# శ్రీభగవద్గీతా శాంకరభాష్యతత్త్వబోధిని

## ప్రథమ కుసుమమ్

"శాస్త్రరత్నాకర" బ్ర॥ వే॥ దెందుకూరి నృసింహశాస్త్రిణాం

ప్రియశిష్యేణ,

బ్ర॥ వే॥ బులుసు వేఙ్కటశాస్త్రిణాం

తనూభవేన,

శ్రీ శేషమాంబాగర్భశుక్తి ముక్తాఫలాయమానేన
"తర్కరత్న, న్యాయవేదాన్త విద్యాపారీణ, దర్శనాలంకార"
గౌతమసగోత్రోద్భవేన,

## బులుసు అప్పన్నశాస్త్రిణా

ప్రణీతా సతీ,

ఆస్తికవదాన్యానాం ద్రవ్యసహాయేన,
తత్పుత్రాభ్యాం న్యాయశాస్త్ర కోవిదాభ్యాం,
శ్రీ వేఙ్కటశాస్త్రి, మిత్రసత్యనారాయణాభ్యాం
భట్నవిల్లి గ్రామసంస్థాపితే స్వీయ శ్రీ శారదాముద్రణాలయే
ముద్రాపితా సతీ విజయతేతరామ్॥

పునర్ముద్రణమ్

గ్రంథప్రాప్తిస్థానమ్ ;

**శ్రీ శారదా గ్రంథమాలిక**

భట్నవిల్లి – 533 222

అమలాపురం తా॥ (తూ॥ గో॥ జిల్లా.)

[మూల్యం : 19–00

# శ్రీభగవద్గీతా శాంకరభాష్యతత్త్వబోధిని

## ప్రథమ కుసుమమ్

"శాస్త్రరత్నాకర" బ్ర॥ వే॥ దెందుకూరి నృసింహశాస్త్రిణాం

ప్రియ శిష్యేణ,

బ్ర॥ వే॥ బులుసు వేఙ్కటశాస్త్రిణాం

తనూభవేన,

శ్రీ శేషమాంబాగర్భశుక్తి ముక్తాఫలాయమానేన
"తర్కరత్న, న్యాయవేదాన్తవిద్యాపారీణ, దర్శనాలంకార"
గౌతమసగోత్రోద్భవేన,

**బులుసు అప్పన్నశాస్త్రిణా**

ప్రణీతా సతీ,

ఆస్తికవదాన్యానాం ద్రవ్యసహాయేన,
తత్పుత్రాభ్యాం న్యాయశాస్త్ర కోవిదాభ్యాం,
శ్రీవేఙ్కటశాస్త్రి, మిత్రసత్యనారాయణాభ్యాం
భట్నవిల్లి గ్రామసంస్థాపితే స్వీయ శ్రీశారదాముద్రణాలయే
ముద్రాపితాసతీ విజయతేతరామ్॥

పునర్ముద్రణమ్

గ్రంథప్రాప్తిస్థానమ్ :

**శ్రీ శారదా గ్రంథ మాలిక**

భట్నవిల్లి – 533 222

అమలాపురం తా॥ (తూ॥ గో॥ జిల్లా.)



[మూల్యం : 19–00

# పండితాభిప్రాయము



సంస్కృతవాఙ్మయమునఁ గల గీతలలో నెల్ల శ్రీ భగవద్గీత యగ్రగణ్యము. అది యుపనిషత్సారభూత మని తత్తద్భాష్యములవల్ల వేద్య మయ్యెడిని. అందెల్ల శ్రీశాంకరభాష్య ముత్కృష్టమని లోకవిఖ్యాతిని గాంచినది. అట్టి తద్భాష్యసార మవగత మొనర్చుకొనుట జిజ్ఞాసువుల కవశ్యకర్తవ్యము; కాని యందు శాస్త్రచర్చ మెండుగా నుండుటచే సాధారణులకు దురవగాహముగ నున్నది. అందులకే శ్రీమదానందగిరిటీక యేర్పడవలసెను. ఇంకను విశేషములు పరికించిన సుధీమణులు– శ్రీమధుసూదనసరస్వతీప్రభృతులు, నితరులు వ్రాసినవానిలోఁ బ్రసిద్ధిని గన్నవి మఱికొన్ని గలవు.

ఏమైనను, గీర్వాణభాషానభిజ్ఞులకు దుర్బోధము కాటచేత సుఖావబోధము కొఱకుఁ గొన్ని తెలుగుటీకలును వెలువడనైనవి. కాని, వాని కన్నిటికి నేకవాక్యత పూర్తిగా సాధింపఁబడి యుండలేదు.

ఇపుడు "తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణులు" శ్రీవేదమూర్తులునౌ బ్రహ్మశ్రీ బులుసు అప్పన్నశాస్త్రిగారిట్టి లోటును దీర్పనూని, "శ్రీశాఙ్కరభాష్యతత్త్వబోధిని" యను నిద్దానిని బ్రకటింప సంకల్పించినది ప్రశంసార్హము. ఇందు శ్రీశాంకరభాష్యమును, శ్రీమదానందగిరివివరణమును, యథాతథములును దక్కఁగలవానిలో నగత్యార్థము లెల్ల నిరవశేషములుగను సేకరింపఁబడుటచేత నిందేకవాక్యత యబ్బి పాఠకులకుఁ దత్త్వము సువ్యక్తము కాదగి యున్నది. ఇది యాస్తికాంధ్రమహాశయులకుఁ గల్పభూజమని నిస్సంశయముగా నెంచుచున్నారము.

ఇట్లు,

వావిలాల వెంకటశివావధాని,
పింఛెనుసబ్జెడ్జి,
నాదెళ్ళ మేధాదక్షిణామూర్తిశాస్త్రి,
కురుగంటి శ్రీరామశాస్త్రి.

బందరు
4-5-1941

# వి జ్ఞా ప న.

ఆస్తికమహాశయులకు: —

నేను బాల్యావస్థ నెనిమిదవవత్సరమున బ్రా॥ వే॥ గొర్తి విశ్వనాథసోమయాజులు వారివద్ద నామాతృ దేవత యగు శేషమాంబగారు ప్రోత్సహింప బాల్యావస్థ యగుటచే దత్తాలమున "యత్తదగ్రే విషమివ" అను భగవద్వచనానుసారము విషప్రాయమైనను విద్యాభ్యాస మొనర్చి గుర్వనుగ్రహమువలన కావ్యనాటకాలంకారసాహిత్యమును సంపాదించుకొని బ్రా॥ వే॥ బలుసు సూరావధానులుగారు, బ్రా॥ వే॥ గొర్తి రామమూర్త్యవధానులుగార్లవద్ద పంచదశకర్మల నభ్యసించితిని.

పిమ్మటఁ గృషి (వ్యవసాయము) జేయ నారంభించి వ్యవసాయమునందు రెండు వత్సరములు గడపఁ గారణాంతరముచేఁ గులక్రమాగతవిద్యను బరిత్యజించితి నని చింతాకులితహృదయుఁడనై యంతటితోఁ గృషియందు విరక్తిచే నిర్విణ్ణుఁడనై కర్తవ్యము దోపక యాతురతనుఁ బొందియుండ శ్రీగొర్తి విశ్వనాథసోమయాజులుగారు నాకు మేనత్తకొమరు లగుటంజేసి పరమానుగ్రహమున దర్శనమియ్య వారిపాదారవిందములకు మ్రొక్కి తప్పులు మన్నించి నన్ను విద్యావంతునిగ జేయుఁడని ప్రార్థించితిని.

అట్టి నాప్రార్థనను మన్నించి నిష్కల్మషహృదయముతోఁ దర్కశాస్త్రము నుపదేశింపఁ దొరకొని సామాన్యనిరుక్తివఱకుపదేశింప నంతవరకుఁ బునర్వ్యాసంగము జేయించెద నను ప్రతినను బూనిన తణుకుతాలూకా అజ్జరంకాపురస్థు లగు బ్రా॥ వే॥ చామర్తి విశ్వపతిశాస్త్రిగారి యనుగ్రహమున సామాన్యనిరుక్తివఱకుఁ దిరుగ వ్యాసంగముఁ జేసి ఉండియగ్రహారనివాసు లగు బ్రా॥ వే॥ ధూళిపాళ సూర్యనారాయణశాస్త్రిగారి పాదారవిందముల నాశ్రయించి తర్కశాస్త్రము నందుత్తీర్ణుడనై, మహీసూరమండలవాసులగు బ్ర॥ వే॥ సుందరరామశాస్త్రిగారి ప్రియశిష్యులును, తర్కవేదాంతశాస్త్రములయం దతినిపుణతఁ బొంది యనేకశిష్యులకు వేదాంతశాస్త్రోపదేశమును గావించినట్టియు, శాస్త్రరత్నాకరేత్యాదిబిరుదావళీభూషితులును, గుంటూరుమండలాంతర్గత నల్లపాడుగ్రామనివాసులును, బీఠికాపురమహారాజాస్థానవిద్వాంసులు నగు బ్రా॥ వే॥ దెందుకూరి నరసింహశాస్త్రిగురువర్యపాదారవింద సేవాతత్పరతవలన వేదాంతశాస్త్రాభ్యాస మొనరించితి నని యాంధ్రదేశీయు లెల్లరు బ్రాయికముగ దెలిసికొనిన విషయమే.

ఇట్లు విద్యాభ్యాస మొనరించి క్రీస్తుశకము 1918వ సంవత్సరము మొదలుకొనియు విద్యాభ్యాసకాలమున నంతేవాసులకు విద్యాభ్యాస మొనరింపవలయు నను నియమమునే

పాటింపుచు క్రీస్తుశకము 1930వ సంవత్సరమువఱకు విద్యార్థులఁ బాఠప్రవచనములకు గడంగి పదచలనమును విడచియుండ నజ్ఞానసంస్కారపరిపాకమున సాంసారిక క్లేశములు దటస్థింప "ఇద మపి క్షేమాయ" అను న్యాయము ననుసరించి దేశపరిభ్రమణమునకుఁ గడంగి మహారాజ బహద్దూర్ సర్ కృష్ణప్రసాద్ బహద్దూర్ వారి దర్శన మొనరించి వారి యనుగ్రహమునకుఁ బాత్రుఁడనై శ్రీగద్వాల, వనపర్తి, ఆత్మకూరు సంస్థానముల కేగి యచటఁ బ్రభుత్వస్థానము నలంకరించి న్యాయరాజ్యపరిపాలన మొనరించుచున్న శ్రీమహారాజులచే నపరిమితానందపురస్సరముగ నర్పింపఁబడిన వార్షికబహుమానముల నంది, తత్పరిసరమున నున్న సింగంపల్లి యగ్రహారమున కధిపతులును, జ్యోతిర్విద్వచ్ఛిరోమణులును, "భూభ్రమణభ్రాంతినిరాస" యను గ్రంథరచయితలు నగు బ్ర॥ వే॥ సీతారామసిద్ధాంతిగారి యాహ్వానముమీద వారు సలుపు శ్రీకాశీనాథ విశ్వేశ్వరప్రతిష్ఠామహోత్సవమున కేగి యచట విద్వజ్జనమహాసభయం దెనిమిదిదినములవరకు వేదాంతోపన్యాసములు గావింప నద్దానివలన శ్రీసిద్ధాంతిగారు బ్రహ్మానందభరితులై బహుమానపురస్సరముగ నిడిన సువర్ణపతకాది బహుమానముల నందుకొనియుండఁ దత్పరిసరమునందుండు కలకొండ గ్రామవాసులును, ఆస్తికాగ్రేసరులును, దేవబ్రాహ్మణపూజాధురంధరులును నగు బ్ర॥ వే॥ సిద్ధాంతి రామయ్యగారు మొదలగువారలచే నాహ్వానింపబడి వారిగ్రామముల కేగి వారివలన బహూకరింపబడి, భాగ్యనగరమునకుఁ జేర నట్టిసమయమున బ్ర॥ వే॥ "శిరోమణి" సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారిచే ప్రోత్సహింపఁబడి న్యాయసిద్ధాంతముక్తావళికి "సుబోధిని" అను వ్యాఖ్యను రచియించి యాగ్రంథముద్రణనిమిత్తము ప్రచారము జేయ మొదలిడితిని.

అత్తరి శ్రీకాంచీకామకోటిపీఠాధిష్ఠిత జగద్గురు శ్రీశ్రీశ్రీ ౧౦౮శ్రీశ్రీమచ్చంద్రశేఖరేంద్రసరస్వతీశంకరభగవత్పాదులుగద్వాలసంస్థానమునందు శ్రీచంద్రమౌళీశ్వరాభిషేకపూజాది పురస్సరముగ శిష్యకోటి ననుగ్రహించుచుండిరని తెలిసికొని శ్రీగురుసందర్శనార్థ మచటి కేగి వారిని దర్శించి తీర్థప్రసాదాదిస్వీకార మొనర్చి పునీతుఁడనైతినని నిశ్చయించుకొని సన్నిధియందు "నాచే రచియింపఁబడిన న్యాయసిద్ధాంతముక్తావళీవ్యాఖ్యను వినిపించెదను. అందుల కాజ్ఞకై నిరీక్షించుచుంటి" నని విజ్ఞాపనముఁ జేయ శ్రీగురువర్యులు నారాయణస్మరణపూర్వకముగ సుబోధినీవ్యాఖ్యను జదువుట కాజ్ఞ నొసంగిరి. అట్టి సమయమున శ్రీగురువర్యముఖారవిందసంజాతాజ్ఞావచనమకరందపానమదమత్తభృంగాయమానమానసుండనై తదీయ పదకమల సందర్శనక్షపితకల్మషుఁడనై తదీయసందర్శనసంజాతామందానందనిమగ్నుఁడనై మైమరచి యెచ్చటెచ్చటనో సుబోధినియందుఁ జదువ నారంభించితిని. నేను జదివి వినిపించిన స్థలముల నన్నిటిని విన్న యచ్చటి పండితులందరు "ఈస్థలము లన్నియు మూలమున మనఃక్లేశముతో

ఛేదింపఁదగినవై నను మీరు సుబోధకమగునట్లు వ్యాఖ్యానించిరి. అని పరోక్షమునఁ గూడఁ జెప్పుకొననారంభించిరి. శ్రీపాదులును, శిష్యపరమాణువునం దతివాత్సల్యముతో విని విని తుదకు దీని ముద్రణవిషయ మేమి చేసితి వని ప్రశ్నించిరి.

అట్టి ప్రశ్నవాక్యమును విని యానందాశ్రుసంరుద్ధగ్రీవుడనై గద్గదస్వరమున "శ్రీవారి యాజ్ఞ" యని పలికి యూరకుంటిని. శ్రీవారు నావాక్యము వినినతోడనే భాగ్యనగరమునకు రమ్మని యాజ్ఞ జేయ నట్టి యాజ్ఞను శిరసావహించి భాగ్యనగరమున సందర్శింప శ్రీవారు నాచే రచియింపఁబడిన ముక్తావళీసుబోధినియందుఁ దమకుఁగల యభిప్రాయమును వ్రాసి యాపత్రమునందే నీవు సర్వదా మతప్రచారమును జేయుమని యాజ్ఞను గూడ లిఖించి యాసమ్మతిపత్రమునుఁ దగు ద్రవ్యసహాయముతోఁ గూడ నారాయణస్మరణపూర్వకానుగ్రహము నొసంగిరి. పిమ్మట నాసమ్మతిపత్రమును సభయందు జదివి "నాశక్యముకాని మతప్రచారమును జేయు" మను నాజ్ఞను జదివి నిర్విణ్ణుడనైతిని. అట్టి స్థితియందుండిన నాస్వరూపమును గుర్తించి "భయపడవలదు. మానారాయణస్మరణమే యీకార్యమును సాధించు" ననిపలుక నట్టి వాక్యామృతసేకముచే వికసితవదనుడనై శ్రీగురుకటాక్షలబ్ధద్రవ్యసహాయాదులచే ముద్రణాలయమును వారి యాజ్ఞపై స్థాపించి క్రీ॥ శ॥ 1935 లగాయితు 'సనాతనమతప్రచారిణీ" పత్రికాసంపాదకుడనై తన్ముఖమున మతప్రచారము జేయుచు క్రీ॥ శ॥ 1940 మార్చియందుఁ బత్రికాద్వారమునఁ బ్రచారము గొన్ని యీతిబాధలచే నిలిపి తత్ప్రభృతి శ్రీగుర్వాజ్ఞానుసారము యథాశక్తి మతసేవ జేయవలసియున్నదని నిశ్చయించుకొని ఆనందగిరీయవ్యాఖ్యాసహిత శ్రీభగవద్గీతాశాంకరభాష్యమునకుఁ దత్త్వబోధిని యను తాత్పర్యమును అన్యూనానతిరిక్తముగ రచియించితిని. మఱియు నద్వైతమతమునకు సంబంధించిన మధుసూదనసరస్వతీవ్యాఖ్య, శంకరానందీయము, భాష్యోత్కర్షదీపిక, సదానందీయము, పరమార్థప్రప, నీలకంఠీయము, శ్రీధరీయము, మొదలగు వ్యాఖ్యావిశేషములయందలి యగతార్థవిషయముల నాంధ్రభాషయందు సంగ్రహించితిని. కాన నిది గ్రంథమాలికగ వెలిబుచ్చినగాని ముద్రించుట నాశక్యముకానేరదని నిశ్చయించుకొంటిని. అందువలన శ్రీజగద్గురువుల యాజ్ఞానుసారము నేను జేయు నీమతప్రచారమున కాంధ్రదేశీయులెల్లరు దోడ్పడుదురుగాక! యని ప్రార్థించుచుంటిని.

ఇట్లు,

'దర్శనాలంకార, తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ"

బులుసు అప్పన్నశాస్త్రి.

———

ॐ

श्रीशृङ्गेरीजगद्गुरुसंस्थानम् ॥




श्रीमत्परमहंसपरिव्राजकाचार्यवर्य, पदवाक्यप्रमाणपारावारपारीण, यमनियमासनप्राणायामप्रत्याहारध्यानधारणासमाध्यष्टाङ्गयोगानुष्ठाननिष्ठ तपश्चक्रवर्त्यनाद्यविच्छिन्न श्रीशङ्कराचार्यगुरुपरम्पराप्राप्तषड्दर्शनस्थापनाचार्य, व्याख्यानसिंहासनाधीश्वर, सकलनिगमागमसारहृदय सांख्यत्रयप्रतिपादक, वैदिकमार्गप्रवर्तक, सर्वतन्त्रस्वतन्त्रादिराजधानी, विद्यानगरमहाराजधानीकर्णाटकसिंहासनप्रतिष्ठापनाचार्य, श्रीमद्राजाधिराजगुरु, भूमण्डलाचार्य, ऋष्यशृङ्गपुरवराधीश्वर, तुङ्गभद्रातीरवासि, श्रीमद्विद्याशङ्करपादपद्माराधक, श्रीजगद्गुरु, श्रीचन्द्रशेखरभारतीस्वामिगुरुकरकमलसंजात-

# श्रीजगद्गुरु
# शृङ्गेरी श्रीमदभिनवविद्यातीर्थस्वामिभिः

अस्मदत्यन्तप्रियशिष्य 'दर्शनालङ्कार' ब्रह्मश्री बुलुसु अप्पन्नशास्त्रिविषये नारायणस्मरणपूर्वकं विरचिता आशिषः समुल्लसन्तु तराम् ॥

सर्वोपनिषत्सारभूता हि भगवद्गीता । तदर्थावगमे हि सर्वाप्यध्यात्मविद्या अधिगतैव । अत एव तत्तन्मतप्रतिष्ठापकाचार्यैः अनेकैः स्वाभिमतानुसारेण बहुधा व्याख्याता । श्रीमच्छङ्करभगवत्पादाश्च नित्यशुद्ध-बुद्ध-मुक्त-स्वभाव सत्यज्ञानानन्दस्वरूप-ब्रह्मावगतिपर्यवसायितां स्वभाष्ये निरणयन् । तस्य च भाष्यस्य बहूनि व्याख्यानानि प्रथितानि सन्ति । बहुषु दर्शनेषु कृतपरिश्रमाः श्री बुलुसु अप्पन्नशास्त्रिणः श्रीमच्छङ्करभगवत्पादभाष्यं तस्य च व्याख्यानं आनन्दगिरीयं समग्रतया आन्ध्रभाषयाऽनूद्य श्रीभगवद्गीताशङ्करभाष्यतत्त्वबोधिनीति नामानं ग्रन्थं प्रकाशयन् । श्रीमधुसूदनसरस्वतीयं, श्रीशङ्करानन्दीयं, भाष्योत्कर्षदीपिकेत्यादीनि बहूनि व्याख्यानानि सम्यगालोच्य युक्तान् विषयान् तत आदाय तत्र तत्र स्वाभिप्रायांश्च विशदीकृत्य ग्रन्थेऽस्मिन् अयूयुजन् । अतिनवीनं सुप्रसिद्धं च तिलकव्याख्यानं सम्यगत्र व्यमर्शन् ।

भगवद्गीतातात्पर्यं अवजिगमिषूणां लोकानां विमर्शकानांश्च समग्रतया सर्वानपि विमर्शान् पुरत उपस्थापयन् सिद्धान्तं च प्रतिपादयन् एष ग्रन्थस्सर्वात्मना उपकारको भवतीत्यस्माकमभिप्रायः।

ग्रन्थोयं विशिष्टशिष्टनराणां आदरातिशयमाप्नुवन् सर्वत्र प्रचारमियादिति आशास्महे । ग्रन्थप्रणेतारः श्रीशारदाचन्द्रमौलीश्वरयोरमन्ददयासन्दोहेन चिरमभ्युदयपरम्परा अनुभूयासुः ॥

शार्वरिवत्सराषाढशुद्धचतुर्थीभौमवासरः ॥
२८—६—१९६० काकिनाडाक्षेत्रम् ॥



# శ్రీ శృంగేరీ జగద్గురు సంస్థానం.

శ్రీ విద్యాశంకర

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య పదవాక్య ప్రమాణపారావారపారీణ యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధ్యానధారణాసమాధ్యష్టాంగయోగానుష్ఠాననిష్ఠ తపశ్చక్రవర్త్యనాద్యవిచ్ఛిన్న శ్రీశంకరాచార్యగురుపరంపరాప్రాప్త షడ్దర్శనస్థాపనాచార్య వ్యాఖ్యానసింహాసనాధీశ్వర సకలనిగమాగమసారహృదయ సాంఖ్యత్రయప్రతిపాదక వైదికమార్గప్రవర్తక సర్వతంత్రస్వతంత్రాది రాజధానీవిద్యానగరమహారాజధానీకర్ణాటకసింహాసనప్రతిష్ఠాపనాచార్య శ్రీమద్రాజాధిరాజగురుభూమండలాచార్యఋష్యశృంగపురవరాధీశ్వరతుంగభద్రాతీరవాసిశ్రీమద్విద్యాశంకరపాదపద్మారాధక శ్రీజగద్గురు శ్రీశ్రీ చంద్రశేఖరభారతీస్వామి గురుకరకమలసంజాత

## శ్రీజగద్గురు-
## శృంగేరిశ్రీమదభినవవిద్యాతీర్థస్వాములవారిచే—

అస్మదత్యంతప్రియశిష్య "దర్శనాలంకార" బులుసు అప్పన్న శాస్త్రివిషయమున నారాయణస్మరణపూర్వకముగా చేయఁబడిన యాశీర్వాదములు లెస్సగా ప్రకాశించుగాక.

భగవద్గీత సర్వోపనిషత్సారభూతమని ప్రసిద్ధము. దాని యర్థము ను తెలిసికొనినచో నధ్యాత్మవిద్య యంతయు దెలిసినదియే యగును. కనుకనే యాయామతప్రతిష్ఠాపనాచార్యులగు అనేకులచే దమతమ మతముల ననుసరించి యనేకవిధముల వ్యాఖ్యానింపబడినది. శ్రీమచ్ఛంకరభగవత్పాదులు తమ భాష్యమున నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావ సత్యజ్ఞానానందస్వరూప బ్రహ్మావగతిపర్యవసాయిత్వమును నిర్ణయించియుండిరి. ఆశంకరభాష్యమునకు సుప్రసిద్ధానేక వ్యాఖ్యానములు కలవు. బహుదర్శనములయందు కృతపరిశ్రము లగు శ్రీబులుసు అప్పన్న శాస్త్రులుగారు శ్రీమచ్ఛంకరభగవత్పాదభాష్యమును, దానికి వ్యాఖ్యాన మగు ఆనందగిరీయ వ్యాఖ్యననుసరించి సంపూర్ణముగ నాంధ్రభాషలోని కనువదించి, "శ్రీభగవద్గీతా-శాంకరభాష్యతత్త్వబోధిని" అను పేర నొక గ్రంథమును ప్రకటించిరి. ఈగ్రంథమున "మధుసూదనసరస్వతీయ, శ్రీశంకరానందీయ, భాష్యోత్కర్షదీపికేత్యాద్యనేకవ్యాఖ్యానములను లెస్సగ నాలోచించి వానినుండి యుక్తవిషయములను స్వీకరించి వానిని, మరియు స్వాభిప్రాయములను అటనట విశదీకరించి కూర్చియుండిరి. అతినవీనము సుప్రసిద్ధము నగు తిలకుగారి వ్యాఖ్యానమును లెస్సగ నీగ్రంథమున విమర్శించియుండిరి భగవద్గీతాతాత్పర్యమును తెలిసికొనగోరు జనులకు, విమర్శకులకుగూడ, సర్వవిమర్శములను యెదుట బెట్టి, సిద్ధాంతమును ప్రతిపాదించు యీగ్రంథ మన్నివిధముల నుపకారక మగుచున్నదని మా యభిప్రాయము.

ఈ గ్రంథము విశిష్టశిష్టజనుల ఆదరాతిశయమును జూరగొని యంతటను ప్రచారము నొందుగాక యని యాశించుచున్నాము.

గ్రంథప్రణేతలు శ్రీశారదాచంద్రమౌళీశ్వరుల యమంద దయాసందోహముచే చిరకాల మభ్యుదయపరంపరల ననుభవించుదురుగాక.

శార్వరిసంవత్సరాషాఢశుద్ధచతుర్థీభౌమవాసరః ది28-6-1960 కాకినాడాక్షేత్రమ్ 



శ్రీ శృంగేరీ పీఠాధిష్ఠిత

శ్రీజగద్గురు

శ్రీ శ్రీ శ్రీ ౧౧౦౮ శ్రీ శ్రీ

శ్రీ మదభినవవిద్యాతీర్థమహాస్వాములవారు.



శ్రీకాంచీ కామకోటి పీఠాధిష్ఠిత

శ్రీజగద్గురు . . .

శ్రీ శ్రీ శ్రీ ౧౧౦౮ శ్రీ శ్రీ

శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ మహాస్వాములువారు.

श्रीः ।

श्रीमत्परमहंस परिव्राजकाचार्यवर्य श्रीमच्छङ्करभगवत्पादप्रतिष्ठित श्रीकाञ्चीकामकोटिपीठाधिप जगद्गुरु श्री ११०८ श्रीमच्चन्द्रशेखरेन्द्रसरस्वती श्रीपादादेशानुसारेण श्रीमज्जयेन्द्रसरस्वतीश्रीपादैः—

क्रियते नारायणस्मृतिः—

"शिष्यस्तेऽहं शाधि मां त्वां प्रपन्नम्" इति अनन्यशरणतया आत्मानं गुरुं प्रपन्नाय अर्जुनाय भगवता श्रीकृष्णेनोपदिष्टा क्रमेण अध्यायषट्कत्रयेण शोधित जीव-ईश्वर-तदैक्यप्रतिपादिका, अतएव उपनिषदिति व्यवह्रियमाणा च श्रीभगवद्गीता परशिवावतारश्रीशङ्करभगवत्पादानुगृहीतभाष्ययुता विराजते ।

एतद्गम्भीरार्थकं भाष्यं आनन्दगिरिव्याख्यायुतं पण्डित श्री बुलुसु अप्पन्नशास्त्रिरचितान्ध्र्यनुवादयुतं शङ्करानन्दीयाद्यनेकव्याख्योद्धृतमुख्यविषयसनाथं च दृष्ट्वा प्रमुदितस्वान्ताः स्मः ।

श्रीभगवद्गीताशाङ्करभाष्यतत्त्वबोधिन्याख्योऽयं ग्रन्थः गीतातात्पर्यजिज्ञासूनां आन्ध्रभाषाज्ञानामत्यन्तमुपकारको भूयादित्याशास्महे ॥

यात्रास्थलम्
इलैयात्तङ्कुटी
शुभकृत्कार्तिकबहुलद्वितीया ।

नारायणस्मृतिः ।

శ్రీః

శ్రీమత్పరమహంసపరివ్రాజ కాచార్యవర్య శ్రీమచ్ఛంకరభగవత్పాద ప్రతిష్ఠిత శ్రీకాంచీకామకోటిపీఠాధిప జగద్గురు శ్రీ ౧౧౦౮ శ్రీమచ్చంద్రశేఖరేంద్ర సరస్వతీ శ్రీపాదుల యాదేశానుసారముగా శ్రీమజ్జయేంద్రసరస్వతీశ్రీపాదులచే నారాయణస్మరణము చేయబడుచున్నది.—

'శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్' అని యనన్యశరణముగా గురువగుతన్ను ఆశ్రయించిన యర్జునునకై శ్రీకృష్ణభగవానునిచే నుపదిష్టమైనదియు, యథాక్రమముగా నధ్యాయషట్కముచే జీవ, ఈశ్వర, తదైక్యప్రతిపాదకమైనదియు, కనుకనే "యుపనిషత్" అనివ్యవహరింపబడునదియు నగు శ్రీభగవద్గీత పరశివావతారు లగు శ్రీశంకరభగవత్పాదులచే ననుగృహీతమైన భాష్యముతో విరాజిల్లుచున్నది.

ఈగంభీరార్థక మగుభాష్యము ఆనందగిరివ్యాఖ్యాయుతముగ పండిత శ్రీబులుసు అప్పన్నశాస్త్రిరచితాంధ్రానువాదసహితమై, మరియు శంకరానందీయాద్యనేకవ్యాఖ్యోద్ధృతముఖ్యవిషయసంకలితమై యున్నది. ఇట్టి దీనిని జూచి మేము ప్రముదితస్వాంతులమైతిమి. "శ్రీభగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధిని" యను నీగ్రంథము గీతాతాత్పర్యజిజ్ఞాసువు లగు నాంధ్రభాషాజ్ఞానసంపన్నుల కత్యంత ముపకరించునని తలంచుచుంటిమి.

మకాం— ఇళైయాత్తకుటీ
శుభకృత్కార్తికబహులద్వితీయా

నారాయణస్మృతిః ।

శ్రీమద్భగవత్పాద శ్రీశంకరాచార్య విరచితమ్

# ఉపదేశ పంచకమ్.

వేదో నిత్య మధీయతాం, తదుదితం కర్మ స్వనుష్ఠీయతాం
తేనేశస్య విధీయతా మపచితిః, కామ్యే మతి స్త్యజ్యతాం।
పాపౌఘః పరిధూయతాం, భవసుఖే దోషో౽నుసన్ధీయతాం,
ఆత్మేచ్ఛా వ్యవసీయతాం, నిజగృహా త్తూర్ణం వినిర్గమ్యతామ్॥ 1.

సంగ స్సత్సు విధీయతాం, భగవతో భక్తి ర్దృఢా౽౽ధీయతాం,
శాన్త్యాదిః పరిచీయతాం, దృఢతరం కర్మా౽౽శు సంత్యజ్యతాం।
సద్విద్వా నుపసృప్యతా మనుదినం తత్పాదుకా సేవ్యతాం,
బ్రహ్మైకాక్షర మర్థ్యతాం, శ్రుతిశిరోవాక్యం సమాకర్ణ్యతామ్॥ 2.

వాక్యార్థశ్చ విచార్యతాం, శ్రుతిశిరఃపక్ష స్సమాశ్రీయతాం,
దుస్తర్కా త్సువిరమ్యతాం, శ్రుతిమత స్తర్కో౽నుసన్ధీయతాం।
బ్రహ్మా౽స్మీతి విభావ్యతాం, అహరహ ర్గర్వః పరిత్యజ్యతాం,
దేహే౽హంమతి రుజ్ఝ్యతాం, బుధజనై ర్వాదః పరిత్యజ్యతామ్॥ 3.

క్షుద్వ్యాధిశ్చ చికిత్స్యతాం, ప్రతిదినం భిక్షౌదనం భుజ్యతాం,
స్వాద్వన్నం నతు యాచ్యతాం, విధివశా త్ప్రాప్తేన సంతుష్యతాం।
శీతోష్ణాది విషహ్యతాం, నతు వృథా వాక్యం సముచ్చార్యతాం,
ఔదాసీన్య మభీప్స్యతాం, జనకృపానైష్ఠుర్య ముత్సృజ్యతామ్॥ 4.

ఏకాన్తే సుఖ మాస్యతాం, పరతరే చేత స్సమాధీయతాం,
పూర్ణాత్మా సుసమీక్ష్యతాం, జగదిదం తద్బాధితం దృశ్యతాం।
ప్రాక్కర్మ ప్రవిలాప్యతాం, చితిబలా న్నాప్యుత్తరై శ్శ్లిష్యతాం,
ప్రారబ్ధం త్విహ భుజ్యతాం, అథ పరబ్రహ్మాత్మనా స్థీయతామ్॥ 5.

ఏకశ్లోకీ

కిం జ్యోతి స్తవ? భానుమా నహని మే, రాత్రౌ ప్రదీపాదికం,
స్యాదేవం రవిదీపదర్శనవిధౌ కింజ్యోతి రాఖ్యాహి మే? ।
చక్షుః, తస్యనిమీలనాదిసమయే కిం? ధీః, ధియో౽దర్శనే,
కిం? తత్రా౽హం, అతో భవా న్పరమకం జ్యోతిః, త దస్మి ప్రభో॥ 6.

# శ్రీ గురుస్తోత్రనవరత్నమాలికా.

బ్ర॥ వే॥ బాలకృష్ణశాస్త్రి, సుందరరామశాస్త్రి గురుకరుణాసముపలబ్ధపూర్వోత్తర మీమాంసాసముపార్జిత దిగన్తవిశ్రాన్తయశోవిలసితానాం, బ్ర॥ వే॥ శ్రీపాద రామశాస్త్రి లక్ష్మీనరసింహశాస్త్రి గురుపాదశుశ్రూషాసమాసాదిత న్యాయశాస్త్రవికసితప్రజ్ఞాచక్షుషాం, బ్ర॥ వే॥ దెందుకూరి సదాశివశాస్త్రితనూభవానాం, ద్వైతికరీన్ద్రకుంభదళనప్రోదృప్తపంచాననానాం, యాస్కగోత్రపయఃపారావారసుధాకరాణాం, శాస్త్రరత్నాకరేత్యాదిబిరుదావళీవిరాజమానానా మస్మద్గురువర్యాణాం బ్ర॥ వే॥ **దెందుకూరి నరసింహశాస్త్రిణాం**

గ్రీవాయాం సవినయం సాదరం పరస్సహస్రవినతిపూర్వకం సమర్పితా॥

శ్రీమంతం విజితేంద్రియం పరశివ శ్రీపాదపద్మద్వయీ
ధామాంతఃకరణం త్రయీమయమహఃప్రస్పర్ధి తేజస్వినమ్।
అద్వైతార్థసుధాపయోధిమథనప్రస్ఫీతమంథాచల
ధీమంతం నరసింహశాస్త్రిణ మహం వందేఽస్మదీయం గురుమ్॥ 1.

క్షోణీదేవకులావతంసితయశశ్శ్రీ దెందుకూర్యన్వయ
క్షీరార్ణోదధిపూర్ణిమాహిమకరం పుంభావవాగ్దేవతామ్।
ఆజానోదితవద్విరాగచరితం తం బ్రహ్మభూయంగతం
ధీమంతం నరసింహశాస్త్రిణ మహం వందేఽస్మదీయం గురుమ్॥ 2.

తర్కవ్యాకరణాంబురాశిమిళితం పూర్వోత్తరాఖ్యావయు
మీమాంసాబ్ధియుగం ఘటోద్భవ ఇవాఽఽసస్వాద యో లీలయా।
వాతాపీల్వలతుల్యకద్వదగణం యోఽభక్షదుక్త్యైవ తం
ధీమంతం నరసింహశాస్త్రిణ మహం వందేఽస్మదీయం గురుమ్॥ 3.

నృత్యచ్ఛంకరజాటజూటవిలుఠద్గంగాతరంగస్వన
ప్రత్యర్థిస్ఫుటసంస్కృతోక్తిభి రుపన్యస్యంత మత్యద్భుతమ్।
సామంతేశ్వరపీఠికాపురపతే రాస్థానవిద్వద్వరం
ధీమంతం నరసింహశాస్త్రిణ మహం వందేఽస్మదీయం గురుమ్॥ 4.

అద్వైతార్థపరేణ తత్త్వమసినా శాతాసినా దుర్గమం
ద్వైతారణ్య మలావి, యేన సహసా విస్మాపయిత్వా జగత్ ।
శూరం సూరిషు ధీర మద్వయమతే వీరం జయేఽంతర్ద్విషాం
ధీమంతం నరసింహశాస్త్రిణ మహం వందేఽస్మదీయం గురుమ్ ॥ 5.

శాంతం శాంకరవాఙ్మయామృతసర్వసంతం పిబంతం ముహుః
శ్రాంతం దాంత మనంతబోధఘన మభ్రాంతం చ కాంతాదిషు ।
సంతం శిష్యజనేప్సితార్థఘటనే చింతామణీసంతతిం
ధీమంతం నరసింహశాస్త్రిణ మహం వందేఽస్మదీయం గురుమ్ ॥ 6.

జేతారం ప్రతివాదితార్కికతతే స్త్రాతార మద్వైతినాం
గాతారం గురుశాంకరీయయశసో ధ్యాతార మీశాకృతేః ।
పాతారం పితృవత్స్వశిష్యవితతేః స్థాతార మగ్రే సతాం
ధీమంతం నరసింహశాస్త్రిణ మహం వందేఽస్మదీయం గురుమ్ ॥ 7.

సంసారే నళినీదళేఽంబుకణవ ద్యస్సంచరన్నిర్మమో
నిర్ద్వంద్వో నిరహంకృతి శ్శ్రుతిశిఖా కేళీకళాలాలసః ।
తం సంతం చిదభిన్న మప్రతిమశుద్ధానంద మంతర్ముఖం
ధీమంతం నరసింహశాస్త్రిణ మహం వందేఽస్మదీయం గురుమ్ ॥ 8.

దృశ్యం నశ్వర మిత్యతంద్రితమతే ర్నిశ్చిత్య నిత్యం స్థిత
ప్రజ్ఞో ద్వైతమతాధ్వగో విహరతే బ్రహ్మణ్యభేదేన యః ।
తం ముక్తావళినాయకం బుధమణిం దేదీప్యమానం స్వతో
ధీమంతం నరసింహశాస్త్రిణ మహం వందేఽస్మదీయం గురుమ్ ॥ 9.

శ్రీదక్షిణాస్యపరరూపనృసింహసూరేః
స్తోత్రం గురో ర్నవమణీమయమాల్య మేతత్ ।
కంఠస్థ మాచరతి యః స భవే త్స్వరూప
స్తాపత్రయాపరహితో భవబంధముక్తః ॥ 10.



'శాస్త్రరత్నాకర'

బ్రి॥ వే॥ దెందుకూరి నృసింహశాస్త్రి

గురుపాదాః.

శ్రీ పార్థసారథయే నమః.

# ఆశీః పద్యరత్నమాలికా.

శ్రీమాన్ క్షత్రియమండలీపరివృఢః శ్రీబుద్ధరాజాన్వయ
ఖ్యాతాదిత్యకులాబ్ధిశీతకిరణో వాసిష్ఠగోత్రాంచితః ।
ధీరః కృష్ణమరాజనామనృపతిః శ్రీబుచ్చివేంకాయమ (వేంకాంబికా
ప్రాణేశః ప్రథితః పురా విజయతే క్షేమంకరః ప్రాణినాం ॥ 1.

తత్పుణ్యదంపతిపురాకృతపుణ్యపాకా
దావిర్బభూవ తనయో భువి రంగరాజః ।
శ్రీసత్యవత్యభిధయా సుచరిత్రయా యో
గార్హస్థ్యసౌఖ్య, మఖిలార్థసమృద్ధి మాప ॥ 2.

బంధూనాం సురధేను రర్థివితతే స్సంతానవల్లీ స్వయం
దేవీ సత్యవతీ సదా పతిహితాచారంభప్రియంభావుకా ।
ప్రాసూత ప్రియవందనా వథ జగన్నాథాధిపాఖ్యం తతః
శూరం వేంకటరాజ ముత్తమగుణాలంబం చిరంజీవినం ॥ 3.

పరిణీ యేందిరాదేవి మిందిరాసుందరీసమాం ।
జగన్నాథవిభుః పూర్ణో రాజతేఽవాప్తసంతతిః ॥ 4.

ద్వితీయః కమలాదేవీం పాణౌకృత్య తదాత్మజః ।
భాసతేఽఖిలసస్యాఢ్యకేదారో వేంకటప్రభుః ॥ 5.

తత్పౌత్రద్వితయాగ్ర్యహార్చనవిధోత్ఫుల్లాంతరంగో విభూ
రంగక్షోణిపతి స్సదా హృది జప త్యాశైశవం మంత్రవత్ ।
"శ్రీరాజా" బిరుదస్య పోషకపితుః కాకర్లపూడిప్రసి
ద్ధాదిత్యాన్వయదీపకస్య చ జగన్నాథాధిప స్యాహ్వయం ॥ 6.

యథా రంగాధీశం తనయ మిన సాక్షా దపుపుష
త్తథాఽపోష ద్బంధూ న్నిరవధికదానవ్రత మపి ।
అలంచక్రే రోదోంతర మమలసత్కీర్తి కుసుమై
ర్జగన్నాథక్షోణీపతి రితబహాద్దూరుబిరుదః ॥ 7.

శ్రీరాజా వత్సవాయాన్వయజలధివిధుః సూర్యవంశప్రదీపో
ధీమాన్ నారాయణాఖ్యక్షితిపతిబహదూర్ భవ్యవాసిష్ఠగోత్రః ।
నేతా పెద్దాపురీవిశ్రుతవిపులయశః స్థానసంస్థానలక్ష్మ్యాః
సోఽయం శ్రీరంగరాజావనిరమణమణే రాజబంధు ర్బభూవ ॥ 8.

ఇత్థం సమస్తాభ్యుదయోపపన్నః
శ్రీబుద్ధరాజాన్వయరంగరాజః ।
ఆనంద తూద్వీక్ష్య చిరం స్వపుత్ర
పౌత్రాభివృద్ధిం చ పరాత్మతత్త్వమ్ ॥ 10

ఇతి శమ్ ।

శ్లో॥ బుచ్చమాంబాకల్పవల్లీ, పాణిపల్లవసంశ్రయః ।
ధర్మార్థ కామా నవా ప్యాప్తి, కామా నాపూర్య సద్గృహీ ॥ ॥౧॥
ధృత్వా గెద్దనపల్ల్యాఖ్య, గ్రామే గ్రామాధికారితామ్ ।
స్వప్రజానిర్విశేషం యో, ఽపాలయ త్సప్రజాః ప్రజాః ॥ ॥౨॥
తస్య శ్రీవ్యావువంశోత్థ, షూక్తికస్య మహాధృతేః ।
మహాన్నత్యయుత స్యాస్య, వెంకటాద్రిజమహీభృతః ॥ ॥౩॥
సిద్ధిబుద్ధిమహాశక్తి, సంపన్నా మహితు స్సుతా ।
వినాయకస్కందసమౌ, వభూతాం సుమనోముదే ॥ ॥౪॥
మాతామహమహాసంప, ద్గృహాభూవిభవా వుభౌ ।
పబ్రుద్ధౌ బుద్ధరాజాహ్వా, వంశదుగ్ధాబ్ధివర్ధనే ॥ ॥౫॥
జగన్నాథమహీనాథ, వెంకట్రాజాహ్వయాంచితౌ ।
గీతాశాస్త్ర స్యాదిమస్య, భాగస్యాస్య సుముద్రణే ॥ ॥౬॥
సంపూర్ణద్రవ్యసాహాయ్యం, కృద్భి స్స్వజనకైస్సహ ।
"విద్వజ్జనకల్పతరు", రూపోపాధివిభాసురైః ॥ ॥౭॥
సమోదభరితస్వాంతౌ, పిత్రాజ్ఞాపరిపాలకౌ ।
సహితౌ పరయా భక్త్యా, స హి తౌ భక్తవత్సలః ॥ ॥౮॥
వినయాచార్యకౌ వేతౌ, గీతాచార్యో నయాన్వితౌ ।
అనయారిపరాభూతే, స్త్రాయేతాం పార్థసారథిః ॥ ॥౯॥
ఆయు రారోగ్య మైశ్వర్యం, యశ శ్చాతారవంశతాం ।
ధర్మద్వయీం చ దత్త్వా వాం, పాయాచ్ఛ్రీ పార్థసారథిః ॥ ॥౧౦॥
భూసురాశీర్విశేషోత్థ, జయతోషోఽస్తు వాం సదా ।
త్వద్దత్తపోషతోషోఽస్తు, భూసురేషు చ గోషు చ ॥ ॥౧౧॥

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం, న్యాయేన మార్గేణ మహీం మహీశాః ।

ఇతి

"తర్కరత్న, న్యాయ వేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార"
బులుసు అప్పన్న శాస్త్రి.



'విద్వత్కల్పతరు'

మహారాజశ్రీ బుద్ధరాజు రంగరాజు వారు.

గొద్దనపల్లి.



'విద్వత్కల్పతరు'

మ॥ రా॥ శ్రీ బుద్ధరాజు రంగరాజావారి జ్యేష్ఠపుత్రులు:

మహారాజశ్రీ బుద్ధరాజు జగన్నాథరాజావారు, (చిట్టిబాబుగారు)

వీరి సతీమణి శ్రీమతి, చి॥ సౌ॥ ఇందిరాదేవిగారు.

గొద్దనపల్లి.



‘విద్వత్కల్పతరు’

మ॥ రా॥ శ్రీ బుద్ధరాజు రంగరాజావారి ద్వితీయపుత్రులు:

మహారాజశ్రీ బుద్ధరాజు వెంకటరాజావారు, (చిరంజీవిబాబుగారు)

వీరి సతీమణి శ్రీమతి, చి॥ సౌ॥ కమలాదేవిగారు.

గొద్దనపల్లి.



ర చ యి త :

"తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార"

బ్ర॥ వే॥ బులుసు అప్పన్నశాస్త్రిగారు,

భట్నవిల్లి,

అమలాపురంతాలూకా,

తూ॥ గో॥ జి॥



(40 వ సం॥ వయస్సులోని ఛాయాచిత్రము)

ర చ యి త :

"తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార"

బ్రి॥ వే॥ బులుసు అప్పన్న శాస్త్రి గార్లు,

భట్నవిల్లి,

అమలాపురంతాలూకా,

తూ॥ గో॥ జి॥

# గ్రంథస్థ విషయములు.



1. శ్రీ బాదరాయణప్రణీత శ్రీభగవద్గీతా.

2. పదవిభాగము.

3. ప్రతిపదార్థము.

4. శ్రీజగద్గురుశంకరభగవత్పాదాచార్యప్రణీత శ్రీభగవద్గీతాభాష్యమ్.

5. "తర్కరత్న, న్యాయవేదాన్తవిద్యాపారీణ, దర్శనాలంకార" బులుసు అప్పన్నశాస్త్రిప్రణీత శ్రీమదానందగిరిటీకానుసృత శ్రీభగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధిని.

6. మధుసూదనసరస్వతీకృత గూఢార్థదీపికకు "న్యాయవేదాన్తవిద్యాపారీణ" బులుసు అప్పన్నశాస్త్రివిరచిత తాత్పర్యబోధిని.

7. శంకరానన్దకృతతాత్పర్యబోధినికి బులుసు అప్పన్నశాస్త్రివిరచిత తాత్పర్యబోధిని.

8. ధనపతిసూరికృత భాష్యోత్కర్షదీపికకు బులుసు అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని.

9. దైవజ్ఞ పండితసూరికృత పరమార్థప్రపకు బులుసు అప్పన్నశాస్త్రివిరచిత తాత్పర్యబోధిని.

10. సదానందకృత భావప్రకాశకు బులుసు అప్పన్నశాస్త్రివిరచిత తాత్పర్యబోధిని.

11. నీలకంఠవిరచిత భారతభావదీపమునకు బులుసు వేంకటశాస్త్రివిరచిత తాత్పర్యబోధిని.

12 శ్రీధరస్వామికృత సుబోధినికి బులుసు అప్పన్నశాస్త్రివిరచిత తాత్పర్యబోధిని.

13. లోకమాన్య బాలగంగాధరతిలక్మహాశయ విరచిత గీతారహస్యమునకు బులుసు అప్పన్నశాస్త్రివిరచిత విమర్శనము.



# పారిభాషికపదార్థవివరణము.

అభ్యుదయము=అభివృద్ధి.
నిష్ఠాద్వయము=కర్మనిష్ఠ, జ్ఞాననిష్ఠ యను రెండు.
ప్రతిపాద్యము=చెప్పఁబడునది.
ప్రతిపాదకము= చెప్పునది.
బాహ్యకరణములు=బాహ్యేంద్రియములు.
నిరతిశయసుఖము, నిశ్శ్రేయసము=మోక్షము.
ఆప్తప్రణీతము=యథార్థమును బలుకువానిచే రచింపఁబడినది.
ప్రేక్షావత్ప్రవృత్తి=చూచువాని ప్రవృత్తి.
అత్యంతోపరమము=శేషములేకుండగ నశించుట.
కర్మసముచ్చితము=కర్మతోఁగూడిన.
వివిదిష=ఆత్మను దెలిసికొను కోరిక.
పౌరుషేయము=జీవునిచే రచియింపఁబడినది.
బుద్ధుడు చెప్పిన ధర్మద్వయము= బుద్ధునిచే బోధింపఁబడిన సత్యము, అహింస యను రెండు.
ఉపాయము=సాధనము, లేక కారణము.
ఉపేయము=సాధ్యము, లేక కార్యము.
ఏకవాక్యత=ఏకార్థమునుఁజెప్పుట.
చిదాభాసలు=జీవులు.
కూటస్థము=దాగలివలె వికారము లేకుండగ నుండునది, నిర్వికారము.
అసంగము=సంగరహితము, సంబంధములేనిది.
అవిషయము=ఏప్రమాణమునకు గోచరింపనిది.
శాస్త్రప్రతిపాద్యత్వము=శాస్త్రముచేఁ జెప్పఁబడుట.
విరాట్టు=పంచీకృత పంచమహాభూతములు.
హైరణ్యగర్భతత్త్వము=అపంచీకృతపంచమహాభూతములు (తన్మాత్రలు).
విశ్వుడు=జాగ్రదవస్థాభిమాని.
తైజసుడు=స్వప్నావస్థాభిమాని.
ప్రాజ్ఞుడు=సుషుప్త్యవస్థాభిమాని.
మాయ=మూలప్రకృతి, అవిద్య, అవ్యక్తము, ప్రధానము.
పంచతన్మాత్రలు=అపంచీకృతమగు పృథివ్యప్తేజోవాయ్వాకాశములు.
మహత్తత్త్వము=పంచతన్మాత్రజన్యము, మోక్షపర్యంతస్థాయియగు హిరణ్యగర్భలింగదేహము.
అహంకారము=పంచతన్మాత్రజన్యము మోక్షపర్యంతస్థాయియగు జీవలింగదేహము.
లింగదేహము=పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు, పంచప్రాణవాయువులు, మనోబుద్ధులుఈ17న్ని.
పంచకర్మేంద్రియములు=వాక్కు, పాణులు, పాదములు, పాయువు, ఉపస్థయు.
పంచజ్ఞానేంద్రియములు=త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు.
పంచప్రాణవాయువులు=ప్రాణాపానవ్యానోదాన సమానములు.

ఈశ్వరుఁడు=మాయావిశిష్టచైతన్యము.
ఈశ్వరసాక్షి=మాయోపహితచైతన్యము.
జీవుఁడు=అంతఃకరణవిశిష్టచైతన్యము.
జీవసాక్షి=అంతఃకరణోపహితచైతన్యము.
బ్రహ్మము=రజోగుణప్రధానమాయావిశిష్టచైతన్యము.
విష్ణువు=సత్త్వగుణప్రధానమాయావిశిష్టచైతన్యము.
రుద్రుఁడు=తమోగుణప్రధానమాయావిశిష్టచైతన్యము.
మూర్తిత్రయము=బ్రహ్మము, విష్ణువు, రుద్రుఁ డను మువ్వురు.
హిరణ్యగర్భుఁడు=ప్రథమజీవుడు.
మనస్సు=సంశయాత్మకవృత్తితోఁగూడిన యంతఃకరణము, పంచతన్మాత్రజన్యము, చంద్రుఁడధిష్ఠానదేవత గాఁగలది.
బుద్ధి=నిశ్చయాత్మకమగు వృత్తితోఁగూడిన యంతఃకరణము, పంచతన్మాత్రజన్యము. అచ్యుతుఁడధిష్ఠానదేవత గాఁగలది
అహంకారము=గర్వాత్మకవృత్తితో గూడిన యంతఃకరణము, పంచతన్మాత్రజన్యము, చతుర్ముఖుం డధిష్ఠాన దేవత గాఁగలది.
చిత్తము=స్మరణాత్మకవృత్తితోఁగూడిన యంతఃకరణము. పంచతన్మాత్రజన్యము. శంకరుఁడధిష్ఠానదేవత గాఁగలది
శ్రోత్రేంద్రియము=శబ్దమును గ్రహించునది, సత్త్వగుణముతోఁగూడిన యాకాశతన్మాత్రవలన జనించునది, దిక్కే యధిష్ఠానదేవత గాఁగల యింద్రియము.
త్వగింద్రియము=స్పర్శను గ్రహించునది, సత్త్వగుణముతో గూడినవాయుతన్మాత్రవలన జనించునది, వాయువే యధిష్ఠానదేవత గాఁగల యింద్రియము.
చక్షురింద్రియము=రూపమును గ్రహించునది, సత్త్వగుణముతోఁగూడిన తేజస్తన్మాత్రమువలన జనించునది, సూర్యుఁ డధిష్ఠానదేవత గాఁగల యింద్రియము.
రసనేంద్రియము=రసమును (రుచులను) గ్రహించునది, సత్త్వగుణముతోఁగూడిన జలతన్మాత్రవలన జనించునది. వరుణుఁడే యధిష్ఠానదేవత గాఁగల యింద్రియము.
ఘ్రాణేంద్రియము=గంధమును గ్రహించునది, సత్త్వగుణముతోఁగూడిన పృథివీతన్మాత్రవలన జనించునది అశ్వనీదేవతలే యధిష్ఠానదేవతలుగాఁగల యింద్రియము.
వాగింద్రియము=శబ్దోచ్చారణకు హేతువగునట్టియు, రజోగుణముతోఁగూడిన యాకాశతన్మాత్రమువలన జనించునట్టియు, అగ్ని యధిష్ఠానదేవత గాఁగల యింద్రియము.
పాణీంద్రియము=ఆదానమునకు (స్వీకారమునకు) హేతువగునట్టి, రజోగుణముతోఁగూడిన వాయుతన్మాత్రమువలన జనించునది. ఇంద్రుఁడధిష్ఠానదేవత గాఁగల యింద్రియము.
పాదేంద్రియము=గమనమునకు సాధనమగునది రజోగుణముతోఁగూడిన తేజస్తన్మాత్రమువలన జనించునది, ఉపేంద్రుఁడధిష్ఠానదేవత గాఁగల యింద్రియము.
పాయ్వింద్రియము=విసర్జనమునకు హేతువగునది, రజోగుణముతోఁగూడిన జలతన్మాత్రమువలన జనించునది, మృత్యువే యధిష్ఠానదేవత గాఁగల యింద్రియము.
ఉపస్థేంద్రియము=ఆనందమునకు హేతువగునది, రజోగుణముతోఁగూడిన పృథివీతన్మాత్రమువలన జనించునది. ప్రజాపతి యధిష్ఠానదేవత గాఁగల యింద్రియము.

——

## శ్రీభగవద్గీతా ప్రథమ, ద్వితీయ, తృతీయాధ్యాయములందలి శ్లోకముల

# అకారాది సూచిక.

| | |
|---|---|
| ప్రథమాధ్యాయమందలి శ్లోకసంఖ్య | 47 |
| ద్వితీయాధ్యాయమందలి శ్లోకసంఖ్య | 72 |
| తృతీయాధ్యాయమందలి శ్లోకసంఖ్య | 43 |
| మొత్తం | 162 |

ఓం

# ఉపోద్ఘాతము.

శ్రుత్యన్తపాథోనిధిమన్థనోత్థం, జ్ఞానామృతం యేన వితీర్య లోకే ।
సంరక్షితా స్సర్వజనా స్తు మృత్యో స్తం శ్రీ నృసింహం గురు మాశ్రయేఽహమ్ ।

ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడు. తత్సృష్టమైన ఈజంతుజాలము సకలవిధముల నతని మహోద్దేశమును యథావిధి నెరవేర్చుటకే యేర్పడినది. జంగమస్థావరాత్మకములైన యేభూతములును నతనిశాసనము నతిక్రమింపఁజాలవు. వాని వాని యవసరములను దెలిసియే వాని బాహ్యాభ్యన్తరములనిర్మించియున్నాఁడు. ఆనిర్మాణములో బ్రత్యణువును నీశ్వరుని యొకానొక మహోద్దేశమును నెరవేర్చునదిగనే యున్నదనుట నేటికిని నిర్వివాదాంశముగ నున్నది. ఇదియే యతని సర్వజ్ఞత కొక గొప్ప నిదర్శనము.

## మానవజన్మమునకుఁ బ్రయోజనము.

ఈశ్వరప్రపంచమున నెనుబదినాల్గులక్షల కెకలు జీవరాశులు గలవని శాస్త్రజ్ఞుల నిర్ణయము. వీనిలోఁ బశుపక్ష్యాదిజీవులు తాము పూర్వజన్మమునఁ జేసియున్న పాపకర్మలవలన నీలోకమున ధర్మాధర్మవివేకమున కేయించుక యవకాశములేని విధమున జన్మించుచున్నవి.

అవి తమ యీ వర్తమాన జన్మమున నెట్టి సుకృతదుష్కృతములను జేయఁజాలవు. పాపఫలము ననుభవించుటయే వాని యీ జన్మమున కీశ్వరోద్దేశము.

దేవతలు తాము పూర్వజన్మమున జేసియున్న యజ్ఞయాగాదిపుణ్యకర్మలకు ఫలభూతమైన కేవలసుఖము ననుభవించుటకుమాత్రమే సముచితశరీరములఁ బడసియున్నవారు. కావున వారును నా శరీరమున మఱి సుకృతవిశేషమును సంపాదించుట కనధికారులు. మఱియు నొక దుష్కృతమునకు మాత్రమే వారి కవకాశమున్నది.

ఇక మనుష్యులు తాము చేసియున్న సుకృతదుష్కృతములకు ఫలభూతములైన సుఖదుఃఖముల ననుభవించుచు నుత్తరగతికి సాధనములైన పాపపుణ్యాత్మకములగు వివిధకర్మల కనుకూలములైన శరీరములతో నీభూలోకమున జన్మించి యున్నారు. వీరికి తాము జేసిన పాపములను నివారించుకొనుటకుఁ బ్రాయశ్చిత్తాధికారమును, విహితరీతిని ధర్మార్థకామమోక్షములను పురుషార్థములను సాధించుకొనుటకుదగిన కర్మాధికారమును గలదు.

ఇట్లు హీనోత్తమజాతు లని చెప్పఁబడు తిర్యగ్దేవజాతులకంటె మధ్యమజాతి యని చెప్పఁబడిన మనుష్యుడే యుత్కృష్టుఁ డని నిశ్చిత మగుచున్నది.

కావున మనుష్యుఁడు తన పూర్వజన్మసుకృతవిశేషముచేఁ బ్రాప్తించిన ధనవిద్యాదులవలనఁ బ్రమత్తుఁడై మైమఱచి శమదమాదిగుణసంపత్తిగల వ్యక్తివిశేషములను దూషించుచు సత్కర్మవిముఖుఁడై యకృత్యముల కలవడి యాప్తవాక్యములను, సదుపదేశములను ఆదరింపక పర

కాంతాపరధనాపహరణచతురతామాత్రపాండిత్యగర్వితుఁడై పాపముల కొడిగట్టి పుణ్యముల త్రోవ యెఱుంగక తా ననుకొన్నదియె కర్తవ్యమని యదియు దేశసేవయని దాననే తాను కృతార్థుడ నని విఱ్ఱవీగుచుండెనేని తనకంటె నికృష్టజాతు లనఁబడు పశ్వాదులకంటె నధమాధముడని వాని నేల తలంపగూడదు?

ఇట్లున్నచో మానవునకుఁ దన యుత్తరగతికి నవశ్యమైన యుత్తమకర్మ యెట్టిది? అద్దాని నిరూపించుకొను సాధన మెద్ది? దానివలనగలుగు ఫలితమేమి? అను ప్రశ్నములు సాధారణముగ నెవ్వరికైన గలుగకపోవు. ఇందులకు దగు సమాధానము దొలుదొలుతనే మనము నిశ్చయింపదగియున్నది. మనపెద్ద లీవిషయమున నీశ్వరసృష్టము లగు ప్రకృతిగుణభేదముల ననుసరించి యాసహజభేదములచే మానవజాతి నంతను నాలుగువిధములుగ గుఱుతించి మొదట వర్ణవిభాగమును, తరువాత నాయా తెగలలోని జనులకు వారివారి స్వభావముల కనురూపమైన కర్మవిశేషములను జక్కఁగఁ బ్రతిపాదించియున్నారు.

వారిలో మొదటి మూడు తెగలజనులకును యథోచితవిధిని నిత్యనైమిత్తికకామ్యము లను కర్మభేదములను విధించియున్నారు. అట్టి నియతకర్మలలో "స్నానం సంధ్యా జపో హోమో దేవతానాం చ పూజనమ్ । ఆతిథ్యం వైశ్వదేవం చ షట్కర్మాణి దినే దినే ॥" స్నానము, (ఇది సర్వకర్మలకు సాధారణముగాన షట్కర్మలయందు పరిగణింపబడదు.) సంధ్య, జపము, హోమము, దేవతాపూజనము, ఆతిథ్యము, వైశ్వదేవము ఇవి నిత్యకర్మలు. శ్రాద్ధాదులలో ప్రత్యాబ్దికసకృన్మహాలయాదులు నిత్యములు. గ్రహణాదినిమిత్తకములగు శ్రాద్ధములు నైమిత్తికములు. అష్టకశ్రాద్ధాదులు, పశుమహాలయాదులు, వాజపేయాదులు కామ్యములు. ఇవి కామ్యములైనను 'కర్మణ్యే వాధికార స్తే మా ఫలేషు కదాచన' (గీ-2-47) అను భగవద్వచనానుసారము ఫలాభిసంధివర్జితములై ఈశ్వరార్పణబుద్ధితో ననుష్ఠింపబడిన పక్షమున నవియు "కర్మణా స్సుకృత స్యాహు స్సాత్త్వికం నిర్మలం ఫలమ్" (గీ-14-16) అను వచనానుసారముగ ననుష్ఠాతకు సత్త్వశుద్ధిగలిగించి "సత్త్వాత్సంజాయతే జ్ఞానం" (గీ-14-17) అనుభగవదుపదేశప్రకారము బ్రహ్మజ్ఞానమునకు సాధనము లగుచున్నవి.

అట్టిజ్ఞానమువలన ననగా "బహూనాం జన్మనా మంతే జ్ఞానవా న్మాం ప్రపద్యతే । వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః" (గీ-7-19) అనియు, 'జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్' (గీ. 7- 8) అనియు భగవంతుడు చెప్పిన ప్రకారము క్రమముగ నా కామ్యకర్మానుష్ఠానపరుఁడు తానుశుద్ధబుద్ధముక్తస్వభావమగు పరతత్త్వమను యథార్థము ననుభవింపగలుగుచున్నాడు. అదియే యతనిమానవజన్మముయొక్క పరమప్రయోజనము. దానినే ముక్తియందురు.

## మా న వు ని క ర్త వ్య ము.

కనుకనే "యథాఽఽదర్శే తథాత్మని యథాస్వప్నే తథా పితృలోకే । యథాప్సుపరీవ దదృశే తథా గంధర్వలోకే । ఛాయాతపయో రివ బ్రహ్మలోకే" అద్దమునం దెట్టితీరున

ముఖము, ప్రత్యక్షమగునో యదేతీరున సాధకున కీలోకమున బ్రహ్మము సాక్షాత్కరించును. స్వప్నమునం దెట్టితీరుగ పదార్థములు తెలియఁబడునో సాధకున కట్టితీరుగ స్వర్గమునం దాత్మ సందిగ్ధముగ దెలియఁబడును. నీటియందు ప్రతిబింబ మెట్టితీరున చలించుచు సుస్పష్టముగఁ దెలియదో యదే తీరున గంధర్వలోకమున నాత్మసాక్షాత్కారము స్పష్టము గా నేరదు. ఇది యెండ యని యిది నీడయని యెటులదెలియఁబడునో యటులనే బ్రహ్మలోకమున బ్రహ్మ సాక్షాత్కార మగునుగాన భూలోకబ్రహ్మలోకములు యితర (స్వర్గ గంధర్వ) లోకములకన్న బ్రహ్మజ్ఞానము గలుగుట కుత్కృష్టస్థానము లని కఠోపనిషత్తు ఘోషించుచున్నది. కాన నీలోకమున దగు దేహము ప్రాప్తించినపుడు పాపకృత్యము లాచరింపక నిత్యనైమిత్తిక కర్మల నాచరించుచు జ్ఞానమునకుఁ దగు బ్రయత్నము జేసి యద్దానిని సంపాదిచి మోక్షమును బడయుట మానవ జన్మమునందు జీవుని కర్తవ్యము.

### స్వధర్మమవశ్యకర్తవ్యము అందలి ప్రయోజనము.

కనుకనే శ్రీకృష్ణపరమాత్మ 'స్వధర్మ మపి చావేక్ష్య న వికమ్పితు మర్హసి। ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోన్యత్ క్షత్రియస్య న విద్యతే' (గీ. 2-31) 'శ్రేయా న్స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్। స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥' (గీ. 3-35) అని యర్జునున కుపదేశించి 'యది హ్యహం న వర్తేయం జాతు కర్మ ణ్యతంద్రితః। మమ వర్త్మాను వర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః॥' (గీ. 3-23) అనుచోటఁ గర్మవలనఁ దనకు బ్రయోజనము లేకున్నను నేనే కర్మలను జేయనిచో నామార్గమునే యనుసరించి యితరులుగూడఁ గర్మలను బరిత్యజించెదరు. అటులు పరిత్యజించిన నీలోకము లన్నియు నశించిపోవునని కర్మల నుపదేశించి నీచే నాచరింపఁబడు కర్మలను 'తత్కురుష్వ మదర్పణమ్' (గీ. 9-27) పరమేశ్వరుండ నగు నా కర్పణము జేయుమని యుపదేశించెను. ఈ యుపదేశమువలనఁ దేలిన యాశయమేమి? ఫల నిరపేక్షులై పరమేశ్వరార్పణముగఁ గర్మల నాచరించుటచేత నంతఃకరణము సత్త్వప్రధానమై శ్రవణాదుల కభిముఖమై శ్రవణ, మనన, నిదిధ్యాసనములవలన జ్ఞానసిద్ధినిఁ బొంది మోక్షము బొందుదురని యాశయము.

### ముక్తివిశేషముల నిరూపణము.

ధర్మార్థకామమోక్షములనెడి నాలుగు పురుషార్థములయందు మోక్ష ముత్కృష్టమని సర్వమతస్థు లంగీకరించిన విషయమే. అట్టి మోక్ష మనగా నెట్టిది? అను విషయమునందు మాత్రమే యాయామతస్థులకు గల వివాదము. అందు తార్కికులు 'దుఃఖజన్మప్రవృత్తిదోష మిథ్యాజ్ఞానానామత్తరోత్తరాపాయే తదనంతరాపాయాదపవర్గః' అను గౌతమసూత్రానుసారము దుఃఖము, జన్మము, ప్రవృత్తి, దోషము, మిథ్యాజ్ఞానము అను నీ యయిదింటిలో గడపటిదగు మిథ్యాజ్ఞానముయొక్క వినాశముచే దోషనాశము, దోషనాశముచే బ్రవృత్తినాశము, నా

బ్రవృత్తినాశముచే జన్మనాశ మగు ననియు, దానివలన దుఃఖనాశనగుననియు, నదియే మోక్షమనియు, చార్వాకాదినాస్తికులు 'స్వాతంత్ర్య మేవ మోక్షః' స్వాతంత్ర్యమే మోక్షమనియు, వైష్ణవులు "సాయుజ్య మేవ మోక్షః" విష్ణుసన్నిధి కేగి యచట విష్ణుసమానరూపధారులై తత్సన్నిధియందు నివసించి లక్ష్మ్యాలింగితవక్షస్థలత్వముమాత్రము బరిత్యజించి యితరభోగముల నన్నిటి ననుభవించుచు వైకుంఠమునందు శాశ్వతముగ నుండుటయే మోక్షమనియు, మాధ్వమతస్థులు జీవులలో గొందరు ముక్తజీవులనియు, గొందరు బద్ధజీవులనియు నందు బద్ధజీవులెల్లపుడు బద్ధులే, ముక్తజీవులెల్లపుడు ముక్తులేయనియు, వారు ముక్తియందు వైషమ్యముగలిగి యుందురనియు, మోక్షము సర్వోత్కృష్టమనియు జెప్పెదరు. వారు వీరన నేల? సర్వులు మోక్ష ముత్కృష్టమని యంగీకరింతురు. ఇట్టి మోక్షము సాధింపవలయు ననిన నర్థకామములను ధర్మమనెడి పురుషార్థమున కుపయోగించుచు ఫలమునందిచ్ఛలేని వారై యీశ్వరార్పణముగ గర్మలుచేయుచు వేదాంతశ్రవణ మొనర్పవలయును. అట్టిశ్రవణమున కాటపట్టుపనిషత్తులే. అట్టి యుపనిషదర్థమునే కురుపాండవ యుద్ధప్రారంభసమయమున గురుభ్రాతృపితృపుత్రాదుల వధ నూహించి శోకమోహములచేత నితికర్తవ్యతాజ్ఞానవిమూఢుం డగు నర్జునునకు జ్ఞానోపదేశము చేసిన గాని యజ్ఞానమువలనం బ్రాప్తించిన శోకమోహములు పోజాలవని కృష్ణపరమాత్మ లోకముకొరకు నర్జునునకు జ్ఞానము నుపదేశించెను. ఆయుపదేశ వాక్యములే భగవద్గీత లను పేరం బ్రఖ్యాతములై యున్నవి కాన నీభగవద్గీతలుపనిషత్సారమును బోధించుటచేత నౌపచారికముగ నుపనిషత్తులనబడునని ప్రతియధ్యాయాంతమున "భగవద్గీతాసూపనిషత్సు" అని శ్రీవేదవ్యాసమహర్షి వ్రాసెను.

## శ్రీభగవద్గీత "తత్త్వమసి" అను మహావాక్యార్థబోధకము.

ఉపనిషత్తు లన్నియు జీవబ్రహ్మైక్యము నెటులు బోధించునో యటులే భగవద్గీతలుగూడ జీవబ్రహ్మైక్యమును బోధించుచున్నవి. అది యెట్లనిన నుపనిషత్తులయందు జీవబ్రహ్మైక్యమును బోధించునవి "తత్త్వమసి" "అహం బ్రహ్మాస్మి" "అయమాత్మా బ్రహ్మ" "ప్రజ్ఞానం బ్రహ్మ" అనునవి మొదలుగా గలమహావాక్యములు, అందు 'తత్త్వమసి' అను మహావాక్యము 'తత్, త్వం, అసి' అను మూడుపదములు గలది. అందు 'తత్' అనుపదము పరమాత్మను బోధించును. 'త్వం' అనుపదము జీవాత్మను బోధించును. 'అసి' అనుపదము జీవబ్రహ్మల కైక్యమును బోధించును. అదేతీరున భగవద్గీత పదునెనిమిదిఅధ్యాయములు గలది. పదునెనిమిదియధ్యాయములను మూడుభాగములు చేసిన నొక్కొక్కభాగమున నారారధ్యాయములు. అనగా భగవద్గీత మూడుషట్కములుగా విభజింపబడినది. షట్కమనగా నారధ్యాయములు. అందున మొదటిషట్కము 'న జాయతే మ్రియతే వా కదాచిత్' (గీ.2-20) 'దేహీ నిత్య మవధ్యోఽయం' (గీ.2-30) 'వేదావినాశినం నిత్యం' (గీ.2-21) 'అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయం' (గీ.2-24)

ఇత్యాదివాక్యములచే జీవస్వరూపమును బోధించుచున్నది. రెండవషట్కము 'అహం సర్వస్య జగతః ప్రభవః ప్రళయస్తథా' (గీ.7-6) 'మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ' (గీ.7 7) "అహ మాది ర్హి భూతానాం" (గీ. ) "అహ మాత్మా గుడాకేశ" (గీ. 10-20) ఇత్యాది వాక్యములచే పరమాత్మస్వరూపమును బోధించుచున్నది. మూడవషట్కము 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి' (గీ,13-2) "మమైవాంశో జీవలోకే" (గీ.15-7) "తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరం" (గీ. ) ఇత్యాది వాక్యములచే జీవబ్రహ్మల యభేదమును బోధించును. కాన భగవద్గీత "తత్త్వమసి" అను మహావాక్యసమానార్థకము. ఇట్లు శ్రుతిత్రయమునే బోధించుటచే "భగవద్గీతాసూపనిషత్సు" అని యధ్యాయాంతమున నుడువుట సమంజసముగానే యున్నది.

## భగవద్గీత సర్వశాస్త్రసమ్మతము.

మఱియు వేదములం దచ్చటచ్చట బ్రహ్మాత్మైక్యజ్ఞానమునకుఁ గారణమగు భక్తియోగము, అట్టి భక్తియోగమునకుఁ గారణమగు కర్మయోగము అచ్చటచ్చట విశకలితముగ వర్ణింపఁబడెను. అట్టివాక్యముల ననుసరించియే పతంజలి భక్తియోగము ప్రధానముగాగల యోగసూత్రములను, అట్టి వేదవాక్యముల ననుసరించియే జైమినిమహర్షి కర్మయోగము ప్రధానముగాగల మీమాంసాశాస్త్రమును రచియించియుండిరి. శ్రీవేదవ్యాసమహర్షి యుపనిషత్తుల ప్రధానతాత్పర్య విషయమగు జీవబ్రహ్మైక్యము నుపనిషత్తు లేవిధముగ బోధించునో యారీతిని దెలుపుటకు నాలు గధ్యాయములుగల యుత్తరమీమాంసాశాస్త్రమును (బ్రహ్మసూత్రములను) రచించి యుండెను. కురుపాండవయుద్ధప్రారంభసమయమున శ్రీకృష్ణునిచే నర్జునున కుపదేశింపఁబడిన సర్వశాస్త్రసారభూతములగు భగవద్గీతలయందు జీవస్వరూపమును నిర్ధారణచేయుచు జ్ఞానోత్పత్తికి మొదటిసోపానమగు కర్మయోగమును మొదటిషట్కమునందును, రెండవసోపానమగు భక్తియోగమును రెండవషట్కమునందును, పరమపురుషార్థమగు మోక్షమునకు ప్రధానప్రయోజనమగు జ్ఞానయోగమును మూడవషట్కమునందును వర్ణించుటచే భగవద్గీతాశాస్త్రము శ్రుతి, పూర్వమీమాంసా, ఉత్తరమీమాంసా, యోగశాస్త్రసార మగుటంబట్టి జిజ్ఞాసువున కత్యంతాదరణీయమని ప్రత్యేకము వ్రాయ నవసరములేదు.

## జాతులు జన్మసిద్ధములు.

మఱియు వ్యవహారమునందు నిరుద్యోగసమస్య లేకుండగ మానవులు జీవించునటుల "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః" (గీ4-13) అనునది మొదలుగాగల స్థలములయందు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాది జాతివిభాగమును, తత్తజ్జాతుల కనురూపముగ వృత్తికర్మవిభాగమునుఁ బ్రత్యేకముగ నిందు జెప్పబడుటవలన గీతాశాస్త్రము సర్వులకు నాదరణీయము. దీని ననుసరించి వర్తించినయెడల నిరుద్యోగసమస్యకు నేదేశమునను దావుండదు.

భగవద్గీతలయందు జాతులు జన్మసిద్ధములే యని చెప్పఁబడినంతమాత్రమున నిరుద్యోగ సమస్య దొలగిపోవునా?

జాతులు జన్మసిద్ధమను నీభగవదుపదేశముయొక్క సత్యమును గ్రహించియు, ప్రాచీనభారతీయుల యీ వర్ణవిభాగముయొక్క మూలము నెరింగియు నా యా వర్ణములవారికి విధింపఁబడిన కర్మలు తత్తజ్జాతుల కనురూపము లను యథార్థము నెరింగియు నుండు మానవులలో వృత్తికర్మవిషయకమగు వివాదము పుట్టుట కెట్టియెడల నవకాశముండదు.

అట్లుకాక కేవలము వారివారి కర్మలను బట్టియే జాతులేర్పడిన వనినచో దత్తత్కర్మవిషయమున మానవులలో బోటీలును, దన్మూలములైన కలహములును, దన్మూలమున వృథాకాలక్షేపమును దానిచే నుభయలోక భ్రంశమును దప్ప మరి యేప్రయోజనము నుండదు.

వృత్తికర్మలయెడ సమానాధికారము సర్వమానవసహజమని తలంచుమానవులకు మాంసశకలము నెడ సమానాపేక్షగల శ్యేనములకుంబోలె గొందర కశక్యకార్యకరణపరతయు, గొందరకు బరస్పరవిరోధమును, గొందరకు స్వల్పాల్పఫలమును నను నీలాటియభీష్టప్రాప్తివైకల్యములే సంప్రాప్తములై లోకమర్యాద సంపూర్ణముగ చెల్లాచెదరగుటతప్పదు. కనుకనే ధర్మప్రభావము నెరింగినపెద్దలు సర్వజ్ఞుండగు నీశ్వరునిచే లోకానుగ్రహబుద్ధితో సృజింపబడిన భగవతియగు వేదమాత నాశ్రయించి తదుపదేశమునఁ దత్త్వజ్ఞులై యీవర్ణవిభాగమును గావించెననుట నిక్కము.

ఈనిక్క మెఱిగిన మహర్షి తనమహాభారతమున ధర్మశబ్దనిర్వచనముచేయుచు "ధారణాద్ధర్మ ఇత్యాహుర్ధర్మో ధారయతే ప్రజాః" అని స్పష్టముగఁ జెప్పియున్నాడు. ప్రజాధారణసమర్థమైన యీభారతీయధర్మమును దొల్లింటి రాజులును బ్రజలును సమానగౌరవముతో బాటించుచు వచ్చినందుననే పిమ్మట నెన్ని విప్లవములువచ్చినను నీభారతజాతి నిరుద్యోగసమస్యలకు బాల్పడకయు, దన సహజస్వభావమును గోల్పోవకయు నిలిచి యున్నది. ఇట్టి సహజమును, సత్యమును, ధార్మికమునైన వర్ణాశ్రమ విభాగరూప స్వజాతీయధర్మముయెక్క పటుతరశక్తినిగమనింపక నేటిదుర్వివేక దుస్సంస్కార, దురాచార, దుర్వివాద, దుర్వేష, దుర్భాషాదోషదూషితులగు హైందవులు తమపతనమునకుఁ దామే గోయి ద్రవ్వుకొనుట శోచనీయము. కావుననే బ్రహ్మస్వరూపుఁడగు వశిష్ఠమహర్షి స్నాతక ధర్మములలో 'నమ్లేచ్ఛభాషాం శిక్షేత' అని మున్నె స్నాతకనీయపభాషాశిక్షణమును నిషేధించియున్నాడు.

కనుకనే శ్రీకృష్ణపరమాత్మ "బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప! కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవై ర్గుణైః" (గీ-18-41) ఈజన్మమందు ఫలదానముకొరకభివ్యక్తమైన పూర్వజన్మకర్మసంస్కారమే స్వభావము. అదియే కారణముగా గల సత్త్వరజస్తమోగుణంబులచేతనే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకు శమదమాదికర్మలు వేర్వేరుగా చెప్పబడెనని "శమోదమస్తపశ్శౌచం క్షాంతిరార్జవ మేవచ, జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభా

వజం" (గీ-18-42) శమ, దమ, శౌచ, శాంతి, ఋజభావ, జ్ఞాన, విజ్ఞానాస్తికతలు బ్రాహ్మణు నకును, "శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధేచాప్యపలాయనం, దాన మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్" (గీ-18-43) శౌర్యము, ప్రాగల్భ్యము, ధారణయు, దక్షత్వము, హఠాత్సంప్రాప్తమయిన కార్యమందు మోహము లేకుండగ బ్రవర్తించుట, యుద్ధమందు వెనుకకుఁ దిరుగకుండ నిలిచియుండుట, సత్పాత్రప్రాప్తించినపుడు ముక్తహస్తుఁడగుట, తనకుండు ప్రభుశక్తిని ప్రకటించుట అను నీకర్మలు క్షత్రియునకును, "కృషి గౌరక్ష్యవాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్" (గీ-18-44) వ్యవసాయము జేయుట, గోవులను రక్షించుట, వర్తకము చేయుట, అనునవి వైశ్యునకును, 'పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్' (గీ-18-44) బ్రాహ్మణ క్షత్రియవైశ్యులకు శుశ్రూష శూద్రునకును, తమ తమ స్వభావప్రాప్తములైన కర్మలని వేర్వేరుగాఁ జెప్పి 'స్వే స్వే కర్మ ణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః' (గీ-18-45) తన తన కర్మలయందనఁగా స్వధర్మమునం దభిరతుఁడైన మానవుడు జ్ఞాననిష్ఠారూపసంసిద్ధిని బడయు ననియు 'స్వకర్మనిరత స్సిద్ధిం యథా విందతి త చ్ఛృణు' (గీ-18-45) తన కర్మలయందాసక్తుడై చరించు మానవుఁ డేతీరుగ సిద్ధిని బొందునో జెప్పెద విను మని 'యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతమ్। స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః' (గీ-18-41) యెవనివలన సమస్తభూతములు జనించుచున్నవో, యెవనిచే నీప్రపంచమంతయు వ్యాపించి యుండెనో అట్టి పరాత్పరుని తన జాతిసిద్ధమగు కర్మలచేఁ బూజించి మానవుడు జ్ఞాననిష్ఠకు యోగ్యతను పొందుననియు, 'శ్రేయా న్స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్, స్వభావ నియతం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్' (గీ-18-47). లెస్సగ ననుష్ఠింపఁబడిన నితరజాతికర్మ కన్న కొంత గుణలోపము గలదైనను తన తన జాతిసిద్ధమగు కర్మయే శ్రేష్ఠమయినది. పూర్వ కర్మానుసారము ప్రాప్తించిన తన జాతిస్వభావమున కనురూపంబుగ బ్రాప్తించిన శాస్త్రనియత మగు కర్మ నాచరించువాఁడు పాపమునుఁ బొందనేరడనియు 'సహజం కర్మ కౌంతేయ! సదోష మపి న త్యజేత్, సర్వారంభా హి దోషేణ ధూమే నాగ్ని రివావృతాః' (గీ-18-48) అగ్ని ధూమముచే నావరింపబడినటుల సర్వకర్మలు దోషములచే నావరింపఁబడి యుండుటచేత పూర్వకర్మసంస్కారమువలన ప్రాప్తించిన తన జాతికి తగు కర్మ దోషయుక్తమయినను బరిత్యజింపగూడదనియు భగవంతుఁ డీగీతయం దుపదేశించుటచే 'జన్మనా బ్రాహ్మణో జ్ఞేయః' అనునట్లు జాతి జన్మసిద్ధమని స్పష్టపడుటయే గాక యాయా జాతికి దగు కర్మలుకూడ ప్రత్యేకముగ నుపదిష్టములైనందున నీభారతధర్మములందు నిరుద్యోగసమస్యకు (వృత్త్యభావమునకు) తావు లేదనుట నిర్వివాదాంశము.

మరియుఁ దమ జాతిధర్మంబుల ననుష్ఠించుటచే నంతఃకరణము శుద్ధమై మానవజన్మకు పరమార్థమైన జీవబ్రహ్మైక్యజ్ఞానము కలుగు నను సత్యమును బ్రకటించుటచే భగవద్గీత సర్వులకును మోక్షోపాయమును జక్కఁగా బ్రదర్శించిన వ్యాప్తగ్రంథ మని నిర్ణయింపఁదగి యున్నది.

భగవద్గీత సర్వులకు సమాదరణీయమని మేము చెప్పుటయే కాదు. ఇప్పటికే యీ పవిత్రగ్రంథము ప్రాచీనులగుశంకర, రామానుజప్రభృతి వివిధమతాచార్యులకును, నేటిపాశ్చాత్యవిద్యాసంపన్నులగు ప్రాచ్యపండితులకును, పాశ్చాత్యవిద్వాంసులకును నిత్యపఠనప్రవచనవిషయమై వారివారి దేశకాలములకును, తత్తత్సంస్కారములకును, తత్తద్బుద్ధివైశద్యమునకును ననురూపములగుభావములనుత్పన్నముజేయుచు నెల్లరిచేబరమప్రమాణముగ గ్రహింపబడుచున్నది.

ఇట్టి స్థితి భగవద్గీతయొక్క యసాధారణమహిమను వెల్లడించునదియే యైనను ఇందరకిన్నివిధముల యభిప్రాయములను దోపించు నీగ్రంథము నిజములో నేదైననొక నియతాభిప్రాయము గలది యగునా? కాదా? అను సంశయమున కాస్పదమగుచున్నది.

## భగవద్గీతను గూర్చి పూర్వులు.

"సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః। పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్" అని బహువిధముల బ్రశంసించి యుండిరి ఈగీతామృతముపనిషత్తులను గోవులనుండి యర్జునుని దూడగాఁగొని శ్రీకృష్ణభగవానుడు తాను స్వయముగ దోగ్ధయై సుధీజనముయొక్క యుపభోగముకొరకును, వారిజననజరామరణ శోకాద్యాధ్యాత్మిక తీవ్రవ్యాధినివారణముకొఱకును బిదికియిచ్చిన మహామహిమగల దుగ్ధముగునేనిదానిని వికృతార్థగ్రహణవిషదోషదూషితము గావించి తమ యనుయాయులకొసంగినచో నీవ్యాఖ్యాతలును, విమర్శకులును, వారి భవరోగశాంతికిగాక తద్విరుద్ధమైన దురంత మన్విషహ సన్నిపాతోత్పత్తికి గారకులై తత్పాపఫలము ననుభవించు వారలగుచున్నారు.

శ్రీశుద్ధాద్వైతభాష్యకారులు తమ భాష్యరచనకు బూర్వమే యీమహాగ్రంథమున కిట్టి దోషమునాపాదించు కొన్నివ్యాఖ్యానము లున్నట్లు తమ భాష్యమునందే సూచించియుండిరి. తరువాతకూడ ననేకవ్యాఖ్యానములు పుట్టినవనుట మన మెఱుంగుదుము. కొంతవరకు శ్రుతిస్మృతిసంప్రదాయము వీడగూడదను నియమమే ప్రధానముగాఁగల ప్రాచీనవిద్వాంసుల వ్యాఖ్యానములు భక్తి, జ్ఞాన, కర్మయోగములలో నేదేనియొక్క దానిని బ్రధానీకరించు నుద్దేశముతో బుట్టినవి. గావునను నవి యుపాయోపేయములలో దేనికైన నొకదానికిసుసంబద్ధములై యుండినందునను వానివలనగలుగు నుపద్రవమంతగా బాటింపదగినది కాజాలదు.

అది యెట్లనిన? శ్రీభగవత్పాదులు మోక్షమునకు సాక్షాత్సాధనము జ్ఞాన మొక్కటియే యని సిద్ధాన్తీకరించి యట్టియాజ్ఞానమునకు భక్తియోగ, కర్మయోగము లుపాయభూతములుగా నంగీకరించిరి. ఇదియే 'తత్తు సర్వకర్మసన్న్యాసపూర్వకా దాత్మజ్ఞాననిష్ఠామాత్రా త్కేవలా ద్ధర్మా ద్భవతి' అట్టి మోక్షము సర్వకర్మసంన్యాసపూర్వకాత్మజ్ఞాననిష్ఠామాత్రధర్మమువలననే ప్రాప్తించును. అని స్వసిద్ధాంతమును వెల్లడించుటకు గారణము. "జ్ఞానముత్పద్యతే పుంసాం క్షయాత్పాపస్య కర్మణః" అనుప్రాచీననియమావళి ననుసరించి వారి యాసిద్ధాన్తమే యుక్తి

సమంజసముగ నున్నది. నిత్యనైమిత్తికాదివిహితకర్మజాలము చిత్తశుద్ధికిని, నది జ్ఞానోత్పత్తికిని సాధనమగుననుట భగవన్మతమే యగునని గీతలలోని "కర్మణస్సుకృతస్యాహుస్సాత్త్వికం నిర్మలం ఫలం" (గీ. 14–16) 'సత్త్వాత్సంజాయతే జ్ఞానం' (గీ. 14–17) "జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" (గీ 7–18) అను భగవద్వచనములవలననే స్పష్టమగుచున్నది. దీనిని సహింపని కర్మవాదులు పూర్వోత్తరభాగ్యములైన యీ కర్మజ్ఞానములకు సముచ్చయము ననఁగా యౌగపద్యావస్థతోఁ గూడిన సమప్రాధాన్యము నిచ్చి తదనురూపముగ నీగ్రంథమునకు వ్యాఖ్యానము చేసియుండిరి.

ఇట్లే భగవంతుఁడు 'చతుర్విధా భజన్తే మాం జనాస్సుకృతినోఽర్జున! ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ!' (గీ. 7–16) అను శ్లోకమునందు 'సుకృతినః' అనుటచే కృతపుణ్యులైనవారికే తన భక్తిసాధ్యమనియు, నదియు ఆర్త, జిజ్ఞాసు, అర్థార్థి, జ్ఞానులనెడు పరస్పర విశిష్టహృదయులగు నాలుగు తెగల భక్తులయొక్క నాలుగువిధములగు పరమేశ్వర విషయక హార్దప్రీతిభేదములచే నొప్పుచున్నదనియు జెప్పి యట్టి భక్తిచే గలుగు ఫలితమును "మచ్చిత్తా మద్గతప్రాణాః" (నాయందే చిత్తముకలవారై, నన్నుబొందిన ప్రాణములు కలవారై) (గీ. 10–9) అను పదియవయధ్యాయమందలి తొమ్మిదవ శ్లోకముతో దొరకొని ప్రీతిపూర్వకముగ సతతయుక్తులై తన్ను భజించువారికి దేనిచే తన్ను బొందగలుగుదురో అట్టిబుద్ధియోగము నిత్తునని చెప్పుటయేకాక స్పష్టవచనముతో బుద్ధియోగశబ్దార్థమును వివరించువాడై యీక్రిందిశ్లోకము అనగా "తేషా మేవానుకంపార్థ మహమజ్ఞానజం తమః। నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా" (గీ. 10–11) అను శ్లోకమును జెప్పియున్నాడు. అట్టి భక్తులయందలి పరమకారుణ్యముతో నాత్మస్వరూపముననున్న నేను వారి యజ్ఞానజనితమగు తమస్సును ప్రకాశమానమగు జ్ఞానదీపముచే నశింపఁజేయుదునని స్పష్టముగ జెప్పియున్నాఁడు. ఇందువలన భక్తియొక్క ప్రథమావతరణము స్త్రీశూద్రాదిజాతులకు ననఁగా నజ్ఞానులకు సయితము గలిగి క్రమక్రమముగ దాని మూలమున నీశ్వరానుగ్రహము ప్రవృద్ధమై యాయనుగ్రహమున జ్ఞానోత్పత్తియై దానిచే నజ్ఞానతమోనాశనమగునని చెప్పియున్నాఁడు.

మఱియు "భక్త్యా మా మభిజానాతి యావాన్య శ్చాస్మి తత్త్వతః" (గీ. 18–55) అని యనుటవలన భగవంతుని స్వరూపజ్ఞానమునకు భక్తియనునది యొకసాధనమనియు, వెంటనే 'తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరం' (గీ. 18–55) అనుటవలన పరమేశ్వరస్వరూపజ్ఞానానంతరమే తత్ఫలభూతమైన మోక్షరూపమగు నవిద్యానివృత్తిపూర్వక బ్రహ్మప్రాప్తియనియు భగవంతుఁడుద్ఘోషించినట్లైనది. ఇందుచే కర్మజ్ఞానవైరాగ్యములు భక్తికిసాధనములను విశిష్టాద్వైతసిద్ధాంతముకంటే, కర్మ, భక్తి, వైరాగ్యములే జ్ఞానమునకు సాధనములను నద్వైతాచార్యసిద్ధాంతము భగవన్మతమనుట నెల్లరు గ్రహింపదగినదని విషయము.

## సంస్కర్తల విమర్శనము.

ఇది యిట్లుండ నేటి నవీనవ్యాఖ్యాతలు తమ జాతీయతాప్రఖ్యాపనముకొరకో, ప్రాకృతజనసమ్మోహనార్థమో భగవద్గీతాగ్రంథమునందలి 'చాతుర్వర్ణ్యం మయా సృష్టం' (గీ4–13)

"విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని, శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః" (గీ. 5-18) ఇంకను విచారింతుమేని "ప్రజన శ్చాస్మి కందర్పః" (గీ. 10-28) అను నిత్యాదిగా గల శ్లోకములకు యథామతిఁ దమకుఁ దోచిన దురర్థావలంబనభ్రాంతిచే పారప్రవచనంబులకుఁ గడంగియు వ్యాఖ్యానవిమర్శనములు వ్రాసి ప్రకటించియు వివాహవిచ్ఛేదాస్పృశ్య దేవాలయప్రవేశన ప్రౌఢావివాహ వితంతూద్వాహాదులైన స్వాభిమంతసంఘసంస్కారములకు జనులను నిరంతరము ప్రేరేపించుచున్నారు. వారిమతములో భగవదుద్దిష్టమైన కర్మ యీ యుక్తసంస్కారాదికర్మయే. వారిదృష్టికి గీతాశాస్త్రము శ్రుతిస్మృత్యాదిప్రాచీనశాస్త్రసాపేక్షముగాక తమవలె నూత్నసంప్రదాయ సంస్కారప్రతిష్ఠాపనము కొరకు స్వతంత్రబుద్ధితో బుద్ధావతారమునకు ముందే యతని పురోమార్గమునుజక్కఁ జేయుటకు బుట్టిన యొకానొక సహజజ్ఞానసంపన్నుడగు గొల్లపిల్లవానిచే రచింపఁబడిన గ్రథవిశేషమైయున్నది. గ్రంథకర్త యీకారణముచే సర్వజ్ఞుఁడనుట కాస్తికులకంటె నాస్తికులకే యెక్కువ యవకాశము చిక్కినది. ఏలయన? రమారమిం యిరువదియైదువందలసంవత్సరములకు ముందు జన్మించిన బుద్ధభగవానుని కార్యక్రమమునేకాక తరువాత నింతకాలమున కవతరించిన తమవంటి మహాశయులయొక్క మహత్తరకార్యక్రమమును గూడ నంతటిపూర్వకాలముననే తనభవిష్యద్జ్ఞానపాటవముతో గురితించియే తాదృశగ్రంథనిర్మాణము గావించు మహాప్రజ్ఞ సర్వజ్ఞశేఖరునకు గాక యితరుల కేలగలుగునని వారి యాశయము. ఎట్లైననేమి? శ్రీకృష్ణుడు సాక్షాత్పరమేశ్వరుడని తత్సర్వజ్ఞతను గొనియాడుచుండు సనాతనులవలె మీము నతని నేకారణమున నైననేమి తాదృశగౌరవముతోఁ గొనియాడుటొక్కటి మాత్రము శ్లాఘ్యతరమైన కృత్యమే.

## గీతారహస్య విమర్శనము.

సరి ఇదియంతయు నిట్లుండనిచ్చి ప్రఖ్యాతదేశనాయకులగు శ్రీ. శ్రీ. శ్రీ. కీ. శే. లోకమాన్య బాలగంగాధర తిలక్ మహాశయులు వారి గీతారహస్యములో శ్రీ శ్రీ శ్రీ ౧౧౦౮ శ్రీభగవత్పాదుల భాష్యమును విషయీకరించుకొని దొరలించిన కొన్ని యనుపేక్ష్యములగు దూషణవాక్యములను సయిత ముపేక్షించి ముఖ్యాంశముల విచారింతము.

భారతయుద్ధారంభదివసమున నుభయపక్షములవారును సన్నాహముతోఁ గురుక్షేత్రము బ్రవేశించినపిమ్మట తత్కార్యక్రమమును గూర్చి కథకుడైన సంజయు నుద్దేశించి ధృతరాష్ట్రుఁ డడిగిన "ధర్మక్షేత్రే కురుక్షేత్రే" (గీ. 1-1) ఇత్యాదిగాఁ గల ప్రశ్నశ్లోకములతో గీతాగ్రంథ మారబ్ధమగుచున్నది. ప్రతిపక్షసైన్యమునకు దాని బలీయస్త్వమునకు వెరఁగుబడి గగ్గోలు చెందిన కౌరవనాయకుని స్వపక్షప్రోత్సాహనవాక్యములతో విషయమారంభింపబడినది. దుర్యోధనుఁడుతన దురభిమాన, కామ, క్రోధ, లోభ, మద దూషితుడై మాయోపాయమున దాను బడసిన పరస్వత్వమును రక్షించుకొను ప్రయత్నముతోఁ దనపాపమున కనురూపమగు నస్థానశంకాసంకులహృద-

యుఁడై యేదేదియో మాటలాడి తన యజ్ఞానమునకు దగినట్లు పరవిధ్వంసనార్థము భీష్మద్రోణాదులగు పెద్దలు తాత్కాలికముగజూపిన యుత్సాహమునకు నుప్పొంగి యంతటితో స్వస్థుడయ్యెను.

గీతలపదునాఱవయధ్యాయములో శ్రీకృష్ణు డర్జునునకుఁ జెప్పిన యాసురసంపదభిజాతుల లక్షణములన్నియు నేకొదువయులేకుండగ సరిపోయినవాఁడు దుర్యోధనుండును, వానియనుచరులు నై యున్నారు. పై లక్షణములన్నియు భగవంతుఁడర్జునునకుఁ దత్ప్రతిపక్షస్వరూపనిరూపణముకొఱకే చెప్పియున్నాడనుట నిక్కము. ఈస్థలమున మొట్టమొదటనే దైవసంపదభిజాతుల పవిత్రగుణములను వర్ణించి "మాశుచ స్సంపదం దైవీ మభిజాతోసి పాండవ!" (గీ. 16-5) అని తానెవ్వని యసాధారణభక్తిశ్రద్ధలకులోఁగి సారథ్యముచేయఁగడగెనో యాశ్రితయగు నర్జునునియొక్కయు, దదుపలక్షితన్యాయమున నతని సోదరాదులయొక్కయు నుత్తమప్రకృతిని ముందుగనే వర్ణించియున్నాఁడు. దీనివలన ధర్మైకరతులగు తనభక్తులకే తాను సమయమున దోడ్పడుదు ననుస్వాభిప్రాయమును భగవంతుడు స్పష్టపరచినట్లయినది.

"అభయం సత్త్వసంశుద్ధిః" (గీ. 16-1) ఇత్యాదిగాగల దైవసంపద్యోగములైన మహాగుణములుగల కథానాయకుఁడగు నర్జునుఁడు స్వపక్షసైన్యముఖమున నిలిచి యుభయసేనామధ్యమునకు తన తేరు బోనిమ్మనియు, నందు ప్రతిపక్షవీరులలో నెవ్వరెవ్వరు సకలజగద్విజేతయగు తన్ను మాఱ్కొన నువ్విళ్ళూరుచున్నారో, లేక, తనతో యుద్ధముచేయతగిన యోధపుంగవులెవరో చూతుననియు చెప్పినపిమ్మట భక్తవత్సలుడగు భగవంతుడు నిశ్శంకముగ నారథమునచ్చటకు దోలి "ఉవాచ పార్థ పశ్యైతా న్సమవేతాన్కురూన్" (గీ. 1-25) అని పలికి శిష్యునకు మొదటిసంశయము నావిర్భవింపజేసి విషయము నెదుట నిలిపి సిద్ధాంతావబోధమునకు దగు నవకాశము వెదుకు నాచార్యునట్లు తాన వినోదముచూచుచున్న వానివలె నూరకుండెను.

అంతట తన యుద్దేశానుసారముగ నుభయపక్షములయందున్న పితృపితామహాచార్యమాతులశ్వశురాదులగు పూజ్యులను, సుహృద్భ్రాతాదులగువయస్యులను, పుత్రపౌత్రాదులగు వాత్సల్యస్థానభూతులను, పరాధీనజీవనులగు నానాదేశసైనికులను జూచియు తన జగత్ప్రఖ్యాతవిక్రమమును నసాధారణసంపత్తిని నొక్క మాఱు స్మరించుకొనినంత మాత్రమునం దనబుద్ధియందు వారి విషయమై తోఁచిన ఘోరాంతరాపదను దలంచియు, మఱియు ననధ్యులును విఖ్యాతయోధులు నగు ప్రతిపక్షసేనానుల వీర్యవిక్రమములు దలంచికొనినమాత్రమున దోచు స్వపక్షవీరుల వినాశమును భావించియు, నొకవంక తల్లడమును, నొకవంకదయయు, నొకవంకపశ్చాత్తాపమును గలిగి వీరపురుషోచితమైన యుత్సాహము సడలి కరుణారసమునకు మూలమైన శోకము పొంగి పొరలుచుండ యుద్ధమునందును దన్మూలమైన విజయమందును, దానంగలుగఁబోవు నిహపరసుఖములందును గాఢతరమైన విరక్తి పొడమి నిర్విణ్ణుఁడై కర్తవ్యము దోపక కొంతసేపు భగవంతునితో దన దుఃస్థితినిఁగూర్చి యేమేమియో యంగలార్చి తుదకాయుద్ధము తన యజ్ఞాన

నకీర్తికరమనియు, నట్టి వైరాగ్యము నవలంబింపబూనిన నీవు క్లీబసదృశుఁడవనియు, నట్టిక్లైబ్యము నీకుఁ దగదు కావున క్షుద్రమైన యీహృదయదౌర్బల్యమును వదలి యుద్ధమున కభిముఖుఁడవు కమ్మని భగవంతు డతనిని నిందాపూర్వకముగఁ బ్రోత్సహించుచున్నాఁడు.

ఇట్టి భగవద్వచనములకుఁ గారణమైనది (1) నిజములో జగదీశ్వరుఁడనని చెప్పుకొనిన యతని హృదయమునందుగల విషమబుద్ధియు, గౌరవులయెడల యీర్ష్యాసూయలును మాత్రమే యగునా? (2) లేక యతనికి గలిగిన యీ వైరాగ్యముయొక్క దార్ఢ్యమెంతటిదియో పరీక్షింపవలయు నను యుద్దేశమా? ఈరెండును గాక (3) యర్జునుని హృదయమందుఁ గలిగిన యీ యుద్ధవైముఖ్యరూపమయిన వైరాగ్యమును, దానికిఁ గారణభూతములైన బంధుప్రీతి, దయా, శోకములును నయోగ్యములని భగవంతుఁడు తలంచి యుండుటయా? చూతము.

భగవంతుని యీవచనములు విన్న పిమ్మట మఱల నర్జునుఁడు కొన్నిమాటల నుడివియున్నాఁడు. (1) భీష్మద్రోణులు వారికిని నాకును గల సంబంధమునుబట్టి నాకుఁబరమపూజ్యులని యెఱుంగుదువుగదా. పూజ్యులఁ బూజింపవలసినవారికిఁ బ్రచండకాండములతోఁ బూజ నెట్లు గావింతును? పాపము వారీ ముసలిముప్పున నేఁడేని నొక స్వార్థభంగభీతిచే నన్నెదుర్కొన వచ్చియున్నారు. వారినిఁజంపి తదుధిరప్రదిగ్ధములైన భోగము లనుభవించుటకంటె నాక్షత్రియజాతికి శాస్త్రగర్హితమైనను భిక్షాటనవృత్తినయితము నాకు శ్రేయస్కరమని భావించుచున్నాను. ఇందుల నీయభిప్రాయమేమి?

మఱియు (2) నీయుద్ధమునందు దుదికి జయాపజయము లేపక్షమున కలుగునో ఆజయాపజయముల వలన లాభనష్టములలో నేది యెవ్వరికి గరిష్ఠమైనదో తెలిసినది కాదుకదా. యిట్టి స్థితిలో మరల నెదుర్కొనునది మేమెవ్వరినిఁ జంపి క్షణమైనను జీవింపఁగోరమో యట్టి కురువంశవృద్ధుఁడగు మాపెదతండ్రి ధృతరాష్ట్రుని కుమారులై యున్నారు. వారినిఁజంపి జయముగొనుటకంటె మా యపజయమునె యంగీకరించుట శ్రేయస్కరము కాదా? అని. యీవిధముగ బ్రశ్నించియున్నాడు.

కాని యర్జునుఁడు తన యీనిశ్చయముపైననే యాభాగపక్ష యుద్ధము మానుకొనఁ దలంపలేదు. తన ధర్మసందేహములనెల్ల బాగుగా దాను దెలియఁజేసినందున దన హృదయము దేలపడి భగవంతుఁడు దనకు సరియైన మార్గము నుపదేశించు ననియే తలంచినట్లున్నది.

భగవంతుఁ డింతకుముందు దనకుఁజెప్పిన వచనములను గూర్చి యతనికిని మనకుఁ గలిగియున్న పూర్వోక్తసంశయత్రయములో రెండవసంశయమే (అనగాఅర్జునునకుగలిగిన యీవైరాగ్యముయొక్క దార్ఢ్య మెంతటిదియో? అను సంశయమే) కలిగియుండవచ్చుననితోఁచుచున్నది. ఇంతటితో విడువక యర్జునుఁడు నాస్వభావము కార్పణ్యదోషముచే బెదరిపోయినది. ధర్మము నెడ నతిమూఢ్యమును వహించినది. కావున నిన్నడుగుచున్నాను. నేనునీశిష్యుడను. నిన్ను శర

ణుఁజెందితిని. నాకిప్పట్టున యుద్ధత్యాగమే కర్తవ్యమగునో? యుద్ధమే కర్తవ్యమగునో నిశ్చయించి సువ్యక్తముగ బోధింపుము.

నాకిప్పుడు కలిగిన సకలేన్ద్రియశోషకమగు శోకముమాత్రము యీభూమియందు నిస్సపత్నమగు సామ్రాజ్యము చేకూరినమాత్రమున బోవునదికాదు. అదియేమి! త్రిలోకాధిపత్యము కలిగినను నాయీశోకము దానిని నివారింప జాలదనియెను. ఈమాటలవలన నర్జునుని మనస్తత్వ మిప్పు డెట్లున్నదో మహాభారతకవి మనకు జక్కఁగ బ్రదర్శించియున్నాఁడు.

## శ్రీభగవత్పాదుల సిద్ధాంతము.

ఇప్పట్టున శ్రీభగవత్పాదులు శోత్రియగు నర్జునునకు గలిగిన యవస్థనుగూర్చి సంగ్రహముగఁ జెప్పుచు "శోకమోహ మహోదధౌ నిమగ్నా యార్జునాయ" అని వర్ణించియున్నారు. మఱియు ప్రథమాధ్యాయ రూపమగు గ్రంథభాగ మంతయు శోత్రియొక్క శోకమోహప్రదర్శనమాత్ర పర్యవసితమని గూడ నుడివియున్నారు.

ఈశోకమోహములే మానవుని సంసారమహాసముద్రములో పడవైచు నవిద్యామయ మహావృక్షమునకు బీజభూతములనియు జెప్పియున్నారు. కావున నిట్టి పాపిష్ఠములగు నీసంసార బీజములు నర్జునుని హృదయక్షేత్రమునుండి దూరము సేయుటకే భగవంతుడు "అశోచ్యా నన్వశోచస్త్వం (గీ. 2-11) అను నిత్యాదిగా నుపదేశగ్రంథము నారంభించెననియు నుపక్రమ లింగముయొక్క స్వరూపమును నిర్వచించియున్నారు. వారి యీనిర్ణయము సరియైనది కాదని తోసివేతమనిన మహాభారతకర్త యీగ్రంథమునకు యోగశాస్త్రమని పేరు పెట్టియున్నాఁడు. "భగవద్గీతాసూపనిషత్సు" అనువచనముచే నీగ్రంథ ముపనిషదసంప్రదాయమునకు సంబంధించినదనికూడ దెలిపియున్నాఁడు.

యోగశాస్త్రమై యుపనిషదర్థావబోధకమునైన యీగ్రంథము వాని ప్రయోజనమగు శోకమోహనివృత్తిని జేయవలసియుండును. శోకమోహము లాత్మజ్ఞానమువలనగాని నివృత్తములు కావనుట సర్వసంప్రదాయసిద్ధమైన నిశ్చయము.

ఇంతేకాక మొదటియధ్యాయమునకు విషాదాధ్యాయమని శ్రీవ్యాసభగవానుడే పేరు పెట్టియున్నాఁడు విషాదము మోహజనితమనుట స్పష్టము. అట్టిదికనుకనే భగవన్ముఖమున దానిని 'కశ్మలం' 'క్లైబ్యం' 'క్షుద్రం' 'హృదయదౌర్బల్యం' అను పేర్లతో నుడివియున్నాఁడు ఇక శోకమునుగూర్చియో పూర్వాధ్యాయమున బ్రదర్శించినదియేకాక యర్జునునినోటనే దుర్నివారమైనది తనశోకమనియు జెప్పియున్నాఁడు. భగవంతుఁడును నతనిశోకమునుగూర్చియే ప్రస్తావించి యతని జ్ఞానమును బరిహసించియున్నాఁడు. ఇట్లు భగవత్పాదులు చెప్పిన భగవద్గీతోద్దేశముయొక్క ముఖ్యస్వరూపము శోకమోహనివారణైకప్రయోజన మనుట యెటుజూచినను స్థిరపడుచున్నది.

## శ్రీతిలకుగారి యాశయము.

ఇంక తిలకుగారు గీతోద్దేశము నిజములో నర్జునునకుఁ గలిగిన సన్న్యాసస్వీకారబుద్ధిని నివారించుటయే యనుచున్నారు. అర్జునుడు తనకు యుద్ధోచితములైన ధనుర్బాణాదులను విసరి పారవైచి వానికి మారుగ జోలెయును, కమండలువు గైకొని సన్న్యసింప సంసిద్ధుడై యుండ నతని నాతుచ్ఛమార్గమునుండి తప్పించుటకై భగవంతుఁడీయుపదేశమును జేసినందునను, తుదకు భగవంతునితో 'నష్టోమోహస్స్మృతిర్లబ్ధాకరిష్యే వచనం తవ' (గీ. 18-73) అని తన మోహము అనగా కర్మానుష్ఠానముకంటె సన్యాసము శ్రేష్ఠమని తాను "శ్రేయో భోక్తుం భైక్షమపీహ లోకే" అని నిశ్చయించుకొనుటకుఁ గారణమైన యజ్ఞానము నశించినదనియు, పూర్వస్మృతి అనగా తానేయుద్ధములో యుద్ధముచేయదలచి వచ్చియుండెనో ఆవిషయస్మృతి మరల గలిగినదనియు నింక నీమాటను బరిపాలింతు ననియు స్వయముగనే చెప్పినందునను నీగ్రంథము కర్మైకనిష్ఠాప్రతిపాదకమేగాని భగవత్పాదులు చెప్పినట్లు సర్వకర్మసన్న్యాసపూర్వకాత్మజ్ఞాననిష్ఠారూపధర్మప్రతిపాదకము కాదనియు నఖండముగ నాందోళనము సాగించియున్నారు.

ఇంకను నటు భక్తియోగప్రతిపాదకమని కాని, ధ్యానయోగప్రతిపాదకమని కాని, యీ భగవద్గీతయొక్క యుద్దేశనిర్ధారణము చేసియున్న వ్యాఖ్యాతలను మిక్కిలి పరిహసించియున్నారు. అబోధోపహతులైన జనులు తక్కినదేదియు దమకు దెలియకున్నను ప్రసిద్ధనాయకుని యీ పరిహాసవచనములను మాత్రము చదివి తెలిసికొని తొల్లిటి పెద్దల యథాసారజ్ఞానసంపత్తిని విశ్వసింపక త్రోసివేసి విరుద్ధమతులగుచున్నారు.

ఇట్టి విభ్రాంతికి మూలమైన లోకమాన్యుని గీతారహస్యమును నితరవిషయములలో వారి యందు మాకెట్టిగౌరవ మున్నను విమర్శించక తప్పనదికాదు.

## గీతారహస్య విమర్శనము.

శ్రీతిలకుగారర్జునుని యుద్ధవైముఖ్యను సన్న్యాసేచ్ఛాహేతుకముగా మొదట నిశ్చయించియుండినచో దానినే యుపక్రమలింగముగా గ్రహించి యుపదేశతాత్పర్యము నిట్లు తాము మారు చేసి యుండఁగూడదు. కాని యర్జునుడు తనకు సన్న్యాసేచ్ఛ యున్నట్లు వారుపక్రమభాగమని తలంచిన గ్రంథప్రథమాధ్యాయములోఁగాని తరువాత యర్జునుని వచనములలోఁ గాని యెచ్చటను వాచ్యముగ దెలిపియుండలేదు. పోనీ వ్యంగ్యముగనైనఁ దెలిపియుండెనా? యనిన నదియుఁగానరాదు. కాని 'శ్రేయోభోక్తుం భైక్ష మపీహ లోకే' (గీ. 2 5) అనువాక్యము వలన వారు భ్రమించినట్లు తోఁచుచున్నది. ఇట్టి భ్రమ వారికిఁ గలదనుటకు వారు వ్రాసిన "అర్జునుఁడు సన్న్యసించి భిక్షాటనమునకు సంసిద్ధుడై యుండఁగా" అను వాక్యములే సాక్ష్యమిచ్చుచున్నవి.

భిక్షాచర్యమనునది సన్న్యాసికి శరీరయాత్రార్థమగు వృత్తియగుట సత్యమేకాని యంత మాత్రమున నది సన్న్యాసేచ్ఛాసూచక మనుట యుపపన్నముకాదు. ఏలయన? బ్రహ్మచారికిని

భిక్షావృత్తి నియతమైయున్నది. ఈయర్జునుఁడే యొకప్పుడు తన బ్రహ్మచర్యమున నేకచక్రపురము నందు భిక్షావృత్తి నవలంబించియున్నాఁడు. సరి. గృహస్థుడైనపిమ్మట నర్జునుఁడిట్టివృత్తి నవలంబింపఁదలఁచె నను సూచనచే నతఁడు సన్న్యసింపఁదలఁచెనని యేల చెప్పఁగూడదందురేమో! వారు. కానియర్జునుఁడు దాను భిక్షాటనము చేయుదునని యేమియుఁ జెప్పియుండలేదు. మఱి యేమనః గురువులనువధించి వారి నెత్తురుకూడు భుజించుటకంటె భిక్షావృత్తితో జీవించుటైన మేలుగాదా! యని తనగురువధాత్మక కర్మమునందలి జుగుప్సను దెలిపియున్నాఁడు. ఇంతమాత్రముననే యతఁడు సన్న్యసింపఁదలఁచెనని నిశ్చయింపఁదలఁచినచో నొకానొకఁడు తనభార్యయందలి యల్పకారణకమైన కోపముతో "నీతోఁగాపురముచేయుటకంటె మూడూళ్ళ ముష్టియెత్తుకొనుట మేలు" అని యనెననుకొనుఁడు. అట్టి సామాన్యగృహస్థుని పలుకులు వినినను తిలకుగారతఁడు క్షణమాత్రములో సన్న్యాసాశ్రమమునకు సంసిద్ధుఁడై వింధ్యగుహలకు బరుగిడుచున్నాఁడని తాము తలంచెదు నంతటి దుర్బలహృదయు లనక తప్పదు.

ధీరపుంగవులైన తిలకుగారట్లు చేయుదురా? పోనీ యర్జునుఁడు నుడివిన మాటలంతకంటే సన్న్యాససూచనము నెడ బ్రబలములైనవి కావే! భగవంతు డీమాటలకు బెదరి తన చెల్లెలైన సుభద్రకెట్టి కడగండ్లు వచ్చునోయనియా? యతనికి "నాయనా! యర్జునా! అయ్యో! ఇంత మాత్రమునకు సన్యసింతువా? మానుముతండ్రీ" అని యతనికి కర్మయోగమును మాత్రమే యుపదేశింప దొరకె ననుట శ్రీతిలకుగారికి మాత్రము సమ్మతమా? ఇట్లనుటకంటె మనము మొదటివిధమున దెలిపిన సంశయమే నిజమైనదని భావించి యర్జునుఁడు తన పితృబంధువులయెడ జూపు నాదర, గౌరవ, దయా, వాత్సల్యములకు వెగటుపడి యసూయాగ్రస్తుఁడై భగవంతుఁ డతనికి సహజముగాగలిగిన యా వైరాగ్యమును దొలగించి యా యుద్ధమును సాగింప దృఢప్రయత్నము చేసెననినను గొంతశ్రీకృష్ణుని ప్రజ్ఞాబలము మనచే శ్లాఘింపబడినట్లేయగునుగదా!

కానీ భగవంతునియెడ నట్టిమిథ్యాదోషము నాపాదించి తిలకుగారి వాదమును యంగీకరించి ప్రతివాదము చేయజాలనిచో మూడూళ్ళు భిక్షమెత్తుకొనుచు బ్రొద్దుపుచ్చుటయైనను మేలే యగును.

నిజమేకాని తిలకుగారు సన్న్యాసమనగ నెట్టిదో తెలిసికొనినవారుకారు. "యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్" అను శ్రుతిని గమనించినవారుకారు. ఇట్లనిన వారా వాక్యమునే చూడలేదని కాదు. దాని తాత్పర్యమును గ్రహింపలేదని మాత్రమే మా యభిప్రాయము. శ్రీతిలకుగారు పాశ్చాత్యవిద్యాసంస్కారశూన్యులై యుండినచో వారి కీశ్రుత్యర్థము చక్కగా దెలిసియుండెడిదియే.

అర్జునుని స్వవచనములచేతనే యతఁడు కార్పణ్యదోషోపహతస్వభావు డనియు, ధర్మసంమూఢచేతస్కుఁడనియు దెలియుచున్నది. అతఁడు స్వయముగనే తన శోకము యుద్ధవిజయ

మూలములైన భోగభాగ్యములవలనగాని, మఱియే యితరమనోరథములవలనగాని దీరదని స్పష్ట పఱచి యున్నాడు. ఈయజ్ఞానశోకములే సన్న్యాసాధికారమునకు ముఖ్యలక్షణములనియో? తిలకుగారితలంపు. అట్లైనచో "సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరా వుభౌ" (గీ. 5–2) అను శ్లోకమునకు దామువ్రాసిన టీకయైన దగియుండదు. ఏలయన? సన్న్యాసమునయితము కర్మయోగముతోపాటు శ్రేయస్కరమని వ్రాసినటీక యెట్లు సముంజసమగును? పఱౌంతరముగ నైన శోకమోహహేతుకమైన మూర్ఖసన్న్యాసమును దెచ్చి పరమప్రియమైన తమకర్మయోగ ముతో సదృశమని భగవంతుడు చెప్పినయెడల నా కర్మయోగము కూడ గొంచ మించు మించుగా నట్టి యగౌరవమునే పొందదా?

తిలకుగారు చెప్పిన గ్రంథోద్దేశమునకు నిట్లు సర్వవిధముల వారియుపక్రమలింగము నిరు పయుక్తము కాఁగా తుదికి శ్రీభగవత్పాదులు చెప్పినట్లు శోకమోహనివారణప్రయో జనమే నిలిచినది. కావుననే తదర్థము గ్రంథప్రవృత్తి యనక తప్పదు. తిలకుగారు వ్రాసిన తాత్ప ర్యనిర్ణయసాధనములను జక్కగా విచారించినచో భగవత్పాదుల యభిప్రాయమునే స్థిరపఱుప గలవై యున్నవి. అవి "ఉపక్రమోపసంహారా వభ్యాసోఽపూర్వతా ఫలమ్। అర్థవాదోపపత్తీ చ లింగం తాత్పర్యనిర్ణయే" అనుశ్లోకమున జెప్పబడినవి. ఉపదేశమునకుపక్రమము తదారంభ శ్లోకములనుగాని తిలకుగారు చెప్పినట్లు గీతాప్రథమాధ్యాయమో, తత్పూర్వకథాభాగమో కాఁజాలదు.

అశోచ్యాన్వశోచ యను శ్లోకము మున్నె పారనునిని భగవంతుఁడది యజ్ఞానజల్పితమని పరిహ సించెను. అదే కారణముతో భగవదుపదేశ మారంభమైనది. శోకింపవలని (చనిపోయిన వారిని, ఇక చనిపోవువారిని) వారినిగూర్చి శోకించితివి. ప్రజ్ఞావాదములనే బలుకు చున్నాడవు. పండితులు గతాసువులవిషయమునగాని, యగతాసువుల విషయమునగాని శోకిం పరు. అని ప్రారంభించెను. గతాసుత్వాగతాసుత్వములు మిథ్యారూపములనియు, యాత్మ నిత్య సత్యస్వరూపమనియు స్పష్టపరచుటకే తత్త్వవేత్తలైనపండితుల శోకరాహిత్యమును భగవంతుఁ డట్లు ప్రస్తావించియున్నాడు. దానికనురూపముగనే "ఏషా తేఽభిహితాసాంఖ్యే" (గీ. 2–39) అనునంతవఱకు నాత్మనిత్యత్వమును గూర్చి యర్జునునకుఁ జక్కగా బోధించియున్నాఁడు.

దీనివలన భగవదభిప్రాయములో దిలకుగారు చెప్పినట్లు కర్మప్రోత్సాహనము కానరాదు. శోకాపాయమునకు వలయు నుపాయమే యిందుఁ బ్రశంసింపఁబడినది. కావుననే సర్వజ్ఞులగు భగవత్పాదు లాత్మజ్ఞాననిష్ఠారూపధర్మమువలననే శోకమోహవినాశమగునని భగవన్మతమైనట్లు స్థిరపరచియున్నారు.

ఇక భాష్యకారులయొక్క యాత్మజ్ఞానవిషయముగ నీయబడిన 'సర్వకర్మసన్న్యాసపూర్వ కమైన' యనువిశేషణమే తిలకుగారికి విద్వేషస్థానమైనది. ఏలయనఁగా భాష్యకారుల సన్న్యాస

శబ్దము వారు పరిహసించి విడిచిన సన్న్యాసాభాసమునే బోధించునని వారిభయము. తిలకుగారు సన్న్యాసమనిన నేమనుకొన్నారు? యిల్లు వాకిలి విడచుట, శిఖాయజ్ఞోపవీతములు విసర్జించుట, ప్రొయ్యి రాజవేసికొనక పరులయిండ్లపై బడి తెగదినుట, మఱియెట్టిపాటును బడక నిష్ప్రయోజనముగ "గ్రామైకరాత్రం దినమేకభుక్తం" అని తిరుగుట అను నీలక్షణములే తిలకుగారు తమ యుపోద్ఘాతగ్రంథముననేమి శ్లోకవ్యాఖ్యాన వివరణములయందైననేమి మిక్కిలి పట్టుదలతో నుడివిన సన్న్యాసలక్షణములు. భగవద్భాష్యకారుల సన్న్యాసమో బ్రహ్మాత్మైక్యజ్ఞానలక్షణమైనది. "జ్ఞానం సన్న్యాసలక్షణమ్" అను నభియుక్తవచనముగూడ దీనినే తెలుపుచున్నది.

తిలకుగారి యుపక్రమలింగమిట్లు విపర్యసమైపోవుటయేకాక వారనుకొనిన సన్న్యాసలక్షణమునకు దమఃప్రకాశములకుంవలె బరస్పరవిరుద్ధస్వభావ మున్నదని స్పష్టమయినది.

ఇక వారియుపసంహారలింగమో యర్జునుని 'నష్టో మోహః' ఇత్యాదిగా గలవాక్యములును తదనంతరీయ తద్యుద్ధప్రవృత్తియునై యున్నది. కాని తాత్పర్యలింగమగు నుపసంహారభాగము నుపదేశగ్రంథమునుండియే గ్రహింపవలయుననుట శాస్త్రీయమగు పద్ధతి. (అనగా యుపక్రమోపసంహారములు సమానకర్తృకములనుట) "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ! అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః" (గీ. 18-66) అనునదియే యుపదేశగ్రంథముయొక్క యంతిమశ్లోకము, తిలకుగారు భగవద్గీతపై వ్యాఖ్యానము చేయునపు డేక్లిష్టకల్పనలకుం బోక సరళముగా శ్లోకముల నన్వయించుకొనినచోం దమయభిప్రాయమే భగవదుద్దిష్టమని తోచుననియు, పూర్వాచార్యులటుచేయక తమయభీష్టార్థమును లాగుకొనుటకై యనేకశబ్దములకు క్లిష్టవిధమున నర్థము చెప్పిరనియు నిందించియున్నారుగదా! మన మీయుపసంహారశ్లోకమును వారు విధించిన సరళపద్ధతితోడనే యన్వయించి వారియభిప్రాయముయొక్క ప్రబలదోషమును నిరూపింతము.

'సర్వధర్మాన్ పరిత్యజ్య' అనగా "యెల్లధర్మములను బరిత్యజించి" 'మామేకం శరణం వ్రజ' 'నన్నొకనినే శరణుం జెందుము' అనునది పూర్వార్థములోని విషయము. ఇందు రెండు విధులు శ్రోతృవిషయములుగా గానవచ్చుచున్నవి. మొదటిది 'యెల్లధర్మములను వదలివేయుము' అని. రెండవది 'నన్నొకనినే శరణుంజెందుము' అని. ఇట్లైనచో సర్వధర్మములనగా తిలకుగారి కర్మయోగములోని కర్మవిశేషమైనట్లా? కాదా? అయినచో కర్మయోగము బరిత్యజింపుమనియే భగవంతుఁడు చెప్పినట్లైనది. కానిచో వారి కర్మయోగమునకును, ధర్మమునకును నేసంబంధమును లేదని చెప్పవలసివచ్చుచున్నది.

అట్లైనచో భగవంతుఁడు సర్వధర్మములను బరిత్యజింపుమనుటలో నధర్మములనన్నిటిని చేయుమని చెప్పినట్లగుచున్నది. ఇది తిలకుగారి యభిమతమే యగునా?

ఇది యిట్లుండ రెండవవాక్యములో నన్నొకనినే శరణుం జెందుమనియు జెప్పుచున్నాఁడు. 'నన్నొకనినే' అనుటవలన ధర్మములను శరణుంజెందకుమనియుం జెప్పినట్లగుచున్నది. ఏలయనఁ

నన్నొకనినే శరణు జెందుమనుటలో నీకితరాశ్రయ మేదియు నక్కర లేదని యేకదా తాత్పర్యము. దీని వలన నర్జునునకు ధర్మాధర్మములలో దేనినిసయిత మాశ్రయింప నవసరములేదని భగవంతుఁడు నిశ్చయించినట్లయినది. కర్మలెల్ల నిటు ధర్మమునకో, అటు అధర్మమునకో సంబంధించియే యుండును. కావునఁ గర్మయోగమనగా తిలకుగారు చెప్పిన యర్థముప్రకారము కర్మానుష్ఠాన యుక్తియై యున్నది. అట్లయినచో భగవంతుడు చెప్పిన "నన్నొకనినే శరణు జెందుము." అను విధివాక్యమువలన నాకర్మలుగాని, వానిని చేయుటకు నవలంబింపవలసిన యాయుక్తిగాని యత డాశ్రయింపకుండునట్లు భగవంతుడు ముందుగనే జాగ్రత్తపడినట్లున్నది. అనగానేమి? ఆకర్మలతోఁగాని దానికి సంబంధించు నాయుక్తితోఁగాని నీకేలాటిప్రయోజనమును లేదు. అనుటలోఁ బ్రయోజనకారియైనది. యొక్క భగవచ్ఛరణాగతియే. అని భగవదుద్దేశముగదా.

ఆశరణాగతివలన ప్రయోజనమునునిర్దేశించుటకీశ్లోకముయొక్కయుత్తరార్ధము ప్రారంభింపబడినది, "అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః" (18-66) నేను నిన్ను సకలపాపములనుండి విముక్తుని జేసెదను. శోకింపకుము. అని యీయుత్తరార్ధమున భగవంతు డర్జునున కభయ మొసంగి 'మాశుచః' అని యొదార్చుచున్నాడు. ఇట్లుపదేశోపక్రమశ్లోకమున "అశోచ్యానన్వశోచః" గీ 2-11) అని యుపక్రమించి యుపదేశాన్తిమశ్లోకమున "మాశుచః" (గీ 18-66) అని యీవిధముగ జెప్పినందున నీయుపదేశోపక్రమోపసంహారలింగములు శోకనిరాసమునకై యీగీతయుపదేశింపఁబడినదనియు నంతకుముం దర్జునునకుదయించినయుద్ధజన్య పాపశంకా నివృత్తియగుటకు భగవంతుడు పరమేశ్వరశరణాగతియొక్కటియే ముఖ్యసాధనముగ నిర్దేశించెననియు స్పష్టపడినది.

శంకరభగవత్పాదులును తమ యుపోద్ఘాతగ్రంథమున గ్రంథతాత్పర్యనిర్ణయార్థ మీయుపసంహారశ్లోకమునే గ్రహించియున్నారు.

జ్ఞానము, తద్ద్వారా శోకనాశము అనునీయుద్దేశము భగవన్మతమున నున్నట్లుపలుమారు లచ్చటచ్చట గానవచ్చుచునేయున్నది. అట్టి బహువారోక్తమునే యభ్యాసలింగ మందురు.

### అభ్యాసలింగములు,

"మాశుచ స్సంపదం దైవీం' (గీ. 16-5) 'నైవం శోచితు మర్హసి" (గీ. 2-26) "నాను శోచితుమర్హసి" (గీ 2-25) "న త్వం శోచితుమర్హసి" (గీ 2-27) "తస్మాత్సర్వాణిభూతాని న త్వం శోచితుమర్హసి' (గీ 2-30) 'తత్రకాపరిదేవనా' (గీ 2-28) శోకకారణమైన పశుతను వారించుచు "నైవం పాప మవాప్స్యసి" (గీ. 2-38) "కర్మబంధం ప్రహాస్యసి" (గీ. 2-39) అను యభ్యాసము లున్నవి.

### జ్ఞానాభ్యాసలింగములు.

"జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం" (గీ. 4-19) జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే (గీ. 4-37) శ్రేయాన్ద్రవ్యమయాద్యజ్ఞాజ్జ్ఞానయజ్ఞః పరంతప। సర్వం కర్మాఖిలంపార్థ జ్ఞానే పరిసమా

వ్యతే (గీ ,4-౩౨) 'తద్విద్ధి ప్రాణిపాతేన పరిప్రశ్నేన సేవయా। ఉపదేక్ష్యంతి తే జ్ఞానం' (గీ 4-34) "సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి" (గీ. 4-౩౬) "నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే" (గీ. 4-౩౮) "యోగసంన్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయం। ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ!" (గీ 4-41) 'తస్మా దజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసి నాత్మనః! ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత!" (గీ. 4-42) "జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" (గీ 7-18) ఇవన్నియు శోకనిరసన జ్ఞానప్రధానతా నిర్ణయలింగములు.

## అపూర్వతాలింగము.

అపూర్వత యనగా శాస్త్రాంతరమునఁ జెప్పఁబడని క్రొత్తపద్ధతి. అర్జునుడు క్షత్రియుడైనందున నతనికి ప్రత్యక్షముగఁ గర్మత్యాగము చేయు నధికారము లేదు. కావున భగవంతుడు శాస్త్రీయకర్మవిధిని జేయుచు నంతస్సన్న్యాసమున నంతడు ముక్తుఁడగుటకు రెండు క్రొత్తమార్గములు అనగా శాస్త్రాంతరమున స్పష్టరూపమున వివేచింపబడని మార్గము లిందుఁ జూపియున్నాడు. అదియే కర్మయోగము. 'అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతియః। ససన్న్యాసీ చ యోగీచ న నిరగ్ని ర్న చాక్రియః' (గీ. 6-1) 'యం సన్న్యాస మితి ప్రాహు ర్యోగ్యం తం విద్ధి పాండవ!' (గీ 6-2) 'ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే" (గీ 6-4) 'సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే' (గీ. 6-4) 'జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా' (గీ 6-8) బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్' (గీ. 4-24) 'యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః' (గీ. 4-19) 'త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః కర్మణ్యభిప్రవృత్తోపి నైవ కించిత్కరోతి సః' (గీ. 4-20) (యోగారూఢస్యాపి) 'లోకసంగ్రహమేవాపి సంపశ్య న్కర్తుమర్హసి' (గీ. ౩-20, అనునవి యీ యపూర్వత్వమునే ప్రదర్శించుచున్నవి.

## ఫలలింగములు.

ఫలలింగము లేవనిన "య ఇమం పరమం గుహ్యం మద్భక్తే ష్వభిధాస్యతి। భక్తిం మయి పరాం కృత్వా మామేవై ష్యత్యసంశయః" (గీ. 18-68) అని యంతిమభాగమునందును 'మద్భక్త ఏత ద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే" (గీ. 1౩-19) 'శరీరస్థోపి కౌంతేయ న కరోతి న లిప్యతే" (గీ. 1౩-౩2) 'ఇమం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః' (గీ. 14-2, 'గుణేభ్యశ్చపరంవేత్తి మద్భావం సోధిగచ్ఛతి' (గీ 14-19) అనునవి యీఫలమునే ప్రదర్శించుచున్నవి.

## అర్థవాదలింగములు.

అర్థవాద మనఁగా స్తుతిప్రధానమైన వాక్యవిశేషము. అవి యేవనిన? "అపిచేదసి పాపేభ్యస్సర్వేభ్యః పాతకృత్తమః। సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి" (గీ 4-౩6) "అపిచేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్। సాధురేవ స మన్తవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః" (గీ.9-౩0)'యస్య నాహం కృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే। హత్వాపి స ఇమా న్లోకాన్న హన్తి

న నిబధ్యతే" ఇవి యర్థవాదలింగములు. అనఁగా నెట్టిపాపములు చేసినవాఁడైనను, యెట్టి దురాచారములు గలవాఁడైనను, ఈలోకముల నన్నిటినిఁ జంపువాఁడైనను ఒక్కజ్ఞానము కలవాఁడైనచో నాజ్ఞానమువలన సర్వపాపములను దాను నశింపజేసికొని ముక్తుఁడగునని పై వాక్యములు జ్ఞానమును స్తుతిచేయుచున్నవి.

### ఉ ప ప త్తి లిం గ ము లు.

'నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహకశ్చన। నచాస్యసర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రియః' (గీ 7-18) 'కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః' 'న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన। నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి' (గీ 3-22) "యస్త్వాత్మరతి రేవ స్యా దాత్మ తృప్తశ్చ మానవః। ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం నవిద్యతే" (గీ.3-14). ఇవి యన్నియు నుపపత్తిలింగవాక్యములు. ఇట్టి యుపపత్తిలింగములవలన క్షత్రియోచితమైన కర్మమును జేయుచునే తొంటిక్షత్రియులు నోపదిష్టజ్ఞానమువలన ముక్తులైరని భగవంతుఁ డర్జునునకు జెప్పుట, కర్మయోగమనగా సన్న్యాసానధికారులగు క్షత్రియాదుల యంతస్సన్న్యాసమును సూచించుటకే యని గ్రహింపనగును.

మఱియు భగవంతుఁ డీకర్మయోగముయొక్క సంప్రదాయమును జెప్పుచు "ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్। వివస్వాన్మనవేప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్ ॥" (గీ. 4-1) అని ప్రారంభించి 'ఇమం రాజర్ష యో విదుః' (గీ 4-2) 'స ఏవాయం మయాతేఽద్యయోగః ప్రోక్తః పురాతనః' (గీ 4-3) అను వచనముతో రాజర్షియోగ్యమగు సన్న్యాసమే కర్మయోగమని భగవంతుడు నిరూపించియున్నాఁడు.

శ్రీభగవత్పాదులును జనకాదుల కర్మయోగమునుగూర్చి "ఏకమే వేదం సర్వం బ్రహ్మ కర్తృచేతి యస్య జ్ఞానముత్పన్నం తస్య కర్మణి, కర్మప్రయోజనేచ నివృత్తేఽపిలోకసంగ్రహార్థం యత్నపూర్వం యథాప్రవృత్తః, తథైవ కర్మణి ప్రవృత్తస్య యత్ప్రవృత్తిరూపం దృశ్యతే న తత్కర్మ, యేన బుద్ధే సముచ్చయస్స్యాత్" అని బ్రహ్మైకత్వదర్శియొక్క లోకసంగ్రహార్థ ప్రవృత్తిరూపకర్మ కర్మయే కాదనియు, దానితో జ్ఞాననిష్ఠకుఁ బొత్తుపొసఁగదనియుఁ జెప్పి యందులకు శ్రీకృష్ణభగవానుని జాత్రకర్మచేష్టితమునె యుదాహరణముగ నిచ్చియున్నారు. జనకాదుల కర్మవిషయమును గూడ యిట్లే యన్వయించినారు.

కావున బాహ్యదృష్టికి గోచరించు తత్త్వవేత్తయొక్క కర్మ వాస్తవస్థితిలోఁ గర్మయే కాదని యనఁగా సన్న్యాసమే యని వారు సిద్ధాంతీకరించుచున్నారు. మఱియు వారు తత్త్వవేత్తలు గాకయే యీశ్వరసమర్పితముగఁ గర్మను చేసియుండు రేని 'యోగినః కర్మ కుర్వన్తి సంగం త్యక్త్వాఽత్మశుద్ధయే' అనియు, 'స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః' అనియుఁ జెప్పబడియున్నవిధమున వారికర్మ సత్త్వశుద్ధిద్వారా జ్ఞాననిష్ఠాయోగ్యతకు సాధనమగునని నిర్ణయించియున్నారు.



ఇట్లు భాష్యకారుల యభిప్రాయము దెలిసికొనిన పిమ్మట మనమిప్పుడు భగవన్మతానుసారముగఁ గర్మయోగమన నెట్టిదో నిశ్చయింపవచ్చును. ఎట్లనఁగా గర్మయోగము రెండువిధములు. ఒకటి అతత్త్వవిత్కర్మానుష్ఠానరూపము, రెండు తత్త్వవిత్కర్మానుష్ఠానరూపము. అతత్త్వవిత్కర్మానుష్ఠానరూపమైనకర్మయోగము(ఫలనిరపేక్షమునునీశ్వరార్పితమునైనకర్మానుష్ఠానము) జ్ఞాననిష్ఠాప్రాప్తి కవశ్యమైన చిత్తశుద్ధి కుపాయభూతము. రెండవదియగు తత్త్వవిత్కర్మానుష్ఠానరూపకర్మయోగము (కేవల లోకసంగ్రహార్థమైన కర్మాచరణము) ముఖ్యసన్న్యాసానధికారులకు జెప్పబడిన గౌణసన్న్యాసము.

గావున శ్రీమచ్ఛంకరభగవత్పాదుల యుపోద్ఘాతమెఱుంగక వారి సర్వకర్మసన్న్యాసపూర్వకాత్మజ్ఞానప్రయోజననిర్దేశకసన్న్యాసశబ్దముచే భ్రాంతులయ్యు సన్న్యాసమనగఁ మఱి యేదో బయిరాగిచర్య యను నయోగ్యనిశ్చయముతో శ్రీతిలకుగారు వృథాగ్రంథమును బెంచిరని ఫలితార్థము.

మఱియు నేతద్భ్రాంతినిమిత్తకములైన వ్యాఖ్యాదోషములను నాచే రచయింపబడు తత్తచ్ఛ్లోక శాంకరభాష్యతత్త్వబోధినియను వివరణమునందే చూపింతును.

ఓం తత్సత్.

శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ



# శాంతి పాఠః ।



శ్లో॥ శివనామ్ని విభావితేంతరంగే మహతి జ్యోతిషి మానినీమయార్ధే ।
దురితా న్యపయాన్తి మాందూరం ముహు రాయాన్తి మహాంతి మఙ్గళాని ॥

శ్లో॥ స్మృతే సకలకల్యాణభాజనం యత్ర జాయతే ।
పురుష స్త మజం నిత్యం వ్రజామి శరణం హరిం ॥

శంనో మిత్ర శ్శం వరుణః । శంనో భవత్వర్యమా । శం న ఇంద్రో బృహస్పతిః । శంనో విష్ణు రురుక్రమః । నమో బ్రహ్మణే । నమస్తే వాయో । త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి । త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి । ఋతం వదిష్యామి । సత్యం వదిష్యామి । తన్మామవతు । తద్వక్తార మవతు । అవతు మాం । అవతు వక్తారం । ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ॥

సహ నా వవతు । సహ నౌ భునక్తు । సహ వీర్యం కరవావహై । తేజస్వినా వధీత మస్తు మావిద్విషావహై । ఓం శాంతి.........

యశ్ఛందసా మృషభో విశ్వరూపః । ఛందోభ్యోధ్యమృతాత్సంబభూవ । సమేంద్రో మేధయా స్పృణోతు । అమృతస్య దేవధారణో భూయాసం । శరీరం మే విచర్షణం । జిహ్వా మే మధుమత్తమా । కర్ణాభ్యాం భూరి విశ్రువం । బ్రహ్మణః కోశోసి మేధయా పిహితః । శ్రుతం మే గోపాయ । ఓం శాంతిః...

అహం వృక్షస్య రేరివా । కీర్తిః పృష్ఠం గిరే రివ । ఊర్ధ్వపవిత్రో వాజినీవ స్వమృత మస్మి । ద్రవిణగ్ం సవర్చసం । సుమేధాఽమృతోక్షితః । ఇతి త్రిశంకో ర్వేదానువచనం । ఓం శాంతిః.........

పూర్ణమదః పూర్ణమిదం పూర్ణా త్పూర్ణ ముదచ్యతే , పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణ మేవావశిష్యతే ॥ ఓం శాంతిః.........

ఆప్యాయంతు మమాంగాని వాక్ప్రాణ శ్చక్షు శ్శ్రోత్ర మథో బల మింద్రియాణి చ సర్వాణి । సర్వం బ్రహ్మౌపనిషదం మాహం బ్రహ్మ నిరాకుర్యాం మామా బ్రహ్మ నిరాకరో దనిరాకరణ మస్త్వనిరాకరణం మే అస్తు తదాత్మని నిరతే య ఉపనిషత్సు ధర్మాస్తే మయి సన్తు తే మయి సన్తు । ఓం శాంతిః.........

వాఙ్మే మనసి ప్రతిష్ఠితా । మనో మే వాచి ప్రతిష్ఠితం । ఆవిరావీర్మ ఏధి । వేదస్యమ ఆణీస్థః । శ్రుతం మే మా ప్రహాసీః । అనే నాధీతే నాహోరాత్రా న్సందధామి । ఋతం వదిష్యామి! సత్యం వదిష్యామి । తన్మా మవతు । తద్వక్తార మవతు । అవతు మాం । అవతు వక్తారం । ఓం శాంతిః.........

ఓం భద్రం నో అపి వాతయ మనః । ఓం శాంతిః... ఓం భద్రందదాతు । ఓం శాంతిః.........

ఓం భద్రం కర్ణేభి శ్శృణుయామ దేవాః । భద్రం పశ్యేమాక్షభి ర్యజత్రాః । స్థిరై రంగైస్తుష్టువాగ్ం సస్తనూభిః । వ్యశేమ దేవహితం యదాయుః । స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః । స్వస్తి నః పూషా విశ్వవేదాః । స్వస్తి న స్తార్క్ష్యో అరిష్టనేమిః । స్వస్తి నో బృహస్పతి ర్దధాతు । ఓం శాంతిః.........

ఓం నమో బ్రహ్మదిభ్యో బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో వంశఋషిభ్యో నమో గురుభ్యః । సర్వోపప్లవరహితః ప్రజ్ఞానఘనః ప్రత్యగర్థో బ్రహ్మైవాహ మస్మి బ్రహ్మైవాహ మస్మి । అధీహి భోభగవః ।

శ్లో॥ సదాశివసమారంభాం శంకరాచార్యమధ్యమాం, అస్మదాచార్యపర్యన్తాం వన్దే గురుపరంపరామ్.
నారాయణం పద్మభువం వశిష్ఠం, శక్తిం చ తత్పుత్రపరాశరం చ । వ్యాసం శుకం గౌడపదం మహాన్తం, గోవిన్ద యోగీంద్ర మథాస్య శిష్యమ్ ॥

శ్రీశంకరాచార్య మథాస్య పద్మ, పాదంచ హస్తామలకంచ శిష్యమ్ । తం త్రోటకం వార్తికకారమన్యా, నస్మ ద్గురూ న్సంతత మానతోస్మి ॥

శ్లో॥ శ్రుతిస్మృతిపురాణానా మాలయం కరుణాలయం, నమామి భగవత్పాదశంకరం లోకశంకరమ్॥
యదవిద్యావిలాసేన భూతభౌతికసృష్టయః, తన్నౌమి పరమాత్మానం సచ్చిదానందవిగ్రహమ్॥
శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణం, సూత్రభాష్యకృతౌ వన్దే భగవన్తౌ పునః పునః॥

# దక్షిణామూర్తిస్తోత్రమ్.

శ్లో. మౌనవ్యాఖ్యాప్రకటితపరబ్రహ్మతత్త్వం యువానం వర్షిష్ఠాంతేవసదృషిగణై రావృతం జ్ఞాననిష్ఠైః.
ఆచార్యేంద్రంకరకలితచిన్ముద్రమానందమూర్తిం స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తిమీడే ౧.
శ్లో. విశ్వందర్పణదృశ్యమాననగరీతుల్యంనిజాంతర్గతంపశ్యన్నాత్మనిమాయయాబహిరివోద్భూతంయదానిద్రయా,
యస్సాక్షాత్కురుతేప్రబోధసమయేస్వాత్మానమేవాద్వయంతస్మైశ్రీగురుమూర్తయేనమఇదంశ్రీదక్షిణామూర్తయే.
శ్లో. బీజస్యాంత రివాంకురోజగదిదంప్రాఙ్నిర్వికల్పంపునర్మాయాకల్పితదేశకాలకలనావైచిత్ర్యచిత్రీకృతమ్,
మాయావీవ విజృంభయత్యపి మహాయోగీవ య స్స్వేచ్ఛయా తస్మైశ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ...౩.
శ్లో. యస్యైవస్ఫురణంసదాత్మకమసత్కల్పార్థకంభాసతే సాక్షాత్తత్త్వమసీతివేదవచసాయోబోధయత్యాశ్రితాన్
యత్సాక్షాత్కరణా ద్భవే న్న పునరావృత్తిర్భవాంభోనిధౌ తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ...౪.
శ్లో. నానాఛిద్రఘటోదరస్థితమహాదీపప్రభాభాస్వరమ్ జ్ఞానం యస్య తు చక్షురాదికరణద్వారా బహిస్స్పందతే,
జానామీతి త మేవభాంత మనుభా త్యేతత్సమస్తం జగ త్తస్మైశ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ......౫.
శ్లో. దేహం ప్రాణ మపీంద్రియా ణ్యపి చలాం బుద్ధిం చ శూన్యం విదుః స్త్రీబాలాంధజడోపమా స్త్వహమితి
భ్రాంతా భృశంవాదినః,
మాయాశక్తివిలాసకల్పితమహావ్యామోహసంహారిణే తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ......౬.
రాహుగ్రస్తదివాకరేన్దుసదృశోమాయాసమాచ్ఛాదనాత్సన్మాత్రః కరణోపసంహరణతోయోభూత్సుషుప్తః పుమా
న్ప్రాగస్వాప్సమితి ప్రబోధసమయే యః ప్రత్యభిజ్ఞాయతే తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ...౭.
శ్లో. బాల్యాదిష్వపిజాగ్రదాదిషుతథాసర్వాస్వవస్థాస్వపివ్యావృత్తాస్వనువర్తమానమహమిత్యంతస్స్ఫురంతంసదా,
స్వాత్మానం ప్రకటీకరోతి భజతాం యోభద్రయా ముద్రయా తస్మై శ్రీగురుమూర్తయేనమ ఇదం శ్రీ....౮.
శ్లో. విశ్వంపశ్యతి కార్యకారణతయాస్వస్వామిసంబంధతశ్శిష్యాచార్యతయాతథైవపితృపుత్రాద్యాత్మనా భేదతః,
స్వప్నే జాగ్రతివా య ఏష పురుషో మాయాపరిభ్రామిత స్తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ...౯.
శ్లో. భూ రంభాం స్యనలోఽనిలోంబర మహర్నాథో హిమాంశుః పుమా నిత్యాభాతి చరాచరాత్మక మిదం
యస్యైవ మూర్త్యష్టకమ్,
నాన్యత్కించన విద్యతేవిమృశతాం యస్మాత్పరస్మాద్విభో స్తస్మై శ్రీగురుమూర్తయేనమ ఇదం శ్రీ...౧౦.
శ్లో. సర్వాత్మత్వ మితి స్ఫుటీకృత మిదంయస్మాదముష్మింస్తవే తేనాస్యశ్రవణాత్తదర్థమననాద్ధ్యానాచ్చసంకీర్త
నాత్,
సర్వాత్మత్వమహావిభూతిసహితం స్యా దీశ్వరత్వం స్వతస్సిద్ధ్యేత్తత్పునరష్టధాపరిణతంచైశ్వర్యమవ్యాహతమ్.
శ్లో॥ వటవిటపిసమీపే భూమిభాగే నిషణ్ణం సకలమునిజనానాంజ్ఞానదాతార మారాత్,
త్రిభువనగురు మీశం దక్షిణామూర్తి దేవం జననమరణదుఃఖచ్ఛేదదక్షం నమామి. ౧౨.
శ్లో. చిత్రంవటతరోర్మూలే వృద్ధాశ్శిష్యా గురుర్యువా, గురోస్తుమౌనవ్యాఖ్యానాచ్ఛిష్యాస్తుచ్ఛిన్నసంశయాః ౧౩.
శ్లో. అంగుష్ఠతర్జనీయోగముద్రావ్యాజేన దేహినామ్, శ్రుత్యర్థం బ్రహ్మజీవైక్యం దర్శయ న్నోఽవతాచ్ఛివః.౧౪.
శ్లో. సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం, మన్నాథంపరమాత్మానం ప్రణతోఽస్మి సదాశివమ్. ౧౫.

# నిర్వాణదశకస్తోత్రం.

శ్లో॥ నభూమిర్నతోయం నతేజో నవాయు, ర్నఖం నేంద్రియంవా నతేషాం సమూహః ।
అనైకాంతికత్వా త్సుషుప్త్యైకసిద్ధ, స్తదేకోఽవశిష్ట శ్శివః కేవలోహమ్ ॥ ౧.

శ్లో॥ నవర్ణా నవర్ణాశ్రమాచారధర్మా, నమే ధారణాధ్యానయోగాదయోపి ।
అనాత్మాశ్రయోహం మమాధ్యాసహానా, త్తదేకోఽవశిష్ట శ్శివః కేవలోహమ్ ॥ ౨.

శ్లో॥ నమాతా పితావా నదేవా నలోకా, నవేదా నయజ్ఞా న తీర్థంబ్రువంతి ।
సుషుప్తౌ నిరస్తాతిశూన్యాత్మకత్వా, త్తదేకో వశిష్ట శ్శివః కేవలోహమ్ ॥ ౩.

శ్లో॥ నసాంఖ్యం నశైవం నతత్పాంచరాత్రం, నజైనం నమీమాంసకాదేర్మతం వా ।
విశిష్టానుభూత్యా విశుద్ధాత్మకత్వా, త్తదేకో వశిష్ట శ్శివః కేవలోహమ్ ॥ ౪.

శ్లో॥ నశుక్లం నకృష్ణం నరక్తం నపీతం, నపీనం నకుబ్జం నహ్రస్వం నదీర్ఘమ్ ।
అరూపం తథా జ్యోతిరాకారవత్త్వా, త్తదేకో వశిష్ట శ్శివః కేవలోహమ్ ॥ ౫.

శ్లో॥ నజాగ్రన్న మే స్వప్నకోవా సుషుప్తి, ర్నవిశ్వో నవాతైజసః ప్రాజ్ఞకోవా ।
అవిద్యాత్మకత్వాత్త్రయాణాంతురీయం, తదేకో వశిష్ట శ్శివః కేవలోహమ్ ॥ ౬.

శ్లో॥ నశాస్తా నశాస్త్రం నశిష్యో నశిక్షా, నచత్వం నచాహం నచాయం ప్రపంచః ।
స్వరూపావబోధా ద్వికల్పాసహిష్ణు, స్తదేకో వశిష్ట శ్శివః కేవలోహమ్ ॥ ౭.

శ్లో॥ నచోర్ధ్వం నచాధో నచాన్త ర్నబాహ్యం, నమధ్యం నతిర్య జ్నపూర్వాపరాదిక్ ।
వియద్వ్యాపకత్వా దఖండైకరూప, స్తదేకో వశిష్ట శ్శివః కేవలోహమ్ ॥ ౮.

శ్లో॥ అపివ్యాపకత్వా ద్ద్వితత్వాత్ప్రయోగా, త్స్వతస్సిద్ధ భావా దనన్యాశ్రయత్వాత్ ।
జగత్తుచ్ఛ మేతత్సమస్తం తదన్య, త్తదేకో వశిష్ట శ్శివః కేవలోహమ్ ॥ ౯.

శ్లో॥ నచైకం తదన్య ద్ద్వితీయం కుతస్స్యా, న్నచా కేవలత్వం న వాకేవలత్వమ్ ।
నశూన్యం నచాశూన్య మద్వైతకత్వా, త్కథం సర్వవేదాంతసిద్ధం బ్రవీమి ॥ ౧౦.

శ్లో॥ దశశ్లోకవర్యా ఇమే సమ్యగుక్త్వా, అహో శంకరాచార్యవక్త్రారవిందాత్ ।
అజస్రం పఠంతీహ సంతోష బుద్ధ్యా, ప్రయాంత్యేవ తే సచ్చిదానందరూపమ్ ॥ ౧౧.

ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యవిరచితం
నిర్వాణదశకస్తోత్రం
సంపూర్ణమ్.

శ్లో॥ సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత ।
యావ దేతా న్నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్ ॥



అగ్రే కృత్వా కమపి చరణం జానునై కేన తిష్ఠ న్పశ్చా త్పార్థం ప్రణయరసజుషా చక్షుషాఽ వేక్షమాణః ।
సవ్యే తోత్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రా మాబిభ్రాణో రథ మధివస న్పాతు న స్సూతవేషః ॥

శుభమస్తు.

శ్రీమహాగణాధిపతయే నమః.

శ్రీభువనేశ్వర్యై నమః.

# శ్రీభగవద్గీతా శాంకరభాష్యతత్త్వబోధిని

## శ్రీ భగవద్గీతా శాంకరభాష్యమ్.

శ్లో॥ నారాయణః పరోఽవ్యక్తా దండ మవ్యక్తసంభవమ్ ।
అండ స్యాన్త స్త్విమే లోకా స్సప్తద్వీపా చ మేదినీ ॥

---

### శ్రీశాంకరభాష్యతత్త్వబోధిని.

శ్రీగీతాశాస్త్రము "ఉపాయోపేయభూతములగు (సాధనసాధ్యములగు) కర్మనిష్ఠ, జ్ఞాననిష్ఠ" అను రెండింటి నుద్దేశించి ప్రవృత్తమయ్యెను. అట్టిగీతాశాస్త్రమును వ్యాఖ్యానింపఁ దలఁచి భగవద్భాష్యకారులు తొలుత విఘ్నోపప్లవశాంతికై యాస్తికవ్యవహారానుప్రాప్తమగు నిష్టదేవతాతత్త్వానుస్మరణరూపమంగళాచరణముం జేయువారై యితిహాసపురాణములకును, ప్రకృతగీతాశాస్త్రమునకు నేకవాక్యత నంగీకరించుచు నంతర్యామివిషయకమగు నీశ్లోకము నుదహరించిరి.

ఇందలి నారాయణశబ్దము స్థూలదృష్టితో "ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః । అయనం తస్య తాః పూర్వం తేన నారాయణ స్స్మృతః" అనుపౌరాణికవచనానుసారము జలధిశయనుండగు నారాయణుం దెల్పున దని కొందరు చెప్పుచున్నారు. సూక్ష్మదృష్టితోఁ బరికించువారు "నరశబ్దము చరాచరాత్మకములగు శరీరములను జెప్పుచున్నదనియు, వానియందు నిత్యసన్నిహితములగు చిదాభాసజీవులు "నారాః" అనంబడుదురనియు, ఆజీవులకు "అయనం" ఆశ్రయము; అనఁగా: నియామకుఁడగు నంతర్యామి నారాయణుఁడు" అనియు జెప్పుచున్నారు. అట్టి నారాయణు నుద్దేశించియే "యః పృథివ్యాం తిష్ఠ న్నంతరో యమయతి" అనునది మొదలగు నంతర్యామిబ్రాహ్మణమును, నారాయణమంత్రామ్నాయమును బఠింపఁ బడుచున్నవి. కావునఁ నీ నారాయణశబ్దముచే గీతాశాస్త్రమువలన ప్రతిపాదింపబడు విశిష్టతత్త్వముఁ జెప్పబడుచున్నది.

కూటస్థము, అసంగము, అవిషయము, అద్వితీయము నగు పరతత్త్వమునకు మాయాసంబంధములేనిచో అంతర్యామిత్వము, శాస్త్రప్రతిపాద్యత్వమును సంభవములు కావు కాన

శాస్త్రాదియం దనుస్మృతమగు తత్త్వము శబలబ్రహ్మమగును. అట్టిశబలదేవతాస్మరణమున నభీష్టఫలసిద్ధి కలుగనేరదని శంకింపరాదు.

కావుననే "పరోఽవ్యక్తాత్" అను విశేషణము విన్యసింపఁ బడినది. అవ్యక్తమన నవ్యాకృతమగు మాయ. దానికి పరమనఁగా "అక్షరాత్పరతః పరః" అను శ్రుతిసిద్ధమగు శుద్ధబ్రహ్మము. ఆశుద్ధబ్రహ్మమునకు మాయాసంబంధము నిజముగ లేకున్నను కల్పితమగు మాయాసంబంధమును బురస్కరించుకొని అంతర్యామిత్వ శాస్త్రప్రతిపాద్యత్వము లూహింపఁబడుచున్నవి. అందువలన నిచట శుద్ధపరదేవతాతత్త్వానుస్మరణమే సిద్ధమగును. కాన: నిష్టఫలప్రాప్తి కెట్టి యాటంకము లేదు.

"పై విశేషణవ్యాఖ్యానమువలన నవ్యక్తము ప్రకృతానుస్మృతమగు శుద్ధబ్రహ్మముకంటె వ్యతిరిక్తమై యున్నదని నిరూపింపఁ బడుచున్నది. అది సాక్షిసిద్ధ (సాక్షివలన జీవానుభూత) మైనను ప్రమాణాంతర సిద్ధమగునా!" యను శంకకు సమాధానముగ "అండమవ్యక్త సంభవం" అని వివరింపఁబడినది.

అపంచీకృతపంచమహాభూతాత్మకమగు (తన్మాత్రస్వరూపమగు) హైరణ్యగర్భతత్త్వమిచట యండ మని చెప్పఁబడెను. ఆయండము పూర్వోక్తావ్యక్తమువలన జనించెడిని. ఈవిషయము శ్రుతిస్మృతిసిద్ధము. కార్యమాత్రము సజాతీయకారణసాపేక్షమగుటంబట్టి యీయండరూపకార్యము సజాతీయకారణము నపేక్షించును. ఆ కారణము మాయాపదవాచ్యమగు నవ్యాకృతతత్త్వమనకతప్పదు. కాన నీ యవ్యక్తము కార్యలింగకానుమానసిద్ధమగునని గ్రహింపనగును.

పూర్వోక్తహైరణ్యగర్భతత్త్వము శ్రుతిస్మృతులచే సిద్ధించుచున్నను, అనుమానప్రమాణముచే గాని పరితోషము నందనేరని శుష్కవైయ్యాకరణలం దనియుంపఁబూని "అండస్యాన్తస్త్వమే లోకా స్సప్తద్వీపా చ మేదినీ" అని చెప్పుట యవసర మయ్యెను.

సప్తద్వీపవిశిష్టమేదినీస్వరూపములగు నీలోకము లాయండములోన నిమిడియున్నవని దీని యర్థము. ఇచట లోకశబ్దము పంచీకృతపంచభూతాత్మకమగు విరాట్టును జెప్పుచున్నది. ఈ విరాట్టు కార్యమగును. కార్యము సజాతీయకారణసాపేక్షముగాన సజాతీయకారణ మనుమేయమగుచున్నది. అట్టి కారణమువిలక్షణమగునీకార్యమునెడ హైరణ్యగర్భతత్త్వము దక్క వేరొండు గాజాలదు. ఇట్లనుమానప్రమాణముచే సైతము హిరణ్యగర్భతత్త్వము సిద్ధించుచున్నది.

పర్యవసితార్థము.

దృశ్యమానజగద్రూపకార్యమగువిరాట్టువలనఁ కారణమగు హిరణ్యగర్భతత్త్వమూహింపబడుచున్నది. హైరణ్యగర్భాండమువలనఁ దత్కారణమగుమాయయని పేర్కొనఁబడునవ్యక్తమనుమితమగుచున్నది. అట్టి యవ్యక్తమునకు పరమాత్మ యతీతమనియు, కావుననే శుద్ధమనియు ఆశుద్ధబ్రహ్మమే స్వవిషయకాజ్ఞానద్వారమున నీ సకలలోకముల నుత్పాదించి, తనయందే

శాంకరభాష్యమ్:— (1) స భగవా న్సృష్ట్వేదం జగ త్తస్య చ స్థితిం చికీర్షు ర్మరీచ్యాదీ నగ్రే సృష్ట్వా ప్రజాపతీ న్ప్రవృత్తిలక్షణం ధర్మం గ్రాహయామాస వేదోక్తం। తతోఽన్యాంశ్చ సనకసనందనాదీ నుత్పాద్య నివృత్తిలక్షణం ధర్మం జ్ఞానవైరాగ్యలక్షణం గ్రాహయామాస।

---

ఇమిడించికొని యఖండైకసచ్చిదానందాత్మకమై తనమహిమయందే తాను నెలకొనియున్నది. అట్టి పరమాత్మ కల్పితమాయాసంబద్ధుఁడై యంతర్యామిత్వ, శాస్త్రప్రతిపాద్యత్వపురస్సరముగ ననుస్మృతుఁడగుచున్నాఁడు. కాన ఇష్టఫలప్రదాత యగుఁగాకయని యాశయము.

(1) "భూదేవి ప్రార్థనము ననుసరించి పరమేష్ఠి ప్రార్థింప భూభారాపనయనార్థము దేవకీవసుదేవులకుఁ బుత్రుఁడై భగవంతుఁడగు వాసుదేవుఁ డుదయించెను. కావున స్వప్రయోజనానురూపముగ నర్జునునియుద్ధకర్మమునఁ బ్రోత్సహించుట భగవంతుని కవసరమయ్యెను. తత్ప్రసంగానుసారము నిష్ఠాద్వయ మనువదింపఁ బడెనే కాని యుపాయోపేయభావముచే నీశాస్త్రమున నానిష్ఠాద్వయ ముపదేశిపఁబడుటలేదు." అని శంకింపరాదు—

భగవదవతారప్రయోజనము ధర్మస్థాపనమే కాని భూభారహరణము కాదు. స్వభావానుసారముగ భగవంతున కదియే నిర్వర్తనీయమగుచున్నది. స్వప్రయోజనానుసారము ప్రకృతశాస్త్రమున కధికారియగు నర్జునుని నిమిత్తముగాఁ జేకొని కర్మజ్ఞాననిష్ఠలనుభగవంతుఁడుపదేశింపవద్దానివలన భూభారపరిహార మానుషంగికముగ సిద్ధించుచున్నది. ప్రకృతోపదేశమువలన విశిష్టాధికారియగు నర్జునుని స్వధర్మప్రవృత్తి ప్రేరణద్వారమున జ్ఞాననిష్ఠ యందవతరింపఁ జేయుచు నధికారిసామాన్యమును సైతమునం దవతరింపఁజేయుట యీగీతాశాస్త్రమున కుద్దేశము. కాన ఇందు కర్మజ్ఞాననిష్ఠలు సాధనసాధ్యరూపమున విషయములగుచున్నవి. కావునఁ బూర్వోక్తాశంకావకాశ మిందులేదు. ఈవిషయమునే శ్రీమద్భాష్యకారులు, 'స భగవాన్' అని ప్రారంభించి, 'ఉపదిదేశ' అనుట యంతముగాఁగల గ్రంథముచే నుపపాదించుచున్నారు.

సర్వజ్ఞుఁడగు సర్వేశ్వరుం డీజంగమస్థావరాత్మకజగత్తును సృజించెను. తనచే సృజింపఁబడిన జగత్తునకు వ్యవస్థాపకుఁడు లేనియెడల నాజగత్తు సుస్థిత మగుట దుర్ఘటము. తానే వ్యవస్థాపకుఁడైనచో వ్యవస్థితమగు జగత్తునందలి విషమభావమునుఁ బట్టి యీశ్వరు నెడ వైషమ్యమును, జగత్తునందలి శోకబాహుల్యమునుఁ బట్టి నిర్దయత్వమును నారోపితములు కావలసివచ్చును. కావున భగవంతుడు జగద్వ్యవస్థాపనార్థము ప్రవృత్తిరూపధర్మము నుత్పాదించెను. తాదృశధర్మము సాధ్యరూపమగుటంజేసి సాధకుఁడు లేనిచో నప్రవృత్తమగును. గాన తత్సాధకులగు మరీచ్యాదిప్రజాపతులను దొలుత సృజించి యా వేదోక్తధర్మమును వారి కుపదేశించెను.

ఇంతమాత్రమున నశేష జగద్వ్యవస్థాపనము సాధ్యము కానేరదు. పూర్వోక్తధర్మముచే నియతమగు ప్రవృత్తిమార్గమున జగద్వ్యవస్థాపనము సాధింపఁ బడినను నివృత్తిమార్గమునఁ జేయఁ

(2) ద్వివిధో హి వేదోక్తో ధర్మః- ప్రవృత్తిలక్షణో నివృత్తిలక్షణశ్చ। జగతస్స్థితికారణం ప్రాణినాం సాక్షా దభ్యుదయనిశ్శ్రేయసహేతు ర్య స్స ధర్మో బ్రాహ్మణాద్యైర్వర్ణిభి రాశ్రమిభిశ్చ శ్రేయోర్థిభి రనుష్ఠీయమానో దీర్ఘేణకాలేనానుష్ఠాతౄణాం కామోద్భవాద్ధీయమానవివేకవిజ్ఞానహేతుకే నాధర్మే ణాభిభూయమానే ధర్మే ప్రవర్ధమానే చాధర్మే జగత స్థితిం పరిపి

---

దగు జగద్వ్యవస్థాపన మాధర్మముచేఁ జేయ నశక్యమగుటం జేసి నివృత్తిధర్మము నుత్పాదించి, పిమ్మట సనకనందనసనత్కుమారసనత్సుజాతులను సృజించి, జ్ఞానవైరాగ్యలక్షణమగు నానివృత్తిధర్మము నుపదేశించెను.

(2) "ధర్మవిషయమున వాదిభేదమునుబట్టి వివాదములు గనుపట్టెడిని. కాన: జగత్తుయొక్కస్థితికిహేతువగు ధర్మాంతరముసైతము సృజింపదగియున్న" దని తలంపరాదు. ప్రాణుల యభ్యుదయ నిశ్శ్రేయసములకు సాక్షాద్ధేతువగునదియే ధర్మ మనఁబడును. జగత్తుయొక్కస్థితికి హేతువగు నావేదోక్తధర్మము ప్రవృత్తిరూపము, నివృత్తిరూపమును గాక వేఱొండు సంభవింపదు. అందుఁ బ్రవృత్తిరూపధర్మము సాక్షాదభ్యుదయమునెడను, సత్వశుద్ధిద్వారమున జ్ఞానసాధనమై నిశ్శ్రేయసమునెడను హేతు వగుచున్నది. నివృత్తిరూపధర్మము నిశ్శ్రేయసమునకు సాక్షాద్ధేతు వగుచున్నది. పూర్వోక్తరీతి నభ్యుదయనిశ్శ్రేయస హేతువగు నాధర్మద్వయము పురుషార్థాభిలాషులగు నెల్లవారికి ననుష్ఠేయమగును. కాన: ననుష్ఠాతృనియమము సిద్ధింపదయ్యెను. అట్టియెడ బ్రాహ్మణాదివర్ణాశ్రములకును, దదితరులకును బురుషార్థాభిలాష తుల్యమైనను శ్రుతిస్మృతిపర్యాలోచనచే నాయా వర్ణాశ్రములకే యాయా ధర్మానుష్ఠానమభిహిత మగుటం జేసి యనుష్ఠాతృనియమము సిద్ధించుచునేయున్నది.

అట్టి నియమానుసారము శ్రేయోర్థులగు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రవర్ణముల చేతను, ఆశ్రములుచేతును ప్రవత్తినివృత్తిరూపధర్మద్వయ మనుష్ఠింపఁ బడుచున్ననుఁ గృతత్రేతాద్వాపరావసానపర్యంత మనుష్ఠించుటచే గ్రమక్రమమున ననుష్ఠాతలకుకామక్రోధాదు లుద్భవించుటంబట్టి వివేకజ్ఞాననాశహేతువగు నధర్మము ప్రబలి. ధర్మము కృశింప, నధర్మము క్రమక్రమముగాఁ బ్రవర్ధమానమయ్యెను. అట్టి యధర్మమువలనస్వనిర్మితజగముయొక్కమర్యాద నశించుచుండ జగత్స్థితికి హేతువగు మర్యాదను నిలుపఁదలచి యాదికర్తయగు నా నారాయణుఁడు బ్రాహ్మణత్వరక్షణార్థమై దేవకీదేవియందు వసుదేవునివలన స్వేచ్ఛానిర్మితంబగు మాయామయస్వరూపముతో నావిర్భవించెను.

"యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత! అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజా మ్యహమ్" అను భగవద్వచనానుసారము వైదికధర్మద్వయరక్షణార్థమే భగవంతుఁ డవతరించె నని స్పష్టముగాఁ గనబడుచుండ బ్రాహ్మణత్వమును మాత్రము రక్షించుట కావిర్భవించె ననుట బరమేశ్వరుఁడు విషమప్రవృత్తిగలవాఁడు గాదా? యని శంకింపరాదు.

పాలయిషు స్స ఆదికర్తా నారాయణాఖ్యో విష్ణు ర్భౌమస్యబ్రహ్మణో బ్రాహ్మణత్వస్య రక్షణార్థం దేవక్యాం వసుదేవా దంశేనకిల సంబభూవ। బ్రాహ్మణత్వస్య హి రక్షణేన రక్షిత స్స్యా ద్వైదికో ధర్మ స్తదధీనత్వా ద్వర్ణాశ్రమధర్మాణాం ।

(౩) సచ భగవాన్ జ్ఞానైశ్వర్యశక్తిబలవీర్యతేజోభి స్సదా స్సంపన్న స్త్రిగుణాత్మికాం వైష్ణవీం స్వాం మాయాం మూలప్రకృతిం వశీకృత్యాఽజోఽవ్యయో భూతానా మీశ్వరో నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావోఽపి స న్స్వమాయయా దేహవానివ జాతఇవచ లోకానుగ్రహం కుర్వన్నివ లక్ష్యతే ।

---

యాజనాధ్యాపనములు బ్రాహ్మణాధీనములగుటంబట్టి బ్రాహ్మణులుస్వకర్మనిరతులేని అట్టిబ్రాహ్మణుల నుపదేశికులుగ గ్రహించి క్షత్రియాదులు స్వవర్ణాశ్రమాచారములయందు ప్రవర్తింతురు: బ్రాహ్మణులే స్వవర్ణాశ్రమాచారదూరులైనయెడల కూఁకటివేరున బురుగుపట్టిన చెట్టుయొక్క శాఖాదులు యథాస్థితియం దుండని విధమున క్షత్రియాదులుపదేశకులు లేమిం జేసి స్వవర్ణాశ్రమాచారాదుల యందుండజాలరు. కానఁ ప్రథమమున రక్షణీయమగు బ్రాహ్మణత్వమును రక్షించిన దదుపదేశములవలన క్షత్రియాదులు స్వవర్ణాశ్రమాచారనిష్ఠు లగుదురనియు, నందువలన వైదికధర్మరక్షణమగుననియు, బ్రాహ్మణత్వరక్షణార్థము శ్రీకృష్ణజననమని నిర్ధారింపవలసియున్నది.

(౩) భగవంతుఁ డగు నారాయణునకు శరీరసంబధమున్నను శరీరసంబంధముగల జీవులకువలె ననీశ్వరత్వము సంభవింపదు. ఏలయన: నారాయణుడు:- జ్ఞానము. ఈశ్వరత్వము అర్థనిర్వర్తనసామర్థ్యము, బలము (సహాయసంపత్తి) పరాక్రమము, అప్రధృష్యత్వము (ఇతరులచే పరిభవింపబడకుండుట) అను నీయారుగుణములు గలవాడు. కాన శరీరసంబంధమున్నను నతనికి జీవులవలె ననీశ్వరత్వము ప్రాప్తింపదు.

"ప్రాజ్ఞుడెవండును ననర్థమును దెలిసికొని యాయనర్థమునఁ బ్రవేశింపడుగదా! నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుడును, స్వతంత్రుడునగు నీశ్వరుఁ డనర్థరూపశరీరము నెట్లు గ్రహియించెను. అట్లనర్థరూపశరీరమును గ్రహించుటవలన నేమిప్రయోజన" మని శంకింపరాదు.

శ్రీనారాయణుఁడు సత్వరజస్తమోగుణాత్మకమైనట్టియు, సర్వవ్యాపకమైనట్టియు, స్వాధీనమైనట్టియు, స్వకీయమగునట్టి, ప్రతిభాసరూపమగు మాయ యనునట్టియు నానావిధకార్యకారపరిణామియగు మూలప్రకృతిని స్వాధీనమొనర్చుకొని యెల్లపుడునిత్యుడు. (కార్యాకారవిరహితుడు) బుద్ధుడు (కారణరహితుడు) శుద్ధుడు, (జాడ్యరహితుడు) ముక్తుడు (అవిద్యాకామకర్మపారతంత్ర్యరహితుడు) నైనను తనమాయచే దేహవంతునివలె జన్మించినవానివలె లోకానుగ్రహమును చేయువానివలెఁ గానబడుచున్నాడు. పరమేశ్వరుని దేహాదులు వాస్తవికములు కావనియు, గల్పితములనియు గ్రహింపవలయును.

(4) స్వప్రయోజనాభావేపి భూతానుజిఘృక్షయా వైదికం హి ధర్మద్వయ మర్జునాయ శోకమోహమహోదధౌ నిమగ్నాయోపదిదేశ గుణాధికైర్హి గృహీతోఽనుష్ఠీయమానశ్చ ధర్మః ప్రచయం గమిష్యతీతి ।

(5) తం ధర్మం భగవతా యథోపదిష్టం వేదవ్యాస స్సర్వజ్ఞో భగవా న్గీతాఖ్యై స్సప్తభి శ్శ్లోకశతై రుపనిబబన్ధ ।

(6) త దిదం గీతాశాస్త్రం సమస్త వేదార్థసారసంగ్రహభూతం దుర్విజ్ఞేయార్థం తదర్థావిష్కరణాయానేకై ర్వివృతపద, పదార్థ, వాక్యార్థ, న్యాయ మప్యత్యన్తవిరుద్ధానేకార్థ

(4) "ప్రయోజన మనుద్దిశ్య న మన్దోపి ప్రవర్తతే" అను న్యాయానుసారముగ కృతకృత్యుఁడును, అప్తకాముఁడు నగు పరమేశ్వరునకుఁ బ్రయోజనమేమియు లేకుండుటయు, నద్వైతవాదమున ననుగ్రహింపఁదగిన దేదియు గానరానందునను ధర్మద్వయోపదేశము లోకానుగ్రహబుద్ధితోడనే యొనరించె నని చెప్పుట యెట్లు సమంజస మగుననిన—

స్వప్రయోజనము వాస్తవముగ లేకున్నను, తనకంటె నితరమగునది లేకున్నను గల్పితభేదముగల భూతములయందు దయకలవాఁడై పరమేశ్వరుఁడు ప్రవృత్తి, నివృత్తిరూపధర్మద్వయమును శోకమోహమహోదధియందు మునిగియుండి కర్తవ్యము దోపక యాతురత బొందియున్న యర్జునున కుపదేశించెను. ఇట్టివార లనేకులుండ నర్జునున కేల యుపదేశింప వలయుననిన— గుణాధికుల కుపదిష్టమై వారిచే గృహీతమగు ధర్మద్వయము వారలచే ననుష్ఠింపబడి యభివృద్ధిని బొందును కాన నీయర్జునుఁడే గుణాధికుడగుటంబట్టి యతనికి ధర్మద్వయము నుపదేశించెను.

(5) "బుద్ధో నామ్నా జినిసుతః కీకటేషు భవిష్యతి" అను పురాణవచనానుసారము బుద్ధుడును భగవదవతారమే. అట్టి బుద్ధభగవానునిచే బోధింపబడిన ధర్మద్వయము ప్రామాణికులచే గ్రహింపఁ బడలేదు. ఆవిధమున భగవదవతారమగు శ్రీకృష్ణునిచే బోధింపబడిన ప్రవృత్తి నివృత్తిరూప ధర్మద్వయము పరిత్యజింపఁ దగినదే యగు" నని శంకింపరాదు.

బుద్ధుడుచెప్పిన ధర్మద్వయము శ్రుతివిరుద్ధం బగుటంజేసి శిష్టులు గ్రహింపరైరి, ఈధర్మద్వయము వేదోక్తంబగుటంజేసి ప్రామాణికగృహీతము. కాన నర్జునునకు శ్రీకృష్ణుఁ డేక్రమము ననుసరించి యేధర్మద్వయము నుపదేశించెనో యాక్రమము ననుసరించి యాధర్మద్వయమును బోధింప "కృష్ణద్వైపాయనం విద్ధి వ్యాసం నారాయణం ప్రభుమ్" అను స్మృత్యనుసారము సాక్షాన్నారాయణ స్స్వరూపుఁడైన సర్వజ్ఞుఁడగు వేదవ్యాసుఁడు గీత లనుపేర నేడునూరుల శ్లోకములచే గ్రంథమును రచించెను.

(6) "గీతాశాస్త్రము పౌరుషేయము, పౌరుషేయమునకు మూలమగు వేదమును బట్టియే ప్రామాణ్య మంగీకరింపవలయును. అట్టివేదము గానరాదు. కాన నీగీతాశాస్త్రము ప్రమాణము కానేర" దని శంకింపరాదు.

త్వేన లౌకికై ర్గృహ్యమాణ ముపల భ్యాహం వివేకతోఽర్థనిర్ధారణార్థం సంక్షేపతో వివరణం కరిష్యామి ॥

(7) తస్యాస్య గీతాశాస్త్రస్య సంక్షేపతః ప్రయోజనం పరం నిశ్శ్రేయసం సహేతుకస్య సంసార స్యాత్యన్తోపరమలక్షణమ్

(8) తచ్చ సర్వకర్మసంన్యాసపూర్వకా దాత్మజ్ఞాననిష్ఠారూపా ద్ధర్మా ద్భవతి ।

---

ఈగీతాశాస్త్రము సమస్తవేదార్థసారసంగ్రహము. కాన వేదమూలకమగుటచే ప్రమాణము. ఇట్టి గీతాశాస్త్రముయొక్కయర్థముమూలమాత్రముచేగ్రహింపశక్యముగాదు. దీనికిఁబూర్వులు కొందరు (వృత్తికారాదులు) "పదచ్ఛేదః పదార్థోక్తి ర్విగ్రహో వాక్యయోజనా। ఆక్షేపోఽథ సమాధానం వ్యాఖ్యానం షడ్విధం మతమ్" అను న్యాయము ననుసరించి పదచ్ఛేదము, పదార్థోక్తి, విగ్రహము, వాక్యసమన్వయము, ఆక్షేపము, సమాధానరూపముగు వ్యాఖ్యలను జేసియుండిరి. ఆవ్యాఖ్యానములు విరుద్ధమగు ననేకార్థములు గలవగుటచే యజ్ఞానులు విరుద్ధముగనే గ్రహించుచుండిరి. అట్టి విరుద్ధార్థగ్రహణమును మాన్పుటకు నేను విరోధనులు లేకుండ స్పష్టముగ దెలియునటుల సంక్షేపముగ నీగీతాశాస్త్రమును వివరింతును.

(7) ఈగీతాశాస్త్ర మాప్తప్రణీతమైనను ప్రేక్షావత్ప్రవృత్త్యంగములగు విషయ, ప్రయోజన, సంబంధాధికారిరూపమగు ననుబంధచతుష్టయమిందు కానరానందున నీగ్రంథము శాస్త్రము కానేరదు. కాన నిది వ్యాఖ్యానయోగ్యము కాదని తలంపరాదు.

ఈగీతాశాస్త్రమునకు సంక్షేపముగ (సంగ్రహముగ) ననఁగా నేకవాక్యతచే నుత్కృష్టమగు నిశ్శ్రేయస్సు ప్రయోజనము.

నిశ్శ్రేయస్సనగా నిరతిశయసుఖావిర్భావమనియు, నిశ్శేషముగ ననర్థవినాశమనియు, నర్థద్వయము గ్రహింపనగును. అందెట్టి నిశ్శ్రేయస్సు ప్రాప్తించుననిన; మూర్ఛాస్వాపాదుల యందుఁ బునరావృత్తికి హేతువగు మూలావిద్యగలదు. అట్టి మూలావిద్యాసహితంబగు సంసారముయొక్క యత్యంతోపరమరూపమగు నిశ్శ్రేయస్సు, నిరతిశయానందావిర్భావరూపమునగు నిశ్శ్రేయస్సును ప్రయోజనములు.

(8) ఇట్టి నిశ్శ్రేయసము జ్ఞానసముచ్చితమగు కర్మవలనగాని. కేవలకర్మవలనగాని ప్రాప్తింపనేరదు. ఇక సర్వకర్మసంన్యాసపూర్వకంబగు నాత్మజ్ఞాననిష్ఠామాత్రమువలననే ప్రాప్తించును. అనఁగా సర్వకర్మసంన్యాసద్వారమునఁ బెక్కుసార్లనుష్ఠింపఁబడిన శ్రవణాదులవలననే జ్ఞాననిష్ఠ సిద్ధించును. కర్మవలన చిత్తశుద్ధియు, చిత్తశుద్ధివలన వివిదిషయము, దానివలన వైరాగ్యము, తన్మూలమున శ్రవణాదులును, వానివలన జ్ఞాననిష్ఠయును గలుగును. గానఁ గర్మము జ్ఞాననిష్ఠకు పరంపరయా కారణము.

(9) తథేమ మేవ గీతార్థధర్మ ముద్దిశ్య భగవతైవోక్తమ్ "స హి ధర్మ స్సుపర్యాప్తో బ్రహ్మణః పదవేదనే" ఇత్యనుగీతాసు । తత్రైవ చోక్తమ్ "నైవ ధర్మీ న చాధర్మీ న చైవ హి శుభాఽశుభీ। య స్స్యా దేకాసనే లీన స్తూష్ణీం కించి దచిన్తయన్" 'జ్ఞానం సంన్యాసలక్షణమ్' ఇతిచ।

(10) ఇహాపి చాన్త ఉక్త మర్జునాయ:— "సర్వధర్మా న్పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ" ఇతి । (గీ. 18-66)

(11) అభ్యుదయార్థోపి యః ప్రవృత్తిలక్షణో ధర్మోవర్ణాశ్రమాంశ్చోద్దిశ్య విహితస్స దేవాదిస్థానప్రాప్తి హేతు రపి స న్నీశ్వరార్పణబుద్ధ్యాఽనుష్ఠీయమానస్సత్త్వశుద్ధయేభవతిఫలాభిసంధి

---

(9) "యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం కార్య మేవ తత్" యజ్ఞ దాన తపోరూపకర్మలను వదలఁగూడదు. అట్టి కర్మ తప్పక చేయవలయునని యీగీత చెప్పుటవలన నిశ్శ్రేయస్సునకు కర్మసముచ్చితజ్ఞానము కారణ మగుననియు, సర్వకర్మసంన్యాసపూర్వకజ్ఞాననిష్ఠామాత్ర మిందుఁ జెప్పబడలేదనియు శంకింపరాదు.

నిశ్శ్రేయస్సునుగూర్చి కారణమగు సర్వకర్మసంన్యాసపూర్వకజ్ఞాననిష్ఠామాత్రము నుద్దేశించి భగవంతుఁడగు శ్రీకృష్ణపరమాత్మ యనుగీతలయందు "బ్రహ్మయొక్క స్థానమగు నిశ్శ్రేయస్సునుఁ బొందుటకు సర్వకర్మసంన్యాసపూర్వకమగు జ్ఞాననిష్ఠయొక్కటియే సమర్థమైనది.' అని చెప్పియుండెను. మఱియు నాయనుగీతలయందే యెవఁడు వాగాదిబాహ్యకరణవ్యాపారశూన్యుడై, యంతఃకరణవ్యాపారశూన్యుఁడై (అనగా బాహ్యాభ్యంతరకరణవ్యాపారశూన్యుఁడై) కేవల బ్రహ్మమునందే అవస్థానము (బ్రహ్మరూపముగ నవస్థితి) నొంది (యనఁగా నసంప్రజ్ఞాతసమాధినిష్ఠుడై) యుండునో వాడు ధర్మియుగాడు, నధర్మియుగాడు, శుభాశుభములులేనివాడు (అనగా సర్వకర్మసంన్యాసపూర్వకాత్మజ్ఞాననిష్ఠామాత్రుడగు) నని చెప్పఁబడినది. "జ్ఞానము సర్వకర్మసంన్యాసరూప" మనియుఁ గూడ నచ్చటనే వచింపబడెను. కాన సర్వకర్మసంన్యాసపూర్వకాత్మజ్ఞాననిష్ఠామాత్రముచేతనే మోక్షము ప్రాప్తించును. "యజ్ఞదానతపఃకర్మ" అను వచనమున కర్థము ప్రకృతార్థమునకు విరోధములేకుండునట్లు యీగీతా వాక్యవివరణమునందే చూపుదుము.

(10) ఈవిషయ మనుగీతలయందే గాక యీభగవద్గీతాశాస్త్రసమాప్తియందుఁగూడ శ్రీకృష్ణభగవానుఁడు సర్వధర్మములను వదలి నన్నొకనినే శరణుఁజెందుమని చెప్పెను. (అనగా సర్వకర్మసంన్యాసపూర్వకాత్మజ్ఞాననిష్ఠామాత్రుడవు కమ్మని బోధించెను.) కాన భగవద్గీత సర్వకర్మసంన్యాసపూర్వకజ్ఞాననిష్ఠామాత్రమువలననే మోక్షప్రాప్తియని బోధించుచున్నదనిగ్రహింపనగును. (విశిష్టాద్వైతులు చెప్పినట్లు కర్మసముచ్చితజ్ఞానమువలన మోక్షముప్రాప్తించునని కాని, తిలకుగారు చెప్పినటుల జ్ఞానసముచ్చితమగు కర్మవలన మోక్షము ప్రాప్తించుననికాని బోధింపదని గ్రహింపవలయును.)

(11) ఈగీతాశాస్త్రమునందు యథోక్తజ్ఞానమాత్రమే చెప్పబడుటలేదు. "కురు కర్మైవ

వర్జితః। శుద్ధసత్త్వస్య చ జ్ఞాననిష్ఠాయోగ్యతాప్రాప్తిద్వారేణ జ్ఞానోత్పత్తి హేతుత్వేన చ నిశ్శ్రేయసహేతుత్వ మపి ప్రతిపద్యతే। తథా చేమ మేవార్థ మభిసంధాయ వక్ష్యతి "బ్రహ్మణ్యాధాయ కర్మాణి" (గీ. 5-10) "యోగినః కర్మ కుర్వన్తి సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే" (గీ. 5-11) ఇతి।

(12) ఇమం ద్విప్రకారం ధర్మం నిశ్శ్రేయసప్రయోజనం పరమార్థతత్త్వంచ వాసుదేవాఖ్యం పరం బ్రహ్మాభిధేయభూతం విశేషతోఽభివ్యఞ్జయ ద్విశిష్టప్రయోజన సంబన్ధాభిధేయవద్గీతాశాస్త్రమ్। యత స్తదర్థే విజ్ఞాతే సమస్తపురుషార్థసిద్ధి రిత్యత స్తద్వివరణే యత్నః క్రియతే మయా।

---

తస్మాత్త్వం" ఇత్యాదస్థలములయందు కర్మనిష్ఠగూడ ప్రధానముగాఁజెప్పబడుచున్నది అందువలన నిశ్శ్రేయసమునుగూర్చి కర్మగూడ కారణమనక తప్పదని శంకింపరాదు. అభ్యుదయార్థమగు ప్రవృత్తిరూపధర్మము కామనతో ననుష్ఠింపబడిన పక్షమున దేవాదిస్థానప్రాప్తికి హేతువగును. ఈశ్వరార్పణముగ ఫలనిరపేక్షులై యాకర్మనే యాచరించినచో నట్టికర్మ సత్త్వశుద్ధికి హేతువై జ్ఞాననిష్ఠాయోగ్యతను గలిగించి క్రమముగ శ్రవణాదులయందు బ్రవృత్తి నిజనింపజేసి జ్ఞానమును గలిగించును. దానివలన శ్రేయఃప్రాప్తి యగును.

కనుకనే 'బ్రహ్మణ్యాధ్యాయ కర్మాణి' తాను జేయుకర్మలనుపరమేశ్వరార్పణము జేసి, 'యోగినః కర్మ కుర్వన్తి సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే' యోగులు (కర్మనిష్ఠాపరులు) అంతఃకరణపరిశుద్ధికొఱకు ఫలపరిత్యాగ మొనరించి కర్మలను జేయుదురు అని శ్రీకృష్ణుడు చెప్పియుండెను. కాన ప్రవృత్తి మార్గముకూడ సత్త్వశుద్ధిద్వారమున జ్ఞానమునకు హేతువగును. కాన నీగీతలయందు "కురు కర్మైవ తస్మాత్త్వం" అనునది మొదలుగాగల స్థలములయందు ప్రవృత్తి మార్గ ముపదేశింపఁబడెను.

(12) "ఈద్వివిధ కర్మనిష్ఠ, జ్ఞాననిష్ఠ" యను ధర్మములు నిశ్శ్రేయసమునకు హేతువులు. కాన నిష్ఠాద్వయద్వారమున గీతాశాస్త్రమునకు నిశ్శ్రేయసము (మోక్షము) ప్రయోజనము. గీతాశాస్త్రముచే జీవునకు పరమార్థతత్త్వమగు వాసుదేవుఁడను పరబ్రహ్మము చెప్పబడును. కాన విషయము పరబ్రహ్మము, గీతాశాస్త్రమునకును, నిశ్శ్రేయసమునకును (మోక్షమునకు)నిష్ఠాద్వయద్వారమైన సాధ్యసాధనభావము సంబంధము. పరమార్థతత్త్వమగు పరబ్రహ్మమునకును, గీతాశాస్త్రమునకు విషయవిషయిభావము (ప్రతిపాద్య ప్రతిపాదకభావము) సంబంధము.పరమపురుషార్థియగు జిజ్ఞాసువు అధికారి. కాన నీగీతాశాస్త్రము విషయ, ప్రయోజన, సంబంధాధికారు లను అనుబంధచతుష్టయము కలది. అట్టి గీతాశాస్త్రార్థమును దెలిసికొనిన సమస్తపురుషార్థసిద్ధి కలుగుటంబట్టి యీగీతాశాస్త్రమును వివరింతును. హరిః ఓం తత్సత్.

సంబంధగ్రంథము ముగిసెను.



శ్లో॥ సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత ।
యావ దేతా న్నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్ ॥



అగ్రే కృత్వా కమపి చరణం జానునైకేన తిష్ఠ న్పశ్చాత్పార్థం ప్రణయరసజుషా చక్షుషా వీక్షమాణః।
సవ్యే తోత్త్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రా మాబిభ్రాణో రథ మధివస న్పాతు న స్సూతవేషః ॥

ఓమ్.

# శ్రీభగవద్గీతాసు

## ప్రథమోఽధ్యాయః.

ధృతరాష్ట్ర ఉవాచ:—

ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః ।
మామకాః పాణ్డవాశ్చైవ కిమకుర్వత సంజయ! ॥ ॥౧॥

పదవిభాగము:— ధృతరాష్ట్రః- ఉవాచ- ధర్మక్షేత్రే- కురుక్షేత్రే-సమవేతాః- యుయుత్సవః- మామకాః- పాణ్డవాః- చ- ఏవ- కిం- అకుర్వత- సంజయ ॥

ప్రతిపదార్థము:— ధృతరాష్ట్రః=ధృతరాష్ట్రుఁడు; ఉవాచ=పలికెను; హే సంజయ!=ఓ సంజయుడా; ధర్మక్షేత్రే, ధర్మ=ధర్మమునకు, ధర్మజ్ఞానమునకును; క్షేత్రే=అభివృద్ధి కారణమైన; కురుక్షేత్రే=కురుక్షేత్రమునందు; యుయుత్సవః=యుద్ధము చేయ నిచ్ఛగలవారలై; సమవేతా ఏవ=కలిసికొనినట్టి; మామకాః=నా కొమరులగు దుర్యోధనాదులును; పాండవాః=పాండురాజు కొమరులగు ధర్మరాజాదులును; కిం=దేనిని; అకుర్వత=(చేసిరి) *చేయుచుండిరి.

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ధర్మరాజాదులు రాజసూయయాగానంతరమున దుర్యోధనాదులచే ద్యూతమున కాహ్వానింపఁబడి, కపటద్యూతమున రాజ్యము నోడిపోయి, పదురెండువత్సరము లరణ్యవాస మొనర్చి, పదమూడవ వత్సరమున విరాటునికొలువు జేరి; యజ్ఞాతస్వరూపులై యా వత్సరమును గడిపిరి.

---

—• ౧వ అధ్యాయము ౧వ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

శంకరానందీయము:— ఈగీతాశాస్త్రాధ్యయన, తదర్థగ్రహణ, తచ్ఛ్రవణజన్యజ్ఞాన, తత్ఫలప్రాప్తులయం దధికారిగఁ జేయఁబడిన యర్జునుని యందలి సదసద్వివేచనము, ఇహాముత్రఫలభోగవిరాగము, శమాదిషట్కసంపత్తి, ముముక్షుత్వము మొదలగు నధికారిలక్షణములను సూచించుటకుఁ బ్రథమాధ్యాయ మారంభింపబడెను.

"ధర్మక్షేత్రే" ధర్మము ప్రధానముగాఁ గలదగుటచే లేక, ధర్మమునిచ్చునదగుటచేలేక, ధర్మక్షయము నుండి రక్షించునదగుటచే ధర్మక్షేత్రము.

ఇట 'యుయుత్సవః' అనెడి విశేషణబలమున యుద్ధము నిశ్చితపూర్వమగుటచే 'యుద్ధరంగ సమవేతులైన పాండవ ధార్తరాష్ట్రు లేవిధముగ యుద్ధమును మొదలిడిరి.' అని ప్రశ్నింపవలయునుగాని "ఏమిచేసిరి" అని ధృతరాష్ట్రుఁడు ప్రశ్నించుట యనుపపన్నమని శంకింపజనదు. ఏలన 'ధర్మక్షేత్రే' అనుటవలన క్షేత్రమహిమచే దుర్యోధనుడే స్వయముగ ధర్మరతుడై తత్పిత్ర్యమగు నర్ధరాజ్యమును పాండవులకిచ్చియుండవచ్చును. లేక, ప్రవృద్ధధర్ముడై ధర్మజుఁడు స్వజనవధము నరకహేతువని యూహించి యుద్ధవిరతుఁడు కావచ్చును. లేక, అందఱును గలసి యుద్ధమునే చేయుచుండవచ్చును. కాన ననిశ్చితయుద్ధవిషయుక విశేషప్రశ్నమే యనుపపన్నము. కనుకనే "కిమకుర్వత" "ఏమిచేసిరి" యని ప్రశ్నించుటయే యుపపన్నము.

భాష్యోత్కర్షదీపిక:— "ధర్మక్షేత్రే" ధర్మాభివృద్ధికి కారణమగు "స్వీయధర్మమగు ధర్మయుద్ధమునుజేసిరా? లేక, అధర్మయుద్ధమును జేసిరా? అనుప్రశ్నము 'ధర్మక్షేత్రే' అను విశేషణముచే బోధింపబడెను. 'నావారగు

---

* ధృతరాష్ట్ర ప్రశ్న భూతాద్యతనకాలిం మగుటచే "అకుర్వత" అను పదమునకు చేయుచుండిరి అని అర్థము చెప్పుట సమంజసము.

తరువాత శ్రీకృష్ణభగవానుని ధృతరాష్ట్రుని కడకు అయిదు గ్రామములనైన నిమ్మని రాయబారమునంప దాని కంగీకరింపక సూదిమోపునంత భూమినైన నివ్వనను దుర్యోధనుని వాక్యములను విని, శ్రీకృష్ణుఁడత్యాగ్రహముతో వచ్చి, ధర్మరాజాదులకు జెప్ప నది విని ధర్మ రాజాదులు దుర్యోధనాదులను యుద్ధమున కాహ్వానించ యిరువురు కురుక్షేత్రమునందు యుద్ధ సన్నద్ధులై యుండిరి.

అత్తఱి చర్మచక్షువులు లేమిం జేసి ప్రజ్ఞాచక్షువగు ధృతరాష్ట్రుండు కురుక్షేత్రమునందు జరుగనున్న యుద్ధమును తెలిసికొనఁగోరి తనకు హితమును గోరునట్టి, సమీపము నందుండిన సంజయునిగూర్చి యిట్లు ప్రశ్నించెను.

దుర్యోధనాదు లధార్మికులగుటవలన ధర్మక్షేత్రముగుటంజేసి హింసాప్రధానమగు యుద్ధమున కనర్హమగు కురుక్షేత్రమునం దధర్మయుద్ధమును చేసెడివారైనను, పరమధార్మికులగు పాండవులు భీష్మపతనము నెట్లు జేసిరి?" అని సూచించుటకు "పాండవాః" అని చెప్పఁబడెను.

"పాండవుల బహువిధమగు జయ కారణమును ధృతరాష్ట్రుడు విని, స్వపుత్రరాజ్యచ్యుతి నాశంకించి "ధర్మక్షేత్రే" మొదలుఁగొని పూర్వయుయుత్సానుసారము యుద్ధమునే చేసిరా? లేక, వేరొక కారణముచే నపగతయుద్ధేచ్ఛులై వేఱొండెద్దియేని చేసియుండిరా? అని ప్రశ్నించెను.

ఇట యుయుత్సానివృత్తికి భీమార్జునాదివీరపురుషనిమిత్తకమగు దృష్టభయము కారణము. "ధర్మక్షేత్రే" అనుటచే నదృష్టభయరూపకారణముఁగూడ సూచింపబడెను. "ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమందున్న పాండవులు వస్తుతః పరమ ధార్మికులుగాన నుభయపక్షహింసాకారణమగు నధర్మమునకు భీతిల్లి యుద్ధోపరతులైనచో నాపుత్రులు ప్రాప్తరాజ్యులే యగుదురు. లేక స్వతఃపాపులగు నా పుత్రులు ధర్మక్షేత్రమాహాత్మ్యముచే నిర్మలమనస్కులై, యనుతప్తులై, కపటోపాత్తమగు రాజ్యమును పాండవులకిచ్చినచో యుద్ధమును చేయనివారైనను మృతప్రాయులే యగుదురు." అను నీవిధమగు వికల్ప కల్పనచే సంశయితుఁడై స్వపుత్రరాజ్యప్రాప్తికిని, పాండవరాజ్యాప్రాప్తికిని దృఢతరోపాయమును గనుఁగొనఁజాలని ధృతరాష్ట్రుని యపరిమితోద్వేగమే యిట ప్రశ్నబీజము అని కొందరి (మధుసూదనసరస్వతి) యభిప్రాయము.

కాని "అథ గావల్గణి ర్ధీమా న్సంగరా దేత్య సంజయః । ప్రత్యక్షదర్శీ సర్వస్య భూతభవ్యభవిష్యతః ॥ ధ్యాయతో ధృతరాష్ట్రస్య సహసోపేత్య దుఃఖితః। హతో భీష్మ శ్శాంతనవో భరతానాం పితామహః" అనునది మొదలుకొని "సశేతే నిహతో భూమౌ వాతరుగ్ణ ఇవ ద్రుమః" అనునది యంతముగాగల సంక్షేపోక్తి పరమును, యుద్ధనిశ్చాయకము నగు పూర్వగ్రంథమునకు విరోధము వాటిల్లును గాన పూర్వోక్తాభిప్రాయ ముపేక్షణీయము. ఈప్రశ్నము పూర్వగ్రంథావిరుద్ధముగ సేచునుడివివరీతిని సూపపన్నమగుచుండుటచే 'సంక్షేపోక్తి పరమగు పూర్వగ్రంథమును వినియు మోహముచే విస్మృతినిఁబొందిన ధృతరాష్ట్రుఁడీవిధముగఁ బ్రశ్నించె" ననుటయు నసంగతము.

ఇట కురుక్షేత్రపదప్రయోగముచే "అవిముక్తం వై కురుక్షేత్రం" అనుటచే నవిముక్తక్షేత్ర ప్రతీతి గాకుండుటకు "ధర్మక్షేత్రే" అను విశేషణమని కొందరి (నీలకంఠుని) యభిప్రాయము. కాని ప్రస్తుతప్రసక్తమగు కురుక్షేత్రమునుండి తిరిగివచ్చిన సంజయునకు "ముక్తిక్షేత్రమునందెట్లు కలిసికొనిరి?" అను సంశయమే కలుగదు గాన నీయభిప్రాయము గూడ నసంగతమే యగును.

"భీష్మపతనముచే నీయుద్ధ మనర్థదాయకమని చెప్పిన నీవాక్యమునకు లెస్సగా జయము కలిగె" నని సూచించుటకు "సంజయ!" అని సంబోధించెను.

ఓసంజయా! ధర్మమునకును, ధర్మజ్ఞానమునకును నభివృద్ధికారణమగుకురుక్షేత్రమునందు యుద్ధముచేయ నిచ్ఛగలవారై కలిసికొనిన నాకొమరులగు దుర్యోధనాదులును, పాండవులగు ధర్మరాజాదులు నేమి (చేసిరి) చేయుచుండిరి.

---

స్వాభిప్రాయము:— వైశంపాయనుఁడు జనమేజయునకుఁ జెప్పినట్లు వ్యాసమహాముని భారతేతిహాసమును రచించెను. అందు "హతో భీష్మ శ్శాంతనవో భరతానాంపితామహః" ఇత్యాదిసంక్షేపోక్తి పరగ్రంథమును సంజయుఁడు ధృతరాష్ట్రునకుఁజెప్పినట్లు వైశంపాయనుఁడు జనమేజయునకు సంగ్రహముగ జెప్పి, విపులముగఁ జెప్పనెంచి "ధృతరాష్ట్రఉవాచ" ఇత్యాదిగ్రంథమును జెప్పమొదలిడెను. కనుకనే పైసంక్షేపోక్తి పరగ్రంథముజనమేజయునకు యుద్ధనిశ్చాయకముగాని, ధృతరాష్ట్రునకు యుద్ధనిశ్చయమును కలుగఁజేయునదిగాదు. అందువలననే ధృతరాష్ట్రుడు యుద్ధసంశయితుఁడై యట్లు వికల్పముగఁ బ్రశ్నించెనను మధుసూదనసరస్వత్యభిప్రాయమే సమంజసము. భాష్యోత్కర్షదీపికాకారాభిప్రాయ మనుపపన్నమనియు మాయాశయము.

పరమార్థప్రపా:— ఉభయసేనాసన్నాహ సమయమున నాచార్య, గోత్ర, సుహృదాది వధాశంకచే "కులక్షయ కృతం దోషం," ఆచార్యా స్మాతులా స్సాత్రిత్రాః" మొదలగు వాక్యములచే నిర్విణ్ణుడును, అవిధముగనే నిత్యానిత్యవస్తువివేకముచే స్వీయ (కృష్ణ) చరణైకశరణుడును, మఱియు "అపి త్రైలోక్యరాజస్య" మొదలగు వాక్యములచే నిహాముత్రఫలభోగవైరాగ్యవంతుడును, అట్లే "శిష్యస్తేహం శాధి మాం త్వాం ప్రపన్నం" అనుటచే గురుదైవతవాక్యవిశ్వాసముతో మోక్షార్థియునగు యర్జునునిఁగూర్చి వర్ణధర్మోచితకర్మోపదేశావసరము కలిగెను. అసయముననే "న కాంక్షే విజయం కృష్ణ!" అనియు అట్లే "ఏతాన్న హంతు మిచ్ఛామి" అనియు, "శ్రేయో భోక్తుం భైక్ష మపీహ లోకే" ఇత్యాదివాక్యార్థ పర్యాలోచనచే శ్రీకృష్ణభగవాను డర్జునునిజ్ఞానాధికారిగనిశ్చయించి, స్వరూపమును (బ్రహ్మాత్మభావమును)గూడనుపదేశించెను.

సదానందీయము:— ఈగీతాశాస్త్రాదిమశ్లోకమునందు రూపకప్రదర్శనము చేయఁబడెను. అదెట్లనః— కురువులనగా కరణములు (ఇంద్రియములు.) వానికిక్షేత్రము దేహము ఈదేహమేసర్వధర్మసాధకముగాన ధర్మక్షేత్రము. అదెట్లనః— శరీరసంబంధముచే ముముక్షువులాత్మజ్ఞానరూపమగు పరమధర్మము నొందుచుండిరి. లేక మోక్షైకలాభముచే సమస్తధర్మము లీశరీరమునందు నశించునుగాన ముముక్షువులు శారీరకధర్మక్షయరూపకారణముచే రక్షించునదిగాన ధర్మక్షేత్రము. క్షేత్రములలో నుత్కృష్టమగు నీశరీరమునందు పరస్పరబాధ్యబాధకభావముతో రాగవైరాగ్యసంతోషతృష్ణాదులు యుయుత్సువులై కలసికొనియుండును. "మామకాః" నాదియను భ్రాంతిని కలిగించునవిగానఁ గామక్రోధాదులుమామకములనంబడును. కనుకనే మహామోహునిసంతానమనియు, క్రూరములనియుఁ జెప్పనొప్పును. 'పాండుః' యనగా శుద్ధియని యర్థము. తత్పుత్రులు 'పాండవాః' పాండవులనంబడు క్షమా, వైరాగ్య, సంతోషాదులు వీరలు విద్యామయులగు సౌమ్యులు. ఇటఁబ్రశ్నకుడు జాత్యంధుడగు ధృతరాష్ట్రుఁడు (అనగా విజ్ఞానచక్షూరహితుడగు ముముక్షువు) అని యర్థము. సంజయుఁడు (లెస్సగ నింద్రియముల జయించినవాడగు జ్ఞాని) కథకుఁడు. ప్రశ్నకుఁడగు ముముక్షువు కథకుఁడగు జ్ఞానినిగూర్చి ధర్మక్షేత్రమగు నీశరీరమునందు మమకారాభినివేశకములు, యాసురప్రవృత్తులునగు కామక్రోధాదులు, సాత్త్వికములు దైవప్రవృత్తులునగు క్షమావైరాగ్యాదులు కలిసి సంఘర్షించుకొను సమయమున వేనిని నెవ్వి జయింపగల్గును! అని ప్రశ్నించెనని యాశయము. ఇట, ప్రశ్నార్థకముగనే "కిమకుర్వత" అని నుడువఁబడెను.

లేక, యిట ప్రశ్నకుడు మహామోహుడు "మామకములగు క్రోధాదులు, తద్విపక్షులు, సాత్త్వికులునగు క్షమావైరాగ్యాదులు యుయుత్సువులై దేహమునందు సమావేశమై యెవ్వనిని యెవ్వి జయింపగలిగెను!" అనిసర్వేంద్రియార్థసంబంధముగల (సర్వేంద్రియములను స్వాధీన మొనర్చుకొనిన మనస్సును) ప్రశ్నించెను. కనుకనే గ్రంథాంతమున ధృతరాష్ట్రునిఁగూర్చి "యత్ర యోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః"

సంజయ ఉవాచ:—

గీ॥ దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా ।
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్ ॥ ॥౨॥

పదవిభాగము:— సంజయః- ఉవాచ- దృష్ట్వా- తు- పాండవానీకం- వ్యూఢం- దుర్యోధనః- తదా ఆచార్యం- ఉపసంగమ్య- రాజా- వచనం- అబ్రవీత్ ॥౨॥

ప్రతిపదార్థము:— సంజయః=సంజయుఁడు; ఉవాచ=సమాధానమును జెప్పెను; తదా=ఆ ట్టి సమయమున; రాజా=ప్రభువగు; దుర్యోధనః=దుర్యోధనుడు; వ్యూఢం=గారుడాదివ్యూహముగఁ బన్నబడిన; పాండవానీకం=పాండవసైన్యమును; దృష్ట్వా=చూచి; ఆచార్యం=ద్రోణాచార్యులను; ఉపసఙ్గమ్య=కలిసి కొని; వచనం=వాక్యమును; ఉవాచ= పలికెను.

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ప్రథమమున ధర్మరాజాదులు యుద్ధము నంగీకరింపమికి రెండు కారణములు. మొదటిది- భీష్మద్రోణకృపాచార్యాశ్వత్థామాదిమహావీరులచే వ్యాప్తమైయున్న మనసైన్యమునుజూచునంత మాత్రముచేత భయముగలుగుట, రెండవది- ఉభయపక్షనాశనమూలకమగు పాపభయము.

ఈ రెండింటిలో నేకారణము చేతనైనను ధర్మరాజాదులు యుద్ధమును జాలించెదరా! యను విషయమును దెలిసికొనుటకు పుత్రప్రేమాకులుఁడగు ధృతరాష్ట్రునిచే వేయబడిన ప్రశ్నకు సంజయుఁడు సమాధానముఁ జెప్పుచున్నాడు.

పాండవుల కెంతమాత్రము భయప్రసక్తియేలేదు. మఱియు నీకుమారుడగు దుర్యోధను నకే ధృష్టద్యుమ్నాదిమహారథికాధిష్ఠితమగు పాండవసైన్యమును జూచినతోడనే భయ మావి

---

ఇత్యాదికముచే యోగీశ్వరుడగు శ్రీకృష్ణభగవానులు భక్తియోగాదులచే నేదేహదేవాలయమునందు సమారాధిం పఁబడునో యచ్చటపార్థుఁడు (క్షమాదిదైవీసంపత్తి) ధనుర్ధనుఁడై విజయసామగ్రికలవాడై) యుండునో ఆదేహమునందు "శ్రీ" మోక్షసాధనసంపత్తి మొదలగునవి నెలకొనియుండును. అని చెప్పబడెను. ఇట జెప్ప బడిన యింద్రియవృత్తులే ఛాందోగ్యోపనిషత్తునందు దైవీవృత్తులుగాను, ఆసురీవృత్తులుగాను జెప్పబడినవి. స్వభావప్రవృత్తము, శాస్త్రనిషిద్ధార్థప్రకాశనముచే బరాభూతములగు నింద్రియవృత్తులే యాసురము లనబడును. ఇవియే కామక్రోధాదులు. శాస్త్రానుసృతములై వెడలెడి యింద్రియవృత్తులు దైవికములనబడును. ఇవియే శాంతి దాంత్యాదులు. అనాదికాలమునుండియు ప్రతిమానవదేహమునందును నీదేవాసురసమ్మేళనమై యుద్ధము జరుగు చుండును. ఈయుద్ధపర్యవసానవివిదిషయే యిట ప్రశ్నబీజము. ఈవివిదిషానివృత్తికొఱకు నీగ్రంథోపక్రమోప సంహారములు సమర్థము లగుచున్నవి. కాన నిదియే వ్యాసభగవానుని తాత్పర్యము.

—• ౧వ అధ్యాయము ౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఓరాజా! "నీపుత్రుడు రాజ్యమును వారల కర్పించునేమో" యని భీతిల్లవలదు ఏమన? అందుకు మన దుర్యోధనుని దౌష్ట్యమే ప్రతిబంధకము. అని తెల్పుటకు "దృష్ట్వాతు" అను శ్లోకమును మొదలిడెను.

"అకురుక్షేత్రమునందు పాండవులకు దృష్టభయ మూహించుటకైనను లేదు. ఇక నదృష్టభయము మాత్ర మర్జునునకు జనించెను. అదియు శ్రీకృష్ణభగవానునిచే దొలగింపబడెను. అని సూచించుటకు యీశ్లోకమునం దున్న 'తు' అను శబ్దముచే పాండవుల యుత్కర్ష సూచింపబడెను.

శ్లో॥ పశ్యైతాం పాండుపుత్రాణా మాచార్య! మహతీం చమూమ్ ।
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా ॥ ॥౩॥

ప ద వి భా గ ము:— పశ్య- ఏతాం- పాండుపుత్రాణాం- ఆచార్య- మహతీం- చమూం- వ్యూఢాం- ద్రుపదపుత్రేణ- తవ- శిష్యేణ- ధీమతా । ॥౩॥

ప్ర తి ప దా ర్థ ము:— హేఆచార్య!=ఓగురువగు ద్రోణాచార్య!; ద్రుపదపుత్రేణ=ద్రుపదరాజకుమారుడును; తవ=నీయొక్క; శిష్యేణ=శిష్యుడునైన; ధీమతా=బుద్ధిమంతుడగు ధృష్టద్యుమ్నుచే; వ్యూఢాం=పన్నబడిన; మహతీం=అనేకాక్షౌహిణీసంఖ్యాకమగు; పాండుపుత్రాణాం=ధర్మరాజాదులయొక్క; ఏతాం=మనసమీపమున తమబోంటి మహాపురుషులను గూడ లెక్కజేయక నిలచియున్న యీ; చమూం=సైన్యమును; పశ్య=చూడుము. ॥౩॥

---

ర్భవించెను. అట్టిభయము గలిగియు పరాక్రమవంతుడగుటంబట్టి యుద్ధప్రారంభ సమయమునందనకు శిక్షకుడును; రక్షకుడునైన ద్రోణాచార్యుని సమీపమునకు వినయపూర్వకముగ నేగి నర్థసహితమగు నొక వాక్యమును బలికెను. ॥౨॥

"పరసైన్యము గొప్పదైనను బరపక్షబలము నీసంబంధమైన"దని సూచించుచు ద్రోణాచార్యులకుం గోపోద్రేకముం గలిగింప దుర్యోధనుం డిట్లు పలికెను. ద్రోణాచార్య! నీకుం బ్రబలశత్రువగు ద్రుపదరాజు కుమారుండా నీకు శస్త్రాస్త్రవిద్యలయందును శిష్యుడు! అట్టివాడయ్యు నీయెదుట నిర్భయముగ నిన్నెదుర్కొన సైన్యమును వ్యూహముగం బన్ని నిలిచియుండ నెట్లు సహించుచుంటివి? ధృష్టద్యుమ్నుచే వ్యూహితమైనట్టియు, తమబోంట్లను లెక్కజేయక నిర్భయముగ నిలిచియున్న అనేకాక్షౌహిణీసంఖ్యాకమైన నీ పాండవసైన్యమును జూడుము. ॥౩॥

---

ఆచార్యుని తనదగ్గరకు రప్పింపక తాను రాజైయుండియు స్వయముగ నాచార్యుని సమీపించి అనుటచే దుర్యోధనునకుం బాండవసైన్యదర్శనముచే భియము కలిగెనని సూచితమయ్యెను.

భియముచే స్వీయరక్షణనిమిత్త మాచార్యుని సమీపించినను యాచార్యునియందలి గౌరవప్రదర్శనవ్యాజమున భియమును కప్పిపుచ్చెనని రాజనీతికుశలత్వద్యోతకమగు "రాజా" అను పదముచే ధ్వనితమయ్యెను.

శ ం క రా న ం దీ య ము:— పాండవబలోత్కర్ష వర్ణనచే తనసైన్యమునకు శౌర్య, బల, పౌరుష, ఉత్సాహోద్రేకములను వృద్ధిచేయుట కాచార్యుని సమీపించి వక్ష్యమాణవాక్యమును బలికెను.

స దా న ం దీ య ము:— ప్రియశిష్యులగు పాండవులతో యుద్ధముచేయుట కాచార్యు డిచ్చగింపడేమో యను భియముచే నాచార్యుని ప్రోత్సహించుటకు సమీపించి యీవాక్యమును బలికెను.

భాష్యోత్కర్షదీపిక:— "వీరశిరోమణియు, పరమకారుణికుడు నగు అర్జునుడు హింసాప్రధానమగు యుద్ధమునుండి విరతుడైనను భూభారసంజిహీర్షువగు శ్రీకృష్ణునిచే నుపదిష్టుడై తిరిగి యుద్ధమునే చేసెను. ధర్మరాజాదులు క్షాత్రధర్మకోవిదులగుటచే యుద్ధమును జేసిరి. ఇక నీవారగు దుర్యోధనాదులన్ననో క్రూరస్వభావులై యుద్ధమును జేసిరి' అని తెల్పుటకు 'దృష్ట్వాతు' అను శ్లోకమును సంజయుడుపక్రమించెను. (ఈవ్యాఖ్యాత ప్రథమశ్లోక స్వీయవ్యాఖ్యానరీతిగ యుద్ధనిశ్చయముగల ధృతరాష్ట్రుడు జేసిన ప్రశ్నకు సమాధానముగ వ్యాఖ్యానించెను)

—• ౧వ అధ్యాయము ౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మ ధు సూ ద న స ర స్వ తీ య ము:—'ఓఆచార్యా! నీబోటిమహానుభావులు సమీపవర్తులై యున్నను మిమ్ములను లెక్కింపక నిర్భికముగ నిలిచియున్న యీపాండవసైన్యమును చూడుము.' అని పాండవస్నిగ్ధుడగు నాచా-

ర్యుఁడు వారితో యుద్ధము జేయుడేమో యను సంశయముతో నాచార్యునకుఁ గ్రోధోద్దీపనార్థమై పాండవకృతము, ఆచార్యవిషయకమునగు నవమానమును దుర్యోధను డీశ్లోకమున సూచించెను.

"నేనుశిష్యుఁడనగుటచే చూడుముఅని ప్రార్థించుచుంటిని," అనిసూచించుటకు 'ఆచార్య' అని సంబోధించెను.

ఇట "తవ శిష్యేణ వ్యూఢాం" అనుటచే నీశిష్యునిచే(పన్నబడినది) వ్యూఢము గాన: ఈసేననుజయించుట నీకు సుకరము. కాఁబట్టి యప్రీతి కార్యమని యూహింపజనదు. అని సూచితమైనది.

"ద్రుపదపుత్రేణ" అనుటచే క్రోధోద్దీపనార్థము ద్రుపదపూర్వవైరము సూచనము చేయఁబడెను.

"ధీమతా" అనుటచే "బుద్ధిమంతుడగు నీధృష్టద్యుమ్నుఁ డనుపేక్షణీయుఁడుసుమా" యని సూచితమయ్యెను. లేక "హే పాండుపుత్రాణా మాచార్య" ఓ పాండవగురూ! అని సంబోధనముచే "వారలయందధికానురాగవంతుఁడవగుటంజేసి వారలకే గురుడవు" అని సూచించెను.

"ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ" అనుటచే నీశత్రుపుత్రుఁడును, త్వద్వధార్థసంజాతుఁడు నయ్యు నీచే నధ్యాపితుఁడయ్యె, ఇట్టి నీమాధ్యమే నాకు మహానర్థకారణమయ్యె" అని సూచింపబడెను.

"శత్రువగు నీవల్లనే త్వద్వధోపయోగియగు యస్త్రవిద్య గ్రహింపఁబడెను. కనుకనే వీనిబుద్ధిశ్లాఘ్యము" అని 'ధీమతా' అను విశేషణముచే సూచితమయ్యెను.

"ఈసేనాదర్శనముచే నానందము భ్రాంతచిత్తుఁడవగు నీకే కలుగును. కాన దీనిని నీవే చూడుము" అని యీవిధముగ నాసైన్యమును జూపుచు దుర్యోధనుఁ డాచార్యునకు నిగూఢమగు ద్వేషమును రగుల్గొల్పుచుండెను. కాన ధర్మక్షేత్రగతుఁడైనను దుష్టబుద్ధియగు నీకుమారుఁ డనుతప్తుఁ డెట్లగును? అని సంజయుఁడు ధృతరాష్ట్రునకు సూచించెనని యాశయము.

భాష్యోత్కర్ష దీపికః— తనకు రక్షకుఁడును, విద్యాశిక్షకుడునగు నాచార్యుని సమీపించి నమస్కారపురస్సరముగ యుద్ధార్థము ప్రార్థించు దుర్యోధనునకు 'లేక' అని మొదలుకొని తెలిపినపై మధుసూధనసరస్వత్యభిప్రాయము ప్రక్రృతాసంగతము గాన నుపేక్షణీయము.

స్వాభిప్రాయము:— దుర్యోధనుఁడాచార్యుని దనకభిముఖునిగ, పాండవులయెడ విముఖునిగ జేయఁ దలంచెను. అందునస్వీయాభిముఖ్యసంపాదనార్థమునమస్కారపురస్సరముగ స్వయముగ నాచార్యుని సమీపించి విజ్ఞాపించుకొనెను. ఇకఁ బాండవవైముఖ్యసంపాదనార్థము పాండవకృతావమాననిరూపణమును, పాండవపక్షపాతులయెడను, పాండవులయెడను నాచార్యునకుగల ప్రియశిష్యత్వభ్రాంతియొక్క నిరసనమును జేయుట ప్రస్తుతప్రసక్తమగును. కనుకనే "నీశత్రువునకు ప్రియశిష్యత్వభ్రాంతిచే స్వీయవధోపయుక్తమగు విద్యనుపదేశించి త్వద్ద్వేషకుఁడ నగుటయేకాక శిష్యుఁడనుగూడ నగు నాకును, మీకునుగూడ మహానర్థమును దెచ్చిపెట్టితిరి. కాన నిప్పుడైనను నీప్రియశిష్యత్వభ్రాంతిని విడువఁ బ్రార్థించుచున్నాడ" నను మధుసూదనసరస్వతీవ్యాఖ్యాపర్యవసితభావమువలన నాచార్యునకుఁ బాండవకృతావమాన పూర్వవైరస్మృతులచే వారియెడ ప్రియశిష్యత్వభ్రాంతి తొలగి, పాండవవైముఖ్యము, స్వాభిముఖ్యము కలుగునని దుర్యోధనుఁ డూహించుట యసమంజసము కానేరదు. అట్లే ఏతదర్థద్యోతకముగ బలుకుటయు ప్రస్తుతప్రసక్తము కాకపోదు.

మఱియు స్వయముగ సమీపించి నమస్కారపురస్సరముగ ప్రహ్వీభూతశిష్యభావమును కార్యరూపముగఁ జూపుచు, "హే పాండుపుత్రాణా మాచార్య" అని "నముమ" నాకు కావు. అను నర్థముసుధ్వనింపఁ జేసినంతమాత్రమున విచక్షణుఁడగు నాచార్యుఁడు "దుర్యోధనుఁడు నాకుశిష్యుఁడు కాఁడు పాండవులే ప్రియశిష్యులు" అని యథాశ్రుతార్థమునే గ్రహించునేమోయని దుర్యోధనుఁడుసందేహింపవలెననుటయు నసంగతము. కాన మధుసూదనసరస్వత్యభిప్రాయ ముపేక్షణీయము కాదని మాయభిప్రాయము. ॥3॥

గీ॥ అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి ।
యుయుధానో విరాట శ్చ ద్రుపద శ్చ మహారథః ॥ ॥౪॥

గీ॥ ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజ శ్చ వీర్యవాన్ ।
పురుజి త్కుంతిభోజ శ్చ శైబ్య శ్చ నరపుఙ్గవః ॥ ౫॥

గీ॥ యుధామన్యు శ్చ విక్రాంత ఉత్తమౌజా శ్చ వీర్యవాన్ ।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః ॥

పదవిభాగము:— అత్ర- శూరాః- మహేష్వాసాః- భీమార్జునసమాః- యుధి- యుయుధానః- విరాటః- చ- ద్రుపదః- చ- మహారథః ॥౪॥ ధృష్టకేతుః- చేకితానః- కాశీరాజః- చ- వీర్యవాన్- పురుజిత్- కుంతిభోజః- చ- శైబ్యః- చ- నరపుఙ్గవః ॥౫॥ యుధామన్యుః- చ- విక్రాంతః- ఉత్తమౌజాః- చ- వీర్యవాన్- సౌభద్రః- ద్రౌపదేయాః- చ- సర్వే- ఏవ-మహారథాః । ॥౬॥

ప్రతిపదార్థము:— అత్ర=శత్రుభూతమగు నీసైన్యమునందు; శూరాః=స్వయముగ భయములేక శస్త్రాస్త్రములందు నేర్పరులు; మహేష్వాసాః=గొప్పవిండ్లుకలవారు; యుధి=యుద్ధమునందు, భీమార్జున సమాః=ఎల్లరచేతను మహాపరాక్రమవంతులని కొనియాడబడుచున్న భీమార్జునులతో సమానమైనవారును గలరు; వారెవరనిన? యుయుధానః=(విశేషేణయుధ్యతీతి యుయుధానః) విశేషముగ యుద్ధముచేయుసాత్యకి; విరాటశ్చ=(శత్రూన్విశేషేణ రటయతీతి విరాటః) శత్రువులను విశేషముగ రోదనధ్వనిని చేయించు విరాటరాజును; మహారథః=మహారథికుడగు; ద్రుపదశ్చ= (ద్రుః వృక్షః; పదం ధ్వజే చిహ్నం యస్య స ద్రుపదః) వృక్షము ధ్వజమునందు చిహ్నముగాగల ద్రుపదరాజును. ॥౪॥

ధృష్టకేతుః=ధృష్టకేతువు; చేకితానః=చేకితానుడును; వీర్యవాన్=పరాక్రమవంతుడగు; కాశీరాజః= కాశీరాజును; పుజిత్=(యుద్ధే పురూ న్బహూ న్జయతీతి పురుజిత్) యుద్ధమునం దనేకులను జయించుపురజిన్మహారాజును; కుంతిభోజశ్చ=(కుంతితండ్రియగు) కుంతిభోజుడును; నరపుఙ్గవః=నరశ్రేష్ఠుడగు శైబ్యశ్చ=శైబ్యుడును ॥౫॥

విక్రాంతః=పరాక్రమముగల; యుధామన్యుశ్చ=యుధామన్యువును; వీర్యవాన్=పరాక్రమముగల; ఉత్తమౌజాశ్చ=ఉత్తమౌజస్కుడును, సౌభద్రః=అభిమన్యుడును; ద్రౌపదేయాశ్చ=ఉపపాండవులును; సర్వఏవ= వీరందరును; మహారథాః=మహారథికులు. ॥౪, ౫, ౬॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఈధర్మరాజాదుల సైన్యమునందు భీమార్జునులకు సరివచ్చువారు, పిరికిపందలు కానివారు; గొప్పవిలుకాండ్రగు యుయుధాన, విరాట. ద్రుపదాది మహారథికులు గలరు. కాన నీసైన్య మెంతమాత్రము పేక్షింపదగినది కాదు. ॥౪, ౫, ౬॥

—• ౧వ. అధ్యాయము ౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "ఒకద్రుపదపుత్రాధిష్ఠిత మగుటచేతనే యీసైన్య మజేయమని శంకింపవలదు. మనసేనలలో నొక్కొక్కడైనను జయింపసమర్థుడు" అని అందువేమో? అట్లు కాదు. మనప్రతిపక్ష సేనయందనేకులుమహారథులుయుద్ధమునందుభీమార్జునసములుకలరనివారలమహేశ్వైర్యంబెప్పుటకుపక్రమించెను.

భాష్యోత్కర్షదీపిక:— శత్రుసైన్యవిషయమై యనుపేక్షణీయత్వమును నిరూపించుటకు 'అత్రశూరాః' అని చెప్ప మొదలిడెను. ఇచ్చట 'మహారథః' అని ఏకవచన స్వారస్యముచే సన్నిహితుడగు ద్రుపదునకే విశేషణ మగును. ఇదేతీరున ముందు "సర్వ ఏవ మహారథాః" అని బహువచనస్వారస్యమున సాత్యకి మొదలగు వారలకు మహారథికత్వ మూహింపనగును.

గీ॥ అస్మాకం తు విశిష్టా యే తా న్నిబోధ ద్విజోత్తమ! ।
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తా న్బ్రవీమి తే ॥ ॥౭॥

పదవిభాగము:— అస్మాకం– తు– విశిష్టాః– యే– తాన్– నిబోధ– ద్విజోత్తమ!– నాయకాః– మమ– సైన్యస్య– సంజ్ఞార్థం– తాన్– బ్రవీమి– తే ।

ప్రతిపదార్థము:— హేద్విజోత్తమ=ఓబ్రాహ్మణోత్తమ; అస్మాకంతు= ఇక మనలో; యే=ఎవరు; విశిష్టాః=పరాక్రమాదిగుణమహత్తరులో; తాన్=వారలను; నిబోధ= తెలిసికొనుము; మమ=నాయొక్క; సైన్యస్య=సైన్యమునకు; యే=ఎవరు; నాయకాః=నాయకులో; తాన్=వారలను; తే=నీకొఱకు; సంజ్ఞార్థం=గుర్తుకొఱకు; బ్రవీమి=చెప్పెదను. ॥౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"ధర్మరాజాదుల బలము మహత్తరముగా నున్నదని తెలిసికొని భీతుడవైనట్లు పలుకుచుంటివి. అట్లేని నీయుద్ధము నందింత పట్టుదలయేల? ధర్మరాజాదులతో సంధిచేసుకొను" మని యాచార్యుని కభిప్రాయము గలదేమోయని దుర్యోధనుడు తనకు గలిగిన భయమును కప్పిపుచ్చి, తన ప్రౌఢిని వెలిబుచ్చుచు ద్రోణాచార్యున కిట్లు జెప్పఁదొడఁగెను

నీవు బ్రాహ్మణులలో నుత్తముడవు, త్రైవర్ణికులలో నీవు వృద్ధుడవు నగుటంజేసి నేను చెప్పబోవు విషయము నీకు దెలిసినను మన సైన్యమున నెవరు పరాక్రమశాలురో వారలను నీకొఱకు గుర్తునిమిత్తము చెప్పెదను తెలిసికొనుము.

సదానందీయము:— భీష్మపరిగణితు లగుటచే సాత్యకి, విరాట, ద్రుపదులకు "మహారథః" అను విశేషణము వర్తించును. ॥౬॥

—• ౧వ అధ్యాయము ౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

భాష్యోత్కర్షదీపిక:— అతిరథుడవగు నీకు మహారథులగు వీరల నందఱను జయించుట సులభమని తెలిసి యాచార్యునకుత్సాహము పుట్టించుటకు పరసైన్యమునం దతిరథులున్నను వారలనుగప్పిపుచ్చిమహారథికులజెప్పెను.

— ౧వ అధ్యాయము ౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు —

మధుసూదనసరస్వతీయము:— ఈసమృద్ధమగు పరసైన్యమును జూచి భయమునొందితివా? అట్లయిన వారితో సంధిని చేసికొనరాదా? అను నాచార్యాభిప్రాయము నాశంకించుకొని "అస్మాకంతు" అని చెప్ప నారంభించెను. ఇట 'తు' శబ్దముచే లోనగలిగిన భయమును గప్పిపుచ్చుకొనుటకు స్వీయధార్ష్ట్యమును వెలిబుచ్చెను. స్వకార్యమునందాచార్యాభిముఖ్యమును సంపాదించుటకు "ద్విజోత్తమ!" అని సంబోధించెను. ప్రియశిష్యులగు పాండవుల సైన్యమును జూచినతోడనే హర్షవ్యాకులితమానసుడవగు నీవు స్వీయవీరులనుమఱచి పోకుండుటకు నేనిట్లు చెప్పుచుంటినని తెల్పుటకు "సంజ్ఞార్థం" అనెను.

లేక దుర్యోధనునకు దౌష్ట్యమును నిరూపించెడి పక్షమున "బ్రాహ్మణుడ వగుటంజేసియుద్ధాకుశలుడవు గాన నీవు యుద్ధవిముఖుడవైనను భీష్మాదిక్షత్రియశ్రేష్ఠు లుండుటంజేసి నాకేమియు కొరతలేదని తెల్పుటకు "ద్విజోత్తమ" అని సంబోధించెను.

స్వాభిప్రాయము:— ఈశ్లోకమునకు ముందున్న "భవాన్భీష్మశ్చ" అను శ్లోకమున ప్రథమమున ద్రోణుని, తరువాత కృపాశ్వత్థామలను యుద్ధవిశారదులుగ బరిగణింపబోవు దుర్యోధనుఁడు దుష్టుఁడైనను రాజ

గీ॥ భవాన్భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః ।
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవ చ ॥ ౮ ॥

పదవిభాగము:— భవాన్‌- భీష్మః- చ- కర్ణః- చ- కృపః- చ- సమితింజయః- అశ్వత్థామా- వికర్ణః- చ- సౌమదత్తిః- తథా- ఏవ- చ । ॥౮॥

ప్రతిపదార్థము:— భవాన్‌=నీవును; భీష్మశ్చ=భీష్ముఁడును; కర్ణశ్చ=కర్ణుఁడును; కృపశ్చ=కృపాచార్యుఁడును; సమితింజయః=శత్రుసంఘమును జయించునట్టి; అశ్వత్థామా=అశ్వత్థామయు; వికర్ణశ్చ=వికర్ణుడును; తథైవ=అటులనే;=సౌమదత్తిశ్చ=భూరిశ్రవస్సును. ॥౮॥

గీ॥ అన్యేచ బహవ శ్శూరా మదర్థే త్యక్తజీవితాః ।
నానాశస్త్రప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః ॥ ౯ ॥

పదవిభాగము:— అన్యే- చ- బహవః- శూరాః- మదర్థే- త్యక్తజీవితాః- నానాశస్త్రప్రహరణాః- సర్వే- యుద్ధవిశారదాః । ॥౯॥

ప్రతిపదార్థము:— అన్యేచ=ఇతరులున్ను; బహవః=అనేకులు; శూరాః=శూరులు; మదర్థే=నానిమిత్తము; త్యక్తజీవితాః- త్యక్త=విడిచిపెట్టబడిన; జీవితాః=జీవనముకలవారు; సర్వే=అందరును; నానాశస్త్రప్రహరణాః=అనేకశస్త్రములు ప్రహరణసాధనములుగా గలవారు; యుద్ధవిశారదాః—=యుద్ధమునందు=నేర్పరులు.

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

తనభయము పోవుటకై దుర్యోధనుడు తనసైన్యమునందుఁగల మహావీరులను లెక్కింప మొదలిడెను. మనసైన్యమునఁ దమరు, భీష్ముడును, కర్ణుండును, అశ్వత్థామయు, వికర్ణుడును, భూరిశ్రవస్సుయు కలరు. ఇంతమాత్రమే కాదు ఇంక నసంఖ్యాకులగు శూరులు నానిమిత్తము ప్రాణత్యాగము సేయుటకు సిద్ధముగానున్నారు. వీరందఱు ననేక (శాస్త్రాస్త్ర) భిండివాలతోమరముసలముద్గరాదిప్రహరణసాధనములు గలవారు. ఎన్నిసాధనములున్నను వానిని వినియోగించు శక్తిలేనిచో యవియన్నియు నిష్ఫలములుకావా! యని శంకింపరాదు. వీరందరు యుద్ధమునం దారితేరినవారు. కాన మనకెంతమాత్రము భయము లేదు. ॥౮, ౯॥

---

శిష్యోపివుండగుటంజేసి "లేక" అని మొదలుకొని పైఁజూపినమధుసూదనసరస్వత్యభిప్రాయానుసారము "ద్విజోత్తమ" అని సంబోధించెననుట యుత్తరగ్రంథ విరుద్ధముగాన యుపేక్షణీయము.

తత్త్వప్రకాశిక:— "ద్విజోత్తమ" అనునది స్తుతిబోధకమైనను "నీవు యుద్ధమునుజేయునప్పో నీ బ్రాహ్మణోత్తమత్వము "బ్రాహ్మణో భోజనప్రియః" అను న్యాయానుసారము భోజనప్రియత్వ మాత్ర పర్యవసాయియే యగును" అను గూఢార్థమును ధ్వనింపఁజేయును.

—• ౧వ అధ్యాయము ౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పూర్వశ్లోకమునందుఁ జేసిన ప్రతిజ్ఞ ననుసరించి యీ శ్లోకమునందు ద్రోణ, భీష్మ, కర్ణ, కృపాచార్యులను దన సైన్యమునందు విశిష్టులుగను అశ్వత్థామ వికర్ణ భూరిశ్రవస్సులను నాయకులుగను నిరూపించెను. కర్ణానంతరస్వీయపరిగణనముచే కృపాచార్యుఁడు గోపగించునేమో యను భయమునఁ దన్నిరాసార్థము కృపాచార్యునకు "సమితింజయః" అను విశేషణమును విన్యసించెను.

భాష్యోత్కర్షదీపిక:— కర్ణపరిగణనానంతరము తమ్ము లెక్కించుటంచేసి కృపాశ్వత్థామలకుఁ గోపము రాకుండుటకై మధ్యమణిన్యాయముగ నిద్దరకు వర్తించునట్లు "సమితింజయః" అను విశేషణమును విన్యసించెను.

గీ॥ అపర్యాప్తం త దస్మాకం బలం భీష్మాభిరక్షితమ్ ।
పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితమ్ ॥

అయనేషు చ సర్వేషు యథాభాగ మవస్థితాః ।
భీష్మ మేవాభిరక్షన్తు భవన్త స్సర్వ ఏవ హి ॥ ॥౧౦, ౧౧॥

పదవిభాగము:— అపర్యాప్తం- తత్- అస్మాకం- బలం- భీష్మాభిరక్షితం- పర్యాప్తం- తు- ఇదం- ఏతేషాం- బలం- భీమాభిరక్షితం- అయనేషు- చ- సర్వేషు- యథాభాగం- అవస్థితాః- భీష్మం- ఏవ- అభిరక్షంతు- భవన్తః- సర్వే- ఏవ- హి । ॥౧౦, ౧౧॥

ప్రతిపదార్థము:— అస్మాకం=మనసంబంధమైన; తత్=పదునొకండక్షౌహిణులగు; బలం=సైన్యము; భీష్మాభిరక్షితం, భీష్మ=భీష్మునిచేత; అభిరక్షితం=రక్షింపఁబడినదై; పర్యాప్తం=శత్రువులను జయించుటయందు సమర్థమైయున్నది; ఏతేషాం=ఈధర్మరాజాదులయొక్క; ఇదం=ఈయేడు అక్షౌహిణుల సైన్యము; భీమాభిరక్షితం=భీమునిచే రక్షింపఁబడినదై; అపర్యాప్తం=మనలను జయించుటకు సమర్థము కాదు. లేక:- తత్=ఆ; అస్మాకం=మనసంబంధమగు; బలం=బలము; భీష్మాభిరక్షితం=భీష్మునిచేరక్షింపబడినదై, అపర్యాప్తం=అసంఖ్యాకమైనది, లేక పరులచేజయించుటకు శక్యమైనది కాదు. లేక పరులచే క్షోభపెట్టబడుటకుశక్యమైనది కాదు; ఏతేషాం=ఈపాండవులయొక్క; ఇదం=ఈ; బలం=బలము. భీమాభిరక్షితం=భీమునిచేరక్షింపఁబడినదై; పర్యాప్తం=ఏడక్షౌహిణుల మాత్రమే లేక మనలచే జయింపబడుటకు సమర్థమైనది, లేక మనసైన్యముచే క్షోభపెట్టఁబడుటకు సమర్థ మగుచున్నది. సర్వ ఏవ=సమస్తమైన; భవన్తో హి=తామందరు: సర్వేషు=సమస్తమైన; అయనేషు=అయనములయందు; (అనగా యుద్ధప్రారంభసమయమున ప్రధాన నాయకు లేయే స్థలములయం దుండవలెనో నాయాస్థలములయందు) యథాభాగం=ఎవరెవరికి యేయే స్థానములునియమితములో యాయా స్థానములయందు; అవస్థితాః=ఉన్నవారలై; భీష్మమేవ=భీష్మునినే; అభిరక్షన్తు=అంతటను రక్షింతురుగాక. ॥౧౦, ౧౧॥

---

—• ౧వ అధ్యాయము ౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "సింధురాజు, జయద్రథుఁడు మొదలగువారు కలరుగదా! వారు మాత్రము నాయకులుగారా? నీచే బూహ్యబరిగణితులగు వీరే నాయకులా?" అని యాచార్యుఁ డాశంకించునని యాయాశంకకుసమాధానముగ నీశ్లోకమును జెప్పుచున్నాడు. శల్య, కృతవర్మప్రభృతులు, నాప్రయోజనమునిమిత్తమై జీవితమునుగూడ విడచుటకు సిద్ధముగా నున్నారని భావము. "త్యక్తజీవితాః" అనుటచే దనయందు వారలకుఁ గల యనురాగము సూచింపబడెను. మఱియు నట్లే "నానాశస్త్రప్రహరణాః" "సర్వే యుద్ధ విశారదాః" అను విశేషణములచే తన సైన్యబాహుళ్యము, ఆసైన్యమునకు దనయందుగల భక్తి, వారి శౌర్యము, యుద్ధోద్యోగము, యుద్ధకౌశలము సూచింపఁబడెను.

భాష్యోత్కర్షదీపిక:—శత్రురాజులు "మహేష్వాసాః" గొప్పధనస్సులు గలవారు. అని పూర్వమందు జెప్పి స్వీయపక్షరాజులు "నానాశస్త్ర ప్రహరణాః" నానావిధములగు శస్త్ర, ఖడ్గాదులు, గదాదులు కలవారు యని చెప్పుటచే తనవారి యుత్కర్ష చూపబడెను.

గీ॥ తస్య సంజనయ న్హర్షం కురువృద్ధః పితామహః ।
సింహనాదం వినద్యోచ్చైః శ్శంఖం దధ్మౌ ప్రతాపవాన్ ॥ ॥౧౨॥

పదవిభాగము:— తస్య- సంజనయన్- హర్షం- కురువృద్ధః- పితామహః- సింహనాదం- వినద్య- ఉచ్చైః- శంఖం- దధ్మౌ- ప్రతాపవాన్ । ॥౧౨॥

ప్రతిపదార్థము:— ప్రతాపవాన్=ప్రతాపవంతుడును; పితామహః=తాతయు; కురువృద్ధః=కురువంశరాజులలో వృద్ధుడును నగు భీష్ముడు; తస్య=తాను ప్రభుడైనను ద్రోణాచార్యునిసమీపమునకేగి భీతుఁడై యేమేమో పలుకుచున్న దుర్యోధనునకు; హర్షం=సంతోషమును; శత్రువులను జయించుటచేఁదనకు ప్రాప్తించు

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మనబలము పదునొకొండక్షౌహిణులసైన్యము. ఉత్కృష్టమహిమగల సూక్ష్మబుద్ధియగు భీష్మునిచే రక్షింపఁబడుటచే ధర్మరాజాదులను జయించుటకు సమర్థమైనది.

ధర్మరాజాదుల బల మేడక్షౌహిణుల సైన్యము. స్వల్పమైనది. చపలబుద్ధిగల భీమునిచే రక్షింపబడుచున్నది గాన మనలను జయించుటకు సమర్థమైనది కాదు.

మనసైన్యము అసంఖ్యాకమైనది. మరియు యుద్ధమునం దతినైపుణ్యము, సూక్ష్మబుద్ధిగల భీష్మునిచే రక్షింపఁబడుచున్నది. కాన మనసైన్యమును జయించుటకు ధర్మరాజాదుల సైన్యము సమర్థమైనది కాదు. ధర్మరాజాదులసైన్య మల్పసంఖ్యాకము. పాండవులసైన్యము చపలబుద్ధియు, దుర్బలుడునగు భీమునిచే రక్షింపఁబడుచున్నది. కాన మనసైన్యము ధర్మరాజాదులసైన్యమును జయించుటకు సమర్థమైనది. ॥౧౦॥

మనసర్వసైన్యమున కధిపతి భీష్ముడు. కాన నాభీష్ముని రక్షించిన మనలను రక్షించుకొనినవారల మగుదుము. కావునఁ దామందఱు దత్తన్నియతస్థానములందుండి సేనాధిపతియై సేనామధ్యమున నున్న భీష్ముని రక్షింతురుగాక. ॥౧౧॥

---

—• ౧వ అధ్యాయము ౧౦ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "అస్మాభిః భీష్మః య త్పాండవసైన్యనివృత్త్యై అభిరక్షితః తత్ భీష్మాభిరక్షితం" మనలచే భీష్ముడే పాండవసైన్యనివృత్తికొఱకు రక్షింపఁబడుచుండునో అట్టి పాండవసైన్యము మనలను జయించుటకు సమర్థమైనది కాదు. "తైః భీమః య ద్ధార్తరాష్ట్రసైన్యనివృత్త్యై అభిరక్షితః తత్ భీమాభిరక్షితం" వారలచే నే మనసైన్యనివృత్తికొఱకు భీముఁడు పాండవులచే రక్షింపబడుచుండునో అట్టి మనసైన్యము వారలను పరిభవించుటకు సమర్థము. మనలను జయించుట కత్యంతదుర్బలహృదయుఁడగు భీముని రక్షించుచుండుటంజేసి పాండవసైన్యమునకు నే నెంతమాత్రము జంక నని యాశయము. అట్లైన నవకర్తవ్యశేష మున్నదని తెలుపుట కిట "తు" శబ్దము ప్రయోగింపఁబడెను.




శ్రీధరీయము:— "తత్" అట్టి వీరపురుషాధిష్ఠితమైనను, భీష్మాభిరక్షితమైనను మన బలము వారలను జయించుట కసమర్థమైనది. "ఇదంతు" ఈ యల్పసంఖ్యాకమగు వారిసైన్యము భీమాభిరక్షితమైనను మనలను జయించుటకు సమర్థమైనది. ఎట్లన? భీష్ముం డుభయపక్షపాతి గావునను, భీముఁ డేకపక్షపాతిగావునను ఇట్లు తోచుచున్నది. యని యభిప్రాయము. ॥౧౦॥

విజయము వలనఁగలుగు సంతోషమును;) సంజనయన్=పుట్టించుచు; ఉచ్చైః=గట్టిగ; సింహనాదం=సింహనాదమును; వినద్య=పలికి; శంఖం=శంఖమును; దధ్మౌ=పూరించెను. ॥౧౨॥

గీ॥ తత శ్శంఖా శ్చ భేర్య శ్చ పణవానకగోముఖాః ।
సహ సై వాభ్యహన్యన్త స శబ్ద స్తుములోఽభవత్ ॥
తత శ్శ్వేతై ర్హయై ర్యుక్తే మహతి స్యన్దనే స్థితౌ ।
మాధవః పాండవ శ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః ॥ ॥౧౩, ౧౪॥

పదవిభాగము:— తతః– శంఖాః– చ– భేర్యః– పణవానకగోముఖాః– సహసా– ఏవ– అభ్యహన్యన్త– సః– శబ్దః– తుములః– అభవత్ ।

తతః– శ్వేతైః– హయైః– యుక్తే– మహతి– స్యన్దనే– స్థితౌ– మాధవః– పాండవః– చ– ఏవ– దివ్యౌ– శంఖౌ– ప్రదధ్మతుః । ॥౧౩, ౧౪॥

ప్రతిపదార్థము:— తతః=భీష్మునిచే సింహనాదము, శంఖధ్వనిచేయబడినపిమ్మట; శంఖాశ్చ=శంఖములు; భేర్యశ్చ=భేరులు; పణవానకగోముఖాః=పణవములు, ఆనకములు గోముఖములనెడి వాద్యవిశేషములు; సహసైవ=శీఘ్రముగ; అభ్యహన్యన్త=మ్రోగింపబడెను; సః=అట్టి వాద్యవిశేషములనుండి బుట్టిన;శబ్దః=శబ్దము; తుములః=సంకులమై; (అనగా ధర్మరాజాదుల సైన్యమునకు భయముచేయునదై;) అభవత్=అయెను. ॥౧౩॥

తతః=దుర్యోధనుని సైన్యమునఁదిట్టి గొప్పశబ్దము బయలువెడలిన పిమ్మట; మాధవః=శ్రీకృష్ణపరమాత్మయు; పాండవః=అర్జునుడును; శ్వేతైః=తెల్లనైన; హయైః=గుర్రములచే; యుక్తే=కూడిన; మహతి=గొప్ప; స్యందనే=రథమునందు; స్థితౌ=ఉన్నవారై; దివ్యౌ=దివ్యములగు; శంఖౌ=శంఖములను; ప్రదధ్మతుః=పూరించిరి. ॥౧౪॥

శాంకరభాష్యతత్త్వబోధి:—

ఇవ్విధమున భీతుఁడై ద్రోణాచార్యునివద్దనేమేమో మాటలాడుచున్న దుర్యోధనునకుఁ బ్రతాపశాలియు, కురువృద్ధుడును, తాతయు నగు భీష్ముఁడు శత్రువులను జయించి సంతోషింపఁజేయుటకై గట్టిగ సింహనాదమును జేసి శంఖమును పూరించెను. ॥౧౨॥

—• ౧వ అధ్యాయము ౧౨వ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "దుర్యోధనుఁడు స్తుతించుగాక, లేక, నిందించుగాక వీరినిమిత్తమీశరీరత్యాగ మావశ్యకర్తవ్యముకదా" యని యూహించి భీష్ముఁ డాదుర్యోధనున కుత్సాహజనకమగు నట్లు సింహనాదమును జేసి శంఖమును పూరించెనని యాశయము. ఇట దుర్యోధనుఁడు పరసైన్యనిరీక్షణముచే భీతిలుటను, అవిధముగ భయభ్రాంతుడగు దుర్యోధనుని విషయమై యాచార్యుఁ డుపేక్షించుటను గమనించెనని దెల్పుటకు "కురువృద్ధః" అనియు, అట్టి దుర్యోధనుని విషయమై యుపేక్షింపలేదని దెల్పుటకు 'పితామహః' అనియు శత్రుభయంకరమగు నట్లు సింహనాదమును జేసెనని తెల్పుటకు "ప్రతాపవాన్" అనియు భీష్మునకు విశేషణత్రయవిన్యాసము చేయఁబడెను.

భాష్యతత్త్వదీపిక:— "భీష్మునే మీరందరు ప్రధానముగా రక్షింపవలెను. ఆయనను రక్షించినచో మీరందరు సురక్షితులై యుండగలరు" అని దుర్యోధనుడు చెప్పినతోడనే ద్రోణాచార్యులు భీష్మునికంటె దన యప్రాధాన్యమును దెలిసికొని తూష్ణీంభూతుడయ్యెను. అట్టి ద్రోణుని గని ఖిన్నుడైనట్టియు తనయందత్యంతము భక్తియుక్తుడైన దుర్యోధనుని జూచి భీష్ముడు దుర్యోధనహర్షోత్పాదనార్థమై ప్రవర్తించెనని చెప్పుట కీశ్లోకము జెప్పుచున్నాడు. ॥౧౨॥

గీ॥ పాఞ్చజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః ।
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః ॥ ॥౧౫॥

పదవిభాగము:— పాంచజన్యం- హృషీకేశః- దేవదత్తం- ధనంజయః- పౌండ్రం- దధ్మౌ- మహాశంఖం- భీమకర్మా- వృకోదరః ॥

ప్రతిపదార్థము:—హృషీకేశః=మాయకు ప్రభువగు శ్రీకృష్ణపరమాత్మ; పాఞ్చజన్యం=పాంచజన్యమను శంఖమును; ధనంజయః=దిగ్విజయసమయమున సకలదేశాధీశ్వరులను జయించి ధనంజయుడను పేరునుబడసిన యర్జునుడు; దేవదత్తం=దేవదత్తమను శంఖమును, భీమకర్మా=యుద్ధమునందు భయంకరమగు కర్మను జేయునట్టియు, వృకోదరః=అంగుష్టప్రమాణముగల జఠరాగ్నికలభీముడు; పౌండ్రం=పౌండ్రమనుపేరుగల, మహాశంఖం=గొప్పశంఖమును, దధ్మౌ=పూరించెను. ॥౧౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

దుర్యోధను నభిప్రాయము దెలిసికొని దుర్యోధనునకుఁ గలిగిన భయముతొలఁగి సంతోషము గలుగుటకు భీష్ముఁడు చేసిన సింహనాదమును, శంఖధ్వనిని విని దుర్యోధనపక్షీయులగు రాజులు శత్రువులకు భయము కలుగునటుల భేరులు మొదలుగాగల వాద్యవిశేషములను మోగించిరి. వానివలన శత్రుభయంకరమగు మహాశబ్దము బయలువెడలెను. కాని పాండవులు కొంచెమైనను క్షోభించలేదు.

ఇవ్విధమున దుర్యోధనసైన్యమునందు గలిగిన ప్రవృత్తినిజూచి కేశవార్జును లతిబలపరాక్రమములుగల శ్వేతాశ్వములు కట్టిన రథమునగూర్చుండి తమదివ్యశంఖములను పూరించిరి. ॥౧౪॥

శ్రీకృష్ణపరమాత్మ తన పాంచజన్యమును, అర్జునుడు తన దేవత్తమును, భీముడు తన పౌండ్రమను శంఖమును పూరించెను. ॥౧౫॥

—• ౧వ అధ్యాయము ౧౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇతరులుఁగూడ రథస్థులైనను కృష్ణార్జునుల రథోత్కర్షను సూచించుటకు ప్రత్యేకముగ "శ్వేతైర్హయై ర్యుక్తే" ఇత్యాదికముచే కృష్ణార్జునులకు రథస్థత్వమును జెప్పెను. అగ్నిదత్తరథస్థులగు కృష్ణార్జును లజేయులని యాశయము.

భాష్యోత్కర్షదీపిక:— ఈశ్లోకపూర్వార్థముచే ధార్తరాష్ట్రుల తుములశబ్దాకర్ణనానంతరము కృష్ణార్జునులు భయప్రచలితులు కాలేదని సూచింపబడెను. ఇట 'మాధవః' అనుటచే "లక్ష్మీవల్లభుడగు శ్రీకృష్ణపరమాత్మ తన శంఖారావముచేతనే నీపుత్రుల రాజ్యలక్ష్మిని గైకొనె" నని సూచితమయ్యెను. "పాండవః" అనుటచే "పాండురాజు రాజ్యము పాండవులకే సంక్రమించు" నని సూచితమయ్యెను. ॥౧౪॥

౧వ అధ్యాయము— ౧౫-౧౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు.

మధుసూదనసరస్వతీయము:— శత్రుసైన్యమునందు బ్రసిద్ధములైన శంఖములు కలవు. నీవారల సైన్యమునం దొక్కనికైన నట్టి శంఖము లేదు." అని పాండవుల యుత్కర్షను సూచించుటకు తత్తన్నామనిర్దేశపురస్సరముగ పాండవుల శంఖములను పేర్కొనెను.

"సర్వేంద్రియప్రేరకుడగు పరమాత్మ వారలకు సహాయకారి" అని సూచించుటకు "హృషీకేశః" (ఇంద్రియములకు ప్రభువు) అను శబ్ద ముపయోగింపబడెను.

గీ॥ అనంతవిజయం రాజా కుస్తీపుత్రో యుధిష్ఠిరః ।
నకుల స్సహదేవ శ్చ సుఘోషమణిపుష్పకౌ ॥ ॥౧౬॥

పదవిభాగము:— అనంతవిజయం– రాజా– కుంతీపుత్రః– యుధిష్ఠిరః– నకులః– సహదేవః– చ– సుఘోషమణిపుష్పకౌ ।

ప్రతిపదార్థము:— రాజా=ప్రభువగు, కుస్తీపుత్రః=కుంతికుమారుడగు; యుధిష్ఠిరః=ధర్మరాజు; అనన్తవిజయం=అనంతవిజయమను పేరిశంఖమును; నకులః=నకులుడును; సహదేవశ్చ—సహదేవుడును, సుఘోషమణిపుష్పకౌ= సుఘోషము,మణిపుష్పకముననెడి శంఖములను; ప్రదధ్మతుః=పూరించిరి. ॥౧౬॥

గీ॥ కాశ్య శ్చ పరమేష్వాస శ్శిఖండీ చ మహారథః ।
ధృష్టద్యుమ్నో విరాట శ్చ సాత్యకి శ్చాపరాజితః ॥ ॥౧౭॥
ద్రుపదో ద్రౌపదేయా శ్చ సర్వశః పృథివీపతే ।
సౌభద్ర శ్చ మహాబాహు శ్శంఖా న్దధ్ముః పృథక్పృథక్ ॥ ॥౧౮॥

పదవిభాగము:— కాశ్యః– చ– పరమేష్వాసః– శిఖండీ– చ– మహారథః– ధృష్టద్యుమ్నః– విరాటః– చ– సాత్యకిః– చ– అపరాజితః । ॥౧౭॥

ద్రుపదః– ద్రౌపదేయాః– చ– సర్వశః– పృథివీపతే– సౌభద్రః– చ– మహాబాహుః– శంఖాన్– దధ్ముః– పృథక్– పృథక్ ।

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కృష్ణార్జునాదుల ప్రవృత్తిని దెలిసికొని పరిపాలనావకాశమిదియేయని ప్రభువగు ధర్మరాజు అనంతవిజయశంఖమును, నకులుడు సుఘోషముపేరి శంఖమును, సహదేవుడు మణిపుష్పకముపేరి శంఖమును పూరించిరి. ॥౧౬॥

---

"దిగ్విజయమందు సమస్తరాజలోకమును జయించి భూరిధనమును సేకరించిన వాఁడగుటచే నర్జునుఁడజేయుడని సూచించుటకు "ధనంజయః" అను పద ముపయోగింపబడెను.

"హిడింబవధాదిభీకర కార్యకారియగు భీముడు మహాబలిష్ఠు" డని సూచించుటకు "భీమకర్మా" అని చెప్పబడెను.

"గొప్పతపస్సుచే ధర్మునివలన కుంతికి లభించినట్టియు, స్వయముగ రాజసూయయాగకర్త యగుటచే ముఖ్యముగ రాజగు ధర్ముడే యుద్ధమునందు జయమును బొందువాడై స్థిరుడగు" నని సూచించుటకు "రాజా కుస్తీపుత్రో యుధిష్ఠిరః" అని చెప్పబడెను.

భాష్యోత్కర్ష దీపిక:— "సర్వేంద్రియములకు ప్రభువగుటంజేసి శ్రీకృష్ణపరమాత్మ పాండవుల యింద్రియములకు బలప్రదాతయు, ధార్తరాష్ట్రాదుల యింద్రియముల బలమును హరించువాడగు" ననియు సూచించుటకు 'హృషీకేశః' అను పద ముపయోగింపబడెను.

"అతిరౌద్రమగు దుశ్శాసన రక్తపానాదులయందు సమర్థుడగు భీమసేనుడు త్రాగిన యారక్తమును తన వృకప్రమాణమగు నౌదరాగ్నిచే జీర్ణము చేసికొనగలుగు" నని సూచించుటకు "భీమకర్మా వృకోదరః" అను పదముల నుపయోగించెను. ॥౧౫, ౧౬॥

ప్రతిపదార్థము:— హేపృథివీపతే=భూమికిప్రభువగు ఓధృతరాష్ట్రుడా!; పరమేష్వాసః=గొప్ప ధనుస్సుగల; కాశ్యశ్చ=కాశీరాజును; మహారథః=మహారథికుడగు; శిఖండీచ=శిఖండియు; ధృష్టద్యుమ్నః=ధృష్టద్యుమ్నుడును; విరాటశ్చ=విరాటరాజును; అపరాజితః=యుద్ధమునందు పరాజితుడు కానట్టి, సాత్యకిశ్చ=సాత్యకియు, ద్రుపదః=ద్రుపదమహారాజును; ద్రౌపదేయాశ్చ=ద్రౌపదికుమారులగుఉపపాండవులును; మహాబాహుః=గొప్పబాహువులుగల; సౌభద్రః=సుభద్రకుమారుండగు అభిమన్యుడును; పృథక్పృథక్=వేర్వేరుగా; సర్వశః=అంతటను; శంఖాన్=శంఖములను, దధ్ముః=పూరించిరి. ॥౧౭-౧౮॥

గీ॥ స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్ ।
నభశ్చ పృథివీం చైవ తుములోఽభ్యనునాదయన్ ॥ ॥౧౯॥

గీ॥ అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః ।
ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాండవః ॥ ॥౨౦॥
హృషీకేశం తదా వాక్య మిద మాహ మహీపతే ।
సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత ॥ ॥౨౧॥

పదవిభాగము:— సః-ఘోషః-ధార్తరాష్ట్రాణాం-హృదయాని-వ్యదారయత్-నభః-చ-పృథివీం-చ-ఏవ-తుములః-అభ్యనునాదయన్ ॥౧౯॥ అథ-వ్యవస్థితాన్-దృష్ట్వా-ధార్తరాష్ట్రాన్-కపిధ్వజః-ప్రవృత్తే-శస్త్రసంపాతే-ధనుః-ఉద్యమ్య-పాండవః ॥౨౦॥ హృషీకేశం-తదా-వాక్యం-ఇదం-ఆహ-మహీపతే-సేనయోః-ఉభయోః-మధ్యే-రథం-స్థాపయ-మే-అచ్యుత । ॥౨౧॥

ప్రతిపదార్థము:— సః=ధర్మరాజాదులచే నొనర్పబడిన; తుములః=సంకులమైన; ఘోషః=ఆశంఖధ్వని; నభశ్చ=అంతరిక్షమును; పృథివీంచైవ=భూలోకమును; (అనగా) ముల్లోకములను; అభ్యనునాదయన్=ప్రతిధ్వనింపజేయుచు; ధార్తరాష్ట్రాణాం=దుర్యోధనాదులయొక్క; హృదయాని=అంతఃకరణములను; వ్యదారయత్=వ్రయ్యలుచేసెను. ॥౧౯॥

అథ=ఇవ్విధమున శంఖశబ్దము బయలువెడలినపిమ్మట; హేమహీపతే!=ఓ ప్రభువగు ధృతరాష్ట్రుడా; కపిధ్వజః=జండాపైఁగపిరాజుగల; పాండవః=అర్జునుడు; వ్యవస్థితాన్=ఎదుటనిలిచియున్న; ధార్తరాష్ట్రాన్=దుర్యోధనాదులను; దృష్ట్వా=చూచి; శస్త్రసంపాతే=బాణపాతము; ప్రవృత్తేసతి=సిద్ధముగానుండగా, తదా=అత్తరి; ధనుః=గాండీవమును; ఉద్యమ్య=ఎత్తి; హృషీకేశం=మాయకు ప్రభువగు శ్రీకృష్ణపరమాత్మనుగూర్చి; ఇదం=ఈ; వాక్యం=వాక్యమును; ఆహ=పలికెను. ॥౨౦॥

హేఅచ్యుత!=ఓశ్రీకృష్ణుడా!; మే=నా సంబంధమగు; రథం=రథమును; ఉభయోః=రెండయిన; సేనయోః=సేనలయొక్క; మధ్యే=మధ్యయందు; స్థాపయ=నిలుపుము. ॥౨౧॥

---

శాంకరభాష్యతత్త్వబోధని:—

పైన జెప్పబడిన వారలే గాక యితరులగు తత్పక్షీయులగు రాజులకైకమత్యముగలదు. కాన ఓధృతరాష్ట్రుడా! నీ దురాశను వదలుకొనుమని సూచనఁ జేయుచు సంజయుడు ధృతరాష్ట్రునిగూర్చి యిట్లుపలికెను. ఓప్రభూ! వీరలేగాక శత్రువులకు మార్కొనరాని గొప్ప ధనుస్సుగల కాశీరాజును, మహారథికుఁడగు శిఖండియు (శిఖండంశ్మశ్రుశూన్యతా) (మీసములేని వాడు) ధృష్టద్యుమ్నుడును, విరాటుఁడును, యుద్ధమునం దజేయుఁడగు సాత్యకియు, ద్రుపద మహారాజును; ఉపపాండవులును, అభిమన్యుఁడు మొదలగు వారలందరును తమ శంఖములను పూరించిరి. ॥౧౭, ౧౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ధర్మజుని సైన్యమొనర్చిన శంఖధ్వని ముల్లోకములను మార్మోగించుచు దుర్యోధనాదుల హృదయములను బ్రద్దలుజేసెను.

అట్టి శంఖధ్వనిని వినినతోడనే ముల్లోకములు బెదరి బెదరి గగ్గోలు పొందెనన దుర్యోధనాదుల హృదయములు జెదరిపోవుట యక్కజము (ఆశ్చర్యము) కాదు. ॥౧౯॥

ఓ ధృతరాష్ట్రుడా! కపిధ్వజుఁడగు యర్జునుని శంఖధ్వని హృదయవిదారకమగుటచేఁ గడుంగడు భయపడి నీపుత్రులు యుద్ధమును వదలి పారిపోవలసియుండెను. అట్లుగాక ధైర్యముతో యుద్ధము చేయుటకునెదుటనిలచిన నీకుమరులగు దుర్యోధనాదులనుజూచి శస్త్రాస్త్రప్రయోగమునకు సిద్ధపడి గాండివమెత్తి యర్జునుడు శ్రీకృష్ణపరమాత్మను గాంచి యొకవాక్యమును బలికెను. ॥౨౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

స్వరూపమువలన నెన్నడును నాశనములేని యో శ్రీకృష్ణ! నారథము నుభయసేనల మధ్య నిలుపుమని యర్జునుడు పలికెను. పరమేశ్వరుఁడు భక్తవశుఁడు భక్తుల నియోగము నవశ్యము జేయువాడగు పరమేశ్వరుఁడుండ భక్తుల కశక్యమైన దేమిఁకలదు! కాన నర్జునుఁడిట్టి సారథ్యమునందు శ్రీకృష్ణుని నియోగించుట సమంజసమే. ॥౨౧॥

—• ౧వ అధ్యాయము ౨౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

శంకరానందీయము:—"తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే... సస్యమివ మర్త్యః పచ్యతే। సస్యమివాజాయతే పునః, అష్టాదశోక్త మవరం యేషు కర్మ। ఏతచ్ఛ్రేయో యేఽభినందన్తి మూఢా జరామృత్యుం పునరేవాపియన్తి, శ్వో భావా మర్త్యస్య యదన్తకైతత్, పరాచః కామా ననుయన్తి బాలాః కర్మణా పితృలోకో విద్యయా దేవలోకః. అంధం తమః ప్రవిశన్తి యేఽవిద్యా ముపాసతే। తతో భూయ ఇవ తే తమో య ఉ విద్యాయాగ్ం రతాః" ఈ మొదలగు శ్రుతులచేతను, "జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ. మోఘాశా మోఘకర్మాణః, క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి" ఈ మొదలగు స్మృతులచేతను "ఏది పుట్టునో యది గిట్టును" "ఏది చూడఁబడునో యది నశించును" అను యుక్తులచేతను మోక్షమునే యర్థించు పండితుడు తా నారాధించు దేవతలను, దేవతోద్దేశముగఁ జేయఁబడు కర్మలను, ఆకర్మల ఫలమును విచారింపవలయును. కాన: పరమార్థియగు యర్జుననకు కర్తవ్యమును, యుద్ధయోగ్యతను, యుద్ధము జేసెడివారల యొక్క విచారమును, యుద్ధముయొక్క విచారమును, యుద్ధమువలన బ్రాప్తించెడి ఫలముయొక్క విచారమును, అట్టి విమర్శనమువలన కలిగెడి వైరాగ్యమును ప్రతిపాదించుటకు "అథ వ్యవస్థితాన్ దృష్ట్వా" అను శ్లోకము మొదలుకొని ప్రకరణ మారంభింపబడెను. ॥౨౦॥

—• ౧వ అధ్యాయము ౨౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "నే నీరథము నాపుదమన్నను శత్రువులు శస్త్రాస్త్రప్రహరణములచే న న్నీరథమునుండి క్రిందికి బడవ్రోయుదు రందు కేమందువు?" అని శ్రీకృష్ణుఁ డాశంకించు నని యూహించి "దేశకాలవస్తువులయందు చ్యుతిరహితుఁడ వగు నిన్నీరథమునుండి యెవడును క్రిందికిఁద్రోయజాల" డని సూచించుటకు "అచ్యుత!" అని సంబోధించెను. "ధర్మరాజాదులు విమర్శించి చేయువారలు కాన: నీతిధర్మకుశలులు. విమర్శింపక నీవు వారి రాజ్యమునపహరించితివి. కాన జయము వారలకే ప్రాప్తించును కాని నీతిధర్మదూరమగు మహీపతిత్వముకల నీకు ప్రాప్తింపనేరదు." అని సూచించుటకు "మహీపతే" అని సంబోధించెను.

గీ॥ యావ దేతా న్నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్ ।
కై ర్మయా సహ యోద్ధవ్య మస్మి న్రణసముద్యమే ॥ ॥౨౨॥
యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః ।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః ॥ ॥౨౩॥

పదవిభాగము:— యావత్- ఏతాన్- నిరీక్షే- అహం- యోద్ధుకామాన్- అవస్థితాన్- కైః- మయా- సహ- యోద్ధవ్యం- అస్మిన్- రణసముద్యమే । ॥౨౨॥

ప్రతిపదార్థము:— ఏతాన్=ఈశత్రుపక్షమందున్న; యోద్ధుకామాన్=యుద్ధముచేయుటకు కోరికగల; అవస్థితాన్=ఎదురుగా నిలిచియున్న భీష్మద్రోణాదులను; యావత్=ఏప్రదేశమందుండి; అహం=నేను; నిరీక్షే= చూడఁగలనో ఆట్టిప్రదేశమునందు నారథమునునిలుపుము, అని పూర్వశ్లోకముతో సమన్వయము; అస్మిన్=ఈ;రణ సముద్యమే=యుద్ధప్రారంభమునందు;కైస్సహ=ఎవరితో;మయా=నాచేత;యోద్ధవ్యం=యుద్ధముచేయఁదగినది.

పదవిభాగము:— యోత్స్యమానాన్- అవేక్షే- అహం- యే- ఏతే- అత్ర- సమాగతాః- ధార్తరాష్ట్రస్య- దుర్బుద్ధేః- యుద్ధే- ప్రియచికీర్షవః । ॥౨౩॥

ప్రతిపదార్థము:— దుర్బుద్ధేః=తన రక్షణోపాయమును గుర్తెరుంగనట్టి; ధార్తరాష్ట్రస్య=ధృతరాష్ట్రుని కుమారుఁడగు దుర్యోధనునకు; యుద్ధే=యుద్ధమునందు: ప్రియచికీర్షవః=ప్రియమును జేయ నిచ్ఛగలవారలై; యే ఏతే=ఏఈరాజులు; అత్ర=ఈయుద్ధభూమియందు; సమాగతాః=కలిసికొనిరో; యోత్స్యమానాన్=యుద్ధముచేయుట కిచ్ఛగలవారలను; అహం=నేను; నిరీక్షే=చూడగలను. ॥౨౩॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

దుర్యోధనపక్షమున యుద్ధము చేయఁగోరి వచ్చి ఎదుట నిలచియున్న భీష్మద్రోణాదులను జూడఁగల ప్రదేశమున రథమును నిలుపుము ఈ యుద్ధప్రారంభమున ననేకరాజులు యుద్ధభూమియందు నిలిచియుండిరి. నాగమనమున కెచ్చటను అడ్డులేదు. కాన: వీరలలో నెవరితో నేను యుద్ధముచేయవలెను? ఎవరును యిచట నాతో యుద్ధము చేయదగినవారు కానరారు. ॥౨౨॥

యుద్ధముచేయుటకు దగినవారీ యుద్ధభూమినిఁ గానరారనిఁ బలికితివి. అట్టి ప్రతిపక్షులు లేనప్పుడు యుద్ధమునం దౌత్సుక్యము నిష్ఫలము కాదా యని శంకింప

---

భాష్యోత్కర్షదీపిక:— "వాక్ప్రవర్తకుడగు శ్రీకృష్ణునిచే బ్రేరేపితుడై యర్జునుఁడు పల్కె" నని తెల్పుటకు "హృషీకేశం" (ఇంద్రియములకు ప్రభువు) అని చెప్పఁబడెను. "బలహీనులు, బుద్ధిహీనులు నగు మీచే కపటముగ నార్జింపఁబడిన మహీపతిత్వము, మహాశూరులు, దైవానుగ్రహవంతులు, బుద్ధిమంతులు. నగు పాండవులకే ప్రాప్తించును. కాన: నిట్టి రాజ్యలోభమును వదలుకొను" మని సూచించుటకు సోల్లుంఠనముగ 'మహీపతే' అని సంబోధించెను.

"నేను రథము నాపినను శత్రువులు నిలువనీయరుకదా! అందు కేమందువు?" అను శ్రీకృష్ణభగవానుని ప్రశ్న నాశంకించుకొని "చ్యుతిరహితుడ వగు నీవీరథమునుగూడ నచలముగ జేయసమర్థుడవే" అని సూచించుటకు 'అచ్యుత' అని సంబోధించెను. పరమేశ్వరుడు గూడ ప్రాకృతునివలె యెవరికి సారథి యయ్యెనో యట్టి యర్జునునకు విజయము ప్రాప్తించుననిన యాశ్చర్యమేమి యని యాశయము. ॥౨౧॥

—• ౧వ అధ్యాయము ౨౨వ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— నేను చేసెడి యుద్ధమున కెవరు ప్రతియోగులు? ఎవరు చేసెడి

గీ॥ సంజయ ఉవాచ:—

ఏవ ముక్తో హృషీకేశో గుడాకేశేన భారత!।
సేనయో రుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్ ॥ ॥౨౪॥
భీష్మద్రోణప్రముఖత స్సర్వేషాం చ మహీక్షితామ్ ।
ఉవాచ పార్థ! పశ్యైతా న్సమవేతా న్కురూ నితి ॥ ॥౨౫॥

పదవిభాగము:— సంజయః- ఉవాచ । ఏవం- ఉక్తః- హృషీకేశః- గుడాకేశేన- భారత- సేనయోః- ఉభయోః-మధ్యే- స్థాపయిత్వా- రథోత్తమం ॥౨౪॥ భీష్మద్రోణప్రముఖతః- సర్వేషాం- చ- మహీక్షితాం- ఉవాచ- పార్థ- పశ్య- ఏతాన్- సమవేతాన్- కురూన్- ఇతి ॥౨౫॥

ప్రతిపదార్థము:— సంజయః=సంజయుడు; ఉవాచ=పలికెను; హేభారత!=భరతవంశమునందు జనించిన ఓధృతరాష్ట్రుడా!; గుడాకేశేన=(అంగుష్ఠతర్జనుల మధ్యభాగముచేఁగొలువదగినకేశపాశముగల) అర్జునునిచే; హృషీకేశః=శ్రీకృష్ణపరమాత్మ; ఏవం=ఈరీతిగ; ఉక్తః=పలుకబడినవాడై; ఉభయోః=రెండగు; సేనయోః=సేనలయొక్క; మధ్యే=మధ్యయందు భీష్మద్రోణప్రముఖతః=భీష్మద్రోణాచార్యులయెదుట; సర్వేషాం=సమస్తమైన; మహీక్షితాం=రాజులయొక్క; (అంతికేఅనుపద మధ్యాహార్యము) అంతికె=సమీపమునందు;రథోత్తమం=శ్రేష్ఠమగు రథమును; స్థాపయిత్వా=నిలిపి;

హేపార్థ!= ఓఅర్జునుడా; సమవేతాన్=కలిసియున్న; ఏతాన్= శత్రువులగు; కురూన్=కురువంశమునందు జనించిన దుర్యోధనాదులను, పశ్య=చూడుము, ఇతి=ఈవిధముగ, ఉవాచ=పలికెను. ॥౨౪, ౨౫॥

---

రాదు. తనరక్షణోపాయమును గూడ గుర్తెరుగని దుర్యోధనునకు బ్రియముఁ గూర్పదలచి యీ యుద్ధభూమియందు నిలిచి యుద్ధమునకుఁ దగు ప్రహారణోపాయములతో సన్నద్ధులై యున్న వీరలను చూచెదను. అనఁగా ప్రత్యేకవ్యక్తి ప్రతిపక్షిగ లేకున్నను సంఘము నాయుద్ధోత్సుక్యమును సార్థకము జేయును. అట్టి సంఘము పూర్వవైరము లేక, యెట్లు సంభవించునన్న బూర్వవైరము గల దుర్బుద్ధి యగు దుర్యోధనునకు యుద్ధమునందు సహాయ మొనర్చుట మూలమున సంభవించును. ॥౨౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:- "ఇట్లర్జునునిచే బ్రేరితుడగు శ్రీకృష్ణపరమాత్మ యహింసారూప

---

యుద్ధమునకు నేను ప్రతియోగినగుదును. ఈవిషయమును తెలిసికొనుటయే యీరథస్థాపనమునకు బ్రయోజన మని యర్థము. ॥౨_౨॥

—• ౧వ అధ్యాయము— ౨౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు. •—

భాష్యోత్కర్షదీపిక:— దుష్టబుద్ధియగు దుర్యోధనున కీయుద్ధమునందు తాము సమర్థులు కాకపోయినను నెవరు మేలును కూర్పనిచ్ఛగించిరో వారిని చూచెదనని యర్థము. ఇట "ధార్తరాష్ట్రస్య" అనుటచే ధృతరాష్ట్రుని కుమారులగు దుర్యోధనాదులేగాక ధృతరాష్ట్రుడుగూడ దుర్బుద్ధి కలవాడెయని సూచింపబడెను. ॥౨౩॥

## ౧వ అధ్యాయము— ౨౪-౨౫ శ్లోకవ్యాఖ్యావిశేషములు.

మధుసూదనసరస్వతీయము:— "భరతవంశమర్యాదను జూచియైన జ్ఞాతులవిషయమై ద్రోహచింతను మాను" మని సూచించుటకు సంజయుడు ధృతరాష్ట్రుని "భారత" అని సంబోధించెను.

ధర్మము నాశ్రయించి శతవిధముల నర్జునుని యుద్ధమునుండి విరతుని జేయగలడు. అట్లేని యుద్ధప్రసక్తి లేకయే నాకుమారులకు రాజ్యము లభింపగలదు." అను ధృతరాష్ట్రుని దురభిప్రాయమును తొలగింపదలచి సంజయుడు ధృతరాష్ట్రునితో నిట్లనియె.

భూభారహరణార్థము ప్రవృత్తుడైన శ్రీకృష్ణపరమాత్మ యర్జునుని యభిప్రాయమును తెలుసుకొనినపిమ్మట తన యభీష్టమును నెరవేర్చుకొనదలచి యర్జునుని వాక్యము ననుసరించి తనయభిప్రాయానుసార ముభయసేనలమధ్యకు రథమును బోనిచ్చి భీష్మాదులగు సర్వరాజన్యుల యెదుట నిలిపి ఓయర్జున! ఈసైన్యమున శస్త్రాస్త్రసంపన్నులగు నీరాజు లుపేక్షింప దగినవారు కారు. కానసారథ్యమున నామనస్సును ఖేదపెట్టక యెవరెవరితో నీకు యుద్ధము చేయవలయునని కోరికగలదో వారలను చూచుకొనుము. ॥౨౪-౨౫॥

"గుడాకాయాః=నిద్రాయాః, ఈశః, గుడాకేశః" (నిద్రను జయించినవాడు) "హృషీకేశః" అందరి యొక్క నిగూఢాభిప్రాయమును తెలిసికొనువా డగుటచే శ్రీకృష్ణుం డర్జునుని శోకమోహముల నెలిసికొనియే పలికె నని యభిప్రాయము.

"పార్థ!" అనుటచే గుంతికి శోకమోహములు స్త్రీస్వభావసిద్ధములు, కాన: నా మేనత్తకుమారుడవగుటచే నవి నీకుంగూడ ప్రాప్తించెననియు, "నా మేనత్తకొమరుడవగు నీకు నేను సారథ్యము జేయుచుండ నీకేమి కొదువ? కాన నిశ్చితబుద్ధితో నిశ్శంకగ వీరలను చూడు" మనియు, సూచితమయ్యెను.

శంకరానందీయము:— "గుడో గోళేక్షుపాకయోః" అను కోశానుసారము గుడమన గోళమని యర్థము. గుడం=బ్రహ్మాండగోళం, + అకతి=వ్యాప్నోతీతిగుడాకః సఈశః యస్యసగుడాకేశః" ఎవనికి బ్రహ్మాండగోళమంతటను "విశ్వస్యైకం పరివేష్టితారం జ్ఞాత్వాశివం" అను శ్రుత్యుక్తరీతిని వ్యాపించియున్న పరమశివుడు పాశుపతాస్త్రప్రదానరూపమున రక్షకుడో యట్టియర్జునుండు గుడాకేశు డనబడును. లేక, "రసోవైసః" అను శ్రుత్యుక్తరీతిని బెల్లమువలె మధురమై భక్తులను పొందువాడగు శివుడు రక్షకుడుగా గలవాడగుటంజేసి యర్జునుడు గుడాకేశు డనబడును.

భాష్యోత్కర్షదీపిక:— ఎవని యాజ్ఞ ననుసరించి పరమేశ్వరుడగు శ్రీకృష్ణుడుగూడ రథమునాపి శత్రువులను జూడమని జెప్పెనో యట్టి యర్జునుని మాహాత్మ్య మేమిచెప్పుదుననియీశ్లోకమున నభిప్రాయము. భరతవంశ్యులు విషమావస్థయందును దుఃఖింపనట్టి ధీరులు. అట్టి భరతవంశోద్భవుండ వగు నీవుగూడ "పరమేశ్వరుడగు శ్రీకృష్ణుడు నాపుత్రులకు ప్రతికూలు డగుటయేగాక పాండవుల కనుకూలు డయ్యె" నని దుఃఖింపవలదని సూచించుటకు "భారత" అని సంబోధించెను.

"గుడాకాయాః=అజ్ఞానరూప నిద్రాయాః + ఈశః, గుడాకేశః" అజ్ఞానరూపమగు నిద్రను జయించినవాడని యర్థము. ॥౨౪, ౨౫॥

గీ॥ తత్రాపశ్యత్ స్థితా న్పార్థః పితౄ నథ పితామహాన్ ।
ఆచార్యా న్మాతులా న్భ్రాతౄ న్పుత్రా న్పౌత్రా న్సఖీం స్తథా ॥
శ్వశురా న్సుహృద శ్చైవ సేనయో రుభయో రపి । ॥౨౬॥

గీ॥ తా న్సమీక్ష్య స కౌంతేయ స్సర్వా న్బంధూ నవస్థితాన్ ।
కృపయా పరయాఽఽవిష్టో విషీద న్నిద మబ్రవీత్ ॥ ॥౨౭॥

గీ॥ అర్జున ఉవాచ:- దృష్ట్వేమం స్వజనం కృష్ణ! యుయుత్సుం సముపస్థితమ్ ॥౨౮॥
సీదన్తి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి ।

గీ॥ వేపథు శ్చ శరీరే మే రోమహర్ష శ్చ జాయతే ॥ ॥౨౯॥
గాండీవం స్రంసతే హస్తా త్త్వ క్చైవ పరిదహ్యతే ।

గీ॥ న చ శక్నో మ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః ॥ ॥౩౦॥

పదవిభాగము:— తత్ర- అపశ్యత్- స్థితాన్- పార్థః-పితౄన్- అథ- పితామహాన్- ఆచార్యాన్- మాతులాన్-భ్రాతౄన్-పుత్రాన్-పౌత్రాన్-సఖీన్-తథా ॥ శ్వశురాన్-సుహృదః-చ-ఏవ-సేనయోః-ఉభయోః-అపి । ॥౨౬॥

పదవిభాగము:— తాన్-సమీక్ష్య-సః- కౌంతేయః- సర్వాన్- బంధూన్- అవస్థితాన్ । ॥౨౭॥ కృపయా- పరయా- ఆవిష్టః- విషీదన్- ఇదం- అబ్రవీత్ ॥ అర్జునః- ఉవాచ ॥ దృష్ట్వా- ఇమం- స్వజనం- కృష్ణ- యుయుత్సుం- సముపస్థితం- ॥౨౮॥ సీదన్తి- మమ- గాత్రాణి- ముఖం- చ- పరిశుష్యతి- వేపథుః- చ- శరీరే- మే- రోమహర్షః- చ- జాయతే ॥౨౯॥ గాండీవం- స్రంసతే- హస్తాత్- త్వక్- చ- ఏవ- పరిదహ్యతే- న- చ- శక్నోమి- అవస్థాతుం- భ్రమతి- ఇవ- చ- మే- మనః । ॥౩౦॥

ప్రతిపదార్థము:—తత్ర=యుద్ధమారంభింపశ్రీకృష్ణపరమాత్మయొక్క-యాజ్ఞ కాగానే; పార్థః-అర్జునుడు: ఉభయోః=రెండయిన; సేనయోః=సేనలయందు; స్థితాన్=ఉన్న; పితౄన్= పితృస్థానీయులను; అథ= (అథశబ్దమునకు తథాశబ్దార్థము) అట్టి; పితామహాన్=తాతలను; ఆచార్యాన్=విద్యాగురువులను; మాతులాన్=మేనమామలను; భ్రాతౄన్=అన్నదమ్ములను; పుత్రాన్=కుమారులను, పౌత్రాన్=మనుమలను. తథా=అట్లు, సఖీన్=స్నేహితులను, (ప్రత్యుపకారము నపేక్షింపక యుపకార మొనర్చువారు సఖులు) శ్వశురాన్=మామలను, సుహృదశ్చైవ=స్నేహితులను, (ప్రత్యుపకార మపేక్షించి యుపకార మొనర్చువారలు సుహృత్తులు) అపశ్యత్=చూచెను. ॥౨౬॥ సః=ఆ, కౌంతేయః=కుంతీపుత్రుండగు యర్జునుడు. అవస్థితాన్=ఉభయసేనలయందున్న, తాన్=ఆ, సర్వాన్=సమస్తమైన, బంధూన్=పితృపితామహాదులను, సమీక్ష్య=దేటిపాఱజూచి, పరయా=గొప్ప, కృపయా=దయతో, ఆవిష్టః=కూడుకొన్నవాడై, విషీదన్=దుఃఖించుచు; కృష్ణంప్రతి=శ్రీకృష్ణుని గూర్చి, ఇదం=ఈవాక్యమును, అబ్రవీత్=పలికెను. ॥౨౭॥ అర్జునం=అర్జునుడు, ఉవాచ=పలికెను, హేకృష్ణ=ఓశ్రీకృష్ణుడా!, యుయుత్సుం=యుద్ధము చేయనిచ్ఛగల, సముపస్థితం=(యుద్ధభూమియందు)కూడిన ఇమం=ఈ, స్వజనం=నాపితృపుత్రాదులను, దృష్ట్వా=చూచి. మమ= నాయొక్క, గాత్రాణి=అవయవములు, సీదన్తి =విలవిలపోవుచున్నవి, ముఖంచ=నోరును, పరిశుష్యతి=ఎండుచున్నది. ॥౨౮॥

మే=నాయొక్క, శరీరే=శరీరమునందు, వేపథుశ్చ=కంపమును, రోమహర్షశ్చ=గగ్గురుపాటును. జాయతే=పుట్టుచున్నది, హస్తాత్=హస్తమునుండి, గాండీవం=గాండీవము, స్రంసతే= జారుచున్నది, త్వక్చైవ=ఒడలును, పరిదహ్యతే=అంతటను మండుచున్నది. ॥౨౯॥

హేకేశవ!=ఓకృష్ణా!, అవస్థాతుంచ=నిలుచుటకును, నశక్నోమి=సమర్థుడను గాకుంటిని, మే=నాయొక్క, మనః-మనస్సు, భ్రమతీవ=తిరుగుచున్నట్లున్నది. ॥౩౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

శ్రీకృష్ణునివలన యుద్ధమున కాజ్ఞను గొన్నపిమ్మట నుభయసేనలయందున్న పితృస్థానీయులను, పితామహులను, విద్యోపదేశకులగు నాచార్యులను, మేనమామలను, సోదరులను, కుమారులను, మనుమలను, ప్రత్యుపకార మపేక్షింపక యుపకార మాచరించెడి మిత్రులను, మామలను, ప్రత్యుపకారమపేక్షించి యుపకారము నాచరించెడి స్నేహితులను జూచెను. ॥౨౬॥

ఓ ధృతరాష్ట్ర! అర్జునుఁ డుభయసేనలయందున్న పూజ్యు లగు పితృపితామహాదులను, వాత్సల్యపాత్రులగు పుత్రాదులను, పరాధీనజీవనులగు సేనలను జూచి కృపాపరవశుఁడై యిందరను హింసించుట ధర్మమా? యని దుఃఖించుచుశ్రీకృష్ణపరమాత్మనుగూర్చియిట్లు పలికెను. ॥౨౭॥

అట్టియెడ శ్రీకృష్ణునిగూర్చి యర్జును డిట్లు వచించెను. ఓ శ్రీకృష్ణ! యుద్ధముచేయఁగోరి యుద్ధభూమియందుఁగూడిన నాపితృపుత్రాదులను జూడఁగా అయ్యో! వీరిని హింసింపవలయునే! యని నాయవయవములు విలవిలపోవుచున్నవి. నో రెండుచున్నది.

దేవాంశసంభూతుడగు నర్జునునకు నాత్మయాథాత్మ్యజ్ఞానము లేకుండుటంబట్టి తన దేహమునం దాత్మజ్ఞానము, పరదేహములయం దాత్మీయజ్ఞానమును నుంటజేసి యుద్ధారంభసమయమున మృత్యుప్రసంగదర్శనమువలన బెద్ద యలజడి గలిగెను. ॥౨౮॥

ఓ శ్రీకృష్ణా! భయకారణమగు కంపము, రోమాంచములు నాశరీరమునందుదయించుచున్నవి. ఇంతియేకాదు. గాండీవముకూడ హస్తమునుండి జారిపోవుచున్నది; నఖశిఖాంతము నాయొడలు మండుచున్నది. ॥౨౯॥

ఓ శ్రీకృష్ణా! భయహేతువులేకావు; అధైర్యముకూడ కలుగుచున్నది. నిలుచుటకు శక్తి చాలకున్నది. మోహము గలుగుచున్నది. నామనస్సు తిరుగుచున్నట్లున్నది. ॥౩౦॥

—• ౧వ అధ్యాయము— ౨౬-౨౭-౨౮-౨౯-౩౦ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— “యుద్ధరూపమగు హింస యధర్మము” అనెడి విపరీతబుద్ధియే మోహమనబడును. దీనివల్ల మమకారనిబంధనమగు చిత్తవైక్లబ్యము జనించును. దీనినే శోకమోహములందురు. ఈచిత్తవైక్లబ్యమే “శాస్త్రవిహితముగాన యుద్ధము క్షత్రియధర్మము” అనెడి జ్ఞానమును ప్రతిబంధించును. ఇట్టి చిత్తవైక్లబ్యముచేఁ గప్పబడిన వివేకముగల యర్జునునకు మహానర్థకారియగు “యుద్ధమునుండి విరమించవలె” ననెడి యిచ్ఛ గలిగెనని “తాన్సమీక్ష్య స కౌన్తేయః” అనునది మొదలుకొని చెప్పుచున్నాడు.

స్వదేహమునందాత్మాభిమానమును, పరదేహమునందాత్మీయాభిమానమును గలవాఁడగుటచే ననాత్మవిదుడగునట్టియు కనుకనే యుద్ధమువలన తనదేహము, పరదేహములు నశించునేమో యని దిగులొందుచున్న యర్జునునకు స్వధర్మప్రవృత్తికిఁ గారణమగు తత్త్వజ్ఞానమును ప్రతిబంధించు శోకము కలిగెనని ‘తన్మే క్షేమతరంభవేత్’ ఇత్యన్తశ్లో.

గీ॥ నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ! ।
నచ శ్రేయోనుపశ్యామి హత్వా స్వజన మాహవే ॥ ॥౩౧॥

పదవిభాగము:— నిమిత్తాని- చ- పశ్యామి- విపరీతాని- కేశవ!- న- చ- శ్రేయః- అనుపశ్యామి- హత్వా- స్వజనం- ఆహవే । ॥౩౧॥

ప్రతిపదార్థము:— హే కేశవ!=ఓ శ్రీకృష్ణా!; విపరీతాని=విరుద్ధములైన; నిమిత్తానిచ=శకునములను; పశ్యామి=చూచుచున్నాను; ఆహవే=యుద్ధమునందు, స్వజనం=నావారిని, హత్వా=సంహరించి, శ్రేయశ్చ=ఎట్టి మేలును, నానుపశ్యామి=చూడను. ॥౩౧॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓ శ్రీకృష్ణా! ఈ రణభూమియందు వామనేత్రి మదురుట, నక్కలు కూయుట, గృధ్రవాయసాదులు యప్రదక్షిణముగ సంచరించుట మొదలగు దుర్నిమిత్తములు గానవచ్చుచున్నవి. యుద్ధమునందు నావారలను జంపుటవలన నా కెట్టిమేలును కానరాదు ॥౩౧॥

---

౧అ॥ అనునది యంతము గాగల గ్రంథముతో నిరూపించదలచి ప్రథమమున "దృష్ట్వేమం స్వజనంకృష్ణ!" అను శ్లోకము మొదలుకొని "భ్రమతీవచమే మనః" అనునంతవరకు నగు మూడుశ్లోకములచే తల్లింగనిరూపణమును జేయుచుండెను.

శంకరానందీయము:— ముముక్షువు తా నారాధించు దైవమును పరిశీలింపవలెను, కాన నట్టి యర్జునునకు యష్టవ్యదేవతారూపమైన సైనికులను బరిశీలించుటను "తత్రాపశ్యత్" అనునది మొదలుకొని రెండు శ్లోకములతోఁ జెప్పుచుండెను.

"తస్మాచ్చ దేవా బహుధా సంప్రసూతాః" "ముఖాదింద్రశ్చాగ్నిశ్చ" ఇత్యాదశ్రుతులచే దేవతలకుఁ గూడ పుట్టుక శూన్యమాణ మగుచుండుటచే వార లనిత్యులనియు, కనుకనే యాగంతుకైశ్వర్యవంతులనియు, సంసారులనియు, ఫలదాతలగుటచే బంధకులనియు నిత్యసుఖార్థియగు ముముక్షువు తెలిసికొని యాయాదేవతల నారాధింపక "ఈ దుఃఖాంతములగు కర్మలతో నేమిప్రయోజనము" అని పరితపింపవలయును. కాన: నట్టి యర్జునునికి స్వకర్తృక బంధుజనవధనిమిత్తమగు పరితాపమును "దృష్ట్వేమం స్వజనం కృష్ణ" అనుశ్లోకము మొదలుకొని యధ్యాయాంతము వరకు జెప్పుచున్నాడు. ॥౨౬, ౨౭, ౨౮, ౨౯, ౩౦॥

—• ౧వ అధ్యాయము ౩౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— నే నాత్మజ్ఞానిని గానందున దుఃఖించు స్వభావముకలవాడను. కనుకనే యాదుఃఖజన్యమగు క్లేశమును అనుభవించుచుంటిని. ఇక నీవన్ననో సదానందస్వరూపుడవు గాన శోకసంబంధము లేనివాడవు. స్వజనదర్శనము మనమిరువురకు సమానమైనను శోకసంబంధములేని నీవు నన్ను శోకరహితుని జేయుమనిభావము. శోకరాహిత్యమును జేయు సామర్థ్యము "కేశవ!" అను సంబుద్ధిచే సూచితమయ్యెను. (కః=బ్రహ్మ,) సృష్టికర్తా, ఈశః=రుద్రః సంహర్తా తౌ వాత్యనుకంప్యతయా గచ్ఛతీతి కేశవః) సృష్టికర్తయగు బ్రహ్మను, సంహర్త యగు రుద్రుని యనుగ్రహించెడివాడు కేశవుఁడనబడును. ఈరీతిగ హేతుపురస్సరముగ యోగ్యప్రవృత్తిహేతువగు తత్త్వజ్ఞానమునకు ప్రతిబంధకమగు శోకమును జెప్పి ఆ శోకకృతమును విపరీతప్రవృత్తిహేతువగు విపరీతబుద్ధిని "నచ శ్రేయోనుపశ్యామి" అను శ్లోకముచే జెప్పుచున్నాడు.

"ద్వావిమౌ పురుషౌ లోకే సూర్యమండలభేదినౌ । పరివ్రాడ్యోగయుక్తశ్చ రణే చాభిముఖో హతః" అను వాక్యానుసారము యుద్ధమునందు మృతినొందినవానికే శ్రేయోవిశేషము చెప్పబడినది. గాన స్వీయులు కాని వారినైననుఁ జంపి శ్రేయస్సునుఁ బొందజాలను. ఇఁక స్వజనమును జంపి యేమి ప్రయోజనము" అని సూచించుటకు "స్వజనం" అని జెప్పఁబడెను. ॥౩౧॥

శ్లో॥ న కాంక్షే విజయం కృష్ణ! నచ రాజ్యం సుఖాని చ ।
కిం నో రాజ్యేన గోవింద! కిం భోగై ర్జీవితేన వా ॥ ॥౩౨॥
యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగా స్సుఖాని చ ।
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ ॥ ॥౩౩॥
ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః ।
మాతులా శ్శ్వశురాః పౌత్రాః స్స్యాలా స్సంబన్ధిన స్తథా ॥ ॥౩౪॥

పదవిభాగము:— న- కాంక్షే- విజయం- కృష్ణ!- న- చ- రాజ్యం- సుఖాని- చ- కిం- నః- రాజ్యేన- గోవింద!- కిం- భోగైః- జీవితేన- వా ॥౩౨॥ యేషాం- అర్థే- కాంక్షితం- నః- రాజ్యం- భోగాః- సుఖాని- చ- తే- ఇమే- అవస్థితాః- యుద్ధే- ప్రాణాన్- త్యక్త్వా- ధనాని-చ॥౩౩॥ ఆచార్యాః- పితరః- పుత్రాః- తథా- ఏవ- చ- పితామహాః- మాతులాః- శ్వశురాః- పౌత్రాః- స్యాలాః- సంబంధినః- తథా । ॥౩౪॥

ప్రతిపదార్థము:— హేకృష్ణ!=భక్తజనహృదయములయందుండు పాపముల నాకర్షించు ఓ శ్రీకృష్ణపరమాత్మా!; విజయం=యుద్ధమునందు జయమును; న కాంక్షే=కోరను; రాజ్యం=రాజ్యమును; సుఖానిచ=సుఖములను; నచ కాంక్షే=కోరను; హేగోవిన్ద=ఇంద్రియములకు సాక్షిభూతుఁడవగు ఓ శ్రీకృష్ణ!; నః=మనకు; రాజ్యేన=రాజ్యముచేత; కిం=ఏమిప్రయోజనము?; భోగైః=భోగములచేఁగాని; జీవితేనవా=జీవనముచేతగాని; కిం=ఏమి ప్రయోజనము?; యేషాం=యెవరియొక్క; అర్థే=నిమిత్తము; నః=మనకు; రాజ్యం=రాజ్యము; కాంక్షితం=అభిలషితమయ్యెనో; భోగాః=భోగములు; కాంక్షితాః=అభిలషితములో; సుఖానిచ=సుఖములును; కాంక్షితాని=అభిలషితములో; తే=ఆ; ఇమే=వీరు; ప్రాణాన్=ప్రాణములను; ధనాని చ=ధనములను; త్యక్త్వా=విడిచి; యుద్ధే=యుద్ధమునందు; అవస్థితాః=ఉండిరి. ॥౩౨, ౩౩॥

ఆచార్యాః=విద్యోపదేష్టలగు ద్రోణాచార్యాదులు; పితరః=పితృసములు; పుత్రాః=అభిమన్య్వాదులు;తథైవ=అట్లే; పితామహాః=భీష్మాదులు; మాతులాః=శల్యాదులు; శ్వశురాః=ద్రుపదాదులు; పౌత్రాః=మనుమలు; స్యాలాః=భార్యతోఁబుట్టిన ధృష్టద్యుమ్నాదులు; తథా=అట్లే; సంబంధినః=పరంపరాసంబంధులు; సంతి=కలరు. ॥౩౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓ శ్రీకృష్ణా! శ్రేయస్సు (మోక్షము)ను గోరు నేను యుద్ధమువలన గలుగబోవు తుచ్ఛమైన విజయమునుఁగాని, దానివలన ప్రాప్తించు రాజ్యమునుగాని, రాజ్యమువలన ప్రాప్తించు విషయసుఖములనుగాని కోరను. "చక్షుషశ్చక్షుః" ఇత్యాదిశ్రుతులచే సర్వేంద్రియములకు సాక్షిభూతుఁడవగు నో శ్రీకృష్ణా! ఎవరినిమిత్తము రాజ్యము, భోగములు, సుఖములును మనము కోరుచున్నామో అట్టి పితృపితామహాచార్యస్యాలకాదులు ధనప్రాణములను లెక్కసేయక యుద్ధమునందు నిలిచియుండిరి. అట్టివారు మరణింప మనకీరాజ్యమువలనగాని, భోగములవలనగాని, జీవితమువలనగాని యేమి ప్రయోజనముగలదు? ॥౩౨, ౩౩॥

ఎవరు లేనిచో రాజ్యభోగాదులు వ్యర్థమో వారెవరనిన? పితృసములు, ద్రోణాచార్యకృపాచార్యాదులు, అభిమన్యుప్రభృతిపుత్రులు, తాత యగు భీష్ముఁడు, మేనమామలగు శల్యాదులు; మామలగు ద్రుపదాదులు, మనుమలు, స్యాలకులగు ధృష్టద్యుమ్నాదులు, మఱియు నితరులగు సంబంధులు ఇందఱను జంపియా మనమీతుచ్ఛరాజ్యభోగాదులను గైకొనుట ? ॥౩౪॥

—♦ ౧వ అధ్యాయము— ౩౨, ౩౩ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు. ♦—

మధుసూదనసరస్వతీయము:— యుద్ధమువలన యదృష్టఫలము లేకున్నను విజయ, రాజ్యసుఖాది

గీ॥ ఏతా న్న హంతు మిచ్ఛామి ఘ్నతోపి మధుసూదన ।
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే ॥ ॥౩౫॥

పదవిభాగము:— ఏతాన్- న- హంతుం- ఇచ్ఛామి- ఘ్నతః- అపి- మధుసూదన- అపి- త్రైలోక్యరాజ్యస్య- హేతోః- కిం- ను- మహీకృతే । ॥౩౫॥

ప్రతిపదార్థము:— ఈశ్లోకమున "అహం" అనుపదమధ్యాహార్యము. అహం=నేను; హేమధుసూదన=మధు వను రాక్షసుని సంహరించిన యోశ్రీకృష్ణ!; ఘ్నతోపి=నన్ను కొట్టుచున్నవారైనను; ఏతాన్=ఈదుర్యోధనాదులను; త్రైలోక్యరాజ్యస్య=త్రైలోక్యరాజ్యముయొక్క; హేతోరపి=హేతువుకొరకైనను; హంతుం=చంపుటకు; నేచ్ఛామి=కోరను; మహీకృతే=భూమినిత్తము; కింను=ఏమిచెప్పవలెను. ॥౩౫॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

తన రాజ్యమునకు శత్రువు లగుట నవశ్యవధ్యు లగువారి యందు జాలిఁగొని మోహవశుడై స్వధర్మమగు యుద్ధమునుండి వైరాగ్యముబొందియర్జునుడిట్లనెను."జిఘాంసంతంజిఘాంసీయాత్" చంపగోరుచున్న వానిని చంపదలపవలెను. అను న్యాయము ననుసరించి దుర్యోధనాదుల వధ యధర్మఫలకము గాకున్నను, ఓ శ్రీకృష్ణా! నన్ను చంపనున్న దుర్యోధనాదులను త్రిలోకాధిపత్యము నాకొసంగినను జంపజాలను. ఇక నీ భూరాజ్యము నిమిత్తము వీరలను జంపుదునే ? ॥౩౫॥

---

దృష్టఫల మున్నను దానిని నేను గోరను. అని తెల్పుటకు "న కాంక్షే" అని పూర్వార్థము చెప్పఁబడెను. ప్రయోజనము లేకపోవుటచే నట్లంటి నని దెల్పుటకే "కింనో రాజ్యేన"అని చెప్పఁబడెను. రాజ్యాదు లక్కరలేకపోవుటకు హేతువును 'యేషామర్థే' అనునది మొదలుకొని జెప్పెను. "సర్వేంద్రియప్రవర్తకుడ వగు నీవే నాయైహికఫలవైరాగ్యము నెరుగుదువు" అని దెల్పుటకు "గోవింద!" అని సంబోధించెను. "గాః ఇంద్రియాణి విందతీతి గోవిందః" సర్వేంద్రియసాక్షి యని గోవిందశబ్దమున కర్థము.

శంకరానందీయము:— 'అప్యకార్యశతం కృత్వా భర్తవ్యా మను రబ్రవీత్' అను వచనముచే నీవు స్వజనపోషణకొరకు తప్పక యుద్ధము చేయవలయు నందువా? అట్లు కాదు. ఎవరినిమిత్తము రాజ్యాదు లాకాంక్షితములో, ఎవరు ఆకార్యములను జేసియైన బోషింపఁదగినవారో వారే నాతో యుద్ధము జేయుటకు సంసిద్ధులై యుండిరి. అని జెప్పుటకు "యేషామర్థే కాంక్షితం" ఇత్యాదికము నుపక్రమించెను.

భాష్యోత్కర్ష దీపిక:— 'హేకృష్ణ' అను సంబోధనచే "వాసుదేవే మనో యస్య జపహోమార్చనాదిషు । తస్యాన్తరాయో మైత్రేయ! దేవేన్ద్రత్వాదికం ఫలం" అను వచనానుసారము పరమేశ్వరునియందు భక్తికి యంతరాయము అగు విజయ, రాజ్యాదులను హరించుటయే నీకుఁగల యనుగ్రహ మని సూచించి "యస్యానుగ్రహ మిచ్ఛామి తస్య విత్తం హరా మ్యహం" అను భగవద్వచనానుసారము విజయరాజ్యాదు లను నీయందుగల భక్తి కంతరాయములని యాలోచించి యైన వాటిని గోరను" అని "న కాంక్షే విజయం" అను వాక్యముచే సూచించెను. ॥౩౨, ౩౩॥

—• ౧వ అధ్యాయము ౩౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

భాష్యోత్కర్ష దీపిక:— 'మధుసూదన' అను స్థలమున మధుపదము కైటభాసురునికి గూడ నుపలక్షణము. మధుకైటభు లనగ రజస్తమస్సులు. వాటిని నశింపఁజేసెడి నీవు నీభక్తుడ వగు నన్ను రజస్తమోరూపము, స్వజనహింసారూపము నగు నీఘోరకర్మయందు నియోగించుట దగదని "మధుసూదన" అను సంబోధనముచే సూచించెను. ॥౩౫॥

గీ॥ నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతి స్స్యా జ్జనార్దన! ।
పాప మేవాశ్రయే దస్మా న్హత్వైతా నాతతాయినః ॥ ॥౩౬॥

పదవిభాగము:— నిహత్య- ధార్తరాష్ట్రాన్- నః- కా- ప్రీతిః- స్యాత్- జనార్దన!- పాపం- ఏవ- ఆశ్రయేత్- అస్మాన్- హత్వా- ఏతాన్- ఆతతాయినః । ॥౩౬॥

ప్రతిపదార్థము:— హేజనార్దన!=ఓశ్రీకృష్ణ!; ధార్తరాష్ట్రాన్=దుర్యోధనాదులను; నిహత్య=చంపి; నః=మనకు; ప్రీతిః=సంతోషము; కా=ఏమి? అస్మాన్=నిర్దోషులమగు మనలను; హత్వా=చంపి; ఏతాన్=ఈ, ఆతతాయినః="అగ్నిదోగరదశ్చైవ" అన్నరీతి నిప్పటికే యాతతాయులయిన దుర్యోధనాదులను; పాపమేవ= నిర్దోషులగు స్వజనమును హింసించుటవలన ప్రాప్తించుపాపమే; ఆశ్రయేత్=ఆశ్రయింపనిమ్ము. ॥౩౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓశ్రీకృష్ణా! శత్రువులగు దుర్యోధనాదులను సంహరించినయెడల ప్రీతి సంభవించునుగాన యుద్ధమే కర్తవ్యమనెదవేమో మాపెదతండ్రి ధృతరాష్ట్రుని పుత్రులగు దుర్యోధనాదులగు స్వజనమును హింసించుటవలన మన కెట్టిప్రీతి గలుగును? మనము దుర్యోధనాదులను హింసింపమేని వారే మిమ్ములను హింసించెదరనెదవా? అట్లేని నిర్దోషులగు మనలను హింసించి ఇదివరకే ఆతతాయులగు ("అగ్నిదోగరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహృత్ । క్షేత్రదారహరశ్చైవ షడేతే హ్యాతతాయినః" ఇండ్ల కగ్నిని పెట్టువాడు, విషమును బెట్టువాడు. నిష్కారణముగ శస్త్రాస్త్రములను ధరించువాడు, పరధనముల నపహరించెడివాడు, పరక్షేత్రముల నపహరించువాడు, పరదారల నపహరించువాడు నీయార్గురు నాతతాయు లనబడుదురు) నీదుర్యోధనాదులు మఱియు పాపిష్టు లగుదురుగాక.

లేక, ఈదుర్యోధనాదు లాతతాయులు గాన నవశ్యవధ్యులే కాని యతిదీను లగుటచే శోచ్యులు గాన నిట్టివారిని హింసించినయెడల స్వజనులను హింసించుటవలన గలుగు పాపము మనలనే యాశ్రయించును.

లేక; గురుభ్రాతృపుత్రసుహృద్భ్రాతృలగు వీరలనే హింసింతుమేని మనమేయాతతాయుల మగుదుము. గాన నట్టి గురుభ్రాత్రాదుల హింసవలన పాపము మనలనే యాశ్రయించును. కాన మనకు యుద్ధమునుండి విరమించుటయే శ్రేయస్కరము. ॥౩౬॥

—• ౧వ అధ్యాయము ౩౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇట "జనార్దన!" అనుసంబోధనమువలన "ఓశ్రీకృష్ణ! నీవు ప్రళయకాలమందున సర్వజనసంహారకుడవైనను నిన్నే పాప మంటకుండును. కాన నేను కాక నీవే యీబంధువధను జేయుదగుదువు" అని సూచింపబడెను.

ఆతతాయులు గాన నీదుర్యోధనాదులు వధ్యులేయందువా? "స్మృత్యో ర్విరోధే న్యాయస్తు బలవాన్వ్యవహారతః । అర్థశాస్త్రా త్తుబలవ ద్ధర్మశాస్త్ర మితి స్థితిః" అను యాజ్ఞవల్క్యోక్తిచే "ఆతతాయినం హన్యాత్" అనుఅర్థశాస్త్రముకంటె "మాహింస్యా త్సర్వభూతాని" అనుధర్మశాస్త్రము బలమైనది కాన ఆతతాయులైనను వీరలనుజంపినమమ్ములనే పాపమాశ్రయించునుగాని దృష్టాదృష్టరూపమగు మఱియొకప్రయోజన మేమియు లేదని భావము.

శంకరానందీయము:— ఆతతాయిని జంపుట "ఆతతాయిన మాయాంతం" అను యర్థశాస్త్రముచే పాపకార్యము కాకపోయినను యిట్టి యర్థశాస్త్రముకంటె "సఏవ పాపిష్ఠతమో యః కులనాశకః" అను ధర్మశాస్త్రము బలవత్తరముగాన వీరిని జంపినచో మేమే పాపిష్ఠుల మగుదు మని భావము.

గీ॥ తస్మా న్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రా న్స్వబాంధవాన్ ।
స్వజనం హి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ! ॥౩౭॥

గీ॥ యద్య ప్యేతే న పశ్యన్తి లోభోపహతచేతసః ।
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్ ॥ ॥౩౮॥

గీ॥ కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివర్తితుమ్ ।
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన ॥ ॥౩౯॥

పదవిభాగము:— తస్మాత్ – న – అర్హాః – వయం – హంతుం – ధార్తరాష్ట్రాన్ – స్వబాంధవాన్ – స్వజనం – హి – కథం – హత్వా – సుఖినః – స్యామ – మాధవ! ॥౩౭॥ యది – అపి – ఏతే – న – పశ్యన్తి – లోభోపహతచేతసః – కులక్షయకృతం – దోషం – మిత్రద్రోహే – చ – పాతకమ్ ॥౩౮॥ కథం – న – జ్ఞేయం – అస్మాభిః – పాపాత్ – అస్మాత్ – నివర్తితుం – కులక్షయకృతం – దోషం – ప్రపశ్యద్భిః – జనార్దన! ॥౩౯॥

ప్రతిపదార్థము:— హేమాధవ!=ఓశ్రీకృష్ణ; తస్మాత్=ఆ కారణమువలన (స్వజనమును సంహరించుటవలన ఫలములేకపోవుట; మఱియు ననర్థము సంభవించుటవలన); స్వబాంధవాన్=మనబంధువులగు; ధార్తరాష్ట్రాన్=దుర్యోధనాదులను; హంతుం=సంహరించుటకు; వయం=మనము; నార్హాః=తగినవారలము కాము; స్వజనం=మనవారలను; హత్వా=చంపి; కథం=ఎవ్విధమున; సుఖినః=సుఖవంతులము; స్యామ=కాగలము. ॥౩౭॥

యద్యపి=విచారింపగ; ఏతే=ఈదుర్యోధనాదులు; లోభోపహతచేతసః=రాజ్యలోభముచే కొట్టబడిన చిత్తము గలవారై; కులక్షయకృతం =స్వకులనాశమువలన గలుగు; దోషం =దోషమును; మిత్రద్రోహే=మిత్రద్రోహమునందుగల, పాతకంచ= పాతకమును; నపశ్యంతి=తెలుసుకొనకున్నారు. ॥౩౮॥

హేజనార్దన!=ఓశ్రీకృష్ణ!; కులక్షయకృతం=కులక్షయమువలన గలుగు; దోషం=దోషమును(పాపమును); ప్రపశ్యద్భిః=తెలిసికొన్న; అస్మాభిః=మనచేత; అస్మాత్=ఈ (ఈకులక్షయమువలన, మిత్రద్రోహమువలనప్రాప్తించిన); పాపాత్=పాపమునుండి; నివర్తితుం=మఱ్ఱుటకు; కథం=ఎట్లు; నజ్ఞేయం=తెలుసుకొనబడతగదు ॥౩౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

దుర్యోధనాదులను సంహరించుటవలన ఫలములేకపోగా ననర్థప్రాప్తియు గలుగుచున్నది. కాన మనబంధువులగు దుర్యోధనాదులను సంహరించు టర్హాకృత్యము కాదు. స్వజన మున్నంగదా రాజ్యసుఖము. అట్టి స్వజనమును సంహరించి మనమెట్లు సుఖమును బొందుదుము. ॥౩౭॥

అట్లేని దుర్యోధనాదులకు మాత్రము కులక్షయమునందు, స్వజనహింసయందు ప్రవృత్తి యేల? అందువేమో! వారు రాజ్యలోభముచే యుక్తాయుక్తజ్ఞానము లేనివారు. కానవారు కులక్షయమువలన ప్రాప్తించిన దోషమును, మిత్రద్రోహమునగల దోషమును తెలిసికొనకున్నారు. కావుననే దుర్యోధనాదులకు స్వజనహింసారూపమగు యుద్ధమునందు బ్రవృత్తి కలిగినది. ॥౩౮॥

"దుర్యోధనాదుల కెట్లు యుద్ధప్రవృత్తిగలదో మనకును యట్లే యుద్ధప్రవృత్తియందు నిమ్నకముండుగాక" యని యనెదవేమో మిత్రద్రోహమువలన బ్రాప్తించెడి పాపమును,

భాష్యోత్కర్షదీపిక:— "అపకారియైనను వృద్ధుడగు ధృతరాష్ట్రునివిషయమై యపకారము జేయదగదు" అని సూచించుటను "ధార్తరాష్ట్రాః" అని ధృతరాష్ట్రసంబంధమును జూపెను. ॥౩౬॥

—• ౧వ అధ్యాయము ౩౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— 'ఆహూతో న నివర్తేత ద్యూతాదపి రణాదపి' అనియు 'విజితం క్షత్రియస్య'

గీ॥ కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మాస్సనాతనాః ।
ధర్మే నష్టే కులం కృత్స్నమధర్మోఽభిభవత్యుత ॥ ॥౪౦॥

గీ॥ అధర్మాభిభవాత్కృష్ణ! ప్రదుష్యన్తి కులస్త్రియః ।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ! జాయతే వర్ణసఙ్కరః ॥ ॥౪౧॥

పదవిభాగము:— కులక్షయే-ప్రణశ్యన్తి- కులధర్మాః-సనాతనాః- ధర్మే- నష్టే- కులం- కృత్స్నం- అధర్మః- అభిభవతి- ఉత ॥౪౦॥ అధర్మాభిభవాత్- కృష్ణ!- ప్రదుష్యన్తి- కులస్త్రియః- స్త్రీషు- దుష్టాసు- వార్ష్ణేయ!- జాయతే- వర్ణసఙ్కరః । ॥౪౧॥

ప్రతిపదార్థము:— కులక్షయే=కులమునశింపగా, సనాతనాః=ప్రాచీనములైన, కులధర్మాః=కులధర్మములు, ప్రణశ్యన్తి= నశించుచున్నవి, ధర్మే=కులధర్మము, నష్టే=నశించినచో, కృత్స్నం=సమస్తమైన, కులం=కులమును, అధర్మః=అధర్మము, అభిభవతి= తిరస్కరించుచున్నది. ॥౧౪॥

ప్రతిపదార్థము:— హేకృష్ణ!=భక్తహృదయస్థనిఖిలపాపములను నశింపజేయు శ్రీకృష్ణ!, అధర్మాభిభవాత్=అధర్మముచేనైన తిరస్కారమువలన, కులస్త్రియః=కులస్త్రీలు, ప్రదుష్యన్తి=చెడుచున్నారు. హేవార్ష్ణేయ!=ఓవృష్ణికుల సంభూతుడవగు శ్రీకృష్ణ, స్త్రీషు=స్త్రీలు, దుష్టాసు=దుష్టలైనచో, వర్ణసంకరః=వర్ణసంకరము, జాయతే=కలుగుచున్నది. ॥౪౧॥

---

కులక్షయమువలన ప్రాప్తించెడు పాపమును తెలిసికొనజాలని దుర్యోధనాదులకు తత్పరిహారము సంభవింపకపోయినను, తద్వివేకముగల మనకట్టి పాపపరిహార మెట్లు తెలియకపోవును ॥౩౯॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మనకు యుద్ధమునందు బ్రవృత్తిలేకపోవుటకు హేతువగునట్టి కులక్షయమునందుగల దోషమెట్టిదనిన?

కులక్షయమైనయెడల కులధర్మములను పాలించువారు నశించెదరు. వారు లేనియెడల చిరంతనములగు కులధర్మములు (అగ్నిహోత్రాదికర్మలవలన సాధింపదగిన ధర్మములు), నశించిపోవును. అట్టిధర్మము నశించెనేని నశింపఁగా మిగిలిన కులము నధర్మము వ్యాపించుచున్నది. అనఁగా నష్టావశిష్టమగు కులమంతయు నగ్నిహోత్రాదిధర్మముల నాచరించువారులేమిచే నధర్మభూయిష్టము కాగలదు. ॥౪౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నష్టావశిష్టమగు కుల మధర్మభూయిష్ట మగునేని యేమి దోషము ప్రాప్తించుననిన? అగ్నిహోత్రాదికర్మల నాచరించువారు లేమి నధర్మము కులము నావరించును.

---

అను వాక్యము అస్త్రకారిము క్షత్రియులకు యుద్ధము ధర్మమనియు, యుద్ధార్జిత మగు ధనము ధర్మ్య మనియు శాస్త్రములు నిశ్చయించుచున్నవి. కాన ధార్తరాష్ట్రులు లుబ్ధచిత్తులైనను వారిచే యుద్ధమున కాహ్వానింపబడిన మీరు యుద్ధమునందు బ్రవర్తింపకుండుట యనుచితము అని శ్రీకృష్ణుండనునని యర్జును డాశంకించుకొని "సోఽపాపస్మాన్నివర్తితుం" (ఈ బంధువధరూపమైన పాపమునుండి మరలుటకు మన మెందుకు తెలుసుకొనగూడదు) అని చెప్పెను. అనగా "ఈ కార్యము శ్రేయస్సాధనము" అను జ్ఞానము ఆయా కార్యములయందు బ్రవర్తకమగును. ఏయుద్యది యశ్రేయస్సునుగూర్చునదో యది శ్రేయస్సాధనమగును. అట్లుకానిచో శాస్త్రోక్తమగు శ్యేనయాగముకూడ ధర్మము కావలసియుండెడిది. ఈవిషయమునే "ఫలతోఽపి చ యత్కర్మ నానర్థేనానుబధ్యతే । కేవలప్రీతిహేతుత్వాత్తద్ధర్మ ఇతి కథ్యతే" అనువాక్యముకూడ దెలుపుచున్నది. అందుచే శాస్త్రప్రతిపాదితమైనను, అశ్రేయస్సును గూర్చునదిగాన యుద్ధమునందు బ్రవర్తించుట మనకుచితము గాదు. అనిభావము. ॥౩౯॥

గీ॥ సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ ।
పతన్తి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః ॥౪౨॥ ॥౪౨॥

గీ॥ దోషైరేతైః కులఘ్నానాం వర్ణసఙ్కరకారకైః ।
ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః ॥ ॥౪౩॥

గీ॥ ఉత్పన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన! ।
నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ ॥ ॥౪౪॥

పదవిభాగము:— సంకరః- నరకాయ- ఏవ- కులఘ్నానాం- కులస్య-చ- పతన్తి - పితరః-హి-ఏషాం- లుప్తపిండోదకక్రియాః- ॥౪౨॥

పదవిభాగము:— దోషైః- ఏతైః- కులఘ్నానాం- వర్ణసంకరకారకైః- ఉత్సాద్యన్తే- జాతిధర్మాః- కులధర్మాః- చ- శాశ్వతాః- ॥౪౩॥ ఉత్పన్నకులధర్మాణాం- మనుష్యాణాం- జనార్దన!- నరకే- నియతం- వాసః- భవతి- ఇతి- అనుశుశ్రుమ । ॥౪౪॥

ప్రతిపదార్థము:— సంకరః=సంకరము; కులఘ్నానాం=కులనాశనము చేసినవారికిని; కులస్యచ=అట్టి వారికులమునకు; నరకాయైవ=తప్పకనరకముకొరకు; ('భవతి' అనుపదమధ్యాహార్యము) భవతి=అగుచున్నది, ఏషాం=ఇట్టివర్ణసంకరకారకులయొక్క, పితరోహి=పితరులు, లుప్తపిండోదకక్రియాః లుప్త=లోపించిన, పిండ=పిండములయొక్కయు, ఉదక= ఉదకములయొక్కయు, క్రియాః= క్రియలుకలవారై, పతన్తి= నరకము నందు బడుచున్నారు. ॥౪౨॥

ప్రతిపదార్థము:— ఏతైః=ఈ, వర్ణసంకరకారకైః=వర్ణసంకరమును జేయునట్టి, దోషైః=దోషములచేత, కులఘ్నానాం=కులనాశకులయొక్క, శాశ్వతాః=శాశ్వతములగు, జాతిధర్మాః=జాతిధర్మములు, కులధర్మాశ్చ=కులధర్మములును, ఉత్సాద్యన్తే=నశింపజేయబడుచున్నవి. ॥౪౩॥

ప్రతిపదార్థము:— హేజనార్దన!=ఓశ్రీకృష్ణ, ఉత్పన్నకులధర్మాణాం=నశించినకులధర్మములుగల, మనుష్యాణాం=మనుష్యులకు, నరకే=నరకమునందు, నియతం=నియతమగు, (తప్పని) వాసః=నివాసము, భవతి=అగుచున్నది, ఇతి=ఈరీతిని, అనుశుశ్రుమ=స్మృతిగహస్యముల నెఱిగిన పెద్దలవలన వినుచుంటిమి ॥౪౪॥

దాన కులస్త్రీలు వ్యభిచారాది దోషదూషిత లగుదురు. అట్లు కులస్త్రీలు దుష్టలైనచో వర్ణసాంకర్య మేర్పడును. ॥౪౦॥

కులమును నశింపజేయువారును, వారికులమును కులనాశమువలనగలుగు సాంకర్యదోషముచే నరకమును బొందుదురు. ఇంతేకాదు; కులక్షయకారకుల వంశము నశించుటచే పితరులకుత్తరక్రియలు జేయువారులు లేమింజేసి పిండోదకక్రియలు లేక ప్రేతత్వనివృత్తి కాజాలదు. ప్రేతత్వము పోకున్న నాపితరులు శాశ్వతముగ నరకమున మ్రగ్గుచుందురు. ॥౪౨॥

వర్ణసంకరమునకు కారణమగు పైజెప్పబడిన పాపములచేత కులమును గూల్చివేసిన వారిశాశ్వతములగు జాతిధర్మములు, కులధర్మములు నశించిపోవుచున్నవి ఇట్టిమహాపదప్రినను నకు యుద్ధము హేతువుకాన మనవట్టి యుద్ధమును మానుటయే శ్రేయస్సాధనము. ॥౪౩॥
జాతిధర్మములు కులధర్మములు నశించెనేని వానినాచరించువారుండరు. అట్టిశాశ్వతమగుజాతి

—• ౧వ అధ్యాయము ౪౪వ శ్లోకవ్యాఖ్యాపిశేషములు •—

శ్రీధరీయము:— "ప్రాయిశ్చిత్తమకుర్వాణాః పాపేషు నిరతానరాః । అపశ్చాత్తాపినః కష్టాన్నిర

గీ॥ అహో! బత! మహ త్పాపం కర్తుం వ్యవసితా వయమ్ ।
యద్రాజ్యసుఖలోభేన హన్తుం స్వజన ముద్యతాః ॥ ॥౪౫॥
యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః ।
ధార్తరాష్ట్రా రణే హన్యు స్త న్మే క్షేమతరం భవేత్ ॥ ॥౪౬॥

పదవిభాగము:— అహో!– బత!– మహత్– పాపం– కర్తుం– వ్యవసితాః– వయం– యత్– రాజ్యసుఖలోభేన– హన్తుం– స్వజనం– ఉద్యతాః ॥౪౫॥ యది– మాం– అప్రతీకారం–అశస్త్రం– శస్త్రపాణయః– ధార్తరాష్ట్రాః– రణే– హన్యుః– తత్– మే– క్షేమతరం– భవేత్ । ॥౪౬॥

ప్రతిపదార్థము:— యత్=ఏ కారణమువలన; లేక ("యత్" అనునది లుప్తతృతీయాంతపదము) యత్=ఏ: రాజ్యసుఖలోభేన=రాజ్యసుఖమునందుగల లోభముచేత; స్వజనం=స్వజనమును; హంతుం=సంహరించుటకు; ఉద్యతాః=ఉద్యుక్తులమో; తత్ (ఈపదమధ్యాహార్యము) ఆ కారణమువలన; వయం=మనము; మహత్=గొప్ప; పాపం=పాపమును; కర్తుం=చేయుటకు; వ్యవసితాః=పూనుకొన్నవారము; అహో!=ఎంత ఆశ్చర్యము; బత!=ఎంత కష్టము! ॥౪౫॥

శస్త్రపాణయః=శస్త్రహస్తులగు; ధార్తరాష్ట్రాః=దుర్యోధనాదులు; అశస్త్రం=శస్త్రములు లేనట్టియు; అప్రతీకారం=ప్రతిక్రియచేయనట్టి; మాం=నన్ను, రణే=యుద్ధమున, హన్యుర్యది=సంహరించినయెడల, తత్=అది, మే=నాకు, క్షేమతరం=అతిశ్రేష్ఠమై, భవేత్=అగును. ॥౪౬॥

ధర్మములను, కులధర్మముల నాచరింపని వారికి నరకమునందు నివాసముతప్పదు. అని ధర్మశాస్త్రవేత్తల వలన వినుచుంటిమి. గాన: నిట్టి మహానర్థమూలమగు యుద్ధమును మానుటయే మేలు.

గుణదోషవిభాగము తెలిసిన మనకు రాజ్యప్రాప్తివలన గలుగు సుఖోపభోగములందు గల లోభముచే స్వజనుల హింసించుటయందుకల ప్రవృత్తి యతికష్టమైనది' (మంచిది కాదు) అని తెలిసియున్నను రాజ్యసుఖలోభముచే స్వజనహింసాస్వరూపదోషమునందు ప్రవర్తించుచుంటిమి. ఎంత ఆశ్చర్యము! ఎంత కష్టము ప్రాప్తించెను. ॥౪౫॥

"శత్రువులను పరిభవింపజాలిన శస్త్రాస్త్రములను వదలి శత్రుభీతుడవై యుద్ధమునందు విముఖుడవై యున్నచో శస్త్రపాణులగు శత్రువులు నిన్ను సంహరింపరా?" అని యనెదవేమో? శస్త్రాస్త్రసంపన్నులగు దుర్యోధనాదులు శస్త్రములను విడిచి యుద్ధవిముఖుడనగు నన్ను యుద్ధమునందు సంహరించినయెడల యది నాకు మిక్కిలి క్షేమము. ఏలయన? మనుష్యులకు ప్రాణములను రక్షించుటకన్న నహింసారూపధర్మముత్కృష్టము. కాన: ప్రాణసంరక్షణధర్మముకన్న గొప్పదగు నహింసాధర్మము నాచే నాచరింపబడిన దగును. ॥౪౬॥

యాన్యాంతి దారుణాన్" ఇత్యాదివచనములచే నుత్సన్నకులధర్ములకు నియతమగు నరకమునందు నివాసము సంభవించునని వినుచుంటిమి. ॥౪౪॥

—• ౧వ అధ్యాయము ౪౬వ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

శంకరానందీయము:— కులమును నశింపజేయుటవలన గలిగెడి దోషము, దానివలన గలిగెడి నరకపతనము, అపకీర్తి మొదలగు యనర్థములు లేకుండుటయు, పురాకృతపుణ్యము నశింపకుండుటయు క్షేమతరశబ్దార్థము.

గీ॥ సంజయ ఉవాచః— ఏవ ముక్త్వార్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః ॥ ॥౪౭॥

పదవిభాగము:— ఏవం- ఉక్త్వా- అర్జునః- సంఖ్యే- రథోపస్థః- ఉపావిశత్- విసృజ్య- సశరం- చాపం- శోకసంవిగ్నమానసః । ॥౪౭॥

ప్రతిపదార్థము:— సంజయః=సంజయుడు; ఉవాచ=పలికెను; అర్జునః=అర్జునుడు; శోకసంవిగ్నమానసః శోక=దుఃఖముచేత; సంవిగ్న=వ్యాప్తమైన; మానసః=మనస్సుకలవాడై; ఏవం=ఈరీతిని;ఉక్త్వా=పలికి; సంఖ్యే=యుద్ధమునందు; సశరం=బాణములతోగూడిన; చాపం=విల్లును; విసృజ్య=విడచి; రథోపస్థః=రథమునందున్నవాడై; ఉపావిశత్=కూర్చుండెను. ॥౪౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సంజయుడు ధృతరాష్ట్రునిగూర్చి చెప్పుచుండెను.

ఓ ధృతరాష్ట్ర! అర్జునుడీవిధముగ శోకమోహావ్యాకులుడై యుద్ధరంగమధ్యమున రథసమీపమునందు (రథమధ్యమున) బాణములను, గాండీవమును విసర్జించి నేను యుద్ధమొనర్పనని కూర్చుండెను. ॥౪౭॥

ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి
శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృ
ష్ణార్జునసంవాదేఽర్జున విషాదయోగోనామ ప్రథమోఽధ్యాయః.
ఓం తత్సత్.

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఇట్లు నూరువేలసంఖ్యగలిగి వ్యాసప్రోక్తము, సంహితారూపమునగు మహాభారతమునందంత
ర్గతమైన భీష్మపర్వమునందున్న యుపనిషద్రూపము, బ్రహ్మవిద్యారూపమును
యోగశాస్త్రమునగు భగవద్గీతలయందున్న శ్రీకృష్ణార్జున సంవాదమందు
గల యర్జునవిషాదయోగ మను పేరి ప్రథమాధ్యాయము
సమాప్తము.

అధ్యాయసముదాయార్థము.

పరమార్థప్రపా:— "సద్యో మోక్షాధికారీ స భవతి ఖలు యః పాపభీరు ర్విత్పృష్ణః
తాదృ క్పార్థోఽస్తి తస్మా న్నిజకులవధవా ద్రాజ్యభోగా న్నివృత్తః ।
మత్త్వేవం యాదవేశోఽప్యనుపద మకరో ద్బ్రహ్మవిద్యోపదేశం
భూభృద్ధర్మానురూపం త దిద మభిహితం త్వాదిమాధ్యాయకృత్యమ్ ॥

ఎవడు పాపభీరువో, ఆశారహితుడో వాడు మోక్షాధికారి యగును. ప్రస్తుతము స్వీయకులహింసనుండియు, రాజ్యభోగము నుండియు విముఖుడైన యర్జునుని యట్టి మోక్షాధికారిగ నూహించి శ్రీకృష్ణభగవానులు వెంటనే క్షత్రియధర్మానురూప మగు బ్రహ్మవిద్య నుపదేశించెను.

ఇదియే యీ ప్రథమాధ్యాయసముదాయార్థము.

ప్రథమాధ్యాయశ్లోకవ్యాఖ్యావిశేషములు ముగిసెను.

శుభమస్తు.

శ్రీవల్లభాసమేత శ్రీ మహాగణాధిపతయే నమః

# శ్రీభగవద్గీతా

# శాంకరభాష్యతత్త్వబోధిని

## ద్వితీయోఽధ్యాయః.

---

సంజయ ఉవాచ:—

గీ॥ తం తథా కృపయాఽఽవిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్ ।
విషీదంత మిదం వాక్య మువాచ మధుసూదనః ॥ ॥౧॥

పదవిభాగము:— సంజయః- ఉవాచ- తం- తథా-కృపయా- అవిష్టం- అశ్రుపూర్ణాకులేక్షణం-విషీదంతం- ఇదం- వాక్యం- ఉవాచ- మధుసూదనః । ॥౧॥

ప్రతిపదార్థము:— సంజయః=సంజయుడు; ఉవాచ=పలికెను; మధుసూదనః=మధ్వాసురుని సంహరించిన శ్రీకృష్ణపరమాత్మ; విషీదంతం=దుఃఖించుచున్నట్టియు; తథా=స్వజనమరణప్రసక్తిజ్ఞానముచే; కృపయా=దయచేత;అవిష్టం=వ్యాప్తమైనట్టియు; అశ్రుపూర్ణాకులేక్షణం-అశ్రు=కన్నీటితో; పూర్ణ=నిండిన;ఆకుల=కలఁతపడిన; ఈక్షణం=కన్నులుఁగల; తం=అయర్జునునిగూర్చి; ఇదం=ఈచెప్పఁబోవు; వాక్యం=వాక్యమును; ఉవాచ=పలికెను. ॥౧॥

---

శాంకరభాష్యతత్త్వబోధని:—

అహింసయు, భిక్షాటనము బరమధర్మములని తలంచి యర్జునుడు యుద్ధవిముఖుడాయెనని సంజయునివలన విని ధృతరాష్ట్రుడు తనకుమారులగు దుర్యోధనాదుల రాజ్య మప్రచలితమని నిశ్చయించుకొని స్వస్థచిత్తుఁడై యుండెను. అట్టి ధృతరాష్ట్రునిఁగాంచి సంజయుడీధృతరాష్ట్రుని దుర్బుద్ధిని దొలగించు నూహతో నిట్లు పలికెను—

—• ౨వ అధ్యాయము ౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఈశ్లోకమున "కృపయాఽఽవిష్టం" అని కృపనుఁ గర్తగాను, అర్జుననిఁ గర్మగాను జేయుటచే నర్జునునకు గృప స్వభావసిద్ధమనియు, "విషీదంతం" అని అర్జుననిఁగర్తగాను, విషాదమునుఁ గర్మగాను జేయుటచే నర్జునునకు విషాద మాగంతుకమనియు సూచితమయ్యెను.

"మధుసూదనః" అనుటచే స్వయముగ మధ్వాసురాదిదుష్టనిగ్రహకర్త యగు శ్రీకృష్ణుఁ డర్జుననిఁగూడ దుష్టనిగ్రహమందు నియోగించుట కుపక్రమించె నని సూచితమయ్యెను.

శంకరానందీయము:— సదసద్వివేకముచేతను, తీవ్రవైరాగ్యముచేతను, మోక్షేచ్ఛచేతను సర్వకర్మలను సంన్యసించిన బ్రాహ్మణునకు మోక్షసాధనసంపత్తియొక్కయు, బ్రాహ్మణత్వముయొక్కయు సాఫల్యము కొఱకు "తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్" అను నీమొదలగు శ్రుతులు జెప్పినరీతిని శ్రోత్రియుఁడు, బ్రహ్మనిష్ఠుఁడు నగు సద్గురువు నాశ్రయించి "ఆత్మావారే ద్రష్టవ్యః శ్రోతవ్యః" "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను

శ్రీభగవానువాచ:— కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్ ।
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున! ॥ ॥౨॥

పదవిభాగము:— శ్రీభగవాన్- ఉవాచ- కుతః- త్వా- కశ్మలం- ఇదం- విషమే- సముపస్థితం- అనార్యజుష్టం- అస్వర్గ్యం- అకీర్తికరం- అర్జున! । ॥౨॥

ప్రతిపదార్థము:— శ్రీభగవాన్=శ్రీకృష్ణపరమాత్మ; ఉవాచ=పలికెను; హేఅర్జున!=ఓ యర్జునుఁడా; అనార్యజుష్టం=శాస్త్రార్థపరిజ్ఞానము లేనివారలచే సేవింపబడినదియు; అస్వర్గ్యం=పాప కారణ మగుటం జేసి స్వర్గానర్హమైనట్టియు; అకీర్తికరం=అపఖ్యాతికరమైనట్టియు; ఇదం=ఈ; కశ్మలం=(శిష్టులచే నిందింపబడిన) యుద్ధపరాఙ్ముఖత్వము; విషమే=విషమస్థానమునందు; (భయస్థానమునందు) త్వా=సర్వక్షత్రియశ్రేష్ఠుఁడవగు నిన్ను; కుతః=ఏ కారణమువలన; సముపస్థితం=పొందెను. ॥౨॥

---

ఓధృతరాష్ట్ర! శ్రీకృష్ణపరమాత్మ మాటిమాటికినిఁ గృత్యాకృత్యములను జ్ఞాపకము చేయుచున్నను నర్జునుఁడు దృఢతరమగు మోహమువలనఁ గల్గిన విపరీతజ్ఞానముచే జనించిన శోకము కలవాఁడగుటంబట్టి కృత్యాకృత్యములను స్మరింపకపోఁగా దిరిగి శ్రీకృష్ణుఁడు—కన్నీరు రాల్చుచుఁ దిక్కుదిక్కులు చూచుచుఁ దనవారు మరణింతురే యని కనికరించి దుఃఖించుచున్న యర్జునునిఁగూర్చి యిట్లు పలికెను. ॥౧॥

---

శ్రుతిస్మృతులు జెప్పిన విధమున బ్రహ్మజ్ఞానముకొఱకు వేదాంతవిచారమును జేయవలె నను యర్థమును సూచించుటకును, సదసద్వివేకము, పరమార్థాపేక్షగల యర్జునుని "శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నం" అనురీతిని జెప్పఁబడిన యీశ్వరప్రపత్తిని, భగవత్కృత మగు నాత్మానాత్మోపదేశమును ప్రతిపాదించుట కీద్వితీయాధ్యాయ మారంభింపఁబడెను,

"సర్వేషాం దేహే మధువ ద్దిష్టత్వా న్మధు రహంకారః త మాత్మప్రకాశనేన సూదయతి నాశయతీతి మధుసూదనః" సర్వదేహములయందు తేనెవలె నిష్టమగునదిగాన నహంకారము మధు వనంబడును. అట్టియహంకారము నాత్మప్రకాశనముచే నశింపజేయువాడు కాన శ్రీకృష్ణుడు మధుసూదను డనబడును.

లేక, "ఇయం పృథివీ సర్వేషాం మధు" అను శ్రుత్యుక్తప్రకారము స్వరూపానందమును, నపరోక్షానుభూతికలవారలకు స్ఫురింపజేయువాఁడు కాన శ్రీకృష్ణుఁడు మధుసూదనుఁ డనఁబడును.

ఈశ్లోకమున "కృపయాఽఽవిష్టం" అని చెప్పుటచే ముముక్షు వగువాఁడు కృప మొదలగు నెనిమిది యాత్మగుణములు కలవాఁడై యుండవలె నని స్పష్ట మగుచున్నది. కనుకనే ఇట 'కృపయా' అను పద మాత్మనిష్ఠమగు క్షాంత్యాదిగుణాష్టకమున కుపలక్షణము. "దయా సర్వేషు భూతేషు క్షాంతి, రనసూయా, శుచి, రనాయాసో,మాంగల్య, మకార్పణ్య, మస్పృహా, చేత్యష్టా వాత్మగుణాః" సర్వభూతములయందును దయ, ఓర్మి, అసూయలేకపోవుట, పవిత్రత. ఆలసటలేకపోవుట, మాంగల్యము, కార్పణ్యము లేకపోవుట, కోరిక లేకపోవుట" అను గౌతమప్రతిపాదితము లగు నీగుణములు కలవారలకే లెస్సగ జ్ఞానము కలుగు.

"సోఽహం భగవ శ్శోచామి" అను శ్రుతిప్రకార "మీసంసారము నెట్లు తరించగలను" అని శోచించు (తపించు) వానినే ఈశ్వరుఁడు ననుగ్రహించును. అట్టివాడే యర్జునుడు అని సూచించుటకు "విషీదంతం" 'అశ్రుపూర్ణాకులేక్షణం' అను విశేషము లుపయోగించబడెను.

నీలకంఠీయము:— "ఈశ్లోకమున 'మధుసూదనః' అనుటచే దుష్టులను సంహరించెడివాఁడు కావుననే శ్రీకృష్ణుఁడు యర్జునుని నిమిత్తముగా జేసికొని నీపుత్రులను సంహరింపగలఁడు. కాన: నీపుత్రులకే జయము ప్రాప్తించు నని యాశింపకుము" అని సూచితమైనది. ॥౧॥

గీ॥ క్లైబ్యం మా స్మ గమః పార్థ! నైతత్త్వయ్యుపపద్యతే।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప! ॥ ॥౩॥

పదవిభాగము:— క్లైబ్యం- మా- స్మ- గమః- పార్థ- న- ఎతత్- త్వయి- ఉపపద్యతే-క్షుద్రం- హృదయదౌర్బల్యం- త్యక్త్వా- ఉత్తిష్ఠ- పరన్తప! । ॥౩॥

ప్రతిపదార్థము:— హే పార్థ!=కుంతికొమరుడవగు నోయర్జునా!; క్లైబ్యం=నపుంసకధర్మమును; (అధైర్యమును) మాస్మగమః=పొందకుము; ఎతత్=ఈయధైర్యము; త్వయి= (మహేశ్వరునితో యుద్ధముజేసిన) నీయందు; నోపపద్యతే=సమంజసము (మంచిది) కాదు, హేపరన్తప!=శత్రుతాపనుడవగునోయర్జునా!, క్షుద్రం=నీచమైన; హృదయదౌర్బల్యం=మనోదుర్బలత్వమును, త్యక్త్వా=వదలి,ఉత్తిష్ఠ= లెమ్ము; యుద్ధమును ప్రారంభింపుము. ॥౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓధృతరాష్ట్ర! శ్రీకృష్ణపరమాత్మ యర్జునునిగూర్చి యిట్లు పలికెను.

ఓ యర్జునా! ఈయుద్ధపరాఙ్ముఖత్వమును శాస్త్రార్థసాంప్రదాయము తెలియనివారు సేవించిరి. ఇయ్యది పాపహేతువగుటంజేసి స్వర్గప్రాప్తికి ప్రతిబంధకము. నివాతకవచాది రాక్షసులను జయించి ప్రఖ్యాతివడసిన నీవంటి యుత్తమక్షత్రియున కపఖ్యాతిని బుట్టించునది. ఇట్టి కశ్మలము (శిష్టగర్హితమగు యుద్ధపరాఙ్ముఖత్వము) విషమస్థానము (అసమయము) నందు సర్వశ్రేష్ఠుడవగు నిన్నే కారణముచే నాశ్రయించెనో తెలియకున్నది. ।౨॥

మఱియు శ్రీకృష్ణపరమాత్మ యర్జునునిగూర్చి యిట్లు పలికెను.

ఓయర్జునా! అధైర్యమును (క్లీబత్వమును) పొందకుము. శంకరునితో యుద్ధ మొనర్చి

—♦ ౨వ అధ్యాయము ౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— “శ్రీభగవానువాచ” అనుచోట ‘భగవాన్’ అనగా “ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశసశ్శ్రియః। వైరాగ్యస్యాథ మోక్షస్య షణ్ణాం భగ ఇతీంగనా” సంపూర్ణమగు నైశ్వర్యము, ధర్మము, కీర్తి, సంపత్తు, వైరాగ్యము ననెడి నీయాఱింటిని దెలుసుకొనువాడని యర్థము.

శిష్టగర్హితమగు నీయుద్ధపరాఙ్ముఖత్వ మసమయమందు నీకెట్లు ప్రాప్తమైనది. అనగా మోక్షేచ్ఛచేతనా? లేక స్వర్గేచ్ఛచేతనా! లేక యశఃకామునచేతనా? అని ప్రశ్నించుట.

మోక్షేచ్ఛచేతనందువా? స్వధర్మాచరణముచే నంతఃకరణపరిశుద్ధి నొంది మోక్షమును గోరు నపక్వకషాయులు స్వధర్మమును విడనాడరు. కాన మోక్షేచ్ఛచే నీవు యుద్ధపరాఙ్ముఖుడ వైతి ననుట బొసగదు” అని సూచించుటకు ‘అనార్యజుష్టం’ అని చెప్పబడెను. ఇక స్వర్గేచ్ఛచేనందువా? క్షత్రియులకు స్వర్గహేతువు స్వధర్మమగు యుద్ధముకాన: నట్టియుద్ధపరాఙ్ముఖత్వము నీకు తగదని చెప్పుటకు ‘అస్వర్గ్యం’ అని చెప్పబడెను. కీర్తికామనచేనందువా? క్షత్రియులకు యుద్ధము స్వధర్మము. అట్టి స్వధర్మాచరణవలన కీర్తి వృద్ధి నొందును. నీవట్టి స్వధర్మమగు యుద్ధమును బరిత్యజించిన నపకీర్తియే నాటిల్లును. కాని కీర్తి ప్రాప్తింపనేరదని సూచించుటకు “అకీర్తికరం” అని చెప్పబడెను. ॥౨॥

భాష్యోత్కర్షదీపిక:— స్వధర్మమగు నీయుద్ధమును జేయనిచో శుద్ధస్వభావుడవగు నీకు బాపము ప్రాప్తించునని సూచించుటకు “అర్జున!” అని సంబోధించెను.

—♦ ౨వ అధ్యాయము ౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— ఇట “పార్థ” సంబోధనచే “కుంతిచే నారాధింపబడిన మహేంద్రుని

అర్జున ఉవాచ;— కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన ।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన! ॥ ॥౪॥

పదవిభాగము:— అర్జునః- ఉవాచ। కథం- భీష్మం- అహం- సంఖ్యే- ద్రోణం-చ- మధుసూదన!- ఇషుభిః- ప్రతియోత్స్యామి- పూజార్హౌ- అరిసూదన ।

ప్రతిపదార్థము:— అర్జునః=అర్జునుఁడు; ఉవాచ=పలికెను; —హే అరిసూదన=అప్రయత్నముగ సర్వశత్రుసంహార మొనర్చిన; హేమధుసూదన=ఓశ్రీకృష్ణా!; పూజార్హౌ=పూల బూజింపదగిన; భీష్మం=(తాతయగు భీష్మునిని, ద్రోణంచ=(అస్త్రవిద్యాగురువగు) ద్రోణాచార్యులను; సంఖ్యే= యుద్ధమునందు; ఇషుభిః=బాణములతో; కథం=ఎట్లుల: ప్రతియోత్స్యామి=ఎదుర్కొని యుద్ధము చేసెదను. ॥౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—
యాతనిచే గొనియాడబడిన పౌరుషముగల నీకీయధైర్యము తగదు. నీచత్వమునకు గారణమగు నీయధైర్యమును వదలి యుద్ధము చేయుటకు సన్నద్ధుడవు కమ్ము. ॥౩॥

ఇవ్విధముగ భగవంతుడు తెలియజెప్పినను శోకాభిభూతమనస్కుఁ డగుటచే నర్జునుఁడు ప్రకృతమగు తన యభిప్రాయమును భగవంతుని కిట్లెరింగించెను.

అప్రయత్నముగ సర్వశత్రువులను నశింపజేసిన యోశ్రీకృష్ణ! తాతయగు భీష్ముడు, శస్త్రాస్త్రవిద్యాగురువగు ద్రోణాచార్యులు పూవుల పూజింపవలసినవారు. అట్టి వారల నెదిర్చి యుద్ధమునందు ప్రచండకాండములతో నెటుల యుద్ధము చేయగలను? ॥౪॥

వలన జన్మించిన నీకీక్లీబభావ మనర్హము' అని సూచితమయ్యెను. "త్వయి" అనుటచే యుద్ధమునందు మహేశ్వరు నోడించి ప్రసిద్ధి వడసిన నీకీక్లీబభావము తగదు అని సూచితమయ్యెను. "పరంతప" అను సంబోధనముచే 'శత్రుతాపనుడ వగుటంజేసి యుద్ధోన్ముఖుడ వగుటకు తగుదువు' అని సూచితమయ్యెను.

భాష్యోత్కర్షదీపిక:— "నామేనత్తకొమరుడవగు నీకు మాకుండు ధైర్యముండుట యుచితము" అని సూచించుటకు 'పార్థ' అని సంబోధించెను. "శత్రువులను దపింపజేయుము కాని యుద్ధోపరతుడవై నీకు హితమును జేకూర్చు స్వజనమును బాధింపకుము." అని సూచించుటకు "పరంతప" అని సంబోధించెను. ॥౩॥

—• ౨వ అధ్యాయము— ౪ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు. •—

నీలకంఠీయము:— "శత్రువులనుగాని, స్వభావదుష్టులనుగాని, హింసించుటయుక్తమేయగును. కాని బంధువులు దోషరహితులు నగు వారినెట్లు హింసింపదగును" అని యర్జును డీశ్లోకమున ప్రశ్నించుచుండెను.

"మధుసూదన! "అను సంబోధనముచే దుష్టులగువారిని, 'అరిసూదన' అను సంబోధనముచే శత్రువులగు వారినే హింసించెడి నీవుగూడ పూజార్హులు, దోషరహితులు నగు భీష్మద్రోణులను హింసించుమని యుపదేశించుట యసంగతమని సూచితమయ్యెను.

(గర్తయగు యర్జునుడు శోకవ్యాకులుడగుటచే "మధుసూదన" 'అరిసూదన' అని సంబోధనపదద్వయము సమానార్థకమేయైనను పౌనరుక్త్యదోషము నాపాదింపదని కొందరి (మధుసూదనసరస్వతి) యభిప్రాయము.)

"పూజ్యులగు భీష్మద్రోణులతో వాక్కలహమునైన జేయుట యనుచితమన నింక బాణములతో నెదుర్కొనవలెననిన నేమిచెప్పుదు" నని సూచించుటకు "ఇషుభిః" అనుపదము నివేశింపబడెను. ॥౪॥

గీ॥ గురూ నహత్వా హి మహానుభావా న్ఛ్రేయో భోక్తుం భైక్ష మపీహలోకే ।
హత్వార్థకామాం స్తు గురూ నిహైవ భుంజీయ భోగా న్రుధిరప్రదిగ్ధాన్ ॥౫॥

పదవిభాగము:— గురూన్- అహత్వా- హి- మహానుభావాన్- శ్రేయః- భోక్తుం- భైక్షం- అపి- ఇహ- లోకే- హత్వా- అర్థకామాన్- తు- గురూన్-ఇహ- ఏవ-భుంజీయ-భోగాన్-రుధిరప్రదిగ్ధాన్ ॥౫॥

ప్రతిపదార్థము:—మహానుభావాన్=శ్రుతశీలాధ్యయనసంపన్నులగు;గురూన్=భీష్మద్రోణాచార్యాదులను; అహత్వా=సంహరింపక; ఇహ=ఈ; లోకే=లోకమునందు; (అనగా నీభూలోకమునందు), భైక్షమపి=భిక్షాశనము నైనను, భోక్తుం=భుజించుట; శ్రేయః=శ్రేష్ఠతరము; గురూన్=గురువులను; హత్వా=వధించి; ఇహైవ=ఈ భూలోకమునందుమాత్రమే; రుధిరప్రదిగ్ధాన్=రక్తముచే బూయబడినపదార్థములువలె; ( అతితుచ్ఛమైనట్టి); భోగాన్=భోగరూపములగు; అర్థకామాంస్తు=శబ్దస్పర్శరూపరసగంధాత్మకము లగు నర్థములను; స్రక్చందన వనితాదిభోగములను; భుంజీయ=అనుభవించెదము. ॥౫॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఏకర్మమునకు నిహలోకమున జీవికావృత్తిమాత్రము ఫలమో యట్టి కర్మపాప హేతువు. క్షత్రియులకు యుద్ధము ధర్మకారణమైనను గుర్వాది వధాత్మకమగు నీకర్మము జీవికావృత్తి మాత్రహేతువగుటంజేసి పాపహేతువని తలంచి యర్జునుడు శ్రీకృష్ణపరమాత్మనుగూర్చి యిట్లు పలికెను. శ్రుతశీల వేదాధ్యయనాదులచే గొప్పవారలగు భీష్మద్రోణకృపాచార్యాదులనుసంహరించుటకన్న నీలోకమున భిక్షాశనమును భుజించుటమేలు. గురువులను వధియించి మన మనుభవించునది యీలోకమున నతితుచ్ఛమగు భోగరూపములైన నర్థకామములే కాని మఱొండు మోక్షమనుభవింపబోము. అట్టి యీలోకమునమాత్రమే యనుభవించు నీ యర్థకామముల నిమిత్త మీగురువధాత్మక కర్మ పాపహేతువు.

---

౨వ అధ్యాయము— ౫వ శ్లోక వ్యాఖ్యావిశేషములు.

మధుసూదనసరస్వతీయము:— భీష్మద్రోణకృపాచార్యాదులు గురువులైనను యుద్ధగర్వముచే నవలిప్తులును, అన్యాయముగ రాజ్యమును స్వీకరించుటచేతను, శిష్యద్రోహముచేతను కార్యాకార్యవివేకశూన్యులై న్యాయ మార్గము నతిక్రమించినవారలు. కాన "గురో రప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః । ఉత్పథం ప్రతిపన్నస్య పరిత్యాగో విధీయతే॥" అను న్యాయానుసారము వీరలు వధ్యులే యని శంకింపజనదు. వీరలు "మహాను భావాన్" అనగా: 'మహంజాడ్యమపహన్తీతిమహోఽగ్నిః తస్యేవ అనుభావః సామర్థ్యం యేషాం తేతథోక్తాః' జాడ్యము నపహరించు యగ్నివలె సామర్థ్యము గలవారలు యని యర్థము. అనగా అతితేజస్వులు. కాన "ధర్మ వ్యతిక్రమో దృష్టఈశ్వరాణాం చ సాహసమ్। తేజీయసాం న దోషాయ వహ్నే స్సర్వభుజో యథా" సమ ర్థులగు పెద్దలు సాహసముగ ధర్మమును కదాచిత్ అతిక్రమించెదరు. అట్టిధర్మవ్యతిక్రమము—పవిత్రాపవిత్ర వస్తువులను దహించుటవలన నగ్నికి యేదోష ముంటనటుల నట్టి పెద్దలయెడ దోషము నాపాదింపదు. కానభీష్మ ద్రోణకృపాచార్యాదులయెడ యవలిప్తత్వాదిదోషము సంభవింపదు.

భీష్ముడు స్వయముగ ధర్మరాజునుగూర్చి "అర్థస్య పురుషో దాసో దాసస్త్వర్థో న కస్యచిత్। ఇతిసత్యం మహారాజ బద్ధో స్మ్యర్థేనకౌరవైః ॥" ఓధర్మరాజా! పురుషుడు ధనమునకు దాసుడు. ధనము యెన్నడు బురుషు నకు దాసభావమును బొందదు. కాన కౌరవులచేత నేను నిత్యము ధనముచే గట్టబడితిని. అని చెప్పుటవలన భీష్మ ద్రోణాదులు అర్థవిక్రీతులు. గాన వీరి కట్టి మాహాత్మ్యము లేదందువా?

గీ॥ న చైతద్విద్మః కతరన్నో గరీయో యద్వా జయేమ యది వా నో జయేయుః ।
యానేవ హత్వా న జిజీవిషామ స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ॥ ॥౬॥

పదవిభాగము:— న- చ- ఏతత్- విద్మః- కతరత్- నః- గరీయః- యద్వా- జయేమ- యది- వా- నః- జయేయుః- యాన్- ఏవ- హత్వా- న- జిజీవిషామః- తే- అవస్థితాః- ప్రముఖే- ధార్తరాష్ట్రాః ॥౬॥

ప్రతిపదార్థము:— కతరత్=("కతరం" అని పాఠభేదము) భిక్షాశనయుద్ధములలో నేదైననొకటి; నః=మనలకు; గరీయః=గొప్పదో; ఏతత్=దీనిని; నవిద్మః=గుఱుతింపము; యద్వా=అట్లు కానిచో; వయం=(ఈపదమధ్యాహార్యము) మనము; జయేమ=జయించెదమో;? యదివా= అట్లు కానిచో; తే=(ఈపదమధ్యాహార్యము) అదుర్యోధనాదులు; నః=మనలను; జయేయుః=జయించెదరో; యానేవ=ఎవరలను; హత్వా=సంహరించి; వయం=(ఈపదమధ్యాహార్యము)మనము; న జీవిషామః=బ్రతుకగోరమో; తే=అట్టి:ధార్తరాష్ట్రాః=మాపెదతండ్రియగు ధృతరాష్ట్రుని కుమారులగు దుర్యోధనాదులు; ప్రముఖే= ఎదుట; అవస్థితాః=ఉండిరి. ॥౬॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

క్షత్రియులకు స్వధర్మ మగుటంజేసి నీకు యుద్ధమే కర్తవ్య మనినచో నిట్టి గురువధాత్మక యుద్ధము హింసాత్మకమును, పాపహేతువు నగుటంబట్టి యీ యుద్ధము కర్తవ్యమో? హింసాశూన్యమగుటచే భిక్షాశనము కర్తవ్యమో దోపకున్నది. యుద్ధమువలన జయము చేకూరు

---

అట్లు కాదు; ఏలన—వీరర్థకాములను గోరువారలైనను నాకుగురువులే యగుదురు. కానవీరలు నాయెడ యెంతమాత్రము దోషులు కారని సూచించుటకు తిరుగ నీశ్లోక ద్వితీయార్థమునందు "గురూన్" అని చెప్పెను. (ఈయర్థమున "అర్థకామాన్" అనునది గురువులకు విశేషణము).

శంకరానందీయము:— "మహాన్=అనర్గలః; అనుభావః=ధర్మబ్రహ్మవిషయకో బోధః: యేషాం తాన్ మహానుభావాన్" అడ్డులేని ధర్మబ్రహ్మవిషయకజ్ఞానము గలవారు గాన భీష్మద్రోణాదులు మహానుభావు లనంబడుదురు.

"అకృత్వా పరసంతాప మగత్వా ఖలమందిరమ్ । అక్లేశయిత్వా చాత్మానం య దల్ప మపి తద్బహుః" పరసంతాపమునుజేయక, దుర్మార్గుల గృహముల కేగక, శరీరమును క్లేశపెట్టక స్వల్పము ప్రాప్తించినను అది విస్తారమైనది అనున్యాయమున గుర్వాదిహింసారహితమగు భిక్షాశనమే మాకు శ్రేయస్కరము అని సూచించుట కీశ్లోకమునందు 'హి' అను శబ్దము ప్రయోగించబడెను.

అర్థాన్=ధర్మాదిపురుషార్థాన్; శిష్యేభ్యః కామయంతి=బోధయంతీతి; అర్థకామాన్" ధర్మార్థకామమోక్షములనెడి పురుషార్థచతుష్టయమును శిష్యుల కుపదేశించువారలుగాన గురువు లర్థకాము లనంబడుదురు.

పరమార్థప్రపా:— "తస్మా ద్బ్రాహ్మణాయ నాపగురేత న నిహన్యా న్న లోహితం కుర్యా దేతావతా హ్యేనసా భవతి" (ఆప) చతుర్థద్వితీయార్థే విపరిణేయా) అనగా బ్రాహ్మణుని—దిట్టుటయు, హస్తపాదాదులచే కొట్టుటయు, ఖడ్గాదులచే రక్తవంతునిగ జేయుటయు గూడదు. అట్లు చేసెనేని పాపియగును. అను నీయాపస్తంబసంహితానుసారము బ్రాహ్మణులగు ద్రోణాచార్యాదిగురువులను హింసించి పాపినై నేనీభోగముల నెట్లనుభవింతు నని పర్యవసితార్థము. ॥౫॥

—• ౨వ అధ్యాయము ౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇంతకు పూర్వమునందు జెప్పబడిన గ్రంథముచే సంసారదోష నిరూపణపురస్సరముగ నధికారివిశేషణములు జెప్పబడెను. అది యెట్లన "న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా

గీ॥ కార్పణ్యదోషోపహతస్వభావః పృచ్ఛామి త్వా ధర్మసమ్మూఢచేతాః ।
యచ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్ ॥

పదవిభాగము:— కార్పణ్యదోషోపహతస్వభావః- పృచ్ఛామి- త్వా- ధర్మసమ్మూఢచేతాః- యత్- శ్రేయః- స్యాత్- నిశ్చితం- బ్రూహి- తత్- మే- శిష్యః-తే-అహం-శాధి-మాం-త్వాం-ప్రపన్నం । ॥౭॥

ప్రతిపదార్థము:— కార్పణ్యదోషోపహతస్వభావః, కార్పణ్య=దైన్యమనెడి; దోష=దోషముచే; ఉపహత=కొట్టఁబడిన; స్వభావః=అంతఃకరణముగల; ధర్మసమ్మూఢచేతాః, ధర్మ=("ధరతీతి) ధర్మః" జగమును ధరించునని బ్రహ్మము. అట్టి జగద్ధారణసమర్థమగు బ్రహ్మమునందు; సమ్మూఢ=అవివేకత్వమును బొందిన; చేతాః=చిత్తముగల నేను; త్వా=నిన్ను; పృచ్ఛామి=అడుగుచుంటిని; యత్=ఏది; నిశ్చితం=ఆపేక్షికము కాని; శ్రేయః=శ్రేయస్సో; తత్=అట్టిమోక్షమును; మే=నాకొఱకు; బ్రూహి=చెప్పుము; అహం=నేను; తే=నీకు; శిష్యః=శిష్యుఁడను; త్వాం=నిన్ను; ప్రపన్నం=శరణుఁజెందిన; మాం=నన్ను; శాధి=అనుశాసింపుము. (నా కాత్మోపదేశముచేసి శిక్షింపుము.) ॥౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నసెదవా? ఆదియు సందిగ్ధమే. ఏలయన? జయపరాజయములు నిర్ణయించుటకు యెట్టివానికిని వీలుకావు. కాన మనమే దుర్యోధనాదులను జయించెదమో ! దుర్యోధనాదులు మనలనే జయించెదరో !

మనమే దుర్యోధనాదులను జయించెద మనెదవా? యెవరలను జయించి క్షణమాత్రము మనము జీవింపఁగోరమో యట్టి మాపెదతండ్రి కుమారులగు దుర్యోధనాదులే యెదుట నుండిరి. కాన నిట్టి దుర్యోధనాదులను జంపి జయమును గైకొనుటకన్న హింసారహితమగు భిక్షావృత్తితో జీవించుట మేలుకాదా ! ॥౬॥

జ్ఞాననిష్ఠునకు భిక్షావృత్తి చెప్పఁబడినను నిత్యానిత్యవస్తువివేకాదులే లేని నీకు భిక్షావృత్తి శాస్త్రగర్హితము. కాన స్వధర్మమగు యుద్ధమే నీకుఁ గర్తవ్య మనెదవా? అట్లైన చో స్వ

స్వజన మాహవే" అను శ్లోకమున యుద్ధనిహతునకు— "ద్వావిమౌ పురుషౌ లోకే సూర్యమండలభేదినౌ పరివ్రాడ్యోగయుక్తశ్చ రణేచాభిముఖో హతః" అను వాక్యానుసారము పరివ్రాట్టుతో సమానమగు యోగక్షేమములను జెప్పుటచే 'అన్య చ్ఛ్రేయో అన్యదుతైవప్రేయః' అను శ్రుతిసిద్ధమోక్షము జెప్పబడెను. అందువలన మోక్షముకంటె వేరగునది శ్రేయస్సు కానేరదు. అని నిత్యానిత్యవివేకము జూపఁబడెను. న కాంక్షే విజయం కృష్ణ" అనుచోట నైహికఫలభోగవిరాగము. "అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః" అను స్థలమున ఆముష్మికఫలభోగవైరాగ్యము, "నరకే నియతం వాసః" అనుశ్లోకమున స్థూలదేహముకంటె నతిరిక్తమగు నాత్మ కలదనియు, "కిం నో రాజ్యేన" అనుదానిచే నే వ్యాఖ్యానించినరీతిని శమము, "కిం భోగైః" అనుటచే దమము, "యద్య ప్యేతే నపశ్యంతి" అనుదానిచే లోభములేకుండుట, "తన్మే క్షేమతరం భవేత్" అనుదానిచే దితిక్షయు జూపఁబడెను. ఇదియే ప్రథమాధ్యాయసంగ్రహార్థము. ఇక "శ్రేయో భోక్తుం భైక్షం" అని సంన్యాససాధన మగు భిక్షాచర్యము, తదుపలక్షిత సంన్యాసము ఈ యధ్యాయమున జూపఁబడెను. ॥౬॥

—• ౨వ అధ్యాయము ౭వ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— సంసారమునందలి దోషముల బూర్తిగ దెలిసికొని యత్యంతము నిర్విణ్ణుఁడై శాస్త్రోక్తమార్గమున గురువును జేరి యర్థించినవానికే మోక్షవిద్యయం దధికారము కలదు. కాన

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ర్మానుష్ఠానమువలన ప్రాప్తించునవి దేవాదిజన్మములుకదా! స్వధర్మపరిత్యాగపాపముచే నీచమగు శ్వసూకరాదిజన్మములు ప్రాప్తించును గదా! అట్టి సూకరజన్మమును, దేవజన్మమును బొందినవారలకుఁ గల విశేష మేమియుఁ గానరాదు. ఇరువురు స్వదేహములయం దాత్మభ్రాంతి గలవారలే. స్వదేహమునందు మమతగలిగి తత్పోషణరతు లగుచుండిరి అట్టిజీవు లెన్ని జన్మము లెత్తినను మోక్షమును బొందలేరు. మఱియు సంసారసాగరముననే మునుఁగుచుందురు. కాన బుణ్యమైనను, బాపమైనను సంసారమునకే హేతువు లగుచున్నవి. కనుకనే ధర్మముకూడ సంసారమునకు హేతువగుటం బట్టి యధర్మమే యని శాస్త్రజ్ఞుల నిర్ణయము. కాన: నాస్వధర్మ మగు యుద్ధరూపకర్మకూడ ననేకానర్థసంకలితసంసారమునకుఁ గారణము. అట్టి తుచ్ఛముగుసంసారమునఁ బడుటకన్న మోక్షమును సంపాదించుట న్యాయము. కాన నేను ముముక్షువును, సంసారవిరక్తుడను, ఆత్మోపదేశసంగ్రహణాధికారి నని సూచించుచు నర్జునుఁ డిట్లు శ్రీకృష్ణభగవానునితోఁ బలికెను.

ఎవఁడు స్వల్పమైనను స్వనాశనమును సహింపఁడో అట్టివాఁడు కృపణుఁడు. వాఁ డనాత్మజ్ఞుడు. 'యో వా ఏతదక్షరం గార్గ్యవిదిత్వాఽస్మా ల్లోకా త్ప్రైతి స కృపణః' మానవజన్మము ప్రాప్తించినను యెవఁడు నాశరహితమగు నిత్యశుద్ధబుద్ధముక్తబ్రహ్మమును దెలిసికొనక మరణించునో వాడు కృపణుఁడు. అట్టివాని ధర్మము కార్పణ్యము (అనగా దైన్యము). అట్టి దైన్యరూపదోషముచే హతమగు నంతఃకరణము కలవాఁడ నగుటచే జగద్ధారణసమర్థమగు బ్రహ్మమును తెలిసికొనలేకుంటిని. కాన: రోగనివృత్తివలె వ్యభిచారి కానట్టియు, స్వర్గాదులవలె కర్మసాపేక్షము కానట్టియుఁ శ్రేయస్సును (మోక్షమును) గూర్చినిన్నడుగుచుంటిని. "నాపుత్రాయాశిష్యాయ ప్రబ్రూయాత్" పుత్రుఁడు కానివానికి, శిష్యుఁడు కానివానికి నట్టిబ్రహ్మవిద్య నుపదేశింపగూడ దను శాస్త్రనియమముచే నీవు పుత్రుఁడవు కావు, శిష్యుడవును కావు. అట్టి నీకెట్లుపదేశింపవలయుననెదవా? నేను నీశిష్యుండను; నిన్ను శరణుజెందితిని. నన్ను బ్రహ్మవిద్యోపదేశముచే శిక్షింపుము. ।౭॥

---

భీష్మాదివిషయకమగు సంకటమువలన "వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరంతి" అను శ్రుతిసిద్ధమగు భిక్షాచర్యము నందర్జునుని కభిలాషఁ జూపి శాస్త్రోక్త గురూపసదనమును గూడ భీష్మాదివిషయకసంకటవ్యాజముననే యీశ్లోకమున జూపుచున్నాడు. 'ధర్మసమ్మూఢచేతాః' ధర్మవిషయమున నొక నిశ్చయమును దేల్చెడి ప్రమాణము కనబడకపోవుటచే "వీరిని వధించుట ధర్మమా? లేక వీరిని పాలించుట ధర్మమా? అట్లే యీపృథివీపరిపాలనము ధర్మమా? లేక పూర్వానుభూతమగు వనవాసమే ధర్మమా?" అను నీమొదలగు సంశయములచే వ్యాప్తమైన మనస్సుకలవాడనై. అని యర్థము.

ఈశ్లోకమునందు "తద్విజ్ఞానార్థం స గురు మేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం" "భృగుర్వై వారుణిః। వరుణం పితర ముపససార। అధీహి భగవో బ్రహ్మేతి" ఇత్యాదిశ్రుతులచే జెప్పఁబడు గురూపసదనము బోధింపఁబడెను.

భాష్యార్కదీపిక:— "ధర్మసమ్మూఢచేతాః" భిక్షాశనము ధర్మమా? లేక యుద్ధము ధర్మమా? అని సందిగ్ధమనస్సు కలవాడనై నిన్నడుగుచుంటి నని యర్థము. ॥౩॥

గీ॥ న హి ప్రపశ్యామి మమాపనుద్యా ద్యచ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణామ్ ।
అవాప్య భూమా వసపత్న మృద్ధం రాజ్యం సురాణా మపి చాధిపత్యమ్ ॥ ॥౮॥

గీ॥ సంజయ ఉవాచ— ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరన్తపః ।
న యోత్స్య ఇతి గోవిన్ద ముక్త్వా తూష్ణీం బభూవ హ ॥ ॥౯॥

పదవిభాగము:— న- హి- ప్రపశ్యామి- మమ- అపనుద్యాత్- యత్- శోకం- ఉచ్ఛోషణం- ఇంద్రియాణాం- అవాప్య- భూమౌ- అసపత్నం- ఋద్ధం- రాజ్యం- సురాణాం- అపి- చ-ఆధిపత్యమ్ ।

పదవిభాగము:— సంజయః- ఉవాచ:— ఏవం- ఉక్త్వా- హృషీకేశం- గుడాకేశః- పరన్తపః- న- యోత్స్యే- ఇతి- గోవిన్దం- ఉక్త్వా- తూష్ణీం- బభూవ- హ । ॥౯॥

ప్రతిపదార్థము:—భూమౌ=భూమియందు: అసపత్నం=శత్రురహితమగునట్టియు; ఋద్ధం=సమృద్ధమైనట్టియు; రాజ్యం=క్షత్రియకర్మయగు ప్రజారక్షణపాలనాదికమును; సురాణాం=దేవతలయొక్క; ఆధిపత్యమపి=ప్రభుత్వమునైనను; అవాప్య=పొంది; యత్=ఏది; మమ=నాయొక్క; శోకం=దుఃఖమును; ఇంద్రియాణాం=ఇంద్రియములయొక్క; ఉచ్ఛోషణం=తాపమును; అపనుద్యాత్=పోగొట్టునో; తత్=(ఈపదమధ్యాహార్యము) అట్టిదానిని; నహిప్రపశ్యామి=చూడను. ॥౮॥

ప్రతిపదార్థము:— సంజయః=సంజయుఁడు, ఉవాచ=పలికెను, పరంతపః=శత్రువులను దపింపఁజేయునట్టి, గుడాకేశః=అర్జునుడు, హృషీకేశం=శ్రీకృష్ణునిఁగూర్చి, ఏవం=ఈప్రకారముగ, ఉక్త్వా=పలికి, గోవిందం=శ్రీకృష్ణునిగూర్చి; అహం=(ఈపదమధ్యాహార్యము) నేను, నయోత్స్యే=యుద్ధము చేయను ఇతి=ఈతీరున, ఉక్త్వా=పలికి, తూష్ణీంబభూవహ=ఊరకుండెనట, ("హ" అనుశబ్దము 'కిల' అనుపదపర్యాయము)

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

దేనిని బొందుటవలన నిప్పటున నాకుఁ గలిగిన శోకము, సర్వేంద్రియతాపము తొలగునో యట్టిదానిని గనుగొనఁజాలను. నిస్సపత్నమగు, సమృద్ధమైన నీభూలోకాధిపత్యమువలన నీశోకతాపాదులు నివృత్తములు కాఁజాలవా ? యనెదవేమో ! త్రిలోకాధిపత్యము చేకూరినను నీశోకతాపములు నివృత్తములు కావు. పరిమిత మగు నీభూలోకాధిపత్యమువలన నాశోకతాపము లెట్లు తొలఁగును ॥౮॥

---

—• ౧వ అధ్యాయము— ౮వ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— నిస్సపత్నమగు నీభూలోకాధిపత్యమును, దేవతాధిపత్యమును బొందినను గూడ నా కీశోకము పోజాలదు: అని యీశ్లోక పర్యవసితార్థము. అనగా "తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవ మేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే" ఈలోకమున కృష్యాదులవలన సంపాదితమగు దాన్యాదు లేతీరున నశించునో యదేతీరున పరలోకమున పుణ్యమువలన సంపాదితమగు స్వర్గాదులు నశించునను శ్రుతి చేతను, "ఏయ్యది కార్యమో అది యనిత్యము" అను అనుమానప్రమాణముచేతను, ఐహిక మగు ప్రతివస్తువు నశించుచుండుటను మనము చూచుచుండుటచేతను, ఐహికభోగము కాని, ఆముష్మికభోగము కాని నశించున వగుటచే శోకనివర్తకములు కానేరవు.

మఱియు నవి తామున్డు కాలమున భోగపారతంత్ర్యముచేతను, వినాశకాలమున వియోగముచేతను, శోకజనకములే యగుచున్నవి. కాన నీయుద్ధము శోకనివృత్తికొరకనుష్ఠింపదగినది కాదు. అని యర్థము. ఇట్లనుటచే నధికారివిశేషణమగు నిహాముత్రఫలభోగవిరాగ మర్జునునకు జూపఁబడెను. ॥౮॥

గీ॥ త ముచాచ హృషీకేశః ప్రహస న్నివ భారత! ।
సేనయో రుభయో ర్మధ్యే విషీదన్త మిదం వచః ॥ ॥౧౦॥

పదవిభాగము:—తం-ఉవాచ-హృషీకేశః-ప్రహసన్-ఇవ-భారత!-సేనయోః-ఉభయోః-మధ్యే-విషీదన్తం-ఇదం-వచః । ॥౧౦॥

ప్రతిపదార్థము:— హేభారత!= ఓభరతాన్వయసంభూతుడ వగు నోధృతరాష్ట్రా!; హృషీకేశః=మాయకుఁ బ్రభువగు (మాయాతీతుఁడగు) శ్రీకృష్ణపరమాత్మ; ఉభయోః=రెండయిన; సేనయోః=సేనలయొక్క; మధ్యే=మధ్యయందు; తం=ఆ; విషీదంతం=దుఃఖించుచున్న యర్జునునిగూర్చి; ప్రహసన్నివ=మందహాసము చేయుచు; ఇదం=ఈ చెప్పబోవు వాక్యమును; ఉవాచ=పలికెను. ॥౧౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ధృతరాష్ట్రునిఁగూర్చి సంజయుఁడిట్లు పలికెను. ఓ ధృతరాష్ట్రా! శత్రుతాపనుఁడగు నర్జునుఁడు శ్రీకృష్ణపరమాత్మనుగూర్చి తన శోకమును, సకలేంద్రియతాపమును వెలిబుచ్చి నేను యుద్ధముఁ జేయనని యూరకుండెను. ॥౯॥

భరతవంశోద్భవుడ వగు నోధృతరాష్ట్రా! ఉభయసేనలమధ్యయందు శోకమోహములచే వ్యాకులుడైన యర్జునుని గూర్చి శ్రీకృష్ణపరమాత్మ మందహాసముచేయుచు యిట్లుపలికెను. ౧౦.

—• ౨వ అధ్యాయము ౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "గుడాకేశః" ఆలసత్వమును జయించినవాడు. ఇది యర్జునునికి విశేషణము. "హృషీకేశం" సర్వేంద్రియప్రవర్తకు డగుటచే నంతర్యామి యగు. ఇది శ్రీకృష్ణునకు విశేషణము. "గోవిందం" వేదరూప మగు వాణిని దెలిసికొనువాడని శ్రీకృష్ణునకు విశేషణము. సర్వజ్ఞత్వ, సర్వశక్తిమత్వ సూచకములగు "గోవింద, హృషీకేశ" పదములచేభగవంతున కర్జునునిమోహమును బోఁగొట్టుట యనాయాస సాధ్య మని సూచింపఁబడెను. ॥౯॥

—• ౨వ అధ్యాయము— ౧౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు. •—

మధుసూదనసరస్వతీయము:— "ప్రహసన్నివ" అనుచితాచరణప్రకాశనముచే లజ్జనుపుట్టించువాడు వలె. అని యర్థము. అర్జునుడు భగవత్కృపాపాత్రుడుగాన యనుచితాచరణప్రకాశనము వివేకోత్పత్తికి హేతు వగుటచే నిట గౌణమైన ప్రహాసనమే గ్రాహ్యమని దెల్పుటకు 'ఇవ' అను శబ్దము ప్రయోగింపఁబడెను.

శంకరానందీయము:—"తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః" అను శ్రుతిప్రసిద్ధమగు బ్రహ్మాత్మైకత్వజ్ఞానము కలిగినకాని యీ యర్జునుడు ద్వైతభ్రమప్రవర్తకమగు భేదబోధకశాస్త్రముచే బోధింపఁబడి భ్రమమూలక మగు నీసంసారమును తరింపఁజాలఁ డని యూహించి 'త్వం' పదార్థ 'తత్' పదార్థశోధన పురస్సరముగ స్వస్వరూపజ్ఞానము నుపదేశింప నిశ్చయించి ప్రథమమున 'త్వం' పదార్థశోధన మవతరింప జేయుటకు "ఓహో! నీవు పండితుండ వనుకొంటిని; నీ పాండిత్య మింతటిదా" అని పరిహసించువాడువలె ముందు వాక్యమును పలికెను.

భాష్యార్కప్రకాశదీపిక:— "ప్రహసన్నివ" "మదాజ్ఞావశవర్తి వగు నీవిషయమై నేను బ్రసన్నుడ నైతిని" అని ప్రకటనచేయువాడువలె. అని యర్థము. ॥౧౦॥

—♦♦—

# సాంఖ్యయోగము.

శ్రీభగవా నువాచ— అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।
గతాసూ నగతాసూంశ్చ నానుశోచంతి పండితాః ॥ ౧౧॥

పదవిభాగము:— శ్రీభగవాన్- ఉవాచ।—అశోచ్యాన్- అను- అశోచః- త్వం- ప్రజ్ఞావాదాన్- -చ- భాషసే- గతాసూన్- అగతాసూన్- చ- న- అను- శోచంతి- పండితాః। ॥౧౧॥

ప్రతిపదార్థము:— హేభారత!=ఓ భరతాన్వయసంభూతుడవగు యర్జున!; త్వం=నీవు; అశోచ్యాన్= (సద్వృత్తులగుటచే, లేక, సదూప్రులగుటవలన నిత్యులగుటంబట్టి) దుఃఖింపదగని భీష్మద్రోణాదులనుగూర్చి; అన్వశోచః=దుఃఖించుచుంటివి; ప్రజ్ఞావాదాంశ్చ=ప్రజ్ఞావంతుల వాక్యములను; భాషసే=పలుకుచుంటివి; పండితాః=ఆత్మజ్ఞానులు; గతాసూన్=మరణించినవారలనుగూర్చి; అగతాసూంశ్చ=మరణింపనివారలనుగూర్చి; (లేక:—గతాసూన్=విపదభిముఖులనుగూర్చి; అగతాసూంశ్చ= విపదనభిముఖులనుగూర్చి;) (లేక:— ఇట చకారము ఇవార్థకము. అగతాసూంశ్చ=అగతాసువులను గూర్చివలె; గతాసూన్=మరణించినవారలనుగూర్చి;) నానుశోచంతి=దుఃఖింపరు.

---

శాంకరభాష్యమ్:—

(1) అత్ర చ- "దృష్ట్వా తు పాండవానీకం" (గీ1-2) ఇత్యారభ్య 'న యోత్స్య ఇతి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవహ' (గీ 2-9) ఇత్యేతదంతః ప్రాణినాం శోకమోహాది సంసార బీజదోషోద్భవకారణ ప్రదర్శనార్థత్వేన వ్యాఖ్యేయో గ్రంథః ।

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(1) ఈగీతాశాస్త్రము మూడువాక్యములుగా విభజింపదగియున్నది.

ఒకటి "ధర్మక్షేత్రే కురుక్షేత్రే" అను మొదటిశ్లోకము—ప్రకృతగీతాశాస్త్రము మహాభారతాంతర్గతము. అని వ్యక్తముచేయునుగాన ప్రథమశ్లోక మొకవాక్యము.

"దృష్ట్వా తు పాండవానీకం" అను ప్రథమాధ్యాయ ద్వితీయశ్లోకము మొదలు "ఏవ ముక్త్వా హృషీకేశం—ఉక్త్వా తూష్ణీం బభూవ హ" అను ద్వితీయాధ్యాయ నవమశ్లోకము వఱకు నొకవాక్యము.

"త మువాచ...ఇదం వచః" అను ద్వితీయాధ్యాయదశమశ్లోకము మొదలు గ్రంథ సమాప్తిపర్యంత మొకవాక్యము(తృతీయవాక్యము). గీతాశాస్త్రమునకుమహాభారతాంతర్గతత్వ ద్యోతక మగుటచే మొదటిశ్లోకమున కేకవాక్యత్వము సమంజసము. "త మువాచ...ఇదంవచః" అనునది మొదలుగాగల గీతాశాస్త్ర మర్జునుని యాశ్వాసననిమిత్తము ప్రవృత్త మగుటచే నేక వాక్యత్వము న్యాయము. "దృష్ట్వాతు పాండవానీకం" అనునది మొదలు "తూష్ణీం బభూవహ"

---

—• ౨వ అధ్యాయము ౧౧వ శ్లోకవ్యాఖ్యావిశేషము.

మధుసూదనసరస్వతీయము:— యుద్ధభూమియం దర్జునునకు స్వధర్మమగు యుద్ధమునం [illegible] ప్రవృత్తి గల్గియు, నది ద్వివిధమగు మోహముచేతను, తన్నిమిత్తమగు శోకముచేతను ని[illegible] యర్జునుని యాద్వివిధమగుమోహము పోగొట్టదగియున్నది. అందు స్వప్రకాశపరమానందరూపము సర్వసంసారధర్మ [illegible]

శాంకరభాష్యమ్:—

(2) తథా హ్యర్జునేన రాజ్యగురుపుత్రమిత్రసుహృత్స్వజనసంబంధిబాంధవేష్వహ మేతేషాం మమైత ఇత్యేవం ప్రత్యయనిమిత్త స్నేహవిచ్ఛేదాదినిమిత్తౌ వాత్మనశ్శోకమోహౌ ప్రదర్శితౌ- "కథం భీష్మ మహం సంఖ్యే" (గీ.2-4) ఇత్యాదినా శోకమోహాభ్యాం హ్యభూతవిజ్ఞాన స్స్వత ఏవ క్షత్రియధర్మే యుద్ధే ప్రవృత్తోఽపి తస్మా ద్యుద్ధా దుపరరామ, పరధర్మం చ భిక్షా జీవనాదికం కర్తుం ప్రవవృతే ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అనునంతవరకు నగు గ్రంథమున కేకవాక్యత్వ మెట్లనిన? "దృష్ట్వా తు పాండవానీకం" అనునది మొదలుగాగల "తూష్ణీంబభూవహ" అనునంతవరకునగు నీగ్రంథముప్రాణులకు (జీవులకు) దుఃఖాత్మకమగు సంసారమునకు హేతువగు శోకమోహ (మనస్తాప, వివేకాభావ)ము లనెడి దోషము జనించుటకు గారణమగు నహంకారమమకారములయు,*తద్ధేతువగు నవిద్యయొక్కయు ప్రదర్శనార్థ మగుటంజేసి యేకార్థప్రతిపాదక మగుటచే నేకవాక్యత్వము సిద్ధించును.

(2) అది యెట్లనిన? "కథం భీష్మమహం సంఖ్యే" అనునది మొదలుగాగల గ్రంథముచే-క్షత్రియధర్మమగు ప్రజాపరిపాలనము, పూజార్హులు గురువులు నగు భీష్మద్రోణాదులు, అభిమన్యుడు మొదలగు పుత్రులు, (వీరలు యితరసంబంధములేని మిత్రులు) ప్రత్యుపకారము నపేక్షింపక నుపకారము నాచరించు భగవత్ప్రముఖులగు సుహృత్తులు, దుర్యోధనాదులగు స్వజనులు, ద్రుపదధృష్టద్యుమ్నాదిసంబంధులు, (పితృపితామహులయం దనురాగముగల బంధువులు) వీరలయందు యర్జునునకు 'నేను వీరలసంబంధిని' వీరలు నాసంబంధువులు' అనుజ్ఞానముచే జనించునని బంధుస్నేహము, వారితో విచ్ఛేదము, వీరలను జంపుటవలన పాతకము, లోకమునందు నింద మొదలగునవి. వానికి హేతువులగునట్టియు, సంసారహేతువు లగునట్టియు శోకమోహములు జెప్పబడెను.

'ప్రసిద్ధమగు మహామహిమయు, వివేకజ్ఞానము గలిగి స్వధర్మమునందు ప్రవృత్తుడైన యర్జునున కీశోకమోహములుసంభవించె' ననియెట్లు లూహింపవలెననిన-శోకమోహములచేగప్పబడిన వివేకవిజ్ఞానము గలవాడగు యర్జునుడు స్వయముగాక్షత్రధర్మమునందు బ్రవృత్తుడైనను దనధర్మమగు యుద్ధమును వదలుకొని పరధర్మమగు భిక్షాజీవనాదికము నాచరించుటకు బ్రవృత్తుడగుటంజేసి శోకమోహము లర్జునునకు గలవని యూహింప నగును.

*మోహమనగు పరమాత్మయందు స్థూల, సూక్ష్మ కారణరూపోపాధిత్రయావివేకముచే మిథ్యాభూతసంసారమును సత్యముగాను, యాత్మధర్మముగాను దలంచుట యొకవిధమగు మోహము. ఇది సర్వప్రాణిసాధారణము. స్వధర్మమగు యుద్ధమును హింసాబాహుళ్యముచే నధర్మముగ భ్రమయుట రెండవవిధమగు మోహము. ఇది యర్జునుని కరుణాదిదోషముచే పుట్టినదిగాన నసాధారణ మగును.

శాంకరభాష్యమ్:—

(3) తథాచ సర్వప్రాణినాం శోకమోహాదిదోషావిష్టచేతసాం స్వభావత ఏవ స్వధర్మ పరిత్యాగః ప్రతిషిద్ధసేవా చ స్యాత్। స్వధర్మే ప్రవృత్తానా మపి తేషాం వాఙ్మనఃకాయాదీనాం ప్రవృత్తిః ఫలాభిసంధిపూర్వికైవ సాహంకారా చ భవతి।

(4) తత్రైవం సతి ధర్మాధర్మోపచయా దిష్టానిష్టజన్మసుఖదుఃఖసంప్రాప్తిలక్షణ స్సంసారోఽనుపరతో భవతీ త్యత స్సంసారబీజభూతౌ శోకమోహౌ। తయో శ్చ సర్వకర్మ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(3) అర్జునునియందుండు శోకమోహములు సంసారమున కెట్లు హేతువులగు ననిన-అజ్ఞానులగు నస్మదాదినిఖిలప్రాణులయందుండుశోకమోహములు స్వభావమువలన(శోకమోహాత్మకము లగుటంజేసి) సంసారమున కెట్లు హేతువులగునో, యట్లే యర్జునునియందుండు శోక మోహములు స్వధర్మపరిత్యాగప్రతిషిద్ధాచరణపూర్వకముగ సంసారహేతువు లగును.

శోకమోహములుగల కొందఱు స్వధర్మరతులై చరించుచుండిరి. ప్రతిషిద్ధసేవాస్వధర్మ పరిత్యాగములు కన్పట్టుటలేదు. కాన నిరుక్తానుమానప్రమాణము బాధితమని శంకింపరాదు. అట్టివారియెడ స్వధర్మానుష్ఠానము గాన్పించినను వారి ప్రవృత్తి యాధర్మమునెడ ఫలాభిసంధి పూర్వకముగను, సాహంకారముగను యగుచున్నది. కాన అట్టిధర్మము సంసారహేతువే యగుటం బట్టి * బాధదోషము ప్రాప్తించనేరదు. అందువలన యనుమానప్రమాణము నిష్కళంకము.

(4) పూర్వోక్తరీతిని శోకమోహములు సంసారహేతువు లగుచో దేలిన యాశయ మేమనః ధర్మానుష్ఠానమువలన ధర్మము వృద్ధినొంది "పుణ్యేన పుణ్యం లోకం నయతి" అను శ్రుత్యనుసారము దేవాదిజన్మ ప్రాప్తించి దానివలన సుఖప్రాప్తియు, నిషిద్ధకర్మాచరణమువలన నధర్మము వృద్ధినొంది దానివలన "పాపేన పాపం లోకం నయతి" అనుశ్రుత్యనుసారము శ్వసూకరాదితిర్యగ్జన్మములు ప్రాప్తమై వానివలన దుఃఖప్రాప్తియు; మిశ్రకర్మానుష్ఠానముచే "ఉభాభ్యా మేవ మనుష్యలోకం" అనుశ్రుత్యనుసారము మానవజన్మము, దానివలన సుఖదుఃఖ ములుగలుగును. ఇట్టి సుఖదుఃఖాత్మకసంసార మెల్లపు డనువర్తించుచునే యుండును.

కాన, "కథం భీష్మ మహం సంఖ్యే" అనునది మొదలుగాగల ప్రథమాధ్యాయ గ్రంథముచేతను, ద్వితీయాధ్యాయాంతర్గతమగు "తూష్ణీం బభూవ హ" అనునంతవరకు నైన

మొదటిదియగు మోహము హాదత్ర్యసాంవేకముచే గలుగు శుద్ధాత్మస్వరూపజ్ఞానమువలన దొలగును. రెండవది యగు మోహము, "యుద్ధము హింసాభూయిష్ఠమైనను స్వధర్మము" అనెడి జ్ఞానముచే నివర్తించును. ఈమోహద్వయసంబంధమగు శోకము మోహద్వయనాశముచే నశించును. అని యూహించి శ్రీకృష్ణభగవాను డీమోహద్వయమును నిరూపించుటకు "అశోచ్యా నన్వశోచ స్త్వం" ఇత్యాదికము నుపక్రమించెను.

* పక్షమునందు సాధ్య ముండకపోవుట బాధదోషము.

శాంకరభాష్యతత్త్వబోధినిః—
సంన్యాసపూర్వకా దాత్మజ్ఞానా న్నాన్యతో నివృత్తి రితి తదుపదిదిక్షు స్సర్వలోకసంగ్రహార్థ మర్జునం నిమిత్తీకృత్యాహ భగవా న్వాసుదేవః — అశోచ్యానిత్యాది ।

(5) తత్ర కేచి దాహుః—సర్వకర్మసంన్యాసపూర్వకా దాత్మజ్ఞాననిష్ఠామాత్రాదేవ కేవలా త్కైవల్యం న ప్రాప్యత ఏవ । కిం తర్హ్యగ్నిహోత్రాదిశ్రౌతస్మార్త సహితాద్ జ్ఞానాత్కైవల్యప్రాప్తి రితి సర్వాసు గీతాసు నిశ్చితోఽర్థ ఇతి । జ్ఞాపకం చాహు రస్యార్థస్య— "అథ చేత్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్య సి" (గీ2-33) "కర్మణ్యేవాధికారస్తే" (గీ2-47) "కురు కర్మైవ తస్మా త్త్వం" (గీ 4-15) ఇత్యాది ।

శాంకరభాష్యతత్త్వబోధినిః—
గ్రంథభాగముచే నాత్మాజ్ఞానజనితములగు సంసారబీజభూతములైన శోకమోహములు ప్రకటీకృతములు. (కాన ప్రథమాధ్యాయము, ద్వితీయాధ్యాయమున 'తూష్ణీం బభూవహ' అనునంతవరకు నగు గ్రంథభాగము శోకమోహరూపైకార్థప్రతిపాదక మగుటచే నొకవాక్యము)

అట్టి సంసారబీజభూతములగుశోకమోహములు సర్వకర్మసన్న్యాసపూర్వకాత్మజ్ఞాననిష్ఠామాత్రమువలననే నివృత్తము లగును; మఱియేయితరకారణములవలనను నివృత్తములు కాజాలవు. అను విషయమునుశ్రీకృష్ణపరమాత్మ యుపదేశింపదలచి సర్వలోకసంగ్రహముకొఱకర్జునుని నిమిత్తముగా జేసికొని 'అశోచ్యా నన్వశోచ స్త్వం' అనునది మొదలుగాగల గ్రంథభాగముచే సహేతుక శోకమోహనివృత్తికి వలయునుపాయనగు జ్ఞాన ముపదేశింపదొరకొనెను.

—• వృత్తికారపూర్వపక్షము •—

(5) సర్వకర్మసన్న్యాసపూర్వక మగు నాత్మజ్ఞాననిష్ఠామాత్రముకైవల్యసాధనమనునదియే సిద్ధాంతము. వృత్తికారు లీసిద్ధాంతమునకు విరుద్ధముగ నిట్లు నుడివియుండిరి.

వైదికకర్మతోను. స్మార్తకర్మతోను సముచ్చితముకాని కేవలజ్ఞాననిష్ఠామాత్రమువలన కైవల్యము ప్రాప్తింపనేరదు. మఱేమనిన? ప్రయాజములు, అనుయాజము లనెడి అంగయాగములతొ గూడిన దర్శపూర్ణమాసాదియాగములు స్వర్గసాధనమైనట్లు అగ్నిహోత్రాది శ్రౌతస్మార్తకర్మసముచ్చితమగు బ్రహ్మజ్ఞానము మోక్షసాధన మగును. అనగా ప్రయాజానుయాజాదీతికర్తవ్యముతో గూడిన దర్శపూర్ణమాసాదులు స్వర్గాదిఫలమునకు కరణ (సాధన)ము లగునట్లు బ్రహ్మజ్ఞానము కరణ మగుటంజేసి యది శ్రౌతస్మార్తకర్మసహితంబై మోక్షమునకు సాధనము.

ఇట్టి కర్మసముచ్చితజ్ఞానమువలననే మోక్షము ప్రాప్తించు నని 'అథ చేత్త్వ మిమం

ఆత్మస్వరూపు లగుటంజేసి యశోచ్యులగు భీష్మాదులవిషయమై శోచ్యత్వభ్రమ పండితుడవగు నీకు దగదు. ఆట్టిది పశ్వాదిసాధారణమని యర్థము. "ప్రజ్ఞావాదాంశ్చ భాషసే" "ప్రజ్ఞానాం అవాదాః"

శాంకరభాష్యమ్:—

(6) హింసాదియుక్తత్వా ద్వైదికం కర్మ ధర్మాయేతీయ మప్యాశంకా న కార్యా। కథం క్షాత్రం కర్మ యుద్ధలక్షణం గురుభ్రాతృపుత్రాదిహింసాలక్షణ మత్యంతక్రూర మపి స్వధర్మ ఇతి కృత్వా నాధర్మాయ. తదకరణే చ- 'తత స్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి' (గీ 2-33) ఇతి బ్రువతా యావజ్జీవాదిశ్రుతిచోదితానాం పశ్వాదిహింసాలక్షణానాం చ కర్మణాం ప్రాగేవ నాధర్మత్వ మితి సునిశ్చిత ముక్తం భవతీతి।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి" 'కర్మణ్యే వాధికార స్తే' 'కురు కర్మైవ తస్మా త్త్వం' అనునవి మొదలుగాఁ గల గీతావాక్యములే తెలుపుచున్నవి.

—• సాంఖ్యపూర్వపక్షము •—

(6) "న హింస్యా త్సర్వభూతాని" ఏభూతములను హింసింపవలదను శ్రుతిచే నిషిద్ధమగు హింస యధర్మరూపానర్థ హేతువు. అట్టి హింసతో కూడిన వైదికకర్మ ననుష్ఠించుటకు శక్యము కానందున మోక్షప్రయోజకమగు జ్ఞానమునకు కర్మతోసముచ్చయముపొసగదని యాక్షేపింపవలదు.

—• వృత్తికారసిద్ధాంతము •—

ఎట్లనిన ? యుద్ధమనునది గురుభ్రాతృపుత్రాదిహింసాయుక్తమైనను క్షత్రియధర్మము. అట్టి యుద్ధము నాచరింపనిచో క్షత్రియుఁడు పాపియగు నను స్మృతివలన యుద్ధరూపకర్మము క్షత్రియునకు నిత్యకర్మ యని యొప్పుకొనవలయును. అట్టి నిత్యకర్మ గురుభ్రాతృపుత్రాది హింసాయుక్తమైనను నిత్యకర్మయగుటచే నవశ్యకర్తవ్య మగుటంబట్టియు, అట్టి స్వధర్మమగు యుద్ధము బరిత్యజించిన 'తత స్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి' స్వధర్మమును, సంపాదితకీర్తినిఁ బరిత్యజించి పాపమును బొందుదువని శ్రీకృష్ణపరమాత్మయే బోధించుటవలనను, హింసాదియుక్తమైన స్మృతిచోదితయుద్ధరూపకర్మ మధర్మముకొఱకు కాదని సిద్ధమగుచున్నది. స్మృతిచోదిత మగు నత్యంతక్రూరమైన యుద్ధ మధర్మము కానిచో 'అగ్నీషోమీయం పశు మాలభేత' 'వాయవ్యం శ్వేత మాలభేత' ఇత్యాదిశ్రుతిచోదితపశ్వాది హింసాయుక్తయాగ రూపకర్మ యెట్లధర్మకారణమగును ? మఱియు ధర్మకారణమే యగును. 'న హింస్యా త్సర్వా భూతాని' అను శ్రుతి సామాన్యశాస్త్రము. తదపవాదమగు 'అగ్నీషోమీయం పశు మాలభేత'

భ్రాతృభ్రాతృలను చంపుట కనర్హ మనుచు "కథం భీష్మ మహం సంఖ్యే" ఇత్యాదివాక్యములను పలుకుచుంటివి. "ఇంత కన్న యనుచిత మేది కలదు?" అని సూచించుట కిట చకార ముపయోగింపఁబడెను. క్షత్రియుల కధర్మ మగు భిక్షాటనాదులయందు ధర్మత్వభ్రాంతియు, స్వధర్మమగు యుద్ధమునం దధర్మత్వభ్రాంతియుఁ బొందితివి పగు నీకుఁ దగదని భావము.

శాంకరభాష్యమ్—

(7) తదసత్, జ్ఞానకర్మనిష్ఠయో ర్విభాగవచనా ద్బుద్ధిద్వయాశ్రయయోః 'అశోచ్యాన్' (గీ 2-11) ఇత్యాదినా భగవతా యావత్ "స్వధర్మ మపి చావేక్ష్య" (గీ 2-31) ఇత్యేతదన్తేన గ్రంథేన యత్పరమార్థాత్మతత్త్వనిరూపణం కృతం తత్సాంఖ్యం, తద్విషయా బుద్ధి రాత్మనో

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అను శ్రుతి ననుసరించి సామాన్యశాస్త్రమునకు 'న హింస్యా త్సర్వా భూతాని' అను శాస్త్రము శ్రుతిచోదితహింసావ్యతిరిక్తజీవహింసానిషేధపర మని యర్థము సిద్ధనుగుచున్నది. కాన శ్రౌత కర్మ ప్రత్యవాయజనకము కాకపోవుటవలన శ్రౌతకర్మతో సముచ్చయము జ్ఞానమునకు సంభవించును.

— • భగవ ద్భాష్యకారసిద్ధాంతము • —

(7) స్వర్గాదులకు కరణములగు దర్శపూర్ణమాసము లనెడి యాగములు ప్రయాజానుయాజయాగము లనెడి యితికర్తవ్యతాకములతో గూడి స్వర్గసాధనము లయినట్లు కరణ మగుటచే బ్రహ్మజ్ఞానము శ్రౌతస్మార్తకర్మసముచ్చితమై మోక్షమునకు సాధనమను యనుమానము సంభవింప నేరదు.

ఏల ననః ఇది శుక్తిక (ముత్యపుచిప్ప) అను జ్ఞానమువలన నిది రజిత మను భ్రాంతి నివృత్త మగును. అట్టి భ్రాంతి నివృత్తమైన పిదప రజితభ్రాంతివలన గలుగు ప్రవృత్త్యాదులు నివృత్తము లగుచున్నవి. అట్టి ప్రవృత్త్యాదులు శుక్తిజ్ఞానమువలన నివృత్తము లగుటకు మఱియొకసాధనము నపేక్షించుటలేదు. అనఁగాఁ గర్మవలన ఫలము సిద్ధించునపుడు కర్మ మరియొక సాధనము నపేక్షించునట్లు జ్ఞానమువలన ఫలము ప్రాప్తించునపుడు జ్ఞానము సాధనాంతరము నపేక్షించుటలేదు. *కాన వ్యభిచారియగుటవలన కరణత్వహేతువు బ్రహ్మజ్ఞానమునందు శ్రౌతస్మార్తకర్మసముచ్చితత్వమును సాధింప నేరదు.

కరణత్వహేతువు బ్రహ్మజ్ఞానమునందు శ్రౌతస్మార్తకర్మసముచ్చితత్వమును సాధింపలేకున్నను ఈగీతాశాస్త్రమునందు "కర్మ ణ్యేవాధికార స్తే" "కురు కర్మైవ తస్మా త్త్వం" అనునవి మొదలుగాఁగల స్థలములయందు కర్మ చెప్పఁబడుటచే గీతాశాస్త్రమునందుఁ గర్మజ్ఞానసముచ్చయము ముపపాదితము. అనగా ననుమానప్రమాణము లేకున్నను శబ్దప్రమాణము వలనఁ గర్మజ్ఞానసముచ్చయము సిద్ధించు నని శంకింపవలదు.

---

బంధువిచ్ఛేదసమయమున దుఃఖించుట యనుచిత మెట్లగును? మహానుభావులగు శిష్టులు దుఃఖించిరి కాదా? యను నాశంకపొందిన "గతాసూ నగతాసూంశ్చ నానుశోచంతి పండితాః" అని చెప్పెను. 'మృతులగు వీరు సర్వోపకరణక్షీణులై గతించి యేమి చేసెదరు? ఎక్కడ నుందురు? అనియు, జీవించియున్న వీరు బంధు

---

* దేనిని సాధించుచుంటిమో అది సాధ్యము. అట్టి సాధ్యము లేనిచోట హేతు వుండిన నాహేతువు వ్యభిచారి యనఁబడును.

శాంకరభాష్యమ్:—

జన్మాదిషడ్వికి్రయాభావా దకర్తాఽఽత్మేతి ప్రకరణార్థనిరూపణా ద్యా జాయతే సా సాంఖ్య బుద్ధి స్సా యేషాం జ్ఞానినా ముచితా భవతి తే సాంఖ్యాః ।

(8) ఏతస్యా బుద్ధే ర్జన్మనః ప్రా గాత్మనో దేహాదివ్యతిరిక్తత్వకర్తృత్వభోక్తృత్వా ద్యపేక్షో ధర్మాధర్మవివేకపూర్వకో మోక్షసాధనానుష్ఠానలక్షణో యోగః, తద్విషయా బుద్ధి ర్యోగబుద్ధిః, సా యేషాం కర్మిణా ముచితా భవతి తే యోగినః ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఏలన ? ఈగీతాశాస్త్రమునందు సాంఖ్యబుద్ధి యని, యోగబుద్ధి యని రెండుబుద్ధులు జెప్పఁబడెను. అందు సాంఖ్యబుద్ధి నాశ్రయించి జ్ఞాననిష్ఠయు, యోగబుద్ధి నాశ్రయించి కర్మ నిష్ఠయు భిన్నపురుషాశ్రితములుగ జెప్పఁబడెను. అట్టి భిన్నపురుషాశ్రితములగు జ్ఞానకర్మనిష్ఠ లకు సముచ్చయము పొసఁగదు అట్లేని "జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్" అను విభాగవచనమునకు విరోధము ప్రాప్తించును. కాన శబ్దప్రమాణమువలన గూడఁ గర్మజ్ఞానములకు సముచ్చయము పొసగదు.

సాంఖ్య మనగ నేమనిన ? "అశోచ్యా నన్వశోచ స్త్వం" అనునది మొదలు "స్వధర్మ మపి చావేక్ష్య" అను నంతవరకు నగు గ్రంథభాగముచే నేపరమార్థాత్మతత్త్వము నిరూపింపఁ బడెనో యది సాంఖ్యము. ఎట్లనిన ? "సమ్యక్ ఖ్యాయత ఇతి సంఖ్యా" యెన్నగఁ బ్రకాశింపఁబడు వైదికమగు సమ్యగ్జ్ఞానము 'సంఖ్యా' అని యనఁబడును. అట్టిబుద్ధిచే బ్రకాశ్య మగు ప్రకృ తాత్మతత్త్వము సాంఖ్య మనబడును. అట్టి పరమార్థాత్మతత్త్వజ్ఞానము అనగా "న జాయతే మ్రియతే వా కదాచిత్" అనునది మొదలైన ప్రకరణార్థనిరూపణద్వారమున జనించునట్టిదియు, 'పుట్టుట, జన్మమువలన ప్రాప్తించు యస్తిత్వము, వృద్ధిబొందుట, పరిణమించుట, కృశించుట, నశించుట' అను నీ షడ్భావవికారము లాత్మకు లేనందున 'ఆత్మ కర్తకాదు' అను బుద్ధి సాంఖ్య బుద్ధి. అట్టి "ఆత్మా అకర్తా" అను సాంఖ్యబుద్ధికలవారలు సాంఖ్యులు (పరమహంసపరివ్రాజకులు).

(8) యోగమనగ నేమి ? "నేను కర్తనుగాను; భోక్తనుగాను; పరమాత్మస్వరూపుడను" అనుజ్ఞానము కర్మప్రవృత్తికి విరోధి. కాననిట్టి జ్ఞానోత్పత్తికి పూర్వమునందుండునదియు, "దేహా దులకంటె నేను వేరు; కర్తను; భోక్తను" అనుజ్ఞానముకలవాడై యిది ధర్మము, ఇది యధర్మ మని గుర్తించి ఫలమునం దిచ్ఛలేనివాడై యీశ్వరార్పణముగ నేకర్మ నాచరించునో యట్టి కర్మ సత్త్వశుద్ధిద్వారా జ్ఞానోత్పత్తికి హేతువగును. అట్టి కర్మ 'యుజ్యతే అనేనేతి' దీనిచే మోక్ష

వియోగముతో నెట్లు జీవింపఁగలరు?' అనియుఁ బండితులు దుఃఖింపరు. ఏలన? సమాధిసమయమునఁ బండితులకు బంధుప్రతిభాసమే యుండదు. ఇక సమాధివ్యుత్థానకాలమం దన్ననో బంధుప్రతిభాస మున్నను 'యది మిథ్య' అను నిశ్చయ మఁుండుటచేఁ బండితులు దుఃఖించుట కవకాశము లేదు. ఎట్లన 'ఇది రజ్జువు' అను రజ్జుతత్త్వసాక్షా

శాంకరభాష్యమ్:—

(8) తథా చ భగవతా ద్వే బుద్ధీ నిర్దిష్టే "ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు" (గీ 2-39) ఇతి। తయోశ్చ సాంఖ్యబుద్ధ్యాశ్రయాం జ్ఞానయోగేన నిష్ఠాం సాంఖ్యానాం విభక్తాం వక్ష్యతి— "పురా వేదాత్మనా మయా ప్రోక్తా" ఇతి। తథా చ యోగబుద్ధ్యాశ్రయాం కర్మయోగేన నిష్ఠాం విభక్తాం వక్ష్యతి— 'కర్మయోగేన యోగినామ్' (గీ. 3-3) ఇతి। ఏవం సాంఖ్యబుద్ధిం యోగబుద్ధిం చాశ్రిత్య ద్వే నిష్ఠే విభక్తే భగవతైవోక్తే జ్ఞానకర్మణోః కర్తృత్వాకర్తృత్వైకత్వానేకత్వబుద్ధ్యాశ్రయయో రేకపురుషాశ్రయత్వాసంభవం పశ్యతా।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

రూపపురుషార్థమునకు యోగ్యుడగునుగాన యోగ మనబడును. అట్టి కర్మజ్ఞానము యోగబుద్ధి. అట్టి యోగబుద్ధిగల కర్ములు యోగు లనంబడుదురు.

(8) "ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు" అను వాక్యముచే సాంఖ్యబుద్ధి, యోగబుద్ధులు వేర్వేరుగాఁ జెప్పఁబడెను. ఆ రెండింటిలో "పురా వేదాత్మనా మయా ప్రోక్తా" అను గీతావచనముచే సాంఖ్యులకు సాంఖ్యబుద్ధ్యాశ్రయమగు జ్ఞానయోగముచే నిష్ఠను భగవంతు డుపపాదించెను. ("యుజ్యతే ఆపాద్యతే బ్రహ్మణా తాదాత్మ్యమనేనేతి యోగః జ్ఞానమేవయోగః జ్ఞానయోగః" అనువ్యుత్పత్తి ననుసరించి జ్ఞానమను సాధనము జీవునకు బ్రహ్మతో తాదాత్మ్యము నాపాదించునది గానజ్ఞానము యోగమనంబడును.) "కర్మయోగేన యోగినాం" అను వచనముచే శ్రీకృష్ణపరమాత్మ— యోగబుద్ధ్యాశ్రయమగు కర్మయోగముచే నిష్ఠను కర్ములకు వేరుగ నుడివెను. (కర్మయోగమనగ "యుజ్యతేఽనేనేతి యోగః కర్మైవ యోగః కర్మయోగః" అను వ్యుత్పత్తి ననుసరించి బుద్ధిశుద్ధిద్వారమున దేనివలన మోక్షసామ్రాజ్యము చేకూరునో యట్టి నిష్కామకర్మయే కర్మయోగ మనబడును.)

ఈరీతిని జ్ఞాని, కర్ములకు జ్ఞానయోగకర్మయోగములచే నిష్ఠలను వేర్వేరుగఁ జెప్పుటకు హేతు వేమన? కర్మయనునది కర్తృత్వానేకత్వబుద్ధి నాశ్రయించునది. (అనగా "శరీరముకన్న నేను వేరు, నిత్యుడను, కర్తను, భోక్తను, నాకు కర్మఫలప్రదాత యీశ్వరుఁడు" అను జ్ఞానముకల మానవుఁడే కర్మను జేయును వానికే కర్మనిష్ఠ) ఎవనికి "నేను కర్తనుగాను, భోక్తనుగాను ఆత్మస్వరూపుఁడను" అను జ్ఞానము సంభవించునో వానికి జ్ఞాననిష్ఠ. కాన కర్మప్రవృత్తికి ప్రతిబంధకమగుజ్ఞాననిష్ఠ గలవానికి కర్మయోగముసంభవింపదని శ్రీకృష్ణపరమాత్మ— సాంఖ్యులకు జ్ఞాననిష్ఠయనియు, యోగులకుఁ గర్మనిష్ఠయనియు వేర్వేరుగఁ జెప్పెను.

త్కారముచే సర్పభ్రాంతి తొలఁగఁ దన్నిమిత్తమగు భయకంపాదులు సంభవింపనట్లు సమాధియందున్న బ్రహ్మతత్త్వసాక్షాత్కారవంతుల కట్టి వ్యామోహము గలుగనేరదు. పిత్తదోషమాశితరసనావంతున కొకప్పుడు

శాంకరభాష్యమ్:—

(10) యథైతద్వి భాగవచనం తథైవ శాతపథీయబ్రాహ్మణే "ఏతమేవ ప్రవ్రాజినో లోకమిచ్ఛంతో బ్రాహ్మణాః ప్రవ్రజంతి" ఇతి సర్వకర్మసంన్యాసం విధాయ తచ్ఛేషేణ 'కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయ మాత్మాఽయం లోకః' (బృహ. 4-4-22) ఇతి। తత్రైవ చ ప్రాగ్దారపరిగ్రహాత్పురుష ఆత్మాప్రాకృతో ధర్మజిజ్ఞాసోత్తరకాలం లోకత్రయసాధనం పుత్రం ద్విప్రకారం చ విత్తం మానుషం దైవం చ, తత్ర మానుషం విత్తంకర్మరూపం పితృలోకప్రాప్తిసాధనం విద్యాం దైవం విత్తం దేవలోకప్రాప్తిసాధనం "సోఽకామయత" ఇత్యవిద్యావత ఏవ సర్వాణి కర్మాణి శ్రౌతాదీని దర్శితాని। 'తేభ్యో వ్యుత్థాయ ప్రవ్రజంతి'

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(10) భగవద్గీత స్మృతియగుటవలన శ్రుతిసాపేక్ష కలదై యుండును. కాన నీభగవద్గీతయం దేజ్ఞాననిష్ఠాకర్మనిష్ఠలకు విభాగము దెలిపియుండెదె యద్విశతపథ బ్రాహ్మణమునందు 'ఏతమేవ ప్రవ్రాజినో లోకమిచ్ఛన్తో బ్రాహ్మణాః ప్రవ్రజన్తి" అని కానవచ్చుచున్నది. (అనగా నిత్యవిజ్ఞానరూపమగు నాత్మస్వరూపమును తెలిసికొనదలచి త్రివిధకర్మఫలమునందు తృష్ణను వదలి విరక్తులై సర్వకర్మలను బరిత్యజించినబ్రాహ్మణులు జ్ఞాననిష్ఠు లగుచుండిరి.) అని సన్న్యాసమును విధించి యనంతర మర్థవాదవాక్యమునందలి 'కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయ మాత్మాఽయంచ లోకః" అని సంతతిచే నేమిప్రయోజనమనిసంతతిని దిరస్కరించెను.

'పుత్రేణైతల్లోకం జయతి' కుమారునిచే నీలోకజయము ప్రాప్తించుచుండ బుత్రతిరస్కారము జేయుట యయుక్తము కాదా!' అని శంకింపజనదు.

"యేషాం నోఽయమాత్మాఽయంచ లోకః" "ఇది యాత్మ; ఈ లోకమాత్మస్వరూపము" అని జ్ఞానముగల విద్వాంసున కాత్మ వ్యతిరిక్తమగు ప్రజాసాధ్యలోకమే లేనందున బుత్రతిరస్కారము యుక్తమే" అని జ్ఞానము జూపబడెను. (చెప్పబడెను.)

ఆశతపథబ్రాహ్మణవాక్యమునందే కర్మనిష్ఠావిషయమున 'ప్రాగ్దారపరిగ్రహాత్పురుష ఆత్మా ప్రాకృతో ధర్మజిజ్ఞాసోత్తరకాలం లోకత్రయసాధనం పుత్రం, ద్విప్రకారంచ విత్తం మానుషం దైవంచ: తత్రమానుషం విత్తంకర్మరూపం పితృలోకప్రాప్తిసాధనం; విద్యాంచ దైవం విత్తం దేవలోకప్రాప్తిసాధనం సోఽకామయత" భార్యనుపరిగ్రహించుటకుపూర్వము ప్రాకృతజనుడు (అజ్ఞాని) ధర్మజిజ్ఞాసను సలిపినపిదపఇహలోకమునకగుపుత్రుడు, పితృలోకప్రాప్తికి సాధనమగు కర్మరూపమానుషవిత్తము, దేవలోకప్రాప్తికి సాధనమగువిద్యా (ఉపాసనా)నీనినిగోరి "జాయా మే స్యాత్" నాకు భార్య ప్రాప్తించుగాక యని కోరునని చెప్పుటవలన నవిద్యాకామములుగల

బెల్లము చేదుగ నగుపడినను దానియందు మధురత్వనిశ్చయ ముండుటచే బెల్లమునందు చేదుకొఱకుబ్రవృత్తిగలుగ నట్లు పండితునకు సమాధివ్యుత్థానసమయమున బంధుప్రతిభాసయున్నను దానియందుమృషాత్వనిశ్చయ ముండుటచే

శాంకరభాష్యమ్:—

ఇతి వ్యుత్థాన మాత్మాన మేవ లోక మిచ్ఛతోఽకామస్య విహితం । త దేత ద్విభాగవచన మనుపపన్నం స్యా ద్యది శ్రౌతకర్మజ్ఞానయో స్సముచ్చయోఽభిప్రేత స్స్యా ద్భగవతః ।

(11) న చార్జునస్య ప్రశ్న ఉపపన్నో భవతి 'జ్యాయసీ చే త్కర్మణస్తే' (గీ 3-1) ఇత్యాదిః । ఏకపురుషానుష్ఠేయత్వాసంభవం బుద్ధికర్మణో ర్భగవతా పూర్వ మనుక్తం- కథ మర్జునోఽశ్రుతం బుద్ధేశ్చ కర్మణో జ్యాయస్త్వం భగవ త్యధ్యారోపయే న్మృషైవ 'జ్యాయసీచే త్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన!' (గీ. 3-1)

(12) కించబుద్ధికర్మణో స్సర్వేషాం సముచ్చయ ఉక్త స్స్యా దర్జునస్యాపి ఉక్త ఏవేతి "య చ్ఛ్రేయ ఏతయో రేకం త న్మే బ్రూహి సునిశ్చితం" (గీ, 5-1) ఇతి కథ మన్యతరవిషయ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వానికే శ్రౌతాదినిఖిలకర్మలును జెప్పజడెను. "తేభ్యోవ్యుత్థాయప్రవ్రజన్తి" ఇట్టి కర్మలయందు విరక్తులై సంసన్యాసమును స్వీకరించుచుండిరి.- అనగాసర్వకర్మసంన్యాసపూర్వకాత్మజ్ఞాననిష్ఠులగు చుండిరి. అని ఆత్మజ్ఞానమును గోరెడివారలకు దారైషణా—పుత్రైషణా-ధనైషణారూపైషణా త్రయపరిత్యాగులకే జ్ఞాననిష్ఠ జెప్పబడెను. కాన శ్రౌతకర్మతో సముచ్చయము జ్ఞానమునకుఁ జెప్పిన శతపథబ్రాహ్మణమునందు జెప్పబడిన సర్వకర్మసంన్యాసికి జ్ఞాననిష్ఠ, అవిద్యాకామవంతు నికి కర్మనిష్ఠ యను విభాగము బాధిత మగును. కాన శ్రుతివిరోధమువలన గర్మజ్ఞానసముచ్చ యము పొసగదు. కావున శ్రుతికి విరుద్ధముగ శ్రీకృష్ణపరమాత్మ యుపదేశించియుండలేదు.

(11) కర్మజ్ఞానములకు సముచ్చయము భగవదభిప్రేతమైనచో "జ్యాయసీ చే త్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన!' 'ఓశ్రీకృష్ణ! నీకు కర్మకంటె జ్ఞానమే యుత్కృష్టమని సమ్మత మైనచో' అని భగవంతునిచే బూర్వమునందు గర్మజ్ఞానముల కేకపురుషానుష్ఠేయత్వము పొసగదని చెప్పబడనియెడల దాను వినకున్న గర్మకంటె బుద్ధికి జ్యాయస్త్వము భగవత్సమ్మత మని భగవంతునియం దెట్లారోపించును? కాన నర్జునప్రశ్నపర్యాలోచనముచేఁ గర్మజ్ఞాన సము చ్చయ మభిప్రేతముకాదు.

(12) బుద్ధికర్మలకు సముచ్చయము భగవదభిప్రేతమై యట్టి సముచ్చయమే శ్రీకృష్ణుఁ డుపదేశించిన నట్టి కర్మజ్ఞానములను దా ననుసరింపవలసియుండ బంచమాధ్యాయ ప్రారంభ మున "య చ్ఛ్రేయ ఏతయో రేకం త న్మే బ్రూహి సునిశ్చితమ్" కర్మ, కర్మసంన్యాసములలో యేది శ్రేయస్సాధనమో దానినిఁ జెప్పుమని ప్రశ్నించుట ఎటుల సమంజస మగును?

మోహమును బొందడు. కాన నాత్మస్వరూపజ్ఞానముచేదత్స్వరూపాజ్ఞానముతోఁ(గ నాత్మస్వరూపాజ్ఞానముచే గలుగు శోచ్యత్వభ్రమ తొలగు నని భావము.

శాంకరభాష్యమ్:—

ఏవ ప్రశ్న స్స్యాత్ । న హి పిత్త ప్రశమనార్థినో వైద్యేన మధురం శీతం చ భోక్తవ్య మిత్యు పదిష్టే తయో రన్యతర త్పిత్త ప్రశమన కారణం బ్రూహీతి ప్రశ్నో భవతి ।

(13) అథార్జునస్య భగవదుక్తవచనార్థవివేకానవధారణనిమిత్తః ప్రశ్నః కల్ప్యేత, తథాపి భగవతా ప్రశ్నానురూపం ప్రతివచనం దేయం- మయా బుద్ధికర్మణో స్సముచ్చయ ఉక్తః కిమర్థ మిత్థం భ్రాంతో౽సీతి। నతుపునః ప్రతివచన మననురూపం పృష్టాదన్యదేవ "ద్వే నిష్ఠే మయా ప్రోక్తే" ఇతి వక్తుం యుక్తం ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

శ్రీకృష్ణపరమాత్మ సర్వులకు గర్మజ్ఞానసముచ్చయము జెప్పెను. కాని యర్జునునకు మాత్ర మట్టి కర్మజ్ఞానసముచ్చయమును చెప్పనందున "యచ్ఛ్రేయ ఏతయో రేకం త న్మే బ్రూహి సునిశ్చితమ్" అని యర్జుముని ప్రశ్న మేల సమంజసము కాదని ప్రశ్నింపరాదు.

సర్వులకు బుద్ధికర్మసముచ్చయము చెప్పబడినచో నది యర్జునునకు గూడ జెప్పబడినదే. కాన నట్టి కర్మజ్ఞానసముచ్చయమును దెలిసికొని "యచ్ఛ్రేయ ఏతయో రేకం త న్మే బ్రూహి సునిశ్చితమ్" అని ప్రశ్నించుట యెట్లు సమంజస మగును?

శ్రీకృష్ణపరమాత్మ సర్వులకును గర్మజ్ఞానసముచ్చయ ముపదేశించినను గర్మకంటె జ్ఞాన ముత్కృష్టమని తలంచి "యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మేబ్రూహిసునిశ్చితమ్" అని ప్రశ్నించె నందురా? పైత్యరోగశాంతినిగోరి యొకానొకడు వైద్యుని కడకేగి పైత్యరోగశాంతి కౌషధము జెప్పుమనిన నదివిని వైద్యుడు మధురమును, జల్లనిదియు నగు పదార్థమును భక్షింపుమని చెప్ప నది గమనించినరోగి మధురపదార్థము భుజింపదగినదా? చల్లనిపదార్థము భుజింపదగినదా? యని ప్రశ్నించునా? ప్రశ్నింపడు. అట్లే కర్మజ్ఞానములకు సముచ్చయము శ్రీకృష్ణభగవానుడు జెప్పి యుండ వాటి ననుష్ఠింపవలసినదియే కాని 'య చ్ఛ్రేయ ఏతయో రేకం త న్మే బ్రూహి సునిశ్చితమ్' అని ప్రశ్నించుట తగదు (అందువలన నర్జునుని ప్రశ్నపర్యాలోచనముచే కర్మజ్ఞానసముచ్చయము పొసగదని యాశయము.)

(13) శ్రీకృష్ణపరమాత్మచే బుద్ధికర్మసముచ్చయము చెప్పబడినను నర్జునుఁ డది దెలిసికొనక 'వ్యామిశ్రేణైవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే । తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయో౽హ మాప్నుయామ్" అనిప్రశ్నించెనినను, శ్రీకృష్ణపరమాత్మ యందులకు దగుసమా

ఇక వశిష్ఠాదులు ప్రారబ్ధకర్మ ప్రాబల్యముచే నట్లు దుఃఖము ననుకరించిరి. శిష్టులుధర్మబుద్ధితో ననుష్ఠించు నలౌకికవ్యవహారమే శిష్టాచార మనబడును: కనుక వారి దుఃఖము శిష్టాచారమై యితరానుష్ఠేయత్వము నాపా దింపదు. అట్లు కానిచో శిష్టకృతమగు నిష్ఠీవనాదికముగూడ నాచరణీయ మయ్యెడిని. కానఁ బండితుఁడ వగు నీవు దుఃఖింపవలదని భావము.

శాంకరభాష్యమ్:—

(14) నాపి స్మార్తేనైవ కర్మణా బుద్ధేః సముచ్చయోఽభిప్రేతే విభాగవచనాది సర్వ-ముపపన్నమ్ ।

(15) కించ క్షత్రియస్య యుద్ధం స్మార్తం కర్మ స్వధర్మ ఇతి జానతః "తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి" (గీ. 3-1) ఇత్యుపాలంభోఽనుపపన్నః తస్మాద్గీతాశాస్త్రే ఈషన్మాత్రేణాపి శ్రౌతేన స్మార్తేన వా కర్మణా ఆత్మజ్ఞానస్య సముచ్చయో న కేనచిద్దర్శయితుం శక్యః ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ధానము "నాచే బుద్ధికర్మసముచ్చయము జెప్పబడియుండ నీవిక్లెందులకు భ్రాంతినొందితి" వని పలుకుటకుమాఱుగా ప్రశ్నానురూపముగ "లోకేఽస్మిన్ద్వివిధా నిష్ఠా పురాప్రోక్తా మయానఘ! జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్" ఓ యర్జున! సాంఖ్యులకు జ్ఞానయోగముచే నిష్ఠయు, యోగులకు కర్మయోగముచే నిష్ఠయనియు నాచే పూర్వము రెండు నిష్ఠలు వచింపబడినవి.' అని జ్ఞానకర్మలు భిన్నపురుషాశ్రయములుగ జెప్పెను. ప్రశ్నయొకటి ప్రత్యుత్తరము వేరొకటియా? అట్టితీరున భగవంతునికిగూడ మిథ్యావాదిత్వకల్పనము జేయుట న్యాయముకాదు. కాన: శ్రౌతకర్మజ్ఞానములకు సముచ్చయ మెట్లు చూచినను సరిపడదు.

(14) బుద్ధికి స్మార్తకర్మసముచ్చయము జెప్పినచో బుద్ధికర్మలకు భిన్నపురుషానుష్ఠేయత్వమును బోధించు శతపథబ్రాహ్మణమునకు 'జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్' అనునది మొదలుగాగల గీతాశాస్త్రమునకు' జ్యాయసీచేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన!' అను వాక్యముచే బుద్ధియందుపపాదితజ్యాయస్త్వమునకు, పంచమాధ్యాయ ప్రథమమునందు 'సన్న్యాసం కర్మణాం కృష్ణ! పునర్యోగం చ శంససి । యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్" అను వాక్యముచే జేయబడిన ప్రశ్నకు "సంన్యాసః కర్మయోగశ్చ నిఃశ్రేయసకరావుభౌ, తయోస్తు కర్మసంన్యాసాత్కర్మయోగోవిశిష్యతే" అను శ్లోకముచే జెప్పబడిన లేక "జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్" అను వాక్యముచే జెప్పబడిన భగవత్ప్రతివచనమునకు నిరుక్తరీతిని విరోధము ప్రాప్తించును.

(15) మరియు క్షత్రియునకు యుద్ధము స్మార్తకర్మయని తెలిసినయర్జునుడు కర్మజ్ఞానములకు సముచ్చయమే భగవదభిప్రేతమైనచో యుద్ధమవశ్యకర్తవ్యమైయుండ "తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ!" కర్మకంటె జ్ఞానమే యుత్కృష్టమైనచో ఘోరమగు నీయుద్ధము

శంకరానందీయము:— "ప్రజ్ఞావాదాంశ్చ భాషసే" "ప్రజ్ఞావాదాః" సదసత్పదార్థస్వరూపమును వివేచనపూర్వకముగ నెవరు లెస్సగ తెలిసికొనెదరో వారుప్రాజ్ఞులు. వారియొక్క "ఆవాదాన్" శాస్త్రమునంతటను వ్యాపించిన (శాస్త్రసమ్మతమైన)వాక్యములను బలుకుచుంటివి. అశోచ్యులనుగూర్చిమఃఖించుచుంటివి. విరుద్ధములగు నీరెండు నొకచో నుండనేరవు. కాన నీవు పరమమూఢుడవని భావము.

శాంకరభాష్యమ్:—

(16) యస్య త్వజ్ఞానా ద్రాగాదిదోషతో వా కర్మణి ప్రవృత్తస్య యజ్ఞేన, దానేన, తపసా వా విశుద్ధసత్త్వస్య జ్ఞాన ముత్పన్నం పరమార్థతత్త్వవిషయ మేక మేవేదం సర్వం బ్రహ్మాకర్తృచేతి తస్య కర్మణి కర్మప్రయోజనేచ నివృత్తేఽపి లోకసంగ్రహార్థం యత్నపూర్వం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నం దెందులకు నియోగించెదవను నుపాలంభము సరిపడనేరదు. కాన— గీతాశాస్త్రమునందు జ్ఞానమునకు ఉపనిషన్మాత్రమగు శ్రౌతకర్మతోగాని, స్మార్త కర్మతోగాని సముచ్చయ మెవరి చేతను జూపించుటకు శక్యముకాదు.

(16) "కుర్యా ద్విద్వాం స్తథా సక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్" అజ్ఞాని యెట్లు కర్మల నాచరించునో యటులనే విద్వాంసుఁడుగూడ కర్మలయందాసక్తి లేకయే లోకసంగ్రహమును గోరి కర్మల నాచరింపవలయు నని యీగీతలయందు జెప్పబడుటచే గర్మజ్ఞానసముచ్చయము సిద్ధించుచున్నదని శంకింపరాదు.

ఎవ డజ్ఞానమువలన జనించు రాగాదిదోషముచేఁ గర్మలయందు బ్రవృత్తుఁడై యజ్ఞదాన తపస్సులచే శుద్ధాంతఃకరణుడై 'ఏకమేవేదం సర్వం బ్రహ్మాకర్తృచ' ఈనిఖిలప్రపంచము అక ర్తయు, సజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యుఁడు నగు బ్రహ్మస్వరూప మను పరమార్థతత్త్వ విషయకజ్ఞానముక లిగియుండునోఅట్టివానికిఁగర్మ,కర్మప్రయోజనములునివృత్తములైనను ప్రయ త్నపూర్వకముగ నజ్ఞానావస్థయందువలె లోకసంగ్రహార్థము కర్మయందుగల యేప్రవృత్త్యాభా సము గలదో యది బుద్ధికి సముచ్చితమగు (మోక్షకారణమగు బుద్ధికి సహకారి) *కర్మము కాదు.

"అట్లగుచో నిట్టిసమయమున బండితు లేమిచేసెదరు?" అను నాశంకమీఁద జెప్పుచున్నాడు— కేవల మూఢులు "నాపుత్రులు మడిసిరి" అని మృతులనుగూర్చియే దుఃఖింతురు. ఇఁక శాస్త్రజ్ఞులు "పుత్రాదులు మూఢులు దుర్వృత్తులు నైరి" అని బ్రతికియున్న వారలనుగూర్చియే దుఃఖింతురు. పండితు లన్ననోగతాసువులు, నగతాసువులుగూడ నవిద్యాకార్యములుగాన స్వాప్నికపదార్థములవలెనసత్పదార్థముగ నెఱింగివారిద్దరియందును బ్రహ్మమునే చూచెదరు. కాన వారలనుగూర్చి దుఃఖింపరు. "బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య" అను శ్రుతిచే నెవరు సర్వథా యంతటను యసత్తును విడచి సత్పదార్థమునే గ్రహించెదరో వారు పండితులు.

పరమార్థప్ర పా:— "ప్రజ్ఞ యా వాదా (ప్రజ్ఞావాదాః" వచనచాతుర్యమాత్రముచే వాక్యములను బలుకుచుంటివి. ఇట్టి యజ్ఞాతప్రలపనము నీకుఁ దగదని యర్థము.

*బుద్ధికర్మసముచ్చయ మనఁగ మోక్షమునకు కర్మయను సహకారికారణముతో గూడిన జ్ఞానమే కారణము అనగా జ్ఞానమునకు పూర్వమునం దాచరించిన కర్మము చిత్తశుద్ధికి కారణమై యద్దానివలన జ్ఞానము కలుగును. కాని జ్ఞానకాలమున కర్మము ననుష్ఠింపనిచో నాజ్ఞానము మోక్షమునకుఁ గారణము కానేరదు. కాన జ్ఞానకాల మున గర్మ నాచరించిన నాకర్మయు, జ్ఞానమును బరస్పరసహకారులై మోక్షమును గలిగించును. అనునదియే సముచ్చయవాదము. జ్ఞానిచే లోకసంగ్రహార్థ మాచరింపబడిన కర్మకు లోకసంగ్రహమే ప్రయోజనము; మోక్షము ప్రయోజనము కాదు. కాన నాకర్మతో జ్ఞానమునకు సముచ్చయము సంభవింపదు, అని యాశయము

శాంకరభాష్యమ్—

యథాప్రవృత్త స్తథైవ కర్మణి ప్రవృత్తస్య యత్ప్రవృత్తిరూపం దృశ్యతే న తత్కర్మ యేన బుద్ధే స్సముచ్చయ స్స్యాత్ ।

(17) యథా భగవతో వాసుదేవస్య క్షాత్రకర్మచేష్టితం న జ్ఞానేన సముచ్చీయతే పురుషార్థసిద్ధయే తద్వ త్ఫలాభిసంధ్యహంకారాభావస్య తుల్యత్వా ద్విదుషః । తత్త్వవిత్తు నాహం కరోమీతి మన్యతే, నచ తత్ఫల మభిసంధత్తే । తథా చ స్వర్గాదికామార్థినోఽగ్నిహోత్రాది కామసాధనానుష్ఠానా యాహితాగ్నేః కామ్య ఏవాగ్నిహోత్రాదౌ ప్రవృత్తస్య సామికృతే వినష్టేఽపి కామే తదేవాగ్నిహోత్రా ద్యనుతిష్ఠతోఽపి న తత్కామ్య మగ్నిహోత్రాది భవతి ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(అనగా "చోదనాలక్షణోఽర్థో ధర్మః" అను జైమినిసూత్రానుసారము విధివిహిత కర్మమే ధర్మము. క్రియామాత్రము ధర్మము కానేరదు. కాన వర్ణాశ్రమాభిమానశూన్యున కధికారము లేమింజేసి యవిద్యాలేశమువలన జ్ఞానిచే ననుష్ఠింపఁబడు కర్మలు కర్మాభాసములు గాన 'కుర్యా ద్విద్వాన్' అను వాక్యము కర్మజ్ఞానసముచ్చయమును బోధింపనేర దని యాశయము.)

(17) ఫలాభిసంధిశూన్యప్రవృత్తి యగుటవలన, లేక అహంకారశూన్యప్రవృత్తి యగుటవలనఁగాని భగవత్ప్రవృత్తి ఫలవిషయమున జ్ఞానమునకు నెట్లు సహకారి కానేరదో యదేరీతిని 'నేను కూటస్థబ్రహ్మను' అను జ్ఞానముగల విద్వాంసుని ప్రవృత్తి గూడ ఫలాభిసంధిశూన్యమగుటంజేసి మోక్షవిషయమున నట్టి విద్వాంసుని ప్రవృత్తి జ్ఞానమునకు సహకారి కానేరదు. లేక విద్వత్ప్రవృత్తి యహంకారాభావపూర్వక మగుటవలన ఫలవిషయమున జ్ఞానమునకు సహకారి కానేరదు. భగవానునికి ఫలాభిసంధి కాని యహంకారము కాని లేనటుల విద్వాంసుడు ఫలము నపేక్షింపఁడు. 'నేను జేయుచుంటి' నని యహంకారమును బొందడు. అది యెట్లనిన? 'నేను కూటస్థబ్రహ్మస్వరూపుడ' నను జ్ఞానముకల విద్వాంసుడు దృశ్యములగు (చూడబడు) రూపాదులు ద్రష్ట (చూచువాని) ధర్మములు కానందున ప్రవృత్తినిగాని, తత్ఫలమునుగాని స్వనిష్ఠములుగ (ఆత్మనిష్ఠములుగఁ) జూడఁడు. కాన తత్త్వవేత్తకు వ్యాఖ్యానమునం దహంకారము, భిక్షాటనమునందుఁ దృప్తియు నాభాసములే యగును. కాన బూర్వోక్త హేతుద్వయము విద్వత్ప్రవృత్తి యం దుండుటచే స్వరూపాసిద్ధము కాదు.

బ్ర॥ వే॥ జయంతి భగీరథశాస్త్రిలవారి యభిప్రాయము:—

"ప్రజ్ఞావాదాంశ్చ భాషసే" ప్రకర్షేణ జానంతీతి ప్రజ్ఞాః, "ప్రజ్ఞాం వాదాః ప్రజ్ఞావాదాః" అని విగ్రహము. ఇచ్చట ప్రజ్ఞాశబ్దము అకారాంతపుల్లింగము గాని స్త్రీలింగము గాదు. 'ఆతో మనిన్ క్వనిబ్వనిపశ్చ' అను సూత్రముచే "విచ్" అను ప్రత్యయము వచ్చినది. ఈ విచ్ ఛాందసము గాదు. "కీలాలప అగతం" అని

శాంకరభాష్యమ్:—

(18) తథాచ దర్శయతి భగవాన్- "కుర్వన్నపి" (గీ. 5-7) 'న కరోతి న లిప్యతే' (గీ. 13-31) ఇతి తత్ర తత్ర। యచ్చ- "పూర్వైః పూర్వతరం కృతమ్" (గీ. 4-51) "కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః" (గీ. 3-20) ఇతి, తత్తు ప్రవిభజ్య జ్ఞేయమ్। త త్కథం, యది తావ త్పూర్వే జనకాదయ స్తత్త్వవిదోఽపి ప్రవృత్తకర్మాణ స్స్యుస్తే లోకసంగ్రహార్థం "గుణాగుణేషు వర్తంతే" (గీ. 3-28) ఇతి జ్ఞానేనైవ సంసిద్ధి మాస్థితాః, కర్మసంన్యాసే ప్రాప్తేపి కర్మణా సహైవ సంసిద్ధి మాస్థితా న కర్మసంన్యాసం కృతవంత ఇత్యేషోఽర్థః।

శాంకరభాష్యతత్త్వబోధని:—

జ్ఞానోత్పత్తికిఁ బూర్వమునం దెట్టి తీరున జ్ఞానికిఁ బ్రవృత్తి కలదో యదేరీతిని నియమముగ గర్మప్రవృత్తి కన్పట్టుటచే జ్ఞానప్రవృత్తి యాభాసము కానేరదని శంకింపరాదు. కామ్యమగు స్వర్గాదులయందుఁ గోరిక గలవాఁడై తత్సాధనమగు నగ్న్యాధానము గావించి యగ్నిహోత్రాదులు సేసిన నాయగ్నిహోత్రము కామ్యాగ్నిహోత్ర మనంబడును. అట్టి యగ్నిహోత్రాదుల గొంతకాలమువఱకు నాచరించుచుండ నొకానొకకారణముచే నాకామన వినష్టమైపోవ నా యగ్నిహోత్ర మాచరించుచుండినను యా యగ్నిహోత్రము నిత్యాగ్నిహోత్ర మనంబడును. ఏల యన ? కామ్యత్వనిత్యత్వములు స్వాభావికములు కావు. కామనతో నాచరించిన ఆకర్మ కామ్య మనియు, కామనాపరిత్యాగముతో నాచరించిన ఆకర్మయే నిత్య మనియు యనం బడును. ఆదేవిధమున జ్ఞానోత్పత్తికిఁ బూర్వ మాచరింపఁబడిన కర్మప్రవృత్తి ఫలాభిసంధిపూర్వ కమై జ్ఞానోత్పత్త్యనంతరమున నాకర్మప్రవృత్తి జ్ఞానికి విధియం దధికారము లేమింజేసి కర్మాభాసరూప మగును.

(18) 'కుర్వన్నపి' 'న కరోతి న లిప్యతే' జ్ఞాని కర్మను జేసినను జేయనివాఁడే. కర్మము ననుష్ఠించినను దానిచే లేపమును బొందడని శ్రీకృష్ణపరమాత్మ యాగీతలయం దచ్చటచ్చట స్పష్టముగ నుడివెను.

విద్వాంసుని వ్యాపారముకూడ కర్మశబ్దముచే వ్యవహరింపఁబడుటచే నదియు కర్మయే యగును. కర్మాభాసము కానేరదని శంకింపరాదు. ఎట్లనిన? ప్రాచీనులగు జనకాదులు తత్త్వవేత్తలా ? కారా ? తత్త్వవేత్తలగునేని గర్మయందుఁ బ్రవృత్తులైనచో గర్మసంన్యాసము ప్రాప్తించినను 'గుణాగుణేషు వర్తన్తే' అను భగవద్వచనానుసారము లోకసంగ్రహముకొరకు కర్మనాచరించుచునే తత్ఫలాభిసంధివర్జితులై జ్ఞానముచేతనే సంసిద్ధిని (మోక్షమునుఁ) బొందిరి.

"విభాషాపూర్వాహ్ణ-" అను సూత్రభాష్యమున లౌకికవిగ్రహమునందు ప్రయోగించబడినది. కావున లోకమునందు గూడ నిది యుండవచ్చును. ఇచ్చట "క్విప్చ" అను సూత్రముచే "క్విప్" అను ప్రత్యయముఁ గూడఁ జేయవచ్చును. ఈవిషయము లఘుశబ్దేందుశేఖరమునందు స్పష్టముగ నున్నది. ఈపద్ధతిగ "ప్రజ్ఞావతాం బుద్ధిమతాం

శాంకరభాష్యమ్:—

(19) అథ న తే తత్త్వవిద ఈశ్వరసమర్పితేన కర్మణా సాధనభూతేన సంసిద్ధిం సత్త్వశుద్ధిం జ్ఞానోత్పత్తిలక్షణాం వా సంసిద్ధి మాస్థితా జనకాదయ ఇతి వ్యాఖ్యేయమ్ ।

(20) ఏత మేవార్థం వక్ష్యతి భగవా న్సత్త్వశుద్ధయే కర్మ కుర్వన్తీతి "స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః" (గీ. 18-46) ఇత్యుక్త్వా సిద్ధిం ప్రాప్తస్య చ పునః జ్ఞాననిష్ఠాం వక్ష్యతి 'సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ' (గీ. 18-50) ఇత్యాదినా ।

(21) తస్మా ద్గీతాసు కేవలాదేవ తత్త్వజ్ఞానా న్మోక్షప్రాప్తి ర్న కర్మసముచ్చితా దితి నిశ్చితోఽర్థః । యథా చాయ మర్థ స్తథా ప్రకరణశో విభజ్య తత్ర తత్ర ప్రదర్శయిష్యామః ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(19) జనకాదులు తత్త్వవేత్తలు కానిచో నంతఃకరణశుద్ధికి కారణమైన నీశ్వరార్పిత కర్మము ననుష్ఠించి యంతఃకరణపరిశుద్ధినిఁ బొందిరి. లేక నిష్కామపురస్సరముగ నీశ్వరార్పితమగు కర్మను జేయుచు నద్దానివలన సత్త్వశుద్ధిమూలమున జ్ఞానమును బొందిరని 'కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః" అను శ్లోకమును వ్యాఖ్యానించవలెను.

(20) శ్రీకృష్ణపరమాత్మ "స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః" అను గీతా వాక్యముచే నంతఃకరణపరిశుద్ధికొఱకుఁ గర్మలు సేయుదు రను విషయము నుపన్యసించి యట్టి యంతఃకరణపరిశుద్ధినిఁ బొందినవానికి "సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ" అనునది మొదలుకొని జ్ఞాననిష్ఠను జెప్పఁగలడు. అనగా కోరికలేనివాఁడై యీశ్వరార్పణముగ నెవఁడు కర్మల నాచరించునో వానియందు భగవదనుగ్రహము ప్రవృద్ధమై యద్దానివలన జ్ఞాననిష్ఠాయోగ్యతను బొంది శ్రవణమనననిదిధ్యాసనములవలన బ్రహ్మసాక్షాత్కారమును బడసి ముక్తుఁ డగును. కాన కర్మలు చిత్తశుద్ధిద్వారమున పూర్వమునందు చెప్పఁబడినరీతిని మోక్షమునకుఁ బ్రయోజనములు గాని, సాక్షాత్తు కారణములు కానేరవని మున్ముందు స్పష్టము కాఁగలదు.

(21) కాన భగవద్గీతలయందు సర్వకర్మసంన్యాసపూర్వకాత్మజ్ఞాననిష్ఠామాత్రమువలననే మోక్షప్రాప్తి యగుననియు, కర్మసముచ్చితజ్ఞానమువలన మోక్షప్రాప్తి కాదనియు నిశ్చితమగుచున్నది.

గీతాశాస్త్రము తత్త్వజ్ఞానప్రాధాన్యమున నేకవాక్యతను బొందియున్నను దత్త్వజ్ఞానమధ్యమున గర్మను నుపపాదించెను. కాన దత్త్వజ్ఞానప్రకరణమునం దుండుటచే 'శ్రుతి, లింగ,

---

పాదాంశ్చ" అని యున్న శాంకరభాష్యము అకారాంతపుల్లింగముచే సమర్థిత మగుచుండఁగా ననేకవిధములగు విగ్రహముల వ్రాసి క్లిష్టముగ సమర్థించు వ్యాఖ్యాత లుపేక్ష్యులు.

రాఘవేంద్రవృత్తి:— పండితులు "అగతాసూంశ్చ" జీవించియున్నవారిఁగూర్చివలె "గతాసూన్" ఆసన్నవినాశవంతులను గూర్చి దుఃఖింపరు.

శాంకరభాష్యమ్:—

తత్రైవం ధర్మసమ్మూఢచేతసో మహతి శోకసాగరే నిమగ్నస్యార్జునస్యాన్యత్రాత్మజ్ఞానా దుద్ధరణ మపశ్య న్భగవా న్వాసుదేవ స్తతోఽర్జున ముద్ధిధారయిషు రాత్మజ్ఞానాయావతారయన్నాహ—అశోచ్యానిత్యాది। న శోచ్యా అశోచ్యా భీష్మద్రోణాదయ స్సద్వృత్తత్వా త్పరమార్థరూపేణ చ నిత్యత్వాత్ । తా న శోచ్యా నన్వశోచోఽనుశోచితవా నసి తే మ్రియంతే మన్నిమిత్త మహం తై ర్వినాభూతః కిం కరిష్యామి రాజ్యసుఖాదినేతి । త్వం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వాక్య, ప్రకరణ, స్థాన, సమాఖ్య" లను షట్ప్రమాణాంతర్గతప్రకరణ మను ప్రమాణముచే గర్మజ్ఞానసముచ్చయవాద మంగీకరింపవలయు నని శంకింపరాదు.

ఏయేప్రకరణములయం దిట్టి విషయ ముపపాదితమో యట్టి ప్రకరణములయందే విడదీసి కర్మజ్ఞానసముచ్చయ మెట్లు సంభవింపనేరదో, సర్వకర్మసంన్యాసపూర్వకాత్మజ్ఞాననిష్ఠామాత్రము వలననే మోక్షప్రాప్తి యను విషయమును జూపగలము.

(22) 'ఈగీతాశాస్త్రము మూడు షట్కములుగా విభజింపదగినది. షట్కమనగా నారధ్యాయములు. మూడు షట్కములు మూడుకాండములు. అందు ప్రథమషట్కాత్మక ప్రథమకాండముచే 'త్వం' పదార్థము, ద్వితీయషట్కాత్మకద్వితీయకాండముచే 'త' త్పదార్థము, తృతీయషట్కాత్మకతృతీయకాండముచే 'అసి' పదార్థములు బోధింపబడుచున్నవి. తత్ప్రసంగానుప్రసంగముగ దత్తజ్జ్ఞానసాధనము లాయా స్థలములయందు బోధింపబడెను. మొత్తము గీతాశాస్త్రము మోక్షసాధనమగు సర్వకర్మసంన్యాసపూర్వకాత్మజ్ఞానమునే బోధించుచున్నది" అని గీతాశాస్త్రప్రార్థము నిశ్చితమై యుండ ధర్మవిషయమై కర్తృత్వాకర్తృత్వజ్ఞానశూన్యుడై అహంకారమమకారములు గలిగి దాటశక్యముకాని దుఃఖసాగరమునందు బ్రవేశించి క్లేశమును బొందిన యర్జునునికి నాత్మజ్ఞానమును విడనాడి మఱియొక యుపాయమువలన సముద్ధరణము సంభవపదని తలచి యతిభక్తుడును, శిష్యుడును నగు నర్జునుని శోకసాగరమునుండి యుద్ధరింపదలచి శ్రీకృష్ణపరమాత్మ యర్జునుని పదార్థపరిశోధనమున ప్రవర్తింపజేయుచు మొట్టమొదట "త్వం" పదార్థమును శోధన జేయుటకు "అశోచ్యా నన్వశోచస్త్వం" అనువాక్యము నుపక్రమించెను.

బ్ర॥ వే॥ శ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రులువారి యభిప్రాయము:— పామరు లెట్లు గతాసువులను గూర్చి దుఃఖింపరో యట్లే పండితులు గతాసువులనుగూర్చి దుఃఖింపరు. ఇట పామరశబ్దమధ్యాహార్యము. చకారము ఇవార్థకము.

నీలకంఠీయము:— అర్జునునకు దేహమే యాత్మయని జ్ఞానముండుటచే దేహము నశించినచో నాత్మ నశించునని జ్ఞానము కలిగెను. ఇదియొకవిధమగు మోహము. స్వధర్మమగు యుద్ధ మధర్మమని భ్రమయుటరెండవ

శాంకరభాష్యమ్:—

ప్రజ్ఞావతాం బుద్ధిమతాం వాదాంశ్చ వచనాని చ భాషసే। తదేత న్మౌఢ్యం పాండిత్యం చ విరుద్ధమాత్మని దర్శయ స్యున్మత్త ఇవే త్యభిప్రాయః। యస్మా ద్గతాసూ న్గతప్రాణా న్మృతా నగతాసూ నగతప్రాణా ఞ్జీవతశ్చ నానుశోచంతి పండితా ఆత్మజ్ఞాః పండాఽఽత్మవిషయా బుద్ధి ర్యేషాం తే హి పండితాః "పాండిత్యం నిర్విద్య" (బృ. ౩-౫-1) ఇతి శ్రుతేః। పరమార్థతస్తు నిత్యా నశోచ్యా ననుశోచ స్యతో మూఢోఽసీ త్యభిప్రాయః। ॥౧౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఎవని కజ్ఞానమో వానికే భ్రాంతి. ఎవనికి భ్రమయో వానికి బదార్థశోధనపూర్వక మగు సమ్యగ్జ్ఞానము వాక్యమువలన జనించును. కాన నర్జునుడు జ్ఞానమున కధికారి యని తలచి యర్జునునిగూర్చి శ్రీకృష్ణపరమాత్మ యిట్లు పలికెను.

ఓయర్జున! నీవు భీష్మద్రోణపదవాచ్యులనుగూర్చి దుఃఖించుచుంటివా? భీష్మద్రోణపద లక్ష్యార్థముల నుద్దేశించి దుఃఖించుచుంటివా? భీష్మద్రోణపదవాచ్యులు శ్రుతిస్మృతిశిష్టాచార పరిపాలనతత్పరులుగాన నీదేహము గతించిన నితోధికమగు దేహమునే పొందెదరు. కాన వారలు దుఃఖింపదగనివారలు. లేదా భీష్మద్రోణపదలక్ష్యార్థముల నుద్దేశించి దు,ఖించుచుంటి వందువా? అట్టి లక్ష్యార్థము లాత్మస్వరూపమే కాన బరమార్థముగా నిత్యములు. నిత్యమగు నాత్మ జననాదిషడ్భావవికృియాశూన్యమగుటంజేసి హననాదిక్రియాకర్మత్వము సంభవింపనేరదు. కాన నట్టి భీష్మద్రోణశబ్దలక్ష్యార్థముగూడ దుఃఖింపదగనిదే. అట్టి భీష్మద్రోణకృపాచార్యా దుల నుద్దేశించి నీవు రజితభిన్నమునందు రజితజ్ఞానమువలె "నానిమిత్తము వీరలు మరణించు చుండిరి. ఇట్టివారలను విడిచి నా కీరాజ్యసుఖాదులతో నేమి ప్రయోజన" మని భ్రాంతిచే దుఃఖించుచుంటివి.

మరియు బుద్ధిమంతులయొక్క (ప్రజ్ఞావంతులయొక్క) "ఉత్సన్నకులధర్మాణాం మను ష్యాణాం జనార్దన! నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ" అనునవి మొదలుగా గల వాక్యములను బలుకుచుంటివి. ఎందువలననినః అనాత్మజ్ఞులు బ్రతికియున్నవారలను గూర్చి నేను లేనిచో వీర లెట్లు జీవించెదరు యనియు, మృతులను గూర్చి వీరు మరణించిరే యనియు దుఃఖించెదరు. ఆత్మజ్ఞానసంపన్నులు మరణించినవారలనుగూర్చిగాని. జీవించినవారలనుగూర్చి

విధమగు మోహము. ఈరెంటిలో మొదటిమోహమును తొలగించుటకు బ్రహ్మవిద్యానురోధభూతములగు నీశ్లో కము మొదలు నిరువది శ్లోకములవఱకు చెప్పుచున్నాడు.

"జీవాపేతం వావ కిలేదం మ్రియతే న జీవో మ్రియతే" అను ఛాందోగ్యశ్రుత్యుక్తప్రకార ముపాస భూతములగు దేహాదులు నశించినను, యాకాశమువలె యాత్మ నశించునది కాదు. కాన నీభీష్మాదు లశోచ్యులు. అట్టి వీరినిగూర్చి "వీరు నాకు గురువులు, వీరల నెట్లు జంపగలను. వీరలను విడిచి యెట్లు జీవింపగల" నని దుఃఖించుచుంటివి. ఈ విధముగ మూఢుడవయ్యు "ప్రజ్ఞావాదాన్" దేహముకంటె

గీ॥ న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః ।
న చైవ న భవిష్యామ స్సర్వే వయ మతః పరమ్ ॥ ॥౧౨॥

పదవిభాగము:— న- తు- ఏవ- అహం- జాతు- న- అసం- న- త్వం- న- ఇమే- జనాధిపాః- న- చ- ఏవ- న- భవిష్యామః- సర్వే- వయం- అతః- పరమ్ ।

ప్రతిపదార్థము:— జాతు=ఒకానొకప్పుడు; అం=నేను; నాసమితిన=లేననునదియు లేదు; త్వం=నీవు: నాసీరితిన=లేవనునదియు లేదు; ఇమే=ఈ; జనాధిపాః=భీష్మాదులు, నాసన్నితిన=లేరనునదియులేదు; సర్వే=సమస్తమయిన; వయం=మనము; అతఃపరం=ఈశరీరపతనానంతరము;నభవిష్యామఇతిన=ఉండమనుమాటయులేదు.

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—
దుఃఖింపరు. నీవటులగాక దుఃఖింపదగనివారలయందు శోచ్యత్వబుద్ధి కలిగియుంటివి. కాన మౌఢ్యము., ప్రజ్ఞావంతుల వాక్యములను బలుకుటచే పాండిత్యము నను నీవిరుద్ధధర్మాశ్రియత్వమును నీయం దున్మత్తునివలె బ్రకటించితివి.

పాండిత్యము సూక్ష్మబుద్ధియే. ఆత్మజ్ఞానము కానేరదు. కాన నాయం దట్టి సూక్ష్మబుద్ధియు నిరుక్తమౌఢ్యము యుండుటయం దేమియు విరోధము లేదనెదవా? పాండిత్యమనగ 'పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్' ఆత్మజ్ఞానమును బొంది బాల్యావస్థచే నుండవలెను. అనగానాత్మజ్ఞాని మాతృస్తన్యమును ద్రావి యానందభరితుడై యుండుబాలునివలె నుండవలెనని బృహదారణ్యకోపనిషత్తు పాండిత్యమను శబ్దమున కాత్మజ్ఞానమను యర్థమును బోధించుచున్నది. కాన అట్టి పాండిత్యమును, పరమార్థముగా దుఃఖింపదగనివారల నుద్దేశించిదుఃఖించుట వలన మౌఢ్యమును బ్రకటించుటచే నీవు మూఢుడవు. ॥౧౧॥

---

నాత్మ వేరని తెలిసికొనువారు బలికెడి "పతన్తి నరకే హ్యేషాం లుప్తపిండోదకక్రియాః" అను మొదలగు వాక్యములను బలుకుచుంటివి. కాన నీవు ప్రజ్ఞావంతుడవుగావు. ఏలన: పండితులగువారు తమవారి ప్రాణము లుత్క్రమించినచో నట్టివారి దేహములనుగూర్చి దుఃఖింపరు. కనుకనే దేహముకంటె ప్రాణమే యిష్టమైనదందురు. ఈవిషయమునే "ప్రాణోహపితా, ప్రాణోమాతా, ప్రాణ ఆచార్యః" అను శ్రుతికూడ జెప్పుచున్నది. మఱియు లోకమున జీవించియున్న తల్లిదండ్రులను లెక్కసేయక యెవడు తిరస్కరించునో అట్టి పుత్రుని "వీడు పితృహంత" యనియు, తల్లిదండ్రులు మరణించినపిమ్మట వారి దేహములకుదహనాదిసంస్కారములు చేయుచో నాపుత్రుని యట్లు నిందింపకుండుటయు లోకవేదప్రసిద్ధమై పొసగుచున్నది. కావున ఆత్మ చేతనమగుటంజేసి దేహముకంటె వేరు. "ఇట ఘటము చేతనము కానందున నాత్మస్వరూపము కానేరదు" అని వ్యతిరేకముగ దృష్టాంతము చూడనగును. మఱియు దృశ్యమగు ఘటమెట్లు చేతనము కాదో అట్లే దృశ్యమగు శరీరాదులు చేతనములు కానేరవు. అట్లుకాక దేహాదులు చేతనములేయైనచో మరణించినవానియందుగూడ చైతన్యము గన్పట్టెడిని. కాన దేహముకంటె ఆత్మ వేరని పర్యవసితము. కనుకనే దేహనాశముచే నాత్మనాశము నూహించెడి నీవు మూర్ఖుడవే యగుదు వని యాశయము. ॥౧౧॥

శాంకరభాష్యమ్—

కుతస్తేఽశోచ్యాయతో నిత్యాః । కథం? న త్వేవ జాతు కదాచి దహం నాసం కింత్వాస మేవాతీతేషు దేహోత్పత్తివినాశేషు నిత్య ఏవాహ మాసమి త్యభిప్రాయః । తథా న త్వం నాసీః కిం త్వాసీరేవ । తథా నేమే జనాధిపా నాస న్కిం త్వాసన్నేవ । తథా నచైవ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

భీష్మద్రోణాదులు పరమార్థరూపముచే నిత్యులుగాన దుఃఖింపదగనివారలని చెప్పబడెను.

నేను, నీవు, భీష్మద్రోణాదులు పూర్వమునందు గూడ నుండినవారలమే. అనగా భావకార్యమును గూర్చి యాకార్యప్రాగభావము కారణము. ఎట్లనిన? ఘటమునుగూర్చి ఘటప్రాగభావము గారణము. అనగా ఘటోత్పత్తికి పూర్వమునందు ఘటములేనందున ఘటాభావ

— ౨వ అధ్యాయము — ౧౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు —

మధుసూదనసరస్వతీయము:— "స్వధర్మ మపి చావేక్ష్య" అను శ్లోకము మొదలుకొని యెనిమిది శ్లోకములచే 'ప్రజ్ఞావాదాంశ్చ భాషసే' అనుదానివలన నిరూపింపబడిన యర్జునుని మోహద్వయమును నిరాకరించును గాన దత్పూర్వగ్రంథమగు 'నత్వేవాహం' అను శ్లోకము మొదలుకొని యిరువదియొక్క శ్లోకములచే "అశోచ్యా నన్వశోచ స్త్వం" అను శ్లోకమును వివరించుచున్నాడు.

స్థూలశరీరముకంటె యాత్మ వేఱని తెల్పుటకు నీశ్లోకమున నాత్మకు నిత్యత్వమును సాధించుచున్నాడు. ఇట "తు" అనుశబ్దమాత్మకు దేహాదివ్యతిరేకమును సూచించును. నేనొకానొకప్పుడును లేననునది లేదు. అట్లే నీవును, అట్లే వీరును. కాన మనప్రాగభావమును జెప్పుటకు వీలుపడదు. ఇక ఘటాదిప్రాగభావములకు మనము ప్రతియోగులము కాము. అట్లే మన మీపైన నొకానొకప్పుడును నుండ మనునదియును లేదు. (ఈపైన నెప్పుడును నుందుము) కాన మనవినాశమును జెప్పుటకు వీలుపడదు. ఇకఘటాదిధ్వంసములకు మనముప్రతియోగులము కాము కాన నిత్యత్వసాధకములగు ప్రాగభావాప్రతియోగిత్వ ధ్వంసాప్రతియోగిత్వము లాత్మయందుండుటచే నాత్మ త్రికాలాబాధ్యమనియు, గనుకనే యనిత్యమగు శరీరాదులకంటె వేరనియు సిద్ధించిన దని యాశయము:

శంకరానందీయము:— "అశోచ్యాన్" అను శ్లోకముచే భీష్మాదివిషయమగునశోచ్యత్వమును ప్రతిపాదించుటవలన భీష్మాదిపదలక్ష్యార్థమగు నాత్మ దేహేంద్రియాదులకంటె వేఱనియు, నిత్యమనియుసూచింపబడెను. ఈయర్థమును దెలిసికొనవలె నర్జునునకీయర్థములకహేతుకముగనుపదేశించుటకుశ్రీకృష్ణభగవానుడు సంకల్పించెను. అందుకు "అజము (పుట్టువులేనిది) కాన ఆత్మ నిత్యము" అని యందమన్న బుట్టువులేని తుచ్ఛములగు శశవిషాణాదులుకూడ నిత్యములు కావలసివచ్చును. కాన శశవిషాణాదివ్యావృత్తికై "భావము, యజము నగునది నిత్యము" అని చెప్పదగును. అట్లైన శశవిషాణాదు లజములైనను నప్రసిద్ధములగుటచే భావములు కావుగాన నిత్యములు కాజాలవు. కావున భావము, అజము నగునది నిత్యమని జెప్పదగును. మఱియు గాలత్రయమునందును నేది యుండునో యది భావము నిత్యము నగును. ఏది యేకాలమునందైన నుండదో (కాలత్రయవ్యభిచారియో) యది భావము (సత్తు) కాదు. మఱియు ననిత్యము. కాననాత్మకు కాలత్రయసత్త్వమును నిరూపించి తద్ద్వారా ననిత్యదేహేంద్రియాదులకంటె వేఱగుటను, నిత్యత్వమునుసూచించుటకును, త్వంపదార్థమగుజీవునకునిశ్శేష సాంసారిక

శాంకరభాష్యమ్:—

న భవిష్యామః, కింతు భవిష్యామ ఏవ । సర్వే వయ మతోఽస్మా ద్దేహవినాశా త్పర ముత్తర కాలేఽపి త్రిష్వపి కాలేషు నిత్యా ఆత్మస్వరూపేణే త్యర్థః । దేహభేదానువృత్త్యా బహువచనం నాత్మభేదాభిప్రాయేణ ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ముండును. అట్టి ఘటాభావము "ప్రాక్" ఘటోత్పత్తికి పూర్వమునందుండును. కాన నదిఘట ప్రాగభావ మనఁబడును. ఇదేతీరున ప్రతిభావకార్యోత్పత్తికి పూర్వమునందు ఆయాకార్యముల ప్రాగభావ ముండును. అనగా పూర్వమునందులేని భావకార్యమే బుట్టు నని యాశయము. అట్టి భావకార్యమును గూర్చి ఆయాభావకార్యప్రాగభావము కారణమని తాత్పర్యము. నర

దుఃఖనివృత్తిద్వారమున నిత్యము, నిరతిశయము, నఖండము నగు నానందము ప్రాప్తించుటకును, అట్లే తత్పదార్థమగు పరమాత్మకుఁ బరోక్షత్వ, పరిచ్ఛిన్నత్వరూపానర్థనివృత్తిద్వారా అద్వితీయాఖండరసైకత్వము సిద్ధించుటకును తత్త్వంపదార్థశోధనను, శోధించిన వా రెంటికి నైక్యము జెప్పుటకు నీశ్లోకము నుపక్రమించుచున్నాఁడు.

“అహం” తత్పదార్థమగు సర్వజ్ఞుఁడు, సర్వశక్తిసంకలితుఁడు నగు పరమేశ్వరుఁడు (నేను) యొకానొకప్పుడును లేఁడ (న) నునది లేదు. ఏలన? “జన్మాద్యస్యయతః” (బ్ర. 1-1-2) “యతో వా ఇమాని భూతాని జాయన్తే” “యతో జాతాని భువనాని విశ్వా” “స ఈక్షత లోకాన్ను సృజా ఇతి। స ఇమాంల్లోకానసృజత” ఇత్యాదిశ్రుతులచే నావలననే జగదుత్పతియు, అట్లే “యేన జాతాని జీవన్తి” “వ్యక్తావ్యక్తం భరతే విశ్వ మీశః” “స దాధార పృథివీం ద్యా ముతేమాం” “భీషాఽస్మాద్వాతః పవతే,” “ఇతరేణ తు జీవన్తి యస్మి న్నేతా వుపాశ్రితౌ । తస్మిం ల్లోకాశ్శ్రితా స్సర్వే” ఇత్యాది శ్రుతిస్మృతులచే నావల్లనే జగత్స్థితియు, అట్లే “యత్ప్రయ న్త్యభిసంవిశన్తి. తథా క్షరా ద్వివిధా స్సోమ్య! భావాః ప్రజాయన్తే తత్ర చైవాపియన్తి. యస్మిన్ క్షేత్రే సంహర త్యేష దేవః” ఇత్యాది శ్రుతులచే నావల్లనే జగల్లయము శ్రూయమాణమగుచున్నది. నిరుక్తశ్రుతిబలముచే జగత్సృష్ట్యాదులు మదేకకర్తృకములనియు, ఆసృష్ట్యాదు లెన్నిమారులు ప్రాప్తించినను వానికి నేనే గర్తననియు, నధిష్ఠాతనై యెప్పుడు నుండుననియు స్పష్టమగుచున్నది.

ఇట్లనుటచే మేఘ, తదాగమన, స్థితి, నిర్గమనముల కాధారమగు నాకాశమువలె ప్రపంచ, తదుత్పత్త్యాదులకు నధిష్ఠానము, తత్పదార్థము నగు పరమాత్మ, స్వరూపతః నిష్కలమగుటచేతను, నిష్క్రియమగుటచేతను ప్రపంచ, తద్ధర్మ, తత్కర్మలేశసంబంధరహితుఁడనియు, తద్భిన్నుడనియు, నిత్యుఁడనియు సూచితమయ్యెను.

స్వతంత్రుఁడగు పరమేశ్వరునకుఁ గాలత్రయసద్భావముండుఁగాక, మర్త్యుఁడనగు నాకు నిత్యత్వమెట్లు సిద్ధించును? అను శంకమీఁద ‘త్వం’ అని చెప్పుచున్నాఁడు. త్వంపదలక్ష్యార్థభూతుఁడవగు నీ వొకానొకప్పుడును లేవనునది లేదు. జాగ్రదవస్థయందున్న నీకు స్వప్నబంధము, స్వప్నావస్థయందున్న నీకు సుషుప్తిసంబంధము, సుషుప్త్యవస్థయందున్న నీకు జాగ్రదవస్థాసంబంధ మెట్లు కలదో, అట్లే గతదేహమునందున్న నీకు నీ దేహసంబంధము, ఈ దేహమందున్న నీకు భావిదేహసంబంధమును కలదు. అట్లు కానిచో కర్మవైచిత్ర్యముచేఁ బ్రాప్తించు నీ సుఖదుఃఖవైచిత్ర్యము నీయందు కనఁబడకపోయెడిని. మఱియుఁ గృతములగు సుకృతదుష్కృతకర్మల ఫలము ననుభవింపకపోవుటయు, అకృతములగు సుకృత దుష్కృతకర్మల ఫలము ననుభవించుటయు సంభవించెడిని. ‘యత్కర్మ కురుతే తదభిసంపద్యతే’ అనియు, ‘జన్మాంతరకృతం కర్మ భుంజతే జన్తవోఽధునా’ ఇత్యాది పూర్వజన్మకృతకర్మఫల మవశ్యభోక్తవ్యమని చెప్పెడి శ్రుతిస్మృతులకు విరోధము సంభవించెడిని. ‘ప్రాప్యాన్తం కర్మణ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

విషాణప్రాగభావము లేమింజేసి నరవిషాణము పుట్టన ట్లాత్మ పూర్వకాలమునం దెల్లపుడు నుండుటచే నద్దానిప్రాగభావము సంభవింపనేరనందున నెన్నిదేహముల కుత్పత్తివినాశములు సంభవించినను యాత్మ జనించునది కాదు.

ఇకముందు (నీదేహవినాశానంతరమున మనమందరము జన్మించువారలము కాము. భూతభవిష్యద్వర్తమానకాలములు మూడింటియందును నుండువారలమే. అనగా నీశ్లోకపూర్వా

ర్ధస్య యత్కించ పేహ కరోత్యయం। తస్మాల్లోకా త్పునరే త్యస్మై లోకాయ కర్మణే" అను శ్రుతిచే పూర్వకృతమగు కర్మను నీ జన్మమున దేహి యనుభవించునని చెప్పుటయే కాక యీ జన్మయందు జేసిన కర్మమును భావిజన్మయందనుభవించునని చెప్పుచున్నది. కానజాగ్రదాద్యవస్థలయందువలె గతదేహములందును, వర్తమానదేహములందును, భావిదేహములయందును నీ సత్త్వము నొప్పుకొనవలయును. ఇట్లనుటచే త్వం పదలక్ష్యార్థమగు నాత్మ యనిత్యదేహాదులకంటె వేరనియు, నిత్యమనియు సూచింపఁబడెను.

"ఈరాజు లోకానొకప్పుడును లేరనునదిలేదు" త్వంపదలక్ష్యార్థావిశేషులుగాన నీరాజులుగూడ కాలత్రియమునందుఁ గలరు. నే నెట్లో యట్లే వీరును నిత్యసిద్ధ సత్స్వభావులని యర్థము.

ఇట 'జనాధిపాః' అను బహువచనము వారల యవిద్యావృత్తిభేదసూచనపరము. కాని ఆత్మభేదముండుటకుఁ బ్రమాణములేదుగాన నాత్మభేదమును జెప్పునదికాదు.

పూర్వపక్షము:— ఆత్మతత్త్వమును విచారించునో బ్రత్యక్షాది ప్రమాణములకు విరోధము వాటిల్లునుగాన నాత్మైక్యమును జెప్పుటకు వీలుపడదు. ఎట్లన:

'నేను' అనెడి జ్ఞానము వేఱు వేఱుగ ప్రతిదేహమందును ప్రత్యక్షముగఁ గన్పట్టుచున్నందున నిట్టి 'అహంప్రత్యయ భేదముండు ప్రతిదేహమందును నాత్మ వేఱు' అను యనుభవముచే నాత్మ ప్రతిదేహమునందును వేఱు. అట్లు కాక యాత్మయొక్కటియే యన్నచో 'నేను, వీఁడు' అను వ్యవహారము లోపించెడిని. కాన నాత్మ లనేకము లనుటకుఁ బ్రత్యక్షము ప్రమాణము. మఱియు నిట్టి యాత్మభేదము నొప్పనిచో 'నేను, వీడు' అను వ్యవహారము మఱొకవిధమున సిద్ధింపనందున నర్థాపత్తి ప్రమాణముచేఁ గూడ నాత్మభేదము సిద్ధించుచున్నది.

శరీరము లనేకములు గాన గవాదులవలె వానియందుండు నాత్మలనేకము. లేక, ప్రతిశరీరమందును 'నేను, నేను' అనెడి జ్ఞానము వేఱువేఱుగ నుండుటచే నాత్మ ప్రతిశరీరమందు వేఱుగనుండును. ప్రతివ్యక్తి లేకజ్ఞానము వేఱువేఱుగ నుండుటచే ఘటాదులవలె నాత్మలు వేఱు అను యనుమానప్రమాణముచేగూడ నాత్మభేదము సిద్ధించుచున్నది.

"అదితి, ర్దేవా, గంధర్వాః, మనుష్యాః, పితరో, ఽసురాః" "దేవ, దానవ, గంధర్వ, యక్ష, రాక్షస, కిన్నరాః" అను శ్రుతి పురాణవచనములుగూడ నాత్మభేదమునే బోధించుచున్నవి.

మఱియు నాత్మైకత్వమునే యంగీకరించిన సర్వదేహములయందుండు నాత్మ యొక్కటియే గాన నొకడు దుఃఖించినను, సుఖించినను నందఱు దుఃఖించుటయు, సుఖించుటయు సంభవించెడిని. అట్లే దేవానిసర్వదేహములయందుండు నాత్మ యొక్కటియేగాన దేవతలు సర్వజ్ఞు లగుటంజేసి మనముగూడ సర్వజ్ఞులము కావలసివచ్చును. అందుచే విధినిషేధశాస్త్రములుగూడ వ్యర్థము లయ్యెడిని. ఒక్కఁడు బద్ధుడైనచో నందఱును బద్ధులును కావలయును. అట్లే యొక్కఁడు ముక్తుడైనచో నందఱకు మోక్షము సంభవించెడిని. కాన బ్రమాణసిద్ధ మగు నాత్మానేకత్వమును నీవుగూడ నొప్పుకొనవలయునందు వేమో అట్లు కానేరదు. ఏలన ?

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ర్థమువలన నాత్మ కజన్యత్వము సిద్ధించుచున్నది. అట్టి యజన్యత్వ మాత్మకు నిత్యత్వసాధకము. అది యెట్లనిన? ఆత్మ యుత్పత్తి లేని భావపదార్థమగుటచే నిత్యము. ఇందులకు వ్యతిరేకదృష్టాంతము "ఘటము జన్యభావపదార్థ మగుటచే ననిత్యము" అని యనుమానప్రమాణమువలన పరమార్థమగు నాత్మస్వరూపు లగుటచే భీష్మద్రోణాదులు నిత్యులని సిద్ధించుచున్నది.

గీతలయం దంతటను నాత్మయాథాత్మ్యము జెప్పఁబడుచుండుటచే "న త్వే వాహం" "దేహినోఽస్మిన్" "మాత్రాస్పర్శాస్తు" "యం హి న వ్యథయం త్యేతే" అను నీనాల్గుశ్లోకములు మాత్ర మాత్మయాథాత్మ్యప్రకాశకము లను కొందఱి వాక్యములు విశ్వసింపరాదు.

కౌమారావస్థయం దున్నవానికి శైశవభావజన్యమగు 'నేను శిశువును' అను జ్ఞానముండక 'నేను కుమారుఁడను' అను జ్ఞానమే యుండును. ఇట్లే యౌవనావస్థయందును, వార్ధకమునందును యహంప్రత్యయభేదము తత్తదవస్థానుసారము వేఱువేఱుగ నుండును. అట్లగుటచే నొకనికే తత్తదవస్థలయందు "నేను శిశువును, కుమారుడను, యువకుడను, వృద్ధుడను" అను యహంప్రత్యయము వేఱువేఱుగ నున్నను, తా ననేకము కాక యొక్కఁడే యగుచుండెను. కావున "అహంప్రత్యయభేద మున్న ప్రతిదేహమున నాత్మభేద ముండు" నను వ్యాప్తి నిరుక్తస్థలమునఁ గన్పట్టుటలేదు. కాన నహంప్రత్యయభేద మున్నను శైశవాద్యవస్థలు కలదియు, నహంప్రత్యయార్థమునగు యాత్మకు భేదము కన్పట్టుటలేదు. కనుకనే యాత్మానేకత్వసిద్ధికిఁ బ్రత్యక్షము ప్రమాణము కాదు.

'విశేషణము భిన్నమైనచో విశిష్టముగూడ భిన్నమే యగును' అను న్యాయము ననుసరించి విశేషణములగు శైశవాద్యవస్థల భేదముచే దద్విశిష్టమగు నాత్మలుగూడ వేఱని చెప్పుటయు నసంగతము. ఏలన? శైశవాద్యవస్థాభేదకృతమగు నీభేదమును శిశుత్వాద్యభిమానముగల యహంకారమునకుఁ జెప్పిన యుపపన్న మగుచుండ నిత్యమగు నాత్మ కాపాదించుట యసంగతము.

ఒకనిచే ననుభూతమగు దానిని మఱియొకఁడు స్మరింపకపోవుటయు, తా ననుభవించినదానిని తానే స్మరించుటయు ననుభవసిద్ధము. అందుచే నాత్మ యవస్థాభేదముచే ననేక మన్నచో "బాల్యమునందు నేను గందుకముచే క్రీడించితిని" అని వృద్ధుఁడు స్మరింపకపోయెడిని. కాన ప్రత్యయ (జ్ఞాన) భేద మున్నను ప్రత్యయార్థము వేఱగు నను ప్రత్యక్షప్రమాణమువలన నాత్మభేదము సిద్ధింపదు.

స్థూల, సూక్ష్మ, కారణదేహములు, అట్లే జాగ్రత్స్వప్నదేహములు వేరైనను నహంప్రత్యయార్థ మగు యాత్మకు భేదము లేదు. కాన "శరీరములు భిన్నములుగాన యాత్మ లనేకము" అను యనుప్రమాణముగూడ యాత్మానేకత్వసాధకము కాదు.

ఎట్లు స్థూలసూక్ష్మ కారణదేహభేదములచే నొక్కటియగు యాత్మయొక్క భోగము వేఱువేఱుగ నుండెనో యట్లే దేవాదిదేహభేదముచేఁగూడ యాత్మయొక్క భోగము వేఱు వేఱుగ నుండును. కనుకనే దేవాదిదేహములు భోగాయతనములుగాని యాత్మభేదద్యోతకములుగావు. ఆ దేహములయందే రూపతేజస్స్వభావముల భేద మగుపడుచున్నది. కాని చేతనభేద మగుపడనందున యాత్మవిషయకమగు "నేను" అను జ్ఞాన మెప్పుడును యొక విధముగనే యుండును. కనుక "అనితి ర్దేవా గంధర్వాః" అను శ్రుతి శరీరభేదప్రతిపాదనపరమే గాని యాత్మభేదమును జెప్పునది కాదు.

ఒక శరీరమునందే యవయవభేదము నాశ్రయించి శిరస్సు, హస్తము, పాదము అనెడి వ్యవహార మెట్లు కలుగుచున్నదో యట్లే యాత్మ యొక్కటియైనను శరీరభేదము నాశ్రయించి నీవు, నేను అనియు, దేవతలు, దాన

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"చరాచరవ్యపాశ్రయస్తు స్యాత్" (బ్ర. అ2. పా3 సూ16 అధి10) అను న్యాయాను సారము జన్మవినాశము లుపాధిభూతశరీరనిష్ఠము లనియు, నిరుపాధికమగుటచే నాత్మకు జన్మ వినాశములు సంభవింపవనియు గ్రహింపవలెను.

దేహోత్పత్తి వినాశములవలన గలుగు జన్మవినాశము లాత్మకు లేకున్నను, మహాసర్గ మహాప్రళయములయందు "యథాఽగ్నే ర్విస్ఫులింగాః" అగ్నివలన మిణుగురులు బయలు వెడలిన చందమున సృష్టిసమయమున పరమాత్మస్వరూపమునుండి జీవులు బయలువెడలెద రను శ్రుత్యనుసారము జీవులకు జన్మవినాశము లెందులకు సంభవింపవు? అని శంకింపరాదు.

---

వులు అనియు వ్యవహారము కలుగుచున్నది. కాని యాత్మభేదము ననుసరించి కాదు. కనుక "దేవదానవ" అను నది మొదలుగాగల పురాణవచనములుగూడ నాత్మభేదమును బోధింపనేరవు.

ఇట్లే "నీవు, నేను" అను వ్యవహారము శరీరభేదము నాశ్రయించి యుపపన్న మగుటచే నేతాదృశవ్యవ హారాన్యథానుపపత్తి సంభవింపనందున నాత్మానేకత్వసాధనమున నర్థాపత్తియుఁ బ్రమాణము కాదు.

పుణ్యపాపములవలన సుఖదుఃఖములు ప్రాప్తించును. అవి యనేకములు. అట్టి పుణ్యపాపములకుఁ గర్మ కారణము. "యత్కర్మ కురుతే తదభిసంపద్యతే యథాకారీ యథాచారీ తథా భవతి" అనుశ్రుతులచే తత్త త్కర్మలు, తత్తత్కర్మఫలభోక్తలు ననేకవిధములని బోధింపఁబడుటవలన కర్మవైచిత్ర్యముచే సుఖదుఃఖాది వైచిత్ర్య ముపపన్న మగుచుండ—'ఆత్మైకత్వము నొప్పినచో నొకఁడు దుఃఖించిన నందఱుదుఃఖింపవలయు ననియు, నొకడు సుఖించిన నందఱు సుఖింపవలయు" ననియు నాపత్తి సంభవింపదు.

అంతటను నాత్మయే స్వయముగఁ దత్తద్బుద్ధుల ననుసరించి విషయములను దెలిసికొనును. దేహము లనేక ములు గాన దేహములయం దుండు బుద్ధులుగూడ ననేకమగును. దానివలన బుద్ధివృత్తి యగు జ్ఞానముకూడ బ్రతి దేహమందును వేఱువేఱుగ నుండును. అజ్ఞానము చక్షురింద్రియమువలె స్వసంబద్ధ మగువిషయమునుమాత్రమే భాసింపఁజేయును. పరిచ్ఛిన్న మగుటచే సర్వపదార్థసంబంధము నాబుద్ధివృత్తికి సంభవింపదు. కాన నొకఁడు సర్వజ్ఞుఁడైన నందఱకు సర్వజ్ఞత్వము ప్రాప్తింపదు. ఎట్లన: శబ్దోత్పత్తికారణమును, విభువగు నాకాశమునకు నంతటను భేర్యాదులతో సంయోగ మున్నను నెచ్చట భేరి దండముచే కొట్టఁబడునో యచ్చటనే శబ్దముపుట్టు చున్నది. కాని భేర్యాదు లున్న ప్రతిప్రదేశమునందు శబ్దము పుట్టుటలేదు. అట్లే యాత్మ పరిపూర్ణమైనను, ఏక మైనను ఏదేహమునందు బుద్ధివృత్తికిఁ పదార్థసంబంధ ముండునో యక్కడనే (అదేహావచ్ఛేదముగ) జ్ఞానము కలుగును కాని మఱియొక స్థలమున (ఇతరదేహావచ్ఛేదముగ) కలుగనేరదు. కనుకనే బుద్ధివృత్తు లనేకము లగు టచే వ్యాపకములు కావు. "ఆత్మైకత్వ మొప్పిన యొకఁడుసర్వజ్ఞుఁ డగుచో నందరు సర్వజ్ఞులు కావలె" ను నాపత్తియు సంభవింపదు.

కనుకనే కించిదులకుఁ బ్రవృత్తి నివృత్తి హేతువులు కాన విధినిషేధశాస్త్రముల కానర్థక్యము సంభవింపదు.

ప్రాణులకు సర్వజ్ఞత్వము లేదని చెప్పుటచే "త ద్యో యో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ తదభవ త్తథర్షీణాం తథా మనుష్యాణాం" అను శ్రుతి ననుసరించి వేదాంతశ్రవణజన్యజ్ఞానముచేఁ బ్రత్యగభిన్న మగు పరమాత్మను దేవఋషిమనుష్యులలో నెవడు తెలిసికొనునో వాడే ముక్తుఁ డగును. అందువలననేయాత్మ యొక్క డైనను "జ్ఞానా దేవతు కైవల్యం" అను నియమశ్రవణమున నాత్మజ్ఞానముచేతనే ముక్తు డగును. కనుకనే 'ఆత్మై క్యము నొప్పినచో నొకడు ముక్తుఁ డైనను, బద్ధుడైనను నందఱు ముక్తులుగాని, బద్ధులుగాని కావలె" నను నాపత్తియు సంభవింపదు.

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"నాత్మాఽశ్రుతే ర్నిత్యత్వాచ్చ తాభ్యః" (బ్ర. అ2, పా3, సూ17, అధి 11) అను న్యాయమున మూడుకాలములయం దవ్యభిచారిగనున్న యాత్మకు జన్మవినాశములు సంభవింప నేరవు.

"యావద్వికారం తు విభాగో లోకవత్" (బ్ర. అ2, పా3, సూ7, అధి1) అనున్యాయమున నాత్మ భిన్న మగుటచే వికారిత్వ మూహింపబడుననియు, "నేమే జనాధిపాః" (గీ 2-12) అను బహువచనముచే నాత్మలకు భిన్నత్వ మూహింపబడుననియు శంకింపరాదు.

---

మఱియు నాత్మలు పూర్ణములు, ననేకములని చెప్పు నీపక్షమునందే యీదోషములన్నియు సంభవించును. ఎలన? సర్వవ్యాపకములు, ననేకములు నగు నాత్మలు పరస్పరము పరస్పరమనోబుద్ధ్యాదులతో నన్ని దేహములయందు గలసికొనుటచే నొకడు దుఃఖించిన నందరుదుఃఖించుటయు, నొకడు సుఖించిన నందరుసుఖించుటయు నొకడు బద్ధుడైన నందరు బద్ధులగుటయు, నొకడు ముక్తుడైన నందరుముక్తులగుటయు సంభవించును. ఇదియునుంగాక "ఏయేవస్తువు నితరవస్తువులకంటె వేరుగ నుండునో ఆయావస్తువు పరిచ్ఛిన్న మనబడును." అను న్యాయముచే నాత్మలనేకములైనచో వానికి నితరభేదము ప్రాప్తించును. గాన నాత్మలన్నియు బరిచ్ఛిన్నము లగుటచే వానికి బూర్ణత్వ మెట్లుపొసగును? పూర్ణత్వమే యున్నచో ననేకత్వ మెట్లు సమకూరును? పరస్పరవిరుద్ధము లగు నీరెంటికి నాత్మలయందు సమావేశమును బ్రహ్మకూడ నిర్వహింపజాలడు. కాన నాత్మైకత్వమవశ్యాంగీకార్యము.

"ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః, ఏకస్తథా సర్వభూతాంతరాత్మా, ఏకో దేవ స్సర్వభూతేషు గూఢః ఏక స్సన్ బహుధా విచచార, ఏక ఏవ హి భూతాత్మా, నిరపేక్ష ఏక ఏవ, సాక్షీ ఏకస్తేనేదం పూర్ణం పురుషేణ సర్వం, అశరీరం శరీరే ష్వనవస్థే ష్వవస్థితమ్। మహాంతం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి" ఇత్యాద్యాత్మైకత్వనిత్యత్వపూర్ణత్వ బోధకశ్రుతులచేతను, "నిత్య స్సర్వగత స్థాణుః; నిత్య స్సర్వగతో హ్యాత్మా కూటస్థో దోషవర్జితః। ఏక స్సన్భిద్యతే భ్రాంత్యా మాయయా న స్వరూపతః" ఇత్యాదిస్మృతులచేతను ఘటాదులయందున్న యాకాశమువలె సర్వశరీరములందున్న యాత్మ పూర్ణుడగుటచే నొక్కఁడేయని నిర్ణయింపబడినందున "పూర్ణములు కాకపోయినను నాత్మలు పరిచ్ఛిన్నములు ననేకములు చిద్రూపములు" అను పక్షముగూడ నిరస్తమైనది

మఱియు నాత్మ యంశరహితమగుటవలనను, సర్వప్రకాశమగుటచేతను, సర్వసాక్షియగుటచేతను యంతటను యహంపత్యయార్థమగుటచేతను, ఇంకను యిట్టి యనేకయుక్తులచే నాత్మ పరిపూర్ణమని నిశ్చయింపబడుచున్నందున నాత్మ పూర్వోపదర్శితశ్రుతి స్మృతియుక్తి ప్రామాణ్యముచే నొక్కఁటనియే సిద్ధాంతము.

ఏ కారణముచే నేను. నీవు, వీరును భూతభవిష్యద్వర్తమాన కాలములయం దొకానొప్పుడును నుండమను నదియు లేదో (అనగా కాలత్రయమం దుందుము) యా కారణముచే బ్రపంచ తదభిమానాద్యది సర్వద్వైతకల్పనాస్తారము, సంగరహితము, నిష్క్రియము, అనంతము, నిత్యశుద్ధబుద్ధముక్తసత్యజ్ఞానానందాద్వయ రూపమును (బహ్మమే మైయున్నాము. "భోక్తా భోజ్యం ప్రేరితారం చ మత్వా సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మ ఏతత్, బ్రహ్మైవేదం సర్వం" అను శ్రుతుల ననుసరించి నన్ను, నిన్నును, వీరలనందరనుగూడ బ్రహ్మనుగా దెలిసికొనుమని అర్థము.

పరమార్థప్రపా:— శోకమనునది జీవనిమిత్తకమా? శరీరనిమిత్తకమా? జీవులు నిత్యులగుటచే జీవనిమిత్తకము శోకమనుట వీలుపడదు. శరీరనిమిత్తకమందమా? అదియు సంభవింపనేరదు, ఎదుట నిద్రించుచున్న వానివలె శరీరము చూడబడుచుండుటచే శరీరనిమిత్తకమగు మోహముసంభవముకాదు. అనిశంకించుకొని "యశో

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఆత్మభేదాభిప్రాయముచే నీబహువచనము ప్రయుక్తముకాదు. మఱేమనిన? ఉపాధుల భేదము ననుసరించియే "నేమే జనాధిపాః" "వయం" అనుచోట్ల బహువచనము ప్రయుక్తము కాన బహువచనమువలన నాత్మభేదము సిద్ధింపనేరదు. ॥౧౨॥

---

చ్యత్వమునకు హేతువును జెప్పుచున్నాడు. ఏరీతిగనీశ్వరుఁడనగు నేనొకానొకసమయమున స్వేచ్ఛచే శరీరమును ధరించినను, అట్టిశరీరము తిరోభావము నొందినను, ఆవిర్భావమును బొందినను అనాదిసిద్ధుడ నగుటచే నొకానొకప్పుడును లేననునది లేదు. ఆరీతిగనె నేను, నాయంశమగుటంజేసి నీవు,ఈరాజులునుఙుందునువుఁడువాలరమెం. అనగా త్రికాలాబాధ్యుల మగుటంజేసి నిత్యులము. కాననీవు భీష్మాదులనుగూర్చి దుఃఖింపదగదని యాశయము.

జీవస్వరూపనిరూపణప్రసంగమున గమనాగమనరహితంబగు నీశ్వరునకు "అహం"అనుపదముచే బ్రసక్తి యెటుల సంభవించును? అనిన పరమార్థతః విచారించిన జీవుడును యీశ్వరాంశయగుటంజేసి నిత్యుడు. అనాది యని తెలిసికొని పండితులు శోకింపరని తెల్పుట కిచట జీవస్వరూపనిరూపణప్రస్తావమునందు "అహం" అను పదముచే నీశ్వరుడు గ్రహింపబడెను.

నీలకంఠీయము:— "శరీరముకంటె నాత్మ వేరైనను, యెట్లు పట్టుపురుగు తనచుట్టు ఆవరకమైయున్న పట్టుకాయ నశించినచో నదియు నశించునో, యట్లేయాత్మగూడ నశించదా? యను నాశంకమీద నీశ్లోకమును జెప్పుచున్నాడు. "నీవు, నేను, వీరు నందరముగూడ నాద్యంతశూన్యులము" అని యర్థము. ఒకానొకప్పుడును నేను లేననునదిలేదు. అనగా—యెల్లపుడు యుంటిని. అట్లే నీవును లేవనునది లేదు. అనగా— ఎల్లప్పుడును యుంటివి. ఈరాజులును, (ఇదిఉపలక్షణవాక్యము) ఈసమస్తజంతుజాలము లేదనునదిలేదు. అనగా ఎల్లపుడును కలరు అనియేతదర్థకగీతాపదములను సమన్వయింపదగును. అనాదులముగనుకను, అనంతులము గనుకను ఇక ముందుగూడ మనమందరము నుండమనునదియులేదు. అనగామనమందరము నెల్లప్పుడు నుందుము. అనియాగీతోత్తరార్థమును సమన్వయింపదగును.

ఒకానొకశరీరమునందు యక్షుడు (బ్రహ్మరక్షస్సు) ప్రవేశించినపు డాశరీమును బాధించినచో నాబ్రహ్మ, రక్షస్సు కాదేహమునం దభిమాన ముండుటచే నది బాధనొందును. కాని యాదేహపతి కాదేహమునం దభిమానము లేకపోవుటచే నతడు బాధ నొందుటలేదు. ఇదిలోకానుభవసిద్ధము. పైయనుభవమును బట్టి దేహ మాత్మకంటె వేరైనను దేహముబాధింపబడిన నాదేహమునందున్న యభిమానమాత్రిచే నాదేహాశ్రితమగు యాత్మకు గూడ నాబాధ సంభవించుచున్నదని సిద్ధమగుచున్నది. కాన "దేహముకంటె నాత్మ వేరైనచో నాదేహము పీడింపబడినచో నాదేహపతి యెట్లు పీడింపఁబడును?" అను ప్రశ్నమున కవకాశము లేదు.

మఱియు, కృతహానాకృతాభ్యాగమప్రసంగము (చేసినకర్మయొక్క ఫలముననుభవించక పోవుటయు. చేయనికర్మయొక్క ఫలము ననుభవించుటయు) సంభవించుటచే పురాకృతకర్మ లేనిఁడగ జీవించుటయేసంభవింపనేరదు. కనుకనే యెట్లు మనజీవనము పాకాదిక్రియాపూర్వకమో యట్లే స్థావరములగువృక్షాదుల జీవనము గూడ జీవికాత్వము కలదిగాన పూర్వకర్మపూర్వకమే యగుచున్నది. అందువలన వృక్షాదిస్థావరములకుగూడ ప్రాక్కర్మమున్నదని యూహింపదగును. అట్టి పూర్వకర్మ యనేకవిధములుగా నుండునుగాన దానింబట్టి సుఖదుఃఖములుగూడ ననేకవిధములుగ నుండును. యెట్లన? కుమ్మరి ఘటము పుట్టుట కనుకూలమగు క్రియనారంభించినచో నాక్రియానుసారముగ ఘటమే పుట్టుచున్నది. అట్లే మూకుడు పుట్టుట కనుకూలమగు క్రియ నారంభించినచో నాక్రియానుసారముగ మూకుడుపుట్టుచున్నది. కానక్రియావైచిత్ర్యమునుబట్టి కార్యవైచిత్ర్యమనుభవ

గీ॥ దేహినోఽస్మిన్యథా దేహే కౌమారం యౌవనం జరా ।
తథా దేహాంతరప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి ॥ ॥౧౩॥

పదవిభాగము:— దేహినః- అస్మిన్- యథా- దేహే- కౌమారం- యౌవనం- జరా- తథా- దేహాన్తరప్రాప్తిః- ధీరః- తత్ర- న- ముహ్యతి।

ప్రతిపదార్థము:— దేహినః=దేహసంబంధముగల జీవునకు; అస్మిన్=ఈ; దేహే=దేహమునందు; కౌమారం=బాల్యావస్థయు; యౌవనం=మధ్యమావస్థయు; జరా=వార్ధక్యావస్థయు; యథా=ఎట్లు; దృశ్యన్తే=(ఈపదమధ్యాహార్యము) చూడబడుచున్నవో; తథా=అప్రకారమున నే; దేహాన్తరప్రాప్తిః=మరియొక దేహము ప్రాప్తించుచున్నది; ధీరః=ధీరుడు; తత్ర=అట్టివిషయమున; న ముహ్యతి=మోహపడడు ॥౧౩॥

---

శాంకరభాష్యమ్:—

తత్ర కథ మివ నిత్య ఆత్మేతి దృష్టాంత మాహ—దేహిన ఇతి । దేహోఽస్యాస్తీతి దేహీ తస్య దేహినో దేహవ దాత్మనోఽస్మిన్వర్తమానే దేహే యథా యేన ప్రకారేణ కౌమారం కుమారభావో బాల్యావస్థా, యౌవనం యూనో భావో మధ్యమావస్థా, జరా

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

భీష్మద్రోణాదులు పారమార్థికరూపముచే నిత్యులు. కాన శోచింపదగనివార లని పూర్వమునందు జెప్పబడెను. పూర్వదేహమును విడచి దేహాంతరమును బొందుచున్న

---

సిద్ధము. అట్లే పూర్వకర్మవైచిత్ర్యమునుబట్టి సుఖదుఃఖవైచిత్ర్యము నూహింపదగును. అట్లే తత్కాలమున బుట్టిన గోవత్సమునకు స్తన్యపానమునందు ప్రవృత్తియు, జంతుమాత్రమునకు మరణమువలనభయము ప్రాక్తనానుభవజనిత మగు సంస్కారమువలన కలుగుచున్నవి. భోజనాదిప్రవృత్తి యుచ్ఛ్వాసాదులవలె కల్గుచున్నది. కనుక ప్రాచీనకర్మము కలదని సిద్ధించుచున్నది. మఱియు నీవిషయము లౌకికశాస్త్రప్రసిద్ధమైనది. యెట్లన? దేవదత్తుని శరీరమునం దొక ములుతో గ్రుచ్చిన యాతఁడు ఖేదపడును. అట్లు ఖేదించుట యుక్తమే యగును. ఇట్లే అతని శరీరప్రతిమను కొందరు శత్రువులు మట్టితో చేసి దాని నొక సూదితో నవమానచికీర్షతో గ్రుచ్చినను యాతఁడు ఖేదపడును. ఇట అభ్యంతర మగు ధాతువైషమ్యము గాని, బహిరంగ మగు కంటకవేధ గాని యాతనికి ఖేదహేతువులు కావు. గనుక కేవల ప్రాక్కర్మమాత్రమే- యాతనికి ఖేదహేతు వని తప్పక చెప్పవలయును. కనుక యీ యుపపత్తిసమూహచే జంగమస్థావరాత్మకనిఖిలప్రాణులకు పూర్వకర్మ కలదని సిద్ధించును. ఇంతకు పర్యవసితమేమి? బీజాంకురన్యాయముగ (విత్తునుండి వృక్షము, వృక్షమునుండి బీజములు పుట్టుట) కర్మనుండి సంస్కారములు, సంస్కారముల వలన కర్మలు జనించుచుండును. ఇట్టి సంస్కారకర్మపరంపరచే సంసారమునాదియని తెలిసికొనదగును. దేహములు నశించినను ఆత్మనశించునది కాదు. కనుకనే యాత్మస్వరూపుల మగు మన మెల్లప్పుడు నుందు మని భావము. పూర్వశ్లోకమున దేహముకంటె నాత్మ వేఱని చెప్పఁబడెను. ఈ శ్లోకమందు సూక్ష్మశరీరవిశిష్టాత్మకు వ్యావహారికనిత్యత్వము సాధింపబడెను. ఇదియే యీరెండుశ్లోకములకు గల భేదము.

## —• ౨వ అధ్యాయము— ౧౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "నేను స్థూలమయినవాఁడను, నేను గౌరవర్ణము కలవాఁడను, నేను వెళ్ళుచుంటిని" అను ప్రతీతులనుబట్టి చైతన్యవిశిష్టములగు దేహములనే యాత్మలనిలోకాయతికు (నాస్తికు)లందురు.

శాంకరభాష్యమ్:—

వయోహాని ర్జీర్ణావస్థే త్యేతా స్తిస్రో౽వస్థా అన్యోన్యవిలక్షణా స్తాసాం ప్రథమావస్థానాశే న
నాశో ద్వితీయావస్థోపజననే నోపజననమాత్మనః, కిం తర్హ్యవిక్రియస్యైవ ద్వితీయతృతీయావస్థా
ప్రాప్తి రాత్మనో దృష్టా యథా తథా తద్వదేవ దేహా దన్యో దేహాంతరం తస్య ప్రాప్తి ర్దేహాం
తరప్రాప్తి రవిక్రియస్యై వాత్మన ఇత్యర్థః । ధీరో ధీమాం స్తత్రైవం సతి న ముహ్యతి న
మోహ మాపద్యతే । ॥౧౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

యాత్మ వికారి యగుచుండ నెట్లాయాత్మ నిత్య మగుననిన ? నీదేహమునందు జీవుఁడు' అహం
మమ' అనుయభిమానముగలవాఁడై బాల్యావస్థ, యౌవనావస్థ, వార్ధకావస్థయను అన్యోన్యవిలక్ష
ణము లగు మూఁడవస్థలును జూచుచుండెను. అందువలన బ్రథమమగు బాల్యావస్థ నశించిన
నాత్మకు నాశము లేదు. ద్వితీయమగు యౌవనావస్థ పుట్టుటవలన నాత్మ పుట్టుటలేదు. మఱే
మనిన: అవిక్రియమగు నాత్మకే ద్వితీయతృతీయావస్థలు ప్రాప్తించుచున్నవి. 'యో౽హం

కాన దేహముకంటె నాత్మ వేరెట్లగును? అట్లైనను "దేవదత్తుఁడు పుట్టెను. దేవదత్తుఁడు మరణించెను" అను
ప్రతీతివలన దేహముయొక్క జన్మనాశనములతో గూడ నాత్మకును జన్మనాశములు సంభవించుచున్నందున
యాత్మ నిత్య మెట్లగును? అను నాశంకమీద 'దేహినో౽స్మి న్యథా దేహే' అను శ్లోకమును జెప్పుచున్నాఁడు.

'దేహినః' జగన్మండలవర్తులును, భూతభవిష్యద్వర్తమాన కాలికములు నగు సకలదేహములయొక్క
సంబంధముగల యాత్మకు యెట్లు వర్తమానదేహమునకు బరస్పరవిరుద్ధములగు కౌమార యౌవన వార్ధకావస్థలు
ప్రాప్తించునో యట్లే యీదేహముకంటె విలక్షణములగు దేహములు బ్రాప్తించును. కనుకనే దేహభేదముచే
నాత్మ వేఱగుటకు వలనుపడదు. ఒకటియగు నాత్మ విభువుగాన సర్వేంద్రియసంబంధము కలదనియు, కనుకనే
యంతటను చేష్టాదికము పపన్న మగుచున్నదనియు, కావుననే ప్రతిదేహమునందు నాత్మ వేరని జెప్పుటకు
బ్రమాణము లేదనియు "దేహినః" అను స్థలమునందు గల ఏకవచనముచే సూచితమయ్యెను.

కౌమారాద్యవస్థలు వేఱగుటచే దేహముగూడ వేరే యగును. అట్టిదేహములే యాత్మలందు వేమో? అట్లు
కానేరదు. ఏలన? "బాల్యమున దల్లిదండ్రులచే సుఖించిన నే నీవార్ధకమున మునిమనుమల జూచి యానందించు
చుంటిని" అను ప్రత్యభిజ్ఞ యొకనికే గలుగుచుండుటవలనను, ఒకనికి గలిగిన ప్రత్యక్షాద్యనుభవసంస్కారముల
వలన మఱొకనికి బ్రత్యభిజ్ఞాదులు గలుగకపోవుటవలనను యవస్థాభేదములనుబట్టి యాత్మ భిన్నము కాదు. అట్లే,
స్వప్నమునందును, యోగమహిమ యున్నపురుషుని యొకనికే దత్తద్దేహభేదజ్ఞాన మున్నను "వాఁడినే నేను" అను
ప్రత్యభిజ్ఞ యొకనికే గలుగుచుండుటచే నవికారియు, సద్రూపము నగు నాత్మకే యీదేహముకంటె నత్యంత
విలక్షణ మగు దేహము ప్రాప్తించుచున్నది.

కౌమారాద్యవస్థ లత్యంతవిలక్షణమైనను "ప్రత్యభిజ్ఞ యున్నంతవరకు నొకేవస్తు వుండును" అను న్యాయ
మనుసరించి యట్టి యవస్థలుగల దేహ మొక్కటియే యని యందు మన్న స్వప్నయోగమహిమలయందు దేహ
తద్ధర్మభేద ముండుటచే "వాఁడినే నేను" అను ప్రత్యభిజ్ఞ కలుగకపోయెడిని. కాన వాస్తవికముగ మరుమరీచి
కాదు లుదకము కానందున వానియం దుదకబుద్ధివలె వాస్తవముగ నాత్మ స్థూలము కానందున దానియందు
"నేను స్థూలుఁడను" అను మొదలగు బుద్ధి భ్రమాత్మకమే యగును. ఈవిషయము "న జాయతే" అను శ్లోకమున
వివరింపఁబడును. ఈచెప్పుటవలన నాత్మ దేహముకంటె వేఱని సిద్ధించినది.

శాంకరభాష్యతత్త్వబోధిని:—
"బాల్యే య దద్రాక్షం సోఽహ మిదానీం స్మరామి" ఏనేను బాల్యమందు దేనినిఁ జూచితినో యానేనే దానిని యౌవనావస్థయందు స్మరించుచుంటిని. అని బాల్యమునందు గల దర్శనమునకు, యౌవనమునందుఁగల స్మరణమునకు సామానాధికరణ్యము (ఏకాధికరణవృత్తిత్వము) అనగా నొకదానియందుండుట కన్పట్టుటవలన ఒకరిచే జూడఁబడినది మఱొకరికి స్మరణమునకు రానం

కౌమారాద్యవస్థలు వేఱయినను దేహ మొక్కటియే యగుటచే "వాడినే నేను" అను ప్రత్యభిజ్ఞ యుప పన్నమైనను స్వాప్నికదేహములు, యోగమహిమవలన బొందెడి దేహములు వేఱగుటచే "వాడినే నేను" అను ప్రత్యభిజ్ఞ సంభవింపనేరదు. కాన ఆత్మ దేహముకంటె వేఱని యొప్పుకొనవలయును. అట్లు వేరైనను దేహము పుట్టునపుడు పుట్టుననియు, దేహము నశించునపుడు నశించుననియు జెప్పుటయు నసంగతము.

మఱియు నెట్లవికారియు, నేకము నగు నాత్మకు కౌమారాద్యవస్థలు ప్రాప్తించుచున్నవో యట్లే నీదేహో త్క్రమణానంతర మింకొక దేహము ప్రాప్తించుచున్నది, అట్లు దేహాంతరప్రాప్తి లేనిచో నీదేహమునుండి యుత్క్రమించి యన్యదేహమును బ్రవేశించిన యాత్మకు "సోహం" (వాడినే నేను అను) ప్రత్యభిజ్ఞ లేక పోయినను యప్పుడే జన్మించిన బాలునకు నదృష్టమాత్రమువలన జనించెడి యిష్టసాధనతాజ్ఞాన (ఇవి నాకిష్ట సాధనము లనెడిజ్ఞానము, ఇవి యనిష్టసాధనము లనెడి జ్ఞాన)మువలన నుద్బుద్ధమగు పూర్వసంస్కారమువలన జనించెడి హర్షశోకాదులు లేకపోయెడిని. అట్లే స్తన్యపానాదులయందు బ్రవృత్తియు లేకపోయెడిని. కాన అట్టి స్తన్యపానాది ప్రవృత్తికి హేతువగు సంస్కారము నంగీకరింపవలయు. అట్టి సంస్కార మనభవపూర్వక మగుటంజేసి యట్టి యనుభవశాలియగు నాత్మ యీశరీరోత్పత్తికి పూర్వమునందు శరీరధారియని యొప్పుకొన వలయును. కావున పూర్వాపరదేహసంబంధముగల యాత్మ దేహముకన్న వేరనియు, నొక్కటనియు సిద్ధించు చున్నది. మఱియు నట్లు కానిచో కృతహానాకృతాభ్యాగమము (చేసి నకర్మనిష్ఫలమగుటయు, తానెట్టి సుకృ తమునుజేయకున్నను మంచిభోగము ననుభవించుటయు) ప్రాప్తింపవలసివచ్చును. కాన దేహాదులకంటె యాత్మ వేఱనినిశ్చిత మగుచున్నది.

అట్టి యాత్మ శరీరపరిమాణక మన్నయెడల మధ్యమపరిమాణముకల వస్తువు ఘటాదులువలె సావయవమగు టంజేసి నశింపవలసివచ్చును. అట్లైన కృతహానాకృతాభ్యాగమములు ప్రాప్తింపవలసివచ్చును. అందువలన మధ్యమ (శరీర)పరిమాణకము కానేరదు. అణుస్వరూపమన్న నదియు సంభవము కాదు. అట్లయినచో అణురూప మగు నాత్మ దేహమునం దేకదేశమునం దుండును. కాని సర్వదేహమునం దుండజాలదు. అట్లేకదేశమునం దుండు ఆత్మకు సర్వశరీరమునం దనులిప్తమగు చందనమువలన బ్రాప్తించెడి శైత్యప్రత్యక్షము గలుగకపోయె డిని. అందుచే నాత్మసర్వవ్యాపకమని యొప్పుకొనవలయును. అట్లయిన యోగమహిమచే నొక్కమారుగ ననేక దేహముల సంబంధము ప్రాప్తించును. దేహగతబాల్యాద్యవస్థల యుత్పత్తివినాశము లున్నను నిత్యుడు నొకడే యాత్మ యగుటంజేసి యాత్మ నిత్యమనియు, ఏకమనియు సిద్ధించుచున్నది. ఇట్లుండ నోయర్జునా! నీవు ధీరుడవు కాకపోవుట వలన వీరలు జంపబడువారు, నేను జంపువాడనని కల్పనజేసుకొని నీవు మోహమును బొందుచుంటివి. ధీరులు "ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా" అనుశ్రుతిసిద్ధమగు నాత్మను వ్యాపకముగను, నిత్యముగను దెలిసికొని వధ్యఘాతకభావకల్పనను విడిచి మోహమును బొందరు. ఈచెప్పుట వలన దేహమాత్రమే యాత్మయను చార్వాకమతము, ఇంద్రియములు, మనస్సు, ప్రాణము, యాత్మ యను చార్వాకైకదేశుల మతము, క్షణికవిజ్ఞాన మాత్మయనెడి బౌద్ధులమతము, దేహముకంటె వేఱు స్థిరుడు దేహపరి మాణము కలవాడాత్మ యను దిగంబరమతము. నిత్యుడు అణుస్వరూపుడు అనువిశిష్టాద్వైతమతము(లేక దిగంబ రైకదేశిమతము)లు— ఆత్మ నిత్యము, విభువనని సిద్ధాంతీకరించుటచే నిరస్తములు.

శాంకరభాష్యతత్త్వబోధిని:—

దున నవస్థాత్రియమునందనుస్యూతమైన యాత్మ యొక్కటే యనియొప్పుకొనక తప్పదు. అదేవిధమున నీదేహమును వదలి దేహాంతరము నొందినను దేహపరంపరయందనుస్యూతమైన యాత్మ యొక్కటే. కాన యాత్మ నిత్యము. కావుననే యాత్మ యవిక్రియమగుటచే

శంకరానందీయము:— ఈవిధముగ శ్రుతియుక్తులచేశోధింపఁబడిన తత్త్వంపదార్థములకైక్యము ప్రతిపాదింపఁబడినను, త్వంపదార్థమగు నాత్మ యవిద్యాతత్కార్యకోటులచే దిరోహిత మగుటంబట్టి యతిసూక్ష్మ మగుటచేతను, దుర్విజ్ఞేయ మగుటచేతను మందప్రజ్ఞుడు, ముముక్షువు నగు శ్రోతకెంతలోపల బ్రతిబంధరహిత మగు నపరోక్షజ్ఞానము కలుగునో యంతవరకు "ఆవృత్తిరసకృదుపదేశాత్" అను బ్రహ్మసూత్రన్యాయము ననుసరించి పౌనఃపున్యముగ తత్త్వంపదార్థశోధనమే లెస్సగ జేయదగిన దని సూచించుట కుత్తరగ్రంథము నారంభించుచుండెను.

ఇంతకుముందు త్వంపదార్థమగు నాత్మ కాలత్రయమందుండునని ప్రతిపాదించినను యీ దేహము నశించినతరువాత యుండుటలేదు గనుక కాలత్రయసద్భావ మెట్లు పొసగును? అను సంశయము గలవానిగా నర్జును నూహించి యాత్మ దేహాంతరమందుగూడ నుండునని సదృష్టాంతముగను, ప్రత్యక్షానుమాన ప్రమాణములతో నీశ్లోకమున నిరూపించుచున్నాడు.

"దేహినః=దేహోపాధికమగు నాత్మకు; వపుః=(ఈ పదమధ్యాహార్యము) కౌమారావస్థతోకూడిన శరీరము, యౌవనావస్థతోగూడిన శరీరము, వార్ధకావస్థతోగూడిన శరీరమని యన్వయింపదగును. దేహాంతరప్రాప్తిః =ఈస్థూలదేహమును విడచినను నశించనియాత్మకు మఱియొక దేహము బ్రాప్తించుచుండును. "జీవాపేతం వావ కిలేదం మ్రియతే న జీవో మ్రియతే" అను శ్రుత్యర్థ మీశ్లోకమున జెప్పఁబడెను. జాగ్రదవస్థలోనున్న దేహము, స్వప్నావస్థలోనున్న దేహము సుషుప్త్యవస్థయందు నశించినను యాత్మ యున్నదని దెలిసికొనలేము. అట్లైనను జాగ్రదవస్థయందున్న మనుజుడు "ఏ నేను స్వప్నమును గంటినో, సుఖముగ నిద్రించితినో అట్టి నే నిపుడు మేల్కాంటిని" అను ప్రత్యభిజ్ఞానబలముచే జాగ్రత్స్వప్న సుషుప్తులందాత్మ సత్తనియు, నిత్యమనియు నెట్లు దెలిసికొనునో యట్లే దేహనాశానంతరమందు గూడ నాత్మ సత్తనియు. నిత్యమనియు దెలిసికొని ధీరుడు మోహమును బొందడని భావము.

"ఈ శిశువు ప్రస్తుతమున నెవరు నుపదేశింపకుండగనే స్తన్యపాన మందు బ్రవృత్తి కలవాఁడయ్యెను. కనుకనే పూర్వజన్మమున నన్నాద్యాహారములు కలవాఁడు. ఇఁక ప్రతిమాదుల కీజన్మయందు స్తన్యపానప్రవృత్తియు లేదు. కనుకనే పూర్వజన్మమున నన్నాద్యాహారములు కలవియు కావు" అని వ్యతిరేకముగ నూహింపఁదగును. కాన ననేకజన్మములయందనేకదేహములు నశించినను యాత్మ నిత్యము. కాన అనేకదేహములు బ్రాప్తించినను యాత్మ నశించక యుండును. ఎట్లన ? కౌమారాదిదేహములు ప్రాప్తించినను యెట్లాత్మ నిత్యమైయున్నదో (నశించక యున్నదో) అట్లే యనేకదేహములు ప్రాప్తించినను పూర్వమునందుఁ జెప్పఁబడిన ప్రత్యక్షానుమానప్రమాణములచే జన్మాంతరమునందు గూడ నాత్మసద్భావము నెఱిఁగి నిత్యమనియే నిశ్చయించి "యాత్మ కలదా? లేదా!" అని పండితుఁడు సంశయింపఁడని తాత్పర్యము.

పరమార్థప్రపా:— పూర్వశ్లోకమందు శోకము జీవనిమిత్తకము గాదని జెప్పి, యీశ్లోకమందు దేహనిమిత్తకముగూడ గాదని జెప్పుచున్నాడు.

దేహాభిమానవంతుఁడగు జీవుని దేహమం దెట్లు కౌమారయౌవనజరావస్థలు సంభవించుచున్నను, దేహ-

శాంకరభాష్యతత్త్వబోధిని:—

**నిత్యమైయుండ శ్రుతిస్మృతియుక్తులచే నాత్మ నిత్యమని దెలిసిన ధీరుఁడు మోహమును బొందనేరఁడు.** ॥౧౩॥

యొక్కటియే యగుచున్నదో యట్లే జీవుని కీదేహనాశానంతరమింకొక దేహము ప్రాప్తించుచుండును. కనుక నాత్మ యొక్కటియే యగును. అట్లగుటచే నెట్లు పుత్రునకు బాల్యము నశించి యౌవనము ప్రాప్తించినచో తండ్రి శోకింపఁడో యట్లే ధీరుఁ డీదేహనాశానంతర మింకొక దేహము ప్రాప్తించినను దుఃఖింపడు. ॥౩౧॥

నీలకంఠీయము:— "ఇష్టమగు దేహముయొక్క వియోగమువలన శోకము జనించునుగాదా?" యను నాశంకకు సమాధానముగ 'దేహినోఽస్మి న్యథా దేహే' అను శ్లోకమును చెప్పుచుండెను. "దేహినః, దేహౌ స్థూలసూక్ష్మే విద్యేతేఽస్యేతి" స్థూలసూక్ష్మ దేహములుగల చిదాత్మ దేహి అనబడును. అట్టి జీవున కేతీరున స్థూలశరీరమున కౌమారాద్యవస్థలయందు దేహభేదముండినను, నేనో॰ డనే పూర్వమువందు బాలుడను, ఇప్పుడు వృద్ధుడను అను యభేద ప్రత్యయమువలన బాల్యావస్థల యందుండు నాత్మ కభేదము, బాల్యాది శరీరముకంటె భేదము సిద్ధించుచున్నదో ఆదేతీరున "వ్యావృత్తేభ్యోఽనువృత్తం భిన్నం కుసుమేభ్య స్సూత్ర మివ" పరస్పర భిన్నములగు కుసుమములయం దనువృత్తమగు సూత్రము (దారము) కుసుమములకన్న భిన్నమగునటుల "దేహాంతరప్రాప్తిః" స్థూలశరీరముకన్న వేరగునట్టియు, స్థూలానుకారులగునట్టి లింగదేహము లాత్మకు సంభవించును. అనగా ఒక్కటగు స్థూలదేహము కౌమారాద్యవస్థాభేదముచే ననేకము లైనటుల (ముక్త్యవస్థాపర్యంతము) నిత్యమగు లింగదేహముగూడ ప్రాణుల కర్మవైచిత్ర్యమున సుర, నర తిర్యగాద్యవస్థాభేదములచే ననేకవిధము లగును. కాన నుక్తన్యాయమున నవస్థాభేదములచే భిన్నమగునట్టియు, (పరస్పరవ్యావృత్తములగు) లింగదేహములయం దనువృత్తమగు నాత్మ పరస్పరభిన్నమగు కుసుమములయం దనువృత్తమగు సూత్రమువలె నొక్కటియే. కనుక శోకమోహాదుల కాశ్రయమగు లింగదేహముకంటె వేఱగు నీకిష్టవియోగమువలనఁ గలిగెడి శోకము గూడ న్యాయముగాదు. కనుకనే యీ విషయమునందు ధీరుడు మోహమును బొందడు. పర్యవసితభావమేమి? దేహద్వయాభిమానముచే జనించునవి శోకమోహములు. అట్టి శోకమోహములు దేహద్వయాభిమానమును బరిత్యజించిన ధీరుని బాధింపవు. కనుక నీవు గూడ దేహద్వయాభిమానమును బరిత్యజించి ధీరుడవు కమ్మని యాశయము.

"గతాసూన్" "నత్వేవాహం-వయమతః పరం" అనుశ్లోకములయందు గతాసూన్. వయం" అను బహువచన ముపాధిగతబహుత్వము ననుసరించి జెప్పఁబడెను. ఇట "దేహినః" అను నేకవచనమాత్మాభేదాభిప్రాయకము. ఈవిషయమునే "యథా హ్యయం జ్యోతి రాత్మా వివస్వా నపో భిన్నా బహుధైఽకోఽనుగచ్ఛన్ । ఉపాధినా క్రియతే భేదరూపో దేవః క్షేత్రేష్వేవమజోఽయమాత్మా" ఏతీరున జ్యోతిస్స్వరూపుడగు సూర్యుఁడు భిన్నములగు జలముల ననుసరించుచు ననేకవిధములుగ గన్పట్టునో యదేరీతిగ నొక్కడగు నాత్మగూడ ననేకములగు స్థూలసూక్ష్మదేహరూపోపాధుల ననుసరించుచు నుపాధులచే భిన్నుడుగ జేయబడును. అనియు, "ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా" సర్వభూతములయందు నిగూఢమైనట్టియు, సర్వవ్యాపియగు నట్టియు, సర్వభూతాంతరాత్మయగు నాత్మ యొక్కడే అనియు యీ శ్రుతి యాత్మ కేకత్వమును జెప్పుచున్నది. ఏకత్వమువలన నాత్మకు విభుత్వము సిద్ధించుచున్నది. అందువలన ననిత్యములును, అవిభువులును నగు శరీరాదుల కాత్మత్వము సంభవింపనేరదు. కాన చార్వాకాదిమతములు నిరస్తములు. ॥౩౧॥

మాత్రాస్పర్శాస్తు కౌంతేయ! శీతోష్ణసుఖదుఃఖదాః ।
ఆగమాపాయినోఽనిత్యా స్తాం స్తితిక్షస్వ భారత! ॥ ॥౧౪॥

పదవిభాగము:— మాత్రాస్పర్శాః- తు- కౌంతేయ- శీతోష్ణసుఖదుఃఖదాః- ఆగమాపాయినః- అనిత్యాః- తాన్- తితిక్షస్వ- భారత! ।

ప్రతిపదార్థము:— హేకౌంతేయ=ఓయర్జున!; మాత్రాస్పర్శాస్తు=(మీయంతే అభిశ్శబ్దాదయ ఇతి మాత్రాః) త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము అనెడి యింద్రియములయొక్క; స్పర్శాః=శబ్దస్పర్శరూపరసగంధములతో గల సంయోగాది సంబంధములు; శీతోష్ణసుఖదుఃఖదాః, శీత=శీతమును; ఉష్ణ=ఉష్ణమును; సుఖదుఃఖదాః=సుఖదుఃఖములను యిచ్చునవి; లేక, మాత్రాస్పర్శాః, మాత్రా=ఇంద్రియములు; స్పర్శాః=శబ్దాది విషయములు; శీతోష్ణసుఖదుఃఖదాః=ఒకప్పుడు శీతమువలన సుఖమును, ఒకప్పుడు శీతమువలన దుఃఖమును, ఒకప్పుడు ఉష్ణమువలన సుఖమును, ఒకప్పుడు ఉష్ణమువలన దుఃఖమును యిచ్చునవి; తే=ఆ మాత్రాస్పర్శలు, ఆగమాపాయినః=వచ్చిపోవుస్వభావముగలవి కనుక; అనిత్యాః=అనిత్యములు; అతః=(ఈపద మధ్యాహార్యము) ఈహేతువువలన; తాన్=ఆశీతోష్ణాదులను; తితిక్షస్వ=సహింపుము. ॥౧౪॥

---

శాంకరభాష్యమ్:—

యద్యప్యాత్మవినాశనిమిత్తో మోహో న సంభవతి నిత్య ఆత్మేతి విజానత స్తథాపి శీతోష్ణసుఖదుఃఖప్రాప్తినిమిత్తో మోహో లౌకికో దృశ్యతే, సుఖవియోగనిమిత్తో దుఃఖసంయోగనిమిత్తశ్చ శోక ఇత్యేత దర్జునస్య వచన మాశం క్యాహ—మాత్రాస్పర్శా ఇతి । మాత్రా అభి ర్మీయంతే శబ్దాదయ ఇతి శ్రోత్రాదీ నీంద్రియాణి, మాత్రాణాం స్పర్శా శ్శబ్దాదిభి స్సంయోగా స్తే శీతోష్ణసుఖదుఃఖదా శ్శీత ముష్ణం సుఖం దుఃఖం చ ప్రయచ్ఛంతీతి ।

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

శ్రుతిస్మృత్యాదులవలనను, అనుమానప్రమాణమువలనను ఆత్మ నిత్యమని తెలిసినవానికి యాత్మనాశప్రసక్తివలనఁ గలుగు శోకమోహములు సంభవింపనేరవు. కాని శీతోష్ణములప్రాప్తి చేతను, శీతకాలమునందు శీతమువలన దుఃఖప్రాప్తియు, వేసవియందు శీతమువలన సుఖప్రాప్తియు, శీతకాలమునం దుష్ణమువలన సుఖప్రాప్తియు, వేసవియం దుష్ణమువలన దుఃఖప్రాప్తియు వానివలనఁ గలుగు లౌకికమోహము, సుఖవియోగమువలన గలుగు శోకము, దుఃఖసంయోగమువలన ప్రాప్తించు శోకము ప్రత్యక్షమేకదా యనెదవా? ఓయర్జున! కుంతీపుత్ర! భరతా

---

—• ౨వ అధ్యాయము— ౧౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "బుద్ధిసుఖదుఃఖేచ్ఛాద్వేషప్రయత్నధర్మాధర్మసంస్కారరూప విశేషగుణములు గలవియై ప్రతిదేహమునందు వేఱువేఱుగ గనబడుచున్నవిగాన నాత్మలు శరీరమున కొక్కొకటి చొప్పున వేర్వేరుగ నుండును. ఆత్మ నిత్యము, విభువు నగుగాక. ఆవిషయమున మాకెట్టి వివాదయు లేదు. కాని సర్వశరీరములయందు నొక్కటియే యాత్మ యుండుననుటను సహింపము" అని వైశేషికు లందురు. ఈపక్షమునే తార్కికులు (గౌతమీయులు), పూర్వమీమాంసకులుగూడ నాశ్రయించిరి. సాంఖ్యమతమునగూడ కొద్దిమార్పున్నను యాత్మ గుణముకలదనుటయందును, ప్రతిశరీరమునందు వేర్వేరుగ నుండుననుటయందును వైమతములతో సామ్యత

శాంకరభాష్యమ్:—

అథవా స్పర్శ్యంత ఇతి స్పర్శా విషయాః శబ్దాదయః మాత్రాశ్చ స్పర్శాశ్చ శీతోష్ణసుఖదుఃఖదాః శీతం కదాచి త్సుఖం, కదాచిద్దుఃఖం తథోష్ణమ ప్యనియతరూపం సుఖదుఃఖే పున ర్నియతరూపే యతో న వ్యభిచరతోఽత స్తాభ్యాం పృథక్ శీతోష్ణయో ర్గ్రహణమ్। యస్మా త్తే మాత్రాస్పర్శాదయ ఆగమాపాయిన ఆగమాపాయశీలా స్తస్మా దనిత్యా అత స్తాన్ శీతోష్ణాదీం స్తితిక్షస్వ ప్రసహస్వ; తేషు హర్షం విషాదం చ మాకార్షీ రిత్యర్థః ॥ ॥౧౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

న్వయ సంభూత! త్వక్చక్షు శ్శ్రోత్రజిహ్వాఘ్రాణములనెడి యింద్రియములకు శబ్దస్పర్శరూపరస గంధములనెడి విషయములతో గల సంబంధమువలన శీతోష్ణసుఖదుఃఖములు ప్రాప్తించును. (లేక త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లనునింద్రియములవలనను, శబ్దస్పర్శరూపరసగంధము లనువిషయముల వలనను శీతోష్ణసుఖదుఃఖములు ప్రాప్తించును) విషయేంద్రియములవలన శీతోష్ణములు ప్రాప్తించునని చెప్పుటచేతనే తద్ద్వారమున సుఖదుఃఖములు ప్రాప్తించుచుండ శీతోష్ణములకంటె వేరుగ సుఖదుఃఖములను యెందులకుఁ జెప్పవలయునని శంకింపరాదు. శీతమొకానొక

మేకీభవించును. ఆత్మ సర్వశరీరములందు యొక్కటియే యున్న నొకడు సుఖ మనుభవించిన నందరు సుఖ మనుభవింపవలయు ననియు, నొకడు దుఃఖమనుభవించిన నందరు దుఃఖ మనుభవింపవలయు నను యాపత్తి సంభవించెడిని. కాన ప్రతిశరీరమం దుండు ఆత్మలు వేఱనిన నట్టి సుఖదుఃఖసాంకర్యము సంభవింపదు. అందువలన ప్రతిశరీరమం దాత్మలు వేఱని నైయాయిక వైశేషికాదుల యాశయము. కాన "భీష్మాదులకంటె భిన్నుడ నైన నేను నిత్యుడ నైనను, విభువు నైనను నాకు సుఖదుఃఖసంబంధ ముండును. కమక భీష్మాదుల శరీరములు నశించినచో సుఖవియోగము, దుఃఖసంయోగము నాకు సంభవించును. వాటివలన ప్రాప్తించు శోకమోహములను నేనెట్లు విడువగల" నను యర్జునాభిప్రాయ మాశంకించుకొని లింగశరీరవివేకముకొఱ కీశ్లోకము జెప్పుచుండెను.

"మీయన్తే ఆభి ర్విషయా ఇతి మాత్రాః" వీటిచే విషయములు బరిచ్ఛిన్నములగును. గాన నింద్రియములు మాత్రలనఁబడును. వాటికి శబ్దాదులతోనగు సంయోగాది సంబంధములుగాని, లేక నట్టి యింద్రియములద్వారా బయలువెడలెడి విషయాకారమగు నంతఃకరణపరిణామరూపములగు వృత్తులుగాని స్పర్శలనఁబడును. అవి 'ఆగమాపాయినః' (ఇది షష్ఠ్యంతము) ఉత్పత్తివినాశములు గల యంతఃకరణమునకే "శీతోష్ణసుఖదుఃఖదాః" శీతోష్ణములద్వారా సుఖదుఃఖముల నిచ్చునవి కాని నిత్యుడు, విభువగు నాత్మకు సుఖదుఃఖములను గలిగింపవు. ఎట్లనఁగ విమర్శించినచో (ధర్మి సత్త్వము ననుసరించియే ధర్మమునకు సత్త్వముగన్పట్టుటవలనను, ధర్మిసత్త్వము లేనిచో ధర్మమునకు సత్వము గన్పట్టుటలేనందున. ధర్మికంటె ధర్మము వేఱు కానందున) ధర్మమునకును ధర్మికిని మఱొక సంబంధము జెప్పుటకు వీలులేదు. కాన నభేదసంబంధమునే చెప్పనగును. అనగా ఘటసత్త్వము ననుసరించియే ఘటత్వమునకు సత్త్వము గన్పట్టుటవలనను, ఘటసత్త్వము లేనిదే ఘటత్వమునకు సత్త్వము గన్పట్టుటలేనందునను ఘటఘటత్వముల యాథార్థ్యమును విమర్శించుచో ఘటత్వమనునది ఘటముకన్న వేరుగ లేనందున ఘటఘటత్వముల కభేదము సంబంధము. అనిత్యమగు ఘటమునం దభేదముచే నంతర్భావముఁ బొందిన ఘటత్వముగూడ ఘటముతో పాటు నశించును. దీనివలన పర్యవసిత మేమి? అనిత్యమగువస్తు వనిత్యధర్మమున కాశ్రయమగును. అట్లేనిత్యమగువస్తువు నిత్యధర్మముల కాశ్రయమగును. కావున నిత్యమగు నాత్మయనిత్యమగు సుఖదుఃఖాదిగుణముల కాశ్రయము కాజే

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ప్పుడు సుఖమును, నొకప్పుడు దుఃఖమును, ఉష్ణ మొకప్పుడు సుఖమును, నొకప్పుడు దుఃఖమును గలుగజేయుటచే ననియతరూపము లగుచున్నవి. సుఖదుఃఖము లెల్లపుడు నియతములేయని సూచించుటకుఁగాను శీతోష్ణములకన్న వేఱుగ సుఖదుఃఖములు జెప్పబడెను.

శబ్దస్పర్శరూపరసగంధములనెడి విషయములకంటె వేఱుగ శీతోష్ణముల నెందుల కీగీత యందుఁ జెప్పెననిన? విషయము లధ్యాత్మమగు ననుకూలశీతమును గాని. అనుకూల మగు యుష్ణమునుగాని సంపాదించి సుఖము నిచ్చును. ప్రతికూలమగు నుష్ణమును గాని, ప్రతికూల మగు శీతమును గాని సంపాదించి దుఃఖమును గలుగజేయు నని సూచించుటకు విషయముల కంటె వేఱుగ శీతోష్ణములు జెప్పఁబడెనని గ్రహింపనగును.

రము. కనుకనే వాని ననుభవించుట యను క్రియయు నాత్మకు పొసగదు. అందువలననే యాత్మ నిర్గుణము నిష్క్రియము నగును. కనుకనే ఆత్మకు శీతోష్ణాదిద్వారా విషయేంద్రియసంబంధములు సుఖదుఃఖముల నిచ్చునవి కావు.

మఱియు సాక్ష్యము (జ్ఞేయము) సాక్షి (జ్ఞాతృ) ధర్మము కానేరదు. అనగాఁ దెలియబడు ఘటాదికము దెలిసికొను యాత్మధర్మము కానేరదని యాశయము. కాన జ్ఞేయములగు సుఖదుఃఖాదులు జ్ఞాతయగు నాత్మయందుండు ధర్మములు కావు కనుక సుఖదుఃఖాదుల కాశ్రయ మంతఃకరణము. అట్టి యంతఃకరణము ప్రతిదేహమందును భిన్నము. అట్టి యంతఃకరణభేదము నాశ్రయించి వైశేషికాదులచేఁ జెప్పఁబడిన బుద్ధిసుఖదుఃఖేచ్ఛాద్వేషప్రయత్న ధర్మాధర్మభావనాఖ్యసంస్కారవైచిత్ర్య ముపపన్నమగుచుండ సద్రూపముచేతను, స్ఫురణ (ప్రకాశ) చేతను, సర్వత్ర నేకరూపముగ భాసించుచున్నట్టియు, నిర్వికారుడు, సర్వావభాసకుడు నగు యాత్మ ప్రతిదేహమందు వేఱని జెప్పుట నిర్యుక్తికము.

"సుఖదుఃఖాదులను గూర్చి యాత్మ యుపాదానకారణము. కార్య ముపాదాన కారణనిష్ఠమగుటంజేసి సుఖదుఃఖాశ్రయత్వ మాత్మకు దప్పదు. అట్టి సుఖదుఃఖాముల వైచిత్ర్యమును బట్టి యాత్మ యనేకము లనక తప్పదు" అని శంకింపఁజనదు.

ఏలన: వైశేషికులు మనస్సునకు సుఖదుఃఖాదినిమిత్తకారణత్వమును మాత్రమే యంగీకరించి యుండిరి. మేమన్ననో యుపాదానత్వ మంగీకరించితిమి. కాన నుభయులము సుఖదుఃఖకామనాదులను గూర్చి మనస్సు కారణమే యని యొప్పుకొనియుంటిమి. ఇక వివాద మెచ్చటయనిన: మనస్సు సుఖదుఃఖాదులను గూర్చి యుపాదాన కారణమగునా కాదా? యను సంశయము మాత్ర ముభయులకు వివాదాంశము. సుఖదుఃఖాది కారణత్వము మనస్సున కుభయుల మంగీకరించినపుడు పూజ్యమగు నుపాదానకారణత్వమును వైశేషికులుఁగూడ యంగీకరించుట న్యాయము. అట్లంగీకరించినచో "కామ, స్సంకల్పో, విచికిత్సా శ్రద్ధా౽శ్రద్ధా, ధృతి, రధృతి, ర్హ్రీ, ర్ధీ, ర్భీ, రిత్యేతత్సర్వం మన ఏవ" కామనాదికము మనస్సే యని యభేదనిర్దేశద్వారమున కామసుఖదుఃఖాదికమును గూర్చి యుపాదానము మనస్సే యని బోధించుచున్న శ్రుతికూడ యనుకూలమగును. కనుక సుఖాముల కుపాదానకారణము మనస్సు. అందువలన సుఖాదుల కాశ్రయము మనస్సగును. అట్టి మనస్సులు ప్రతిదేహమందును వేఱగుటచే సుఖదుఃఖాది వైచిత్ర్య ముపపన్నమగుచుండ శ్రుతిప్రతిపాదితస్వప్రకాశానందాత్మకమగు నాత్మకు కామాద్యాశ్రయత్వము సంభవింపదు. కావున వైశేషికాదులు భ్రమచేతనే యాత్మకు వికారిత్వమును, భేదమును యంగీకరించిరి.

అంతఃకరణ ముత్పత్తివినాశశాలియగుటవలనను, దృశ్యమగుటవలనను, జడమగుటవలనను ద్రష్టగూడ మగు నీకంటె వేరు. అట్టి యంతఃకరణమందు సుఖదుఃఖాదికము లగు మాత్రాస్పర్శములు గూడ ననిత్యములు కాక

శాంకరభాష్యతత్త్వబోధినీ:—

విషయేంద్రియసంయోగ మాత్మయందు నియతము. అట్టి నియతమగు విషయేంద్రియ సంయోగమువలన శీతోష్ణసుఖదుఃఖములు నియతములు. అట్టి నియత శీతోష్ణసుఖదుఃఖములవలన హర్షవిషాదములు నియతముగ బ్రాప్తించుచునే యుండునని శంకింపరాదు.

విషయేంద్రియసంయోగము లాగమాపాయులు. కావున నవి యనిత్యములు. కాన ననిత్యము లగు విషయేంద్రియసంయోగాదులవలనఁ బ్రాప్తించు శీతోష్ణసుఖదుఃఖములను సహింపుము. అనగా శీతోష్ణములవలన సుఖము ప్రాప్తించునపుడు హర్షమును గాని, దుఃఖము ప్రాప్తించునపుడు విషాదమును గాని పొందకుము. అనగా "అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే। గతాసూ నగతాసూంశ్చ నానుశోచంతి పండితాః॥" అనుచోట నెట్టివాఁడు విద్యాధికారి యని సూచింపఁబడెనో అట్టివానికి "తితిక్షు స్సమాహితో భూత్వా"

నత్యంతస్థిరమగు నీకంటె వేరును, వికారియు నగు నంతఃకరణమునకు సుఖదుఃఖాదుల నిచ్చునట్టియు, భీష్మాది సంయోగ వియోగరూపములు నగు మాత్రాస్పర్శలను సహింపుము. అనగా నీమాత్రాస్పర్శాదులు నాకేమియు హానిచేయు నవి కావని వివేకబుద్ధితో నుపేక్షింపుము. దుఃఖమున కాశ్రయమగు నంతఃకరణముయొక్క తాదాత్మ్యధ్యాసముచే నాత్మను దుఃఖముకలదానినిగా దెలిసికొనవలదని యాశయము. "హేకౌంతేయ!" 'భారత!' అను సంబోధనములచే నుభయకులవిశుద్ధుడ వగు నీ కజ్ఞానంబు తగదని సూచింపఁబడెను.

శంకరానందీయము:— ప్రత్యక్షానుమానశ్రుతిస్మృతులచే త్వంపదలక్ష్యార్థ మగు నాత్మ నిత్యమే యని నే నెఱుంగుదును. అయినను భీష్మాదిపదవాచ్యార్థములు మరణించుచుండ తద్వియోగమువలన జనించెడి దుఃఖము సహించుటకు శక్యము కాదు. అను నాశయము గలవానినిగ నర్జునుని యూహించి బ్రహ్మవేత్త లనాత్మవిషయకదుఃఖానుసంధానము జేయఁదగదు. మరేమనిన? శరీరాంతరానుసరణచే ప్రారబ్ధకర్మవశమున ప్రాప్తమగు నాధ్యాత్మికాధిభౌతికాధిదైవికరూపం బగు త్రివిధదుఃఖములను సహించి తీవ్రమగు ముముక్షచే నెల్లపుడు బ్రహ్మానుసంధానమునే జేయవలయునని ఈశ్లోకమును చెప్పుచుండెను. "చక్షురాదిజ్ఞానేంద్రియై స్సామాన్యేవ మీయంత ఇతి మాత్రాః। హాగా ద్యుభయేంద్రియై స్పృశ్యంతే గృహ్యంత ఇతి స్పర్శాః। శబ్దాదయో భోగ్యపదార్థాః" చక్షురాదీంద్రియములచే సామాన్యముగ పరిచ్ఛేద్యము లగు (కొలువబడు) నవి మాత్రము లనఁబడును. వాక్పాదపాణిపాయూపస్థాదులచే గ్రహించబడునవి స్పర్శము లనఁబడును. ఇవియే శబ్దస్పర్శరూపరసగంధము లనెడి భోగ్యపదార్థములు. ఇవి స్వయముగ శీతోష్ణములవలె సుఖదుఃఖముల నిచ్చునవి. శీతోష్ణము లనుకూలములై యేరీతిన సుఖమును, ప్రతికూలములై దుఃఖము నొసంగునో యావిధముననే శబ్దాదులుఁగూడ యనుకూలములై సుఖమును, ప్రతికూలములై దుఃఖము నొసంగు నని యర్థము. లేక శబ్దాదులు ప్రతికూలము, ననుకూలము నగునట్టి శీతమునుగాని, యుష్ణమునుగాని శరీరము ననుసరించి పుట్టించి తద్ద్వారమున గాని, సాక్షాత్తుగ గాని సుఖదుఃఖముల నొసంగును. గాన శబ్దాదులు శీతోష్ణసుఖదుఃఖదము అని చెప్పనొప్పును.

"విషయేంద్రియసంయోగము నిత్య మగుటంజేసి తన్నిమిత్తకము లగు సుఖదుఃఖములు నిత్య మగుచుండ నాత్మజ్ఞకు నట్టి సుఖదుఃఖానుసంధానమును విడచి బ్రహ్మానుసంధాన మెటుల సిద్ధించు" నను యాశంకకు సమాధానముగ నీశ్లోకముయొక్క యుత్తరార్థము అనగా "ఆగమాపాయినోఽనిత్యాః" అని చెప్పబడెను. ఆగమ మనగా నుత్పత్తి. అపాయ మనగ వినాశము. అట్టి యుత్పత్తివినాశములు కలవి శబ్దాదివిషయములు. అట్టి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అనుశ్రుతివలన బోధింపబడు తితిక్షను (శీతోష్ణాదిద్వంద్వసహనమును) నీవు బొందుము. శీతోష్ణాదిద్వంద్వసహనము లేనివాడు జ్ఞాని కానేరడు.

ఈశ్లోకమున "కౌంతేయ!" "భారత! అని రెండు సంబోధనలు గలవు. వానివలన మాతృవంశమువలనను, పితృవంశమువలనను పరిశుద్ధమైనవాడే విద్యాధికారి యని సూచితమగుచున్నది. ॥౧౪॥

యనిత్యశబ్దాదివిషయజన్యసుఖదుఃఖములు శబ్దాదులవలె యనిత్యములు. ఆట్టి క్షణికములగువిషయములను, తత్సంయోగములను సహింపుము- "భాయాం రమత ఇతి తస్య సంబుద్ధిః హేభారత" బ్రహ్మవిద్యయందు క్రీడించునట్టి ఓయర్జునా! ముముక్షువగు నీవ్యస భార్గకి ప్రారబ్ధకర్మవశమున బ్రాప్తమగుసుఖదుఃఖాదులనుసహించుటయవశ్యకర్తవ్యము. కాన నీవట్టి సుఖదుఃఖాదులను సహింపుము. ఆటుల సహించిన వేదాంతశ్రవణము, ఆట్టి శ్రవణమువలన జనించెడి అపరోక్షానుభూతి, తత్ఫలమగు మోక్షము సిద్ధించును. ముముక్షువునకు బ్రాప్తమగు సుఖదుఃఖములను ప్రతిక్రియాచింతా విశేషణములు లేకుండగ సహించుటయే యుత్తమధర్మము. ఈవిషయమునే "వృక్ష ఇవ తిష్ఠాసే చ్ఛిద్యమానో న కుప్యేత న కంప్యేత। ఉపల ఇవ తిష్ఠాసే చ్ఛిద్యమానో న కుప్యేత న కంప్యేత" ఛేదింపబడుచున్నను వృక్షమువలె, రాయివలె నుండవలెను. కోపమును బొందవలదు; కంపింపవలదు. అని శ్రుతి బోధించుచున్నది. ఉత్పత్తివినాశములు గలవగుటంజేసి దేహేంద్రియాదులు శబ్ద, స్పర్శ, రూపరస. గంధము లనిత్యములు. ఉత్పత్తివినాశములకు సాక్షియగుటంజేసి ఆత్మనిత్యము. ఇట్లనుపమానప్రమాణముచే దేహేంద్రియశబ్దాదులకు యనిత్యత్వము, వాట్లకు సాక్షియగు నాత్మకు నిత్యత్వము యీశ్లోకమునందు సూచితమయ్యెను.

పరమార్థప్రపా:— నేను భీష్మద్రోణాదులను గూర్చి దుఃఖించను. మరణమనిన తద్వియోగముకల్ల జనించెడి దుఃఖముకలవాడ నైతిని. అను యభిప్రాయమును దొలగించుట కీశ్లోకమును ప్రారంభించెను. శత్రులు, పౌత్రులు మొదలగు విషయములు దేహార్థము సంపాదింపబడును. కాన దేహము సర్వోత్కృష్టమగు విషయము. ఇట్టి దేహమునగూడ వీరులు రణమునందు తృణీకరింతురు. అట్టి దేహమునే తృణీకరించుచుండ శీతోష్ణాదితుల్యమగు క్షణభంగురమైనట్టి సుహృద్వియోగమును తృణీకరించుట యాశ్చర్యమా? కాన "హే భారత!" భరతవంశోత్పన్నుడవగు నీవు వీరుడవు. అందువలన నట్టి బంధువియోగజన్యమగు దుఃఖమును సహింపుమని యాశయము.

నీలకంఠీయము:— "ఆత్మ లింగశరీరముకంటె వేరైనను 'అహం దుఃఖీ' (నేను దుఃఖవంతుడను) అను యనుభవమువలన నాత్మ దుఃఖాదిధర్మముల కాశ్రయమే యగును. కనుకనే భీష్మాదిబంధువర్గము నశించినచో నాకుదుఃఖము ప్రాప్తింపక తప్పదు" అను నాశంకమీద నీశ్లోకమును జెప్పుచున్నాడు. "మీయన్తే ఆభిరితి మాత్రాః ఇంద్రియప్రవృత్తయః" వీటిచే విషయములు పరిచ్ఛిన్నము అగును. కాన మాత్రలనగ నింద్రియ ప్రవృత్తులు. లేక, కౌషీతకీ బ్రాహ్మణప్రసిద్ధములగు నింద్రియవిషయరూపములు నగు వాగాదులగు పది ప్రజ్ఞామాత్రములు, నామాదులగు పంచభూతమాత్రములు మాత్రాశబ్దముచే జెప్పబడును. వాటియొక్క 'స్పర్శాః' పరస్పరము విషయవిషయిభావముతోనైన సంబంధములు 'మాత్రాస్పర్శాః' అనంబడును.

లేక, 'మాత్రాస్పర్శాః' అని వ్యస్తపదములు.మాత్రాసహప్రమాత (జీవుని) తోనైనస్పర్శాః విషయేంద్రియసంబంధములు, ఇవి"శీతోష్ణసుఖదుఃఖదాః"శీతోష్ణములవలె నుత్పత్తినాశములుకలవియైయనిత్యములై వాటి

యం హి న వ్యథయం త్యేతే పురుషం పురుషర్షభ ।
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే ॥　　॥౧౫॥

పదవిభాగము:— యం- హి- న- వ్యథయంతి- ఏతే- పురుషం- పురుషర్షభ- సమదుఃఖసుఖం- ధీరం- సః- అమృతత్వాయ- కల్పతే ।　　॥౧౫॥

ప్రతిపదార్థము:— హే పురుషర్షభ!=ఓ పురుషశ్రేష్ఠుఁడవగు నర్జునుండా; ఏతే=ఈశీతోష్ణసుఖదుఃఖములు; సమదుఃఖసుఖం, సమ=సమానమగు; దుఃఖసుఖం=దుఃఖసుఖములుగల;(అనగా సుఖదుఃఖములు ప్రాప్తించు నపుడు హర్షవిషాదములు లేనట్టి) యంహి=ఏ; ధీరం=బుద్ధిమంతుఁడగు; పురుషం=పురుషుని; నవ్యథయంతి= చలింపఁజేయవో; సః—ఆపురుషుఁడు; అమృతత్వాయ=మోక్షముకొఱకు; కల్పతే=సమర్థుఁడగును.　　॥౧౫॥

శాంకరభాష్యమ్:—

శీతోష్ణాదీ న్సహతః కిం స్యాదితి శృణు — యం హీతి । యం హి పురుషం సమదుఃఖసుఖం సమే దుఃఖసుఖే యస్య తం సమదుఃఖసుఖం సుఖదుఃఖప్రాప్తౌ హర్షవిషాదరహితం ధీరం ధీమంతం న వ్యథయంతి న చాలయంతి నిత్యాత్మదర్శనా దేతే యథోక్తాశ్శీతోష్ణాదయ స్స

శాంకరభాష్యతత్త్వబోధిని:—

శీతోష్ణాదిద్వంద్వసహనరూపతితిక్ష యనునది యాత్మజ్ఞానాధికారసంపాదనమునకు హేతువు లగు శమదమాదులలో నొకటి. అట్టి తితిక్షామాత్రమున నేమి పురుషార్థలాభ మగు ననిన?

వలెనె సుఖదుఃఖముల నిచ్చునవి. కాన వాటిని సహింపుమని యర్థము. "కౌన్తేయ। భారత" అను సంబోధనము లచే "నుత్తమవంశుఁడవగు నీవీయెడ ధైర్యము నవలంబింపఁదగు" నని సూచితమైనది.

ప్రమాతృ (జీవ) త్వము సుషుప్త్యవస్థయందును, సమాధ్యవస్థయందును, ప్రగాఢావేశసమయమందును భాసింపక పోవుటచేతను, జాగ్రత్స్వప్నావస్థలయందు భాసించుచుండుటచేతను కాదాచిత్కము గాన ఆత్మయందు ప్రతీయమానమైనను జ్ఞాన సర్పమువలె నాప్రమాతృత్వము మిథ్యాస్వరూపము. కనుకనే యది యాత్మధర్మము కానేరదు. అనగా ఏది దేనియం దొకప్పు డభిన్నముగా భాసించి, యొకప్పుడు భాసించకుండునో యది దాని యందు, రజ్జువునందు సర్పమువలె నధ్యస్తమైయుండును. కనుక ప్రత్యక్కు (ఆత్మ) యందు ప్రమాత (జీవుఁడు) జాగ్రత్స్వప్నములయందు భాసించుచుండుటవలనను, సుషుప్త్యాదులయందు ప్రత్యగభిన్నముగ భాసించకపోవుటచేతను, రజ్జువునందు సర్పమువలె ప్రత్యగాత్మయందు ప్రమాత యధ్యస్తుఁడు. రజ్జువునం దధ్యస్తమగు సర్పమువలె ప్రత్యగాత్మయం దధ్యస్తమగు ప్రమాతగూడ మిథ్యయగును. కనుక సత్యమగు రజ్జువునకును మిథ్యాభూతమగు సర్పమునకును వాస్తవసంబంధము లేనట్లు, సత్యమగు ప్రత్యగాత్మకు, మిథ్యయగు ప్రమాతకు వాస్తవసంబంధము లేదు. కాన ప్రమాతృధర్మములగు దుఃఖాదులు ప్రత్యగాత్మయం దెట్లుసంభవించును? సంభవింపవని యాశయము.

ఆత్మయందు దుఃఖాదులు సంభవింపనిచో "అహం దుఃఖీ" (నేను దుఃఖవంతుఁడ) నను యనుభవ మెట్లు పొసగు ననిన "కామ స్సంకల్పో విచికిత్సా శ్రద్ధా ధృతి రధృతి ర్హ్రీ ర్ధీ ర్భీ రిత్యేత త్సర్వం మన ఏవ" అను శ్రుతివలన దుఃఖాదుల కుపాదానకారణము మనస్సు. కనుకనే దుఃఖాదులు మనోధర్మములు. తాదృశ దుఃఖాద్యాశ్రయీభూతమనోరూపోపాధితాదాత్మ్యాధ్యాసచేతనాత్మయందు దుఃఖిత్వాదిభ్రాంతి కలుగును. కాని వాస్తవముగ దుఃఖాదు లాత్మధర్మములు కావు. కాన నిష్టజనవియోగమువలన గలిగెడిదుఃఖాదులను సహింపు మని భావము.　　॥౧౪॥

శాంకరభాష్యమ్:—

నిత్యాత్మదర్శననిష్ఠో ద్వంద్వసహిష్ణు రమృతత్వాయ అమృతభావాయ మోక్షాయ కల్పతే సమర్థో భవతి । ॥౧౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఎవనికి సుఖదుఃఖములు సమానములో ననగా సుఖము ప్రాప్తించినపుడు హర్షమును, దుఃఖముప్రాప్తించినపుడు విషాదమును నెవఁడు బొందడో (అనగా శమదమాదిసాధనసంపత్తి గలవాఁడో) ఎవడు ధీరుఁడో (ధీమంతుఁడో) (అనగా నిత్యానిత్యవస్తువివేకముగలవాఁడో) వైరా

—• ౨వ అధ్యాయము ౧౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— అంతఃకరణము సుఖదుఃఖాదుల కాశ్రియ మనినయెడల నట్టి అంతఃకరణమునకే కర్తృత్వభోక్తృత్వము లంగీకరింపవలయును. అట్లయిన చేతనత్వము గూడ నట్టి యంతఃకరణమునకే యంగీకరింపవలయును. అట్లంగీకరించినచో నంతఃకరణముకంటె వ్యతిరిక్తమగునట్టియు, తద్భాసకమగునట్టియు భోక్త వరొకడు కల డనుటయందు ప్రమాణము లేమింజేసి యట్టి భోక్తకు నామమాత్రమునందు, అనగా నట్టి చేతనమునకు అంతఃకరణ మనియా? ఆత్మ యనియా? పేరిడవలె ననిమాత్రము వివాదము కలిగెడిని.

ఇట్లు కాక నంతఃకరణముకంటె వేరుగ నాత్మ యనునది యున్నదని యంగీకరించినచో కర్తృత్వభోక్తృత్వరూపసంబంధము లంతఃకరణమునకును, మోక్ష మనునది యాత్మకును సంభవింపవలసివచ్చు ననెడి యర్జుని యాశంకను తొలగించుటకు శ్రీకృష్ణపరమాత్మ "యం హి న వ్యథయం త్యేతే" అనునది జెప్పుటకు మొదలిడెను.

"అత్రాయం పురుష స్స్వయంజ్యోతి ర్భవతి" అను శ్రుత్యుక్తప్రకారము స్వప్రకాశ మగుటచే స్వతః ప్రసిద్ధమైనట్టియు "స వా అయం పురుషస్సర్వాసు పూర్షు పురి శయో నైతేన కించ నానావృతం నైతేన కించనాసంవృతం" అను శ్రుత్యుక్తప్రకారము శరీరరూపములగు సర్వపట్టణములందు నివసించియుండుటచే పూర్ణుడైనట్టియు, "ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య న కర్మణా వర్ధతే నో కనీయాన్" అను శ్రుతిచే వృద్ధి కనీయస్స్వరూపములగు సుఖదుఃఖముల యొక్క నిషేధమువలన నంతఃకరణపరిణామములగు సుఖదుఃఖాదుల ననాత్మధర్మములుగాను, భాస్యములుగాను సమానముగ తలచునట్టియు, "ధీరం, ధియం ఈరయతీతి" చిదాభాస (జీవ) ద్వారమున బుద్ధి తాదాత్మ్యాధ్యాసముచే బుద్ధి ప్రేరకుడైనట్టియు (అనగా బుద్ధి సాక్షియగునట్టియు) నాత్మకు ఈచెప్పుటవలన "యతో మానాని సిధ్యంతి జాగ్రదాదిత్రయం తథా । భావాభావవిభాగ శ్చ స బ్రహ్మాస్మీతి బోధ్యతే" అను స్మృత్యనుసారము బంధప్రసక్తి చూపబడెను. సుఖదుఃఖము లిచ్చునట్టి యింద్రియములు, శబ్దస్పర్శరూపరసగంధములు ఏకారణమువలన నాత్మ సర్వవికారావభాసక డగుటంజేసి వికారముల కయోగ్యమగుటచే నట్టి పురుషుని వ్యథపెట్టజాలవో యట్టి పురుషుడు స్వస్వరూపబ్రహ్మాత్మైక్యజ్ఞానముచే సర్వదుఃఖోపాదాన మగు నాత్మాజ్ఞాననివృత్తిపూర్వకం బగు నిఖిలద్వైతశూన్యం బగు స్వప్రకాశపరమానందరూపమోక్షముకొరకు సమర్థుఁ డగుచున్నాడు.

ఆత్మకు బంధము స్వాభావిక మనినయెడల "ఆత్మా కర్త్రాదిరూపశ్చే న్మా కాంక్షీ స్తర్హి ముక్తతామ్ । నహి స్వభావో భావానాం వ్యావర్తే తౌష్ణవ ద్రవేః" సూర్యునియొక్క స్వాభావికమగు నుష్ణత్వ మెన్నడును సూర్యుని విడువనటుల భావపదార్థముల యొక్క స్వభావ మెన్నడును భావపదార్థమును విడువనేరదు. కాన నాత్మకు కర్తృత్వాదిరూపబంధము స్వాభావిక మనిన నది యెన్నడు నాత్మను విడువనేరదు. కాన మోక్షము నెన్నడు కోరవలదను న్యాయానుసార మాత్మకు మోక్షమే లేకపోయెడిని.

శాంకరరభాష్యమ్:—

గ్యాదిగుణసంపత్తిగలవాఁడో అట్టివాడు త్వంపదార్థజ్ఞానముకలవాడు. అట్టి సాధనసంపన్నుఁడగు ద్వంద్వసహిష్ణువు "తత్త్వమసి" అను వాక్యార్థజ్ఞాననిష్ఠాద్వారమున మోక్షముకొఱకు సమర్థుఁడగును. ॥౧౫॥

అందువలన నాత్మకు బంధము స్వాభావికము గాదు. బుద్ధ్యాద్యుపాధికృతము. ఈవిషయమునే "ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తేత్యాహు ర్మనీషిణః" అను శ్రుతి కూడ బోధించుచున్నది. అట్టి బుద్ధ్యాదికృత మగు బంధము ధర్మియగు నాత్మ యుండినను నివృత్తము కావచ్చును. కాన నాత్మకు మోక్ష ముపపన్నమగును. అనగా నేది తనధర్మము నన్యధర్మముగ భాసింపజేయునో యది యుపాధియనంబడును. బుద్ధ్యాదులు స్వధర్మమగు దుఃఖాదుల నాత్మనిష్ఠముగ భాసింపజేయును గాన బుద్ధ్యాదు లుపాధులనంబడును. అనగా తేలినయాశయ మేమి? స్ఫటికమునందు జపాకుసుమసాన్నిధ్యమువలన లౌహిత్యము (ఎఱుపు) గాన్పించును అది సత్యము కానేరదు. అటే తీరున బుద్ధ్యాదిసాన్నిధ్యమువలన నాత్మయందు బంధము భాసించుచుండును. అట్టి బంధము అసత్యము. కాన నట్టి బంధము స్వస్వరూపజ్ఞానముచే స్వరూపాజ్ఞాన తత్కార్యబుద్ధ్యాదులు నివృత్తములగుచుండ, అట్టి బుద్ధ్యాదినిమిత్తకములగు సకలభ్రమలు నివృత్తములై విభాస్యసంబంధము లేనిదగుటచే శుద్ధము, స్వప్రకాశపరమానందాత్మకమగుటచే పూర్ణమైనట్టి యాత్మకు స్వతః కైవల్యము (మోక్షము) సంభవించును గాన నెవరికి బంధమో వారికే మోక్షమను న్యాయ ముపపన్నమగును.

భాస్యమగు జగత్తునకు, భాసకమగు నాత్మకు నేకత్వము సంభవింపనేరనందున "నామ (పేరు) మాత్రమందు వివాద" యనెడి పై యాశంకముగూడ నిరస్తమైనది.

ఘటాదులవలె భాస్యమగుటంజేసి దుఃఖముగలపదార్థము దనకంటె భిన్నమగుదానిచేత భాసించును. అను ననుమానప్రమాణమువలన భాస్యమగు యంతఃకరణాదులకు భాసకత్వము సంభవింపకపోవుటవలనను, నొక్క వస్తువు కర్తయు, కర్మయు కానందునను భాస్యత్వభాసకత్వము లొకదానికి సంభవింపకపోవుటచేతను, భాస్యమగు నంతఃకరణాదులు భాసకములు కానేరవు. ఇఁక నాత్మ యన్ననో "అహం దుఃఖీ" అనెడి వృత్తిసహితాహంకారభాసక మగుటచే భాస్యకోటియం దెన్నడును ప్రవేశింపనందున నెల్లప్పుడు భాసకమే గాని భాస్యము కానేరదు.

"నహి ద్రష్టు ర్దృష్టే ర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాత్, ఆకాశవ త్సర్వగత శ్చ నిత్యః, మహద్భూత మనన్త మపారం విజ్ఞానఘన ఏవ, తదేత ద్బ్రహ్మాపూర్వ మనపర మనన్తర మబాహ్య మయ మాత్మా బ్రహ్మ సర్వానుభూః" ఇత్యాదిశ్రుతులు, విభుత్వనిత్యత్వ స్వప్రకాశత్వజ్ఞానరూపత్వము నాత్మకుఁ జెప్పుచున్నవి. ఈ చెప్పుటవలన నవిద్యాస్వరూపమగు నుపాధికంటె భేదమాత్మకు సిద్ధించుచున్నది. అందుచే నసత్యోపాధినిబంధనమగు బంధభ్రమ, సత్యమగు నాత్మయొక్క జ్ఞానమువలన నివృత్తమై మోక్షము సిద్ధించును. ఈశ్లోకమున 'పురుషర్షభ' అని యర్జునుని సంబోధించుటచే స్వప్రకాశచైతన్యరూప మగుటచే బురుషు డగుటంజేసి పరమానందస్వరూప మగుటచే నాత్మకు ఋషభత్వము (సర్వద్వైతాపేక్షయా ఆత్మనః ఉత్కృష్టత్వము)ను గుర్తింపక దుఃఖించుచుంటివి. కాన స్వరూపజ్ఞానమువలన నీకు శోకనివృత్తి సుకరము. అని సూచిత మయ్యెను.

ఈశ్లోకమున 'పురుషం' అని ఏకవచనముచే పురుషబహుత్వము నంగీకరించు సాంఖ్యపక్షము నిరాకృతము.

శంకరానందీయము:— వివేక, వైరాగ్య, శమ, దమ, సంన్యాససహితంబగు తితిక్షయే (శీతోష్ణాది ద్వంద్వసహనమే) శ్రవణాదులకు సాధనమై శ్రవణాదులవలన జనించెడిజ్ఞానద్వారమున మోక్షఫలము నిచ్చునని 'యంహినవ్యథయన్త్యేతే' అను శ్లోకముచే జెప్పుచుండెను. సర్వదుఃఖసహనపూర్వకముగ నిరంతరము బ్రహ్మ

నిష్ఠుడై యెవఁడు మోక్షమును సంపాదించునో వాఁడు బురుషోత్తముడని సూచించుట కిట “హే పురుషర్షభ” అను సంబోధన ముపయోగింపఁబడెను.

“విషయేభ్యో ధియం రాతి నిగృహ్ణాతీతి ధీరః” శబ్దస్పర్శరూపరసగంధము లనెడి విషయముల నుండి బుద్ధిని నిగ్రహించువాడు ధీరుఁడనఁబడును. సర్వదా ఆత్మనిష్ఠుఁడు అట్టివాడు కనుకనే సమానముగ సుఖదుఃఖములు ప్రాప్తించినను యవికారియగు నాత్మస్వరూపమున నుండువాడు. లేక ‘సమే సమభావం బ్రహ్మభావం గమితే సుఖదుఃఖే యస్య తం” సుఖదుఃఖములను బ్రహ్మస్వరూపముగ నెరింగినవాడు. అట్టి బ్రహ్మవేత్తయగు యేపురుషుని శీతోష్ణాదులు జ్ఞాననిష్ఠనుండి చలింపఁజేయజాలవో, అట్టి పురుషుఁడు ఏ బ్రహ్మము యొక్క అజ్ఞానమువలన మరణములను జన్మలను పొందుచుండెనో యమృతరూపమగు నాబ్రహ్మముయొక్క భావ (స్వరూపము) కొఱకు సమర్థుఁడగుచున్నాడు.

శాంతో, దాంత, ఉపరత, స్తితిక్షు, స్సమాహితో భూత్వాఽఽత్మన్యేవాత్మానం పశ్యతి, అభయం హివై బ్రహ్మ భవతి” అంతరింద్రియ నిగ్రహము, బహిరింద్రియ నిగ్రహము, సంన్యాసము, శీతోష్ణాదిద్వంద్వ సహనము, చిత్తసమాధానము గలవాడాత్మయందే యాత్మను దెలిసికొనును. అట్టితీరున దెలిసికొని భయరహితమగు బ్రహ్మభావమును బొందును. అనగా మోక్షమును బొందునను శ్రుతిప్రసిద్ధిని సూచించుటకు “యంహి న వ్యథయన్త్యేతే” అనుచోట “హి” అనుశబ్ద ముపయోగింపఁబడెను.

నీలకంఠీయము— శీతోష్ణాదిద్వంద్వసహనరూపమగు తితీక్షవలన గలుగు ఫలము ప్రత్యక్షసిద్ధమే యని యీశ్లోకమున జెప్పుచున్నాడు. “యం” ఏ, అష్టాసు పూర్షు వసతీతి పురుషః తం పురుషం” అనగా “శ్లో॥ కర్మేంద్రియాణి ఖలు పంచ తథా పరాణి జ్ఞానేంద్రియాణి మన ఆది చతుష్టయం చ । ప్రాణాదిపంచక మథో వియదాదికం చ కామశ్చ కర్మ చ తమః పున రష్టమీ పూః” పంచకర్మేంద్రియములు (వాక్పాణిపాదపాయూపస్థలు) పంచ జ్ఞానేంద్రియములు (త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు), మనశ్చతుష్టయము (మనోబుద్ధిచిత్తాహంకారములు), ప్రాణాదిపంచకము (ప్రాణాపానవ్యానోదానసమానములు), వియదాదిపంచకము (పృథివ్యప్తేజోవాయ్వాకాశములు), కామము, కర్మ, మూలాజ్ఞానము అను నీయెనిమిది పురము లనఁబడును. వీటియం దుండు ఆత్మ పురుషుఁ డనంబడును. లేక, స్థూలదేహసూక్ష్మదేహములయందు పైన జెప్పిన వన్నియు నంతర్భావమును బొందును గాన నట్టి స్థూలసూక్ష్మదేహములకు గారణోపాధి యగు మూలావిద్య పుర మనఁబడును. దానియం దుండు ఆత్మ పురుషుఁ డనంబడును. ఇట్లనుటచే (కారణోపాధి యగు మూలావిద్యకంటె నాత్మ వేరని జూపఁబడెను.) అట్టి పురుషుడు స్థూలసూక్ష్మ కారణోపాధులయం దభిమానమును విడిచినచో వాఁడు స్థూలసూక్ష్మ కారణోపాధులను విడిచినవాఁ డగును. సమాధినిష్ఠుఁ డగునట్టి పురుషునికి శీతోష్ణములు సుఖమునుగాని, దుఃఖమునుగాని కలుగజేయుటకు సమర్థములు గావు. కాన “సమదుఃఖసుఖం” సమములగు సుఖదుఃఖములు కలవాఁ డగును. అట్టి “ధీరం” ధ్యానయోగనిష్ఠుని ‘ఏతే’ పూర్వోక్తవ్యాఖ్యానరీతిని త్రివిధము లగు మాత్రాస్పర్శములు జాగ్రదవస్థయందుగాని, స్వప్నావస్థయందు కాని, యసంప్రజ్ఞాతసమాధ్యవస్థయందు కాని ‘నవ్యథయంతి’ స్వాస్థ్యమునుండి ప్రచ్యుతుని జేయవు. ‘సోమృతత్వాయ కల్పతే’ అట్టి సమదుఃఖసుఖియు, ధ్యాననిష్ఠావంతుడు నగు పురుషుడే మోక్షమున కర్హుఁడగుచున్నాడు. కాన నీవుగూఁడ నట్టి తితీక్ష నాశ్రయింప దగుదు వని యాశయము. ‘పురుషర్షభ! అను సంబోధనముచే సర్వపురుషశ్రేష్ఠుఁడ వగుటచే నీవుగూడ నట్టి తితీక్షాఫలము ననుభవించుటకుఁ దగుదువని సూచితమైనది. ॥౧౫॥

నాఽసతో విద్యతే భావో నాఽభావో విద్యతే సతః ।
ఉభయో రపి దృష్టోఽంత స్త్వనయో స్తత్త్వదర్శిభిః ॥ ॥౧౬॥

పదవిభాగము:— న- అసతః- విద్యతే- భావః- న- అభావః- విద్యతే- సతః- ఉభయోః- అపి- దృష్టః- అంతః- తు-అనయోః- తత్త్వదర్శిభిః । ॥౧౬॥

ప్రతిపదార్థము:— అసతః=మిథ్యాభూతమగు మూలావిద్యావిశిష్టశీతోష్ణాదిరూపజగమునకు; భావః=సత్త్వము; నవిద్యతే=లేదు; సతః=సద్రూపమగు నాత్మకు; అభావః=అసత్త్వము;నవిద్యతే=లేదు; తత్త్వదర్శిభిః=('తత్' అనుపదము సర్వనామము. సర్వము. బ్రహ్మము. కాన "తత్" అనుపదమునకు బ్రహ్మ యర్థము) బ్రహ్మయాథార్థ్యమును దెలిసినజ్ఞానులచేతను; అనయోః=ఈ; ఉభయో రపి=ఆత్మానాత్మలయొక్క సదసత్తుల యొక్క); అంతః=నిశ్చయము (సత్తు సత్తే, అసత్తు అసత్తే అనునిశ్చయము); దృష్టః= చూడఁబడెను.

శాంకరభాష్యమ్:—

(1) ఇతశ్చ శోకమోహౌ పకృత్వా శీతోష్ణాదిసహనం యుక్తం యస్మాత్—నాసతఇతి । నాసతోఽవిద్యమానస్య శీతోష్ణాదే స్సకారణస్య న విద్యతే నాస్తి భావో భవన మస్తితా । నహి శీతోష్ణాది సకారణం ప్రమాణై ర్నిరూప్యమాణం వస్తు సంభవతి । వికారో హి సః। వికారశ్చ వ్యభిచరతి, యథా ఘటాదిసంస్థానం చక్షుషా నిరూప్యమాణం మృద్వ్యతిరేకేణానుపలబ్ధే రస త్తథా సర్వో వికారః కారణవ్యతిరేకే ణానుపలబ్ధే రసన్ । జన్మప్రధ్వంసాభ్యాం ప్రాగూర్ధ్వం చానుపలబ్ధేః । మృదాదికారణస్య చ తత్కారణవ్యతిరేకే ణానుపలబ్ధే రసత్త్వమ్।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(1) అధికారివిశేషమగుతితిక్ష (శీతోష్ణాదిద్వంద్వసహనము) యీ చెప్పబోవు కారణము వలన నవశ్యకర్తవ్యము. ఎట్లనిన? మిథ్యాభూతమగు నవిద్యమొదలు, శీతోష్ణములవఱకు నగు ప్రపంచమంతయు నసద్రూపము. (లేనిది) అనగా వస్తువు కానేరదు. నిర్వికారమగుటంజేసి యొకయాత్మమాత్ర మేకరూపము, నిత్యవస్తువు, సద్రూపముగాన నసద్రూపములగు శీతోష్ణాదులవలన బ్రాప్తించు సుఖదుఃఖములచే హర్షవిషాదాదులను బొందుట యుచితముకాదు. అందువలన శీతోష్ణాదిద్వంద్వసహన మావశ్యకము.

ఈశ్లోకమున "నాసతో విద్యతే భావః" అసత్తునకు సత్త్వములేదని చెప్పుట యసమంజసము. అసత్తునకు సత్త్వము ప్రసక్తమే కానప్పుడు తన్నిషేధ మప్రసక్త ప్రతిషేధ మగును.

—• ౨వ అధ్యాయము ౧౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "ఆత్మ కేకత్వము నంగీకరించుగాక. అయినను సత్యమగు నాత్మకు జడమగు బ్రపంచద్రష్ట్రృత్వ మనెడి సంసారము సత్యము. అట్లయిన శీతోష్ణసుఖదుఃఖకారణము సంభవించునప్పటి శీతోష్ణసుఖదుఃఖానుభవ మవశ్యము సంభవించును. కాన సత్య జడప్రపంచద్రష్ట్రృత్వమునకు జ్ఞానము వలన నివృత్తి సంభవింపనేరనందున నెటుల తితిక్ష (శీతోష్ణాదిద్వంద్వసహనము)స ంభవించును? సంభవింపనేరదు. తితిక్ష సంభవింపనిదే మోక్ష మెటుల ప్రాప్తించును? మోక్షము ప్రాప్తింపనేర" దని శంకింపవలదు.

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అట్టి నిషేధము చెప్పుట శాస్త్రీయము కాదని శంకింపరాదు. కారణవిశిష్టశీతోష్ణాదులు రజ్జుసర్పమువలె నప్రామాణికము లగుటంజేసి యథార్థములు కావు. విషయములగు శీతోష్ణాదులను కారణముతోఁగూడ నేవిధముగను నిరూపించుటకు వీలు కానందున శీతోష్ణాది రూపధర్మిని గ్రహించు ప్రత్యక్షాదులకు యాథార్థ్యమును స్థాపించు ప్రామాణ్యమును కల్పించుటకు వీలు లేదు. విషయము లగు శీతోష్ణాదులు నిరూపించుటకు శక్యము కానందుననే నావిషయ మగు ద్వైత మనిర్వాచ్య మని యర్థము.

ప్రత్యక్షసిద్ధమగు శీతోష్ణాదిద్వైతము నిరూపించుటకు శక్యము కానందున ననిర్వాచ్య మెట్లగు నని శంకింపరాదు. "వాచారంభణం వికారో నామధేయం మృత్తికే త్యేవ సత్యమ్" అను శ్రుతివలన వికారమంతయు మిథ్యాభూతమే యగును. మఱియు వికారమగు రజ్జుసర్పమాగమాపాయి యగుటవలన మిథ్యాభూతమైనట్లు శీతోష్ణాదులగు వికారము లాగమాపాయు లగుటంబట్టి మిథ్యాభూతములు.

మఱియుఁ గార్యము కారణముకన్న భిన్నమా! అభిన్నమా? భిన్నమగుచో ఘటాదులు చక్షురిన్ద్రియముచే లోపల వెలుపల బాగుగ బరిశీలించినచో మృత్తుకన్న వేరుగ గాన్పింపవు. కానకార్యములైన ఘటాదులు కారణమగు మృత్తుకన్న వేరుకావు. అదేవిధమున గార్యములగుటంబట్టి శీతోష్ణాదులు నిజముగా గారణముకన్న వేరుకావు.

మఱియు "ఆదా వంతేచ య న్నాస్తి వర్తమానేపి త త్తథా" అను వచనానుసారముత్పత్తికి బూర్వమునందు నాశమునకు బరమందు లేమింజేసి వర్తమానకాలమునందు గూడ నవి లేనివే (అసత్తులే).

కార్యము కారణస్వరూపమే యైనచో కారణముకన్న కార్యమనునది వేరుగ లేకుండుటంజేసి కార్య మసత్తే యగును.

మఱియు భేదాభేదరూప మగు తాదాత్మ్యముచే గారణమందు గార్య ముండునేని నదియు గార్యకారణవిభాగముతో శూన్య మగు వస్తువునందుఁ గార్యకారణపరంపర భ్రమరూప మగుటఁజేసి కారణముకన్న వేఱు కానేరదు. కాన మృదాది కార్యములుగూడ తత్కారణములకన్న వేఱుగ కానరానందున నవియు సదూప్రములే. కాన ననదూప్రములగు శీతోష్ణాది ద్వంద్వసహనము కర్తవ్యము.

---

శుక్తియందు కల్పితమగు రజతమునకు, శుక్తిజ్ఞానముచే నాశము సంభవించునటుల యాత్మయందు కల్పితమగు నిఖిలప్రపంచమున కాత్మజ్ఞానమువలన నివృత్తి సంభవించును. కాన నాత్మయం దజ్ఞానపరికల్పిత కర్తృత్వ భోక్తృత్వాదిక మాత్మయాథాత్మ్యజ్ఞానమువలన నాత్మాజ్ఞానము తొలఁగి నశించును. అందుచే నాత్మజ్ఞాని మోక్షమునకు అర్హ సమర్థుఁడగును.

శాంకరభాష్యమ్:—

(2) తదసత్త్వే చ సర్వాభావప్రసక్తి రితి చేత్, న. సర్వత్ర బుద్ధిద్వయోపలబ్ధే స్సద్బుద్ధి రసద్బుద్ధి రితి। యద్విషయా బుద్ధి ర్న వ్యభిచరతి త త్సత్। యద్విషయా బుద్ధి ర్వ్యభిచరతి తదసదితి సదసద్విభాగే బుద్ధితంత్రే స్థితే సర్వత్ర ద్వే బుద్ధీ ఉపలభ్యేతే సమానాధికరణే।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(2) కార్యకారణములు రెండును నసత్తులే యైనచోఁ గార్యమును గారణమును కాని వస్తువులేమింజేసి సర్వాభావప్రసక్తి (శూన్యవాదప్రసక్తి) యగునని శంకింపరాదు. ఏలన? సర్వత్ర సద్బుద్ధి, అసద్బుద్ధి యని రెండు బుద్ధులు గోచరించుచున్నవి. అందు సద్బుద్ధి యనువృత్తబుద్ధి, అసద్బుద్ధి వ్యావృత్తబుద్ధి. అది యెట్లనిన? "ఘటస్సన్" "పటస్సన్" "దండస్సన్" అను బుద్ధులన్నిటియందు సత్తనువృత్తము. కాన సద్బుద్ధి యనువృత్తబుద్ధి. 'పటస్సన్' అను బుద్ధియందు ఘటమువ్యావృత్తము. 'ఘటస్సన్' అను బుద్ధియందుఁ బటము వ్యావృత్తము. 'దండస్సన్' అను బుద్ధియందు ఘటపటములు వ్యావృత్తములు. 'ఘటస్సన్' 'పటస్సన్' అను బుద్ధులయందు దండము వ్యావృత్తము. అవ్యభిచారి యగుటచే వ్యావృత్తము లగు రజ్జుసర్పపరంపరయం దనువృత్తమగు నిదమంశమువలె వ్యావృత్తములయం దనువృత్తమగునది పరమార్థసద్రూపము. వ్యభిచారియగుటచే వ్యావృత్తమగు రజ్జుసర్పపరంపరవలె వ్యావృత్త మగునది మిథ్యాభూతము. కాన ఘటపటాదుల బుద్ధులు వ్యావృత్తబుద్ధులనబడును. కాన ననువృత్తమునందు వ్యావృత్తము కల్పితము. అనువృత్త మకల్పితము. అందుచే సర్వభేదకల్పనాధిష్ఠానము, కార్యకారణములకన్న భిన్నమునగు సత్తు కలదు. అందుచే శూన్యవాదము సంభవింపనేరదు.

---

"ఆత్మానాత్మవిషయక ప్రతీతు (జ్ఞానము)లు సమముగ నగపడుచుండ నాత్మవలె యనాత్మ యెందులకు సత్యముకాదు? సత్యము కాదందువా? అట్లైన యనాత్మవలె నాత్మ యెందులకు మిథ్య కాదు: ఆత్మానాత్మ ప్రతీతులు సమానమైయుండ నాత్మ సత్యమనియు, ననాత్మ యసత్యమని (మిథ్యయని) చెప్పట యసంగతము కాదా? అను నాశంకపై నాత్మానాత్మలకు విశేషములు గలవని చెప్పుటకు శ్రీకృష్ణపరమాత్మ "నాసతో విద్యతే" అని చెప్పుటకు మొదలిడెను.

ఏది కాలమువలనను, దేశమువలనను, వస్తువువలనను పరిచ్ఛిన్నమగునో అదియసత్తనబడును. ఎట్లన? ఉత్పత్తివినాశములు గల ఘటాదికము పుట్టుటకు పూర్వకాలమునందు బరకాలమునందు లేనిదగుటచే నట్టి కాలములచే నా ఘటాదికము బరిచ్ఛిన్నమగును. (అనగా నిన్నటిరోజు మొదలుకొని నేటివరకు ఘటముకలదనియు యుత్పత్తికి బూర్వము, నాశమునకు బరమందును లేదని యాశయము) కాన ఘటాదికము కాలపరిచ్ఛిన్న మనబడును. ఆ దేవిధమున నా ఘటాదికమే శ్రియావత్తగుటంజేసి సర్వదేశములయందుండక పోవుటవలన దేశపరిచ్ఛిన్నమగును. (అనగా కొన్ని ప్రదేశములయం దుండక కొన్ని ప్రదేశములయందుండునదని యాశయము) కాలపరిచ్ఛిన్నమగు వస్తువు దేశపరిచ్ఛిన్న మైనను దేశపరిచ్ఛిన్నములగు పరమాణువులకు తార్కికులు కాలపరిచ్ఛిన్నత్వము నంగీకరింపక పోవుటవలన కాలపరిచ్ఛిన్నత్వము, స్థానికంబె వేఱుగ దేశపరిచ్ఛిన్నత్వ మిచట జెప్పబడెను. దేశపరిచ్ఛేదమనగ నొకానొక దేశమునందు దత్యంతా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సమస్తద్వైతప్రపంచమునకు మిథ్యాత్వమును వాదించు నద్వైతుల మతమునందు సద్రూపబ్రహ్మముకన్న వేఱొండు వస్తువే లేనందున దృష్టాంతము లేమింజేసి పూర్వోక్తానుమానద్వయము సంభవింపనేరదని శంకింపరాదు. "సత్, అసత్" అను విభాగము సదసద్బుద్ధ్యధీనము. కాన (ప్రాతిభాసికవిభాగము) ననుసరించిన ప్రాతిభాసికమగు రజ్జుసర్ప, శుక్తిరజతాదులు దృష్టాంతములుగ సంభవించుటచే నిరుక్తానుమానద్వయము నిష్కళంకము.

సత్తు, అసత్తుల విభాగము బుద్ధ్యధీనము. అట్టి బుద్ధివిభాగము జగన్మిథ్యాత్వవాది యగు నద్వైతికి సంభవించుట దుర్ఘటముకాదా? యనిన కల్పితమగు సదసద్బుద్ధివిభాగము తద్విషయసదసద్విభాగప్రతిభాసమునకు వ్యవహారభూమియందు హేతువగును. కాన వ్యావహారికసదసద్బుద్ధివిభాగము సంభవించును. దాని ననుసరించి ప్రాతిభాసికదృష్టాంతమువలన నిరుక్తానుమానము సమంజసము.

---

భావము. ఘటాదికముయొక్క యత్యంతాభావము. ఘటము లేనిచోట యుండును.) కాన దానిచే ఘటాదికము దేశపరిచ్ఛిన్నమగును. ఇదేతీరున ఘటాదికము వస్తువులచేతను పరిచ్ఛిన్నమగును. ఎట్లనిన? సజాతీయ భేదమనియు, విజాతీయభేదమనియు, స్వగతభేదమనియు వస్తుపరిచ్ఛేదము మూడువిధములు. అందు వృక్షమునకు, మఱియొక వృక్షమునకు గల భేదము సజాతీయభేదమనఁబడును. వృక్షములకు, శిలాదులకు గల భేదము విజాతీయభేద మనఁబడును. వృక్షాదులకు, తన సంబంధమగు పత్రపుష్పాదులతో గల భేదము స్వగతభేదమనఁబడును. లేక, జీవేశ్వరభేదము, జీవజగద్భేదము, జీవులకుగల పరస్పరభేదము, ఈశ్వరజగద్భేదము జగత్తునకు పరమాత్మకు గల భేదమనియు, వస్తుపరిచ్ఛేదము నైదువిధములు. కాలదేశములచే నపరిచ్ఛిన్నమగు నాకాశాదులకు వస్తుపరిచ్ఛేదమును తార్కికులు అంగీకరించుటచే కాలదేశపరిచ్ఛేదములకంటె వేఱుగ వస్తుపరిచ్ఛేదము చెప్పఁబడెను. కాన నిట్టి త్రివిధపరిచ్ఛేదములు గల (దేశకాలవస్తువులవలనఁబరిచ్ఛిన్నమగు) యసద్రూపమగు శీతోష్ణాది నిఖిలప్రపంచమునకు భావము (విరుద్ధమగుటంజేసి ఘటత్వ, అఘటత్వములకు నొకదానియందునికి సంభవింపనటుల) త్రివిధపరిచ్ఛేదములు గల శీతోష్ణాదినిఖిలప్రపంచమునందు త్రివిధపరిచ్ఛేదరాహిత్యము సంభవింపనేరదు. దృశ్యపదార్థమంతటను యనుగతము కాకపోవుటచే నిప్పుడు ఘటములేదనియు, నీదేశమునందు ఘటము లేదనియు, నీవస్తువునందు ఘటము లేదనియు దృశ్యపదార్థము నిషేధింపబడును. సత్పదార్థమన్ననో, యంతట ననుగతమగుటవలన నొకదేశమునందుగాని, కాలమునందుగాని, వస్తువునందుగాని నిషేధింపఁబడుటలేదు. కాన నంతటను యనుగతమగు సద్వస్తువునం దననుగతమగు (వ్యభిచారియగు) దృశ్యవస్తువు అనుగతమగు రజ్జుఖండమునందు వ్యభిచారియగు సర్పధారవలె కల్పితమని యాశయము.

అననుగతమగు (వ్యభిచారియగు) వస్తువునకు కల్పితత్వము నంగీకరించినచో దుచ్ఛమగు శశశృంగాదులయం దనువృత్తము గాకపోవుటచే సద్వస్తువగు నాత్మగూడ కల్పితము కావలెనివచ్చునను యాశంకను దొలగించుటకు "నాఽభావో విద్యతే సతః" అని చెప్పెను.

సత్తుయందుండు భేదమునకు ప్రతియోగియగుట వస్తుగతపరిచ్ఛిన్నత్వము, అనగా ఘటమునందు పటభేదము గలదు. అట్టి పటభేదమునకుబటము ప్రతియోగిగాన పటము పరిచ్ఛిన్నమనఁబడును. ఇట్లే దృశ్యప్రపంచరూపము అగు నన్నియు దమతమభేదములకు ప్రతియోగులుగాన పరిచ్ఛిన్నము అనఁబడును. ఇక శశవిషాణాదు లన్ననో యప్రసిద్ధములగుటంజేసి శశవిషాణాదులభేదము నెచ్చటను జెప్పుటకు వీలులేదు. కాన భేదప్రతియోగిత్వరూపవస్తు

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సద్బుద్ధి, అసద్బుద్ధి యను బుద్ధిద్వయము ననుసరించి సత్తు, అసత్తు అను సదసద్విభాగ మున్నచో సత్తు సామాన్యరూపమగుటంజేసి విశేషాకాంక్ష కలుగును. అట్టి విశేషాకాంక్షానివర్తక మగు విశేషవస్తువు నంగీకరింపవలయును. అట్లైన సామాన్యవిశేషరూపములగు రెండు వస్తువులు సిద్ధించుచున్నవి. అట్లంగీకరింపక కార్యకారణభిన్న మగు సత్తారూపవస్తువుకన్న భిన్న మగు విశేషవస్తువు నంగీకరించినఁ గార్యకారణరూప మగునట్టి యవిద్యతోఁ గూడిన శీతోష్ణాది దృశ్యప్రపంచ మెట్లసద్రూప మని శంకింపరాదు.

సర్వత్ర వ్యవహారావస్థయందు "సన్ఘటః, సన్పటః" అను సమానాధికరణములగు సద్బుద్ధి ఘటాదిబుద్ధులు ప్రత్యక్షసిద్ధములు. సామానాధికరణ్యమనఁగ నేకార్థప్రతిపాదకత్వము. అది యెట్లనిన? "ద్రవ్యం ఘటః" అను పదములు యేకార్థప్రతిపాదకము లగుటం జేసి ద్రవ్య

చ్ఛిన్నత్వము శశవిషాణాదులకు సంభవింపనేరదు. కాన శశవిషాణాదులయందు వ్యావహారిక సత్యత్వము గూడ లేనందున శశవిషాణమునం దాత్మభేదము జెప్పుటకు వీలుపడదు. అందువలన నాత్మకు బరిచ్ఛిన్నత్వకల్పితత్వములు బ్రాప్తింపనేరవు. ఈజెప్పుటచే సర్వవసిష్టమైన యాశయ మేమనిన ఏకము, స్వప్రకాశము, నిత్యము, సర్వవ్యాపకము నగు సత్పదార్థము సర్వానుభూతమగుటచే నట్టి సత్పదార్థభేదము సంభవింపనేరదు. ఘటమునందు సద్భేదము సంభవించు నవెడవా "సన్ఘటః" అను సర్వానుభూత ప్రతీతివలన సత్పదార్థఘటములకు సామానాధికరణ్య (అభేద) మనుభూతమగుచుండ నదియు సంభవము గాదు. అభావమనఁగ బరిచ్ఛిన్నత్వము. అది దేశమువలన, కాలమువలన, వస్తువులన మూడువిధములు. సత్పదార్థము సర్వవ్యాపక మగుటంజేసి దానికి దేశతః బరిచ్ఛిన్నత్వము బ్రాప్తింపనేరదు. నిత్యమగుటచే కాలతః పరిచ్ఛిన్నత్వము బ్రాప్తింపదు. సద్వ్యతిరిక్తమగు వస్తువు లేమిఁజేసి వస్తువువలన పరిచ్ఛిన్నత్వము ప్రాప్తింపదని "నాభావో విద్యతే సతః" అనువాక్యమున కర్థము.

దేశకాలవస్తుపరిచ్ఛేదము దేనికి లేదని చెప్పుచుంటివో, యట్టి సత్పదార్థమను వస్తువే లేదు. ఏమన? సత్త్వ మనునది తర్కశాస్త్రప్రసిద్ధమగు పరసామాన్యము. అట్టి సత్త కాశ్రయ మగుటంజేసి ద్రవ్యగుణకర్మలు 'సద్ద్రవ్యం, సన్గుణః, సత్కర్మ', అని సద్రూపములుగ వ్యవహరింపఁబడుచున్నవి. అట్టి సత్తుతో ద్రవ్యగుణకర్మ లనెడి యేకాధికరణమునందుండుటచే సామాన్య, విశేష, సమవాయములు సత్తావత్తులుగ వ్యవహరింపబడుచున్నవి. గాన నుత్పత్తికి పూర్వమునం దసత్తగు (ప్రాగభావప్రతియోగియగు) ఘటాదికమునకు మృదాది కారణవ్యాపారమువలన సత్త్వమును, అట్టి సత్తావిశిష్టమగు ఘటమునకు కారణనాశముచేనభావము సంభవించుచుండ "నాఽసతో విద్యతే భావో నాఽభావో విద్యతే సతః" అసత్తునకు సత్త్వము లేదనియు, సత్తున కభావము లేదనియు జెప్పుట యెట్లు సమంజసమగును? అను నాశంకకు సమాధానముగ "ఉభయో రపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః" అని జెప్పుచున్నాడు. 'ఉభయో రపి' సదసత్తులయొక్క 'అన్తః' మర్యాద (యేది సత్తో యది యెల్లప్పుడు సత్తే యనియు, ఏది యసత్తో యది యెల్లపు డసత్తే యనియు వస్తుయాథాత్మ్యము)ను దెలిసికొను స్వభావముగల బ్రహ్మవేత్తలు శ్రుతిస్మృతియుక్తులచే విచారపూర్వకముగ నిశ్చయించిరి. కానను తార్కికుల నిశ్చయము (ఉత్పత్తికి బూర్వమునందు ఘట మసద్రూపమై కారణవ్యాపారమున సద్రూపమగుచున్నదనియు, ఆఘట మే నాశానంతరమున నసద్రూపమగుచున్న దనునట్టి నిశ్చయము) భ్రమయే యగుచున్నందున నట్టి విపరీతనిశ్చయ మసత్తునకు సద్రూపత్వమును, సద్వస్తువున కసద్రూపత్వమును సాధింపనేరదని యాశయము. ఈవిషయమునే "సదేవ సోమ్యేద మగ్ర

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఘటపదములు సమానాధికరణము లనఁబడును. అట్టి పదనిష్ఠసామానాధికరణ్య మౌపచారికముగఁ బ్రస్తుతము సద్బుద్ధి, ఘటాదిబుద్ధులయందుఁ జెప్పఁబడుచున్నది. అనఁగా నేమి? సదసద్బుద్ధులయందుఁ గల సామానాధికరణ్య మేకార్థవిషయత్వము. అట్టి వస్తువు శ్రుత్యనుమానాదులవలనఁ బ్రసాధితమగు సద్రూపమే. కాన నట్టి సద్రూపాతిరిక్తవస్తువు మిథ్యయే (యసద్రూపమే) యగును. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ "నాసతో విద్యతే భావః" అని నుడివియుండెను. అట్లు కాక "సన్ఘటః" "సన్పటః" అను బుద్ధివిషయములు భిన్నములే యైనచో ఘటపటములకువలె సామానాధికరణ్యము కుదరనేరదు.

---

అసీ దేక మేవాద్వితీయం" అని మొదలిడి "ఐతదాత్మ్య మిదగ్ం సర్వం । తత్సత్యం స ఆత్మా । తత్త్వమసి శ్వేతకేతో" అను శ్రుతి ఒక్కటగునట్టియు, సజాతీయవిజాతీయ స్వగతభేదశూన్యమైనట్టి సద్రూపము నే సత్యముగ జెప్పుచున్నది. 'వాచారమ్భణం వికారో నామధేయం' అను ఛాందోగ్యశ్రుతి వ్యభిచారియగు వికారమాత్రము వాఙ్మాత్రముచే జెప్పబడుటచే నసత్యమనియు జెప్పుచున్నది. 'అన్నేన సోమ్య! శుంగే నాపో మూల మన్విచ్ఛ, అద్భిస్సోమ్య శుంగేన తేజోమూల మన్విచ్ఛ, తేజసా సోమ్య శుంగేన సన్మూల మన్విచ్ఛ. సన్మూలా స్సోమ్యేమా స్సర్వాః ప్రజా స్సదాయతనా స్సత్ప్రతిష్ఠాః' అను శ్రుతి సర్వవికారములు సత్తుయందు కల్పితములని బోధించుచున్నది.

సత్యమన తార్కికపరికల్పితంబగు బరసామాన్యము కానేరదు. ఎందువలననగ? ఏకాకారమగు 'సద్ద్రవ్యం, సద్గుణః, సత్కర్మ, సత్సామాన్యం' అను ప్రతీతులచే ద్రవ్యగుణకర్మసామాన్యములయందు సామాన్యమనునది సమానముగ భాసించుచుండ ద్రవ్యగుణకర్మలయందు పరసామాన్యము సమవాయ సంబంధముచే భాసించుననియు, సామాన్యాదులయం దేకాధికరణవృత్తిత్వ సంబంధముచే భాసించుననియు జెప్పుట యసంగతము. మఱియు "సద్ద్రవ్యం" అనుచోట "సత్" అనునది ప్రథమావిభక్త్యంతము. "ద్రవ్యం" అనునదియు ప్రథమావిభక్త్యంతము. సమానవిభక్త్యంతప్రతిపాదితములగు నర్థముల కభేదము భాసించును. కాని సమవాయము భాసింపనందున నొకచోట సమవాయసంబంధముచేతను, మఱొకచోట ఏకాధికరణ వృత్తిత్వసంబంధముచేతను పర సామాన్యము సిద్ధింపనేరదు.

మఱియు "ద్రవ్యం సత్, గుణస్సన్" ఇత్యాదిప్రతీతులచే సర్వాభేదము సత్తకు సిద్ధించును. ద్రవ్యగుణకర్మ అను భేదమే లేనందున నట్టిధర్మలగు ద్రవ్యగుణకర్మలయందు సత్త్వము కల్పించుటకు వీలుపడనందున సద్రూపమునందే ద్రవ్యగుణాదులు కల్పితములు. కాన ద్రవ్యగుణాదుల కాశ్రయము సద్రూప మగుచుండ ద్రవ్యగుణాదులయందు పరసామాన్య ముండునని జెప్పుట యసంగతము. ఈవిషయమునే "సత్తాతోపి న భేద స్స్యా ద్ద్రవ్యత్వాదేః కుతోఽన్యతః । ఏకాకారా హి సంవిత్తి స్సద్ద్రవ్యం సద్గుణ స్తథా" అని వార్తికకారులు జెప్పియుండిరి. అసత్పదార్థ మప్రసిద్ధ మగుటంజేసి సత్తయు నసత్పదార్థముకంటె భిన్నము కాదు. ద్రవ్యత్వాదికము సద్ధర్మ మగుటంజేసి సత్తుకంటె భిన్నము కాదు. కనుకనే ఘటపటతద్భేదములు సదభేదముచే నేకములు కాన "ఘటాద్భిన్నః పటః" అను ప్రతీతి ఘటపటముల భేదసాధకము కానేరదు. తార్కికులు కాల మను పదార్థము సర్వాత్మక మని యొప్పుకొనిరి. అట్టి కాలముచేతనే సర్వవ్యవహారము లుపపన్న మగుచుండ తద్వ్యతిరిక్తపదార్థకల్పనయందు ప్రమాణము లేమింజేసి సర్వానుస్యూతం బగు నాకాలమునకే సద్రూపముచేతను, స్ఫురణముచేతను, సర్వతాదాత్మ్యముచేతను బ్రతీతి కలుగుచుండ పరసామాన్య మనెడి సత్త నంగీకరించుట నిర్యుక్తికము. స్ఫురణయు సర్వానుస్యూత మగుటచే నేకము. అట్లగుటచే నాత్మ నిత్య మని ముందుశ్లోకమునందు సవిస్తరముగ జెప్పఁబడును.

శాంకరంభాష్యమ్:—

(౪) న నీలోత్పలవత్ సన్ ఘటః సన్పటః సన్ హస్తీతి । ఏవం సర్వత్ర తయోస్బుద్ధ్యో ర్ఘటాదిబుద్ధిర్వ్యభిచరతి । తథాచ దర్శితం, నతు సద్బుద్ధిః తస్మా ద్ఘటాదిబుద్ధివిషయోఽస న్వ్యభిచారాత్ । న తు సద్బుద్ధివిషయోఽవ్యభిచారాత్। ఘటే వినష్టే ఘటబుద్ధౌవ్యభిచరన్త్యాం సద్బుద్ధి రపి వ్యభిచరతీతిచేత్, న పటాదా వపి సద్బుద్ధిదర్శనాత్ । విశేషణవిషయైవ సా సద్బుద్ధిః. సద్బుద్ధివ ద్ఘటబుద్ధిరపి ఘటాన్తరే దృశ్యత ఇతిచే న్న, పటాదా వదర్శనాత్ ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(౪) బుద్ధులయందుఁగల సామానాధికరణ్యము రెండువిధములు. ఒకటి ఏకార్థవిషయకత్వము, రెండు ధర్మధర్మివిషయకత్వము. "నీలం ఉత్పలం" (నల్లనిది కలువ) అనుచోట నలుపు ధర్మము, కలువ ధర్మి, ఈరెండును ధర్మధర్ములనఁబడును. ఈరెండుజ్ఞానములు "నీలం ఉత్పలం" (నల్లనిది కలువ) అనుజ్ఞానములు. ఈజ్ఞానములకు సామానాధికరణ్యము ధర్మధర్మివిషయకత్వము. అదే విధమున "సన్ఘటః" అనుబుద్ధులయందుఁగల సామానాధికరణ్యము. సత్తు ధర్మము, ఘటము ధర్మిగాన ధర్మధర్మివిషయకత్వరూపసామానాధికరణ్యమే యచట సంభవించును. అందుచే ధర్మమగు సత్తుకన్న వ్యతిరిక్తముగ ఘటాదివస్తువు ప్రాప్తించుచుండ ఘటాదు లెట్లువస్తువు లగును. (అసత్తులగును) అని శంకింపరాదు.

ఏవిధముగ నొకానొక దేశమందు గాని, యొకానొక కాలమునందు గాని యుండు ఘటమునందుండు ఘటత్వము దేశాంతరమునందు గాని, కాలాంతరమునందు గాని పటమునం దుండనేరదో అవిధముగనే పదార్థస్వభావమును భంగపరచుటకు వీలు లేనందున నొకానొక దేశమునందు గాని, యొకానొక కాలమునందు గాని ఘటమునకు ఘటత్వమును సంపాదించుట కిందు్రనకుగూడ శక్యము కాదు. ఇదేవిధమున నొకానొక దేశమునందు గాని, కాలమునందు గానియు సత్తగుదానికి దేశాంతరమునందు కాని, కాలాంతరమునందు కాని సత్త్వమును, ఒకానొక దేశమునందు కాని, కాలమునందు కాని సత్తగు పదార్థమునకు దేశకాలాంతరములయం దసత్త్వమును, సంపాదించుటకు శక్యము కాదు. కాన సదసత్తులకు నియతరూపత్వము (సత్తు సత్తే, అసత్తు యసత్తే యగునని యాశయము.) ఇంకను యీవిషయ మద్వైతసిద్ధియందు విస్తరముగ జెప్పఁబడెను.

కాన సద్వస్తువే—మాయాకల్పిత మగు నసత్పదార్థముయొక్క నివృత్తిచే నమృతత్వముకొఱకు సమర్థమగుచున్నది. కనుక సన్మాత్రదృష్టిచే దితిక్షయు యుపపన్న మగునని యాశయము.

శంకరానందీయము:— "అంతటను యుండు శబ్దస్పర్శరూపరసగంధముల యనుసంధానము నత్యంతము విడిచి యెల్లప్పుడు బ్రహ్మానుసంధానముఁ జేయుట శక్యము కాదు" అను శంకను పరిహరించుటకు— బ్రహ్మాతిరిక్తవస్తువు లేనందుననే బ్రహ్మము పూర్ణ మగుటవలనను, నిత్య మగుటవలనను, నిరంతరమగుటవలన నెల్లప్పుడు నాబ్రహ్మమే యనుసంధానము జేయదగిన దని సూచించుటకు బ్రహ్మమునకు సత్త్వమును, తద్వ్యతిరిక్తమగుదాని కసత్త్వమును "నాసతో విద్యతే భావః" అను శ్లోకముచే నుపపాదించుచుండెను.

ఏవస్తువు (సత్) అస్తితామాత్రస్వరూపమై, సర్వగతమై, సూక్ష్మమై, ఏకమై, ఏకరసస్వరూపమై, నిత్యమై, నిరతిశయమై, నిరంజనమై, విజ్ఞానమై సర్వవేదాంతములవలన తెలియబడుచుండెనో యట్టి బ్రహ్మముకంటె విలక్షణ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

భేదము, అభేదము విరుద్ధములుగాన "సన్ఘటః" అను స్థలమున సామాన్యరూపమగు సత్తకు విశేషరూప మగు ఘటమునకు భేదము, అభేదము ప్రాప్తింపనేరదు. కాన ఘటధర్మము సత్త కానేరదు. కనుక "నీలముత్పలం" (నల్లనిది కలువ) అనుచోట ధర్మధర్మివిషయకమగుటచే నది గౌణమగు సామానాధికరణ్యము. "సన్ఘటః" అనుచోట అనువృత్తమునందు వ్యావృత్తము కల్పితమగుటంబట్టి జాతివ్యక్తులకు గల సామానాధికరణ్యము ఏకవ్యక్తివిషయకత్వరూపము.

ఈరీతిననే యంతటను గుణగుణిస్థలములయందు చూచుకొనవలయును.

"సన్ఘటః" అను బుద్ధిద్వయమునందుండు సామానాధికరణ్యము ఉపపన్నము కాదని సామాన్యవిశేషరూపము లను రెండువస్తువులు సంభవింపవు. కాన సత్తారూపమగు సామాన్యమే యంగీకరింపవలె నని యెందులకుఁ జెప్పవలయును? సామాన్యవిశేషములలో విశేషములే వస్తువు లని శంకింపరాదు.

"సన్ఘటః" అనుస్థలమునందు సద్బుద్ధి, ఘటబుద్ధి యను రెండుబుద్ధులు గలవు. అందు ఘటబుద్ధి "సన్పటః" అను స్థలమునందు లేకపోవుటచే ఘటబుద్ధి వ్యభిచారి. ఘటబుద్ధి వ్యభిచరించినఁ దద్విషయమగు ఘటముకూడ వ్యభిచారి యగుచున్నది. ఈరీతిగనే పటాదులు కూడ వ్యభిచారులు అనఁగా వ్యావృత్తము లనఁబడును. కాన వ్యావృత్తములగు విశేషము లన్నియు వికారము లగుటంబట్టి యాగమాపాయులు. ఆగమాపాయు లగుటచే మిథ్యాభూతములు, (విశేషములకు వస్తుత్వము లేదనుట.)

"సన్ఘటః", "సన్పటః" "సన్హస్తీ" అను ఘట, పట, హస్తి విషయకబుద్ధులయందు సర్వస్థలములయందు సద్బుద్ధి గోచరించుటచే సద్బుద్ధి యవ్యభిచారి. కాన సద్విషయమగు సత్తయు యవ్యభిచారియే. అట్టి సత్త ఒకటియే యగుటంబట్టి ద్విరూపత్వప్రాప్తి లేమింజేసి సామాన్యవిశేషాత్మకము కానేరదు. కాన సద్బుద్ధివిషయమగు నొక్కసత్తయే వస్తు వనంబడును. ఇందువలన ఘటాదిబుద్ధివిషయములగు ఘటాదివిశేషములు వ్యభిచారు లగుటంబట్టి యసత్తు లనంబడును. సద్బుద్ధివిషయమగు సత్త యవ్యభిచారి యగుటచే సద్రూపము (వస్తువు) యనంబడును.

ఘటము నశించినపుడు ఘటబుద్ధి గ్రహింపఁబడకుండుటంజేసి ఘటబుద్ధి వ్యభిచరించుచున్నది, అదేవిధమున 'సన్ఘటః' అను సద్బుద్ధికూడ వ్యభిచరించుచున్నది. కాన సద్బుద్ధి వ్యభిచరించుటచే 'నవ్యభిచారియగుట' అను హేతువు సద్బుద్ధికి సంభవింపనేరదు. కాన సద్బుద్ధివిషయ

మగునట్టి యసద్బుద్ధిప్రతిపాదక మగు జగత్తునకు సత్త్వము లేదు. ఏలన? స్వరూపముచే సద్రూపమగు వస్తువునందు సత్త యుండును. ఈజగత్తు స్వరూపతః సద్రూపము కానందున నసత్స్వరూప మగు జగత్తునకు సత్త్వముండుటయందు ప్రమాణము లేమింజేసి సత్త్వము సంభవింపనేరదు.

జగత్తునందు సత్త్వ ముండుటయందు ప్రత్యక్షాదులు ప్రమాణము లగునదవా? యావిషయమున నిన్నిట్లు

శాంకరభాష్యమ్:—

(4) సద్బుద్ధి రపి నష్టే ఘటే న దృశ్యత ఇతి చే న్న, విశేష్యాభావాత్ । సద్బుద్ధిః విశేషణవిషయా సతీ విశేష్యాభావే విశేషణానుపపత్తౌ కిం విషయా స్యాత్; న తు పునస్సద్బుద్ధే ర్విషయాభావాత్ । ఏకాధికరణత్వం ఘటాదివిశేష్యాభావే న యుక్తమితి చేన్న । ఇద ముదక మితి మరీచ్యాదా వన్యతరాభావేఽపి సామానాధికరణ్యదర్శనాత్ । తస్మాద్దేహాదే ర్ద్వంద్వస్యచ సకారణ స్యాసతో న విద్యతే భావ ఇతి ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మగు సత్తగూడ వ్యభిచారియగుటఁజేసి ఘటాదులవలె కల్పితము. (అనగా నవస్తువు అసత్తు) అని శంకింపరాదు.

ఘటము నశించునపుడు ఘటబుద్ధి వ్యభిచరించినను "సన్ఘటః" అను స్థలములయందు సద్బుద్ధి విశేషణవిషయ మగుటంజేసి విశేష్యాంతరము నవలంబముజేసికొని గ్రహింపబడుటం జేసి సద్బుద్ధికి వ్యభిచారములేదు, అందువలన సత్తు అనువృత్తము. అనువృత్తమునందు వ్యావృత్తము కల్పితము కాన వ్యావృత్తము లగు ఘటాదిప్రపంచము కల్పితము. (వస్తువుకాదు, అసత్తు) అనువృత్తమగు సత్త యకల్పితము. (వస్తువు) అస్తిత్వము కలది.

సద్బుద్ధివలెనె యొక ఘటము నశించినను ఘటాంతరమందు ఘటబుద్ధి గ్రహింపఁబడుటఁజేసి ఘటబుద్ధికూడ యవ్యభిచారియే. కానవ్యభిచారులుగాని ఘటబుద్ధులయందు ఘటాదు లనువృత్తము లగుటంజేసి ఘటాదిప్రపంచము వస్తువు (అస్తిత్వము కలది) యని శంకింపరాదు.

ఘటబుద్ధి ఘటాంతరమందు గ్రహింపబడినను బటమునందు సద్బుద్ధి గ్రహింపబడినటుల గ్రహింపబడుటలేదు. కాన ఘటాదిబుద్ధులు వ్యభిచారులు. తద్విషయములు వ్యావృత్తములు. వ్యావృత్తములు కల్పితములు అసత్తులనంబడును. (అనగా మిథ్యాభూతములు).

(4) ఘటాదినాశదేశమునందు ఘటాకారముగ సత్త భాసింపకపోవుటచే ఘటమునశించి నపుడు సద్బుద్ధి ఘటోపరక్తాకారముగ గ్రహింపబడుటలేదు. కాన సద్బుద్ధికూడ వ్యభిచారియే యగుటంజేసి సత్తు వ్యావృత్తము. వ్యావృత్తమగుటచే కల్పితము అని శంకింపరాదు.

ప్రశ్నింపవలసియున్నది. జగత్తునందు సత్త్వముండుటయందు ప్రత్యక్షము ప్రమాణమా? లేక ననుమానమా? లేక నుపమానమా? లేక శబ్దము ప్రమాణమా? ప్రత్యక్షము ప్రమాణమందువా? శుక్తినిజూచి "ఇది రజతము" అను స్థలమునందును, చంద్రునిజూచి "ప్రాదేశమాత్రశ్చంద్రః" (చంద్రుడు జానెడుపరిమాణము కలవాడు) అనుస్థలమునందును ప్రత్యక్షప్రమాణములగు నింద్రియములకు యథార్థజ్ఞానజనకత్వము లేమింజేసి జగత్సత్త్వమునందు ప్రత్యక్షము ప్రమాణము కాదు. "ఇదంరజతం" (ఇదిరజతము) "ప్రాదేశమాత్రశ్చంద్రః" (చంద్రుడు ప్రాదేశమాత్రపరిమాణకుడు) అను స్థలముయందు ఇంద్రియములకు జంద్రాదులకు యోగ్యసంబంధము లేనందున ప్రత్యక్షప్రమాణ మగు చక్షురింద్రియమువలన యథార్థజ్ఞానము గలుగకపోయినను, మరొక స్థలమునందు విషయేంద్రియములయొక్క యోగ్యసంబంధమువలన యథార్థజ్ఞానము కలుగును. అట్టి జ్ఞానజనకంబు

శాంకరభాష్యతత్త్వబోధినీ:—

ఘటాదికము నశించినప్పుడు ఘటాదివిశేషము లేమింజేసి ఘటోపరక్తాకారమగు సత్తు భాసింపకున్నను ఘటాభావాధిష్ఠానముగ సత్తు భాసించుచునేయున్నది. గోత్వజాతి నిఖిలగోవుల యందున్నను వ్యంజకమగు ఖండముండాది గోవ్యక్తి లేనపుడు గోత్వమున్నను భాసించుటలేదు. అదేవిధమున సద్బుద్ధి విశేషణవిషయకము. అట్లు విశేషణమగు సత్తునకు వ్యంజకము. (భాస

---

మగుటచే బ్రహ్మప్రత్యక్షరూపము లగు నింద్రియములు ప్రమాణము లగునని శంకింపజనదు. గజాకారముగ జేయబడిన దారువునందు గజబుద్ధియు, మృత్తునందు ఘటబుద్ధియు, యోగ్యసంబంధద్వారముననే చక్షురింద్రియములవలన గలుగు చుండెను. అట్టి విపరీతబుద్ధిని జనింపజేయు చక్షురాదీంద్రియములు జగత్సత్త్వమునుగూర్చి యెట్లు ప్రమాణము లగును? ప్రమాణములు కానేరవు.

ఇక జగత్సత్త్వమునుగూర్చి యనుమానము ప్రమాణమందువా? ప్రపంచము ప్రత్యక్షసిద్ధమను నీమత మునం దనుమాన ముపయుక్తము కానందున జగత్సత్త్వమునం దనుమానముగూడ ప్రమాణము కానేరదు.

జగత్సత్త్వమునం దుపమానము ప్రమాణమందువా? నదియు సంభవింపదు. ఏలన: సాదృశ్యవాక్య మగు "గోసదృశో గవయః" అను వాక్యముచే జనించెడి (గవయమృగము గోసదృశము) అనుజ్ఞాన ముపమానప్రమాణ మనబడును. అట్టి పురుషుడొక యరణ్యమునకేగి యటనుండు గోసదృశ మగు నొకజంతువును జూచి "గవయమృగము గోసదృశము" అను పూర్వవాక్యార్థస్మరణముగలవాడై "ఈమృగము గవయపదవాచ్య" మని తెలిసికొనును. ఈజ్ఞానమునే యుపమితి యందురు. ఇట్టి యుపమితికి సాధనముపమానము. ఈవిధముగ జగత్తునకు దేనితో సాదృశ్యమును జెప్పవలయునో యట్టి వస్తువు లేనందున ద్వైవిధమగు నుపమానప్రమాణము సంభవింపనేరదు. "జగత్తు స్వప్నసదృశము" అని స్వప్నసాదృశ్యము సంభవించునందువా? అట్లైన స్వప్నము మిథ్యయగునట్లు స్వప్నసాదృశ్యమువలన జగత్తుగూడ మిథ్యయే యగును. కాన జగత్సత్త్వమునం దుపమానము ప్రమాణము కానేరదు.

శ్రుతులవలన జగత్తునకసత్త్వము శ్రూయమాణ మగుటంజేసియు, శ్రుతులవలన జగత్తు సత్త్వమని శ్రూయమాణము గాకపోవుటవలన నీజగత్సత్త్వమునందు శబ్దము ప్రమాణము కానేరదు.

"ఆత్మన ఆకాశస్సంభూతః" (ఆత్మవలన యాకాశము పుట్టెను.) "యతో వా ఇమాని భూతాని జాయంతే" (ఏబ్రహ్మమువలన నిఖిలభూతములు జనించుచున్నవో) అనిశ్రుతులు చెప్పుటవలన జగత్తు బ్రహ్మకార్యమగుటంజేసి జగత్తునకు సత్త్వ (అస్తిత్వ) ముండుటయందు శ్రుతిప్రమాణ మనెదవా? ఈవిషయమునగొన్ని బ్రశ్నింపవలసియున్నది. బ్రహ్మకార్యమగు జగత్తు (1) బ్రహ్మకంటె భిన్నమా? లేక, (2) బ్రహ్మాభిన్నమా? లేక, (3) బ్రహ్మకంటె భిన్నము నభిన్నముగూడ నగునా?

(1) జగద్రూపకార్యము బ్రహ్మకంటె భిన్నమనుపక్షమున నట్టి జగద్రూపకార్యము (1) సద్రూపమా? లేక, (2) అసద్రూపమా? (3) సదసద్రూపమా? సద్రూపమందువా? అట్టి కార్యమం దుండు సత్త (1) కారణసత్తారూపమా? లేక, (2) కార్యసత్తారూపమా? (1) కారణసత్తారూప మందువేని కారణసత్తకంటె వ్యతిరిక్తమగు సత్తలేకపోవుటచే గార్యమునకసత్త్వమే సంభవించును. (2) కారణసత్తకంటె వ్యతిరిక్తమగుసత్త కార్యమునందు గలదందువా? అట్టి కార్యసత్త (1) సద్రూపమా? లేక, (2) అసద్రూపమా? (1) సద్రూపమను పక్షమందు సద్రూపమగు కార్యసత్త కారణసత్తకంటె (1) భిన్నమా? లేక, (2) కారణసత్తాస్వరూపమా? బ్రహ్మము పూర్ణమగుటంజేసి నిరంతర మగుటచేతను కార్యమునకు కారణసత్తావ్యతిరిక్తమగు సత్త సంభవింపక

కము) విశేష్యములగు ఘటాదులు. అట్టి వ్యంజకములగు ఘటాదులు లేని తఱి విశేషణమగు సత్తుయున్నను భాసింపనేరదు. కాన సత్తు అనువృత్తము. అనువృత్తమునందు వ్యావృత్తములు కల్పితములు. అనువృత్తమగు సత్తు వస్తువు (అస్తిత్వము కలది).

విశేషణవిశేష్యములు ఉభయములు సత్తులైనపుడే సామానాధికరణ్య మనుభూతముగాన ఘటాదు లసద్రూపములైనచో "సన్ఘటః" అను సద్బుద్ధిఘటబుద్ధులకు సామానాధికరణ్యమెట్లు పొసగునని శంకింపరాదు.

విశేషణవిశేష్యములలో నేదైన నొకటియగు నుదకములేని సమయమున మరుమరీచికల యందు "ఇద ముదకం" ఇదియుదకమని సామానాధికరణ్య మనుభూయమాన మగుటచే సామానాధికరణ్యము విశేష్యవిశేషణోభయసత్యత్వము నపేక్షింపదు. అందువలన దేహేంద్రియాదులు, శీతోష్ణాదిద్వంద్వములు, వానికి కారణమగు నవిద్యయు సత్యములు కావు. (మిథ్యాభూతములు. అసత్తులు).

---

పోవుటచే సద్రూపకార్యసత్త కారణసత్తకంటె భిన్నమగునను పక్షమునగూడ కార్యమున కసత్త్వమే ప్రాప్తించును. సద్రూపకార్యసత్త కారణసత్తాస్వరూపమే యనినచో నట్టి కార్యకారణములయందుండు సత్తలకు సద్రూపముచే నేకత్వమే నిశ్చితమగుటచే గార్యమునకు కారణభిన్నత్వము సంభవింపకపోవుటవలన కార్యమున కసత్త్వమే ప్రాప్తించును. కార్యసత్త యసద్రూపమనెదవా? అసద్రూపముచే భిన్నమగు కార్యసత్తకు స్వతః స్వరూపము లేమింజేసి కార్యమునకు శూన్యత్వము సంభవించెడిని.

కార్య మసత్తను పక్షమునందు జగత్తు శశవిషాణమువలె స్వరూపశూన్య మగుటంజేసి జగత్తునకు బ్రహ్మకార్యత్వము సంభవింపకపోయెడిని.

ఉత్పత్తికి పూర్వమునం దసద్రూపమగు ఘటాదిప్రధ్వంసాభావమునకు గార్యత్వమువలె నుత్పత్తికి పూర్వమం దసద్రూపమగు జగత్తునకు గార్యత్వము సంభవించునని శంకింపవలదు. కారణసంబంధము కలదానికే కార్యత్వ మనుభవసిద్ధము. ఎట్లనః కర్తయగు కులాలునియొక్కయు, కరణాదికమగుదండచక్రప్రభృతులయొక్కయు సంబంధ ముండునపుడే జనిక్రియ యుండుటచే ఘటాదులకు కార్యత్వ మనుభవసిద్ధము. ఆవిధముగనే ప్రధ్వంసాభావమునకు భావరూపకర్తృకారకసంబంధ మున్నచో బ్రధ్వంసముగూడ భావపదార్థమే యయ్యెడిని. అట్లైనచో బ్రధ్వంసకు "అభావము" అను నిర్దేశ్యము లేకపోయెడిని. అట్లు కానందున ప్రధ్వంసాభావమునకు కర్తృకారక సంబంధము లేదని చెప్పవలయును. అట్టి ప్రధ్వంసాభావమునకు కార్యత్వము సంభవింపనేరదు. కార్యము కానట్టి ప్రధ్వంసాభావమును దృష్టాంతముగఁ గైకొని ప్రధ్వంసాభావమువలె నుత్పత్తికి పూర్వమం దసద్రూపమగు జగత్తున కుత్పత్త్యనంతరమున కార్యత్వము సంభవించు నని చెప్పుట యసంగతము.

జగత్తు సదసద్రూపమను పక్షముగూడ సంభవింపనేరదు. ఎలన? సత్త్వమనునది భావపదార్థనిష్ఠధర్మము. అసత్త్వమనునది యభావనిష్ఠధర్మము. కాన నీసత్త్వాసత్త్వము అత్యంతవిరుద్ధధర్మము లగుటఁజేసి యీసత్త్వాసత్త్వముల కేకాధికరణ్యము సంభవింపకపోవుటవలన తాదృశవిరుద్ధధర్మములతో గూడియుండుట జగత్తున కెన్నడును సంభవింపనేరదు. కాన జగత్తు బ్రహ్మకార్యము కానేరదు. ఇంతవరకు చెప్పిన గ్రంథముచే "కార్యము కారణముకంటె భిన్నము" అను పక్షము నిరస్తమైనది.

శాంకరభాష్యమ్:—

(5) తథా సత శ్చాత్మనోఽభావోఽవిద్యమానతా న విద్యతే సర్వత్రావ్యభిచారాది త్యవోచామ । ఏవ మాత్మానాత్మనో స్సదసతో రుభయోరపి దృష్ట ఉపలబ్ధో అంతో నిర్ణయః సత్సదేవాసదసదేవేతి త్వనయో ర్యథోక్తయో స్తత్త్వదర్శిభిః । తదితి సర్వనామ । సర్వం చ బ్రహ్మ, తస్య నామ తదితి। తద్భావ స్తత్త్వం బ్రహ్మణోయాథాత్మ్యంతద్ద్రష్టుం శీలం యేషాం తే తత్త్వదర్శిన స్తై స్తత్త్వదర్శిభిః। త్వమపి తత్త్వదర్శినాం దృష్టి మాశ్రిత్య శోకం మోహం చ హిత్వా శీతోష్ణాదినియతానియతరూపాణి ద్వంద్వాని వికారోఽయ మసన్నేవ మరీచిజలవ న్మిథ్యాఽవభాసత ఇతి మనసి నిశ్చిత్య తితీక్ష స్వే త్యభిప్రాయః । ॥౧౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(5) సద్రూపమగు నాత్మ సత్యము. ఆత్మసంబంధమగు విశేషములు దేహేంద్రియ శీతోష్ణాదులు నశించుచుండ దదుపరక్త (అట్టి విశేషములతోగూడిన) మగు నాత్మకుకూడ వినాశ మెందులకు ప్రాప్తింపదనిన? ఆత్మ సర్వత్ర యనువృత్త మగుటచే నవ్యభిచారియగుటంబట్టి వ్యావృత్తము లగుటచే వ్యభిచారులగు దేహేంద్రియాదులగు విశేషములు నశించినను నాత్మ నశింపదు. కనుక నిత్యము (సత్యము).

ఒకానొకసమయమున నసత్తుగూడ సత్తు గావచ్చును. అది యెట్లనిన? ఘటము పుట్టుటకు పూర్వ మసత్తు. పుట్టినపిదప సత్తని యనంబడును. అదేవిధమున నొకానొక సమయమున

ఇక కార్యము కారణస్వరూప మనుటయు సంభవింపనేరదు. అట్లగుచో జడమగు కార్యరూపజగత్తు కారణ మగు బ్రహ్మస్వరూప మగుటచే బ్రహ్మకు దృశ్యత్వము, అనిత్యత్వము, అపరిణామిత్వము, దుఃఖరూప త్వము, సావయవత్వము మొదలగు దోషములు సంభవించెడిని? అట్టి దోషములు బ్రహ్మమునకు బ్రాప్తించుట యిష్టమే యన్నచో "అహం మమేదం," (నేను ఇది నాసంబంధమైనది) అను వ్యవహారము లోపించె డిని. అట్లగుచో నీవుగూడ జడరూపుడవగుటచే నీకు జ్ఞానము సంభవింపకపోయెడిని అందుచే మోక్షమే లేకపో యెడిని. మోక్షము లేదని యన్నచో "తరతిశోక మాత్మవిత్" అను శ్రుతికి వైయర్థ్యము బ్రాప్తించెడిని. అది యిష్టమేయన్న బ్రహ్మానందమును గోరెడివారలకు ముక్తియందు బ్రవృత్తి లేకపోయెడిని. మరియు, యత్త దదృశ్య మగ్రాహ్యం" "అజో నిత్య శ్శాశ్వతః" ఇత్యాది శ్రుతులకగూడ విరోధము ప్రాప్తించును. కాన బ్రహ్మకార్యమగు జగత్తు కారణమగు బ్రహ్మకంటె నభిన్నమని జెప్పుట యసంగతము.

ఇక గార్యమగు జగత్తు కారణమగు బ్రహ్మకంటె భిన్నాభిన్నము నగును తృతీయపక్షముకూడ— భిన్నత్వాభిన్నత్వము లన్యోన్యవిరుద్ధము లగుటంజేసి యేకవ్యక్తియం దుండవు కాన నిరస్తము. ఈజెప్పుటవలన దేలిన యాశయ మేమి? జగత్తునకుబ్రహ్మ కార్యత్వము సిద్ధించదనుటచే "జగత్తునకు సత్త్వము శ్రుతిసిద్ధ" మను శంక దొలగి పబడెను.

అట్లైనచో జగత్తు బ్రహ్మకార్యమని బోధించు "యతో వా ఇమాని భూతాని జాయంతే, ఆత్మన ఆకాశ స్సంభూతః" అనుశ్రుతులు యథార్థబోధకము లగుటంజేసి యట్టిశ్రుతుల కప్రామాణ్యము ప్రాప్తించు నని శంకింపవలదు.

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సత్తు అసత్తు కావచ్చును. అది యెట్లనిన? స్థితికాలమున ఘటము సత్తు, నాశానంతర మసత్తు యని యనఁబడునుగాన సత్త్వాసత్త్వము లవ్యవస్థితములు. కావున సామాన్యవిశేషములగు సత్ప్రపంచముయం దుభయములయందు సత్త్వాసత్త్వములు సమానముగనే యుండునని శంకింపరాదు.

ఆత్మయాథార్థ్యమును దెలిసినవారు సత్తెల్లప్పుడు సత్తే, అసత్తెల్లపుడు నసత్తే యని సదసత్తులయొక్క నిశ్చయమును గ్రహించిరి. అనగా నుత్పత్తికి పూర్వమునందసత్తగు ఘటాదులు ఉత్పత్త్యనంతరమున సత్తులు కానేరవు సత్త్వాసత్త్వములు విరుద్ధములుగాన నసత్త్వమున్న సమ

తార్కికులు "పరమాణువులు జగత్కారణ" మనియు, సాంఖ్యులు "ప్రకృతి జగత్కారణ" మనియు జెప్పెదరు. ఆట్టి యామతసిద్ధాంతమునే యంగీకరించినచో కారణమగు పరమాణ్వాదులకంటెను, కార్య మగు జగత్తుకన్నను బ్రహ్మము వేరగుటంబట్టి బ్రహ్మము సద్వితీయ మగును. అట్లైన శ్రుతిప్రసిద్ధ మగు నద్వితీయత్వము బ్రహ్మమునకు బ్రాప్తించకపోయెడిని. ఆట్టి విషయమును సహింపనిదై బ్రహ్మమునకద్వితీయత్వము జెప్పుటకై "యతో వా ఇమాని భూతాని జాయంతే" అనునది మొదలగు శ్రుతులు జగదుపాదానత్వమును బ్రహ్మమునకు జెప్పుచున్నవి. కాన "యతో వా ఇమాని భూతాని జాయంతే" ఇత్యాదిశ్రుతులు బ్రహ్మ కద్వితీయత్వప్రతిపాదనపర మగుటవలన ప్రమాణములు.

ఉపాదానమనగ పరిణామియని గర్థము. పూర్వోక్తవిధమున జగత్తునకు కార్యకారణభావమే లేనిచో జగదుపాదానము బ్రహ్మ మెట్లగును? ఉపాదానమనగ బరిణామియని యర్థము కాదు. మరేమనిన? వివర్తమని యర్థము. కాన కార్యకారణభావనియతమగు బరిణామిత్వము బ్రహ్మమునకు లేకున్న వివర్తోపాదానత్వ మవ్యాహతముగ బ్రాప్తించును. వివర్తోపాదానత్వమనగ నధిష్ఠానమున కన్యథాభావము. ఆట్టి యన్యథాభావము గ్రహీతయొక్క గ్రహణదోషకృతము. ఎట్లనిన? గ్రహీతయొక్క గ్రహణదోషముచే శుక్తి (ముత్యపుచిప్ప) కెట్లు రజతాకారముగ బ్రతీతికలుగునో యట్లే గ్రహీతయొక్క గ్రహణదోషముచే నాత్మకు జగదాకారముగ బ్రతీతి గల్గును. 'ఇది శుక్తి' యను శుక్తియాథాత్మ్యజ్ఞానముచే రజతాకారభావము శుక్తిమాత్ర మెట్లగునో యటులనే బ్రహ్మస్వరూప సాక్షాత్కారముచే ప్రతీతి (జ్ఞాన) మాత్రస్వరూపమగు జగత్తునకు 'తదనన్యత్వ మారంభణ శబ్దాదిభ్యః, వాచారంభణం వికారో నామధేయం' ఇత్యాది శ్రుతిసూత్ర ప్రామాణ్యమువలన బ్రహ్మమాత్రత్వము సిద్ధించును. కాన బ్రహ్మ కద్వితీయత్వ మవ్యాహతము. అందువలన బూర్వోక్తదోషముల కవకాశ మించుకయు లేదని యాశయము. కార్యమాత్రము నామమాత్రమే యగుటచే వస్తుతః శబ్దాదిప్రపంచ ముండుటయందు శ్రుతి (శబ్దము) ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము ప్రమాణములు కావని సిద్ధమగుచున్నది.

ఈవిధముగ నసద్రూప మగు శబ్దాదిప్రపంచమునకు సత్త్వాభావమునుఁ జెప్పి, "నాభావో విద్యతే సతః" అను వాక్యముచే స్వస్వరూపబ్రహ్మమునకు సత్త్వమునుఁ జెప్పుచున్నాడు. సామాన్యవిశేషభావము లేనట్టియు, నఖండైకచిదేకరస మగునట్టియు, సర్వవిక్రియారహిత మగునట్టి 'సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్' ఇత్యాది శ్రుతిప్రసిద్ధం బగునట్టి కార్యకారణవిలక్షణ మగునట్టి యేసద్రూపమగు యాత్మ కలదో యట్టి యాత్మకు యేదేశమునందును, యేకాలమునందును అభావము లేదు. జాగ్రత్స్వప్న సుషుప్త్యాదులయం దాత్మకు సద్భావము గన్పట్టుటవలన నాత్మ యెల్లపు డుండుటయందు బ్రత్యక్షము ప్రమాణము. ఆత్మ జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థాత్రయసాక్షి యగుటవలన నిత్యసత్త్వము కలది. "దేహాదు లనిత్యములు గాన నవస్థాత్రయసాక్షులును యగుటలేదు" అని వ్యతిరేకముగ దృష్టాంతము నూహింపఁదగు. ఇట్లనుప్రమాణముగూడ యాత్మ నిత్యసత్తావత్త్వనుటయందు

శాంకరభాష్యతత్త్వబోధిని:—

యందున సత్త్వము ప్రాప్తింపనేరదు. అసత్త్వము నివృత్తమైనపిదప సత్త్వము ప్రాప్తించు ననిన పెట్టికుదిరిన పెండ్లియగును; పెండ్లియైన పెట్టికుదురు నన్నట్లు సత్త్వము ప్రాప్తించినఁ గాని యసత్త్వము నివృత్తము కానేరదు అసత్త్వము నివర్తించిన గాని సత్త్వము ప్రాప్తింపనేరదు. కాన నన్యోన్యాశ్రయదోషము ప్రాప్తించును. దాన నసత్తులగు నీశరీరేంద్రియశీతోష్ణాదులెల్లపుడు నసత్తులే. సత్యమగు బ్రహ్మము త్రికాలములయందును సత్యమే యని గ్రహింపనగును.

ప్రమాణము "అయ మాత్మా నిత్య శ్శుద్ధో బుద్ధః, అజో నిత్య శ్శాశ్వతః. తథాఽరసం నిత్య మగంధవచ్చ" ఇత్యాదిశ్రుతులుఁగూడ నాత్మకు నిత్యసత్త్వ ముండుటయందు ప్రమాణములు. ఈవిధముగ సర్వప్రమాణములచే నిర్ధారిత మగు నిత్యసత్త్వముగల ప్రత్యగభిన్న మగు బ్రహ్మ కభావ మెన్నడును సంభవింపదని బ్రహ్మయొక్క సత్యజ్ఞానానందాత్మక మగు యాథాత్మ్యమును దెలిసికొనిన బ్రహ్మవేత్తలచే సదసత్తులయొక్క నిశ్చయము (సర్వత్ర) ఎల్లపుడు బ్రహ్మ మేక మే కలదు. బ్రహ్మముకంటె వేరగునది లేదను నిష్కర్ష) చేయబడెను. ఈ చెప్పుటచే— ఓ యర్జునా! నీవుగూడ నాత్మ కనిత్యత్వభ్రాంతిని విడిచి శోకరహితుఁడవై "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను శ్రుత్యర్థము ననుసరించి యంతటను బ్రహ్మమునే జూచువాడ వగు మని సూచితమైనది.

నీలకంఠీయము:— "సుషుప్త్యవస్థయందును, సమాధ్యవస్థయందు నాత్మ కుపాధిసంబంధముండదు గాన నా యవస్థలయందు సుఖదుఃఖముల ననుభవించకుండుట న్యాయమే యగును. కాని జాగ్రత్స్వప్నావస్థలయం దాత్మ కుపాధిసంబంధముండును గాన దప్తాయఃపిండమునకు దగ్ధృత్వముండునట్లు ఆ యవస్థలయం దాత్మకు సుఖదుఃఖములుండుట తప్పదు. సర్వవ్యాపక మగు మూలావిద్యయొక్క యంశమే యుపాధి యగును గాన, నామూలావిద్యయున్నపుడే సంసారము సమూలముగ నశించకనే యుండును. అట్టి సంసారి మోక్షముకొరకు సమర్థుఁడగునని చెప్పుట యనుపపన్నము.' అని యాశంకించుకొని ఈ శ్లోకమునుఁ జెప్పుచున్నాడు. ప్రమాత్రాదిక (జీవాదిక)ము వచ్చిపోవు స్వభావముకలది. కాన నది కాదాచిత్కము. కనుకనే రజ్జుసర్పమువలె నసత్తు. అట్టి 'అసతః' అసత్తునకు, 'భావః' సత్త్వము, 'నాస్తి' కాలత్రయమునందును లేదు. అనగా ప్రమాత్రాదిక "జీవాదిక"ము మూలావిద్యచే చిదాత్మయందు గల్పితము. ఆ మూలావిద్య యాత్మజ్ఞానముచే నివృత్తమగును. అట్టి మూలావిద్యారూప కారణము లేనందున ప్రమాత్రాదిక ముండదు. కాన నిర్విఘ్నముగ నాత్మజ్ఞానము సిద్ధించునని భావము. ప్రమాత్రాదికము రజ్జూరగమువలె నసత్తుగాన సర్వదా ప్రతీయమాన మగుటలేదు. అందువలన భ్రమాత్రాదికమును మిథ్యగా నొప్పుకొనవలయును. అట్లొప్పుకొన్నచో నట్లే యాత్మగూడ సుషుప్త్యాదులయం దప్రతీయమాన మగుటచే నుభయమునకు విశేషమేమియు గన్పట్టక పోవుటవలన భ్రమాత్రాదికము, నాత్మగూడ మిథ్యలే కావలయును లేక, రెండును సత్యములే కావలయును గాని ప్రమాత్రాదికము మిథ్యయు, నాత్మ సత్యము నెట్లగును." అను నాశంకమీద 'నాభావో విద్యతే సతః' అని జెప్పుచున్నాఁడు. సద్వస్తువగు నాత్మకు అసత్త్వము కాలత్రయమునందు లేదు అని యర్థము. అనగా నిద్రనుండి మేల్కొనినవానికి, "నేను సుఖముగ నిద్రించితిని, దేనిని దెలిసికొనలేదు." అని జ్ఞానము గల్గుచున్నది. ఈజ్ఞానము సుషుప్తియం దతఁడు సుఖమును, నజ్ఞానము ననుభవింపనిచో నాతనికి సంభవింపనేరదు. కాన నట్టి జ్ఞానమునకు కారణమగు సుఖాజ్ఞానానుభవము సుషుప్తియందాత్మకుండుటచే నట్టి యనుభవమునుబట్టి సుషుప్తియందు గూడ నాత్మ ప్రతీయమానమే యగుచున్నది. కాన నసత్తగు భ్రమాత్రాదికముకంటె సత్తగు నాత్మకు ప్రతీయమానత్వరూపవిశేషమున్నది గాన 'భ్రమాత్రాదిక మనిత్యమగుచో నాత్మ గూడ ననిత్యమే కావలయు' నను నాశంకయు నిరస్తమైనది. అందువలన సత్పదార్థమగు నాత్మ కసత్వము లేదు. సుషుప్తి సమాధ్యవస్థలయందు ప్రమాత్రా-

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సత్తు సత్తుగను, అసత్తు అసత్తుగను గనుపించుచున్నది. కొందఱు సత్తు నసత్తుగను, అసత్తును సత్తుగను తెలిసికొనుచుండిరి. మఱికొందఱు ఆత్మను సత్తుగను, శరీరాదుల నసత్తుగను తెలిసికొనుచుండిరి. కాన నే నేపక్షము నవలంబింపవలె ననెదవా? నీ వాత్మయాథాత్మ్యమును తెలిసికొనినవారల దృష్టి నవలంబించి శోకమోహములను వదలి నియతరూపములగు సుఖదుఃఖాదిద్వంద్వములు, అనియతరూపములగు శీతోష్ణాదిద్వంద్వములు వికారములుగాన మరుమరీచిజలము వలె మిథ్యాభూతములని నిశ్చయించుకొని శీతోష్ణములను సహింపుము. ॥౧౬॥

దిక ముండదనియు, దృగ్రూపమగు నాత్మ సత్యమనియు, "యద్వైతన్న పశ్యతిపశ్యన్వైతన్న పశ్యతి, న హి ద్రష్టుర్దృష్టే ర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాన్న తు తద్ద్వితీయమస్తి తతోఽన్య ద్విభక్తం య త్పశ్యేత్" అను శ్రుతిగూడ జెప్పుచున్నది.

ప్రమాత్రాదికము సత్యమైనచో సుషుప్త్యాదులయందు ప్రమాతృజ్ఞానము కలుగకపోవుటకు హేతువు ప్రమాతృసాన్నిధ్యము లేకపోవుటయా? లేక ద్రష్టయొక్క దృష్టిలోపమా? (జ్ఞానభావమా) మొదటిపక్షమున ఆత్మయందు దృష్టనష్టస్వభావముగల ప్రమాత్రాదికమున కాత్మకంటె మరొకస్థలమునందు స్థితికల్పన సంభవింపకపోవుటవలన "సాన్నిధ్యములేకపోవుట" యనెడిహేతువు సంభవింపనేరదు. ఇంక ద్రష్టయొక్క దృష్టి (జ్ఞాన) లోప మనెడి హేతువుగూడ 'నహి ద్రష్టు ర్దృష్టే ర్విపరిలోపో విద్యతే' ద్రష్టకు దృష్టి (జ్ఞాన)లోపము లేదను శ్రుతిచే ద్రష్టకు దృష్టిసంభవమగుచుండ ద్రష్టయొక్కదృష్టి(జ్ఞాన) లోపమువలన సుషుప్త్యాదికమునందు ప్రమాతృత్వము దెలియఁబడుటలేదు. అను పక్షము సంభవింపనేరదు. కాన నాత్మ, ప్రమాతయు (జీవభావము) ననెడి యుభయము సమానమగుటంజేసి సత్యమయ్యెడిని. లేక మిథ్యమయ్యెడిని' అను నాపత్తి సంభవింపనేరదు.

విమర్శించినచో సద్రూపమగు నాకాశముయొక్క భావ మొకానొక దేశమందును, ఒకానొక కాలమందు లేకపోయినను, సద్రూపమగు పరమాణువుయొక్క యభావము ఆపరమాణువుండు ప్రదేశముకంటె మరొకప్రదేశమందు గలదు. అట్లే యుత్పత్తికి బూర్వమునం దసద్రూపమగు ఘటాదికమున కుత్పత్త్యనంతరమున సత్త్వము కనఁబడుచుండ "నాఽసతో విద్యతేభావో నాఽభావో విద్యతేసతః" అసత్తునకు సత్త్వము లేదనియు, సత్తునకు అసత్త్వము లేదనియు జెప్పుట యెట్లుపపన్నమగు" ననుయాశంకను విద్వదనుభవముచే "ఉభయోరపి" అను యుత్తరార్థముచే దొలగించుచున్నాడు— 'అంతః' యాథాత్మ్యము; ఎట్లు స్వప్నమునందు ఆకాశము, ఘటము, రజ్జువు, సర్పము, మొదలగునవి నిత్యత్వ, అనిత్యత్వ, సత్యత్వ, అసత్యత్వాది ధర్మవిశిష్టములుగ నిశ్చితములై, జాగ్రదవస్థయందు స్వాప్నికములగు నా యాకాశాదికము బాధింపబడునో (లేకుండునో) యట్లే జాగ్రదవస్థయందుఁ జూడబడు పదార్థములన్నియు నసంప్రజ్ఞాతసమాధ్యవస్థయందు దత్త్వజ్ఞానముచే బాధింపఁబడును.

ఎట్లు జాగ్రద్వాసనావశమున స్వప్నగతనిత్యత్వాదినిశ్చయము భ్రమాత్మకమగుచున్నదో యట్లే యనాదికాలప్రవృత్త ప్రాగ్భవీయ సంస్కారమువలన జాగ్రదవస్థయందు భాసించు గగనాదినిష్ఠ నిత్యత్వాదినిశ్చయము గూడ భ్రమ యేయగును. అనగా నాత్మయందు గగనాదు లధ్యస్తము లని పర్యవసితము.

స్వరూపతః సద్రూపమగు నాపణస్థరజతాదికమునకు శుక్త్యాదులయందధ్యాస యనుభవసిద్ధము. కాని యసద్రూప మగు శశశృంగాదుల కధ్యాసము లోకమున బ్రసిద్ధము కానందున దేనియం దేది యధ్యస్త మగునో దాని సామాన్యరూపమునకును, అధ్యస్తవిశేషాంశమునకు గల యైక్యముయొక్క యథార్థజ్ఞానమువలన జనించెడి సంస్కారము, పురోవర్తి వస్తుగతచాకచక్యాదిసందర్శనమువలన నుద్బుద్ధమై యధ్యాసనుగూర్చి గారణ మగును. అనఁగా

గీ॥ అవినాశితు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్ ।
వినాశ మవ్యయస్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి ॥ ॥౧౭॥

పదవిభాగము:— అవినాశి– తు– తత్– విద్ధి– యేన– సర్వం– ఇదం– తతం– వినాశం– అవ్యయస్య– అస్య– న– కః– చిత్– కర్తుం– అర్హతి । ॥౧౭॥

ప్రతిపదార్థము:— యేన=ఏసద్రూపబ్రహ్మముచేత; ఇదం=ఈ; సర్వం=సర్వజగత్తు; తతం=వ్యాప్తమైనదో; తత్=ఆసదాఖ్యబ్రహ్మమును; అవినాశితు=నాశరహితముగ; విద్ధి=తెలిసికొనుము; కశ్చిత్=ఒకానొకడును; అస్య=ఈ; అవ్యయస్య=ఉపచయాపచయములు (వృద్ధిక్షయములు) లేనట్టి బ్రహ్మమునకు; వినాశం=నాశమును; కర్తుం—చేయుటకు; నార్హతి=తగడు. ॥౧౭॥

శాంకరభాష్యమ్:—

కిం పున స్త ద్య త్సదేవ సర్వదై వాస్తీ త్యుచ్యతే— అవినాశీతి । అవినాశి న వినష్టుం శీల మస్యేతి । తుశబ్దోఽసతో విశేషణార్థః । తద్విద్ధి విజానీహి । కిం, యేన సర్వ మిదం జగ త్తతం వ్యాప్తం సదాఖ్యేన బ్రహ్మణా సాకాశమాకాశేనేవ ఘటాదయః । వినాశ మదర్శన

అధిష్ఠానమగు వస్తువు శుక్తి, తత్సామాన్యరూపము ఇదము. ఆరోప్యమాణవిశేషము రజతము. ఈరెంటి కాపణమునందు "ఇదం రజతం" ఇది రజతము అను యథార్థజ్ఞానము గలుగును. అట్టి యథార్థజ్ఞానమువలన జనించెడి సంస్కారము పురోవర్తి శుక్తిగతచాకచక్యసందర్శనసముద్బోధితమై "ఇదం రజతం" ఇది రజతము అను భ్రమను (అధ్యాసను) గలిగించును. శశశృంగాదిక మప్రసిద్ధ మగుటంజేసి పూర్వోక్తయథార్థజ్ఞానజన్యసంస్కారము సంభవింపకపోవుటచే శశశృంగాధ్యాస యెట్లు సంభవింపనేరదో యట్లే గగనాదికముగూడ నీదృష్టిచే స్వరూపతః నసద్రూప మగుటంజేసి యనాత్మ యగు గగనాదికమునకు, సద్రూపమగు నాత్మకు తపఃప్రకాశములకువలె నైక్యము సంభవింపనందున యాత్మానాత్మైక్యప్రమాజన్యసంస్కారము లేమింజేసి యాత్మయం దనాత్మరూపమగు గగనాద్యధ్యాసము సంభవింపనేర దని శంకింపరాదు.

"లఘుధర్మపురస్సరముగ గారణత్వము సంభవించుచుండ గురుధర్మపురస్సరముగ గారణత్వము జెప్పదగదు" అను నియమానుసార మధ్యాసమునుగూర్చి యధిష్ఠానసామాన్యమునకు, ఆరోప్యవిశేషమునకు నైన యైక్యానుభవమువలన జనించెడి సంస్కారమే కారణము. అనగా అధిష్ఠానసామాన్య మగు ఇదమునకు, ఆరోప్యవిశేష మగు రజతమునకు నగు యైక్యానుభవము "ఇదం రజతం" ఇది రజతము అను యనుభవము. అట్టి యనుభవము యథార్థరూపమనియు, భ్రమరూపమనియు విశేషాంశము నపేక్షింపక తజ్జన్యసంస్కారము శుక్త్యాదుల యందు గల్గు "ఇదం రజతం" ఇది రజతము అను భ్రమను (అధ్యాసమును) యెట్లు గల్గించునో అట్లే యాత్మానాత్మల కైక్యము లేకున్నను, శశశృంగాదులవలె దుచ్ఛము (అత్యంతాప్రసిద్ధములు) గాక వ్యావహారికసద్రూపములగు గగనాది ప్రపంచమునకు, నాత్మకు భ్రమాత్మక మగు పూర్వైక్యానుభవమువలన జనించెడి సంస్కారమువలన యాత్మయందు గగనాదుల యధ్యాసము సంభవించును. కనుకనే గగనమునందు నైల్యము స్వరూపతః లేకున్నను, దర్పణప్రతిబింబిత మగు గగనమందు నైల్యాధ్యాస సంభవించుచున్నది. కాన జాగ్రదవస్థయందు స్వప్నద్రష్టలచే స్వాప్నికపదార్థములయొక్క యాథార్థ్య మెట్లు దెలిసికొనబడునో యట్లే మనచే జూపబడిన సదసత్తుల యాథాత్మ్యము దత్త్వవేత్తలచే దెలిసికొనబడును. ఈవిషయమునే "నేహ నానాఽస్తి కించన, అస్తీత్యేవోపలబ్ధవ్యః అతోఽన్యదార్తం" అను శ్రుతు లనాత్మల కసత్త్వమును ఆత్మకుసత్త్వమును బోధించుచున్నవి. కాన సద్రూపజ్ఞానముచే నసత్తు బాధింపబడుచుండ గైవల్యము సిద్ధించునని యాశయము. ॥౧౬॥

శాంకరభాష్యమ్:—

మభావ మవ్యయస్య నవ్యే త్యుపచయాపచయౌ న యాతీ త్యవ్యయం తస్యావ్యయస్య । నైతత్సదాఖ్యం బ్రహ్మ స్వేన రూపేణ వ్యేతి వ్యభిచరతి నిరవయవత్వా ద్దేహాదివత్ । నాప్యాత్మీయే నాత్మీయాభావా ద్యథా దేవదత్తో ధనహాన్యా వ్యేతి న త్వేవం బ్రహ్మ వ్యేత్యతోఽవ్యయ స్యాస్య బ్రహ్మణో వినాశం న కశ్చి త్కర్తు మర్హతి, న కశ్చిదాత్మానం వినాశయితుం శక్నో తీశ్వరోఽపి । ఆత్మా హి బ్రహ్మ స్వాత్మని చ క్రియావిరోధాత్ । ॥౧౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సత్తనగ నేమి? సామాన్యమా? స్వరూపమా? సామాన్యరూప మైనచో సామాన్యము విశేషాపేక్ష కల దగుటచే ప్రళయదశయందు సర్వవిశేషములు నశించుచుండ విశేషాపేక్షితంబగు సామాన్యముగూడ నశింపవలెను. సామాన్య మన నాత్మవిశేషము. అట్టి యాత్మ ప్రళయమునందుండ సామాన్య మెట్లునశించుననిన? ఆత్మాతిరిక్త విశేషము లన్నియు కార్యరూప మగుటచే బ్రళయావస్థయందుండవు. ఆత్మ ధర్మిస్వరూప మగుటచే సామాన్యరూపము విశేషము కానేరదు. కాన పూర్వదోషము ప్రాప్తించుచునే యున్నది. సత్తాస్వరూప మనిన నది వ్యావృత్తమా? అనువృత్తమా? వ్యావృత్తమనిన నది కల్పితమగుటంజేసి సత్తు నశింప

—• ౨వ అధ్యాయము ౧౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "సద్రూపమగు నాత్మ యజ్ఞానముకన్న భిన్నమైనచో నాత్మకుఁ బరిచ్ఛిన్నత్వము ప్రాప్తించెడిని. అట్లైన నాత్మకు జ్ఞానస్వరూపత్వ మంగీకరింపదగును. అట్టిజ్ఞానస్వరూపత్వ మాధ్యాసికము కానేరదు. అధ్యాసికమే యన్నచో జడత్వము ప్రాప్తించెడిని. కాన నాధ్యాసికము కానట్టి జ్ఞానస్వరూపమగు సద్రూపము జ్ఞాధాత్వర్థమగుటంబట్టి "ఘటజ్ఞానము పుట్టినది, ఘటజ్ఞానము నశించునది" అను ప్రతీతులచే నుత్పత్తివినాశముల నంగీకరింపవలెను. అట్లైన "నేను ఘటమును దెలిసికొనుచుంటిని." అను ప్రతీతిచే జ్ఞానస్వరూపమగు సత్తుకు సాశ్రయత్వము, సవిషయత్వముఁ బ్రాప్తింతును. కనుక స్ఫురణరూపము, సద్రూపము నగు నాత్మకు దేశకాలవస్తుపరిచ్ఛిన్నత్వము ప్రాప్తించుచుండ సత్తుకు దేశకాలవస్తుపరిచ్ఛేదము లేదని చెప్పుటెట్లు సమంజస" మగునను శంకకు సమాధానముగ "అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతం" అని చెప్పెను. స్ఫురణరూపము, నిత్యము, విభువు, నేనమునగు నేసద్రూపముచే దృశ్యమగు నీసకలప్రపంచము వ్యాపింపబడెనో యట్టి సత్తును దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యముగ దెలసికొనుము.

ఎందువలననిన 'కశ్చిత్' ఒకానొక యాశ్రయము కాని, విషయము కాని, విషయేంద్రియసంబంధము కాని దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యము, అపరోక్షము, నిఖిలప్రపంచానుస్యూతము స్ఫురణరూపము నగు సత్తకు 'వినాశం' పరిచ్ఛేదమును జేయుటకు సమర్థమైనది కాదు. ఏలయన? ఆశ్రయము, విషయము, విషయేంద్రియసన్నికర్ష మెండు నగునవి కల్పితములు. అట్టి కల్పితములు అకల్పితమగు సత్తను బరిచ్ఛేదకములు కానేరవు. దేశకాలపరిచ్ఛిన్నత్వ మాత్మయందు దారోపితమనెదవా? అది సమ్మతమే. "అహం ఘటం జానామి" (నేను ఘటమును దెలిసికొనుచుంటిని.) అను ప్రతీతియం దహంకార మాశ్రయముగను ఘటము విషయముగను భాసించుచుండెను. అందు

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వలసివచ్చును. అనువృత్త మనిన ననువృత్తము సామాన్యరూపము గాన సామాన్యము విశేషాపేక్షిత మగుటంజేసి విశేషములు ప్రళయకాలమునందు నశించుటచే సామాన్యము నశింపవలసివచ్చును. కాన సర్వదా అస్తిత్వము గల యాసత్తనంగ నేమని శంకింపరాదు.

"సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్" అను శ్రుతిప్రమితము, సామాన్యవిశేషరహితము, సర్వవిక్రియారహితము నఖండైకరసమునగు వస్తువే ప్రకృతమున సచ్ఛబ్దముచే నుడువబడును.

---

నుత్పత్తివినాశములు గల యాహంకారవృత్తి సర్వత్ర వ్యాపించియున్న సత్తాస్ఫూర్తికి వ్యంజకముగ నుండును. తార్కికులుకూడ నాత్మమనస్సంగయోగము జ్ఞానహేతువుగ నంగీకరించియుండిరి. కనుక నహంకారవృత్త్యుత్పత్తివినాశములచేతనే-ధ్వన్యవచ్ఛేదముగ శబ్దసత్తను, ఘటాద్యవచ్ఛేదముగ నాకాశసత్తనగు మహాకాశమువలె నహంకారవృత్త్యుపహిత మగునట్టియు, స్ఫురణరూప మగు సత్తనందుత్పత్తివినాశము లుపపన్నము లగుచుండ నేకము స్ఫురణాత్మకము నగు సత్తకు స్వాభావికముగ నుత్పత్తివినాశములయొక్క కల్పన సంభవింపనేరదు. అహంకారమట్టి సత్తనం దధ్యస్తమైనను దానియందుండు తాదాత్మ్యాధ్యాసముచే సత్తనకాశ్రయముగ భాసించుచుండెను.

సుషుప్తియం దహంకారము లేకపోయినను దధ్యాసనావాసిత మగు నజ్ఞానమునకు భాసకమగు చైతన్యము స్వతఃస్ఫురణచే సుషుప్తియందు స్వప్రకాశస్ఫురణయొక్క సద్భావమును సదారూపమునను నిత్యత్వముచే దెలుపుచున్నది. అట్లు కానియెడల (అనగా సుషుప్తియందు సత్తలేదనినచో) సుప్తోత్థితుం డగు పురుషునకు "ఏతావంతం కాల మహం కిమపి నాజ్ఞాసిషం" (ఇంతకాలము నేను దేనినెఱుగను) అను స్మరణము లేకపోయెడిని. సుప్తోత్థితపురుషునకు గలిగెడి యాజ్ఞానము స్మరణరూపము గానేరదు. మరేమనిన "సుషుప్తికాలమందు నాసంబంధమగు జ్ఞానము లేదు" అని సుషుప్తినుండి మెలకువగాంచిన పురుషుడూహించు ననుటయు సంభవింపనేరదు. (పర్వతమునందుధూమమువలన వహ్నినూహించుటకు బక్షమగు పర్వతజ్ఞాన మెట్లపేక్షితమో) అట్లే సుషుప్తికాలమందు జ్ఞానాభావము నూహించుటకు బక్షమగు సుషుప్తి కాలముయొక్క జ్ఞానమపేక్షితము. అట్టి జ్ఞానము జాగ్రత్కాలమందు సంభవింపకపోవుటచే సుషుప్తి కాలమందుజ్ఞానాభావము నూహించుట వలనుపడదు. మఱియు పర్వతమునందు వహ్ని నూహించుటకు ధూమ మెట్లు హేతువగునో యట్లే సుషుప్తి కాలమందు జ్ఞానాభావము నూహించుటకు హేతువు సంభవింపనేరదు.

సుషుప్తియందు జ్ఞానముండినయెడల సుప్తోత్థితపురుషుడు (నిద్రనుండి మెలుకువ గాంచినవాడు) "నాకు సుషుప్తియందు జ్ఞానముగల" దని స్మరించెడిని. అట్లుస్మరింపకపోవుటవలన (స్మరణాభావమనెడి హేతువుచే) సుషుప్తియందు జ్ఞానాభావము కలదని యూహించుటకు వలనుపడు ననెదవా; అదియు సంభవము కాదు. జాగ్రదవస్థయందే గతదినమున నొకదానిని జూచియుండినను అది నేటి దినమున స్మరణకు రానంతమాత్రమున నావస్తువును నిన్నటిరోజున దెలిసికొన లేదనుటకు వీలుపడునా: వీలుపడదు. కనుక గతదివసమందు గలిగినజ్ఞానముయొక్క స్మరణ మిపుడు లేకున్నను గతదివసమందు జ్ఞానము కలదు. కనుక స్మరణాభావమనెడి హేతువు వ్యభిచారి యగుటంజేసి సుషుప్తియందు జ్ఞానాభావమును సాధింపనేరనందున సుప్తోత్థితపురుషునకు కలిగిన 'తావన్తం కాలం కిమపి నాజ్ఞాసిషం' (ఇంతకాలము సుషుప్తియందు నేనేమియు గుఱుతెరుగ) నను జ్ఞానము స్మరణరూపమే కాని యనుమితిరూపము కానేరదు.

జ్ఞానమును గలిగించెడి సామగ్రి లేనందున సుషుప్తియందు జ్ఞానము లేదనియు యూహించుటకు వలనుపడదు. అట్లైన-సుషుప్తియందు జ్ఞానము లేదని తెలిసికొనవి జ్ఞానసామగ్రి లేదని కదా తెలిసికొనతగినది? అట్టి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఆత్మకు వినాశము స్వయముగనా? (తనవలనా?) పరునివలనా? తన వల్లననిన ఘటమునకువలె (అవకాశముతో గూడునట్లుగ) నాకాశముచేత వ్యాప్తమైన యీ జంగమస్థావరాత్మక నిఖిలప్రపంచము సదా పరబ్రహ్మముచే వ్యాప్తమైనది. కనుకనే యా పరబ్రహ్మము స్వయముగా నాశనము లేనిదని గ్రహింపుము. ఆత్మకుం బరునివలన వినాశము ప్రాప్తించునే నన్నవా? వినాశమనునది సావశేషత్వ, నిరవశేషత్వములచే రెండు విధములు. (అనగా కొంత మిగిలియుండి నశించుట, అంతయు నశించుట అని యెట్లనిన? దేవదత్త దేహము ప్రాణములను విడనాడినపుడు నిరవ

జ్ఞానము లేదని తెలిసికొనుటకు ముందుగ జ్ఞానసామగ్ర్యభావమును తెలిసికొనవలెను. అనగా జ్ఞానాభావజ్ఞానమును గూర్చి జ్ఞానసామగ్ర్యభావజ్ఞానము కారణము. అట్టి జ్ఞానసామగ్ర్యభావమును గూర్చి జ్ఞానాభావజ్ఞానము కారణము కనుక - (వెఱ్ఱికుదిరినగాని పెండ్లి కుదరదు. పెండ్లికుదిరినగాని వెఱ్ఱి కుదరదనునట్లు) అన్యోన్యాశ్రయదోషము ప్రాప్తించును. అందువలన జాగ్రదవస్థయందు గలిగిన 'సుషుప్తియందు నేను దేనిని గుర్తెరుగను' అను జ్ఞానము స్మరణమే యని యొప్పుకొనవలయును.

ఈవిషయమునే అనగా జాగ్రదవస్థయందుగల 'నేను సుషుప్తియందు దేనిని తెలిసికొనలేదను స్మరణము వలన సుషుప్తియం దహంకారము లేకున్నను యహంకారవాసనావాసితం బగు నజ్ఞానమునకు భాసకమగు చైతన్యము కలదని "యద్వై తన్న పశ్యతి పశ్యన్వై తద్ద్రష్టవ్యం న పశ్యతి। నహి ద్రష్టుర్దృష్టేర్విపరిలోపో విద్యతే ఽవినాశిత్వాత్" అను శ్రుతియు బోధించుచున్నది.

ఈవిధముగనే "య ఏవ మయా ప్రాగజ్ఞాత స్స ఏ వేదానీం మయా జ్ఞాతః" (ఏఘటాదికము పూర్వమందు నాచే దెలియబడలేదో యట్టి ఘటాదిక మిపుడు నాచే దెలిసికొనబడె) నను ప్రత్యభిజ్ఞవలన ఘటాద్యజ్ఞానావభాసక మగు స్ఫురణయందే ఘటాదివిషయముగూడ గల్పితము.

ప్రామాణ్యమనగ నజ్ఞాతజ్ఞాపకత్వము (దెలియని దానిని దెలుపుట) యనిగదా సర్వశాస్త్రసిద్ధాంతము. ఇట్టి యజ్ఞాతజ్ఞాపకత్వనే ప్రామాణ్యమను నిశ్చయముచేతనే తార్కికులు దెలిసికొనిన పదార్థమును దెలుపు స్మృతి యొక్క వ్యావృత్తినిమిత్తమై 'యథార్థానుభవము ప్రమ' అను బ్రమాలక్షణమం దనుభవపదమును బ్రవేశపెట్టిరి కాన నీప్రామాణ్యము తార్కికులకుగూడ సమ్మతమే. కనుక నజ్ఞాతములగు ఘటాదులకు జ్ఞాపక మగుటంజేసి స్ఫురణాత్మక మగు నాత్మ ప్రమాణము.

అట్టి యాత్మయందే ఘటాదిప్రపంచము కల్పితము. చక్షురాదీంద్రియముల కజ్ఞాతత్వమును గలుగజేయుటయం దసామర్థ్య ముండుటంజేసి ఘటాదులయందుండెడజ్ఞాతత్వజ్ఞానము చక్షురాదీంద్రియములచే గ్రహింపబడదు. హేతువు లేమింజేసి యనుమానప్రమాణముచేతను గ్రహింపబడదు. ఇప్పుడు ఘటాదికము గ్రహింపబడుటచే ప్రాక్కాలమందు ఘటాదికమజ్ఞాతమని యూహింపదగు ననెదవా? ధారావాహికబుద్ధిస్థలమున (ఇది ఘటము, ఇదిఘటము, ఇది ఘటమని విరామము లేకుండగ ఘటజ్ఞానములు వరుసగ గలిగిన స్థలమందు) తృతీయజ్ఞానకాలము నవలంబించి యట్టి కాలమున జ్ఞాతత్వము ఘటమునందుండినను యాఘటము పూర్వకాలమందు (ద్వితీయజ్ఞాన సమయమందు) జ్ఞాతమే యగుటచే పూర్వకాలమం దజ్ఞాతత్వము లేమింజేసి "యిప్పుడు దెలియబడుటచే" అను హేతువు వ్యభిచారిగాన నట్టి హేతువుచే ఘటాదులయందుపూర్వకాలమునం దజ్ఞాతత్వమూహించుట సంభవింపదు.

"ఇదానీ మేవ జ్ఞాతత్వం" (ఇప్పుడే దెలియబడుట హేతు వనినచో ధారావాహికబుద్ధిస్థలమునందు

శాంకరభాష్యతత్త్వబోధిని:—

శేషముగ నశించును. ప్రాణము లుండినను దేవదత్తసంబంధమగు ధనము నశించినపుడు "దేవదత్తో నష్టః" దేవదత్తుడు నశించెనని యనెదరు. ఈనాశము దేవదత్తస్వరూపముండినను ధనసంబంధము నశించుటచే ప్రాప్తించునాశము సావశేషనాశము. ఇట్టి రెండు విధములగు నాశములలో నాత్మనాశము సావశేషనాశమా? నిరవశేషనాశమా? నిరవశేషనాశమనినచో నది యాత్మకు సంభవింపనేరదు.

---

ప్రథమద్వితీయజ్ఞానవిషయ మగుటం జేసి తృతీయజ్ఞానసమయమున నే ఘటము తెలియబడకుండుటచే నట్టి ఘటాదుల యందు 'ఇప్పుడే తెలియబడె' నను హేతువు లేమిం జేసి వ్యభిచారి కానందున "ఇదానీమేవ జ్ఞాతత్వం" (ఇప్పుడే తెలియబడుట) అను హేతువుచే ఘటాదులయం దజ్ఞాతత్వ మూహింపశక్యమగునందువా? అదియు సంభవింపనేరదు. ఏట్లనిన? "ఇప్పుడే తెలియబడుట" అన పూర్వమునందు దెలియబడక, ఇపుడు దెలియబడుట యని యర్థము. ఇందు పూర్వమునందు తెలియబడక యనునది విశేషణము. తద్విశిష్ట మగు విశేష్యమనగా 'ఇప్పుడే తెలియబడుట' యని యర్థము. అట్టి విశిష్టము హేతువనబడును. అందు 'తెలియబడుట' యను విశేష్యము పక్షమగు ఘటాదులయందు నవయవమున విశేషణమగు "పూర్వమునందు దెలియబడకపోవుట" అనునది సాధ్యముగాన నట్టి సాధ్యముతో గూడిన "ఇప్పుడు దెలియబడుట" అను హేతువే సంభవము కాదు. కాన 'నిపుడే తెలియుట' అనునది ఘటాదులయం దజ్ఞాతత్వము నూహించుటకు హేతువు కానేరదు. హేతుసాధ్యములకు సామానాధికరణ్యము (ఒకచోట నుండుట) సంభవము. కాన నట్టి హేతువు సంభవమగునందువా? అటులైన పక్షమగు ఘటాదులయందు "ఇప్పుడే తెలియబడుట" అను హేతుజ్ఞానమే ఘటాదులయందు "పూర్వమందు దెలియబడకపోవుట" అను సాధ్యనిశ్చయరూప మగుటంజేసి సిద్ధసాధనమనెడి దోషము ప్రాప్తించును. సిద్ధసాధన మనగ పక్షమందు సాధ్యనిశ్చయమున్నను సాధ్యమునూహించుటకు హేతువు పురస్సరముగ బ్రవర్తించుట.

"ఘటం న జానామ్యహం" (నేను ఘటమును గురు తెరుగ) సార్వజనీనానుభవమువలన భాసమానంబగునట్టియు, యజ్ఞాత మగునట్టి స్ఫురణమే స్వస్వరూపమునం దధ్యస్తమగు ఘటాదికమున భాసింపజేయుచున్నది. అటులైనచో ఘటాదుల కజ్ఞానమందు కల్పితత్వము సిద్ధించుచున్నది. ఘటాదు లజ్ఞానమందు కల్పితములు కానిచో ఘటాదులు జడములు గాన నట్టి ఘటాదుల కజ్ఞాతత్వము ఘటాదులయందుండు అజ్ఞాతత్వమునకు భావము లేకపోయెడిని. స్ఫురణము - తనయం దధ్యస్తమగు నజ్ఞానము చేతనే యజ్ఞాతమని శ్రీకృష్ణపరమాత్మ గూడ 'అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః' అని ముందు చెప్పంగలడు. ఈయుపన్యాసమువలన దేలిన యాశయమేమి? ఆత్మ విభు వని సిద్ధము. "మహద్భూత మనంత మపారం విజ్ఞానఘన ఏవ, సత్యం జ్ఞాన మనంతం" అను శ్రుతులగూడ జ్ఞానరూప మగు నాత్మ కనంతత్వమును, మహత్త్వమును దెలుపుచున్నవి. ఆత్మయందుండు మహత్వమన నేమనిన? తనయం దధ్యస్తమగు సర్వకార్యముల సంబంధము గలుగుట. అనంతత్వ మనగ దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యత్వమని గ్రహింపనగును. ఈ చెప్పుటవలన యధిష్ఠానము లేనిదే భ్రమ సంభవింపనందునను, ఒకదాని నొకదానియందె నిషేధించుట సంభవించును గాని అధిష్ఠానము లేనిదే నిషేధముగూడ సంభవింపనందునను (సర్వము శూన్య మనుటవలన సర్వనిషేధము గదా ప్రాప్తించును. అట్టి సర్వనిషేధమును యెచ్చట జెప్పవలెను? అధికరణ మంగీకరింపక నిషేధించుట యెట్లు సంభవించును? సంభవింపనేరదు. గృహమునందు ఘటము లేదని చెప్పుట సమంజస మగును గాని, అధికరణమున జెప్పక ఘటము లేదని జెప్పుట సమంజస మగునా? కాదు. అట్లే నిషేధాధికరణము లేనిదే "సర్వం శూన్యం" మని జెప్పుట యసంగత మగుటవలనను) సర్వము శూన్య మను-

శాంకరభాష్యతత్త్వబోధనః—

ఏలన ? సద్రూపబ్రహ్మము దేవదత్తశరీరమువలె వృద్ధిక్షయములు లేనిది. కనుకనే యవిక్రియము. కావుననే సద్రూపబ్రహ్మము శరీరాదులవలె స్వరూపముచే నాశములేనిది. (అనగా నిరవశేషనాశ మాత్మకు ప్రాప్తింపనేరదనుట.)

---

బౌద్ధైకదేశి యగు మాధ్యమికుని మతము తొలగింపఁబడెను. "ఆత్మయందే సర్వము నిషేధింపఁబడును. ఆత్మ సర్వనిషేధావశిష్టము సత్యమను విషయమును "పురుషాన్న పరం కించి త్సా కాష్ఠా సా పరా గతిః" అను శ్రుతియు జెప్పుచున్నది. ఇదేవిషయమును శ్రీమద్భగవద్భాష్యకారులును "సర్వం వినశ్య ద్వస్తుజాతం పురుషాన్తం వినశ్యతి। పురుషో వినాశ హేత్వభావా న్న వినశ్యతి" (నశించు నిఖిలదృశ్యప్రపంచము పురుషునివరకు నశించును. వినాశహేతువు లేమింజేసి పురుషుడు నశించడు అని జెప్పియుండిరి.

పురుషుడు నిత్యుడని జెప్పుటచే క్షణికవిజ్ఞానమే యాత్మయను బౌద్ధైకదేశియగు యోగాచార్యుని మతము నిరస్తము. క్షణికవిజ్ఞానమే యాత్మయన్నచో బాల్యమునందు యే నేను కందుకముతో క్రీడించితినో ఆ నేను వార్ధకమునందు మునిమనుమలను జూచుచుంటిని" అని బాల్యావస్థయందు వార్ధకమునందు నాత్మైకత్వమును దెలిపెడి ప్రత్యభిజ్ఞ కలుగకపోయెడిని. నిన్న ననుభవించిన పురుషుడు క్షణికమే యయినచో వానికే నేడు స్మరణము గలుగకపోయిడిని. కనుక నాత్మ నిత్యమే కాని క్షణికము కానేరదని క్షణికవిజ్ఞానవాదము నిర్యుక్తికమని గ్రహింపవలయును.

కనుక నేకము, సర్వానుస్యూతము, స్వప్రకాశస్ఫురణరూపము నగు సత్త సర్వవిధముల బరిచ్ఛేదశూన్యమగుటంజేసి "నాభావో విద్యతే సతః" సత్తున కభావము లేదని జెప్పుట మిక్కిలి సమంజసము.

శంకరానందీయము:— సత్తు సత్తనుచుంటివి. ఆ సత్తనునది (1) సామాన్యమా? (2) లేక, స్వరూపమా? సామాన్యరూపమగుచో సామాన్యము విశేషము నపేక్షించును. గాన విశేషములు కార్యము అగుటంజేసి ప్రళయకాలమునం దట్టి విశేషములు నశించుచుండ విశేషధర్మ మగుటంజేసి సామాన్యము కూడ నశించును. అందువల్ల సత్తు సామాన్యము కాదు. స్వరూపమేయందువా? అట్టి స్వరూపము (1) వ్యావృత్తమా? (2) అనువృత్తమా? వ్యావృత్త మందువా వ్యావృత్తము కల్పిత మగుటంజేసి స్వరూపమునకు నాశమే ప్రాప్తించును. అందువలన ననువృత్తమందువా? సర్వానువృత్తము సామాన్యమే కనుక నది విశేషము నపేక్షించియుండుటంజేసి విశేషములు ప్రళయకాలమందు నశించుచుండ సామాన్యము గూడ నశించునను పూర్వోక్తదోషమునకు దాదవస్థ్యమే ప్రాప్తించునను యాశంకయందు సత్తు సామాన్యవిశేషరూపము గానందున నాశము సంభవింపదని "అవినాశితు తద్విద్ధి యేన సర్వమిదం తతం" అను శ్లోకమును జెప్పుచుండెను.

"ఇదం" ఈపరిదృశ్యమానము, అవిద్యాకార్యము, అసద్రూపము నగు నిఖిలప్రపంచము "యేన" అతిసూక్ష్మము, విభువు నగు నే సద్రూపముచే మరుప్రదేశమందుండు సూర్యకిరణములచే జలప్రవాహమువలె "తతం" లోపల వెలుపల వ్యాప్తమైనదో "తత్" అట్టి సచ్ఛబ్దముచే జెప్పఁబడు వస్తువు "అవినాశి" ఏవిధముగ నసత్తు నశించునో యట్టి వినాశక్రియావిషయత్వమును బొందుట కనర్హమగు స్వభావము (సత్త) గలది. కనుక యవినాశి యనంబడును. అనగ నతిసూక్ష్మము, అతిమహత్తు యగుటంజేసి స్వయముగ వినాశక్రియ నతిక్రమించి నిత్యమే యగునని యర్థము.

ఆత్మ పూర్ణమగుటంజేసి గగనమువలె నిత్యమైనదను యనుమానప్రమాణ మాత్మకు నిత్యత్వమును సాధించుచున్నది. సర్వప్రకాశకమగు సూర్యు డుండినచో సర్వపదార్థములు గోచరించునట్లే దేహము దాత్మయుండినచో నట్టియుపలబ్ధికి యన్యథానుపపత్తి ప్రాప్తించునుగనుక నర్థాపత్తిప్రమాణముచే గూడ నాత్మకు నిత్యత్వము సిద్ధించుచున్నది.

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నిరవశేషనాశము ప్రాప్తింపకపోయినను ధనసంబంధమగు ధనహానిచే దేవదత్తునకు ప్రాప్తించిన సావశేషనాశ మెట్లు ప్రాప్తింపదనెదరా? నదియు దుర్ఘటమే.

దేవదత్తసంబంధధననాశనముచే దేవదత్తునకు సావశేషనాశము ప్రాప్తించినను, ఆత్మ

ఆత్మకు నాశమును జెప్పెడివారిని గూర్చి యిట్లు ప్రశ్నింపవలెను. ఎవనిన? (1) ఆత్మ స్వయముగ నశించునా (2) లేక వేఱొకదానిచే నశించునా? (3) లేక ఆశ్రయనాశముచే నశించునా? (4) లేక స్వసంబంధినాశముచే నశించునా? (5) లేక స్వకారణనాశముచే నశించునా? (6) లేక స్వకార్యముచే నశించునా?

సావయవమగు వస్తువు స్వావయవములు నశించుటచే నశించును. ఆత్మ నిరవయవము కనుక దానికి నవయవములే ప్రాప్తింపనందున నాత్మకు స్వతః నాశము ప్రాప్తింపనందున ప్రథమపక్షము నుపేక్షణీయము.

ఆత్మకంటె వేఱనెడి వస్తువుకూడ నాత్మస్వరూపమే యగుటచే నన్యగా నాత్మకంటె వేఱగు వస్తువు లేదు కనుక స్వనాశమును దానే హేతువనిన్నగును. అట్లైన నొకదానికే నాశకత్వనశ్యత్వములు ప్రాప్తింపకపోవుటచే వేఱొకదానిచే నాత్మకు నాశము ప్రాప్తించునను ద్వితీయపక్షము కూడ నిరస్తము.

"కస్మిన్ను భగవః ప్రతిష్ఠిత ఇతి స్వే మహిమ్ని" అను శ్రుతిచే నాత్మాతిరిక్తమగు నాశ్రయ మాత్మకు లేదని స్పష్టపడుటచే నాశ్రయనాశముచే నాత్మకు నాశమనెడి తృతీయపక్షముగూడ నిరస్తము.

సావయవమగు వస్తువులయందే సంయోగాది సంబంధములచే వేఱొకటి సంబంధించును. అట్టి సంబంధవిశ్లేషముచే నాద్రవ్యము నశించును. ఆత్మయన్ననో నిరవయవమగుటంజేసి సంయోగాది సంబంధములచే వేఱొక ద్రవ్య మాత్మయందు సంబంధింపనేరదు. కనుక నాత్మకు స్వసంబంధియే లేనందున స్వసంబంధినాశముచే నాత్మ నశించునను చతుర్థపక్షమూ సంభవింపనేరదు.

"న చాస్య కశ్చి జ్జనితా న విద్యతే" (నాత్మ పుట్టుటకు వేఱొక కారణము లేదు) అని శ్రుతిచే కారణము నిషేధింపఁబడుచుండుటచే కారణనాశముచే నాత్మ నశించునను పంచమపక్షము నిరస్తము.

"న తస్య కార్యం కరణంచ విద్యతే" అను శ్రుతిచే (నాత్మ కార్యమే లేదని) నిషేధింపఁబడుచున్న కార్యనాశముచే నాత్మ నశించునను షష్ఠపక్ష మపాస్తము.

కాన నేవిధమగను నాత్మకు నాశము లేనందున నాత్మ యవ్యయ మనఁబడును. అట్టి యవ్యయము, నిత్యసిద్ధసత్తాకమునగు బ్రహ్మము నభావమును జేయుటకుగాని, చెప్పుటకుగాని యేవాఁడును దగఁడు. అట్లైనఁ డైన నాత్మకభావమును జెప్పినచో తా నాత్మస్వరూపమే గాన స్వీయాభావమే ప్రాప్తించెడిని. ఇదియుఁగాక నాత్మాస్తిత్వమును జెప్పెడి బహుశ్రుతులకు, ప్రత్యక్షాది ప్రమాణములకు విరోధము ప్రాప్తించెడిని. కాన నాత్మక భావము నెవఁడు జెప్పలేడని యాశయము.

పరమార్థప్రపా:— పూర్వమందు జెప్పఁబడిన యుక్తులవల్ల సిద్ధమగు నర్థమను యీశ్లోకముచే జెప్పుచుండెను "యేన" అధ్యాసాశ్రయమగు నధికరణముచే నీదృశ్యప్రపంచమంతయు వ్యాపింపఁబడెనో యట్టి సద్వస్తువు యవినాశియని దెలిసికొనుము. శుక్తిక యసత్యమే యగుచో రజత మెటుల భాసించెడో యట్లే సత్యమగు నాశ్రయము లేనిచో అసత్యమగుజగము భాసింపనేరదు. కనుక నట్టి సద్రూపమవినాశియని తాత్పర్యము. కనుక నాశరహితమగు నాత్మకు వినాశమును నెవఁడును జేయుటకు సమర్థుడు గాఁజాలఁడు.

నీలకంఠీయము:— "దేని యభావమే లేదో యట్టి వస్తు కల దనుటలో ప్రమాణ మేమి?" అను నాశంకమీద నీశ్లోకము నను జెప్పుచున్నాఁడు. 'ఘటస్సన్' 'పటస్సన్' (ఘటము కలదు. పటము కలదు).

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సంబంధమగు వస్తువు లేమింజేసి యట్టి సావశేషనాశ మాత్మకు సమకూర్చుట జగదీశ్వరునకైన శక్యము కానేరదు. ఆత్మయనగ బ్రహ్మము. ఉరివలన స్వయముగ నాత్మ నశించు ననిన స్వాత్మయందు క్రియలేమింజేసి యాత్మయం దట్టి నాశముకూడ ప్రాప్తింపనేరదు. ॥౧౭॥

అని సర్వమునందు సదభేద మనుభవసిద్ధ మగుటచే "యేన సర్వ మిదం తతమ్" సత్పదార్థముచే నీయాకాశాది సర్వప్రపంచకము వ్యాప్తమైనది. 'ఘటో మృత్; శరావో మృత్' (ఘటము మట్టి, శరావము మట్టి) అను ఘటాదులయందు మృదభేదానుభవ ముండుటచే నట్టి ఘటాదులకు మృత్తు యెట్లుపాదానకారణమో, అట్లే, సర్వమును గూర్చి సత్తు ఉపాదానకారణమని తెలియదగును.

"అటులైన సత్తుగూడ మృత్తువలె వికారి కాదా?" అను శాశంకమీద "అవినాశితు తద్విద్ధి" (అసత్తును వినాశరహితముగ దెలిసికొనుము) అని చెప్పెను. అనగా నిట వినాశ మన ? పూర్వావస్థాపరిత్యాగము. మృత్తు పూర్వమందున్న పిండాకారత్వమును విడచి ఘటముగా నగుచున్నది. కాన నామృత్తు వికారధారాశ్రయమగుటచే వినాశస్వభావ (పూర్వావస్థాపరిత్యాగము) కలదియై యగుచున్నది. సద్రూపమగు బ్రహ్మమన్ననో యట్లుకాక రజ్జువవలె స్వయముగ నశించగనే కార్యాకార మగుచున్నది. కనుకనే స్వీయములగు సత్తాస్ఫురణములను గార్యమునం దర్పించుచున్నది. కనుక నాసద్రూపమగు నాత్మ వినాశరహితము. అట్లే "అజాయమానో బహుధా విజాయతే" (జనన మనెడి వికారమును బొందనివాఁ డయ్యును వియదాదిరూపమున యావిర్భవించుచున్నాడు) అనియు, "జాత ఏవ న జాయతే కో న్వేనం జనయే త్పునః" లోకదృష్టిచే పుట్టుకకల ఘటాదికము పరమార్థదృష్టిచే పుట్టుటలేదు. ఏలన? స్వాప్నికమృదాదికము జాగ్రదవస్థయం దెట్లు తుచ్ఛమో (లేనిదో) యటులే వ్యావహారికదశయం దున్న మృదాదికము పరమార్థదశయందు తుచ్ఛమే యగును. అట్టి మృదాదికమునకు ఘటాద్యుపాదానకారణత్వము సంభవింపదు. కనుక పరమార్థదృష్ట్యా పరిణామ్యుపాదానమే లేనందున ఘటాదికము పుట్టునది కాదని జెప్పఁదగును. అందుచే నట్టి ఘటాదికము నెవఁడు పుట్టించును? (ఎవఁడును పుట్టించలేఁడు) అటులైన నాఘటాదిక మెందుచే భాసించుచున్నదనివ? రజ్జుసర్పమువలె భాసించుచున్న దని యుత్తర మీయవలయు నను శ్రుతులు గూడ నాత్మ వినాశరహితమని జెప్పుచున్నవి 'తథా ప్రాణా వై సత్యం తేషా మేష సత్యం' (సత్తు సత్య మగుటచేతనే ప్రాణోపలక్షితమగు నీప్రపంచమునకు సత్యత్వము) అనియు, 'తస్య భాసా సర్వ మిదం విభాతి' (సత్తుయొక్క భావముచేతనే యీప్రపంచము భాసించుచున్నది) అనియు శ్రుతులచే ప్రపంచగతసత్తాస్ఫూర్తులే సత్తుయొక్క సత్త్వమం (ఉండుటయం) దుప్రమాణమని యర్థము. 'అన్నేన సోమ్య శుంగే నాపో మూల మన్విచ్ఛ అద్భిస్సోమ్య శుంగేన తేజో మూల మన్విచ్ఛ తేజసా సోమ్య శుంగేన సన్మూల మన్విచ్ఛ సన్మూలా స్సోమ్యేమాః ప్రజా స్సదాయతనా స్సత్ప్రతిష్ఠాః' అను శ్రుతియు గార్యరూపహేతువుచే జగత్తునకు జగదుపాదానత్వము స్థిరపరుచుచున్నది. వినాశమునకు హేతు వగున దేదియు సత్తునందు లేమింజేసి సత్తు వినాశరహితము' అని యుత్తరార్థముచే జెప్పుచున్నాడు. 'న వ్యేతి అపక్షీయత ఇత్యవ్యయః' (అపక్షయమును బొందరుగాన సత్తగు బ్రహ్మ మవ్యయ మనఁబడును) అపక్షయము జన్మాదిసర్వవికారములు కలవానికే ప్రాప్తించును గాన నిట యపక్షయము సర్వవికారోపలక్షణముగ గ్రహింపనగును. ఈచెప్పుటచే సర్వవికారశూన్యమగు సద్రూపబ్రహ్మమునకు నాశము లేదని యర్థము. అట్టి యవ్యయమునకు 'వినాశం న కశ్చిత్కర్తు మర్హతి' (ఎవఁడును వినాశమును జేయుటకు దగఁడు) 'న కశ్చిత్' అనుటచే 'ద్వితీయా ద్వై భయం' అను శ్రుత్యుక్తరీతిని సద్భిన్న మగున దేదియు లేమిగాన వినాశహేతువగు మరొకటేదియు లేదని సూచిత మైనది.

గీ॥ అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః ।
అనాశినోఽప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత! ॥ ॥౧౮॥

పదవిభాగము:— అంతవంతః- ఇమే- దేహాః- నిత్యస్య- ఉక్తాః- శరీరిణః- అనాశినః- అప్రమేయస్య- తస్మాత్ యుధ్యస్వ- భారత! । ॥౧౮॥

ప్రతిపదార్థము:— అనాశినః=నాశరహితంబైన; అప్రమేయస్య=ప్రమేయము కానట్టి; (జ్ఞానవిషయము కానట్టి) నిత్యస్య=నిత్యమైన; శరీరిణః=జీవునకు; అంతవంతః=నాశముకల; ఇమే=ఈ; దేహాః=దేహములు; ఉక్తాః=చెప్పఁబడినవి; తస్మాత్=జీవుడు నిత్యుడగుటవలన; హే భారత!=ఓ భరతాన్వయసంభూతుఁడవగు నర్జునుఁడా; యుధ్యస్వ=యుద్ధము జేయుము. ॥౧౮॥

శాంకరభాష్యము:—

(1) కిం పున స్తదస ద్య త్స్వాత్మసత్తాం వ్యభిచరతీతి, ఉచ్యతే— అంతవంత ఇతి । అంతవంతోఽన్తో వినాశో విద్యతే యేషాం తేఽన్తవన్తో యథా మృగతృష్ణికోదకాదా సద్బుద్ధి రనువృత్తా ప్రమాణనిరూపణాంతే విచ్ఛిద్యతే స తస్యా అంత స్తథేమే దేహాః । స్వప్నమాయాదేహాదివ చ్చాంతవంతో నిత్యస్య శరీరిణ శ్శరీరవతోఽనాశినోఽప్రమేయ స్యాత్మనోఽన్తవన్త ఇత్యుక్తా వివేకిభి రిత్యర్థః ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(1) సదసత్తులగు నాత్మ శరీరేంద్రియాదులలో యాత్మ యవ్యభిచారియగుటచే 'పరమార్థతః' సత్తని నిర్ధారణ చేయఁబడెను. అదేతీరున నసత్తు సత్తేయని నిర్ధారణ సేయఁబడినను నసత్తనగ శూన్యము కాదని నిర్ధారణముచేయు యావశ్యకము కాన స్వాత్మ సత్తను విడచు నసత్తన నేమియన? నిత్యుఁడును, నాశరహితుడు (పరిణామినిత్యుడు కానట్టియు) ప్రత్యక్షాద్యగోచరుడును, (దేహేంద్రియాదులకు గోచరుఁడు కానట్టియు) శరీరియగు జీవునకు మృగతృష్ణి

శ్రీధరీయము:— ఇంతవఱకు బూర్వగ్రంథముచే సత్స్వభావ మవినాశివస్తు వని సామాన్యముగ జెప్పఁబడెను. ఈశ్లోకమందు దానినే విశేషముగ జూపుచుండెను. 'యేన' వీసదూపముచే 'ఇదం' ఆగమాపాయములు గల యీ దేహాదికము 'తతం' తాత్సాక్షిగ వ్యాప్తమో "తత్తు" ఆ యాత్మ 'అవినాశి' నాశము లేదని 'విద్ధి' తెలిసికొనుము. ఈ విషయమునందే "వినాశ మవ్యయ స్యాస్య" అను యుత్తరార్థము హేతువు. ॥౧౭॥

—• ౨వ అధ్యాయము ౧౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— సదూపమగు స్ఫురణము దేహధర్మము. దేహ మనుక్షణము నశించుచుండ తద్ధర్మమగు సదూపస్ఫురణమున కవినాశిత్వ మెట్లు ప్రాప్తించు నను భూతచైతన్యవాదుల వాదమును నిరాకరించుటకు "నాసతో విద్యతే భావః" అను శ్లోకము నీశ్లోకమునందు వివరించుచున్నాఁడు.

'అన్తవన్తః' వృద్ధిక్షయరూపములు గలవగుటచే నశించు స్వభావముకల "ఇమే దేహాః" ఈ పరిదృశ్యమానములగు దేహములు (ఇట 'దేహాః' అను బహువచనస్వారస్యముచే సమిష్టివ్యష్టిరూపములగు విరాట్టు సూత్రాత్మ అవ్యాకృతము లనెడి స్థూల, సూక్ష్మ, కారణదేహములు గ్రహింపనగును.) ఇవి యన్నియు నిత్యము నవినాశియు,

శాంకరభాష్యమ్:—

(2) నిత్యస్యానాశిన ఇతి న పునరుక్తం, నిత్యత్వస్య ద్వివిధత్వాల్లోకే నాశస్య చ। యథా దేహో భస్మీభూతోఽదర్శనం గతో నష్ట ఇత్యుచ్యతే. విద్యమానోఽప్యన్యథా పరిణతో వ్యాధ్యాదియుక్తో జాతో నష్ట ఇత్యుచ్యతే తత్రానాశినో నిత్యస్యేతి ద్వివిధేనాపి నాశే నాస్య సంబంధోఽస్తీత్యర్థః ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కోదకాదులవలె దేహాదులు "దేహస్సత్" అను సద్బుద్ధిభాక్కులైననూ (దేహాదులయందు సద్బుద్ధి యనువృత్తమైనను) ప్రమాణములవలన నిరూపింప నంతమున నాసద్బుద్ధి లేమింజేసి దేహాదు లంతవత్తులు. (నాశముగలవి) ప్రవాహము ప్రవాహినికంటె వ్యతిరిక్తము కానందున దేహాదుల ప్రవాహము ప్రవాహియగు నాత్మకంటె వ్యతిరిక్తము కాదను శంకను దొలగించుటకే జీవునకు దేహాదు లనిత్యములని వివేకులచే నుడువబడెను.

(2) 'నిత్యస్య' అనుపదమునకు నాశములేనివాడనియర్థము. 'అనాశినః' అనుపదమునకు నాశము లేనివాడని యర్థము. ఒక పదముచేతనే నాశములేనివాడని సిద్ధించుచుండ నేకార్థమునుబోధించుటకు 'నిత్యస్య' 'అనాశినః' అను రెండుపదములను గీతయందు బ్రయోగించుట బునరుక్తిదోషమని యాక్షేపింపరాదు. నిరవశేషనాశమనియు, సావశేషనాశమనియు నాశము రెండువిధములు అందు దేహము భస్మీభూతమై కాన్పింపనపుడు దేహము నిరవశేష నాశముకలది. (అనగా కొంచెమైన మిగలకుండగ నశించుట) దేహముండినను రోగాదులచే జిక్కినపుడు దేహము నష్టమాయెనని

నాధ్యాసిక సంబంధముచే 'శరీరిణః' శరీరముగల్గినట్టియు స్వప్రకాశస్ఫురణరూపము, సజాతీయవిజాతీయస్వగతభేద శూన్యమునగు నాత్మయొక్క సంబంధముకలదియై దృశ్యములుగను. భోగ్యములుగను, శ్రుతులచేతను బ్రహ్మవేత్తలచేతను జెప్పబడుచున్నవి. ఈవిషయము నే తైత్తిరీయోపనిషత్తునందు అన్నమయ, ప్రాణమయ, మనోమయ విజ్ఞానమయా నందమయములనెడి యయిదుకోశములను గల్పనజేసి యట్టికోశముల కధిష్ఠానమగుబ్రహ్మ మకల్పితమని "బ్రహ్మ పుచ్ఛంప్రతిష్ఠా" అనువాక్యముచే జూపబడెను. అందు పంచీకృతపంచమహాభూతములు, తత్కార్యములు నగునట్టి మూర్తరాశియు స్థూలసమిష్టిరూపము నగు విరాట్టు యన్నమయకోశ మనబడును. అట్టి విరాట్టునకు గారణమగునట్టి యపంచీకృతపంచమహాభూతములు తత్కార్యములునగునట్టియు, సూక్ష్మసమిష్టియు, అమూర్తరాశియు నగు హిరణ్యగర్భుడు మాత్రాత్మయనబడును. "త్రయంవా ఇదం నామరూపం, కర్మ" అను బృహదారణ్యక వాక్యోక్తరీతిని కర్మతో గూడిన దగుటంజేసి క్రియాశక్తి ననుసరించి ప్రాణమయకోశమనియు, నామాత్మకమగుటంజేసి జ్ఞానశక్తిమాత్రము ననుసరించి మనోమయకోశమనియు, రూపాత్మకమగుటంజేసి క్రియాశక్తి జ్ఞానశక్త్యాశ్రయమగుటచే కర్తృత్వమును బట్టి విజ్ఞానమయకోశమనియుఁ జెప్పబడినందున ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయస్వరూపుడగు హిరణ్యగర్భుడు త్రికస్నాత్మకమగు లింగశరీరకోశ మనబడును. అట్టి లింగశరీరకోశ కారణ మాయోపహితచైతన్యరూపము సర్వసంస్కారశేషములుగల నవ్యాకృత మానందమయకోశ మనఁబడును. ఈసర్వశరీరములు యొక్కటిగ నాత్మయొక్క సంబంధముగలవి అని "తస్యైష ఏవ శారీర ఆత్మా యః పూర్వస్య" అను తైత్తిరీయశ్రుతి జెప్పుచున్నది.

శాంకరరభాష్యమ్:—

(౩) అన్యథా పృథివ్యాదివ దపి నిత్యత్వం స్యాదాత్మన స్త న్మాభూ దితి నిత్య స్యానాశిన ఇత్యాహ—అప్రమేయస్య న ప్రమేయస్య ప్రత్యక్షాదిప్రమాణై రపరిచ్ఛేద్య స్యేత్యర్థః ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

చెప్పబడును. ఇది సావశేషనాశము. (అనగా దేహము కొంచెము మిగిలి ప్రాణావశిష్టమై యుండుట) కాన నీరెండు నాశములలోను "నిత్యస్య" అను పదముచే నిరవశేషనాశము జీవునకు లేదనియు, "అవినాశినః" అనుపదముచే సావశేషనాశము లేదనియుఁ జెప్పబడుటవలన పునరుక్తి దోషము లేదు.

(౩) లేక, "నిత్యస్యానాశినః" అను రెండింటిలో నొకేవిశేషణము జీవున కన్నచోఁ బృథివ్యాదులవలె "జీవుడు పరిణామినిత్యుడు" అనునాశంక జనించును. అట్టి యాశంకను తొలఁగించుటకు "నిత్యస్య" "అనాశినః" అను రెండు విశేషణములు జీవున కీయబడినవి. కాన పునరుక్తిదోషము ప్రాప్తింపనేరదు.

లేక మూడులోకములందుగల సర్వప్రాణిసంబంధమాకల నీసర్వదేహములు నొక్కటగు నాత్మనుసంబంధించినవిగా జెప్పబడుచున్నవి. ఈవిషయముననే "ఏకో దేవ స్సర్వభూతేషు గూఢస్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా। కర్మాధ్యక్ష స్సర్వభూతాధివాస స్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" అను శ్రుతులుగూడ విభువు నిత్యుఁడు నగు నొక్కయాత్మకే సర్వశరీరసంబంధము గలదని జెప్పుచున్నవి..

నిత్యత్వమనగ యావత్కాల స్థాయిత్వము. వియదాదులవలె శరీరాదులు కాలముతో నశించినను యట్టి యావత్కాలస్థాయిత్వరూపనిత్యత్వము శరీరాదుల కప్రతిహతమను నాశంకను నొలగించుటకు "అనాశినః" అని జెప్పెను. దేశమువలన, కాలమువలన, వస్తువువలన బరిచ్ఛిన్నములగు నవిద్యాదులు కల్పితము లగుటంజేసి యావత్కాలస్థాయిత్వరూపమగు నౌపచారిక నిత్యత్వము ననుసరించి యవిద్యాదులు నిత్యత్వములని వ్యవహరింపబడుచుండెను. ఈవిషయముసే "యావ ద్వికారంతు విభాగో లోకవత్" (అధ్యా2 పా3 సూ7 అ1) బ్రహ్మసూత్రము గూడ బోధించుచున్నది. దేశమువలన, కాలమువలన, వస్తువువలన బరిచ్ఛేదశూన్యము అకల్పితము నగు నాత్మకు వినాశహేతువు లేమింజేసి ముఖ్యమగు కూటస్థనిత్యత్వము కాని యావత్కాల స్థాయిత్వరూపపరిణామి నిత్యత్వమాత్మకు లేదని యాశయము.

ఇట్టియాత్మ కలదనుటయందు ప్రమాణము జూపవలెను. అట్టిప్రమాణము లేనియెడల యాత్మనిష్ప్రమాణమగుటంజేసి శశశృంగాదులవలె నలీకమగును.అట్టిప్రమాణమునుజూపుటకే "శాస్త్రయోనిత్వాత్" (బ్ర.ప్ర-1 అధి_3సూ-3.) "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" (ఉపనిషద్వాక్యగమ్యుడు బ్రహ్మమను ప్రమాణము దెలుపు సూత్రగ్రంథసామగ్ర్యమువలన నాత్మకు వస్తుపరిచ్ఛేద మపరిహార్య) మను శంకకుసమాధానముగ "అప్రమేయస్య" అని జెప్పబడెను.

"ఏకధైవానుద్రష్టవ్య మేతదప్రమయం ధ్రువం" అప్రమయమప్రమేయం "న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాన్తి కుతో య మగ్నిః త మేవ భాన్త మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి" అను శ్రుతులవలన స్వప్రకాశచైతన్యరూప మాత్మయని సిద్ధమగుచున్నది. కాన నట్టిసర్వావభాసకమగు నాత్మకుతాను భాసించుట నిమిత్తమై తనచేఁ భాసింపబడు దానియపేక్ష సంభవింపదు. మరేమనిన?

శాంకరభాష్యమ్:—

నన్వాగమే నాత్మా పరిచ్ఛేద్యతే ప్రత్యక్షాదినా చ పూర్వమ్। న, ఆత్మన స్స్వతస్సిద్ధత్వాత్। సిద్ధే హ్యాత్మని ప్రమాతరి ప్రమిత్సోః ప్రమాణాన్వేషణా భవతి। నహి పూర్వమిత్థమహమిత్యాత్మాన మప్రమాయ పశ్చా త్ప్రమేయపరిచ్ఛేదాయ ప్రవర్తతే। న హ్యాత్మానామ కశ్చి దప్రసిద్ధో భవతి।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" అను శ్రుతివలన నాత్మ యుపనిషద్గమ్యుఁడగుచుండగా (అనగా నుపనిషద్వాక్యమువలన గలుగు ప్రమావిషయుఁడగుచుండ) నాగమప్రవృత్తికిం బూర్వమునందు బ్రత్యక్షాదులచే నాత్మను తెలిసికొనుటకు బ్రయత్నింప నట్టి యాత్మ తెలియఁబడనందున యాగమము అజ్ఞాతార్థజ్ఞాపకమగుచుండ నప్రమేయత్వ మాత్మ కెట్లు సంభవించుననిన?

"ఏతదప్రమేయం" ఈయాత్మస్వరూపము అప్రమేయము, (ప్రమావిషయము కాదు) అని శ్రుతిచే చెప్పుటవలన నాత్మ స్వతస్సిద్ధమగుటంబట్టి యప్రమేయము.

ప్రమాణము లేనిదే యాత్మ యెట్లు సిద్ధించుననిన? ప్రమాతయగు నాత్మ సిద్ధించినపుడు ప్రమేయమునుగూర్చి ప్రమిత్సువగు ప్రమాత ప్రమాణాన్వేషణము జేయును. (అనగా నెవడు వస్తుయాథార్థ్యమును తెలిసికొనగోరునో వాఁడే ప్రమాత. అట్టి ప్రమాతయే వస్తుయాథార్థ్యజ్ఞానమునకు హేతువగు ప్రమాణమును వెదకును పూర్వమునందు నేనిట్టివాడనని యాత్మస్వరూపమును దెలిసికొనక యెవడును వస్తుయాథార్థ్యమును దెలిసికొనుటకు బ్రవర్తింపఁడు. ప్రమాతయే లేనిచో నెవనికి ప్రమాణాన్వేషణము? కాన ప్రమాణాన్వేషణమునకు బూర్వము ప్రమాత సిద్ధించియేయుండును. ఎవనికిని యాత్మయనునది యప్రసిద్ధము కాదు. కాన ప్రమాణాన్వేషణమునకు బూర్వమునందు సిద్ధించినయాత్మ యప్రమేయమనక తప్పదు.

---

అజ్ఞానము, తత్కార్యములు తనయందు కల్పితములు. "యక్షానురూపో బలిః" (యక్షునకుదగినబలి నివ్వవలె) నను న్యాయానుసారము కల్పితములగు నవిద్యాతత్కార్యములకు గల్పితవృత్తి విశేషమే విరోధియగుటంబట్టి యజ్ఞానతత్కార్యములయొక్క నివృత్తికొఱకు గల్పితమగు వృత్తివిశేషము నాత్మయపేక్షించును. అట్టి వృత్తివిశేషము "తత్త్వమసి" అనునది మొదలగు వాక్యములవలననే జనించును గాన సర్వకల్పితనివర్తకవృత్తివిశేషోత్పత్తినిమిత్తము శాస్త్రమారంభింపఁబడెను. ఆత్మ స్వతః యెల్లప్పుడు భాసించుటచేతను, సర్వకల్పనాధిష్ఠాన మగుటచేతను యాత్మకు తుచ్ఛత్వము సంభవింపదు.

అవిద్యాతత్కార్యములు కల్పితము లెట్లగునో అట్లే 'ఏకమేవాద్వితీయం' 'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ' ఇత్యాది శాస్త్రము స్వప్రమేయానుసారము (స్వప్రమేయ మెటుల కల్పితమో అటులనే) తనకుగూడ కల్పితత్వమును దెలుపుచున్నది. అట్లు కానిచో నట్టిశాస్త్రమునకే ప్రామాణ్యము దుర్ఘటమయ్యెడిని. కల్పితమున కకల్పితపరిచ్ఛేదకత్వము సంభవింపదని పూర్వము జెప్పఁబడెను. ఆత్మకు స్వప్రకాశత్వము శ్రీశంకరభగవత్పాదులుగూడ

శాంకరభాష్యమ్:—

(4) శాస్త్రం త్వన్త్యం ప్రమాణ మతద్ధర్మాధ్యారోపణమాత్రనివర్తకత్వేన ప్రమాణత్వ మాత్మని ప్రతిపద్యతే న త్వజ్ఞాతార్థజ్ఞాపకత్వేన । తథా చ శ్రుతిః—"యత్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ, య ఆత్మా సర్వాన్తరః" (బృ. 3, 4, 1) ఇతి । యస్మా దేవం నిత్యోఽవిక్రియశ్చాత్మా తస్మా ద్యుధ్యస్వ యుద్ధా దుపరమం మా కార్షీ రిత్యర్థః । న హ్యత్ర యుద్ధకర్తవ్యతా విధీయతే । యుద్ధే ప్రవృత్త ఏవ హ్యసౌ శోకమోహప్రతిబద్ధ స్తూష్ణీ మాస్తే తస్య కర్తవ్యప్రతిబంధాపనయనమాత్రం భగవతా క్రియతే । తస్మా ద్యుధ్యస్వే త్యనువాదమాత్రం న విధిః ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(4) అనాత్మలగు దేహాదులు వ్యవహారదశయం దజ్ఞాతములు. అట్టి యజ్ఞాతదేహాదిగ్రాహకము లగుటంజేసి వ్యవహారదశయందు ప్రత్యక్షాదులు ప్రమాణములు కాన నంతఃకరణోపాధివిశిష్టులయందు యథాసంభవముగ ప్రత్యక్షాదిప్రమాణప్రవృత్తి యున్నను శుద్ధమునందు ప్రత్యక్షాది ప్రమాణములకు ప్రవృత్తి సంభవింపనేరదు. అయినను "ఆత్మా వా రే ద్రష్టవ్యః శ్రోతవ్యః" అను తద్ధితప్రత్యయశ్రుతిచే విధింపబడు వేదాంతశ్రవణవిషయమగు శాస్త్రమునకు శుద్ధమునందు ప్రవృత్తి సంభవించును. కాన బ్రహ్మము శాస్త్రజన్యప్రమావిషయుం డగుచుండగా నప్రమేయత్వ మెట్లు సంభవించునని యాక్షేపింపరాదు.

---

యుక్తివలన జెప్పియుండిరి. అది యెట్లనిన? "యత్ర జిజ్ఞాసో స్సంశయవిపర్యయవ్యతిరేకప్రమాణానా మన్యతమ మపి నాస్తి తత్ర తద్విరోధిజ్ఞాన మితి సర్వత్ర దృష్టమ్ । అన్యథా త్రితయాన్యతరాపత్తేః । ఆత్మని చాహం నాహం వేత్తి న కస్యచి త్సంశయః । నాపి నాహమితి విపర్యయః। వ్యతిరేకం ప్రమా వేతి" ఎచట జిజ్ఞాసువునకు సంశయవిపర్యయవ్యతిరేకజ్ఞానములయం దొకటైన నుండదో యచట తద్విరోధిజ్ఞానము కలదని నిశ్చయింపవలెను. అటులు కానిచో సంశయవిపర్యయవ్యతిరేకజ్ఞానములలో నేదైననొకటి యుండెడిని. అనగా నొకస్థాణువును జూచి "ఇది స్థాణువు" అను నిశ్చయమున్నచో "ఇది స్థాణువా? పురుషుడా" అను సంశయముగాని, "ఇది పురుషుడు" అను విపర్యయజ్ఞానముకాని, వ్యతిరేకప్రమకాని యుండదు. అట్లే యాత్మయందు "నేను నేనా? నేను కానా?" అను సంశయముకాని, "నేను నేను కాను" అను విపర్యయజ్ఞానముకాని, వ్యతిరేకప్రమకాని లేనందున సంశయవిపర్యయవ్యతిరేకములకు ధర్మియగు నాత్మయొక్క స్వరూపప్రమ (యథార్థజ్ఞానము) "ధర్మ్యంశే సర్వమభ్రాన్తం ప్రకారే తు విపర్యయః" అను న్యాయమున సర్వదా అందరికి కలదని నిశ్చయింపబడినది. కనుకనే "ప్రమాణ మప్రమాణం చ ప్రమాభాస స్తథైవ చ । కుర్వంత్యేవ ప్రమాం యత్ర తదసంభావనా కుతః" దేనియందు ప్రమనుగాని, అప్రమనుగాని, సంశయముగాని పొందెదరో అట్టి వస్తువులేదని జెప్పుటకు యెట్లు వీలుపడును? వీలుపడదు. కాన స్వప్రకాశము, సద్రూపము, ధర్మియు నగు నాత్మయందు ప్రామాణ్యాప్రామాణ్యముల విశేష మేమియు లేదని యాశయము.

బాహ్యపదార్థమునందు—క్లుప్తమగు విరోధిజ్ఞానము చేతనే సంశయాది ప్రతిబంధము సంభవించుచుండ అనగా స్థాణువునందు 'ఇది స్థాణువు' అను విరోధజ్ఞాన ముండినపు 'డిది స్థాణువా? పురుషుడా' అను సంశయము, 'ఇది

శాంకరభాష్యతత్త్వబోధిని:—

శాస్త్రముచే ప్రత్యగ్బ్రహ్మము చెప్పఁబడుటంజేసి ప్రమాత్రాదివిభాగము తొలఁగిపోవును. కాన శాస్త్ర మత్యంతప్రమాణము అపౌరుషేయ మగుటంజేసి నిర్దోషము; దోషరహిత మగుటచేఁ బ్రమాణము. అయినను బ్రత్యగాత్మ స్వతస్సిద్ధ మగుటవలన నవిషయుఁడు. అవిషయమగు ప్రత్యగాత్మయందు శాస్త్ర మెట్లు ప్రమాణమగు ననిన?

ప్రత్యగాత్మ స్వయముగా భాసించినను "మనుష్యోఽహం" కర్తాహం" "భోక్తాహం" అని యాత్మయందు దద్ధర్మములుకాని కర్తృత్వ, భోక్తృత్వాదు లారోపితములు. అట్టి యాత్మధర్మములుకాని కర్తృత్వ భోక్తృత్వాదులను "సిద్ధం తు నివర్తకత్వాత్" అను న్యాయమున శాస్త్ర మాత్మనుండి నివర్తింపఁజేయును. కాన నతద్ధర్మాధ్యారోపణమాత్రనివర్తక మగుటచే శాస్త్ర మాత్మవిషయమున ప్రమాణము.

---

పురుషుడు' అను విపర్యయజ్ఞానము కలుగదు. అట్టి సంశయవిపర్యయ (భ్రమ) జ్ఞానములకు 'ఇది స్థాణువు' అను నిశ్చయము ప్రతిబంధకము. కాన బాహ్యపదార్థ మగు స్థాణ్వాదులయందు క్లప్తవిరోధియగు 'ఇది స్థాణువు' అను జ్ఞానాదులచేతనే "ఇది స్థాణువా? పురుషుడా?" అను సంశయములయొక్కయు, 'ఇది పురుషుడు' అను విపర్యయముయొక్కయు ప్రతిబంధము సంభవించుచుండ ఆంతరపదార్థ మగు నాత్మయందు స్వభావభేదకల్పన (సంశయాదిప్రతిబంధకత్వకల్పన) న్యాయము కాదు. అటు అయినచో సర్వవిప్లవము ప్రాప్తించెడిని. కాన నాత్మ సర్వదా భాసమాన మగునేని "నాయందు ఘటజ్ఞానము కలిగినదా? లేదా" అను సంశయము సంభవించెడివి.

ఆత్మమనస్సంయోగమాత్ర మాత్మసాక్షాత్కారమును గూర్చి హేతువు. అట్టి యాత్మమనస్సంయోగము జ్ఞానమాత్రమునుగూర్చి హేతు వగుటంబట్టియు, ఆత్మమనస్సంయోగమువలన గలిగెడి జ్ఞానమునందు ఘటాదులు భాసించినను సమూహాలంబనన్యాయమున తార్కికసిద్ధాంతరీతి ననుసరించినను నాత్మభావముకూడ తప్పదు. అనగా ఘటజ్ఞానము కలిగినపుడాజ్ఞానమునందే యాత్మ భాసించు నని తార్కికులు యొప్పుకొనితీరవలయునని యాశయము.

అటులైనచో నాజ్ఞానము "ఘటమును నేను దెలిసికొనుచుంటిని" అనికదా. నేను అనునది యాత్మ; అట్టి యాత్మ ప్రత్యక్షమందు మానసత్వ మను ధర్మ ముండును. ఘటాదిప్రత్యక్షము చక్షురింద్రియమువలన గలుగును గాన దానియందు చాక్షుషత్వ మను ధర్మ ముండును. కాన నొకజ్ఞానమందే యాత్మఘటములు భాసించినచో నాజ్ఞానమందు మానసత్వచాక్షుషత్వము లనెడి ధర్మద్వయ ముండవలసివచ్చును. అటులైన నాధర్మములకు సాంకర్య మేర్పడెడిని. అట్లు సాంకర్యమంగీకరించినచో నాధర్మములు జాతులు కాకపోయెడిని. అని శంకింపఁజనదు. చందనఖండముతో చక్షురింద్రియమునకు సంబంధాదు లుండినపుడు 'ఇది చందనఖండము' అను ప్రత్యక్షము కలుగును. అట్టి ప్రత్యక్షము కలుగుటకు పూర్వమందు చందనఖండమునందుండు సౌరభస్మృతి గలిగినచో నా సౌరభస్మృతిసహకృతచక్షుస్సంయోగాదులవలన "చందనఖండం సురభి" (చందనఖండము సువాసనకలది) అను ప్రత్యక్షము జనించును. అట్టి ప్రత్యక్షము చందనఖండాంశమందు లౌకిక మనియు, సౌరభాంశమునందలౌకిక మనియు, జెప్పబడును. కాన నట్టి ప్రత్యక్షమునం దెట్లు "చందనఖండాంశముచే లౌకికత్వము, సౌరభాంశముచే నలౌకికత్వము" అనెడి రెండుధర్మము లుండునో అట్లే "ఘట మహం జానామి" (నేనుఘటమును దెలిసికొనుచుంటిని) అను జ్ఞానమందు "ఘటాంశముచే చాక్షుషత్వము, ఆత్మాంశముచే మానసత్వము" అను రెండు ధర్మము లుండుటయం దేమియు విరోధము లేదు. సాంకర్యమను దోషము ప్రాప్తింప దనెదవా!

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అజ్ఞాతములగు ఘటాదులయందువలె నాత్మ స్ఫురణాతిశయజనక మగుటచే శాస్త్ర మాత్మయందుఁ బ్రమాణ మెట్లు కానేరదని యాక్షేపింపరాదు. ఆత్మ "యత్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ, య ఆత్మా సర్వాన్తరః" (సర్వాంతరమగు నాత్మస్వరూపమైన పరబ్రహ్మము ప్రమాణాపేక్షను విడిచియే యపరోక్షస్ఫురణాత్మకము) అను శ్రుతివలన నపరోక్షరూపబ్రహ్మము స్వతస్సిద్ధ మగుటచే శాస్త్ర మాత్మయం దజ్ఞాతార్థజ్ఞాపక మగుటచేఁ బ్రమాణము కానేరదు. (అనగా తెలియఁబడని విషయమును దెల్పుటచే శాస్త్రము ప్రమాణమని చెప్ప నలవికాదు.)

కాన నాత్మ యప్రమేయమగుటచే నిత్యము; నిత్యమగుటంబట్టి యాత్మనాశశంక ననుసరించి శోకమోహావిష్టుఁడవై స్వధర్మమగు యుద్ధమును వదలుట యుక్తముకాదు. శరీరాదులు వస్తువులు కానేరవు. అంతవత్తులు అట్టి యవస్తువుల నుద్దేశించి శోకమోహావిష్టుఁడవై యుద్ధము బరిత్యజించుట న్యాయముకాదు. కాన యుద్ధమును జేయుము; యుద్ధమును బరిత్యజింపకుము.

సాంకర్యము జాతిబాధకము కానేర దని తార్కికులే యంగీకరించిరి. సాంకర్యము జాతిబాధక మన్నను చాక్షుషత్వమానసత్వాదులు జాతులు కావనియే తార్కికుల సిద్ధాంతము. కాన "ఘట మహం జనామి" అను నొక జ్ఞానమునందే ఘటము, ఆత్మయు భాసించును. ఈ జెప్పుటవలన వ్యవసాయమాత్రమున నాత్మ భాసించుటకు సామగ్రి సంభవించుచుండ ననువ్యవసాయ మనునది ప్రత్యేకముగ నంగీకరింపవలయు నను మతము నిరస్తము. అనగ మొట్టమొదట "ఇది ఘటము" అను జ్ఞానము కలుగును. దీనిని వ్యవసాయజ్ఞాన మని శాస్త్రజ్ఞులు వ్యవహరించెదరు. ఈజ్ఞాన మెట్టిదో తెలియవలె ననిన నాజ్ఞానానంతరమున "నేను ఘటమును తెలిసికొనుచుంటిని" అను జ్ఞానము కలుగును. దీనినే యనువ్యవసాయ మందురు, ఇట్టి యనువ్యవసాయముచే ప్రాథమికజ్ఞానము ప్రత్యక్షముగనో, అనుమితిగనో, లేక శాబ్దముగనో దెలిసికొనదగును. ఇట్టి యనువ్యవసాయమునందే ఆత్మ భాసించును. ప్రాథమికజ్ఞానము (వ్యవసాయము)నం దాత్మ భాసింపదు. కాన ననువ్యవసాయమనునది వ్యవసాయాత్మకజ్ఞానముకన్న భిన్నముగ నంగీకరించవలయు నని కొందరు చెప్పెదరు. పూర్వమందు చెప్పినరీతిని అనగా నాత్మ ప్రత్యక్షమును గూర్చియు ఘటాదిప్రత్యక్షమును గూర్చియు ఆత్మమనస్సంయోగము కారణమని జెప్పుటచే ఘటాదిప్రత్యక్షసామగ్రీకాలమున నుభయప్రత్యక్షసామగ్రి యుండుటవలన సమూహాలంబనాత్మకమగు "నేను ఘటమును తెలిసికొంటిని" అను ఘటాత్మకవిషయకవ్యవసాయాత్మకజ్ఞానము కలుగునని జెప్పుటవలన అనువ్యవసాయమనెడి జ్ఞానాంతరమంగీకరింపవలయునను మతము నిరస్తము. మఱియు ఘటము విషయము, ఘటాదిజ్ఞానము విషయి, ఘటమునందు విషయత్వముండుటయందు, ఘటాదిజ్ఞానమునందు విషయిత్వ ముండుటయం దారెంటియందు వైజాత్యము కలదు. ఎట్లనిన? ఘటమునందు ఘటత్వముండును. ఘటజ్ఞానమునందు జ్ఞానత్వముండును. ఈ రెండును భిన్నజాతులు. కాన ఘటత్వజాతి నవలంబించుకొని ఘటమునందు విషయత్వ ముండును. జ్ఞానత్వజాతి నవలంబించుకొని ఘటజ్ఞానమునందు విషయిత్వముండును. అదే విధమున "ఇది ఘటము" అనెడి వ్యవసాయజ్ఞానమునందు విషయత్వ ముండుటయందు "ఘటము నేను తెలిసికొంటిని" అనెడి యనువ్యవసాయజ్ఞానమునందు విషయత్వ ముండుటయందును వైజాత్యము జెప్పవలెను. అట్టి వైజాత్యము కానవచ్చుటలేదు. ఏలయన? "ఇది ఘటము," అనెడి వ్యవసాయమునందు జ్ఞానత్వమే యుండును. నేను ఘటమును తెలిసికొంటిని" అనెడి వ్యవసాయమునందు జ్ఞానత్వమే యుండును. అట్టి జ్ఞానత్వమునకు భేదము లేనందున వ్యవసాయానువ్యవసాయములయందు విషయత్వ విషయిత్వ వ్యవస్థాపక వైజాత్యము లేనందున అనువ్యవసాయమనెడి జ్ఞానాంతర మంగీకరింపవలయునను మతము దూరముగ నిరస్తము.

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఆత్మకు నిత్యత్వాదుల నుపపాదించి 'తస్మా ద్యుధ్యస్వ భారత!' యని యుద్ధకర్మను విధించుటచే జ్ఞానకర్మసముచ్చయ మీగీతయందు శ్రీకృష్ణభగవానునిచే నుడువబడెనని శంకింపరాదు.

ఈగీతయందు యుద్ధకర్తృత్వము విధించుటలేదు. మఱేమనిన? అర్జునుడు స్వధర్మమగు యుద్ధమునందు స్వతః ప్రవృత్తుడు. అట్టి విధమునఁ బ్రవృత్తుఁడైనను యుద్ధప్రారంభసమయమున సైన్యములను బరికించి "కథం భీష్మ మహం సంఖ్యే" అనునది మొదలు శోకమోహములచే యుద్ధమునందుఁ బ్రతిబద్ధుఁడై ఊరకుండెను. శ్రీకృష్ణపరమాత్మ యర్జునునకుగల యుద్ధప్రతిబంధాపనయనమును మాత్రము చేసెను. (అనఁగా యుద్ధమునకుఁ బ్రతిబంధకమగు శోకమోహముల నివృత్తిని శ్రీకృష్ణపరమాత్మ చేసెను.)

---

వ్యవసాయాత్మకజ్ఞానభావమునిమిత్తమను వ్యవసాయము నంగీకరింపవలయుననెదవా? అదియుసంభవముకాదు. ఏలన? దీపము తనకన్న భిన్నమగు పదార్థములను భాసింపజేయును. తనచే తానుభాసించును కాని తాను భాసించుటకు వేఱొక దీపము నెట్లపేక్షింపదో అట్లే వ్యవసాయాత్మకజ్ఞానముగూడ స్వవిషయమగు ఘటాదివ్యవహారమునకు హేతువగుచు స్వవ్యవహారమునకుగూడ హేతువగును. కాన వ్యవసాయాత్మకజ్ఞానవ్యవహారార్థ మనువ్యవసాయాత్మకజ్ఞాన మంగీకరింపనవసరము లేదు.

వ్యవహారమునందు వ్యవహర్తవ్యజ్ఞానము కారణము. అనగా "నిదిఘటము." అను శబ్దప్రయోగమునుగూర్చి వ్యవహర్తవ్య (ఘటశబ్దార్థ) మగు ఘటముయొక్క జ్ఞానము కారణము. (ఘటజ్ఞానములేనిదే "ఇదిఘటము" అనెడి శబ్దప్రయోగము సంభవింపనేరదనుట) అదేవిధమున ఘటజ్ఞానమును వ్యవహరించుటకు తజ్జ్ఞానరూపానువ్యవసాయాత్మకవ్యవహర్తవ్యజ్ఞాన మపేక్షితముకాన ననువ్యవసాయ మంగీకరింపవలయు నని శంకింపవలదు.

వ్యవహారమునుగూర్చి వ్యవహర్తవ్యజ్ఞానము కారణ మను విషయమంగీకార్యమే. కాని వ్యవహర్తవ్యజ్ఞానరూపకారణము వ్యవహర్తవ్యభిన్నముకావలెననునియమములేదు. అటులైనచో వ్యవహారమునుగూర్చివ్యవహర్తవ్యభిన్నమగు వ్యవహర్తవ్యజ్ఞానపురస్సరముగ గారణత్వము జెప్పవలసివచ్చును. అట్టిధర్మము గురుధర్మమగును. అట్టిధర్మముకన్న లఘువగు వ్యవహర్తవ్యజ్ఞానత్వధర్మపురస్సరముగనే కారణత్వము—(లఘుధర్మపురస్సరముగ గారణత్వము సంభవించుచుండ గురుధర్మపురస్సరముగ గారణత్వము జెప్పవలదను నియమానుసారము) చెప్పవలెను. కాన లఘుధర్మ మగు వ్యవహర్తవ్యజ్ఞానత్వము—స్వప్రకాశ మగుటంజేసి వ్యవహర్తవ్యమగు ఘటజ్ఞానమునందు కలదు. అందుచేవ్యవహర్తవ్యజ్ఞానత్వధర్మపురస్సరముగ ఘటజ్ఞానరూపమగు వ్యవసాయ (జ్ఞాన)ము ఈశ్వరజ్ఞానమువలె, యోగిజ్ఞానమువలె, "ప్రమేయం" అను జ్ఞానమువలె స్వవ్యవహారమునుగూర్చి హేతువగుచుండ ఘటజ్ఞానవ్యవహారనిమిత్త మనువ్యవసాయ మంగీకరింపవలయునను యుక్తి దూరతః నిరస్తము.

అనువ్యవసాయమనెడి జ్ఞానాంతరముకల దనువారినిగూర్చి యిట్లు ప్రశ్నింపవలయును. అనువ్యవసాయజ్ఞానము ఘటజ్ఞానవ్యవహారమునుగూర్చి ఘటజ్ఞానత్వధర్మపురస్సరముగ హేతువా? లేక ఘటజ్ఞానజ్ఞానత్వధర్మపురస్సరముగ హేతువా? అని. ఉభయమం దుండునది జ్ఞానత్వమే. కాన నాధర్మద్వయము ఘటజ్ఞానమందే సంభవించుచుండ నారెంటిలో లఘుధర్మమగు ఘటజ్ఞానత్వపురస్సరముగనే ఘటజ్ఞానవ్యవహార ముపపన్న మగుచుండ ఘటజ్ఞానవ్యవహారార్థ మనువ్యవసాయాత్మకమగుఘటజ్ఞానము నంగీకరింపవలయునను వాదము నిర్యుక్తము.

కనుకనే వ్యవసాయజ్ఞానమువలననే (ఘటాదిజ్ఞానమువలననే) ఘటవ్యవహారము, ఘటజ్ఞానవ్యవహారము గలుగునను విషయమును "మితి, మాతృ, మేయ మేతత్త్రితయం వ్యవసాయే భాసతే" (జ్ఞానము, జ్ఞాత, పదార్థము

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఇచట దత్త్వమిది. అపూర్వవిధి, నియమవిధి,పరిసంఖ్యావిధి యని విధి మూడువిధములు అందు అపూర్వవిధి యనగ కాలత్రయమునందు నితరప్రమాణములచేఁ బ్రాప్తింపనిదానిని విధించునది యపూర్వవిధి. "వ్రీహీన్ ప్రోక్షతి" క్రతువునఁ బురోడాశమునకు వ్రీహులను (ధాన్యమును) యుదకముచే బ్రోక్షణము సేయవలెను. తండుల (బియ్యము) నిమిత్తము ధాన్యమును దండుపుట యేకాలమునందు నేప్రత్యక్షాదులచేతను సిద్ధము కాదు. అట్టి యపూర్వ మగు ప్రోక్షణమును "వ్రీహీన్ ప్రోక్షతి" అను విధివాక్యము విధించుచున్నది. ఆవిధముగా నర్జునునకు యుద్ధము ప్రమాణాంతరముచేఁ బ్రాప్తింపనియెడల "తస్మాద్యుద్ధ్యస్వ భారత!" అనువాక్యముచే యుద్ధము విధింపబడుచున్నదని చెప్పుటకు వీలగును. యుద్ధము క్షత్రియున కవశ్యకర్తవ్యమగు కర్మ అట్టి కర్మ మానాంతరముచే బ్రాప్తమైయుండ "తస్మాద్యుద్ధ్యస్వ భారత!" అనునది యపూర్వవిధి కానేరదు.

---

అనెడి యీత్రితయము వ్యవసాయ (జ్ఞాన)మునందు భాసించును) అనెడి త్రిపుటీప్రత్యక్షవాదులగు ప్రాభాకరు లంగీకరించిరి.

వేదాంతు లన్నచో ఆత్మ స్వప్రకాశజ్ఞానరూపము కాని జ్ఞానాశ్రయము కాదని జెప్పెదరు. అట్లు కాక జ్ఞానాశ్రయమే యన్నచో కర్తృకర్మవిరోధముచే (కర్తృత్వకర్మత్వము లొకదానియం దుండకపోవుటచే) నాత్మభానము లేకపోయెడిని. మఱియు నాత్మ జ్ఞానముకన్న వేఱగుచో జ్ఞానభిన్నము జడమగుటంజేసి యాత్మ జడమయ్యెడిని. అటులైనచో జడము కల్పితము కాన నాత్మ కల్పితము కావలసివచ్చును. కాన నాత్మ జ్ఞానస్వరూపమే యని యంగీకరింపవలయును.

ఆత్మ స్వప్రకాశజ్ఞానస్వరూప మైనను విద్యోపహితమై సాక్షియనియు, వృత్తిమదంతఃకరణోపహితమై ప్రమాత యనియు, యనంబడును. అట్టియాత్మకు చక్షురాదులు కరణములు. అట్టి యాత్మ చక్షురాదిద్వారమున నంతఃకరణపరిణామముతో ఘటాదులను వ్యాపించి తదాకార మగును. ఒక్క యంతఃకరణపరిణామమునందే ఘటావచ్ఛిన్నచైతన్యము, అంతఃకరణావచ్ఛిన్నచైతన్యము కలిసికొనును. అనంతరము ఘటావచ్ఛిన్నచైతన్యము యంతఃకరణావచ్ఛిన్నచైతన్యస్వరూప మగుటంజేసి ఘటాజ్ఞానమును నశింపజేసి ప్రత్యక్షరూప మగును. అట్టి ప్రత్యక్షము స్వావచ్ఛేదక మగు ఘటమును స్వతాదాత్మ్యాధ్యాసమువలన భాసింపజేయును.

అంతఃకరణపరిణామమునకు వృత్తి యనిపేరు. అట్టి వృత్తి యతిస్వచ్ఛమైనది. అట్టి వృత్తి స్వావచ్ఛిన్నమగు చైతన్యముచేత భాసించును. కాన నంతఃకరణమునకు తద్వృత్తికి, ఘటమునకును యపరోక్షత్వముసంభవించును. ఇట్టి యాకారత్రయమే "ఘట మహం జానామి" (నేను ఘటమును దెలిసికొనుచుంటిని) అనునది.

భాసకమగు చైతన్య మేకరూపమైనను ఘటమును భాసింపజేయుటకు వృత్త్యపేక్ష కలదికాన ప్రమాత యనఁబడును. అంతఃకరణతద్వృత్తులను భాసింపజేయుటయందు వృత్తి నపేక్షింపకపోవుటచే సాక్షియనంబడును. ఈవిషయ మద్వైతసిద్ధియందును, సిద్ధాంతబిందువునందును విస్తారముగఁ జెప్పఁబడెను.

కాన బూర్వమునందు జెప్పబడినవిధమున నాత్మ నిత్యము. విభువు, అసంసారి యెల్లపు డేకరూపమగుటంజేసి స్వధర్మమగు యుద్ధమునందు బ్రథమమున బ్రవృత్తుడవగు నీవాత్మనాశశంకచే నాయుద్ధమునుండి విరతుఁడ వగుట యుక్తము కాదని యుద్ధమునం దర్జునున కభ్యనుజ్ఞచే శ్రీకృష్ణభగవానుడు "తస్మాద్యుద్ధ్యస్వ భారత!" అని చెప్పెను.

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నియమవిధి యనఁగఁ బక్షమునం దప్రాప్తమగు నంశమును బరిపూర్ణముసేయు విధి నియమవిధి యనంబడును. అది యెట్లనిన ? బురోడాశమును జేయుటకు తీసుకొనిరాఁబడిన వ్రీహుల (ధాన్యము) నుఁ బ్రోక్షణము సేసినపిదప 'హ్రీహీ నవహంతి' వ్రీహులను దంచవలెను. అను విధివాక్యముచేఁ దండులనిష్పత్తికి దంచుట విధింపఁబడెను. ఇచట దండులనిష్పత్తి యనునది దంచుటవలనను గలుగును. నఖముల (గోళ్ళ)చే విదళించుటవలనను ప్రాప్తించును. కాన బురోడాశమున కుపయోగించు తండులనిష్పత్తి నఖవిదళనముచే బ్రాప్తించినచో నవహననము (దంపుట) పక్షమున నప్రాప్త మగును. అట్టి యప్రాప్తాంశమగు నవహననమును (దంపుటను) "వ్రీహీ నవహంతి" అను విధివాక్యము విధించుచున్నది. నఖవిదళనమువలనఁ దండులనిష్పత్తి

---

స్వధర్మమగు యుద్ధమునం దర్జునుఁడు బ్రవృత్తమయినను శోకమోహములచే నట్టి యుద్ధమునుండి విరతుఁడాయెను. అట్టి శోకమోహములు విచారమువలన బుట్టిన జ్ఞానముచే బాధితములు కాన "అపవాదాపవాదే ఉత్సర్గస్య స్థితిః" ఉత్సర్గమున కపవాదము జెప్పి యట్టి యపవాదమున కపవాదము జెప్పినయెడల ఉత్సర్గమే ప్రాప్తించును. అది యెట్లనిన? ఒకనిగూర్చి నీవు సర్వదేశములయందు దిరుగు మనునది ఉత్సర్గము. రాజమహేంద్రవరమున బజారుకు పోవల దనునది అపవాదము. ఈవేషము మార్చుకొని పోవచ్చు ననునది అపవాదాపవాదము. అట్టి యపవాదాపవాదము బ్రాప్తించినపు డుత్సర్గము ప్రాప్తించును. అనగా నీ వాబజారునకు కూడ యీవేషము మార్చుకొని బోవచ్చు నని యభ్యనుజ్ఞ బ్రాప్తించును. అట్లే యర్జునుఁడు యుద్ధమునందు బ్రథమము బ్రవృత్తుఁడయ్యెను. అట్టి యుద్ధమున కపవాదమున శోకమోహములు బ్రాప్తించెను. శ్రీకృష్ణుని యుపదేశమువలన తదపవాదమగు శోకమోహములు దొలగింప నుత్సర్గన్యాయమున యుద్ధమున కభ్యనుజ్ఞమాత్ర మిందు జూపఁబడెను. కాని యుద్ధకర్తవ్యతను విధించుటలేదు.

కొందఱు "యుద్ధ్యస్వ" అని యుద్ధమును విధించుటచే జ్ఞానకర్మసముచ్చయమువలననే మోక్షము సిద్ధించునుగాని కేవలజ్ఞానమువలన మోక్షము సిద్ధింపదని ప్రేలుచుండిరి. "యుద్ధ్యస్వ" అను పదముచే యుద్ధకర్తవ్యత్వము బోధింపబడును కాని, మోక్షము జ్ఞానకర్మసముచ్చయసాధ్య మని బోధింపబడుటలేదు. కాన జ్ఞానకర్మసముచ్చయము నిర్యుక్తిక మని గ్రహింపనగును. ఏటుల కర్మజ్ఞానసముచ్చయము గ్రహించుటకు వలనుపడదో యటులనే శ్రీభగవద్గీతావచనవిరోధప్రదర్శనపూర్వకముగ మున్ముందు విస్తరముగ జూపఁగలము.

శంకరానందీయము:— 'అశోచ్యా నన్వశోచస్త్వం' అను గీతయందు "త్వంపదవాచ్యార్థ మగు దేహేంద్రియాదులు జన్మాదులు గలవిగాన ననిత్యము లగుటంజేసి యశోచ్యములు, త్వంపదలక్ష్యార్థ మగు నాత్మ స్వయముగ నజ మగుటంజేసి నిత్య మగుటచే నశోచ్యము" అని శరీరాత్మ లశోచ్య మగుటయందు యేశరీరాత్మ అనిత్యనిత్యములను జ్ఞానము హేతువుగ జూపఁబడెనో 'శరీర మనిత్యము, ఆత్మ నిత్యము' అనునట్టి జ్ఞానము నిచట స్పష్టపరచుచు నట్టి జ్ఞానముచే నివృత్తమగు శోకమోహములు గలవానినిగ నర్జునుని గురుతించి యట్టి యర్జునుఁడు పూర్వ మేయుద్ధమునందు బ్రవృత్తుఁ డయ్యెనో యట్టి యుద్ధమునందే యర్జునుని శ్రీకృష్ణపరమాత్మ "అంతవంత ఇమే దేహాః" అను శ్లోకముచే బ్రోత్సహించుచుండెను.

'అప్రమేయస్య' ప్రత్యక్షానుమానోపమానశబ్దాదిప్రమాణములచే దెలిసికొనుటకు శక్యము కానిది ఎట్లనిన లోకమునందు శబ్దస్పర్శరూపరసగంధములలో నేదైన నొకటిగల వస్తువు ప్రత్యక్షప్రమాణములగు నింద్రియములచే

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నైయెనను పురోడాశమున కుపయోగించు తండులనిష్పత్తి యవహననము (దంపుట) చేతనే చేయవలె నని నియమవిధి. ఒక కార్యమునుగురించి స్వతంత్రముగఁ గారణద్వయము ప్రాప్తించునపు డవశ్యమగు హేతువు పక్షమునఁ బ్రాప్తించునపుడు దానిని సంపాదించువిధి నియమవిధి యని సారాంశము.

ప్రకృతమున నవశ్యము సాధింపదగిన యుద్ధరూపకర్మను సాధించుటకు స్వతంత్ర మగు హేతుద్వయము ప్రాప్తించునపుడు ముఖ్యమగు హేతువు సాత్త్వికము కాఁగా నద్దానిని సంపాదించు

తెలిసికొనదగును. ఆత్మ—"అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం తథాఽరసం నిత్య మగంధవత్" అను శ్రుత్యుక్త రీతిని శబ్దాదివిహీనమగుటచే బ్రత్యక్షప్రమాణముచే దెలియబడదు. అట్లే 'నైవ చ తస్య లింగం' అను శ్రుతి ననుసరించి యాత్మనూహించుటకు దగు హేతు వేదియు లేనందున ననుమానప్రమాణముచేగూడ నాత్మను నూహించుటకు వలనుపడదు. అట్లే "హేతుదృష్టాంతవర్జితం" అను శ్రుత్యుక్తరీతిని దృష్టాంతము లేమింజేసి యాత్మను—దృష్టాంతపురస్సరముగ దెలిసికొనుటకు వీలగు నుపమానప్రమాణముచేగూడ దెలిసికొనుటకు వీలులేదు. అట్లే "యత్తదద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణం" అను శ్రుత్యుక్తరీతిని నామరూపజాత్యాదివిహీన మగుటంజేసి యాత్మ— నామరూపజాతిక్రియాపురస్సరముగ వస్తువునుబోధించు శబ్దమువలనగూడ దెలియబడదు.

"తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" అను శ్రుతి యాత్మ యుపనిషద్గమ్యు డని బోధించుచుండ శబ్దముచే నాత్మ బోధింపదని జెప్పుట యెట్లు సమంజస మగు ననిన? శబ్దప్రవృత్తికి హేతువులగు జాతిగుణక్రియలు లేమింజేసి శబ్దముచే నాత్మ జెప్పఁబడదు. కనుకనే— "యతో వాచో నివర్తంతే" అను శ్రుతి యాత్మ వాక్కున కగోచరమని జెప్పుచున్నది. అటులైన నాత్మను బోధించునట్టి శ్రుతులు యప్రమాణములు కావలసివచ్చు ననెదవా? అట్లు కానేరవు. శ్రుతులు ఆత్మయం దధ్యస్తమగు నశేషవిశేషములను దొలగించి యధిష్ఠానము, సన్మాత్రము, నిర్విశేషమునగు నాత్మను దెలుపును. కాన శ్రుతి యప్రమాణము కానేరదు. ఆత్మ సవిశేషముగ (కర్తృత్వభోక్తృత్వధర్మములు కలదిగ) జ్ఞాతమైనను యాత్మయం దుండు నిర్విశేషత్వ మజ్ఞాతమగుటచే నట్టి యజ్ఞాతనిర్విశేషత్వజ్ఞాపక మగుటంజేసి శ్రుతి ప్రమాణము. అయినను "ఆత్మ యిది" అని సాక్షాత్తు నిర్దేశించుటకు వీలుపడనందున శ్రుతికి యాత్మ విషయము కానేరదు.

మఱియు ఆత్మవిషయమునం దన్యథానుపపత్తి లేనందున నర్థాపత్తిప్రమాణముచేతను యాత్మ బోధింపబడదు. అనుపలబ్ధి యనగ బ్రతియోగ్యనుపలబ్ధ్యభావము. అది యభావప్రత్యక్షము గలిగించును. ఎట్లనిన? ఘటాభావముండుప్రదేశమున నాయభావమునను బ్రతియోగియగు ఘటప్రత్యక్ష ముండనేరదు. అనగా బ్రతియోగ్యనుపలబ్ధ్యభావమే యుండును. కాన నట్టి ప్రతియోగ్యుపలబ్ధ్యభావరూపానుపలబ్ధిప్రమాణము చక్షుస్సహకృతమై ఘటాభావప్రత్యక్షమును గలిగించును. అనగా యనుపలబ్ధిప్రమాణమువలన నియతముగ నభావప్రత్యక్షమే కలుగును. ఆత్మ భావపదార్థము, అభావరూపము కాదు. కాన నాత్మప్రత్యక్షమును యనుపలబ్ధిప్రమాణము గలిగింప నేరదు.

"యతో వాచో నివర్తంతే" అను శ్రుత్యనుసారము వాగవిషయ మగుటంజేసి యైతిహ్య మను ప్రమాణము గూడ నాత్మను బోధింపనేరదు.

స్వప్రమాణములకు ప్రమేయములకు దేనివలన ప్రామాణ్యము సిద్ధించుచున్నదో యట్టి యాత్మను యే ప్రమాణము బోధించును ? ఏప్రమాణము బోధింపనేర దని యాశయము. ఈవిషయమునే "విజ్ఞాతారమరే! కేన విజానీయాత్" అను శ్రుతియు బోధించుచున్నది.

శాంకరభాష్యతత్త్వబోధిని:—

టకు గదా! నియమవిధి ఇచట నట్లులేదు. "తస్మాద్యుద్ధ్యస్వ భారత!" అని ప్రకృతయుద్ధమే చెప్పఁబడెను. కాని దానిని సాధించు మఱియొక హేతుప్రసక్తియే లేదు. కాన 'తస్మాద్యుద్ధ్యస్వ భారత!' అనునది నియమవిధి కానేరదు.

పరిసంఖ్యావిధి యనగ ఒక వికృతికార్యమున "ప్రకృతివ ద్వికృతిః కర్తవ్యః" ప్రకృతి వలెనే వికృతిఁగూడఁ జేయవలె నను న్యాయానుసారము ప్రకృతియందుండు కొన్నిసాధనములు వలె నితరసాధనములుగూడ బ్రాప్తించుచుండ వానిని నిషేధించుటకు జెప్పఁబడిన విధి పరిసంఖ్యావిధి. అదియెట్లనిన? గృహమేధీయేష్టి యని యొకయాగము. నాయాగమును విధించుచు తత్ప్రకరణమున "ఆజ్యభాగౌ జుహోతి" ఆజ్యభాగములను హోమముల జేయవలె నని

---

కాన దనయం దధ్యస్త మగు సర్వప్రమాణప్రమేయములయొక్క సద్భావాసద్భావములకు బ్రకాశక మగుటవనను, స్వప్రకాశ మగుటవలనను యాత్మకు స్వతః ప్రామాణ్యము సంభవించును. కాని మఱియొకదాని వలన ప్రామాణ్యము సంభవింపనేరదు.

కనుకనే యాత్మ యప్రమేయ మనఁబడును. అందుచేతనే నాశరహితము (పరిచ్ఛేదశూన్యము) అనంతమని యాశయము. అట్టిది కనుకనే యాత్మ నిత్యము.

పరిచ్ఛిన్నమగు బరమాణువుగూడ నిత్య మగుచుండ నపరిచ్ఛిన్న మగుటచే నాత్మనిత్యమని జెప్పుట యెట్లు సమంజస మగునని శకింపజనదు. "సర్వగత శ్చ నిత్యః. యోవై భూమా తదమృతం" అను శ్రుతులచే నపరిచ్ఛిన్నము సర్వగతము నగు వస్తువే నిత్యమని బోధింపబడుటవలన బరిచ్ఛిన్నమగు బరమాణువు నిత్యము కానేరదు. మఱియు 'యదల్పం తన్మర్త్యం' అనుశ్రుతి యల్పమగునది నశించునని బోధించుచుండ నల్పమగు బరమాణువు నిత్యమని జెప్పుటకు బ్రమాణములేదు. కాన నల్పమగు బరమాణువు నిత్యమేయని గ్రహింపవగును.

"శరీరిణః" బ్రహ్మమొదలు స్తంబపర్యంతమగు శరీరము లెవని కుపలబ్ధిస్థానములుగ గలవో అట్టి సర్వప్రాణిశరీరోపాధికుడగు నాత్మ యొక్కటియే యని దెలుపుట కిట "శరీరిణః" అని శ్రీకృష్ణపరమాత్మ యేకవచనమును, శరీరము లనేకములని దెలుపుటకు 'ఇమే దేహాః' అని బహువచనమును బ్రయోగించెను. కాని 'శరీరిణః' అను పదముచే సర్వశరీరములయందు "అహం" (నేను) అని భాసించుచున్నట్టియు, నిత్యము యేకము నగునట్టి యాత్మయొక్క సంబంధమగు 'ఇమే' ఈయుభయసేనలయందు జూడబడుచుండెడి భీష్మాదిపదవాచ్యములగు "ఆచార్యాః పితరః పుత్రాః" ఇత్యాదివాక్యములచే నీచే చెప్పబడిన సర్వదేహములు "అంతవంతః" అంత మనగ గనపడకపోవుట. జన్మాది షడ్వికారములు గలవగుటవలనను, ప్రతీతిమాత్రము లగుటచేతను యనియతసత్తాకము అని యాశయము.

ప్రమాణమువలన గ్రహింపబడుచుండ నేకారణమువలన నసత్తునకు సత్త్వాభావము "నాసతో విద్యతే భావః" అను వాక్యముచే జూపబడెనో యందువలన శుక్తిరజతాదులవలె యధిష్ఠానభ్రమవలన గల్పితములగు దేహాదులకు సత్త్వము సంభవింపదు.

కాన నోయర్జునా! నీవు—దేహాదు లనిత్యము లనియు, దేహి యగు నాత్మ నిత్యమనియు దెలిసికొనక బూర్వమునందు "నాసంబంధమగు వీరలు నశించుచుండిరి" అని దుఃఖించితివి. ఇపుడు శ్రుతి, యుక్తి అనుభవములచే విచారింప నాత్మ శరీరాదు లశోచ్యములని సిద్ధించినది. అట్లే నీవును దెలిసికొంటివి. కాన 'హేభారత!' వివేకజ్ఞానసంపన్నుడవగు నోయర్జునా! "యుద్ధ్యస్వ" యుద్ధమునకు ప్రయత్నింపుము. అని పూర్వమునందే

శాంకరభాష్యతత్త్వబోధిని:—

విధించెను. "ప్రకృతివ ద్వికృతిః కర్తవ్యః" అను న్యాయమునఁ బ్రకృతియాగమునందుఁ గల యాజ్యభాగములు ప్రాప్తించుచుండ 'ఆజ్యభాగౌ జుహోతి" అని విధించుట యెందు కనిన? ప్రకృతియందుండు ఆజ్యభాగములవలెఁ బ్రయాజానూయాజలను యాగములుగూడ ప్రకృతి యాగాంతర్గతము లగుటంజేసి "ప్రకృతివ ద్వికృతిః కర్తవ్యః" అను న్యాయము ననుసరించి ప్రయాజానూయాజులు గూడ గృహమేధీయేష్టియందు ప్రాప్తింపవలసివచ్చునని వానిని నివృత్తి జేయుటకు "ఆజ్యభాగౌ జుహోతి" అని విధివాక్యము నుడువఁబడెను. ఆవిధముగా నిచట బొసగదు. గృహమేధీయేష్టివలె యుద్ధము ముఖ్యకర్తవ్యము. దానిని సాధించుట కితరమగు నంగములు ప్రాప్తించునపు డావిధిని జెప్పవలెను. ఇచట నట్లు కానరానందునఁ బరిసంఖ్యావిధి-

---

యుద్ధముకొరకు బ్రవృత్తుడై భ్రాంతిచే దుఃఖించుచుండిన యర్జునునికి– యట్టి శోకమునకు గారణమగు భ్రాంతిని దొలగించి యుద్ధము జేయు మని భోజనమునకు సిద్ధమై విషశంకచే యూరకుండినవానికి విషశంకనుదొలగించి భోజనమును జేయుమని యాజ్ఞ నొసగినట్లు శ్రీకృష్ణపరమాత్మ యాజ్ఞ నొసగెను. కాని 'యుద్ధమును జేయుము' అని యుద్ధకర్తవ్యతను విధించుట లేదు. "నహి కర్మణి కర్మాంతరారంభః" ఒక కర్మయందు మరియొక కర్మారంభమే వ్యర్థ మగుచుండ కర్మకాండకు విరోధి యగు జ్ఞానప్రకరణమునందు కర్మను విధించుట నిరుపయుక్తము. కాన "ఒక గ్రామమునగూర్చి వెళ్ళుచుండెడి పురుషునికి 'వెళ్ళుము' అని యనుమతి నొసగినటుల యుద్ధమునకు వచ్చి యున్న యర్జునునిగూర్చి యుద్ధమును జేయుము" అను యనుమతి మాత్రము 'యుద్ధ్యస్వ' అను భగవద్వచనమున కాశయము.

లేక "ఏతం వై త మాత్మానం విదిత్వా బ్రాహ్మణా వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరంతి" (బ్రహ్మవేత్త లగు బ్రాహ్మణులు దారైషణా ధనైషణా పుత్రైషణములను వదలి శరీరయాత్రార్థము భిక్షాచర్య నాచరించుచుండిరి) అను శ్రుతియే 'జ్ఞానులు శరీరయాత్రయుం దుండవలె' నని బోధించుచున్నది. అట్లే యిచటను బ్రహ్మవేత్త లవశ్యమూ ప్రాణమును రక్షించుకొనవలె నని సూచించుటకు జ్ఞానప్రకరణమునందు— జ్ఞానియగు నర్జునుడు క్షత్రియు డగుటచే సంన్యాసానధికారి యగుటవలనను, యువ డగుటవలన వానప్రస్థమున కనధికారి యనియు క్షత్రియుడు రాజ్యముచేతనే శరీరయాత్ర జేయవలె నను నియమమువలనను, రాజ్యము పరాక్రాంత మగుటంజేసి శత్రుజయముకొఱకు ప్రయత్నింపు మని యర్జునునకు శరీరయాత్ర శ్రీకృష్ణభగవానులు విధించుచుండెను. కనుక నే ముందువాక్యములలో 'శరీరయాత్రాపి చ తే నప్రసిద్ధ్యే దకర్మణః" అని చెప్పఁబడును. కాన నీశ్లోకమునందు "యుద్ధ్యస్వ" అను పదముచే కర్మ విధింపఁబడుటలేదని గ్రహింపనగును.

భాష్యోత్కర్ష దీపిక:— తెలియబడని వస్తువువిషయమై ప్రమాణాన్వేషణను సంభవించినను— "ఏనేను బాల్యమునందు దల్లిదండ్రుల ననుభవించితినో యట్టి నేను వార్ధకమునందు మునిమనుమల ననుభవించుచుంటిని" అను యనుభవముచే బాల్యావస్థవార్ధకావస్థలయందుండు శరీరములకన్న వేరుగ నాత్మ యందరిచే తెలియబడుచునే యున్నది.

స్వప్నమునందు దేవాదిశరీరములనుబొంది యందుకుదగిన భోగముల ననుభవించి స్వప్నమునుండి మెలకువగని మనుష్యదేహమునుబొంది 'నేను మనుష్యుడను దేవుడను కాను' అను ప్రత్యయముచే దేవదేహము బాధింపఁబడినను అహమాస్పదమగు నాత్మ బాధింపఁబడకుండుటచేతను, యోగమాహాత్మ్యముచే సింహాదిదేహములను బొందినప్పు

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"తస్మా ద్యుద్ధ్యస్వ భారత!" అనునది కాదు. కాన విధిత్రయము ప్రాప్తింపనందున "తస్మా ద్యుద్ధ్యస్వ భారత" అనునది అనువాదమాత్రమే యగును. లేదా, శ్రుతిలింగవాక్యప్రకరణస్థానసమాఖ్యలగు ప్రమాణములలో లింగాదిప్రమాణములచే 'ఇమామగృభ్ణ న్రశనామృతస్య" అను మంత్రము గర్ధభరశనాగ్రహణమందుగూడ బ్రవర్తించుచుండ తద్వ్యావృత్తినిమిత్తము "ఇమామ గృభ్ణ న్రశనామృత స్యే త్యశ్వాభిధానీ మాదత్తే" అను విధివాక్యము ప్రవృత్తమాయెను. కాన నిదియు బరిసంఖ్యావిధి. ఇట్టిది "తస్మా ద్యుద్ధ్యస్వ భారత!" అనుచోట జెప్పుటకు రెంటి నుద్దేశించి యొకటి బ్రవర్తించుట లేమింజేసి నలవి కాదు. ॥౧౮॥

డాదేహములు భిన్నమైనను యాత్మయొక్కటిగ దెలియబడుటచేతను, అట్లే "యేనేను చూచితినో యానేను వినుచుంటిని." అను ప్రత్యభిజ్ఞవలన నింద్రియాదులకంటె యాత్మ భిన్నముగ దెలియబడుటచేతను, బుద్ధిమనస్సులు కరణము లగుటచే కర్తృత్వమున కాశ్రయము కాకపోవుటచే బుద్ధి మనస్సులకంటె భిన్నముగ దెలియబడుటవలనను, మనోబుద్ధిశరీరేంద్రియాదులకంటె భిన్నముగ నొకటగు నాత్మ కలదని తెలియబడుచున్నది. ప్రేమాస్పదమగు బుత్రులు వికలు రైనపుడు "నేను వికలుడను" అను ప్రత్యయమువలె ప్రేమాస్పద మగు శరీరము గృశించినపుడు "నేను గృశించితిని" అను బ్రత్యయము శరీరాత్మభ్రాంతిచే గలుగుచున్నదని గ్రహింపనగును. కాన నాత్మ స్వతః తెలియబడుటచే బ్రమాణపరిచ్ఛేద్యత్వము (ప్రమాణములచే దెలియబడుట) యాత్మకు సంభవింపదు.

అట్లైనచో ప్రత్యగాత్మవిషయమై శాస్త్రమున కెట్లు ప్రామాణ్యము సంభవించుననిన? ప్రత్యగాత్మ స్వతస్సిద్ధమగుటచే జ్ఞాతమైనను ఆత్మయందధ్యస్తమగు నవిద్యయొక్కయు, తత్కార్యములగు గర్తృత్వభోక్తృత్వాద్యనాత్మరూపధర్మములయొక్కయు, నిరాసకమగుటచే శాస్త్రము ప్రమాణమగును. ఈవిషయమునే శ్రీమద్భాష్యకారులుగూడ "నహి పూర్వ మిత్థ మహ మిత్యాత్మానం ప్రమాయ" అని మొదలుకొని "నత్యజ్ఞాతార్థజ్ఞాపకత్వేన" అనునంతవరకుగల భాష్యముచే స్పష్టపరచినది. "య త్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ య ఆత్మా" (ఏది యాత్మయో యట్టి బ్రహ్మము సాక్షాత్తు యపరోక్షమని) శ్రుతిగూడ యాత్మ స్వప్రకాశజ్ఞానస్వరూపమగుటచే స్వతస్సిద్ధముగ జ్ఞాతమని జెప్పుచున్నది.

కాన నాత్మ దేనిచేతను యెన్నడును యెచ్చటను నశించునది కాదు. అందుచే నిత్యము. దేహాదులు నశించునవిగాన ననిత్యములు. అందుచే నోయర్జునా! నీవు స్వధర్మమగు యుద్ధమును జేయుము. యుద్ధమును వదలకుమని యర్థము.

పరమార్థప్రపా:— ఎందునిమిత్తమై యీయుపక్రమమో దానిని "అన్తవంతః" అను శ్లోకముచే జెప్పుటకు శ్రీకృష్ణపరమాత్మ మొదలిడెను.

"నిత్యస్య" ఎల్లపుడు నొకే స్వభావముగలది యాత్మ. కనుకనే "అనాశినః" నాశనములేనిది "అప్రమేయస్య" అపరిచ్ఛిన్నమునగు "శరీరిణః" అధ్యాసికసంబంధముచే శరీరవిశిష్టమగు బరమాత్మయొక్క సంబంధము గలవిగ 'ఇమే దేహాః" సుఖదుఃఖకారణములగు నీదేహములు ఘటాంతర్గతమగు ఘటాదులవలె ననేకస్వరూపములతో నశించుచున్న నటునకు నాయాస్వరూపములు వలె దత్త్వవేత్తలచే 'ఉక్తాః' చెప్పంబడెను.

కాన భీష్మద్రోణాది విషయమై విగతజ్వరుడవై "యుద్ధ్యస్వ" యుద్ధమును జేయుము.

య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్ ।
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే ॥ ॥౧౯॥

పదవిభాగము:— యః- ఏనం- వేత్తి- హంతారం- యః- చ- ఏనం- మన్యతే- హతం- ఉభౌ- తౌ- న- విజానీతః- న- అయం- హంతి- న- హన్యతే । ॥౧౯॥

ప్రతిపదార్థము:— యః=ఎవఁడు; ఏనం=ఈప్రకృతమగు నాత్మను; హంతారం=సంహరించువానినిగ; వేత్తి=తెలిసికొనునో; యశ్చ=ఎవఁడు; ఏనం=ఈప్రకృతమగు నాత్మను; హతం=మరణించినదానినిగ; మన్యతే=తలఁచునో; తౌ=ఆ; ఉభౌ=ఇద్దరు; నవిజానీతః=ఆత్మస్వరూపానభిజ్ఞులు (ఆత్మస్వరూపమును దెలియనివారలు); అయం=ఈఆత్మ; న హంతి=చంపుటలేదు; న హన్యతే=చంపబడుటలేదు. ॥౧౯॥

---

నీలకంఠీయము:— సత్తగు నాత్మ నిత్యమనియు, నసత్తగుదేహాదిక మనిత్యమనియు నింతకు బూర్వము నందుఁ జెప్పి యావిషయము నుపసంహరించుచు నర్జునుని యుద్ధాభిముఖుని జేయుట కీశ్లోకము నారంభించుచున్నాఁడు "నాసతో విద్యతే భావః" అనుదానిచే నసత్తులగుదేహాదులకు కాలత్రయమందును సత్త్వములేదని పరమార్థదృష్టితో జెప్పినను ఆట్టి పరమార్థదృష్టి లేనట్టియు, నరకాదులయెడ భయముకల పురుషునికి గలుగు వ్యవహారదృష్టిచేగూడ నిత్యానిత్యవిభాగము ననుసరించి "అంతవంత ఇమే దేహాః" అనుదానిచే దేహములకంతవత్త్వము జెప్పబడినది గనుక పునరుక్తిదోషములేదు.

నిత్యత్వ మనగ కాలాపరిచ్ఛేద్యత్వము. ఆట్టిది యాకాశమునకుగూడ సంభవించును. కాన నొకయాత్మగాక నాకాశముగూడ నిత్యమగును. కాబట్టి "ఒక యాత్మయే నిత్యము" అను సిద్ధాంత మెట్లు పొసగు ననుయాశంకమీద "అనాశినః అని యాత్మకు విశేషముగా జెప్పెను. "నాశః అదర్శనం తద్వాన్ నాశీ" నాశమనగ కనుపడకపోవుట. ఆట్టి ధర్మముకలది యాకాశమగును. ఈవిషయమునే "నభ ఆత్మని లీయతే" అను స్మృతి యాకాశ మాత్మయందు లీనమగుచున్నది; అనిచెప్పుచున్నది. ఆత్మ యాకాశమువలె నాశి (అదర్శనవత్తు) గాక యెల్లపుడు బ్రకాశించునదే యని యర్థము.

ఆత్మ ఘటాదులవలె చక్షుర్గోచరమై భాసించునదిగాక స్వయముగ బ్రకాశించునది" అని చెప్పుటకు 'అప్రమేయస్య' అని యాత్మకు విశేషణముగ జెప్పబడెను. ఆత్మవిషయమై యేప్రమాణము ప్రసరించదు గాన నాత్మ నప్రమేయముగా దెలిసికొనదగును. "యే నేదం సర్వం విజానాతి తం కేన విజానీయా ద్విజ్ఞాతార మరే కేన విజానీయాత్" అను శ్రుతిగూడ నీవిషయమునే తెలుపుచున్నది. ఇఁక నాత్మ ప్రత్యగాత్మత్వ రూపముగనే ప్రసిద్ధము. ఈవిషయమునే "య త్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ య ఆత్మా సర్వాంతరః" అను శ్రుతిగూడ జెప్పుచున్నది. మఱియు "ప్రమాణ మప్రమాణం చ ప్రమాభాస స్తథైవ చ। యత్ప్రసాదా త్ప్రసిద్ధ్యంతి తదసంభావనా కుతః" అను నార్యోక్తిప్రకారము సర్వావభాసకమైనయాత్మ నిత్యమై స్వతః భాసించును. కాన నోభరతాన్వయసంభూత! యుద్ధముజేయుము. భీష్మాదులు మిథ్యారూపులును, అనిత్యులు కనుక స్వయముగనే నష్టప్రాయు లగుటంజేసి తద్ధనననివృత్తిచే నీచే స్వధర్మము నశింపజేయతగినది కాదనిభావము.

గీతారహస్యవిమర్శనము:— శ్రీభాష్యకారులు, మధుసూదనసరస్వతి, శంకరానందులు జెప్పిన విధమున "యుధ్యస్వ" అనుచోట యేవిధియు సంభవింపనందున 'యుధ్యస్వ' అను పదముచే యుద్ధకర్తవ్యత విధింపబడె నను తిలకుమహాశయుని వాక్యము భ్రాంతిమూలక మని తత్త్వజ్ఞులు గ్రహింతురుగాక. ॥౧౮॥

శాంకరభాష్యమ్:—

శోకమోహాదిసంసారకారణనివృత్త్యర్థం గీతాశాస్త్రం, న ప్రవర్తక మిత్యేత స్యార్థస్య సాక్షిభూతే ఋచా వానినాయ భగవాన్ ।

**యత్తు మన్యసే యుద్ధే భీష్మాదయో మయా హన్యంతేఽహ మేవ తేషాం హంతే త్యేషా బుద్ధి ర్మృషైవ తే ।**

కథమ్—య ఏన మితి । య ఏనం ప్రకృతం దేహినం వేత్తి జానాతి హంతారం హననక్రియాయాః కర్తారం యశ్చైన మన్యో మన్యతే హతం దేహహననే హతోఽహ మితి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"శ్రీకృష్ణపరమాత్మచే నింతవర కుపపాదింపబడిన గీతాశాస్త్రము శోకమోహాదిసంసార కారణంబగు నవిద్యానివృత్తినిమిత్తకము. ప్రవర్తకము (కర్మయందుప్రవృత్తిగలుగజేయునది) కాదు" అను విషయమును శ్రీకృష్ణుండు తనబుద్ధి ననుసరించి చెప్పియుండలేదు. మఱేమనిన; కఠోపనిషత్తునందలి యీవిషయము "హన్తాచే న్మన్యతే హంతుం హతశ్చే న్మన్యతే హతమ్ । ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే ॥ న జాయతే మ్రియతే వా విపశ్చి

— ◆ ౨వ అధ్యాయము ౧౯వ శ్లోక వ్యాఖ్యావిశేషములు ◆ —

మధుసూదనసరస్వతీయము:— "అశోచ్యా నన్వశోచస్త్వం" అనునది మొదలుగాగల గ్రంథముచే భీష్మాదిబంధువులవలన గలిగెడి శోకము దొలగింపబడినను, తద్వధకర్తృత్వమువలన గలిగెడిపాపమునకు ప్రతిక్రియలేదు. యెచట శోకము బ్రాప్తించదో యచట పాపములేదను నియమములేదు. అట్లయినచో ద్వేషియగు బ్రాహ్మణుని చంపుటయందు శోకము లేమింజేసి పాపము సంభవింపకపోయెడిని. కాన నేను కర్తను, నీవు ప్రేరకుడవు. "కర్తా కారయితా చైవ ప్రేరకస్త్వనుమోదకః । సుకృతం దుష్కృతం చైవ చత్వారస్సమభాగినః" అను న్యాయమున మనయిరువురకు నీభీష్మద్రోణాదివధవలనజనించెడి పాపముతప్పదు. కాన 'తస్మా ద్యుద్ధ్యస్వ భారత!' అనిచెప్పుట నీకు యుక్తము కాదనుశంకను కఠోపనిషత్తునందు జెప్పబడిన "య ఏనం వేత్తి హన్తారం" అను ఋక్కుచే బరిహరించుచుండెను. అదృశ్యత్వాదిగుణములుగల యాత్మ యొకదానిం జంపునది కాదు. జంపం **బడునదీకాదు. కాన నట్టియాత్మ యొకదానిని జంపునదిగ దెలిసికొనువాడు, నొకదానిచే జంపబడుదానినిగ దెలిసి**కొనువాడు యీయిరువురు యాత్మస్వరూపమును శాస్త్రమువలన దెలిసికొనినవారు కారు. కావున వీరలను జంపుటయందు నీవుగర్తవు కావు. నేనుప్రేరకుడను కాను. అందువలన "తస్మా ద్యుద్ధ్యస్వ భారత!" అని ప్రేరణజేసినందున నాకును, వీరలనుజంపుటవలననీకును బ్రత్యవాయములేదని బ్రత్యవాయశంక నీశ్లోకముచే దొలగించెను.

ఈశ్లోకమునందు "య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్" అను పూర్వార్థమున 'యః ఏనం' అనుపదములరెండుసార్లు జెప్పకపోయినను 'య ఏనం వేత్తి హన్తారం హతం చ' అనిచెప్పినను పూర్వమునందు జెప్పబడినయర్థము బ్రాప్తించుచుండ 'యః ఏనం' అని దిరుగ జెప్పుట వాక్యాలంకారమనియెరుంగవలెను.

లేక తార్కికులాత్మకుగర్తృత్వముకలదనిజెప్పెదరు. 'య ఏనం వేత్తి హన్తారం' అనువాక్యముచేనాత్మకు గర్తృత్వమంగీకరించిన తార్కికులు, అట్లే "శరీరమేచేతనమనెడి చార్వాకులు శరీరమునశించిన నాత్మనశించు" ననెదరు. అట్టి 'యశ్చైనం మన్యతే హతం' అనువాక్యముచే శరీరాత్మవాదులగు చార్వాకులుఆత్మస్వరూపమును

శాంకరభాష్యమ్:—

హననక్రియాయాః కర్తృభూతం తావుభౌ న విజానీతో నజ్ఞాతవంతా వవివేకేనాఽఽత్మానమహం ప్రత్యయవిషయం, హంతాఽహం హతోఽస్మ్యహమితి దేహహననే నాత్మానమహంప్రత్యయ విషయం యౌ విజానీత స్తా వాత్మస్వరూపానభిజ్ఞా విత్యర్థః । యస్మా న్నాయ మాత్మా హంతి న హననక్రియాయాః కర్తా భవతి, న హన్యతే నచ కర్మ భవతీత్యర్థః, అవిక్రియత్వాత్ ॥౧౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

న్నాయం కుతశ్చి న్న బభూవ కశ్చిత్ । అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే ॥" అను మంత్రముచే గూడ జెప్పఁబడెనని యామంత్రములను జెప్ప దొడఁగెను.

ఓయర్జునా! "యుద్ధమునందు భీష్మద్రోణకృపాచార్యాశ్వత్థామాదులు నాచేఁ జంప బడుచుండిరి. నేను వారలను జంపువాడ" నను నీకు జనించిన బుద్ధి కల్ల.

తెలిసికొనినవారు కారని జెప్పుటకు వాదిభేదము ననుసరించి 'య ఏనం' అను రెండుపదములు దిరుగ జెప్పఁబడె నని గ్రహింపనగును.

లేక "య ఏనం వేత్తి హన్తారం" అనువాక్య మతిశూరవిషయమనియు, "యశ్చైనం మన్యతే హతం" అనునది కాతరవిషయమనియు దెలిసికొనవలయును.

"య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతం" అను గీతావాక్యమునకు కఠోపనిషత్తునందు "హన్తా చే న్మన్యతే హన్తుం హతశ్చే న్మన్యతే హతం" అని శ్రౌతపాఠమనియు గ్రహింపనగును.

శంకరానందీయము:— "పాప మేవాశ్రయే దస్మాన్, సంకరో నరకాయైవ కులఘ్నానాం, కథం భీష్మ మహం సంఖ్యే" అనునవి మొదలగుశ్లోకములచే నాత్మకునే పాపసంబంధమును, పాపఫలభోక్తృత్వమును, పాపక్రియాకర్తృత్వమును దలచితివో యది ఆత్మస్వరూపాజ్ఞానకృతము. సత్యమగు నాత్మతత్త్వము దెలిసినచో నేవికల్పమున కవకాశముండదను యాశయముచే నాత్మయాథాత్మ్యమును బోధించుట కాత్మతత్త్వప్రకాశకములగు మంత్రముల నర్థతః శ్రీకృష్ణపరమాత్మ పఠించుచుండెను. అందు మొదటి మంత్రముచే నెవడాత్మకు క్రియా శ్రయత్వమును, క్రియావిషయత్వమును దలచునో యట్టి పురుషుడు వేదాన్తశ్రవణ మొనరించినను మూఢుఁడే యని జెప్పుచుండెను.

ఎవడు 'నేను వీనిని జంపుచుంటి' నని యహంప్రత్యయార్థమగు నాత్మను హననక్రియాకర్తగా దలచునో, ఎవడు 'నేను వీనిచే జంపబడితిని' అని హననక్రియావిషయముగ దలచునో వా రిరువు రాత్మస్వరూపమును దెలిసినవారు కారు. ఎందువలననిన? ఈయాత్మ స్వయముగ నెవనిని జంపునది కాదు. దేనిచేతను జంపబడునది కాదు. దేహేంద్రియాదులు తత్తత్కార్యములయందు వ్యాపృతమై యుండినను వృక్షము చలించినను తదంతర్గతమగు నాకాశమువలె నాత్మకూటస్థచిద్రూపముచే నంతట నుదాసీనమై తూష్ణీంభావమును బొందియుండునని యాశయము. "న తదశ్నాతి కించన న తదశ్నాతి కశ్చన" అనుశ్రుతివలనను 'నిరవయవమగుటంజేసి యాత్మస్వరూప మాకాశమువలె నిష్క్రియము' అను యుక్తిచేతను, 'నిష్కలం నిష్క్రియం శాన్తం' 'సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ' ఇత్యాది శ్రుతులచేతను యాత్మ నిష్క్రియమని దెలిసికొని, అశ్లేయుక్తులచే స్థిరపరచుకొనియు యెవఁ డాత్మను కర్తనుగాను, భోక్తనుగాను, సుఖముకలదానినిగను, దుఃఖముకలదానినిగను దలచునో యట్టివాఁ డాత్మ తత్త్వమును దెలిసిన వాఁడు కాడు. మఱేమనిన? మరణించిన లేగనుగనిన తల్లియొక్క ప్రసవము శ్రమైకఫ కమై నిష్ఫలమైనటుల నట్టివానియొక్క శ్రవణమననములు శ్రమయే ఫలముగా కలవగునని సూచింపబడెను.

శాంకరభాష్యతత్త్వబోధిని:—

**ఆత్మ యవిక్రియుఁడు అందుచే నాత్మ యొకదానిని జంపునది కాదు. ఒకదానిచే జంపబడునది కాదు. కాన నెవఁడు దేహము చచ్చునపు డవివేకముచే "అహం" అను ప్రత్యయ విషయ మగునట్టియు, ప్రకృతదేహి యగు నేను మరణించినవాడ ననియు, ఎవడు ప్రకృతదేహి యగు తన్ను చంపువానినిగను తలఁచెదరో వారిరువురు నాత్మస్వరూపమును దెలిసినవారు కారు.**

పరమార్థప్రప:— "ఏతా న్న హంతు మిచ్ఛామి" అనునది మొదలగు శ్లోకములచే నాత్మకు హనన కర్తృత్వనిమిత్తక మగు దుఃఖముఁ జెప్పఁబడెను. అట్టి దుఃఖముగూడ నిర్నిమిత్తక మని "య ఏనం వేత్తి" అను శ్లోకముచేఁ జెప్పమొదలిడెను.

ఎట్లు ఘటముచే ఘటమును బ్రద్దలుచేసిన నాఘటమునందుండు నాకాశమునకు గర్తృత్వకర్మత్వములు లేవో (నాకాశము బ్రద్దలు చేయునది కాదు; బ్రద్దలగునది కాదో) యట్లే యాత్మకు హననక్రియాకర్తృత్వము, తత్కర్మత్వము (చంపుట, చంపఁబడుట) లేవు. ఈవిషయమునందే "నాయం హంతి న హన్యతే" అనునది హేతువు.

నీలకంఠీయము:— "నాసతో విద్యతే భావః" అనుదానిచే నసద్రూపములగు మాత్రా (ఇంద్రియా)దులు మిథ్యాభూతము లగుటవలన నిస్స్వరూపములుగాన మాత్రాదులకు గర్తృత్వము సంభవింపదు. కాన సత్తునకే కర్తృత్వము, బంధమోక్షములు జెప్పనగును. అట్లుగాక నంతఃకరణమునకు బంధము, ఆత్మకు మోక్షమనినచో బంధమోక్షములకు సామానాధికరణ్యము (ఒకచోటనుండుట) లేకపోయెడిని. అటులైన తేలుకుట్టుట యొకనికి తన్నివృత్తికి మందు మఱియొకని కనినట్లు బంధములేని జీవునకు మోక్షశాస్త్రమును జెప్పుట వ్యర్థమయ్యెడిని. కాన నాత్మకే బంధమోక్షము లని యంగీకరింపవలయును. "యేన సర్వ మిదం తతం" అను శ్రుతిగూడ నాత్మకే దేహాదిస్వీకారమును జెప్పుచున్నది. అటులైన హననక్రియనుగూర్చి కర్తృత్వకర్మత్వము లాత్మకు సంభవింపవలసివచ్చును. తనను చంపించుటకు కర్తృత్వము తనకే సంభవించుట విరుద్ధము. వహ్ని వహ్నిని దగలబెట్టుట సంభవము కాదుకదా. యను శంకను దొలగించుటకు "య ఏనం" అని చెప్ప మొదలిడెను. ఏతార్కికులు కాదు లాత్మను హననక్రియాకర్తగ దలచుచుండిరో, ఏచార్వాకాదు లాత్మను హననక్రియాకర్మగ (జంపబడుదానిగ) దలచుచుండిరో వారిరువు రాత్మతత్త్వమును దెలిసికొనినవారు కారు.

ఎందువల ననిన నీయాత్మ జంపునదికాదు; జంపబడునదీ కాదు. ఏది కర్తయో యది యాత్మ కాదనియు, దేహ మాత్మ కాదనియు పూర్వమునందే జెప్పబడెను.

**ఇచట దత్త్వ మిది. ఏవిధమున నయఃపిండమునందు వహ్నిసంబంధమువలననే దగ్ధృత్వమో, స్వయముగ నయఃపిండమునందు దగ్ధృత్వము లేదో ఆదేవిధమున మాత్రాదులు సంభవించినపుడే కర్తృత్వము సంభవించుటచే నాకర్తృత్వము మాత్రాదుల ధర్మమే కాని యాత్మధర్మము కాదు. ఆత్మయందు గర్తృత్వప్రతీతి మాత్రాదిసంబంధమువలననే కలుగుచున్నది. కాన మాత్రాదులతో గూడినదానికి బంధము. కేవలాత్మకు బంధము లేదు. మోక్ష మనగ మాత్రాదుల సంబంధము లేకుండుటయే. కావున బంధమోక్షములకు వైయధికరణ్యము (ఏకాధికరణమునం దుండకపోవుట) సంభవింపదు. మాత్రాదులు సత్తులనిగాని, అసత్తులనిగాని నిర్వచించుటకు శక్యము కానందున ననిర్వచనీయములు. వ్యవహారయోగ్యము, బ్రహ్మజ్ఞానైకబాధ్యము, స్వప్నమాయాగంధర్వనగరతుల్యమునగు దత్స్వరూపము నంగీకరించుటచే మాత్రాదులు నిస్స్వరూపములు కావు. కాన గర్తృత్వము మాత్రాదిధర్మమే కాని యాత్మధర్మము కాదు. ఈవిషయమునే "ఆత్మా కర్త్రాదిరూపశ్చే న్మా కాంక్షీ స్తస్త ముక్తతామ్। నహి స్వభావో భావానాం వ్యావర్తే తౌష్ణ్యవ ద్రవేః" అను వచనముగూడ జెప్పుచున్నది.**

న జాయతే మ్రియతే వా కదాచి న్నాయం భూత్వాఽభవితా వా న భూయః ।
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే ॥౨౦॥

పదవిభాగము:—న-జాయతే-మ్రియతే-వా-కదాచిత్-న-అయం- భూత్వా- అ-భవితా-వా- న-భూయః-అజః-నిత్యః-శాశ్వతః-అయం-పురాణః-న-హన్యతే-హన్యమానే-శరీరే । ॥౨౦॥

ప్రతిపదార్థము:—ఈశ్లోకమున "భూత్వాఽభవితా వా" అనుచోట (భూత్వా-అ-భవితా) అని పదవిభాగము. "యతః అను పద మధ్యాహార్యము. యతః=ఏ కారణమువలన; అయం=ఈయాత్మ; అభూత్వా=పూర్వమునందు లేక; భూయః=తిరిగి; భవితా=ఉండునది; న= కాదో; (యత్తచ్ఛబ్దములకు నిత్యసంబంధమువలన "అతః" అనుపద మధ్యాహార్యము) అతః=ఈ కారణమువలన;కదాచిత్=ఒకానొకప్పుడు; న జాయతే=పుట్టడు; యతః=ఏ కారణమువలన; అయం=ఈ ఆత్మ; భూత్వా=ఇదివర కుండి;భూయః=తిరిగి;అభవితా=ఉండునది కాదో; అతః=ఈ కారణమువలన; అయం=ఈయాత్మ; కదాచిత్=ఒకానొకప్పుడు; న మ్రియతే=మరణింపడు; అయం=ఈయాత్మ; శాశ్వతః=అపక్షయము లేనివాడు (కృశింపనివాడు); పురాణః=పూర్వమునందును నూతనుడు;(అనగా వృద్ధిరూపక్రియ లేనివాడు) శరీరే=శరీరము; హన్యమానే=సంహరింపబడినను; న హన్యతే=పరిణామక్రియ లేనివాడు; అజః=ఉత్పత్తి లేనివాడు;నిత్యః=నిత్యుఁడు (అనగానుత్పత్తి వలనఁబ్రాప్తింను నస్తిత్వము లేనివాడు)॥౨౦॥

శాంకరభాష్యమ్:—

(1) కథ మవిక్రియ ఆత్మేతి ద్వితీయో మంత్రః—న జాయతే నోత్పద్యతే జనిలక్షణా వస్తుక్రియా నాఽఽత్మనో విద్యత ఇత్యర్థః । న మ్రియతే వా వా శబ్దశ్చార్థే । న మ్రియతే చే

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(1) ఆత్మ యవిక్రియమగుటచే నొకదానినిఁ జంపునది కాదు; తాను మరణించునది కాదని పూర్వగీతయందుఁ జెప్పబడెను, అందు హేతువగు నవిక్రియత్వ మెట్లాత్మకు సంభవించు నవిన?

మఱియు గర్తృత్వము రాగద్వేషాదివికారములు గలదానికే సంభవించును. అట్టిది కలవాడే దుఃఖియగును. అటులైన నాత్మ కనుభూయమానమగు సాక్షిత్వమునకు బాధ ప్రాప్తించెడిని. కాన నాత్మకు గర్తృత్వము లేదని యాశయము. ఈ విషయమునే "నర్తే స్యాద్విక్రియాం దుఃఖీ సాక్షితా కా వికారిణః । ధీవిక్రియాసహస్రాణాం సాక్ష్యతోఽహ మవిక్రియః" అను వచనముగూడ జెప్పుచున్నది

వివర్తవాదము నంగీకరించుటచే నత్మునకు దేహాద్యుపాదానమువలన గర్తృత్వము సంభవింపదు. అధ్యస్తమగు దానియొక్క ధర్మములచే నధిష్ఠానము వికారి కానేరదు. ఈ విషయమునే శ్రీమద్భాష్యకారులు "యత్ర యదధ్యాసస్తత్కృతేన దోషేణ గుణేనవాఽణుమాత్రేణాపి స న సంబధ్యతే" అను భాష్యవచనముచే స్పష్టపరచిరి. మరియు వృద్ధులుగూడ "ఊషరక్షేత్రము మృగతృష్ణజలప్రవాహముకలదై నదిని వహించదు. మృగవారిప్రవాహముచే నిండినదియు, యూషరక్షేత్రమును స్పృశించదు" అని యధ్యస్తగుణదోషసంబంధ మధిష్ఠానమునకు లేదని స్పష్టపరచిరి.

ఈ జెప్పుటచే గర్తృత్వ కర్మత్వము లనాత్మధర్మములగుటచే ననాత్మ లనేకమగుటంజేసి యొక యాత్మ యందు దాయుభయమునకు విరోధమని జెప్పుటయు నిరస్తము.

ఈ విధమునవే చార్వాకతార్కికాభిమతములగు, దేహాత్మ, కర్త్రాత్మ వాదములు "హన్తా చే న్మన్యతే హన్తుం హతశ్చే న్మన్యతే హతమ్ । ఉభౌ తౌ నవిజానీతో నాయం హంతి న హన్యతే॥"అను పూర్వార్ధమున పాఠభేదముచే నుచ్చరింపఁబడిన కాఠకమంత్రముచే నిరస్తము అని తెలిసికొనదగినది. ॥౧౯॥

శాంకరభాష్యమ్:—

త్యంతా వినాశలక్షణా విక్రియా ప్రతిషిధ్యతే। కదాచిచ్ఛబ్దః సర్వవిక్రియా ప్రతిషేధైః సంబధ్యతే న కదాచిజ్జాయతే న కదాచిన్మ్రియత ఇత్యేవమ్। యస్మాదయమాత్మా భూత్వా భవనక్రియామనుభూయ పశ్చాదభవితాఽభావం గంతా న భూయః పునస్తస్మాన్న మ్రియతే। యో హి భూత్వా న భవితా స మ్రియత ఇత్యుచ్యతే లోకే। వాశబ్దాన్నశబ్దాచ్చాయమాత్మాఽభూత్వా భవితా వా దేహవన్న భూయః పునస్తస్మాన్న జాయతే। యో హ్యభూత్వా భవితా స జాయత ఇత్యుచ్యతే నైవమాత్మాఽతో న జాయతే। యస్మాదేవం తస్మాదజో యస్మాన్న మ్రియతే తస్మాన్నిత్యశ్చ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఏది పూర్వమునందు లేక వర్తమానమున గాన్పించునో యది పుట్టునది యని చెప్పఁబడును. (అది యెట్లనిన? ఘటముత్పత్తికిఁ బూర్వమునందు లేక వర్తమానకాలమునం దుండుటచే నుత్పన్నమని చెప్పఁబడును) ఆత్మయనునది పూర్వమునందు లేక వర్తమానమునం దుండునదికాదు కాన నుత్పన్నము కాదు. (అనగా భావవికారమగు నుత్పత్తి లేనిదనుట.).

ఏది పూర్వమునం దుండి వర్తమానమున కాన్పింపదో యది నష్టమని చెప్పఁబడును. (ఎట్లనిన? ఘటము పూర్వమునందుండి వర్తమానమున కాన్పింపదో యది నష్టమని చెప్పబడును) ఆత్మ పూర్వమునందుండి ముమ్ముం దుండనిదికాదు. కాన నాశములేనిది. (అనగా భావవికారమగు నాశవిక్రియ లేనిదనుట) కాననాత్మ యుత్పత్తిలేమింజేసి యజము, నాశములేమింజేసి నిత్యము ఇట్టియర్థ మీవాక్యమునలన నెట్లు సంభవించు ననిన? చ కారార్థకముగల వాశబ్దము వలన, నశబ్దమువలనను ప్రాప్తించును.

—• ౨వ అధ్యాయము- ౨౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

పరమార్థప్రపా:— "న హన్యతే" అని పూర్వశ్లోకమునందున్న వాక్యముచే నాత్మ షడ్భావవిక్రియా శూన్యమని చెప్పఁబడెను. అషడ్భావవిక్రియా రాహిత్యమునే యీశ్లోకమునందు స్పష్టపరచుచున్నాడు.

'పుట్టుట, ఉండుట, వృద్ధినొందుట, విపరిణామమును బొందుట, క్షీణించుట, నశించుట, ననునీయారును వికారము లనఁబడును. ఈయారు వికారము లాత్మకు లేవని క్రమపద్ధతిని చెప్పుచున్నాఁడు.

(పుట్టుటలేదు) ఇట్లనుటచే నాత్మకు జన్మరూపవికారము నిషేధించబడెను. "న చాయం భూత్వా భవితా భవతి" (ఆత్మ స్వతస్సిద్ధము కాన జన్మాంతరాస్తిత్వము గలదికాదు) పుట్టుకకల వస్తువెల్ల యస్తిత్వము కలదగును. కాని పుట్టువులేని వస్తువున కస్తిత్వ ముండదు గాన 'అజః' అని యాత్మ యస్తిత్వరూపవికారము లేనిదనుటలో హేతువుగ చెప్పబడినది. ఆత్మ 'నిత్యః' అనుటచే వృద్ధిరూపవికారము లేదని చెప్పబడెను. "శాశ్వతః" అనుటచే శాశ్వతమగుటచేతను నపక్షయవికారము లేనిదని చెప్పఁబడెను. "పురాణః" అనుటచే నిరవయవమగుటచేతను, నిర్గుణమగుటచేతను పురాతనమగు నాత్మ విపరిణామరూపవికారము లేనిదని సూచింపబడెను. (ఆత్మ పూర్వమందుగూడ క్రొత్తదియే గనుక నిప్పుడు విపరిణామమువలన రూపాంతరమును బొంది క్రొత్తదిగా యగుటలేదని యర్థము.)

లేక. 'న భవితా' అని యనుషంగముగా స్వీకరింపఁదగును. (అస్తిత్వము లేనిదై ఆత్మ)'భూయోఽధికం

శాంకరభాష్యమ్:—

(2) యద్య ప్యాద్యంతయో ర్వికిృయయోః ప్రతిషేధే సర్వా వికిృయాః ప్రతిషిద్ధా భవంతి, తథాపి మధ్యభావినీనాం వికిృయాణాం స్వశబ్దై రేవ తదర్థైః ప్రతిషేధః కర్తవ్య ఇత్యనుక్తానామపి యౌవనాదిసర్వవికిృయాణాం ప్రతిషేధో యథా స్యాది త్యాహ— శాశ్వత ఇత్యాదినా । శాశ్వత ఇత్యపక్షయలక్షణా వికిృయా ప్రతిషిధ్యతే । శశ్వ ద్భవ శ్శాశ్వతః । నాపక్షీయతే స్వరూపేణ నిరవయవత్వా న్నిర్గుణత్వాచ్చ, నాపి గుణక్షయే ణాపక్షయః । అపక్షయవిపరీతాపి వృద్ధిలక్షణా వికిృయా ప్రతిషిధ్యతే— పురాణ ఇతి । యో హ్యవయవాగమే నోపచీయతే స వర్ధతేఽభినవ ఇతి చోచ్యతే । అయం త్వాత్మా నిరవయవత్వా త్పురాపి నవ ఏవేతి పురాణో న వర్ధత ఇత్యర్థః ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(2) "జాయతే, అస్తి, వర్ధతే, పరిణమతే, అపక్షీయతే, నశ్యతి" అను షడ్భావవికారములలో నాద్యంతములగు నుత్పత్తినాశము లాత్మకు సంభవింపవని నిషేధించిన మధ్యస్థములగు భావవికారముల నార్థికముగ నిషేధించినట్లే యగును. కాని అట్టి మధ్యభావులగు భావవికారములను స్వశబ్దములచేతనే నిషేధింపవలయు నని "శాశ్వతః" అనునది మొదలుగాఁగల వాక్యములచే నిషేధించుచుండెను.

అపక్షయము (కృశించుట) స్వరూపముచే నపక్షయ మనియు, తన గుణములయొక్క యపక్షయముచే తన కపక్షయ మనియు రెండువిధములు. ఎట్లనిన? శరీరము సావయవము (అవయవములతోఁ గూడినది) అట్టి యవయవములకు లోపముప్రాప్తించినపుడు శరీర మపక్షీణమైనది. ఇది స్వరూపమువలన నపక్షయము, ఆత్మ నిరవయవము (అవయవములు లేనిది) కాన స్వరూపమువలన నపక్షయము యాత్మకుఁ బ్రాప్తింపనేరదు.

గుణముల యపచయమువలనను యాత్మ కపచయము ప్రాప్తింపనేరదు. (ఎట్లనిన? శరీరమునందుఁ గాంత్యాదిగుణలోపము గలిగినపుడు శరీర మపక్షీణమయినదని చెప్పుదురు.) ఆత్మ నిర్గుణము. (గుణరహితము) కాన గుణముల యపక్షయమువలన నపక్షయముగూడ నాత్మకుఁ బ్రాప్తింపనేరదు.

దేనికి యవయవములు తనయందుఁ జేరుటవలన నుపచయము గలుగునో వది "వర్ధతే" వృద్ధిబొందును అని చెప్పఁబడును. అట్టి వృద్ధికి హేతువగు నవయవము లాత్మకు లేనందున (నిరవయవమగుటచే) పూర్వమునందుఁ గూడ నవ (నూతన)మే; పురాణము. కాన నపక్షయమునకు విపరీతమగు వృద్ధిరూపవికిృయకూడ నాత్మకు సంభవింపనేరదు.

యథా భవతి తథా న భవితా" (అధికముగా నెట్లు కావలెనో యట్లు కాదు) అని వృద్ధిరూపవికారమును నిషేధించెను. 'అజః, నిత్యః' అని యీరెండు విశేషణములును వృద్ధ్యాద్యభావములకు హేతువులుగ వేర్వేరుగ చెప్పబడినందున పౌనరుక్త్యదోషము లేదు. పైవిధముననే యే యాత్మావినాశవిషయమై జన్మాదిషడ్వికారములు నిరసింపబడెనో యట్టి యాత్మవినాశాభావమును "న హన్యతే హన్యమానే శరీరే" అను వాక్యముచేఁ జెప్పి యుపసంహరించెను. ఈవిషయమై కఠశాఖీయ మగు "న జాయతే మ్రియతే వా విపశ్చి న్నాయం కుతశ్చి న్న బభూవ

శాంకరభాష్యమ్:—

(3) తథా న హన్యతే న విపరిణమ్యతే హన్యమానే విపరిణమ్యమానేఽపి శరీరే। హంతిరత్ర విపరిణామార్థో ద్రష్టవ్యోఽపునరుక్తతాయై న విపరిణమ్యత ఇత్యర్థః। అస్మిన్మంత్రే షడ్భావవికారా లౌకికవస్తువిక్రియా ఆత్మని ప్రతిషిధ్యంతే। సర్వప్రకారవిక్రియారహిత ఆత్మేతి వాక్యార్థః। యస్మాదేవం తస్మాత్ "ఉభౌ తౌ న విజానీత" ఇతి పూర్వమంత్రేణాస్య సంబంధః॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(3) ఈగీతయందు "న మ్రియతే" అను పదముచేతనే యంత్యవిక్రియారూపనాశ మాత్మకు నిషేధింపబడుచుండ "న హన్యతే" అను పదముచేఁ దిరిగి నాశరూపవిక్రియను నిషేధించుట పునరుక్తిదోషము కాదా? యని యాక్షేపింపరాదు. "న హన్యతే" అను పదముచే విపరిణామరూపవిక్రియ నిషేధింపఁబడెను. శరీరము విపరిణామమును బొందినను యాత్మ విపరిణామును బొందదు.

ఈ గీతయందు లౌకికవస్తువునందుండు షడ్భావవికారములు నాత్మకుఁ బ్రాప్తింపవని నిషేధింపబడెను. ఏవికారములును నాత్మకుఁ బ్రాప్తింపవని యీ గీతార్థము.

ఆత్మ షడ్భావవిక్రియారహితుఁడగుటచే 'నేను వారలను జంపువాడను, వారలచే సంహరింపఁబడువాడను నేను' అని తెలిసికొను నీ యిరువురు నాత్మస్వరూపమును దెలిసినవారలు కారు. అని పూర్వమంత్రమగు "ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే" అనువానితో నీ గీతావాక్యమున కన్వయము. ॥౨౦॥

కశ్చిత్, అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే, హంతా చే న్మన్యతే హంతుం హత శ్చే న్మన్యతే హతం" "ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే" అశరీరం శరీరే ష్వనవస్థే ష్వవస్థితం, మహాంతం విభు మాత్మానం మత్వా ధీరో న శోచతి" అను నీశ్రుతులు గతార్థములు.

నీలకంఠీయము:— "నాయం హన్తి న హన్యతే" అను వాక్యమునందుగల "న హన్యతే" అను వాక్యమును కాఠకమునందు గల "న జాయతే" అను మంత్రముచే వివరించుచున్నాడు.

ఈయాత్మ యొకానొకప్పుడును యభినవమై పుట్టునది కాదు. తార్కికాభిమతపటము సంబంధవిహీనమై నశించునటుల నీయాత్మ నిరన్వయమై నశించునది కాదు. ఎందువలననిన? ఆత్మ యజను గాన బుట్టినది కాదు. నిత్యము గాన నశించునదిగాదు. అని తెలుపుటకే యాత్మవిశేషణములుగ 'అజః నిత్యః' అని యిందు నివేశింపబడెను.

అటులైన క్షణికవిజ్ఞానవాది యగు యోగాచారుఁడు క్షణికవిజ్ఞానధారకు నజత్వమును, నిత్యత్వమును యంగీకరించుటచే నట్టి క్షణికవిజ్ఞానధారయే యాత్మయనగూడదా? యను నాశంకను దొలగించుటకు "భూత్వా భవితా వా న భూయః" అని చెప్పెను. ఇచట 'అయం' అను పద మనువర్తించును.

'అయం' ఈయాత్మ 'భూత్వా' ఉండి 'భూయః' అనేకమారులు 'భవితా' ఉండెడిదియై 'న' కాదు. ఎట్లనిన? అంకురాదికము మొదట యున్నదియై యనంతరమున వృద్ధిపరిణామాపక్షయములచే ననేకమారులుండెడిది. ఆత్మ యన్ననో వృద్ధ్యాదులు లేమిం జేసి యట్లు కాదు.

"భూత్వా భవితా" అను భవనక్రియాద్వయమునకు "భూత్వా" అనుచోట నుండు క్త్వాప్రత్యయోక్తమగు సమానకర్తృకత్వము విజ్ఞానధారైకాభిప్రాయముచే జెప్పఁబడెను. కాన విజ్ఞానధార 'భూత్వైవభవితా'

శ్లో॥ వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్ ।
కథం స పురుషః పార్థ! కం ఘాతయతి హంతి కమ్ ॥ ॥ ౨౧ ॥

పదవిభాగము:— వేద– అవినాశినం– నిత్యం– యః– ఏనం– అజం– అవ్యయం– కథం– సః– పురుషః– పార్థ!– కం– ఘాతయతి– హంతి– కమ్ । ॥ ౨౧ ॥

ప్రతిపదార్థము:— హే పార్థ!=ఓయర్జునా!; యః=ఏపురుషుడు; అవినాశినం= నాశరహితమైనట్టియు; నిత్యం=పరిణామము లేనట్టియు; అజం=ఉత్పత్తి లేనట్టియు; అవ్యయం=అపక్షయము (క్షీణించుట) లేనట్టి; ఏనం=ఈయాత్మస్వరూపమును; వేద=తెలిసికొనునో; సః=అ; పురుషః=పురుషుడు; కథం=ఎట్లు; కం=ఎవనిని; ఘాతయతి=సంహరించుటకుఁ బ్రేరణము చేయును; కం=ఎవనిని; హంతి=చంపును? ॥ ౨౧ ॥

---

ఉండియే భవనక్రియ గలది. ఉండినశించునది కాదు. తార్కికులవిజ్ఞానము ఉత్పత్తిస్థితినాశక్షణవ్యాపి యగుటంజేసి త్రిక్షణస్థాయియగును. బౌద్ధపరికల్పితవిజ్ఞాన మన్ననో పూర్వవిజ్ఞాననాశక్షణమే యుత్తరవిజ్ఞానోత్పత్తిక్షణము. అక్షణమే స్థితిక్షణమగుటంజేసి క్షణికమనంబడును. విజ్ఞానములకు భవనక్రియాద్వయవ్యవధానము లేమింజేసి "భూత్వాభవితా" (ఉండిభవనక్రియను బొందునని జెప్పుటన్యాయము) అట్లిగూడ నీయాత్మ కాదు. ఎందువలననిన? నీయాత్మ యెల్లప్పు డేకరూపము. "ఏ నేను బాల్యమునందు దల్లిదండ్రుల ననుభవించితినో యానేను వార్ధకమునందు మనుమనుమల ననుభవించుచుంటిని" అను యనుభవముచే బాల్యవార్ధకములం దుండు ఆత్మ యేకత్వ మనుభూత మగుటంజేసి ఆత్మ యుండి పరిణామములచే భవక్రియ ననుభవించునది కాదు.

సాదృశ్యమును గ్రహించు స్థిరుడగు వాడొకడు లేనందున– బాల్యమునందుండు ఆత్మ సాదృశ్యముచే వార్ధకమునందుండువాని కట్లనుభవము గలుగు నను వాదము దూరముగ నిరస్తము.

లేక జన్మమరణములు లేకపోయినను ధర్మాంతరవిశిష్టుడై పూర్వమునందుండి యిరుగ ధర్మాంతరవిశిష్టుడై "భవితా" కాగలడనియు జెప్పవచ్చు. "భూత్వా భవితా న భూత్వా భవితా" ఉండియే భవక్రియను బొందును. లేక కాదు. అని సమన్వయము జేయువలెను.

జైనులు శరీరపరిమాణక మాత్మయని యనెదరు. అట్టి నిత్యమగు నాత్మకేకక్రమమునుగాని, వ్యుత్క్రమమునగాని మశక, మనుజ, గజదేహములబ్రాప్తించునపు డాత్మ యాయాదేహములకు దగు బరిమాణభేదమును బొందుననియు యంగీకరించిరి. అందుచే నౌపచారికభవనము నాత్మ కంగీకరించెదరు. ఉపచయాపచయ (వృద్ధిక్షయ) ములు గల వస్తువునకు నిత్యత్వము సంభవింపకపోవుటవలనను, ఆత్మశాశ్వత మగుటవలన నట్టిది కాదని గ్రహింపనగును.

దుఃఖాదిధర్మములుగల ధర్మికి—ఘటనాశము లేనిదే తద్గతమగు రూపాదులు నశించనట్లు స్వనాశము లేనిదే దుఃఖాదుల కత్యంతనాశము సంభవింపనందున సుఖదుఃఖాదిధర్మాంతరములు బుట్టుటచే నాత్మకు గౌణమగు "భూత్వా" భవనము సంభవించు నను శంక దొలగింపఁబడెను.

అజత్వము, నిత్యత్వము, శాశ్వతత్వ మనెడివి యాకాశమునకుగూడ గల వను నాశంకను దొలగించుటకు "పురాణం" అని జెప్పఁబడెను. "పురా" వియదాదిసృష్టికి బూర్వమునందుగూడ "నవ ఏవ" నూతన మయినదే. ఈ జెప్పుటవలన నపక్షయాదిధర్మరహిత మగుటంజేసి యాత్మకు ముఖ్యమగు నజత్వము, ఆకాశాదులకు గౌణమగు నజత్వము గలదని జూపఁబడెను. కనుకనే "న హన్యతే హన్యమానే శరీరే" శరీరము జంపఁబడుచున్నను యాత్మ జంపబడునది కాదని జెప్పఁబడెను. ॥ ౨౦ ॥

శాంకరభాష్యమ్:—

(1) 'య ఏనం వేత్తి హంతారం' ఇత్యనేన మంత్రేణ హననక్రియాయాః కర్తా కర్మ చ న భవతీతి ప్రతిజ్ఞాయ 'న జాయతే' (గీ. 2, 20) ఇత్యనేన నావిక్రియత్వే హేతు ముక్త్వా ప్రతిజ్ఞాతార్థ ముపసంహరతి — వేదావినాశిన మితి ।

వేద విజానాత్యవినాశిన మంత్యభావవికారరహితం నిత్యం విపరిణామరహితం యో వేదేతి సంబంధః । ఏనం పూర్వేణ మంత్రోక్తలక్షణ మజం జన్మరహిత మవ్యయమపక్షయ రహితం, కథం కేన ప్రకారేణ స విద్వా న్పురుషోఽధికృతో హంతి హననక్రియాం కరోతి ।

శాంకరభాష్యతత్త్వబోధినీ:—

(1) "య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్, ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే॥" అను శ్లోకమునం దాత్మ యొకనినిఁ జంపువాఁడు కాడు, యొకనిచేఁ జంపబడువాఁడు కాఁడు అని ప్రతిజ్ఞ చేసెను. అందులకు హేతువుగ 'న జాయతే మ్రియతే వా కదాచి న్నాయం భూత్వా భవితా వా న భూయః । అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే ।' అను శ్లోకముచే నాత్మ షడ్భావవికారశూన్యుఁడు (నే విక్రియయు లేనివాఁడు) అని నుడివి "య ఏనం వేత్తి హంతారం" అను శ్లోకముచేఁ బ్రతిజ్ఞాత మగు నర్థమును (ఆత్మ యొకదానినిఁ జంపునది కాదు. ఒకదానిచేఁ జంపబడునది కాదను నర్థము) "వేదావినాశినం నిత్యం" అను శ్లోకముచే నుపసంహరించుచుండెను. కాన నీ శ్లోకము నందుఁ బూర్వశ్లోకప్రతిపాదితార్థమే చెప్పబడినను పునరుక్తిదోషము సంభవించు నని యాశంకింపరాదు.

విద్వాంసునకు గర్తృత్వాద్యభిమానము లేకపోవుటచేతను. అద్వితీయకూటస్థాత్మ నిశ్చయసామర్థ్యమువలనను బ్రాప్తించిన సర్వకర్మసన్యాసమును గూర్చి విద్యాదార్ఢ్యము నిమిత్తమభ్యనుజ్ఞను "వేదావినాశినం నిత్యం" అను శ్లోకముచే జేయుచుండెను.

అంత్యభావవికారమగు నాశము లేనట్టియు, పరిణామరహితము, ఉత్పత్తిశూన్యము, అపక్షయరూపవికారశూన్యము నగు నాత్మ నెవఁడు తెలిసికొనునో యట్టి విద్వాంసు డగు పురుషుఁ డెవనినిఁ జంపును? ఎవనినిఁ జంపుటకుఁ బ్రేరణము జేయును? ఎవనినిఁ జంపనేరడు, ఎవనినిఁ జంపుటకు బ్రేరణమును జేయఁడని యాశయము

—॥ ౨వ అధ్యాయము- ౨౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ॥—

మధుసూదనసరస్వతీయము:— "నాయం హంతి న హన్యతే" (ఈయాత్మ జంపునదీ కాదు; జంపఁబడునదీ కాదు) అని ప్రతిన జేసెను. అట్టి ప్రతిజ్ఞాతార్థ మగు 'న హన్యతే' (ఆత్మ జంపఁబడదు) అను యంశమును "న హన్యతే హన్యమానే శరీరే" అనుదానిచే నుపపాదించి, "వేదావినాశినం" అను శ్లోకముచే బ్రతిజ్ఞాతార్థైకదేశ మగు 'నాయం హంతి' అను విషయము నుపపాదించుచు బ్రతిజ్ఞాతార్థము నుపసంహరించుచుండెను. "న వినష్టుం శీలం యస్య తి మవినాశినం" (వినాశరూపాంత్యవిక్రియాశూన్యునిగ) ఈవిషయమున హేతువుగ 'అవ్యయం' (అవయవాపచయము గాని, గుణాపచయము గాని లేనివానినిగ) అని చెప్పఁబడెను. లోకమున యత

శాంకరభాష్యమ్:—

కథం వా ఘాతయతి హంతారం ప్రయోజయతి । న కథంచి త్కంచి ద్ధంతి న కథంచి త్కంచి ద్ఘాతయతీ త్యుభయ త్రాక్షేప ఏవార్థః ప్రశ్నార్థాసంభవాత్ । హేత్వర్థస్య తుల్యత్వాద్విదుష స్సర్వకర్మప్రతిషేధ ఏవ ప్రకరణార్థోఽభిప్రేతో భగవతః । హంతే స్త్వాక్షేప ఉదాహరణార్థత్వేన । విదుషః కం కర్మాసంభవే హేతువిశేషం పశ్య న్కర్మా ణ్యాక్షిపతి భగవా న్—కథం స పురుష ఇతి ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఈ శ్లోకమున "కథంచి త్కంచి ద్ధంతి, కథంచి త్కంచి ద్ఘాతయతి" అను వాక్యము ఎవనినిఁ జంపఁడు? ఎవనినిఁ జంపుటకు ప్రేరణ జేయఁడు? అని ప్రశ్నార్థమున సంభవింపనేరదు. అట్టి ప్రశ్నయే యీ శ్లోకమున సంభవించినచో నుత్తరగ్రంథమున నీ ప్రశ్నకు సమాధానము శ్రీకృష్ణపరమాత్మ జెప్పియుండెడిని. అట్లు సమాధానము మున్ముందు గాన్పింపకపోవుటచే బ్రశ్నార్థమున సంభవింపనేరదు కాన 'కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కమ్' అనునది యాక్షేపార్థము (అనగా నట్టి విద్వాంసు డెవనినిఁ జంపును! ఎవనినిఁ జంపుటకుఁ ప్రేరణము జేయును! అని ఉభయస్థలములయందు నాక్షేపణార్థమే గ్రహింపవలయును) ఎవనిని జంపడు, ఎవనినిఁ జంపుటకునుఁ ప్రేరణము జేయఁడనియే యాశయము.

కాన విద్వాంసు డవిక్రియాత్మస్వరూపు డగుటంబట్టి ప్రకృతప్రకరణార్థమగు సర్వకర్మసంన్యాసమే శ్రీకృష్ణపరమాత్మ యాశయము.

విద్వాంసున కేకర్మయు సంభవింపనపు డెవనినీ జంపడు, ఎవనినీ జంపుటకునుఁ బ్రేరేపింపఁడని మాత్రము చెప్పుట యెట్లు సమంజసమగు నని శంకింపరాదు, ఎవనినిఁ జంపడు అనునది దృష్టాంతార్థమునుగ జెప్పెను. అనగా విద్వాంసు డెట్లు యెవరినిగాని చంపడో అదేతీరున యేకర్మయుఁ జేయఁడని యాశయము.

శ్రీకృష్ణపరమాత్మ విద్వాంసున కేకర్మయు సంభవింపకపోవుటయం దేహేతువును గురుతించి "కథం స పురుషః" అని కర్మల నాక్షేపించుచుండెను?

యవములు క్షీణించుటచేత గాని, లేక గుణములు క్షీణించుటచేతను గాని యొకవస్తువు నశించుట యనుభవసిద్ధము. కాన యవయవములయొక్క గాని, గుణములయొక్క గాని క్షీణత్వము లేమింజేసి యాత్మకు వినాశము సంభవింపదని యభిప్రాయము.

"ఆత్మ జన్య మగుటంజేసి వినాశిగ నూహించెద నసెదవేమో యట్లునూ గాదు" అని చెప్పుటకు 'అజం' (జన్మరూపాదివికారరహితునిగ) అని చెప్పఁబడెను. ఆత్మ పుట్టువులేని దనుటలో హేతువుగ 'నిత్యం' (ఎల్లపుడు నుండునదిగ) అని చెప్పఁబడెను. లోకమున బూర్వమునందులేని వస్తువునకే జన్మ యనుభవసిద్ధము కాని, యెల్లపుడు నుండు సత్తునకు జన్మ ముండదని యభిప్రాయము.

లేక 'అవినాశినం' (అబాధ్యునిగ) అనగా సత్యరూపునిగ నని నిశ్చితార్థము. 'నిత్యం' (సర్వవ్యాపకునిగ) ఈవిషయమున హేతువుగ "అజం, అవ్యయం" (జన్మవినాశశూన్యునిగ) అని చెప్పఁబడెను. లోకమున పుట్టువు.

శాంకరభాష్యమ్:—

(2) ననూక్త ఏవాత్మనోఽవిక్రియత్వం సర్వకర్మాసంభవకారణవిశేషః, సత్య ముక్తో నతు స కారణవిశేషోఽన్యత్వా ద్విదుషోఽవిక్రియా దాత్మన ఇతి । న హ్యవిక్రియం స్థాణుం విదితవతః కర్మ న సంభవతీతిచే న్న, విదుష ఆత్మత్వాత్ । న దేహాదిసంఘాతస్య విద్వత్తా । అతః పారిశేష్యా దసంహత ఆత్మా విద్వా నవిక్రియ ఇతి తస్య విదుషః కర్మాసంభవా దాక్షేపో యుక్తః "కథం స పురుషః పార్థ!" ఇతి । యథా బుద్ధ్యాద్యాహృతస్య శబ్దాద్యర్థ స్యావిక్రియ

శాంకరభాష్యతత్త్వబోధని:—

(2) ప్రశ్నికుని యభిప్రాయమును దెలిసికొనక విద్వాంసున కేకర్మయు సంభవింపక పోవుటయందుఁ గారణ మాత్మయందుగల యవిక్రియయే యని చెప్పఁబడెనని సమాధానము జెప్పగా వాది యిట్లనియెను. "నీచే నాత్మ యవిక్రియమగుటచేత విద్వాంసున కేకర్మయు సంభవింపదని చెప్పబడిన వాక్యము సత్యమే. కాని విద్వాంసు డవిక్రియమగు నాత్మకన్న భిన్నుఁ డగుటచేత నాత్మయందుండు నవిక్రియత్వము విద్వాంసునకుఁ గర్మ సంభవింపకపోవుటయందు గారణముకాదు కూటస్థము, నవిక్రియమునగు బ్రహ్మమును దెలిసికొనినవానికి విక్రియ (కర్మ) యెట్లు సంభవించును? అటులైన బ్రహ్మజ్ఞాన మెట్లు సంభవించును. విక్రియకలవానికి నవిక్రియ కూటస్థబ్రహ్మజ్ఞానము ప్రాప్తింపనేరదు. కాన గూటస్థము నవిక్రియమునగు బ్రహ్మమును దెలిసికొనినవానికి విక్రియ (కర్మము) సంభవింప దనెదవా? ఇది దృష్టవిరుద్ధము. ఏలయన? అవిక్రియ (చలనాదికర్మరహిత) మగు స్థాణువును "ఇది స్థాణు" వని దెలిసినవానికిఁ గర్మ సంభవింపకపోవుటలేదు అనగా గర్మ సంభవించుచునే యున్నది కాన నవిక్రియమగు బ్రహ్మమును దెలిసికొనినవానికిఁ గూడ గర్మ సంభవించును. అందుచే విద్వాంసున కేకర్మయు సంభవింపకపోవుటయం దాత్మనిష్ఠమగు యవిక్రియత్వము కారణము కాదని శంకింపరాదు. "అయమాత్మా బ్రహ్మ" (ఈజీవుఁడు బ్రహ్మస్వరూపుడు) అను శ్రుతిచే విద్వాంసు డవిక్రియ మగు నాత్మస్వరూపుడు. కాన విద్వాంసుఁ డవిక్రియుఁ డగుటఁజేసి విద్వాంసునకు నేకర్మయు సంభవింపనేరదు మఱియు విద్వత్త్వము దేహాదికార్యకరణసంఘాతవిశిష్టాత్మకా? లేక, శుద్ధాత్మకా? దేహాదిసంఘాతవిశిష్టమునకే విద్వత్త్వ మనినచో దేహాదిసంఘాతవిశిష్టమునకు విద్వత్త్వము ప్రాప్తించునపుడు విశేషణ మగు దేహాదికార్యకరణసంఘాతమునకు గూడ విద్వత్త్వము ప్రాప్తింపవలసివచ్చును. దేహాదికార్యకరణసంఘాతము జడ మగుటంజేసి దేహాదికార్యకరణ

వినాశములు కల నేవస్తువునకైనను సర్వవ్యాపకత్వము, సత్యత్వము కల్గుటలేదు. కాన పుట్టువు, వినాశములేని యాత్మ సత్యము, సర్వవ్యాపకము నగునని యభిప్రాయము.

(పైన జెప్పినవిధముగ సర్వవిక్రియాశూన్యునిగ) 'ఏనం' (దేహరూపము, స్వస్వరూపమునగు నాత్మను) "యః వేద" (శాస్త్రముచేతను, ఆచార్యోపదేశముచేతను ఎవడు దెలిసికొనునో) అనగా "నేను సర్వవిక్రియాశూన్యుడను, సర్వమును భాసింపఁజేసెడివాడను. సర్వద్వైతరహితుడను, పరమానందబోధరూపుడను" అని యెవఁడు దెలిసికొనునో 'సః' (అట్టి విద్వాంసుఁడు, పూర్ణరూపుఁడు నగు పురుషుడు) "కం హంతి" (యెవనిని జంపును!) "కథం హంతి" (యెట్లు జంపును!) ఇట కింశబ్ద మాక్షేపార్థకము. ఎవనినీ జంప డనియు, ఎట్లును

శాంకరభాష్యమ్: —

ఏవ సన్బుద్ధివృత్త్యవివేకజ్ఞానేనావిద్యయోపలబ్ధాత్మా కల్ప్యతే, ఏవ మేవాఽఽత్మానాత్మ వివేకవిజ్ఞానేన బుద్ధివృత్త్యా విద్యయాఽసత్యరూపయైవ పరమార్థతోఽవిక్రియ ఏవాత్మా విద్వా నుచ్యతే, విదుషః కర్మాసంభవవచనా ద్యాని కర్మాణి శాస్త్రేణ విధీయన్తే తా న్యవిదుషో విహితానీతి భగవతో నిశ్చయోఽవగమ్యతే ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సంఘాతమునకు విద్వత్త్వ మంగీకరింప వీలుకాదు కాన( బారిశేష్యన్యాయమున దేహాదికార్య కరణసంఘాతముతో గూడినకేవలాత్మకే విద్వత్త్వము సిద్ధించుచున్నది. శుద్ధునకే విద్వత్త్వ మనినచో "అసంగో హ్యాయం పురుషః" అను శ్రుతివలన దేహాది కార్యకరణసంఘాతసంబంధము లేని శుద్ధము బ్రహ్మమే యగును. జీవబ్రహ్మలకు విరుద్ధధర్మములను సాధించు ప్రమాణి కాను మానము లేమింజేసియు జీవబ్రహ్మముల కభేదమే సిద్ధించును. కాన విద్వాంసుడు దేహాది కార్యకరణసంఘాతావిశిష్టు డగునాత్మ స్వరూపుడగుటచేత నవిక్రియుడు అవిక్రియుడగుటం జేసి 'కథం స పురుషః' అని విద్వాంసున కేకర్మయు సంభవింపనేరదను నాక్షేపము సమంజసము.

"అవిక్రియమగు బ్రహ్మమునకు విక్రియారూపమగు విద్య సంభవింపదు, అట్టి బ్రహ్మ స్వరూపమగు విద్వాంసునకుమాత్ర మెట్లు విక్రియారూపమగు విద్య సంభవించును?" అని శంకింపరాదు.

ప్రదీపముయొక్క ప్రభ దేశాంతరమున వ్యాపించునట్లు తేజోరూపమగు నంతఃకరణ మదృష్టవశమున జక్షురాదిగోళకద్వారమున ఘటపటాదివిషయదేశమున కేగి ఘటపటా ద్యాకారముగ బరిణమించును. ఇట్టి యంతఃకరణపరిణామమునకు బుద్ధివృత్తియని పేరు. అట్టి యంతఃకరణవృత్తి యందు సర్వవ్యాపకమైన చైతన్యము ప్రతిబింబించును. అట్టి చైతన్యమున కభివ్యంజకము బుద్ధివృత్తి. అట్టి బుద్ధివృత్తికి చైతన్యమునకు భేదజ్ఞానము లేమిం జేసి యా ప్రతిబింబిత చైతన్యమే విషయజ్ఞాన (ఘటపటజ్ఞాన) మని వ్యవహరింపబడును. అట్టి జ్ఞానముచే నాత్మ యుపలబ్ధ (దెలిసికొనువాడు) అని కల్పింపఁబడును. ఈ కల్పనకవిద్యవలన గలుగు నాధ్యాసికసంబంధము హేతువు, (అనగా నంతఃకరణైకాధ్యాసనిబంధనము.)

అట్టి యాధ్యాసిక సంబంధమువలననే 'తత్త్వమసి' ఇత్యాదిమహావాక్యములవలన నంతః కరణవృత్తి జనించును. అట్టిమహావాక్యములవలనజనించిననంతఃకరణవృత్తియే జీవనబ్రహ్మైక్యా

జంప డనియు నర్థము. అట్లే "కం ఘాతయతి" (ఎవనినీ జంపించు) నని యర్థము. సర్వవిక్రియాశూన్యుడు, నకర్తయు నగు నాత్మకు హననక్రియయందు కర్తృత్వము సంభవింపదనియాశయము. ఈవిషయమునే 'ఆత్మానం చే ద్విజానీయా దయ మస్మీతి పూరుషః । కిమిచ్ఛ న్కస్య కామాయ శరీరమనుసంజ్వరేత్" అను శ్రుతిగూడ జెప్పుచున్నది.

శుద్ధమగు నాత్మను దెలిసికొనినవానికి నాత్మాజ్ఞానమువలన జనించెడి యధ్యాస నివృత్తమగును. అట్టి యధ్యాస నివృత్తమగుచో తన్మూలకమగు రాగద్వేషములుసంభవింపనేరనందున కర్తృత్వభోక్తృత్వము లాత్మకు సంభవములు కావని శ్రీకృష్ణపరమాత్మ "కం ఘాతయతి హంతి కం" అను వాక్యముచే చూపుచుండెను.

శాంకరభాష్యతత్త్వబోధిని:—

భివ్యంజకము. అట్టి బ్రహ్మాత్మైక్యాభివ్యంజకబుద్ధివృత్తిద్వారమున నాత్మ 'విద్వాన్' విద్వాంసుడని వ్యవహరింపఁబడును. అనఁగా నట్టి బుద్ధివృత్తియందు నాత్మచైతన్యము ప్రతిబింబించును. అట్టి బుద్ధివృత్తికి జైతన్యమునకు భేదజ్ఞానము లేమింజేసి యా ప్రతిబింబితచైతన్యమే జీవబ్రహ్మైక్యజ్ఞానము 'విద్యా' యని వ్యవహరింపఁబడును. అట్టి జ్ఞానముచే నాత్మ 'విద్వాన్' విద్వాంసుడని కల్పింపబడును. కాన మిథ్యాసంబంధము పారమార్థికమగు నవిక్రియత్వభంజకము కానేరదు.

"అహంబ్రహ్మ" (నేను బ్రహ్మను). అనుబుద్ధివృత్తి మోక్షావస్థయందుఁగూడ నుండును. అందువలన నాత్మ సవిశేషమే(అనగా సక్రియమే) కాని యవిక్రియము కానేరదని శంకింపరాదు.

'అహం బ్రహ్మాస్మి' నేను బ్రహ్మమును అను బుద్ధివృత్తి యసత్యరూపము (అనగా నాబుద్ధివృత్తి యంతఃకరణపరిణామము) అంతఃకరణము తన్మాత్రజన్యము. తన్మాత్రలు మాయాపరిణామము. మాయ యనగా నవిద్య. అట్టి యవిద్యకు విరోధియగు 'అహం బ్రహ్మాస్మి' (నేను బ్రహ్మను) అను బుద్ధివృత్తివలన దేజస్సుచే దిమిరము నశించినట్లు అవిద్య నశించును. కారణమగు నవిద్య నివృత్తమైనఁ గార్యమగు పంచతన్మాత్రలు నివృత్తములగును. పంచతన్మాత్రలు నివృత్తములైన దత్కార్యమగు నంతఃకరణము నివృత్తమగును. అంతఃకరణము నశించినపిదప నాశ్రయము లేమింజేసి కాష్ఠములు దగ్ధమైనపిమ్మట తద్గతమగు నగ్ని స్వయముగ శాంతించినట్లాయంతఃకరణవృత్తి స్వయముగ నశించును. కాన నట్టి బ్రహ్మాత్మైక్యవిషయకమగు వృత్తి (విద్య) నశించును గాన నది మోక్షావస్థయం దుండదు. కనుక నాత్మ యవిక్రియ మగుటయం దేమియు యభ్యంతరము లేదు.

"కూటస్థమగు నాత్మకు మిథ్యారూపమగు విద్యాసంబంధ ముండినను నట్టి యాత్మకు గర్మాధికారము లేమింజేసి కర్మ లెవనికి విధింపబడుచున్నవి? అధికారశూన్యుల కనెదవా? అధికారము లేనివారలకు విధిమాత్ర మెట్లు సంభవించును?" అని యాశంకింపరాదు.

"అహం బ్రహ్మాస్మి" (నేను బ్రహ్మస్వరూపుఁడను) అను విద్యకలవానికి యష్టవ్యదేవతాంతరము లేమింజేసి కర్మలు సంభవింపకపోయినను "యావజ్జీవ మగ్నిహోత్రంజుహుయాత్" "వసంతే వసంతే జ్యోతిషా యజేత" "అహరహ స్సంధ్యా ముపాసీత" ఇత్యాదివిధివిహితకర్మలు "నేను త్రైవర్ణికుడను, శరీరముకన్న భిన్నుఁడను, పరలోకసంబంధముకలవాడను, నాకు కర్మఫలప్రదాత యీశ్వరుడు" అను జ్ఞానముకల యవిద్వాంసునకు విధింపబడుచున్నవని శ్రీకృష్ణపరమాత్మ నిశ్చయము.

---

శ్రీకృష్ణపరమాత్మ యాశయమిది: విచారింపగ నాత్మ సర్వవిక్రియాశూన్యస్వభావము గలదనుటవలన దేనినీ చేయదు; చేయించదు. మఱేమనిన? స్వప్నమునందువలె నజ్ఞానముచే గర్తృత్వాదిక మాత్మయందుకలదని యభిమానింపఁబడుచున్నవి. ఈవిషయమునే "ఉభౌ తౌ న విజానీతః" అను వాక్యముగూడ దెలుపుచున్నది. 'ధ్యాయతీవ లేలాయతీవ' అను శ్రుతిగూడ నీవిషయమునే బోధించుచున్నది. కనుకనే సర్వశాస్త్రములయం దవిద్వాంసునకే యధికారము గలదు. విద్వాంసుఁ డన్ననో "ఇది స్థాణువు" అని దెలిసినవాడు స్థాణుస్వరూపమునందు

శాంకరభాష్యమ్:—

(౩) నను విద్యాప్యవిదుష ఏవ విధీయతే విదితవిద్యస్య పిష్టపేషణవ ద్విద్యావిధానానర్థక్యాత్। తత్రావిదుషః కర్మాణి విధీయన్తే న విదుష ఇతి విశేషో నోపపద్యతే। న అనుష్ఠేయస్య భావాభావవిశేషోపపత్తేః। అగ్నిహోత్రాది విధ్యర్థజ్ఞానోత్తరకాల మగ్నిహోత్రాదికర్మానేక సాధనోపసంహారపూర్వక మనుష్ఠేయం కర్తాహం మమ కర్తవ్య మిత్యేవంప్రకారవిజ్ఞానవతోఽ విదుషో యథాఽనుష్ఠేయం భవతి నతు తథా నజాయత ఇత్యా దాత్మస్వరూపవిధ్యర్థజ్ఞానోత్తర

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(౩, "విద్యకలవానికి విద్యను విధించుట పిష్టపేషణమువంటి దగును. కాన నవిద్వాంసునకే విద్యయు విధింపబడినది. అవిద్వాంసునకే కర్మలును విధింపబడినవి విద్వాంసునకు కర్మలు విధింపబడుటలేదే యని యనుటయం దేమి విశేషము కలదు" అని శంకింపరాదు

ధర్మజ్ఞానానంతర మనుష్ఠేయమగు నగ్నిహోత్రాదికమునకు సత్త్వము (ఉనికి) బ్రహ్మజ్ఞానానంతర మనుష్ఠేయమగు నగ్నిహోత్రాదికముయొక్క యసత్త్వమువలన నజ్ఞానికి యగ్నిహోత్రాదిక మనుష్ఠేయము. అది యెట్లనిన? 'యావజ్జీవ మగ్నిహోత్రం జుహుయాత్" (బ్రతికియున్నంతకాల మగ్నిహోత్రము సేయనగు నని విధివాక్యము. అట్టివిధివాక్యార్థజ్ఞానానంతర "మనేకసాధనసంగ్రహపూర్వకముగ నగ్నిహోత్రాదికర్మ నాకు కర్తవ్యము. నేను శరీరముకన్న వేరు, నిత్యుడను, నేను గర్తను పరలోకసంబంధము కలవాడను, నాకర్మకు ఫలప్రదాత యీశ్వరుడు" అను నిట్టి జ్ఞానముకల యవిద్వాంసున కెట్లు బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానము లేమింజేసి యగ్నిహోత్రాదికర్మ కర్తవ్యమో యట్లవిక్రియాత్మజ్ఞాన మనుష్ఠేయమగు నగ్నిహోత్రాదికర్మకు విరోధియగుటంజేసి "నేను గర్తనుకాను, భోక్తనుకాను, నిష్క్రియాత్మస్వరూపుడను" అను జ్ఞానమాత్రమే విద్వాంసునకు సంభవించునుగాని యంతకన్న వేఱొండగ్నిహోత్రాదికర్మము పుట్టనేరదు. (ప్రాప్తింపనేరదు) కాన నవిద్వాంసునకు విద్వాంసునకు గల విశేషమిదియే యుపపన్నము.

"విద్వాంసునకు జేయదగిన కర్మయే లేనిచో "విద్వా న్యజేత" విద్వాంసుడు యాగము సేయవలెను.. అనుశాస్త్రము విద్వాంసునకు గర్మనెట్లు విధించుచున్నది? " అనియాక్షేపింపరాదు

చోరత్వమును దలపనటుల మూలమగు నవిద్యతోగూడ నధ్యాస (భ్రమ) యొక్క నాశమువలన నాత్మయందు కర్తృత్వాదికమును దలపడు. కాన విద్వాంసుడు విక్రియారహితుడు, అద్వితీయము నగుటవలన "నకరోతి కారయతి చ" (దేనిని చేయడు, చేయించడని) చెప్పబడును. ఈవిషయమునే "విద్వాన్న బిభేతి కుతశ్చన" అను శ్రుతిగూడ జెప్పుచున్నది. అర్జునుడన్ననో తనయందు కర్తృత్వమును శ్రీకృష్ణపరమాత్మయందు కారయితృత్వమును యధ్యసించి (భ్రమించి) భీష్మద్రోణాదిహింసానిమిత్తక మగు దోషము నుభయులయం దాశంకించెను.. ఇట్టి యాశయమును దెలిసికొనిన శ్రీకృష్ణపరమాత్మయు "న హంతి న ఘాతయతి" అని కర్తృత్వ కారయితృత్వము లాత్మయందు సంభవింపవని యాక్షేపించెను. నాయందు కారయితృత్వము నారోపించి ప్రత్యనాయ శంకను చేయకుమని యాశయము.

ఆత్మ యవిక్రియమని చెప్పుటచే కర్తృత్వమాత్మకు నిషేధింపఁబడెను. అందుచే కర్మమాత్ర మాత్మకు

శాంకరభాష్యమ్:—

కాలభావి కించిదనుష్ఠేయం భవతి । కిన్తు నాహం కర్తా నభోక్తేత్యాద్యాత్మైకత్వాకర్తృత్వాది విషయజ్ఞానా దన్య న్నోత్పద్యత ఇత్యేష విశేష ఉపపద్యతే । యః పునః కర్తాహ మితి వేత్త్యాత్మానం తస్య మమేదం కర్తవ్య మిత్యవశ్యం భావినీ బుద్ధి స్స్యా త్తదపేక్షయా సోఽధికిృయత ఇతి తం ప్రతి కర్మాణి । సచావిద్వాన్ "ఉభౌ తౌ న విజానీతః" ఇతి వచనాత్ । విశేషితస్య చ విదుషః కర్మాక్షేపవచనాత్ "కథం స పురుషః" ఇతి । తస్మాద్విశేషిత స్యావిక్రియాత్మ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఎవఁడు 'నేను గర్తను' అని శరీరాదులకన్న విలక్షణమగు నాత్మస్వరూపమును దెలిసికొననో అట్టివానికి నాకీ "యగ్నిహోత్రాదికము కర్తవ్య" మని యవశ్యము బుద్ధిగలుగును. కాన వాఁడట్టి కర్తృత్వజ్ఞానము నవలంబించి కర్మలయం దధికారి యగునని యట్టివాని నుద్దేశించి కర్మలు విధింపబడెను. వాడు శరీరాదులకన్న భిన్నుడనని యాత్మజ్ఞానము కలవాడు అట్టి శరీరభిన్నాత్మదర్శి నుద్దేశించియే 'విద్వా న్యజేత' అను శ్రుతి కర్మలను విధించుచున్నది. కర్మలయం దధికారమును సంపాదించు విద్య యనగ నీమంత్రి మీకర్మయందు వినియోగింపవలయును ఈకర్మయందు నీదేవత; ఈకర్మయందు జరువును వినియోగింపవలయును; ఈకర్మయందు బురోడాశమును వినియోగింపవలయును; నేను శరీరాదులకన్న భిన్నుడను, నాకు బరలోకసంబంధము గలదు; నాకర్మఫలప్రదాత యీశ్వరుడు" అను నీజ్ఞానమే కర్మలయం దధికారప్రయోజకము. ఇట్టి జ్ఞానమే 'విద్వా న్యజేత' 'విద్వా న్యాజయతి' అను స్థలములయందు గల విద్వచ్ఛబ్దములచే జెప్పఁబడును. కాని 'నేను గర్తనుగాను, భోక్తనుగాను, నిష్క్రియాత్మస్వరూపుడ' నను జ్ఞానము కానేరదు అందువలన 'నేను గర్తను, నేను భోక్తను' అను జ్ఞానము కలవాఁడు 'ఉభౌ తౌ న విజానీతః' నేను జంపువాడను (కర్తను) నేను జంపబడువాడను అను నీయిరువురు నాత్మజ్ఞానశూన్యులను భగవద్గీతావచనానుసార మవిద్వాంసులే. అట్టి యవిద్వాంసులకు గర్మలు విధింపబడెను.

పర్యవసితాశయము:— ఎవనికి 'నేను కర్తను, భోక్తను' అను జ్ఞానము కలదో వానికి 'నేను గర్మలయం దధికారి' నను జ్ఞానము కలుగును. అట్టివాని నుద్దేశించి కర్మలు విధింపఁ

సంభవింపదు. కాన నిచ్చట హంతి (హననము) ఉపలక్షణము. ఉపలక్షణమనగ వక్తవ్యార్థమునం దేకదేశమును జెప్పుట. అట్టి యేకదేశముచేతనే వక్తవ్యమగు నన్నిటికి గ్రహణము. ప్రస్తుతమున సర్వకర్మ లాత్మను నిషేధింపవలసియుండ నట్టి కర్మలయం దేకదేశమగు హననరూపకర్మను నిషేధించెను. ఇది యుపలక్షణము. హననశబ్దముచే నిఖిలకర్మలు గ్రహింపవలయునని యాశయము. కాన "నహంతి" అను వాక్యముచే నాత్మను నిఖిలకర్మలు నిషేధింపబడినవి. ఈ విషయమునే 'తస్య కార్యం న విద్యతే' అను శ్రుతికూడ దెలుపుచున్నది. అందువలన "తస్మాద్యుధ్యస్వభారత" అను స్థలమునందు హననము భగవంతునిచే నభ్యనుజ్ఞాతమగుటచేతనూ, వాస్తవకర్తృత్వాభావము సర్వకర్మలయందు సమాన మగుటవలనను, "కంఘాతయతి హంతికం" అను వాక్యముచే "భగవానులు హననకర్మనుమాత్రము నిషేధించుటచే నితరకర్మలను జ్ఞానిచేయుటయం దభ్యనుజ్ఞ నొసగె" నని కర్మజ్ఞానసముచ్చయవాదము నంతఃకరణ యందుంచుకొని పలికెడి మూఢజనకల్పితము నిరస్తము.

శాంకరభాష్యమ్:—

దర్శినో విదుషో ముముక్షోశ్చ సర్వకర్మసంన్యాస ఏవాధికారః । అత ఏవ భగవాన్నారాయణః సాంఖ్యాన్విదుషోఽవిదుషశ్చ కర్మిణః ప్రవిభజ్య ద్వే నిష్ఠే గ్రాహయతి— 'జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం'' ఇతి । తథాచ పుత్రాయాహ భగవా న్వ్యాసః— 'ద్వా విమా వథ పంథానౌ' (మహాభా-శాం-240-6) ఇత్యాది ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

బడెను. ఇట్టి కర్మాధికారి "ఉభౌ తౌ న విజానీతః" అను వాక్యానుసార మవిద్వాంసు డని నిశ్చిత మగుచున్నది.

"నేను గర్తనగాను, భోక్తనుగాను, నిష్క్రియాత్మస్వరూపుడ" నను నిశ్చయ మెవనికిఁ గలదో వానికి నధికారప్రయోజక మగు "నేను గర్తను, సక్రియుఁడ" నను విరుద్ధజ్ఞానము గలుగజాలదు. కాన నట్టి విద్వాంసునకు గర్మలయందు బ్రవృత్తి కలుగదు.

ఎవనికి "నేను గర్తనుగాను, భోక్తనగాను, నిష్క్రియాత్మస్వరూపుఁడ" నను జ్ఞానము కలదో యట్టి విద్వాంసునకు "వేదావినాశినం నిత్యం" అను వచనముచే గర్మ లాక్షేపింప బడుటంబట్టి కర్మ సంభవింపదు.

నిష్క్రియాత్మజ్ఞానికి గర్మలు సంభవింపకున్న వివిదిష (ఆత్మజ్ఞానశూన్యుఁడై యాత్మ జ్ఞానము కావలె నను యిచ్ఛ) గలవానికిఁ గర్మలు సంభవింపవా? యని శంకింపరాదు.

కర్మలు విద్యావిరోధులు. తన కిష్టమగు మోక్షమునకు ప్రతిబంధకములగుటంబట్టియు "న జాయతే" ఇత్యాదివాక్యములచే బోధింపఁబడు నిష్క్రియాత్మదర్శి యగు విద్వాంసుఁడగు, ముముక్షువునకు సర్వకర్మసంన్యాసమునందే యధికారము. కర్మలయం దెంతమాత్ర మధికారము లేదు.

విచారించిన ముముక్షువున కాశ్రమకర్మ లపేక్షితములు అవియు విద్యకు, విద్యాఫల మగు మోక్షమునకు ప్రతిబంధకములు కానివై ముముక్షువు కర్తవ్యములు. అట్లుకాక సర్వ కర్మలయందు ముముక్షువున కభ్యనుజ్ఞ కలదన్నచో వివిదిషాసంన్యాసము లేకపోవలసివచ్చును. కాన విద్యకు, తత్ఫలమోక్షమునకు విరోధులుకాని యాశ్రమకర్మలయందు ముముక్షువున కధి కారము కలదు. అందువలననే నారాయణుం డగు శ్రీకృష్ణపరమాత్మ సాంఖ్యు (జ్ఞాను) లగు విద్వాంసులను, కర్మలగు నవిద్వాంసులను వేఱుజేసి 'జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం' అని వారిరువురకు వేర్వేరుగ జ్ఞాననిష్ఠ, కర్మనిష్ఠలను జెప్పుచుండెను.

అధికారిభేదము ననుసరించి యీజ్ఞాననిష్ఠ, కర్మనిష్ఠ అను నిష్ఠాద్వయమును శ్రీకృష్ణపర మాత్మయే జెప్పియుండలేదు. శ్రీవేదవ్యాసమహర్షి గూడ తనకుమారుఁడగు శ్రీశుకునకు "ద్వా

శంకరానందీయము:— అహమర్థమగు నాత్మనకు గల నిర్వికారత్వమును, నిత్యకూటస్థాసంగచిద్రూపత్వము నమునదియే పారమార్థికమగు తత్త్వమని నిరూపించి యట్టి పరమార్థతత్త్వమును దెలిసికొనిన విద్వాంసునకే సర్వ కర్మసంన్యాసమునం దధికారము కలదు కాని మఱియొకనికి లేదని దెల్పుట కీశ్లోకమును జెప్పుచున్నాడు.

బ్రహ్మచర్యాహింసాదివివేకవైరాగ్యశమదమాదిశ్రుత్యాచార్యేశ్వరప్రసాదరూపము, నియతము నగు శ్రుత్యాదిసాధనసంపత్తితో గూడినట్టియు, మోక్షైకప్రయోజనుఁడు, ముముక్షువు నగు యధికారి బ్రహ్మవేత్త

శాంకరభాష్యమ్:—

(4) తథాచ క్రియాపథశ్చైవ పురస్తాత్ప్రజాపతేః సన్న్యాసశ్చేతి । ఏత మేవ విభాగం పునః పున ర్దర్శయిష్యతి భగవాన్—అతత్త్వవిత్, "అహంకారవిమూఢాత్మా కర్తాహ మితి మన్యతే" (గీత-27) తత్త్వవిత్తు నాహం కరోమీతి । తథాచ "సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే" ఇత్యాది ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

విమా వథ పంథానౌ" "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" అను నధ్యయనవిధిచే త్రైవర్ణికులకు (బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు) వేదాధ్యయనమునందు బ్రవృత్తులైనపిమ్మట నధికారిభేదము ననుసరించి కర్మమార్గమనియు, జ్ఞానమార్గమనియు రెండుమార్గములు గలవనిబోధించెను.

(4) "ద్వా విమా వథ పంథానౌ" అను శ్రీవ్యాసమహర్షి వాక్యమునకు గర్మమార్గము, జ్ఞానమార్గము నని యర్థము. ఈవాక్యముచే విద్వ దవిద్వదూపాధికారిభేదము ననుసరించి యీ కర్మజ్ఞానమార్గములు చెప్పబడె నని గ్రహింపనగును: 'ఈరెండుమార్గములు గూడ బ్రాణుల శ్రేయస్సునకు సమానములే యని యేల గ్రహింపగూడ' దని శంకింపరాదు.

ఆవ్యాసమహర్షియే యుత్తరత్ర శ్రీశుకులనుగూర్చి "క్రియాపథశ్చైవ పురస్తాత్ప్రజా త్సంన్యాసశ్చ" మొట్టమొదట గర్మమార్గము. అనగా ఫలనిరపేక్షులై యీశ్వరార్పణబుద్ధిచే గర్మల నాచరింపవలయును. అట్టి కర్మాచరణమువలన నంతఃకరణము శుద్ధమై కర్మమునందు, కర్మఫలమునందు వైరాగ్యము జనించును. అట్టి వైరాగ్యముగలవానికి సర్వకర్మసంన్యాసము. కానఁ గర్మమార్గజ్ఞానమార్గములు శ్రేయస్సును గూర్చి సమకారణములు కావని చెప్పెను.

అవిద్వాంసునకుఁ గర్మమార్గ మనియు, విద్వాంసునకు జ్ఞాననిష్ఠయనియు బోధించి శ్రీకృష్ణపరమాత్మ ఈగీతలయందు మున్ముందు మాటిమాటికి "అహంకారవిమూఢాత్మా కర్తాహ మితి మన్యతే" (అవిద్వాంసుడు నేను కర్త నని తలచు ననియు) తత్త్వవేత్త "నేను గర్తను గా నని తలఁచు ననియు, నెవడు విరక్తుఁడో యట్టివాడు "సర్వకర్మాణి మనసా సంన్యస్యాస్తే సుఖం వశీ" సర్వకర్మలను మనస్సుచేఁ ద్యజించి సుఖముగ నుండునని చెప్పును.

యగు గురువు సన్నిధియందు శ్రద్ధాభక్తులతో నెల్లపుడు నాచరింపబడిన శ్రవణాదులచే గల్గుజ్ఞానముచే ననుభూయమానమగు 'ఏనం' (ఈప్రత్యగూపము వహమర్థమునగు యాత్మను) 'అజం' (జన్మాదిసర్వవికారశూన్యుని గను) కనుకనే 'అవ్యయం' (ఏవిధముగను యపక్షయము బొందనివానిగను "అవినాశినం" (బ్రత్యక్షాదిప్రమాణములచే నెట్లు రజ్జుసర్పము యొక్క సత్త్వమునకు బాధకలుగుచున్నదో యట్లే యేవస్తువునకైనఁగల్గు సత్తాబాధము ద్రిక్యగుణాములచే బరిచ్ఛిన్నమగుట వినాశమనబడును) అట్టిది లేనిదిగను (పరిపూర్ణునిగను) కనుకనే "నిత్యం" (ఏకరూపము. నద్వితీయము నగు నాత్మతత్త్వమును "ఈయాత్మస్వరూపుఁడనే నేను" యని) 'యో వేద' (ఎవఁడు తెలిసికొనునో) 'సపురుషః' (సర్వాత్మభావమును బొందినయావిద్వాంసుడు) 'కథం' (ఏప్రకారముగ) 'కంహంతి' (ఎవనిని విషయముగా జేసికొని హననక్రియను జేయును!) "కం ఘాతయతి" (ఎవనిని హననక్రియయందు బ్రవర్తింపజేయును!) ఇట నంతటను 'కిం' శబ్దమాత్రే పార్థకముగాని ప్రత్యుత్తరము లేమింజేసి ప్రశ్నార్థకమునం జెల్లదు. 'కథం' అని సాధనమును, 'కం' అని విషయమును, 'కం ఘాతయతి' అని ప్రయోజ్యమును యాత్రే

శాంకరభాష్యమ్:—

(5) తత్ర కేచిత్పండితంమన్యమానా వదంతి- జన్మాదిషడ్భావవిక్రియారహితోఽవిక్రియోఽకర్తైకోఽహ మాత్మేతి న కస్యచి ద్జ్ఞాన ముత్పద్యతే యస్మి న్సతి సర్వకర్మసంన్యాస ఉపదిశ్యతే। న, న జాయత ఇత్యాదిశాస్త్రోపదేశానర్థక్యాత్ । యథాచ శాస్త్రోపదేశసామర్థ్యా ద్ధర్మాస్తిత్వ విజ్ఞానం కర్తు శ్చ దేహాంతరసంబంధిజ్ఞానం చోత్పద్యతే తథా శాస్త్రా త్తస్యై వాత్మనోఽవిక్రియత్వాకర్తృత్వైకత్వాదివిజ్ఞానం కస్మా న్నోత్పద్యతే ఇతి ప్రష్టవ్యాస్తే । కరణాగోచరత్వాదితి చే న్న, మనసై వానుద్రష్టవ్య మితి శ్రుతేః । (బృ 4-4-19) శాస్త్రాచా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(5) ఇంతవర కాత్మజ్ఞానికి సర్వకర్మసంన్యాసమునందే యధికారమని జెప్పఁబడెను. అట్టి సర్వకర్మసంన్యాసవిషయమునఁ బండితంమన్యులగు మీమాంసకు లిట్లు జెప్ప మొదలిడిరి.

ఎట్లనిన? ఆత్మ జ్ఞానక్రియాశక్తుల కాధారమగుటంజేసి విక్రియాశూన్యము కానేరదు. కాన నేజ్ఞాన ముండుటవలన సర్వకర్మసంన్యాసము ప్రాప్తించునో యట్టి "నేను జన్మాదిషడ్భావ విక్రియా రహితుడను, అవిక్రియుడను, కర్తనుకాను, ఒక్కడను" అను జ్ఞానమెవకిని గలుగదు. అని శంకింపవలదు.

ఎందువలననిన; 'నేను కర్తనుగాను, అవిక్రియుడను, అద్వితీయుడను. అను జ్ఞానము కలుగకపోవుటకు రెండు కారణములు. ఒకటి యవిక్రియాద్వితీయాత్మ లేకపోవుట. రెండు అట్టి యాత్మజ్ఞానమును కలుగఁజేయు ప్రమాణము లేకపోవుట. ఈ రెంటిలో యేకారణము లేక పోవుటచే నద్వితీయావిక్రియాత్మజ్ఞానముకలుగదందువు. జ్ఞానవిషయ మగునవిక్రియాద్వితీయాత్మ లేనందున యట్టి యద్వితీయావిక్రియాత్మజ్ఞానము కలుగదందువా? అట్లనుట శక్యముకాదు. ఎందువలననిన? 'నజాయతే మ్రియతేవా' ఇత్యాదిశాస్త్రమాప్తప్రణీతము. కాన నట్టి యవిక్రియాద్వితీయాత్మ లేనిచో నాప్త యగు శ్రీకృష్ణు డెట్లు చెప్పును? అందువలన నాప్తవాక్యము వలన కారణములేనిదే యవిక్రియాత్మజ్ఞానము కలుగ దని చెప్పనొప్పదు. అట్లయినచో 'న జాయతే' ఇత్యాద్యుపదేశమున కానర్థక్యము ప్రాప్తించును అందువలన నవిక్రియాత్మ రూపవిషయ మున్నదని యొప్పుకొనవలయును. విషయముండగ 'విషయములేదుకాన నట్టియవిక్రియాత్మజ్ఞానము కలుగ' దని జెప్పుటకు వీలుపడదు.

పించుట కీవిధమననే క్రియాతత్సాధనాదులు సంభవింపకపోవుటచే నిర్వికారబ్రహ్మాత్మదర్శికి సర్వకర్మసంన్యాసమునందే యధికారమని సిద్ధించినది.

"సర్వకర్మసంన్యాసికి 'కథం హన్తి, కం హన్తి, కం ఘాతయతి' అని సాధనాద్యాక్షేపమువలన హననక్రియయే ప్రాప్తింప దని సూచింపఁబడుచుండెను. కాని సర్వకర్మలు నిషేధింపబడుటలేదు." అని శంకింపరాదు. ఏయేవ్యక్తి కినవిక్రియాత్మజ్ఞానము కలదో నాయావ్యక్తికి బ్రవృత్తి సంభవింపనందున నిర్వికారాత్మజ్ఞానము ప్రవృత్తిమాత్రముయొక్క నివృత్తికి హేతువగుటంజేసి కేవల హననక్రియామాత్రనివృత్తిని గూర్చియే హేతువని జెప్పుట శక్యముకాదు. కాన నిర్వికారాద్వితీయబ్రహ్మాత్మజ్ఞానికి "కర్తవ్యము, కారయితవ్యము నేమియులే" దని సర్వకర్మలను నిషేధించుట సంగతమే యగును.

శాంకరభాష్యమ్:—

ర్యోపదేశశమదమాదిసంస్కృతం మన ఆత్మదర్శనే కరణమ్ । తథా చ తదధిగమా యానుమాన నిగమేచ సతి జ్ఞానం నోత్పద్యత ఇతి సాహసమేతత్ । జ్ఞానం చోత్పద్యమానం తద్విపరీత మజ్ఞాన మవశ్యం బాధత ఇత్యభ్యుపగంతవ్యమ్ । తచ్చాజ్ఞానం దర్శితం-హన్తాఽహం హతోఽస్మీ త్యుభౌ తౌ న విజానీత ఇతి । అత్ర చాత్మనో హననక్రియాయాః కర్తృత్వం, కర్మత్వం హేతుకర్తృత్వం చాజ్ఞానకృతం దర్శితమ్ ।

శాంకరభాష్యతీర్థబోధనః:—

ప్రమాణము లేదుగాన నవిక్రియాత్మదర్శనము కలుగదందువా? అదియు నసంగతమే.

ఏలన: ఏవిధముగ నదృష్టమగు ధర్మము- దేహాంతరసంబంధము శాస్త్రోపదేశసామర్థ్యము (శాస్త్రము) వలన గలుగునో ఆదేతీరున శాస్త్రమువలన 'ఆత్మ యకర్త, అద్వితీయము, అవిక్రియము" అనుజ్ఞానమెందులకుకలుగదో యాపండితంమన్యుల నడుగవలసియుండును అనగా కర్మకాండ స్వతఃప్రమాణమగు వేదమగుటచే నజ్ఞాత మగు ధర్మాదిజ్ఞాన మెటుల కర్మకాండ వలన గలుగునో యట్లే బ్రహ్మకాండగూడ నుపనిషద్రూపముగాన వేద మగుటంబట్టి స్వతః ప్రమాణ మగుటచే బ్రహ్మాత్మవిషయకజ్ఞానము జ్ఞానకాండమువలన జనించు' నని యర్థము.

జ్ఞానము మనస్సంయోగమువలన జనించును. "అప్రాప్య మనసా సహ" అను శ్రుతి "యాత్మ మనోగోచరముకా" దని జెప్పుచున్నది అందువలన నాత్మ కరణగోచరము కానందున నిష్క్రియాద్వితీయాత్మజ్ఞానము సంభవింపనేర దని శంకింపజనదు.

"మనసై వానుద్రష్టవ్యం" అను శ్రుతి శాస్త్రాచార్యోపదేశశమదమాదిసంస్కృతంబగు మనస్సు నిష్క్రియాత్మదర్శనమునందు సమర్థమగుచున్నదని జెప్పుటవలన స్వరూపముచే స్వప్రకాశమగు బ్రహ్మరూపాత్మవస్తువు 'తత్త్వమసి' అను వాక్యజన్యబుద్ధివృత్తిచే నభివ్యక్తమై సవికల్పకవ్యవహారాస్పద మగుచున్నది కాన శమదమాదిసంస్కృతమనోగోచరత్వోపచారమువలన

"న జాయతే మ్రియతేవా" అనుదానిచే సర్వవిక్రియాశూన్యత్వము బ్రహ్మకు జెప్పఁబడెను. అట్టిబ్రహ్మమును దెలిసికొనువాడు జ్ఞాత యనఁబడును. అట్టి జ్ఞాత 'విద్వాన్' (విద్వాంసుడనబడును.) విద్వాంసుఁడు వికారి. కాన విద్వాంసునకు, బ్రహ్మమునకు సవికారిత్వనిర్వికారిత్వములచే భేదము కలదు. కావున వికారియగు విద్వాంసున కవిక్రియత్వజ్ఞానము సంభవము కానందున సర్వకర్మసంన్యాసము సంభవింపదు. సంన్యాసమునకు గారణమగు 'అవిక్రియము బ్రహ్మము' అనెడిజ్ఞానము కలదనెదవా? అది జ్ఞేయమగు బ్రహ్మవిషయమగుటచే వికారియగు విద్వాంసునకు సంన్యాససాధకము కానేరదు. "అచలము పర్వతము" అనెడి జ్ఞానమెట్లు జ్ఞాతకు క్రియానివృత్తికారణము కాదో అట్లేవిద్వాంసుఁడు వికారియగుటఁజేసి 'నేనవిక్రియుఁడను, అను జ్ఞానము సంభవింపక పోవుటవలన విద్వాంసునకు సర్వకర్మసంన్యాస మనుపపన్నమని శంకింపజనదు.

ఈవిషయమున వాదిని కొన్నివిషయము లడుగవలసియున్నది. ఏమనిన? "ఇద మహం జానామి" (నేను దీనిని దెలిసికొనుచుంటిని. అను స్థలమున నిద మర్థజ్ఞాత యహంప్రత్యయార్థము. అట్టి యహంప్రత్యయార్థము (1) దేహమా? (2) ప్రాణమా? (3) ఇంద్రియములా? (4) మనస్సా? (5) అహంకారమా? (6) విశ్వుడా? (7) తైజసుడా? (8) ప్రాజ్ఞుడా? (9) ఆత్మయా?

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కరణగోచరము కాదని చెప్పుట వీలుపడదు. అందువలన నిష్క్రియాత్మజ్ఞానము జనించుటకు శమదమాదిసంస్కృతమనస్సు, శ్రుతి, అనుమానప్రమాణము, ఇన్ని సాధనములుండ నిష్క్రియాద్వితీయాత్మజ్ఞానము గలుగదని చెప్పుట సాహసము.

నిష్క్రియాద్వితీయాత్మదర్శనము గలుగుగాక, దానివలన స్వీకరింపదగినది, పరిత్యజింప తగినది యేమియు లేదు. కాన నది నిష్ఫలమని శంకింపజనదు.

జనించిన నద్వితీయాత్మజ్ఞానము తద్విరుద్ధ మగు నజ్ఞానమును నశింపజేయు నని యవశ్య మంగీకరింపవలయును. అట్టియజ్ఞాన మెట్టిదనిన? 'హంతా చే న్మన్యతే హంతుం హతశ్చే న్మన్యతే హతమ్। ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే' అనుచోట నిష్క్రియాత్మకు 'నేను చంపువాడను' అని హననక్రియాకర్తృత్వము. 'నేను మరణించువాడను' అని హననక్రియాకర్మత్వము, 'నేను చంపించువాడ'నని ప్రేరణకర్తృత్వ మజ్ఞానకృతములని చూపబడెను.

దేహమే యహమర్థ మనుపక్షమున స్వప్నదేహమా? లేక జాగ్రద్దేహమా? లేక నుభయ మహమర్థమనెదవా? స్వప్నదేహ మహమర్థమన్నచో జాగ్రదవస్థయం దట్టి దేహరూపమగు నహమర్థము లేమిం జేసి జాగ్రదస్థయం దహంప్రత్యయము లేకపోయెడిని. స్వప్నదేహనాశనమువలన జ్ఞాతయగు నహమర్థముగూడ నశించుటచే నహం ప్రత్యయము లేకపోవుట యిష్టమేయనెదవా? అటులైనచో జాగ్రత్తునందు నీవే లేకపోవుటచే 'అహమస్మి' నేను లేను ప్రత్యయము నీకేః లిగెడిని. మఱియు ప్రత్యక్షవిరోధము ప్రాప్తించెడిని. కాన స్వప్నదేహ మహమర్థ మనుటకు వీలుపడదు. ఇక జాగ్రద్దేహ మహమర్థమనెదవా? అటులైన జాగ్రద్దేహరూపమగు నహమర్థము లేమిం జేసి స్వప్నమునం దొకనికైనను "నేను యుంటి" నను ప్రత్యయము లేకపోయెడిని. "నేను వెళ్ళెదను" అని చెప్పి దేహము వెళ్ళకుండుటచే దేహమే యహంశబ్దార్థ మనెదవా? "దేవా నిష్ట్వాఽహం స్వర్గం వ్రజామి" (దేవతల నుద్దేశించి యాగముజేసి స్వర్గమున కేగెదను) అను స్థలమునందు దేహము స్వర్గమునకు వెళ్ళకపోవుటచే వ్యభిచారము ప్రాప్తించును. మఱియు మరణించినదేహ మున్నను యహంప్రత్యయము కనబడుటలేదు. కాన జాగ్రద్దేహ మహమర్థమని చెప్పుట సంభవించదు. జాగ్రత్స్వప్నదేహ మహమర్థమను తృతీయపక్ష మంగీకరించినచో నట్టి దేహ మేకాలమునందు నొక్కసారి యుండకపోవుటచే నహమర్థ మనునది లేకపోయెడిని.

ప్రాణము స్వభావముచే జడమగుటవలన జాగ్రత్తునందు కాని, స్వప్నమునందు కాని దేనినీ దెలిసికొన లేదు. కాన ప్రాణమున కహమర్థత్వము సిద్ధింపదు.

ఇంద్రియము అహమర్థమను తృతీయపక్షమున నొక యింద్రియమే యహమర్థ మనెదవా? సర్వేంద్రియము అహమర్థమనెదవా? ఒక యింద్రియమే యహమర్థమన్నచో నేయింద్రియ మహమర్థ మనెదవో యట్టి యింద్రియమునకు యోగ్యమగు శబ్దాదివిషయములలో నొకటియే గ్రహింపబడును. ఇతరవిషయములు గ్రహింపబడకపోయెడిని. మఱియు శబ్దాదిసర్వవిషయములు సర్వత్ర ప్రత్యక్షమగుటచే ప్రత్యక్షవిరోధము ప్రాప్తించెడిని. సర్వేంద్రియము అహమర్థమనెదవా? "అహం బ్రాహ్మణః" (నేను బ్రాహ్మణుడను) అను స్థలమునందు ప్రత్యేకము శ్రోత్రాదీంద్రియములు బ్రాహ్మణశబ్దార్థమగుచో బ్రాహ్మణానేకత్వము సిద్ధించును. అటులైన "అయ మేకో బ్రాహ్మణః" (ఈ బ్రాహ్మణుడొకడు) అను ప్రత్యక్షసిద్ధమగు బ్రాహ్మణైకత్వవ్యవహారమునకు విరోధము సంభవించెడిని. మఱియు "ఏ నేను ఘటమును చక్షురింద్రియముచే జూచితినో యా నేను త్వగింద్రియముచే ఘటమును స్పృశించుచుంటిని." అను ప్రత్యయముచే చక్షురాదీంద్రియములకంటె భిన్నముగ నహమర్థము

శాంకరభాష్యమ్:—

(౬) తచ్చ సర్వక్రియాస్వపి సమానం కర్తృత్వాదే రవిద్యాకృతత్వ మవిక్రియత్వా దాత్మనః। విక్రియావాన్హి కర్తాఽఽత్మనః కర్మభూత మన్యం ప్రయోజయతి కుర్వితి। త దేత దవిశేషేణ విదుష స్సర్వక్రియాసు కర్తృత్వం హేతుకర్తృత్వం చ ప్రతిషేధతి భగవా న్విదుషః కర్మాధికారాభావప్రదర్శనార్థం వేదావినాశినమ్, కథం స పురుష ఇత్యాదినా। క్వ పున ర్విదుషోఽధికార ఇత్యేత దుక్తం పూర్వమేవ "జ్ఞానయోగేన సాంఖ్యానా" మితి। తథా చ సర్వకర్మసంన్యాసం వక్ష్యతి "సర్వకర్మాణి మనసే" (గీ ౫, 27) త్యాదినా।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(౬) "న హింస్యా త్సర్వా భూతాని" (ఏభూతములను హింసింపరాదు) అను శ్రుతివలన హింస నిషిద్ధము గాన నట్టి హింసాదిరూపక్రియా కర్తృత్వ మజ్ఞానకృతంబైనను "అగ్నీషోమీయం పశు మాలభేత" "వాయవ్యగ్ం శ్వేతమాలభేత" అను శ్రుతిబోధితక్రియాకర్తృత్వ మజ్ఞానకృతము కానేరదు. కాన సర్వక్రియాకర్తృత్వ మజ్ఞానకృతమని చెప్పు టెట్లు పొసగుననిన?

ఆత్మయందుండు కర్తృత్వము నిత్యము కానేరదు. అటులైన నెల్లప్పు డాత్మ కర్త యగుటంజేసి ముక్తి లేకపోయెడిని. కాన కర్తృత్వమనిత్యమని యొప్పుకొనవలయును. అనిత్యమగు భావకార్యము నిరుపాదానము కానందున నుపాదానకారణము నపేక్షించును. అట్టి భావకార్యమగు కర్తృత్వమునుగూర్చియాత్మయం దాకర్తృత్వముభాసించుటవలన యాత్మయుపాదానకారణము కానేరదు. ఆత్మయే యుపాదాన మందమన్న కూటస్థ (నిర్వికార) మగునాత్మ కవిద్యాసంబంధము లేనిదే యుపాదానత్వము పొసగదు. అందువలన సర్వక్రియలయందు కర్తృత్వ మవిద్యాకృతము (కాన నాత్మకు కర్తృత్వము సంభవింప దని యాశయము)

ఆత్మకు కర్తృత్వము సంభవింపకున్నను కారయితృత్వ మేల సంభవింపదని యాక్షేపింపవలదు. విక్రియావంతు డగు కర్త కర్మభూతుడగు మఱియొకనిని "నీవీపని చేయుము" మని ప్రేరణ జేయును. ఆత్మయన్ననో నిర్వికారము. కాన నాత్మకు కారయితృత్వము సంభవింపదు.

సిద్ధించుచుండ నింద్రియము లహమర్థమనుట సమంజసము కాదు. "మనసా హ్యేవ పశ్యతి" అను శ్రుతిచే దర్శనమునందహమర్థమునకు మనస్సు కరణమని దెలియబడుటవలన మనస్సు యహమర్థమను చతుర్థపక్షముగూడ నిరస్తము.

అహంకారము వికారియగుటవలన జ్ఞాతృత్వము సంభవింపకపోవుటచే నహమర్థత్వము సంభవింపనందున నహంకారమహమర్థమను పంచమపక్షము పరాస్తము. "అహం జానామి" (నేను దెలిసికొనుచుంటిని) అను ప్రత్యయమువలన నహంకారమునకు గూడ జ్ఞాతృత్వము ప్రతీయమాన మగుచున్నదనెదవా? అదియు సంభవింపదు. ఏందువలననిన? స్వతః అహంకారము జడము. కాన జ్ఞాతృత్వము సంభవింపనేరదు. వహ్నికి దగ్ధృత్వమువలె జ్ఞాతృత్వము చేతనధర్మ మగుటంజేసి యహంకారముజడమగుటచే నహంకారమునకు జ్ఞాతృత్వము సంభవింపదు. అట్లయిన నహంకారమునందు జ్ఞాతృత్వముభాసింపజేసెడి "అహం జానామి" (నేను తెలిసికొనుచుంటిని) అను ప్రత్యయ మెట్లుపపన్నమగుననిన? "మనుష్యోహం" (నేను మనుష్యుడను) అను ప్రతీతి దేహధర్మమగు మనుష్యత్వాధ్యాసమువలన యెట్లు గలుగునో అజ్ఞో (నేను జ్ఞాతను) : అను స్థలమునందుగూడ నన్యధర్మాధ్యాసయే యని గ్రహింపవగును. మఱియు "మమాయ మహంకారో దుష్టః" (నాసంబంధమగు నీయహంకారము దుష్టమైనది)

శాంకరభాష్యమ్:—

(7) నను మనసేతి వచనాన్న వాచకానాం కాయికానాం చ సంన్యాస ఇతిచేన్న, సర్వకర్మాణీతి విశేషితత్వాత్ । మానసానామేవ సర్వకర్మణామితిచేన్న, మనోవ్యాపారపూర్వకత్వాద్వాక్కాయవ్యాపారాణాం మనోవ్యాపారాభావే తదనుపపత్తేః । శాస్త్రీయాణాం వాక్కాయకర్మణాం కారణాని మానసాని వర్జయిత్వాఽన్యాని సర్వకర్మాణి మనసా సంన్యసేదితి చేన్న, "నైవ కుర్వన్న కారయ" న్నితి విశేషణాత్ । సర్వకర్మసంన్యాసోఽయం భగవతోక్తో మరిష్యతో న జీవత ఇతిచేన్న, "నవద్వారే పురే దేహీ...ఆస్తే" (గీ 5, 13) ఇతి విశేషణానుపపత్తేః । నహి సర్వకర్మసంన్యాసేన మృతస్య తద్దేహ ఆసనం సంభవతి ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఆత్మయందు కర్తృత్వాదిభానమున కుపాదానకారణ మనాదియు, యనిర్వచనీయము నగు నవిద్య యగును. అట్టి యవిద్యానివృత్తి తత్త్వజ్ఞానమువలన గలుగునని పూర్వగ్రంథముచే జెప్పఁబడెను. కనుకనే విద్వాంసునకు కర్మలయం దధికారము లేదని జూపుటకు శ్రీకృష్ణపరమాత్మ "వేదావినాశినం-కథం స పురుషః" ఇత్యాదివాక్యములచే (జ్ఞాని యగుటచే విద్వాంసునకు సర్వక్రియలయందు కర్తృత్వము, కారయితృత్వము లేదని) నిషేధించుచుండెను.

"జ్ఞానికి కర్మయం దధికారాభావమే భగవత్సమ్మత మైనచో జీవించియున్న జ్ఞానికి దేనియం దధికారము గలదు" అనిన "జ్ఞానయోగేన సాంఖ్యానాం" అను వాక్యము ననుసరించి జ్ఞానయోగముచే నిష్ఠను జెప్పి "సర్వకర్మాణి మనసా" అను గీతచే సర్వకర్మసంన్యాసమును శ్రీకృష్ణపరమాత్మ జెప్పగలడు. (అనగా జ్ఞానికిసర్వకర్మసంన్యాసమునందధికారమనియాశయము).

(7) వక్ష్యమాణమగు "సర్వకర్మాణి మనసా" అను వాక్యమునందు 'మనసా' అను విశేషణమువలన మానసికకర్మలకే సంన్యాసము, కాని కాయికవాచకకర్మలకు సంన్యాసము చెప్పఁబడలేదని శంకింపజనదు. "సర్వకర్మాణి మనసా" అను వాక్యమునందు 'సర్వకర్మాణి' సర్వకర్మలను వదలి అని కర్మపదమునకు సర్వపదము విశేషణ మగుటఁబట్టి కాయిక, వాచక, మానసిక కర్మ లన్నిటియొక్క సంన్యాసము విద్వాంసునకుఁ జెప్పబడెను.

---

అను ప్రతీతిచే దనకంటె భిన్నమగునది జ్ఞేయమగుటచే నహంకారమునకు జ్ఞాతృత్వము సిద్ధించనందున నహమర్థత్వము సిద్ధింపదు.

అహమర్థము విశ్వుడను షష్ఠపక్షము, తైజసుడను సప్తమపక్షము, ప్రాజ్ఞుడను అష్టమపక్షముగూడ సంభవింపవు. విశ్వుడనగ జాగ్రదవస్థాభిమాని. తైజసుడనగ స్వప్నావస్థాభిమాని. ప్రాజ్ఞుడనగ సుషుప్త్యవస్థాభిమాని. ఈముగ్గురు దత్తదవస్థాభిమాను లగుటచే మూడవస్థలయొక్కయు, తద్ధర్మములయొక్కయు జ్ఞానము సంభవింపక పోవుటచే నీముగ్గురకు జ్ఞాతృత్వము సంభవింపదు. జ్ఞాతృత్వము లేమింజేసి యహమర్థత్వము పొసగదు. కనుకనే "ఏనేను స్వప్నమును జూచితినో నేనుసుఖముగ నిద్రించితినో యానేనే మేల్కొంటిని" అను ప్రత్యయముచే నవస్థాత్రయజ్ఞాత యగు నహంప్రత్యయార్థమునకు విశ్వతైజసప్రాజ్ఞులకంటె భిన్నత్వము, నిత్యత్వము, అవికారిత్వము దెలియఁబడుచుండుటవలన పారిశేష్యన్యాయమున నాత్మయే జ్ఞాత యగును. "నాన్యోఽతోఽస్తి విజ్ఞాతా" అను శ్రుతియు నీవిషయమునే బోధించుచున్నది.

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"సర్వేభ్యో దర్శపూర్ణమాసౌ" అను స్థలమున ప్రకాంతకతిపయయాగపరముగ నేరీతిని సర్వశబ్దము సంకుచితమో యదేతీరున "సర్వకర్మాణి మనసా" అనుచోటను 'మనసా' అనువిశేషణమువలన సర్వశబ్దము మానసికములగు కర్మలనే బోధించును కాన మానసికకర్మలనే విద్వాంసుఁడు బరిత్యజింపవలెననియే "సర్వకర్మాణి మనసా సంన్యస్య" అను వాక్యమున కర్థమని శంకింపఁజనదు సర్వవ్యాపారములు మనోవ్యాపారపూర్వకములుగాన మనోవ్యాపారము లేనిచో వాచక కాయికకర్మలే సంభవింపనందువలన విద్వాంసునకు సర్వకర్మసంన్యాసమే యభిహితము

"సామాన్యవాచకశబ్దములు విశేషపర్యవసాయులు గూడ కావచ్చును." అనునియమము ననుసరించి "సర్వకర్మాణి మనసా" అను స్థలమునందలి సర్వశబ్దము విశేషవాచకము. కాన నశాస్త్రీయములగు వాచికకాయికకర్మలకు కారణమగు మానసికకర్మలను సంన్యసింపవలెననియే "సర్వకర్మాణి మనసా" అను వాక్యమున కర్థమని శంకింపఁజనదు.

త్యాగమునకు హేతువగు వివేకబుద్ధికలవానికి "నైవ కుర్వ న్న కారయన్" ఏమియు చేయఁడు, యొకనిచే చేయించఁడు అనునది విశేషణము. కాన "జ్ఞాని శాస్త్రీయములగు కాయిక వాచకమానసికకర్మలను జేయు" ననిన నట్టివిశేషణము వ్యర్థము కావలసివచ్చును. అందువలన జ్ఞానికి సర్వకర్మసంన్యాసమునందే యధికారమని యొప్పుకొనవలెను.

"సర్వకర్మాణి మనసా సంన్యస్య" అను స్థలమునందు భగవంతునిచే సర్వకర్మసంన్యాసము మరణించువానికే జెప్పఁబడె (అనగా మరణించువాఁడట్టి మరణావస్థయందు సర్వకర్మలను సంన్యసింపవలె) నని శంకింపనలదు ఏలన? "నవద్వారే పురే దేహీ నైవ కుర్వ న్న కారయన్, సర్వకర్మాణి మనసా సంన్యస్యాస్తే సుఖం వశీ" జ్ఞాని సర్వకర్మలను మనస్సుచే సంన్యసించి దేహమునందు సుఖముగ నుండుననికదా యీగీతార్థము. నీవు జెప్పినటుల యీగీతావాక్యముచే మరణావస్థయందు సర్వకర్మసంన్యాసము బోధింపఁబడెననిన మరణావస్థయందు కర్మసంన్యాసము జేసినవానికి దేహమునందు సుఖముగ స్థితి యెటుల సంభవించును? సంభవింపనిచో 'దేహమునం దుండు' నను విశేషణ మసంగతము కావలసివచ్చును. అందువలన 'జీవించియుండగనే జ్ఞాని సర్వకర్మలను సంన్యసించి' యనియే యొప్పుకొనవలయును.

"నిరవయవమగు నాత్మకు బుద్ధితోగాని, తద్వృత్తితోగాని, ఇంద్రియములతోగాని, ఇంద్రియార్థములతోగాని సంబంధము సంభవింపనందున జ్ఞాతృత్వ మెట్లు సంభవించు" ననిన బైనజెప్పిన బుద్ధ్యాదులతో నాత్మ కాధ్యాసికసంబంధము సంభవించునుగాన యవిక్రియమగు నాత్మకు జ్ఞాతృత్వము సిద్ధించును. కనుకనే యట్టి విజ్ఞాతయగు నాత్మయే యహమర్థమగును. ఈవిషయమునే "అహం విజానామి వివిక్తరూపః" అను శ్రుతిగూడఁ జెప్పుచున్నది. కనుక నాత్మయే విద్వాంసు డగును. విద్వాంసునకు నిరుక్తవిజ్ఞానము సంభవించుటచే విద్వదాత్మల కభేదము సిద్ధించగనే "అయ మాత్మా బ్రహ్మ" అను శ్రుతిచే నాత్మబ్రహ్మల కభేదము శ్రామమాణమగుటచే 'నేనవిక్రియుడను' అని దెలిసికొనిన తన కవిక్రియత్వాద్వితీయత్వజ్ఞానము నిరంకుశముగ సిద్ధించుటచే నవిక్రియబ్రహ్మాత్మజ్ఞానబలముచే దనకు సర్వకర్మసంన్యాస ముపపన్నమే యగునని సిద్ధించినది.

శాంకరభాష్యమ్:—

(8) అకుర్వతోఽకారయతశ్చ దేహే సంన్యస్యేతి సంబంధో న దేహ ఆస్త ఇతి చేన్న. సర్వత్రాత్మనోఽవిక్రియత్వావధారణాత్ । ఆసనక్రియాయా శ్చాధికరణాపేక్షత్వా త్తదనపేక్షత్వాచ్చ సంన్యాసస్య । సంపూర్వస్తు న్యాసశబ్దస్త్యాగార్థో న నిక్షేపార్థః । తస్మాద్గీతాశాస్త్ర ఆత్మజ్ఞానవత స్సంన్యాస ఏవాధికారో న కర్మణీతి తత్ర తత్రోపరిష్టా దాత్మజ్ఞానప్రకరణే దర్శయిష్యామః ॥ ॥౧౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(8) "నవద్వారే పురే దేహీ" అను శ్లోకమునకు "మరిష్య న్పురుషః వివేకవశా దశేషాణ్యపి కర్మాణి దేహే సంన్యస్య సుఖ మాస్తే" మరణించు పురుషుడు మరణావస్థ యందు నిఖిల కర్మలను దేహమునందు సంన్యసించి ఏమియుచేయక, చేయించక సుఖముగ నుండునని యర్థము. అట్లైనచో "దేహే" అను విశేషణమున కానర్థక్యము సంభవింపదని శంకింపరాదు.

అవిక్రియుడగు నాత్మకు శరీరసంబంధము లేనిదే కర్తృత్వముగాని కారయితృత్వముగాని సంభవింపదు. కాన సర్వకర్మలను మరణావస్థయందు దేహమునందు సంన్యసించి మరణించిన వానికి శరీరసంబంధము లేనందున కర్తృత్వకారయితృత్వములు ప్రసక్తములు గావు. అట్టి యప్రసక్తములగు కర్తృత్వకారయితృత్వములను "సంభవింపవు" అని నిషేధించుట యప్రసక్త ప్రతిషేధ మగును. కాన నట్టి యప్రసక్తప్రతిషేధరూపదోషము దగులకుండ మేము చెప్పిన రీతిని జ్ఞాని సర్వకర్మలను సంన్యసించి ఏమియు చేయనివాడై, ఏమియు చేయించక దేహమునందు సుఖముగనుండుననునదియే గ్రహింపనగును. (ఈయర్థమున జీవించియున్న వానికే సర్వకర్మసంన్యాసము. అట్టివానికి శరీరసంబంధము కలదు కాన తన్నిషేధము 'నైవ కుర్వ న్నకారయన్' అనుదానిచే జేయుట సమంజసము. అప్రసక్తప్రతిషేధము కానేరదు.

మఱియు "ఆస్తే" అనుశబ్దమునకు (కలదు) అని యర్థము. "ఉండుట" అనునది సంబంధము "ఏది యెచట యుండును" అని సంబంధము సంబంధిద్వయము నపేక్షించును. ప్రకృతమున 'నుండుట' యను యాసనక్రియ యధికరణము నపేక్షించును. అట్టి యధికరణము మేము

నీలకంఠీయము:— "అవినాశినం" (రజ్జుసర్పమువలె నశించు స్వభావముగల యుపాధిత్రయమగు స్థూలసూక్ష్మకారణదేహములు వినాశు లనబడును. అట్టిది కానట్టియు) కనుకనే నిత్యము. అట్టి నిత్యమునందు హేతువు 'అజం' అనునది. లోకమున జన్మగలది యనిత్యమగును. ఈయాత్మయన్ననో అజము. కనుకనే నిత్యమని యర్థము.

స్వ కార్యము నపేక్షించి భిన్నత్వము, అజత్వము, నిత్యత్వము సాంఖ్యాభిమతప్రధానమునందును, తార్కికాభిమతమగు నాకాశమునందును గలవను నాశంకను దొలగించుటకు 'అవ్యయం' అని జెప్పబడెను. 'న వ్యేతి పూర్వావస్థాం త్యజతీ త్యవ్యయం' (పూర్వావస్థను విడుచనిది)పరిణమించినదని యాశయము. సాంఖ్యపరికల్పితప్రధానమన్ననో 'చలం గుణవృత్తం' అను న్యాయముచే గుణసామ్యావస్థయందు గూడ బరిణమించునదై యుండునదని సాంఖ్యులే యొప్పుకొనియుండిరి. కాన నట్టిప్రధానము పరిణమించున దగుటచే 'అవ్యయం' పరిణామి కాదు. ఆకాశమన్ననో 'తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః' (ఈ యాత్మవలన నాకాశము పుట్టుచున్నది) అను శ్రుతిచే నాకాశముత్పత్తి కలదగుట నజము కానేరనందున యవ్యయము కాదు. ఇక నవ్యయ మాత్మయే..

శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।
తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥ ॥౨౨॥

పదవిభాగము:— వాసాంసి– జీర్ణాని– యథా– విహాయ– నవాని– గృహ్ణాతి– నరః– అపరాణి– తథా– శరీరాణి– విహాయ– జీర్ణాని– అన్యాని– సంయాతి– నవాని– దేహీ ॥ ॥౨౨॥

ప్రతిపదార్థము:— నరః=మనుష్యుడు; యథా=ఏతీరుని; జీర్ణాని=చినిగిన; వాసాంసి=వస్త్రములను; విహాయ=విడచి; నవాని=నూతనములగు; అపరాణి=మఱియొక వస్త్రములను; గృహ్ణాతి=గ్రహించునో; తథా=అరీతిగనే; దేహీ=జీవుఁడు; జీర్ణాని=వార్ధక్యముచే శిథిలములగు; శరీరాణి=శరీరములను; విహాయ=విడిచి; నవాని=నూతనములగు; అన్యాని=మఱియొక దేహములను; సంయాతి=పొందుచున్నాడు. ॥౨౨॥

---

శాంకరభాష్యతత్త్వబోధని:—

జెప్పిన "జ్ఞాని సర్వకర్మలను వదలి దేహమునం దుండును" అను నర్థమున దేహ మగును కాన మేము నుడివిన యర్థమే సమంజసము. నీచే వచింపఁబడిన యర్థమునందు "అనగా సర్వకర్మలను దేహమునందు సంన్యసించి" యను నర్థమున సంన్యాసమనగ 'సం' అను నుపసర్గగల న్యాస శబ్దార్థము త్యాగ మగునుకాని నిక్షేపము కానేరదు. "దేనియందు త్యాగ మని" అట్టి త్యాగ మధికరణము నపేక్షించదుకాన నీవు వచించిన యర్థమున నావాక్యము నిరాకాంక్షావాక్య మనంబడును (అనగా త్యాగ మనినతోడనే దేనియొక్క త్యాగ మని యాకాంక్ష జనించును గాని దేనియందని యాకాంక్ష జనింపనందునను, దేహమునందు సర్వకర్మల త్యాగమని జెప్పుట నిరాకాంక్షావాక్య మని గ్రహింపనగును)

కాన మనస్సుచే (అనగా వివేకజ్ఞానముచే) సర్వకర్మలను సంన్యసించి జ్ఞాని దేహమునందు సుఖముగ నుండును అను నర్థమే సాధు వగుటవలన నాత్మజ్ఞానికి సర్వకర్మసంన్యాసమునందే యధికారము. కర్మలయం దధికారము లేదని యీగీతాశాస్త్రమునందు మున్ముం దాత్మజ్ఞానప్రకరణమునందు జూపెదము ॥౨౧॥

---

అట్టి యాత్మ నెవఁడు దెలిసికొనునో అట్టిపురుషుఁడు యేవిధమున నెవనిని జంపును? ఎవనిని జంపించును? ద్వైత రాహిత్యముచే నెవనిని జంపడు; ఎవనిని జంపించ డని యాశయము. కనుకనే విద్యావస్థయం దాత్మజ్ఞానికి "యత్రత్వస్య సర్వ మాత్మైవాభూ త్తత్కేన కం పశ్యేత్" అను శ్రుతి సర్వకారకవ్యాపారములను నిషేధించుచున్నది. "యత్ర హి ద్వైత మివ భవతి తదితర ఇతరం పశ్యతి" అను శ్రుతి ద్వైతావస్థయం దజ్ఞానికి సర్వకారకవ్యాపారము సంభవించుచున్న దనియు బోధించుచున్నది. ఈజెప్పుటవలన సర్వకారకోపమర్దినియగు విద్యకు సర్వకారకసాపేక్షగల కర్మతోఁగూడ సముచ్చయ మను వాదము నిరస్తము. శీతోష్ణములవలె బరస్పరవిరుద్ధస్వభావములుగల విద్యాకర్మలకు రథాశ్వన్యాయమున నేకకార్యకారిత్వము సంభవింపనందున (తిలఘృహాశయాదుల కభిమతమగు) కర్మజ్ఞానసముచ్చయము సంభవింపదని యాశయము.

ఇచట రథాశ్వన్యాయము వ్యతిరేకదృష్టాంతముగ నివ్వబడెను. రథాశ్వన్యాయ మనగ నొకనికి రథము గలదు. మఱియొకని కశ్వములు గలవు. ఈరెండింటిని సమకూర్చినయెడల యొకకార్యము సాధింపనగును. ఇదియే రథాశ్వన్యాయము.

మావంటి (శ్రీకృష్ణపరమాత్మవంటి) జ్ఞానులకు సమాధివ్యుత్థానకాలమునం దవిద్యాలేశానువృత్తిచే ఘాతయితృత్వము (చంపించుట) ప్రసక్తమైనను విద్యచే నట్టి యవిద్యాలేశము బాధింపబడుటచేతను, అగామికర్మల సంబంధము లేకపోవుటచేతను దోషము (ప్రత్యవాయము) బ్రాప్తింపనేరదు. ఈవిషయమునే "హత్వాఽపి స ఇమాం లోకా న్న హంతి న నిబధ్యతే" అని శ్రీకృష్ణపరమాత్మ చెప్పగలడు. ॥౨౧॥

శాంకరభాష్యమ్:—

ప్రకృతం తు వక్ష్యామః- తత్రాత్మనోఽవినాశిత్వం ప్రతిజ్ఞాతం, తత్కిమివేత్యుచ్యతే- వాసాంసీతి। వాసాంసి వస్త్రాణి జీర్ణాని దుర్బలతాం గతాని యథా లోకే విహాయ పరిత్యజ్య నవాన్యభినవాని గృహ్ణాత్యుపాదత్తే నరః పురుషోఽపరాణ్యన్యాని తథా తద్వదేవ శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి సంగచ్ఛతి నవాని దేహీ ఆత్మా పురుషవదవిక్రియ ఏవేత్యర్థః॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అవిక్రియ మగుటంజేసి యాత్మకుఁ గర్మ సంభవింపదని చెప్పెను. ఆత్మ యెట్లవిక్రియము? అను నాశంకను దొలగించుటకు దృష్టాంతపూర్వకముగ నాత్మ కవిక్రియత్వము నుపపాదించుచుండెను. ఆత్మకు స్వతః విక్రియ లేకుండినను పురాతన దేహమును విడిచి నూతన దేహమును స్వీకరించునపుడు విక్రియ ప్రాప్తించుచుండ నవిక్రియత్వ మెటుల సంభవించును? అవిక్రియత్వము సంభవింపనిచో నవినాశ్యత్వ మెటులఁ బొసఁగును?

మనుష్యుఁడు చినిగిన వస్త్రములను బరిత్యజించి యేవిక్రియయు లేకుండగనే యెట్లు నూతనవస్త్రములను గ్రహించుచుండునో ఆదేతీరున జీవుడును వార్ధక్యాదులచే శిథిలమైన దేహమును విడిచి యవిక్రియుఁడై క్రొత్త శరీరములను గ్రహించుచుండెను. కాన నాత్మకు ప్రతిజ్ఞాతమగు బ్రకృతమైన యవిక్రియత్వము, యవిక్రియుఁడగుటంజేసి యవినాశిత్వము సిద్ధించుచున్నవి.

—• ౨వ అధ్యాయము ౨౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "ఆత్మ వినాశము లేనిదైనను దేహములు నశ్వరము లగుటచేతను, యుద్ధము దేహవినాశసాధన మగుటచేతను ననేకసుకృతసాధనములగు భీష్మాదిదేహముల నే నెట్లు యుద్ధముచే నశింపజేయుదు" నను నాశంక కుత్తరముగ నీశ్లోకమును జెప్పుచున్నాడు. "జీర్ణాని విహాయ వస్త్రాణి నవాని గృహ్ణాతి విక్రియాశూన్య ఏవ నరో యథా" (ఎట్లు విక్రియాశూన్యుడయియే నరుఁడు జీర్ణములగు వస్త్రములను త్యజించి నూతనములగు వస్త్రములను గ్రహించునో) అనుటచేతనే తావన్మాత్రగ్రంథముచేతనే సరిపడుచున్నను "అపరాణి" అను విశేషణము నుత్కర్షాతిశయద్యోతకముగ నివేశించెను. అందుచే నెట్లు ప్రాకృతజనుడు నికృష్టములగు వస్త్రములను విడిచి యుత్కృష్టములగు వస్త్రములను స్వీకరించునో అను నర్థ మెటు లౌచిత్యమువలన ప్రాప్తించునో యట్లే "జీర్ణాని" (వయస్సుచేతను, తపస్సుచేతను కృశించిన) దేహములను విడిచి 'అన్యాని శరీరాణి' (సర్వోత్కృష్టములగు దేవాదిశరీరములను) 'దేహీ' (ప్రకృష్టధర్మానుష్ఠాత యగు భీష్మాదిదేహవంతుడు) 'సంయాతి' (చిరోపార్జితధర్మఫలభోగముకొరకు గర్భవాసాదిక్లేశమును విడిచియే పొందును) అను నర్థ మౌచిత్యమువలన బ్రాప్తించును. ఈవిషయమునే "అన్య న్నవతరం కల్యాణతరం రూపం కురుతే పిత్ర్యం వా గాంధర్వం దైవం వా ప్రాజాపత్యం వా బ్రాహ్మణం వా" అను శ్రుతిగూడ జెప్పుచున్నది.

ఇట బర్యవసితము నిట్లు చెప్పఁదగును— భీష్మాదులు యావజ్జీవము ధర్మానుష్ఠానక్లేశముచేతనే జర్ఝరితశరీరులై యీ వర్తమానదేహముల విడిచి గాని యాధర్మఫలము ననుభవింపజాలకుండిరి. కాన నీ వీధర్మయుద్ధముచే స్వర్గప్రతిబంధకములగు వారిశరీరములను నశింపజేసి దివ్యదేహసంపాదనమున వారిని స్వర్గయోగ్యులనుగా జేసి వారి కీవిధమున నుపకారమును జేయదగుదువు. ఇట్లే దుర్యోధనాదులకుఁగూడ స్వర్గభోగ్యదేహసంపాదనచే గొప్ప యుపకారము జేసినవాఁడ వగుదువు. కాన నత్యంతోపకారక మగు నీయుద్ధమునందపకారకత్వభ్రమను జేయవల దని "అపరాణి, అన్యాని, సంయాతి" అను పదత్రయస్వారస్యముచే భగవదభిప్రాయ మూహించబడెను. ఈశ్లోకమునందున్న దృష్టాంతముచే నాత్మ కవిక్రియత్వము ప్రతిపాదించబడె నను ప్రాచీనుల వ్యాఖ్యాన మతిస్పష్టముగ దెలియుచున్నది.

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః ।
న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః ॥ ॥౨౩॥

పదవిభాగము:— న- ఏనం- ఛిందంతి- శస్త్రాణి- న- ఏనం- దహతి- పావకః- న- చ-ఏనం- క్లేదయంతి- ఆపః- న- శోషయతి- మారుతః । ॥౨౩॥

ప్రతిపదార్థము:— శస్త్రాణి=ఖడ్గములు మొదలగునవి; ఏనం=ఈయాత్మను; న ఛిందంతి=ఛేదింపనేరవు; పావకః=అగ్నియు; ఏనం=ఈయాత్మను; న దహతి=భస్మమును చేయనేరదు; ఆపః=ఉదకములు; ఏనం=ఈయాత్మను; న క్లేదయంతి=ఆర్ద్రీభావమును బొందింపనేరవు; (తడుపలేవు); మారుతః=వాయువు; న శోషయతి=ఎడింపజేయనేరదు.

---

శాంకరభాష్యమ్:—

కస్మాదవిక్రియ ఏవేత్యాహ—నైనం ఛిందంతీతి । ఏనం ప్రకృతం దేహినం న ఛిందంతి శస్త్రాణి నిరవయవత్వాన్నావయవవిభాగం కుర్వంతి శస్త్రాణ్యస్యాదీని । తథా నైనం దహతి పావకోఽగ్నిరపి న భస్మీకరోతి । తథా నైనం క్లేదయంత్యాపః । అపాం హి సావయవస్య

---

శంకరానందీయము:— "ఆత్మ స్వతః అవిక్రియావంతైనను యెట్లుదయాస్తానలసంబంధమువలన సూర్యునకు విక్రియావత్త్వ ముపపన్నమో యట్లే బూర్వాపరదేహపరిగ్రహపరిత్యాగములవలన నౌపాధికమగు విక్రియావత్త్వ మాత్మకు సంభవించుమనే యున్నది. కాన ఆత్మ యవిక్రియ మెట్లగును?" అను నాశంకను దొలగించుట కీశ్లోకమును జెప్పుచున్నాడు. పురుషు డెట్లు జీర్ణవస్త్రముల వదలి నామరూపలక్షణములచే మరొకవిధములగు క్రొత్తవస్త్రములను స్వయముగ నవిక్రియుడయినదే గ్రహించునో, అట్లే దేహమునందహమర్థముగా దెలియబడు నాత్మ స్వయముగా నవిక్రియు డయినదే కాలకర్మవశమున త్యాజ్యములగు శరీరములవిడిచి నామరూపజాతిగుణవిశేషములచే బూర్వశరీరములకంటె విలక్షణములగు శరీరముల నొందుచున్నాడు. (అని యీగీతాపదములకు క్రమరీతి నర్థము దెలియదగును). అనగా నెట్లు ఆగమనిర్గమనములు, నామరూప వైచిత్ర్యము, శైథిల్యము శరీరమునకేగాని. బురుషున కేవిధమైనవియు సంభవించవో అట్లే నాగమాపాయములు, నవాంతరవికారములు శరీరమునకేగాని, నిరవయవమగు నాత్మకు సంభవింపవు. అందుచే నాత్మ దేహేంద్రియాదులకంటె భిన్నమనియు, నవిక్రియు డనియు, నిత్యుడనియు సూచింపబడెను.

నీలకంఠీయము:— "బ్రాహ్మణో యజేత, జాతపుత్రః కృష్ణకేశోఽగ్నీ నాదధీత" (బ్రాహ్మణుడు యాగమును జేయవలె, పుత్రవంతుడును కృష్ణకేశములు కలవాడు నగ్న్యాధానము జేయవలె) అను శ్రుతులచే వయోవర్ణాదివిశేషములుకల యాత్మనే యధికృతునిగా జేసికొని కర్మలు విధింపబడుచున్నవి. అందుచే 'నీలోత్పలం' అనునప్పుడు విశేషణమగు నీలపదార్థముకంటె నుత్పలము నెట్లు వేరుచేయుటకు శక్యము కాదో యట్లే వయోవర్ణాదివిశిష్టమగు దేహముకంటె నాత్మ వేరని నిశ్చయించుటకు శక్యముగాదు. కాన దేహనాశముచే నాత్మ నశించునదియే యగునుగాన నిత్యత్వాదిక మాత్మకెట్లు సంభవించు నను నాశంకను దొలగించుటకు "వాసాంసి జీర్ణాని" అను శ్లోకమును జెప్పుచున్నాడు. "దండీ ప్రైషా నన్వాహ" (దండి ప్రైషల ననుసరించి బల్కును) అనువాక్యమున దండము విశేషణ మైనను ప్రైషానువక్తృస్వరూపాంతర్గతము కానేరదు. ఈవిధముగనే బ్రాహ్మణత్వ జాతపుత్రత్వాదులు విశేషణము లైనను స్వర్గకామస్వరూపాంతర్గతములు కానేరవు. కాన వస్త్ర దేవదత్తులవలె జడాజడములగు దేహాత్మలు రెండును యత్యంతవిలక్షణములు గాన వస్త్రము నశించిన దేవదత్తుడు నశించనటుల దేహము నశించినను యాత్మ నశించదు. కనుక "దేహము నశించిన యాత్మ నశించు" నని తలచుటచే నీవత్యంతము మూఢుడవని స్పష్టమగుచున్న దని భావము. ॥౨౨॥

శాంకరభాష్యమ్:—

వస్తున ఆర్ద్రీభావకరణే నావయవవిశ్లేషాపాదనే సామర్థ్యం తన్న నిరవయవ ఆత్మని సంభవతి। తథా స్నేహవద్ద్రవ్యం స్నేహశోషణేన నాశయతి వాయు రేవం స్వాత్మానం న శోషయతి మారుతోఽపి ॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పృథివ్యప్తేజోవాయుస్వరూప మగు భూతచతుష్టయమువలన నాత్మ వికారమును బొందుచుండ నాత్మ కవిక్రియత్వ మెటుల సిద్ధించునని శంకింపజనదు

పార్థివములగు ఖడ్గాదులు నిరవయవమగు నాకాశము నెటుల ఛేదింప సమర్థములు గానేరవో అదేతీరున నిరవయవమగు నాత్మను ఛేదింపనేరవు. అటులనే యగ్నియు వికృతమగు నాత్మను భస్మము చేయజాలదు ఉదకములు అవయవములు గల వస్తువులను ఆర్ద్రీభావమును బొందించి యవయవవిశ్లేషమును బొందించును. ఆత్మనిరవయవ మగుటంజేసి యుదకము లాత్మను ఆర్ద్రీభావముచే నవయవవిశ్లేషమును బొందింపనేరవు వాయువు స్నేహమను గుణము గల ద్రవ్యమును, స్నేహమును ఎండింపజేసి నశింపఁజేయును. స్నేహహీనమగు నాత్మనుఎండింప లేదు. (పృథివ్యాదిభూతచతుష్టయము తన శక్తిచే సావయవవస్తువునే విక్రియాంనంత మొనర్చును. ఆత్మ నిరవయవ మగుటంజేసి పృథివ్యాదిభూతచతుష్టయ మాత్మను విక్రియాపంతముఁ జేయ నేరదని తాత్పర్యము.)

—• ౨వ అధ్యాయము- ౨౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "గృహము తగులఁబడినపు డాగృహమునం దుండు పురుషుఁడు దగ్ధ మగునటుల దేహము నశించుచుండ తదంతర్వర్తియగు నాత్మ యెందులకు నశించ" దను శంకనుతొలగించుటకు "నైనం ఛిందంతి శస్త్రాణి" అని చెప్పమొదలిడెను. ఆకాశమునకు నాశకత్వప్రసిద్ధి లేమింజేసి నాకాశమును జెప్పలేదు.

శంకరానందీయము:— "ఘటమునందుండు జలము నశించినచో దానియందుండు ప్రతిబింబము నశించును. అట్లే దేహము నశించినచో దేహమునం దుపలభ్యమాన మగు నాత్మ నశించుచుండ నాత్మకవిక్రియత్వ మెటులసంభవించు" నను నాశంకను 'నైనం ఛిందంతి శస్త్రాణి' అను శ్లోకముచే తొలగించుచుండెను.

"శస్యంతే పదార్థా ఏభిరితి శస్త్రాణి" పదార్థములను ఛేదించునట్టిపృథివీవికారములగు ఖడ్గాదులు నిరవయవమగు నాత్మను ఛేదింపనేరవు. ఉదకము లార్ద్రత్వమును బొందించి సావయవవస్తువును శిథిలమగునటుల జేయునట్లు నిరవయవమగు నాత్మను శిథిలమగునట్లు జేయజాలవు. అగ్నియు దేహమును దగులబెట్టునటుల దహనక్రియ కవిషయ మగుటంజేసి యాత్మను దగులబెట్టనేరదు. వాయువు స్నేహవద్ద్రవ్యమగు శరీరమందుండు స్నేహ మను గుణమును యెండింపజేసి శరీరము నెండింపఁజేయునో అట్లుశోషణక్రియ కగోచరమగు నాత్మను శుష్కింప చేయుటకు సమర్థమైనది కాదు. జలము ఘటమును దడిపినను, ఖడ్గాదులు ఛేదింపదగిన పదార్థములనుఛేదించినను, వాయువు శుష్కింపజేసినను, వహ్ని తగులబెట్టినను తదంతర్గతము నిరవయవము నగు నాకాశము నెట్లు తడుపలేవో, చేదింపనేరవో, తగులబెట్టనేరవో యట్లే దేహస్థమగు నాత్మను దడుపలేవు; ఛెదింపనేరవు; శుష్కింప జేయజాలవు; తగులబెట్టజాలవని యభిప్రాయము. కాన నాత్మ యవిక్రియమని సిద్ధించుచున్నది.

ఈచెప్పుటవలన "జరారోగాదులు, భౌతికదైవికోపద్రవములుశరీరసంబంధులే కాని ఆహామర్థమగు నాత్మవి కావు. దేహమును విషయముగ జేసుకొని బయల్వెడలు ననర్థములకు దేహాదిభిన్నమగుటచే నాత్మగోచరము కాదని మదువబడెను. కాన నిట్టి రోగాదులు బాధింపించినను బ్రహ్మవేత్తలు స్థిరప్రజ్ఞులైయుండదగినదని సూచింబడెను.

అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ ।
నిత్య స్సర్వగత స్స్థాణు రచలోఽయం సనాతనః ॥ ॥౨౪॥

పదవిభాగము:— అచ్ఛేద్యః- అయం- అదాహ్యః- అయం- అక్లేద్యః- అశోష్యః- ఏవ- చ- నిత్యః- సర్వగతః- స్థాణుః- అచలః- అయం- సనాతనః ॥ ॥౨౪॥

ప్రతిపదార్థము:— అయం=ఈయాత్మ; అచ్ఛేద్యః= ఛేదింపదగినది కాదు; అయం=ఈయాత్మ; అదాహ్యః=దహింపదగినది కాదు; అయం=ఈయాత్మ; అక్లేద్యః=తడుపదగినది కాదు; అయం=ఈయాత్మ; అశోష్య ఏవ చ=ఎండింపదగినదియు కాదు; అయం=ఈయాత్మ; నిత్యః=నిత్యము; (నాశములేనిది): సర్వగతః=సర్వవ్యాపకము (అంతట నిండియున్నది); స్థాణుః=స్థాణువువలె స్థిరము; అయం=ఈయాత్మ; అచలః=చలనము లేనిది; సనాతనః= చిరంతనము. ॥౨౪॥

శాంకరభాష్యమ్:—

(1) యత ఏవం తస్మాత్ —అచ్ఛేద్యోఽయ మితి । యస్మా దన్యోన్యనాశహేతూని భూతా న్యేన మాత్మానం నాశయితుం నోత్సహన్తే తస్మా న్నిత్యో నిత్యత్వా త్సర్వగత స్సర్వ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(1) పృథివ్యాదిభూతచతుష్టయము సావయవవస్తువులందే పరస్పరం ఛేదనాదికార్యముల నొనరించును. (పరస్పరనాశక మగును), ఆత్మ సావయవవస్తువు గానందున పృథివ్యాదిభూత చతుష్టయ మాత్మను వికిృయకలదానినిగఁ జేయ నేరదు. కాన నాత్మ యచ్ఛేద్యము, అదా

—• ౨వ అధ్యాయము ౨౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— శస్త్రాదులు ఆత్మను నశింపజేయుటయం దసమర్థములు. కనుకనే-యాత్మ శస్త్రాదులవలన గలిగెడి నాశనమున కనర్హమైన దనుటయందు హేతువును "అచ్ఛేద్యః" అను శ్లోకముచే జెప్పుచుండెను.

"ఆత్మ ఛేదనానర్హము కనుకనే దానిని శస్త్రములు ఛేదింపజాలవు. అట్లే యాత్మ దాహానర్హము. కాన నగ్ని యాత్మను దహింపఁజాలదు. ఆత్మ క్లేదనమున (తడుపుట) కనర్హము. కనుకనే యుదకము లీయాత్మను క్లేదింపజేయఁ (తడుప) జాలవు. ఆత్మ శోషణమున (ఎండింపజేయుట) కనర్హము. కాన నట్టియాత్మను వాయువు శోషింపఁ (ఎండింపఁ) జాలదు" అని యీవిధముగ నీశ్లోకమునందున్న యచ్ఛేద్యత్వాదివిశేషణములను హేతువులుగ వెనుకటిశ్లోకమున యోజింపదగును. యీశ్లోకమందున్న ఏవకారము ప్రత్యేకము "అచ్ఛేద్యః" అనునది మొదలగువానితో సంబంధించి యచ్ఛేద్యత్వాద్యవధారణము (నిశ్చయము) ను గలుగజేయును. ఇట "అశోష్య ఏవచ" అను స్థలమునందు చకారము సముచ్చయమును లేక హేతువును గాని తెలుపును.

ఆత్మ ఛేదనాదుల కనర్హ మనుటయందు హేతువుగ నుత్తరార్థమును జెప్పుచున్నాడు. 'నిత్యః' పూర్వాపరకోటిరహితము. కానను త్పాద్యము కాదు. మఱియు 'యావద్వికారస్తు విభాగోలోకవత్' అను న్యాయమును ననుసరించి సర్వగతము కాని ప్రతిపదార్థముకూడ ననిత్యమేయగుచున్నది. అద్వైతమతమందు పరమాణువుల నంగీకరింపమిం జేసి "పరాభ్యుపగతపరమాణువులు సర్వగతములు కాకపోయినను నిత్యము లను టెట్లు సమంజసమగును." అను నాశంక కవకాశములేదు. ఈయాత్మ "సర్వగతః" విభువు. కనుకనే నిత్యము. ఇట్లనుటచే నాత్మ కప్రాప్యత్వము చెప్పఁబడెను. ఈయాత్మ వికారియైనచో సర్వగము కాకుండెడిని. అట్లుకాక 'స్థాణుః' అవికారి

శాంకరభాష్యమ్:—

గతత్వాత్ స్థాణుః స్థాణు రివ స్థిర ఇత్యేతత్ । స్థిరత్వా దచలోఽయ మాత్మాఽత స్సనాతన శ్చిరంతనో న కారణా కుతశ్చి న్నిష్పన్నోఽభినవ ఇత్యర్థః ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

హ్యము, అక్లేద్యము (తడుపఁదగినది కాదు), అశోష్యము (ఎండింపదగినది కాదు). అనగా నాత్మ యవిక్రియము ; కావున నిత్యము; నిత్య మగుటచే సర్వగతము; సర్వగత మగుటవలననే స్థిరము; స్థిర మగుటచేతనే చలనము లేనిది; కాన చిరంతనము (ఏకారణమువలననూ జనించునది కాదు).

మగుటజేసి సర్వగతమే యగును. ఇట్లనుటచే నాత్మకు వికార్యత్వము తొలగింపఁబడెను. ఈయాత్మ క్రియ కాశ్రయ మైనచో క్రియాశ్రయములగు ఘటాదులవలె వికారి యయ్యెడిని. అట్లు కాక 'అచలః' క్రియావత్త్వ మందున వికారియు కాదు. ఇట్లనుటచే నాత్మకు సంస్కార్యత్వము తొలగింపబడెను. (పూర్వావస్థను విడిచి మఱియొక యవస్థను పొందుట విక్రియ యనియు, అవస్థైక్యమున్నను చలనమాత్రము క్రియ యనియు తెలిసికొన నగును). పై హేతువులచే నాత్మ "సనాతనః" సర్వకాలములయం దేకరూపము. అనగా నేక్రియకును కర్మభూతము కాదని యర్థము.

ఉత్పత్తి, ప్రాప్తి, వికృతి సంస్కారము లనెడి యీనాలుగింటిలో నేదో యొకానొకదాని క్రియాఫలసంబంధమున్నపుడే యావస్తువునకు కర్మత్వము సంభవించును. అనిత్యములగు ఘటాదులే యుత్పాద్యములు కాని నిత్యమగుటచే నాత్మ యుత్పాద్యము కాదు. మఱియు నల్పపరిచ్ఛిన్నములగు ఘటాదులు ప్రాప్యములగును కాని సర్వగతమగు నాత్మ ప్రాప్యము కానేరదు. విక్రియావత్తగు ఘృతాదికము వికారి యగును కాని స్థాణుస్వరూపమగుటచే నాత్మ వికారియుఁ గానేరదు. సవిక్రియములగు దర్పణాదులు సంస్కార్యము లగును గాని నిష్క్రియమగుటచే నాత్మ సంస్కార్యముగూడ గానేరదు. "ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః" 'వృక్షఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేకః" "నిష్కలం నిష్క్రియం శాంతం" అను శ్రుతులుగూడ పైవిషయములనే దృఢపరచుచున్నవి. "యః పృథివ్యాం తిష్ఠ న్పృథివ్యా అంతరో యోఽప్సు తిష్ఠ న్నద్భ్యోఽంతరో య స్తేజసి తిష్ఠం స్తేజసోఽంతరో యో వాయౌ తిష్ఠ న్వాయో రంతరః" అను శ్రుతిగూడ సర్వగత మగు నాత్మ సర్వాంతర్యామియై సర్వావిషయమగునని దెలుపుచున్నది. అనఁగా నెవడు శస్త్రాదులం దంతర్యామియై యుండడో వానిని శస్త్రాదులు ఛేదించును. ఏది శస్త్రాదులకు సత్తాస్ఫూర్తిప్రదమై తత్ప్రేరకమై శస్త్రాదులయం దంతర్యామియై యుండునో యట్టియాత్మను శస్త్రాదులు స్వవ్యాపారమునం దెట్లు విషయమునుగా జేసికొనునని యభిప్రాయము. ఈవిషయమున "యేన సూర్యస్తపతి తేజసేద్ధః" అను సీమొదలగు శ్రుతు లనుసంధేయములు.

శంకరానందీయము:— "వాసాంసి జీర్ణాని" అను శ్లోకముచే నాత్మ దేహవ్యతిరిక్తమని చెప్పఁబడుటచే ఛేదనాదులు దేహమునకే యనుభవసిద్ధమై కన్పట్టుచున్నవిగాని నిరవయవమగు నాత్మకు సంభవింపనేరవు. కాన భూతచతుష్టయ కార్యములగు ఛేదన, క్లేదన, దహన, శోషణము లాత్మవిషయమై ప్రసరించవని యీశ్లోకమునందు స్పష్టముగఁ జెప్పుచున్నాడు.

'సనాతనః' ఆదిరహితము. అనగా "న తస్య కశ్చి జ్జనితా న చాధిపః" అను శ్రుత్యనుసార మీయాత్మ నిరవయవమగుటచే నేదోయొక కారణమువలనపుట్టునది కాదు. కనుక సనాతనము (జన్మాదిషడ్భావవికారశూన్యము). కనుకనే 'నిత్యః' నిత్యము. అట్లగుటచే 'సర్వగతః' పరిపూర్ణము. నిత్యము, పరిపూర్ణమువగు నాకాశమునం దెట్లు

శాంకరభాష్యతత్త్వబోధిని:—
కారణమువలన జనించునది యభినవ మనఁబడును. ఆత్మ యట్టిది కానందున నభినవము కాదు; చిరంతన మనఁబడును.

నిత్యములగు పరమాణువులకు సర్వగతత్వము సంభవింపనందున నిత్యత్వహేతు వాత్మయందు సర్వగతత్వమును సాధింపనేరదని శంకింపఁనదు. పరమాణువులే యప్రామాణికము అగుచుండ

క్రియాశక్తి కన్పట్టుటలేదో యట్లే యాత్మకూడ నిష్క్రియ మగును. (క్రియాశక్తి లేనిదనుట) కనుకనే "స్థాణుః" స్థిరస్వభావముకలది. కనుకనే "అచలః" చలనరహితము. ఆత్మ విద్వదనుభవగోచర మగునని సూచించుటకిట "అయం" అని యాత్మ నపరోక్షరూపముగ నిర్దేశించెను. ఈ యాత్మ సనాతనము, నిత్యము, స్థిరము, అచలము నగుటచే ఛేదనాదుల కవిషయమని యర్థము. సనాతనత్వవిశేషణముచే నాత్మ నిర్వికార మనియు, నిత్యత్వవిశేషణముచేఁ బ్రమాణాంతరాబాధ్య మనియు, స్థిరత్వాచలత్వవిశేషణములచేఁ గ్రియకనాశ్రియ (అవిషయ) మనియు, సనాతనత్వపూర్ణత్వవిశేషణములచే నద్వితీయ మనియు, నిత్యశుద్ధ మనియు, ఆనందైకరసస్వరూప మనియు సూచిత మయ్యెను.

భాష్యోత్కర్ష దీపిక—"అచ్ఛేద్యః" అనుశ్లోకముచే ఫలితమును చెప్పుచుండెను. ఈశ్లోకమునందుగల ఏవకారము "అచ్ఛేద్యఏవ, అదాహ్యఏవ, అక్లేద్యఏవ, అశోష్యఏవ" అని యంతటను సంబంధించును. ఏకారణమువలన నన్యోన్యనాశహేతువులగు పృథివ్యప్తేజోవాయువు లీయాత్మను నశింపజేయుటకు సమర్థములు కావో ఆ కారణమువలన నాత్మ నిత్యము. పరమాణువులు నిత్యమనుటయందుఁ బ్రమాణము లేమింజేసి వానియం దతిప్రసక్తి సంభవింపదు. ఆత్మ నిత్యముకనుకనే సర్వగతము; సర్వగతముకనుకనే యాకాశమువలె, స్థాణువువలె స్థిరము. స్థిరము గనుకనే యచలము; అచలముకనుకనే సనాతనము, చిరంతనము. 'ఏకారణమువలనను జన్మించునది కా' దను భాష్య ముపలక్షణము. ఉపలక్షణ మనగ (వక్తవ్యమగు నర్థమున నేకదేశమును చెప్పుట) అనగా జెప్పఁదగిన విషయ మున్నదనుట. అది యేదనిన? యథేష్టముగ హేతుహేతుమద్భావము. అది యెట్లనిన? ఆత్మ నిత్యము కాన నుత్పాద్యము కాదు; సర్వగతము కాన ప్రాప్యము కాదు; స్థాణువువలె స్థిరము కాన వికార్యము కాదు; అచలము కాన సంస్కార్యము కాదని కూడ యోజనముచేయుదగును. ఇట్టి యర్థము "న కుతశ్చి త్కారణా న్నిష్పన్నః" ఏకారణమువలనను నాత్మ జనించునది కాదను భాష్యమువలనఁ బ్రాప్తించును. కాన నిట్టియర్థము చెప్పుటయం దెట్టి విరోధమును లేదు.

ఈశ్లోకమునకు మధుసూదనసరస్వతి 'ఆకాశవ త్సర్వగతశ్చ నిత్యః' 'వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠ త్యేకః' "నిష్కలం నిష్క్రియం శాంతం" "యః పృథివ్యాం తిష్ఠ న్పృథివ్యా అంతరో యోఽప్సు తిష్ఠ న్నద్భ్యోఽన్తరో య స్తేజసి తిష్ఠంస్తేజసోఽన్తరో యో వాయౌ తిష్ఠ న్వాయోరన్తరః" అను నీమొదలగు శ్రుతుల నుదహరించి సర్వగత మగు నాత్మ సర్వాంతర్యామి యగుటచే శస్త్రాదుల కవిషయ మని చెప్పియుండెను. మఱియు నెవఁడు శస్త్రాదులయం దుండఁడో వానిని శస్త్రాదులు ఛేదించును. శస్త్రాదులకు సత్తాస్ఫూర్తిప్రదమై తత్ప్రేరకమై తదన్తర్యామి యగు నీయాత్మను శస్త్రాదు లెటుల ఛేదించును? (ఛేదింపనేరవు) అనియు తాత్పర్యము వ్రాసెను.

ఈవిషయమున కొంచెము విచారింపఁదగియున్నది. ఏమనిన? "గతాసూ నగతాసూంశ్చ" అని యుపక్రమము; "దేహినోఽస్మి న్యథా దేహే" 'అంతవంత ఇమే దేహాః' 'వాసాంసి జీర్ణాని' అని మధ్యభాగమునందు నిర్దేశము (అభ్యాసము); "దేహీ నిత్య మవధ్యోఽయం" అని యుపసంహారము. ఇట్టి యుపక్రమోపసంహారాభ్యాసలింగములచే త్వంపద నిరూపణము స్పష్టముగ ప్రతీయమాన మగుటచేతను, ప్రథమషట్కము త్వంపదశోధనపర మని సర్వులును, మధుసూదనసరస్వతులును నొప్పుకొనుటవలన త్వంపదశోధనప్రకరణమునందు

శాంకరభాష్యతత్త్వబోధిని:—
"నిత్యత్వము సర్వగతత్వమునకు పరమాణ్వంతర్భావముచే వ్యభిచారిగాన సర్వగతత్వసాధకము కానేర"దని యాక్షేపించుట యసంగత మగుటచే నాత్మయందు సర్వగతత్వమును నిత్యత్వము సాధించును.

తత్పదవాచ్య మగు నంతర్యామిప్రతిపాదక మగు శ్రుతుల నుదహరించుట యయుక్తము. అంతర్యామి యగు శుద్ధచైతన్యమునకు జీవునకు నభేదము గాన త్వంపదశోధనప్రకరణమునం దట్టి తత్పదవాచ్యాంతర్యామిప్రతిపాదక శ్రుత్యుదాహరణము యుక్తమే యని శంకింపఁజనదు. నియమ్యనియామకోపాధివినిర్ముక్త మగు శుద్ధచైతన్యమునం దభేదము వాస్తవికము. ఉపాధిప్రయుక్తమైనది భేదమే యగును. ఈవిషయమునే "అవిద్యాప్రత్యుపస్థాపితకార్యకరణోపాధినిమిత్తోఽయం శారీరాంతర్యామిణో ర్భేదవ్యపదేశో న పారమార్థికః" (జీవాంతర్యాముల కగు భేద మవిద్యాప్రత్యుపస్థాపితకార్యకరణరూపమగు నుపాధినిమిత్తమైనది కాని వాస్తవికము కాదు) అనుభాష్యము స్పష్టపరచుచున్నది. కాన నేశుద్ధముతో శుద్ధమున కభేదము కలదో యట్టిశుద్ధమునకు నియామకత్వము లేమింజేసి త్వంపదశోధనప్రస్తావ మగు ప్రథమషట్కమునం దంతర్యామిశ్రుత్యుదాహరణ మయుక్తము.

మఱియు "అన్తర్యా మ్యధిదైవాదిషు తద్ధర్మవ్యపదేశాత్" (అ 1, 2పా సూ 18) "న చ స్మార్త మతద్ధర్మాభిలాపాత్" (అ 1 పా 2 సూ 19) 'శారీర శ్చోభయేఽపి హి భేదేనైన మధీయతే' (అ1 పా2 సూ20) అను బాదరాయణప్రణీత బ్రహ్మసూత్రములు గూడ నౌపాధికప్రయుక్తభేదమునే తెల్పుచున్నవి. అది యెట్లనిన? 'అన్తర్యా మ్యధిదైవాదిషు తద్ధర్మవ్యపదేశాత్' అను సూత్రము బ్రహ్మసూత్రములలో ప్రథమాధ్యాయ ద్వితీయపాదమునందలి పందొమ్మిదవ సూత్రము. ఇది అంతర్యా మ్యధికరణ ప్రథమసూత్రము. ఈరెండవపాదమునందలి యీయధికరణ మైదవ యధికరణము. దీనికి "య ఇమం చ లోకం పరం చ లోకం సర్వాణి చ భూతాన్యన్తరో యమయతి" (ఎవఁ డన్తర్యామియై యీలోకమును, పరలోకమును సర్వభూతములను నియమించుచుండెనో) అను నదియు, "యః పృథివ్యాం తిష్ఠ న్పృథివ్యా అన్తరో యం పృథివీ న వేద యస్య పృథివీ శరీరం యః పృథివీ మన్తరో యమయతి" (ఎవఁడు పృథివియం దున్నవాఁడై పృథివికి నంతర్యామియో, ఎవనిని పృథివి తెలిసికొనలేదో, ఎవనికి పృథివి శరీరమో, ఎవఁ డన్తర్యామియై పృథివిని నియమించుచుండెనో) అనునదియు విషయవాక్యము. ఈ శ్రుతులయందు అధిదైవతమును, అధిలోకమును. అధివేదమును, అధియజ్ఞమును, అధిభూతమును, అధ్యాత్మము నొకానొకడన్తరవస్థితుఁడై, యన్తర్యామియై. నియమనము చేయువాఁడని స్పష్టమగుచున్నది. అట్టియధిదైవాద్యభిమాని యొకానొక దేవత యగునా? లేక యణిమాద్యైశ్వర్యములుగల యొకానొక యోగి యగునా? లేక పరమాత్మ యగునా యని సందేహము ప్రాప్తింప,

పూర్వపక్షము:— ఒకానొక దేవతే యగును. లేక యణిమాద్యైశ్వర్యములుగల యోగియైనా యగును. లేక మరియొక డెవఁడైన నగును. కాని పరమాత్మమాత్రము కాదను పూర్వపక్షముపై—

సిద్ధాంతము:—"అంతర్యా మ్యధిదైవాదిషు తద్ధర్మవ్యపదేశాత్" అను నీసూత్రము చెప్పఁబడెను. ఎవఁ డధిదైవాదులయం దంతర్యామియై చెప్పఁబడెనో వాఁడు పరమేశ్వరుఁడే ఎందువల ననిన? 'తద్ధర్మవ్యపదేశాత్' పరమేశ్వరధర్మము లీశ్రుతియందు వ్యపదిష్టము లగుటవలన. అని హేతువు చెప్పఁబడెను. ఇటుఁ జెప్పఁబడు నంతర్యామి సాంఖ్యస్మృతిసిద్ధ మగు ప్రధాన మెందులకు కాదను నాశంకను తొలగించుటకు 'నచ స్మార్త మతద్ధర్మాభిలాపాత్' అను సూత్రము బయలుదేరెను. అనగా ప్రధానధర్మములు కాని ద్రష్టృత్వాది ధర్మము లిచట జెప్పఁబడుటచే సాంఖ్యస్మృతిపరికల్పిత మగు ప్రధాన మంతర్యామిశబ్దముచే బోధింపఁబడదని యీసూత్రమున కర్థము.

శాంకరభాష్యమ్:—

(2) నైతేషాం శ్లోకానాం పౌనరుక్త్యం చోదనీయం । యత ఏకేనైవ శ్లోకే వాత్మనో నిత్యత్వ మవిక్రియత్వం చోక్తం "న జాయతే" (గీ. 2-20) ఇత్యాదినా । తత్ర యదేవాత్మ విషయం కించి దుచ్యతే త దేతస్మా చ్ఛ్లోకార్థా న్నాతిరిచ్యతే । కించి చ్ఛబ్దతః పునరుక్తం కించి దర్థత ఇతి । దుర్బోధత్వా దాత్మవస్తునః పునః పునః ప్రసంగ మాపాద్య శబ్దాన్తరేణ తదేవ వస్తు నిరూపయతి భగవా న్వాసుదేవః- కథంనునామ సంసారిణా మవ్యక్తం తత్త్వం బుద్ధిగోచరతా మాపన్నం స త్సంసారనివృత్తయే స్యా దితి । ॥౨౧॥

శాంకరభాష్యతత్త్వబోధని:—

(2) "న జాయతే మ్రియతే వా కదాచిత్" అను శ్లోకముచే నాత్మ కవిక్రియత్వమును, నిత్యత్వమును జెప్పి తిరుగ "వేదావినాశినం నిత్యం" అను శ్లోకముచే నాయవినాశ్యత్వనిత్యత్వములనే చెప్పుటవలన పౌనరుక్త్యదోషము ప్రాప్తించుచున్నది.

ఇట "న జాయతే మ్రియతే వా" అను శ్లోకముచే నాత్మకు జన్మమరణాదులు లేవని చెప్పఁబడెను. "వేదావినాశినం" అను శ్లోకమునందు షడ్భావవికారాంతర్గత మగు నపక్షయము లేదని చెప్పఁబడెను. కాన పౌనరుక్త్యదోష మెటుల ప్రాప్తించునని శంకింపఁబనదు

"న జాయతే మ్రియతే వా" అను శ్లోకమున "నిత్యః" అను పదము ప్రయోగింపఁబడెను "వేదావినాశినం నిత్యం" అను శ్లోకమునందు "నిత్యం" అను పదము ప్రయోగింపఁబడెను. కాన నొకపదమును రెండుస్థానములయందు నొకప్రకరణమునందే ప్రయోగించుటచే శబ్దమువలనను, అచటనే "శాశ్వతః" అను పద మపక్షయరాహిత్యమును బోధింపగా "వేదావినాశినం నిత్యం" అను శ్లోకమునందు "అవ్యయం" అను పద మపక్షయరాహిత్యమునే తిరిగి బోధించు నర్థమువలనను పౌనరుక్త్యదోషము ప్రాప్తించు నని శంకింపవలదు.

**ఆత్మపదార్థము నెన్నిసార్లు బోధించినను తెలిసికొనుట యశక్యము. అందువలన శ్రీకృష్ణ** పరమాత్మ— "సంసారులగు జీవుల కీయాత్మతత్త్వము ననేకపర్యాయము లనేకవిధములుగ నుపదేశింపనిచో సుఖదుఃఖమోహాత్మకమగు సంసారముయొక్క నివృత్తికొరకాత్మస్వరూపము వారికెట్లు బుద్ధిగోచరంబగు" నని యూహించి మాటిమాటికి ప్రసక్తిఁగల్పించి చెప్పినయాత్మనే మఱల బోధించుచుండెను. కాన దుర్బోధమగు వస్తుతత్త్వము నెన్నిసార్లు జెప్పినను పునరుక్తము దోషావహము గానేరదు ॥౨౧॥

సాంఖ్యస్మృతికల్పితమగు ప్రధానము కానున్నను శరీరసంబంధముగల జీవుఁడగునను సాశంకను తొలగించుటకు 'శారీరశ్చోభయేఽపి హి భేదేనైన మధీయతే' అను సూత్రము చెప్పఁబడెను పూర్వసూత్రమునుండి 'న' అను పదిసూత్రమునం దనువృత్తము. శారీరు (జీవు) డంతర్యామి కాడు. ఎందువలననిన? కాణ్వులు, మాధ్యందినులీశారీరుని అంతర్యామికన్న భిన్నునిగను, పృథివ్యాదులవలె నధిష్ఠానముగను, నియమ్యునిగను చెప్పుచుండిరి. అది

యెట్లనిన? "యో విజ్ఞానే తిష్ఠన్" ఎవఁడు విజ్ఞానాత్మయం దున్నవాఁడో అని కాణ్వులు, "ఆత్మని తిష్ఠన్" ఆత్మయం దున్నవాఁడో అని మాధ్యందినులు శరీరముకంటె భిన్నునిగ నంతర్యామినిఁ జెప్పుచుండిరి. కాన శారీరునికంటె నంతర్యామి వేఱని యీ మీమాంసవలన దేలినది. అట్టి శారీరప్రతిపాదక త్వంపదశోధనపరమగు ప్రథమషట్కమునం దంతర్యామిని బోధించు శ్రుతుల నుగహరించుట మధుసూదనసరస్వతికి యుక్తము కాదని యాశయము.

మఱియు ఎవఁడు ఖడ్గాదులయం దుండెడో వానిని ఖడ్గాదులు ఛేదించుటకు సమర్థములగును. అట్లు కాక నీయాత్మ ఖడ్గాదులయం దంతర్యామి యగుటంజేసి ఖడ్గాదు లాత్మను ఛేదింపజాలవని నుడివిన మధుసూదనసరస్వత్యభిప్రాయము కూడ సమంజసము కాదు. ఖడ్గాదులయందుండు లోహశకలమును ఖడ్గాదులు ఛేదించుటలేదా? ఛేదించుచు నేయున్నవి. కాన నిట్టి తీరువారియు మధుసూదనసరస్వత్యభిప్రాయ ముపేక్షణీయము. కాన భాష్యకారోక్తమగు నిరవయవత్వమే ఛేదనాదు లాత్మను సంభవింపక పోవుటయందు హేతువని సుజ్ఞులు తెలిసికొందురుగాక.

"నజాయతే" అను శ్లోకముచేఁ జెప్పఁబడిన యాత్మజ్ఞానము దృష్టఫలకము, దుర్బోధము నగుటంజేసి కరుణానిధియు, భగవంతుడు నగు శ్రీకృష్ణపరమాత్మ దృష్టఫలకమగు వ్రీహ్యవహననావృత్తివలె పునః పునః ప్రసంగమున శబ్దాంతరముచే నా యాత్మజ్ఞానమే సంసారనిమగ్నులు, ముముక్షువులు, నగువారల బుద్ధిగోచరమగు స్పష్టతత్త్వమై సంసారనివర్తక మగునని చెప్పుచుండెను. కాన పునరుక్తిదోష మిందులేదు. ఇట్లు చెప్పుట యందు వ్యాసభగవానులు గూడ "ఆవృత్తి రసకృ దుపదేశాత్" అను సూత్రము నుడివెను. ఇచట "ఆత్మా వాఽరే ద్రష్టవ్య శ్శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః । తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః" అనునది విషయవాక్యము.

ఈ విషయవాక్యమున నొకసారి వేదాంతశ్రవణ మొనరించిన చాలునా? లేక పలుమారులు వేదాంతశ్రవణ మొనరింపవలయునా? యని సంశయము.

దర్శపూర్ణమాసముల కంగమగు ప్రయాజాదు లను నంగయాగము లొకసారి యొనరించిన కలికాపూర్వద్వారమున దర్శపూర్ణమాసయాగములవలన మహాపూర్వము పుట్టి స్వర్గాదులు సంభవించినట్లు శ్రవణ మొకసారిజేసిన దానివలన నాత్మజ్ఞానము సంప్రాప్తమై మోక్షము సంభవించును. ఇట్టి సకృచ్ఛ్రవణమువలననే శాస్త్రము సార్థకమగుచుండ నవిహితమగు శ్రవణావృత్తిని జేయుచో నశాస్త్రార్థమే యగును. "శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" అని యసకృదుపదేశమువలన శ్రవణమునం దావృత్తి (పలుమార్లు వేదాంతశ్రవణ మొనరించుట) శాస్త్రార్థమే యగునని శంకింపఁజనదు. అట్లున్నను శబ్దము నతిక్రమింపకయే యావృత్తి చేయదగును. అనగా వేదాంతశ్రవణ మొనర్పవలయుననుట. ఇంతమాత్రముచే శ్రవణ మనేకపర్యాయము లొనర్పవలయునని సిద్ధింపదు. సకృచ్ఛ్రవణముచేతనే యట్టి శాస్త్రము చరితార్థ మగునని పూర్వపక్షము.

ఇట్టివిధమున పూర్వపక్షము ప్రాప్తింప "ఆవృత్తిరసకృ దుపదేశాత్" అని వ్యాసభగవానులు చెప్పెను. అనగా శ్రవణమునం దావృత్తి చేయనగును. (అనేకపర్యాయములు వేదాంతశ్రవణ మొనరింపవలయును) ఎందువలననిన? 'అసకృ దుపదేశాత్' ఒక కార్యము నుద్దేశించి "శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" అని అనేక కారణములను స్వతంత్రముగ నుపదేశించుటవలన-అని హేతువు జెప్పఁబడెను. శబ్దము నతిక్రమించకుండగ నొక పర్యాయమే శ్రవణమని చెప్పఁబడెననెదవా? శ్రవణాదులు దర్శనము (అపరోక్షానుభూతి) పర్యవసానముగా గలవై దృష్టార్థము లగును. ఎట్లు తండులములు కనుపించువరకు వడ్లను దంచవలెనో అట్లే బ్రహ్మసాక్షాత్కారమగువరకు శ్రవణాదుల నొనరింపవలయును అని సిద్ధాంతము. కాన నిట్టి సూత్రాదులవలన పునరుక్తి లేదుగాన "నజాయతే" అను శ్లోకముచే జెప్పఁబడిన యాత్మజ్ఞానమునే యీ శ్లోకముచేఁ జెప్పుచుండినను పునరుక్తి యని యాక్షేపింపవలదు.

స్వాభిప్రాయము:— 'గతాసూనగతాసూంశ్చ' అని యుపక్రమము, 'దేహినోఽస్మిన్యథాదేహే, అన్తవన్త ఇమే దేహాః' అని అభ్యాసము, 'దేహీ నిత్య మవధ్యోఽయం' అని యుపసంహారమనియు ఇట్టి యుపక్ర

మోపసంహారాభ్యాసలింగములచే త్వంపద నిరూపణము స్పష్టముగ బ్రతీయమానమగుటచేతను, ప్రథమషట్కము త్వంపదశోధనపరమని సర్వులు, మధుసూదనసరస్వతులును నొప్పుకొనుటవలనను త్వంపదశోధనప్రకరణమునందు తత్పదవాచ్యమగు నంతర్యామిప్రతిపాదకమగు శ్రుతుల నుదహరించుట యయుక్తము. అనిభాష్యోత్కర్షదీపికాకారులు నుడివియుండిరి. ఈవిషయమున కొంచము విచారింతము— ప్రథమషట్కము త్వంపదశోధనపరమనియంగీకరించిన మధుసూదనసరస్వతులు తెలియక యంతర్యామిబ్రాహ్మణము నుదహరించినా? తెలిసియుదహరించెనా? తెలియకయుదహరించెనందమన్న "ప్రథమషట్కము త్వంపదశోధనపరమని తనచే నంగీకరించబడినందునను" అనుభాష్యోత్కర్షదీపికాకారుని వ్రాత యెటుల సమంజసమగును? సమంజసము కానేరదు; తెలిసియే త్వంపదశోధనప్రకరణమునం దంతర్యామిబ్రాహ్మణము నుదహరించె ననెదమా? తెలిసి త్వంపదశోధనప్రకరణమునం దంతర్యామిబ్రాహ్మణ ముదహరించుటకు కారణమేదియో విచారింపవలయును. ప్రథమషట్కము త్వంపదశోధనపరమనుట సర్వులకు సమ్మతమే. శోకమోహములచే వ్యాప్తమై కర్తవ్యముదోపక నిర్విణ్ణుడగు నర్జునుడు త్వంపదవాచ్యుడు. అట్టిత్వంపదవాచ్యమును త్వంపదలక్ష్యార్థస్వరూపముగ బోధించిన నట్టిలక్ష్యార్థము సర్వాంతర్యామియగు శుద్ధచైతన్య మగుటంబట్టి యట్టిలక్ష్యార్థమునకు ఛేదనదాహాదులు సంభవింపవని బోధించిన నర్జునుడది దెలిసికొని శోకమోహములను వదలునని యూహించియేకదా యీయుపక్రమము. కనుకనే శ్రీమద్భాష్యకారులుగూడ 'అశోచ్యా నన్వశోచస్త్వం' అనుశ్లోకమునకు వ్యాఖ్యానము చేయుచు 'కుతస్తేఽశోచ్యాః సద్వృత్తత్వాదాత్మస్వరూపేణ నిత్యత్వాచ్చ' అని చెప్పియుండిరి. ఈభాష్యమున కానందగిరులుగూడ భీష్మాదిపదవాచ్యార్థమునుగూర్చి దుఃఖించుచుంటివా? లక్ష్యార్థమునుగూర్చి దుఃఖించుచుంటివా? అని ప్రశ్నించి వాచ్యార్థమునుగూర్చి దుఃఖించుచుంటినందువా? అట్టి వాచ్యార్థమగు భీష్మాదులు శ్రుతశీలవేదాధ్యయనరూపసద్వ్యాపారము గలవారలుగాన నీదేహము గతించినను ఇతోఽధిక దేహమే ప్రాప్తించునుగాన నట్టివాచ్యార్థమునుగూర్చి దుఃఖించుట నీకు యుక్తముకాదు. లక్ష్యార్థమునుగూర్చి దుఃఖించుచుంటినందువా? అట్టిలక్ష్యార్థము వస్తుతః ఆత్మస్వరూపమగుటచే ఛేదనాదులు సంభవింపవుగాన నట్టిలక్ష్యార్థము నుద్దేశించియు దుఃఖించుట యనుచితమేయని పైభాష్యాభిప్రాయమును వర్ణించియుండిరి. అట్లే మధుసూదనసరస్వతులును నిత్యశుద్ధబుద్ధముక్తస్వరూపమగు నాత్మ సర్వాంతర్యామి యగుటవలన ఖడ్గాదులకుగూడ నంతర్యామి యగుటంజేసి ఛేదనార్హము కాదని త్వంపదలక్ష్యార్థమగు శుద్ధచైతన్యమును జెప్పి యీయంతర్యామి బ్రాహ్మణము నుదహరించెను. కాన నట్లుదహరించుట దోషావహము కానేరదు. మఱియు "అంతర్యామ్యధిదైవాదిషు తద్ధర్మవ్యపదేశాత్" "న చ స్మార్త మతద్ధర్మాభిలాపాత్" "శారీరశ్చోభయేఽపిహి భేదేనైనమధీయతే" అనియంతర్యామ్యధికరణమునందుగల మూడుసూత్రములనుదహరించి జీవునకు అంతర్యామికి భేదముగలదుగాన త్వంపదశోధనప్రకరణమునందంతర్యామిశ్రుతినుదహరించుటయుక్తముగాదని యఖండముగ నాందోళనము సాగించిరి. 'య ఇమం లోకం పరంచ లోకం సర్వాణిచ భూతాన్యంతరో యమయతి' 'యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అంతరో' అనునది మొదలుగాగల శ్రుతులయందు చెప్పబడు సర్వాంతర్యామియు,నియామకుడు నెవడనిసందేహమునుదొలగించుటకీయంతర్యామ్యధికరణము చెప్పవలసివచ్చెను. సర్వభూతములకు నియామకుడని చెప్పుటచే నట్టి సర్వభూతములయందు త్వంపదవాచ్యార్థములగు జీవులుగూడ బ్రవిష్టులైనందున నట్టిత్వంపదవాచ్యార్థమగు జీవులీశ్రుతియందు జెప్పబడుటలేదని బోధించుటకే యీయధికరణము చెప్పబడెను. కాన నచట జీవాన్తర్యాములకు గల యుపాధిప్రయుక్తభేదము ననుసరించియే భేదమును బోధించునిమిత్తము "శారీర శ్చోభయేపి హి భేదేనైన మధీయతే" అని సూత్రకారులు చెప్పుట సమంజసము. ఇచటనో త్వంపదలక్ష్యార్థ మన్తర్యామిస్వరూపమే గాన నిత్యము, నిరవయవము, శుద్ధము నగుటంజేసి ఛేదనాదుల కనర్హమని చెప్పుట సమంజసమేయగును. మఱియు త్వంపదశోధనమనగ త్వంపదలక్ష్యార్థమును చెప్పుటయే

యనిక దా పార్థము. అట్లుగాక వాచ్యార్థమును చెప్పుటయునిచో ఇదేవిధమున ద్వితీయపట్టముచే తత్పదవాచ్యార్థమును జెప్పుటయే తత్పదశోధనమని చెప్పవలసివచ్చును. అట్లయిన తృతీయపట్టముచే ప్రథమద్వితీయపట్టశోధితపదార్థముల నైక్యము చెప్పుటకదా? అట్టివిధమున శోధితతత్త్వంపదార్థరూపవాచ్యార్థములగు కించిద్జ్ఞసర్వజ్ఞుల కభేదము చెప్పుట యెటుల పొసగును? పొసగనేరదు. కాన ప్రథమపట్టముచే త్వంపదలక్ష్యార్థము శోధింపబడెననియు, ద్వితీయపట్టముచే తత్పదలక్ష్యార్థము శోధింపబడె ననియును జెప్పిన వారెంటికి నభేదము తృతీయపట్టముచేఁ జెప్పబడుట సంభవించును. అందువలన ప్రథమపట్టము త్వంపదశోధనపరము. అనగా త్వంపదలక్ష్యార్థప్రదర్శనపరము అట్టి లక్ష్యార్థము సర్వవ్యాపకము, నిరవయవము, శుద్ధము, సర్వాంతర్యామి యగు శుద్ధచైతన్యమే. అట్టి సర్వాంతర్యామిస్వరూపముగ త్వంపదలక్ష్యార్థమును చెప్పుటయందు అంతర్యామి బ్రాహ్మణము నుదహరించుట యుక్తమే.

మఱియు 'ఏవండు శస్త్రాదులయందుండఁడో వానిని శస్త్రాదులు ఛేదించుటకు సమర్థము లగును. అట్లుకాక యీయాత్మ శస్త్రాదులయందంతర్యామి యగుటంజేసి శస్త్రములాత్మను ఛేదింపజాలవని నుడివినశ్రీమధుసూదనసరస్వత్యభిప్రాయము సమంజసము కాదు, శస్త్రాదులయందుండు లోహశకలమును శస్త్రములు ఛేదించుట లేదా? ఛేదించుచునే యున్నవి. కాన నిట్టితని వ్రాయు మధుసూదనసరస్వత్యభిప్రాయ ముపేక్షణీయము' అని భాష్యోత్కర్షదీపికాకారులు నుడివి యుండిరి. ఇచట కొంచెము విచారింతము— "శస్త్రాదులయందుండు లోహశకలమును శస్త్రములు ఛేదించుటలేదా? ఛేదించుచునే యున్నవి" అను వాక్యమున కర్థ మేమి? మఱియొక శస్త్రములో నుండు లోహశకలము నింకొక శస్త్రము ఛేదించుచుండె ననియా? ఏశస్త్రము ఛేదించునో ఆశస్త్రములో నుండు లోహశకలము నాశస్త్రమును ఛేదించు ననియా? ఇకొక శస్త్రమునందుండు లోహశకలమును మఱొక శస్త్రము ఛేదించు నను యభిప్రాయ మందువా? అది మధుసూదనసరస్వతులకు సమ్మతమే. కాని మధుసూదనసరస్వతులిచ్చిన యుదాహరణ మంతర్యామిపదస్వారస్యమువలన నేశస్త్రము ఛేదించునో యాశస్త్రము తనయందుండు లోహశకలమును ఛేదింపఁజాల దనియే యాశయము. కాన నిట్టి యుదాహరణము సమంజసమే. దేవదత్తుడు తన శిరస్సుతో మఱియొకని శిరోగతభాగమును కొట్టుటకు సమర్థుఁడగును గాని, తన శిరస్సుతో తన శిరోభాగము నెట్లు కొట్టగలుగును ? కొట్టలే డనియే యర్థము. కాన నేనో యొక వ్రాత వ్రాసినకాని, యందుల పూర్వుల నుదహరించి యాక్షేపించినగాని తనకు గౌరవము రాదను దురభిప్రాయముతో వ్రాసిన భాష్యోత్కర్షదీపికాకారుని యాశయము సర్వదా సర్వథా యుపేక్షణీయ మని మాయాశయము.

పరమార్థప్రపా:— "అయఃపిండగతే వహ్నౌ లోహకారస్య తాడనమ్ । ఆరోప్యతే తథా వహ్నౌ దాహకత్వాది వహ్నిజమ్॥" ఎఱ్ఱగ కాలిన యయోగోళకమును కమ్మరి సమ్మెటతో కొట్టుచుండగఁ జూచి "కమ్మరి యగ్నిని గొట్టుచున్నా డనియు, తప్తాయఃపిండమును స్పృశించి దానియందున్న యగ్ని చేయిని దహించిన "అయఃపిండము దహించుచున్న" దనియు లోహకారతాడన మగ్నియందును, దాహకత్వ మయఃపిండమునం దెట్లారోపింపఁబడుచున్నదో యట్లే దేహగత మగు ఛేద్యత్వాదిక మాత్మయం దారోపింపబడుచున్నది. కాని నిరవయవము, మూర్తిమత్తు కానిదియు, ద్రవరూపము కానిదియు నగు నాత్మయందు ఛేద్యత్వాదికము పరమార్థముగ లేదని యర్థము.

నీలకంఠీయము:— "నిత్యః" అను విశేషణముచే నాత్మ నిత్య మని చెప్పుటవలన ఘటమువలె నుత్పాద్యము కాదనియు, "సర్వగతః" సర్వగత మని చెప్పుటచే గ్రామమువలె ప్రాప్యము కాదనియు, "స్థాణుః" స్థాణువువలె స్థిర మని చెప్పుటచే క్షీరమువలె వికార్యము కాదనియు, 'అచలః' అని చెప్పుటచే దర్పణమువలె సంస్కార్యము కాదనియు తెలుపఁబడెను. అట్లు కాకపోవుటయందు హేతువుగ 'సనాతనః' అని చెప్పఁబడెను.

గీ: అవ్యక్తోఽయ మచిన్త్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే।
తస్మా దేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి ॥ ॥౨౫॥

పదవిభాగము:— అవ్యక్తః- అయం- అచిన్త్యః- అయం- అవికార్యః- అయం- ఉచ్యతే- తస్మాత్ - ఏవం- విదిత్వా- ఏనం- న- అనుశోచితుం- అర్హసి ॥ ॥౨౫॥

ప్రతిపదార్థము:— అయం=ఈ ఆత్మ; అవ్యక్తః=ఇంద్రియములకు గోచరింపనిదగుటచే వ్యక్తము కానిది గను; ఉచ్యతే=చెప్పఁబడుచున్నది; తస్మాత్=ఆ కారణమువలన; ఏనం=ఈ చెప్పిన రీతిగా; ఏవం=ఈ యాత్మను; విదిత్వా=తెలిసికొని; (త్వం)=(ఈపద మధ్యాహార్యము) నీవు; శోచితుం=దుఃఖించుటకు; నార్హసి=తగవు. ॥౨౫॥

శాంకరభాష్యమ్:—

కించ— అవ్యక్తోఽయ మితి। అవ్యక్త స్సర్వకరణావిషయత్వా న్న వ్యజ్యత ఇత్యవ్యక్తోఽయ మాత్మా। అత ఏవాచిన్త్యోఽయం। యద్ధీన్ద్రియగోచరం వస్తు తచ్చిన్తావిషయత్వ మాపద్యతేఽయం త్వాత్మాఽనిన్ద్రియగోచరత్వా దచిన్త్యః। అవికార్యోఽయం యథా క్షీరం

శాంకరభాష్యతాత్పర్యబోధిని.—

త్వంపదార్థపరిశోధనము ప్రక్రమించెను. కాన నట్టి త్వంపదార్థమునే 'అవ్యక్తః' అను శ్లోకముచే శోధించుచుండెను.

"నైవాన్తర్యేణ త్రివిధపరిచ్ఛేదరాహిత్యేన భవతీతి సనాతనః" ఎల్లప్పుడు దేశకాలవస్తువులవలన పరిచ్ఛిన్నము కాక యుండువాడు కాన నాత్మ సనాతన మని చెప్పఁబడును. తార్కికాదిమతములందు పరమాణువులు నిత్యములు కాన నవి కాలమునవలనఁ బరిచ్ఛిన్నములు కాకపోయినను దేశమువలనఁ బరిచ్ఛిన్నము లగును. ఆకాశము కాలము వలనను, దేశములవలనను కూడఁ బరిచ్ఛిన్నము కాకపోయినను వస్తువులవలనఁ బరిచ్ఛిన్న మగును. ఆత్మ యన్ననో యట్లు కాక దేశకాలవస్తువులవలన నపరిచ్ఛిన్న మగును. వస్తుపరిచ్ఛేదము సజాతీయభేద మనియు, విజాతీయభేద మనియు, స్వగతభేద మనియు మూడువిధములు. ఎట్లన? "వృక్షస్య స్వగతో భేదః పత్రపుష్పఫలాదిభిః। వృక్షాన్తరాత్సజాతీయో విజాతీయ శ్శిలాదితః॥" వృక్షమునకు తన పత్రపుష్పఫలాదులవలన సిద్ధించెడి భేదము స్వగతభేద మనఁబడును. వృక్షమునకు మఱియొక వృక్షమువలన సిద్ధించెడి భేదము సజాతీయభేద మనఁబడును. వృక్షమునకు శిలాదులవలన ప్రాప్తించెడి భేదము విజాతీయభేద మనఁబడును. ఇట్టి త్రివిధవస్తుపరిచ్ఛేదము, కాల దేశపరిచ్ఛేదములు కూడ నాత్మకు సంభవింపవు. కాన నట్టి యఖండైకస్వరూప మగు నాత్మ యుత్పత్త్యాప్తివికృతి సంస్కారములకు కాశ్రయము కాదని భావము.

శ్రీధరీయము:— ఆత్మ నిరవయవము గాన నచ్ఛేద్యము, అక్లేద్యము నగు ననియు, మూర్తద్రవ్యము కాదు గాన నదాహ్య మనియు, ద్రవత్వము లేనిదిగాన నశోష్య మనియు భావము. ఆత్మ నిత్య మగుటచేతను సర్వగత మగుటచేతను, రూపాంతరాపత్తి లేనిదగుటచేతను, పూర్వరూపమును పరిత్యజించనిదగుటచేతను, అనాది యగుటచేతను ఛేదనాదులకు యోగ్యము కాదని యాశయము. ॥౨౪॥

—• ౨వ అధ్యాయము- ౨౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఆత్మయందు ఛేద్యత్వాదులను గ్రహింపఁజేయు ప్రమాణ మేమియు లేకపోవుటచేఁ గూడ నాత్మ ఛేద్యత్వాదుల కాశ్రయము కాదని యీశ్లోకమునఁ జెప్పుచున్నాఁడు.

చధ్యాతంచనాదినా వికారి న తథాఽయమాత్మా । నిరవయవత్వా చ్చావిక్రియః । 'నహి నిరవయవం కించి ద్విక్రియాత్మకం దృష్టం । అవిక్రియత్వా దవికారోఽయ మాత్మోచ్యతే । తస్మా దేవం యథోక్తప్రకారేణైన మాత్మానం విదిత్వా త్వం నానుశోచితు మర్హసి హన్తాఽహ మేతేషాం మయేమే హన్యన్త ఇతి ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఆత్మ నిత్యత్వాదిలక్షణములు కలదైనచో నటులనే లోకవ్యవహారము గన్పట్టెడిని. అట్లు వ్యవహారము గన్పట్టుటలేదని శకింపజనదు. ఆత్మ సర్వేంద్రియముల కవిషయము. కాన నవ్యక్త మనఁబడును. (అది యెట్లనిన? జ్ఞానేంద్రియము లైదు. వానిలో త్వక్చక్షురింద్రియములు మాత్రమే రూపవద్ద్రవ్యమును గ్రహించును. ఆత్మ నీరూప మగుటంజేసి త్వక్చక్షురింద్రియములకు గోచరముకాదు. శ్రోత్రజిహ్వాఘ్రాణములు గుణగ్రాహకములు, ఆత్మ గుణభిన్నమగుటంజేసి యీయింద్రియములకు గోచరింపదు. అందువలననే అవ్యక్తమనబడును.) ఇంద్రియముల కాత్మ గోచరింపకున్నను ఊహింపనగునని శకింపవలదు. ఏవస్తువింద్రియగోచరమగనో యావస్తువే యనుమేయ మగును. ఈయాత్మ యింద్రియాగోచర మగుటంజేసి యూహించుటకు శక్యముగాదు. ఆత్మ యింద్రియాగోచరమైనను ఆత్మత్వధర్మపురస్సరముగ దెలిసికొననగును. కాన నాత్మ యనుమేయమగు నని శంకింపరాదు. అనుమితికి (ఊహించుటకు) వ్యాప్తియనియు, హేతువనియు నీరెండును నియతములు. ఎట్లనిన? పర్వతమునందు వహ్ని నూహించుటకు ధూమము హేతువు. ఎచ్చటెచ్చట ధూమముండునో యచట వహ్ని యుండుట వ్యాప్తియనఁబడును. అవియు వికారియందే గన్పట్టెడిని. అట్టి వికారిత్వము దధి మొదలగు వికారములు గలదియు, సావయవము నగు క్షీరాదిద్రవ్యమునందే చూడనగును. ఆత్మ నిరవయవము. అందువలన వికారికాదు. కాన నవికారియగు నాత్మ నూహించుటకు వ్యాప్తి హేతువులు సంభవింపవు. అందుచే నాత్మ యచింత్య మనఁబడును.

"అశోచ్యా నన్వశోచస్త్వం" అనునది మొదలుకొని వివరింపబడిన యాత్మతత్త్వోపదేశము నిట నుపసంహరించుచుండెను. ఆత్మ అవ్యక్తము, అచింత్యము, అవికార్యము, నిత్యము, సర్వవ్యాపకముకాన నట్టి విధమున నీవు తెలిసికొనినచో "నేను వీరలను జంపువాడను; నాచే వీరలు మడయుచుండిరి" అని నీవు దుఃఖించుటకు దగవు. ॥౨౫॥

"అవ్యక్తః" ఇంద్రియగోచర మగు ప్రతివస్తువు ప్రత్యక్షమగుటచే వ్యక్త మనంబడును. ఈయాత్మ రూపాదివిహీన మగుటచే నింద్రియగోచరము కానందున నవ్యక్త మగంబడును. కనుకనే ప్రత్యక్షప్రమాణ మాత్మయందు ఛేద్యత్వాదిగ్రాహకము కాదు.

"అచింత్యః" చింత్యమనగ ననుమేయము. ఈయాత్మ తద్విలక్షణ మగుటచే నచింత్యము (ఊహింపఁదగి

నది కాదు.) ఎచటనైన నొకచో ప్రత్యక్షమగు వహ్న్యాదికము గృహీతవ్యాప్తిగల ధూమాదుల దర్శనముచే మఱియొకచోట ననుమేయమగుచుండుటయు, అప్రత్యక్షమగు వస్తువునకు వ్యాప్తిగ్రహము సంభవించదు గాన ననుమేయత్వ మావస్తువునకు సంభవింపకపోవుటయు ననుభవసిద్ధము. కాన నప్రత్యక్షమగు నాత్మవిషయమైన వ్యాప్తిగ్రహము సంభవింపనందున నాత్మ కనుమేయత్వము గూడ సంభవింపదు. అందువలన ననుమానప్రమాణము గూడ నాత్మయందు ఛేద్యత్వాదిగ్రాహకము కానేరదు.

ఎట్లు ప్రత్యక్షమగు చక్షురాదికము * సామాన్యతో దృష్టానుమానవిషయ మగుచున్నదో యట్లే యాత్మ గూడ నప్రత్యక్షమైనను సామాన్యతోదృష్టానుమానవిషయము కాకూడదా? అను నాశంకను తొలగించుటకు "అవికార్యో౽యం" అని చెప్పఁబడెను. స్వకార్యమగు రూపప్రత్యక్షము మఱియొకవిధమున సంభవింపక పోవుటచే కల్ప్యమానమగు నర్థాపత్తిప్రమాణమువలనను, సామాన్యతోదృష్టానుమానమువలనను, వికియావత్తగు చక్షురాదికము గృహీతమయినను ఆత్మ వికియావత్తు కాకపోవుటచే నర్థాపత్తిప్రమాణమువలనను సామాన్యతో దృష్టానుమానమువలనను గృహీతము కానేరదు.

లౌకికశబ్దమేదైన నొకటి యాత్మయందు ఛేద్యత్వాదికమును దెల్పుటయందు ప్రమాణమందమన్న నదియు ప్రత్యక్షసిద్ధమగు వస్తువునందే ప్రమాణమగును. కాన నప్రత్యక్షమగు నాత్మయందు ఛేద్యత్వాదికమును దెల్పుటయందు ప్రమాణము కానేరదు.

వేదముచేతనే యాత్మయందు ఛేద్యత్వాదికము గృహీతమనినచో నదియు నుపపన్నము కాదని చెప్పు చున్నాఁడు. "ఉచ్యతే" వేదాంగములతోఁ గూడిన వేదముచే నాత్మ యచ్ఛేద్యావ్యక్తరూపముగనే తాత్ప ర్యమువలన జెప్పబడుచున్నది. కాన వేదమాత్మయందు ఛేద్యత్వాదికమును గ్రహించుటలోఁ బ్రమాణము కాదు.

'నైనం ఛిందన్తి శస్త్రాణి' అను శ్లోకమునందు శస్త్రాదుల కాత్మను నశింపఁజేయు సామర్థ్యము లేదనియు, "అచ్ఛేద్యో౽యం" అను శ్లోకమునం దాత్మకు ఛేదనాదికర్మత్వము లేదనియు, 'అవ్యక్తో౽యం" అను శ్లోక మునందు ఆత్మయందు ఛేద్యత్వమును గ్రహించు ప్రమాణము లేదనియు చెప్పఁబడుటచే నీశ్లోకములకు పౌన రుక్త్యదోషము సంభవింపదు. "వేదావినాశినం" అనునది మొదలగు శ్లోకములకుగల పౌనరుక్త్యదోషమును శ్రీమద్భాష్యకారులే "యాత్మవస్తువు దుర్బోధము కాన పునః పునః ప్రసక్తిని కలుగఁజేసి భగవాను లాయాత్మ తత్త్వమునే నిరూపించుచుండెను" అని చెప్పి పరిహరించెను.

ఈవిధముగ పూర్వోక్తయుక్తులచే నాత్మకు నిత్యత్వము, నిర్వికారత్వము సిద్ధింప నీవు శోకింపఁదగదని చెప్పుటకు "తస్మా దేవం" అను ఉత్తరమును చెప్పుచున్నాడు.

ఇట్టి యాత్మస్వరూపజ్ఞానము శోక కారణమగు నవిద్యను నివర్తింపఁజేసెడి దగుటఁజేసి యిట్టి యాత్మజ్ఞానము సంభవించినపుడు శోకము తగదు. కారణము లేమిఁజేసి కార్యము సంభవింపకపోవుట న్యాయమే కాన నాత్మ

* సామాన్యతో దృష్టానుమాన మనగా నేది ప్రత్యక్షజ్ఞానమో అదెల్లను ఇంద్రియజన్యము అనునది. రూప విషయకప్రత్యక్షము ప్రత్యక్షజ్ఞాన మగుటవలన శ్రోత్రాదీంద్రియములవలన జనించదు. అను జ్ఞానసహకారము వలన రూపప్రత్యక్షమునందు చక్షురింద్రియజన్యత్వ మనుమానప్రమాణముచే గ్రహింపబడును. (అనగా జన్యత్వ సంబంధముచే ప్రత్యక్షత్వమను హేతువువలన చక్షురింద్రియము రూపప్రత్యక్షమునందు గృహీతమగును. కాన చక్షురింద్రియము చక్షురింద్రియగ్రాహ్యము కాకున్నను అనుమానప్రమాణగ్రాహ్య మగును. (ఈయనుమాన మునే శాస్త్రమునం దిట్లు ప్రయోగింతురు. యద్యత్ప్రత్యక్షం తత్త దిన్ద్రియజన్యం రూపప్రత్యక్షం శ్రోత్రా దీన్ద్రియాజన్యప్రత్యక్ష మితీతరవిశేషబాధనిశ్చయసహకృతవ్యాప్తిజ్ఞానత శ్చక్షురిన్ద్రియజన్యం రూపప్రత్యక్ష మిత్యనుమితి స్సంభవతీతి).

స్వరూపమును దెలిసికొనక నీవు దుఃఖించుట న్యాయమే. ఆత్మస్వరూపమును దెలిసికొనగూడ ‘నానుశోచితు-మర్హసి’ దుఃఖించుటకు తగవని యాశయము.

శంకరానందీయము:— “తరతి శోక మాత్మవిత్” అను శ్రుత్యుక్తరీతిగ నాత్మవిజ్ఞానికి శోకనివృత్తి యగును. అట్టి యాత్మవిజ్ఞాన మాత్మానాత్మసంశోధములేనిదే సంభవింపదు, కాననట్టియాత్మానాత్మసంశోధనము నుపక్రమించి ‘వాసాంసి’ అను శ్లోకముచే స్థూలశరీరభిన్నత్వమాత్మకు ప్రతిపాదించి “నైనం ఛిందన్తి” అను శ్లోకమున నాత్మ ఛేదనాదులకుగూడ నవిషయమని నిరూపించెను. అట్లయినను సూక్ష్మకారణదేహములుగూడ శస్త్రాదుల కవిషయములు కాన నవియేయాత్మయని భ్రమించుట కవకాశముండుటచే దన్నిషేధముకొరకు అవ్యక్తా-చింత్యపదములచే సూక్ష్మకారణదేహభిన్నత్వ మాత్మకు ప్రతిపాదించుచు నవికార్యత్వమును చెప్పుచు “నట్టియాత్మను తెలిసికొనగూడ నీవు శోకింపదగ” దని చెప్పుచు ప్రస్తుతోపక్రాంతవిషయము నుపసంహరించుచుండెను.

‘అవ్యక్తః’ “అహంకార మమకారాదిభి ర్వ్యజ్యత ఇతి వ్యక్తం” అహంకారమమకారములచే దెలియబడునది గాన లింగశరీరము వ్యక్తమనబడును. ‘నాకీదుఃఖము ప్రాప్తించినది’ అని దుఃఖభోక్త (లింగశరీరము) యెవని (ఏయాత్మ)చే దెలియబడునో యది (యాత్మ) దాని (దుఃఖభోక్త)కంటె భిన్నము కాన లింగశరీరముకంటె యాత్మ భిన్నమని యర్థము. ‘అచింత్యః’ ‘కార్యైః శోకమోహాదిభి శ్చింత్యతేఽనుమీయత ఇతి చిన్త్యం సదవ్యాకృత మజ్ఞానం కారణశరీరం” అదృష్టాదు లెట్లు స్వస్వకార్యములచే నూహింపఁబడునో యట్లే స్వస్వకార్యములగు శోకమోహములచే నూహింపఁబడునది కావున నవ్యాకృతము నజ్ఞానరూపము నగు కారణశరీరము చింత్యమనఁబడును. దేనిచే నేది తెలియఁబడునో యది దానికంటె వేరగుట యనుభవసిద్ధము కాన “నన్ను నే నెఱుగనైతిని, నే నజ్ఞుఁడను” అని గలుగు యనుభవసిద్ధమైన యజ్ఞత్వరూపమగు నజ్ఞానము సాక్షిరూపమగు నాత్మచే దెలియబడుట వలన నట్టి యాత్మ చింత్యమగు స్వవిషయాజ్ఞానముకంటె వేరై యచింత్య మనఁబడును “అవికార్యః” ఈ యాత్మ నిరవయవమగుటచే వికారమునకుగూడ నవిషయము (వికారి కాదనుట) ఇట “అవికార్యః” అనునది యాత్మధర్మములగు ననుత్పాద్యత్వాదుల కుపలక్షణము. (సంగ్రాహకము) ఎట్లన? ‘స్వప్రసిద్ధం హి బ్రహ్మ’ అను శ్రుతిచే నాత్మ యనాదిసిద్ధమై యుండుటచే నుత్పాద్యము గానేరదు. “నాన్యోఽతోఽస్తి విజ్ఞాతా” అను శ్రుత్యుక్తరీతిగ నాత్మ జ్ఞాతృస్వరూపమే గాన నాప్యము గానేరదు. శుద్ధమగుటచే నాత్మ యబాధ్యము. బుద్ధమగుటచే సుఖస్వరూపము. నిత్యశుద్ధబుద్ధస్వరూపమగుటచే నాత్మ యసంస్కార్యము, అద్వయస్వరూపమగును. “సన్మాత్రో నిత్య శ్శుద్ధో బుద్ధ స్సత్యో ముక్తో నిరంజనో విభు రద్వయ ఆనందః ప్రత్యగేకరసః ప్రమాణై రేతై రవగతః” అను శ్రుత్యుక్తరీతిని అస్థూలము, అవ్యక్తము, అచింత్యము, నిష్కలము, నిష్క్రియము, కూటస్థాసంగచిద్రూపము నగు నాత్మను స్వస్వరూపముగ దెలిసికొనగూడ “నానుశోచితుమర్హసి” “నేనువీరలను చంపువాఁడను. వీరలు నాచే జంపబడువారు”లని నీవు శోచించుటకు దగవు. ఇట్లు చెప్పుటచే బ్రహ్మవేత్తలగు నద్వైతదర్శులకు శోకింపఁదగిన దేదియు లేదని సూచితమయ్యెను.

నీలకంఠీయము:— ఇంతవరకు నగు గ్రంథముచే జ్ఞేయమగు వస్తువు చెప్పఁబడెను. అట్టి యాత్మస్వరూపమునం దధ్యస్తమగు దేహత్రయానిరసనద్వారమున నట్టి యాత్మ దెలియదగినదని యీశ్లోకమున జెప్పుచున్నాడు.

ప్రత్యక్షగమ్యమగుటచే స్థూలశరీరము వ్యక్తమనఁబడును. ఆత్మ స్థూలశరీరభిన్నమగుటచే నవ్యక్తమనఁబడును. చక్షురాదిసముదాయస్వరూపమగు లింగదేహము రూపాదిప్రకాశమునకు గారణమగును. అట్టి రూపాది ప్రకాశకార్యముచే కారణమగు లింగశరీర మూహించుటకు శక్యమగును. కనుక లింగశరీరము చింత్య మనఁబడును. అట్టి లింగశరీరముకంటె వేరగు నాత్మ ‘అచింత్యః’ అచింత్య మనఁబడును. సత్త్వరజస్తమోగుణాత్మకమగు మూలాజ్ఞానము కారణశరీర మనఁబడును, సుప్తోత్థితపురుషునకు ‘నే నేమియు నెఱుగను’ అని జ్ఞానము కలుగుట

గీ॥ అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్ ।
తథాఽపి త్వం మహాబాహో! నైవం శోచితు మర్హసి ॥ ॥౨౬॥

**పదవిభాగము:—** అథ- చ- ఏనం- నిత్యజాతం- నిత్యం- వా- మన్యసే- మృతం- తథా- అపి- త్వం- మహాబాహో!- న- ఏవం- శోచితుం- అర్హసి ॥ ॥౨౬॥

**ప్రతిపదార్థము:—** అథ చ=ఒకవేళ; ఏనం=ఈ యాత్మను; నిత్యజాతం=నిత్యము పుట్టునదిగ (శరీరము పుట్టునపుడెల్ల పుట్టునదిగను); నిత్యం=ఎల్లపుడు; మృతంవా=మృతముగను (శరీరము నశించునపుడు నశించునదిగను); త్వం=నీవు; మన్యసే=తలచితివేని; తథాపి=అట్లైనను; హేమహాబాహో!=గొప్పబాహువులు గల ఓ యర్జునా!; త్వం=నీవు; ఏవం=ఏవిధముగ; శోచితుం=దుఃఖించుటకు; నార్హసి=తగవు. ॥౨౬॥

---

శాంకరభాష్యమ్:—

ఆత్మనోఽనిత్యత్వ మభ్యుపగమ్యేద ముచ్యతే- అథచైనమితి । అథచేత్యభ్యుపగమార్థః । ఏనం ప్రకృత మాత్మానం నిత్యజాతం లోకప్రసిద్ధ్యా ప్రత్యనేకశరీరోత్పత్తిం జాతో జాత ఇతి

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"శరీరమేవాత్మేతి లోకాయతికాః" చైతన్యవిశిష్టశరీరమే యాత్మ యని చార్వాక మతము. ఆత్మ యనిత్యమని యంగీకరించి చార్వాకమతము ననుసరించినను నీవు దుఃఖింపజనదు.

ఏలయన? "జాతో దేవదత్తో జాతో యజ్ఞదత్తః" (దేవదత్తుఁడు జన్మించెను. యజ్ఞదత్తుడు జన్మించెను). "ఏవం మృతో యజ్ఞదత్తో మృతో దేవదత్తః" (యజ్ఞదత్తుడు మరణించెను; దేవదత్తుడు మరణించెను.) అను లోకప్రసిద్ధి ననుసరించి ప్రతిదేహము పుట్టునపుడు

---

వలనను, "నె నజ్ఞుఁడను" అను ననుభవమువలనను ఈమూలాజ్ఞానము సాక్షివేద్యమై స్థూలనూత్మ్మ కార్యరూపమున నవస్థాన మొందును. కాన వికార్య మనఁబడును. ఈయాత్మ యన్ననో యట్లు వికార్యముగాక 'అవికార్యః' అవికార్య మగుచున్నది. "ఉచ్యతే" వ్యక్తాదులగు స్థూలలింగకారణదేహత్రయాదినిషేధద్వారమున నీయాత్మ చెప్పఁబడుచున్నదిగాన శృంగగ్రాహికన్యాయమున నాత్మ యిట్టిదని చెప్పుటకు వీలులేదు. "తస్మాదేవం విది త్వైనం నానుశోచితు" మర్హసి" అనగ "తరతి శోక మాత్మవిత్" అను శ్రుత్యుక్తప్రకారము శ్రవ్యాశేత్తవై నీవు గూడ బంధువియోగమువలన గలిగెడి శోకమును పొందకు మని యర్థము. "స్వప్ననిద్రాయుతావాద్యౌ ప్రాజ్ఞస్త్వస్వప్న నిద్రయా । న నిద్రాం నైవ చ స్వప్నం తుర్యే పశ్యంతి నిశ్చితాః" అను శ్లోకమునందుకూడ నాత్మ యవస్థాత్రయాతీత మనియే చెప్పఁబడెను.

—• ౨వ అధ్యాయము- ౨౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇంతవర కాత్మ నిర్వికార మగుటచే శోకింపఁదగ దని నిరూపించి, ప్రస్తుత మాత్మకు వికార్యత్వ మంగీకరించినను శోకింపఁదగినది కాదని రెండుశ్లోకములచేఁ బ్రతిపాదించుచున్నాఁడు.

(1) సౌగతులు (యోగాచార్యులు) క్షణిక (ప్రతిక్షణము పుట్టి నశించెడి) విజ్ఞానమే యాత్మ యందురు.

(2) "దేహమే యాత్మ; అది స్థిరమయిన దైనను ప్రతిక్షణపరిణామియై పుట్టుచు, గిట్టుచు నుండును. ఈవిషయము ప్రత్యక్షసిద్ధమే" అని ప్రత్యక్షమునే ప్రమాణముగ నంగీకరించెడి చార్వాకు (లోకాయతికు) లందురు.

(3) 'ఆత్మ దేహముకంటె వేరైనను దేహముతో గూడ పుట్టుచు గిట్టుచు నుండును' అని మతికొందరందురు.

శాంకరభాష్యమ్:—

మన్యసే తథా ప్రతితద్వినాశం నిత్యం వా మన్యసే మృతం మృతో మృత ఇతి । తథాపి తథాభావిన్యప్యాత్మని త్వం మహాబాహో! నైవం శోచితు మర్హసి జన్మవతో జన్మ; నాశవతో నాశశ్చేత్యేతా వవశ్యంభావినా వితి । ॥౨౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

జీవుఁడు పుట్టునని, ప్రతిదేహము నశించినపుడు జీవుఁడు నశించు ననినను ఈజన్మనాశము లవశ్యంభావులు. జన్మవంతునకు నాశము, నాశముకలవానికి జన్మయు అవశ్యంభావులు. కాన నట్టివాని ననుసరించి నీవు "అహో బత! మహత్పాపం కర్తుం వ్యవసితా వయం" అను విధమున దుఃఖించుటకుఁ దగవు. ॥౨౬॥

(4) "ఆకాశ మెట్లు సృష్ట్యాదియందు పుట్టి ఘటాదులయం దనువృత్తమై కల్పాంతమునం దెట్లునశించునో; అటులే యాత్మగూడ సృష్ట్యాదియందు పుట్టి దేహము లనేకము లైనను వానియం దనువర్తమానమై, కల్పాంతస్థాయియై కల్పాంతమునందు నశించును" అని మఱికొంద రందురు.

(5) మరణించిన పిదప పునర్భవ మొందుటయే జన్మము. ఇట్టి జన్మ మనగ నపూర్వదేహేంద్రియాది సంబంధము. ఇట్లే మరణ మనగ పూర్వదేహేంద్రియాదివిచ్ఛేదము. ఇట్టి జన్మమరణములకు ధర్మాధర్మములు కారణములు. అట్టి ధర్మాధర్మముల కనిత్యవస్తు వాధార మనిన\nచో * కృతహానాకృతాభ్యాగమము సంభవించెడిని. కాన ధర్మాధర్మాశ్రయము నిత్య మగు నాత్మయే యని యొప్పుకొనవలయును. అట్టి నిత్యమగు నాత్మకే జన్మము, (అపూర్వ దేహేంద్రియాదుల సంబంధము) మరణము (పూర్వదేహాదుల విచ్ఛేదము) కలుగుచున్నవి. కాన నిత్యమగు నాత్మయే పూర్వమునందు చెప్పఁబడిన జన్మమరణములు కలది యగుచున్నది" అని తార్కికు లందురు.

(6) "ఎట్లాకాశమునకు కర్ణశష్కులీజన్మముచే జన్మము, కర్ణశష్కులీనాశముచే నాశము అను నీ జన్మనాశము లుపాధిప్రయుక్తములై యముఖ్యము లగునో, అటులే నిత్యమగు నాత్మకు దేహజన్మముచే జన్మము, దేహవినాశముచే నాశము అను నీరెండు నుపాధిప్రయుక్తములై యముఖ్యము లగుచున్నవి" అని మఱికొంద రందురు.

ఈమతములలో నాత్మ యనిత్య మను పక్షమునందుగూడ నాత్మవిషయమై దుఃఖించుట తగ దని యాత్మకు శోచ్యత్వమును "అథ చైవం" అను శ్లోకముచే నిషేధించుచున్నాఁడు.

"అథ చ" ఆత్మవస్తువు దుర్బోధ మగుటచే ననేకపర్యాయములు శ్రవణ మయినను అవధారణాసామర్థ్యముచే నే చెప్పిన పక్షము నంగీకరింపక యేతద్విరుద్ధ మగు నాత్మ యనిత్య మను పక్షము నాశ్రయించి "ఏనం" ఈయాత్మను 'నిత్యజాతం నిత్యం వా మృతం మన్యసే' ('వా' అను శబ్దము సముచ్చయార్థకము) ప్రతిక్షణమునందు పుట్టునదిగను, ప్రతిక్షణమునందు నశించునదిగను తలచెడివాఁడ వైనను, లేక 'ఆత్మ పుట్టెను, నశించెను' అని లౌకికప్రత్యక్షముచే నాత్మకు జన్మవినాశములు కల్పించెడివాఁడ వైనను 'హే మహాబాహో!' ఓపురుషధౌరేయ! (కుమతాభ్యుపగమమువలన 'ఓపురుషధౌరేయ!' అని సోపహాసకముగ సంబోధించెను) 'నైవం శోచితు మర్హసి' "అహో! బత! మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్" అని దుఃఖించుటకు తగవు. అనగా క్షణిక విజ్ఞానవాదిమతమునందును, దేహాత్మవాదిమతమునందును ఆత్మకు దేహముతోగూడ జన్మవినాశము లున్నవను పక్షము

* తనచే నాచరింపబడిన సుకృతదుష్కృతములకు హానమున్ను, తనచే నాచరింపఁబడని సుకృతదుష్కృతముల ఫలము ప్రాప్తించుటయు సంభవించెడిని.

నందుగూడ నొకేయాత్మకు పరలోకజన్మము లేదు కాన జన్మాంతరీయ పాపభయము సంభవింపనేరదు. పాపభయము చేతనేకదా నీవు దుఃఖించుచుంటివి. ఆత్మ యనిత్య మను పక్షమున నట్టి పాపభయమున కవకాశము లేనందున నీవు దుఃఖింపదగ దని భావము.

ఆత్మ యనిత్య మనగా 'శరీరేంద్రియసంబంధము నశించునపుడాత్మ నశించును' అను పక్షమునందు దృష్ట దుఃఖనిమిత్తమగు శోకము (మనస్తాపము) సంభవించినను అదృష్టదుఃఖనిమిత్త మగు శోకము నీకు తగదనిభావము.

శంకరానందీయము:— ఈవిధమున సంసారభ్రమవిధ్వంసక మగు నాత్మయాథాత్మ్యజ్ఞానము నుపదేశించి శ్రీకృష్ణపరమాత్మ—ఇట్టి యాత్మతత్త్వజ్ఞాన మాత్మప్రసాదములేనిదే సంభవింపదుగాన నర్జునునియం దట్టియాత్మ ప్రసాదము పుట్టలేదని యూహించి, మరియొకవిధమున నాయర్జునుని శోకమును పోగొట్టుటకు "అథ చైనం" అని చెప్పుచుండెను.

"హే మహాబాహో!" 'పురుషధౌరేయుడ వయ్యును నీవిట్లు దుఃఖించుట తగదు' అని. సూచించుటకు సోపహాసముగ సంబోధించెను. ఈశ్లోకమునందుగల 'చ' అను శబ్దము 'యది' అను శబ్దార్థకము. ఈ పూర్వోక్త రీతిని నిత్యముగ నాత్మ యెప్పుడెప్పుడు దేహముపుట్టునో, ఆట్టిదేహోత్పత్తి ననుసరించిపుట్టునదిగను, దేహనాశము ననుసరించి నశించునదిగను నీవుదలచితివేని యట్లయినను "నార్హా వయం హన్తుం ధార్తరాష్ట్రాన్స్వబాంధవాన్" (మనబంధువులగు దుర్యోధనాదులను సంహరించుటకు మనముతగము) అనిచెప్పినరీతిని నీవుదుఃఖించుటకుతగవు.

భాష్యోత్కర్షదీపిక:— బాగుగ విచారించినచో నాత్మ నిత్యమే. ఇక వేదబాహ్యవాది సిద్ధాంతము నంగీకరించినను శోకింపదగవని యీశ్లోకమున జెప్పుచున్నాడు. "మహాబాహో!" అను సంబోధనచే "శోకమును విడిచి నీవు నీబాహువుల మహత్త్వమును చూపదగుదువు" అని సూచింపబడెను.

పరమార్థప్రపా:— దేహమునకును, ఆత్మకును, సాహచర్యము కన్పట్టుటవలన దేహముతోగూడ నాత్మకు జన్మమనియు, దేహనాశముచే నాత్మకు నాశమనియు నంగీకరించినను శోకింపదగినది గాదని "అథ చైనం" అను శ్లోకముచే జెప్పుచుండెను.

పుణ్యపాపము లాత్మగాము లగుటంజేసి తత్ఫలభూతములగు జన్మవినాశములుగూడ నాత్మగాములే గాన దేహోత్పత్తి ననుసరించి యాత్మ పుట్టుటచేతను, దేహవినాశము ననుసరించి యాత్మ నశించుటచేతను, పుణ్యపాప ఫలము లాత్మకు సంభవించుచునేయున్నవి. ఆట్టి పుణ్యపాపములను పరలోకజన్మమునం దనుభవించు నాత్మయే లేనందున "పాపమేవాశ్రయే దస్మాన్హత్వైతా నాతతాయినః" అని దుఃఖించుట నీకు దగదని భావము.

నీలకంఠీయము:— ఇంతవరకు నగు గ్రంథముచే తత్త్వదృష్టి ననుసరించి శోకింపదగినది గాదని చెప్పి యిపుడు మూఢజనదృష్టి నవలంబించిగూడ శోకము తగదని "అథచైనం" అను శ్లోకముచే జెప్పుచుండెను. "నిత్యజాతం" (నియమేనజాతం) నియమముగ జన్మించునదని చార్వాకపక్షము. 'నిత్యం సర్వదాజాతం' యెల్లపుడు జన్మించునదని క్షణికవిజ్ఞానవాదిపక్షము. నిత్యశ్చాపూర్వదేహేంద్రియసంబంధాజ్జాతశ్చ" నిత్యమగు నీయాత్మ యపూర్వమగు దేహేంద్రియసంబంధమువలన బుట్టునదని తార్కికాదిపక్షము. ఇదే విధమున "నిత్యం వా మన్యసే మృతమ్" అను వాక్యమున కర్థము చూడనగును. అదియెట్లనిన? నియమముగ నశించున దాత్మయని చార్వాకపక్షము. సర్వము నశించునదని క్షణికవిజ్ఞానవాదిపక్షము. నిత్యమగు నాత్మ దేహేంద్రియసంబంధవినాశమువలన నశించునదని తార్కికాదిపక్షము. ఇట్టి పక్షత్రయమునందుగూడ నీవు దుఃఖించుట తగదు. "హే మహాబాహో!" అను సంబోధనచే యుద్ధనిమిత్త ముత్సాహమును గలిగించుచుండెను. ॥౨౬॥

గీ॥ జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ ।
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి ॥ ॥౨౭॥

పదవిభాగము:— జాతస్య- హి- ధ్రువః- మృత్యుః- ధ్రువం- జన్మ- మృతస్య- చ- తస్మాత్- అపరిహార్యే- అర్థే- న- త్వం- శోచితుం- అర్హసి ॥ ॥౨౭॥

ప్రతిపదార్థము:— హి=ఏ కారణమువలన; జాతస్య=పుట్టినవానికి; మృత్యుః=మరణము; ధ్రువః=నిశ్చితమో; మృతస్య చ=మరణించినవానికి; జన్మ=పుట్టుట; ధ్రువం=నిశ్చితమో; తస్మాత్=ఆ కారణమువలన; అపరిహార్యే=పరిహరించుటకు శక్యముకాని; అర్థే=వస్తువువిషయమై; త్వం=నీవు; శోచితుం=దుఃఖించుటకు; నార్హసి=తగవు. ॥౨౭॥

శాంకరభాష్యమ్:—

తథా చ సతి—జాతస్యేతి । జాతస్య హి లబ్ధజన్మనో ధ్రువోఽవ్యభిచారీ మృత్యు ర్మరణం ధ్రువం జన్మ మృతస్య చ । తస్మా దపరిహార్యోఽయం జన్మమరణలక్షణోఽర్థస్తస్మి న్నపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి ॥ ॥౨౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పుట్టుకకలవానికి మరణము, మరణించినవానికి పుట్టుకయు నవ్యభిచారులు (నియతములు) అనగా నవశ్యంభావులు; పరిహరించుట కశక్యములు. కాన నట్టి యపరిహార్యము లగు జననమరణముల నుద్దేశించి నీవు దుఃఖించుటకు తగవు.

—• ౨వ అధ్యాయము ౨౭ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఆత్మ ప్రళయపర్యంతము నుండు నను పక్షమునందు, నిత్య మను పక్షమునందు దృష్టాదృష్టదుఃఖము సంభవించునుగాన నట్టి దుఃఖభయముచే దుఃఖించుచుంటి నను నాశంకను "జాతస్య హి" అను శ్లోకముచే దొలగించుచుండెను.

స్వకృతధర్మాధర్మములవలన బొందబడిన శరీరేంద్రియసంబంధముగల స్థిరమగు నాత్మకు- సంయోగము వియోగావసానము కలదగుటచే శరీరేంద్రియారంభకకర్మక్షయమువలన మృత్యువు (శరీరేంద్రియాది సంయోగ నాశము) తప్పదు. అట్లే మృత్యువునకు పూర్వదేహకృతకర్మఫలోపభోగార్థము జన్మము (శరీరేంద్రియాదిసంబంధము)తప్పదు. పూర్వకర్మశేషము కలవాడే ప్రస్తుతమగుటచే జీవన్ముక్తియం దట్లగుపడుట లేదనుశంక దొలగింపబడెను. కాన పరిహరించుటకు శక్యముకాని యీజన్మమరణస్వరూపమగు నర్థమువిషయమై యిట్టిదని తెలిసికొని కూడ నీవు దుఃఖించుటకు తగవు. ఈవిషయమునే శ్రీకృష్ణపరమాత్మ "ఋతేఽపి త్వాం న భవిష్యన్తి సర్వే" నిన్నువిడచి ఈ యావన్మందియు నశించువారలే) యని ముందు చెప్పగలడు.

నీచే యుద్ధమునందుచంపబడక యీభీష్మద్రోణాచార్యాదులు జీవించునెడల యుద్ధమునకై నీవుశోకించుట యుక్తమే. కాని వీర లీశరీరారంభకకర్మక్షయమువలన స్వయముగనే మరణించుచుండిరి. కాన నట్టివారల మరణముయొక్క పరిహారమునం దసమర్థుడవగు నీకు దృష్టనిమిత్తమగు శోకము (మనస్తాపము) న్యాయము కాదని భావము.

ఈవిధముగనే యదృష్టదుఃఖనిమిత్త మగు శోకముగూడ నీకు యుక్తముకాదనుటయందు "తస్మా దపరి

"హోత్ర్యే౽ర్థే" అను సత్తరార్థము హేతువు. అది యెట్లనఁగ? యుద్ధ మనునది క్షత్రియున కగ్నిహోత్రమువలె విహిత (నిత్య) కర్మము. 'యుధ్ సంప్రహారే' యుధ్ ధాతువు సంప్రహారమునందు వర్తించును. యుధ్ ధాతువు వలన "యుద్ధం" అనెడి రూపము నిష్పన్నమయినది? దీనికి శత్రుప్రాణవియోగమున కనుకూల మగు శస్త్రప్రహారమర్థము. ఇది క్షత్రియునకు శాస్త్రవిహిత మగుటంజేసి శాస్త్రవిహితమగు నగ్నీషోమీయాది పశుహింస ప్రత్యవాయజనకము కానటుల ప్రత్యవాయజనకము కాదు. ఈవిషయమునే "న దోషో హింసాయా మాహవే౽న్యత్ర వ్యశ్వాసారథ్యనాయుధకృతాంజలిప్రకీర్ణకేశపరాఙ్ముఖోపవిష్టస్థలవృక్షారూఢదూతగోబ్రాహ్మణాదిభ్యః" (పోయిన యశ్వములుకల రౌతుని. సారథిలేని రథికుని, ఆయుధములేని యోధుని, అంజలిపట్టి శరణుజొచ్చినవానిని, కేశములను విరియబోసికొనినవానిని (సంసిద్ధుడు కానివానిని), యుద్ధపరాఙ్ముఖుని, కూరుచున్నవానిని, పర్వతాద్యున్నతప్రదేశములను, వృక్షములనధిష్ఠించువారలను, దూతలను, గోవులను, బ్రాహ్మణులనుదక్క యితరులను యుద్దమునందు సంహరించిన ప్రత్యవాయము ప్రాప్తించదు) అని గౌతమమహర్షి చెప్పియుండెను. ఈగౌతమ సూత్రమునందుగల బ్రాహ్మణశబ్దమునకు గవాదిశబ్దములతోఁ బఠించుటచే యుద్ధముచేయని బ్రాహ్మణుఁడని యర్థము. ఈవిషయమంతయు "స్వధర్మ మపి చావేక్ష్య" అను శ్లోకమునందు స్పష్టము కాగలదు. కాన నగ్నిహోత్రమువలె యుద్ధము విహిత మగుటవలన నవశ్యకర్తవ్యము. అట్టియుద్ధకర్మమును చేయనిచో ప్రత్యవాయము ప్రాప్తించుటచే నపరిహార్య మగు నీవిషయమై దృష్టభయముచే నీవు దుఃఖించుటకు తగవని భావము.

మఱియు యుద్ధమునునది కామ్యకర్మమునినను "య ఆహవేషు యుద్ధ్యన్తే భూమ్యర్థ మపరాఙ్ముఖాః ॥ అకూటై రాయుధై ర్యాన్తి తే స్వర్గం యోగినో యథా" (ఎవరు భూమినిమిత్తము యుద్ధపరాఙ్ముఖులుగాక కపటములు కాని యాయుధములతోయుద్ధముజేసెదరో అట్టివారలు యోగులవలెనే స్వర్గముపొందెదరు.) అను యాజ్ఞవల్క్యస్మృతివలనను, "హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్" (మరణించితివా? స్వర్గమును పొందెదవు. శత్రువులను జయించెదవా? నిస్సపత్నమగుభూమి ననుభవించెదవు) అను శ్రీకృష్ణ పరమాత్మ వాక్యమువలనను, యుద్ధమునది కామ్యకర్మమైనను ప్రారంభింపబడిన కామ్యకర్మము నిత్యకర్మతుల్య మగుటంజేసి యవశ్యము పరిసమాపనీయము కాన నీచే నీయుద్ధము ప్రారంభింపబడుటచే నపరిహార్యము, (విడచుటకు శక్యము కానిది.) అట్టి యీయుద్ధవిషయమున నీవు దుఃఖించుట యుక్తము కాదు.

లేక యర్జునుడు పరమాస్తికు డగుటవలన వేదబాహ్యమగు చార్వాకాదిమతము నంగీకరించుట యతనికి సంభవము కానందున 'అథ చైనం నిత్యజాతం' 'జాతస్య హి ధ్రువో మృత్యుః' అను నీరెండుశ్లోకములు 'ఆత్మ నిత్యము' అను పక్షమునందే జెప్పబడెను. అట్టి పక్షమునందు "నిత్యశ్చాసౌ దేహేంద్రియాదిసంబంధవశా జ్జాత శ్చేతి నిత్యజాతః" (నిత్యమగు ఈయాత్మ దేహేంద్రియాదిసంబంధవశమున బుట్టినవాడుగాన నిత్యజాతుఁ డన బడును.) అనగా నిత్యమైనను నాత్మను జన్మించినవానినిగ నీవుతలచితివేని' అట్లే నిత్యమైనను అత్మను దేహేంద్రియాదివియోగముచే మరణించినవానినిగను నీవుతలచితివేని అట్లయినను నీవుదుఃఖించుటకు తగవని ప్రథమశ్లోకమున కాశయము. ఎందుకుదుఃఖింపవలదను నాశంకను దొలగించుటకు 'జాతస్య హి ధ్రువో మృత్యుః' అను శ్లోకము హేతువుగ జెప్పబడెను. నిత్య మగు నాత్మకు జన్మ మనగ శరీరేంద్రియాదిసంబంధము; నాశ మనగ తద్వియోగము. శ్రీశంకరభగవత్పాదులు చెప్పినభాష్యమునుకూడ నాత్మ నిత్య మను పక్షమునందే యోజింపదగును. అది యెట్లనిన? "ఏనం ప్రకృత మాత్మానం లోకప్రసిద్ధ్యా ప్రత్యనేకశరీరోత్పత్తిం జాతో జాతమితి మన్యసే" అని శాంకరభాష్యము. "ఏనం ప్రకృత మాత్మానం" ఈనిత్యమగునాత్మను 'లోకప్రసిద్ధ్యా' లోకవ్యవహారముచే 'ప్రత్యనేకశరీరోత్పత్తిం' ప్రతిశరీరేంద్రియసంబంధమువలన "జాత ఇతి" పుట్టినవాడని "మన్యసే" తలచితివేని అని సమన్వయింపవలెను. అనగా నిత్యమగు నాత్మను శరీరేంద్రియసంబంధమువలన జన్మించినవానిగ తలచితివేని అట్టి జన్మవినాశము లపరిహార్యము లగుటచే నీవు దుఃఖించుటకు దగవని భాష్యాభిప్రాయము చూచుకొనతగినది.

గీ॥ అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత ।
అవ్యక్తనిధనా న్యేవ తత్ర కా పరిదేవనా ॥ ॥ ౨౮ ॥

పదవిభాగము:— అవ్యక్తాదీని- భూతాని- వ్యక్తమధ్యాని-భారత!- అవ్యక్తనిధనాని- ఏవ-తత్ర- కా- పరిదేవనా ॥ ॥ ౨౮ ॥

ప్రతిపదార్థము:— భూతాని=పుత్రపౌత్రాది కార్యకరణసంఘాతరూపమగు భూతములు; అవ్యక్తాదీని=అదర్శనము ఆదిగాగలవి; వ్యక్తమధ్యాని=దర్శనము మధ్యకాలమునందుగలవి; అవ్యక్తనిధనాని=అదర్శనము నిధనము గాగలవి; తత్ర=అట్టియదృష్టదృష్టనష్టభ్రాన్తిరూపములగు భూతములవిషయమై; కా పరిదేవనా=శోకప్రలాపమెట్టిది? వ్యర్థమనియర్థము. ॥ ౨౮ ॥

శాంకరభాష్యమ్:—

కార్యకరణసంఘాతాత్మ కాన్యపి భూతా న్యుద్దిశ్య శోకో న యుక్తః కర్తుం; యతః— అవ్యక్తాదీనీతి । అవ్యక్తాదీ న్యవ్యక్త మదర్శన మనుపలబ్ధి ర్గాది ర్యేషాం భూతానాం పుత్రమిత్రాదికార్యకరణసంఘాతాత్మకానాం తా న్యవ్యక్తాదీని భూతాని ప్రాగుత్పత్తేః । ఉత్పన్నాని చ ప్రాఙ్మరణా ద్వ్యక్తమధ్యాని । అవ్యక్తనిధనా న్యేవ పున రవ్యక్త మదర్శనం నిధనం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"నిత్యమగు నాత్మ నుద్దేశించి దుఃఖించుట న్యాయము కాకున్నను కార్యకరణ (శరీరేంద్రియ) సంఘాతము నశించుచున్నదిగాన నట్టి కార్యకరణసంఘాతము నుద్దేశించి దుఃఖించుట న్యాయమే" యని శంకింపజనదు.

మొదట దృష్టిగోచరము గాక మధ్యకాలమునందు "ఇదం రజతం" (ఇది రజతము) అని చూడఁబడి యాప్తోపదేశమువలన నిది రజతముకాదని తెలిసికొనినపిమ్మట దృష్టిగోచరము

శంకరానందీయము:— ఈపక్షమునందు శోకింపదగినది కాదనుటయందు "జాతస్య" అనుశ్లోకముచే హేతువును చెప్పుచుండెను.

జన్మకలవానికి మరణము, మరణించినవానికి జన్మయు నియతములు. అహోరాత్రములువలె నియతములగు నీజన్మమరణములు బ్రహ్మకుగూడ నపరిహార్యములు. అట్టి జన్మమరణములవిషయమై నీవు దుఃఖింపదగవు. ॥ ౨౭ ॥

—• ౨వ అధ్యాయము ౨౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఆత్మ నిత్యమను పక్షమునను, అనిత్య మను పక్షమునను సర్వవిధముల నాత్మ కశోచ్యత్వ ముపపాదితము. "ఆత్మ అశోచ్యమైనను భూతసంఘాతాత్మకములగు శరీరముల నుద్దేశించి దుఃఖించెద" నను నర్జునుని యాశంకను శ్రీకృష్ణపరమాత్మ "అవ్యక్తాదీని భూతాని" అను శ్లోకముచే తొలగించుచుండెను.

పృథివ్యాది భూతాత్మకమగు శరీరము లుత్పత్తికి పూర్వమునం దవ్యక్తములు. (అప్రత్యక్షములు) ఉత్పత్త్యనంతరమున మరణమునకుఁ బూర్వమునందువ్యక్తములు. (ప్రత్యక్షములు.) నాశానంతరమున నవ్యక్తములు. (అప్రత్యక్షములు.) ఎట్లనిన? స్వప్నమునందును, ఇంద్రజాలమునందును ప్రతిభాస్వరూపములగు జీవులేవిధముగ స్వప్నేంద్రజాలములకు పూర్వమునందుగనబడక మధ్యావస్థయందుగనుపించి నాశావస్థయందు గనబడుటలేదో, శుక్తిరూప్య

శాంకరభాష్యమ్:—

మరణం యేషాం తాన్యవ్యక్తనిధనాని। మరణాదూర్ధ్వ మవ్యక్తతామేవ ప్రతిపద్యన్త ఇత్యర్థః। తథా చోక్తం-"అదర్శనా దాపతితః పునశ్చాఽదర్శనం గతః। నాసౌ తవ న తస్య త్వం వృథా కా పరిదేవనా" ఇతి। తత్ర కా పరిదేవనా కో వా ప్రలాపోఽదృష్టదృష్టప్రనష్ట భ్రాన్తిభూతేషు భూతేష్విత్యర్థః॥ ॥౨౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కావున శుక్తిరజతమువలె మొదట (ఉత్పత్తికి పూర్వమున) అదృష్టమై, అనంతరమున (ఉత్పత్త్యనంతరమున) వ్యావహారికసత్త్వమువలనదృష్టమై, మరణానంతరమున తిరుగదృష్టిగోచరము కానట్టి భ్రాంతివిషయమగు నీశరీరేంద్రియసంఘాతము నుద్దేశించి శోకము న్యాయము కాదు. అట్టివాని నుద్దేశించి "ఇవి మరణించుచున్నవే" అనుశోకము కారణముగాగల ప్రలాప మెందులకు? వ్యర్థమని యాశయము. ఈయాశయమునే "అదర్శనా దాపతితః పునశ్చాదర్శనం గతః। నాసౌ తవ న తస్య త్వం వృథా కా పరిదేవనా" అను వచనముగూడ బోధించుచున్నది ॥౨౮॥

దిక మేవిధముగ పూర్వమునందుఁ గనుపించక ప్రతిభాసకాలమునందు గనుపించి శుక్తిజ్ఞానానంతరము కనుపడక ప్రతిభాసరూప మగుచున్నదో; అదేవిధమున దృష్టిసృష్టివాదము నంగీకరించుటచే నీ శరీరములుగూడ నాద్యంతములయందుఁ గనుపించక ప్రతిభాసకాలమున గనుపించుటచే ప్రతిభాసరూపములే యగును. కాన "ఆదావంతే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా" అను న్యాయమున మధ్యావస్థయందు (ప్రతిభాసకాలమునందు) గూడ నీ శరీరములు లేనివే. ఈ విషయమే "నాసతో విద్యతే భావః" అని పూర్వమునం దీగీతలయందే చెప్పబడెను. కాన స్వప్నమునం దనేకబంధువులను చూచి మెలుకువ గాంచినవాఁడు స్వాప్నికబంధువిచ్ఛేదముచే నెట్లు దుఃఖింపఁడో యట్లే మిథ్యాభూతములు, అత్యంత తుచ్ఛములు నగు పృథివ్యాదిభూతవికారములగు నీ దేహముల విషయమై "కా పరిదేవనా" ఏమి దుఃఖప్రలాపము! ఇట్టి దుఃఖప్రలాప ముచితము కాదని భావము. ఈ విషయమే పురాణమందుగూడ "అదర్శనా దాపతితః పునశ్చాదర్శనం గతః" ఇట 'భూతసంఘః' అనుపద మధ్యాహార్యము. భూతసంఘ మదర్శనమునుండి వచ్చినది. తిరుగ నదర్శనమునే పొందుచున్నది. అని చెప్పఁబడెను. కాన నిట్టి (యదృష్టదృష్టప్రనష్టభ్రాంతిరూపములగు) శరీరముల నుద్దేశించి శోకము యుక్తము కాదని భావము.

లేక ఆకాశాదిమహాభూతాభిప్రాయముగ గూడ నీశ్లోకము నన్వయింపనగును. 'అవ్యక్తాదీని' 'అవ్యక్తం' అవ్యాకృతమగు నవిద్యోపహితచైతన్యము 'ఆదిః' ప్రాగవస్థ కాగల మేమహాభూతములకో అట్టి భూతములు అవ్యక్తాదులనఁబడును. "వ్యక్తమధ్యాని" అవిద్యాకార్యములగు నామరూపములచే మధ్యకాలమునందు ప్రకటీకృతములు. (పరమార్థసద్రూపముచే మధ్యస్థిత్యవస్థ లేనివనుట) 'అవ్యక్తనిధనాన్యేవ' మృత్తుయందు ఘటము లయముఁ బొందినటుల స్వకారణమగు నవ్యక్తమునందే లయించునవి. ఈవిషయమునే "తద్ధేదం తర్హ్యవ్యాకృత మాసీత్ నామరూపాభ్యామేవ వ్యాక్రియతే" అను శ్రుతిగూడ సర్వప్రపంచమున కవ్యక్తమే యుపాదానమని బోధించుచున్నది. కార్యమునకు స్వోపాదానమునందే లయ మనుభవసిద్ధమగుటంజేసి సర్వప్రపంచమునకు లయస్థాన మవ్యక్తమే యని యర్థాత్సిద్ధము. ఈవిషయము గ్రన్థాన్తరమున విస్తారముగ జెప్పఁబడెను. కాన నజ్ఞాకల్పితములగుటచే తుచ్ఛములగు నాకాశాదిభూతముల నుద్దేశించి దుఃఖించుట యుక్తము కాదు. ఆకాశాదిభూతముల నుద్దేశించి

దుఃఖించుటే యుక్తము కానిచో తత్కార్యములగు శరీరాదులనుద్దేశించి దుఃఖించుట యుచితము కాదని వేఱే చెప్పవలెనా? చెప్పనవసరములేదనియే యాశయము.

లేక ఆకాశాదిభూతములు, తత్కార్యములగు శరీరములు స్వకారణమగు నవ్యక్తరూపమున సర్వదా యుండుటచే వానికి నాశము సంభవింపనందున తన్నిమిత్తము ప్రలాపము తగదని యర్థము. "భారత" అని సంబోధనచే నో యర్జునా! నీవు శుద్ధమగు భరతవంశోద్భవుడవు కాన శాస్త్రీయమగు నర్థమును తెలిసికొనుటకు సమర్థుడవు. అట్టివాడవయినను నీవెందుల కట్టి శాస్త్రీయమగు నర్థమును తెలిసికొన లేకుంటివని సూచింపబడెను.

శంకరానందీయము:— భీష్మాదిశబ్దవాచ్యములగు నీశరీరము అన్నియు మాయాకార్యము లగుటంజేసి యసద్రూపములు. అట్లసద్రూపము లగుటచే "నీశరీరములు నాసంబంధములైన" వని యెన్నడు శోచింపదగదని యీశ్లోకమున సూచించుచున్నాడు.

"నామరూపాదిభి ర్న వ్యజ్యత ఇత్యవ్యక్తం మాయా । తస్యా స్సకాశా దాది ర్జన్మ యేషాం తా న్యవ్యక్తాదీని భూతాని శరీరాణి" నామరూపములచే వ్యక్తము కానిదగుటవలన మాయ యవ్యక్త మనబడును. దాని నుండి జన్మించునవగుటచే భౌతికములగు శరీరము లవ్యక్తాదు లనబడును. అట్టి శరీరములే "వ్యక్తమధ్యాని" దేవతిర్యఙ్మనుష్యబ్రాహ్మణాదిరూపముగ నాభాసించినవై మధ్యకాలమునందు లబ్ధస్వరూపములు కలవై యగును. మఱియు "అవ్యక్తనిధనాని" తిరిగి మాయయందే లయము నొందును.

ఐంద్రజాలికప్రపంచమువలె నదృష్టదృష్టప్రనష్టస్వభావము కలవి కాన శరీరములు మాయాకార్యము లగును. మఱియు "యథా స్వప్నప్రపంచోఽయం మయి మాయావిజృమ్భితః । తథా జాగ్రత్ప్రపంచోఽయం మయి మాయావిజృమ్భితః ॥" అను వచనానుసారము స్వాప్నికపదార్థములవలె నీజాగ్రత్ప్రపంచ మంతయు మాయా విజృంభిత (కార్య) ముగ దెలిసికొనిన పురుషునకు 'నన్ను వీడు చంపుచున్నాడనియు, వీడు మృతి నొందుచున్నాడనియు' 'కా? పరిదేవనా' మిథ్యాభూతార్థవిషయమై పరితాపమనగ నెట్టిది? ఎట్టిపరితాపము కలుగదని యర్థము.

లేక "ప్రమాణై స్సర్వై ర్న వ్యజత ఇత్యవ్యక్తం పరం బ్రహ్మ తదగ్రహణా దాది ర్జన్మ యేషాం తా న్యవ్యక్తాదీని" ఏప్రమాణములచేతను తెలియఁబడనిదగుటవలన పరబ్రహ్మ మవ్యక్తమనఁబడును. అట్టి పరబ్రహ్మయొక్క యజ్ఞానము (పరబ్రహ్మజ్ఞానము) వలన జనించునవి కాన భూతము లవ్యక్తాదులనఁబడును. అనగా శుక్త్యజ్ఞానముచే నెట్లు ప్రాతిభాసికరజతము పుట్టుచున్నదో యట్లే యాత్మాజ్ఞానమువలన నీభూతములు పుట్టుచున్నవి. "సర్వం వ్యంజయతీతి వ్యక్తమంతఃకరణం మధ్యే స్థితికాలే యేషాం తాని వ్యక్తమధ్యాని" దేవతిర్యగాది, స్త్రీపురుషాది, పితృపుత్రాదిభేదములను "నేను నాది"యను సంబంధమును కల్పించి యంతఃకరణమే ప్రపంచమును నిర్వహించుచుండుటచే నంతఃకరణము వ్యక్తమనబడును. ఎంతవర కధిష్ఠానదర్శనము కలుగదో యంతవరకు భూతములయొక్క సత్తాస్ఫూర్త్యాదులు వాసనాసహితాంతఃకరణబలమువలననే కలుగుచుండును. కావున నట్టి యంతఃకరణముచే భూతములు వ్యక్తమధ్యమము లనఁబడును. "మనోవృత్తిమయం ద్వైత మద్వైతం పరమార్థతః" అను వచనానుసారము "అవ్యక్తే స్వాధిష్ఠానే బ్రహ్మణి నిధన మేషాం తా న్యవ్యక్తనిధనాని" అధిష్ఠానమగు పరబ్రహ్మముయొక్క (పరబ్రహ్మ విషయికమగు) యజ్ఞానమువలన నుత్పన్నములై ఎంత కాలము వర కధిష్ఠానమగు పరబ్రహ్మము దెలియఁబడదో యంత కాలమువరకు మరుమరీచికాజలమువలె నీ భూతములు స్వతస్స్వరూపము కలవిగా భాసించుచు అధిష్ఠానమగు బ్రహ్మము తెలియఁబడఁగానే నీ భూతము లధిష్ఠానమగు బ్రహ్మస్వరూపముగనే భాసించును. కాన నీ భూతము లవ్యక్తనిధనము లనఁబడును. అధిష్ఠానబ్రహ్మాజ్ఞానవిజృంభితము, మరుమరీచికా జలమువలె ప్రతిభాసమాత్రరూపము నగు ఈ దేహాదిప్రపంచవిషయమై యధిష్ఠానసందర్శనముచే సర్వమును బ్రహ్మమునుగా దెలిసికొను పండితునకు "కా పరిదేవనా" పరిదేవనమున (శోకమున) కవకాశ మెక్కడ యని యర్థము. దుఃఖించుట కవకాశమే సంభవింపదని యాశయము.

భాష్యోత్కర్షదీపిక:—

అవ్యక్తమనగ నవ్యాకృతము (అవిద్యోపహితచైతన్యము) కారణ మీభూతములకో యట్టి యాకాశాదిభూతములు నామరూపములచే వ్యక్తముచేయఁబడుటచే వ్యక్తము అనఁబడు నని మధుసూదనసరస్వతి వ్యాఖ్యానించిన ఆకాశాది మహాభూతాభిప్రాయముగ శ్రీభగవత్పాదు లెందులకు వ్యాఖ్యానింపలేదనిన ? "తత్ర కా పరిదేవనా" (దానివిషయమై శోక మెందులకు) అని వాక్యశేషమునం దుండుటచే తచ్ఛబ్దముచే నాకాశాదులను గ్రహించిన ప్రస్తుత మాకాశాదులనుగూర్చి శోక మప్రసక్త మగుటంజేసి వాక్యశేషమునకు విరోధము వాటిల్లును. మఱియు ఉపసంహారమునందు "తస్మాత్సర్వాణి భూతాని" అని కార్య కరణ సంఘాతబోధకపద ముండుటచే ప్రథమమున నాకాశాదిమహాభూతపరముగ చెప్పినచో నుపక్రమోపసంహారముల కేకార్థత్వము వాటిల్లదుగాన భాష్యకారులట్టుల చెప్పుట నుపేక్షించిరి.

స్వాభిప్రాయము:— భాష్యోత్కర్షదీపికాకారులు "అవ్యక్తాదీని భూతాని" అను వాక్యమునకు మాత్రము మధుసూదనసరస్వతులచే వ్రాయఁబడిన వ్యాఖ్యను చూచి యాకాశాదిమహాభూతముల నుద్దేశించి శోకించుట యనుచిత మను భావము మాత్రము గమనించి యట్లు వాక్యశేషవిరోధమును, ఉపక్రమోపసంహారముల కైకార్థ్యానుపపత్తిని నుడివియుండిరి. ఇంతమాత్రముచే మధుసూదనసరస్వతులు విడువలేదు. అట్టి యవిద్యాకార్యములగు మహాభూతముల నుద్దేశించియే దుఃఖము ప్రసక్తము కానప్పుడు మహాభూతకార్యములగు శరీరాదులనుగూర్చి దుఃఖము సుతరాం ప్రసక్తము కాదని చెప్పియుండిరి. ఇట్లు చెప్పుటచే 'తత్ర కా పరిదేవనా' అను వాక్యశేషవిరోధము, "తస్మాత్సర్వాణి భూతాని" అను ఉపసంహారవాక్యమున విరోధము పరిహరింపఁబడుచుండ నది గమనింపక యిట్టితీరున వ్రాయుట తమకు మధుసూదనసరస్వతియందు ప్రబలవిరోధమో, లేక నద్వైతసిద్ధి మొదలగు గ్రంథరచయితలగు శ్రీమధుసూదనసరస్వతులగ్రంథము నేదో విధమున విమర్శించినగాని తనకు గౌరవము వాటిల్లదనియో ఏదోయొక దురభిప్రాయముచేతనే ప్రతిశ్లోకమునం దిట్టితీరుగనే కుక్కుటాండమునకు రోమాన్వేషణము జేయుచుండిరి. ఇక శ్రీమద్భగవత్పాదు లట్లెందులకు వ్రాయలేదనిన ప్రకరణార్థము చెడక వాక్యార్థము సరిపడునట్లనేకుల కనేకార్థములు తోఁచును. అట్టి యర్థము లన్నియు శ్రీభగవత్పాదులు వ్రాయలేదని యాక్షేపించుట యనుచితము. మఱియు అవిద్య కార్యస్వరూపముచే ననర్థకారి యగు నని "అవ్యక్తాదీని భూతాని" అను దానికి శరీరపరముగ వ్యాఖ్యానించియుండిరి ఇట్లుపపన్న మగుచుండ భాష్యకారుల కొక న్యూనత్వము ప్రాప్తించినటుల తలచి భాష్యకారుల న్యూనతాదోషమును పరిహరించుటకు మొదలిడినట్లు **వ్రాయుట తన సామర్థ్య మెంతటిదియో లోకమునకు విశదపరచుటయే యని మాయభిప్రాయము.**

నీలకంఠీయము:— ఆత్మ కశోచ్యత్వ ముండుగాక, యిష్టదేహవినాశమువలన గలిగెడి శోకము సంభవించును కదా యని యాశంకించి దేహాదులకు మిథ్యాత్వమును 'అవ్యక్తాదీని భూతాని' అను శ్లోకముచే సహేతుకముగ సాధించుచుండెను. "భూతాని" ఆకాశాది పంచమహాభూతములు, తత్కార్యములగు జరాయుజములు, అండజములు, స్వేదజములు, ఉద్భిజ్జములు అను భూతములు "అవ్యక్తాదీని" అజ్ఞానము కారణముగా కలవి. మఱియు 'వ్యక్తమధ్యాని' (ఉత్పత్త్యనంతరము మరణమునకు పూర్వమునం దుండు దశ మధ్యావస్థ యనఁబడును.) అట్టి మధ్యావస్థయందు వ్యక్త మగునవి. మఱియు "అవ్యక్తనిధనాన్యేవ" అజ్ఞానమునందు లయించునవి. అనగా రజ్జూరగాది కారణమగు నజ్ఞానము రజ్జూరగములవలె వ్యక్తము కాదు (పరీక్ష్యమాణమైన రజ్జువువలె. నురగమువలె నజ్ఞానము దృష్టి పథమున ప్రవేశించదనుట.) గాన నజ్ఞాన మవ్యక్త మనఁబడును. అట్టి యజ్ఞానమువలన జనించిన సర్ప మాయజ్ఞానమునందే లయమును పొందుచున్నది. రజ్జువునందు లయించుటలేదు. ఈవిధముననే యాత్మయందు కల్పితములగు వియదాదిభూతములకు, జరాయుజాదులకు కారణము, అంతము అవ్యక్తమే యగును 'ఆదావన్తేచ యన్నాస్తి వర్తమానేపి తత్తథా' అనున్యాయమున నుత్పత్తికి పూర్వమునను, నాశమునకు పరమునను లేనట్టి

గీ॥ ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన మాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః ।
ఆశ్చర్యవచ్చైన మన్యశ్శృణోతి శ్రుత్వాప్యేనం వేద నచైవ కశ్చిత్ ॥ ౨౯॥

పదవిభాగము:— ఆశ్చర్యవత్ – పశ్యతి – కః – చిత్ – ఏనం – ఆశ్చర్యవత్ – వదతి – తథా – ఏవ – చ – అన్యః – ఆశ్చర్యవత్ – చ – ఏనం – అన్యః – శృణోతి – శ్రుత్వా – అపి – ఏనం – వేద – న – చ – ఏవ – కః – చిత్ । ॥ ౨౯॥

ప్రతిపదార్థము:— కశ్చిత్ = ఒకానొకడు; ఏనం = ఈ యాత్మను; ఆశ్చర్యవత్ = ఇదివర కెన్నడును జూడక యకస్మాత్తుగఁ జూచిన యద్భుతమునువలె; పశ్యతి = చూచుచున్నాడు; తథైవ = ఆ దేవిధమున; అన్యః = మఱియొకఁడు; ఆశ్చర్యవత్ = అద్భుతమునువలె; వదతి = చెప్పుచున్నాడు; అన్యః = మఱియొకఁడు; ఏనం = ఈయాత్మను; ఆశ్చర్యవత్ = అద్భుతమునువలె; శృణోతి చ = వినుచుండెను; శ్రుత్వాఽపి = వినినను; ఏనం = ఈయాత్మను; కశ్చిత్ = ఎవఁడును; న వేద చ = తెలిసికొనలేకుండెను.

లేక — కశ్చిత్ = ఎవఁడో యొకఁడు; ఏనం = ఈయాత్మను; పశ్యతి = చూచునో; సః = (ఈ పదమధ్యాహార్యము) వాఁడు; ఆశ్చర్యవత్ = ఆశ్చర్యసదృశుఁడు; (అనేక వేలసాధకులలో నొకానొకఁడుమాత్రము చూచునని యాశయము) తథైవ = అరీతిగనే; అన్యః = మఱియొకఁ డెవఁడు; వదతి = చెప్పునో; సః = వాడు; ఆశ్చర్యవత్ = ఆశ్చర్య సదృశుఁడు; (అనంతములలో నట్టివాఁ డొకానొకఁ డని యాశయము); అన్యః = మఱియొకఁ డెవఁడు; ఏనం = ఈయాత్మను; శృణోతి = వినునో; సః = అట్టివాఁడు; ఆశ్చర్యవత్ = ఆశ్చర్యసదృశుఁడు; (అనేకులలో నొకానొకఁడు) శ్రుత్వాఽపి = వినినను; కశ్చిత్ = ఎవఁడును; ఏనం = ఈయాత్మను; న వేద = తెలిసికొనలేదు. ॥ ౨౯॥

---

భూతములు మధ్యయందు భాసించినను రజ్జూరగమువలె లేనివియే. ఇట్టి భూతములవిషయమై "కా పరిదేవనా" విలాప మనగ నెట్టిది? (విలాపము సంభవింపదని యాశయము.) మరుమరీచికాప్రదము నష్టమాయెనని యామరుమరీచికాప్రదముయొక్క తత్త్వమును తెలిసినవాడు విలపింపడు. కనుకనే భూతములకు రజ్జూరగములకువలెను, శుక్తిరజతములకువలె ప్రతీతిసమకాలిక మగు సృష్టి నుద్దేశించి కౌషీతకీబ్రాహ్మణమునందు "స యదా స్వపితి తదైనం వాక్సర్వై ర్నామభి స్సహాప్యేతి చక్షు స్సర్వై రూపై స్సహాప్యేతి శ్రోత్రం సర్వై శ్శబ్దై స్సహాప్యేతి మన స్సర్వై ర్ధ్యానై స్సహాప్యేతి స యదా ప్రబుధ్యతేఽగ్నేరివ విస్ఫులింగా విప్రతిష్ఠేరన్నేవ మేవైతస్మా దాత్మన స్సర్వే ప్రాణా యథాయతనం విప్రతిష్ఠన్తే ప్రాణేభ్యో దేవా దేవేభ్యో లోకాః" (ఈశ్రుతియందుగల ప్రాణశబ్దమునకు చక్షురాదీంద్రియములు, దేవాః అను శబ్దమునకు చక్షురాదీంద్రియానుగ్రాహకములగు సూర్యాదిదేవతలు అని యర్థము.) ఈజీవు డెప్పుడు నిద్రించునో యప్పుడు వాగింద్రియము సర్వనామములతో నీయాత్మయందు లయము పొందుచున్నది. చక్షురింద్రియము సర్వరూపములతోను, శ్రోత్రేంద్రియము సర్వశబ్దములతోను, మనస్సు సర్వధ్యానములతో నీయాత్మయందు లయము పొందుచున్నవి. ఈయాత్మ యెపుడు మెలకువ గాంచునో అపు డీయాత్మవలన వాగాదిసర్వేంద్రియములు యథాస్థానమును పొందుచున్నవి. ప్రాణముల (ఇంద్రియముల) వలన తదనుగ్రాహకసూర్యాదిదేవతలు యథాస్థానమును పొందుచుండిరి. అట్టి దేవతలవలన లోకములు యథాస్థానమును పొందుచున్నవి. (అనగా మెలకువ గాంచినతోడనే నిద్రయం దాత్మయందు లీనమైన చక్షురాదీంద్రియములాత్మవలన యథాస్థానమును బొందినతోడనే యింద్రియానుగ్రాహకసూర్యాదిదేవతలవలన నాయింద్రియములు సర్వలోకములయందు ప్రసరించి రూపాదిజ్ఞానజనకము లగును. అని స్వాపప్రబోధములయందు జగత్తుయొక్క లయోదయములు వర్ణింపఁబడుచున్నవి. ఈకౌషీతకీబ్రాహ్మణమునందును, మఱియొక స్థలమునందును సర్వభూతలయోదయస్థాన మాత్మయే చెప్పఁబడుచుండ నజ్ఞాన మెటుల లయోదయములకు స్థాన మగును? అనిన నదియు సత్యమే. ఎట్లనిన? బ్రహ్మ మజ్ఞాయమాన మగుటంజేసి లయోదయస్థాన మని వ్యపదేశింపఁబడుచుండెను. కాని యథాస్థితి ననుసరించి కాదు. అపరిణామియు, కూటస్థము నగు బ్రహ్మము మృత్తువలె కార్యలయోదయస్థానరూప మగుట సంభవము కాదు. ఈవిషయమే "అథ ద్వైతేన్ద్రజాలస్య య దుపాదానకారణమ్ । అజ్ఞానం తదుపాశ్రిత్య బ్రహ్మకారణ ముచ్యతే ॥" అను శ్లోకమునందుఁ జెప్పఁబడెను. ॥ ౨౮॥

**శాంకరభాష్యమ్:—**

దుర్విజ్ఞేయోఽయం ప్రకృత ఆత్మా కిం త్వా మేవైక ముపాలభే సాధారణే భ్రాన్తినిమిత్తే కథం దుర్విజ్ఞేయోఽయ మాత్మే త్యాహ—ఆశ్చర్యవదతి। ఆశ్చర్యవ దాశ్చర్య మదృష్ట మద్భుత మకస్మా ద్దృశ్యమానం తేన తుల్య మాశ్చర్యవ దాశ్చర్య మివైన మాత్మానం పశ్యతి

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

"అవ్యక్తోఽయ మచిన్త్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే। తస్మా దేవం విది త్వైనం నానుశోచితు మర్హసి ॥ అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతం। తథాపి త్వం మహాబాహో! నైవం శోచితు మర్హసి ॥ అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత! అవ్యక్తనిధనా న్యేవ తత్ర కా పరిదేవనా ॥" అను శ్లోకములచే నర్జునున కుపాలంభము చూపఁబడెను. ఆత్మాజ్ఞానమువలనఁ గలిగెడి భ్రాంతి సర్వసాధారణమై యుండ నాత్మ సర్వులకు దుర్జ్ఞేయమేగాన నొక యర్జుననిగూర్చియే యీ యుపాలంభము (దూషణము) కాదు. సర్వులకును నీయుపాలంభము వర్తించునని యీశ్లోకముచే బోధించుచుండెను.

—• ౨వ అధ్యాయము ౨౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— అనేకమంది విద్వాంసులుఁగూడ దుఃఖించుచుండ యొందునిమిత్తము నన్నే మాటిమాటికి నిందించుచుంటివి? మఱియు "వక్తు రేవహి త జ్జాడ్యం శ్రోతా యత్ర న బుధ్యతే" (ఎచట శ్రోత విషయమును తెలిసికొనజాలఁడో అది వక్తయొక్క జాడ్యమే కాని శ్రోతృజాడ్యము కాదు) అను న్యాయమున నీవు చెప్పిన వాక్యముల యర్థమును తెలిసికొనలేకపోవుట నా దోషము కాదు. మఱియునిది యదియు నీదే యగును. అని యో యర్జునా! నీ వనెదవా! ఇతరులకువలె నీకును స్వాశయదోషమువలననే యాత్మప్రతిపాదకశాస్త్రము యొక్క యర్థము తెలియుటలేదు. కనుకనే నీకును నితరులకును ఆత్మాపరిజ్ఞానమువలననే శోకము ప్రాప్తించుచుండెను. కానపూర్వోక్తదోషద్వయమున కవకాశము లేదని యభిప్రాయముకలవాడై శ్రీకృష్ణపరమాత్మ యాత్మకు దుర్విజ్ఞేయత్వమును "ఆశ్చర్యవత్" అను శ్లోకముచే జెప్పుచుండెను. ఈశ్లోకమునందుగల ఆశ్చర్యవత్" అను నది **కర్మయందు, కర్తయందు, క్రియయందు గూడ విశేషణము. అది యెట్లనిన? "ఆశ్చర్యేణాద్భుతేన తుల్య** తయా వర్తమాన మేనం దేహినం' ఆశ్చర్యవత్=ఆశ్చర్యసదృశః కశ్చిత్; యత్పశ్యతి తదాశ్చర్యవత్' అని కర్తృకర్మక్రియా విశేషణముగా నన్వయింపనగును. ఇట్లన్వయించుటవలన జేలినయాశయ మేమన? ప్రకృతదేహి యగు నాత్మను— అవిద్యాప్రయుక్త నానావిధవిరుద్ధ ధర్మములుకలవాడైనను సత్తునుగను, అస్వప్రకాశచైతన్యస్వరూపుడైనను జడునిగను, ఆనందఘనుడైనను దుఃఖము కలవానిగను నిర్వికారుడైనను సవికారిగను, నిత్యుడైన ననిత్యునిగను, ప్రకాశించువాడైన నప్రకాశునిగను, బ్రహ్మాభిన్నుడైనను బ్రహ్మాభిన్నునిగను, ముక్తుడైనను బద్ధునిగను, అద్వితీయుడైనను సద్వితీయునిగను ఇట్లు సంభావిత విచిత్రానేకాకారప్రతీతివిషయునిగ (అని కర్మవిశేషణము). శాస్త్రముచేతను, ఆచార్యోపదేశముచేతను అవిద్యక సర్వద్వైత ప్రపంచనిషేధ పురస్సరముగ వేదాంతవాక్యజన్యము, పరమాత్మస్వరూపమాత్రాకారము సర్వసుకృతఫలభూతమునగు నంతఃకరణవృత్తియందుప్రతిఫలితమగు నాత్మను సమాధిపరిపాకముచే శమదమాదిసాధనములతో గూడిన శరీరముకల యొకానొకడు సాక్షాత్కారమును చేసుకొనును. కాని సర్వులు సాక్షాత్కరింపజేసుకొనలేరు. ఈసాక్షాత్కార మనునదియే యాశ్చర్య

శాంకరభాష్యమ్:—

కశ్చిత్ । ఆశ్చర్యవ దేనం వదతి తథైవ చాన్యః । ఆశ్చర్యవ చ్చైన మన్యః శృణోతి । శ్రుత్వాపి దృష్ట్వోక్త్వాపి వ్యేనం వేద నచైవ కశ్చిత్ । అథవా యోఽయ మాత్మానం పశ్యతి స ఆశ్చర్యతుల్యః, యో వదతి యశ్చ శృణోతి సోఽనేకసహస్రేషు కశ్చిదేవ భవతి । అతో దుర్బోధ ఆత్మే త్యభిప్రాయః ॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"అహ మహం" అను ప్రతీతివిషయ మగుటం జేసి యాత్మ సుజ్ఞేయమగుచుండ దుర్జ్ఞేయ మెటు లగును? అని శంకింపవలదు.

"అహం" అను ప్రతీతివలన నంతఃకరణవిశిష్టాత్మ దెలియబడినను శుద్ధాత్మ దెలిసికొనుట కశక్యము. కాన నొకఁడీయాత్మను తానెన్నఁడూ జూడని యద్భుతమువలెఁ జూచును. అనగా "అప్రాప్య మనసా సహ" అని చెప్పినటుల నాత్మ దుర్జ్ఞేయముగాన నాత్మద్రష్టయే దుర్లభ మని యీశ్లోకప్రథమపాదమున కభిప్రాయము.

ఆవిధముననే యొకఁడీయాత్మను తానెన్నఁడు జూడని యాశ్చర్యమువలె జెప్పును. అనగా నాత్మ వాగింద్రియాగోచర మగుటం జేసి యాత్మోపదేశము సంభవింపనందున ఆత్మోపదేశకుఁడే దుర్లభమని యీశ్లోకద్వితీయపాదమున కాశయము.

తుల్యము (అని క్రియావిశేషణము) ఆత్మదర్శన మెటుల యాశ్చర్యతుల్యమునిన? ఆత్మదర్శనమనగ నాత్మాకారమగు నంతఃకరణవృత్తి. ఆట్టియంతఃకరణవృత్తి స్వస్వరూపముచే మిథ్యాభూత మైనను సత్యముగ నాత్మకు వ్యంజకము. అవిద్యాపరిణామాంతఃకరణపరిణామ మైనను అవిద్యానాశకము. అవిద్యను నశింపజేయుచు నవిద్యాకార్య మగుటఁజేసి తననుగూడ నశింపఁజేయును. కాన నాత్మదర్శన మాశ్చర్యసదృశమని యర్థము. అట్లే యీయాత్మను ఎవఁడు దెలిసికొనునో వాఁడును ఆశ్చర్యతుల్యుడు. (అని కర్తృవిశేషణము). ఆట్టియాత్మదర్శనము కలవాఁ డెట్లాశ్చర్యతుల్య డనిన? ఇట్టి యాత్మదర్శనముకలవాఁ డవిద్యాతత్కార్యములు లేనివాఁడైనను ప్రారబ్ధకర్మ ప్రాబల్యమున నవిద్యాతత్కార్యములు కలవాఁడు వలె వ్యవహరించుచుండును. సమాధినిష్ఠుఁడైనను, సమాధినుండి లేచినవాఁడైనను సర్వదా సమాధి ననుభవించుచుండును. ప్రారబ్ధకర్మవైచిత్ర్యముచే విచిత్రచరిత్ర కలవాడును, పొందుటకు శక్యముకాని జ్ఞానము కలవాఁడు నగుటచే సర్వలోకస్పృహణీయుఁడు. కాన నాశ్చర్యతుల్యుఁడని యాశయము. కాన నాశ్చర్యమగునది యాత్మ; ఆట్టియాత్మజ్ఞాన మాశ్చర్యమైనది; అట్టి యాత్మను దెలిసికొనువాడును ఆశ్చర్యతుల్యుడే యగునుగాన పరమదుర్విజ్ఞేయ మాత్మ యగుచుండ నీవట్టి యాత్మను అనాయాసముగ నెట్లు దెలిసికొనెద వని భావము.

ఇదేవిధమున నాత్మోపదేశము చేయువాఁడు లేమింజేసి యాత్మ దుర్విజ్ఞేయము. అది యెట్లనిన? ఎవఁ డాత్మస్వరూపమును దెలిసికొనునో వాఁడే యితరులకొఱ కాత్మను నిశ్చయముగఁ జెప్పును. అజ్ఞుఁ డుపదేశించుటకు సమర్థుఁడు కానేరఁడు. ఆత్మజ్ఞానియు సమాధినిష్ఠుఁడై యుపదేశించునా? సమాధివ్యుత్థానకాలమునం దుపదేశించునా? సమాధికాలమునం దుపదేశించున నెదవా? తానాత్మానుసంధానతత్పరుఁడై యుండ నితరుల కుపదేశించుట యెటుల సంభవించును? సంభవింపనేరదు. సమాధివ్యుత్థానకాలమునం దుపదేశించు నని యెదవా?

శాంకరభాష్యతాత్పర్యబోధిని:—

మఱియొకఁ డీయాత్మను తానెన్నఁడు జూడని యాశ్చర్యమువలె వినును. అనగా నాత్మ శ్రోత్రేంద్రియాగోచర మగుటంజేసి శ్రవణము సంభవింపదు. కాన శ్రోతయు దుర్లభమే యని తృతీయపాదమున కభిప్రాయము

అట్టి జ్ఞాని యే కాలమునందు సమాధినుండి లేచునో యట్టి కాలమితరులచే నెటులఁ దెలియనగును? అతికష్టముచేఁ దెలిసికొనినను అజ్ఞాని లాభమును కాని, పూజను గాని, ఖ్యాత్యాదులను గాని యపేక్షింపనందున నాత్మోపదేశమును చేయడు ఎట్టకేలకు కారుణ్యమాత్రముచేఁ బరమేశ్వరస్వరూపమును బోధించిన నతఁడు పరమేశ్వరుఁడువలె నత్యంతదుర్లభుఁడని 'ఆశ్చర్యవద్వతి తథైవ చాన్యః' అను వాక్యముచేఁ జెప్పనుండెను. "యథా జానాతి తథైవ వక్త్యేన మిత్యనుకర్షణార్థశ్చకారః" (ఏవిధముగఁ దెలిసికొనునో ఆవిధముగనే యీయాత్మను చెప్పును అని యీయాత్మను అనుపదముయొక్క యనుకర్షనిమిత్తము మూలమున చకారము ప్రయోగింపబడెను. అట్టి యుపదేశకుఁడు 'అన్యః' సర్వజనవిలక్షణుఁడు అని "అన్యః" అను శబ్దమున కర్థము. కొందఱు 'అన్యః' అనుశబ్దమునకు పూర్వోక్తభిన్న మర్థము కాన పూర్వమునందు "ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిత్" ఒకానొకఁ డాశ్చర్యమువలె చూచును. అని చెప్పుటచే నట్టి జ్ఞానికంటె భిన్నుఁడని "అన్యః" అను శబ్దమున కర్థము చెప్పిరి. అట్లా యర్థమునే చెప్పినచో నట్టివాఁ డజ్ఞానియే కాన నజ్ఞాని కుపదేశసామగ్ర్యము లేమింజేసి వాడుపదేశించునని చెప్పుట వ్యాఘాత మగును. (విరుద్ధ మగును).

"ఆశ్చర్యవ ద్వదతితథైవ చాన్యః" అను వాక్యమునందుగూడ పూర్వమువలె "ఆశ్చర్యవత్" అనువిశేషణము కర్మయందు క్రియయందు, కర్తయందుఁగూడ నన్వయింపఁదగును. అందు కర్మయందును, కర్తయందు గల యాశ్చర్యము పూర్వమునందు వ్యాఖ్యానింపఁబడెను. క్రియయందుఁగల యాశ్చర్య మేదనిన? ఏశబ్దముచేతను గూడ చెప్పఁబడని శుద్ధమగు నాత్మను చెప్పుటయే ఆశ్చర్యము. అది యెట్లనిన? "యతో వాచో నివర్తన్తే, అప్రాప్య మనసా సహ" అను శ్రుతి యేశబ్దముచేతను ఆత్మ బోధింపఁబడ దని చెప్పుచుండ విశిష్టమునందు శక్తిగల పదముచే లక్ష్యతావచ్ఛేదకరూపమును విడిచియేజహదజహత్స్వార్థలక్షణాస్వరూపమగు కల్పితసంబంధముచే నేయాత్మప్రతిపాదనము కలదో, అదియు నిర్వికల్పకసాక్షాత్కారరూప మగు నని యాశ్చర్యము. అనగా "ఘటః" ఇత్యాదిపదములు ఘటత్వ మనెడి విశేషణముతోఁగూడిన ఘటమునందు శక్తిగలవై ఘటమును బోధించును. "గంగాయాం ఘోషః" అని యొకఁడు ప్రయోగించె ననుకొనుడు. ఇట విశిష్టశక్తిచే గంగాపదము ప్రవాహమును బోధించును. అట్లు ప్రవాహమునే యీస్థలమునందు స్వీకరించిన నాప్రవాహమునందు గొల్లపల్లి సంభవము కాదు. కాన ప్రవాహఘోషముల కన్వయ మనుపపన్నము. కాన గంగాపద మిచట లాక్షణిక మన వలెను. లాక్షణికమనగ లక్షణచే నేపద మర్థమును బోధించునో యాపదము లాక్షణిక మనబడును. లక్షణయనగ శక్యసంబంధము. శక్యమనగ పదముశక్తిచే నేయర్థమును బోధించునో యట్టి యర్థము శక్యమనబడును. "గంగాయాం ఘోషః" అను స్థలమున గంగాపదమునకు శక్యము ప్రవాహము. అట్టి ప్రవాహసంయోగము తీరమునకు కలదు గాన నాప్రవాహసంబంధ మగు సంయోగమే శక్యసంబంధము. అట్టి శక్యసంబంధమే లక్షణ యనఁబడును. అట్టి లక్షణాజ్ఞానముచే గంగాపదమువలన లక్ష్యతావచ్ఛేదక మగు తీరత్వపురస్సరముగ తీరబోధ కలుగును. అట్టి తీరమునందు గొల్లపల్లి సంగతమే యగును. కాన నన్వయానుపపత్తి పరిహారమునిమిత్తము "లక్షణ" అనెడి వృత్తి నంగీకరింపవలెను.

అట్టి లక్షణావృత్తి జహత్స్వార్థయనియు, అజహత్స్వార్థయనియు జహదజహత్స్వార్థయనియు మూడు

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఆత్మ యిట్టిదని వినినను, తెలిసికొనినను, చెప్పినను యెవఁడూ యాత్మసాక్షాత్కారము నొందఁడని చతుర్థపాదమున కాశయము. అనగా నాత్మ సాక్షాత్కార మత్యంతాయాససాధ్య మని గ్రహింపనగును.

విధములు శక్యార్థమును విడిచి కేవల లక్ష్యార్థబోధనప్రయోజకమగు లక్షణ జహత్స్వార్థలక్షణ యనంబడును. అట్టి లక్షణ 'గంగాయాం ఘోషః' అను స్థలమున చూడనగును. శక్యార్థలక్ష్యార్థోభయ జ్ఞానప్రయోజకలక్షణ అజహత్స్వార్థలక్షణ యనంబడును. అది యెట్లనిన? ఒకానొకడు "కాకేభ్యో దధి రక్ష్యతాం" (కాకములవలన పెరుగు రక్షింపఁబడుఁగాక) అని వాక్యమును ప్రయోగించె ననుకొనుడు. ఇచట కాకశబ్దమునకు కాకములు శక్యార్థములు. అట్టి శక్యార్థములనుమాత్రమే గ్రహించినచో కాకములు పెరుగు పాడుచేయకుండ రక్షింపవలెను. గాని మార్జాలకుక్కుటాదులు పెరుగును పాడుచేయుచున్నను నూరకుండు డని యాశయముచేతనా 'కాకేభ్యో దధి రక్ష్యతాం' అని శబ్దమును ప్రయోగించుట. కాదు, దధి నేజంతువులు పాడుచేయునో యట్టిజంతువులవలన దధిని కాపాడుడను తాత్పర్యముచేతనే ప్రయోగించును. కాన నీకాకశబ్దము స్వశక్యమగు కాకములను, లక్ష్యములగు కుక్కుటాదులను కూడ లక్షణచే బోధించును. అట్టి లక్షణావృత్తినే 'అజహత్స్వార్థలక్షణ' యందురు. 'సోఽయం దేవదత్తః' (ఈ దేవదత్తుఁడు వాడే) అను స్థలమునందు 'సః' అను తచ్ఛబ్దమునకు తద్దేశతత్కాలవృత్తిత్వవిశిష్ట దేవదత్తుఁ డర్థము. 'అయం' అను పదమున కేతద్దేశైతత్కాలవృత్తిత్వవిశిష్టదేవదత్తుఁడర్థము. విశేషణము లగు తద్దేశతత్కాలములు, ఏతద్దేశైతత్కాలములు భిన్నములగుటచే తద్విశిష్టదేవదత్తుల కభేదము పొసగదు. కాననిచట శక్యార్థమున కేకదేశమగు తద్దేశతత్కాలములను, ఏతద్దేశైతత్కాలములను బరిత్యజించి తదేకదేశమగు దేవదత్తుని బోధించుటకు ప్రయోజకమగులక్షణ "జహదజహత్స్వార్థలక్షణ" అనియనఁబడును. ఇదేవిధమున 'తత్త్వమసి' అను స్థలమున 'తత్' అనుపదము సర్వజ్ఞత్వవిశిష్టచిత్తును బోధించును. 'త్వం' అనుపదము కించిద్జ్ఞత్వవిశిష్టచిత్తును బోధించును. అట్టితత్త్వంపదార్థములగు సర్వజ్ఞత్వవిశిష్టచిత్తునకు కించిద్జ్ఞత్వవిశిష్టచిత్తునకభేదము సంభవింపదు. అందుచే నిచట జహదజహత్స్వార్థలక్షణ నంగీకరింపవలయును. శక్యార్థైకదేశములగు సర్వజ్ఞత్వకించిద్జ్ఞత్వములను పరిత్యజించి కేవలచిద్విషయకమగు "చిత్" అను బోధమాత్రము ప్రయోజకమగు లక్షణావృత్తి జహదజహత్స్వార్థలక్షణ యనంబడును. అట్టి జహదజహత్స్వార్థలక్షణచే "తత్త్వమసి" అనునవి మొదలగు మహావాక్యములవలన కేవలాత్మవిషయకమగు 'చిత్' అను జ్ఞానము కలుగును. ఈజ్ఞానమునందు ప్రకారవిధిచే నేపదార్థమును భాసింప నేరదు. కాన నీజ్ఞానము నిర్వికల్పక మనంబడును. మఱియు సన్నికృష్టవస్తువిషయక మగుటం జేసి యపరోక్షస్వరూపమనఁబడును. "యతో వాచో నివర్తన్తే" అను శ్రుతివలన నాత్మ యేశబ్దముచేతనైనను జెప్పఁబడదని సిద్ధమగుచుండ 'తత్త్వమసి' అను శ్రుతివలన నిర్వికల్పక మగు నపరోక్షజ్ఞానము కలుగుట యాశ్చర్యమని భావము.

లేక శబ్దముయొక్కశక్తి యూహించుట కలవి కానందున నిద్రించుచున్న దేవదత్తు నుద్దేశించి పలుకఁబడిన 'దేవదత్త' అనుశబ్ద మేవిధమున శబ్దశక్త్యాదిజ్ఞానము నపేక్షింపక దేవదత్తుడు మెలుకువగాంచుటకు హేతువగునో యాదేవిధమున 'తత్త్వమసి' అను శబ్దము శక్తిజ్ఞానమును కాని, లక్షణాజ్ఞానమును గాని, సంబంధాంతరజ్ఞానమును గాని యపేక్షింపక యాత్మజ్ఞానమున బోధించును. ఇట్టివిధమున నాత్మతత్త్వమును బోధించుటయే యాశ్చర్యసద్భావము. శబ్దార్థములకుగల సంబంధజ్ఞానము లేనిదే కేవలశబ్దమాత్రమువలన నర్థజ్ఞాన మెటులకలుగును? అట్లయినచో అతిప్రసక్తి సంభవించును. (ఘటశబ్దమునకు, ఘటమునకుగల శక్తిరూపసంబంధజ్ఞానము లేనిదే ఘటశబ్దమువలన ఘటజ్ఞానము కలుగుననిన నియామకము లేమింజేసిఘటశబ్దమువలనపటజ్ఞానముకూడకలిగెడిని.) లక్షణాపక్షమందుగూడ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

లేక ఎవ డాత్మను దెలిసికొనునో అట్టివా డాశ్చర్యతుల్యుడు ఎవ డాత్మను జెప్పునో అట్టివా డనేకవేలయందొ కానొకడే యుండును. ఎవ డాత్మను వినునో అట్టివా డనేకులయందొ కానొకడే యుండును. అందువలన నాత్మను దెలిసికొనుట సులభసాధ్యము కాదని యాశయము. ॥ ౨౯ ॥

శక్యసంబంధరూపము గు లక్షణ అనేకసాధారణముగుటంజేసి యతిప్రసక్తిసమానము. ఇట్టి యతిప్రసక్తిని వారించుటకు వక్తృతాత్పర్యము శబ్దజన్యజ్ఞాననియామక మనెదవా? అట్టి వక్తృతాత్పర్యము సర్వులకు సమానమగుటంజేసి సర్వులకు శబ్దమువలన జ్ఞానము కలుగవలసి వచ్చును. ఏపురుషుం డట్టి తాత్పర్యజ్ఞానము కలవాడో యట్టి పురుషునకే శబ్దమువలన జ్ఞానము కలుగుననెదవా? అట్లైనచో పురుషగతమగు, నిర్దోషత్వస్వరూపమగు విశేషమే శబ్దజన్యజ్ఞానమునందు నియామకమగుటయే. అట్లైనచో శుద్ధాంతఃకరణగల యెవనికి తాత్పర్యజ్ఞానపురస్సరముగ లక్షణచే వాక్యార్థబోధ నీచే నంగీకరింపఁబడెనో అట్టివానికే కేవలశబ్దవిశేషమువలన సంబంధ (జ్ఞానము) ము లేకయే యఖండసాక్షాత్కారము జనించుటయందేమి యాక్షేపణకలదు? ఈ యద్వైతమతమున నాత్మ శబ్దజన్యవృత్త్యవిషయమగుటంజేసి యాత్మవిషయకమగునఖండసాక్షాత్కారము 'తత్త్వమసి' అను వాక్యమువలన జనించుటయం దేమియు ఆక్షేపణము లేదు. కాన "యతో వాచో నివర్తన్తే" అను శ్రుతి మిక్కిలి యుపపన్నము. ఈభగవదభిప్రాయమునే వార్తికకారులుగూడ "దుర్లభత్వా దవిద్యాయా ఆత్మత్వా ద్బోధరూపిణః । శబ్దశక్తే రచిన్త్యత్వా ద్విద్మస్తం మోహహానతః ॥ అగృహీత్వైవ సంబంధ మభిధానాభిధేయయోః । హిత్వా నిద్రాం ప్రబుధ్యన్తే సుషుప్తే బోధితాః పరైః ॥ జాగ్రద్వన్న యత శ్శబ్దం సుషుప్తో వేత్తి కశ్చన । ధ్వస్తేఽతో జ్ఞానతోఽజ్ఞానే బ్రహ్మాస్మీతి భవే త్ఫలం ॥ అవిద్యాఘాతిః శబ్దాద్యాఽహం బ్రహ్మేతి ధీ ర్భవేత్ । నశ్యత్యవిద్యయా సార్థం హత్వా రోగ మివౌషధమ్ ॥" (జ్ఞానరూపమగు నాత్మ యాత్మస్వరూపమగుటంజేసి యవిద్యకు దుర్లభము. కనుకనే యాత్మ శబ్దశక్తి కచింత్యము. గాన నట్టి యాత్మను మోహనాశనమువలన దెలిసికొనుచుంటిమి. సుషుప్తియందు పరులచే బోధితులై (లేపఁబడి) శబ్దార్థముల సంబంధమును గ్రహింపకయే నిద్రను విడిచి మెలుకువ గాంచుచుండిరి. జాగ్రత్తునందువలె సుషుప్తియం దెవడును శబ్దమును తెలిసికొనజాలడు. కాన శబ్దార్థసంబంధజ్ఞానము లేకయే మెలుకువ గాంచునని పూర్వశ్లోకముతో నన్వయము. కాన జ్ఞానమువలన నజ్ఞానము తొలఁగగ "బ్రహ్మైవాహమస్మి" అను ఫలము సంభవించును. అవిద్యను నశింపఁజేయు "తత్త్వమసి" అనునవి మొదలగు శబ్దములవలన "బ్రహ్మైవాహమస్మి" (నేను బ్రహ్మనైతిని) అను వృత్త్యాత్మకజ్ఞాన ముదయించును. అట్టి బ్రహ్మాకారవృత్త్యాత్మకజ్ఞానముకూడ నౌషధము రోగమును నశింపఁజేసి స్వయముగ తాను నశించునటుల నవిద్యతోగూడ నశించును. అని చెప్పియుండిరి.

ఈవిధమున వచనవిషయమగు నాత్మ, వక్త, వచనక్రియయు నాశ్చర్యరూపమగుటచే నాత్మ దుర్విజ్ఞేయము (తెలిసికొనుటకు శక్యమైనది కాదు.) అని చెప్పఁబడెను. ఇట్లాత్మకు దుర్విజ్ఞేయత్వమును చెప్పి యట్టి శ్రోతయు దుర్లభమగుటచే నాత్మ దుర్విజ్ఞేయమని "ఆశ్చర్యవ చ్చైన మన్య శ్శృణోతి శ్రుత్వా ప్యేనం వేద" అనుదానిచేఁ జెప్పుచుండెను.

"అన్యః" ద్రష్టకంటెను, వక్తకంటెను, ముక్తునికంటెను భిన్నుఁడగు ముముక్షువు బ్రహ్మవేత్త యగు వక్తనుగూర్చి "తద్విజ్ఞానార్థం స గురు మేవాభిగచ్ఛే త్సమిత్పాణి శ్శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం" అను శ్రుత్యనుసారము యథావిధిగఁ జేరనపిమ్మట నా బ్రహ్మవేత్త యీముముక్షువుకు వేదాంతతాత్పర్యనిశ్చయముకలవానిగఁ

చేయును. అట్టి వేదాంతతాత్పర్యనిశ్చయముకలవాఁడై మననిదిధ్యాసనపరిపాకమువలన నీయాత్మను సాక్షాత్కరింపఁజేసికొనినను అట్టివాఁ డనేకజన్మానుష్ఠితసుకృతశాలితనోపశాలిత్వము కలవాఁడగుట నాశ్చర్యతుల్యుఁడు. ఈవిషయమునే శ్రీకృష్ణపరమాత్మ "మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే। యతతామపి సిద్ధానాం **కశ్చిన్మాం వేత్తి తత్త్వతః**" (**అనేకవేల మనుష్యులలో నొకానొకఁడే సిద్ధికొఱకు ప్రయత్నించును. అట్లు** ప్రయత్నించు సిద్ధులలో నొకానొకఁడే నన్ను తత్త్వముగ దెలిసికొనును.) అని చెప్పఁగలఁడు. మఱియు కఠోపనిషత్తునందుగూడ "శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః శృణ్వన్తోఽపి బహవో యం న విద్యుః। ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధా ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః" అని యీవిషయమే చెప్పఁబడెను. ఈవిధముననే శ్రవణమునకు శ్రోతవ్యమగు నాత్మకుఁగల యాశ్చర్యత్వము పూర్వమునందే చెప్పఁబడెను.

ఎవఁడు శ్రవణమనననిదిధ్యాసములను చేయునో వాఁడాత్మను తెలిసికొనును. ఈవిషయమున నేమి యాశ్చర్యము? అను నాశంకను తొలగించుటకు "నచైవ కశ్చిత్" అని చెప్పఁబడెను.

ఇట చకారముచే క్రియాకర్మవాచకపదము లనుషక్తము లగును. "శ్రవణాదికం కుర్వన్నపి కశ్చిదేనం నైవ వేద; తదకుర్వంస్తు న వేదేతి కిము వక్తవ్యం" శ్రవణాదికము చేయుచున్నను అట్టివారలలో నొకానొకఁడీయాత్మను తెలిసికొనఁజాలఁడు. శ్రవణాదికమును జేయనివాఁడు తెలిసికొనలేడని యేమి చెప్పఁదగు? తెలిసికొనలేడని చెప్పనవసరము లేదు. ఈవిషయమునే వార్త్తికకారులకూడ "కుత స్తజ్జ్ఞానమితిచేత్తద్ధి బంధపరిక్షయాత్। అసావపి చ భూతో వా భావీ వా వర్తతే యథా" అని శ్రవణాదికమును జేయఁగలవారలకుఁగూడ ప్రతిబంధపరిక్షయమువల్లనే జ్ఞానము కలుగుచున్నది. ప్రతిబంధపరిక్షయము లేనిదే జ్ఞానము కలుగనేరదు. అట్టి ప్రతిబంధపరిక్షయము హిరణ్యగర్భున కొకనికిమాత్రమే అయియున్నది. వామదేవునకు కాదలచియున్నది. శ్వేతకేతువునకగుచున్నది. కాన ప్రతిబంధపరిక్షయ మతిదుర్లభముగాన "జ్ఞానముత్పద్యతే పుంసాం క్షయాత్పాపస్య కర్మణః" అను స్మృతివలన నాత్మ దుర్విజ్ఞేయమని తేలిన యర్థము.

కొందరు "శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్" శ్రవణాదులొనర్చినను ఈయాత్మ నెవఁడును తెలిసికొనలేడని వ్యాఖ్యానించిరి. అట్టి వ్యాఖ్య 'ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః' అను శ్రుత్యనుగుణము గాకపోవుటచే నుపేక్ష్యము. మఱియు "యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః" ప్రయత్న మొనరించు సిద్ధులలో నొకానొకఁడు నన్ను తెలిసికొను ననుభగవద్వచనమునకుకూడ విరుద్ధముగాన నుపేక్షణీయము. ఇట్లు వ్యాఖ్యాంతరము నాక్షేపించితినని నాయందుగల యవినయమును విద్వాంసులు క్షమింతురుగాక.

**లేక 'న చైవ కశ్చిత్'** అనుదానికి "**కశ్చిదేనం నపశ్యతి, నవదతి, నశృణోతి, శ్రుత్వాపి, నవేదేతి** పంచ ప్రకారాః" 1ఒకానొకఁడాత్మను తెలిసికొనును గాని చెప్పజాలఁడు, 2ఒకానొకఁడు తెలిసికొనియు చెప్పగలుగును, 3 ఒకానొకఁడు వాక్యమును వినును' తదర్థమునూ తెలిసికొనును' 4 ఒకానొకఁడు శ్రవణమొనరించినను తెలిసికొనజాలఁడు, 5 ఒకానొకఁడీగురికి బహిర్భూతుఁడు. అని అయిదువిధములఁ జూపుకొనవలయును. అవిద్వాంసుఁడు అసంభావనావిపరీతభావనలచే నభిభూతుఁడగుట నవిద్వత్పక్షమున దర్శనవదనశ్రవణముల కాశ్చర్యతుల్యత్వము చతుర్థపాదమున 'దృష్ట్వా ఉక్త్వా, శ్రుత్వాపి' చూచియు' చెప్పియు, వినియు ఒకానొకఁడీయాత్మతత్త్వమును తెలిసికొనజాలఁడని యోజనచేయనగును.

శంకరానందీయము:—అనేకపండితు లాత్మతత్త్వమును చెప్పుచుండిరి, మననము చేయుచుండిరి. అట్లయిన నిట్టిజ్ఞాన మెచటను జూడఁబడుటలేదను శంకయం దీశ్వరుఁడనగు నాయొక్కయు. శ్రుతియొక్కయు. ఆచార్యుని యొక్కయు. ఆత్మయొక్కయు అనుగ్రహములేనిదే యిట్టి జ్ఞానమునుపొందుటకు శక్యము కాదని సూచనచేయుటకు జిజ్ఞాసువునకును శ్రోతవును, అతిదుర్లభత్వమును చెప్పుచు నాత్మకు దుర్బోధత్వమును "ఆశ్చర్యవత్" అను శ్లోకముచే జెప్పుచుండెను.

అనేకకోట్లమనుజులలో నొకానొకఁడే నాయనుగ్రహమునకు పాత్రుఁడై కూటస్థాసంగచిద్రూపము, అద్వయము, అఖండానందైకరసము నగు నాత్మను సాక్షాత్కరింపజేసికొనుట కిచ్ఛయించును. అట్టివాఁ డాశ్చర్యవంతుఁడు. మోక్షేచ్ఛ యతిదుర్లభ మగుటంజేసియు, బహుజన్మలభ్య మగుటవలనను, బహుపుణ్యపరిపాకసాధ్యమగుటచేతను, చిత్తప్రసాదైకలభ్య మగుటవలనను లౌకికులకు సాధ్యము కానిది. అట్టి మోక్షేచ్ఛారూప మగు కర్మను చేయుట (హనుమంతుఁడు సముద్రము నుల్లంఘించునటుల సర్వవిషయములయందు గల యాశాపాశమును దహింపఁ జేసికొని యట్టి మోక్షేచ్ఛాకరణము) ఆశ్చర్యము. అనగా సంతీర్ణాశేషాశాసింధువు కలవాఁడును, శుద్ధమగు నంతఃకరణము కలవాఁడును, మోక్షైకకాముఁడు నగునట్టి ముముక్షు వతిదుర్లభుఁ డని తెలియ యర్థము.

మఱియు పూర్వోక్త మగు దివ్యగుణపుంజముచే భిన్నుఁ డగు నొకానొకఁడు "ఏనం" పూర్వోక్తలక్షణములు గల యాత్మను "శృణోతి" వినును. అట్టివాఁ డాశ్చర్యతుల్యుఁడు. పురుషున కాకాశగమనమువలె— ప్రాణములు పోవునపుడుకూడ విడచుటకు శక్యము కానట్టి భోగ్యములగు స్రక్చందనవనితాదిభోగములయందు వైరాగ్య మతిదుర్లభము. అట్టిభోగములయందు వైరాగ్య మున్నను సాధనవిశిష్ట మగు కర్మయొక్క సంన్యాస మతిదుష్కరము. అట్టి సంన్యాసమును పొందినను అమానిత్వము, అదంభిత్వము మొదలగు బ్రహ్మచర్యాదిరూప మగు దైవీసంపత్తు దుర్లభము. అట్టి దైవీసంపత్తు సంభవించినను "అనన్యప్రోక్తే గతి రత్ర నాస్తి" "ఆచార్యవాన్ పురుషో వేద" అను శ్రుత్యుక్తరీతిని బ్రహ్మవేత్త యగు నాచార్యుఁడు దుర్లభుఁడు. అట్టి యాచార్యుఁడు లభ్యమైనను నతని యనుగ్రహలభ్య మగు శ్రవణాదులయందు నిష్ఠ యతిదుర్లభము. భగవదనుగ్రహవంతుఁ డగు పురుషునిచే నాచరింపఁబడిన శ్రవణాదులవలననే సమ్యగ్జ్ఞానము జనించును. కాన శ్రవణాదులు మోక్షఫలకము లగుటంజేసి నిరుక్తసాధనసంపన్నుఁ డగు నాత్మవిషయకశ్రోత దుర్లభుఁ డని యర్థము. ఆదేవిధమున పూర్వమునందు చెప్పఁబడిన సాధనములతో గూడినవాఁడై, అద్వేష్టృత్వాదిస్వధర్మములతో గూడినవాఁడై, మత్ప్రసాద (భగవదనుగ్రహ) పాత్రుఁడగు నొకానొకఁడు శ్రవణాదినిష్ఠచే దెలియఁబడిన యాత్మతత్త్వము కలవాఁడై, బ్రహ్మనిష్ఠుఁడై పూర్వోక్తలక్షణములుకల యాత్మను యథాశాస్త్రముగ సమీపించిన సచ్ఛిష్యునికొఱ కుపదేశించును. 'బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేద్బాల్యం చ పాండిత్యం చ నిర్విద్యాథ మునిరమౌనం చ మౌనం చ నిర్విద్యాథ బ్రాహ్మణః" అను శ్రుత్యుక్తప్రకారము బ్రాహ్మణత్వసిద్ధికి హేతు వగు పాండిత్యాదు లతిదుస్సాధ్యము లగుటంజేసి యట్టి దుస్సాధ్యము లగు పాండిత్యాదిలక్షణములతో గూడిన బ్రహ్మవిత్తగు తత్త్వోపదేశకుఁడు "ఆశ్చర్యవత్" అతిదుర్లభుఁ డని యర్థము.

ఈప్రకారము పరమార్థేచ్ఛువునకు, శ్రోతకు, తత్త్వోపదేష్టకు నతిదుర్లభత్వము నుపపాదించి పూర్వోక్తసాధనరహితుఁడు, భగవదనుగ్రహరహితుఁడు నగువాని కాత్మ తెలిసికొనుటకు శక్యమైనది కాదని "శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్" అను చతుర్థపాదముచేఁ జెప్పుచుండెను. శ్రుత్యాచార్యభగవత్ప్రసాదరహితుఁడు, అమానిత్వాదిదైవీసంపద్దూరుఁడు నగు నొకానొకఁ డాత్మతత్త్వమును దెలిసికొనుటకు శ్రవణమననముల నాచరించినను (అనగా నట్టివాఁడు శతధా సహస్రధా శ్రవణమును (అపిశబ్దమువలన మననము కూడ గ్రహింపవగును) మననము నాచరించినను ఆత్మను తెలిసికొనుటకు గాని, జ్ఞానఫల మగు మోక్షమును పొందుటకు గాని సమర్థుఁడు కానేరఁడు. ఈచెప్పుటవలన "ఈనిఖిలప్రపంచము, నేను బ్రహ్మస్వరూపమే" అను బ్రహ్మమాత్రత్వవిజ్ఞానము సర్వులకు దుర్లభ మని సూచింపఁబడెను.

భాష్యోత్కర్షదీపిక:— శుద్ధాత్మ దెలిసికొనుటకు దుస్సాధ్య మగుటవలనను, భ్రాంతి యనునది సర్వసాధారణ మగుటవలనను ఓయర్జునా! నిన్నొకనిని గూర్చియే యుపాలంభము (దూషించుట) న్యాయము కాదని "ఆశ్చర్యవత్" అను శ్లోకముచే చెప్పుచుండెను. పూర్వమునందుఁ జూడఁబడక యకస్మాత్తుగఁ జూడఁబడునది

యాశ్చర్య మనంబడును. దానితో సదృశమగునది "ఆశ్చర్యవత్" అని యనఁబడును. ఒకానొకఁ డీయాత్మ నాశ్చర్యమువలె చూచును. అదేవిధమున మఱియొకఁ డీయాత్మ నాశ్చర్యమువలెఁ జెప్పును. మఱియొకఁ డీయాత్మ నాశ్చర్యమువలె వినును. వినినను, చెప్పినను, చూచినను ఈయాత్మ నొకానొకఁడు ప్రతిబంధవశమున సాక్షాత్కరింపఁజేసికొనలేడు. "ఐహిక మప్యప్రస్తుతప్రతిబంధే తద్దర్శనాత్" ఫలోన్ముఖము, విద్యావిరుద్ధఫలకము నగు కర్మము ప్రస్తుత మనఁబడును. అట్టి కర్మచేఁ గలుగు ప్రతిబంధకము ప్రస్తుతప్రతిబంధ మనఁబడును. అట్టి ప్రస్తుత ప్రతిబంధాభావ ముండినపు డీజన్మమునందే బ్రహ్మజ్ఞానము జనించును. అట్టి ప్రస్తుతప్రతిబంధ ముండినచో జన్మాంతరమున నాత్మజ్ఞాన ముదయించును. ఎందువల ననిన? ప్రతిబంధప్రతిబంధాభావములచే నుభయవిధమగు విద్యోత్పత్తి శ్రూయమాణ మని హేతువు చూడనగును. కనుకనే "గర్భస్థ ఏవ వామదేవః ప్రతిపేదే బ్రహ్మభావం" (గర్భస్థు డగుచునే వామదేవుడు బ్రహ్మభావమును బొందె) అని శ్రుతి ప్రతిబంధ ముండినయెడల సంచితసాధనమువలన జన్మాంతరంబున విద్యోత్పత్తి గలుగు నని చెప్పుచున్నది.

లేక ఎవఁ డాత్మను దెలిసికొనునో వాఁ డాశ్చర్యతుల్యుడు. ఎవఁ డాత్మను చెప్పునో, ఎవ డాత్మను వినునో అట్టివాఁ డనేకసహస్రములలో నొకానొకఁడే. ఎవఁ డాత్మను చెప్పియు, వినియు పరోక్షజ్ఞానము కలవాఁడో యట్టివాఁడు పూర్వమునందుఁ జెప్పఁబడినవారలకంటె దుర్లభుఁడు. ఎవఁ డాత్మాపరోక్షజ్ఞానము కలవాఁడో యట్టివాఁడు పూర్వోక్తపరోక్షదర్శికంటె దుర్లభుఁడని 'శ్రుత్వాపి' అను పాదముచేఁ జెప్పుచుండెను. కాన నాత్మ దెలిసికొనుటకు శక్యమైనది కాదని (దుర్బోధమని) యాశయము. మొట్టమొదట నొకపక్షము, తరువాత 'లేక' అని రెండవపక్షము నుపపాదితము. అందు మొదటిపక్షమున ప్రథమపాదముచే నాత్మవిషయకమగు పరోక్షదర్శనమునకు, ద్వితీయపాదముచే వదనమునకు (ఆత్మను చెప్పుటకు), తృతీయపాదముచే శ్రవణమునకు (ఆత్మను వినుటకు) దుర్లభత్వము చతుర్థపాదముచే నాత్మసాక్షాత్కారమున కత్యంతదుర్లభత్వమును సూచించు శ్రీకృష్ణపరమాత్మచే ద్రష్ట, వక్త, శ్రోత, సాక్షాత్కర్తయు విరళులని (అనేకకోట్లయం దొకానొకఁడని) చెప్పఁబడెను. తద్ద్వారమున నాత్మకు దుర్విజ్ఞేయత్వము చెప్పఁబడెను.

"లేక" అను ద్వితీయపక్షమునం దాత్మవిషయమై, పరోక్షజ్ఞాని, వక్త, శ్రోత, సాక్షాత్కర్త యనెడి నలుగురు దుర్లభు లని చెప్పఁబడుటచే నాత్మకు దుర్బోధత్వ ముపపాదితము. ఇట్లే ఈశ్లోకమున కర్థము చెప్పినచో ఈగీతావాక్యమునకు, "శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః శృణ్వన్తోఽపి బహవో యం న విద్యుః। ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధా ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః" అను శ్రుతికిని ఏకార్థత్వము పొసగును.

ఈశ్లోక మెటుల పైనుదహరించిన శ్రుత్యర్థమును చెప్పు ననిన? పైశ్రుతియందుగల "శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః" (అనేకమందిచే శ్రవణార్థముకూడ నేయాత్మ లభ్యము కాదో) అను శ్రుత్యర్థమునే "ఆశ్చర్యవచ్చైన మన్యః శృణోతి" అను వాక్యము చెప్పుచున్నది. "శృణ్వన్తోఽపి బహవో యం న విద్యుః" (అనేకులు శ్రవణ మొనరించుచుండినను ఏయాత్మను తెలిసికొనలేకుండిరో) అను శ్రుత్యర్థమును "శ్రుత్వాఽప్యేనం వేద న చైవ కశ్చిత్" అను గీతావాక్యము చెప్పుచున్నది. "ఆశ్చర్యో వక్తా" (ఆత్మస్వరూపమును బోధించువాఁడు దుర్లభుఁడు) అను శ్రుత్యర్థమును "ఆశ్చర్యవద్వదతి తథైవ చాన్యః" అను గీతావాక్యము చెప్పుచున్నది. "కుశలోఽస్య లబ్ధా ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః" కుశలుఁ డగు నాచార్యునిచే ననుశిష్టుఁ (శిక్షితు) డైన నిపుణుఁ డగు నాత్మస్వరూపలబ్ధ యనేకులలో నొకానొకఁడు కాన నట్టి జ్ఞాత యాశ్చర్యతుల్యుఁడు) అను శ్రుత్యర్థమును "ఆశ్చర్యవత్పశ్యతి కశ్చి దేనం" అను గీతావాక్యము చెప్పుచున్నది.

లేక "ఆశ్చర్యవత్పశ్యతి కశ్చి దేనం" అను స్థలమునందుగల "పశ్యతి" అను దృశ్ ధాతువునకు పరోక్షదర్శన మనికాని, అపరోక్షదర్శన మనికాని యర్థము గ్రహింపనగును. అట్టి దర్శనము కాని, అట్టి ద్రష్ట కాని

యత్యంతదుర్లభము. ఈయాత్మవిషయకపరోక్షదర్శనము కాని, అట్టి దర్శనముకలవాడు కాని యెందులకు దుర్లభు లనిన నీయాత్మను చెప్పుట కాని, అట్టియాత్మను చెప్పువాడు కాని, శ్రవణము కాని, శ్రోత కాని దుర్లభు లగుటంజేసి యాత్మపరోక్షజ్ఞానము, అట్టిజ్ఞానియు దుర్లభు లని యర్థము. ఈవిధమున నాత్మపరోక్షదర్శనమునకు, అట్టి ద్రష్టకును హేతుకముగ దుర్లభత్వమును జెప్పి యాత్మాపరోక్షదర్శనమునకు, అట్టి యపరోక్షదర్శనముకల ద్రష్టకును దుర్లభత్వమునందు హేతువును "శ్రుత్వా ప్యేనం వేద న చైవ కశ్చిత్" అను వాక్యముచే చెప్పుచుండెను. శ్రవణ మొనరించియు, పరులఁ బోధించియు, పరోక్షముగ నాత్మను దెలిసికొనియు అసంస్కృతాంతఃకరణము కలవాఁ డాత్మ నపరోక్షముగ దెలిసికొనలేడని యర్థము.

నీలకంఠీయము:— వజ్రపంజరతుల్యమగు నీవియదాదిపంచకము సర్వప్రమాణసిద్ధమై కన్పట్టుచుండ రజ్జూరగమువలె నీప్రపంచ మజ్ఞానప్రభవమగుటచే నత్యంతతుచ్ఛమని చెప్పుటయెట్లుపొసఁగును? మఱియు కర్మకాండాపేక్షితమగుయజ్ఞాదికర్తృత్వమును, జ్ఞానకాండాపేక్షితంబగుశ్రవణాదికర్తృత్వమునుగూడ నెట్లాత్మయం దుపహ్నుతములుగ జేయుటకు శక్యమగును? అను నాశంకపై 'ఆశ్చర్యవత్పశ్యతి' అను శ్లోకమును జెప్పుచున్నాడు.

"కశ్చిత్" ఆత్మతత్త్వమును తెలిసికొనినవాడు 'ఏనం' పూర్వశ్లోకోక్తమగు భూతగ్రామమును, "ఆశ్చర్యమద్భుతం స్వప్నమాయేంద్రజాలాదికం, తేన తుల్య మాశ్చర్యవత్, తథా భూతం పశ్యతి" స్వప్నమాయేంద్రజాలాదికమునువలె జూచుచున్నాడు. "కశ్చిదేవ మాశ్చర్యవ ద్వదతి" ఈభూతగ్రామము సత్త్వరూపమని కాని, అసత్త్వరూపమని కాని నిర్వచించుటకు శక్యము కానందున లోకమునం దప్రసిద్ధమగు ననిర్వచనీయధర్మపురస్సరముగఁ జెప్పుచున్నాడు. రజ్జూరగమువలె నీప్రపంచము సద్రూపమగుచో "నేహ నానాస్తి కించన" అనుశ్రుతిచే బాధింపబడకపోయెడిని. అసద్రూపమే యైనచో ప్రతీతిగోచరము కాకపోయెడిని. కాననీప్రపంచ మనిర్వచనీయమని పర్యవసితము. అట్టి సర్వవ్యవహారాస్పదమగు ప్రపంచమునకు మిథ్యాత్వమును జెప్పుట యత్యాశ్చర్య మని యర్థము.

"ఆశ్చర్య వచ్చైన మన్య శ్శృణోతి" మఱియొకఁడీప్రపంచము నాశ్చర్యతుల్యముగ వినుచున్నాడు. అనగ నీప్రపంచ మాత్మభిన్నముగ బ్రత్యక్షప్రమాణముచే నుపలభ్యమాన మయినను "ఇమే లోకా ఇమే దేవా ఇమే వేదా ఇదం సర్వం యదయ మాత్మా" అనుశ్రుతి ననుసరించి యీప్రపంచమును బ్రత్యగభిన్నముగ వినుచుండెను. ఇదియే యత్యాశ్చర్యమని యర్థము. పైశ్రుతి యజమానునకు ప్రస్తరమునకు (వేదియందుంచబడిన దర్భముష్టికి ప్రస్తరమని పేరు) భేదమున్నను "యజమానః ప్రస్తరః" యజమానప్రస్తరముల కభేదమును బోధించుశ్రుతి యుపచరితార్థ (గౌణ) మగునటుల నైయుదహరింపబడిన "ఇమే లోకాః" అనుశ్రుతి యుపచరితార్థ మని శంకింపఁజనదు. అట్లుపచరితార్థమగుచో "ఆత్మనో వా అరే! దర్శనేన, శ్రవణేన, మత్యా. విజ్ఞానే నేదం సర్వం విదితం భవతి" అను బృహదారణ్యక శ్రుతిచే నొక యాత్మవిజ్ఞానముచే సర్వవిజ్ఞానప్రతిజ్ఞకు భంగము వాటిల్లును. ఈబృహదారణ్యకశ్రుతియు నౌపచారికమేయని యనెదవా? అదియు సంభవము కాదు. అట్లగుచో ఛాందోగ్యమునందు "యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతంస్యాత్" (ఒకమృత్పిండమును దెలిసికొనిన నా మృత్పిండవికారములగు ఘటశరావాదులు దెలిసినవేయగును) అని దృష్టాంతమీయబడెను. అట్టి దృష్టాంతమునకు విరోధము సంభవించెడిని. కాన ప్రతిజ్ఞాదృష్టాంతనిగమనవాక్యముల కేకార్థప్రతిపాదకత్వము నియతమగుటవలనఁ బ్రపంచ మాత్మభిన్నము కానేరదు, ప్రపంచమునందుండు నీయాత్మానన్యత్వము భేదగ్రాహి యగు ప్రత్యక్షమునకు విరుద్ధమగుటచే నద్దాని నాశ్చర్యతుల్యముగ వినుచున్నాఁడని భావము.

"శ్రుత్వాఽప్యేనం వేద న చైవ కశ్చి" దదేవిధమున నొకానొకఁ డీప్రపంచమును ప్రత్యగనన్యముగ వినియు, స్వప్నాదిదృష్టాంతముల నుపపాదించియు ధ్యానముచే సాక్షాత్కరింపజేసికొనియు, దత్త్వమువలన

గీ॥ దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత ।
తస్మా త్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి ॥ ॥౩౦॥

పదవిభాగము:— దేహీ- నిత్యం- అవధ్యః- అయం- దేహే- సర్వస్య- భారత- తస్మాత్- సర్వాణి- భూతాని- న- త్వం- శోచితుం- అర్హసి ॥ ॥౩౦॥

ప్రతిపదార్థము:— హే భారత!=ఓయర్జునా; సర్వస్య=నిఖిలప్రాణులయొక్క; దేహే=(ఈశబ్దము జాతి వాచకముగ నేకవచనాంతము ప్రయుక్తము) దేహములు; వధ్యమానే=(ఈపదమధ్యాహార్యము) వధింపబడుచు చున్నను; అయం=ఈ; దేహీ=ఆత్మ; నిత్యం=సర్వావస్థలయందు; యస్మాత్=(ఈపదమధ్యాహార్యము) ఏ కారణమువలన; అవధ్యః=వధ్యుడు (చంపదగినవాడు) కాడో; తస్మాత్=ఆ కారణమువలన; సర్వాణి=నిఖిలములగు; భూతాని=భీష్మద్రోణకృపాచార్యులనుగూర్చి; త్వం=నీవు; శోచితుం=దుఃఖించుటకు; నార్హసి=తగవు. ॥౩౦॥

శాంకరభాష్యమ్:—

అథేదానీం ప్రకరణార్థ ముపసంహర న్బ్రూతే— దేహీతి । దేహీ శరీరీ నిత్యం సర్వదా సర్వావస్థా స్వవధ్యో నిరవయవత్వా న్నిత్యత్వాచ్చ । తత్రావధ్యోఽయం దేహే శరీరే సర్వస్య సర్వగతత్వాత్ । స్థావరాదిషు స్థితోఽపి సర్వస్య ప్రాణిజాతస్య దేహే వధ్యమానేఽప్యయం దేహీ న వధ్యో యస్మా త్తస్మా ద్భీష్మాదీని సర్వాణి భూతా న్యుద్దిశ్య న త్వం శోచితు మర్హసి ॥ ॥౩౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఇంతవఱకునగు బూర్వగ్రంథముచే నాత్మకు దుర్విజ్ఞేయత్వమును జెప్పి ప్రస్తుతప్రకరణము నుపసంహరించుటకు శ్రీకృష్ణపరమాత్మ యిట్లు జెప్పనారంభించెను.

ఓయర్జునా! నిఖిలప్రాణుల దేహములయందు నీయాత్మ నిరవయవుఁ డగుటవలనను, కనుకనే నిత్యుఁ డగుటవలనను సర్వావస్థలయం దవధ్యుఁడు. ప్రాణులయొక్క స్థావరాది దేహములు వధ్యమానములైనను ఆత్మ వధ్యము కాదు. అందువలన నీవు భీష్మాదుల నుద్దేశించి దుఃఖించుటకు దగవు. ॥౩౦॥

తెలిసికొనుటలేదు. ఈవిషయమునే ప్రజ్ఞ పొందబడినను అది తీవ్రమగు విక్షేపశక్తివలన నశించునని చెప్పబడును. కాన నాత్మైక్యమువలన బ్రపంచమునకు రజ్జూరగతుల్యమగుటచే తుచ్ఛత్వము సంభవించును. (ఈవ్యాఖ్యయం దుపపాదితమగు మిగిలినవిషయము మధుసూదనసరస్వతీప్రభృతుల వ్యాఖ్యలచే గతార్థమగుటచే నింతటితో నీశ్లోకమునకు వ్యాఖ్యావిశేషములను వ్రాయుట విరమించితిమి.) ॥౨౯॥

—♦ ౨వ అధ్యాయము- ౩౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— ఇంతవఱకగు గ్రంథముచే సర్వప్రాణి సాధారణభ్రమయొక్క నివృత్తికి వలయు నుపాయము చెప్పబడెను. ఇప్పుడా సాధనమును 'దేహీ నిత్యం' అను శ్లోకముచే నుపసంహరించుచుండెను.

సర్వప్రాణులయొక్క దేహములు వధ్యమానములైనను ఈలింగదేహోపాధికుడగు నాత్మ వధ్యుడు కాడని "నిత్యం" నియతమయినది. కాన భీష్మద్రోణాదిభావములను బొందిన స్థూలభూతములను, సూక్ష్మభూతములను

హముల నుద్దేశించి నీవు దుఃఖించుటకు తగవు. అనగా స్థూలదేహమునకు జననమరణము లపరిహార్యము లగుటవలన నశోచ్యత్వము. లింగదేహమాత్మవలెనే యవధ్యమగుటచే నశోచ్యము. ఆత్మనిత్యమగుటవలన నశోచ్యమనియింత వరకుఁ దేలిన యాశయము. కాన నట్టి స్థూలసూక్ష్మ దేహాత్మల నుద్దేశించి దుఃఖించుట నీకుఁదగదని భావము.

శంకరానందీయము:— "అవ్యక్తాదీని భూతాని" అను శ్లోకముచే భీష్మాదిశబ్దవాచ్యార్థమున కశోచ్యత్వము నుపసంహరించి యిపుడు లక్ష్యార్థమగు నాత్మ కశోచ్యత్వము నుపసంహరించుచుండెను.

'హే భారత!' ఆత్మజ్ఞానసంపన్నుఁడ వగు నో యర్జునా! ఉపలబ్ధిస్థానము లగుటచే సర్వదేహోపాధికమగు నాత్మ— బ్రహ్మాదిస్తంబపర్యంతమగు సర్వప్రాణుల దేహములు వధ్యమానము లైనను ఘటములు నష్టమైనను ఘటాదులయందుండు నాకాశమువలె స్వయముగ నవిక్రియమగుటం జేసి నశించదు. కాన నాత్మనిత్యమనువిజ్ఞానము కలవాఁడగుటవలన "త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనానిచ" అను రీతిని మదీయులగు భీష్మాదిసర్వభూతములు, మరణించుచుండిరని నీవు దుఃఖించుటకు దగవు; వీరలు చంపబడినను ఆత్మ నశించునది కాదను నాత్మ నిత్యత్వవిజ్ఞానముకల నీవాత్మనుద్దేశించి శోకమును, మోహమును పొందుటకు దగవని యర్థము.

"దేహము నశించుచున్నది. నాసంబంధమైనది" అని దేహవిషయకమగు శోక మోహము లేవనికి నుండవో యట్టి యప్రతిబద్ధాపరోక్షజ్ఞానముకల విద్వాంసునకు 'ద్వైవాధీనే శరీరేఽస్మి న్గుణభావ్యేన కర్మణా' అను న్యాయమున శరీరము ప్రారబ్ధకర్మాధీనమగుటఁజేసి శరీరయాత్రార్థముకూడ నేకర్మయుజేయదగినది లేదు కాన నితరకర్మవిషయమున నేమి జెప్పవలయునను జ్ఞానముకలబ్రహ్మవేత్తకు సర్వకర్మసంన్యాసమునందే యధికారమని యీశ్లోకము అందుగల "తస్మా త్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి" అను వాక్యములచే సూచింపఁబడెను.

భాష్యోత్కర్షదీపిక:— భీష్మాది సర్వభూతములు, దేహములు భరతాదిదేహములవలె ననిత్యమైనవి. కాన నట్టి యనిత్యదేహాదుల నుద్దేశించి నీవు దుఃఖించుటకుఁ దగవని "భారత" అను సంబోధనచే సూచింపబడెను.

పరమార్థప్రపా:— "దేహీ నిత్యం" అను శ్లోకముచేఁ బ్రకృతము ననుసరించుచుండెను. 'దేహీ' శరీరచాలకుఁడు అనగా నెవని సాన్నిధ్యముచే దేహము కదలుచుండెనో అట్టి యాత్మ 'నిత్యం' నిరంతరము (ఎల్లపుడు) 'అవధ్యః' చంపఁదగనివాఁడు. అని చెప్పుటచే నాత్మకు నిత్యత్వము చెప్పఁబడెను. అట్టి యాత్మ యొక్కఁడే సర్వప్రాణిదేహములయం దుండువాఁడని చెప్పుటచే నాత్మకు సర్వవ్యాపకత్వము చెప్పఁబడెను. కాన నో యర్జునా! భ్రాతృసుహృదాదిసర్వభూతముల నుద్దేశించి నీవు దుఃఖించుటకుఁ దగవు. తన్నిమిత్తమగు శోకము వ్యర్థమని యాశయము. భీష్మాదుల నుద్దేశించి దుఃఖించుటలేదు. తత్సంబంధ మగు దేహములు నశించుచున్న వని దుఃఖించుచుంటి ననెదవా? అట్టి దేహముల కధికరణము, సత్యము నగు నాత్మయొక్క సన్నిధి నుండి సర్వభూతము లావిర్భవించుటచే నట్టి దేహము లధ్యాసరూపములే యగునని నిరూపింపఁబడెను. కాన నధ్యాస (భ్రమ) రూపము లగు దేహముల నుద్దేశించి దుఃఖించుట వ్యర్థము. ఈవిషయమే బృహదారణ్యకోపనిషత్తునందు "స యథోర్ణనాభి స్తంతు నోచ్చరే ద్యథాఽగ్నేః క్షుద్రా విస్ఫులింగా వ్యుచ్చర న్త్యేవ మేవాస్మా దాత్మన స్సర్వే ప్రాణా స్సర్వే లోకా స్సర్వే దేవా స్సర్వాణి భూతాని స్సర్వ ఏతదాత్మనో వ్యుచ్చరన్తి। తస్యోపనిష త్సత్యస్య సత్య మితి। ప్రాణా వై సత్యం తేషా మేవ సత్యమ్" ఈ శ్రుతికి పూర్వమునందుకల శ్రుతిచే సుషుప్త్యవస్థయందు మనస్సు పరమాత్మయందు లీనమగును. అటుల లీనమైనపిమ్మట మనఃకల్పితమగు స్థూలసూక్ష్మప్రపంచము లీనమగు నని చెప్పఁబడెను. అనంతరమునఁ దిరుగ జాగరావస్థయందు మనస్సు బహిర్ముఖమగును. మనస్సు బహిర్ముఖమైనపిమ్మట ప్రాక్తనసంస్కారములతోఁ గూడ మనఃప్రపంచము 'ధాతా యథా పూర్వమకల్పయత్' అను శ్రుత్యుక్తరీతిగ నావిర్భవించును. ఈవిధమున సుషుప్తియందగు ప్రపంచలయవిషయమై, జాగరమందగు ప్రపంచావిర్భావవిషయమై "స యథా" అను నీశ్రుతిచే దృష్టాంతములను చెప్పుచుండెను. ఏవిధ

గీ॥ స్వధర్మ మపి చావేక్ష్య న వికమ్పితు మర్హసి ।
ధర్మ్యా ద్ధి యుద్ధా చ్ఛ్రేయోన్య త్క్షత్రియస్య న విద్యతే ॥ ॥౩౧॥

పదవిభాగము:— స్వధర్మం- అపి- చ- అవేక్ష్య- న- వికమ్పితుం అర్హసి- ధర్మ్యాత్- హి- యుద్ధాత్- శ్రేయః- అన్యత్- క్షత్రియస్య- న- విద్యతే ॥ ॥౩౧॥

ప్రతిపదార్థము:— హేఅర్జున!=(ఈపదమధ్యాహార్యము) ఓఅర్జునుడా! త్వం=(ఈపదమధ్యాహార్యము) నీవు; స్వధర్మమపి=స్వధర్మమునైనను; అవేక్ష్య=తెలిసికొని; వికమ్పితుం=చలించుటకు; నార్హసి=తగవు; హి=ఏకారణమువలన; క్షత్రియస్య=క్షత్రియునకు; ధర్మ్యాత్=ధర్మమునుండి తొలగని; (ధర్మసంబద్ధమగు) యుద్ధాత్=యుద్ధముకన్న; అన్యత్=వేరగు; శ్రేయః=శ్రేయస్సాధనము; నవిద్యతే=లేదో. ॥౩౧॥

శాంకరభాష్యమ్:—

ఇహ పరమార్థతత్త్వాపేక్షాయాం శోకో మోహో వా న సంభవతీత్యుక్తం, న కేవలం పరమార్థతత్త్వాపేక్షాయా మేవ, కింతు—స్వధర్మ మితి । స్వధర్మ మపి స్వో ధర్మః క్షత్రియస్య

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పరమార్థ మగు తత్త్వమును విచారించిన నాత్మ నిత్య మగుటంజేసి చంపదగిదికానందున నాత్మ వినాశమువలన గలిగెడి శోకమోహములు సంభవింప వని "దేహీ నిత్య మవధ్యోఽయం" అను పూర్వశ్లోకమునందు నుడువబడెను.

ము న నూర్ణనాభి (సాలిపురుగు) తనచే సృజింపబడిన తంతువును మ్రింగుచు నెంతవర కాతంతు గ్రాసముగునో యంతవర కాతంతుద్వారముననే యూర్ధ్వముగ సంచరించును. ఆదేవిధముననమనస్సు సర్వసంకల్పరూపమగుతంతువును మ్రింగి తానాత్మయందు లీనమగును." అని సుషుప్తియందు సంభవించు ప్రపంచలయవిషయమై దృష్టాంత మీయబడెను. జాగరమునందు సంభవించు ప్రపంచావిర్భావవిషయమై (కట్టిచే కొట్టబడిన) యగ్నినుండి మిణుగురులు బయలువెడలిన విధమున నీయాత్మనుండి మనస్సాన్నిధ్యమున సూక్ష్మప్రపంచరూప మగు ప్రాణములు, స్థూలప్రపంచరూపమగు భూర్భువస్సువరాదిలోకములు, ఇంద్రాదిసర్వదేవతలు, స్థావరజంగమాత్మక మగు నిఖిలభూతములు బయలువెడలును" అని దృష్టాంతమీయబడెను. ఉపనిషద్భావసత్యమగు పరమాత్మకు సత్యత్వమును చెప్పుచుండెను. జ్ఞానవ్యవహారమునందు ప్రాణ ముఖ్యప్రాణాదులు, హిరణ్యగర్భాదులు సత్యములు. నట్టివారలకుగూడ నీయాత్మ సత్యము. కాన నెటు చూచినను శోకమున కవకాశము లేదు. ఈవిషయమే "ఇన్ద్రే ప్రాణీ రతాస్తే ప్రవిశతి మనసా శేతసా సాక మేత ద్యుద్ధ్వన్త ర్విశ్వజాతం సకలకరణం తేన గర్భం దధానా । సాఽవ్యక్తే లీయమానా పున రుదయమితా జాగరాదౌ ప్రసూతే కీటే వోర్ణా మివాసా పుత హుతవహాతో విస్ఫురన్తి స్ఫులింగాః॥" అని యధ్యాత్మమీమాంసయందు చెప్పబడెను.

నీలకంఠీయము:— ప్రకృతార్థము నీశ్లోకముచే నుపసంహరించుండెను. ఓయర్జునా! "అల్పబలముకల ఈదుర్యోధనాదులు బలశత్రురుడనగు నాచే నెటుల జంపదగినవారు; వీరలను విడచి వీరి పుత్రాదు లెటుల జీవించెదరు? భీష్మాదిగురువులను విడిచి నేనెటులజీవించెదను" అని నీవు దుఃఖించుటకు దగవని యర్థము. ॥౩౦॥

—• ౨వ అధ్యాయము ౩౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఈవిధమున స్థూలసూక్ష్మ కారణశరీరరూప మగు నుపాధిత్రయము యొక్క యవివేకముచే మిథ్యాభూతమగు సంసారమునుసత్యముగను, ఆత్మధర్మముగనుభ్రమించుట సర్వప్రాణి

శాంకరభాష్యమ్:—

యుద్ధం; త మప్యవేక్ష్య త్వం న వికమ్పితుం ప్రచలితుం నార్హసి స్వాభావికా ద్ధర్మా దాత్మస్వాభావ్యా దిత్యభిప్రాయః। తచ్చ యుద్ధం పృథివీజయద్వారేణ ధర్మార్థం ప్రజారక్షణార్థం చేతి ధర్మా దనపేతం పరం ధర్మ్యం తస్మా ద్ధర్మ్యా ద్యుద్ధా చ్ఛ్రేయోఽన్య త్క్షత్రియస్య న విద్యతే హి యస్మాత్। ॥౩౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

క్షత్రియునకు యుద్ధము స్వధర్మము. ఏధర్మ మెవరకు స్వధర్మమో అట్టి ధర్మము వారలచే ననుష్ఠింపఁదగినది. కాన నట్టి స్వధర్మ మగు యుద్ధమును స్వధర్మ మని దెలిసికొని యైనను నీవు క్షత్రియస్వభావమగు ధర్మస్వరూపయుద్ధమునుండి చలించుటకుఁ దగవు.

క్షత్రియున కేధర్మము శ్రేయస్సాధనమో యదియే యనుష్ఠింపఁదగినది. ఈ యుద్ధము శ్రేయస్సాధనము కానందున ననుష్ఠేయము కాదని శంకింపఁజనదు. ఈ యుద్ధమునునది క్షత్రియునకు పృథివీజయద్వారమున ధర్మార్థము, ప్రజాసంరక్షణార్థము నగుటం జేసి ధర్మసంబద్ధము. ఇట్టి యుద్ధముకంటె వేఱొండు ధర్మము క్షత్రియునకు లేదు కాన నీవిట్టి ధర్మమునుండి చలించుటకుఁ దగవు. ॥౩౧॥

సాధారణము. అట్టి సర్వప్రాణిసాధారణ మగు నర్జునుని యాభ్రమను తొలగించుటకు స్థూలసూక్ష్మ కారణరూపోపాధిత్రయవివేకద్వారమున నాత్మస్వరూపమును బోధించెను. ఈవిధమున నాత్మస్వరూపమును బోధించి యిపుడు స్వధర్మ మగు యుద్ధము హింసాదిబాహుళ్యముచే నధర్మముగ భ్రమించుట యర్జునుని కరుణాదిదోషనిబంధన మగుటం జేసి యట్టి భ్రమ యర్జునుని కసాధారణ మగును. దానిని తొలగించుటకు యుద్ధము హింసాదియుక్తమైనను స్వధర్మ మగుటచే నధర్మము కాదని శ్రీకృష్ణపరమాత్మ "స్వధర్మ మపి చావేక్ష్య" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

కేవలము పరమార్థతత్త్వము విచారించియే కాదు. మఱేమనిన? క్షత్రియధర్మము యుద్ధమునుండి వెనుకకుఁ దిరుగకపోవుట. అట్టి క్షత్రియధర్మమును కూడ శాస్త్రమువలన నాలోచించి ధర్మమగు యుద్ధామునం దధర్మత్వభ్రాంతిచేఁ జలించుట యోయర్జునా! నీవు తగవు. యుద్ధము స్వధర్మమై, యవశ్యానుష్ఠేయమైయుండ "యద్యప్యేతే నపశ్యన్తి" అనునది మొదలుకొని 'నరకే నియతం వాసో భవతి' అనునంతవరకగు గ్రంథముచే యుద్ధమునకే పాపహేతుత్వము నీచే చెప్పఁబడెనో 'కథం భీష్మ మహం సంఖ్యే' అనునది మొదలగు గ్రంథముచే గురుబ్రహ్మవధాద్యకరణము చెప్పఁబడెనో అదియంతయు ధర్మశాస్త్రమును విచారింపకయే చెప్పఁబడెను. ఎందువలననిన? అపరాఙ్ముఖత్వరూపధర్మసంబద్ధ మగు యుద్ధముకంటె వేఱొండు శ్రేయస్సాధనము క్షత్రియునకు లేదు. యుద్ధమే పృథివీజయద్వారమునఁ బ్రజారక్షణబ్రాహ్మణశుశ్రూషాదిక్షాత్త్రధర్మనిర్వాహకము. కాన నాయుద్ధమే క్షత్రియునకు ప్రశస్తతరమని యాశయము. ఈవిషయమునే శ్రీపరాశరులు "క్షత్రియో హి ప్రజా రక్ష న్శస్త్రపాణిః ప్రదండవాన్। నిర్జిత్య పరసైన్యాని క్షితిం ధర్మేణ పాలయేత్ ॥" (క్షత్రియుండు శస్త్రపాణియై ప్రజలను రక్షించుచు తీవ్రదండనకలవాఁడై పరసైన్యములను జయించి ధర్మముచే పృథివిని పరిపాలింపవలయును) అని చెప్పియుండెను. మఱియు "సమోత్తమాధమై రాజా చాహూతః పాలయ న్ప్రజాః। న నివర్తేత సంగ్రామా త్క్షాత్రం ధర్మ మనుస్మరన్ ॥ సంగ్రామే ష్వనివర్తిత్వం ప్రజానాం చైవ పాలనమ్। శుశ్రూషా బ్రాహ్మణానాం చ

రాజ్ఞః శ్రేయస్కరం పరమ్॥" (ప్రజలను రక్షించు క్షత్రియుఁడు యుద్ధమునకొఱకు సమునిచేతను గాని, ఉత్తమునిచేతను గాని, తక్కువవానిచేతను గాని యాహ్వానింపఁబడి క్షత్రియధర్మమగు నపరాఙ్ముఖత్వమును స్మరించుచు సంగ్రామమునుండి వెనుకకుఁ దిరుగకూడదు. యుద్ధములయందు వెనుకకుఁ దిరుగకుండుట, ప్రజలను పరిపాలించుట, బ్రాహ్మణులకు శుశ్రూషచేయుట అనునవి క్షత్రియునకుఁ బరమశ్రేయస్కరములు.) అని మనువు కూడ చెప్పియుండెను. రాజన్యశబ్దమునకుఁ బూర్వమీమాంసయందు గల ఇష్ట్యధికరణము ననుసరించి క్షత్రియజాతియే యని యర్థము. ఈ చెప్పుటవలన "నీరాజన్ శబ్దము క్షత్రియజాతిని చెప్పునది గాదు. మరేమనిన? భూమిని పాలించు వానిని చెప్పున" దనెడిభ్రమ తొలగించబడెను. పైనుదహరింపఁబడిన వచనములయందును "క్షత్రియోహి" "క్షాత్రం ధర్మం" అనియు స్పష్టముగ క్షత్రియలింగమే దెలియబడుచున్నది. కాన క్షత్రియునకు యుద్ధము ప్రశస్తతరమగు ధర్మమని శ్రీకృష్ణపరమాత్మ చెప్పెను.

అనేక శ్రేయస్సాధనములుండ 'ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే' అని చెప్పుట యెట్లుపొసగును? పశువులలో నేపశువులు ప్రశస్తమైనవను ప్రశ్నమీద "అపశవోఽన్యే గో అశ్వేభ్యః" (గోవు కంటెను, అశ్వముకంటెను ఇతరము లగునవి అపశువులే) యని చెప్పెను. అజామహిష్యాదులు పశువు లగుచుండ గవాశ్వములకంటె భిన్నములగునవి పశ్వితరములే యని చెప్పుట యెట్లు పొసగును? ప్రశస్తములగు పశువులు గవాశ్వములే. ఇతరములు ప్రశస్తమగునవి కావని యాశయము; అదేవిధమున క్షత్రియునకు ధర్మమగు యుద్ధముకంటె వేఱొండు ప్రశస్తమగు శ్రేయస్సాధనము లేదనియే యర్థము. ఇతరమగు శ్రేయస్సాధనము లుండినను అవి ప్రశస్తములు కావని యాశయముచేతనే శ్రీకృష్ణపరమాత్మ "ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే" అని చెప్పెను. ఇట్లు చెప్పుటచే 'యుద్ధముకంటె ప్రశస్తమగుదాని ననుష్ఠించుట కర్జునునకు యుద్ధనివృత్తి యుచితమే' యనునదియు "న చ శ్రేయోఽను పశ్యామి హత్వా స్వజనమాహవే" అనునదియు తొలగింపఁబడెను.

శంకరానందీయము:— "ఈ నిఖిలప్రపంచము, నేను బ్రహ్మస్వరూపమే" అను బ్రహ్మమాత్రత్వవిజ్ఞాన మీశ్వరానుగ్రహమువలన జనించును. అట్టి జ్ఞానము కలవానికిఁ జేయదగిన దేదియు లేదు. ఈ విషయము "వేదావినాశినం నిత్యం" అను స్థలమునందు స్పష్టముగఁ జెప్పఁబడెను. అట్టి బ్రహ్మవిజ్ఞానము లేనట్టియు "అహం" "మమ" అను అభిమానముకల ముముక్షువునకు— "బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన" అను శ్రుతిబలమున చిత్తశుద్ధికొఱకు శాస్త్రదృష్ట స్వధర్మము పూర్వోక్త జ్ఞానసిద్ధినిమిత్త మవశ్యకర్తవ్యము. అని బోధించుటకు ప్రకరణ మారంభింపబడెను. అందు మొట్టమొదట నర్జునున కాత్మజ్ఞానము లేదని యూహించి భక్తుఁడును, ముముక్షువు నగు నర్జునుని కర్తవ్యమగు స్వధర్మమునందు ప్రవర్తింపఁజేయుటకు శ్రీకృష్ణపరమాత్మ "స్వధర్మ మపి" అని చెప్పమొదలిడెను.

ఏసమయమున "కర్తయు, కరణము, కార్యమున్న సర్వము బ్రహ్మమే" అను జ్ఞానము కలుగునో యట్టి సమయమున జేయఁదగిన దేదియు లేదు. "నాసంబంధమైన వీరు నాచే జంపఁబడుచుండిరి" అను భేదజ్ఞాన మెప్పుడు కలదో అపుడు "యుద్ధం స్వధర్మో నృపతేః ప్రజానాం పరిపాలనం" ఇత్యాదిశాస్త్రోక్తమగు స్వధర్మమును క్షత్రియునకు కర్తవ్యముగ (విహిత మగుదానినిగ) నో యర్జునా! స్వబుద్ధిచే విచారించి నీవు స్వధర్మమును విడచుటకు తగవు. ఈ చెప్పుటచే స్వధర్మ మగుటవలన నవశ్యకర్తవ్యము యుద్ధము. అట్టి యుద్ధ విషయమై యాగమునందువలె శోకమోహములు, హింసాదిదోషవిచారము విద్వాంసునిచే చేయఁదగినది కాదని సూచింపఁబడెను.

ధర్మశాస్త్రములచేఁ గర్తవ్యముగ విధింపఁబడిన యుద్ధముకంటె వేఱొండు శ్రేయస్సాధనము క్షత్రియునకు లేదు. జయముచే సంప్రాప్తమైన ధనముచే ముఖ్యముగ సాధింపఁదగిన యాగములచేతను, దానములచేతను, వ్రతాదులచేతను చిత్తశుద్ధి గలుగును. దానివలన జ్ఞానము జ్ఞానమువలన మోక్షము ప్రాప్తించును. కాన యుద్ధము

గీ॥ యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్ ।
సుఖినః క్షత్రియాః పార్థ! లభంతే యుద్ధ మీదృశమ్ ॥ ॥౩౨॥

పదవిభాగము:— యదృచ్ఛయా- చ- ఉపపన్నం- స్వర్గద్వారం- అపావృతం- సుఖినః- క్షత్రియాః- పార్థ!- లభన్తే- యుద్ధం- ఈదృశమ్ । ॥౩౨॥

ప్రతిపదార్థము:— హేపార్థ=ఓయర్జునుఁడా!; యదృచ్ఛయా=స్వేచ్ఛచేతను (ప్రార్థింపకుండగ); ఉపపన్నం=పొందఁబడిన; స్వర్గద్వారం, స్వర్గ=స్వర్గసంబంధమగు; ద్వారం=కవాటము; అపావృతం=తెరవఁబడినది; సుఖినః=సుఖవంతులగు; క్షత్రియాః=క్షత్రియులు; ఈదృశం=స్వర్గద్వారోద్ఘాటనమునకు సమర్థ మగు; యుద్ధం=యుద్ధమును; లభన్తే=పొందుచున్నారు. ॥౩౨॥

---

శాంకరభాష్యమ్:—

కుతశ్చ త ద్యుద్ధం కర్తవ్యమితి, ఉచ్యతే—యదృచ్ఛయేతి। యదృచ్ఛయా చాప్రార్థితత యోపపన్న మాగతం స్వర్గద్వార మపావృత ముద్ఘాటితం ఏత దీదృశం యుద్ధం లభన్తే క్షత్రియాః హేపార్థ! కిం న సుఖిన స్తే ॥ ॥౩౨॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఏకారణమువలన యుద్ధముచేయదగినది? (అనగా "న హింస్యా త్సర్వా భూతాని" ఏభూతములనుగూడ హింసింపరా దను శ్రుతికి విరోధము వాటిల్లును గాన గురుభ్రాతృపుత్రహింసాదిరూపమగు నీయుద్ధము చేయదగినది కాదు) అని శంకింపవలదు.

---

శ్రేయస్సాధనము. అందువలన యుద్ధ మవశ్యకర్తవ్య మని సిద్ధమైనది 'ధర్మ్యాద్ధి' అనుచోట 'ధర్మ్యాత్-హి' అని పదవిభాగము. ఇటనుండు "హి" అను శబ్దమువలన యుద్ధము "యే యుధ్యన్తే ప్రధనేషు శూరాసః" అను శ్రుతిప్రసిద్ధ మని సూచింపఁబడెను.

పరమార్థప్రప:— నీకు సత్యత్వాభిమత మగు దృశ్యదృష్టి యటుండనిమ్ము. అట్లైనను శోకము తగదని "స్వధర్మమపి" అను శ్లోకముచే జెప్పుచుండెను- శ్రుతిస్మృతిప్రసిద్ధమగు క్షత్రియధర్మమును లెస్సగ విచారించిన చలించుటకు తగవు. అట్టి ధర్మమును నీవే చెప్పుచునెదవా? క్షత్రియునకు న్యాయాగతమగు యుద్ధముకంటె వేరగు నహింసాద్యనుష్ఠానము శ్రేయోజనకము కాదు.

నీలకంఠీయము:—అర్జునున కనాత్మయగు దేహాదికమునందాత్మజ్ఞానరూప మోహమును నివారించి, యిపుడు స్వధర్మ మగు యుద్ధమునం దధర్మత్వభ్రాంతిరూపమోహమున 'స్వధర్మ మపి' అనుదానిచేతొలఁగించుచుండెను.

—• ౨వ అధ్యాయము ౩౨ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— యుద్ధము క్షత్రియున కవశ్యకర్తవ్యమయినను అతి గర్హితమగుటంజేసి గురువులగు భీష్మద్రోణాదులతో నద్దానిని చేయుట యుచితము కాదను శంకను 'యదృచ్ఛయా చోపపన్నం' అను శ్లోకముచే దొలఁగించుచుండెను.

స్వప్రయత్నము లేకయే (ప్రార్థింపకుండగ) సంప్రాప్తము, భీష్మద్రోణాదివీరపురుషప్రతియోగికము, కీర్తిరాజ్యలాభదృష్టఫలసాధనము నగు యుద్ధము నెక్షత్రియులు చేసెదరో వారు యుద్ధమునందు జయమును పొంది యనాయాసముగ యశస్సును, రాజ్యమును పొందుదురు. పరాజయమును పొందెదరా, అతిశీఘ్రముగ స్వర్గ

శాంకరభాష్యతత్త్వబోధని:—

"న హింస్యాత్సర్వా భూతాని" అనునది సామాన్యశాస్త్రము. ఈసామాన్యశాస్త్రమునకు "అగ్నిషోమీయం పశు మాలభేత" అనునది విశేష (అపవాద) శాస్త్రము. అనగా శ్రుతివిహితపశ్వాదిహింసావ్యతిరిక్తమగు హింస చేయగాదని యాశయము. అటులనే క్షత్రియునకు యుద్ధము శాస్త్రప్రసిద్ధము. కాన "మాహింస్యాత్సర్వాభూతాని" అను శ్రుతికి నేతద్వ్యతిరిక్తమగు హింసను చేయకూడదని యర్థము. కాన నోయర్జునా! ప్రార్థన లేకుండగ సంప్రాప్తమగు (అనగా నేక్షత్రియుఁడు వెనుకకు దిరుకుండగ యుద్ధమును చేసి యుద్ధమునందు మృతుడగునో వానిచే ప్రార్థింపబడకుండగ సంప్రాప్తమగు) స్వర్గముయొక్క ద్వారము తెరువఁబడెను. అట్టి స్వర్గమునుగూర్చి కారణమగు నీయుద్ధమును సుఖవంతులగు క్షత్రియులు పొందెదరు. ఇట్టి యుద్ధమును జేసిన క్షత్రియులు సుఖవంతులు కారా? (సుఖవంతులే యగుచుండిరి. అందువలన స్వధర్మమగు నీయుద్ధమును నీవుగూడ జేయుమని యాశయము) ॥౩౨॥

ఘును పొందుదురు. గాన నధియథా సుఖవంతులే. ఈ విషయమునే "స్వర్గద్వార మపావృతం" అను వాక్యముచేఁ జెప్పుచుండెను. స్వర్గజనకములు క్రతువు, యుద్ధమునగును. అందు క్రతువువలన స్వర్గము జనించును గాని యయ్యది కాలాంతరమున దేహాంతరముచేఁ బొందఁదగినది. క్రత్వనుష్ఠానసమకాలమునందు స్వర్గము సంభవింపకపోవుట కాశరీరమే ప్రతిబంధకము. అట్టి ప్రతిబంధక మీశరీరపాతానంతరమునఁ దొలగును. ధర్మయుద్ధ మన్ననో వెంటనే స్వర్గజనక మని యర్థము. ఇట "స్వర్గద్వార మపావృతం" అని చెప్పుటచే యుద్ధము శ్యేనయాగమువలె ప్రత్యవాయజనక మను శంక తొలగింపఁబడెను. శ్యేనయాగము విధివిహితమైనను తత్ఫలమగు శత్రువధ "న హింస్యాత్సర్వా భూతాని" "బ్రాహ్మణం న హన్యాత్" అను శాస్త్రనిషిద్ధమగుటచే ప్రత్యవాయజనక మగుటవలనను, ఫలమునందు విధి లేమింజేసియు శత్రువధరూపఫలదోషముచే దుష్టమైనది. కనుకనే "విధిస్పృష్టమైనదానియందు నిషేధమున కవకాశము లే" దను న్యాయము శ్యేనయాగాదులయందు వర్తించదు. యుద్ధమునకన్ననో స్వర్గము ఫలము. అట్టి స్వర్గము నిషిద్ధము కాదు. ఈవిషయమునే మనువు 'ఆహవేషు మిథోఽన్యోన్యం జిఘాంసన్తో మహీక్షితః । యుద్ధ్యమానాః పరం శక్త్యా స్వర్గం యాన్త్యపరాఙ్ముఖాః ॥" అని యుద్ధ మగ్నిషోమీయపశ్వాలంభనమువలె విహిత మగుటంజేసి నిషిద్ధము కాదని స్పష్టముగఁ జెప్పియుండెను.

మఱియు అతిరాత్ర మను క్రతువునందు 'అతిరాత్రే షోడశినం గృహ్ణాతి, నాతిరాత్రే షోడశినం గృహ్ణాతి' అను శ్రుతుల ననుసరించి షోడశి అను పేరుగల గ్రహమును (పాత్రవిశేషమును) గ్రహించుట వికల్ప మగునట్లీయుద్ధము వికల్పము కానేరదు. ఎందువల ననిన? "న హింస్యాత్సర్వా భూతాని" అను శాస్త్రమున సామాన్యశాస్త్రము. యుద్ధమును విధించుశాస్త్రము విశేషశాస్త్రము. విశేషశాస్త్రము సామాన్యశాస్త్రమున కపవాద మగును. అనగా యుద్ధాదులకన్న వేరగు హింసచేయకూడ దని యర్థము. కాన నీయుద్ధము ప్రత్యవాయజనకము కానేరదు.

మఱియు భీష్మద్రోణాదు లాతతాయు లగుటంజేసివారలను వధించుట ప్రత్యవాయజనకము కాదు. ఈవిషయమునే మనువు "గురుం వా బాలవృద్ధౌ వా బ్రాహ్మణం వా బహుశ్రుతం । ఆతతాయిన మాయాన్తం హన్యాదేవావిచారయన్ ॥ ఆతతాయిన మాయాన్త మపి వేదాంగపారగం । జిఘాంసన్తం జిఘాంసీయాన్న తేన బ్రహ్మహా భవేత్ ॥ నాతతాయి వధే దోషో హన్తుర్భవతి కశ్చన" అనియు నాతతాయులగు గురుబ్రాహ్మణాదుల వధించినను

గీ॥ అథ చేత్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి ।
తత స్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి ॥ ॥33॥

పదవిభాగము:— అథ-చేత్- త్వం- ఇమం- ధర్మ్యం- సంగ్రామం- న- కరిష్యసి-తతః-స్వధర్మం- కీర్తిం- చ- హిత్వా- పాపం- అవాప్స్యసి- ॥

ప్రతిపదార్థము:— అథ=ఒకవేళ; త్వం=నీవు; ధర్మ్యం=ధర్మసంబద్ధమగు; ఇమం=ఈ; సంగ్రామం=యుద్ధమును; నకరిష్యసిచేత్=చేయనియెడల; తతః= అట్టియుద్ధము చేయనందున; స్వధర్మం= స్వధర్మమును; కీర్తించ=కీర్తిని; హిత్వా=విడచి; పాపం=పాపమును; అవాప్స్యసి=పొందగలవు. ॥33॥

---

శాంకరభాష్యమ్:—

ఏవం కర్తవ్యతాప్రాప్తమపి— అథ చేత్త్వ మిమం ధర్మ్యం ధర్మా దనపేతం సంగ్రామం యుద్ధం న కరిష్యసిచే త్తత స్తదకరణా త్స్వధర్మం కీర్తిం చ మహాదేవాదిసమాగమనిమిత్తాం హిత్వా కేవలం పాప మవాప్స్యసి ॥ ॥33॥

---

శాంకరభాష్యతత్త్వబోధని:—

ఓయర్జునా! పూర్వము చెప్పినరీతిని యుద్ధము చేయదగినదైనను నీవు ధర్మసంబద్ధ మగు నీయుద్ధమునుఁ జేయనిచో స్వధర్మమును, మహాదేవా (శంకరా)దిసమాగమమువలన బ్రాప్తించిన కీర్తిని విడిచి కేవలము పాపమునే పొందగలవు ॥33॥

---

దోషము లేదని స్పష్టముగఁ జెప్పియుండెను. ('స్మృతేర్విరోధే న్యాయస్తు బలవా' నిత్యాద్యాక్షేపసమాధానము లిదివరకే స్పష్టీకరించుటచే నిట మధుసూదనసరస్వతులు చెప్పినను గ్రంథవిస్తరభీతిచేఁ విడిచితిమి.)

ఈవిధమగు యుద్ధము చేయుటచే సుఖము ప్రాప్తించునని చెప్పుటవలన "స్వజనం హి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ!" అని యర్జునోక్తము నిరస్తము.

శంకరానందీయము:— యుద్ధమునందు జయము ప్రాప్తించిన శ్రేయస్సు ప్రాప్తించును. మరణమే ప్రాప్తించినచో నేదియు లేదుకదా యను నాశంకను తొలగించుటకు "యదృచ్ఛయా" అను శ్లోకమును చెప్పుచుండెను.

అప్రయత్నముగ తెరువఁబడిన స్వర్గద్వారభూతము యుద్ధము. ఇట్టి యుద్ధమును, స్వర్గసుఖమును కోరెడి క్షత్రియులు పుణ్యముచేతనే పొందెదరు. ఇట్టి యుద్ధమునందు మృతులగువారు స్వర్గసుఖమును పొందెదరు. జయమునే పొందినచో రాజ్యసుఖమును పొందెదరు. ఉభయథా ఈయుద్ధము ఫలహేతు వగుటంజేసి యవశ్యము కర్తవ్యమే యని యాశయము.

భాష్యార్థకగ్రదీపిక:— స్వధర్మ మగుటంజేసి యుద్ధము ప్రయత్నపూర్వకముగ సంపాదింపబడును. అట్టి ప్రయత్నమును విడిచియే నీభాగ్యవశమున నీయుద్ధము సంప్రాప్తమైనది. కాన నవశ్యము నీవీయుద్ధము చేయదగినదని "యదృచ్ఛయా చోపపన్నం" అను శ్లోకముచే చెప్పుచుండెను. ॥32॥

—• 2వ అధ్యాయము 33వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "స్వర్గాదిఫలమనుగాని, ఐహికమగు భోగభాగ్యాదులనుగాని కోరికదా యుద్ధము చేయదగినది. "న కాంక్షే విజయం కృష్ణ" 'అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే' అని పూర్వమునందే యాద్వివిధఫలములయందు కోరిక లేదని చెప్పిన నాకు యుద్ధ మెందులకు కర్తవ్య

మగును!" అను నాశంకపై "అథ చేత్త్వ మిమం ధర్మ్యం" అను శ్లోకముచే కోరికలేకున్నను యుద్ధమును చేయని యెడల క్షత్రియునకుఁ బ్రత్యవాయము జనించునని బోధించుచుండెను.

"అథ" పక్షాంతరమునందు భీష్మద్రోణాది వీరపురుషులు విరోధులుగాఁ గలిగినట్టియు 'ధర్మ్యం' హింసాది దోషముచే నదుష్టమైనట్టియు, లేక సత్పురుషుల ధర్మమునుండి చ్యుతము కానట్టి యుట్టియుద్ధము సత్పురుషుల ధర్మమే యని మనువు "న కూటై రాయుధై ర్హన్యా ద్యుధ్యమానో రణే రిపూన్ । న కర్ణిభి ర్నాపి దిగ్ధై ర్నాగ్నిజ్వలిత తేజనైః ॥ న చ హన్యాత్ స్థలారూఢం న క్లీబం, న కృతాంజలిమ్‌ । న ముక్తకేశం, నాసీనం,న తవాస్మీతివాదినం॥ న సుప్తం, నవిసన్నాహం, న నగ్నం న నిరాయుధం ॥ నా యుద్ధ్యమానం, పశ్యన్తం, న పరేణ సమాగతం ॥ నాయుధవ్యసన ప్రాప్తం, నార్తం, నాతిపరిక్షితం । న భీతం, న పరావృత్తం, సతాం ధర్మమనుస్మరన్" (యుద్ధమునందు శత్రువులను కూటాయుధముల చేతను, శబ్దవేధ్యాయుధముల చేతను, విషముల చే పూయబడిన యాయుధముల చేతను అగ్నిచే ప్రజ్వలింపబడిన తేజస్సుకల యాయుధముల చేతను చంపకూడదు. మఱియు మెట్టప్రదేశము నధిష్ఠించినవానిని, నపుంసకుని, దోసెలొగ్గినవానిని, ముక్తకేశుని, కూర్చునియుండినవానిని, నీవాఁడనని పలుకుచున్నవానిని, నిద్రించుచున్నవానిని, యుద్ధసన్నాహము లేనివానిని, దిగంబరుని, ఆయుధము లేనివానిని, యుద్ధము సేయనివానిని, యుద్ధము చూచుచున్నవానిని, మరొక శత్రువుతో కలుసుకొనినవానిని, ఆర్తుని, మిక్కిలి దెబ్బలు తినినవానిని, భయగ్రస్తుని, యుద్ధమునుండి పరావృత్తుని చంపరాదు.) అని చెప్పియుండెను. కాన సత్పురుషుల ధర్మము నతిక్రమించి యుద్ధము చేసినచో పాపియగును. నీవు శత్రువులచే యుద్ధమున నాహూతుడవై సద్ధర్మోపేతమగు యుద్ధమును చేయనిచో (అనగా ధర్మమువలన గాని, లోకమువలనగాని భీతుడవై పరావృత్తుఁడవగుచో) "నిర్జిత్య పరసైన్యాని క్షితిం ధర్మేణ పాలయేత్" అను శాస్త్రవిహితమగు యుద్ధమును జేయనందున స్వధర్మమును విడిచి మహాదేవసమాగమ నిమిత్తమగు కీర్తిని వదిలి "న నివర్తేత సంగ్రామాత్" (సంగ్రామమునుండి క్షత్రియుడు మరలకూడదు.) అనునది మొదలగు శాస్త్రనిషిద్ధ మగు సంగ్రామనివృత్తి యొక్క యాచరణమువలన జనించెడి పాపమునే పొందెదవు. ధర్మమునుగాని, కీర్తినిగాని పొందనేరవని యాశయము.

లేక అనేకజన్మార్జితం బగు ధర్మమును వదలి రాజకృతమగు పాపమునేపొందెదవని యర్థము. ఈవిషయమును మనువు "యస్తు భీతః పరావృత్త స్సంగ్రామే హన్యతే పరైః । భర్తు ర్య ద్దుష్కృతంకించి త్తత్సర్వం ప్రతిపద్యతే ॥ యచ్చాస్య సుకృతం కించి దముత్రార్థ ముపార్జితమ్ । భర్తా తత్సర్వ మాదత్తే పరావృత్త హతస్య తు ॥" అని స్పష్టముగఁ జెప్పియుండెను. మఱియు నీవిషయమునే యాజ్ఞవల్క్యమహర్షియు "రాజా సుకృతమాదత్తే హతానాం విపలాయినాం" అని చెప్పియుండెను: కాన నోయర్జునా! యుద్ధపరావృత్తుడవై హతుఁడ వగుచో చిరోపార్జిత మగు సుకృతమును పరిత్యజించి పరోపార్జిత మగు పాపమునే బొందెద వని యాశయము. ఈచెప్పుటవలన "పాప మేవాశ్రయేదస్మా న్హత్వైతా నాతతాయినః। ఏతా న్నహన్తు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన!॥" అను నర్జునాభిప్రాయము తొలగింపబడెను.

శంకరానందీయము:— ముముక్షువునకు మోక్షసాధన మగు స్వధర్మమునందు ప్రమాదము కూడదని జ్ఞాపకము చేయుటకు స్వధర్మ మగుటచే నవశ్యకర్తవ్యమై సంప్రాప్త మగు యుద్ధమును జేయనిచో ప్రత్యవాయము, అకీర్తి మొదలగు ననర్థపరంపర ప్రాప్తించఁగలదని నయభయములచే నర్జునుని స్వధర్మమునం దైదుశ్లోకములచేఁ బ్రవర్తింపఁజేయుచుండెను. అందు మొదటిదియగు "అథ చేత్త్వ మిమం" అను శ్లోకముచే యుద్ధము హింసారూప మగుటచే దోషముకొఱకే యగు ననిగాని, లేక భీష్మాదులు స్వీయులనే భ్రమచేఁగాని స్వధర్మమును విడచితివేని కీర్తినాశము,ప్రత్యవాయము ప్రాప్తించును. అట్లైన నుభయలోకభ్రంశమే యగునని చెప్పుచుండెను.

'అథ' యుద్ధసన్నాహానంతరమున నీవీధర్మసంబద్ధమగు విధిదృష్టమైన యుద్ధమును చేయనిచో నీశ్వరునితో

గీ॥ అకీర్తిం చాపి భూతాని కథయిష్యన్తి తేఽవ్యయామ్ ।
సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే ॥ ॥౩౪॥

పదవిభాగము:— అకీర్తిం- చ- అపి- భూతాని- కథయిష్యన్తి- తే- అవ్యయాం- సంభావితస్య- చ- అకీర్తిః- మరణాత్- అతిరిచ్యతే । ॥౩౪॥

ప్రతిపదార్థము:— భూతాని=భూతములు (ఇతరములు); తే=నీసంబంధ మగు; అవ్యయాం=నాశరహితమైన; అకీర్తిమపి=అపకీర్తి నిన్ని; కథయిష్యన్తి చ=చెప్పగలరు; సంభావితస్య=(ధర్మాత్ముఁడు, సత్యసంధుఁడు, శూరుఁడు అను గుణములచే) గౌరవింపబడువానికి; అకీర్తిః=అపకీర్తిః; మరణాచ్చ=మరణముకంటెను; అతిరిచ్యతే=ఉత్కృష్టమగుచున్నది. ॥౩౪

శాంకరభాష్యమ్:—

న కేవలం స్వధరకీర్తిపరిత్యాగః —అకీర్తించాపి భూతాని కథయిష్యన్తి తే తవావ్యయాం దీర్ఘకాలామ్ । ధర్మాత్మా శూర ఇత్యేవమాదిభి ర్గుణై స్సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే । సంభావితస్య చాకీర్తే ర్వరం మరణమిత్యర్థః ॥ ॥౩౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కేవల స్వధర్మపరిత్యాగము, కీర్తిపరిత్యాగము మాత్రమే కాదు. మఱేమనిన? చిరస్థాయియు, నీసంబంధమునగు (యుద్ధమునందు భయముకలవాఁడై యర్జునుఁడు యుద్ధరంగమునుండి పరుగిడె నను) నపఖ్యాతిని గూడ నితరులు చెప్పుకొనెదరు. "శరీర మాద్యం ఖలు ధర్మసాధనం" అను న్యాయముచే "మొట్టమొదట ధర్మసాధన మగు శరీరసంరక్షణము శ్రేయస్కరము. యుద్ధమునందు మరణసందేహ ముండుటచే నాత్మరక్షణార్థ మపఖ్యాతినైన సహింపవలయు" నని శంకింపఁజను. 'ధర్మాత్ముఁడు, శూరుఁడు' అను ఖ్యాతిగలవాని కపఖ్యాతి మరణముకంటె నుత్కృష్టమైనది. శౌర్యాదిగుణములచే సంభావితున కపఖ్యాతికన్న మరణము శ్రేష్ఠతమ మైనదని యాశయము.

యుద్ధమును జేసితివను కీర్తిని, స్వధర్మనిష్ఠుఁ డర్జునుఁ డను స్వకీర్తిని, ధర్మమును ధర్మావబోధక మగు వేదమును విడచినవాఁడవగుదువు. వేదోక్తధర్మపరిత్యాగముచే వేదపరిత్యాగి వగుదువు. అట్లయినను స్వధర్మమును కీర్తినివదలి వేద వేదోక్త కర్మపరిత్యాగరూపమగు పాపమును బొందెదవు. సంన్యాసఫలమును బొంద నేరవని యర్థము. ॥౩౩॥

—• ౨వ అధ్యాయము- ౩౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఈవిషయమున యుద్ధమును పరిత్యజించినచో నిష్ట మగు కీర్తిధర్మముల యప్రాప్తియు, అనిష్టమగు పాపముయొక్క ప్రాప్తియు చూపఁబడెను. అందు పాపమనెడి యనిష్ట మాముష్మిక మగుటచే నాలస్యముగ దుఃఖము నిచ్చును. శిష్టులు నిందించుట శీఘ్రముగ ఫలమునిచ్చును. కాన శిష్టగర్హణము (శిష్టులు నిందించుట) అసహ్యమని 'అకీర్తిం చాపి భూతాని" అను శ్లోకముచేఁ జెప్పఁబడెను.

దేవర్షి మనుష్యాదులు నీసంబధ మగు దీర్ఘ కాలస్థాయి యగు నపకీర్తిని (అనగా నీయర్జునుఁడు ధరాత్ముఁడు కాఁడనియు, శూరుఁడు కాఁడనియు) అన్యోన్యము చెప్పుకొనెదరు. ఈశ్లోకమునందు గల 'చ అపి' అని రెండు

నిపాతలు కీర్తిధర్మనాశసముచ్చయార్థకములు. లేక కేవలము కీర్తిధర్మములను విడచి పాపమునుమాత్రమే పొందవు. మరేమనిన? అపకీర్తినిగూడ బొందెదవు. కేవలము నీవాయపకీర్తిని బొందుటయేగాక దేవర్షిమనుష్యాదులు గూడ నాయపకీర్తిని చెప్పుకొనెద రని 'చ అపి' అను రెండు నిపాతల నన్వయింపవలెను.

ఆత్మరక్షణ మత్యంతాపేక్షిత మగుటచే యుద్ధమునందు స్వమరణసందేహము కాన అట్టి మరణపరిహారము నిమిత్తమపకీర్తియు సహింపదగినదే. ఈవిషయమే మహాభారతమునందుగల శాంతిపర్వమునందు "సామ్నా దానేన భేదేన సమస్తై రథవా పృథక్ । విజేతుం ప్రయతేతారీన్న యుధ్యేత కదాచన ॥ అనిత్యో విజయో యస్మాద్దృశ్యతే యుధ్యమానయోః । పరాజయశ్చ సంగ్రామే తస్మాద్యుద్ధం వివర్జయేత్ ॥ త్రయాణా మప్యుపాయానాం పూర్వోక్తానా మసంభవే । తథా యుధ్యేత సంపన్నో విజయేత రిపూన్యథా ॥" (సామముచేతను గాని, దానముచేతను గాని, భేదముచేతను గాని, లేక సామదానభేదములచేతను గాని శత్రువులను జయించుటకుఁ బ్రయత్నింపవలెను. కాని యెన్నడు యుద్ధము చేయవలదు; యుద్ధము చేయువారలకు విజయమనిత్యము; యుద్ధమునందు పరాజయముగూడ సంభవించును; కాన యుద్ధమును విడువవలెను. సామదానభేదములు సంభవింపనిచో శత్రువులను జయించుటకు తగు సంపత్తి యున్నచో యుద్ధము చేయవలెను.) అని చెప్పఁబడెను. మఱియు మనువుగూడ నీవిషయమే చెప్పెను మరణభయము కలవానికి నపకీర్తివలన గలుగు దుఃఖమెంతటిది? అను శంకను "సంభావితస్య చాకీర్తిః" అను వాక్యముచే దొలగించుచుండెను. ధర్మాత్ముఁడు శూరుఁడు అనునిట్టి యనన్యలభ్యములగు గుణములచే బహుమతుఁడగు మనుజునకపఖ్యాతి మరణముకంటె నుత్కృష్టము. కాన నపకీర్తికంటె మరణమే న్యూనమగుటంజేసి శ్రేష్ఠము. కాన నీవుకూడ మహాదేవాదిసమాగమముచే నతిసంభావితుడవు. కాన నపఖ్యాతివలనఁ గలిగెడి దుఃఖమును సహించుటకు తగవనియాశయము.

శాంతిపర్వమునం దుపపాదితవాక్యము అర్థశాస్త్రము. 'సంగ్రామా న్న నివర్తేత' అనునది ధర్మశాస్త్రము. అర్థశాస్త్రముకంటె ధర్మశాస్త్రము ప్రబలమగుటవలన ధర్మశాస్త్రసిద్ధమగు యుద్ధమవశ్యకర్తవ్యమనియాశయము.

శంకరానందీయము:— కేవలపాపమును బొందుటయే కాదు. మఱేమనిన? ఈయుద్ధరంగమునం దుండు జనులు, ఇతరస్థలములం దుండువారలు స్వధర్మపరిత్యాగమువలన జనించునట్టి నీసంబంధ మగు శాశ్వతమైన యపకీర్తిని 'యర్జునుఁడు స్వధర్మవిముఖుడు, పరమపాపి' అనిసభలయందు చెప్పుకొనెదరు. స్వజనవధవలనసంభవించిన నిందకంటె యుద్ధమును చాలించుటవలన గలిగెడి నింద సహించుటకు శక్యమైనదే యని యనెదవా? 'బ్రహ్మణే బ్రాహ్మణ మాలభేత' అను శ్రుతిచే నరమేధమునందు బ్రాహ్మణాలంభము విహిత మగుటచే దోషముకొఱకు కానట్లు యుద్ధము శాస్త్రీయమగుటంజేసి యుద్ధమునందు స్వజనవధవలన దోషము సంభవింపదు, యుద్ధమును క్షత్రియుడు విరమించుట యశాస్త్రీయ మగుటచే నట్టి యుద్ధోపరతివలన బ్రాప్తించెడి యపకీర్తి 'సంభావితస్య' అర్జునుడు ధర్మాత్ముడు, సత్యసంధుడు, శూరుడునని యంతట నందరిచేతను కొనియాడబడు సత్కీర్తిగల పుణ్యపురుషుఁడ వగు నీకు మరణముకంటె నుత్కృష్టమైనది. లోకమున మరణమువలన జనించెడి దుఃఖము క్షణికము. సత్పురుషుల కపఖ్యాతివలన జనించెడి దుఃఖమైతే ప్రళయకాలపర్యంతభావి యగుటచే మరణదుఃఖముకంటె నపఖ్యాతివలన జనించెడి దుఃఖము సత్పురులకు మహత్తరము. కాన నపఖ్యాతికంటె మరణమే శ్రేష్ఠ మని యర్థము.

పరమార్థప్రపః:— జీవించియున్నవానికి మరణసమయముననే మరణమువలన దుఃఖము ప్రాప్తించును. అపకీర్తియైతే మరణానంతరమునందును, జీవించియున్నపుడును సంభవించు నని యర్థము. ॥34॥

గీ॥ భయా ద్రణా దుపరతం మంస్యన్తే త్వాం మహారథాః ।
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్ ॥ ॥౩౫॥

పదవిభాగము:— భయాత్ - రణాత్ - ఉపరతం - మంస్యన్తే - త్వాం - మహారథాః - యేషాం - చ - త్వం - బహుమతః - భూత్వా - యాస్యసి - లాఘవమ్ । ॥౩౫॥

ప్రతిపదార్థము:— యేషాం=ఎవరలకు; త్వం=నీవు; బహుమతః=గౌరవింపఁదగినవాఁడవై; భూత్వా=అయియుండి; లాఘవం=లఘుభావమును (చులకనను); యాస్యసి=పొందఁగలవో; తే=(ఈపదమధ్యాహార్యము) అట్టి; మహారథాః=మహారథికులగు దుర్యోధనాదులు; త్వాం=నిన్ను; భయాత్=భయమువలన; రణాత్=యుద్ధమునుండి; ఉపరతం=విరతునిగ; మంస్యన్తే=తలచెదరు. ॥౩౫॥

శాంకరభాష్యమ్:—

కించ — భయాదితి । భయా త్కర్ణాదిభ్యో రణా ద్యుద్ధా దుపరతం నివృత్తం మంస్యన్తే చిన్తయిష్యన్తి న కృపయేతి త్వాం మహారథాః దుర్యోధనప్రభృతయః । యేషాం చ త్వం దుర్యోధనాదీనాం బహుమతో బహుభి ర్గుణై ర్యుక్త ఇత్యేవం బహుమతో భూత్వా పున ర్యాస్యసి లాఘవం లఘుభావమ్ ॥ ॥౩౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ప్రాణులయందు దయచే నేను యుద్ధమును జేయ ననెదవా? అట్లనుటకు వీలుపడదు. ఏలన? నీవు ప్రాణులయందు దయచే యుద్ధమును మానినను నీశత్రువు లగు దుర్యోధనాదుల కింతవఱ కేనీయెడ "నర్జునుఁడు శౌర్యధైర్యాదిబహుగుణములుకలవాఁ" డని నిశ్చయము గలదో అట్టి నీవు చులకనను బొందెదవు. మఱియు నామహారథికు లగు దుర్యోధనాదులు నిన్ను భయమువలన యుద్ధమునుండి విరతునిగ దలంచెదరు. కాని దయవలన యుద్ధమును వదలితి వని తలవరు. ॥౩౫॥

—• ౨వ అధ్యాయము ౩౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఉదాసీనులు నన్ను నిందించుగాక మహారథికులగు భీష్మద్రోణకృపాచార్యాదులు 'అర్జునుఁడు పరమకారుణికుఁడు' అని నన్ను స్తుతి చేయుగలరను శంకను 'భయాద్రణా దుపరతం' అను శ్లోకముచేఁ దొలగించబడెను. "అర్జునుఁడు కర్ణాదులవలన జడిసి యుద్ధమునుండి విరతుఁడాయెను. కావి కృపవలన కాదు" అని భీష్మద్రోణదుర్యోధనాదులగు మహారథికులు నిన్ను తలచెదరు. భీష్మద్రోణాదు లిదివరలో నన్ను గొప్పవానినిగ తలచెడివారలుకదా. ఇపు డెట్లు భీతునిగ దలచెదరను శంకను తొలగించుటకు "యేషాంచ త్వం" అని చెప్పెను. ఏభీష్మాదులకు నీవు "బహుమతః" అర్జునుఁ డనేక సుగుణములు కలవాఁడని సమ్మతుఁడవో అట్టివారలె నిన్ను భయమువలన యుద్ధమును చాలించుకొనినవానిగఁ దలచెదరు. కాన నిట్టి వాఁడవై యుండియు నీవు యుద్ధోపరతుఁడవై యందరకు ననాదరవిషయుఁడవై లాఘవమును పొందెదవని యాశయము.

లేక ఎవరలకు పూర్వమునం దిట్టి గౌరవస్థానీయుడవై యుంటివో వారలకే యిపు డట్టివాడవై లాఘవమును పొందఁగలవనియైనను నన్వయింపవగును.

గీ॥ అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యన్తి తవాహితాః ।
నిన్దన్తస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్ ॥ ॥౩౬॥

పదవిభాగము:— అవాచ్యవాదాన్– చ– బహూన్– వదిష్యన్తి– తవ– అహితాః– నిన్దన్తః– తవ– సామర్థ్యం– తతః– దుఃఖతరం– ను– కిమ్ । ॥౩౬॥

ప్రతిపదార్థము:— తవ=నీయొక్క; అహితాః=శత్రువులగు దుర్యోధనాదులు; తవ=నీసంబంధమగు; సామర్థ్యం=బలమును; నిందన్తః=నిందించుచు; బహూన్=అనేకవిధములగు; అవాచ్యవాదాన్=అవక్తవ్యవాదములను (పలుకఁదగని దూషణవాక్యములను); వదిష్యన్తి=పలికెదరు; తతః=అంతకన్న; దుఃఖతరం=ఎక్కువదుఃఖము; కింను=ఏదికలదు? ॥౩౬॥

శాంకరభాష్యమ్:—

కించ— అవాచ్యవాదానితి । అవాచ్యవాదా నవక్తవ్యవాదాంశ్చ బహూ ననేకప్రకారా న్వదిష్యన్తి తవాహితా శ్శత్రవో నిన్దన్తః కుత్సయన్త స్తవ త్వదీయం సామర్థ్యం నివాతకవచాది యుద్ధనిమిత్తమ్ । తస్మా త్తతో నిందాప్రాప్తే ర్దుఃఖా ద్దుఃఖతరం ను కిమ్? తతః కష్టతరం దుఃఖం నాస్తీ త్యర్థః ॥ ॥౩౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నీశత్రువులగు దుర్యోధనాదులు– నివాతకవచాదియుద్ధమువలన బ్రాప్తించిన నీసంబంధమగు సామర్థ్యమును నిందించు ననేకవిధములగు నవక్తవ్యవాదములను (పలుకుటకు దగని వాక్యములను) బలికెదరు. కాన నీవు యుద్ధవిరతుఁడవు కాకుము.

భీష్మద్రోణకృపాచార్యాదివధవలన ప్రాప్తించు దుఃఖమును సహింపజాలను. అంతకన్న శత్రుకృతంబగు నాసామర్థ్యనిందయే సహింపనగును. కాన నేనీయుద్ధమును జేయనందువా?

శంకరానందీయము:— యుద్ధమును చాలించిన నీ కపకీర్తిమాత్రమే కాదు. మరేమనిన? శూరులం నిన్ను చులకనచేసెదరని "భయా ద్రణా దుపరతం" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

మహారథికులగు బాహ్లీక, భగదత్త, సౌమదత్త, ద్రుపదాదులు– దయచే యుద్ధమును చాలించుకొనిన నిన్ను "భీష్మద్రోణకర్ణాదివీరులతో యుద్ధముచేయుటకు శక్తిలేక వారలవలన భయపడు యర్జునుఁడు యుద్ధమును చాలించుకొనెను. కాని దయచేతను కా" దని నిశ్చయించెదరు. పూర్వమునం దెవరలకు నీవు శౌర్యధైర్యయుద్ధచాతుర్యాది గుణములచే నుత్కృష్టుఁడవని బహుమతుఁడవయి యుంటివో అట్టి నీ విప్పుడు వారలకలననే "లాఘవం" రణభయమువలన నర్జునుఁడు పలాయనమును చేసెనను లఘుభావమును (అవమానమును) పొందఁగలవు. అపకీర్తి పారోక్షికము. తిరస్కార మపరోక్షసిద్ధమని యీ రెంటికి భేదము. (పూర్వశ్లోకముచే పారోక్షికమగు నపకీర్తిని చెప్పి యీ శ్లోకముచే నపరోక్షరూపమగు తిరస్కారమును చెప్పెను.) ॥౩౫॥

—• ౨వ అధ్యాయము– ౩౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— భీష్మద్రోణాదిమహారథికులు నన్ను బహూకరింపకున్నను, నేను యుద్ధోపరతుఁడ నగుట దుర్యోధనాదుల కుపకారకమగుటచే నన్ను వారలు గౌరవింపగలరను శంకను "అవాచ్యవాదాంశ్చ" అను శ్లోకముచేఁ దొలఁగించుచుండెను.

గీ॥ హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్ ।
తస్మా దుత్తిష్ఠ కౌన్తేయ! యుద్ధాయ కృతనిశ్చయః ॥ ॥౩౭॥

పదవిభాగము:— హతః- వా- ప్రాప్స్యసి- స్వర్గం- జిత్వా- వా- భోక్ష్యసే- మహీం- తస్మాత్- ఉత్తిష్ఠ- కౌన్తేయ- యుద్ధాయ- కృతనిశ్చయః । ॥౩౭॥

ప్రతిపదార్థము:— హే కౌన్తేయ!=ఓ యర్జునుడా!; త్వం=(ఈ పదమధ్యాహార్యము)నీవు; హతోవా=మరణించితివా; స్వర్గం=స్వర్గమును; ప్రాప్స్యసి=పొందగలవు; జిత్వా వా=శత్రువులను జయించెదవా; మహీం=భూమిని; భోక్ష్యసే=అనుభవించెదవు; తస్మాత్=అ కారణమువలన; యుద్ధాయ=యుద్ధముకొఱకు; కృతనిశ్చయః, కృత=చేయఁబడిన; నిశ్చయః=నిశ్చయముకలవాఁడవై; ఉత్తిష్ఠ=సన్నద్ధుఁడవగుము. ॥౩౭॥

---

శాంకరభాష్యమ్:—

యుద్ధే పునః క్రియమాణే కర్ణాదిభిః- హతో వేతి । హతో వా ప్రాప్స్యసి స్వర్గం; హతస్స న్ప్రాప్స్యసి స్వర్గం; జిత్వా వా కర్ణాదీ న్శూరా న్భోక్ష్యసే మహీమ్ । ఉభయథాఽపి తవ లాభ ఏవే త్యభిప్రాయః । యత ఏవం తస్మా దుత్తిష్ఠ కౌన్తేయ! యుద్ధాయ కృతనిశ్చయో జేష్యామి శత్రూ న్మరిష్యామి వేతి నిశ్చయం కృత్వే త్యర్థః ॥ ॥౩౭॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"పుత్రశోకో మహాద్దుఃఖం దుఃఖా ద్దుఃఖతరం క్షుధా । తతో దుఃఖతరం లోకేఽయశః ప్రాప్తి రేవ చ" (పుత్రశోకము మహాదుఃఖము; అట్టి దుఃఖముకన్న దుఃఖతర మాకలి; అంతకన్న దుఃఖతమము లోకమున నపకీర్తి ప్రాప్తించుట. కాన శత్రుకృతసామర్థ్యనిందకన్న కష్టతర మగు దుఃఖ మేది కలదు? అంతకన్న కష్టతరమగు దుఃఖ మేదియు లేదు.) అందువలన నీవు యుద్ధవిరతుడవు కావలదని యాశయము. ॥౩౬॥

---

అసాధారణము, లోకప్రసిద్ధము నగు నీసామర్థ్యమును శత్రువులగు దుర్యోధనాదులు నిందించుచు నవాచ్యములగు వచనములను పలుకఁగలరు. నిన్ను బహూకరించరని భావము.

భీష్మద్రోణాదివధప్రయుక్తము. కష్టతరము నగు దుఃఖమును సహింపలేక యుద్ధమునుండి నివృత్తుఁడ నైన నేను శత్రుకృతసామర్థ్యనిందవాదులవలన సంభవించెడి దుఃఖమును సహించెదనను శంకను తొలగించుటకు "తతో దుఃఖతరం ను కిమ్" అని చెప్పెను. "తతః" అట్టి నిందాప్రాప్తదుఃఖముకంటె దుఃఖతర మేదికలదు? ఏదియు లేదని యర్థము.

శంకరానందీయము:— విద్యాకులశీలధర్మకార్యములచే ప్రతిష్ఠను పొందినవాని కపకీర్తియే దుఃఖరూపము. అంతకంటె నధికమగు దుఃఖ మవమానము. అంతకంటె నధికతర మగు దుఃఖము ప్రత్యక్షదూషణమని "అవాచ్యవాదాంశ్చ" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

నీ శత్రువులగు దుర్యోధనకర్ణవికర్ణప్రభృతులు నీ సంబంధమగు పౌరుషమును నిందింపుచుఁ బలుకుటకుఁ దగని "ధిక్, ధిక్" అను శబ్దములను పలికెదరు. కర్ణకఠోరములు, మర్మఘాతులు నగు నట్టి దూషణవాక్యములకంటె అభిమానియు, శూరుఁడు నగు క్షత్రియునకు దుఃఖతర మేదికలదు? అంతకన్న దుఃఖతరమగున దేదియు లేదని యర్థము. ॥౩౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

యుద్ధమును జేసినచో గుర్వాదుల వధయు, దానివలన మధ్యస్థులవలన నిందయు ప్రాప్తించును యుద్ధమును జేయనిచో శత్రువులవలన నిందయు ప్రాప్తించును 'ఉభయతఃపాశా రజ్జుః' (ఎటుజూచినను పాశముగలత్రాడు సిద్ధమగుచున్నది.) కాన నేనేమి జేయవలెనో దోపకున్న దనెదవా? కర్ణాదులతో యుద్ధము జేయుచుండ నీవు మరణించెదవా, వీరస్వర్గమునే పొందెదవు. శూరులగు కర్ణాదులనుఁ జయించెదవా, నిస్సపత్నమగు నీపృథివి ననుభవించెదవు. ఎట్లైనను నీకు లాభమే యని యాశయము.

నీకు జయము ప్రాప్తించునను నియమము లేకున్నను జయప్రాప్త్యప్రాప్తులయందు లాభముకలదు. అందువలన 'శత్రువులను జయించెదను, లేక మరణమునైన బొందెద' నను నిశ్చయము కలవాఁడవై యుద్ధమునకై లెమ్ము సన్నద్ధుడ వగుము.

ఇట "కౌన్తేయ" అను సంబోధనచేఁ బరిశుద్ధవంశజుడ వైనట్టియు, యుద్ధము కొఱకు కృతనిశ్చయుడవైనట్టియు, క్షత్రియుఁడవగు నీకు యుద్ధమును జాలించుకొనుట మంచిది కాదని సూచితమయ్యెను. ॥37॥

—• 2వ అధ్యాయము 37వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— యుద్ధమును చేసినచో గుర్వాదులవధ ప్రాప్తించును. అందువలన మధ్యస్థకృతనింద ప్రాప్తించును. యుద్ధవిరతుఁడవైనచో శత్రుకృతనింద ప్రాప్తించును. కాన "ఉభయతః పాశా రజ్జుః" అను న్యాయము సంభవించుచున్నది. కాన నేమిచేయవలెనో దోపకున్నది. అను నాశంకకు సమాధానముగ జయము ప్రాప్తించినను ప్రాప్తింపకున్నను లాభము నిశ్చితమగుటచే యుద్ధసంసిద్ధుఁడ వగుట యావశ్యకమని "హతోవా" అను శ్లోకముచే జెప్పుచుండెను.

యుద్ధమునందు మరణించితివేని స్వర్గమును పొందఁగలవు. శత్రువులను జయించినచో నిస్సపత్నమగు నీ భూలోకరాజ్యము ననుభవించెదవు. కాన నుభయవిధముల లాభమే. అందువలన శత్రువులను జయించెదను, లేక మరణించెద నను నిశ్చయము కలవాఁడవై యుద్ధమునకై లెమ్ము సన్నద్ధుఁడ వగుము. ఈ చెప్పుటచే "న చైత ద్విద్మః కతరన్నో గరీయః" అను మొదలుగాఁగలవి పరిహరింపఁబడెను.

శంకరానందీయము:— యుద్ధముచేసినయెడల గుర్వాదివధయు, దానివలన శిష్టనిందయు సంభవించును. యుద్ధముచేయనిచో శత్రువులవలన నింద సంభవించును. రెండువిధములచేతను నిందవలనఁగలిగెడి దుఃఖమే ప్రాప్తించును. అంతకన్న వేరొకటి ప్రాప్తింపనేరదను నాశంకమీద యుద్ధమును జేసినచో యాగమువలె యుద్ధము స్వధర్మమగుటంజేసి యుద్ధమునందు గుర్వాదిహింస యాగీయపశుహింసాతుల్యమగుటవలన శిష్టనింద ప్రాప్తించదు. శత్రునిందయు ప్రాప్తించదు; జయమునందును, పరాజయమునందును యుద్ధముచే నిష్టఫలము కలుగునని "హతోవా" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

యుద్ధమునందు కర్ణాదులచే చంపబడితివేని స్వర్గమును పొందెదవు. శత్రువులను జయించితివేని నిష్కంటక మగు భూమి ననుభవించెదవు. కాన నుభయథా ఫలము ప్రాప్తించును; వ్యర్థము కానేరదు. యుద్ధమునకు నభిముఖుఁడ వగు మని యర్థము.

గీ॥ సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి ॥ ॥౩౮॥

పదవిభాగము:— సుఖదుఃఖే- సమే- కృత్వా- లాభాలాభౌ- జయాజయౌ- తతః- యుద్ధాయ- యుజ్యస్వ- న- ఏవం- పాపం- అవాప్స్యసి । ॥౩౮॥

ప్రతిపదార్థము:— హే అర్జున!=(ఈపదమధ్యాహార్యము) ఓయర్జునుడా!; సుఖదుఃఖే=సుఖదుఃఖములను; సమే=సమానమగునటుల; కృత్వా=చేసి; జయాజయౌ=జయపరాయములను; సమౌ=తుల్యమగునటుల; కృత్వా=చేసి: తతః=అనంతరమున; యుద్ధాయ=యుద్ధముకొఱకు; యుజ్యస్వ=సన్నద్ధుడవగుము; ఏవం=ఇట్టినిశ్చయముతో యుద్ధమును జేసినయెడల; పాపం=పాపమును; నావాప్స్యసి=పొందవు. ॥౩౮॥

శాంకరభాష్యమ్:—

తత్ర యుద్ధం స్వధర్మ ఇత్యేవం యుద్ధ్యమాన స్యోపదేశ మిమం శృణు — సుఖదుఃఖే ఇతి । సుఖదుఃఖే సమే తుల్యే కృత్వా రాగద్వేషా వకృత్వే త్యేతత్ । తథా లాభాలాభౌ జయాజయౌ చ సమౌ కృత్వా తతో యుద్ధాయ యుజ్యస్వ ఘటస్వ । నైవం యుద్ధం కుర్వ న్పాప మవాప్స్యసీ త్యేష ఉపదేశః ప్రాసంగికః ॥ ॥౩౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పాపభీరువు నగుటచే యుద్ధముకొఱకు నిశ్చయమును జేసికొని లేచుటకు సమర్థుఁడను కానని శంకింపజనదు యుద్ధము స్వధర్మముగాన క్షత్రియున కవశ్యకర్తవ్యమె "యుద్ధము స్వధర్మ" మను జ్ఞానముచే యుద్ధముచేయువానికి నేను జేయు నీయుపదేశమును వినుము. సుఖదుఃఖములను సమానముగఁ జేసికొనుము. సుహృజ్జీవనమువలన సుఖము, సుహృన్మరణమువలన దుఃఖము ప్రాప్తించును. ఇట్టి సుఖదుఃఖములను సమానముగఁ జేసికొనుట యెట్లని శంకింపవలదు. సుఖమునందు రాగము. దుఃఖమునందు ద్వేషమును జేయవలదని యాశయము. అట్లయిన సుఖదుఃఖములు సమానము లగును. అటులే లాభాలాభములను, జయాజయములను సమానముగఁ జేసికొని (లాభాలాభములయందు, జయాజయములయందు రాగద్వేషములను

పరమార్థప్రభ:— యుద్ధమునందు మరణించినవానికే స్వర్గప్రాప్తి శ్రూయమాణ మగుటఁజేసి జయించి జీవించియున్నవానికి స్వర్గాదులు లేవనుశంకను "హతో వా" అను శ్లోకముచేఁ దొలగించుచుండెను. యుద్ధమునందు మృతునకు స్వారాజ్యము; జీవించియున్నవానికి సామ్రాజ్యము ప్రాప్తించును. కాన నుభయథా ఫలప్రాప్తి యగు నని యర్థము. ॥౩౭॥

—॥ ౨వ అధ్యాయము- ౩౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ॥—

మధుసూదనసరస్వతీయము:— స్వర్గము నుద్దేశించి యుద్ధము చేసినచో నది కామనాప్రయుక్తమగుటఁజేసి యుద్ధమునకునిత్యకర్మత్వము సంభవింపదు. కామ్యత్వమే సంభవించును. అట్టికామ్యకర్మ ననుష్ఠించనియెడల పాపమెటుల ప్రాప్తించును? మఱియు రాజ్యము నుద్దేశించి యుద్ధము నాచరించినచో నది యర్థశాస్త్రసిద్ధ మగుటఁచేసి ధర్మశాస్త్రము నపేక్షించి యర్థశాస్త్రము దుర్బలమగుటఁజేసి దృష్టార్థమగు గురుబ్రాహ్మణహన

శాంకరభాష్యతత్త్వబోధిని:—
వదలి) యుద్ధమునకు సన్నద్ధుఁడ వగుము. (జయ మనగ తిరస్కరింపఁబడని న్యాయమగు యుద్ధముచేఁ గలుగు శత్రువుయొక్క తిరస్కారము. అపజయ మనగ తద్విరుద్ధమని గ్రహింప నగును.) ఈవిధమున యుద్ధమును జేసినచో నీవు పాపమును బొందనేరవు.

ఈయుపదేశమువలన బరమార్థాత్మతత్త్వప్రకరణమున యుద్ధకర్తవ్యత జెప్పఁబడెను. కాన గీతాశాస్త్రము కర్మజ్ఞానసముచ్చయపరమని శంకింపవలదు. ఏలయన: నీయుపదేశము ప్రాసంగికము. అనగా క్షత్రియుఁడగు నర్జునునకు ధర్మమగు యుద్ధముయొక్క కర్తవ్యతానువాద ప్రసంగమున యుద్ధమునకు కర్తవ్యత్వ ముపదేశింపబడెను. కాన నిట యుద్ధకర్తవ్యతోపదేశమను మిషచే కర్మజ్ఞానసముచ్చయము సిద్ధింపదు. ॥౩౮॥

---

ధర్మ మెట్లగును? ఉభయథా యుద్ధమునకే యుద్ధమగుచుండ "అథ చేత్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి । తతః స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి" అను శ్లోకార్థ మెట్లు నుపపన్నమగును? అను శంకను "సుఖదుఃఖే సమే" అను శ్లోకముచే దొలగించుచుండెను.

సుఖమునందును, తత్కారణమగు లాభమునందును, తత్కారణమగు జయమునందును రాగమునుచేయక ఇదేవిధమున దుఃఖమునందును, తత్కారణమగు అలాభమునందును, తద్ధేతువగు పరాజయమునందును ద్వేషమును చేయక యుద్ధమునకు సన్నద్ధుడవగుము. ఈవిధమున సుఖకామనను, దుఃఖనివృత్తికామనను విడచి 'స్వధర్మము' అనెడి బుద్ధిచే యుద్ధముచేయు నీవు- గురుబ్రాహ్మణాది వధనిమిత్తమగు పాపమును, నిత్యకర్మను చేయకపోవుటవలన ప్రాప్తించెడి పాపమును పొందవు. ఎవఁడు యుద్ధమును ఫలకామనచే నాచరించునో వాడు గురుబ్రాహ్మణవధవలన పాపమును పొందును. ఎవఁడాచరింపడో వాడు నిత్యకర్మాననుష్ఠానమువలన ప్రాప్తించెడి పాపమును పొందును. కావున ఫలమునందు కోరికనువిడచి యుద్ధముచేయువాఁ డుభయవిధమగు పాపమునుపొందడనియే పూర్వోక్తమగు 'అథ చేత్త్వ మిమం ధర్మ్యం' అను శ్లోకమున కభిప్రాయము. "హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్" అను శ్లోకముచే నానుషంగికఫలము చెప్పఁబడెను. కాన ప్రకృతమునకు దోషము (విరోధము) లేదు. ఈవిషయమునే 'తద్యథాఽఽమ్రే ఫలార్థే నిమిత్తే (నిర్మితే) ఛాయాగంధ ఇత్యనూత్పద్యేతే ఏవం ధర్మం చర్యమాణ మర్థా అనూత్పద్యన్తే నో చే దనూత్పద్యన్తే న ధర్మహాని ర్భవతి" అని స్పష్టముగ నాపస్తంబమహర్షి చెప్పెను. కాన యుద్ధశాస్త్రమున కర్థశాస్త్రత్వము సంభవింపనందున "పాప మే వాశ్రయే దస్మా న్హత్వైతా నాతతాయినః" అను శంక తొలగింపఁబడెను.

శంకరానందీయము:— "హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీం" అను వాక్యమువలన యుద్ధమున కైహికాముష్మికసుఖసాధనత్వమే ప్రతీయమాన మగుచున్నది. కాని "ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే" అను వాక్యమువలన బోధింపబడిన శ్రేయస్సాధనత్వము ప్రాప్తింపనేరదు. యుద్ధము స్వర్గసుఖాదిహేతు వగుటంజేసి బంధకము. కాన వైషయికానందమును గోరెడి వారలకే యుద్ధము కర్తవ్యము, మోక్షమును గోరెడివారలకు కాదని శంకింపజనదు. భావనాభేదమువలన నిచట ఫలభేదము కలదు. అదెట్లనిన? జ్యోతిష్టోమయాగము స్వర్గకామనచే ననుష్ఠించినచో స్వర్గహేతు వగును. నిష్కామనతో ననుష్ఠించినచో నాజ్యోతిష్టోమమే చిత్తశుద్ధికి హేతువగును. ఆవిధముననే యుద్ధము, ప్రజాపాలనము, దానము వీనిని కామముచే నాచరించినచో నవి స్వర్గాదిఫలజనకములగును. నిష్కామముచే ననుష్ఠించినచో చిత్త

గీ॥ ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు ।
బుద్ధ్యా యుక్తో యయా పార్థ! కర్మ బన్ధం ప్రహాస్యసి ॥ ॥౩౯॥

పదవిభాగము:— ఏషా- తే- అభిహితా- సాంఖ్యే- బుద్ధిః- యోగే- తు- ఇమాం- శృణు- బుద్ధ్యా- యుక్తః- యయా- పార్థ!- కర్మబంధం- ప్రహాస్యసి । ॥౩౯॥

ప్రతిపదార్థము:— హే పార్థ!=ఓ అర్జునా!; ఏషా=ఈ; సాంఖ్యే=పరమార్థవిషయకమగు; బుద్ధిః=జ్ఞానము; తే=నీకొఱకు; అభిహితా=చెప్పబడెను; యయా=ఏయోగవిషయకమగు; బుద్ధ్యా=బుద్ధితో; యుక్తః=కూడుకున్నవాడవై; కర్మబంధం. కర్మ=ధర్మాధర్మములనెడి; బంధం=బంధమును; ప్రహాస్యసి=విడిచెదవో; యోగేతు=జ్ఞానప్రాప్తిసాధనకర్మయోగవిషయకమగు; ఇమాం=ఈ చెప్పబోవుజ్ఞానమును; శృణు=వినుము ॥౩౯॥

శాంకరభాష్యమ్:—

(1) శోకమోహాపనయనాయ లౌకికన్యాయః "స్వధర్మ మపి చావేక్ష్య" (గీ౨-31) ఇత్యాద్యైః శ్లోకైరుక్తో న తు తాత్పర్యేణ । పరమార్థదర్శనం త్విహ ప్రకృతం తదుక్త ముపసంహ్రియతే-ఏషా తేఽభిహితా ఇతి శాస్త్రవిషయవిభాగప్రదర్శనాయ । ఇహ హి దర్శితే పున శ్శాస్త్రవిషయవిభాగ ఉపరిష్టాత్ "జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం" (గీ౩-౩) ఇతి నిష్ఠాద్వయవిషయం శాస్త్రం సుఖం ప్రవర్త్స్యతే శ్రోతారశ్చ విషయవిభాగేన సుఖం గ్రహీష్యన్తీ త్యత ఆహ —ఏషా త ఇతి ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(1) స్వధర్మ మపి చావేక్ష్య" అను శ్లోకము మొదలు "సుఖదుఃఖే సమే కృత్వా" అనునంతవరకు నగు గ్రంథముచే శోకమోహములు దొలగుటకు దగు లౌకికన్యాయము చెప్పబడెను. కాన నట్టి లౌకికన్యాయ ముపసంహరింపవలసియుండ "ఏషా తేఽభిహితా సాంఖ్యే" అను శ్లోకముచే పరమార్థదర్శన ముపసంహరించుట యెట్లు పొసగునని శంకింపవలదు.

శుద్ధికి హేతువులగును. కాన నోయర్జునా! నీవకామునతో యుద్ధమును జేయుము. అని "సుఖదుఃఖే" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

లాభాలాభములయొక్కయు, జయాజయములయొక్కయు, తత్ఫలభూతములగు సుఖదుఃఖములయొక్కయు సిద్ధ్యసిద్ధులయందు హర్ష విషాదములను జేయక మద్భక్తితో విధివిధేయుఁడవై విధ్యుక్తము, స్వధర్మానుష్ఠానరూపము నగు యుద్ధముకొఱకు ప్రయత్నించుము. ఈవిధమున "ఈశ్వరార్పణబుద్ధితోఁ జేసెద" నను నిశ్చయముతో యుద్ధమునుజేయు నీవు పాపమును బొందవు. "బ్రాహ్మణే బ్రాహ్మణ మాలభేత" అను శ్రుత్యుక్తనరమేధమునందు బ్రాహ్మణుని యాలంభనము చేసిన కర్త యెట్టితీరున పాపమును పొందడో ఆదేవిధమున "యే యుధ్యన్తే ప్రధనేషు" అను శ్రుత్యుక్తము, స్వధర్మము నగు యుద్ధమునందు భీష్మద్రోణాదిగుర్వాదులవధవలన పాపమును బొందవని యాశయము. ॥౩౮॥

—• ౨వ అధ్యాయము ౩౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— స్వధర్మబుద్ధితో యుద్ధము చేయువానికి పాపము లేకపోవు గాక. "య ఏనం వేత్తి హన్తారం" అనునది మొదలగు గ్రంథము చేతను, "కథం స పురుషః పార్థ! కం ఘాతయతి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

స్వజనమరణశంకకు, గురువధశంకకు కారణములును, సమ్యగ్జ్ఞానప్రతిబంధకములు నగు శోకమోహములు దొలగుటకు "స్వవర్ణాశ్రమధర్మము లనుష్ఠించువానికి స్వర్గాదికముసిద్ధించును; అట్లనుష్ఠింపనివానికి స్వర్గాదులు సిద్ధింపనేరవు." అని యన్వయవ్యతిరేకస్వరూప మగు లోక ప్రసిద్ధన్యాయము "స్వధర్మ మపి చావేక్ష్య" అను శ్లోకము మొదలు "సుఖదుఃఖే సమే కృత్వా" అనుశ్లోకమువరకు నగు గ్రంథముచే జెప్పబడినను, అట్టి లౌకికన్యాయము ప్రకృతతాత్పర్యముచేఁ జెప్పఁబడలేదు. ప్రకృతతాత్పర్యమేమనిన? "న త్వే వాహం జాతు నాసం" అను స్థలమునం దేపరమార్థతత్త్వము చెప్పఁబడి "న జాయతే మ్రియతే వా" అనునది మొదలగు గ్రంథముచే నుపపాదితమో అట్టిపరమార్థాత్మతత్త్వము ప్రకృతము. కాన నట్టి పరమార్థతత్త్వజ్ఞానమునే "ఏషా తేఽభిహితా సాంఖ్యే" అను శ్లోకముచే నుపసంహరించుట సమంజసమగును.

ఈవిధమున పరమార్థబుద్ధి నుపసంహరించుటవలన నేమి ప్రయోజన మని శంకింపవలదు. గీతాశాస్త్రమునకు జ్ఞాననిష్ఠ, కర్మనిష్ఠ యను నిష్ఠాద్వయము విషయము. ఏ భాగముచే జ్ఞాననిష్ఠ చెప్పబడెను? ఏభాగముచే కర్మనిష్ఠ చెప్పబడెను? అనిన నీభాగముచే జ్ఞాననిష్ఠయు, నీభాగముచేఁ గర్మనిష్ఠయు చెప్పఁబడు నను శాస్త్రవిషయవిభాగమును జూపుటకు "ఏషా తేఽభిహితా సాంఖ్యే" అనుదానిచే పరమార్థబుద్ధి నుపసంహరించుచుండెను. (కానఁ బూర్వోక్తాశంకావకాశ మిందు లేదు.)

"జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్" అను నుత్తరగ్రంథముచేత నే జ్ఞాననిష్ఠాకర్మనిష్ఠల విభాగజ్ఞానము సంభవించుచుండ నిచటనే యావిభాగ మొనర్చుట యెందుల కనిన?

ఈస్థలమునందే జ్ఞాననిష్ఠాకర్మనిష్ఠల విభాగమును జూపిన మున్ముందు- "జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్" అని చెప్పబోవు నిష్ఠాద్వయవిషయకశాస్త్రము సుఖముగ బోధించుట కనువగును. అట్టి విషయవిభాగపురస్సరముగ శ్రోతయు గ్రహింపగలుగునను నాశయముచే నిచటనే జ్ఞాననిష్ఠాకర్మనిష్ఠల విభాగము చూపఁబడెను.

---

హన్తి కం" అను గీతావాక్యముచేతను విద్వాంసున కేకర్మయు సంభవింపదని బోధింపబడుటచే నన్నుగూర్చి యుద్ధకర్తవ్యతోపదేశము నీకుచితము గాదు. 'అకర్తయు, నభోక్తయు, శుద్ధస్వరూపము నగు బ్రహ్మస్వరూపమును నేను అనియు, "యుద్ధమునుచేసి తత్ఫలము ననుభవించెదను" అనియు నొకే జ్ఞానము కలుగదు. ఏలయన? జ్ఞానకర్మలు తమఃప్రకాశములవలె విరుద్ధములుగాన వారెంటికి సముచ్చయము సంభవము కాదు. అందుచే నట్టి జ్ఞానమును సంభవింపదు. ఇదియే యర్జునుని యభిప్రాయమని "జ్యాయసీ చేత్కర్మణ స్తే" అను స్థలమునందు స్పష్టమగును. కాన నన్నొకనిని గూర్చియే జ్ఞానకర్మల యుపదేశ ముపపన్నము కాదను శంకను తొలగించుటకు విద్వదవిద్వదవస్థాభేదముచే జ్ఞానకర్మోపదేశ ముపపన్న మగునని శ్రీకృష్ణపరమాత్మ "ఏషా తేఽభిహితా సాంఖ్యే" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

శాంకరభాష్యమ్:—

(2) ఏషా తే తుభ్య మభిహితోక్తా సాంఖ్యే పరమార్థవస్తువివేకవిషయే బుద్ధి ర్జ్ఞానం సాక్షా చ్ఛోకమోహాదిసంసారహేతుదోషనివృత్తికారణమ్ ।

యోగే తు తత్ప్రాప్త్యుపాయే నిస్సంగతయా ద్వంద్వప్రహాణపూర్వక మీశ్వరారాధనార్థే కర్మయోగే కర్మానుష్ఠానే సమాధియోగే చేమా మనన్తర మేవోచ్యమానాం బుద్ధిం శృణు । తాం బుద్ధిం స్తౌతి ప్రరోచనార్థం బుద్ధ్యా యయా యోగవిషయయా యుక్తో హే పార్థ ! కర్మబన్ధం కర్మైవ ధర్మాధర్మాఖ్యో బన్ధః కర్మబన్ధస్తం ప్రహాస్య సీశ్వరప్రసాదనిమిత్తజ్ఞానప్రాప్తే రిత్యభిప్రాయః । ॥౩౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(2) శోకమోహములు, రాగద్వేషములు, కర్తృత్వభోక్తృత్వములు సంసారమనఁబడును. అట్టి సంసారమునకు హేతువు స్వాత్మాజ్ఞానము. అట్టి యజ్ఞాననివృత్తికి సాక్షాద్ధేతువు పరమార్థవస్తువివేకజ్ఞానము. అట్టి విజ్ఞానము నీకింతవరకుఁ జెప్పఁబడెను.

"అశోచ్యా నన్వశోచస్త్వం" అనుశ్లోకముచే నుపక్రమింపఁబడిన పరమార్థాత్మతత్త్వవిషయకమగు జ్ఞాననిష్ఠను "ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిః" అనువాక్యముచే నుపసంహరించి * "యోగే త్విమాం శృణు" అనువాక్యముచే కర్మయోగము నుపక్రమించుచుండెను.

'ఏషా' "న త్వేవాహం" అను శ్లోకములు మొదలు యిరువదియొక్క శ్లోకముచే నీకొఱ కభిహిత మగు సాంఖ్యే=సమ్యక్ ఖ్యాయతే సర్వోపాధిశూన్యతయా ప్రతిపాద్యతే పరమాత్మతత్త్వమనయేతి సాంఖ్యోపనిషత్: తయైవ తాత్పర్యపరిసమాప్త్యా ప్రతిపాద్యతే య స్స సాంఖ్య ఔపనిషదః పురుషః' ఏయుపనిషత్తుచే లెస్సగ సర్వోపాధిశూన్య మగు పరమాత్మతత్త్వము చెప్పఁబడునో యట్టి యుపనిషత్తు 'సంఖ్యా' అని యనఁబడును. అట్టి యుపనిషత్తుచే తాత్పర్యపరిసమాప్తిద్వారమున నెవఁడు చెప్పఁబడునో అట్టి యుపనిషత్ప్రతిపాద్యుఁడగు పురుషుఁడు సాంఖ్యుఁ డనఁబడును. అట్టి పరమాత్మమాత్రవిషయకము, సర్వానర్థనివృత్తికారణము నగు జ్ఞానము నీకొఱకు నాచేఁ జెప్పఁబడెను. ఇట్టి జ్ఞానముకలవానికి "తస్య కార్యం న విద్యతే" అని మున్ముందు చెప్పుట వలన నెచ్చటను కర్మ చెప్పఁబడలేదు. ఇట్టి యాత్మతత్త్వజ్ఞానము నీకు చిత్తదోషమువలన కలుగనిచో నట్టి చిత్తదోషాపనయనద్వారమున నాత్మతత్త్వసాక్షాత్కారముకొఱకు కర్మయోగము నీచే నాచరింపఁదగినది. అట్టి కర్మయోగవిషయకమగు "సుఖదుఃఖే సమే కృత్వా" అనుచోట చెప్పఁబడిన ఫలాభిసంధిత్యాగలక్షణము నగు విస్తారముగ నాచే చెప్పఁబోవు బుద్ధిని వినుము. "యోగే త్విమాం" అనుచోటఁగల 'తు' అను శబ్దముచే పూర్వబుద్ధికి (సాంఖ్యబుద్ధికి) యోగవిషయత్వము లేకపోవుట సూచింపఁబడెను. కానఁ బరిశుద్ధాంతఃకరణకలవానికి జ్ఞానోపదేశము, అపరిశుద్ధాంతఃకరణకలవానికి కర్మోపదేశ మని స్పష్ట మగుచుండ సముచ్చయశంకచే విరోధావకాశ మెటుల సంభవించు నని యాశయము.

* ఈ ౩౯వ శ్లోకమున జ్ఞానప్రాప్తి కుపాయముగఁ గర్మయోగమును జెప్ప మొదలిడెను. కాన కర్మయోగోపక్రమ మీశ్లోకమందని గుర్తించవలెను.

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"యోగ శ్చిత్తవృత్తినిరోధః" అను యోగసూత్రానుసార మిట నుండు "యోగే" అను శబ్దమునకు చిత్తవృత్తినిరోధమని యర్థముకాదు. మఱే మనినః యోగము రెండువిధములు. ఒకటి ఫలము నపేక్షింపక నీశ్వరార్పణముగఁ గర్మల నాచరించుట. రెండవది సమాధి. ఈ రెండను చిత్తశుద్ధిద్వారమున జ్ఞానప్రాప్త్యుపాయములు. అట్టి జ్ఞానప్రాప్త్యుపాయ మగు కర్మయోగముయొక్కయు, సమాధియోగముయొక్కయుఁ జెప్పఁబోవు బుద్ధిని వినుము.

అభీష్టము నిచ్చు బుద్ధియందే శ్రద్ధ జనించును. అట్టి బుద్ధియందే శ్రోతకుఁ బ్రవృత్తియుఁ గలుగును. కాన నట్టి యోగబుద్ధిని 'బుద్ధ్యా యుక్తో యయా పార్థ! కర్మబంధం ప్రహాస్యసి' (ఓయర్జునా! ఏయోగబుద్ధితోఁ గూడినవాఁడవై నీవు ధర్మాధర్మములనెడి బంధమును విడువఁగలవో అట్టి యోగబుద్ధిని జెప్పెద వినుము) అని శిష్యప్రరోచనార్థము యోగబుద్ధిని స్తుతించెను.

తత్త్వజ్ఞానములేనిదే అజ్ఞానమువలనఁ బ్రాప్తించు కర్మబంధము సమూలముగ నివృత్తము కాదుగదా! అట్టియెడ "కర్మానష్ఠానమనెడి కర్మయోగమువలనఁ కర్మబంధ మెట్లు తొలగు" నని శంకింపజనదు.

కర్మయోగ మనగ నీశ్వరార్పణముగఁ జేయు కర్మలయొక్క యనుష్ఠానము. అట్టి కర్మయోగమువలన నీశ్వరానుగ్రహము ప్రవృద్ధమై దానివలన జ్ఞానము గలిగి జ్ఞానమువలన కర్మబంధమునకు కారణమగు నజ్ఞానము దొలఁగ కర్మబంధమునుండి విముక్తుఁ డగునని యాశయము. (కాన పూర్వోక్తాశంకావకాశ మిందు లేదు. ॥౩౯॥

యోగవిషయికబుద్ధిని ఫలకథనద్వారమున "బుద్ధ్యా యుక్తో యయా" అనుదానిచే స్తుతించుచుండెను. వ్యవసాయాత్మిక మగు బుద్ధితోఁ గూడినవాఁడవై యంతఃకరణాపరిశుద్ధిరూపము జ్ఞానప్రతిబంధము నగు కర్మనిమిత్తమైన బంధమును ప్రకర్షచేఁ బ్రతిబంధానుత్పత్తిద్వారమున విడువఁగలవో అట్టి యోగబుద్ధిని వినుమని పూర్వముతో సంబంధము. ఇచట తత్త్వ మిది: కర్మనిమిత్త మగు జ్ఞానప్రతిబంధము ధర్మ మనెడి కర్మచేతనే పోగొట్టుటకు శక్యమైనది. ఈవిషయమునే "ధర్మేణ పాప మపనుదతి" (ధర్మముచే పాపమును నశింపఁజేసికొనును) అను శ్రుతియు చెప్పుచున్నది. శ్రవణాదిరూపవిచారము కర్మాత్మకప్రతిబంధరహితునకు అసంభావనాదిప్రతిబంధమును దృష్టద్వారమున తొలఁగించుచున్నది. కాన నది కర్మప్రతిబంధనిరాకరణకొఱ కుపదేశించుటకు సమర్థమైనది కాదు. అందువలన నీ వత్యంతమలినాంతఃకరణకలవాఁడ వగుటంజేసి నీవు బహిరంగసాధన మగు కర్మమునే చేయుము. నీ కిప్పుడు శ్రవణాదియోగ్యతగూడ లేదు. జ్ఞానయోగ్యత యన్ననో సుతరాం సంభవము కాదు. ఈవిషయమునే శ్రీకృష్ణపరమాత్మ "కర్మ ణ్యేవాధికార స్తే" అని చెప్పఁగలడు.

ఈచెప్పుటవలన సాంఖ్యబుద్ధి కంతరంగసాధన మగు శ్రవణాదికమును విడిచి బహిరంగసాధన మగు కర్మమే భగవంతునిచే నర్జునికొఱ కెందుల కుపదేశింపఁబడె నను శంక తొలఁగింపబడెను. మఱియు కర్మబంధ మగు సంసారమును ఈశ్వరానుగ్రహమువలనఁ గలిగెడి జ్ఞానప్రాప్తిచే విడువఁగల వను ప్రాచీనుల వ్యాఖ్యయందు నధ్యాహారదోషము, కర్మపదవైయర్థ్య మనునవి పరిహృతములు.

శంకరానందీయము:— "వేదావినాశినం నిత్యం" అను శ్లోకముచే బ్రహ్మవేత్త కేమియు చేయఁదగినది లేదని చెప్పి యిపుడు "స్వధర్మ మపి చావేక్ష్య" అనునది మొదలగు గ్రంథముచే కర్మము కర్తవ్య మని నీచే తిరుగ కర్మ విధింపఁబడుచుండెను. దుఃఖభూయిష్ట మగు కర్మమును చేయుటకంటె "కర్తయు, కరణము, కర్మము సర్వము మిథ్యయే" అని సర్వకర్మలను సంన్యసించి తూష్ణీంభావముగ నుండుటయే సుఖ మని యనెదవా? సత్యమే. ఇట్టి జ్ఞానమే "అహం, మమ" (నేను, నాసంబంధమైనది) అనునది మొదలగు నేసంసారభ్రమ కలదో అట్టి భ్రమను తొలఁగించునది. అయినను ఇది యారూఢవిషయము; ఆరురుక్షువిషయము కాదు. కాన ముముక్షువులకు కర్మకర్మసంన్యాసమార్గపరిజ్ఞానముకొఱకు, కర్మసంన్యాసకర్మయోగముల సూచించుటకు, కర్మానుష్ఠానప్రకారమును బోధించుటకు "ఏషా తేఽభిహితా" అని చెప్పుట మొదలిడెను.

"సాంఖ్యే" 'యయా తదక్షర మధిగమ్యతే' అను నీ మొదలగు శ్రుతిప్రసిద్ధము, బ్రహ్మవేత్తలచేతను, ఋషులచేతను లెస్సగఁ బఠింపఁబడు పరవిద్య సంఖ్య యనంబడును. అట్టి "యత్త దద్రేశ్య మగ్రాహ్యం" అనునది మొదలగు పరవిద్యచేఁ బ్రతిపాదింపఁబడు నిర్విశేషపరబ్రహ్మము సాంఖ్య మనఁబడును. అట్టి పరబ్రహ్మవిషయక మగు నేబుద్ధి (జ్ఞానము) "న జాయతే మ్రియతే వా కదాచిత్" అను నీ మొదలగు గ్రంథముచే నీకొఱకుఁ జెప్పఁబడెనో; అట్టి బుద్ధి యారూఢునకేగాని యారురుక్షువునకుఁ గాదు. ఆరురుక్షువు వగు నీకు చిత్తశుద్ధికొఱకు శ్రద్ధాపూర్వకముగ నీశ్వరార్పణబుద్ధితోను, నిరభిమానపురస్సరముగను, నిష్కామతతోను, సుఖదుఃఖాదులయందు సమబుద్ధితోను కర్మయోగమే కర్తవ్యము. నీకు జ్ఞానయోగము కర్తవ్యము కాదు. కాన నోయర్జునా! చెప్పఁబోవు కర్మయోగవిషయబుద్ధిని వినుము. కర్మయోగబుద్ధియెట్టిదనిన: నీవు కర్మయోగబుద్ధితోఁగూడినవాడవై చెప్పబోవు నుపదేశప్రకారము కర్మయోగమునం దున్నవాఁడవై కర్మ మనెడి బంధమును విడువఁగలవు. వైదికకర్మానుష్ఠానముచే సంభావిత మగు చిత్తశుద్ధిచే నుత్పన్న మగు నాత్మజ్ఞానముయొక్క బలముచే బంధకములగు నిఖిల కర్మలవలన నిష్క్రాంతుఁడ వగుదువు. కర్మబంధ మనఁగ "జన్మమృత్యుజరాదిభిః పునః పునః పురుషం బధ్నాతి యోజయతీతి బంధః; కర్మైవ బంధః కర్మబంధః" జన్మమృత్యుజరాదులచేఁ బురుషుని మాటిమాటికి బంధించునది బంధ మనఁబడును. అట్టిది కర్మమే కాన కర్మము బంధ మనఁబడు నని 'కర్మబంధః' అను శబ్దమున కర్థము.

"సర్వకర్మలకు కర్తయు, కారయితయు, కర్మఫలభోక్తయు పరమేశ్వరుఁడే" అను నిశ్చయముచే కర్మబంధము నశించుచుండ నిష్క్రియాత్మజ్ఞానముచేఁ గర్మబంధమునుండి ముక్తుఁ డగునని మధ్యఁనుండు కర్మబంధమున కాత్మజ్ఞాననాశ్యత్వమును చెప్పుట యెట్లు పొసగు ననిన— ఈవిషయమున విన్నదుగడగియున్నది. (1) కర్మల నీశ్వరార్పణము చేయుటచే కర్మబంధము నివృత్త మగు ననెదవా? (2) లేక 'ఈశ్వరుఁడే కర్తయు, కారయితయు' అను వచనమాత్రముచే కర్మబంధము నివృత్తమగు ననెదవా? 'నాదత్తే కస్యచి త్పాపం నచైవ సుకృతం విభుః' భక్తులచే నర్పింపఁబడు సుకృతదుష్కృతముల నీశ్వరుఁడు స్వీకరించడని యీగీతావచనమే బోధించుచుండ పరమేశ్వరార్పణము చేసినంతమాత్రమున నైష్కర్మ్యము సంభవింపదు. కాన పరమేశ్వరార్పణముచే కర్మబంధము నివృత్త మగునను ప్రథమపక్షము పొసఁగదు. పరమేశ్వరార్పణము చేసినయెడల యీశ్వరుఁడు స్వీకరించు ననినను అనంతకోటిబ్రహ్మకల్పములయం దాచరింపఁబడినట్టియు (భక్తి యీజన్మమునందే కలదు కాన పూర్వజన్మములందు భావిజన్మభక్తి ననుసరించి యర్పణము సంభవింపనందున), పూర్వజన్మములయం దర్పితము కానట్టి సుకృతాదులకు నివృత్తి సంభవింపదు. ఎపుడు జన్మ మారబ్ధ మాయెనో అపుడే భక్తియు సంభవించు ననెదవా? అట్లైనచో జన్మాంతరంబునందునకూడ నట్టి భక్తి కలదు కాన నాజన్మమునందే సుకృతదుష్కృతముల నీశ్వరార్పణము చేయుటచే నపుడే ముక్తి సంభవించెడిని. మఱియు "లోకత్రయాధిపతి మప్రతిమప్రభావ మీష త్ప్రణమ్య శిరసా ప్రభవిష్ణు మీశం। జన్మాంతరప్రళయకల్పసహస్రజాత మాశు ప్రణాశ ముపయాతి నరస్య పాపమ్॥" (లోక

శ్రియాధిపతియు, అప్రతిమప్రభావుఁడును, సమర్థుఁడును అగు పరమేశ్వరునికి శిరసా ఒక సాష్టాంగప్రణామ మొనరించినచో ననేకబ్రహ్మకల్పములయందు ప్రాప్తించిన యనేకకోట్లజన్మములయం దాచరింపఁబడిన నరుని పాపము నశించును.) అనెడి సత్కృత్ప్రణతి సంసారమహాసాగరతారక మను భక్తవాక్యముల కప్రామాణ్యము గూడ ప్రాప్తించును. అందునను "ప్రణాశ ముపయాతి నరస్య పాపం" అనుటచేఁ బాపమే నశించును కాని పుణ్యము నశింపనేరదు (పుణ్యము నశించనిచో నైష్కర్మ్య మెటుల సంభవించును? సంభవించదనియే యాశయము.) "అయుద్ధేన హతో వాలీ తస్యేదం కర్మణః ఫలం" (వాలి యుద్ధము లేకుండగనే చంపఁబడెను. ఇది వాని కర్మఫలము) అని స్వకృతకర్మయే యపరిహార్య మగుచుండ నీశ్వరునకు పరకృతకర్మను పరిహరించుట సంభవము కాదు. కాన నీశ్వరుఁడే కర్తయు, కారయితయు అను వచనమాత్రముచే కర్మబంధము నివృత్త మగునను ద్వితీయపక్షము నిరస్తము (తొలఁగించఁబడెను.)

కాన నవిక్రియాత్మదర్శనమువలననే పురుషునకు సర్వకర్మనివృత్తి యని యొప్పుకొనవలయును. ఈ విషయమునే "సర్వం పాప్మానం తరతి, క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" అను శ్రుతులును చెప్పుచున్నవి. అట్లైనచో "బుద్ధ్యా యుక్తో యయా పార్థ! కర్మబంధం ప్రహాస్యసి" (ఏ యోగవిషయకబుద్ధితోఁ గూడినవాఁడవై కర్మబంధము విడువఁగలవో) అను గీతావాక్యమునకు గతి యేమనిన? ఫలాభిసంధిని విడిచి చెయ్యబడిన కర్మ బంధమునకు కాదని కర్మస్తుతిచే ముముక్షువులచే నిష్కామపూర్వకముగ చిత్తశుద్ధికొఱకు కర్మ చేయఁదగినదని కర్మవిధిపరత్వమే యా గీతావచనమునకు గతియని చెప్పెదము. కాన నిష్క్రియాత్మదర్శనమువలననే కర్మబంధనివృత్తి యని సిద్ధము.

నీలకంఠీయము:— ఈ విధమున నర్జునసంబంధమైన పూర్వోక్తమోహద్వయము తొలఁగింపఁబడెను. అందు 'కం ఘాతయతి హన్తి కం' అనువాక్యముచే నాత్మకు కర్తృత్వకారయితృత్వములు సంభవింపవని చెప్పఁబడెను. అనంతరమున "తతో యుద్ధాయ యుజ్యస్వ" అను వాక్యముచే యుద్ధమునందు నియోగము చెప్పఁబడెను. అకర్తయు, ఆకాశమువలె సర్వగతము నగు నాత్మకు నియోజ్యత్వము సంభవింపనందునఁ బరస్పరవిరుద్ధ మీ చెప్పుట యను శంకను అధికారభేదముచే నుభయమును(కర్తృత్వకారయితృత్వభావములు నియోజ్యత్వమును) స్థాపనచేయుచు తొలఁగించుచుండెను.

ఉపనిషద్గమ్యమగు పరమాత్మయొక్క జ్ఞానము "అశోచ్యా నన్వశోచస్త్వం" అనునది మొదలుకొని "స్వధర్మ మపి చావేక్ష్య" అను గ్రంథమునకు పూర్వమగు గ్రంథముచే నీకొఱకుఁ జెప్పఁబడెను. అట్టి జ్ఞానము సంసారనివర్తకము. "సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే" అను వాక్యముచే బోధింపఁబడు లక్షణముకల యోగము విషయముగాఁ గలిగినట్టియు, "స్వధర్మ మపి చావేక్ష్య" అను శ్లోకము మొదలుకొని చెప్పఁబడినట్టియు, విస్తారముగ ముందుగ్రంథముచే చెప్పఁదలచినట్టియు బుద్ధిని వినుము.

అట్టి బుద్ధినే "బుద్ధ్యా యుక్తో యయా పార్థ! కర్మబంధం ప్రహాస్యసి" అను నీశ్లోకోత్తరార్ధముచే స్తుతించుచుండెను.

"తస్యైవాత్మపదం విదిత్వా న లిప్యతే కర్మణాఽపాపకేన" అను శ్రుతి కర్మబంధనాశక మాత్మజ్ఞానమని బోధించుచున్నది. కర్మయోగ మన్ననో కర్మబంధమును దృఢపరచును. కాన యోగబుద్ధిచే కర్మబంధము నశించునని చెప్పుట యెట్లు పొసగును? అనిన శ్రుతిబలమువల్లనని చెప్పెదము. ఆశ్రుతి యెట్టి దనిన "ఈశా వాస్యమిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్ । తేన త్యక్తేన భుంజీథా మాగృధః కస్యచి ద్ధనం ॥ కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతగ్ం సమాః । ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మ లిప్యతే నరే" (ఈశ్వరునిచే నిఖిల ప్రపంచము వ్యాప్తమైనది. కాన నెవఁడును దేనిని స్వేచ్ఛచే జేయుటకు సమర్థుఁడు కాదు. అందుచే నంతటను

గీ॥ నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే ।
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥ ॥౪౦॥

పదవిభాగము:— న- ఇహ- అభిక్రమనాశః- అస్తి- ప్రత్యవాయః- న- విద్యతే- స్వల్పం- అపి- అస్య- ధర్మస్య- త్రాయతే- మహతః- భయాత్ । ॥౪౦॥

ప్రతిపదార్థము:— ఇహ=మోక్షమార్గమగు నీకర్మయోగమునందు; అభిక్రమనాశః, అభిక్రమ=ప్రారంభముయొక్క; నాశః=నాశము; నాస్తి=లేదు; ప్రత్యవాయః=పాపము; నవిద్యతే=లేదు; అస్య=ఈ; ధర్మస్య=కర్మయోగమనెడి ధర్మముయొక్క; స్వల్పమపి=స్వల్పమగు ననుష్ఠానముకూడ; మహతః=గొప్పదియగు; భయాత్=జన్మమరణాదిరూపసంసారమునుండి; త్రాయతే=రక్షించుచున్నది. ॥౪౦॥

శాంకరభాష్యమ్:—

కించాన్యత్.—నేహాభీతి । నేహ మోక్షమార్గే కర్మయోగేఽభిక్రమనాశోఽభిక్రమణమభిక్రమః ప్రారంభస్తస్య నాశో నాస్తి । యథా కృష్యాదేర్యోగవిషయే ప్రారంభస్య నానైకాన్తిఫలత్వమిత్యర్థః । కించ నాపి చికిత్సావత్ప్రత్యవాయో విద్యతే । కింతు భవతి స్వల్పమప్యస్య యోగధర్మస్యానుష్ఠితం త్రాయతే రక్షతి మహతస్సంసారభయాజ్జన్మమరణాదిలక్షణాత్ ॥ ॥౪౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"కర్మానుష్ఠానమునకు నియతమగు ఫలము సంభవింపనందున యది యకించిత్కరము. (వ్యర్థము) మఱియు జీవహింసాద్యనేకానర్థకలుషిత మగుటచే గూడ నది దుష్టము. కాన నట్టి యోగబుద్ధి నవ్మదగినదికా" దని శంకింపవలదు.

పరంపరయా మోక్షసాధనమగుటచే నీకర్మయోగముయొక్క ప్రారంభమునకు నాశము లేదు. కాన యోగబుద్ధి నమ్మదగినది.

మమత లేనివాఁడవై భోక్తృత్వ కర్తృత్వాభిమానమును పరిత్యజించి భోగముల ననుభవింపుము. కర్మలను చేయుము. ఈవిధమున కర్మలను చేయు నీకు కర్మలోపము లేదు. ఇంతకంటె నుపాయాంతరము లేదు. ఇట్టి రీతున చేయు మనుష్యునకు కర్మలేపము సంభవింపదు) అని శ్రుతి చెప్పుచున్నది. * కాన కనకకార్ష్ణాయసమువలె నొకానొకవిశేషముతో కూడిన కర్మమే సజాతీయకర్మ నాశకమగును. కాన కర్మయోగముచే కర్మబంధమును విడువఁగలవని చెప్పుట సమంజసమే. ॥౩౯॥

—• ౨వ అధ్యాయము ౪౦ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన" అనుశ్రుతిచే వివిదిషను, జ్ఞానమును నుద్దేశించి సంయోగపృథక్త్వన్యాయముచే సర్వకర్మలు వినియుక్తములు. అందంతఃకరణపరిశుద్ధి ద్వారము కాన నితరులకు కర్మానుష్ఠానము విధించబడుచున్నది.

* ఇనుముచేఁ జేయఁబడిన యాభరణమునకు బంగారము పూతపూసినవు డాయాభరణమును స్వీకరించినవాఁడు పూర్వమునందుండు అయసాభరణమును విడుచును.

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"అనేకాంతరాయములు సంభవించుటచే కర్మానుష్ఠానసమయమున సమాధి సంభవించుట దుర్ఘటము. కర్మతోఁగూడ సమాధి సంభవింపనందున సమాధిఫలమగు తత్త్వసాక్షాత్కార మొక జన్మమునందు సంభవింపనేరదు. కాన యోగి యోగమునుండి భ్రంశమునొంది యనర్థమునందుఁ బ్రవేశించుననియు, మఱియు ఫలము సంభవించు నను నూహచే కృషివాణిజ్యములు సలిపెదరు. అట్టి కృషివాణిజ్యములకు ఫల మొకానొకప్పుడు ప్రాప్తించదు. కాన కృషివాణిజ్యములు నియతఫలములుకలవి కానేరవు. అటులే వైదికకర్మకుఁగూడ ఫలనియమము లేనందున కర్మ మకించిత్కర" మను నాశంకయుఁ జేయ వీలుపడదు.

కృషివాణిజ్యాదులకు ఫలము నియతము కాకున్నను కర్మయోగము శాస్త్రవిహితమగుటంబట్టి ఫలమునియతము. అట్లు కానిచో "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అను శ్రుతికి వైయర్థ్యము ప్రాప్తించెడిని. కాన కర్మయోగప్రారంభము వ్యర్థమను శంక సరియైనది కాదు.

యాగాద్యనుష్ఠానము పశుహింసా ద్యనేకానర్థకలుషిత మగుటంబట్టి దుష్టమైనది. కాన నది పరిత్యాజ్య మను శంకయుఁ సరియైనది కాదు.

వైద్యుడు చికిత్సను జేయునపుడు కర్మపరిపాకము దెలిసికొనుటకు శక్యము కానందున రోగికి రోగ మధికము కావచ్చును. లేదా రోగి మృతి నొందవచ్చును. అందుచే చికిత్స యనునది ప్రత్యవాయ (పాప) జనకము. కర్మమువిహితముగాన గర్మప్రారంభమునం దట్టివిధమున బ్రత్యవాయము సంభవింపదు. ఈయుపన్యాసమువలన దేలినయాశయమేమి: కృష్యాదు లనియత ఫలము లైనటుల విహితకర్మ మనియతఫలకము కాదు. నియతమగు ఫలముకలదియే యనియు, ప్రత్యవాయజనకమగు చికిత్సాదులవలె గాక విహితకర్మము దోషములేనిదనియు నాశయము.

అట్టి కర్మలవిషయమై 'తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవ మేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే' అను శ్రుతిచే ఫలనాశము బోధింపబడుచున్నది. కాన జ్ఞానమును వివిదిష నుద్దేశించి క్రియమాణమగు యజ్ఞాదికము కామ్యమగుటంజేసి అట్టికర్మకుయత్కించిదంగ వైకల్యమున్నను వైగుణ్యముసంభవించును కాన సర్వాంగములతోగూడ ననుష్ఠింపదగినది. 'యజ్ఞేన' అను వాక్యముచే విహితమగు సర్వకర్మ లొకనిచే బురుషాయుషపర్యవసానపర్యంత మనుష్ఠించుటకు శక్యము కానందున "కర్మబంధం ప్రహాస్యసి" అని కర్మబంధపరిత్యాగము నాశించుట యెట్లు పొసగు" ననుశంకను శ్రీకృష్ణపరమాత్మ "నేహాభిక్రమనాశోఽస్తి" అనుశ్లోకముచేఁ దొలగించుచుండెను.

"అభిక్రమ్యతే కర్మణా ప్రారభ్యతే యత్కర్మఫలం సోఽభిక్రమః" కర్మచేప్రారంభింపబడుకర్మఫల మభిక్రమమనబడును. నిష్కామకర్మయోగఫలము పాపక్షయరూపపరిశుద్ధస్వరూపమగుటచే నదిలోకశబ్దవాచ్యమగు భోగ్యము కానేరదు. కాననీకర్మయోగమునందు "తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే" అను శ్రుతిబోధితమగు ఫలనాశము సంభవింపదు. కర్మయోగమున వివిదిషజన్మించును. అది వేదనపర్యన్త ముండును. వేదన కలిగినవెంటనే యావేదనవలన (జ్ఞానమువలన) నజ్ఞానము నశించును. కాన జ్ఞానమున కజ్ఞాననాశము ఫలము. కాన నట్టి జ్ఞానము స్వఫలమగు నజ్ఞాననాశమునివ్వనిదే నశింపనందునవిష్కామకర్మయోగమునందు ఫలనాశములేదనిలెస్సగ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అందుచే గర్మానుష్ఠానమువలన బ్రాప్తించు ఫలమెట్టిది? అనిన?- "సర్వపాపేషు సక్తోఽపి ధ్యాయ న్నిమిష మచ్యుతమ్। యతి స్తపస్వీ భవతి పంక్తిపావనపావనః॥" (సర్వ పాపములయందు సక్తుఁడైనను నిమిషమాత్రమైనను అచ్యుతుని ధ్యానించినచో నట్టివాఁడు యతియు, తపస్వియు, పంక్తిపావనులను పవిత్రింపచేయువాడును నగును.) అను స్మృత్యను సారము శాస్త్రవిహితధర్మమును పరమేశ్వరార్పణముగ నాచరించిన నట్టి ధర్మానుష్ఠానము జ్ఞానోత్పత్తిద్వారమున- గొప్పదియగు, జననమరణప్రవాహరూపము నగు సంసారమునుండి రక్షించుచున్నది. అనగా కర్మయోగమువలన జ్ఞానము, జ్ఞానమువలన మోక్షము ప్రాప్తించును. కాన కర్మయోగము వ్యర్థమను శంక దూరముగఁ దొలగించబడెను. ॥౪౦॥

జెప్పబడెను. ఈవిషయమే "తద్యథేహేతి యా నిందా సా ఫలే నతు కర్మణి। ఫలేచ్ఛాంతు పరిత్యజ్య కృతం కర్మ విశుద్ధికృత్" "తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే" (అని చెప్పబడిననింద ఫలమునందే కాని కర్మ యందు సంభవింపదు. ఫలమునం దిచ్ఛనువదలి చేసినకర్మ యంతఃకరణపరిశుద్ధిని చేయును.) అని చెప్పబడు చున్నది. ఆవిధముననే "ప్రత్యవాయో న విద్యతే" అంగవైగుణ్యమువలన ప్రాప్తించెడివైగుణ్యమీకర్మయోగము నందు లేదు. ఇచట తత్త్వమిది: నిత్యకర్మలకే యుపాత్తదురితక్షయద్వారమున వివిదిషనుగూర్చి వినియోగము "తమేతం వేదానువచనేన" అనువాక్యముచే జెప్పబడెను. నిత్యకర్మలయందు ఏయంగము లోపింపకుండగ నాచ రింపవలెనని నియమములేదు. కామ్యములకుకూడ సంయోగపృథక్త్వన్యాయముచే వినియోగమను పక్షమునందు కూడ ఫలాభిసంధి లేమింజేసి కామ్యములుకూడ నిత్యతుల్యములే యగును. కామ్యాగ్నిహోత్రమునకు, నిత్యాగ్ని హోత్రమునకు స్వతః ఎట్టివిశేషములేదు. మరేమనిన? కామనచేననుష్ఠించిన నాయగ్నిహోత్రము కామ్యమనియు, కామనారహితముగ ననుష్ఠించిన నాయగ్నిహోత్రమే నిత్యమనియు యనబడును. ఈపక్షద్వయమును వార్తికకారులు "వేదానువచనాదీనా మైకాత్మ్య జ్ఞానజన్మనే। త మేత మితి వాక్యేన నిత్యానాం వక్ష్యతే విధిః॥ యద్వా వివి దిషార్థత్వం కామ్యానా మపి కర్మణః। త మేత మితి వాక్యేన సంయోగస్య పృథక్త్వతః॥" అని చెప్పియుండిరి. కాన ఫలాభిసంధిపూర్వకముగఁ జేయు కర్మమునందే సర్వాంగముల నాచరింపవలయునను నియమముండుటచే తద్విలక్షణము, శుద్ధ్యర్థము నగు కర్మమునందు ప్రతినిధ్యాదులచే గర్మ సంపూర్తి యగుచుండ నంగవైగుణ్యము వలన గలిగెడి ప్రత్యవాయము ప్రాప్తించదని యర్థము.

శుద్ధ్యర్థము "త మేతం వేదానువచనేన" అను వాక్యముచే విహితమగు ధర్మములో యత్కించిత్తైనను యథాశక్తి భగవదారాధనార్థ మనుష్ఠింపబడినచో నది భగవదనుగ్రహ సంపాదనద్వారమున నట్టి యత్కించి త్కర్మానుష్ఠానపరుని సంసారభయమునుండి రక్షించుచున్నది. ఈవిషయముసే "సర్వపాపప్రసక్తోఽపి ధ్యాయ న్నిమిష మచ్యుతమ్। భూయ స్తపస్వీ భవతి పంక్తి పావనపావనః॥" (అనేకపాపములతో గూడినవాడైనను నిమిషకాల మచ్యుతుని ధ్యానించినచో తిరిగి తపస్వియై పంక్తిపావనులకు పావనుఁడై యగును.) అను స్మృతి చెప్పుచున్నది. "త మేతం వేదానువచనేన" అను వివిదిషావాక్యమునందు నిఖిలకర్మలు చేయవలెనని విధి లేమిం జేసి యశుద్ధితారతమ్యముచే ననుష్ఠానతారతమ్య ముపపన్న మగుచున్నది. (అనగా పాపము అధికమున్నయెడల కర్మానుష్ఠాన మధికము; కొద్దిపాపము లున్నచో కర్మానుష్ఠాన మల్పమని యుపపన్న మగుచున్నది). కాన "కర్మ బంధం ప్రహాస్యసి" కర్మబంధమును విడువగలవని లెస్సగ జెప్పఁబడెను.

శంకరానందీయము:— పూర్వమునందు చెప్పఁబడిన కర్మయోగమునే ముముక్షుప్రవృత్తికొఱకు నుతించుచుండెను—మోక్షైకప్రయోజనమగు నీకర్మయోగమునందు కర్మారంభము నిష్ఫలము కాదు. కృషివాణిజ్యాదుల ప్రారంభించినచో నొకానొకప్పు డొకానొకస్థలమునందు ఫలము ప్రాప్తించును: ఒకప్పుడు ఫలము ప్రాప్తింపకుండును. కాన కృషివాణిజ్యాదుల ప్రారంభమునకు ఫలనియమములేదు. భోజనము చేసినచో తృప్తినియమముగ సంభవించును. అదేవిధమున నీకర్మయోగము ఫలనియమముకలది. ఈకర్మయోగమునందు జ్ఞానాజ్ఞానకృతము, కర్మనియమాదిలోపకృతము నగుదోషము రాజాజ్ఞవలె ననర్థమును సంపాదించదు. భక్తిచే క్రియమాణము, ఈశ్వరారాధనరూపము, వేదోక్తమునగు ధర్మము స్వల్పమైనను (అనగా కేవలాగ్నిహోత్రమైనను లేక, స్మార్తమగు ఔపాసనమైనను) శ్రద్ధచే నాచరించినచో నట్టికర్మ చిత్తశుద్ధిజననద్వారమున జ్ఞానహేతువై కర్తను జననమరణదుఃఖమునుండి రక్షించును. కాన ముముక్షువు శ్రౌతకర్మమునుగాని, స్మార్తకర్మమునుగాని, ఉభయముగాని శ్రద్ధాభక్తులచే కామనారహితముగ నీశ్వరప్రీతికొఱ కవశ్యము యథాశక్తి చేయనగును. ఈశ్వరప్రీతినిమిత్త మాచరింపబడిన కర్మచే పురుషుఁడు తరించును. మరియొకవిధమున తరింపడని సూచింపబడెను.

నీలకంఠీయము:— ఈకర్మయోగమునే “నేహాభిక్రమనాశోఽస్తి” అనుశ్లోకముచేఁ జెప్పుచుండెను. కర్మబంధనాశనిమిత్తమగు కర్మయోగమునను ష్ఠించుచో కర్మారంభనాశము లేదు. అనగా కృష్యాదిప్రారంభము ఫలము నివ్వకయే నశింపవచ్చును. కర్మయోగారంభమన్ననో ఇష్టఫలమగు జ్ఞానద్వారమున నైష్కర్మ్యసిద్ధినికలుగఁజేయకుండ నశించనేరదు. (నైష్కర్మ్యసిద్ధినికలిగించుననియే యాశయము.)

ఈకర్మయోగముకూడ కామ్యకర్మాంతఃపాతి యగుటఁజేసి దీనినే యాచరించువానికి నిత్యకర్మాననుష్ఠానమువలన గలిగెడి ప్రత్యవాయము సంభవించెడిని. మఱియు ఆకర్మయోగ మొకసారియే యనుష్ఠించుటచే సకృదనుష్ఠితమున నొకఫలమే ప్రాప్తించునను నియమముచే బంధనాశము, ప్రత్యవాయపరిహారము ననెడి ఫలద్వయము ప్రాప్తించనేరదు.” అను నాశంకను “ప్రత్యవాయో న విద్యతే” అను వాక్యముచే తొలగించుచుండెను.

“తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన, దానేన, తపసాఽనాశకేన” అను శ్రుతిచే సంయోగపృథక్త్వన్యాయముచే “దధ్నేంద్రియకామస్య జుహుయాత్” (వీర్యము వృద్ధిపొందవలెననికోరువారు పెరుగుచే నగ్నిహోత్రమును చేయవలెను.) అనుశ్రుతిచే నిత్యకర్మకు పెరుగు వీర్యార్థమగునటుల నిత్యమగుకర్మలు వినియోగబలమున వివిదిషార్థముసిద్ధించును. కాన కామ్యమగు ప్రయోగముచేతనే నిత్యముకూడ సిద్ధించుచుండ నిత్యాకరణనిమిత్తమగు ప్రత్యవాయముకాని, సర్వాంగాననుష్ఠాననిమిత్తమగుప్రత్యవాయముకాని నిత్యములుచేయుటవలన ప్రాప్తించవు. ‘నిత్యములను యథాశక్తిని యనుష్ఠింపవలయు’ నను యనుజ్ఞవలన నిత్యములలో కొన్ని నిత్యకర్మల నాచరించినను ప్రత్యవాయము ప్రాప్తించదు. వార్తికగ్రంథమునందైతే కామ్యములకుకూడ నీవిషయమున వినియోగముకలదని ‘వేదానువచనాదీనా మైకాత్మ్యజ్ఞానజన్మనే। తమేత మితి వాక్యేన నిత్యానాం వక్ష్యతే విధిః॥ యద్వా వివిదిషార్థత్వం కామ్యానా మపి కర్మణాం। తమేతమితివాక్యేన సంయోగస్య పృథక్త్వతః” ఈవాక్యములచే చెప్పబడెను. ఈపక్షమున కామ్యములుగూడ నిత్యములతో సమానమగుటఁజేసి నిత్యకర్మలవలె కామ్యములకు యథాశక్త్యనుష్ఠానము సంభవింపగలదు. కాన సర్వాంగాననుష్ఠానమున గలిగెడిప్రత్యవాయము సంభవింపదు. ఈకర్మయోగమున యత్కించిదనుష్ఠితమైనను అదియనుపభుక్తబీజమై (అనుభవించని బీజసమానమై) ‘జన్మజన్మాంతరాభ్యస్తం దాన మధ్యయనం తపః। తే నైవాభ్యాసయోగేన తచ్చైవాభ్యసతే పునః” అను శ్రుత్యనుసారము ఉత్తరోత్తరసంస్కారాధానద్వారమున స్వసజాతీయవృద్ధికి హేతువై కామాదిదోషపక్షణద్వారమున సంసారరూపమహాభయమునుండి రక్షించును. కాన సాంఖ్యయోగానధికారిచే కర్మయోగమేయనుష్ఠింపదగినదని భావము ॥౪౦॥

గీ॥ వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన! ।
బహుశాఖా హ్యనంతా శ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్ ॥ ॥౪౧॥

పదవిభాగము:— వ్యవసాయాత్మికా- బుద్ధిః- ఏకా- ఇహ- కురునన్దన!- బహుశాఖాః- హి- అనంతాః- చ- బుద్ధయః- అవ్యవసాయినామ్ । ॥౪౧॥

ప్రతిపదార్థము:— హేకురునన్దన!=ఓయర్జునా!; ఇహ=ఈమోక్షమార్గవిషయమై; బుద్ధిః=సాంఖ్యబుద్ధియు, చెప్పఁబోవు యోగబుద్ధియు; వ్యవసాయాత్మికా=నిశ్చయాత్మికమైనది; ఏకా=ఒక్కటి (విపరీతములగు బుద్ధిశాఖావిశేషములను తొలగించుటయందు సమర్థమైనది); అవ్యవసాయినాం=ప్రమాణమువలన జనించెడి వివేకబుద్ధి లేనివారలయొక్క; బుద్ధయః=బుద్ధులు; బహుశాఖాః=అనేకభేదములుఁగలవి; అనంతాశ్చహి=అనంతమైనవియు. ॥౪౧॥

శాంకరభాష్యమ్:—

యేయం సాంఖ్యే బుద్ధి రుక్తా యోగే చ వక్ష్యమాణలక్షణా సా- వ్యవసాయేతి । వ్యవసాయాత్మికా నిశ్చయస్వభావా వై కైవ బుద్ధి రితరవిపరీతబుద్ధిశాఖాభేదస్య బాధికా సమ్యక్ప్రమాణజనితత్వా దిహ శ్రేయోమార్గే హేకురునందన! । యాః పున రితరా బుద్ధయో యాసాం శాఖాభేదప్రచారవశా దనన్తోఽపారోఽనుపరత స్సంసారో నిత్యప్రతతో విస్తీర్ణో భవతి, ప్రమాణజనితవివేకబుద్ధినిమిత్తవశా చ్చోపరతా స్వనన్తభేదబుద్ధిషు సంసారోఽప్యుపరమతే । తా బుద్ధయో బహుశాఖా బహ్వ్య శ్శాఖా యాసాం తా బుద్ధిశాఖా బహుభేదా ఇత్యేతత్ । ప్రతిశాఖాభేదేన హ్యనన్తాశ్చ బుద్ధయః కేషా మవ్యవసాయినాం ప్రమాణజనితవివేకబుద్ధిరహితానా మిత్యర్థః ॥ ॥౪౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"సాంఖ్య బుద్ధి, యోగబుద్ధి అను రెంటికన్న వేరుగ కణాదగౌతమశాస్త్రప్రసిద్ధము లగు బుద్ధు లనేకము లుండ వానిని విడిచి సాంఖ్యబుద్ధి యోగబుద్ధులను మాత్రము శ్రీకృష్ణపరమాత్మ యెటుల నుపదేశించుటకు దొరకొనె" నని శంకింపఁజనదు.

పూర్వమునందుఁ జెప్పఁబడిన సాంఖ్యబుద్ధియు, ముందు జెప్పఁబోవు యోగబుద్ధియు సమ్యక్ప్రమాణమువలనఁ బుట్టిన వగుటఁజేసి నిశ్చయాత్మకములై, ఏకరూపమై తనకంటె భిన్నమగు విపరీతబుద్ధులయొక్క శాఖావిశేషములను బాధించి శ్రేయోమార్గమునకు సమర్థము లగును.

—, ౨వ అధ్యాయము- ౪౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ,—

మధుసూదనసరస్వతీయము:— "త మేతం వేదానువచనేన" అను వాక్యమునందు యజ్ఞదానాది నిఖిలకర్మము లాచరింపవలయు నని సముచ్చయమును విధించు శబ్దము లేమింజేసి యశుద్ధితారతమ్యముచే ననుష్ఠానతారతమ్య ముపపన్న మగుటఁజేసి "కర్మబంధం ప్రహాస్యసి" (కర్మబంధమును విడువఁగలవు) అని చెప్పుట యుక్తమే యని పూర్వశ్లోకవ్యాఖ్యాసమయమున నుడువఁబడెను. ఈవిషయమునే యుపపాదనచేయుటకు "త

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అట్లుకాక స్వకపోలకల్పితములు, విపరీతప్రమాణజనితములు నగు బుద్ధుల శాఖావిశేషములు సంసారహేతువు లగును. అట్టి విపరీతబుద్ధులను నశింపఁజేయుటయందు సాంఖ్యబుద్ధి యోగబుద్ధులు సమర్థములైనవి. అందుచే శ్రీకృష్ణపరమాత్మ సాంఖ్యబుద్ధిని చెప్పి యోగ బుద్ధిని జెప్పుటకు మొదలిడెను. (ఉపాయభూతమగు యోగబుద్ధియు, ఉపేయభూతమగు సాంఖ్య బుద్ధియు దోషరహితమగు వేదవాక్యమువలన జనించెడివి. కాన సంసారహేతు వగు నవిద్యకు సాక్షాత్తుగ గాని, పరంపరయా గాని బాధకములగుటచే యాసాంఖ్యబుద్ధిని, యోగబుద్ధిని శ్రీకృష్ణపరమాత్మ చెప్పుటకు దొరకొనె నని యాశయము.)

సాంఖ్యబుద్ధి యోగబుద్ధులకన్న వ్యతిరిక్తములు, స్వకపోలకల్పితములు, అప్రమాణజనితములు నగు బుద్ధులయొక్క ప్రసక్తానుప్రసక్తిచేఁ బుట్టెడి బుద్ధిపరిణామవిశేషముల ప్రచారముల వలన సంభవించెడి సంసార మనంతము (సమ్యగ్జ్ఞానము లేనిదే నివృత్తముకానిది; అపారము (కార్యము కనబడుచున్నను వస్తురూపమగు కారణములేనిది); నిత్యము (వ్యాపించి విస్తీర్ణమగు నది); అనుమానాగమప్రమాణములవలన పదార్థపరిశోధనము, దానివలన వివేకబుద్ధియు, దాని వలన సమ్యక్ప్రబోధము జనించి దానివలన నాయనంతబుద్ధులు నివృత్తినొంద నాశ్రయరహితమై యట్టిసంసారము నివృత్తమగును. అట్టి సంసారహేతువు లగు విపరీతబుద్ధులు ప్రతిశాస్త్రము నందును వృక్షశాఖలువలె ననంతము లని జెప్పఁబడెను శాస్త్రభేదముచే భిన్నములగు ననంత బుద్ధులు సమ్యక్ప్రమాణజనితబుద్ధివిహీనులకు సంభవించునని యాశయము.

(కాన నవ్యవస్థితములగు నట్టి బుద్ధులు సంసారహేతువులని తలచి శ్రీకృష్ణపరమాత్మ సంసార నివృత్తికి సాక్షాద్ధేతువగు సాంఖ్యబుద్ధిని జెప్పి యట్టి సాంఖ్యబుద్ధికి హేతువగు యోగబుద్ధిని జెప్పుట కారంభించె నని యాశయము.) ॥౪౦॥

మేతం వేదానువచనేన" అను వాక్యవిహిత మగు యజ్ఞదానాదికర్మముల కేకార్థత్వమును "వ్యవసాయాత్మికా బుద్ధిః" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

ఓయర్జునా! "త మేతం వేదానువచనేన" అను వాక్యమునందుగల తృతీయావిభక్తిచే వేదానువచనయజ్ఞ దానతపోనిరశనవ్రతములు స్వతంత్రముగ (పరస్పరసహాయము నపేక్షింపక) వివిదిషనుగూర్చి, ఆత్మజ్ఞానమును గూర్చియు కారణములని బోధింపఁబడుటవలన నిశ్శ్రేయోమార్గమునందు, లేక "త మేతం" అను వాక్యమునందు కాని యాత్మతత్త్వవిషయకనిశ్చయాత్మికబుద్ధి యొక్కటియే బ్రహ్మచర్యగార్హస్థ్యవానప్రస్థసంన్యాసాశ్రములకు సాధింపఁదగిన దని వివక్షితమైనది. అట్లు కాక 'వేదానువచనేన' అను వాక్యముచే విధింపఁబడిన వేదానువచన యజ్ఞదానాదు లన్నియు పరస్పరసహాయము లేకయే భిన్న భిన్న ఫలజనకము లన్నను, లేక పరస్పరసహాయముచే నేకార్థజనకము లన్నను 'దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత' అనుచోట నొక స్వర్గఫలమునకు కారణ మగు దర్శయాగపూర్ణమాసయాగములకు సముచ్చయము బోధించు ద్వంద్వసమాసమువలె నిచట ద్వంద్వసమా సము కాని, లేక— 'యదగ్నయే చ ప్రజాపతయే చ' అను స్థలమునందు సముచ్చయము బోధించు 'చ' కారము వలె

"వేదానువచనేన" అను వాక్యమునందు కడ 'చ' కారము యుండవలసివచ్చును. అట్టి ద్వంద్వసమాసము కాని, 'చ' కారము కాని యిచట లేదు. కాన "వేదానువచనేన" అను వాక్యబోధితకర్మములు భిన్నార్థకములు కాని, సముచ్చితములు కాని కావని యర్థము.

సాంఖ్యబుద్ధియు, యోగబుద్ధియు నొక శ్రేయస్సే ఫలముగ కలవగుటచే నొక్కటియే యగును. అట్టి నిశ్చయాత్మికము, ఆత్మతత్త్వవిషయకము నగుబుద్ధి నిర్దోషమగు వేదవాక్యమువలన జనించుటచే నితరమగు సర్వవిపరీతబుద్ధుల బాధించును. (నశింపజేయును) ఆత్మతత్త్వవిషయకము, నిశ్చయాత్మికము నగు బుద్ధితో విహీనులగు వారి యితరబుద్ధులు బాధ్యములు. అని భాష్యకారులుకూడ నుడివియుండిరి.

మఱికొందరు "పరమేశ్వరారాధనచేతనే సంసారము తరించగలము" అను నిశ్చయాత్మిక మగు నొక బుద్ధియే యీకర్మయోగమునం దగును. అని "వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన" అనుదాని కర్థమును చెప్పెదరు. ఏవిధము చేసైనను జ్ఞానకాండానుసారముగ 'స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్' (నిష్కామ కర్మానుష్ఠానధర్మమున స్వల్పము ననుష్ఠించినను అది సంసారరూపమహాభయమునుండి రక్షించును అనునది యుపపన్నము.

కర్మకాండమునందున్ననో కోరిక అనేకము లగుటచే ననేకవిధములును, కర్మఫలగుణఫలాదిప్రకారమగు నుపశాఖాభేదముచే ననంతములు నగు (విపరీత) బుద్ధులు తత్తత్ఫలములయందు కోరికకలవారలకు సంభవించును. ఇచట 'హి' అను శబ్దముచే నట్టి బుద్ధుల యానంత్యముయొక్క ప్రసిద్ధి ద్యోతితము. కాన శుద్ధ్యర్థకర్మలకు కామ్యకర్మల కంటె గొప్పదైన ఆధిక్యము కలదని భావము.

శంకరానందీయము:— యోగవిషయకబుద్ధితోఁగూడిన పురుషుఁడు తరించునని యింతకుపూర్వము చెప్పఁబడెను. అట్టి యోగబుద్ధి యెట్టిదను నాశంకయందు దాని స్వరూపమును చెప్పుచు తదితరబుద్ధులు కలవారెన్నడు తరింపరని "వ్యవసాయాత్మికా" అను శ్లోకముచే సూచించుచుండెను.

'మనో హి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చాశుద్ధమేవ చ । అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామవివర్జితం ॥' (మనస్సు శుద్ధమనియు, అశుద్ధమనియు రెండువిధములు. అందు కామసంకల్పములతోఁ గూడిన మనస్సు అశుద్ధమనియు, కామసంకల్పశూన్యమగు మనస్సు శుద్ధమనియు చెప్పఁబడును.) అనువాక్యానుసారము కామసంకల్పాదికషాయరహితమగుటవలన శుద్ధమగుటచే 'ఈశ్వరుఁడే మనలకు పరమగతి' అను నిశ్చయము కలిగినట్టియు, వస్తుతత్త్వనిశ్చయము కలదియు నీశ్వరాశ్రయమునగు బుద్ధి మోక్షప్రయోజనమగు కర్మయోగమునందు ప్రవృత్తుఁడు, వ్యవసాయి, ముముక్షువునగు వానికి వెలుపలను లోపలను ఎల్లప్పుడు 'ఏకైవ' ఏకరూపమే యగుచున్నది. 'యోవా ఏతదక్షరం గార్గ్య విదిత్వాఽస్మిన్ లోకే జుహోతి, యజతే, తపస్తప్యతే అన్తవదేవాస్య తద్భవతి' (ఓ గార్గి! యీయక్షరరూపమగు నాత్మను తెలిసికొనక యెవఁడీలోకమున హోమముచేయునో, యాగముచేయునో, తపమునాచరించునో అదంతయు నట్టివాని కంతవత్తే యగును.) అను నర్థమునకు వ్యతిరేకముగ నాత్మస్వరూపమును తెలిసికొని హోమముచేయువానియొక్కయు, యాగముచేయువానియొక్కయు, తపమునాచరించువానియొక్కయు నిఖిలకర్మము అనన్తమే యగునని చెప్పు శ్రుతిప్రమాణమున నిశ్చయాత్మకబుద్ధి యేకరూపముగనే యుండును. కాని యెన్నడును భేదమునుపొందజాలదు. ఇట్టి వ్యవసాయాత్మక(వివేక)బుద్ధిరహితులు, వ్యవస్థాశూన్యులు అగు కాముకుల బుద్ధు లనేకవిధములు. "అశాస్తేయం యజమానోఽసౌ" అను శ్రుత్యుక్తప్రకార మనేకార్థవిషయకము అగుటచే ననేకవిధములు వేరగును. కనుకనే కామ్యము అనన్తమగుటచే నాబుద్ధు అనన్తమగును. ఈవిధమున బుద్ధులనంతములగుచో నట్టిబుద్ధులు కలవారలకు సంసార మనంతమే యగును. ఎన్నడును సంసార ముపశమించదని యర్థము.

గీ॥ యా మిమాం పుష్పితాం వాచం ప్రవద న్త్యవిపశ్చితః ।
వేదవాదరతాః పార్థ! నాన్య దస్తీతి వాదినః ॥ ॥౪౨॥

పదవిభాగము:— యాం- ఇమాం- పుష్పితాం- వాచం- ప్రవదన్తి- అవిపశ్చితః- వేదవాదరతాః- పార్థ!- న- అన్యత్- అస్తి- ఇతి- వాదినః ॥ ॥౪౨॥

ప్రతిపదార్థము:— హే పార్థ!=ఓ యర్జునా!; వేదవాదరతాః=(అనేక మగు నర్థవాదవాక్యములచేఁ జెప్పఁబడు ఫలములకు సాధనలను ప్రకాశింపజేయు) వేదవాక్యములయం దాసక్తిగలవారై; అన్యత్=స్వర్గప్రాప్తిరూపఫలమునకు సాధనమగు కర్మలకంటె వేరగునది; నాస్తీతి=లేదని; వాదినః=పలికెడి; అవిపశ్చితః=అవివేకులు; యాం=ఏ; ఇమాం=అధ్యయనవిధిగృహీతమగుటచేఁ బ్రసిద్ధమైన; పుష్పితాం=పుష్పించిన వృక్షమువలె రమణీయమగు; వాచం=వాక్యమును; ప్రవదన్తి=పలుకుచుండిరో! ॥౪౨॥

శాంకరభాష్యమ్:—

యేషాం వ్యవసాయాత్మికా బుద్ధి ర్నాస్తి, తే— యామితి । యా మిమాం వక్ష్యమాణాం పుష్పితాం పుష్పితవృక్ష ఇవ శోభమానాం శ్రూయమాణరమణీయాం వాచం వాక్యలక్షణాం ప్రవదన్తి । కేఽవిపశ్చితోఽల్పమేధసోఽవివేకిన ఇత్యర్థః । వేదవాదరతా బహ్వర్థవాదఫలసాధన

నీలకంఠీయము:— సాంఖ్యయోగము లనెడి రెంటికి సంసారమహాభయమునుండి రక్షించుట సమానమగుచో నీరెంటికేమి విశేషము కలదని యాశంకించి సాంఖ్యులకు పతనశంకయే లేదనియు, యోగుల కెంతవఱకు విదేహకైవల్యము సంభవింపదో యంతవరకు పతనశంక కలదని 'వ్యవసాయాత్మికా' అనుశ్లోకముచేఁ జెప్పుచుండెను.

"వ్యవసాయాత్మికా" వ్యవసాయమన తత్త్వనిశ్చయము. తదాకారము 'అహం బ్రహ్మాస్మి' అను వాక్యజన్యమగు నంతఃకరణవృత్తి, అట్టి బ్రహ్మాకారాంతఃకరణవృత్తియే బ్రహ్మవిద్య యనఁబడును. అట్టి బ్రహ్మాకారాంతఃకరణవృత్తి, యితరనిఖిలవృత్తి బాధద్వారమున నెప్పుడుఁ బుట్టినదై యేకరూపముగనే యుండును. "సకృద్విభాతో హ్యేష బ్రహ్మలోకః," బ్రహ్మ మొక్కసారి తెలియఁబడినచో కృతకృత్యుఁ డగుటంజేసి వానికిఁ దెలిసికొనఁదగినదియు, కర్తవ్యము, కొంచమైన నుండదు. కాన నిట్టి బ్రహ్మవిద్యావంతునకు పతనశంకయే లేదు. అజ్ఞానులబుద్ధు లనంతములు. అవి ప్రత్యేక మనేకవిధములు. కాన "ఇది నాకు శ్రేయస్కరము" అను నిశ్చయము దుర్లభ మగుటంజేసి యొకానొకప్పు డశ్రేయస్సునందుకూడ శ్రేయోబుద్ధి కలిగినచో పతనశంక కలుగఁగలదు. కాన సాంఖ్యయోగుల కిట్టి గొప్పవిశేషము కలదని భావము.

శ్రీధరీయము:— ఈశ్వరారాధనరూపమగు కర్మయోగమునందు "పరమేశ్వరభక్తిచేతనే నిశ్చయముగఁ దరించగలను" అను నిశ్చయాత్మకమగు నేకనిష్ఠారూపబుద్ధి జనించును. బహిర్ముఖులగు కాముకులకు కామము లనన్తమగుటచే బుద్ధులనేకవిధములు జనించును. అనిగూడ కర్మగుణఫలాదిభేదమువలన ననేకశాఖలు కలవగును. ఈశ్వరారాధననిమిత్తము నిత్యనైమిత్తికమగు యత్కించిత్కర్మము అంగలోప మున్నను నశించదు. 'యథాశక్త్యా తథాకుర్యాత్' (ఎట్లుచేయుటకు సమర్థుడగునో అట్లే యాచరింపవలయును) అని ఈశ్వరారాధననిమిత్తమగు కర్మము విధించబడుచున్నది. అట్టి కర్మ మీశ్వరోద్దేశమగుటచే వైగుణ్య ముపశమించును. కాన కర్మమునకు వైగుణ్యము ప్రాప్తించదు. "అగ్నిహోత్రం జుహుయా త్స్వర్గకామః దర్శేంద్రియకామో జుహుయాత్" అను శ్రుతిబోధితమగు నగ్నిహోత్రాదికామ్యకర్మ మట్టిది కాదు. కాన సకామకర్మమునకు, నిష్కామకర్మ (కర్మయోగ)మునకు మహద్వైషమ్యము కలదనిభావము. ॥౪౧॥

శాంకరభాష్యమ్:—

ప్రకాశకేషు వేదవాక్యేషు రతాః హేపార్థ! నాన్య త్స్వర్గప్రాప్త్యాదిఫలసాధనేభ్యః కర్మభ్యోఽస్తీత్యేవంవాదినో వదనశీలాః ॥

శాంకరభాష్యతత్త్వబోధినీ:—

సాంఖ్యయోగబుద్ధి యొక్కటియే ప్రమాణమైనచో నట్టి బుద్ధి సర్వుల చిత్తమునం దెందుకు సిద్ధముకాదని శంకింపజనదు. ఎవరికి నిశ్చయాత్మకబుద్ధి కలుగదో అట్టి స్వల్పబుద్ధికల యవివేకు లనేకార్థవాదవాక్యములచే బోధింపఁబడు ఫలములకు సాధనములను ప్రకాశింపఁ జేయు వేదవాక్యములయం దాసక్తికలవారై స్వర్గప్రాప్తికి సాధనమగు కర్మలకంటె వేరుగ నీశ్వరుడుకాని, మోక్షముకాని లేదని పలుకుటయందు స్వభావముకలవారై భోగ్య మగు ఫలములు లేక పుష్పమాత్రముచేతనే రమణీయ మగు కింశుక (మోదుగ) వృక్షమువలె శ్రవణకాలమునందుమాత్రము రమణీయము, నిరతిశయఫలశూన్యము, కర్మకాండబోధకము నగు వాక్యము ను "క్రియావిశేషబహుళాం" అను వాక్యముచే చెప్పబోవువిధమున పలుకుచుండిరి. కాన నట్టివారు స్వర్గాదికాములుగాన కామవశమున వారలకు నిశ్చయాత్మకమగు బుద్ధి ప్రాయశః కలుగనేరదు. కలిగినను స్థిరము కానేరదు. ॥౪౨॥

—• ౨వ అధ్యాయము ౪౨, ౪౩, ౪౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "ప్రమాణము సమానమగుటచే నవ్యవసాయుల (కాముకుల) కు కూడ వ్యవసాయాత్మకమగు బుద్ధి యేలకలుగదు?" అని యాశంకించుకొని ప్రతిబంధకముండుటచే నట్టి బుద్ధి కలుగదని 'యా మిమాం' అను శ్లోకము మొదలు మూడు శ్లోకములచే చెప్పుచుండెను.

"యా మిమాం" 'స్వాధ్యాయోఽ ధ్యేతవ్యః' అను యధ్యయనవిధిచే గృహీతమగుటచేఁ బ్రసిద్ధము, సాధ్య సాధన, సంబంధప్రతిభానమువలనను నిరతిశయ ఫలాభావమువలనను పుష్పించిన మోదుగవలె నాపాతరమణీయము, 'జన్మకర్మఫలప్రదాం' నశ్వరమగునపూర్వశరీరేంద్రియాది సంబంధరూపజన్మమును. తదధీనమగువర్ణాశ్రమాభిమాననిమిత్త నశ్వరకర్మమును, తదధీనమగు నశ్వరప్రతిపశుస్వర్గాదిరూపఫలమును(ప్రకర్షగఘటీయంత్రమువలె నవిచ్ఛిన్నముగ నిచ్చునదియు. కనుకనే నిత్యనిరతిశయఫలము నివ్వజాలనిదియు, మఱియు "భోగైశ్వర్యగతిం ప్రతి క్రియావిశేషబహులాం" అమృతపానము, ఊర్వశీవిహారము, పారిజాతపరిమళము మొదలగుభోగముల యొక్కయు, తత్కారణమగు దేవాదిస్వామిత్వముయొక్కయు ప్రాప్తినిగూర్చి హేతువగు నగ్నిహోత్రదర్శపూర్ణమాసజ్యోతిష్టోమాదులచే విస్తృతమైనట్టిదియు, (అతివిస్తారముగ భోగైశ్వర్యసాధనక్రియాకలాపమును చెప్పునది) (కర్మకాండము జ్ఞానకాండముకంటె యతివిస్తృతత్వముప్రసిద్ధము.) నిట్టికర్మకాండరూపము నగు వాక్కును— 'అవిపశ్చితః' విచారజన్యతాత్పర్యపరిజ్ఞానశూన్యులు, కనుకనే "వేదవాదరతాః" వేదమునందుండు "అక్షయగ్ం హవై చాతుర్మాస్యయాజిన స్సుకృతంభవతి" అనునది మొదలగు యర్థవాదవాక్యములయం దాసక్తులు, (వేదార్థము సత్యముగ నిదియే యని మిథ్యావిశ్వాసముచేసంతోషించెడివారలు) చెప్పుచుందురు. కనుకనేవారు 'నాన్యదస్తీతివాదినః' వేదమంతయు కార్యపరమగుటచేకర్మకాండముకంటె భిన్నమగుజ్ఞానకాండము లేదని పలికెడివారలు, కర్మఫలముకంటె వేరుగ జ్ఞానఫలమగు నిరతిశయసుఖము లేదనిపలుకుచు పెద్దప్రయత్నముచే జ్ఞానకాండవిరుద్ధార్థమును పలికెడి

గీ॥ కామాత్మానః స్వర్గపరాః జన్మకర్మఫలప్రదామ్ ।
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి ॥ ॥౪౩॥

పదవిభాగము:— కామాత్మానః- స్వర్గపరాః- జన్మకర్మఫలప్రదాం- క్రియావిశేషబహుళాం- భోగైశ్వర్యగతిం- ప్రతి ॥ ॥౪౩॥

ప్రతిపదార్థము:— తే=అట్టి యవివేకులు; కామాత్మానః=కామస్వభావులై; (కామపరులై;) స్వర్గపరాః=స్వర్గమే పురుషార్థముగాఁగలవారై (స్వర్గప్రధానులై); జన్మకర్మఫలప్రదాం=జన్మయనెడి కర్మఫలము నిచ్చునట్టియు; భోగైశ్వర్యగతింప్రతి, భోగైశ్వర్య=భోగైశ్వర్యములయొక్క; గతింప్రతి=ప్రాప్తినిగూర్చి; సాధన మగునట్టి; క్రియావిశేషబహుళాం=క్రియావిశేషములే విస్తారముగాఁగల; (1) తాం=ఆ; (2) వాచం=వేదవాక్యమును; (3) ప్రవదన్తి=పలుకుచుండిరి; (తాం, వాచం, ప్రవదన్తి అను నీమూఁడుపదములు పూర్వశ్లోకమునుండి అనుషక్తములు.) అనుషంగ మనగ పూర్వశ్లోకమునందుండు పదమును ముందుశ్లోకమున సమన్వయమునిమిత్త మాశ్లోకమునందుగల పదములతో గలుపుట. ॥౪౩॥

శాంకరభాష్యమ్:—

తేచ— కామాత్మాన ఇతి । కామాత్మానః కామస్వభావాః కామపరా ఇత్యర్థః । స్వర్గపరాః స్వర్గః పరః పురుషార్థో యేషాం తే స్వర్గపరా స్స్వర్గప్రధానా జన్మకర్మఫలప్రదాం కర్మణః ఫలం కర్మఫలం జన్మైవ కర్మఫలం జన్మకర్మఫలం తత్ప్రదదాతీతి జన్మకర్మఫలప్రదాం తాం వాచం ప్రవదన్తీత్యనుషజ్యతే । క్రియావిశేషబహుళాం క్రియాణాం విశేషాః క్రియావిశేషా స్తే బహుళా యస్యాం వాచి తాం స్వర్గపశుపుత్రాద్యర్థా యయా వాచా బాహుళ్యేన ప్రకాశ్యన్తే । భోగైశ్వర్యగతిం ప్రతి భోగ శ్చైశ్వర్యం చ భోగైశ్వర్యే తయో ర్గతిః ప్రాప్తి ర్భోగైశ్వర్యగతి స్తాం ప్రతి సాధనభూతా యే క్రియావిశేషా స్తద్బహుళాం తాం వాచం ప్రవదన్తో మూఢా స్సంసారే పరివర్తన్త ఇత్యభిప్రాయః ॥ ॥౪౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కామపరులును, స్వర్గమే ప్రధానముగఁ గలవారును నగు నవివేకులు— కర్మఫల మగు జన్మ నిచ్చునట్టియు, భోగైశ్వర్యప్రాప్తికి సాధన మగునట్టియు, స్వర్గపశుపుత్రుల నిచ్చునట్టి క్రియావిశేషములను విస్తారముగ జెప్పునట్టి వేదవాక్యములను బలికెడివారై సంసారమునందుఁ దిరుగుచుండెదరు. కాన వారలకు నిశ్చయాత్మకబుద్ధి సంభవింపనేరదు. ॥౪౩॥

వారలు "కామాత్మానః" కామ్యమానవిషయాకులితచిత్తులు కాన కామమయులు, కనుకనే మోక్షవిద్వేషులు "స్వర్గపరాః" ఊర్వశ్యాద్యుపేతమగుటచే స్వర్గమేయుత్కృష్టముగఁ గలవారలు, కనుకనే వివేకవైరాగ్యములు లేమింజేసి స్వర్గముకంటె వేరుగ పురుషార్థము లేదని భ్రమను చెందినవారలై మోక్షకథనుకూడ సహింపనేరారలు. అట్టి "భోగైశ్వర్యప్రసక్తానాం" భోగైశ్వర్యములయందు క్షయిత్వాదిదోషాదర్శనముచే నివిష్టమగు నంతఃకరణ కలిగినట్టియు, "తయాపహృతచేతసాం" క్రియావిశేషబహుళ మగు వేదవాక్యముచే నాచ్ఛాదిత వివేకవిజ్ఞానము కలవారు అగువారల యంతఃకరణమునందు వ్యవసాయాత్మకబుద్ధి కలుగనేరదు. లేక పరమాత్మవిషయక

గీ॥ భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్ ।
వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధీయతే ॥ ॥౪౪॥

పదవిభాగము:— భోగైశ్వర్యప్రసక్తానాం- తయా- అపహృతచేతసాం- వ్యవసాయాత్మికా- బుద్ధిః- సమాధౌ- న- విధీయతే ॥ ॥౪౪॥

ప్రతిపదార్థము:— భోగైశ్వర్యప్రసక్తానాం, భోగ=భోగమునందును, ఐశ్వర్య=ఐశ్వర్యమునందును; ప్రసక్తానాం= ప్రసక్తులైనట్టియు (భోగైశ్వర్యాత్మభూతులైనట్టియు, తయా=క్రియావిశేషములను విస్తారముగఁ బ్రకటింపజేయునట్టి యా వేదవాక్యముచే; అపహృతచేతసాం=కప్పబడిన వివేకవిజ్ఞానముకల మూఢులకు; వ్యవసాయాత్మికా నిశ్చయాత్మికమగు; బుద్ధిః=సాంఖ్యబుద్ధి కాని, యోగబుద్ధి కాని; సమాధౌ=అంతఃకరణమునందున; న విధీయతే=విధించబడటములేదు; (సంభవింపదు).

---

శాంకరభాష్యమ్:—

తేషాంచ.—భోగేతి । భోగైశ్వర్యప్రసక్తానాం భోగః కర్తవ్య మైశ్వర్యం చేతి భోగైశ్వర్యయో రేవ ప్రణయవతాం తదాత్మభూతానాం తయా క్రియావిశేషబహులయా వాచాఽపహృతచేతసా మాచ్ఛాదితవివేక ప్రజ్ఞానాం వ్యవసాయాత్మికా సాంఖ్యే యోగే వా బుద్ధి స్సమాధౌ సమాధీయతేఽస్మి న్పురుషోపభోగాయ సర్వమితి సమాధి రంతఃకరణబుద్ధి స్తస్మి న్సమాధౌ న విధీయతే న భవతీత్యర్థః । ॥౪౪॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కర్మానుష్ఠానమువలన చిత్తశుద్ధిగలిగి తద్ద్వారమున కర్మకాండనిష్ఠులగు కర్మానుష్ఠానపరులకుఁగూడ యోగబుద్ధిసాంఖ్యబుద్ధులు జనించి మోక్షము సంభవించు ననెదవా? అదియు సంభవము కాదు. ఏలనః కర్మానుష్ఠానపరులు ఆత్మకర్తవ్యములుగ నారోపితము లగు భోగైశ్వర్యములయం దభినివిష్టమగు చిత్తముకలవారుగాన భోగైశ్వర్యములతో తాదాత్మ్యధ్యాసముకలవారు. కనుకనే బహిర్ముఖు లనంబడుదురు. అట్టి బహిర్ముఖులకు యోగబుద్ధిసాంఖ్యబుద్ధులు జనింపనేరవు. అట్టివారలకు యోగబుద్ధిసాంఖ్యబుద్ధులు జనింపకున్నను శాస్త్రానుసారి యగు వివేకజ్ఞానముచే వ్యవసాయాత్మక (నిశ్చయాత్మిక) మగు బుద్ధి జనింపవచ్చునని శంకింపఁజనదు. కేవలకర్మానుష్ఠానపరులు యజ్ఞయాగాదులనే విస్తారముగఁ ప్రకాశింపజేయునట్టి వేద

---

వ్యవసాయాత్మకబుద్ధి కలుఁగనేరదు. 'సమాధీయతేఽస్మి సర్వమిదం' అను వ్యుత్పత్తి ననుసరించినచో సమాధి శబ్దమున నంతఃకరణము, పరమాత్మయు నను నర్థములు సంభవించును. కొందఱు "అహం బ్రహ్మ" (నేను బ్రహ్మను) అని యుండుటే సమాధియనియు, తన్నిమిత్త మగు వ్యవసాయాత్మకబుద్ధి కలుగదని వ్యాఖ్యానించెదరు. ఈవ్యాఖ్యానమునందు సమాధిశబ్దము రూఢమగును.

పర్యవసిత మేమన? విచారింప కామ్యాగ్నిహోత్రాదులు శుద్ధ్యర్థమగు నగ్నిహోత్రాదులకంటె వేరు కావు. అయినను కామ్యాగ్నిహోత్రాదులు ఫలాభిసంధిదోషదూషితము లగుటచే చిత్తశుద్ధిని సంపాదింపనేరవు. భోగానుగుణమగు శుద్ధి ప్రాప్తించినను అది జ్ఞానోపయోగి కానేరదు. ఈవిషయమును తెలుపుటకే "భోగైశ్వర్యప్రసక్తానాం" అని తిరుగ జెప్పబడెను. ఫలాభిసంధిని విడిచి యాచరింపబడిన యగ్నిహోత్రాదులు జ్ఞానోపయోగి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వాక్యులచేతనే యాచ్ఛాదితమగు వివేకవిజ్ఞానముకలవారు. కాన వారలకు యోగబుద్ధి, సాంఖ్యబుద్ధులు సమాధి (అంతఃకరణ) యందు సంభవింపవు. ఇట సమాధియనగ "సమాధీయతేఽస్మిన్పురుషోపభోగాయ సర్వం" అను వ్యుత్పత్తి ననుసరించి పురుషునియుపభోగముకొఱకు సర్వము దీనియం దుంచబడునుగాన సమాధిశబ్దముచే నంతఃకరణము బోధింపబడునుగాని యప్రసక్తములగు సంప్రజ్ఞాతాసంప్రజ్ఞాతసమాధులు జెప్పబడవు. కనుకనే "సంప్రజ్ఞాతాసంప్రజ్ఞాతసమాధులు ప్రసక్తములు కావుకదా. యట్టి సమాధుల నిచట నిషేధించుట యెట్లను శంకగూడం దొలగింపఁబడెను. ॥౪౪॥

యగు శుద్ధిని చేకూర్చును. కాన విద్వదవిద్వాంసులకు ఫలభేదము సిద్ధమని భావము. ఈవిషయమే మున్ముందు విస్తారముగఁ జెప్పబడును.

శంకరానందీయము:— "అవ్యవసాయులకు (కాముకులకు) కూడ యోగబుద్ధిసంభవించు గాక" యను శంకపై కామపరుల యంతఃకరణమును యోగబుద్ధి యధిష్ఠింపనేరదని బోధించుట కట్టివారల స్వభావమును మూడు శ్లోకములచే వర్ణించుచుండెను.

"వేదవాదరతా ఉచ్యన్త ఇతి వాదా వాక్యాని వేదస్య వాదాః వేదవాదాస్తేషు" చెప్పబడునవి వాదము లనబడును. అవివాక్యములు. వేదసంబంధమగువాక్యములు వేదవాదములనబడును. కర్మతత్ఫలసాధనప్రకాశకములగు 'వాయవ్యగ్ం శ్వేతమాలభేత భూతికామః' అనునట్టి వేదవాక్యములయం దాసక్తులు కనుకనే "నాన్యదస్తీతి వాదినః" సాధనసాధ్యరూపములగు కర్మతత్ఫలములకంటె వేరుగ నీశ్వరుడు కాని, మోక్షము కాని లేదని పలికెడివారును, వేదముల యుపక్రమోపసంహారతాత్పర్యమును గుర్తెఱుగని మీమాంసకులు "పుష్పితాం" పుష్పశోభితమగు మల్లికమొదలగు లతలతో సదృశమగు "అపామసోమం, దక్షిణావన్తోఽమృతం భజన్తః. పశ్యతి పుత్రం పశ్యతి పౌత్రం, అక్షయ్యగ్ం హవై చాతుర్మాస్యయాజిన స్సుకృతం భవతి" అనునవిమొదలగు ఫలశూన్యములగుయర్థవాదవాక్యములనెడిపుష్పములచేరంజితమగు "ఇమాం" "జన్మకర్మఫలప్రదాం" అనునది మొదలు చెప్పబోవు 'యాం వాచం' "అగ్నిమీళేపురోహితం, ఇషేత్వోర్జేత్వా, బ్రహ్మసంధత్తం తన్మే జిన్వతం" ఇత్యాది వాక్యరూపమగు కర్మకాండమునే ప్రశస్తమైనదానినిగ చెప్పుచుందురు. ఉపాసనకాండను కాని, బ్రహ్మకాండను కాని యట్టి విధముగ చెప్పరు.

యోగబుద్ధి కనర్హమగు నిట్టి మీమాంసకుల స్వభావము దుష్టమని సూచించుటకు తద్గుణములను "కామాత్మానః" అనుశ్లోకముచే వర్ణించుచుండెను.

'స్వర్గపరాః' స్వర్గమే నిరతిశయపురుషార్థమను నిశ్చయముకలవారు స్వర్గపరు లనిపించుకొందురు. "భోగైశ్వర్యగతింప్రతి కామాత్మానః" దివ్యమగు స్రక్చందనవనితాదుల సమగ్రభోగముకొఱకు ఈశ్వరత్వప్రాప్తినిగూర్చి యిచ్ఛావేగము బుద్ధియందు కలవారలు. అనగా విషయభోగలంపటులని యర్థము. అట్టి కాముకులగు మీమాంసకులు—'క్రియావిశేషబహుళాం' అగ్నిష్టోమాతిరాత్రాప్తోర్యామాదిక్రియావిశేషములను విస్తారముగ బోధించునట్టియు 'జన్మకర్మఫలప్రదాం' జన్మమృత్యుజరాశోకదుఃఖములనిచ్చు కర్మప్రతిపాదకము (లేక తనచేబోధింపబడు కర్మల నాచరించువారలకు నానాయోనులందు జన్మములను, కర్మఫలమగు సుఖాదులను నిచ్చునట్టిది అగు) వేదవాక్యమును పలుకుచుండెడివార లని పూర్వశ్లోకములతో నన్వయింపనగును. ॥౪౩॥

గీ॥ త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥ ॥౪౫॥

పదవిభాగము:— త్రైగుణ్యవిషయాః- వేదాః- నిస్త్రైగుణ్యః- భవ- అర్జున- నిర్ద్వన్ద్వః- నిత్యసత్త్వస్థః- నిర్యోగక్షేమః- ఆత్మవాన్ । ॥౪౫॥

ప్రతిపదార్థము:— వేదాః=కర్మప్రతిపాదక వేదములు; త్రైగుణ్యవిషయాః="త్రయాణాం సత్త్వరజస్తమసాం గుణానాం సమాహారః త్రైగుణ్యం, తత్ విషయో యేషాం తే త్రైగుణ్యవిషయాః" సత్త్వరజస్తమోగుణసంబంధమగు పుణ్యపాపవ్యామిశ్రకర్మ, తత్ఫలములను ప్రకాశింపజేయునట్టివి; హే అర్జున!=ఓ యర్జునుడా!; త్వం=(ఈపద మధ్యాహార్యము) నీవు; నిస్త్రైగుణ్యః=త్రిగుణసంబంధ మగు పుణ్యపాపవ్యామిశ్రకర్మ, తత్ఫలరూపసంసార కామనా సంబంధము లేనివాఁడవై; నిర్ద్వన్ద్వః=సుఖదుఃఖహేతువులగు శీతోష్ణములు, మానావమానములు అనెడి ద్వన్ద్వములు లేనివాఁడవై: నిత్యసత్త్వస్థః, నిత్య=ఎల్లపుడు; సత్త్వస్థః=సత్త్వగుణాశ్రితుడవై; నిర్యోగక్షేమః=పొందఁబడని వస్తువులను సంపాదించుట, సంపాదించినవాటిని రక్షించుట యనెడి యోగక్షేమములు లేనివాఁడవై ; ఆత్మవాన్=అప్రమత్తుడవై ; భవ=అగుము. ॥౪౫॥

శాంకరభాష్యమ్:—

య ఏవం వివేకబుద్ధిరహితా స్తేషాం కామాత్మనాం— త్రైగుణ్యేతి । త్రైగుణ్యవిషయా స్త్రైగుణ్యం సంసారో విషయః ప్రకాశయితవ్యో యేషాం తే వేదా స్త్రైగుణ్యవిషయా స్త్వం తు నిస్త్రైగుణ్యో భవార్జున! నిష్కామో భవే త్యర్థః । నిర్ద్వంద్వ స్సుఖదుఃఖ హేతు

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అవివేకులుగూడ వేదాభ్యాసవంతు లగుచో నట్టివారలకు వివేకజ్ఞానము గలుగవచ్చు నని శంకింపఁజనదు. ఎవరు వివేకబుద్ధిరహితులో కామాత్ములగు నట్టివారలకు కర్మప్రతిపాదకములగు వేదములు సత్త్వరజస్తమోగుణములయొక్క సమాహారరూపము, పుణ్యపాపమిశ్రరూపము, తత్ఫలసంబంధరూపము నగు సంసారమును బోధించును. అట్లైనచో వేదార్థ మగుటంజేసి

మీమాంసకు లిట్టివారలుకనుకనే వారలకు యోగబుద్ధి కాని, తత్ఫలము కాని సిద్ధింప దని "భోగైశ్వర్య ప్రసక్తానాం" అను శ్లోకముచే చెప్పుచుండెను.

"తయాఽపహృతచేతసాం" అర్థవాదవాక్య (స్తుతిప్రధానవాక్య)ములచే విస్తారమైనట్టి కర్మకాండప్రతిపాదక వేదవాక్యముచే గప్పబడిన కార్యాకార్యవివేక విజ్ఞానముకలవారు (విషయాశాభ్రమిత బుద్ధులుకలవారు) కనుకనే "భోగైశ్వర్యప్రసక్తానాం" భోగ్యములగు స్రక్చందన వనితాదులయందు ప్రసక్తులు. అట్టివారి 'సమాధౌ' యంతఃకరణమునందు యోగబుద్ధి ప్రవేశింపదు. ఎందులకనిన? అట్టివారల యంతఃకరణము కామములచే నిండియుండినందున యోగబుద్ధి ప్రకాశించుట కవకాశములేదు. కాన కారణము లేమింజేసి కార్యము సంభవింపదను న్యాయమున కారణమగు యోగబుద్ధి తత్కార్యమగు మోక్షమీ మీమాంసకుల కెన్నడును సంభవము కాదని యర్థము. ॥౪౪॥

—• 2వ అధ్యాయము- 44వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "అంతఃకరణదోషముచే సకాములకు వ్యవసాయాత్మకబుద్ధి కలుగకుండు గాక! వ్యవసాయాత్మకబుద్ధిచే కర్మ నాచరించెడి నిష్కాములకు కర్మస్వభావమువలన స్వర్గాదిఫలము

శాంకరభాష్యమ్:—
సప్రతిపక్షౌ పదార్థౌ ద్వన్ద్వశబ్దవాచ్యౌ తతో నిర్గతో నిర్ద్వన్ద్వో భవ । త్వం నిత్యసత్త్వస్థ స్సదా సత్త్వగుణాశ్రితో భవ । తథా నిర్యోగక్షేమోఽనుపాత్తస్యోపాదానం యోగః, ఉపాత్తస్య రక్షణం క్షేమః, యోగక్షేమప్రధానస్య శ్రేయసి ప్రవృత్తి ర్దుష్కరే త్యతో నిర్యోగక్షేమో భవ । ఆత్మవా నప్రమత్త శ్చ భవ । ఏష తవోపదేశ స్స్వధర్మ మనుతిష్ఠతః । ॥౪౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—
కామాత్మత్వము శ్రేష్ఠమైనదే యగు నని శంకింపవలదు. అట్టి వేదాభ్యాసరతులు కామనాపూర్వకముగ వేదబోధితములగు కర్మలనే యనుష్ఠించుటచే నెల్లపుడు వారికి సంసారమే యనువర్తించు (సంభవించు) చుండును. కాని వివేకముమాత్రము ప్రాప్తించ నేరదు. అందువలన సంసారపరిత్యాగముకొరకై యర్జునా! నీవు నిస్త్రైగుణ్యుఁడ (నిష్కాముడ) వగుము.

ఇట "నిస్త్రైగుణ్యః" అను పదమునకు త్రిగుణాతీతుఁడ వగుమని యర్థము చెప్పక నిష్కాముఁడ వగుమని చెప్పుటవలన "నిత్యసత్త్వస్థ" అను ముందుపదముచే సత్త్వగుణప్రధానుఁడ వగు మని యర్థము చెప్పుటవలనఁ బ్రాప్తించు విరోధము పరిహృతము.

నిష్కామత్వము ప్రాప్తించు టెట్లనిన ? పరస్పరవిరుద్ధములును, సుఖదుఃఖములకు హేతువులు నగు పదార్థములు ద్వంద్వము లనంబడును. అవి యేవనిన? శీతోష్ణములు, మానావమానములు, హానివృద్ధులు మొదలగునవి. అట్టి ద్వంద్వముల కెవఁడు లోనగునో వానికి నిష్కామత్వము ప్రాప్తించ నేరదు. అట్టి ద్వంద్వాతీతత్వ మెవనికిఁ బ్రాప్తించునో వానికి నిష్కామత్వము సంభవించును. కాన నోయర్జునా! నీవు నిష్కామత్వమునకు హేతు వగు శీతోష్ణాదిద్వంద్వాతీతత్వమును సంపాదించుము (ద్వంద్వాతీతుఁడ వగు మని యాశయము).

శీతోష్ణాదిద్వంద్వసహిష్ణుత్వ మెటుల బ్రాప్తించును ? అనిన నెల్లపుడు సత్త్వగుణప్రధానునకు ద్వంద్వసహిష్ణుత్వము ప్రాప్తించును. కాన శీతోష్ణాదిద్వంద్వసహనమునకు హేతు వగు సత్త్వగుణము నెల్లపు డాశ్రయింపుము.

సత్త్వగుణము నెల్లపు డాశ్రయించుట యనగా రజస్తమస్సులచే సంస్పృష్టము కాని సత్త్వము నాశ్రయించుట యనికదా యర్థము. యోగక్షేమములయందు వ్యాపృత మగు నంతఃకరణముకలవాని కట్టి సత్త్వగుణము సంభవించుట దుర్ఘటమే యందువా? యోగక్షేమముల

ప్రాప్తించుచుండ జ్ఞానప్రతిబంధము సమానమే యగునుకదా" యను నాశంకను 'త్రైగుణ్యవిషయాః' అను శ్లోకముచే దొలఁగించుచుండెను:

"త్రయాణాం గుణానాం కర్మ త్రైగుణ్యం కామమూల స్సంసార స్స ఏవ ప్రకాశ్యత్వేన విషయో యేషాం త్రైగుణ్యవిషయా వేదాః కర్మకాండాత్మకాః" సత్త్వరజస్తమోగుణముల కర్మము త్రైగుణ్య మనంబడును. అది యేదనిన? కామమూల మగు సంసారము. అట్టి సంసారమును ప్రకాశింపజేయునవి కాన సంసారము విష

శాంకరభాష్యతత్త్వబోధిని:—
యందు వ్యాపృత మగు నంతఃకరణముకలవాని కెల్లపుడు సత్త్వగుణము సంభవింపదుకనుకనే "నీవు యోగక్షేమములను వదలు" మని విధించుచుంటిని.

యోగ మనఁగఁ బొందఁబడని వస్తువులను బొందుట (సంపాదించుట). క్షేమ మనఁగఁ బొందఁబడినవస్తువులను రక్షించుకొనుట. ఈరెండును జీవనహేతువు లగుటంజేసి పురుషార్థసాధనములు అట్టి పురుషార్థసాధనములగు యోగక్షేమములను వదలు మని విధించుట యెట్లు సమంజస మగునని శంకింపవలదు.

యోగక్షేమములు ధర్మార్థకామము లనెడి పురుషార్థత్రియమునకు సాధనము లైనను యోగక్షేమములు ప్రధానముగఁ గలవానికి మోక్ష మనెడి పురుషార్థము సంభవించుట దుర్ఘటము కాన సర్వోత్కృష్ట మగు మోక్షమునకు సాధన మగు యోగక్షేమపరిత్యాగము నొనరించుము.

ప్రతిజీవునకు యోగక్షేమప్రధానత్వము స్వారసికముకదా! అట్టిదాని నెట్లు విడువవలెననిన? విషయములయందైన మానసికరూపమగు పరవశత్వము ప్రమాద మనఁబడును. మనస్సునకట్టి ప్రమాదమును దొలగించుము (అప్రమాదుఁడ వగుము). ఈయుపదేశము ముముక్షువిషయ మగుటంజేసి యర్జునన కీస్థలమునందు ముముక్షుత్వము వివక్షిత మని శంకింపఁజనదు. స్వధర్మము ననుష్ఠించుచుండిన నీకిది యుపదేశము (అనగా నిట నర్జునునకు ముముక్షుత్వము వివక్షచేయఁబడలేదు). మఱేమనిన స్వధర్మానుష్ఠానపరుఁ డగు నర్జునునకు శ్రేయస్సాధనము లుపదేశింపఁబడె నని గ్రహింపనగును. అది యెట్లనిన ? అప్రమాదునకు యోగక్షేమరాహిత్యము, దానివలన నెల్లపుడు సత్త్వగుణప్రధానత్వము, అందుచే ద్వంద్వసహిష్ణుత్వము, దానివలన నిష్కామత్వము ప్రాప్తించును. అట్టివానికే నిశ్చయాత్మకబుద్ధిగలిగి శ్రేయఃప్రాప్తి యగునని యాశయము. ॥౪౫॥

యముగాఁగలవి కర్మకాండప్రతిపాదక వేదములు. అనగా నెవఁ డేఫలమును గోరునో తత్ఫలమును బోధించునవి యని యర్థము. 'సర్వేభ్యః కామేభ్యో దర్శపూర్ణమాసౌ' సర్వకోరికల నిచ్చునవి దర్శపూర్ణమాసయాగము లని వినియోగ ముండినను తత్తత్కామన లేనిచో నొకపర్యాయము దర్శపూర్ణమాసయాగముల నాచరించినచో సర్వఫలప్రాప్తి సంభవింపదు. ఈవిషయమే యోగసిద్ధ్యధికరణమునందు "యత్ఫలకామనయాఽనుతిష్ఠతి తదేవ ఫలం తస్మిన్ప్రయోగే" ఏఫలకామనచే నేయాగము ననుష్ఠించునో యాఫలమే యాయనుష్ఠానమువలన సిద్ధించు నని చెప్పఁబడెను. కాన కామన లేనిచో ఫలము ప్రాప్తించదు. అందువలన నోయర్జునా! నీవు "నిస్త్రైగుణ్యః" నిష్కాముఁడ వగుము. ఈచెప్పుటవలన "కోరికలేకున్నను కర్మస్వభావమువలన సంసార మనువర్తించు" నను శంక తొలఁగింపఁబడెను.

శీతోష్ణాదిద్వంద్వప్రతిక్రియకొఱకు వస్త్రాదుల నపేక్షింపవలయునుకదా! అట్లైన నిష్కామత్వ మెట్లు సిద్ధించును? అను శంకను "నిర్ద్వన్ద్వః" అనుదానిచే తొలఁగించుచుండెను. "మాత్రాస్పర్శాస్తు" అని చెప్పఁ

బడిన న్యాయమున శీతోష్ణాదిసహిష్ణుడవు వగుము. అసహ్యమగు దుఃఖము నెట్లు సహింపవలయు ననెదవా? అచంచలమగు ధైర్యము నవలంబింపుము. రజస్తమస్సులచే నభిభూతమగు సత్త్వగుణము కలవాడు "శీతోష్ణాదిపీడచే మరణించెదను" అని తలచి ధర్మమునెడ విముఖుడగును. నీవట్లు గాక రజస్తమస్సుల నభిభవించి (నణచిపుచ్చి) కేవల సత్త్వగుణము నాశ్రయించుము. శీతోష్ణాదులను సహించినను క్షుత్పిపాసాదిప్రతిక్రియానిమిత్తము ప్రాప్తించిన యొకానొకవస్తువును స్వీకరింపవలయును. స్వీకరించినవస్తువును రక్షింపవలయును. అందునిమిత్తము ప్రయత్నమును చేయవలెను. అట్లయిన సత్త్వగుణ మ్మెటుల ప్రాప్తించు ననెదవా? 'నిర్యోగక్షేమః' వస్తులాభము యోగ మనియు, లబ్ధరక్షణము క్షేమమనియు ననంబడును. అట్టి యోగక్షేమరహితుడ వగుము. అనగా చిత్తవిక్షేపకారియగు పరిగ్రహము వదలివేయుమని యర్థము. అటులైనచో "నే నెటుల జీవింపగలను" అని చింతసేయదగదు. ఎందుచేత ననగ? "సర్వాంతర్యామి యగు పరమేశ్వరుడే నీసంబంధమగు యోగక్షేమములను నిర్వహింపగలడు" అని "ఆత్మవాన్" అనుదానిచే చెప్పుచుండెను. "ఆత్మవాన్" ధ్యేయుడగను, యోగక్షేమాదినిర్వాహకుడగను పరమాత్మ యెవనికి గలడో వాడు "ఆత్మవాన్" అని యనిపించుకొనును. అనగా సర్వకామనాపరిత్యాగపురస్సరముగ పరమేశ్వరు నారాధించు నాకుపరమేశ్వరుడే నాచే నపేక్షితమగు దేహయాత్రామాత్రమును సంపాదించగలడు. అని నిశ్చయించి నిశ్చింతుడవగుమనియర్థము. లేక 'ఆత్మవాన్' అనుదానికి నప్రమత్తుడవగు మనియైన నర్థము చెప్పనొప్పును.

శంకరానందీయము:— ఈవిధమువ శ్రుతివాక్యముల నుపక్రమోపసంహారాదులయం దవాంతరతాత్పర్యమును, మహాతాత్పర్యమును గుర్తించనట్టియు, అర్థవాదవాక్యములచే మోహితులగు కాములకు యోగబుద్ధి లేమింజేసి ఈశ్వరానుగ్రహము ప్రాప్తించదు. ఈశ్వరానుగ్రహము లేనిచో మోక్షము ప్రాప్తించదని చెప్పి, యిప్పుడు యోగబుద్ధిగలిగి యీశ్వరప్రీతికొఱకు కర్మ నాచరించు కేవలముముక్షువులు ప్రరోచకవాక్యములగు నర్థవాదవాక్యములచే మోహమును పొందవలదు. ఇష్టప్రాప్తియందును, అనిష్టప్రాప్తియందును సమబుద్ధిపూర్వకముగ శ్రద్ధాభక్తులతో నీశ్వరారాధనాత్మకమగు వైదికకర్మ జేయదగునని సూచించుటకు 'త్రైగుణ్యవిషయాః' అని ప్రారంభించెను.

వేదములు "త్రైగుణ్యవిషయాః" రాజసములు, తామసములు, సాత్త్వికములు అను నీమూడువిధములగు గుణములు త్రిగుణము లనంబడును. అట్టి రాగద్వేషలోభమోహాదులు, తత్కార్యములు, తత్ఫలములయొక్కయు సముదాయము "త్రైగుణ్యం" అని యనంబడును. అదియే సంసారము. అట్టి సంసారము గాంగలవి వేదములు. అనగా సంసారహేతువగు కర్మలను, తత్సాధనములను ప్రతిపాదనచేయుచు సంసారమును వృద్ధిపొందించును గాన వేదములు త్రైగుణ్యవిషయము లనంబడును. (సంసారవృద్ధి వేదోక్తకర్మాధీనము గాన వేదములు త్రైగుణ్యవిషయములని చెప్పంబడును) సంసారము వేదవిషయమగుటచే సర్వుల కుపాదేయమైనను అది ముముక్షువులకు ఆదరణీయము కాదని "నిస్త్రైగుణ్యోభవార్జున!" అను వాక్యముచే చెప్పుచుండెను. ఓ యర్జునా! నీవు మోక్షేచ్ఛచే యోగబుద్ధియుక్తుడవై స్వధర్మమునందు ప్రవృత్తుడవు కాన "నిస్త్రైగుణ్యో భవ" ప్రరోచనప్రధాన శ్రుతులవలనను, రాగద్వేషములవలనను రాగద్వేషప్రధానకర్మములవలనను నిష్క్రాంతుడ వగుము. "నిర్ద్వన్ద్వశ్చ భవ" ఇష్టానిష్టపదార్థములు రెండును ద్వంద్వశబ్దవాచ్యములు, రాగద్వేషాదిజనకములు. వానియందు సమబుద్ధిచే నా ద్వంద్వములనుండి నిష్క్రాంతుడ వగుము.

మోక్షము, తత్సాధన మగు శమదమశాంత్యాదులు కేవలసత్త్వగుణలభ్యము లగుట నిస్త్రైగుణ్యమున్నను ముముక్షువునకు సత్త్వగుణము లేనిచో నవి లభించవను నాశయముచే 'నిత్యసత్త్వస్థః' అని చెప్పంబడెను. ఎల్లప్పుడు సత్త్వగుణముగలవాడ వగుము. వివేకవైరాగ్యశమదమాదులు కలవాడ వగు మని యర్థము. యోగక్షేమములం

కోరెడివానికి రాగద్వేషాదు లవశ్యము సంభవించును. అట్టి రాగద్వేషాదులచే శమదమాదులు తొలఁగిపోవును. అందుచే సాధనవిచ్ఛిత్తి కలుగును. సాధనవిచ్ఛిత్తివలన మోక్షము సిద్ధింపదు. కాన ముముక్షువు యోగక్షేమములను వదలవలయు నను నాశయముచే "నిర్యోగక్షేమో భవ" అని చెప్పెను. ప్రారబ్ధాధీనుఁడవై యోగక్షేమములు లేనివాఁడ వగుము. మనస్సు విషయాంతరపరవశ మగుచో స్వధర్మము సిద్ధింపదు. కాన నప్రమత్తుఁడవై విషయాంతరపరవశతను వదలు మని సూచించుటకు "ఆత్మవాన్" అను పదము నుపయోగించెను. విహితకర్మములందు, శ్రవణధ్యానకీర్తనాదులయందును నుండిన యంతఃకరణముకలవాఁడ వగుము. నిశ్చలచిత్తుఁడ వగు మని యర్థము.

లేక, "న జాయతే మ్రియతే వా కదాచిత్, వేదావినాశినం" ఇత్యాదివాక్యములచేఁ బ్రతిపాదిత మగు సాంఖ్యబుద్ధి నీకు దృఢతరముగ నున్నచో నీ వీవిధమున నుండవలయు నని". జ్ఞాని కిట కర్తవ్యమును సూచించుచుండెను— సత్త్వరజస్తమోగుణములుగల జగద్బీజ మగు నవ్యాకృతము (మాయ) త్రిగుణ మనఁబడును. అట్టి యవ్యాకృతమునుండి జనించిన జగత్తు త్రైగుణ్య మనఁబడును. సర్వవేదములు నట్టి సాధ్యసాధనసాధకఫలభేదతాత్మకజగత్ప్రకాశనపరము లగును. అట్టి వేదములందు, వేదోక్తకర్మలయందు, తాదృశకర్మఫలములందును బ్రవృత్తమైన వానికి ద్వైతజ్ఞాన మబాధితమగును. అందుచే నద్వైతజ్ఞానము, అద్వైత జ్ఞాననిష్ఠయు తత్ఫలము సిద్ధింపవు కాన విద్వాంసుఁడు తన్నివృత్తుఁడై యుండవలెనని 'నిస్త్రైగుణ్యో భవ' అనుదానిచే బోధించుచుండెను— "వేదా నిమం లోక మముంచ పరిత్యజ్యాత్మాన మన్విచ్ఛేత్" అను శ్రుత్యుక్తరీతిని వేదములనుండియు, వేదోక్తకర్మములనుండియు, త్రైగుణ్యమగు జగత్తునుండియు, సర్వమునుండియు నిష్క్రాంతుఁడ వగుము. అనగా సర్వమును సంన్యసింపు మని యర్థము.

"సర్వమును సంన్యసించినను ద్వైతావలంబి యగు బహిర్ముఖునకు బ్రహ్మనిష్ఠ సంభవించదు. అందుచే జ్ఞానభ్రంశము కలుగును. దానిచే మోక్షము సిద్ధింపకుండును. కాన జ్ఞాని ద్వైతావలంబనమును పరిత్యజింపవలెనని 'నిర్ద్వంద్వః' అను పదముచేఁ జెప్పుచుండెను—నామరూపములు ద్వంద్వము అనఁబడును. అట్టి నామరూపములను గ్రహింపకుము. నిద్రించువాఁడుకూడ నామరూపములను గ్రహింపకుండును. అట్టి నామరూపాగ్రహణము విద్వాంసులకు బ్రసక్తమగును గాన దానిని నిషేధించుటకు "నిత్యసత్త్వస్థః" అని చెప్పఁబడెను—సత్తుయొక్క భావము సత్త్వ మనఁబడును. అది బ్రహ్మస్వరూపము నిత్యము నట్టి బ్రహ్మస్వరూపమునందుండువాఁడ వగుము. ఎల్లపుడు బ్రహ్మానుసంధానతత్పరుఁడ వగుమని యర్థము. "బ్రహ్మవేత్త శరీరయాత్రనుకూడ బ్రహ్మదృష్టిచేతనే చేయఁదగును. బాహ్యదృష్టిచే చేయఁగూడ"దని సూచించుటకు 'నిర్యోగక్షేమః' అని చెప్పుచుండెను—సర్పకంటకాదులవలన దేహమును రక్షించుకొనుట క్షేమ మనఁబడును. తదనుకూలద్రవ్యసంపాదనము యోగ మనఁబడును. ఈరెండును ప్రారబ్ధకర్మాధీనములగుటవలనను, జ్ఞానిదృష్టిచే దేహమే లేనందునను, ఆత్మజ్ఞానబలముచే నా రెంటిని విడుమని యర్థము. "ఎన్నడును బ్రహ్మనిష్ఠయందు ప్రమాదము లేకుండుగాక!" యని 'ఆత్మవాన్' అను పదముచే జెప్పుచుండెను. బ్రహ్మాకారవృత్తి ఆత్మ యనఁబడును. ఎల్లపు డట్టి యాత్మాకారవృత్తి కలవాఁడవగుమని యర్థము. లేక, ఎల్లపుడు నహంబుద్ధివిషయ మాత్మ యగుఁగాక; ఎన్నడు నహంబుద్ధివిషయము ప్రమాదముచేతనైన నాత్మ కాకుండుఁగాక యని తలచి "ఆత్మవాన్భవ" అని చెప్పెను. ఎచ్చటను, ఎన్నడును అనాత్మను "అహం" అను బుద్ధివిషయముగఁ జేసికొనకుమని యర్థము.

భాష్యోత్కర్షదీపిక:— వేదవాదరతులకు వేదోక్తత్రిగుణాత్మకసంసారమే ఫలమను నాశయమును 'త్రైగుణ్యవిషయాః' అను శ్లోకముచే చెప్పుచున్నాడు. సంసారమే వేదములచే చెప్పఁబడునో అట్టి కర్మకాండపరమగు వేదములు త్రైగుణ్యవిషయములు అనఁబడును. కాన నీవు "నిస్త్రైగుణ్యో భవ" నిష్క్రాంతుఁడవగుము. ఈశ్లోకమున "హే అర్జున" అను సంబోధనచే ఓ యర్జునా! నీవు నీనామమును సార్థకము చేసికొనుటకు తగుదువని

సూచింపబడెను. నిస్త్రైగుణ్యుడగుటయందుపాయము 'నిర్ద్వంద్వః' అను పదముచే చెప్పుచుండెను. సుఖదుఃఖ హేతువులు, పరస్పరవిరుద్ధములు ద్వంద్వము లనబడును. అట్టి ద్వంద్వరహితుడవగుము. ద్వంద్వరాహిత్యమున కుపాయమును 'నిత్యసత్త్వస్థః' అను పదముచే చెప్పుచుండెను. నిత్యము సత్త్వమునందుండుము. నిత్యసత్త్వస్థితి కుపాయమును "నిర్యోగక్షేమః" అనుపదముచే చెప్పుచుండెను. అనుపాత్తద్రవ్యము యొక్క యుపాదానము యోగమనబడును. ఉపాత్తద్రవ్యరక్షణము క్షేమమనబడును. ఇట్టి యోగక్షేమరహితుఁడవగుము. అనగా రజోగుణరహితుఁడవగుమని యర్థము. 'ఆత్మవాన్' అప్రమాదుడవగుము; తమోగుణరహితుడవగుము. ఇచట తత్త్వమిది: రజస్తమోగుణరహితుఁడు సత్త్వమునందు స్థితిగలిగి దానివలన ద్వంద్వాతీతుడై నిష్కాముఁడగును. కావున నో యర్జునా! నీవుకూడ నట్టివాడవగుమని భావము.

పరమార్థప్రపా:— "స్వర్గాదికము ఫలమే కానిచో తత్సాధనభూతములగు కర్మలు వేదములచే నెట్లు విధింపబడుచుండును?" అని యాశఁకించి కర్మవిధాయకవాక్యములకుమతియొక తాత్పర్యముకలదని "త్రైగుణ్యవిషయా వేదాః" అను శ్లోకముచే జెప్పుచుండెను.

ఇచట వేదములకు కేవల త్రైగుణ్యవిషయత్వమునే యంగీకరించినచో భగవదుపదిశ్యమానమగు నిస్త్రైగుణ్యము వేదామూలక మగుటచే నుపదేశానర్హమగును. అటులుగాక యుపదేశార్హమే యగునందమన్న 'తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ' "వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః" అని మున్ముందు భగవంతుడు చెప్పుట యసంగతమగును. కాన నీశ్లోక మన్యథా వ్యాఖ్యానింపఁబడుచుండెను.

అధికారానుగుణముగ సత్త్వాదిగుణత్రయసంబంధియగు ఫలము త్రైగుణ్యమనఁబడును. అట్టి ఫలములను నిరూపించు వేదములు కలవు. కాని నీవుమాత్రము సాత్త్వికఫలమునందు నిత్యసత్త్వస్థుడవై నిస్త్రైగుణ్యుఁడవగుము. నిత్యము శుద్ధమగు సత్త్వమునందుండుటచే తత్త్వజ్ఞానముకలవాడవై గుణత్రయాతీతుఁడవగుము. "ఉపాసనాయాం య దవంచకత్వం వాక్కాయచిత్తేషు తదేవ సత్త్వం" (మనోవాక్కాయములయందు ఉపాసనావిషయమైన యవంచకత్వమే సత్త్వమనఁబడును.) వేదముచేఁగూడ నుపాసనయందు శబలశుద్ధభేదముచే రెండు విధములుగ సత్త్వము నిర్వచింపబడెను. అందు స్వర్గసుఖమును కలుగఁజేయునది మొదటిది. తత్త్వజ్ఞానమును కలుగఁజేయునది రెండవది. ఈ విషయమునే శ్రీకృష్ణపరమాత్మయు మున్ముందు "తత్ర సత్త్వం నిర్మలత్వాత్ప్రకాశక మనామయం। సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ" (గీ అ-14 శ్లో-6) అని నిరూపింపఁగలఁడు. అథర్వోపనిషత్తునందలి శ్రుతియు "వేదాన్త విజ్ఞానసునిశ్చితార్థా స్సంన్యాసయోగా ద్యతయ శ్శుద్ధసత్త్వాః। తే బ్రహ్మలోకే తు పరాన్తకాలే పరామృతాత్పరిముచ్యన్తి సర్వే" అని యీ విషయమునే బోధించుచున్నది. మిగిలిన శ్లోకార్థము స్పష్టము. పర్యవసితార్థ మేమన? శుద్ధసత్త్వముచే రజస్తమస్సుల నభిభవించిన క్రమక్రమముగ జ్ఞానోత్పత్తియగును. అద్దానివలన పుష్పఫలన్యాయమున సత్త్వ ముపశమింపఁగ నిస్త్రైగుణ్యత్వమే పర్యవసన్న మగును.

లేక 'త్రైగుణ్యమేవ విషయం త్రైగుణ్యవిషయం తద్యాపయన్తి తిరస్కుర్వన్తి తే త్రైగుణ్యవిషయా ఏవం విధా వేదాః' త్రిగుణసంబంధియగు స్వర్గాదిఫలము జన్మమరణపర్యవసాయియగుటచే బంధహేతువగుటవలన విష(ఘాతుక) మనంబడును. అట్టి విషమును తిరుగ నుపనిషద్విభాగములచే తిరస్కరించునవి గాన వేదములు త్రైగుణ్యవిషయములు అనఁబడును. 'ఇట్టివని తెలిసియు వానివిధాన మెందుల' కనిన-రోగార్తుడగు శిశువు కటువగు నౌషధమును గ్రహింపకుండును. అత్తరి తల్లి "నాయనా! యీ పాత్రయందు శర్కర నిక్షిప్తము" అని యా పిల్లవానిని లోభపెట్టును. పిల్లవాడు శర్కరామాధుర్యేచ్ఛచే నా యౌషధమును గ్రహించును. కాని తల్లి తాత్పర్య మారోగ్యమునందే కాని మాధుర్యమునందు కాదు. అట్లె శరీరాయాసద్రవ్యములచే నతి క్లేశసాధనములగు కర్మములయందు శీఘ్రముగఁ

ప్రవృత్తి కలుగకుండును. కాన నట్టి ప్రవృత్తిని గలుగఁజేయుటకు ప్రరోచనార్థము ఫలశ్రుతి చెప్పఁబడెను. కాన నో యర్జునా! నీవు త్రైగుణ్య (సంసార) తిరస్కారక వేదార్థమును సేవింపుము. వ్యతిరేకముఖమున త్రైగుణ్యమునకు విషరూపత్వమును "నిర్ద్వంద్వః" అను పదముచే చెప్పుచుండెను. శీతోష్ణాది ద్వంద్వములు, తదసహిష్ణుత్వము, అప్రాప్తమగు పదార్థముయొక్క ప్రాప్తియనెడి యోగము, ప్రాప్తసంరక్షణమనెడి క్షేమము, సావధానత్వము అను నివన్నియు దుఃఖహేతువులై త్రైగుణ్యవిషయమునందు సంభవించును. కాన నివి విషరూపములు. నిస్త్రైగుణ్యమునం దివి సంభవములు కావు. కాన నిత్యసత్త్వస్థుఁడవై, ధైర్యవంతుఁడవై, సావధానుఁడవగుము.

శ్రీధరీయము:—స్వర్గాదికము పరమఫలము కానిచో వేదములచే స్వర్గాదిసాధనముగఁ గర్మ మెందులకు విధింపఁబడెను? అను నాశంకను తొలగించుటకు 'త్రైగుణ్యవిషయా వేదాః' అని చెప్పెను. సకాములగు నధికారులకు కర్మఫలసంబంధప్రతిపాదకములు వేదములు. ఓ యర్జునా! నీవు నిస్త్రైగుణ్యుఁ (నిష్కాముఁ)డ వగుము. అట్టి నిష్కామత్వమును సంపాదించుట కుపాయమును "నిర్ద్వంద్వః" అనుదానిచే చెప్పుచుండెను. సుఖదుఃఖములు, శీతోష్ణములు, మానావమానములు, శత్రుమిత్రులు మొదలగునవి ద్వంద్వము లనంబడును అట్టి ద్వంద్వరహితుడ వగుము. అనగా నిట్టి ద్వంద్వములను సహించు విధ మేదనిన? 'నిత్య సత్త్వస్థః' ధైర్యము నవలంబించి, యోగక్షేమరహితుడవై, అప్రమత్తుఁడవై ద్వంద్వసహిష్ణుడ వగుము. ద్వంద్వాకులునకు, యోగక్షేమములను కోరెడివానికి. ప్రమత్తులకు త్రైగుణ్యము నతిక్రమించుట సంభవింపదు.

నీలకంఠీయము:— "కర్మకాండప్రతిపాదకవేదాపహృతచేతస్కులకు సమాధియందు బుద్ధి సంభవింపనిచో నిం కెవనికి సమాధియందు బుద్ధి సంభవించును?" అను నాశంకను దొలగించుటకు 'త్రైగుణ్యవిషయా వేదాః' అని చెప్పమొదలిడెను.

సత్త్వరజస్తమస్సులు త్రిగుణము లనఁబడును. అందు సత్త్వకార్య మూర్ధ్వలోకగతి, రజోగుణ కార్యము మధ్యలోకగతి, తమోగుణ కార్య మధోలోకగతి, ఇట్టిగతియే సంసరణ మనఁబడును. అట్టి సంసరణమును ప్రకాశింపఁజేయునవి కర్మకాండపర మగు వేదములు. ఓ యర్జునా! నీవైతే నిస్త్రైగుణ్యుఁడ వగుము. అనఁగా నూర్ధ్వలోకగతియందు కూడ విరక్తుఁడ వగుము. ఆయా గుణప్రధానమగు గతత్రయమును "ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః । జఘన్యగుణవృత్తస్థా అధో గచ్ఛన్తి తామసాః" (గీ–14 శ్లో–18) అను శ్లోకముచేఁ జెప్పఁగలడు. ఈ చెప్పుటవలనఁ దేలినయాశయ మేమన? స్వర్గాదిసంబంధమగు విషయములనుండియుకూడ విరక్తుఁడగువాడే సమాధియోగమునం దధికారి యగు నని భావము. ఇట్టి నిస్త్రైగుణ్యు డెట్టి లక్షణములు కలవాడగుననిన? "నిర్ద్వంద్వః" సుఖదుఃఖములు, మానావమానములు, శత్రుమిత్రులు, శీతోష్ణములు మొదలగువిరుద్ధపదార్థములు ద్వంద్వము లనబడును. అట్టి ద్వంద్వములనుండి నిర్గతుఁడగును. అనగా సర్వత్ర సమబుద్ధి కలిగియుండును. బాధపెట్టెడియుష్ణాదికము శీతమువలె సహించుట కెట్లు శక్యమైన దనిన? 'నిత్యసత్త్వస్థః' ధీరుడు సర్వమును సహించుటకు సమర్థుఁడగును. లేక సాత్త్వికుడైనను "ఈదుఃఖము ప్రారబ్ధకర్మమువలన బ్రాప్తించినది. యపరిహార్యము: తపించి యేమి ప్రయోజన"మని తెలిసికొని సర్వమును సహించుటకు సమర్థుడగును. నిస్త్రైగుణ్యముచే బ్రవృత్తిశూన్యుడతిదుస్సహ క్షుధాదిదుఃఖము నెటుల సహింపగల డను శంకనుతొలగించుటకు 'నిర్యోగక్షేమః' అని చెప్పెను. అప్రాప్త ప్రాప్తి యోగమనియు, ప్రాప్తపరిరక్షణము క్షేమమనియు చెప్పబడెను. ఈరెండును ప్రారబ్ధకర్మాధీనమని యీ రెంటిని విడుచువాడు క్షుధాదిదుఃఖమును సహించును. ఈరెంటిని విడుచుటకు హేతు వేదియను శంకను తొలఁగించుటకు 'ఆత్మవాన్' అని చెప్పెను. జితచిత్తుడని యర్థము. అట్టివాడు సర్వాపత్తులయం దనాసక్తుడై నిత్యతృప్తుఁ డగుటచే నుద్యమరహితుఁ డగును. కాన నీవుకూడ నిస్త్రైగుణ్యుఁడ వగుమని యర్థము. ॥౪౫॥

గీ॥ యావా నర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే ।
తావా న్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః ॥ ॥౪౬॥

పదవిభాగము:— యావాన్- అర్థః- ఉదపానే- సర్వతః- సంప్లుతోదకే- తావాన్- సర్వేషు- వేదేషు- బ్రాహ్మణస్య- విజానతః । ॥౪౬॥

ప్రతిపదార్థము:— ఉదపానే=కూపతటాకాదులయందు; యావాన్=ఎంతపరిమాణముగల స్నానపానాదిరూపమగు; అర్థః=ఫలము; సంభవతి=(ఈపదమధ్యాహార్యము) సంభవించుచున్నదో; సః=ఆఫలము; సర్వతః=అంతటను; సంప్లుతోదకే=వ్యాప్తమైన యుదకమునందుగల ఫలమునందే; తావానేవ=ఆకూపతటాకాదులయందు సంభవించెడిఫల మంతర్భవించుచున్నది; సర్వేషు=నిఖిలమగు; వేదేషు=వేదోక్తకర్మలయందు; యావానర్థః=ఎంతఫలము: అస్తి=కలదో; విజానతః=ఆత్మజ్ఞానసంపన్నుఁడగు; బ్రాహ్మణస్య=బ్రాహ్మణునకు; యోఽర్థః=విజ్ఞానమువలనఁ బ్రాప్తించెడి యెంతఫలముకలదో; తస్మిన్=(ఈపదమధ్యాహార్యము) ఆవిజ్ఞానఫలమునందు; తావానేవ=అకర్మఫల మంతర్భవించుచున్నది. ॥౪౬॥

శాంకరభాష్యమ్:—

సర్వేషు వేదోక్తేషు కర్మసు యా న్యనన్తాని ఫలాని తాని నాపేక్షనే చే త్కిమర్థం తా నీశ్వరా యే త్యనుష్ఠీయన్త ఇతి. ఉచ్యతే, శృణు— యావా నితి । యథా లోకే కూపతటాకా ద్యనేకస్మి న్నుదపానే పరిచ్ఛిన్నోదకే యావా న్యావత్పరిమాణ స్స్నానపానాది రర్థః ఫలం ప్రయోజనం; స సర్వోఽర్థ స్సర్వత స్సంప్లుతోదకే తావా నేవ సంపద్యతే తత్రాన్తర్భవతీ త్యర్థః । ఏవం తావాం స్తావత్పరిమాణ ఏవ సంపద్యతే సర్వేషు వేదేషు వేదోక్తేషు కర్మసు

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వేదోక్తం బగు నిఖిలకర్మలయందు "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అనునది మొదలుగఁ గల శ్రుతివాక్యములచే నే యనంతఫలములు చెప్పఁబడెనో అట్టి ఫలముల నపేక్షించనిచో నిష్ఫలముగ నాకర్మల నీశ్వరునికొఱ కెందుల కాచరింపవలయును? అని శంకించెదవా? కర్మయోగము యొక్క యర్థవత్త్వమును చెప్పెద వినుము. పరిచ్ఛిన్నోదకము లపరిచ్ఛిన్నోదకాంశములుగాన నేతీరున లోకమునందు పరిచ్ఛిన్న మగు నుదకములు గల కూపతటాకాదులం దు సంభవించెడి యే స్నానపానాదిరూపం బగు ప్రయోజనము కలదో యట్టి ప్రయోజనంబు— అంతట వ్యాపించియున్న యుదకముగల పెద్దప్రవాహములయం దేప్రయోజనముప్రాప్తించునో అట్టి ప్రయోజనమునం దంతర్భవించుచున్నది. (అనగా కూపతటాకాదులయందు ప్రాప్తించు ఫలము స్నానము, పానము. అట్టి స్నానపానాదులు ప్రక్కను గంగాప్రవాహము ప్రవహించు

—• ౨వ అధ్యాయము ౪౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "సర్వకామనాపరిత్యాగపూర్వకముగఁ గర్మముల నాచరించనిచో నాయా కర్మజన్యములగు నానందములు నాకు ప్రాప్తించకపోయెడిని" అను నాశంకను "యావానర్థః" అను శ్లోకముచేఁ దొలగించుచుండెను.

శాంకరభాష్యమ్:—

యోఽర్థో య త్కర్మఫలం- సోఽర్థో బ్రాహ్మణస్య సంన్యాసినః పరమార్థతత్త్వం విజానతో యోఽర్థో విజ్ఞానఫలం సర్వత స్సంప్లుతోదకస్థానీయం తస్మిం స్తావానేవ సంపద్యతే తత్రైవాన్తర్భవతీత్యర్థః। "సర్వం తదభిసమేతి యత్కించ ప్రజా స్సాధు కుర్వన్తి యస్త ద్వేద యత్స వేద" (ఛాం-4-1-4) ఇతి శ్రుతేః। "సర్వం కర్మాఖిలం" (గీ-౩-౩) ఇతి చ వక్ష్యతి। తస్మాత్ప్రాక్ జ్ఞాననిష్ఠాధికారప్రాప్తేః కర్మ ణ్యధికృతేన కూపతటాకా ద్యర్థస్థానీయ మపి కర్మ కర్తవ్యమ్ ॥ ॥౪౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

చుండిన అట్టి ప్రవాహమువలన బ్రాప్తించెడి యేప్రయోజనము కలదో అట్టి అధికప్రయోజనమునం దంతర్భవించును) అదేవిధమున నిఖిలవేదోక్తకర్మయం దేకర్మఫలము చూపఁబడెనో అకర్మఫలము— సర్వకర్మపరిత్యాగ మొనరించి పరమార్థతత్త్వమును దెలిసికొనినబ్రాహ్మణునకు విజ్ఞానమువలన నేఫలము ప్రాప్తించునో అట్టి విజ్ఞానఫలమునం దంతర్భవించుచున్నది. (అనగా వేదోక్తములగు కర్మల నాచరించినచో తత్ఫలమువలన శబ్దస్పర్శరూపరసగంధాత్మకము లగు విషయసంబంధమువలన సుఖవిశేషములు జనించుచుండును. అట్టి సుఖవిశేషము లన్నియు పరిచ్ఛిన్నానందములు కానఁ బరిచ్ఛిన్నానందము లపరిచ్ఛిన్నానందమునం దంతర్భవించునుగాన జ్ఞానియొక్క స్వరూపంబగు సుఖమునం దంతర్భవించుచున్నది. ఈవిషయమునే "ఏతస్యైవానంద స్యాన్యాని భూతాని మాత్రా ముపజీవన్తి" అను శ్రుతిగూడ బోధించుచున్నది. కాన పరిచ్ఛిన్నానందప్రాప్తికి సాధన మగు కర్మయోగమునకు మోక్షఫలము బ్రాప్తింపనేరదు. కర్మఫలమంతయు జ్ఞానఫలమునం దంతర్భవించు ననుటయం దేమి ప్రమాణమనెదవా? "సర్వం త దభిసమేతి యత్కించ ప్రజా స్సాధు కుర్వన్తి యస్త ద్వేద యత్స వేద" (ఏవస్తువును రైక్వుఁడు తెలిసికొనెనో అట్టి వస్తువును దెలిసికొనినచో— ప్రజలు యేసత్కర్మను జేయుచుండిరో అట్టి సత్కర్మఫలమునంతను బొందును. అను శ్రుతియే ప్రమాణము. ఈశ్రుతి సంవర్గవిద్యయందుఁ జదివఁబడినది. అచట కర్మఫలమునకు సగుణజ్ఞాన

క్షుద్రజలాశయములయందు దెంతటిస్నానపానాదిప్రయోజనము సంభవించునో; అట్టిప్రయోజనము మహాజలాశయమునందు సంభవించును. కొండకాల్వలంతటను ప్రవహించుచు నొకానొకపర్వతప్రాంతదేశమునకు జేరును. అచట నొక్కొక్క కొండకాల్వయందుగల ప్రయోజన మాసమాశేశమునం దెట్లు లభించునో అదే విధమున వేదోక్తములగు నిఖిల కామ్యకర్మములయం దేహిరణ్యగర్భానందపర్యంతప్రయోజనము సంభవించునో ఆయానందరూపప్రయోజనము బ్రహ్మతత్త్వమును సాక్షాత్కరింపజేసికొనిన బ్రహ్మభుబూషువునకు సంభవించును. "ఏతస్యానంద స్యాన్యాని భూతాని మాత్రా ముపజీవన్తి" అను శ్రుత్యుక్తరీతిని క్షుద్రానందములు (వైషయికానందములు) బ్రహ్మానందాంశము లగుటచేఁ బ్రహ్మానందమం దంతర్భవించును. ఆనంద మొకటియైనను అవిద్యాకల్పితతత్త్వదుపాధుల ననుసరించి యనేకత్వము ఘటాద్యవచ్ఛేదకల్పనచే నాకాశమునకువలె వ్యపదిష్టము. (కల్పితము)

శాంకరభాష్యతత్త్వబోధిని:—
ఫలమునం దంతర్భావ మని చెప్పఁబడెను. కాన నిర్గుణజ్ఞానఫలమునం దంతర్భావ మని చెప్పఁబడలేదే. ఇంతమాత్రముచే నిర్గుణజ్ఞానఫలమునందు కర్మఫల యంతర్భవించునని చెప్పుట యెట్లు సంభవించు ననిన నీగీతలయందే "సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే" అని యీవిషయమునే శ్రీకృష్ణపరమాత్మ బోధింపఁగలడు. అటులైన జ్ఞాననిష్ఠయే యాచరింపఁదగినది. దాని వలననే కర్మఫలము ప్రాప్తించుచుండ కర్మనిష్ఠ వ్యర్థమేనా యని శంకింపజనదు.

ఎంతవరకు జ్ఞాననిష్ఠాధికారము ప్రాప్తింపదో అంతవరకు కర్మలయం దధికారముగల వాఁడు కూపతటాకాద్యర్థస్థానీయ మగు కర్మను తప్పక యాచరింపవలయును. (అట్టి కర్మ యోగము సత్త్వశుద్ధిద్వారమున జ్ఞాననిష్ఠాయోగ్యతకు సాధనమగుటంజేసి కర్మయోగము నిష్ఫలమను నాశంక దొలగింపఁబడెను).

---

కాన నిష్కామకర్మలచే శుద్ధాంతఃకరణుఁడవగు నీకు తత్త్వజ్ఞానము కలిగిన బ్రహ్మానందప్రాప్తి యగును. అట్టి బ్రహ్మానందప్రాప్తి చేతనే సర్వానందములు ప్రాప్తించుచుండ వైషయికానందములు ప్రాప్తించలేదని వ్యగ్రత (తొందరపాటు) కవకాశములేదు. కాన పరమానందప్రాపక మగు తత్త్వజ్ఞానముకొఱకు నిష్కామకర్మముల నాచరించుమని యాశయము.

"ఉదపానే యావానర్థః సర్వతస్సంప్లుతోదకే । తావానర్థః యథా భవతి తథైవ సర్వేషు వేదేషు యావానర్థస్తావానర్థః విజానతో బ్రాహ్మణస్య భవతి" అని యన్వయింపదగును. ఇట్టి యన్వయమునందు "యథా, తథా భవతి" అను మూడు పదము లధ్యాహార్యములు. దార్ష్టాంతికమునందు "యావాన్, తావాన్" అను పద ద్వయమున కనుషంగము.

శంకరానందీయము:— 'బ్రహ్మవేత్త శ్రుత్యుక్తసర్వకర్మలను సంన్యసించినచో "సాధనము లేనిదే ఫలము ప్రాప్తించదు" అనున్యాయమున నాయాకర్మవిశేషలభ్యమగు సుఖవిశేషములు సంభవింపవు. అట్లయినచో నున్మత్తుని ప్రవృత్తివలె నీబ్రహ్మవిదుని ప్రవృత్తియు నిష్ఫలమేయగు" నని శంకింపజనదు. 'సర్వం పదంహస్తిపదే నిమగ్నం' (ప్రతిపదము ఏనుగుపదమునందు నిమగ్నము) అను న్యాయమున సత్క్రియాలభ్యములగు సార్వభౌమాదిబ్రహ్మపర్యంత మగు నానందములన్నియు బ్రహ్మానుభూతియందున్న యాయాథునకు సంభవించు నని "యావానర్థ ఉదపానే" అనుశ్లోకముచే సదృష్టాంతముగ నుపపాదించుచుండెను.

"ఉద ముదకం పిబన్త్యస్మి న్నిత్యుదపానం జలాశయః" దేనియం దుదకమును త్రావెదవో అదిఉదపాన మనఁబడును. జలాశయము. 'ఉదపానః' అను స్థలమునందుగల యేకవచనము జాతిపరము (అనగా భూమియందు సర్వత) నుండు జలాశయములు చెప్పబడును). భూమియందు సర్వత్రనుండు వాపీ, కూప, తటాక, పుష్కరిణీ, నద, నద్యాదులగు పుణ్యతీర్థములందు స్నానదానార్చనాదిక్రియలచే నెంతపరిమాణముకల పుణ్యము సిద్ధించునో 'సర్వతస్సంప్లుతోదకే' 'సర్వత్ర సంప్లుతం పరిపూర్ణ ముదకం యస్య సః' (దేనిసంబంధమగునుదకము సర్వత్ర పరిపూర్ణమో) అను విగ్రహముచే చెప్పబడు సముద్రమునందు స్నానదానార్చనాదిక్రియలచే లభ్యమగు పుణ్య విశేషము 'తావానేవ' గంగాదిపుణ్యతీర్థములయందు వేరువేరుగ నాచరింపబడిన స్నానదానార్చనాదిక్రియా విశేషలభ్యపుణ్యవిశేషములతో సమానమగు పరిమాణము కలదియైసిద్ధించును. 'శతే పంచాశత్' (నూరు రూప్యములయం దేబదిరూప్యము లంతర్భవించును) అను న్యాయమున బరిచ్ఛిన్నజలాశయములగు గంగాదులు సము

శ్రీమునం దింతట్ల్యపిరుచుటచే గంగాముఖముం దాచరింపఁబడిన క్రియావిశేషములవలన జనించెడి పుణ్యముకంటె సముద్రస్నానమువలనఁ గలిగెడి పుణ్యము తక్కువ కాదని యర్థము. ఈవిధముననే ఋగాదిసర్వవేదములయందును ప్రసిద్ధ మగు యజ్ఞయాగదానాధ్యయనవ్రతతపోయోగాదులచేతను, ఇతర మగు పుణ్యవిశేషములచేతను సంపాదింపఁబడు సార్వభౌమాదిబ్రహ్మాంత మగు శ్రుత్యుక్తానందము పునః పునః శతగుణితమై యెంత సంభవించునో, అంతపరిమాణముకల యానందము— 'ఈనిఖిలప్రపంచము, నేను బ్రహ్మస్వరూపమే' అని నిఖిలజగత్తును, తనను సచ్చిదానందరూప మగు బ్రహ్మముగఁ దెలిసికొనిన బ్రహ్మవిత్తగు యతికి బ్రహ్మానుభూతిచే సిద్ధించును. కాన "స మోదతే మోదనీయం హి లబ్ధ్వా" అను శ్రుత్యుక్తరీతిని బ్రహ్మవేత్త నిత్యానందుఁడే యగును.

లేక, సర్వత్ర భూమియందుండు వాపీకూపతటాకనదనద్యాదులగు జలప్రదేశములయందుఁగల జల మెంత పరిమాణముకలదో, అట్టి పరిమాణముకల జలము సముద్రమునం దేకదేశస్థిత మగు జలముయొక్క యంశముగ నెట్లు సంభవించునో ఆవిధముగ "వేదేషు శబ్దాదివిషయజాతం విదన్తి జానంతీతి వేదాః, విదధాతోః కర్తర్యచ్" విదధాతువునకు కర్త్రర్థమునం దచ్ అను ప్రత్యయము చేసినచో శబ్దాదివిషయజాతమును తెలిసికొనువారు "వేదాః" అని యనంబడుదురు. అట్టి బ్రహ్మాదిపిపీలికాంతనిఖిలప్రాణులయందు పుణ్యకర్మపరిపాకమువలన విశిష్టసాన్నిధ్యముచేఁ బ్రతీయమానానంద మెంతపరిమాణముకలదో, ఆయానంద మంతయు సర్వతః సంప్లుతోదకస్థానీయమగు బ్రహ్మయందుఁగల యానందముయొక్క లేశాంశము. ఈవిషయమునే "ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రా ముపజీవన్తి" అను శ్రుతియు బోధించుచున్నది. ఈవిధముగనే స్వప్రతిబింబలేశాంశమాత్రముచే బ్రహ్మాదిపిపీలికాంతప్రాణిజాతమునకు తత్తత్పుణ్యవిశేషతారతమ్యముచే సుఖతారతమ్యము నిచ్చుచున్నట్టియు, సర్వతస్సంప్లుతోదకస్థానీయము, అద్వితీయము, సత్యజ్ఞానానందఘనము నగు పరబ్రహ్మమును "ఈ పరబ్రహ్మమునే నేను" అని స్వస్వరూపముగ సాక్షాత్కార మొనరించుకొనిన బ్రహ్మవేత్తచే నఖండాకారవృత్తిచే నెల్లప్పు డనుభూయమానము, అనంతము నగు బింబానంద 'మిట్టిలక్షణము కలది, ఇంతపరిమాణముకల' దని యెవనికిని చెప్పుటకు శక్యము కాదని యర్థము.

భాష్యోత్కర్షదీపిక:— (ఈ శ్లోకార్థమునందు శ్రీమద్భాష్యకారులు చెప్పినవిధముననే భాష్యోత్కర్షదీపికాకారులు చెప్పి "ఈ శ్లోకమునందు బ్రాహ్మణపదగ్రహణము బ్రహ్మవిద్యయందు బ్రాహ్మణునకే ముఖ్యాధికారమని సూచించుట" కని, విశేషమును జూపిరి.

పరమార్థప్రపః:— వేదములకు పరమార్థాధిగమనమునందే తాత్పర్యముగాన వేదతాత్పర్యమును తెలిసికొనిన పురుషుని "యావానర్థః" అను శ్లోకముచే స్తుతించుచుండెను.

స్నానమునకు పర్యాప్తమగు నుదకముకల నిర్ఝరపల్వలాదికమునందు పరిభ్రమణ మొనరించిన పురుషున కెంత ప్రయోజనము కలదో అంతప్రయోజనము మహాహ్రదమునందు సిద్ధించుచున్నది. ఈవిధముగనే పూర్వోత్తర మీమాంసాది నిఖిలధర్మములయం దొకటి కర్మనైష్కర్మ్యద్వయర్థము నిరూపింపఁబడెనో ఆ కర్మనైష్కర్మ్యద్వయార్థగుంభితయు విశేషముగ వేదతాత్పర్యమును తెలిసికొనిన బ్రహ్మజ్ఞానికి సంప్లుతోదకస్థానీయవేదములయందు సిద్ధించును.

నీలకంఠీయము:— చిత్తశుద్ధి యున్నచో శాస్త్రవంతుఁ డగును. అట్టి చిత్తశుద్ధి సకలకర్మానుష్ఠానముచే సాధింపనగును. కాని నిస్త్రైగుణ్యత్వము దుర్లభమని యాశంకించుకొని "యావానర్థః" అని చెప్పమొదలిడెను.

"సర్వతః సంప్లుతోదకే మహతి ఉదపానే జలాశయే పురుషస్య యావానర్థో యావత్స్నానపానాదికం ప్రయోజనం ఘటమాత్రజలనిర్వర్త్యం భవతి" గొప్పజలాశయమునందు (మడుగునందు) పురుషునకు స్నానపానాదికము ఘటమాత్రజలముచే సాధింపఁదగినదై యగును. అట్లే వ్యుత్పన్న చిత్తుఁడగు బ్రహ్మ మనుభవింపవలయు

నను ఇచ్ఛగల పురుషునకు సర్వవేదములయందుఁగల ప్రయోజనము వేదైకదేశమగు నుపనిషత్తుల శ్రవణమాత్రముచేతనే సిద్ధించును. ఒకజన్మమునందు నిఖిలవేదోక్తకర్మానుష్ఠానము సంభవింపనందున నట్టి ప్రయోజనసిద్ధి నిఖిలవేదోక్తకర్మానుష్ఠానము నపేక్షించదు. ఈజన్మమునందు కాని, జన్మాంతరమునందు కాని యాచరింపఁబడిన జపాదులచే చిత్తశుద్ధికలిగి దానివలన నుపనిషచ్ఛ్రవణద్వారమున నిస్త్రైగుణ్యత్వము సంభవించు నని భావము.

కొందఱువృద్ధులు:— క్షుద్రానందములు బ్రహ్మానందమునందంతర్భవించుటచే ననేక కూపస్వరూపోదపానీయస్థానీయ మగు నిఖిలవేదోక్తకర్మముల ననుష్ఠించిన నెంతప్రయోజనము సిద్ధించునో ఆ ప్రయోజనమంతయు సర్వతస్సంప్లుతోదకస్థానీయమగు నాత్మజ్ఞానము కలిగినచో సిద్ధించును.

కృతాయవిజితాయాధరేయాః సంయన్త్యేవ మేవైనం సర్వం తదభిసమేతి యత్కించప్రజాస్సాధు కుర్వన్తి యస్తద్వేద యత్స వేద" కృతాయ మనఁగ జూదము (అదెట్లనిన? జూదమాడు గుఱుపగుండ్లు నాలుగు; ఒక్కొక్కగుండునకు నాలుగుఫలకములుండును. అందు మొదటిఫలకమునం దొకగీటును, రెండవఫలకమునందు రెండుగీట్లును, మూడవఫలకమునందు మూడుగీట్లును, నాల్గవఫలకమునందు నాల్గు గీట్లును కలిగియుండును. అందొక గీటునకు కృతమనియు, రెండుగీట్లకు త్రేతయనియు, మూడుగీట్లకు ద్వాపరమనియు, నాల్గుగీట్లకు కలియనియు పేర్లు. నట్టిగోళములచే నిర్వర్తింపఁబడు జూదమునకు కృతాయమని పేరు.) అట్టిజూదమునందు గెలుపొందినవానికి మిగిలిన వారందరు తమపందెముల నిచ్చినట్లు, ఎవఁడాత్మను తెలిసికొనునో వానిని ప్రజ లేసుకృతము నాచరించిన నదంతయు పొందును: అను శ్రుతియు జ్ఞానమునందు సర్వకర్మఫలాంతర్భావమును చెప్పుచున్నది. మఱియు "సర్వంకర్మాఖిలంపార్థ! జ్ఞానే పరిసమాప్యతే" అను గీతావచనముకూడ నీవిషయము నే దెలుపుచున్నది. కావునగంగా తుల్యజ్ఞానోదయమునకు పూర్వమునందే కూపస్థానీయనిఖిలకర్మము లాచరింపదగినవని భావము. అని వ్యాఖ్యానించిరి. ఈపక్షమునందు పూర్వార్ధమునందు "అనేకస్మిన్: యథా, తథా, భవతి" అని పద చతుష్టయ మధ్యాహార్యము. ఉత్తరార్ధమునందు "యావాన్, తావాన్" అను పదద్వయమున కనుషంగము చేసుకొనవలయును.

గీతారహస్యవిమర్శనము:— "ఈశ్లోకముయొక్క ఫలితార్థవిషయమున మతభేదములు లేవు. కాని దాని యందున్న శబ్దములను టీకాకారులు వ్యర్థముగ చీకాకుపరచిరి. "సర్వత స్సంప్లుతోదకే" అనునది సప్తమ్యంతమగు సామాసికపదము. కాని సప్తమ్యంతముమాత్రమే యని కాని, లేక, యుదపానమునకు విశేషణ మని కాని యనుకొనక "సతిసప్తమి" అని యందుమేని "సర్వత స్సంప్లుతోదకే సతి ఉదపానే యావానర్థః (న స్వల్పమపి ప్రయోజనం విద్యతే) తావా న్విజానతః బ్రాహ్మణస్య సర్వేషు వేదేషు అర్థః" అని యేవో కొన్ని లేనిపదముల నధ్యాహార్యము తెచ్చుకొన నవసరములేకయే సరళ మగు నన్వయము కుదురును. "నలుదిక్కులయందును జలమే వ్యాప్తమై యుండుటచేత (అనాయాసముగ త్రాగుటకు సరస మగు నుదకము లభించినచో) నేరీతిగ వాపీకూపాదులను విచారింపరో, అటులనే జ్ఞానము సిద్ధించినవానికి యజ్ఞయాగాదివైదికకర్మలవలన నుపయోగ మేమియు నుండ దని దానికి సరళమైన యర్థము చెప్పనొప్పును" అని శ్రీబాలగంగాధరతిలక్మహాశయులవారి గీతారహస్యమున నీగీతావివరణయందే చెప్పియుండిరి. ఇట కొంచెము విచారించెదము—

గీతాశాస్త్రము వేదమూలకమా? లేక, కేవల పురుషబుద్ధిపరికల్పితమా? కేవల పురుషబుద్ధిపరికల్పితమనిన పౌరుషేయము కావలసివచ్చును. అటులైనచో పురుషబుద్ధి ప్రమాదదోషదూషిత మగుటంజేసి యప్రమాణము కావలసివచ్చును. కాన వేదమూలకమే యని యొప్పుకొనవలయును. వేదమూలకము గీతాశాస్త్ర మగుచో వేదము స్వతఃప్రమాణమగుటచే తన్మూలకమగు నీ గీతాశాస్త్రముకూడ ప్రమాణమగును. ఈ విషయమే "తదిదం గీతాశాస్త్రం సమస్తవేదార్థసారసంగ్రహభూతం" అని శ్రీమద్భాష్యకారు లుపక్రమభాష్యమునందు స్పష్టముగ నుడివియుండిరి. కాన నీ గీతాశాస్త్రమునకు మూలము వేదమే యని యొప్పుకొనవలయును. ఈ 'యావానర్థ ఉదపానే'

గీ॥ కర్మణ్యే వాధికార స్తే మా ఫలేషు కదాచన ।
మా కర్మఫలహేతు ర్భూ ర్మా తే సంగోఽస్త్వకర్మణి ॥ ॥౪౭॥

పదవిభాగము:— కర్మణి- ఏవ- అధికారః- తే- మా- ఫలేషు- కదాచన- మా- కర్మఫలహేతుః- భూః- మా- తే- సంగః- అస్తు- అకర్మణి । ॥౪౭॥

ప్రతిపదార్థము:— తే=నీకు; కర్మణ్యేవ=కర్మయందే; అధికారః=అధికారము; అస్తి=(ఈపదమధ్యాహార్యము) కలదు; కదాచన=ఏఅవస్థయందు; ఫలేషు=కర్మఫలములయందు; అధికారః=(ఈపదమనువృత్తము) తృష్ణ: మా=వద్దు; కర్మఫలహేతుః=కర్మఫలమునకు హేతువు; మాభూః=కావద్దు; తే=నీకు; అకర్మణి=కర్మాకరణమునందు; సంగః=ప్రీతి; మాఽస్తు=లేకుండుగాక. ॥౪౭॥

---

శాంకరభాష్యమ్:—

తవచ—కర్మణీతి । కర్మణ్యే వాధికారో న జ్ఞాననిష్ఠాయాం తే తవ । తత్ర చ కర్మ కుర్వతో మాఫలే ష్వధికారోఽస్తు కర్మఫలతృష్ణా మాభూ త్కదాచన కంస్యాంచిద ప్యవస్థాయా మిత్యర్థః । యదా కర్మఫలే తృష్ణా తే స్యా త్తదా కర్మఫలప్రాప్తే ర్హేతుస్స్యాః । ఏవం మా

---

అను గీతావాక్యమునకు మూలభూతమగు వేదవాక్యమేదనిన? "సర్వం త దభిసమేతి యత్కించ ప్రజా స్సాధు కుర్వన్తి య స్త ద్వేద య త్సవేద" (ఛాం-4-1-4) అను ఛాందోగ్యశ్రుతియేయని గ్రహింపనగును. ఆశ్రుతి వాక్యము 'ఆత్మజ్ఞాని ప్రజలచే జేయబడిన సుకృతఫలమునంతను పొందు' నని బోధించుచున్నది. అనగా జ్ఞానికి ప్రాప్తించు ఫలమున కర్మఫల మంతర్భవించుననియేకదా యాశయము. ఈశ్రుతిమూలకమగు నీగీతావాక్యమున కాశ్రుత్యర్థమే చెప్పవలసియుండెను. కానియితరార్థమును వర్ణించుట యుక్తముకాదు. కనుకనే శ్రీమద్భాష్యకారులు "ఉదపానే యావా నర్థ స్స సర్వో ప్యర్థ స్సర్వత స్సంప్లుతోదకే యావా నర్థ స్తావా నేవ తత్రై వాంతర్భవతి. సర్వేషు వేదేషు యావా నర్థ స్స సర్వో ప్యర్థో విజానతో బ్రాహ్మణస్య యావా నర్థ స్తావా నేవ తత్రై వాంతర్భవతీతి" అని దృష్టాంత దార్ష్టాంతికములయందు కొన్ని పదముల నధ్యాహారము తెచ్చి జ్ఞానఫలమున కర్మఫల మంతర్భవించు నని వర్ణించియుండిరి. ఇట్లు శ్రుతిసమానార్థత్వము లభించుట కీగీతావాక్యమున కిట్లర్థమును వర్ణించుట శ్రీతిలక్మహాశయులకు చీకాకుపరచుటగా తోచి "టీకాకారు లీగీతావాక్యమునకు కొన్నిపదము లధ్యాహారముచేసి చీకాకుపరచి" రని వ్రాసిరి. మఱియు తిలక్మహాశయులు వ్రాసినయర్థమునా కొంచము విచారింతము. "సర్వత స్సంప్లుతోదకేసతి ఉదపానే యావానర్థః; యావాఞ్కియాన్ కిమపి ప్రయోజనం నాస్తీత్యర్థః । బ్రాహ్మణస్య విజానత స్సతః సర్వేషు వేదేషు వేదోక్తకర్మసు తావానేవ కిమపి ప్రయోజనం నాస్తి" అని వా రన్వయించిరి. అనగా సుఖముగ స్నానపానాదులకు వలయు నుదకప్రవాహము సులభముగ లభించుచుండ కూపతటాకాదులనుగూర్చి యెవడు ప్రయత్నించును? ఎవడూ ప్రయత్నించడు. అట్లే బ్రాహ్మణుడు బ్రహ్మజ్ఞానము కలవాడైయుండ వేదోక్తనిత్యనైమిత్తిక కర్మలవలన నట్టిబ్రహ్మజ్ఞానికి ప్రయోజన మేమియు లేదనికదా యీగీతారహస్యకారుని వ్యాఖ్యవలన దెలిసెడియాశయము. ఈయర్థమున జ్ఞానఫలమున కర్మఫలమంతర్భవించునను నర్థమెటుచూచినను బ్రాప్తించదు. గాన నిట్టియర్థమును వర్ణించు తిలక్మహాశయులకే శ్రుతిబహిష్కృతార్థకథకత్వము సంభవించును. మఱియు జ్ఞానికి కర్మలువ్యర్థమను యర్థమును తిలక్మహాశయులు వర్ణించినచో జ్ఞానికూడ కర్మలనాచరించవలయునని కర్మజ్ఞానసముచ్చయము నంగీకరించు తిలక్మహాశయులకు స్వమతవిరోధముకూడ వాటిల్లునని గ్రహింపనగును. ॥౪౬॥

శాంకరభాష్యము:—

కర్మఫలహేతుర్భూః । యదా హి కర్మఫలతృష్ణాప్రయుక్తః కర్మణి ప్రవర్తతే తదా కర్మఫలస్యైవ జన్మనో హేతు ర్భవేత్ । యది కర్మఫలం నేష్యతే కిం కర్మణా దుఃఖరూపేణేతి । మా తే తవ సంగో స్త్వకర్మ ణ్యకరణే ప్రీతి ర్మాభూత్ ॥ ॥౪౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"పరంపరయా పురుషార్థసాధనము కర్మయోగము; సాక్షాత్తుగ మోక్షసాధన మాత్మజ్ఞానము. నామనస్సు మోక్షమును కోరుచున్నది. కాన సాక్షాత్తు మోక్షసాధన మగు నాత్మజ్ఞానమునే యుపదేశింపు" మని యనెదవా? నీకు గర్మయందే యధికారము కలదు. కాన జ్ఞాననిష్ఠయం దధికారము లేదు. అట్లయినచో ఫలమునుకూడ గోరెదనందువా? అట్లుకాదు. కర్మాష్ఠానమునకు ప్రాక్కాలమునందును, ఉత్తరకాలమునందును, కర్మానుష్ఠానకాలమునందును నీకు కర్మఫలమునందు తృష్ణవలదు. (అనగా మూడు కాలములయందు కర్మఫలతృష్ణను వదలుము) ఎప్పుడు నీకు కర్మఫలమునందు తృష్ణ (ఆశ) కలుగునో; అపుడే నీవు కర్మఫలప్రాప్తికి హేతుభూతుడ వగుదువు. కాన నీవిధమున కర్మఫలప్రాప్తికి హేతుభూతుడవు కాకుము. ఎపుడు కర్మఫలతృష్ణాప్రయుక్తుడై కర్మయందు బ్రవర్తించునో; అపుడే కర్మఫలమగు జన్మకు హేతుభూతు డగును. కాన నట్టి కర్మఫలప్రాప్తి హేతుభూతుడవు కాకుందువుగాక.

కర్మఫలమును కోరనిచో దుఃఖరూపమగు గర్మచే నేమి ప్రయోజనము? కర్మాకరణమే శ్రేష్ఠ మని తలచెద నందువా? నీకు గర్మాకరణమునందు ప్రీతి లేకుండుగాక. (తప్పక నీవు కర్మాచరణ తత్పరుడ వగుము;) ఫలమును మాత్ర మపేక్షింపకుము. ఈశ్లోకమును మరియొక తీరుగ వ్యాఖ్యానింపవచ్చును.

జ్ఞానానధికారికి కర్మత్యాగము న్యాయముకాదు. కాననీకు కర్మయందే యధికారము. జ్ఞాననిష్ఠయం దధికారము లేదు. ఏలన? అజ్ఞాతబ్రహ్మణునకు, అపరిపక్వ మగు నంతఃకరణముకలవానికి ముఖ్యమగు నధికారము సంభవింపదు. (నీవు బ్రహ్మణేతరుడవు, క్షత్రియుడవు. పరిపక్వముకాని యంతఃకరణము కలవాడవు నగుటంజేసి కర్మపరిత్యాగపురస్సరముగ జ్ఞాననిష్ఠయం

—: ౨వ అధ్యాయము- ౪౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీ టీక:— నిష్కామకర్మలచే నాత్మజ్ఞానమును సంపాదించి తద్ద్వారమున మోక్షమును పొందుటకంటె యాత్మజ్ఞానమునే ప్రథమమున సంపాదించి మోక్షమునుబడయుట శ్రేష్ఠము. బహిరంగసాధనములు, బహ్వాయాససాధ్యములు నగు కర్మములతో నేమిప్రయోజన" మను శంకను "కర్మణ్యేవ" అను శ్లోకముచే దొలగించుచుండెను.

తాత్త్వికజ్ఞానోత్పత్త్యయోగ్యుడవు, అపరిశుద్ధాంతఃకరణుడవునగు నీకంతఃకరణపరిశోధకమగు కర్మమునందే యధికారము ('నాకీకర్మము చేయతగినది.' అనుజ్ఞానము) కలుగుగాక. జ్ఞాననిష్ఠారూపమగు వేదాంతవాక్య

శాంకరభాష్యతత్త్వబోధిని:—

దధికారము సంభవింపదు). అట్లగుచో కర్మఫలములతో బంధము వాటిల్లుటకు శక్యముకావలె నని శంకింపజనదు నీకు కర్మము నందధికారము ప్రాప్తించుచుండ కర్మఫలతృష్ణ ప్రాప్తింపకుండుం గాక (అట్టి యకర్మఫలములచే బంధము ప్రాప్తింపనేరదు (మిగిలినయంశమంతయు పూర్వము వలెనే సమన్వయించుకొనవలెను).

విచారాదికములం దధికారము లేదు. అట్టివిధమున కర్మము నాచరించు నీవు కర్మఫలములగు స్వర్గాదులయం దే యవస్థయందును (అనగా కర్మానుష్ఠానమునకు పూర్వమునందును, పరమునందును, కర్మానుష్ఠాన కాలమునందును) నాచేనిది భోక్తవ్యమను జ్ఞానము లేకుండుగాక "నాచేనిది యనుభవింపదగినదను జ్ఞానము లేకున్నను కర్మము స్వసామర్థ్యమువలన ఫలములను పుట్టించగల" దను శంకను 'మాకర్మఫలహేతుర్భూః' అను వాక్యములచేం దొలగించుచుండెను. ఫలకామనచే కర్మము నాచరించువాడు ఆకర్మఫలోత్పాదకుడగును. నీవన్ననో నిష్కాముడవై కర్మఫలహేతువు కావును. నిష్కామముగ భగవదర్పణబుద్ధితో నాచరింపంబడిన కర్మము ఫలము నివ్వదని చెప్పంబడెను. "ఫలము నివ్వనిచో నెందుల కట్టికర్మ మాచరింపవలయు" నను శంకను తొలగించుటకు "మా తే సంగోఽస్త్వకర్మణి" అని చెప్పెను. "ఫలమును కోరనిచో నాకర్మముతో నేమిప్రయోజనము" అని యాకర్మను విడచుటయందు నీకు ప్రీతి లేకుండుగాక!

శంకరానందీయము:— విచారించుచో పూర్వోక్తలక్షణములుకల బ్రహ్మవిత్తునకు సర్వకర్మసన్యాసమునందే యధికారము. అయినను శోకమోహాదిధర్మములచే విచారింప నీబ్రహ్మవిత్తులక్షణము నీయందు కాన్పించుటలేదు. కాన నీకు కర్మమునందే యధికారము. జ్ఞానమునందు కాని, సంన్యాసమునందు కాని యధికారము లేదని చెప్పుచు శతధా శ్రవణాదుల నాచరించినను అనుదితాత్మజ్ఞానముకల ముముక్షువులకు స్వధర్మానుష్ఠానమవశ్యకర్తవ్యము, ఎన్నడును పరిత్యజింపవలదని నిష్కర్షగ "కర్మణ్యేవ" అను శ్లోకముచే జెప్పుచుండెను.

ముముక్షువగు నీకు శ్రుతిస్మృతులచే విహితములగు నిత్య కామ్యవర్జితములు నగు నిత్యనైమిత్తికకర్మములయందే యధికారము (యోగ్యత) కలదు. జ్ఞాననిష్ఠయందు కాని, సంన్యాసమునందు కానియధికారములేదు. అని ఇట ఏవకారము అన్యయోగవ్యవచ్ఛేదార్థకము. అందునను "యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణాం. ధర్మేణ పాపమపనుదతి" అను శ్రుతిస్మృతులచే బోధింపబడు ఫలములయందు నీకధికారము లేదు. (అనగా నట్టి కర్మఫలాపేక్ష నీవెన్నడు చేయదగినది కాదనిభావము.) కర్మఫలముల నపేక్షించినచో బీజాంకురన్యాయమున దుఃఖములకు హేతువులగు జన్మాదులు స్వయముగనే సంభవించును. కాన స్వర్గకామి స్వర్గఫలహేతువగునట్లు నీవు కర్మఫలహేతువవు కావును. (కర్మఫలములయం దపేక్షకలవాడవు కావుమని యర్థము.) "ఫలశూన్యము, క్లేశప్రధానము అగు కర్మము నాచరించుటకు శక్యమైనది కాదు. అట్టిదాని నాచరించుటకంటె నట్టికర్మత్యాగ మొనరించుటే సుఖమైన" దను యాశంకయం దాముముక్షువునకు కర్మత్యాగము యుక్తమైనది కాదను యాశయముచే 'మా తే సంగోఽస్త్వకర్మణి' అని చెప్పెను. అకర్మయనగ కర్మత్యాగము. అట్టి యకర్మమునందు నీకునసక్తి లేకుండుగాక. విహితకర్మము నాచరించనిచో ప్రత్యవాయము ప్రాప్తించును. అట్టి ప్రత్యవాయములచే నరకము, దుష్టజన్మములు ప్రాప్తించును. కాన ముముక్షువునకు కర్మసంన్యాసము న్యాయము కాదని యర్థము. ఈచెప్పుటచే కర్మఫలము నపేక్షింపక శ్రద్ధాపూర్వకముగ నీశ్వరప్రీతినిమిత్తము భక్తిచే గర్మల నాచరించువానికే మోక్షము ప్రాప్తించును; మరియొక విధమున మోక్షము ప్రాప్తింపదని సూచింపం బడెను.

భాష్యోత్కృష్టదీపిక:— అట్లయినచో నాకు జ్ఞాననిష్ఠయం దధికారము కలదు? అను నాశంకయందు "కర్మ ణ్యేవ" అను శ్లోకమును చెప్పుచుండెను.

అంతఃకరణశుద్ధి లేమింజేసి నీకు కర్మమునందే యధికారము. జ్ఞాననిష్ఠయం దధికారములేదు. అందుకూడ చిత్తశుద్ధిహేతువగు ఫలాభిసంధిరహితకర్మమునం దధికారముకలదు. బంధమునకు హేతువగు కామ్యకర్మమునం దధికారము లేదని "మాఫలేషు కదాచన" అనువాక్యముచే జెప్పుచుండెను. ఏయవస్థయందును నీకుకర్మఫల తృష్ణ లేకుండుగాక. అనగా ఫలతృష్ణచేఁ గామ్యకర్మమునందు నీకధికారము లేకుండుగాక.

తృష్ణ లేకున్నను భోజనమువలన తృప్తి ప్రాప్తించునట్లు కర్మమువలన ఫలముసంభవించునను శంకను "మా కర్మఫలహేతుర్భూః" అనువాక్యముచే దొలగించుచుండెను" "చిత్రయా యజేత పశుకామః" అను శ్రుత్యుక్తరీతిని కామనచేనాచరింపబడిన కర్మమునకు పశ్వాదిఫలదాతృత్వనియమమువలన ఫలతృష్ణచే ఫలోత్పాదకుఁడవు కాకుము. కొందరు "కర్మఫలం ప్రవృత్తిహేతు ర్యస్య సః" అనివ్యాఖ్యానించిరి. ఈవ్యాఖ్య యన్య పదార్థప్రధానబహువ్రీహి యగుటచే నుపాదేయము కాదు. "దుఃఖరూపము, నిష్ఫలము నగు కర్మముచే నేమి ప్రయోజనము" అని కర్మాకరణమునందు నీకాసక్తి యుండకుండుగాక.

పరమార్థప్రపా:— పర్యవసితార్థమును "కర్మణ్యేవ" అను శ్లోకముచే జెప్పుచుండెను. తత్త్వజ్ఞానార్థి వగు నీకు పరమేశ్వరకృపచే కర్మమునందే యధికార ముండుగాక; స్వర్గాదిఫలభోగాధికారము లేకుండుగాక యని యాశీర్వాదము. నీవుకర్మఫలభోగమునందు నిమిత్తము కాకుండుము. నీచిత్తమును కర్మఫలసంకల్పముకూడ స్పృశింపకుండుగాక. 'కర్మముయొక్క సంగమువలన ఫల మవశ్యము సంభవించు' నను నియమప్రసిద్ధియుండ ఫలమవశ్యము సంభవించుచునేయుండును. కాన కర్మమునే యాచరింపవలయునను శంకను "మాతే సంగోఽస్త్వకర్మణి" అను వాక్యముచే దొలగించుచుండెను. నీకు కర్మాకరణమునందు నిష్ఠలేకుండుగాక; తన తృప్తి నుద్దేశింపక యీశ్వరార్పణముగ భోజనసామగ్రిసంపాదనవలె కర్మము చేయవలెను.

నీలకంఠీయము:— ఉపనిషత్ప్రతిపాద్యాత్మజ్ఞానార్థినగు నాకును శమమే (కర్మసంన్యాసమే) ఇష్టమై యుండ నెందులకు నన్ను "యుధ్యస్వ" అని కర్మమునందు ప్రేరేపించుచుంటివను శంకను "కర్మణ్యేవాధికా రస్తే" అను శ్లోకముచే దొలగించుచుండెను. (మిగిలినశ్లోకార్థము స్పష్టము)

శ్రీధరీయము:— అట్లయిన సర్వకర్మఫలములు పరమేశ్వరారాధనవలననే సంభవించునను నుద్దేశముతో బ్రవర్తించుగాక. కర్మచే నేమిప్రయోజనమను శంకను 'కర్మణ్యేవ' అను శ్లోకముచే దొలగించుచుండెను.

తత్త్వజ్ఞానార్థివగు నీకు కర్మమునందే యధికారముగలదు. బంధహేతువులగు కర్మఫలములయందు కోరిక లేకుండుగాక. 'భోజనము చేసినచో దృప్తి ప్రాప్తించునటుల కర్మము నాచరించినచో తత్ఫలము సంభవించు' నను శంకను 'మా కర్మఫలహేతుః' అను వాక్యముచే దొలగించుచుండెను. 'మా కర్మఫలహేతుర్భూః। కర్మ ఫలం ప్రవృత్తిహేతు ర్యస్య తథాభూతో మాభూః' ప్రవృత్తిహేతువు కర్మఫలము, అట్టి ఫలముకలవాడవు కాకుము. కామితస్వర్గాదికమే నియోజ్యవిశేషణ మగుటచే ఫలమగును. కాన నకామితఫలము ప్రాప్తించదని భావము. కనుకనే ఫలము బంధకమగునను భయమువలన గర్మాకరణమునందు నీకు నిష్ఠలేకుండుగాక. ॥౪౭॥

గీ॥ యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ ।
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే ॥ ॥౪౮॥

పదవిభాగము:— యోగస్థః– కురు– కర్మాణి– సంగం– త్యక్త్వా– ధనంజయ– సిద్ధ్యసిద్ధ్యోః– సమః– భూత్వా– సమత్వం– యోగః– ఉచ్యతే । ॥౪౮॥

ప్రతిపదార్థము:— హే ధనంజయ!= ఓ యర్జునుఁడా!; త్వం=(ఈపదమధ్యాహార్యము) నీవు; సిద్ధ్యసిద్ధ్యోః= సత్త్వశుద్ధివలనఁగలిగెడి జ్ఞానప్రాప్తిరూప మగు సిద్ధియందు, తద్విరుద్ధ మగు నసిద్ధియందు; సమః=సముఁడవై; యోగస్థః=యోగమునం దున్నవాఁడవై; సంగం=ఈశ్వరుఁడు నాకొఱకు సంతసించుఁగాక యనెడి సక్తిని గూడ; త్యక్త్వా=వదలి; కర్మాణి=కర్మలను; కురు=చేయుము; సమత్వం=సిద్ధ్యసిద్ధులయందుఁగల సమభావము; యోగః =యోగ మని; ఉచ్యతే= చెప్పఁబడుచున్నది. ॥౪౮॥

శాంకరభాష్యమ్:—

యది కర్మఫలప్రయుక్తేన న కర్తవ్యం కర్మ కథం తర్హి కర్తవ్య మిత్యుచ్యతే- యోగస్థ ఇతి । యోగస్థస్సన్కురు కర్మాణి కేవల మీశ్వరార్థం తత్రాపీశ్వరో మే తుష్యత్వితి సంగం త్యక్త్వా ధనంజయ! ఫలతృష్ణాశూన్యేన క్రియమాణే కర్మణి సత్త్వశుద్ధిజా జ్ఞానప్రాప్తిలక్షణా సిద్ధి స్తద్విపర్యయా జ్ఞానసిద్ధి స్తయో స్సిద్ధ్యసిద్ధ్యో రపి సమ స్తుల్యో భూత్వా కురు కర్మాణి । కోఽసౌ యోగో యత్రస్థః కుర్విత్యుక్త మిద మేవ తత్సిద్ధ్యసిద్ధ్యో స్సమత్వం యోగ ఉచ్యతే ॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"కర్మాకరణమునం దాసక్తి వలదు. కర్మఫలమును గోరుచు కర్మమును జేయవలదు" అని చెప్పియుంటివి. అట్లగుచో దేని నుద్దేశించి కర్మలను చేయవలె ననెదవా ? చెప్పెద వినుము. ఓయర్జునా ! నీవు యోగస్థుఁడవై కేవల మీశ్వరార్థము ఈశ్వరానుగ్రహముకొఱకు కర్మముల నాచరించుము. అట్లైన నీశ్వరసంతోషమును గోరెడివాఁడవై కర్మల నాచరింప వచ్చునా యని యనెదవా ? అదియు వలదు "ఈశ్వరుఁడు నాకొఱకు సంతసించుఁగాక" యనెడి సంగమునుకూడ వదలి కర్మల నాచరింపుము. ఫలమునం దాసక్తిని బరిత్యజించినవానిచే నాచరింపఁబడు కర్మలవలన నంతఃకరణము పరిశుద్ధ మగును. అట్టి యంతఃకరణశుద్ధివలన జ్ఞాన ప్రాప్తి యగును. అట్టి జ్ఞానప్రాప్తియే "సిద్ధి" అనంబడును. తద్విరుద్ధ మగు మలినాంతఃకరణ వలన జ్ఞానము సిద్ధింపనేరదు. దీనినే "అసిద్ధి" అని యందురు. అట్టి సిద్ధ్యసిద్ధులయందు సముఁడ వగుము. (అనగా జ్ఞానము సిద్ధించు ననిగాని, సిద్ధించ దని కాని యాశయమును వదలి యీశ్వ రార్థము ఫలకామనను విడచి కర్మల నాచరించుము.)

—• ౨వ అధ్యాయము- ౪౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీ యము:— పూర్వోక్తవిషయమునే 'యోగస్థః' అను శ్లోకము చే వివరించుచుండెను. ఓ యర్జునా! నీవు ఫలాభిలాషను, కర్తృత్వాభినివేశమును వదలి కర్మముల నాచరించుము. ఇచట 'కర్మాణి' అను స్థలమునందుగల బహువచనసామర్థ్యముచే 'కర్మణ్యేవాధికారస్తే' అను స్థలమునందుగల యేకవచనము జాతి

శాంకరభాష్యతత్త్వబోధని:—

"యోగస్థః కురు కర్మాణి" అను వాక్యముచే నీవు యోగస్థుఁడవై కర్మముల నాచరింపు మని బోధించితివి ఆ యోగ మనఁగ నెట్టి దనిన ? సిద్ధ్యసిద్ధులయందుండు సమత్వమే యోగ మనఁబడును. ॥౪౮॥

వాచకము. అనఁగా కర్మముల నుండని యర్థము. సంగత్యాగోపాయమును 'సిద్ధ్యసిద్ధ్యోః' అను వాక్యముచేఁ జెప్పుచుండెను. ఫలసిద్ధియందు హర్షమును, ఫలాసిద్ధియందు విషాదమును వదలి కేవలము ఈశ్వరార్పణబుద్ధితో కర్మముల నాచరింపుము. 'యోగ'శబ్దముచేఁ బూర్వమునందు కర్మము చెప్పఁబడెను. ఇట "యోగస్థః కురు కర్మాణి" యోగస్థుఁడవై కర్మముల నాచరింపు మని చెప్పఁబడెను. కాన నిది యెటుల దెలిసికొనుటకు శక్యమైన" దను శంకను 'సమత్వం యోగ ఉచ్యతే' అను వాక్యముచేఁ దొలఁగించుచుండెను. ఫలసిద్ధ్యసిద్ధులయందు సమత్వమే "యోగస్థః" అనుచోటగల యోగశబ్దార్థము. కర్మము కాదు. కాన విరోధము ప్రాప్తించదు. "ఈశ్లోకమునందు పూర్వార్ధమునకు ఉత్తరార్ధముచే వ్యాఖ్యానము చేయఁబడెను. కాన పునరుక్తి లే" దని శ్రీభాష్యకారుల మార్గము. "సుఖదుఃఖే సమే కృత్వా" అనుస్థలమునందు జయాజయసామ్యముచే ప్రకృత మగు యుద్ధమాత్ర కర్తవ్యత చెప్పఁబడెను. ఇచట నన్ననో దృష్టాదృష్టసర్వఫలపరిత్యాగపురస్సరముగ సర్వకర్మకర్తవ్యత బోధింపఁబడెను. ఇదియే విశేషము కాన "సుఖదుఃఖే సమే కృత్వా" అను శ్లోకముచే బోధింపఁబడిన విషయమే "సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా" అను శ్లోకముచే బోధించుటవలన పునరుక్తి యను శంక తొలఁగించబడెను.

శంకరానందీయము:— ఓ యర్జునా! నీకు జన్మాదిదుఃఖనిశ్శేషనివృత్తియం దపేక్ష యుండినచో నీవు కర్మములనే యాచరింపు మని "యోగస్థః" అను శ్లోకముచే బోధించుచుండెను.

"నిర్దోషం హి సమం బ్రహ్మ" అను శ్లోకముచేఁ జెప్పఁబడు బ్రహ్మమే యిచట సమశబ్దముచేఁ జెప్పఁబడును. అట్టి బ్రహ్మభావమే సమత్వ మనఁబడును. అట్టి బ్రహ్మభావము జ్ఞానముచేఁ బొందఁబడును గాన యోగ మనఁబడును. అట్టి బ్రహ్మమునందు తనకు బ్రహ్మభావాపత్తిచే బ్రహ్మభావైకాపేక్షచే నుండువాడు "యోగస్థుఁడు" అని చెప్పఁబడును. నీ వట్టి మోక్షైకకాముఁడవై, 'సంగం త్యక్త్వా' ఈకర్మములచే నాకు దురితక్షయ మగుఁగాక; లేక— జ్ఞానప్రతిబంధనివృత్తి యగుఁగాక; లేక— నాకొఱ కీశ్వరుఁ డనుగ్రహించుఁగాక; లేక— కర్మజన్య మగు ఫలము నాకు సంభవించుఁగాక" యనెడి కర్మములయందు కోరికలను వదలి "సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా" ప్రారబ్ధకర్మముల సాంగత్యము సిద్ధి, తదభావము సిద్ధి. లేక ఈశ్వరప్రసాదప్రాప్తి సిద్ధి తదభావము సిద్ధి, చిత్తప్రసక్తి సిద్ధి. తదభావము సిద్ధి యనఁబడును. అట్టి సిద్ధ్యసిద్ధులయందు హర్షవిషాదశూన్యుఁడవై కర్మములను క్లేశాత్మకము లైనను విహితము లనెడిబుద్ధితో నాచరింపుము.

భాష్యోత్కర్షదీపిక:— క్షత్రియులను జయించి ధనము నార్జించి రాజసూయమునందు నీవు వినియోగించితివి. అట్లే యిపుడును ఈసర్వులను జయించి యజ్ఞాదుల నాచరించుటకు సమర్థుఁడ వని "ధనంజయ!" అను సంబోధనచే సూచించెను.

పరమార్థప్రప:— అటులైన నే నెటు లుండవలె నను శంకను "యోగస్థః" అను శ్లోకముచే దొలఁగించుచుండెను. పరమేశ్వరసాన్నిధ్యరూపయోగమునందు కృతనిశ్చయుఁడవై కర్మముల నాచరింపుము. కను కనే తుచ్ఛమగుటచే స్వర్గాదిసుఖమును త్యజించుటచే నీవు ధనంజయుడవైతివి. కర్తృత్వాభినివేశమును వదలి సిద్ధ్యసిద్ధులయందు హర్షవిషాదరహితుఁడవై కర్మముల నాచరింపుము. ఎందువలననిన? సమత్వ మనఁగా నిర్వికారత్వము; అదియే యోగ మనఁబడును.

శ్రీధరీయము:— యోగ మనఁగా పరమేశ్వరైకపరత్వము. అట్టిదానియందుండి కర్మముల నాచరింపుము. (శేషము పూర్వమువలె చూచుకొనవలెను.) ॥౪౮॥

గీ॥ దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ ।
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః ॥ ॥౪౯॥

పదవిభాగము:— దూరేణ- హి- అవరం- కర్మ- బుద్ధియోగాత్- ధనంజయ!- బుద్ధౌ- శరణం- అన్విచ్ఛ- కృపణాః- ఫలహేతవః । ॥౪౯॥

ప్రతిపదార్థము:— హేధనంజయ!=ఓయర్జునా!; కర్మ=ఫలమును కోరువారిచే నాచరింపఁబడు కర్మము; బుద్ధియోగాత్=సమత్వబుద్ధియుక్తకర్మముకంటె; దూరేణ=అత్యంతము; అవరం=తక్కువది; త్వం=(ఈపదమధ్యాహార్యము) నీవు; బుద్ధౌ=యోగవిషయకబుద్ధియందు, లేక సాంఖ్యబుద్ధియందు; శరణం=ఆశ్రయమును (అభయప్రాప్తి కారణమును); అన్విచ్ఛ=ప్రార్థింపుము; యే=(ఈపద మధ్యాహార్యము) ఎవరు; ఫలహేతవః=ఫలతృష్ణాప్రయుక్తులై; కర్మ=(ఈపద మధ్యాహార్యము) కర్మమును; కుర్వన్తి=(ఈపద మధ్యాహార్యము) చేయుదురో; తే=(ఈపద మధ్యాహార్యము) వారలు; కృపణాః=దీనులు. ॥౪౯॥

శాంకరభాష్యమ్:—

యత్పున స్సమత్వబుద్ధియుక్త మీశ్వరారాధనార్థం కర్మైతస్మా త్కర్మణః—దూరేణేతి । దూరే ణాతివిప్రకర్షేణ హ్యవరం నికృష్టం కర్మ ఫలార్థినా క్రియమాణం బుద్ధియోగా త్సమత్వబుద్ధియుక్తా త్కర్మణో జన్మమరణాదిహేతుత్వా ద్ధనంజయ! యత ఏవం యోగవిషయాయాం బుద్ధౌ తత్పరిపాకజాయాం వా సాంఖ్యబుద్ధౌ శరణ మాశ్రయ మభయప్రాప్తికారణ మన్విచ్ఛ ప్రార్థయస్వ, పరమార్థజ్ఞానశరణో భవే త్యర్థః । యతోఽవరం కర్మ కుర్వాణాః కృపణా దీనాః ఫలహేతవః ఫలతృష్ణాప్రయుక్తా స్సంతః "యో వా ఏత దక్షరం గార్గ్యవిదిత్వాఽస్మా ల్లోకా త్ప్రైతి స కృపణః" ఇతి శ్రుతేః । ॥౪౯॥

శాంకరభాష్యతత్త్వబోధని:—

ఓయర్జునా ! ఈశ్వరారాధననిమిత్తము చేయునట్టియు, సమత్వబుద్ధితోఁ గూడినదియు నగు కర్మముకంటె జననమరణాదిహేతు వగుటంజేసి ఫలార్థిచేఁ జేయఁబడు కర్మ మతినికృష్టమైనది ఎవరు ఫలతృష్ణాప్రయుక్తులై తక్కువదగు కర్మము నాచరించెదరో వారు "యో వా ఏత దక్షరం గార్గ్యవిదత్వాఽస్మా ల్లోకా త్ప్రైతి స కృపణః" ఓగార్గీ ! నాశరహితం బగు నీ పరబ్రహ్మమును తెలిసికొనక యీలోకమునుండి పరలోకమున కెవఁ డేగునో (మరణించునో) వాడు దీనుఁడు) అను శ్రుతి ననుసరించి దీను లనంబడుదురు. కాన నోయర్జునా! (నీ వట్టివాఁడవు కాక) యోగబుద్ధిని కాని, లేక యోగబుద్ధిపరిపాకమువలన జనించెడి సాంఖ్యబుద్ధిని గాని శరణ (ఆశ్రయ) మునుగాఁ బ్రార్థించుము. అనగా పరమార్థజ్ఞానశరణుడ వగుము. ॥౪౯॥

—• ౨వ అధ్యాయము ౪౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "నిష్ఫలముగనే కర్మము నాచరింపుమని చెప్పుచుంటివి. అట్టి కర్మానుష్ఠానమే పురుషార్థసాధనమా? అట్లగుచో 'ప్రయోజన మనుద్దిశ్య న మందోపి ప్రవర్తతే' (మందుఁడైనను ప్రయోజనము నపేక్షింపక దేనియందు బ్రవర్తించఁడు.) అను న్యాయమున ఫలకామనపురస్సరముగనే కర్మముల నాచరించుట న్యాయ" మను శంకను "దూరేణ" అను శ్లోకముచే నిరసించుచుండెను.

ఆత్మబుద్ధిసాధనమగు నిష్కామకర్మముకంటె జన్మమరణహేతువగు కామనతో ననుష్ఠింపఁబడు కర్మ మత్యధమము. లేక — పరమాత్మబుద్ధియోగముకంటె సర్వకర్మములు నికృష్టములైనవి. కాన సర్వానర్థనివర్తకమగు పరమాత్మబుద్ధియందు ప్రతిబంధకపాపక్షయద్వారమున రక్షకమగు నిష్కామకర్మయోగము నాచరించుట కిచ్ఛయించుము. ఎవరు ఫలకాములై నికృష్టములగు కర్మముల నాచరించెదరో వారు 'కృపణాః' జన్మమరణాది ఘటీయంత్రపరిభ్రమణముచే నత్యంతదీనులు. ఈ విషయమునే "యోవా ఏత దక్షరం గార్గ్యవిదిత్వాఽస్మాల్లోకా త్ప్రైతి స కృపణః" అను శ్రుతియు బోధించుచున్నది. కాన నో యర్జునా! నీవు కూడ నత్యంతదీనుఁడవు కాక సర్వానర్థనివర్త కాత్మజ్ఞానోత్పాదకమగు నిష్కామకర్మయోగము నాచరింపు మని భావము.

ఏవిధమున కృపణజను లతిదుఃఖముచే ధనము నార్జించి ఏదో యొకవిధ మగు దృష్టసుఖమాత్రలోభముచే దానాదిజనితమహాసుఖము ననుభవించుటకు శక్తులు కాక యాత్మను వంచించుచుండిరో; అదేవిధమున గొప్పశ్రమచేఁ గర్మముల నాచరించుచు క్షుద్రఫలమాత్రలోభముచేఁ బరమానందానుభవమువలన వంచింపబడుచుండిరి. వీరల దౌర్భాగ్యము, మౌఢ్య మెంత విషాదకర మని "కృపణాః" అను పదముచే ధ్వనితము.

శంకరానందీయము:— మోక్షేచ్ఛచే ఫలము నపేక్షించక సమబుద్ధితో నిత్యనైమిత్తికకర్మముల నాచరించువానికి— "తుచ్ఛమగు కర్మలతోను, తుచ్ఛమగు కర్మఫలములతోను, తుచ్ఛమగు భోగ్యములతోను నేమియు ప్రయోజనము లే"దనెడి యలంబుద్ధిరూప మగు చిత్తశుద్ధి యెన్న డుదయించునో; అపుడు నికృష్టఫలము నిచ్చెడి కర్మమునం దనాస్థ (అనాదరణ)చే జ్ఞానయోగమే యాదరింపఁదగిన దని "దూరేణ" అను శ్లోకముచే బోధించుచుండెను.

కర్మము బహుసాధనసాధ్య మగుటవలనను, క్లేశభూయిష్ఠ మగుటవలనను, అంగవైకల్యముచే ఫలవైగుణ్యము కలదగుటవలనను, అంగవైకల్యము లేకున్నను జన్మాదిదుఃఖహేతు వగుటవలనను, చేయనియెడల ప్రత్యవాయజనక మగుటచే నరకప్రాపక మగుటవలనను నికృష్టమైనది. అట్టి కర్మము నిత్యనిరతిశయమోక్షసుఖహేతు వగు జ్ఞానయోగముకంటె దూరముగ నుండునది. "దూర మేతే విపరీతే విషూచీ అవిద్యా యా చ విద్యా" అను శ్రుత్యుక్తరీతిని మోక్షహేతు వగు జ్ఞానయోగమునకు విపరీతభావహేతు వగుటచే నతిదూరమున కర్మ మగును. "అష్టాదశోక్త మవరం యేషు కర్మ" అను శ్రుత్యుక్తనికృష్టత్వము కర్మకు 'హి' అను శబ్దముచే ద్యోతితము. కాన కర్మ మాస్థేయము (ఆదరింపఁదగినది) కాదని భావము.

'అనేకులు కర్మయోగమునే యాచరించుచుండిరి. అట్టి కర్మయోగము నికృష్ట మెట్లగును?' అను నాశంకపై "కృపణాః" అని చెప్పుచుండెను. కర్మజన్యఫలమగు స్వర్గమునకు, ఐహికసుఖమునకు హేతుభూతులు, కర్మఫలార్థులు నగు కాములు 'కృపణాః' అధములు. (నీచులు) "యోవా ఏత దక్షరం గార్గ్యవిదిత్వాఽస్మాల్లోకా త్ప్రైతి స కృపణః" (ఎవ డీయక్షరరూపమగు బ్రహ్మమును తెలిసికొనక యీలోకమునుండి మరణించునో వాఁడు కృపణుండు (నీచుఁడు.) అను శ్రుతి విశిష్టజన్మకర్మశీలగుణవంతుఁడైనను బ్రహ్మతత్త్వమును తెలిసికొననట్టి కర్మి యధముఁడని చెప్పుచున్నది. "ఏతచ్ఛ్రేయో యేఽభినందంతి మూఢా జరామృత్యుం పున రేవాపియన్తి । యత్కర్మిణో ప్రవేదయన్తి రాగా త్తే నాతురాః క్షీణలోకా శ్చ్యవన్తే" అను శ్రుతియు కర్మఫలమోహితులగు కర్ములకనర్థమునే చెప్పుచున్నది. "అతో ధీరా అమృతత్త్వం విదిత్వా ధ్రువ మధ్రువే ష్విహ న ప్రార్థయన్తే । ఏత ద్యో వేద నిహితం గుహాయాం సోఽవిద్యాగ్రంథిం వికిరతీహ సోమ్య!" 'జ్ఞానాదేవతు కైవల్యం' 'యయాఽచిరాత్సర్వపాపం వ్యపోహ్య పరాత్పరం పురుష ముపైతి విద్వాన్' ఇత్యాది శ్రుతులచే వివేకులకు స్రక్చందనవనితాదు లప్రార్థ్యములనియు, మోక్షము ప్రార్థ్యమనియు జ్ఞానైకగమ్యమనియు చెప్పఁబడుచుండెను. కాన నో ధనంజయ! నీవు చిత్తప్రసాదాపాదిత జ్ఞానయోగమునందు మనోనివాసము నిచ్ఛగించుము. అచ్చటనే మనస్సును స్థాపనచే

గీ॥ బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే ।
తస్మా ద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్ ॥ ॥౫౦॥

పదవిభాగము:— బుద్ధియుక్తః- జహాతి- ఇహ- ఉభే- సుకృతదుష్కృతే- తస్మాత్- యోగాయ- యుజ్యస్వ- యోగః- కర్మసు- కౌశలమ్ । ॥౫౦॥

ప్రతిపదార్థము:— యతః=(ఈపదమధ్యాహార్యము) ఏ కారణమువలన; బుద్ధియుక్తః=సమత్వబుద్ధితోఁ గూడినవాఁడు; ఉభే=రెండగు; సుకృతదుష్కృతే=పుణ్యపాపములను; ఇహ=ఈలోకమునందే; జహాతి=విడుచుచున్నాడో. తస్మాత్=ఆ కారణమువలన; త్వం=(ఈపదమధ్యాహార్యము)నీవు; యోగాయ=సమత్వబుద్ధియోగముకొఱకు; యుజ్యస్వ=సన్నద్ధుడవగుము; యోగః=సమత్వయోగము; కర్మసు=కర్మలయందు; కౌశలం=కుశలభావము; (క్షేమము) ॥౫౦॥

---

శాంకరభాష్యమ్:—

సమత్వబుద్ధియుక్తస్స న్స్వధర్మ మనుతిష్ఠ న్యత్ఫలం ప్రాప్నోతి, తచ్ఛృణు — బుద్ధీతి । బుద్ధియుక్త స్సమత్వవిషయయా బుద్ధ్యా యుక్తో బుద్ధియుక్తో జహాతి పరిత్యజతీహాస్మిం ల్లోక ఉభే సుకృతదుష్కృతే పుణ్యపాపే సత్త్వశుద్ధిజ్ఞానప్రాప్తిద్వారేణ యత స్తస్మా త్సమత్వబుద్ధియోగాయ యుజ్యస్వ ఘటస్వ ! యోగో హి కర్మసు కౌశలం స్వధర్మాఖ్యేషు కర్మసు వర్తమానస్య యా సిద్ధ్యసిద్ధ్యో స్సమత్వబుద్ధి రీశ్వరార్పితచేత స్తయా తత్కౌశలం కుశలభావః । తద్ధి కౌశలం య ద్బంధస్వభావాన్యపి కర్మాణి సమత్వబుద్ధ్యా స్వభావా న్నివర్తన్తే । తస్మా త్సమత్వబుద్ధియుక్తో భవ త్వమ్ ॥ ॥౫౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సమత్వబుద్ధితోఁ గూడినవాఁడై స్వధర్మము నాచరించువాఁ డేఫలమును బొందునో యాఫలమును వినుము.

సమత్వబుద్ధికలవాఁడై స్వధర్మమగు కర్మల నాచరించినచో దానివలననంతఃకరణము సత్త్వప్రధానమై తద్ద్వారమున జ్ఞానమును బొంది తద్ద్వారమున నీలోకమునందే పుణ్యపాపముల రెండింటిని బరిత్యజించును. అందువలన నోయర్జునా! నీవుకూడ సమత్వబుద్ధియోగముకొఱకు సన్నద్ధుడ వగుము. (సమత్వబుద్ధియోగము కలవాఁడ వగుము.)

---

యుము. ఎపుడు నీమనస్సు శుద్ధసత్త్వప్రధానమగునో అదిమొదలు జ్ఞానయోగమువందే నీవుండుము. కర్మము నికృష్టమగుటవలన, సాధనము కానిదగుటవలనను అనాత్మయం దాత్మతాధీనజనకమగుటవలనను ఎన్నడు కర్మయందుండవలదని యర్థము.

ఈచెప్పుటచే చిత్తప్రసాదము కలుగనంతవరకే ముముక్షువునకు కర్మము సాధనము. చిత్తప్రసాదము కలిగినపిమ్మట జ్ఞానయోగమని సూచింపబడెను. ఈచెప్పుటవలన "యావజ్జీవ మగ్నిహోత్రం జుహుయాత్" అను శ్రుత్యుక్తయావజ్జీవాగ్నిహోత్రమును అపక్వబుద్ధికలవాడే యాచరింపవలయునని సూచింపబడెను. ॥౪౯॥

—♦ ౨వ అధ్యాయము- ౫౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— ఈవిధమున బుద్ధియోగములేనిచో కలుగుదోషమును చెప్పి బుద్ధియోగముండినచో కలుగు గుణమును "బుద్ధియుక్తః" అను శ్లోకముచే జెప్పుచుండెను.

శాంకరభాష్యతత్త్వబోధిని:—

స్వధర్మానుష్ఠానపరుడు ఎందులకు సమత్వబుద్ధియోగమునందు మనస్సును ప్రవర్తింపజేయవలెను? అని శంకింపజనదు.

పరమేశ్వరునియం దర్పింపఁబడిన చిత్తముకలవాఁడగుటచే స్వధర్మములగు గర్మలయందు బ్రవర్తించువానియొక్క యేసిద్ధ్యసిద్ధులయందు సమత్వబుద్ధిగలదో అదియే కర్మలయందు కౌశలము. అట్టి కౌశల్య మెట్టిదనిన? కర్మలు స్వభావముచే బంధస్వభావము కలవి. అట్టి వైనను సమత్వబుద్ధిచే నట్టి బంధస్వభావమువలన మరలును (మరలి జ్ఞానమును గలుగజేయును.) ఇదియే సమత్వబుద్ధియందుగల కౌశల్యము. కాన నోయర్జునా! నీవు సమత్వబుద్ధిగలవాడ వగుము ॥౫౦॥

కర్మములయందు సమత్వబుద్ధితో గూడినవాడై సత్త్వశుద్ధిజ్ఞానప్రాప్తిద్వారమున బుణ్యపాపములను విడుచుచున్నాడు. కాననోర్జునా! నీవుసమత్వబుద్ధిరూపయోగముతో గూడినవాడవగుము. ఈశ్వరార్పితచిత్తము కలవాడై కర్మములయందు ప్రవర్తించువానియొక్క సమత్వబుద్ధియోగము కౌశలము. సమత్వబుద్ధి యుక్తకర్మయోగమునకు కౌశల మెట్టిదనిన? బన్ధహేతువులగు కర్మలకు బంధాభావము మోక్షపర్యవసాయిత్వ మనునదియే మహాకౌశలము. సమత్వబుద్ధియుక్త కర్మయోగము కర్మస్వరూపమైనను దుష్కర్మక్షయమును జేయును. కాన మహాకౌశలము. మహాకుశలుఁడవగు నీవైతే చేతనుఁడవై సజాతీయదుష్టుల క్షయమును చేయజాలకుంటివి. కాన నీవు కుశలుఁడవు కావని యిచట వ్యతిరేకముగ ధ్వనితము.

లేక, సమత్వబుద్ధియుక్తమగు కర్మయోగము నాచరించినచో సత్త్వశుద్ధిద్వారమునఁ బరమాత్మ సాక్షాత్కారముకలవాఁడై సుకృతదుష్కృతములను విడుచును. కాన నో యర్జునా! నీవు సమత్వబుద్ధియుక్తకర్మయోగముతోఁ గూడినవాఁడ వగుము. కర్మములన్నిటిలో సమత్వబుద్ధియుక్తకర్మయోగము దుష్టకర్మనివారణచతురము. కాన నట్టి కర్మయోగము నాశ్రయింపు మని భావము.

శంకరానందీయము:— ముముక్షువునకు జన్మాదిహేతువులగు సర్వకర్మములయొక్క నిశ్శేషనివృత్తి జ్ఞానబలముచేతనే సిద్ధించును. ఇతరముచే సిద్ధింపదు. కాన నీవు జ్ఞానయోగనిష్ఠనే చేయుమని 'బుద్ధియుక్తః' అను శ్లోకముచే బోధించుచుండెను.

జ్ఞానయోగముతోఁగూడిన యారూఢుఁ డగు బ్రహ్మవిత్తు కూటస్థాసంగచిద్రూపాత్మతత్త్వవిజ్ఞానబలముచే జన్మాంతరశతసహస్రములయందును, వర్తమానకాలమునందును, జ్ఞానోత్పత్తికి పూర్వమునందును, ఊర్ధ్వమునందును నాచరించఁబడిన నానాయోనిసహస్రప్రాపకమగు తనసంబంధమైన సుకృతదుష్కృతములను విడచుచుండెను. జ్ఞానాగ్నిచే పుణ్యపాపముల నిర్మూలించి యీలోకమునందు జీవించియుండగనే ముక్తుఁ డగును. కాన నోయర్జునా! నీవు జ్ఞానయోగము కొరకు ప్రయత్నించుము.

కృచ్ఛ్రచాంద్రాయణాదిప్రాయశ్చిత్తముల చేతను, త్రిసుపర్ణాదిజపములచేతను, అశ్వమేధాది యాగముల చేతను, గంగాదిమహానదీస్నానదానాదులచేతను సర్వపాపక్షయ మగుచుండ జ్ఞానాభ్యాసక్లేశ మెందుల కని శంకింపఁజనదు.

చెప్పఁబడిన ప్రాయశ్చిత్తాదు లేపాపములు నివర్తించవలె నను నుద్దేశముతో చేయఁబడునో యాపాపములే ఆయాప్రాయశ్చిత్తాదులచే నివర్తించును. ఇతరపాపములు నివర్తించవు. అట్లు కానిచో ప్రాయశ్చిత్తభేదవిధి కానర్థక్యము ప్రాప్తించెడిని. 'తరతి బ్రహ్మహత్యాం యోఽశ్వమేధేన యజతే' (అశ్వమేధయాగముచే బ్రహ్మహత్యవలన జనించిన పాపమును దాటును) అను శ్రుతియందు బ్రహ్మహత్యావ్యతిరిక్తపాపతరణము శ్రూయ

గీ॥ కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః ।
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛ న్త్యనామయమ్ ॥ ॥౫౧॥

పదవిభాగము:— కర్మజం- బుద్ధియుక్తాః- హి- ఫలం- త్యక్త్వా- మనీషిణః- జన్మబన్ధవినిర్ముక్తాః- పదం- గచ్ఛన్తి- అనామయమ్ । ॥౫౧॥

ప్రతిపదార్థము:— హి=ఏ కారణమువలన; బుద్ధియుక్తాః=సమత్వబుద్ధితోఁగూడినవారో; తస్మాత్=(ఈపదమధ్యాహార్యము) ఆ కారణమువలన; కర్మజం=కర్మవలనఁ బుట్టిన; ఫలం=(ఇష్టానిష్టశరీరప్రాప్తిరూపమగు) ఫలమును; త్యక్త్వా=విడచి: మనీషిణస్సంతః=జ్ఞానులై: జన్మబన్ధవినిర్ముక్తాః, జన్మ=జన్మమనెడి; బన్ధ=బన్ధముతో; వినిర్ముక్తాః=విడవబడినవారై; అనామయం=సర్వోపద్రవరహితమగు; పదం=వైష్ణవస్థానమును; (మోక్షమును) గచ్ఛన్తి=పొందుచుండిరి. ॥౫౧॥

శాంకరభాష్యమ్:—

యస్మాత్— కర్మజమితి । కర్మజం ఫలం త్యక్త్వేతి వ్యవహితేన సంబంధః । ఇష్టానిష్ట దేహప్రాప్తిః కర్మజం ఫలం కర్మభ్యో జాతం బుద్ధియుక్తాః సమత్వబుద్ధియుక్తా హి యస్మా త్ఫలం త్యక్త్వా పరిత్యజ్య మనీషిణో జ్ఞానినో భూత్వా జన్మబంధవినిర్ముక్తా జన్మైవ బన్ధో జన్మబన్ధ స్తేన వినిర్ముక్తా జీవన్త ఏవ (ఇతి) జన్మబన్ధవినిర్ముక్తా స్సంతః పదం పరమం విష్ణో ర్మోక్షాఖ్యం గచ్ఛ న్త్యనామయం సర్వోపద్రవరహిత మిత్యర్థః ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సమత్వబుద్ధికలవానికి సుకృతదుష్కృతములయొక్కయు, తత్ఫలములయొక్కయు పరిత్యాగము సంభవించినను మోక్ష మెటులఁ బ్రాప్తించు ననెదవా? సుకృతఫల మిష్టదేహప్రాప్తి రూపము, దుష్కృతకర్మల ఫలము అనిష్టరూపమగు శ్వసూకరాది దేహప్రాప్తిరూపము. ఇట్టి కర్మఫలమును— సమత్వబుద్ధితోఁ గూడినవారై పరిత్యజించి సత్త్వశుద్ధిద్వారమున జ్ఞానులై

మాణము కానందున నిఖిలపాపనివృత్తి సంభవింపదు. అట్లంగీకరించినను ప్రాయశ్చిత్తాదులవలన పాపమే నివృత్తమగును కాని శతకోటిజన్మహేతువగు పుణ్యమునకు నివర్తకము జ్ఞానమును విడిచి వేరొండు సంభవింపదు. 'తదా విద్వా న్పుణ్యపాపే విధూయ' "స ఏవం విద్వా నాత్మానగ్ స్పృణుతే" అను శ్రుతులయందును, ఈగీతా వాక్యమునందుగల "ఉభే సుకృతదుష్కృతే" అను వాక్యమునందును పుణ్యపాపోభయనివర్తకము జ్ఞానయోగ మనియే చెప్పబడెను. కాన పుణ్యపాపోభయాత్మకకర్మల నివర్తింపజేయువలెననిన జ్ఞానయోగమే నిపుణ మైనదని జ్ఞానకుశలులచే పరమసాధనముగ జూడబడెను. కాన నోయర్జునా! నీవును జ్ఞానయోగముతోఁ గూడినవాఁడ వగుమని పూర్వముతో నన్వయము. ఈశ్లోకమునందు "జహాతీహ ఉభే" అను స్థలమునందు విసంధి యార్ష మని గ్రహింపనగును. ॥౫౦॥

—• ౨వ అధ్యాయము ౫౧ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "పాపవినాశన మపేక్షితము. కాని సుకృతవినాశన మపేక్షితము కాదు. అట్లగుచో పురుషార్థభ్రంశము ప్రాప్తించెడిని" అని యాశంకించి తుచ్ఛఫలపరిత్యాగపురస్సరముగఁ బరమపురుషార్థప్రాప్తిరూపఫలమును 'కర్మజం' అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

శాంకరభాష్యమ్:—

అథవా "బుద్ధియోగా ద్ధనంజయ!" (గీ-2-49) ఇత్యారభ్య పరమార్థదర్శనలక్షణైవ సర్వత స్సంప్లుతోదకస్థానీయా కర్మయోగజసత్త్వశుద్ధిజనితా- బుద్ధి ర్దర్శితా సాక్షా త్సుకృతదుష్కృతప్రహాణాదిహేతుత్వశ్రవణాత్ ॥ ॥౫౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

జన్మమే యనెడి బంధమునుండి వినిర్ముక్తులై సర్వవ్యాపక మగు బరమాత్మసంబంధియు సర్వోపద్రవరహితము నగు మోక్షమనెడి స్థానమును బొందుచుండిరి.

లేక. — "బుద్ధియోగా ద్ధనంజయః" (గీ49-అ2) అను శ్లోకమునందుగల 'బుద్ధియోగాత్' అనుశబ్దమునకు సమత్వబుద్ధియోగమని వ్యాఖ్యానించి తదనుసారముగ 'కర్మజం బుద్ధియుక్తాహి' (గీ-51-అ-2) శ్లోకమువరకు బుద్ధియనగ సమత్వబుద్ధి యనియే వ్యాఖ్యానింపబడెను. అట్టి సమత్వబుద్ధికి సాక్షాత్తుగ సుకృతదుష్కృతవినాశకత్వము సంభవింపనేరదు, మరేమనిన? సమత్వబుద్ధివలన నంతఃకరణము సత్త్వప్రధానమై దానివలన శ్రవణమనననిదిధ్యాసముల ద్వారమున జ్ఞాన ముదయించును. అట్టిజ్ఞానమువలన సుకృతదుష్కృతవినాశము కలిగి జన్మ మనెడి బంధమునుండి వినిర్ముక్తులగుదురు. కాన సమత్వబుద్ధి పరంపరయా సుకృతదుష్కృతవినాశ మగుటం జేసి యట్టి యర్థమును బరిత్యజించి సాక్షాత్తుగ నీశ్లోకమునందు సుకృతదుష్కృతములయొక్కయు, జన్మబంధములయొక్కయు వినాశముగూర్చియు హేతుత్వము శ్రూయమాణమగుచుండుటంజేసి 'బుద్ధియోగాత్' (49-అ-2) అనుచోట కర్మయోగమువలన జనించెడి పసత్త్వశుద్ధిగలదో దానివలనఁ గలుగునట్టియు, అపరిచ్ఛిన్నాత్మవిషయమగుటచే నపరిచ్ఛిన్నము సర్వత స్సంప్లుతోదకస్థానీయము పరమార్థము నగు నాత్మవిషయకజ్ఞానమే ఇట వివక్షితము.

కర్మాచరణము రెండు విధములు ఒకటి పరమార్థదర్శనము నుద్దేశించి కర్మల నాచరించుట; రెండు స్వర్గాదుల నుద్దేశించి కర్మల నాచరించుట అందు రెండవవిధముగ గర్మల నాచరించినచో నట్టివానికి కార్పణ్యమనెడి దోషము ప్రాప్తించును. కార్పణ్య మనగ నెవఁడాత్మస్వరూపమును దెలిసికొనక దేహమును విడచునో వాఁడు కృపణుఁడు. అట్టివాని ధర్మము కార్పణ్య మనఁబడును, అట్టి కార్పణ్యదోషాపాదక మగు కర్మ నికృష్టమెనని. కానఁ బరమార్థ

సమత్వబుద్ధియుక్తులు కనుకనే కర్మజన్యమగు ఫలమును వదలి కేవల మీశ్వరారాధనార్థము కర్మముల నాచరించెడివిద్వాంసులు సత్త్వశుద్ధిద్వారమున తత్త్వమస్యాదివాక్యజన్యమగు నాత్మజ్ఞానముకలవారగుచుండిరి. అట్టివారై జన్మమనెడిబంధముతో నిరవశేషముగ ముక్తులై 'పదం' పదనీయము, ఆత్మతత్త్వరూపము, ఆనందరూపము, బ్రహ్మస్వరూపము, అవిద్యాతత్కార్యాత్మక రోగరహితము, భయరహితమునగు మోక్షమనెడిపురుషార్థము నభేదముచే బొందుచుండిరి. కనుకనే వారు ఫలకామనను విడిచి సమత్వబుద్ధితోఁ గర్మల నాచరించుచు ఆ కర్మలచేతనైన యంతఃకరణపరిశుద్ధికలవారై తత్త్వమస్యాది ప్రమాణజనితాత్మతత్త్వజ్ఞానముచే నశింపఁజేయబడిన యజ్ఞాన

శాంకరభాష్యతత్త్వబోధిని:—

దర్శనము నుద్దేశించియే కర్మల నాచరింపవలయును. అటు లాచరించిన దానివలన నంతఃకరణము సత్త్వప్రధానమై పరమార్థదర్శనము (ఆత్మజ్ఞానము) సంభవించును. దానివలనఁ బ్రతికియున్న దేహమునందే పుణ్యపాపములను విడచి మోక్షమును పొందును. (జీవన్ముక్తు డగును) కాన పరమార్థజ్ఞాననిమిత్తము మనస్సును ధారణ చేయవలెను. పరమార్థదర్శనము నుద్దేశించి చేయు కర్మయే యోగ మనఁబడును. అట్టి యోగము నాచరించువాఁడే నిపుణు డనఁబడును. పరమార్థదర్శనము నుద్దేశించి యోగయుక్తులై కర్మల నాచరింతురేని అట్టి కర్మాచరణమువలన నంతఃకరణము పరిశుద్ధము కాగా జ్ఞానులై కర్మవలనఁ గలిగెడి ఇష్టానిష్టదేహప్రాప్తిరూప మగు ఫలమును బరిత్యజించి సర్వబంధవినిర్ముక్తులై మోక్షమును బొందుదురని (గీ-49-50-51 అ-2) ఈమూడుశ్లోకములవలనఁ బ్రాప్తించిన యాశయము. ॥౫౧॥

తత్కార్యములు కలవారై సకలానర్థనివృత్తిపూర్వకమగు పరమానందప్రాప్తిరూపమోక్షమనెడి సర్వవ్యాపకమగు నాత్మస్థానమును పొందుచుండిరి. కాన నో యర్జునా! 'యచ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే' అని చెప్పుటవలన శ్రేయోజిజ్ఞాసువగు నీవును ఇట్టి కర్మయోగము నాచరింపు మని శ్రీకృష్ణపరమాత్మ యాశయము.

శంకరానందీయము:— ఫలము నపేక్షింపక సమత్వబుద్ధితో సమ్యగనుష్ఠితనిత్యనైమిత్తికకర్మపరిపాకసంజాతచిత్తశుద్ధికి ఫలభూత మగు శ్రవణాదిజనితావిక్రియాత్మతత్త్వవిజ్ఞానసిద్ధికి ఫలము "కర్మజం" అను శ్లోకముచేఁ జెప్పఁచుండెను.

జ్ఞానయోగనిష్ఠులగు విద్వాంసులు సంచితాదికర్మలవలన సంభవించెడి నానాయోనిసహస్రప్రాపకజన్మాదిలక్షణఫలమును వదలి "నిమిత్తాపాయే నైమిత్తికస్యా ప్యపాయః" (నిమిత్తము పోయినచో నైమిత్తికముగూడ పోవును) న్యాయానుసారము జ్ఞానాగ్నిచే సర్వకర్మలు దహించఁబడఁగ తత్ఫలములగు జన్మాదులుకూడ నశించిన దానిచే త్యక్తకర్మఫలములు కలవారగుదురు. ఆత్మసంబంధమగు కూటస్థత్వాసంగత్వవిజ్ఞానబలముచే విద్వాంసులు స్వయముగ కర్మఫలావిషయులై— "జన్మబంధవినిర్ముక్తాః" జన్మబంధ మనగ దేహము. అట్టి దేహము ఉత్తరకాలభావియనియు, వర్తమానకాలికమనియు రెండువిధములు. ఆరెంటిలో ఉత్తరకాలికదేహమునకు కారణ మగు కర్మము నశించుటచే నా దేహసంబంధము లేనివారును, తాదాత్మ్యభ్రమ లేనందున వర్తమానదేహసంబంధరహితులును అయి యీలోకమునందు జీవించి యుండగనే యాధ్యాత్మికాధిదైవికాధిభౌతికాది సర్వోపద్రవరహితము, నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావము, అఖండానందైకరసమునగు పదమును (పరబ్రహ్మమును) పొందుచుండిరి. 'పద్యతే జ్ఞానేన ప్రాప్యత ఇతి పదం' అను వ్యుత్పత్తి ననుసరించి 'పదం' అను శబ్దమునకు పరబ్రహ్మమర్థము; అవిద్యాకృతము, వాసనాకృతమునగు యన్యభావమును వదలి బ్రహ్మభావమునే పొందెదరని యర్థము. ఈవిషయము విద్వదనుభవవేద్య మని సూచించుట కీశ్లోకమునందు "హి" అను శబ్దము ప్రయోగించబడెను. ॥౫౧॥

గీ॥ యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి ।
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ॥ ॥౫౨॥

పదవిభాగము:— యదా- తే- మోహకలిలం- బుద్ధిః- వ్యతితరిష్యతి- తదా- గన్తా- అసి- నిర్వేదం- శ్రోతవ్యస్య- శ్రుతస్య- చ । ॥౫౨॥

ప్రతిపదార్థము:— యదా=ఏసమయమునందు; తే=నీయొక్క; బుద్ధిః=బుద్ధి; మోహకలిలం=మోహస్వరూపమగు కాలుష్యమును; వ్యతితరిష్యతి=అతిక్రమించఁగలదో; తదా=ఆసమయమునందు; త్వం=(ఈపదమధ్యాహార్యము) నీవు: శ్రోతవ్యస్య=(ఆధ్యాత్మికశాస్త్రముకంటె వేరగు) వినఁదగిన శాస్త్రముయొక్కయు; శ్రుతస్య చ=వినినదానియొక్కయు; నిర్వేదం=వైరాగ్యమును; గన్తాసి=పొందఁగలవు. ॥౫౨॥

శాంకరభాష్యమ్:—

యోగానుష్ఠానజనితసత్త్వశుద్ధిజా బుద్ధిః కదా ప్రాప్యత ఇత్యుచ్యతే—యదేతి । యదా యస్మిన్కాలే తే తవ మోహకలిలం మోహాత్మక మవివేకరూపం కాలుష్యం యే నాత్మానాత్మవివేకబోధం కలుషీకృత్య విషయం ప్రత్యంతఃకరణం ప్రవర్తతే; తే తవ బుద్ధి ర్వ్యతితరిష్యతి వ్యతిక్రమిష్యతి శుద్ధిభావ మాపత్స్యత ఇత్యర్థః । తదా తస్మిన్కాలే గన్తాసి ప్రాప్స్యసి నిర్వేదం వైరాగ్యం శ్రోతవ్యస్య శ్రుతస్య చ తదా శ్రోతవ్యం శ్రుతం చ నిష్ఫలం ప్రతిపద్యత ఇత్యభిప్రాయః ॥ ॥౫౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

యోగానుష్ఠానమువలన నంతఃకరణశుద్ధి జనించును. అట్టి యంతఃకరణశుద్ధివలన జనించు బుద్ధి (జ్ఞానము) యెపుడు ప్రాప్తమగు ననిన? దేనిచే నాత్మానాత్మవివేకజ్ఞానమును కలుషముగ చేసికొని శబ్దస్పర్శరూపరసగంధము లనెడి విషయములను గూర్చి యంతఃకరణము ప్రవర్తించునో అట్టి నీసంబంధ మగు మోహాత్మకమును, నవివేకరూపమునగు కాలుష్యము నెపుడు నీసంబంధ మగు బుద్ధి యతిక్రమించునో, అనగా నీబుద్ధి శుద్ధిభావము నెప్పుడు పొందునో ఆకాలమునందే యాధ్యాత్మికశాస్త్రముకన్న వేరగునదియు, వినదగినదియు, వినినదియు నగు శాస్త్రములయొక్క వైరాగ్యమును బొందెదవు ఆధ్యాత్మికశాస్త్రవ్యతిరిక్త మగు శ్రోతవ్యము శ్రుతమునగున దెల్ల నిష్ఫల మగు నని యాశయము. (ఎపుడు పూర్వమునందుఁ జెప్పఁబడిన వివేకము జనించునో అపుడే అనాత్మవిషయమై నిష్ఫలత్వము తోచును) ॥౫౨॥

—• ౨వ అధ్యాయము- ౫౨ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "నిష్కామనాపూర్వకముగ నీశ్వరార్పణబుద్ధితోఁ గర్మముల నాచరించుచున్న నా కెపుడు సత్త్వశుద్ధి సంభవించు" ననుశంకను తొలగించుటకు 'యదా' అని చెప్పుట మొదలిడెను.

ఇంతకాలమునకు సత్త్వశుద్ధి కలుగునను కాలనియమము లేదు. మఱేమనిన? ఏకాలమునందు నీ యంతఃకరణము 'అహమిదం మమేదం' ఇత్యాద్యజ్ఞానవిలసితము, అతిగహనము, అవివేకాత్మకము నగు కాలుష్యము నతిక్రమించునో, (అనగా రజస్తమోరూపములను విడచి శుద్ధభావమును పొందునో) అట్టి కాలమునందే శ్రోతవ్యము,

శ్రుతము నగు కర్మఫలముయొక్క నిర్వేదమును, (కర్మఫలమునందు తృష్ణలేకపోవుటను) పొందెదవు. "పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయాత్" (ఈ లోకములను కర్మచే సంపాదింపఁబడినవానిఁగ నెఱిఁగి బ్రాహ్మణుఁడు వైరాగ్యమును పొందవలెను.) అను శ్రుత్యుక్తరీతిని నిర్వేదరూపమగు ఫలముచే నంతఃకరణశుద్ధిని తెలిసికొనఁగలవని యభిప్రాయము.

శంకరానందీయము:— "చిత్తశుద్ధిజన్యమగు సర్వత్ర అలంబుద్ధిరూపవైరాగ్యము, ప్రజ్ఞాస్థైర్యరూపయోగము నెపు డెటుల పొందఁగలను?" అని యర్జునుని యభిప్రాయమును గుర్తించి, యెపుడు నీకు బుద్ధికాలుష్యము నివృత్త మగునో; ఎపుడు నీకు నిర్వికల్పప్రజ్ఞ సంభవించునో; అపుడు వైరాగ్యమును, యోగమును పొందఁగల వని యీరెంటిని "యదా" అను శ్లోకము మొదలు రెండుశ్లోకములచేఁ గ్రమముగ చెప్పుచుండెను.

సదసద్వివేకశూన్య మగుటచే నంతఃకరణ మసద్విషయములయందే మోహముచే "నిది రమ్య మనియు, నిది అరమ్య మనియు, నిది యిష్ట మనియు, నిది అనిష్ట మనియు, నిది గ్రాహ్య మనియు, నిది అగ్రాహ్య మనియు" నీవిధముగ రాగద్వేషగ్రస్తమై సర్వదా ప్రవర్తించును. అట్టి యంతఃకరణమే మోహకలిల మనఁబడును. మోహ మనఁగ విచిత్తత్వము (అనగా నీనిఖిలవిషయజాతము అసద్రూపము, మాయికము, తుచ్ఛము అనెడి వివేకము లేక పదార్థాపరిజ్ఞానము). అట్టి మోహ మనెడి కాలుష్యము దర్పణమునకు ధూళీపటలమువలె వివేకబుద్ధి కావరణము. ఇట్టి మోహకలిలమును నీబుద్ధి యెపు డతిక్రమించునో (అనగా "యదిదం మనసా వాచా చక్షుర్భ్యాం శ్రవణాదిభిః। నశ్వరం గృహ్యమాణం చ విద్ధి మాయామనోమయమ్॥" మనస్సుచేతను, వాక్కుచేతను, చక్షుస్సులచేతను, శ్రవణాదులచేతను గ్రహింపఁబడునది నశ్వరము మాయామనోమయ మని తెలిసికొనుము). ఇత్యాది వచనార్థపరిజ్ఞానమువలనఁ గలిగెడి శివప్రసాదమూలక మగు "దృశ్యమానమగు సర్వము మిథ్యాభూతము" అనెడి నిశ్చయముచే నీబుద్ధి మోహకలిలము నెపుడు విడుచునో అపుడు శ్రోతవ్యము, శ్రుతము, ద్రష్టవ్యము, దృష్టము, జ్ఞాతవ్యము, జ్ఞాతము, గృహీతము, గ్రాహ్యము నగు వస్తువునకు మిథ్యాత్వమునే దెలిసికొని నీవు సర్వత్ర అలంబుద్ధిలక్షణ మగు వైరాగ్యమును బొందఁగలవు. వ్యవహరింపఁదగినది మిథ్య యగుటవలన వ్యవహారము మిథ్యార్థగోచరము. కాన నిష్ఫలము. అట్టి నిష్ఫల మగుదానిచే నాకేమి ప్రయోజన మని నిఖిలవ్యవహారమునుండియు నుపరతుఁడవు కాఁగలవు.

భాష్యోత్కర్షదీపిక:— యోగానుష్ఠానజనితసత్త్వశుద్ధిజన్యము, వైరాగ్యము మొదలగు సాధనములతోఁ గూడినదియు. నిత్యానిత్యవస్తువివేకరూపము, జ్ఞానాధికారసంపాదకము అగు బుద్ధిని నీ వెప్పుడు పొందెదవో అట్టి సమయంబున నీబుద్ధి చిత్తశుద్ధివలనఁ యవివేకరూప మగు కాలుష్యము నతిక్రమింపఁగలదు. ఆసమయమున శ్రోతవ్యము, శ్రుతము నగు కర్మఫలముయొక్క వైరాగ్యమును పొందెదవు.

పరమార్థప్రపా:— ఆపరబ్రహ్మరూప మగు పదము నేసమయమున పొందగలుగుదు నను శంకను తొలగించుటకు "యదా తే" అని చెప్ప మొదలిడెను.

మోహ మనఁగ దేహమునం దాత్మబుద్ధి. దురతిక్రమ మగుటచే నదియే యొక్క గహనము (అరణ్యము). అట్టి మోహారణ్యము నెన్నడు నీబుద్ధి దాటునో అపుడే శ్రోతవ్యముయొక్కయు, శ్రుతముయొక్కయు వైరాగ్యమును పొందెదవు. ఈవిషయమే పాతంజలసూత్రమునందు "భోగాపవర్గౌ బుద్ధికృతౌ బుద్ధావేవ వర్తమానౌ కథం పురుషే వ్యపదిశ్యేతే స హి తత్ఫలభోక్తేతి। యథా విజయః పరాజయోవా యోధేషు వర్తమాన స్స్వామి న్యపదిశ్యతే స హి తత్ఫలభోక్తేతి। బుద్ధేరేవ పురుషార్థాపరిసమాప్తి ర్బంధస్తదర్థవ్యవసాయో మోక్షః" (యుద్ధభటులయందుండు జయపరాజయములు తత్ఫలభోక్త యగుటచే ప్రభువునం దెట్లు వ్యపదిశ్యమానములో అట్లే బుద్ధికృతములును, బుద్ధియందుండునవియు నగు భోగాపవర్గములు తత్ఫలభోక్త యగుటచేఁ బురుషునియందు వ్యపదిష్టము అగుచున్నవి.

గీ॥ శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా ।
సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి ॥ ॥౫౩॥

పదవిభాగము:— శ్రుతివిప్రతిపన్నా- తే- యదా- స్థాస్యతి- నిశ్చలా- సమాధౌ- అచలా- బుద్ధిః- తదా- యోగం- అవాప్స్యసి । ॥౫౩॥

ప్రతిపదార్థము:— శ్రుతివిప్రతిపన్నా, శ్రుతి=అనేక సాధ్యసాధనములను ప్రకాశింపఁజేయునానిని వినుటచే; విప్రతిపన్నా=విక్షిప్తమగు; తే=నీయొక్క; బుద్ధిః=అంతఃకరణము; యదా=ఏ కాలమునందు; నిశ్చలా=విక్షేపశక్తిచే జనించు చలనముతో శూన్యమై; సమాధౌ=(సమాధీయతే చిత్త మస్మి న్నితి సమాధి రాత్మా) ఆత్మయందు; అచలా=(సంశయశూన్యమై): వికల్పశూన్యమై; స్థాస్యతి=స్థిరీభూతమై కాఁగలదో; తదా=అట్టిసమయమున; త్వం=(ఈపదమధ్యాహార్యము) నీవు; యోగం=వివేకజ్ఞానమనెడి సమాధియోగమును; అవాప్స్యసి=పొందఁగలవు. ॥౫౩॥

---

శాంకరభాష్యమ్:—

మోహకలిలాత్యయద్వారేణ లబ్ధాత్మవివేకప్రజ్ఞః కదా కర్మయోగజం ఫలం పరమార్థయోగ మవాప్స్యామీతిచే త్త చ్ఛృణు—శ్రుతివిప్రతిపన్నేతి । శ్రుతివిప్రతిపన్నాఽనేకసాధ్యసాధనసంబంధప్రకాశనశ్రుతిభి శ్శ్రవణై ర్విప్రతిపన్నా నానాప్రతిపన్నా శ్రుతివిప్రతిపన్నా

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మోహ మనెడి యవివేకాత్మకమగు కాలుష్యము తొలఁగి తద్ద్వారమున నాత్మవివేకమువలన జనించెడి ప్రజ్ఞను బొందినవాఁడనై ఏకాలమునందు కర్మయోగమువలన జనించెడి పరమార్థయోగ మనెడి ఫలమును బొందగలనందువా ? అట్టి కాలవిశేషమును జెప్పెద వినుము.

---

పురుషార్థములయందు పరిసమాప్తి లేని బుద్ధియే బంధమనియు, పురుషార్థములయందు పరిసమాప్తియే మోక్షమనియు చెప్పఁబడును. (అని చెప్పబడెను.)

నీలకంఠీయము:— ఎపుడు విద్వాంసు డగుదును? అను నాశంకను తొలగించుటకు "యదా తే" అని చెప్ప మొదలిడెను.

మోహమనగ ఇష్టవియోగానిష్టసంయోగపరితాపమువలనఁ గలిగెడి చిత్తవైకల్యము. ఆ చిత్తవైకల్యమే బుద్ధిగతమగు కాలుష్యము. అట్టి మోహకాలుష్యము నెపుడు నీ బుద్ధి యతిక్రమించునో (అనగా నీ బుద్ధి యెపుడు ప్రసన్నమగునో) అట్టి సమయమునందే వినఁదగిన శాస్త్రభాగముయొక్కయు, వినిన శాస్త్రభాగముయొక్కయు వైరాగ్యమును పొందఁగలవు.

ఇచట నభిప్రాయమిది. బుద్ధిమలినమైయుండ శాస్త్రార్థ మనేకపర్యాయములు గృహీతమైనను స్ఫురింపదు. కాన నపుడు శ్రోతవ్యము, శ్రుతము నగు శాస్త్రార్థము వ్యర్థమగును. ఆదేవిధమున బుద్ధి పరిశుద్ధమైనచో తత్త్వమును తెలిసిన శాస్త్రార్థస్ఫురణమగును. కాన నట్టి సమయమున శ్రోతవ్యము, శ్రుతము నగు శాస్త్రార్థము వ్యర్థము. కాన నుభయథా శాస్త్రార్థమునందు నిర్వేద (వైరాగ్య) ముచితము. ధ్యానము ప్రసన్న మగు బుద్ధిని గ్రహించుటకు యోగ్య మగును. కాన శ్రవణాదికమును విడిచి ధ్యాననిష్ఠుఁడ వగు మని భావము. ॥౫౨॥

—• ౨వ అధ్యాయము ౫౩ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— అంతఃకరణపరిశుద్ధిచే నీ విధముగ వైరాగ్యము కలిగినవాని కెపుడు జ్ఞానప్రాప్తియగును? అను నాశంకపై "శ్రుతివిప్రతిపన్నా" అని చెప్ప మొదలిడెను.

శాంకరభాష్యమ్:—

విప్రతిపన్నా అనేకసాధ్యసాధనసంబంధప్రకాశనశ్రుతిభిః శ్రవణైః ప్రవృత్తినివృత్తిలక్షణైః విప్రతిపన్నా నానాప్రతిపన్నా విక్షిప్తా సతీ తే తవ బుద్ధి ర్యదా యస్మిన్ కాలే స్థాస్యతి స్థిరీభూతా భవిష్యతి నిశ్చలా విక్షేపచలనవర్జితా సతీ సమాధౌ సమాధీయతే చిత్త మస్మి న్నితి సమాధి రాత్మా తస్మి న్నాత్మనీ త్యేతత్ । అచలా తత్రాపి వికల్పవర్జితే త్యేతత్ । బుద్ధి రంతఃకరణం తదా తస్మి న్కాలే యోగ మవాప్స్యసి వివేకప్రజ్ఞాం సమాధిం ప్రాప్స్యసి ॥ ॥౫౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సాధ్యము స్వర్గము, సాధనము జ్యోతిష్టోమము, వానికిఁగల సంబంధమును బ్రకాశింపఁ జేయు వాక్యములను వినుటచే నీయంతఃకరణము విక్షిప్తమైనది. అట్టి యంతఃకరణ మేసమయమునందు విక్షేపశక్తి వర్జితమై, దేనియందు చిత్తము లెస్సగనుంచబడునో అట్టి యాత్మయందు వికల్పవర్జితమై (సంశయశూన్యమై) స్థిరీభూతమగునో అట్టి సమయమునందు వివేకప్రజ్ఞారూపమగు సమాధియోగమును బొందగలవు. ॥౫౩॥

నానావిధఫలశ్రవణములచేతను అవిచారిత తాత్పర్యములచేతను, ననేకవిధసంశయవిపర్యాసములు కలదగుటచే నీబుద్ధియింతకుపూర్వము విక్షిప్తమైనది. అట్టిబుద్ధి యెపుడు చిత్తపరిశుద్ధివివేకజనితదోషదర్శనముచే నావిక్షేపమును పరిత్యజించి పరమాత్మయందు 'నిశ్చలా' జాగ్రత్స్వప్నదర్శనరూప విక్షేపరహితమై "అచలా" సుషుప్తిమూర్ఛాస్తబ్ధీభావాది రూపలయలక్షణచలనరహితమై లయవిక్షేపరూపదోషములనుపరిత్యజించి సమాహితముగనో—లేక 'నిశ్చలా' సంభావనా విపరీతభావనాశూన్యమై "అచలా" దీర్ఘకాలాదరనైరంతర్య సత్కారసేవనలచే విజాతీయప్రత్యయాదూషితమై నిర్వాతప్రదీపమువలె నాత్మయం దుండునో అట్టి సమయమున సర్వయోగఫలము, జీవపరమాత్మైక్యలక్షణము, తత్త్వమస్యాది వాక్యజన్యమునగు యఖండసాక్షాత్కారరూపమునగు సర్వయోగ ఫలమును పొందగలవు అట్టిసమయమున సాధింపదగినది మరేమియు లేనందున కృతకృత్యుఁడవై స్థితప్రజ్ఞుడవై కాగలవని యభిప్రాయము.

శంకరానందీయము:— ఈవిధముగ ముముక్షువునకు జ్ఞానయోగసిద్ధికసాధారణమగు బాహ్యోపరమణమును (వైరాగ్యమును) నిరూపించి యనంతరమున జ్ఞానయోగసిద్ధిప్రకారమును "శ్రుతివిప్రతిపన్నా" అను శ్లోకముచే జెప్పుచుండెను

ఋగాదిశ్రుతులచే నొకానొకస్థలమునందు కర్మవిశేషములు, తత్ఫలవిశేషములు తన్మాహాత్మ్యవిశేషములు చెప్పబడుచున్నవి. ఒకానొకస్థలమునందుపాసనావిశేషములు, తత్ఫలవిశేషములు, తన్మాహాత్మ్యవిశేషములు చెప్పబడుచున్నవి. ఒకానొకస్థలమునందు సగుణబ్రహ్మము, తన్మాహాత్మ్యము, అట్టి సగుణబ్రహ్మోపాసనాఫలమునకౌత్కృష్ట్యము చెప్పబడుచున్నది. ఒకానొకచోట నిర్గుణబ్రహ్మము; తద్జ్ఞానము, తన్మాహాత్మ్యము, తత్ఫలప్రాశస్త్యము చెప్పబడుచున్నది. ఇదంతయువినినవానికి విప్రతిపత్తి గలుగును. (అనగా అన్నిటికిని ప్రాధాన్యమా? లేక సగుణమునకు ప్రాధాన్యమా? లేక, నిర్గుణమునకా? లేక, సగుణనిర్గుణోభయమునకా? అని శ్రుతివాక్యములచే బుద్ధి సంశయావిష్ట (బహువిక్షేపముకలది) మగును. అట్టినీబుద్ధి ప్రజ్ఞచే సర్వశాస్త్రములను విచారించి శ్రుతిస్మృతియుక్తిబలముచేతను, గురూపదేశముచేతను 'సర్వే వేదా యత్పద మామనన్తి' అను న్యాయానుసారముసర్వశాస్త్రములకు నిర్విశేషబ్రహ్మమునందే పరమతాత్పర్యము పర్యవసితమని తెలిసికొని సర్వవిక్షేపములను పరిత్యజించి 'నిశ్చలా' నిర్విశేషమై 'సమాధౌ సమాధీయతేఽస్మింశ్చిత్తమితి సమాధిః పదం బ్రహ్మ తస్మిన్' పరబ్రహ్మము

గీ॥ అర్జున ఉవాచ:— స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ! ।
స్థితధీః కిం ప్రభాషేత? కిమాసీత? వ్రజేత కిమ్? ॥ ॥౫౪॥

పదవిభాగము:— అర్జునః- ఉవాచ । స్థితప్రజ్ఞస్య- కా- భాషా- సమాధిస్థస్య- కేశవ!- స్థితధీః- కిం- ప్రభాషేత- కిం- ఆసీత- వ్రజేత- కిమ్ । ॥౫౪॥

ప్రతిపదార్థము:— హే కేశవ!= ఓ శ్రీకృష్ణా!; స్థితప్రజ్ఞస్య=నేను పరబ్రహ్మనను జ్ఞానముకల: సమాధిస్థస్య=సమాధినిష్ఠునకు; భాషా=భాషణము; కా=ఎట్టిది; స్థితధీః=స్థితప్రజ్ఞుఁడు: కింప్రభాషేత=ఎటుల మాటలాడును?; కిమాసీత=ఎటులకూరుచుండును?; కింవ్రజేత=ఎటులనడచును?; ॥౫౪॥

శాంకరభాష్యమ్:—

ప్రశ్నబీజం ప్రతిలభ్యార్జున ఉవాచ లబ్ధసమాధిప్రజ్ఞస్య లక్షణబుభుత్సయా— స్థితప్రజ్ఞస్యేతి । స్థితా ప్రతిష్ఠితాఽహమస్మి పరం బ్రహ్మేతి ప్రజ్ఞా యస్య సః స్థితప్రజ్ఞస్తస్య కా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వివేకజ్ఞానరూపమగు సమాధియోగమును బొందునని శ్రీకృష్ణుఁడు చెప్ప ప్రశ్నబీజమును దెలిసికొని యర్జునుఁడు స్థితప్రజ్ఞుని లక్షణమును దెలిసికొను నిచ్ఛచే నిట్లు ప్రశ్నించెను.

వందు తదాకారాంము చేతినే 'అచలా' చలనహేతువులగు బాహ్యావాసనలు నశించుటచేఁ గ్రియాశూన్యమై యెప్పుడుండునో అపుడు ప్రజ్ఞాస్థైర్యరూపమగు యోగమును పొందగలవు.

లేక – 'సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ, సర్వం బ్రహ్మైతదాత్మ్యమిదం సర్వం, సద్ధీదం సర్వం తత్త్వమసి, అయమాత్మా బ్రహ్మ తదేతద్బ్రహ్మాపూర్వమనపరమనన్తరమబాహ్యం, బ్రహ్మైవేదం సర్వం'' ఇత్యాదిశ్రుతులు సర్వము బ్రహ్మస్వరూపమే. యనెడిజ్ఞానమును కలుగజేయును. అట్టి శ్రుతులచేనైన విశేషప్రతిపత్తి (విశేషజ్ఞానము) కలది "శ్రుతివిప్రతిపన్నా'' అనియనంబడును. 'సర్వం బ్రహ్మైవ' అను మొదలగు శ్రుతులచే సంభావితమగు విశేషజ్ఞానము కలదనియర్థము. కనుకనే 'నిశ్చలా' విక్షేపములు లేనిది. పరమాప్తవాక్యశ్రవణముచేతగాని, అధిష్ఠానసందర్శనముచేతనుగాని, సద్బుద్ధికి విప్రతిపత్తి కాని విక్షేపము కాని సంభవింపవు. కాన నీవిధమున తెస్సగ శ్రవణముచేతను, మననముచేతను సంపన్నమగు నీబుద్ధి యసంప్రజ్ఞాతసమాధియందు నిర్వాతదీపమువలె కంపములేనిదై ఎపుడు చిత్తపరిపాకావస్థయందుండునో; అపుడు నీవు అప్రతిబద్ధమగు జ్ఞానయోగమును పొందగలవు. అట్టి సమయమున యోగారూఢుడ వగుదువని యర్థము.

నీలకంఠీయము:— బుద్ధిప్రసాదమే హేతువుచే దెలిసికొనదగిన దను ప్రశ్నకు సమాధానముగ "శ్రుతి విప్రతిపన్నా'' అని చెప్ప మొదలిడెను.

నానావిధశాస్త్రశ్రవణములచే నీబుద్ధి- ఆత్మ నిత్యమా? అనిత్యమా? నిత్యమైనను కర్తయా? అకర్తయా? అకర్తయైనను ఏకమా? అనేకమా? అని సంశయగ్రస్తమైనది. అట్టి బుద్ధి యెపు డసంభావనావిపరీతభావనాతిరస్కారపూర్వకముగ శ్రుతితాత్పర్యవిషయీభూత మగు బ్రహ్మాద్వైతమునందు "నిశ్చలా'' కుతర్కములచే నాక్రమించబడనిదై, నిర్విచికిత్సాపరోక్షనిశ్చయముకలదై, నిర్వికల్పప్రత్యగాత్మయందు లయవిక్షేపశూన్యమై, స్థిరమైయుండునో అపుడు వివేకప్రజ్ఞను పొందగలవు. నిశ్చలసమాధిలాభమే బుద్ధిప్రసాదలింగమని భావము. ॥౫౩॥

—• ౨వ అధ్యాయము ౫౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఈవిధమున శ్రీకృష్ణుడు చెప్ప సమయము ప్రాప్తించిన దని యర్జునుఁడు తలచి స్థితప్రజ్ఞలక్షణమును దెలిసికొనుటకై "స్థితప్రజ్ఞస్య'' అను శ్లోకముచే నిట్లు ప్రశ్నించెను.

శాంకరభాష్యమ్:—

భాషా కిం భాషణం వచనం కథ మసౌ పరై ర్భాష్యతే సమాధిస్థస్య సమాధౌ స్థితస్య కేశవ! స్థితధీః స్థితప్రజ్ఞః స్వయం వా కిం ప్రభాషేత? కిమాసీత? వ్రజేత కిం? ఆసనం వ్రజనం వా తస్య కథ మిత్యర్థః । స్థితప్రజ్ఞస్య లక్షణ మనేన శ్లోకేన పృచ్ఛతి । ॥౫౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నేను పరబ్రహ్మస్వరూపుఁడ నను జ్ఞాన మెవనికి సంభవించునో అట్టివాఁడు స్థితప్రజ్ఞుఁడు. అట్టి సమాధినిష్ఠుఁ డగు స్థితప్రజ్ఞు నుద్దేశించి పరు లేవిధమున భాషణము సేయుదురు? (1) అట్టి స్థితప్రజ్ఞుడు స్వయముగ నెట్టుల భాషణమును సలుపును? (2) అట్టి స్థితప్రజ్ఞుఁ డెట్టుల కూర్చుండును? (3) ఎట్టుల సంచరించును? అనగా నట్టి స్థితప్రజ్ఞుని స్థితిగతు లెట్టివని యాశయము. ఈవిధముగ నీశ్లోకముచే స్థితప్రజ్ఞుని లక్షణమును ప్రశ్నించెను. ॥౫౪॥

"స్థితా నిశ్చలాఽహం బ్రహ్మాస్మీతి ప్రజ్ఞా యస్య సః స్థితప్రజ్ఞః" (నేను బ్రహ్మస్వరూపుడ ననెడి నిశ్చలమగు ప్రజ్ఞ కలవాడు స్థితప్రజ్ఞుఁడనబడును. ఆస్థితప్రజ్ఞుఁడు సమాధిస్థుడు వ్యుత్థితచిత్తుఁడని యవస్థాద్వయము కలవాడు కాన 'సమాధిస్థస్య' అని స్థితప్రజ్ఞునకు విశేషణమీయబడెను, (1) ఆయవస్థాద్వయాంతర్గతమగు సమాధ్యవస్థతోఁగూడిన స్థితప్రజ్ఞుని భాషణమెట్టిది? (2) సమాధివ్యుత్థితచిత్తుడగు నాస్థితప్రజ్ఞుడు స్వయముగ స్తుతినిందాదులయం దభినందనద్వేషాదిరూపమగు వాక్యముల నెట్లు పలుకును? సర్వస్థలములయందు సంభావనార్థమునందే 'ప్రభాషేత' అని 'లిఙ్' ప్రయోగింపబడెను. (3) 'కిమాసీత' వ్యుత్థితచిత్తనిగ్రహముకొరకెట్టుల బహిరింద్రియనిగ్రహమును సేయును? (4) బహిరింద్రియనిగ్రహము లేని సమయమున 'కింవ్రజేత' ఎట్లు విషయములను పొందును? మూఢజనవిలక్షణమగు స్థితప్రజ్ఞకర్తృకభాషణము, ఆసనము, వ్రజనమెట్టివని యర్థము. ఇవి మొత్తము నాలుగు ప్రశ్నములు. అందు సమాధిస్థుఁడగు స్థితప్రజ్ఞుని విషయమై యొకప్రశ్నము, సమాధివ్యుత్థిత స్థితప్రజ్ఞుని విషయమై మూడుప్రశ్నములు. 'కేశవ' అను సంబోధనచే సర్వాంతర్యామివగుటచే నీవే యీరహస్యమును చెప్పుటకు సమర్థుఁడ వని సూచింపబడెను.

పరమార్థప్రభ:— సమాధియందు స్థిరబుద్ధికలవాని స్వరూపము నర్జునుఁడు "స్థితప్రజ్ఞస్య" అను శ్లోకముచే ప్రశ్నించుచుండెను.

(1) 'భాష్యతే ప్రోచ్యతేఽనేనేతి భాషా' స్థితప్రజ్ఞుఁడగు పురుషుఁ డే లక్షణములచే స్థితప్రజ్ఞుఁ డని చెప్పబడును? సమాధిస్థుఁ డగు స్థితప్రజ్ఞుని లక్షణమేది? అనగా సమాధిస్థుఁ డగు స్థితప్రజ్ఞుఁ డేలక్షణములచే స్థితప్రజ్ఞుఁడని తెలిసికొన దగును. పరబుద్ధి యప్రత్యక్షముకదా! దర్శనమాత్రముచే స్వరూప మెట్టుల దెలియ వగును? అని శంకింపజనదు. అతిబుద్ధిమంతునిచే నాకారముచేతనే పరుని మనోగతము తెలియబడుచున్నది. ఈవిషయము నుద్దేశించియే "ఉదీరితోఽర్థః పశునాపి గృహ్యతే, హయాశ్చ నాగాశ్చ వహన్తి నోదితాః । అనుక్తమప్యూహతి పండితో జనః పరేంగితజ్ఞానఫలాహి బుద్ధయః" (పశువులు చెప్పబడని యర్థమును గ్రహించును. అశ్వములు, గజములు చెప్పఁబడని యర్థములను వహించును. పండితుఁడు చెప్పబడని విషయము నూహించును. కాన బుద్ధులు పరేంగితజ్ఞానమే ఫలముగాగలవి) అని చెప్పబడెను. ఇట్లర్జునుఁడు ప్రశ్నించి వ్యవహారముచే స్థితప్రజ్ఞలక్షణమును 'స్థితధీః' అనుదానిచే ప్రశ్నించుచుండెను. (2) స్థితప్రజ్ఞుఁ డెట్టులమాట్లాడును? (3) స్థితప్రజ్ఞుఁ డెట్టుల కూర్చుండును? (4) ఎట్టుల నడచును? అని ప్రశ్నార్థము. ॥౫౪॥

గీ॥ శ్రీభగవానువాచ-ప్రజహాతి యదా కామా న్సర్వా న్పార్థ మనోగతాన్ ।
ఆత్మన్యే వాత్మనా తుష్ట స్స్థితప్రజ్ఞ స్తదోచ్యతే ॥ ॥౫౫॥

పదవిభాగము:— శ్రీభగవాన్- ఉవాచ- ప్రజహాతి- యదా- కామాన్- సర్వాన్- పార్థ!- మనోగతాన్- ఆత్మని- ఏవ- ఆత్మనా- తుష్టః- స్థితప్రజ్ఞః- తదా- ఉచ్యతే ॥ ॥౫౫॥

ప్రతిపదార్థము:— శ్రీభగవాన్=శ్రీకృష్ణపరమాత్మ; ఉవాచ=పలికెను । హే పార్థ!=ఓయర్జునా!; యదా= ఎప్పుడు; మనోగతాన్=హృదయమునందు ప్రకాశించిన; సర్వాన్=సమస్తములగు; కామాన్=కోరికలను; ప్రజహాతి=ప్రకర్షగ విడచునో; ఆత్మన్యేవ=ప్రత్యగాత్మస్వరూపమునందే; ఆత్మనా=తన స్వరూపముచేతనే; తుష్టః=(పరమార్థదర్శనలాభముచే మఱియొకదానినుండి) అలంప్రత్యయము (చాలును అను జ్ఞానము) కలవాఁడగునో; తదా=అపుడు; సః=(ఈపదమధ్యాహార్యము) ఇతరులచే; స్థితప్రజ్ఞః=స్థితప్రజ్ఞుడని; ఉచ్యతే=చెప్పబడును. ॥౫౫॥

శాంకరభాష్యమ్:—

యో హ్యాదిత ఏవ సంన్యస్య కర్మాణి జ్ఞానయోగనిష్ఠాయాం ప్రవృత్తో యశ్చకర్మయోగేన తయోః స్థితప్రజ్ఞస్య ప్రజహాతీ త్యారభ్యాధ్యాయపరిసమాప్తిపర్యన్తం స్థితప్రజ్ఞలక్షణం సాధనం చోపదిశ్యతే । సర్వత్రైవ హ్యాధ్యాత్మశాస్త్రే కృతార్థలక్షణాని యాని తాన్యేవ సాధనా న్యుపదిశ్యన్తే యత్నసాధ్యత్వాత్ । యాని యత్నసాధ్యాని సాధనాని లక్షణాని చ భవన్తి తాని శ్రీభగవా నువాచ.—ప్రజహాతీతి। ప్రజహాతి ప్రకర్షేణ జహాతి పరిత్యజతియదా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఎవఁడు కర్మసంన్యాసమునకు కారణమగు వైరాగ్యసంపత్తిగలవాఁడై బ్రహ్మచర్యావస్థయందు (బ్రహ్మభావమును బొందించున దగుటచే జ్ఞానమే యోగమనంబడును. అట్టిజ్ఞానయోగమునం దగు నిష్ఠ (పరిసమాప్తి) జ్ఞానయోగనిష్ఠ యనంబడును.) జ్ఞానయోగనిష్ఠయందే ప్రవృత్తుఁడో, ఎవడు కర్మయోగముచే గర్మలను సంన్యసింపక కర్మయోగనిష్ఠయందు ప్రవృత్తుఁడో వారిరువురిలో ఎవడు స్థితప్రజ్ఞుఁడో అట్టిస్థితప్రజ్ఞుని లక్షణము, సాధనము "ప్రజహాతి" అను శ్లోకము మొదలు ఈద్వితీయాధ్యాయపరిసమాప్తివర కుపదేశింపఁబడుచుండెను.

"ప్రజహాతి" అను శ్లోకము మొదలు అధ్యాయపరిసమాప్తిపర్యంత మొకవాక్యముకదా! అట్లయిన నొకవాక్యముచే నొకవిషయమునే ప్రధానముగ బోధింపవలయును. కాని స్థితప్రజ్ఞలక్షణము, సాధనము అనెడి రెండు విషయములను బ్రధానముగ నెట్లు బోధించును. అట్లు ప్రధానముగ నర్థద్వయమును బోధించినచో వాక్యభేదము ప్రాప్తించును. (వాక్యభేద మనునది శాస్త్రమునం దొక దోషము.) ఇట్టి వాక్యభేదరూపదోషము దొలగుటకు "లక్షణము, సాధ

—• ౨వ అధ్యాయము- ౫౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఈనాలుగు ప్రశ్నములకు క్రమముగ సమాధానమును శ్రీకృష్ణపరమాత్మ "ప్రజాహాతి" అనుశ్లోకము మొదలధ్యాయ పరిసమాప్తవరకు చెప్పుచుండెను.

శాంకరభాష్యము:—

యస్మిన్కాలే సర్వాన్సమస్తాన్కామా నిచ్ఛాభేదాన్ హే పార్థ! మనోగతాన్మనసి ప్రవిష్టాన్
హృది ప్రవిష్టాన్ । సర్వకామపరిత్యాగే తుష్టికారణాభావా చ్ఛరీరధారణనిమిత్తశేషే చ
సత్యున్మత్తప్రమత్తస్యేవ ప్రవృత్తిః ప్రాప్తేత్యత ఉచ్యతే— ఆత్మన్యేవ ప్రత్యగాత్మస్వరూప
ఏవాత్మనా స్వేనైవ బాహ్యలాభనిరపేక్షః తుష్టః పరమార్థదర్శనామృతరసలాభే నాన్యస్మాదలం
ప్రత్యయవాన్ స్థితప్రజ్ఞః స్థితా ప్రతిష్ఠితాఽఽత్మానాత్మవివేకజా ప్రజ్ఞా యస్య సః స్థితప్రజ్ఞో
విద్వాం స్తదోచ్యతే । త్యక్తపుత్రవిత్తలోకైషణ స్సంన్యస్యాత్మారామ ఆత్మక్రీడః స్థితప్రజ్ఞ
ఇత్యర్థః ॥ ॥౫౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నము" అను నీరెండు నొకటియే యందమన్న కృతార్థుని లక్షణము కృతార్థుని స్వరూపమే యగుటంజేసి ఫలరూపమే యగును. ఫలమునకు సాధనరూపత్వ మెట్లు సమంజస మగును? కాన స్థితప్రజ్ఞలక్షణము, సాధనము అనెడి రెండు నీయుత్తరగ్రంథముచే నుపదేశింపఁబడుచుండె నని చెప్పుట యెట్లు సమంజస మగు నని శంకింపఁజనదు.

విచారించినచో కృతార్థు డగు జ్ఞానియొక్క యేజ్ఞానలక్షణము కలదో యది జ్ఞానలక్షణ స్వరూపముచే ఫలరూపమే యగునుకాని సాధనరూపము కానేరదు. అయినను జ్ఞానియొక్క జ్ఞానలక్షణమే జిజ్ఞాసువునకు ప్రయత్నసాధ్య మగుటంజేసి "ఏది ప్రయత్నసాధ్యమో యది సాధన" మను వ్యాప్తిచే సాధనరూప మగును. ఇట జ్ఞానసామగ్ర్యమువలనఁ బ్రాప్తించిన జ్ఞాని లక్షణము విధినిషేధముల కగోచరుం డగుటంజేసి విద్వాంసునకు విధింపఁబడుటలేదు. మఱే మనిన? అనువదింపఁబడుచుండెను. కాన జిజ్ఞాసువునకు సాధనానుష్ఠానము నిమిత్తమై స్థితప్రజ్ఞ లక్షణ మనువదింపఁబడుటచే నొక టగు సాధనానుష్ఠానమునందే యుత్తరగ్రంథము తాత్పర్యము కలదిగాన వాక్యభేదము ప్రాప్తింపనేరదు. అందువలన స్థితప్రజ్ఞలక్షణము, సాధనము అను నీ రెంటిని నుత్తరగ్రంథముచే నుపదేశించుట సమంజసమే. కాన నేయేయత్న సాధ్యములగు సాధనములు, ఏయే యత్నసాధ్యములగు స్థితప్రజ్ఞలక్షణములు కలవో వానిని శ్రీకృష్ణపరమాత్మ "ప్రజహాతి" అను శ్లోకము మొదలుకొని యుపదేశించుచుండెను.

ప్రమాణ విపర్యయ వికల్పనిద్రాస్మృతి భేదముచే నైదువిధములుగ తంత్రాంతరమందు విస్తరింపజేయబడిన మనోవృత్తివిశేషములగు సర్వకామసంకల్పాదులను కారణబాధపురస్సరముగ నెన్నడు పరిత్యజించునో అనగా సర్వవృత్తిశూన్యుఁ డెన్న డగునో అపుడు సమాధిస్థుఁడు స్థితప్రజ్ఞుఁడని పరుల చే జెప్పఁబడును. కామనాదు లనాత్మ ధర్మములగుటచేఁ బరిత్యజించుటకు యోగ్యమైనవని 'మనోగతాన్' అను పదముచే జెప్పుచుండెను. కామనాదు లాత్మధర్మములే యగుచో స్వాభావికములగుటచేవహ్న్యౌష్ణ్యమువలె బరిత్యజించుటకు శక్యమైనవి కావు.; ఈ కామనాదులు మనోధర్మములే. కాన పరిత్యజించుటకు శక్యమైన వని యర్థము. ముఖప్రసాదము చిహ్నముగాగల స్థితప్ర

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"బుద్ధ్యాదయోఽష్టా వాత్మమాత్రవృత్తిగుణాః" బుద్ధిసుఖదుఃఖేచ్ఛాద్వేషప్రయత్న ధర్మాధర్మము లనెడి యెనిమిదిగుణము లాత్మమాత్రమునం దుండున వని తార్కికుల మతము. కాని యీమతము "కామ స్సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధా ధృతి రధృతి ర్హ్రీర్ధీ ర్భీ రిత్యేత త్సర్వం మన ఏవ" కామనాదులు మనోధర్మము లని బోధించు పై నుదహరింపఁబడిన శ్రుతికి విరుద్ధముగాన స్వీకరింపఁదగినది కాదని సూచించుటకు శ్రీకృష్ణపరమాత్మ "మనోగతాన్ "కామాన్" మనోగతములగు కామనాదులను అని నుడివెను. అట్టి సర్వకామములను నెపుడు ప్రకర్షగ నెవఁడు విడచునో (ప్రకర్షగ విడచుట యనగ వాసనారహితుఁ డగునో అని యర్థము) అట్లగుచో "కామః కరోతి కామః కారయతి" అను శ్రుతివలన కాముఁడే తుష్టి కారణ మగు ప్రవృత్తికి హేతు వగుటవలన సర్వకామపరిత్యాగ మొనరించినవానికి తుష్టికారణము లేమింజేసి శరీరధారణమునకు నిమిత్త మగు శేషకర్మ ముండును. అట్టివాని ప్రవృత్తి ఉన్మత్తప్రమత్తుని (ఉన్మత్తుఁడై వివేకరహితమగు బుద్ధిభ్రమను బొంది ప్రకర్షగ మదము ననుభవించుచు వివేకమునుగూడ వదలి భ్రాంతునివలె వ్యవహరించువాఁ డున్మత్తప్రమత్తుఁ డనబడును.) ప్రవృత్తి వంటిది కావలసివచ్చు నని శంకింపఁజనదు. అట్టి సర్వకామపరిత్యాగి ప్రత్యగాత్మయందే తన చేతనే బాహ్యలాభములయం దపేక్షారహితుఁడై పరమార్థదర్శనామృతరసలాభముచే నితరమైన వస్తువులనుండి యలంప్రత్యయము (ఇతరవస్తువులవలన ప్రయోజనము లేదను జ్ఞానము) కలవాఁడై సంతుష్టుఁ డగునో వాఁడు అట్టి సమయమునందు (జ్ఞానప్రతిబంధక మగు సర్వకామములు దొలగిన యవస్థయందు స్థితప్రజ్ఞు (విద్వాంసుఁ) డనంబడును. స్థితప్రజ్ఞుఁ డనగ నాత్మానాత్మవివేకమువలనఁ గలిగెడి ప్రజ్ఞ యెవనికి ప్రతిష్ఠితమో (కలదో) వాఁడు స్థితప్రజ్ఞుఁ డనఁబడును. అనగా నాత్మను తెలిసికొనగోరి వైరాగ్యద్వారమున సర్వైషణాత్యాగరూపసంన్యాసమును బొంది యనేకపర్యాయములు వేదాన్తశ్రవణాదుల నొనరించి దానివలన జ్ఞానియై యాజ్ఞానమునందేగల యాసక్తిచే విషయవిముఖుఁడై ఆత్మారాముఁడై జ్ఞానఫలభూత మగు పరితుష్టిని బొందిన స్థితప్రజ్ఞుఁ డనఁబడు నని యర్థము. ॥౫౫॥

జ్ఞానకు సంతోషవిశేషము ప్రతీయమానమగుచుండ నా స్థితప్రజ్ఞుఁడు సర్వ కామపరిత్యాగమునం దసమర్థుఁడను శంకను "ఆత్మన్యేవాత్మనా తుష్టః" అను వాక్యముచే దొలగించుచుండెను. 'ఆత్మన్యేవ' పరమానందరూపము స్వప్రకాశచిద్రూపముచే భాసమానమునగు నాత్మయందే పరమపురుషార్థలాభమువలన బరితృప్తుఁడు. కాని వృత్తిచే భాసమానము, తుచ్ఛము నగు ననాత్మయందు తృప్తుఁడు కాఁడు. ఈవిషయమునే "యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది శ్రితాః । అథ మర్త్యోఽమృతో భవ త్యత్ర బ్రహ్మ సమశ్నుతే॥" (ఈమర్త్యుని హృదయమునందుండు సర్వకామము లెపుడు విడువఁబడునో ఆట్టి సమయమున మర్త్యుఁడు ముక్తుఁ డగును. జీవించియుండఁగనే బ్రహ్మభావము ననుభవించును.) అని శ్రుతియు చెప్పుచున్నది. పర్యవసితాశయ మేమి? సమాధిస్థుఁ డగు స్థితప్రజ్ఞుఁ డిట్టిలక్షణములను చెప్పుశబ్దములచే పిలువఁబడు నని ప్రథమప్రశ్నకు సమాధానము.

శంకరానందీయము:— విద్వాంసున కేలక్షణములు సిద్ధించుటచే ప్రజ్ఞాస్థైర్యము, విదేహకైవల్యము సిద్ధించుచున్నవో; సిద్ధుని యా లక్షణములే సాధకునకు ప్రయత్నముచే సంపాదింపఁదగిన సాధనములు. కాన నా లక్షణములను ముముక్షువు ప్రయత్నపూర్వకముగ సాధింపఁదగినవని సూచించుట కధ్యాయపరిసమాప్తివర కా లక్షణములనే చెప్పుచుండెను. అందు మొట్టమొదట 'స్థితప్రజ్ఞస్య కా భాషా' అను ప్రథమప్రశ్నమునకు శ్రీకృష్ణ పరమాత్మ "ప్రజహాతి" అను శ్లోకముచే సమాధానమును చెప్పుచుండెను.

శ్రవణాదులచే లెస్సగఁ దెలియఁబడిన యాత్మతత్త్వముగల ముముక్షువు సమాధియందున్నవాఁడై 'మనసైవాను ద్రష్టవ్యం' అను శ్రుతివలన నాత్మస్వరూపప్రకాశమునం దేక కారణమగు మనస్సునందుండు సర్వవిషయభోగేచ్ఛ లనే సమాధిసిద్ధిదశయందు నిశ్శేషముగఁ బరిత్యజించునో, అట్టివానికి స్వతస్సిద్ధము, నిత్యము, కూటస్థము, అసం గము. చిద్రూపము, చక్షురింద్రియమునకు రూపమువలె సర్వత్ర ఉపలభ్యమానము, ఆనందైకరసము, ఆత్మ స్వరూపము అగు స్వస్వరూపమునందు క్రీడనము విషయములను నిశ్శేషముగఁ బరిత్యజించుటకు కారణము. అట్టి క్రీడకలవాఁడై బ్రహ్మవిత్తు నిరుక్తలక్షణములుకల స్వస్వరూపముచేతనే స్వాత్మానందరసానుభూతిచే సంతోష మును, తృప్తిని బొంది యమృతరసపాయి క్షారోదకమునువలె తుచ్ఛమగు విషయసుఖము నపేక్షించడు. కనుకనే సర్వమగు తద్విషయకామనలను వదలును. ఎవుఁడిట్టిలక్షణములు కలవాఁడగునో అపుడితఁడు స్థితప్రజ్ఞుఁడని పండితులు పలికెదరు. "యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది శ్రితాః" అను శ్రుత్యర్థ మీశ్లోక ముచేఁ బ్రతిపాదింపఁబడెను.

కామోదయ కారణమగు విషయములుండ నట్టివిషయములు చూడబడుచుండ విద్వాంసునకుఁగూడ తాదృశ విషయానుభూతియందు కామము తప్పక జనించును. కాన నిశ్శేషముగ కామపరిత్యాగము సంభవింప దని యనె దవా? ఈవిషయమున నిన్నడుగదలసిన యంశము కలదు. (1) విషయములయందు కామోదయము విషయస్వభా వమా ? (2) పురుషస్వభావమా ? విషయస్వభావమే యనెదవా ? విషయములగు తృణపర్ణాదులు చూడఁబడు చుండ నాతృణాదులను భక్షించుట కెందులకు కామము జనించదు? అట్లు కామము జనించనందున మొదటిపక్ష ముపపన్నము కాదు. ఇక పురుషస్వభావ మనెదవా ? నవయౌవనముగల కాంతయొక్క సన్నిధియందు బాలున కెందులకు కామము కలుగదు ? అట్లు కామోదయము లేనందున ద్వితీయపక్షము పొసగదు. అటులైన కామ మెట్లుదయించు ననెదవా ? చెప్పెద వినుము. "కామ! జానామి తే మూలం సంకల్పాత్కిల జాయసే" అను స్మృత్యనుసారము కామము సంకల్పమువలన జనించును. సంకల్పము వాసనవలన జనించును. వాసనలేనిదే వస్తువు నందు సమీచీనత్వబుద్ధి కలుగదు. వస్తువు మంచి దనుబుద్ధి లేనిదే కామ ముదయించదు. కాన కామోత్పత్తికి కార ణము స్రక్చందనవనితాదులందు భోగ్యత్వవాసనయే. వాసనయనగా భోగమువలన జనించెడి పూర్వసంస్కారము. విషయములయందు భోగ్యత్వవాసనాబలముచేతనే జీవులకు విషయములయందు కామము, ప్రవృత్తియు కలుగును. ఇదంతయు లోకశాస్త్రప్రసిద్ధమే. నిత్యము, నిరంతరము సమాధినిష్ఠయందే యుండునట్టియు, ఎల్లపుడుఁ దనను బ్రహ్మమునే జూచునట్టి విద్వాంసునకు స్రక్చందనవనితాదివిషయగ్రహణమే సంభవించదు. మృత్స్వరూపముచే చూచువానికి ఘటము గ్రహింపఁబడనటుల సర్వమును బ్రహ్మస్వరూపముచేఁ జూచువానికి విషయగ్రహణమే సంభవించనందున విషయవాసనలు స్వయముగ నశించును. విషయవాసనలుః క్షయింప కారణము లేమింజేసి కామ ములు స్వయముగనే నశించును. స్వయముగ నశించెడి కామములనాశము, ప్రభచే నశించుచున్న తమస్సుయొక్క నాశమును సూర్యుడు చేయుచుండె ననునట్లు 'ప్రజహాతి యదా' అని విద్వాంసునియం దుపచరింపఁబడుచున్నది కాన నిర్వాసనత్వము విద్వాంసుని లక్షణ మని సిద్ధము. ఈనిర్వాసనత్వము సాధకునకు సమాధిచే సంపాదనీయ మని తేలిన యాశయము. ॥౫౫॥

గీ॥ దుఃఖే ష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ।
వీతరాగభయక్రోధః స్థితధీ ర్ముని రుచ్యతే ॥ ॥౫౬॥

పదవిభాగము:— దుఃఖేషు- అనుద్విగ్నమనాః- సుఖేషు- విగతస్పృహః- వీతరాగభయక్రోధః- స్థితధీః- మునిః- ఉచ్యతే । ॥౫౬॥

ప్రతిపదార్థము:— యదా=(ఈ పదము పూర్వశ్లోకమునుండి అనువర్తనీయము) ఎప్పుడు; దుఃఖేషు సత్సు= ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికదుఃఖములు ప్రాప్తించుచుండ; అనుద్విగ్నమనాః=క్షోభింపని మనస్సు కలవాఁడై; సుఖేషు=ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతికసుఖములు ప్రాప్తించుచుండ; విగతస్పృహః, విగత=పోయిన; స్పృహః=కోరికకలవాఁడై; వీతరాగభయక్రోధః, వీత=పోయిన; రాగ=అనురాగము; భయ=భయము; క్రోధః= క్రోధముకలవాఁడై; భవతి=(ఈపద మధ్యాహార్యము) అగుచుండెనో; తదా=(ఈపద మధ్యాహార్యము) ఆట్టి సమయమునందు; స్థితధీః=స్థితప్రజ్ఞుఁ డని; మునిః=జ్ఞానియని; ఉచ్యతే=చెప్పఁబడును. ॥౫౬॥

శాంకరభాష్యమ్:—

కించ— దుఃఖేష్వితి । దుఃఖే ష్వాధ్యాత్మికాదిషు ప్రాప్తేషు నోద్విగ్నం న ప్రక్షుభితం దుఃఖప్రాప్తౌ మనో యస్య సోఽయ మనుద్విగ్నమనాః । తథా సుఖేషు ప్రాప్తేషు విగతా స్పృహా తృష్ణా యస్య నాగ్ని రివేంధనాద్యాధానే సుఖా న్యనువివర్ధతే స విగతస్పృహః । వీత రాగభయక్రోధో రాగశ్చ భయం చ క్రోధశ్చ వీతా విగతా యస్మా త్స వీతరాగభయక్రోధ స్స్థితధీః స్థితప్రజ్ఞో ముని స్సంన్యాసీ తదోచ్యతే । ॥౫౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

స్థితప్రజ్ఞుని మరియొకలక్షణము ననువదించి తద్ద్వారమున వివిదిషువునకు కర్తవ్యాంతరమును "దుఃఖేషు" అనుశ్లోకముచే నుపదేశించుచుండెను.

జ్వరము, శిరోరోగాదికము మొదలగువానిచే ప్రాప్తమగు దుఃఖము లాధ్యాత్మికములు. వ్యాఘ్రసర్పాదులవలన ప్రాప్తించెడి దుఃఖము లాధిభౌతికములు, అతివాయువు, అతివర్షము, అశనిపాతము మొదలగువాటివలన గలుగు దుఃఖము లాధిదైవికములు. అట్టి దుఃఖములు ప్రాప్తించినను ప్రక్షోభమును బొందనట్టి మనస్సుగలవాడును, ధాతుసామ్యాదులవలన గలిగెడి సుఖ మాధ్యాత్మికము, మందవాయువు, నియతవర్షాదులవలన గలిగెడి సుఖ మాధిదైవికము, స్రక్చందనవనితాదులు, గోమహిష్యాదులవలన గలిగెడి సుఖ మాధిభౌతికము. అట్టి సుఖములు ప్రాప్తించినపుడు (యెండుకట్టె లున్నకొలది యగ్ని వృద్ధిబొందునటులగాక ప్రాప్తించిన సుఖ

—• ౨వ అధ్యాయము- ౫౬ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇపుడు సమాధివ్యుత్థితుఁ డగు స్థితప్రజ్ఞుని మూఢజనవిలక్షణములగు భాషణము, ఉపవేశనము (కూర్చుండుట), గమనము చెప్పఁబడియున్నది. అందు 'కిం ప్రభాషేత' (స్థితప్రజ్ఞుఁడు సమాధివ్యుత్థితుఁడై యెటులు మాట్లాడును?) అను ప్రశ్నమునకు "దుఃఖే ష్వనుద్విగ్నమనాః" అను శ్లోకము మొదలు రెండుశ్లోకములచే సమాధానమును చెప్పుచుండెను.

శాంకరభాష్యతత్త్వబోధిని:—
ములయందు తృష్ణారహితుఁడును, (శబ్దస్పర్శరూపరసగంధము లనెడి విషయములవిషయమై అనుభూతాభినివేశాత్మకమగు తృష్ణావిశేషమే రాగము) అట్టి రాగరహితుఁడును (పరునిచే నపకృతునకు గలిగెడి శరీరనేత్రాదివికారకారణ మగునది భయము) అట్టి భయరహితుడును, (తననుపరవశము చేసికొని స్వపరాపకారప్రవృత్తికి హేతువగు బుద్ధివృత్తి క్రోధము) అట్టి క్రోధరహితుఁడు ఎవఁడు యెన్నఁడగునో అట్టిసమయమునందు అట్టివాఁడు 'స్థితప్రజ్ఞుడు సంన్యాసి' (జ్ఞాని) అని చెప్పఁబడును. (దీనివలన దేలినయాశయ మేమి? దుఃఖములు ప్రాప్తించునపుడు క్షోభింపని మనస్సుగలుగుట, సుఖములయందు తృష్ణనువదలుట, రాగభయక్రోధములనువిసర్జించుటయు నివి స్థితప్రజ్ఞుని లక్షణములు. ఇట్టి లక్షణములు జిజ్ఞాసువులకు సాధనములగునని యాశయము.) ॥౫౬॥

దుఃఖము లాధ్యాత్మికాధిభౌతికాధిదైవికము లనిమూడువిధములు. అందుశోకమోహజ్వరశిరోరోగాదినిమిత్తములగు దుఃఖము లాధ్యాత్మికములు. వ్యాఘ్రసర్పాదులవలన సంభవించెడి దుఃఖము లాధిభౌతికములు. అతివాతాతివృష్ట్యాదులవలన సంభవించెడి దుఃఖములాధిదైవికములు. రజఃపరిణామసంతాపాత్మకచిత్తవృత్తివిశేషములు, ప్రారబ్ధకర్మప్రాపితములు అగునట్టి దుఃఖములయందు దుఃఖపరిహారమునకు సమర్థుడు కాకపోవుటచే వ్యాకులమగు నంతఃకరణముకలవాడు "ఉద్విగ్నమనస్కుఁడు" అని యనిపించుకొనును. అవివేకునకు దుఃఖముప్రాప్తింప "అహో! నేనెంతపాపిని, ఇట్టి దుఃఖమును పొందిన దురాత్ముఁడనగు నన్నునుగూర్చి నిందయగుగాక. ఎవఁడునా సంబంధమగు నీదుఃఖమును పోగొట్టగలఁడు" అను యనుతాపాత్మకము, భ్రాంతిరూపము నగు నుద్వేగ మనుపేరుగల తామసచిత్తవృత్తివిశేషము కలుఁగును. ఈచిత్తవృత్తివిశేషము పాపానుష్ఠానకాలమునందే కలిగినచో నపు డాచిత్తవృత్తి పాపానుష్ఠానప్రవృత్తిప్రతిబంధక మగుటచే సఫలమయ్యెడిని. అటులుకాక భోగకాలమునందే యట్టి యుద్వేగము ప్రాప్తించినచో కారణముండ కార్యమవశ్యము సంభవించును. కాన కార్యమునుచ్ఛేదించుటకు సామర్థ్యము లేనందున నిష్ప్రయోజనమగు దుఃఖకారణముండ 'ఎందువలన నాకు దుఃఖము సంభవించుచున్నది' అని యనుకొనుట యవివేకభ్రమరూపము. కాన నది వివేకియగు స్థితప్రజ్ఞునకుసంభవింపదు. దుఃఖముమాత్రము ప్రారబ్ధకర్మచే బొందబడును కాని తదుత్తరకాలిక మగు భ్రమకూడ ప్రారబ్ధకర్మాధీనము కాదు. దుఃఖాంతర కారణమగుటవలన నట్టిభ్రమ ప్రారబ్ధకర్మాంతరమువలన స్థితప్రజ్ఞునకు ప్రాప్తించునని శంకింపరాదు. భ్రమ కుపాదానకారణమగు నజ్ఞానమునశించుటచే భ్రమ సంభవింపదు. కాన తజ్జన్యదుఃఖప్రాపక ప్రారబ్ధము సంభవింపదు. కాన నట్లు శంకింపజనదు. ఎట్లకేలకు దేహయాత్రామాత్రనిర్వాహకప్రారబ్ధకర్మఫలము భ్రమలేకున్నను బాధితానువృత్తిచే నుపపన్నమగును. ఈవిషయము విస్తారముగ మున్ముందు చెప్పఁబడును.

(అట్లేఆధ్యాత్మికాధిదైవికాధిభౌతిక) త్రివిధములు ప్రారబ్ధపుణ్యకర్మప్రాప్తములు, సత్త్వపరిణామస్వరూపములు, ప్రీత్యాత్మకములు, చిత్తవృత్తివిశేషములునగు సుఖములందు 'విగతస్పృహః' ఆగామితజ్జాతీయసుఖస్పృహారహితుఁడగును. స్పృహయనునది సుఖానుభవకాలమునందు తజ్జాతీయసుఖమునకు కారణము. ధర్మమునసుష్ఠింపక వ్యర్థముగనే దానిని కోరుట. ఇది తామసచిత్తవృత్తిభ్రాంతిరూపము. అది యవివేకికేగలుగును. కారణములేనిదే కార్యము పుట్టనేరదు. కాన నెట్లు కారణముండ కార్యము పుట్టగూడదను వృథాకాంక్షారూపమగు నుద్వేగము వివేకికి సంభవింపదో; అట్లే కారణము లేనిదే కార్యము సంభవించుగాక యనెడి వృథాకాంక్షాస్వరూప మగు తృష్ణాత్మకస్పృహయు ప్రారబ్ధకర్మసుఖమాత్రప్రాపక మగుటచే వివేకికి సంభవింపదు.

లేక, హర్షాత్మక మగు చిత్తవృత్తి స్పృహాశబ్దముచే జెప్పనొప్పును. అదియు భ్రాంతిరూపమే. "అహో! నేను ధన్యుడను; నాకిట్టి సుఖము ప్రాప్తమైనది, ముల్లోకములయందు నాతో సమానుడెవ్వడు? ఏయుపాయముచేతను నాసంబంధమగు సుఖము విచ్ఛిత్తిని పొందనేరదు" అనెడి యుత్ఫుల్లతారూపతామసచిత్తవృత్తిరూపము కనుకనే భాష్యమునందు "నాగ్నిరివేన్ధనాద్యాధానే య స్సుఖా న్యనువివర్ధతే స విగతస్పృహః" (కాష్ఠము లుంచినపు డగ్ని వృద్ధిపొందినటుల ఎవడు సుఖముల ననుసరించి వృద్ధిపొందడో; అట్టివాడు విగతస్పృహు డన బడును.) అని చెప్పబడెను. ఈగీతలయందే "న ప్రహృష్యే త్ప్రియం ప్రాప్య నోద్విజే త్ప్రాప్య చాప్రియమ్" అని శ్రీకృష్ణుడు చెప్పగలడు. అదియు భ్రాంతిరూపమగుటచే వివేకికి సంభవింపదు. అట్లే "వీతరాగభయక్రోధః" శోభనాధ్యాసము నిబంధనము గాగలది, విషయములయందు రంజనాత్మకము. ఉత్పన్నాభినివేశరూపము అగు చిత్తవృత్తివిశేషము రాగ మనఁబడును. రాగవిషయమును నశింపఁజేయు కారణము ప్రాప్తించినపు డద్దానిని నివారించుటకు సామర్థ్యము లేమని తలచువానియొక్క దైన్యాత్మకమగు చిత్తవృత్తివిశేషము భయమనఁ బడును. అట్లే రాగవిషయనాశకము ప్రాప్తించునపు డద్దానిని నివారించుటకు తనకు సామర్థ్య మున్నట్లు తలచెడివాని యభిజ్వలనాత్మకచిత్తవృత్తివిశేషము క్రోధమనంబడును. అవన్నియు విషయరూపము అగుటవలన నెవని నుండి తొలగిపోవునో అట్టిముని (మననశీలుడు) సంన్యాసి; స్థితప్రజ్ఞుడని చెప్పబడును. ఇట్టి లక్షణములతోఁగూడిన స్థితప్రజ్ఞుడు స్వానుభవప్రకటనద్వారమున శిష్యశిక్షణనిమిత్తము అనుద్వేగనిస్పృహత్వాదులను బోధించు వాక్యములను పలుకును. ఈచెప్పుటవలన దేలినయాశయ మేమి? ముముక్షువు దుఃఖము ప్రాప్తించునపు డుద్వేగమును పొందవలదు. సుఖము ప్రాప్తించునపుడు హర్షమును పొందగూడదు. రాగభయక్రోధరహితుఁడు కావలె నని యభిప్రాయము.

శంకరానందీయము:— ఈసాధనము ముముక్షువున కవశ్యము సాధనీయమని సూచించుటకు సిద్ధుని లక్షణాంతరమును "దుఃఖే ష్వనుద్విగ్నమనాః" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

"దుఃఖేషు" దుఃఖప్రాపకములగు జ్వరశూలశిరోవేదనాద్యాధ్యాత్మికములు, చోరాహివ్యాఘ్రాద్యాధిభౌతికములు. వర్షవాతాతపాద్యాధిదైవికములు ప్రాప్తించినపుడు 'ఏమిచేయుదును, ఎచటకేగుదును' అనువిక్షేపవ్యథలేనట్టివాడై, అనగా సమాధినిష్ఠచే నాధ్యాత్మికాధిభౌతికాధిదైవికములవలన క్షోభించనిమనస్సుకలవాడై, అట్లే 'సుఖేషు' సుఖప్రాపకములగు ఇష్టాన్నరసాదులు ప్రాప్తించునపుడు రసనాదీంద్రియలౌల్యము లేనివాఁడై, అనఁగా స్వానందరసాస్వాదమునందాసక్తిచే నిష్టాన్నరసాదులయందాదరము లేనివాఁడై 'వీతరాగభయక్రోధః' (ఉపకారమునందు ప్రీతియు, అపకారమునం దప్రీతియు, ఆసన్నమగు మరణహేతువునందు భయము అనెడి యీమూడును స్వాత్మనిష్ఠచే నెవనికిఁ దొలగునో వాఁడు వీతరాగభయక్రోధు డనిపించుకొనును.) ప్రీత్యప్రీతి భయహేతువులను, ప్రీత్యాదులను, తత్కార్యములను, అవిషయుడైనట్టియు, శ్రుతమును, దృష్టమును, స్పృష్టమును, సర్వమును ప్రత్యగ్దృష్టిచే బ్రహ్మముగనే తెలిసికొనెడివాడు ముని యనబడును. ఆకారమును దాల్చుటచేముని కాడు. ఇట్టి లక్షణములుకల ముని 'స్థితప్రజ్ఞః' సిద్ధుడని చెప్పబడును. ఈచెప్పుటచే దుఃఖాదిబాహ్యవాలంబి యగు సద్బ్రహ్మనిష్ఠావంతునకే సమ్యగ్జ్ఞానము సంభవించును. సమ్యగ్జ్ఞానికే విదేహముక్తి యని సూచింపబడెను. సంసిద్ధుడు బ్రహ్మవిత్తగుయతిఆపత్తులయందును సంపత్తులయందును దేనిని పలుకఁడు. మరేమనిన తూష్ణీం కారము ననే స్వాత్మ చేసుండునని 'కింప్రభాషేత' అను ద్వితీయప్రశ్నమున కీశ్లోకముచే సమాధానమీయబడెను. ॥౫౬॥

గీ: యస్సర్వ త్రానభిస్నేహ స్తత్త త్ప్రాప్య శుభాశుభమ్ ।
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ॥౫౭॥

పదవిభాగము:— యః- సర్వత్ర- అనభిస్నేహః- తత్- తత్- ప్రాప్య- శుభాశుభం- న- అభినందతి- న- ద్వేష్టి- తస్య- ప్రజ్ఞా- ప్రతిష్ఠితా ॥ ॥౫౭॥

ప్రతిపదార్థము:— యః=ఏముని; సర్వత్ర=దేహజీవితాదులయందు; అనభిస్నేహః=అభిస్నేహము (స్పృహ) లేనివాఁడై; తత్తత్=ఆయా; శుభాశుభం=శుభాశుభములను; ప్రాప్య=పొంది; నాభినందతి=సంతసింపఁడో; నద్వేష్టి=ద్వేషింపఁడో; తస్య=అట్టిమునికి; ప్రజ్ఞా=(వివేకమువలన గలిగెడి)ప్రజ్ఞ; ప్రతిష్ఠితా=ప్రతిష్ఠిత మగును. ॥౫౭॥

---

శాంకరభాష్యమ్:—

కించ—యస్సర్వత్రేతి । యో ముని స్సర్వత్ర దేహజీవితాదిష్వ ప్యనభిస్నేహోఽభిస్నేహవర్జిత స్తత్త త్ప్రాప్య శుభాశుభం తత్త చ్ఛుభ మశుభం వా లబ్ధ్వా నాభినన్దతి న ద్వేష్టి శుభం ప్రాప్య న తుష్యతి న హృష్యత్య శుభం చ ప్రాప్య న ద్వేష్టీత్యర్థః । తస్యైవం హర్ష విషాదవర్జితస్య వివేకజా ప్రజ్ఞా ప్రతిష్ఠితా భవతి ॥ ॥౫౭॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మఱియు స్థితప్రజ్ఞుని లక్షణాంతరమును అనువదించి తద్ద్వారమున జిజ్ఞాసువునకు కర్తవ్యాం (సాధనాం) తరము నుపదేశించుచుండెను.

వివేకవంతు డగు వివిదిషువునకు వివేకమువలన జనించెడి ప్రజ్ఞ యెట్లు ప్రతిష్ఠిత మగు ననిన? ఏముని దేహజీవితాదులయందు కోరికలేనివాఁడై ఆయాశుభము ప్రాప్తించినపుడు సంతసింపక, ఆయాయశుభము ప్రాప్తించినపుడు ద్వేషింపకుండునో హర్షవిషాదరహితుఁడగు నట్టి వానికి ప్రజ్ఞ సుప్రతిష్ఠిత మగును.

(అనగా దేహజీవితాదులయందు స్పృహ లేకుండుట, శుభాశుభములు ప్రాప్తించునపుడు హర్షవిషాదరహితు డగుటయే స్థితప్రజ్ఞుని లక్షణములు. ఇవియే వివిదిషువున కనుష్ఠేయములగు సాధనములని భావము.)

---

—• ౨వ అధ్యాయము ౫౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీ:— మఱియు సర్వదేహములయందు, జీవనాదులయందును ఏముని "అనభిస్నేహః" స్నేహములేనివాఁడో (ఏదియుండ నన్యదీయ మగు హానివృద్ధులు తనయం దారోపించఁబడునో అన్యవిషయకము. ప్రేమ కపరపర్యాయము నగునట్టి తామసవృత్తివిశేషము స్నేహమనఁబడును. సర్వవిధములచే నట్టి స్నేహములేనివాడని యర్థము. అనాత్మ యందు స్నేహములేకుండుట, పరమాత్మయందు స్నేహముకలవాడగుటకే కాన భగవంతు డగు పరమాత్మయం దన్నివిధముల నభిస్నేహముకలవాడై యుండవలెను. అని తెలిసికొనవలెను) తత్తత్ప్రారబ్ధకర్మప్రాప్తము, సుఖహేతువగు శుభవిషయమునుపొంది "నాభినన్దతి" హర్షవిషాదపురస్సరముగ బ్రశంసింపఁడో, దుఃఖహేతువగు నశుభవిషయమును పొంది "నద్వేష్టి" లోపల ననూయాపూర్వక

గీ॥ యదా సంహరతే చాయం కూర్మోఽంగానీవ సర్వశః ।
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ॥౫౮॥

పదవిభాగము:— యదా- సంహరతే- చ- అయం- కూర్మః- అంగాని- ఇవ- సర్వశః- ఇన్ద్రియాణి- ఇన్ద్రియార్థేభ్యః- తస్య- ప్రజ్ఞా- ప్రతిష్ఠితా ॥ ॥౫౮॥

ప్రతిపదార్థము:— అయం=(స్థితప్రజ్ఞుఁడు) ఈజ్ఞాని; యదా=ఎప్పుడు; ఇంద్రియాణి=(త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములనెడి ఇంద్రియములను; ఇంద్రియార్థేభ్యః=శబ్దస్పర్శరూపరసగంధములనెడి విషయములనుండి; కూర్మః=తాబేలు; సర్వశః=అంతటనుండియు; అంగానీవ=అవయవములవలె; సంహరతే=మఱలించునో, తదా= (ఈపదమధ్యాహార్యము) ఆసమయమున; తస్య=ఆమునికి; ప్రజ్ఞా=ప్రజ్ఞ; ప్రతిష్ఠితా=ప్రతిష్ఠితమగుచున్నది. ॥౫౮॥

---

ముగ నిందింపఁడో, (అజ్ఞునకు సుఖహేతువగు స్వకళత్రాదికము శుభవిషయ మనఁబడును. అట్టి స్వకళత్రాది గుణకథనము పరప్రరోచనార్థము కానందున వ్యర్థము. కాన తద్గుణకథనాదిప్రవర్తకమగు ధీవృత్తి భ్రాంతిరూపాభినందన మనఁబడును. అట్లే యనూయోత్పాదనద్వారమున దుఃఖహేతు వగు పరకీయవిద్యాప్రకర్షాదికము వీనిని గూర్చి యశుభవిషయము. దాని నిందనివారింపని దగుటచే వ్యర్థము. కాన నట్టి విషయమును నిందించుటకు ప్రవర్తింపచేయునట్టి భ్రాంతిరూపమగు ధీవృత్తివిశేషము ద్వేష మనంబడును. అట్టి ద్వేషముకూడ తామసమే. తామసములు, భ్రాంతిరూపములు అగునట్టి యాయభినందనద్వేషములు ప్రజ్ఞవలన విదారకమగు కారణము లేమిం జేసి యభ్రాంతుఁడు, శుద్ధసత్త్వుఁడు నగు స్థితప్రజ్ఞునియం దెట్లు సంభవించును? సంభవింపవు.) హర్షవిషాద రహితుఁ డగునట్టి మునియొక్క "ప్రజ్ఞా" పరమాత్మతత్త్వవిషయికమగు ప్రజ్ఞ "ప్రతిష్ఠితా" మోక్షరూపఫల పర్యవసాయి యగును. అట్టివాఁడు స్థితప్రజ్ఞుడని యర్థము, ఈవిధముననే యన్యుఁ డగు ముముక్షువును సర్వత్ర అనభిస్నేహుఁడు కావలెను; శుభమును పొంది ప్రశంసింపరాదు; అశుభమునుపొంది నిందింపవలదని సూచింపఁ బడెను. నిందాప్రశంసాదివాక్యములను పలుకవలదని వ్యతిరేకము చెప్పబడెను. ఈశ్లోకముకూడ "కిం ప్రభాషేత" అను ప్రశ్నమునకు సమాధానముగఁ జెప్పఁబడెను.

శంకరానందీయము:— శ్రవణాదులచే నాత్మతత్త్వమును దెలిసికొని విదేహకైవల్యార్థియై సమాధియందు ప్రవృత్తుఁడగు సాధకుఁడు చెప్పబోవువిధమున ప్రవర్తించినచో వానికి జ్ఞాననిష్ఠ సిద్ధించునని 'యస్సర్వత్ర' అను శ్లోకము చెప్పఁబడెను.

ఏయతి సమాధియందు ప్రవృత్తుఁడై కన్థాకౌపీనాది పరిగ్రహమునందును, దేహజీవనమునందును అత్యంతాసక్తిరహితుడగునో, ప్రారబ్ధకర్మవశమువలన సంప్రాప్తమగు శుభము నుద్దేశించి సంతోషించఁడో ప్రతికూలమగు నశుభము నుద్దేశించి ద్వేషించఁడో అనగా హర్షవిషాదరహితుఁడై సర్వత్ర సమబుద్ధికలవాఁడై సమాధియందే యుండునో వానికి "ప్రజ్ఞా ప్రతిష్ఠితా" జ్ఞాననిష్ఠ సిద్ధించును. ఇతరునకు సిద్ధింపదని యర్థము.

నీలకంఠీయము:— "స్థితధీః కిం ప్రభాషేత" అను ద్వితీయప్రశ్నమునకు సమాధానము 'యస్సర్వత్ర' అను శ్లోకముచే చెప్పుచుండెను.

ధనదారదేహజీవనాదులయందు దనభిస్నేహుఁడు (అనగా నభిస్నేహముకలవాడు ధనదారాదులు వికలమైనచో నేను వికలుడననియు, పూర్ణమైనచో నేను పూర్ణుఁడననియు దైన్యదర్పములతోఁగూడి పూర్వాపరపర్యాలోచనలేనివాఁడై ఏమేమియో పలుకును. ముని యట్లు కాడని భావము) అటులే శుభమునుపొంది సంతుష్టుఁడై శుభమును పొందించువానిని ప్రశంసింపఁడో అట్లే యశుభమునుపొంది దుఃఖియై యశుభమును కలుగఁజేయు వానిని నిందించఁడో వానికి ప్రజ్ఞ సిద్ధించుచున్నది. ॥౫౭॥

శాంకరభాష్యమ్:—

కించ — యదా సంహరత ఇతి। యదా సంహరతే సమ్యగుపసంహరతే చాయం జ్ఞాననిష్ఠాయాం ప్రవృత్తో యతిః కూర్మోఽంగానీవ సర్వశో యథా కూర్మో భయాత్స్వాన్యంగాన్యుపసంహరతే సర్వత ఏవం జ్ఞాననిష్ఠ ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్సర్వవిషయేభ్య ఉపసంహరతే। తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితే త్యుక్తార్థం వాక్యమ్ ॥ ॥౫౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

జిజ్ఞాసువునకు కర్తవ్యాంతరము నీశ్లోకముచే సూచించుచుండెను. ఏతీరున కూర్మము (తాబేలు) భయమువలన తన యవయవముల నంతటనుండి ముడుచుకొనునో అదేవిధమున ఎప్పుడూ జ్ఞాననిష్ఠయందు బ్రవృత్తుడైన యతియు — ఇంద్రియములను విషయములనుండి మఱలించుట ప్రజ్ఞాస్థైర్యమునకు హేతువగుటం బట్టి తన యింద్రియములను శబ్దస్పర్శరూపరసగంధము లనెడి విషయములనుండి లెస్సగ నుపసంహరించుకొనునో (స్వవశ మొనరించుకొనునో) అత్తరి యతనికి ప్రజ్ఞ ప్రతిష్ఠితమగును. (అనగా ప్రజ్ఞాస్థైర్యమును గోరెడివాఁడు ఇంద్రియములను తప్పక స్వాధీనముచేసుకొనవలె నని యాశయము.) ॥౫౮॥

— ౨వ అధ్యాయము ౫౮ శ్లోకవ్యాఖ్యావిశేషములు —

మధుసూదనసరస్వతీయము:— "యదా సంహరతే" అను శ్లోకము మొదలు "క్రోధా ద్భవతి సంమోహః" అను శ్లోకమువరకగు నారుశ్లోకములచే "కి మాసీత" అను తృతీయప్రశ్నమునకు సమాధానము చెప్పుటకు శ్రీకృష్ణపరమాత్మ ప్రారంభించుచుండెను.

ప్రారబ్ధకర్మవశమున సమాధివ్యుత్థానకాలమున నింద్రియములు విక్షిప్తములు. సమాధినిమిత్తము అట్టి యింద్రియములఁదిరిగి యుపసంహరించినచో నదిస్థితప్రజ్ఞుని యుపవేశనమని చూపించుటకు 'ఆయుం' అని చెప్పెను. కూర్మము తన యవయవములను సంకోచింపఁజేసినటుల ఈసమాధివ్యుత్థితుఁడు సర్వేంద్రియములను శబ్దాదిసర్వవిషయములనుండి తిరిగి యెపుడు సంకోచించునో అపు డతనికి ప్రజ్ఞ సిద్ధించుచున్నది. ఇంతకు పూర్వమునందుండు రెండు శ్లోకములచేతను వ్యుత్థానదశయందును సకలతామసవృత్త్యభావము చెప్పఁబడెను. ఈశ్లోకమునందు సమాధ్యవస్థయందు సకలవృత్త్యభావము చెప్పఁబడెను. ఇదియే విశేషము (ఏవృత్తియు లేనివాఁడై యుండునని 'కి మాసీత' అను తృతీయ ప్రశ్నమునకు సమాధానము చెప్పఁబడెను.)

శంకరానందీయము:— తీవ్రవైరాగ్యము, తీవ్రమోక్షేచ్ఛ, తత్పరత్వము అను నీమూడును జ్ఞాననిష్ఠాసిద్ధికి కారణము లయినను ఇంద్రియనిగ్రహము లేనిదే వైరాగ్యాదిజ్ఞాననిష్ఠ సిద్ధింపదు. కాన సాధకుఁ డగు యతి ప్రయత్నమువలన ప్రజ్ఞాసిద్ధిచే నింద్రియజయమును సంపాదింపవలయు నని "యదా సంహరతే" అను శ్లోకముచే జెప్పుచుండెను.

జ్ఞాననిష్ఠయందు ప్రవృత్తుఁ డగు యతి- పరులవలన భయపడి కూర్మ మేవిధమున తన సర్వావయవములను తత్తత్కాలములయందు తనయందే యుపసంహరించుకొనునో అట్లే తత్తద్విషయములనుండి రాగాదిదోషప్రసక్తిభయమువలనను, సమాధివిఘ్నభయమువలనను వాగాదికర్మేంద్రియములను, చక్షురాదిజ్ఞానేంద్రియములను ఎపుడు స్వయముగ తనయందు సమాధిస్థైర్యముకొరకు తత్తత్ప్రవృత్తిని నివారించుకొనునో అపు డాతనికి ప్రజ్ఞ ప్రతిష్ఠిత మగును. ॥౫౮॥

గీ॥ విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥ ॥౫౯॥

పదవిభాగము:— విషయాః- వినివర్తన్తే- నిరాహారస్య- దేహినః- రసవర్జం- రసః- అపి- అస్య- పరం- దృష్ట్వా- నివర్తతే । ॥౫౯॥

ప్రతిపదార్థము:— నిరాహారస్య=విషయములయందుఁ బ్రవర్తింపక బలాత్కారముగ నింద్రియములను బంధించుటరూపము కష్టము నగు తపస్సుయందున్నట్టియు మూర్ఖుఁ డగు; దేహినః=దేహవంతునకు; రసవర్జం=రాగము తప్ప; విషయాః=శబ్దస్పర్శరూపరసము అనెడి విషయములు, లేక యింద్రియములు; వినివర్తన్తే=మరలును; (విషయములనుండి మరలును.) అస్య=ఈయతికి; పరం=పరమార్థతత్త్వమును; దృష్ట్వా=చూచి; (తెలిసికొనియున్న వానికి) రసోఽపి=రాగమున్ను; నివర్తతే=నివర్తించును. (మరలును) ॥౫౯॥

శాంకరభాష్యమ్:—

తత్ర విషయా ననాహరత ఆతురస్యాపీన్ద్రియాణి నివర్తన్తే కూర్మాంగానీవ సంహ్రియన్తే. న తు తద్విషయో రాగ స్స కథం సంహ్రియత ఇతి ఉచ్యతే— విషయా ఇతి ।

యద్యపి విషయోపలక్షితాని విషయశబ్దవాచ్యానీన్ద్రియా ణ్యథవా విషయా ఏవ నిరాహార స్యానాహ్రియమాణవిషయస్య కష్టే తపసి స్థితస్య మూర్ఖస్యాపి వినివర్తన్తే దేహినో దేహవతో రసవర్జం రసో రాగో విషయేషు య స్తం వర్జయిత్వా । రసశబ్దో రాగే ప్రసిద్ధ స్స్వర

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వ్యవహారభూమియందు విషయోపభోగవిముఖుండగు నాతురునియొక్క నింద్రియములు గూడ విషయములనుండి తాబేలు అవయవములవలె మఱలును. కాని విషయములయం దను రాగము మాత్రము మఱలనేఱదు. అట్టి విషయరాగ మెటులమరలును? అనిన నిచట విషయశబ్దముచే విషయోపలక్షితములగు నింద్రియములు చెప్పబడును. లేక విషయశబ్దముచే శబ్దస్పర్శరూపరసగంధము లనెడి విషయములఁ జెప్పినను సరియె ఎవఁడు విషయప్రవణుఁడు కాక వాని సమీపమునం దత్యంతము క్లేశాత్మక మగు తపస్సునం దుండునో అట్టి విద్యావిహీనుఁ డగు మూర్ఖుని యింద్రియములు విషయములయందుగల రాగమునుమాత్రము విడువక విషయముల నుండి మరలును. (అనగా నింద్రియములు విషయములనుండి మరలునుగాని విషయములయం దనురాగము మాత్రము పోదనుట) ఇట రసశబ్దము తర్కశాస్త్రప్రసిద్ధ మగు మాధుర్యాది షడ్విధరసపరము కాదు. మఱేమనిన? "రసజ్ఞో రసికః" ఇత్యాదిస్వారసికప్రయోగములవలన రాగమునందుఁ బ్రసిద్ధమైనది. అట్టి సూక్ష్మము, రంజనరూపము నగు రాగ (అనురాగ)ము పర

—• ౨వ అధ్యాయము ౫౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— రోగాదివశమున మూఢునకు గూడ నింద్రియములు విషయములనుండి నివృత్తమగును. కాన నెటుల "తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా" అని చెప్పఁబడెనను శంకను "విషయాః" అను శ్లోకముచే దొలఁగించుచుండెను.

శాంకరభాష్యమ్:—

సేన ప్రవృత్తో రసికో రసజ్ఞ ఇత్యాదిదర్శనాత్ । సోఽపి రసో రంజనరూపః సూక్ష్మోఽస్య యతేః పరం పరమార్థతత్త్వం బ్రహ్మ దృష్ట్వోపలభ్యాహమేవ తదితి వర్తమానస్య నివర్తతే నిర్బీజం విషయవిజ్ఞానం సంపద్యత ఇత్యర్థః । నాసతి సమ్యగ్దర్శనే రసస్యోచ్ఛేదః । తస్మాత్సమ్యగ్దర్శనాత్మికాయాః ప్రజ్ఞాయాః స్థైర్యం కర్తవ్య మిత్యభిప్రాయః । ॥౫౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మార్థతత్త్వ మగు బ్రహ్మమును దెలిసికొనినపిదప అనగా "అహ మేవ తత్" నే నా పరబ్రహ్మము నని దెలిసికొనిన యతికి నివర్తించును. అనగా విషయవిజ్ఞానము నిర్బీజ మగు నని యర్థము.

సమ్యగ్జ్ఞానము లేనిదే విషయములయందు రాగము తొలఁగదు. విషయములయందు రాగము తొలఁగినగాని సమ్యగ్జ్ఞానము కలుగనేరదు. కాన (వెట్టికుదిరినఁగాని పెండ్లి కానేరదు; పెండ్లి యయినఁగాని వెట్టి కుదర దన్నట్లు) అన్యోన్యాశ్రయదోషముచే సమ్యగ్జ్ఞానము సంభవించుట దుర్ఘట మని శంకింపవలదు.

రాగ మనునది స్థూలమనియు, సూక్ష్మమనియు రెండువిధములు. అందు వివేకముచే నింద్రియముల విషయపారవశ్యము దొలఁగింప సమ్యగ్జ్ఞానము గలిగి స్థూలరాగము నివృత్త మగును. కాన అన్యోన్యాశ్రయదోషము సంభవింపదు. సమ్యగ్జ్ఞానము లేనిదే సూక్ష్మరసము యొక్క నాశము కానేరదు కాన సమ్యగ్జ్ఞానవిషయమై స్థైర్యము చేయదగిన దని యభిప్రాయము. ॥౫౯॥

'నిరాహారస్య' ఇంద్రియములచే విషయములను గ్రహించనట్టి దేహాభిమానముగల రోగియగు మూఢునకును, తామసతపస్వికి శబ్దస్పర్శరూపరసగంధము లనెడి విషయములు మరలుచున్నవి. అనఁగా తృష్ణమాత్రము వదలక యజ్ఞానకు విషయములు మరలుచున్నవి. అనగా విషయతృష్ణమాత్రము తొలఁగుటలేదని యర్థము. పురుషార్థమగు పరబ్రహ్మము నే నని తెలిసికొనియుండిన యీస్థితప్రజ్ఞునకు క్షుద్రసుఖతృష్ణయు, విషయములు అను యీరెండును నివర్తించును. అట్టి విధముననే "యావానర్థః" అను స్థలమునందు వ్యాఖ్యానింపఁబడెను. ఈ చెప్పుటవలనఁ దేలిన యాశయమేమి ? సరాగవిషయనివృత్తి స్థితప్రజ్ఞలక్షణము. అట్టి లక్షణము మూఢునియందు లేదని యర్థము. పరమాత్మవిషయక సమ్యగ్దర్శనము లేనిదే సరాగవిషయనివృత్తి సంభవింపదు. కాన సరాగవిషయోచ్ఛేదమునకు హేతువగు సమ్యగ్దర్శనరూపప్రజ్ఞయొక్క స్థైర్యము గొప్పయత్నముచే సంపాదింపవలెనని యభిప్రాయము.

శంకరానందీయము:— 'విషయములనుండి ఇంద్రియములను మరలించుట ప్రజ్ఞాస్థైర్య కారణమని చెప్పుట యయుక్తము. ఏదోయొకానొక కార్యము నుద్దేశించి సర్వేంద్రియముల నిగ్రహించు పురుషునియం దింద్రియ నిగ్రహము కనుపించినను ప్రజ్ఞాస్థైర్యము కనుపించుటలేదు." అని శంకింపఁజనదు. అట్టి పురుషుఁడు తృష్ణావంతు డగుటచే బ్రహ్మజ్ఞానము, తన్నిష్ఠయు సంభవింపవని సూచించుటకు "విషయాః" అని చెప్ప మొదలిడెను.

"ఆహ్రియన్తే విషయా యైస్తే ఆహారాః ఇంద్రియాణి నియమార్థం తేభ్యోనిర్గతో యస్స నిరాహారః" శేటిచే విషయములు తీసుకురాబడునో యట్టి యింద్రియములు "ఆహారాః" అని యనఁబడును. నియమము నిమి

గీ॥ యతతో హ్యపి కౌన్తేయ! పురుషస్య విపశ్చితః ।
ఇన్ద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః ॥ ॥౬౦॥

పదవిభాగము:— యతతః- హి- అపి- కౌన్తేయ!- పురుషస్య- విపశ్చితః- ఇన్ద్రియాణి- ప్రమాథీని- హరన్తి- ప్రసభం- మనః । ॥౬౦॥

ప్రతిపదార్థము:— హే కౌన్తేయ!=ఓ యర్జునా!; హి=ఏ కారణమువలన; యతతః=ప్రయత్నము చేయుచున్నట్టి; విపశ్చితః=బుద్ధిమంతుఁడగు; పురుషస్యాపి=పురుషునియొక్కయు; మనః=మనస్సును; ప్రమాథీని=ప్రమథనస్వభావముగల; (విక్షోభమును గలుగజేయునట్టి) ఇన్ద్రియాణి=ఇన్ద్రియములు; హరన్తి=హరించుచున్నవి.॥౬౦॥

---

త్తమా యింద్రియములనుండి నిర్గతుఁడగువాడు నిరాహారుఁడనఁబడును. ఇంద్రియనిగ్రహముగల దేహాభిమానియగు తాపసునియొక్క యింద్రియములు నిగ్రహింపబడినవగుట శబ్దాదివిషయములు విశేషముగ రాగమునువిడిచి నివృత్తములగును. అనఁగా రాగము మాత్రము నివృత్తము కాదు. 'రాగో లింగ మబోధస్య' (అబోధకు లింగము రాగమే) అను నియమమువలన 'ఈసర్వము నేను బ్రహ్మస్వరూపమే' అని సర్వమునకు తనకు బ్రహ్మమాత్రత్వజ్ఞానము, రాగము అను నీరెండును నొకచోటనుండుటకు సమర్థములు కానందున రాగవత్త్వదోషమువలననేయట్టి తాపసునకు బ్రహ్మాత్మైక్యజ్ఞానము కలుగదు. కనుకనే నిరుద్ధేంద్రియములు కలవాడైనను ప్రజ్ఞాస్థైర్యముల యొక్క ప్రసక్తి లేదు.

అట్లైన నట్టివాని కెటుల రాగనివృత్తి, ప్రజ్ఞాస్థైర్యము సిద్ధించు ననుశంకను 'రసోప్యస్య పరం దృష్ట్వా నివర్తతే' అను వాక్యముచేఁ దొలఁగించుచుండెను.

వైరాగ్యముచేతను, ఇంద్రియనిగ్రహముచేతను, వ్రతాదులచేతను చిత్తము పరిశుద్ధమైనపిమ్మట శ్రవణాదిజన్యజ్ఞానముచే నేనీపరబ్రహ్మము నైతి నని స్వాత్మచే నద్వితీయపరబ్రహ్మమును సాక్షాత్కరింపఁజేసికొనిన యీ యతికే రాగము నివర్తించును. విషయములయందు భోగ్యత్వభావనానివృత్తిచే రాగము నివర్తించును. విషయములయందు భోగ్యత్వభావన బ్రహ్మజ్ఞానముచే నివృత్త మగును. సర్వమునకు తనకు నగు బ్రహ్మమాత్రత్వావగమ మనెడి యగ్నిచే భోక్తృభోగ్యత్వాదిరూప మగు మహారణ్యము బాగుగ తగులఁబడ నట్టి వనము నాశ్రయించుటవలన నావనముతోకూడ స్వయముగ తృష్ణయు (రాగము) దగ్ధ మగు నని యర్థము. 'అపి' శబ్దమువలన ప్రజ్ఞాస్థైర్యము కూడ సిద్ధించు నని సూచింపఁబడెను.

నీలకంఠీయము:— విషయములనుండి యింద్రియములనివృత్తియే స్థితప్రజ్ఞతకు హేతు వగుచో గాఢసుషుప్తియందు, మూర్ఛయందు, లయమునందు, గ్రహావేశమునందును ఇంద్రియములకు విషయములనుండి నివృత్తి కలదు. కాన సర్వులు స్థితప్రజ్ఞులు కావలసివచ్చు ననుశంకను "విషయాః" అను శ్లోకముచే తొలఁగించుచుండెను.

దేహాభిమానము కలిగినట్టియు, సుషుప్త్యాదులయందు నిరాహారుఁడును, ఇంద్రియములచే విషయములను గ్రహించువాఁడును, భోజనపరిత్యాగియు నగు మూఢునకు విషయములు రాగరహితముగ నివర్తించును. కాని అనుషుప్త్యాదులయందు రాగమూల మగు యజ్ఞానము నశింపకపోవుటచే సూక్ష్మరూపముగ రాగ ముండును. కాన నట్టివాఁడు స్థితప్రజ్ఞుఁడు కాఁడని యర్థము. ఆత్మను సాక్షాత్కరింపఁజేసికొనిన నిరాహారుఁడును, శబ్దాదివిషయములను గ్రహించనివాఁడు నగువాని మూలాజ్ఞాననాశమువలన రాగముకూడ నివర్తించును. కాన నిద్రపోయిన మూఢునకు సమాధిస్థునకు గొప్పవిశేషము కలదని భావము. ॥౫౯॥

శాంకరభాష్యమ్:—

సమ్యగ్దర్శనలక్షణప్రజ్ఞాస్థైర్యం చికీర్షతాఽఽదౌ ఇన్ద్రియాణి స్వవశే స్థాపయితవ్యాని యస్మాత్తదనవస్థాపనే దోష మాహ—యతత ఇతి। యతతః ప్రయత్నం కుర్వతోపి హి యస్మాత్కౌన్తేయ! పురుషస్య విపశ్చితో మేధావినోఽపీతి వ్యవహితేన సంబన్ధః। ఇన్ద్రియాణి ప్రమాథీని ప్రమథనశీలాని విషయాభిముఖం హి పురుషం విక్షోభయ న్త్యాకులీకుర్వన్తి। ఆకులీకృత్య చ హరన్తి ప్రసభం ప్రసహ్య ప్రకాశమేవ పశ్యతో వివేకవిజ్ఞానయుక్తం మనో యత స్తస్మాత్। ॥౬౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఎవడు సమ్యగ్దర్శనరూప మగు ప్రజ్ఞాస్థైర్యమును (సంపాదింప) గోరునో అట్టివాఁడు మొట్టమొదట త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లనెడి యింద్రియములను స్వవశమునందుంచుకొనవలెను. మనస్సును స్వవశమునం దుంచుకొనుట యొదులకని శంకింపవలదు. ఇంద్రియములను స్వవశమునం దుంచుకొనినయెడల దోషము (ప్రమాదము) సంభవించు నని "యతతః" అను శ్లోకముచే జెప్పుచున్నాడు. విషయములయందు దోషములను తెలిసికొను వివేకవంతున కింద్రియములు స్వయముగనే విషయములనుండి మరలుచుండ దానివిషయమై ప్రజ్ఞాస్థైర్యమును జేయగోరువాఁడు చేయఁదగిన దేమి కలదని శంకింపవలదు.

విషయములయందు మాటిమాటికి దోషదర్శనము నిమిత్తము ప్రయత్నము చేయుచున్న పురుషు డెంతబుద్ధిమంతుడుఁ డయినను విషయాభిముఖుండగు బురుషుని వ్యాకులునిగ జేయునట్టి యింద్రియములు అట్టిపురుషుని వ్యాకులునిగ జేసి ప్రత్యక్షము (జూచుచుండ)గనే వాని వివేక యుక్తమగు మనస్సును హరించుచున్నవి. కాన ప్రజ్ఞాస్థైర్యమును గోరెడి పురుషుఁడు మొట్టమొదట నింద్రియములను స్వవశమునం (తన స్వాధీనమునం) దుంచుకొనవలెను. ॥౬౦॥

—•౨వ అధ్యాయము- ౬౦ శ్లోకవ్యాఖ్యావిశేషములు•—

మధుసూదనసరస్వతీయము:— బాహ్యేంద్రియనిగ్రహము, మనోనిగ్రహము లేనియెడల ప్రజ్ఞ నశించుచున్నది. కాన ప్రజ్ఞాస్థైర్యమునకు బాహ్యేంద్రియనిగ్రహమనోనిగ్రహములు కారణములని చెప్పదలచి బాహ్యేంద్రియనిగ్రహము లేనియెడల కలుగుదోషమును మొట్టమొదట "యతతః" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

ఓయర్జునా! అనేకసార్లు విషయదోషదర్శనరూపమగు యత్నమును చేయువాడైనను, నత్యంతవివేకియైనను నట్టిపురుషునియొక్క మనస్సు క్షణమాత్రనిర్వికారముకలదిగ చేయబడినను అట్టి మనస్సును ఇంద్రియములు 'హరన్తి' వికారమునుపొందించుచున్నవి. విరోధియగువివేకముండ నెటులవికారము మనస్సునకు ప్రాప్తించుననుశంకను 'ప్రమాథీని' అనుపదముచేతొలగించుచుండెను. ఇంద్రియము లతిబలీయములగుటచే వివేకోపమర్దనక్షమములు. కాన ప్రభువగు జ్ఞాని చూచుచుండగనే వివేకము రక్షకమైయుండ సర్వప్రమాథులగుటవలన ఇంద్రియములు వివేకజన్యప్రజ్ఞయందు ప్రవిష్టమగు మనస్సును బలాత్కారముగ వివేకప్రజ్ఞనుండి దిగలాగి స్వవిషయనిష్ఠ

గీ॥ తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ॥౬౧॥

పదవిభాగము:— తాని- సర్వాణి- సంయమ్య- యుక్తః- ఆసీత- మత్పరః- వశే- హి- యస్య- ఇన్ద్రియాణి- తస్య- ప్రజ్ఞా- ప్రతిష్ఠితా ॥

ప్రతిపదార్థము:— తాని=ఆ; సర్వాణి=సమస్తములగు నింద్రియములను; సంయమ్య=స్వాధీనమొనర్చుకొని; యుక్తః=సమాహితాంతఃకరణము కలవాడై; మత్పరః=సర్వప్రత్యగాత్మస్వరూపు డగు వాసుదేవుడే పరుడు గాగలవాఁడై; (అనగా నట్టి వాసుదేవునికంటె నేను వేరు కాదను నిశ్చయముకలవాడై); ఆసీత=ఉండవలయును; యస్య=ఏయిట్టివానియొక్క; వశేహి=స్వాధీనమునందైతే; ఇంద్రియాణి=ఇంద్రియములు; వర్తన్తే=(ఈపదమధ్యాహార్యము) ఉఁటున్నవో; తస్య=అట్టివాని; ప్రజ్ఞా=ప్రజ్ఞ; (ఉత్కృష్టమగు బ్రహ్మైకత్వజ్ఞానము); ప్రతిష్ఠితా=ప్రతిష్ఠము. ॥౬౧॥

---

స్పర్శరూపరసగంధావిష్టరూపముగ హరించును. ఈశ్లోకమునందుగల 'హి' అనుశబ్దము ఇంద్రియముల కిట్టి స్వభావముయొక్క ప్రసిద్ధిని ద్యోతనచేయును. ఎట్లనర్థప్రదాతలగు దొంగలు ధనికుని, ధనరక్షకుని తిరస్కరించి వారిరువురు చూచుచుండగనే బలాత్కారముగా ధనమును హరించెదరో అట్లే యింద్రియములును విషయసన్నిధానమునందు మనస్సును హరించునని లోకమునం దీవిషయము ప్రసిద్ధమే.

శంకరానందీయము:— రాగద్వేషాదులను నిశ్శేషముగ నివర్తించుటకొరకు, నివృత్తికొరకు, విదేహముక్తికొరకు 'సర్వము బ్రహ్మమాత్రస్వరూప' మను జ్ఞానమును ముముక్షువు సంపాదింపదగియున్నది. విదేహకైవల్యసిద్ధికి కారణ మగు బ్రహ్మజ్ఞానముయొక్క సమ్యక్త్వసిద్ధికొఱకు సమాధియందు ప్రవృత్తమైన యతికి నింద్రియనిగ్రహమే మొట్టమొదట నవశ్యము కర్తవ్యము. ఇంద్రియనిగ్రహము లేనిచో గొప్పయనర్థము ప్రాప్తించునని సూచించుటచును "యతతః" అని చెప్ప మొదలిడెను.

జ్ఞానమునకు ప్రతిబంధకత్వసిద్ధికొఱకు యత్నించు సమాధినిష్ఠుడైనను, "విషయజాతము మాయికము, అసత్తు, తుచ్ఛము" అనియు, 'విషయప్రవృత్తి బంధముకొఱకగును' అనియు తెలిసికొనినవాఁడైనను అట్టి ముముక్షువుయొక్క సదసలోకనకారణ మగు మనస్సును విషయదర్శనమాత్రముచే వ్యాకులముగఁజేయు స్వభావముకల యింద్రియములు రాగాదిదోషగ్రస్తములై యీముముక్షువు చూచుచుండగనే వాని మనస్సును బలాత్కారముగ నపహరించును. అనగా నింద్రియములు మనస్సునుగ్రహించి విషయములయందు పారవైచును. కావ నింద్రియనిగ్రహములేని విద్వాంసునకు స్వరూపభ్రంశమే గొప్పయనర్థము.

భాష్యోత్కర్షదీపిక:— "కౌన్తేయ" అను సంబోధనచే నింద్రియాపేక్షచే పురుషునకు దౌర్బల్యము సూచింపబడెను.

నీలకంఠీయము:— నిద్రించినవాని యింద్రియములు శ్రాంతిచే, జాగ్రత్తునందలసటచే స్వయముగనే లయమును పొందును. సమాహితుడగు మునిచే నాయింద్రియములు కూర్మముచే నంగములువలె తనయిచ్ఛచేతనే యుపసంహరింపబడును. ఈవిధమున నింద్రియముల నుపసంహరించుట యత్యంతాయాససాధ్యమని "యతతః" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

శాస్త్రాచార్యోపదేశము కలిగి సమాధిసిద్ధినిమిత్తము ప్రయత్నించు పురుషునియొక్క ప్రమథనశీలము లగు నింద్రియములు ప్రత్యగాత్మయందు స్థిరమై చేయబడుచుండిన మనస్సును విషయాభిముఖముగఁ జేయును. ఎట్లనేకచోరులు వనమునందొకపురుషుని బాధించి యతని విత్తమును హరించెదరో అట్లే ప్రమథనశీలము లగు నింద్రియలు సమాధిసిద్ధినిమిత్తము యత్నించువాని మనస్సును బలాత్కారముగా హరించును. ॥౬౦॥

శాంకరభాష్యమ్:—

తానీతి । తాని సర్వాణి సంయమ్య సంయమనం వశీకరణం కృత్వా యుక్తస్సమాహితస్సన్నాసీత । మత్పరోఽహం వాసుదేవస్సర్వప్రత్యగాత్మా పరో యస్య స మత్పరో నాన్యోఽహం తస్మా దిత్యాసీతేత్యర్థః । ఏవ మాసీనస్య యతే ర్వశే హి యస్యేంద్రియాణి వర్తన్తేఽభ్యాసబలా త్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ॥౬౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఇంద్రియములను స్వాధీన మొనరించుకొనినపిమ్మట జేయదగినకర్తవ్యమును "తాని" అను శ్లోకముచే జెప్పుచుండెను.

త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లనెడి సర్వేంద్రియములను స్వాధీన మొనరించుకొని సమాహిత (విక్షేపశక్తిరహిత) మగు నంతఃకరణముకలవాఁడై సర్వప్రత్యగాత్మ (వాసుదేవుడు) నగు నేనే పరుఁనిగా (అట్టి వాసుదేవునికంటె నేను వేరు కాదను నిశ్చయము) కలవాడై యుండవలెను. అట్టి తీరుననుండు నేయతియొక్క స్వాధీనమునం దభ్యాసబలము (పరమాత్మకంటె నేను వేరుకాదను పూర్వోక్తమగు ననుసంధానముయొక్క ఆదరముచేనైన నిరంతరదీర్ఘ కాలానుష్ఠాన సామర్థ్యము) వలన సర్వేంద్రియము లుండునో అట్టివానికి ప్రజ్ఞ ప్రతిష్ఠిత మగును. (అనగా నట్టివాఁడు స్థితప్రజ్ఞుఁ డనఁబడును.) ॥౬౧॥

—• ౨వ అధ్యాయము ౬౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇంద్రియము లట్టివగుచో నేమి ప్రతిక్రియ చేయవలెను? అను నాశంకను తొలగించుటకు "తాని సర్వాణి" అని చెప్పమొదలిడెను.

సర్వజ్ఞానేంద్రియములను, సర్వకర్మేంద్రియములను స్వాధీన మొనరించుకొని సమాహితచిత్తుడై యే వ్యాపారమును లేనివాడై యుండవలెను. విక్షేపకారులగు నింద్రియముల నెటుల స్వాధీనమొనరించుకొనవలయును. అని ప్రశ్నించెదవా? 'మత్పరః' సర్వాత్మయగు వాసుదేవుడే యుపాదేయుడుగ కలవాడవై యగుము. ఏకాంత మద్భక్తుఁడ వగుమని యర్థము, ఈవిషయమే 'న వాసుదేవభక్తానా మశుభం విద్యతే క్వచిత్' (వాసుదేవభక్తుల కెన్నడును అశుభము ప్రాప్తించ) దని చెప్పబడెను. ఎట్లు బలవంతుడగు రాజు నాశ్రయించినచో చోరులు నిగ్రహింపబడెదరో (ఇతను రాజాశ్రితుఁడని స్వయముగనే చోరులు తద్వశ్యులగుదురో) అట్లే సర్వాంతర్యామియగు భగవంతు నాశ్రయించి భగవత్ప్రభావముచేతనే దుష్టమగు నింద్రియములను నిగ్రహింపవలెను. ఇతడు భగవదాశ్రితుడని తలచి యింద్రియములే తద్వశ్యము లగునని భావము. భగవద్భక్తియొక్క ప్రభావమును విస్తారముగ ముందు వ్యాఖ్యానించెదము. ఇంద్రియములను స్వాధీనమొనరించుకొనిన ఫల మేమనెదవా? ఎవని స్వాధీనమున నింద్రియము లుండునో వానికే ప్రజ్ఞ సుప్రతిష్ఠితమగును. ఈవిధమున వశీకృతేంద్రియుడై యుండునని 'కిమాసీత' అను ప్రశ్నమునకు సమాధానము చెప్పబడెను.

శంకరానందీయము:— ఇంద్రియములను నియమించుకొనువానికే స్థితప్రజ్ఞత్వమని "తానిసర్వాణి" అను శ్లోకముచే జెప్పుచుండెను. విషయములయందు మాటిమాటికి దోషదర్శనముచేతను, బంధకత్వభయముచేతను రాగద్వేషములతో వియోజితములైన యీసర్వేంద్రియములను నియమించి (అనగా నట్టి యింద్రియముల ప్రవృత్తిని నిరోధించి (తత్తద్గోళకములయం దాయింద్రియములను స్థాపించి) యతి సమాహితచిత్తుఁడై బ్రహ్మాకార

గీ॥ ధ్యాయతో విషయా న్పుంస స్సంగ స్తేషూపజాయతే ।
సంగా త్సంజాయతే కామః కామా త్క్రోధోఽభిజాయతే ॥ ॥౬౨॥

పదవిభాగము:— ధ్యాయతః- విషయాన్- పుంసః- సంగః- తేషు- ఉపజాయతే- సంగాత్- సంజాయతే- కామః- కామాత్- క్రోధః- అభిజాయతే । ॥౬౨॥

ప్రతిపదార్థము:— విషయాన్=శబ్దస్పర్శరూపరసగంధములనెడి విషయములను; ధ్యాయతః=ఆలోచించెడి; పుంసః=పురుషునకు; తేషు=ఆశబ్దాదివిషయములందు; సంగః=ఆసక్తి (ప్రీతి); ఉపజాయతే=పుట్టుచున్నది; సంగాత్=ప్రీతివలన; కామః=తృష్ణ; (ఉద్రేకమును పొందిన యాసక్తి; సంజాయతే=పుట్టుచున్నది: కామాత్=ఉద్రిక్తమగు నాసక్తివలన; క్రోధః=క్రోధము; అభిజాయతే=పుట్టుచున్నది. ॥౬౨॥

శాంకరభాష్యమ్:—

అథేదానీం పరాభవిష్యతస్సర్వానర్థమూల మిద ముచ్యతే—ధ్యాయత ఇతి । ధ్యాయతశ్చింతయతో విషయా న్శబ్దాదివిషయవిశేషా నాలోచయతః పుంసః పురుషస్య సంగ ఆసక్తిః ప్రీతి స్తేషు విషయే షూపజాయతే । సంగా త్ప్రీతే స్సంజాయతే కామ స్తృష్ణా కామాత్కుతశ్చి త్ప్రతిహతా త్క్రోధోఽభిజాయతే । ॥౬౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఇంతవరకు పురుషార్థమునకు దగు నుపాయ ముపదేశింపబడెను. అనంతరమున పురుషార్థోపాయముల నాశ్రయించని సమయమున మహానర్థమును బోధించెడి వివేకజ్ఞానరహితునకు విషయములను చింతించుట సర్వానర్థమూలమని 'ధ్యాయతః' అనుశ్లోకముచే బోధించుచుండెను.

ఆపాతరమణీయములగు శబ్దాదివిషయముల నాలోచించు పురుషున కావిషయములయందాసక్తి (ప్రీతి) జనించును. అట్టి ప్రీతివలన కామము (ఉద్రిక్తమగు నాసక్తి) జనించును, అట్టి యాసక్తి యొకదానివలన ప్రతిహత మైనపు డా కామమువలననే క్రోధము జనించును. ॥౬౨॥

వృత్తినిపొంది సర్వము తాను బ్రహ్మస్వరూపమే. యని తెలిసికొని యెల్లపుడు ప్రత్యగ్దృష్టిచేనుండవలెను. ఈవిధమున నిత్యము, నిరంతరము చూచునట్టి యతియొక్క యింద్రియములు విషయగ్రహణమునం దవకాశములేక రాగరహితములై వశ్యములగును. అట్టివానికే ప్రజ్ఞ ప్రతిష్ఠితము నిశ్చలమునగును. మోక్షము సిద్ధించును. ఇతరునకు సిద్ధించదు. ॥౬౧॥

—• ౨వ అధ్యాయము ౬౨, ౬౩ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— మనస్సు బాహ్యేంద్రియప్రవృత్తిద్వారమున ననర్థహేతు వగును. బాహ్యేంద్రియముల నరికట్టువానికి వెగల్చిన కోరలుగల సర్పమువలె నుండు మనస్సును నిగ్రహింపకున్నను బాహ్యోద్యోగము లేకపోటచేతనే కృతకృత్యత కలుగునుగాన నేమియు క్షతి సంభవింపదు. కాన "సమాహితచిత్తుడైయుండవలెను" అని చెప్పుట వ్యర్థమని యాశంకించి నిగృహీతబాహ్యేంద్రియములు కలవానికిఁగూడ మనోనిగ్రహము లేనిచో సర్వానర్థములు ప్రాప్తించునని "ధ్యాయతః" అను శ్లోకము మొదలు రెండుశ్లోకములచే చెప్పుచుండెను.

నిగ్రహించబడిన బాహ్యేంద్రియములు కలవాడైనను మాటిమాటికి మనస్సుచే శబ్దాదివిషయముల నాలోచించు పురుషున కావిషయములందు "శబ్దాదివిషయములు నాకత్యంతము సుఖహేతువు" అనెడి శోభనాధ్యాస

గీ॥ క్రోధా ద్భవతి సంమోహ స్సంమోహా త్స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి ॥ ॥౬౩॥

పదవిభాగము:— క్రోధాత్- భవతి- సంమోహః- సంమోహాత్- స్మృతివిభ్రమః- స్మృతిభ్రంశాత్- బుద్ధినాశః- బుద్ధినాశాత్- ప్రణశ్యతి । ॥౬౩॥

ప్రతిపదార్థము:— క్రోధాత్=క్రోధమువలన; సంమోహః=కార్యాకార్యవిషయక మగు నవివేకము; భవతి=అగుచున్నది; సంమోహాత్=అట్టి యవివేకమువలన; స్మృతివిభ్రమః=(శాస్త్రాచార్యోపదేశసంపాదిత మగు సంస్కారమువలన జనించిన) స్మృతియొక్క నాశము; భవతి=(ఈపద మావృత్తము) అగుచున్నది; స్మృతిభ్రంశాత్=స్మృతినాశమువలన; బుద్ధినాశః=బుద్ధియొక్క నాశము; భవతి=(ఈపద మావృత్తము) అగుచున్నది; బుద్ధినాశాత్=బుద్ధినాశమువలన; పురుషః=(ఈపద మధ్యాహార్యము) పురుషుఁడు; ప్రణశ్యతి=నశించుచున్నాఁడు.

శాంకరభాష్యమ్:—

క్రోధా ద్భవతి సంమోహోఽవివేకః కార్యాకార్యవిషయః । క్రుద్ధో హి సంమూఢ స్సన్ గురు మప్యాక్రోశతి । సంమోహా త్స్మృతివిభ్రమ శ్శాస్త్రాచార్యోపదేశాహితసంస్కారజనితాయా స్స్మృతే స్స్యా ద్విభ్రమో భ్రంశ స్స్మృత్యుత్పత్తినిమిత్తప్రాప్తా వనుత్పత్తిః । తత స్స్మృతిభ్రంశా ద్బుద్ధే ర్నాశః । కార్యాకార్యవిషయవివేకాయోగ్యతాంతఃకరణస్య బుద్ధే ర్నాశ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కోపముకలవాఁడు గురువును గూడ నధిక్షేపించును. కాన క్రోధమువలన కార్యాకార్యవిషయకమగు నవివేకము సంభవించును. స్మృత్యుత్పత్తికిఁ దగు కారణ మున్నను శాస్త్రాచార్యోపదేశాహితసంస్కారమువలన గలిగెడు స్మృతి యట్టి యవివేకమువలన గలుగకుండును. అట్టి స్మృతిభ్రంశమువలన నంతఃకరణమునకు కార్యాకార్యవిషయవివేకాయోగ్యత్వము సంభవించును. (ఇదియే బుద్ధినాశ మనంబడును.) అట్టి బుద్ధినాశమువలన పురుషుడు నశించును. నిత్యుఁడగు పురుషునకు బుద్ధినాశమువలన నాశ మెట్లుసంభవించు ననినఁ నాశము ముఖ్య మనియు, గౌణ

రూప మగు ప్రీతివిశేషము కలుగును. అట్టి ప్రీతివిశేషమువలన "నాకీవిషయములు ప్రాప్తించుగాక" అనెడి తృష్ణావిశేషము ప్రాప్తించును. ఏదో యొకదానివలన ప్రతిహత మగు నాతృష్ణావిశేషమువలన ప్రతిఘాతక (అడ్డు కారక) విషయక మగు నభిజ్వలనాత్మకక్రోధము జనించును. అట్టి క్రోధమువలనఁ గార్యాకార్యవివేకాభావరూప మగు సంమోహ ముద్భవించును. సంమోహమువలన శాస్త్రాచార్యోపదిష్టార్థానుసంధానమునకు విభ్రంశము సంభవించును. స్మృతిభ్రంశమువలన నైకాత్మ్యకారమనోవృత్తి నశించును. అనగా విపరీతభావనోపచయముచే ప్రతిబంధమువలన నైకాత్మ్యకారమనోవృత్తిరూపమగు బుద్ధి కలుగదు. కాన నట్టి బుద్ధి ఫలాయోగ్యమగుటచే నశించును. అట్టి ఫలభూత మగు బుద్ధియొక్క విలోపమువలనఁ బురుషుఁడు సర్వపురుషార్థముల కయోగ్యుఁడగును. ఏ పురుషుండు పురుషార్థాయోగ్యుఁడో వాఁడు మృతుఁడే యని లోకమునందు వ్యవహరించఁబడును. కాన నట్టి వాఁడు "ప్రణశ్యతి" (నశించుచున్నాఁడని) చెప్పబడెను. బాహ్యేంద్రియముల నన్నింటిని నిగ్రహించినవానికి కూడ మనోనిగ్రహము లేనిచో పరమానర్థప్రాప్తి కలుగును. కాన గొప్పప్రయత్నముచే మనోనిగ్రహము చేయవలెనని యభిప్రాయము. కాన "తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత" అని చెప్పుట యుక్తమే యగును.

శాంకరభాష్యమ్:—

ఉచ్యతే । బుద్ధినాశాత్ ప్రణశ్యతి తావదేవ హి పురుషో యావ దన్తఃకరణం తదీయం కార్యాకార్యవిషయవివేకయోగ్యం త దయోగ్యత్వే నష్ట ఏవ పురుషో భవ త్యత స్తస్యాన్తఃకరణస్య బుద్ధే ర్నాశా త్ప్రణశ్యతి పురుషార్థాయోగ్యో భవతీ త్యర్థః ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మనియు రెండువిధములు. ఘటావయవము లగు కపాలముల నాశముచే ఘటనాశము సంభవించుచున్నది, ఇది ముఖ్యనాశన మనంబడును. దేవదత్తుని ధనము నశించుటచే "దేవదత్తుఁడు నశించెను" అను ప్రతీతిసిద్ధ మగు దేవదత్తనాశము గౌణనాశన మనంబడును. (ఇట దేవదత్తుఁ డుండినను వాని ధననాశముచే దేవదత్తనాశము చెప్పఁబడుచుండెను) అదే విధమున యెంత వరకు పురుషుని యంతఃకరణము కార్యాకార్యవిషయవివేకయోగ్యమో అంతవరకె వాఁడు పురుషు డనిపించుకొనును. ఎపుడు వాని యంతఃకరణము కార్యాకార్యవిషయవివేకయోగ్యము కాదో అపు డాపురుషుడు 'నష్టః' నశించెను అని చెప్పఁబడును కాన నంతఃకరణరూపబుద్ధినాశము వలన బురుషార్థాయోగ్యు డగు నని యర్థము. ॥౬౩॥

శంకరానందీయము:— అంతఃకరణ మింద్రియద్వారమున విషయములయందు ప్రవేశించుచో విద్వాంసున కేమి యనర్థము ప్రాప్తించు ననెదవా? విషయాభిధ్యానమే సర్వానర్థబీజము. దానిచే ననర్థహేతు పరంపర సంభవించును. అట్టి యనర్థకారణ పరంపరచే పరావరైకత్వవిజ్ఞానము పూర్తిగ నశించును. అట్టి విజ్ఞాననాశమువలన జననమరణతరంగ పంక్తులుగల సంసారాంబుధియందు ప్రవేశించి స్వయముగ విద్వాంసుఁడు నశించును. కాన విద్వాంసుడైనను వానిబహిర్ముఖత్వము జన్మాదిదుఃఖప్రవాహపాతమున కారణమగుటయే ఫలము. కారణములేమిం జేసి మోక్షము సంభవింపదు. రాగద్వేషములచే విషయములయందు ప్రవృత్తుఁడగు విద్వాంసునకు కూడ విషయాభిధ్యానమే ప్రసక్తమగును. బ్రహ్మధ్యానము ప్రసక్తము కాదు. కాన సర్వానర్థమూలమగు విషయాభిధ్యానమును, తత్కార్యమును "ధ్యాయతః" అనునది మొదలు రెండుశ్లోకములచే ప్రతిపాదించుచుండెను.

శబ్దాదివిషయములను ధ్యానించువానికి (అనగా విషయములయం దిదిరమ్యము, ఇది యరమ్యము, ఇది భోగ్యమని యాలోచించువాని) కావిషయములయందు 'సంగః' రమ్యత్వాకారముగ కాని, భోగ్యత్వాకారముగ కాని భావితములగు భోగములయందు ప్రాక్తనసంస్కారములవలన తత్కాలమునందే యాసక్తి జనించును. అట్టి ప్రీతివలన శబ్దాదులయందు నాకిది సంభవించుఁగాక యని భోగేచ్ఛావేగము లెస్సగ జనించును. ఆ కామముతో గ్రస్తుఁడై యభోగ్యమగు కళంజాదికమును. స్త్రీసమూహమును, తోబుట్టువు మొదలగువారిని భోగ్యబుద్ధిచే ననుభవించుటకు పురుషుఁడు త్వరపడును. ఏదో యొకానొక ప్రతిబంధముచే ప్రతిహతమగు కామమువలన పరవశీకృతాంతఃకరణ కలవానికి పరాపకారకరణహేతువగు బుద్ధివిశేషము (క్రోధము) జనించును. అట్టి క్రోధమువలన సంమోహము వైచిత్త్యము (కార్యాకార్యవివేకశూన్యత్వము) జనించును. క్రోధావిష్టుఁడైనచో సంమోహముచే మహాత్ములకు గూడ నపచారము నాచరించును. గురువునుకూడ ధిక్కరించును. ఉక్తలక్షణములుకల సంమోహమువలన స్మృతివిభ్రంశము కలుగును (అనఁగా వేదాంతశ్రవణజన్యజ్ఞానముచే "బ్రహ్మైవాహమస్మి" అని మాటిమాటికి చేయఁబడిన స్వానుభవమువలన జనించెడి సంస్కారమువలనఁ బుట్టిన తదాకారపరిణామిబుద్ధి వృత్తివిశేషము స్మృతియనఁబడును.) అట్టి

గీ॥ రాగద్వేషవియుక్తైస్తు విషయా నిన్ద్రియై శ్చరన్ ।
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి ॥ ॥౬౪॥

పదవిభాగము:— రాగద్వేషవియుక్తైః- తు- విషయాన్- ఇంద్రియైః- చరన్- ఆత్మవశ్యైః- విధేయాత్మా- ప్రసాదం- అధిగచ్ఛతి । ॥౬౪॥

ప్రతిపదార్థము:— రాగద్వేషవియుక్తైః=రాగద్వేషములతో కూడన్వి యైనట్టియు; ఆత్మవశ్యైః=తనకు స్వాధీనము లైనట్టి; ఇంద్రియైస్తు=ఇంద్రియముల చేతను; విషయాన్=(అవర్జనీయము లగు) కౌపీనాచ్ఛాదనాశన పానాదులను; చరన్=పొందుచున్న; పురుషః=(ఈపద మధ్యాహార్యము) పురుషుఁడు; విధేయాత్మా=స్వాధీనమగు నంతఃకరణము కలవాఁడై; ప్రసాదం=స్వాస్థ్యమును; అధిగచ్ఛతి=పొందుచున్నాడు. ॥౬౪॥

---

స్మృతిహేతువులు ప్రాప్తించినను అట్టి స్మృతిజనించదు బ్రహ్మాకారమగు వృత్తి స్వవిషయికస్మృతినాశమువలన నశించును. పురోవర్తియగు పురుషునియందు "వీడు పుత్రుఁ"డను స్మృతియుండినచో 'వీడు నా పుత్రుఁడని' పుత్రాకారమగు బుద్ధిజనించును. భ్రాంతునకైనచో స్మృతిలేమింజేసి పుత్రాకారబుద్ధి యెట్లు జనించదో అట్లే బ్రహ్మమపరోక్షరూపమైనను విషయవ్యామోహాక్రాంతచిత్తుఁడగు విద్వాంసునకు స్వవిషయికస్మృతి లేమింజేసి దృశ్యాకారత్వమును విడచి జగత్తునకు తనకు బ్రహ్మాకారత్వావగాహియు, అఖండాత్మకము, చిద్రూపమునగు వృత్తి కలుగనేరదు. మరేమనిన భోక్తృభోగ్యాకారవృత్తులచే స్వయముగ తిరోహితమై ఆబుద్ధి నష్టమగును. ఈవిధమున తన విజ్ఞాననాశముచే విద్వాంసుఁడు స్వయముగ నశించును. సంసారకారాగారమందు పడి యెన్నడును ముక్తిని పొందడు. విషమును పానముచేసినవాఁడమరత్వమును పొందనటుల యసన్మార్గమునందు ప్రవేశించినవాఁడెన్నడును సద్గతిని పొందనేరడు. కాన విషయముల కవకాశ మీయక సర్వేంద్రియనిగ్రహపూర్వకముగ సమాధియోగము నాచరించువానికే సమ్యగ్జ్ఞానము, తత్ఫలమగు మోక్షము సిద్ధించునని యాశయము.

పరమార్థప్రపా:— బాహ్యేంద్రియసంయమము లేనిచో కలుగు దోషమును చెప్పి యిపుడు మనస్సంయమము లేనియెడల కలుగుదోషమును 'ధ్యాయతః' అనునది మొదలు రెండుశ్లోకములచేఁ జెప్పుచుండెను. "లోక ఏష విషయానురంజనం దుఃఖగర్భ మపి మన్యతే సుఖమ్ । ఆమిషం బడిశగర్భ మ ప్యహో! మోహతో గ్రసతి యద్వ దండజః॥" గాలము గర్భమునందుగల మాంసఖండమును మోహమువలన మత్స్య మెట్లు మ్రింగునో, అట్లే యీలోకము దుఃఖము గర్భమునందుఁగలిగిన విషయములచే రంజింపఁబడినవాటిని సుఖముగఁ దలచుచున్నది. ఎంత యాశ్చర్యము!

సదానందీయము:— "శ్రీమ త్కృష్ణపదారవిందసురభౌ వృత్తిం వహ ద్భ్రామరీం శ్రద్ధాభక్తియుతం మనోఽనవరతం యావ త్ప్రవిష్టం నహి । తావ త్క్షోభకశీలతాం ప్రతిపదం వాధ్దా జహాతి స్వికాం చాంచల్యం ప్రజహాతి తత్ర నిరతం చేత స్స్వయం త్వాధిదం ॥" (శ్రీమత్కృష్ణపదారవిందసౌరభమునందు- భ్రామరీవృత్తి నాశ్రయించి, శ్రద్ధాభక్తియుతమైన మన స్సెంతవరకు ప్రవేశింపదో అంతవర కాచిత్తము ప్రతిపదమునందు స్వీయమగు క్షోభకశీలత్వమును విడువదు; చాంచల్యమును విడువదు; ఎల్లపు డాధులను కలుగజేయుచుండును.) ఈశ్లోకముగూడ మనస్సంయమనమునే బోధించుచున్నది.

నీలకంఠీయము:— "యదా పంచావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ । బుద్ధి శ్చ న విచేష్టేత తా మాహుః పరమాంగతిమ్ ॥" అను శ్రుతియం దింద్రియమనోబుద్ధుల నిగ్రహమువలన పరమపదప్రాప్తి యగు నని చెప్పఁబడెను. అందుపసంహృతకరణములుకలవాఁడును, బాహ్యములగు శబ్దాదులను గ్రహించక మనోమాత్రముచే నలియువాఁడును అగు యోగికి మనోనిగ్రహము లేనిచో నేమి సంభవించు నను ప్రశ్నమును తొలగించుటకుఁ "ధ్యాయతః" అని చెప్ప మొదలిడెను. (శేషము పూర్వవ్యాఖ్యలవలె చూచుకొనదగును) ॥౬౨, ౬౩॥

**శాంకరభాష్యమ్:—**

సర్వానర్థస్య మూల ముక్తం విషయాభిధ్యాన మథేదానీం మోక్షకారణ మిదముచ్యతే— రాగద్వేషేతి । రాగద్వేషవియుక్తై రాగశ్చ ద్వేషశ్చ రాగద్వేషౌ తత్పురస్సరా హీన్ద్రియాణాం ప్రవృత్తి స్స్వాభావికీ తత్ర యో ముముక్షు ర్భవతి స తాభ్యాం వియుక్తై శ్శ్రోత్రాదిభి రిన్ద్రియై ర్విషయా నవర్జనీయాం శ్చర న్నుపలభమాన ఆత్మవశ్యై రాత్మనో వశ్యాని వశీభూతాని తై రాత్మవశ్యై ర్విధేయాత్మేచ్ఛాతో విధేయ ఆత్మాన్తఃకరణం యస్య సోఽయం ప్రసాద మధిగచ్ఛతి । ప్రసాదః ప్రసన్నతా స్వాస్థ్యమ్ ॥ ॥౬౪॥

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

శబ్దస్పర్శరూపరసగంధము లనెడి విషయముల సమాలోచనము సర్వానర్థములకు కారణమని ఇంతవరకు జెప్పబడెను. అనంతరమున నిపుడు మోక్షకారణ మగు నీచెప్పబోవు విషయమును "రాగద్వేషవియుక్తైః" అను శ్లోకమునందు బోధించుచుండెను. స్వాభావికములగు నింద్రియములయొక్క ప్రవృత్తి విషయములయందు రాగద్వేషపురస్సర మైనదని సర్వానుభవసిద్ధము. అధికృతులయం దెవడు ముముక్షువో, స్వేచ్ఛాధీనాంతఃకరణము కల యట్టి పురుషుఁడు రాగద్వేషములను విడచిన ఇంద్రియములచే శరీరస్థితిమాత్రప్రయోజనము లగు కౌపీనాచ్ఛాదనాశనపానాదుల బొందుచున్నను ప్రసాదమును (స్వాస్థ్యమును) పొందుచున్నాడు. ॥౬౪॥

—• ౨వ అధ్యాయము- ౬౪ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— మనోనిగ్రహ ముండినచో బాహ్యేంద్రియనిగ్రహము లేకున్నను దోషము ప్రాప్తించ దని చెప్పుచు "కిం వ్రజేత" అను ప్రశ్నమునకు "రాగద్వేషవియుక్తైః" అను శ్లోకము మొదలెనిమిదిశ్లోకములచే సమాధానము చెప్పుచుండెను.

ఎవఁ డసమాహితుఁడో వాఁడు బాహ్యేంద్రియములను నిగ్రహించియు, రాగద్వేషదుష్ట మగు మనస్సుచే విషయముల నాలోచించుచు పురుషార్థమునుండి భ్రష్టుఁ డగును. వశీకృతాంతఃకరణుఁ డెవ్వఁడో స్వాధీనములు, రాగద్వేషవియుక్తములు నగు శ్రోత్రాదీంద్రియములచే ననిషిద్ధ మగు శబ్దాదివిషయములను తెలిసికొనుచు చిత్తముయొక్క స్వచ్ఛత్వమును (పరమాత్మసాక్షాత్కారయోగ్యత్వమును) పొందును. రాగద్వేషప్రయుక్తము లైన యింద్రియములు దోషహేతువు లగును. మనస్సు స్వాధీన మైనచో రాగద్వేషములు సంభవింపకుండును. రాగద్వేషములు లేనిచో తదధీన మగు నింద్రియప్రవృత్తియు కలుగనేరదు. విడిచిపెట్టఁదగనిదిగ ప్రాప్తించిన సద్విషయోపలంభము దోషమును చేయనేరదు. శుద్ధివ్యాఘాతమునూ సంభవింపనేర దని భావము.

ఈ చెప్పుటవలన విషయస్మరణమే యనర్థకారణ మగుచున్న దని చెప్పుచుండ విషయోపభోగ మత్యంతానర్థదాయక మని యేమిచెప్పవలెను? అందుచే జీవనార్థము విషయముల ననుభవించువాఁ డెటుల ననర్థమును పొందఁ డను నాశంక తొలఁగించఁబడెను. స్వాధీనములగు నింద్రియములచే సద్విషయములను పొందు నని "కిం వ్రజేత" అను ప్రశ్నమునకు సమాధానము చెప్పఁబడెను.

శంకరానందీయము:— "ఇంద్రియములచే విషయములను గ్రహింపనిచో విద్వాంసున కెటుల శరీరయాత్ర సంభవించు" నను శంకను తొలగించుటకు విద్వాంసునకు శరీరయాత్రాప్రకారమును, నిత్యము సమాధినిష్ఠునకు చిత్తప్రసాదమును "రాగద్వేషవియుక్తైః" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

గీ॥ ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే ।
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి ॥ ॥౬౫॥

పదవిభాగము:— ప్రసాదే– సర్వదుఃఖానాం– హానిః– అస్య– ఉపజాయతే– ప్రసన్నచేతసః– హి– ఆశు– బుద్ధిః– పర్యవతిష్ఠతే । ॥౬౫॥

ప్రతిపదార్థము:— ప్రసాదేసతి=స్వాస్థ్యము సంభవించినపిమ్మట; అస్య=స్వస్థచిత్తుఁడగు నీయతికి; సర్వదుఃఖానాం=ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతికదుఃఖములయొక్క; హానిః=నాశము; ఉపజాయతే=కలుగుచున్నది; హి=ఏకారణమువలన; ప్రసన్నచేతసః=ప్రసన్నచిత్తుఁడగు యతికి; ఆశు=శీఘ్రముగ; బుద్ధిః=అంతకరణము; పర్యవతిష్ఠతే=అంతటను: (ఆత్మస్వరూపముచే) నిశ్చలమగునో. ॥౬౫॥

---

విషయములయం దిష్టత్వానిష్టత్వజ్ఞానమే రాగద్వేషములకు బీజము. అట్టి జ్ఞానమును దోషదర్శనముచే వదలినచో నింద్రియములు రాగద్వేషములు లేని వగును. (విషయములయం దసత్వతుచ్ఛత్వబంధకత్వబుద్ధిచే రాగద్వేష వియోజితము లగు నని యర్థము). కనుకనే 'ఆత్మవశ్యైః' తనకు సంకోచవ్యాకోచములయందు వశవర్తులును, ప్రసన్నములును అగు నింద్రియములచే ననిషిద్ధములగు నన్నరసాదులను, అందుకూడ ప్రాణత్రాణమాత్రపర్యాప్తముల ననుభవించుచు బ్రహ్మవేత్తయగు యతి యింద్రియశుద్ధిచేతను, సమాధిచేతను వినిర్ముక్తరాగాదిదోషములు కలవాఁడగుటచే శుద్ధుఁడై, స్వాధీనమగు చిత్తముకలవాఁడై. చిత్తస్వాస్థ్యమును (అత్యంతనిర్మలత్వమును) పొందును. "ఆహారశుద్ధౌ సత్వశుద్ధి స్సత్వశుద్ధౌ ధ్రువా స్మృతిః" శుద్ధమైన యాహారము ననుభవించినచో నంతఃకరణము శుద్ధమగును. సత్త్వము శుద్ధమైనచో స్మృతి (పరమాత్మస్మృతి) కలుగును. అని యుండుటవలన నింద్రియ శుద్ధి కలిగినచో దానివలన చిత్తశుద్ధికలుగును.

పరమార్థప్రభ:— పూర్వమునందు చెప్పబడినదాని నాచరించుట కసమర్థుడును తరించు ననియు "ప్రజేతకిం" అను ప్రశ్నమున కుత్తరమును "రాగద్వేష వియుక్తైః" అను శ్లోకముచే జెప్పుచుండెను. (శ్లోకార్థమంతయు వెనుక చెప్పినరీతినే చూచుకొనవలయును).

"అగ్నిసంగా ద్యథా లోహ మగ్నిత్వ ముపగచ్ఛతి । ఆత్మసంగా త్తథా గచ్ఛ త్యాత్మతా మింద్రియాదికమ్ ॥" అగ్నిస యోగమువలన లోహ మగ్నిత్వము నెటుల పొందునో అట్లే యాత్మసాంగత్యమువలన నింద్రియాదిక మాత్మత్వమును పొందును.

నీలకంఠీయము:— "విషయములను ధ్యానించు నట్టి యోగికికూడ సమాధివ్యుత్థానదశయందు ప్రమాణిస్వభావమువలన నింద్రియముల ప్రవృత్తి దుష్పరిహార్యమగును. కాన పూర్వోక్తరీతిని యోగికికూడ నాశము ప్రసక్తమగు' నను శంకను "రాగద్వేషవియుక్తైః" అను శ్లోకముచే తొలగించుచుండెను.

'విధేయాత్మా' కింకరీకృతమనస్సుగల యోగి కధీనమగు మనస్సు కామక్రోధవిహీన మగుటవలన నింద్రియములుకూడ రాగద్వేషవియుక్తము లగును. అట్టి యింద్రియములచే మార్గమునందు పడియుండిన తృణాదులను వలె విషయములను తెలిసికొనుచుండినను ఆవిషయములయందు కామాదులు పుట్టకపోవుటచే సంకల్పవికల్పరూపపంకప్రక్షాళనద్వారమున మనస్సు స్వచ్ఛతను పొందును. పరమాత్మ తద్గుణసారుడు కాన మనస్సుయొక్క స్వచ్ఛతయే ప్రత్యగాత్మయొక్క స్వచ్ఛత యనఁబడును. విషయసంయోగము అజితమనస్కుని బాధించునటుల, జితమనస్కుని బాధింపనేరదు. కాన మనోజయ మవశ్యకర్తవ్య మని యర్థము. ॥౬౪॥

శాంకరభాష్యమ్:—

ప్రసాదే సతి కిం స్యా దిత్యుచ్యతే.—ప్రసాద ఇతి। ప్రసాదే సర్వదుఃఖానామాధ్యాత్మికాదీనాం హాని ర్వినాశోఽస్య యతే రుపజాయతే। కించ ప్రసన్నచేతస స్స్వస్థాంతఃకరణస్య హి యస్మా దాశు శీఘ్రం బుద్ధిః పర్యవతిష్ఠత ఆకాశమివ పరి సమన్తా తదవతిష్ఠత ఆత్మస్వరూపేణైవ నిశ్చలీభవతీత్యర్థః। ఏవం ప్రసన్నచేతసోఽవస్థితబుద్ధేః కృతకృత్యతా యతస్తస్మా ద్రాగద్వేషవియుక్తై రింద్రియై శ్శాస్త్రావిరుద్ధేష్వవర్జనీయేషు యుక్త స్సమాచరే దితి వాక్యార్థః ॥ ౬౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

రాగద్వేషయుక్తములగు నింద్రియములచే భిక్షాశనపానాదులను మాత్రము స్వీకరించుచున్నను అనేకవిధములగు దుఃఖములచే నంతఃకరణ మభిభూత మగుటం బట్టి స్వాస్థ్యమును బొందుట యశక్యమే. అట్టిప్రసాదము (స్వాస్థ్యము) ప్రాప్తించిన ఫల మేమను శంకను తొలంగించుటకు "ప్రసాదే" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

ఎపుడే యతియొక్క యంతఃకరణమునకు స్వాస్థ్యము ప్రాప్తించునో అపుడే ఈయతి కాధ్యాత్మికాధిదైవికాధిభౌతికదుఃఖములు నశించును. మఱియు స్వస్థాంతఃకరణము కలవాని యొక్క బుద్ధి శీఘ్రముగ నాకాశమువలె నంతటనాత్మస్వరూపముచేతనే నిశ్చలమగును. ఈవిధమున ప్రసన్నచిత్తము కలవానికి కృతకృత్యత ప్రాప్తించును. కానరాగద్వేషవియుక్తములగు నింద్రియములచేత శాస్త్రావిరుద్ధమగు భిక్షాశనపానాదులయందు విషయపారవశ్యము లేనివాఁడై ప్రవర్తింపవలయునని వాక్యార్థము. ॥ ౬౫॥

—• 2వ అధ్యాయము 65వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ప్రసాదమును పొందునని పూర్వశ్లోకమునందు చెప్పబడెను. ప్రసాదము ప్రాప్తించిన నేమి యగునో చెప్పెద వినుము.

చిత్తమునకు స్వచ్ఛతారూపప్రసాదము సంభవించినచో నజ్ఞానవిలసితాధ్యాత్మికాది సర్వదుఃఖవినాశన మగును. ప్రసన్నచిత్తునకు సంశయాఽసంభావనావిపరీతభావనారూపప్రతిబంధములేమింజేసి శీఘ్రముగ బ్రహ్మాత్మైక్యాకారబుద్ధియంతటను స్థిరమగును. దానివలన చిత్తప్రసాదము, చిత్తప్రసాదమువలన బుద్ధిపర్యవస్థానము, దానివలన జ్ఞానవిరోధ్యజ్ఞాననివృత్తియు, దానివలన నజ్ఞానకార్యములగు సకలదుఃఖములయొక్క హానియు సంభవించును. ఇట్టి క్రమమునందును చిత్తప్రసాదమునం దధికయత్నముకొఱకు సర్వదుఃఖహానికరత్వము చెప్పబడెను. కాన విరోధములేదు.

శంకరానందీయము:— నిత్యము సమాధినిష్ఠచే నింద్రియములకును మనస్సునకును ప్రసాదమును సంపాదించిన విద్వాంసుని ప్రసాదసిద్ధియొక్క ఫలమును "ప్రసాదే" అను శ్లోకముచే చెప్పుచుండెను.

ఇంద్రియశుద్ధి సిద్ధించుటవలన ప్రసాదము ప్రాప్తింప నీవిద్వాంసునకు దుఃఖహేతువులగు విక్షేపములయొక్క నాశము సంభవించును. దానివలననే శీఘ్రముగ నీనిర్మలమనస్సునకు బ్రహ్మదర్శనరూపబుద్ధి ప్రతిష్ఠితమగును.

గీ॥ నాస్తి బుద్ధి రయుక్తస్య న చాయుక్తస్య భావనా ।
న చాభావయత శ్శాన్తి రశాంతస్య కుత స్సుఖమ్ ॥ ॥౬౬॥

పదవిభాగము:— న- అస్తి- బుద్ధిః- అయుక్తస్య- న- చ- అయుక్తస్య- భావనా- న- చ- అభావయతః- శాంతిః- అశాంతస్య- కుతః- సుఖమ్ । ॥౬౬॥

ప్రతిపదార్థము:— అయుక్తస్య=సమాహితము కాని (స్వాస్థ్యములేని) యంతఃకరణము గలవానికి; బుద్ధిః=ఆత్మస్వరూపవిషయక మగు నిశ్చయజ్ఞానము; నాస్తి=సంభవింపనేరదు; అయుక్తస్య=అసమాహితాంతఃకరణునకు; భావనా=ఆత్మజ్ఞానమునం దభినివేశము; నచ=సంభవింపనేరదు; అభావయతః=ఆత్మజ్ఞానాభినివేశము లేనివానికి; శాంతిః=ఉపశమము; నచ=సంభవింపనేరదు; అశాంతస్య=శాంతిలేనివానికి; సుఖం=(విషయతృష్ణనుండి యింద్రియములయొక్క నివృత్తి సుఖమనంబడును) తద్రూపసుఖము; కుతః=ఎటుల; సంభవతి=సంభవించును? (సంభవింపనేరదు. ॥౬౬॥

---

శాంకరభాష్యమ్:—

సేయం ప్రసన్నతా స్తూయతే— నాస్తీతి । నాస్తి న విద్యతే న భవతీ త్యర్థః । బుద్ధి రాత్మస్వరూపవిషయాఽయుక్తస్యాసమాహితాంతఃకరణస్య । న చాస్త్యయుక్తస్య భావనాఽఽత్మజ్ఞానాభినివేశః । తథా న చాస్త్యభావయత ఆత్మజ్ఞానాభినివేశ మకుర్వత శ్శాంతి రుపశమః । అశాంతస్య కుత స్సుఖమ్ । ఇన్ద్రియాణాం హి విషయసేవాతృష్ణాతో నివృత్తి ర్యా తత్సుఖం న విషయవిషయా తృష్ణా, దుఃఖమేవ హి సా న తృష్ణాయాం సత్యాం సుఖస్య గంధమాత్ర మ ప్యుపపద్యత ఇత్యర్థః ॥ ॥౬౬॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అంతఃకరణపరిశుద్ధిచేతనే యాత్మజ్ఞానము సిద్ధించు ననెదవా ? అట్లు సిద్ధింపనేరదు. మఱే మనిన? ప్రసన్నాంతఃకరణునకే యాత్మజ్ఞానము సిద్ధించు నని చెప్పి యంతఃకరణమునందుండు ప్రసన్నత్వ (స్వాస్థ్య) మును 'నాస్తి బుద్ధిః' అను శ్లోకముచే జెప్పుచుండెను. అసమాహితాంతఃకరణున కాత్మజ్ఞానము కలుగదు. అసమాహితాంతఃకరణున కాత్మజ్ఞానాభినివేశము సంభవింపదు.

---

పరమార్థప్రపా:— "విజ్ఞానామృతనిర్ఝరావని రివ స్వానందపూర్ణోదధే: రూర్మి శ్శాశ్వతసుప్రసాదపదనం భూతానుకంపాప్రసూః । నిర్వాతస్థితసుప్రదీపకలికా వైరాగ్యభాగ్యాస్పదం, దృశ్యాతీతపదావలంబరసికా స్వాంతస్థ్సితి స్తద్విదామ్ ॥" బ్రహ్మవేత్తలయొక్క స్థిరము మగు యంతస్థ్సితి విజ్ఞాన మనెడి యమృతప్రవాహమునకు స్థానమువంటిది. మఱియు స్వానందపూర్ణోదధియొక్క తరంగరూపము, శాశ్వతప్రసాదమునకు గృహరూపము, భూతదయను కలుగఁజేయునది; నిర్వాతప్రదేశమునందుండు దీపకలికవంటిది; వైరాగ్యభాగ్యమున కాధారము, దృశ్యాతీత మగు బ్రహ్మపదమును పొందుటయం దాసక్తి కలది (కాన విద్వాంసుఁ డవశ్యము ప్రసన్నచిత్తుఁడై యుండవలెను.) ॥౬౬॥

—• ౨వ అధ్యాయము ౬౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

**మధుసూదనసరస్వతీయము:— ఈ చెప్పినవిషయమునే వ్యతిరేకముఖమున "నాస్తి బుద్ధిః" అను శ్లోకముచే ప్రపంచించుచుండెను.**

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(అందుచే నాత్మజ్ఞానము సంభవింపదని యాశయము). ఆత్మజ్ఞానాభినివేశము లేనివానికి శాంతి సంభవింపదు. శాంతిలేనివానికి సుఖ మెటుల సంభవించును? అనగా నాత్మ యాపాతతః తెలిసిన పిమ్మట శ్రవణాద్యావృత్తిరూపమగు స్మృతిని జేయుచునే యుండవలెను.) అట్టివాని కపరోక్షజ్ఞానము కలిగి దానివలన ననర్థనివృత్తి యగును. అటుల శ్రవణాద్యావృత్తిరూపమగు భావన లేనివాని కపరోక్షానుభూతి దుర్ఘటము. అపరోక్షానుభూతి లేనివాని కనర్థనివృత్తి సంభవింపదు. పరమానందసాగరముకంటె వేఱగు సంసారసాగరమునందు నిమగ్నమై అనర్థనివృత్తిని గానని వానికి సుఖావిర్భావము సంభవింపదని యాశయము.

అట్టివానికి గూడ విషయసేవవలన వైషయికసుఖము సంభవించుననెదవా? విషయతృష్ణ యుండిన సుఖలేశమైన సంభవింపదు. కాన నీవిషయతృష్ణ యనునది దుఃఖరూపమే; సుఖరూపము కానేరదు. మఱి సుఖరూప మేమనిన? విషయతృష్ణనుండి ఇంద్రియముల నివృత్తియే సుఖ మనంబడును.

కాన నట్టి సుఖము ప్రాప్తింపవలయు ననిన శాంతిని సంపాదింపవలయును. శాంతిని సంపాదింపవలయు ననిన శ్రవణాద్యావృత్తితత్పరుడై యుండవలెను. అట్టి శ్రవణాద్యావృత్తికి చిత్తస్వాస్థ్యము హేతువు. కాన తప్పక నిరతిశయసుఖమును గోరువాఁడు చిత్తస్వాస్థ్యమును సంపాదింపవలయునని యాశయము. ॥౬౬॥

మనోజయము లేనివానికి శ్రవణమననరూపవేదాంతవిచారజన్యమగు నాత్మజ్ఞానము కలుగనేరదు. అట్టిబుద్ధి లేనిచో వానికి విజాతీయప్రత్యయప్రవాహశూన్యసజాతీయప్రత్యయప్రవాహరూపమగు నిదధ్యాసనాత్మకభావనము సంభవింపదు. ఆత్మవిషయకభావన లేనివానికి సకార్యావిద్యానివృత్తిరూపము, వేదాంతవాక్యజన్యము నగు బ్రహ్మాత్మైక్యసాక్షాత్కారము సంభవింపదు. ఆత్మసాక్షాత్కారశూన్యునకిక మోక్షానంద మెట్లు ప్రాప్తించును? ప్రాప్తించ దని యాశయము.

శంకరానందీయము:— నిత్యానిత్యవస్తువివేకవైరాగ్యములచేతను, తీవ్రముముక్షుత్వముచేతను సర్వమును సంన్యసించి రేముముక్షువులు శ్రవణమును చేయుచుందురో అట్టివారలకు ముక్తి-సమ్యగ్జ్ఞానము లేనిదే సిద్ధింపదు. సమ్యగ్జ్ఞానము సమాధి లేనిదే సిద్ధింపదు. సమాధి యింద్రియనిగ్రహము లేనిదే సిద్ధింపదు. ఇంద్రియనిగ్రహము నిశ్శేషముగ రాగమును పరిత్యజించనిదే సిద్ధింపదు. అని "యతతో హ్యపి కౌన్తేయ!" అనునది మొదలగు గ్రంథముచే రాగద్వేషపరిత్యాగమును, ఇంద్రియనిగ్రహమును, సమాధ్యనుష్ఠానమును చెప్పి. "ధ్యాయతో విషయా న్పుంసః" అనుదానిచే బహిర్ముఖుఁడగు జ్ఞానికి జ్ఞాననాశాద్యనర్థము ప్రాప్తించు నని ప్రతిపాదించి యిపు డనేకవిధముల వేదాంతములను వినియు, శిష్యులకు చెప్పియు పఠనపాఠనమాత్రముచేతనే తనను కృతార్థునిగ తలచునట్టియు, దుర్బుద్ధిచేతను, ఆలస్యముచేతను ధ్యానాదులయం దప్రవృత్తుఁడగు ముముక్షు వవశ్యము సమాధి నాచరింపవలెనని సూచించుటకు సమాధినాచరించనివాని కనర్థమును 'నాస్తి బుద్ధి రయుక్తస్య' అను శ్లోకముచే జెప్పుచుండెను.

అనేక పర్యాయములు వేదాంతశ్రవణ మొనరించియు, తీవ్రముముక్షుచే శాంతుఁడు (అంతరింద్రియనిగ్రహము కలవాఁడు) దాంతుఁడు, (బహిరింద్రియ నిగ్రహము కలవాఁడు) ఉపరతుఁడు, (విక్షేపము లేనివాఁడు) తితిక్షువు (శీతోష్ణద్వంద్వసహిష్ణువు) అయి యప్రతిబద్ధజ్ఞానసిద్ధికొఱకై యెవఁడు సమాధినాచరించఁడో అట్టి యసమాహితచిత్తునకు చిత్తప్రసాదైకలభ్యము, సర్వత్ర బ్రహ్మదర్శనరూపమునగు ప్రత్యగ్దృష్టి సంభవించదు. శ్రవణమనేకపర్యాయము లాచరించిన నట్టిశ్రవణజన్యజ్ఞానము పదవాక్యార్థవిషయకమే యగును. కాని వస్తుగోచరము కానేరదు. సూక్ష్మబుద్ధిచే నొకానొకని కట్టి జ్ఞానము జనించిన నది స్థిరముగ నుండనేర దని యర్థము.

ఈశ్లోకమున 'అయుక్తస్య' అనుపదము సమాధికవశ్యకర్తవ్యత్వద్యోతనార్థము రెండుసార్లు చెప్పఁబడెను.

"కారణాభావే కార్యాభావః" (కారణములేనిదే కార్యము జనించదు.) అను న్యాయమున సమాధిసముత్పన్న బ్రహ్మపరోక్షజ్ఞానశూన్యునకు "న చ భావనా" (దేహమునందువలె "నే నిదియే" యని స్వాత్మసాక్షాత్కృతమగుబ్రహ్మమునం దాత్మత్వాభినివేశమే భావనయనియనబడును. లేక బ్రహ్మతాదాత్మ్యప్రతిపత్తిచే(బ్రహ్మమునందే వ్యవస్థితిరూపమగు నహంబుద్ధి భావన యనంబడును.) అట్టిభావన అయుక్తునకు సంభవింపదు. నిద్రనుండి మెలకువగాంచినవాఁడెట్లు దేహమును తనముగ తలఁచునో అటులే "నేను బ్రహ్మమును. ఇతరమైనదికాను" అని యాత్మను, (తనను) బ్రహ్మమునుగ దలపనట్టియు, స్వయముగ బ్రహ్మస్వరూపముచే నుండనట్టి యతికి 'శాంతిః' అనాత్మతాదాత్మ్యతత్కార్యసంబంధాదర్శనరూపమగు శాంతి సంభవింపదు. మఱియు 'అశాంతస్య' అనాత్మశాత్మనుగను ద్వైతమును చూచునట్టివానికి నిత్యము, నిరంతరముబ్రహ్మసంబంధమగు సుఖమెటుల(ప్రాప్తించును? ప్రాప్తించదని భావము. "ఈసర్వము, నేను బ్రహ్మస్వరూపమే" అని సర్వమును, తనను బ్రహ్మముగఁజూచు యతికే బ్రహ్మనందరసానుభవము ప్రాప్తించును; కాని తద్విపరీతదర్శికెటుల సిద్ధించును? సిద్ధింపనేరదు.

లేక 'నచాభావయతశ్శాంతిః' "శ్రుతము, దృష్టము, స్పృష్టము, మతము, విజ్ఞాతము, తాను సర్వము చిద్రూపమగు బ్రహ్మమే" యనిసర్వమునకు చిన్మాత్రత్వమునునిత్యమునిరంతరము చిదాత్మకవృత్తిచే భావింపనియవిద్వాంసునకు చిదానందైకరసబ్రహ్మస్వరూపముచే నవస్థానమనెడి శాంతి సంభవింపదు. ఇట్లు విదేహముక్తిని పొందనివానికి విదేహకైవల్యసుఖ మెట్లు ప్రాప్తించును? బ్రహ్మభావమును పొందనివానికి బ్రహ్మసుఖము సిద్ధించ దని భావము.

నీలకంఠీయము:— మనస్సుతోకూడ నింద్రియములు నిగ్రహించనిచో గలుగుదోషము చెప్పఁబడెను. బుద్ధియొక్క పర్యవస్థాపనము లేనిచో నేమిదోషము ప్రాప్తించునను నాశంకను "నాస్తిబుద్ధిః" అను శ్లోకముచే దొలగించుచుండెను.

శ్రవణమననములయం దాసక్తిలేనివానికి ప్రమాణప్రమేయవిషయకాసంభావన తొలఁగకపోవుటచే బ్రహ్మాత్మైక్యనిశ్చయము సంభవింపదు. అట్టి యసమాహితచిత్తునకు మనస్సుయొక్క చాంచల్యముచే బుద్ధియొక్క చాంచల్యమువలన బ్రహ్మాకారాంతఃకరణవృత్తిప్రవాహము సంభవింపదు. ధ్యానము నాచరించనివానికి చిత్తమనవస్థితమగుటచే దుఃఖ పునశ్శ్యము సంభవించుటవలన సర్వదుఃఖోపరమము సంభవింపదు. అనుపరతదుఃఖునకు దుఃఖి యగుటవలన ప్రత్యగద్వయానందరూపమగు సుఖ మెటుల ప్రాప్తించును? ప్రాప్తించనేరదు. ఈశ్లోకమునందుగల మొదటి 'అయుక్తస్య' అనుపదము 'యుజిర్యోగే' యోగవాచక యుజ్ ధాతువువలన నిష్పన్నము. రెండవది యగు "అయుక్తస్య" అనుపదము "యుజసమాధౌ" సమాధివాచక యుజధాతువువలన నిష్పన్నము. కాన బుద్ధికి పర్యవస్థాన మావశ్యకము. ॥౬౬॥

గీ॥ ఇన్ద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే ।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయు ర్నావ మివామ్భసి ॥ ॥౬౭॥

పదవిభాగము:— ఇంద్రియాణాం– హి– చరతాం– యత్– మనః– అనువిధీయతే– తత్– అస్య– హరతి– ప్రజ్ఞాం– వాయుః– నావం– ఇవ– అంభసి । ॥౬౭॥

ప్రతిపదార్థము:— హి=ఏకారణమువలన; స్వస్వవిషయేషు=(ఈపద మధ్యాహార్యము) తమతమ విషయములయందు; చరతాం=ప్రవర్తించుచున్న; ఇంద్రియాణాం=(ఇది కర్మార్థమునందు షష్ఠి) ఇంద్రియములను; యత్=ఏ; మనః=మనస్సు; అనువిధీయతే=అనుసరించునో; తత్=ఆమనస్సు; అస్య=ఈయతియొక్క; ప్రజ్ఞాం=(ఆత్మానాత్మవివేకమువలనఁగలిగిన) తత్త్వజ్ఞానమును; అంభసి=ఉదకమునందు; వాయుః=వాయువు; నావమివ=పడవనువలె; హరతి=హరించుచున్నది. ॥౬౭॥

శాంకరభాష్యమ్:—

అయుక్తస్య కస్మా ద్బుద్ధి ర్నాస్తీ త్యుచ్యతే— ఇన్ద్రియాణా మితి । ఇన్ద్రియాణాం హి యస్మా చ్చరతాం స్వస్వవిషయేషు ప్రవర్తమానానాం యన్మనోఽనువిధీయతే అనువర్తతే తదింద్రియవిషయవికల్పనే ప్రవృత్తం మనోఽస్య యతే ర్హరతి ప్రజ్ఞా మాత్మానాత్మవివేకజాం నాశయతి । కథం? వాయు ర్నావమివామ్భ స్యుదకే జిగమిషతాం మార్గా దుద్ధృత్యోన్మార్గే యథా వాయు ర్నావం ప్రవర్తయత్యేవ మాత్మవిషయాం ప్రజ్ఞాం హృత్వా మనోవిషయ విషయాం కరోతి ॥ ॥౬౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అసమాహితాంతఃకరణున కెందుల కాత్మజ్ఞానము సంభవింప దను శంకకు సమాధానమును 'ఇన్ద్రియాణాం" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

శబ్దస్పర్శరూపరసగంధము లనెడి స్వస్వవిషయములయందు ప్రవర్తించుచున్న త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లనెడు యింద్రియముల ననుసరించి ఏమనస్సు విషయవికల్పనమునందుఁ (అనగా శ్రోత్రాదీంద్రియములకు ఏవిషయములు కలవో అట్టిశబ్దాదులను పరస్పరము విభజించుకొని గ్రహించుట విషయవికల్పనము) బ్రవర్తించునో ఆమనస్సు ఈ యతియొక్క యాత్మానాత్మవివేకమువలన జనించెడి ఆత్మతత్త్వవిషయ మగు ప్రజ్ఞను హరించి, యుదకమునందు ప్రయాణముచేసెడివారల నావను మార్గమును మరల్చి యున్మార్గమునందు (వేరొక మార్గమునందు) వాయువు ప్రవేశపెట్టునట్టుల విషయవిషయికముగ ప్రజ్ఞను జేయును. కాన నసమాహితాంతఃకరణున కాత్మతత్త్వవిషయక మగు జ్ఞానము గలుగనేరదు.

—• ౨వ అధ్యాయము– ౬౭ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— మనోజయములేనివానికి శ్రవణమననరూప వేదాంతవిచారజన్యము, ఆత్మవిషయికమునగు బుద్ధి యేకారణమువలన సంభవింపదను నాశంకను "ఇంద్రియాణాం హి చరతాం" అను శ్లోకముచేఁ దొలఁగించుచుండెను.

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"యతతో హ్యపి కౌంతేయ" (గీ2-60) "తాని సర్వాణి సంయమ్య" (గీ2-61) అను శ్లోకములచేఁ జెప్పఁబడిన విషయమే యీ "నాస్తి బుద్ధిరయుక్తస్య" (గీ2-66) "ఇన్ద్రియాణాం హి చరతాం" (గీ2-67) అను శ్లోకములచేఁ జెప్పుటచే పునరుక్తి యని శంకింపఁజనదు. "యతతో హ్యపి" అనునది మొదలు రెండుశ్లోకములచేఁ బ్రతిజ్ఞాత మగు నర్థమునందే "ధ్యాయతో విషయాన్పుంసః" అను శ్లోకముచే ననేకవిధము లగు నుపపత్తులను జెప్పి ప్రతిజ్ఞాతార్థము నీశ్లోకములచే నుపసంహరించెను. కానఁ బునరుక్తిదోషము ప్రాప్తించదు. ॥౬౭॥

స్వవిషయమందు ప్రవర్తించు ఇంద్రియములలో నేయొక యింద్రియమునైన లక్ష్యముగఁ జేసికొని మనస్సు ప్రవర్తించినచో ఆయొక్క యింద్రియమే మనస్సుచే ననుసృతమై యా సాధకునియొక్క యాత్మవిషయకము, శాస్త్రీయమునగు ప్రజ్ఞను మనస్సు విషయావిష్టమగుటవలన హరించుచున్నది. ఈవిధముగ నొకయింద్రియమే ప్రజ్ఞను హరించుచుండ సర్వేంద్రియములు ప్రజ్ఞను హరించునని యేమి చెప్పవలయును? ఇట దృష్టాంతము స్పష్టమే. వాయువున కుదకమునందే నౌకాహరణసామర్థ్యము; భూమి యందట్టి సామర్థ్యములేదని సూచించుటకు దృష్టాంతమునందు "అంభసి" అని చెప్పఁబడెను. ఇదేవిధమున దార్ష్టాంతికమునందును, జలస్థానీయమగు మనశ్చాంచల్యముండ నింద్రియమునకు ప్రజ్ఞాహరణసామర్థ్యముండును. భూస్థానీయమగు మనస్స్థైర్యముండ, నింద్రియమునకు ప్రజ్ఞాహరణసామర్థ్యము లేదని సూచితము.

శంకరానందీయము:— మేధావిచే నధీతమీమాంసాది శాస్త్రజన్యజ్ఞానము బుద్ధిచే నెట్లు సుప్రతిష్ఠిత మగునో యట్లే సూక్ష్మబుద్ధిశాలిచే ననుష్ఠింపఁబడిన శ్రవణాదులవలనఁ గలిగెడి జ్ఞానము సమాధిలేకున్నను నశింపదని శంకింపఁజనదు. ఇష్టకాచయనాదిజ్ఞాన మతిస్థూలమైనను మాటిమాటి కవలోకన కాని యాచరణ కాని లేనిదే స్పష్టముగ భాసించుట లేదు. అట్టియెడ అతిసూక్ష్మము, నింద్రియాగోచరము, ప్రమాణావిషయము, అప్రచురము, అసంస్కృతము, అనారూఢము, నశించని ప్రతిపక్షభూతమునగు నజ్ఞానముగల యాత్మజ్ఞానము సమాధి లేనిదే ప్రకాశింపదని యేమి చెప్పవలయును? కాన నట్టి యాత్మజ్ఞానప్రకాశసిద్ధినిమిత్తము ముముక్షువునకు సమాధి కర్తవ్యమని సూచించుటకు బహిఃప్రవృత్తునకు జ్ఞాననాశప్రకారమును సదృష్టాంతముగ 'ఇంద్రియాణాం హి చరతాం' అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

శ్రోత్రాదిజ్ఞానేంద్రియములు, వాగాది కర్మేంద్రియములు తమతమ విషయములయందు ప్రవర్తించుచుండ లోకవాసనలచేతను, శాస్త్రవాసనలచేతను, విషయవాసనలచేతను, కర్మవాసనలచేత నావిష్టమైన మనస్సు తత్తదిచ్ఛావంతుఁ డగు విద్వాంసునిచే స్వేచ్ఛానురూపముగఁ బ్రవర్తింపఁజేయఁబడును. అందుచే నట్టి మనస్సు వాయువు నదీజలమందు నావనుబలె స్వవాసనానురూపముగఁ బ్రవర్తించు నీవిద్వాంసుని యొక్క యాత్మానాత్మవివేకబుద్ధిని హరించుచున్నది. అనఁగా నదినుండి రెండవతీరమునుగూర్చి వెళ్ళుచున్న నావను ప్రతికూలవాయువు గొప్పసుడియందు పారవైచును. లేక జలముచే నిండించి ముంచివేయును. లేక గొప్పపాషాణముతో ఢీకొనఁజేసి భగ్నము చేయును. లేక నపారప్రదేశమును కాని, విషమస్థానమును కాని పొందించును. ఇట్లనేకవిధముల నానావ కనర్థమునే యొటులు సమకూర్చునో, ఆటులే యుత్కృష్టనికృష్టములగు ననాద్యవిద్యావాసనలచే నావిష్టమగు మనస్సు విద్వాంసునియొక్క వివేకబుద్ధిని విషయములయందు కాని, కర్మయందు కాని, యోగమునందు కాని, ఉపాసనమునందు కాని, వ్యవహారమందు కాని, మఱియొకదానియందు కాని పడవైచి ధ్వస్తము చేయునని యర్థము. ॥౬౭॥

గీ॥ తస్మా ద్యస్య మహాబాహో! నిగృహీతాని సర్వశః ।
ఇంద్రియా ణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ॥౬౮॥

పదవిభాగము:— తస్మాత్- యస్య- మహాబాహో!- నిగృహీతాని- సర్వశః- ఇన్ద్రియాణి- ఇన్ద్రియార్థేభ్యః- తస్య- ప్రజ్ఞా- ప్రతిష్ఠితా । ॥౬౮॥

ప్రతిపదార్థము:— హే మహాబాహో!=పెద్దబాహువులుగల ఓయర్జునా!: తస్మాత్=విషయములయందింద్రియముల ప్రవృత్తి దోషరూప మగుటవలన; యస్య=యెవనియొక్క; ఇన్ద్రియాణి=ఇంద్రియములు; ఇన్ద్రియార్థేభ్యః=శబ్దస్పర్శరూపరసగంధము లనెడి విషయములనుండి; నిగృహీతాని=మరలింపబడినవో; తస్య=అతనికి; ప్రజ్ఞా=ఆత్మతత్త్వసాక్షాత్కారము; ప్రతిష్ఠితా=ప్రతిష్ఠిత మగును (ప్రకర్షగ సంభవించి సుస్థిరమగును.) ॥౬౮॥

శాంకరభాష్యమ్:—

"యతోహ్యపి" (గీ 2-60) ఇత్యుపన్యస్త స్యార్థ స్యానేకధోపపత్తి ముక్త్వా తం చార్థ ముపపాద్యోపసంహరతి— తస్మాదితి । ఇంద్రియాణాం ప్రవృత్తౌ దోష ఉపపాదితో యస్మాత్- తస్మా ద్యస్య యతే ర్హేమహాబాహో! నిగృహీతాని సర్వశ స్సర్వప్రకారై ర్మానసాదిభేదై రింద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ॥౬౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"యతతో హ్యపి" అనుశ్లోకముచే నుపన్యస్తమైన యర్థమున కనేకవిధముల నుపపత్తిని జెప్పి మఱియు నాయర్థమునే "తస్మా ద్యస్య" యను శ్లోకముచే నుపపాదించి, ఉపసంహరించుచుండెను. ఇంద్రియముల ప్రవృత్తియందు దోషము చెప్పఁబడెను. ఏమనిన ? "అసమాహితమగు నంతఃకరణముచే ననుసరింపఁబడిన యింద్రియములు బలాత్కారముగ ప్రజ్ఞను హరించు" నని యింద్రియముల ప్రవృత్తియందు దోషము చెప్పఁబడుటవలన ఓయర్జునా! ఎవనియొక్క యింద్రియములు మనోగ్రాహ్యచతుర్గ్రాహ్యాదిభేదములచే ననేకవిధము లగు శబ్దస్పర్శరూపరసగంధము లనెడి విషయములనుండి మరలునో, అట్టి యతికి బ్రహ్మైక్యవిషయికమగు ప్రజ్ఞ సుప్రతిష్ఠిత మగును. కాన నాత్మజ్ఞానమును గోరెడి పురుషున కింద్రియజయ మవశ్యకర్తవ్యము).

—• ౨వ అధ్యాయము- ౬౮ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— కాన నోయర్జునా! ఎవని సర్వేంద్రియములు విషయములనుండి నిగ్రహించఁబడునో అట్టివానికి ప్రజ్ఞ ప్రతిష్ఠిత మగును. ఇట "మహాబాహో!" అని సంబోధనచే సర్వశత్రునివారణక్షముఁడ వగుటవలన నింద్రియశత్రునివారణమునందుఁగూడ నీవు సమర్థుఁడ వని సూచింపఁబడెను. ఇంద్రియసంయమము స్థితప్రజ్ఞునకు లక్షణ మనియు, ముముక్షువునకు ప్రజ్ఞాసాధన మనియు నుపసంహరింపవలసి యుండుటవలన నీశ్లోకమునందుఁగల "తస్య" అను పదముచే సిద్ధుని, సాధకుని గ్రహింపనగును.

శంకరానందీయము:— రాగద్వేషలోభమోహాదిదోషములచేతనే యింద్రియములకు విషయములఁ ప్రవృత్తి సంభవించును. అట్టి ప్రవృత్తి యున్నచో సమాధి సంభవింపకుండును. సమాధి లేమింజేసి జ్ఞానము సంభవింపదు. అందువలననే బ్రహ్మరూప మగు స్వాత్మయం దహంభావము సంభవముకాదు. అట్టి యహంభావము లేనిచో ముక్తి

గీ॥ యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః॥ ॥౬౯॥

పదవిభాగము:— యా- నిశా- సర్వభూతానాం- తస్యాం- జాగర్తి- సంయమీ- యస్యాం- జాగ్రతి- భూతాని- సా- నిశా- పశ్యతః- మునేః॥ ॥౬౯॥

ప్రతిపదార్థము:— సర్వభూతానాం=నిఖిలప్రాణులకు; యా=ఏయాత్మతత్త్వమును; నిశా=రాత్రివంటిదై నిశ యగుచున్నదో; తస్యాం=ఆయాత్మతత్త్వమునందు; సంయమీ=జితేంద్రియుండగుయోగి; జాగర్తి=మేలుకొనును; యస్యాం=ఏయవిద్యయను రాత్రియందు; భూతాని=నిఖిలప్రాణులు; జాగ్రతి=(నిద్రించుచునే) మెలకువగనున్నవో; పశ్యతః=ఆత్మజ్ఞానముకల; మునేః=జితేంద్రియుండగు యోగికి; సా=ఆయవిద్యయను రాత్రి; నిశా=నిశాప్రాయమగుచున్నది. ॥౬౯॥

---

శాంకరభాష్యమ్:—

(1) సోఽయం లౌకికో వైదికశ్చ వ్యవహార స్స ఉత్పన్నవివేకజ్ఞానస్య స్థితప్రజ్ఞ స్యావిద్యాకార్యత్వా దవిద్యానివృత్తౌ నివర్తతే। అవిద్యాయాశ్చ విద్యావిరోధా న్నివృత్తి రిత్యేత మర్థం స్ఫుటీకుర్వ న్నాహ— యా నిశేతి। యా నిశా రాత్రి స్సర్వపదార్థానా మవివేకకారీ తమ స్స్వభావత్వా త్సర్వేషాం భూతానాం సర్వభూతానాం కిం త్పరమార్థతత్త్వం స్థితప్రజ్ఞస్య విషయః। యథా నక్తంచరాణా మహా రేవ స దన్యేషాం నిశా భవతి, తద్వ న్నక్తంచరస్థానీ

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(1) జనించిన వివేకజ్ఞానముకల స్థితప్రజ్ఞున కవిద్య తొలఁగ నవిద్యాకార్య మగు లౌకిక వైదికవ్యవహారములు గూడ నివర్తించును. విద్యతో విరోధము గల దగుటచే నవిద్య విద్యవలన నివర్తించును. అను నీవిషయమును స్పష్టముచేయుచు బాహ్యకరణములకును, అభ్యంతరకరణములకు నేకకాలమునందు పరాగ్రూపము లగు విషయములయందును, ప్రత్యగ్రూప మగు నాత్మయందు నొకసారి ప్రవృత్తిగలుగుట యెట్లు సంభవింపదో యటులనే పరాగ్రూపము లగు విషయములయొక్క జ్ఞానము అనాదియు, ఆత్మావరణము నగు నవిద్యయొక్క కార్య మగుటంజేసి యాత్మదర్శన మవిద్యానివర్తక మగును. అందుచే విషయవిజ్ఞానాత్మదర్శనము లొకసారి సంభవ

---

సంభవము కాదు. ముక్తిలేవందున సుఖము సంభవింపదు. ఇంద్రియనిగ్రహ మొనరించక రాగద్వేషములచే బహిః ప్రవృత్తుఁడగువాఁడు జ్ఞానియైనను వానికి ననర్థపరంపర సంభవించును. కాన నింద్రియసముదాయమును రాగద్వేషాదులతో వియోగ మొనరించి లెస్సగ నిగ్రహించి ముముక్షు వగు యతి విదేహముక్తికొఱకు సమాధి ననుష్ఠింపవలయు నని సూచించుటకు "తస్మాత్" అని చెప్ప మొదలిడెను. ॥౬౮॥

—• ౨వ అధ్యాయము- ౬౯ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఈవిధమున ప్రజ్ఞాస్థైర్యమునకై ముముక్షువు ఇంద్రియసంయము ప్రయత్నపూర్వకముగఁ జేయఁదగిన దని చెప్పఁబడెను. స్థితప్రజ్ఞున కన్నను సర్వేంద్రియసంయము స్వతస్సిద్ధమే యని "యా నిశా" అను శ్లోకముచే జెప్పుచుండెను.

శాంకరభాష్యమ్:—

యానా మజ్ఞానాం సర్వభూతానాం నిశేవ నిశా పరమార్థతత్త్వ మగోచరత్వా దతద్బుద్ధీనాం। తస్యాం పరమార్థతత్త్వలక్షణాయా మజ్ఞాననిద్రాయాః ప్రబుద్ధో జాగర్తి సంయమీ సంయమవా న్జితేన్ద్రియో యోగీత్యర్థః।

(2) యస్యాం గ్రాహ్యగ్రాహకభేదలక్షణాయా మవిద్యానిశాయాం ప్రసుప్తాన్యేవ భూతాని జాగ్రతీ త్యుచ్యతే యస్యాం నిశాయాం ప్రసుప్తా ఇవ స్వప్నదృశ స్సా నిశా అవిద్యారూపత్వా త్పరమార్థతత్త్వం పశ్యతో మునేః। అతః కర్మా ణ్యవిద్యావస్థాయా మేవ చోద్యంతే న విద్యావస్థాయామ్। విద్యాయాం హి సముదితే సవితరి శార్వర మివ తమః ప్రణాశ ముప

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ములు కా నేరవు. అందువలన నాత్మజ్ఞానమునిమిత్త మింద్రియములను విషయములయందుఁ బ్రవేశించకుండ నిగ్రహించవలె నని ఈశ్లోకముచేఁ జెప్పుచున్నాఁడు.

ఏది తమస్స్వభావము కల దగుటచే సర్వప్రాణులకు సర్వపదార్థావివేకకారియై రాత్రి యగుచున్నదో. అదిఏదనిన; స్థితప్రజ్ఞునకు విషయమగు పరమార్థతత్త్వము. అట్టిపరమార్థతత్త్వము ప్రకాశస్వభావము కలదిగదా! అట్టి పరమార్థతత్త్వము అజ్ఞుల కెట్టుల నిశ యగును? అనిన ఇతరులకు పగలుగా నైన కాలము నక్తంచరుల (గుడ్లగూబల) కెట్టుల రాత్రి యగునో అట్టులనే ఆత్మజ్ఞానశూన్యుల కగోచర మగుటంజేసి నక్తంచరస్థానీయులు, అజ్ఞులు నగు సర్వభూతములకు పరమార్థతత్త్వము రాత్రివంటిదిగాన నిశ యనఁబడును. అట్టి పరమార్థతత్త్వరూపమగు నిశయం దజ్ఞాననిద్రనుండి జితేంద్రియుఁ డగు జ్ఞాని మెలకువ గాంచుచుండును.

(2) గ్రాహ్య మనియు, గ్రాహక మనియు భేదముగల ఏయవిద్య యనెడి నిశయందు నిద్రించుచునే యున్నట్టి సర్వభూతములు మేలుకొనుచున్నవని చెప్పఁబడుచున్నవో, (ఏయవిద్యానిశయందు నిద్రించువారువలె స్వప్నదృక్కు లగుచుండిరో) అట్టి ద్వైతావస్థ అవిద్యారూపమగుటంజేసి పరమార్థతత్త్వమును తెలిసికొనినట్టియు, నివృత్తమగు యవిద్యకలిగినట్టి సంన్యాసికి

వేదాంతవాక్యజనితసాక్షాత్కారరూప మగు "అహం బ్రహ్మాస్మి" అనెడి ప్రజ్ఞ అజ్ఞులకప్రకాశరూప మగుటచే రాత్రివంటి దగును. అట్టి బ్రహ్మవిద్యాస్వరూప మగు సర్వభూతనిశయం దింద్రియసంయమముగల స్థితప్రజ్ఞుఁ డజ్ఞాననిద్రనుండి మెలఁకువగాంచి సావధానుఁడై యుండును. ఏనిశయందు ద్వైతదర్శనస్వరూప మగు నవిద్యానిద్రయందు నిద్రించునట్టి భూతములు స్వప్నమునందువలె వ్యవహరించుచున్నవో యాద్వైతదర్శనరూప మగు నవిద్యానిద్ర "సా నిశా" యపరోక్షముగ నాత్మతత్త్వమును తెలిసికొనిన స్థితప్రజ్ఞునకు ప్రకాశించదు. భ్రమ యనునది బాధపర్యంత ముండుటవలన నెంతవరకు మెలఁకువగాంచఁడో అంతవరకే స్వప్నదర్శనము. తత్త్వజ్ఞానకాలమం దన్నదో భ్రమనిమిత్త మగు నేవ్యవహారము సంభవింపదు. ఈవిషయమునే వార్తికకారులు "కారకవ్యవహారే హి శుద్ధం వస్తు న వీక్ష్యతే। శుద్ధే వస్తుని సిద్ధే చ కారకవ్యాపృతి స్తథా॥ కాకోలూకనిశేవాయం సంసారోఽజ్ఞాత్మవేదినోః। యా నిశా సర్వభూతానా మిత్యవోచ త్స్వయం హరిః॥" (ఈకార్యము చేయఁ

శాంకరభాష్యమ్:—

గచ్ఛత్యవిద్యా। ప్రాగ్విద్యోత్పత్తే రవిద్యా ప్రమాణబుద్ధ్యా గృహ్యమాణా క్రియాకారకఫలభేదరూపా సతీ సర్వకర్మహేతుత్వం ప్రతిపద్యతే। నాప్రమాణబుద్ధ్యా గృహ్యమాణాయాః కర్మహేతుత్వోపపత్తిః। ప్రమాణభూతేన వేదేన మమ చోదితం కర్తవ్యం కర్మేతి కర్మణి కర్తా ప్రవర్తతే నాఽవిద్యామాత్ర మిదం సర్వం నిశేవేతి।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నిశయే (రాత్రియే) యగుచున్నది అనగా నజ్ఞానికి పరమార్థావస్థ నిశ (రాత్రి) వంటిది. జ్ఞానికి ద్వైతావస్థ నిశవంటిదని యాశయము కాన అవిద్యావస్థయందు క్రియాకారకఫలభేదములు భాసించుటవలన నాయవస్థయందే కర్మలు విధింపబడుచున్నవి. విద్యచే నవిద్య తొలగినను బాధితానువృత్తిచే బాధితమగు నవిద్య తిరుగ ననువృత్తమగుటచే క్రియాకారకఫలభేదప్రతీతి కలుగును. అట్టి భేదప్రతీతివలన విద్వాంసునకు కర్మ లెందుకు సంభవింపకూడ దని శంకింపఁజనదు, బాధితమగు నవిద్య తిరుగననువృత్తమై క్రియాకారకఫలభేదప్రతీతి గలిగినను అట్టి భేదప్రతీతి యందభినివేశము లేమింజేసి విద్యావస్థయందు కర్మలు సంభవింపవు

సూర్యో డుదయించినపిమ్మట రాత్రియందుండు తమస్సు నశించునటుల విద్యోదయ మయినపిమ్మట యవిద్య నశించును. విద్యోదయమునకు పూర్వమునందు బాధకము లేమింజేసి యవిద్య బాధింపబడనిదై, క్రియాకారకాదిభేదస్వరూపమై ప్రమాణానురూప మగు బుద్ధిచే గ్రహింపబడి క్రియాకారకాదిభేదాభిమానికి కర్మహేతు వగుటంజేసి సర్వకర్మ హేతు వగును. కాని యాయవిద్య—జ్ఞానోదయానంతరమున నప్రమాణబుద్ధిచే గృహ్యమాణమై కర్మహేతువు కానేరదు. "నేను ప్రమాణభూత మగు వేదముచే విధింపబడిన కర్మ చేయుదగును." అనికదా కర్మయందు కామియగు కర్త ప్రవర్తించును. నిఖిలజగ మవిద్యామాత్రస్వరూపము నిశ వంటి దను వాఁడు కర్మయందు ప్రవర్తింపడు.

బడినది. నేను చేయువాఁడనను నెడి కర్తృకర్మ కారకవ్యవహార ముండునంతవరకు శుద్ధమగువస్తువు చూడఁబడదు. శుద్ధవస్తువును తెలిసికొనినపిమ్మట కర్తృకర్మ కారకవ్యవహారముండదు. కాకోలూకనిశవలె నీసంసారమజ్ఞానికిని, యాత్మతత్త్వమును దెలిసికొనినవానికిని ఉండును. ఈవిషయమునే శ్రీహరి స్వయముగ గీతలయందు "యానిశా సర్వభూతానాం" అని చెప్పెను.) అనిచెప్పెను. ఎవఁడు వస్తుదర్శియో వాఁడు విపరీతదర్శి కాఁడు. ఏమన? ఎవనికి వస్తుయాథాత్మ్యదర్శనముండునో యట్టివానికి- విపరీతదర్శన కారణమగు వస్త్వజ్ఞానము వస్తుదర్శనముచే బాధితమగుటవలన విపరీతదర్శనము సంభవింపదు. "యత్ర వా అన్య దివ స్యాత్తత్రాఽన్యోఽన్య త్పశ్యేత్। యత్రత్వస్య సర్వ మాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్" (ఏయవస్థయందన్యమువలెభాసించునో యాయవస్థ యం దితరు డితరమునుచూచును. ఏయవస్థయం దీసాధకునకు సర్వ మాత్మస్వరూపముగనే భాసించునో యాయవస్థయం దేకరణముచే నేవిషయమును చూచును? ఏవిషయమును చూడఁడు) అని శ్రుతిగూడ విద్యావిద్యలకు వ్యవస్థను చెప్పుచున్నది. రాత్ర్యంధమగు కాకముయొక్క- పగలు- దివాంధమగు గుడ్లగూబకు రాత్రి యగును.

శాంకరభాష్యమ్:—

(౪) యస్య పున ర్నిశే వావిద్యామాత్రమిదం సర్వం భేదజాత మితి జ్ఞానం, తస్యాత్మజ్ఞస్య సర్వకర్మసంన్యాస ఏవాధికారో న ప్రవృత్తౌ । తథా చ దర్శయిష్యతి—'తద్బుద్ధయ స్తదాత్మానః' (గీ 5-17) ఇత్యాదినా జ్ఞాననిష్ఠాయా మేవ తస్యాధికారః । తత్రాపి ప్రవర్తకప్రమాణాభావే ప్రవృత్త్యనుపపత్తి రితిచే న్న, స్వాత్మవిషయత్వా దాత్మజ్ఞానస్య । న హ్యాత్మనస్స్వాత్మని ప్రవర్తకప్రమాణాపేక్షతాఽఽత్మత్వాదేవ తదన్యత్వా చ్చ సర్వప్రమాణానాం ప్రమాణత్వస్య । న హ్యాత్మస్వరూపాధిగమే సతి పునః ప్రమాణప్రమేయవ్యవహారస్సంభవతి । ప్రమాతృత్వం హ్యాత్మనో నివర్తయ త్యంతం ప్రమాణం నివర్తయ దేవ చాప్రమాణీభవతి స్వప్న కాలప్రమాణ మివ ప్రబోధే । లోకే చ వస్త్వధిగమే ప్రవృత్తిహేతుత్వాదర్శనా త్ప్రమాణస్య । తస్మా న్నాత్మవిదః కర్మ ణ్యధికార ఇతి సిద్ధమ్ ॥ ॥౬౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(౪) విద్వాంసునకు కర్మయం దధికారము లేనిచో మఱి దేనియం దధికారము కలదనెదవా? ఎవని కవిద్యామాత్రస్వరూప మగు నీభేదజాతమంతయు "నిశ వంటిది" అని జ్ఞానము కలదో అట్టి యాత్మజ్ఞానికి సర్వకర్మసంన్యాసమునందే యధికారముకాని, ప్రవృత్తి (కర్మ) యం దధికారము లేదు. ఈవిషయమునే "తద్బుద్ధయ స్తదాత్మానః" ఇత్యాదికముచే జ్ఞానికి జ్ఞాననిష్ఠయందే యధికార మని శ్రీకృష్ణపరమాత్మ చెప్పఁగలడు.

ప్రవర్తక మగు ప్రమాణము విధికదా! అట్టివిధి లేనియెడల కర్మయందువలె విద్వాంసునకు జ్ఞాననిష్ఠయందుఁ గూడ ప్రవృత్తి కలుగనేరదు. కాన జ్ఞానికూడ విధి ననుసరింపవలయు ననెదవా? అట్లుకాదు. (1) ఆత్మజ్ఞానము విధి నపేక్షించు ననెదవా? (2) ఆత్మ విధి నపేక్షించు ననెదవా? ఆత్మజ్ఞానము స్వరూపమే (ఆత్మయే) విషయముగా గల దగుటవలన ప్రమాణప్రమేయాదుల ననుసరించి జనించుటచే విధి నపేక్షింపదు. కాన మొదటిపక్షము సంభవింపదు. ఆత్మ స్వరూప మగుటంజేసి స్వస్వరూపమునం దాత్మకు ప్రవర్తకప్రమాణ మగు విధియొక్క యపేక్ష సంభవింపదు. కాన ఆత్మ విధి నపేక్షించు నను ద్వితీయపక్షము కూడ సంభవింపదు. అందువలన జ్ఞానికూడ (విధి విధాయక "లిజ్ లోట్" తవ్యప్రత్యయరూపవిధి) ననుసరించవలె నను శంక తొలఁగెను. ఆత్మ, ఆత్మజ్ఞానములు విధి నపేక్షింపకున్నను ప్రమాణప్రమేయముల వ్యవహారనియమమునిమిత్తము జ్ఞానికి విధ్యపేక్ష కలదని శంకింపఁజనదు. ఆత్మ విధికంటె భిన్న మగుటంజేసి సర్వప్రమాణములయొక్క ప్రామాణ్య మాత్మజ్ఞానోదయమే యంతముగాఁ గల

రాత్రులయందు చూచు గడ్లగూబయొక్క పగలు రాత్ర్యంధ మగు కాకమునకు రాత్రి యగును. అని పైవిషయమునకు దృష్టాంతము. కాన నవిద్యవలనఁ బ్రాప్తించెడి క్రియాకారకాదివ్యవహారము తత్త్వదర్శి కెటుల ప్రాప్తించును? ప్రాప్తించనేరదు. అందువలన స్థితప్రజ్ఞున కింద్రియసంయమము స్వతస్సిద్ధ మగు నని యర్థము.

శాంకరభాష్యతత్త్వబోధిని:—

దగుటవలన నాత్మజ్ఞానము కలిగినపిమ్మట ప్రమాణప్రమేయవ్యవహారమున కవకాశము లేమిం జేసి యట్టి ప్రమాణప్రమేయవ్యవహారనియమమునిమిత్త మాత్మజ్ఞానికి విధి సంభవింపదు.

ఆత్మస్వరూపజ్ఞానము కలిగినపిమ్మట తిరిగి ప్రమాణప్రమేయవ్యవహారమే సంభవింపదు. అంత్యప్రమాణ మాత్మకు ప్రమాతృత్వమును నివర్తింపజేయును. ప్రమాతృత్వ మాత్మకు తొలగినచో నద్వైతజ్ఞానమున కెటులు ప్రామాణ్యము సంభవించు ననెదవా? ఆత్మజ్ఞాన మాత్మకు ప్రమాతృత్వమును నివర్తింపజేయుచు, తాను నివృత్తమై (జాగ్రదవస్థయందు స్వప్నకాల ప్రమాణ మప్రమాణ మగునటుల) అప్రమాణ మగును. మఱియు వ్యవహారమునందు ప్రమాణము వస్తునిశ్చయరూపఫలము ప్రాప్తించినపిదప ప్రవర్తకమగు విధి నపేక్షింపనందున రజ్జుజ్ఞానమువలె నద్వైతజ్ఞానముకూడ ప్రమాణ మగుటంజేసి విధిని యపేక్షింపకుండును. కాన జ్ఞాననిష్ఠ విధిలేనిదె జ్ఞానమాహాత్మ్యముచేతనే ప్రాప్తించుచుండుటవలన నాత్మజ్ఞానికి కర్మసంన్యాసమునందే యధికారము కాని కర్మలయం దధికారము లేదని సిద్ధించుచున్నది. ॥౬౯॥

శంకరానందీయము:— అనేక శతసహస్రజన్మములయం దాచరించబడిన సుకృతముయొక్క పరిపాకముచే సంపూర్ణశ్రీత్యాచార్యేశ్వర ప్రసాదమును బొందిన యెవనికి సమాధిచే “నీనిఖిలప్రపంచము, నేను బ్రహ్మస్వరూపమే” అనెడి యప్రతిబద్ధ మగు బ్రహ్మపరోక్షజ్ఞానము కలుగునో; మహాత్ముఁడగునట్టి స్థితప్రజ్ఞునకు— ప్రబుద్ధునకు స్వప్నవ్యవహారము నివర్తించినట్లు “నేను, నాసంబంధమైనది” అనెడి లౌకికము, వైదికము నగు వ్యవహారము నిశ్శేషముగ నివర్తించును. నిద్రవలె నవిద్య నిశ్శేషముగ నశించుటచే దత్కార్యములగు నిఖిలవ్యవహారములు నిశ్శేషముగ నివర్తించును. కాన నిద్రనుండి మెలఁకువగాంచినవానివలె నవిద్యానిద్రనుండి మెలఁకువగాంచిన జీవన్ముక్తుఁడగు బ్రహ్మవేత్త బ్రహ్మమునందె క్రీడించును. మరియొకస్థలమునందు క్రీడించడని “యా నిశా” అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

ప్రాచీనకర్మఫలభోగమునకై మాటిమాటికి జన్మించు ప్రాణులు భూతములనఁబడును. స్థితప్రజ్ఞవ్యతిరిక్తమగునట్టి నిఖిలభూతములకు “తేజఃపరస్యాం దేవతాయాం” అను శ్రుత్యుక్తయు, సర్వప్రమాణాగోచరయు, నిర్విశేషయు, సత్తామాత్రయునగు నేపరదేవత నిశ (రాత్రి) వంటిదగుచున్నదో; అనగా రాత్రి సర్వవ్యాపకమగుటచే దృష్టిప్రశరించుటకు శక్యము కానందున సర్వపదార్థములకు స్వ(రాత్రి) మాత్ర త్వాపాదనచే మనుష్యాదులకు వ్యవహరించుటకు (రాత్రి) ఏవిధమున శక్యము కాదో; అట్లే యీపరదేవతయు సర్వవ్యాపకత్వాదిధర్మములచే వ్యవహరించుటకు శక్యము కానందున సర్వభూతములకు నిశ యనఁబడును. ‘శం సుఖం నితరాం సుఖరూపత్వా న్నిశా’ అత్యంతము సుఖరూప మగుటచే పరదేవత నిశ యనఁబడును. అట్టి పరదేవతాస్వరూపము, ఆనందఘనము నగు పరమాత్మయందు— స్వయముగ నవిద్యాప్రబుద్ధుడై, బహిఃప్రవృత్తినివృత్త సకలేంద్రియములుకల యొక బ్రహ్మవేత్తయే మెలఁకువ గాంచును. ఆపరబ్రహ్మమునందే క్రీడించుచుండును; ఆనందించును. ఇతరులు నిద్రించుచుందురు. అనగా శ్రుతవేదాంతులైనను వారు నిద్రించినవారువలె పరబ్రహ్మస్వరూపము నించుకంతైనను తెలిసికొనలేరు. ద్రష్టృదర్శనదృశ్యాదిభేదముగల యేయవిద్యానిద్రయందు భూతములు “జాగ్రతి” “నేను; నాకిది యిష్టము; ఇది యనిష్టము; ఇది చేయఁదగినది” అని వ్యవహరించుచున్నవో; యట్టి యవిద్యారూపద్వైతభూమి— ద్రష్టను, దర్శనమును, దృశ్యమును, సర్వమును ప్రత్యగ్దృష్టిచే బ్రహ్మమునుగఁ దెలిసికొనిన బ్రహ్మనిష్ఠునకు నిశ

యగును. అనగా నెట్లు రాత్రియందు ప్రాణులు వ్యవహరించరో; యట్లే యీస్థితప్రజ్ఞుఁడు నవిద్యానిశయందు 'అహం, మమ' (నేను, నాసంబంధమైనది) అని వ్యవహరించఁడు. 'అహం, మమ' అనెడి జ్ఞానములకు హేతువులగు ననాద్యవిద్యావాసనలు నిశ్శేషముగ నశించుటచే బ్రహ్మాకార మగు తద్బుద్ధి ప్రవేశించుటకు శక్యము కానందున "అహం, మమేదం" అను ప్రాకృతవ్యవహారమును స్థితప్రజ్ఞుఁడు చేయఁడు. ఇట్టి లక్షణములుకల స్థితప్రజ్ఞునకు వైదికవ్యవహార మెట్లు సిద్ధించును? సిద్ధించదనియే యభిప్రాయము.

లేక—'అధీహి భగవో బ్రహ్మవిద్యాం వరిష్ఠాం' ఇత్యాది శ్రుతిప్రసిద్ధ మగు బ్రహ్మవిద్య తాను స్వయముగ చిదాకృతిచే సూర్యప్రభవలె ప్రకాశరూపమైనను సమ్యగ్దృష్టివిహీనులకు రాత్రివలె నగును. కాన నావిద్య సర్వప్రాణులకు నిశ యనఁబడును. ఎట్లు ప్రసిద్ధనిశ—తనసంబంధ మగు తమశ్శక్తిచే నామరూపభేదమును తొలఁగించి నిఖిలవస్తుజాతమును తమోమాత్ర మొనరించి స్వయముగ నంతటను విజృంభించునో; అట్లే యీబ్రహ్మవిద్యయు స్వకీయచిచ్ఛక్తిచే నామరూపభేదమును పోఁగొట్టి నిఖిలదృశ్యజాతమును చిన్మాత్రస్వరూప మొనరించి తానొక్కటియే యంతట విజృంభించును. నిశయందువలె నీబ్రహ్మవిద్యయం దజ్ఞులు, తద్దృష్టులు త్రిగుణస్థానరూపస్వప్నములను చూచువారై నిద్రించుచుండిరో; అట్టి బ్రహ్మవిద్యయందు బహిఃప్రవృత్తిశూన్యుఁ డగు స్థితప్రజ్ఞుఁడు మేలుకొనగాంచును. అనఁగా నాత్మరతుఁడై, ఆత్మయందే క్రీడకలవాఁడై, ఆత్మధనుఁడై, ఆత్మజ్యోతి కలవాఁడై, ఆత్మానందముకలవాఁడై సర్వదా యుండును. ఏయవిద్యయందు సర్వభూతములు "నీవు, నేను, ఇది, అది" అని వ్యవహరించునో అట్టి యవిద్యారూప మగు ద్వైతావస్థ—"ద్రష్టృదర్శనదృశ్యములు మిథ్య" యని తెలిసికొనిన బ్రహ్మవేత్తకు నిశ యగును. ఎట్లజ్ఞానులగు ప్రాణులకు బ్రహ్మవిద్య నిశ యగునో, యట్లే బ్రహ్మవేత్తకవిద్యయు నిశ యగును. బ్రహ్మవిద్యచే "నేను బ్రహ్మస్వరూపము" అని తనను అనంద్వైకరసముగను, పరిపూర్ణముగను విషయ మొనరించుకొనుట కెట్లజ్ఞులు సమర్థులు కారో, యట్లే యీబ్రహ్మవేత్తయు— "నేను, ఇది నాసంబంధమైనది" అని దేహేంద్రియాదికము నవిద్యచే విషయ మొనరించుకొనుటకు సమర్థుఁడు కాఁడు. కనుకనే యీబ్రహ్మవేత్తకు యోగ్యత లేనందున లౌకికవైదికకర్మలయం దధికారము లేదు. దేహమునందు, తదాశ్రితవర్ణజాత్యాదులయందు అభిమానము, ఫలార్థిత్వము, "నాకిది కర్తవ్య మిది యకర్తవ్య" మను క్రియలయం దగు గుణదోషదర్శన మెవనికి కలదో; వానికే కర్మములయందు యోగ్యత కన్పట్టుచున్నది. ఎంఁడిట్టి లక్షణశూన్యుఁడో వానికి కర్మములయందు యోగ్యత లేదు. నిత్యనిరంతరసమాధినిష్ఠచే నిరూఢవిజ్ఞానబలమున నవిద్యను, నాధ్యాసిక మగు తత్కార్యమును నిర్మూలించి బ్రహ్మతాదాత్మ్యమును పొంది "నేను బ్రహ్మస్వరూపమునే" అని సర్వదా బ్రహ్మమునందే బ్రహ్మత్వముగ నుండు విద్వాంసునకుఁ దిరిగి శరీరతాదాత్మ్యభ్రాంతి కాని, అశరీరమునందు "అహం మమ" అను నభిమానము కాని సంభవింపదు. అట్టి యభిమానము సంభవింపనపు డాశరీరమునం దారోపితవర్ణజాత్యాద్యభిమానము సిద్ధింపదు. అట్టి యభిమానము సిద్ధించనిచో సర్వమును మిథ్య యని తెలిసికొనినవానికి ఫలమునందు కోరిక యుండదు. క్రియలయందు గుణదోషదర్శనము సిద్ధింపదు. ఇట్లైనచో సర్వమిథ్యాత్వదర్శనమునకు, ప్రవృత్తికి పరస్పరవిరోధ ముండుటవలనను, ఏకాధికరణత్వము సంభవింపనందున విద్వాంసునకుఁ గర్మమునం దధికార ముపపన్నము కాదు. వస్తుసత్యత్వనిశ్చయపూర్వక మైనది ప్రవృత్తి. వస్తువుయెడ భ్రమకల్పితత్వనిశ్చయధీమూలక మైనది సర్వమిథ్యాత్వజ్ఞానము. కాన నారెంటికి పరస్పరవిరుద్ధత్వము, ఏకాధికరణత్వానుపపత్తియు సంభవించును.

'కర్తయు, కరణము, కార్యము, సర్వము మిథ్య' అని నిశ్చయముకల విద్వాంసుఁడు కర్మము నాచరించుఁగాక. అట్టికర్మము మిథ్యాత్వపురస్సరముగ నాచరింపఁబడినది కాన బంధకము కానేరదని శంకింపఁజనదు. "ఇది జలము కాదు; మరుప్రదేశము" అని జలమిథ్యాత్వదర్శి తృషితుఁడైనను, వానికి ప్రవృత్తి కనుపించుటలేదు. కాన

మిథ్యాత్వజ్ఞానము ప్రవృత్తికి విరుద్ధము. అందుచే 'నారోపిత మగు సర్పము మిథ్య' అని యారోపితాధిష్ఠాన మగు బ్రహ్మమునే యంతట చూచుచున్నవానికిఁ బ్రవృత్తి సంభవింపదని యేమి చెప్పఁబడియును? ప్రవృత్తి యొంతమాత్ర మట్టివానికి సంభవింపదు. కాన నవిద్యావంతునకే కర్మములయం దధికారము, విద్యకు నవిద్యాతత్కార్యములకు విరోధమువలన విద్వాంసునకు కర్మలయం దధికారము లేదు. తేజస్సునందు తమస్సు, తత్కార్య ముండనటుల విద్యావంతునియం దవిద్యాతత్కార్యము లుండనేరవు. కాన విధియు, విధానము, విధేయము, విధాత, సర్వ మావిద్యక మని తెలిసికొనిన బ్రహ్మవిత్తునకు సత్స్వరూపముచే నవస్థానమును విడిచి మఱియొక కర్తవ్యము లేదని సిద్ధము.

భాష్యోత్కర్షదీపిక:— ఈవిధమున స్థితప్రజ్ఞలక్షణవర్ణనద్వారమున ముముక్షువులు స్థితప్రజ్ఞత్వము కొఱకు సమస్తేంద్రియనిగ్రహము చేయఁదగు నని బోధింపఁబడెను. ఇక వివేకజ్ఞానముకల స్థితప్రజ్ఞునకు సమస్తేంద్రియనిగ్రహము స్వతస్సిద్ధమైనదే. అను నీవిషయమును చెప్పఁదలచి యవిద్యావస్థయందే కర్మములు విధింపఁబడుచున్నవి, కాని విద్యావస్థయందు విధింపఁబడుటలేదని ద్యోతనముచేయుటకు "యా నిశా" అని చెప్పుచుండెను.

ఉలూక (గుడ్లగూబ) స్థానీయ మగు సర్వభూతముల కేది నిశవంటిదై నిశ యగుచున్నదో, అట్టి పరమార్థతత్త్వమునం దజ్ఞాననిద్రనుండి మేల్కొనినవాఁడైన జ్ఞానయోగి యగు స్థితప్రజ్ఞుఁడు మేలుకొనియుండును. గ్రాహ్యగ్రాహకస్వరూప మగు నేయవిద్యయందు భూతములు మేలుకొనునో యది పరమార్థతత్త్వమును దెలిసికొనిన మునికి రాత్రివంటి దని యర్థము.

పరమార్థప్రపా:— విషయపరావృత్తము లగు నింద్రియములు కలవానిస్థితిని "యా నిశా" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

సర్వభూతము లాత్మను తెలిసికొనఁజాలనందున నాత్మవిషయకాజ్ఞానము— గుడ్లగూబకు పగలు రాత్రి యగునటుల సర్వభూతములకు రాత్రి యగును. అట్టి రాత్రియందు విషయవ్యావృత్తేంద్రియుఁ డగు యోగి "జాగర్తి" మేల్కొనినవాఁడైయుండును. ఏజాగ్రదవస్థయందు నిఖిలభూతములు వ్యవహరించుచుండెనో యది యాత్మదృష్టికల మునికి దానియందు వ్యవహారము లేమింజేసి నిశ యగుచున్నది. ఈవిషయమే "ఆత్మా న హి స్ఫురతి సర్వశరీరభాజాం, తేషాం నిశా భవతి సా ఖలు తత్ర యోగీ। జాగర్తి జాగ్రతి చ తే వ్యవహారజాతే, తన్న స్ఫురత్యగుధియః క్షణదాస్య సా తే॥" అని స్పష్టముగఁ జెప్పబడెను. ఇట్లు సకలేంద్రియపరావృత్తత్వమే స్థితప్రజ్ఞలక్షణ మని యర్థము.

లేక, సర్వప్రాణులకు సకలేంద్రియోపరతిరూప మగు నేసుషుప్తి కలదో యట్టి సుషుప్తియం దాత్మాకారాంతఃకరణవృత్తి యున్నను సర్వప్రాణు లాత్మను తెలిసికొనుటలేదు. తుర్యావస్థాపరిణత మగునట్టి సుషుప్తియం దాత్మనిష్ఠుఁ డగు పురుషుఁడు సుఖానుభవము కలవాఁ డగును. ఈవిషయమునే 'ద్వైతం హ్యేత న్మిథునం పరమోహ్యేష ఆనంద స్తస్మా దేవంవి త్స్వప్యా ల్లోక్యం హ్యేత ఏవం తదేవ తే మిథునేన ప్రియేణ ధామ్నా సమర్ధయతి' అను శ్రుతికూడ బోధించుచున్నది. మఱియు వాసిష్ఠమునందుగూడ "నిద్రాదౌ జాగరస్యాన్తే యో భావ ఉపపద్యతే। తం భావం భావయ న్సాక్షా దద్వయానంద మశ్నుతే" (ఎవనికి నిద్రాది యగు జాగరాంతమునం దేభావము జనించునో యాభావమునే భావించుచు వాఁ డద్వయానందమును సాక్షాత్తు పొందును.) అని చెప్పఁబడెను. ఏజాగ్రదవస్థయందు నిఖిలభూతములు స్వవ్యాపారము నాచరించునో యది— వ్యవహారదృష్టిలేని యాత్మద్రష్టకు దృశ్యప్రపంచముయొక్క స్ఫూర్తి లేమింజేసి నిశ యగును.

గీ॥ ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం సముద్ర మాపః ప్రవిశన్తి యద్వత్ ।
తద్వ త్కామా యం ప్రవిశన్తి సర్వే స శాన్తి మాప్నోతి న కామకామీ ॥ ॥౭౦॥

పదవిభాగము:— ఆపూర్యమాణం- అచలప్రతిష్ఠం- సముద్రం- ఆపః- ప్రవిశన్తి- యద్వత్- తద్వత్- కామాః- యం- ప్రవిశంతి- సర్వే- సః- శాన్తిం- ఆప్నోతి- న- కామకామీ । ॥౭౦॥

ప్రతిపదార్థము:— యద్వత్=ఏవిధముగ; అద్భిః=(ఈపద మధ్యాహార్యము) ఉదకములచేత; ఆపూర్యమాణం=అంతటపూరింపఁబడుచుండినను, అచలప్రతిష్ఠం, అచల=చలనరహితమగు; ప్రతిష్ఠం=స్థితిగల; సముద్రం=సముద్రమును; ఆపః=ఉదకములు; ప్రవిశంతి=ప్రవేశించుచున్నవో; తద్వత్=అవిధముగనే; సర్వే=నిఖిలమగు; కామాః=కోరికలు; యం=ఏయాత్మజ్ఞానిని; ప్రవిశంతి=ప్రవేశించుచున్నవో; సః=ఆయాత్మజ్ఞాని; శాంతిం=మోక్షమును; ఆప్నోతి=పొందుచుండెను; కామకామీ, కామ=స్రక్చందనవనితాదిభోగములను; కామీ=కోరువాఁడు; శాంతిం=మోక్షమును; నాప్నోతి=పొందఁడు. ॥౭౦॥

---

నీలకంఠీయము:— "యదా పంచాఽవతిష్ఠన్తే" అను కఠోపనిషచ్ఛ్రుతియొక్క చతుర్థపాద మగు "తా మాహుః పరమాం గతిం" అను వాక్యముచే నుపపాదిత మగు నర్థమును "యా నిశా" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

సర్వప్రాణుల కేది నిశవంటి నిశ యగుచున్నదో అనగా మధ్యందినమునందు గుడ్లగూబలవలె చక్షుష్మంతులైనను సర్వప్రాణు లేప్రత్యగ్జ్యోతిస్సునందు గ్రుడ్డివాం డ్రగుచుండిరో; యట్టి ప్రత్యగ్జ్యోతిస్సునం దింద్రియమనోబుద్ధ్యాదినిగ్రహస్వభావముకల యోగి యింద్రియాదులకు దృక్ఛక్తి లోపించినను అనుపరతదృక్ఛక్తికలఁవాడై యుండును. ఈవిషయమునే "న హి ద్రష్టు ర్దృష్టే ర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాత్" అను శ్రుతికూడఁ జెప్పుచున్నది. నిశీథమునందు గుడ్లగూబలవలె క్రియాకారకాది ద్వైతస్వప్నప్రవర్తక మగు నే యవిద్యానిశయందు నిఖిలప్రాణులు స్వవ్యాపారమునందు ప్రవర్తించుచుండిరో, అట్టి యవిద్య యాత్మజ్ఞానసంపన్నుఁ డగు యోగికి ప్రారబ్ధకర్మముచే విదేహకైవల్యము ప్రాప్తించకున్నను లేశతః అనువర్తమానమై సమాధివ్యుత్థానకాలమందు వ్యవహారమువలన నీయోగికి గాంఢాంధకారముగల రాత్రివలె క్లేశకారి యగుచున్నది. మనుష్యులు గాఢాంధకారసంచారమువలన భియపడినటుల అతిసుకుమారు లగు యోగులు బాహ్యవ్యవహారమువలన నుద్వేగము పొందెదరు. ఈ విషయమే "అక్షిమాత్రకల్పో హి విద్వా నత్యల్పదుఃఖలేశేనాప్యుద్విజతే" (విద్వాంసుఁడు నేత్రసదృశుఁడు. అనగా నేత్రము స్వల్పరేణువును తాకిన నెటుల నుద్వేగమునను పొందునో అటులే విద్వాంసుఁ డత్యల్పదుఃఖలేశముచేగూడ నుద్వేగమును పొందును) అని యోగభాష్యమునందు చెప్పఁబడెను. మఱియు నీవిషయమునే "కారకవ్యవహారే హి శుద్ధం వస్తు న వీక్ష్యతే । శుద్ధే వస్తుని సిద్ధే చ కారకవ్యాపృతి స్తథా ॥ కాకోలూకనిశేవాయం సంసారోఽజ్ఞాత్మవేదినోః । యా నిశా సర్వభూతానా మిత్యవోచ త్స్వయం హరిః ॥" అను వార్త్తికములుకూడ బోధించుచున్నవి (ఈవార్త్తికముల కర్థము మధుసూదనసరస్వతీవ్యాఖ్యయందే చూపఁబడెను.)

"బుద్ధతత్త్వస్య లోకోయం జడోన్మత్తపిశాచవత్। బుద్ధతత్త్వోఽపి లోకస్య జడోన్మత్తపిశాచవత్॥" ఆత్మతత్త్వమును దెలిసికొనినవాని కీలోకము జడమువలె, ఉన్మత్తమువలె, పిశాచగ్రస్తమువలె కాన్పించును. ఆత్మతత్త్వవేత్తయు లోకమున కటులే జడోన్మత్తపిశాచమువలెకనుపించును. "యదా సంహరతే చాయం" అను శ్లోకము మొదలు "యా నిశా" అను శ్లోకముకడకు నగు గ్రంథము "కి మాసీత" అను నర్జునప్రశ్నమున కుత్తరముగ స్థితప్రజ్ఞుఁడు సర్వదా సమాధినిష్ఠుఁడై పరమగతిని పొంది యుండు నని చెప్పఁబడెను. ॥౬౯॥

శాంకరభాష్యమ్:—

విదుష స్త్యక్తైషణస్య స్థితప్రజ్ఞస్య యతేరేవ మోక్షప్రాప్తి ర్న త్వసంన్యాసినః కామకామిన ఇత్యేత మర్థం దృష్టాన్తేన ప్రతిపాదయిష్య న్నాహ.— ఆపూర్యేతి । ఆపూర్యమాణ మద్భి రచలప్రతిష్ఠ మచలతయా ప్రతిష్ఠాఽవస్థితి ర్యస్య త మచలప్రతిష్ఠం సముద్రమాప స్సర్వతో గతాః ప్రవిశంతి స్వాత్మస్థ మవిక్రియ మేవ సంతం యద్వ త్తద్వ త్కామా విషయసన్నిధా వపి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సంన్యసింపనివాఁడు గూడ విద్యాఫల మగు మోక్షమును బొందుటకు సమర్థుఁ డగుచుండ నేకారణముచే విద్వాంసున కిది విధింపఁబడుచుండె ననిన? ఆపాతజ్ఞానము గలిగి వివేకవైరాగ్యాదివిశిష్టుఁడును, దారైషణాధనైషణాపుత్రైషణలను వదలినవాఁడును, శ్రవణమనననిదిధ్యాసనముల ద్వారమున జనించిన సాక్షాత్కారము గలవాఁడు నగు ముఖ్యమగు సంన్యాసికి మోక్షము సంభవించును; కాని ఇతరునకు సంభవింపదు. అను విషయమును దృష్టాంతపురస్సరముగ ప్రతిపాదింపఁదలచి "రాగద్వేషవియుక్తైస్తు విషయా నింద్రియై శ్చరన్" (గీ2-64) అను శ్లోకముచేఁ జెప్పఁబడిన యర్థమునే తిరుగ "ఆపూర్యమాణం" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

ఏవిధముగ నుదకముచే పూరింపఁబడుచున్నను వృద్ధిహ్రాసములు లేని స్థితికలదై యుండు సముద్రమును గౌతమి, భాగీరథి, యమున, కావేరి, నర్మదా మొదలగు నదుల యుదకములు ప్రవేశించుచున్నవో (ఇన్నివిధము లగు నుదకములు ప్రవేశించినను నేవికారమును లేక స్వస్వ

—• ౨వ అధ్యాయము- ౭౦ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇట్టి స్థితప్రజ్ఞునకు సర్వవిక్షేపశాంతి యర్థాత్సిద్ధ మగునని దృష్టాంతపురస్సరముగ "ఆపూర్యమాణం" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

అతిక్రమింపఁబడని మర్యాదకలిగినట్టియు, లేక మైనాకాది పర్వతముల కాశ్రయమగునట్టియు, సర్వనదులచే నింపఁబడుచున్న సముద్రమును వర్షోదకము లెట్టితీరున ప్రవేశించుచున్నవో యదేవిధమున యజ్ఞులచే కోరఁబడు శబ్దాదివిషయములు నిర్వికారముగనే నిర్వికారుఁడగు స్థితప్రజ్ఞుని ప్రారబ్ధకర్మవశమున నవర్జనీయములై ప్రవేశించుచున్నవి. అట్లు ప్రవేశించినను స్థితప్రజ్ఞుని వికారము కలవానిగఁ జేయుటకు సమర్థములు కావు. మహాసముద్రస్థానీయమగు స్థితప్రజ్ఞుఁడు సర్వలౌకికాలౌకికకర్మవిక్షేపనివృత్తిని, బాధితావిద్యానువృత్తి యున్నను అట్టి యవిద్యాకార్యనివృత్తిని జ్ఞానబలముచే పొందును. విషయములనుకోరు స్వభావముకల యజ్ఞుఁడు పూర్వోక్తమగు శాంతిని పొందడు. మఱియు నెల్లపుడు లౌకికాలౌకిక కర్మవిక్షేపముచే గొప్ప క్లేశార్ణవమునందు మునుఁగునని యీశ్లోకార్థము.

ఈ చెప్పుటచే జ్ఞానికే ఫలభూతమగు విద్వత్సంన్యాసము, సర్వవిక్షేపనివృత్తిరూపమగు జీవన్ముక్తియు సంభవించును. అట్టివానికే దైవాధీనవిషయభోగము ప్రాప్తించినను నిర్వికారత్వము సంభవించునని తెలిసికొనదగినది.

శంకరానందీయము:— కన్యక ఋతుమతియై తల్లిదండ్రులను, అన్నదమ్ములను, స్వజనమును విడనాడి యొకభర్తనే యాశ్రయించి, భర్తయే యాధారముగాఁగలదై యక్కడనే క్రీడించుచున్నది, సంతసించుచున్నది, హర్షించుచున్నది. ఇతరపురుషుని చెవిఁబెట్టదు, చూడదు, స్మరించదు, స్పృశించదు, స్వయముగ పతివ్రతయై యా

శాంకరభాష్యము:—

సర్వత ఇచ్ఛావిశేషా యం పురుషం సముద్రమివాపోఽవికుర్వన్తః ప్రవిశంతి సర్వే ఆత్మన్యేవ ప్రలీయంతే న స్వాత్మవశం కుర్వంతి; స శాన్తిం మోక్ష మాప్నోతి నేతరః కామకామీ కామ్యంత ఇతి కామా విషయా స్తా న్కామయితుం శీలం యస్య స కామకామీ నైవ మాప్నోతీత్యర్థః । ॥20॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

రూపమునం దుండిన సముద్రముయొక్క స్థితి యేకరూపమై యున్నదో) అదేవిధమున స్రక్చందనవనితాదిసాన్నిధ్య మున్నను ఇచ్ఛావిశేషములు (కోరికలు) వికారమును పొందింప (యుదకములు సముద్రమును ప్రవేశించునటుల) యేపురుషుని ప్రవేశించునో అనఁగా అన్నికోరిక లాత్మయందు లయమును బొందునో, యేపురుషుని కామపరవశునిగఁ జేసికొనలేవో, ఆపురుషుఁడు మోక్షమును బొందును. విషయములను గోరు పురుషుఁడు (అనఁగా కామపరవశుఁడు) మోక్షమును బొందనేరఁడు. ॥20॥

భర్తృగృహమునందె యుండును. అట్లే యే బ్రహ్మవేత్తయొక్క ప్రజ్ఞ సమాధిచే ప్రౌఢభావమును పొంది దేహమును, ప్రాణమును, ఇంద్రియములను, సర్వమును దూరముగవిడచి సచ్చిదానందైకరసస్వరూపమగు నొక పరబ్రహ్మమే యాశ్రయముగాకలదై యాపరబ్రహ్మమునందే క్రీడకలదై సంతోషముకలదై పతివ్రతవలె నన్యమును వినదో, చూడదో, తలపదో, తెలిసికొనదో, స్వయముగ తత్స్వరూపముగనుండునో; యట్టివాఁడే జీవన్ముక్తిసుఖమును, విదేహకైవల్యసుఖమును పొందునని సూచించుటకు ఇట్టి లక్షణములుకల యతియే విదేహముక్తిని పొందును. ఇతరుఁడు పొందఁడని నిర్ధారణచేయుచు స్థితప్రజ్ఞునకు- భిక్షాదికమునందుకూడ వృత్తి బాహ్యానవలంబి యగునని "ఆపూర్యమాణం" అను శ్లోకముచే జెప్పుచుండెను.

గంగానర్మదాగోదావరీకృష్ణాకావేరీసింధు మొదలగు మహానదులనుండి యనేకవేలముఖములుగ బయలు వెడలు మహాప్రవాహములచే నంతట నిండింపఁబడుచుండినను సముద్రము ప్రాచీనస్వీయలక్షణము నతిక్రమించనట్టి (వృద్ధిక్షయశూన్యమగు) జలస్థితిమర్యాదకలదియై (అనఁగా గంగాది మహానదీజలప్రవేశము లేనికాలమునం దెట్లు వృద్ధిక్షయశూన్యమై యుండునో; యట్లే గంగానద్యాదుల ప్రవాహములు ప్రవేశించిన కాలమునందును నేకరూపముగ సత్తావిశేషశూన్యమై వృద్ధిక్షయశూన్యమై) యెల్లప్పుడు నుండుననుట. అట్టి సముద్రమును గంగాగోదావర్యాదినదులయొక్క నానాముఖములనుండి బయలువెడలిన నానావిధవర్ణరసగంధగుణఫలములుగల యుదకము లెట్లు స్వకీయశుక్లనీలారుణపీతాదిరూపవిశేషములను, మధురామ్లతిక్తకషాయాది రసవిశేషములను, పరిమళపూతిత్వాది గంధవిశేషములను, లఘుత్వగురుత్వాది గుణవిశేషములను. ఏకద్విత్రిచతుఃపంచషట్సప్తాష్టనవదశశత కృచ్ఛ్రవ్రతసమానపుణ్యవిశేషములను, తమతమ నామవిశేషములనుఁ బరిత్యజించి సముద్రభావమునే పొందుచున్నవో (అనగా గంగాదినదులు సముద్రమునుపొంది తత్సంబంధమహిమచే నామరూపగుణవిశేషములచే నెట్లు సముద్రముకంటె వేరగుటలేదో)యట్లే నామభేదముచేతను, రూపభేదముచేతను రసభేదముచేతను, గంధభేదముచేతను, పాకభేదముచేతను వేరువేరుగ గ్రహింపబడుభోగ్యపదార్థములగు సూపాపూపరసాన్నాదులు,ఇతరభోగ్యవిశేషములు కామములనబడును. అట్టి కామములు అనిచ్ఛాప్రారబ్ధమువలన సర్వతః సంప్రాప్తములై నానావిధనామరూపరస గంధపాకసంస్కారాది విశేషవిచిత్రరూపములై "నన్నుగ్రహించు" మని దాతృజనద్వారమున నంతటను సంప్రాప్తములగుచుండ నట్టి

భోగ్యవిశేషములచే వ్యాకులముగ చేయబడుచుండినను "అచలప్రతిష్ఠం" సమాధివ్యుత్థానదశయందుగూడ సదా కారత్వమును పొందించి సత్స్వరూపముగనే నిశ్చలముగనుండిన యఖండాకారవృత్తియొక్క స్థితికల (అట్టి సమయమందుగూడ బాహ్యములను వికల్పించక సమాధినిష్ఠచే విపరిణామరహితాంతఃకరణముకల) బ్రహ్మవిత్తును అట్టి కామములు 'ప్రవిశన్తి' ప్రవేశించును. సర్వవిషయము లేబ్రహ్మనిష్ఠుని పొంది చిదాభాసాపన్నములై యాత్మదృష్టిచే ప్రవిలాపితములై స్వకీయములగు నామవిశేషమును, రూపవిశేషమును, గంధవిశేషమును, పాకవిశేషమును, సంస్కారవిశేషమును, రుచివిశేషమును పరిత్యజించి సముద్రమును ప్రవేశించిన మహానదీజలములు సముద్రభావమునువలె స్వయముగ బ్రహ్మభావమును పొందుచున్నవి. ఇట్టిలక్షణములుకల బ్రహ్మవేత్తయే యవిద్యాప్రపంచోపశమరూప మగు విదేహముక్తిని పొందుచున్నాడు. విషయములను కోరెడివాఁడు తాను కైవల్యకారణభూతమగు బ్రహ్మనిష్ఠారూపస్వధర్మమును బరిత్యజించి యనాత్మయం దాత్మభావమును పొందించి భోక్తయై శుక్తియందు రజితమునువలె ఊషరక్షేత్రమునందు జలమునువలె నద్వితీయబ్రహ్మమునందు లేని ద్వైతమును కల్పించి "నేను భోక్తను, ఇది భోగ్యము" అని యన్వతాభిసంధి కలవాఁడగుటచే బాహ్యవాసనలచే నసత్యమగు నహంతామమతాభినివేశములతో బద్ధుఁడై "ఇది రమ్యమైనది, ఇది ఇష్టమైనది, ఇది యనిష్టమైనది" అనెడి భేదబుద్ధిచే నామరూపాది విశేషవిభాగపురస్సరముగ పదార్థములను గ్రహించుచున్నాఁడు. కాన దేహతాదాత్మ్యాపత్తిచే నేనని యభిమానముచే నద్వితీయబ్రహ్మమునందు భేదమును చూచునో యట్టి ద్వైతదర్శి మోక్షమును పొందడు. ఈ విషయమునే "యదా హ్యేవైష ఏతస్మిన్నుదరమన్తరం కురుతే। అథ తస్య భయం భవతి। తత్త్వేవ భయం విదుషోఽమన్వానస్య" అను తైత్తిరీయశ్రుతియు చెప్పుచున్నది.

దేహతాదాత్మ్యము లేనిదే భేదదర్శనము కాని, కామన కాని సిద్ధింపదు. అవిద్యలేనిదే దేహతాదాత్మ్యము సంభవింపదు. అవిద్యావంతునకు ముక్తి లేకపోవుట యుక్తమే. కాన విదేహకైవల్యము కోరెడియతి దేని నెంద న్నడు దేహతాదాత్మ్యాపత్తిచే భేదదృష్టిని చేయరాదు. ఈ శ్లోకముచేతను, దీనికి పూర్వశ్లోకముచేతను ఆహారాదులయందుగూడ స్థితప్రజ్ఞుఁడగు బ్రహ్మవేత్త బ్రహ్మస్వరూపముగ బ్రహ్మమునందే యుండును. అనాత్మయం దుండడని "కిమాసీత" (స్థితప్రజ్ఞుఁడెట్లు కూర్చుండును.) అను ప్రశ్నమునకు సమాధానము చెప్పఁబడెను.

పరమార్థప్రపః— ఇంద్రియోపరామవృత్తిని దృష్టాంతపురస్సరముగ "ఆపూర్యమాణం" అను శ్లోకముచే చెప్పుచుండెను. మేఘములచే వెలుపల నుదకము లాగుకొనబడుచుండినను క్షయమును బొందనట్టియు, తిరుగ వర్షమువలన సంభవించెడి ప్రవాహములతో గూడినను వృద్ధిలేక మర్యాద నతిక్రమించనట్టి సముద్రము నెట్లు నానానదీప్రవాహములు ప్రవేశించుచున్నవో; అట్లే ప్రకృతమునందు విషయవృత్తులు బహిర్నిసృతములైనను స్థితప్రజ్ఞుఁడగుటవలన క్షయమును పొందనట్టియు, తిరుగ నా యింద్రియవృత్తులను నిరోధించినపుడు "నేను విశ్వత్తేంద్రియుఁడను" అను అభిమానశూన్యుడగు పురుషుఁ డాత్మసుఖమును పొందును. కాని భోగముల నపేక్షించువాఁ డాత్మసుఖమును పొందనేరడు.

నీలకంఠీయము:— "ప్రజహాతి యదా కామాన్, ఇంద్రియాణీంద్రియార్థేభ్యో నిగృహీతాని" అను శ్లోకములు మొదలుకొని విషయపరిత్యాగము, విషయములనుండి యింద్రియములను మరలించుట చెప్పఁబడెను. ఈ చెప్పుటచే విషయముల కాత్మకంటె పృథక్సత్త్వము కలదని సిద్ధించుచున్నది. "నేహ నానాస్తి కించన" అను శ్రుతిచే విషయముల కాత్మకంటె పృథక్సత్త్వము లేదని సిద్ధించుచున్నదని శంకింపఁజనదు. "ఇహ భూతలే ఘటో నాస్తి" (ఈభూమియందు ఘటములేదు) అని చెప్పినచో నావాక్యమువలన ఘటముయొక్క స్వరూపము నిషేధింపఁబడుటలేదు. మరేమనిన? ఘటమునకు భూతలసంబంధము నిషేధింపఁబడును. అదేవిధమున ప్రత్యగ్రూపమునందే విషయసంబంధనిషేధము సంభవించును ఇంతమాత్రముచే విషయముల కసత్త్వము సంభవింపదు. ఆత్మకంటె పృథక్సత్త్వమే సంభవించును. కానఅద్వైతసిద్ధి సంభవింపదను నాశంకను దృష్టాంతపురస్సరముగ "ఆపూర్యమాణం" అనుశ్లోకముచేఁ దొలగించుచుండెను.

గీ॥ విహాయ కామా న్య స్సర్వా న్పుమాం శ్చరతి నిస్స్పృహః ।
నిర్మమో నిరహంకార స్స శాన్తి మధిగచ్ఛతి ॥ ॥౭౧॥

పదవిభాగము:— విహాయ– కామాన్– యః– సర్వాన్– పుమాన్– చరతి– నిస్పృహః– నిర్మమః– నిరహంకారః– సః– శాంతిం– అధిగచ్ఛతి । ॥౭౧॥

ప్రతిపదార్థము:— యః=ఏ; పుమాన్=(సంన్యాసి యగు) పురుషుఁడు; సర్వాన్=సమస్త మగు; కామాన్=కోరికలను; విహాయ=విడచి; నిస్పృహః=(శరీరజీవనమాత్రమునందుఁగూడ) కోఁకలేనివాఁడై; శరీరజీవనమాత్రమునిమిత్తము భిక్షాదులను పరిగ్రహించినను (ఇది నాదియను) యభినివేశము లేనివాఁడై; నిరహంకారః=విద్యాదినిమిత్త మగు నాత్మభావన (ఆత్మగౌరవము) లేనివాఁడై; చరతి=(జీవనమాత్రచేష్టాశేషముకలవాఁడై) సంచరించునో; సః=అట్టి స్థితప్రజ్ఞుఁడు; శాంతిం=మోక్షమును; అధిగచ్ఛతి=పొందును. ॥౭౧॥

---

వృద్ధిగుణము లేనిదగుటచే బ్రవేశించుచున్న జలములచే నుద్రేకము (అతిశయము) లేనిది. బయులువెడలుచున్నయుదకములచే శూన్యమైనను హ్రాసగుణము లేనిదగుటచే శూన్యము కానట్టిదియు నగు సముద్రము నెట్లు సముద్రమునుండి జనించెడి యుదకములు ప్రవేశించునో, యట్లే కామములచే పూరించబడుచుండినను, కామములచే హీనమగుచుండినను వృద్ధిహ్రాసహీనుఁడగుటచే నిర్వికారుఁడగు నేపురుషుని యాత్మప్రభవములగు నిఖిల కామములు ప్రవేశించునో; ఆపురుషుఁడే యాత్యంతికదుఃఖోపరమరూపమోక్షమును పొందుచున్నాడు. విషయములనుకోరువాఁ డట్టి మోక్షమును పొందఁడు.

ఇచట తత్త్వ మిది. "కూటస్థ మగు నాత్మవలన సర్వము జనించును. అట్టి యాత్మయందే సర్వము లయించును" అను విషయము శ్రుతిస్మృతిపురాణేతిహాసనిద్ధము. అట్లగుటచే విషయములను విడచుట, విషయములనుండి యింద్రియములను మరలించుట. స్మరించుట అనునది—బహుప్రమాణవిరోధమువలన విషయములకు పరమార్థ మగు పృథక్సత్త్వమును సాధింపనేరదు. మరేమనిన? పామరప్రసిద్ధ మగు పృథక్సత్త్వము నుద్దేశించి విషయములను విడువవలెనని చెప్పఁబడెను ప్రవిలాపనమునుగూడ నిట్లే వ్యాఖ్యానింపవలెను. అనగా సర్వమాత్మవలన జనించుటచే నాత్మయందే లయించు నని యాశయము. "అగ్నయే పథికృతేఽష్టాకపాలం నిర్వపేత్" అనుస్థలమునందు "నిర్వపేత్" అను ధాతువుచే యాగము చెప్పఁబడెను. శ్రౌతార్థమాత్రము కాదు. అట్లే ప్రకృతమునందుగూడ చూడనగును. "నేహ నానాస్తి కించన" అనుచోటగూడ "ఇహ" పరిదృశ్యమానప్రపంచమునం దాత్మాతిరిక్త మగు "నానాకిమపి" అనేకముగ నేదియు "నాస్తి" లేదని వ్యాఖ్యానింపవలయును. అట్లైనచో "ఆత్మై వేదం సర్వం, బ్రహ్మైవేదం. సర్వం ఖల్విదం బ్రహ్మ" అనునవి మొదలగు శ్రుతులు సమంజసము లగును. ఆత్మయందు కల్పిత మగు నీప్రపంచమున కాత్మయందే నిషేధించుటచేత నన్యస్థలమునందు సత్త్వము సంభవింపదు. కాన విషయములకు పృథక్సత్త్వము సంభవింపదు. అందువలన సముద్రదృష్టాంతము యుక్తమే యగును.

సముద్రమువలన జనించిన గంగాగౌతమ్యాదులకు సముద్రముకంటె వేరే స్థితికలదు. అట్లే యాత్మవలన జనించు జగమునకు పృథక్సత్త్వము కలదని శంకింపఁజనదు. "వాచారంభణం వికారో నామధేయం" అను శ్రుతిచే కార్యమాత్రమునకు వాగాలంబనమాత్రత్వము శ్రూయమాణమగుటచే కార్యమునందు కారణసత్తాతిరిక్త సత్త సంభవింపదు. కాన పూర్వోక్తశంక కవకాశములేదు. ఈ విషయ మన్యత్ర విస్తరముగఁ జెప్పఁబడెను.

శ్రీధరీయము:— విషయములయందు దృష్టిలేనిచో స్థితప్రజ్ఞుఁ డెట్లు విషయముల ననుభవించును? అను నాశంకను "ఆపూర్యమాణం" అను శ్లోకముచేఁ దొలఁగించుచుండెను.

అనేకనదులచే నంతట నిండింపబడుచుండినను మర్యాదనతిక్రమింపకుండ నుండినసముద్రమును తిరిగి మఱియొక విధమున నుదకము లెట్లు ప్రవేశించుచున్నవో; యట్లే భోగములచే వికారమును పొందనట్టి, యంతర్దృష్టికల యేస్థితప్రజ్ఞుని ప్రారబ్ధకర్మసంప్రాప్తములై విషయములు ప్రవేశించుచున్నవో; యట్టిస్థితప్రజ్ఞుడే కైవల్యమును పొందుచున్నాడు. భోగములను కోరెడివాడు మోక్షమును పొందనేరడు. ॥౭౦॥

**శాంకరభాష్యమ్:—**

యస్మాదేవం తస్మాత్—విహాయేతి। విహాయ పరిత్యజ్య కామాన్యస్సంన్యాసీ పుమాన్సర్వానశేషతః కార్త్స్న్యేన చరతి జీవనమాత్రచేష్టాశేషః పర్యటతీత్యర్థః। నిస్స్పృహః శరీరజీవనమాత్రేఽపి నిర్గతా స్పృహా యస్య సః నిస్స్పృహస్సన్నిర్మమః శరీరజీవనమాత్రాక్షిప్తపరిగ్రహేఽపి మమేదమిత్యభినివేశవర్జితః, నిరహంకారో విద్యావత్త్వాదినిమిత్తాత్మసంభావనారహిత ఇత్యర్థః। స ఏవంభూతః స్థితప్రజ్ఞో బ్రహ్మవిచ్ఛాన్తిం సర్వసంసారదుఃఖోపరమలక్షణాం నిర్వాణాఖ్యామధిగచ్ఛతి ప్రాప్నోతి బ్రహ్మభూతో భవతీత్యర్థః॥ ।౭౧॥

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

మనస్సుచే సమస్తాభిమానములను విడిచి తనను కూటస్థబ్రహ్మస్వరూపముగఁ దలఁచెడి గృహస్థునిచేఁ గూడ మోక్షము పొందబడినచో మౌఢ్యావివిడంబనమే ప్రాప్తించు ననెదవా? అట్లు కాదు. కాముఁడు మోక్షవిఘాతకుడు. అందువలన సమస్తకోరికలను విడచి, శరీరజీవనమాత్రమునందు గూడ కోరిక లేనివాఁడై. శరీరజీవనమాత్రమునకు దగుపరిగ్రహము ప్రాప్తించినను 'ఇది నాసంబంధమైనది' అను నభినివేశముతో శూన్యుఁడై విద్యాదులవలనఁ బ్రాప్తించెడి యాత్మసంభావనను (ఆత్మగౌరవమును) విడనాడి, యేసంన్యాసి చరించునో అట్టి బ్రహ్మవిత్తగు స్థితప్రజ్ఞుఁడు సర్వసంసారదుఃఖనివృత్తిరూపమగు మోక్షమును బొందును. అనగా నట్టి యతి బ్రహ్మభూతుఁడగు నని యర్థము. (మోక్షమును గోరెడి సంన్యాసికి సర్వకామపరిత్యాగాదిరూపమగు వైవిశేషణము లవశ్యము సాధింపఁదగినవి. దీనికి ఫలము మోక్ష మని యాశయము.) ॥౭౧॥

## —•౨వ అధ్యాయము - ౭౧ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పూర్వోదాహృతకారణముచే నెవఁడు ప్రాప్తమైన, (1) బాహ్యమగు గృహక్షేత్రదారపుత్రాదులను, (2) అంతరమైన మనోరాజ్యరూపములగు వాసనామాత్రములను, (3) మార్గమధ్యమందు నడచుచుండగ సంభవించెడి తృణస్పర్శతో సమానమగు కోరికలను విడిచి, శరీరజీవనమాత్రమునందు కూడ కోరిక లేనివాడై శరీరేంద్రియాదులయందు 'ఇది నేను' అనెడి యభిమానశూన్యుడై విద్యాప్రయుక్తమగు నాత్మసంభావనారహితుడై, కనుకనే ప్రారబ్ధకర్మచే ప్రాప్తించెడి శరీరయాత్రామాత్రార్థమగు కౌపీనాచ్ఛాదనాదులయందు 'ఇది నాది' అనెడి యభిమానవర్జితుఁడై ప్రారబ్ధకర్మవశముచే భోగముల ననుభవించుచుండునో, లేక, యాదృచ్ఛికముగ నెక్కడికో యొకచోటకు వెళ్లుచుండునో యట్టి స్థితప్రజ్ఞుడు సర్వసంసారదుఃఖోపరమరూపమూ, అవిద్యాతత్కార్యనివృత్తిరూపమునగు మోక్షమును జ్ఞానబలముచే పొందుచున్నాడు. స్థితప్రజ్ఞని వ్రజన మిట్టిదని "వ్రజేత కిం" అను చతుర్థప్రశ్నమునకు సమాధానము పరిసమాప్తము.

శంకరానందీయము:— "ధ్యాయతో విషయాన్" అను స్థలమునందు విషయముల శ్రవణదర్శనములను విడచియే కేవలవిషయధ్యానమాత్రముచే కామాద్యనర్థములుసంభవింపగా విద్వాంసుడునశించునని చెప్పబడెను.

బ్రహ్మనిష్ఠను విడచి బాహ్యవృత్తిచే విషయముల నింద్రియములచేత గ్రహించుచు, యథేచ్ఛగ ననుభవించుచు, యథేచ్ఛగ విహరించునట్టి భోగకామికి నాశము ప్రాప్తించునని యేమిచెప్పవలెను. అనఁగా తప్పక నాశమే ప్రాప్తించును. కాన విదేహకైవల్యమును కోరెడి బ్రహ్మవేత్త యన్నివిధములచేతను విషయగ్రహణమును మాని సర్వేంద్రియనిగ్రహపూర్వకముగ సదాత్మనిష్ఠతో నుండవలెను. ఈవిధమున నెవఁడుండునో వాఁడే విదేహముక్తిని పొందునని "విహాయ కామాన్" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

బ్రహ్మవేత్తయగు పురుషుఁడు దుర్లభపురుషార్థమగు మోక్షమును గొప్పప్రయత్నముచే సంపాదించును. పురుషశబ్దవాచ్యుఁడగు నేబ్రహ్మవేత్త స్వయముగ 'నిరహంకారః' బ్రహ్మయందే నిరూఢమైనయాత్మత్వాభినివేశముచే దేహమునందహంకారము లేనివాడై, నిత్యనిరంతరబ్రహ్మనిష్ఠచే నిర్మూలితమైన యనాత్మతాదాత్మ్యగ్రంధికలవాడై, కనుకనే దేహతద్ధర్మతత్కర్మతదవస్థాదులయందు మమతాబంధము లేనివాఁడై (అనగా బ్రహ్మతాదాత్మ్యప్రాప్తిచే శరీరమునం దహంభావము, శరీరధర్మములయందు మమత్వము విద్వాంసునకు యుక్తమే యనియర్థము). అట్టివాడు కనుకనే విషయములందు కోరికలేనివాఁడై బ్రహ్మమునందైన యాత్మతాపత్తిచే దేహాదులనాత్మరూపములుగ నిరస్తమగుటవలన దేహము నుద్దేశించి సుఖమునందు కోరికసంభవింపనందునను, నిరంతర బ్రహ్మానందామృతరసముచే తృప్తుఁడగుటవలనను విద్వాంసునకు విషయసుఖములయం దపేక్ష లేకపోవుట యుక్తమే. అట్టివాఁడు కనుకనే శుక్తిరజతతుల్యములగు బాహ్యశబ్దవాచ్యములైన విషయములతో ప్రయోజనము లేనందున నింద్రియములచే నట్టివిషయములను గ్రహించక "ఈసర్వము, నేనుబ్రహ్మస్వరూపమే" అని తనను సర్వమును బ్రహ్మమునుగ దెలిసికొని "కామాన్నీ కామరూ ప్యనుసంచరన్" అను శ్రుత్యుక్తప్రకారము భూమియందంతట నసంగుడై, యుదాసీనుడై యేపరమహంససంచరించునో యట్టివాడాత్యంతికసంసారోపరమరూపమగు విదేహముక్తిని పొందుచున్నాడు. ఈలక్షణములకు విరుద్ధలక్షణములు కలవాడు మోక్షమును పొందనేరడు. బ్రహ్మస్వరూపముచే సర్వమును చూచుచున్నవాడై బ్రహ్మానందము ననుభవించుచున్న బ్రహ్మవేత్త సర్వత్ర సంచరించును. ఒకచోట నుండడని 'వ్రజేతకిం' అను చతుర్థప్రశ్నకు సమాధానము చెప్పఁబడెను.

భాష్యోత్కర్షదీపిక:— "వ్రజేతకిం" అను నర్జున చతుర్థప్రశ్నసమాధానము నీశ్లోకముచే నుపసంహరించుచుండెను.

విస్థితప్రజ్ఞుఁడు సర్వవిషయములను విడచి శరీరజీవనమాత్రమునందుకూడ కోరికలేనివాడై, కనుకనే శరీరజీవనమాత్రాక్షిప్త పరిగ్రహమునందుకూడ "ఇదినాది" అను అభినివేశరహితుఁడై విద్యాప్రయుక్తాత్మసంభావనారహితుఁడై సంచరించునో యట్టిస్థితప్రజ్ఞుఁ డవిద్యాతత్కార్యోపరమరూపమోక్షమును పొందును.

"నిరహంకారః" అనుపదమునకు శ్రీభగవత్పాదులు దేహాభిమానరహితుఁడని యెందులకు వ్యాఖ్యానింపలేదు? అనిన నిరుక్తాహంభావమునందే దేహాభిమానముకూడ నంతర్భవించుటచే నట్లు వ్యాఖ్యానింపలేదని సమాధానము చూచుకొననగును.

పరమార్థప్రపా:— సాధితపురుషార్థుఁడగు నేపురుషుఁడు స్రక్చందనవనితాదిభోగములను తృణప్రాయమొనరించి సర్వవిషయములయందు నిస్పృహుఁడై (విషయములు సంప్రాప్తమైనపుడావిషయములయందు మమతాభిమానశూన్యుఁడై, విషయములు పరావృత్తములై (మరలి) నపుడు "నేను కృతకృత్యుఁడను" అను శ్లాఘాశూన్యుఁడై) చరించునో అట్టివాడే మోక్షమును పొందుచున్నాడు. ఇతరుఁడు పొందలేడు.

నీలకంఠీయము:— ప్రాసంగికమగు పూర్వోక్తాశంకను తొలగించి "వ్రజేత కిం" అను చతుర్థప్రశ్నకు సమాధానము "విహాయ కామాన్" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

గీ॥ ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ ! నైనాం ప్రాప్య విముహ్యతి ।
స్థిత్వాఽస్యా మంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి ॥ ॥౭౨॥

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి
శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే సాంఖ్యయోగో నామ
ద్వితీయోఽధ్యాయః ।
హరిః ఓమ్ తత్సత్ । శ్రీ కృష్ణార్పణమస్తు ।

పదవిభాగము:— ఏషా- బ్రాహ్మీ- స్థితిః- పార్థ!- న- ఏనాం- ప్రాప్య- విముహ్యతి- స్థిత్వా- అస్యాం- అంతకాలే- అపి- బ్రహ్మనిర్వాణం- ఋచ్ఛతి । ॥౭౨॥

ప్రతిపదార్థము:— హే పార్థ=ఓ యర్జునా!; ఏషా=ఈ పూర్వమునందు చెప్పఁబడినది; బ్రాహ్మీ=బ్రహ్మయం దైన; స్థితిః=ఉనికి; ఏనాం=ఈ బ్రాహ్మీ స్థితిని; ప్రాప్య=పొంది; నవిముహ్యతి=మోహమును పొందడు; అస్యాం=ఈ బ్రాహ్మీ స్థితియందు; అంతకాలేపి=అంతిమవయస్సునందును; స్థిత్వా=ఉండి; బ్రహ్మనిర్వాణం=మోక్షమును; ఋచ్ఛతి=పొందుచున్నాడు. ॥౭౨॥

శాంకరభాష్యము:—

సైషా జ్ఞాననిష్ఠా స్తూయతే— ఏషా బ్రాహ్మీతి । ఏషా యథోక్తా బ్రాహ్మీ బ్రహ్మణి భవేయం స్థితి స్సర్వం కర్మ సంన్యస్య బ్రహ్మరూపే ణైవావస్థానమి త్యేతత్ । హే పార్థ! నైనాం స్థితిం ప్రాప్య లబ్ధ్వా న విముహ్యతి న మోహం ప్రాప్నోతి । స్థిత్వాఽస్యాం స్థితౌ బ్రాహ్మ్యాం యథోక్తాయా మంతకాలే ప్యంతే వయస్యపి బ్రహ్మనిర్వాణం బ్రహ్మనిర్వృతిం

ఎవఁడు పూర్వోక్త మగు త్రివిధ కామములను విడచి, నిస్పృహుఁడై "నిర్మమః" (మమకారము లేనివాఁడు "ఇది నాకు సంభవించును గాక" యని యితరుల ధనము మొదలగునవి కోరును. అట్టి) కోరిక లేక "నిరహంకారః" అహంకారము లేనివాఁడై విషయముల ననుభవించునో; యట్టివాఁడు (అహంకారశూన్యనకు సుషుప్త్యాదులయందు వలెనే సంభవింపనందున, అహంకారప్రవిలయమువలన) మోక్షమును పొందును.

ఇచట 'య స్సర్వాత్రాఽనభిస్నేహః' అనునది మొదలగు స్థలములయం దంతటను 'యః' అని యచ్ఛబ్ద ముండుటచే నీగ్రంథము ('య స్సర్వత్రాఽనభిస్నేహః' అనునది మొదలు ఈ యధ్యాయపరిసమాప్తి కలిగిన గ్రంథము) ముముక్షువునకు సాధనవిధిపరము. అట్లు కానిచో స్థితప్రజ్ఞుఁడు ప్రస్తుత మగుటవలన తదనువాదార్థ మగు యచ్ఛబ్ద మనర్థక మగును. లోకమునం దైతే వ్యవహరించునపుడు పరుని స్వభావమును చెప్పుసమయమున 'స ఏవం కరోతి' వాఁడిట్లు చేయుచున్నాఁ డని తచ్ఛబ్దమునే ప్రయోగించుచున్నాఁడు. "యః" అని యనువాదసమయమున యచ్ఛబ్దమును ప్రయోగించఁడు. విధియం దైతే "య ఏవం కరోతి స ఇదం ప్రాప్నోతి" (ఎవఁ డిట్లు చేయునో వాఁ డీఫలమును పొందును) అని "యః సః" అని యచ్ఛబ్దతచ్ఛబ్దప్రయోగము చూడఁబడుచున్నది. స్థితప్రజ్ఞలక్షణకథనార్థమైనను లక్షణకథనమునందు తాత్పర్యము లేమింజేసి ముముక్షువుయొక్క సాధనవిధియందే పర్యవసిత మని నిశ్చయార్థము. ॥౭౧॥

శాంకరభాష్యమ్:—

మోక్షమృచ్ఛతి గచ్ఛతి కిము వక్తవ్యం బ్రహ్మచర్యాదేవ సంన్యస్య యావజ్జీవం బ్రహ్మణ్యే వావతిష్ఠతే స బ్రహ్మనిర్వాణ మృచ్ఛతీతి ॥ 72 ॥

ఇతి శ్రీమ త్పరమహంసపరివ్రాజకాచార్యగోవిందభగవత్పూజ్యపాదశిష్య
శ్రీమ చ్ఛంకరభగవతః కృతౌ శ్రీభగవద్గీతాభాష్యే
ద్వి తీ యో ఽ ధ్యా యః ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అచ్చటచ్చట సంక్షేపముగను, విస్తరముగను జెప్పిన జ్ఞాననిష్ఠను అధికారిప్రవృత్తి నిమిత్తము "ఏషా బ్రాహ్మీ" అనుశ్లోకముచే స్తుతిచేయుచుండెను.

గృహస్థు, సంన్యాసి యీ యుభయులు గూడ ముక్తినిబొందెడివార లగుచో కష్ట మగు సంన్యాసముతో నేమిప్రయోజనము? అని శంకింపఁజనదు. సంన్యాసికంటె నితరులకు విఘ్న బాహుళ్యము సంభవించుటచే ముముక్షువునకు సంన్యాసము తప్పక యపేక్షితము. కాన నీ పూర్వమునందుఁ జెప్పఁబడిన స్థితి సర్వకర్మలను సంన్యసించి బ్రహ్మరూపముగ నవస్థానరూపము. గృహస్థుడు ధనహానివలన వికలచిత్తుఁడై పరమార్థవివేకరహితుఁడై యగును. సంన్యాసికి ధనాదులు లేమిం జేసి ధనాదినాశమువలన వికలచిత్తుఁడు గానేరడు. కాన నోయర్జునా! యిట్టి బ్రాహ్మీస్థితిని బొంది సంన్యాసి యగు బ్రహ్మవిత్తు మోహమును పొందఁడు. (పరమార్థరహితుడు కాడు) ముదిమియందైన నిట్టి సర్వకర్మసంన్యాసపూర్వ కాత్మజ్ఞాననిష్ఠుడైనచో మోక్షమును పొందును. ముదిమియందుమాత్రమే జ్ఞాననిష్ఠుడైనవాఁడు మోక్షమును బొందుచుండ బ్రహ్మచర్యమునందే సంన్యసించి యావజ్జీవము బ్రహ్మనిష్ఠుడైనవాఁడు ముక్తిని బొందు నని చెప్ప నవసరము లేదు.

ఈతీరున తత్పదార్థము, త్వంపదార్థము, "తత్త్వమసి" అను వాక్యార్థము, అట్టి వాక్యార్థ జ్ఞానమువలన ప్రత్యేకముగ మోక్షము, అట్టి మోక్షోపాయము ఒక్కొక్కశ్లోకమునందియధ్యాయమునఁ జెప్పబడెను. కాన కర్మనిష్ఠ, జ్ఞాననిష్ఠ యనెడి యుపాయోపేయభూత మగు నిష్ఠాద్వయ మీద్వితీయాధ్యాయముచే సిద్ధమగుచున్నది.

ఇట్లు నూరువేల సంఖ్య కలిగి, వ్యాసప్రోక్తము, సంహితారూపము నగు మహాభారతమునం దంతర్గతమైన భీష్మపర్వమునందున్న యుపనిషద్రూపము, బ్రహ్మవిద్యారూపమును, యోగశాస్త్రము నగు భగవద్గీతలయందున్న శ్రీకృష్ణార్జునసంవాదమునందు గల సాంఖ్యయోగ మను పేరి ద్వితీయాధ్యాయమునకు గౌతమసగోత్రుఁడగు "తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార" బిరుదు అప్పన్నశాస్త్రిచే రచియింపఁబడిన, ఆనందగిరీయ వ్యాఖ్యానుసృత శ్రీ భగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధిని

స మా ప్త ము.

హరిః ఓమ్ తత్సత్.

—• ౨వ అధ్యాయము ౭౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఈవిధమున "స్థితప్రజ్ఞస్య కా భాషా" అను శ్లోకమునందుఁ జూపఁబడిన యర్జునుని నాల్గుప్రశ్నములకు సమాధానము చెప్పువ్యాజముచే స్థితప్రజ్ఞుని నిఖిలలక్షణములు ముముక్షువుచే నాచరింపదగినవిగా చెప్పి, ఇపుడుకర్మయోగఫలభూతమగు సాంఖ్యనిష్ఠను ఫలద్వారమున స్తుతించుచు, నుపసంహరించుచుండెను. స్థితప్రజ్ఞలక్షణవ్యాజమున చెప్పబడినట్టియు, 'ఏషా తేఽభిహితా సాంఖ్యేబుద్ధిః' అనిపూర్వమందు చెప్పబడునట్టినిష్ఠ సర్వకర్మసంన్యాసపూర్వకపరమాత్మజ్ఞానరూపముగను, బ్రహ్మవిషయకముగను చెప్పబడెను. ఓయర్జునా! ఎవఁడైన నీస్థితిని పొందినచో తిరుగ మోహమును పొందఁడు. అనఁగా అజ్ఞానమనాదియగుటచే నట్టి యజ్ఞానము బాధింపబడి తిరుగ నది సంభవింపదు. ముదిమియందుగూడ నిట్టి బ్రాహ్మీస్థితియందుండువాడు బ్రహ్మయందు సుఖమును, లేక బ్రహ్మరూపమగు సుఖమును పొందుచుండ బ్రహ్మచర్యమునందే సంన్యసించి యావజ్జీవమీబ్రాహ్మీస్థితి నవలంబించువాడు బ్రహ్మరూపసుఖమును పొందునని చెప్పనవసరములేదు. ఇట్టి యర్థము "అన్తకాలేఽపి" అను స్థలమునందుగల 'అపి' అను శబ్దముచే చెప్పఁబడుచున్నది.

"జ్ఞానం తత్సాధనం కర్మ సత్త్వశుద్ధిశ్చ తత్ఫలం। తత్ఫలం జ్ఞాననిష్ఠైవేత్యధ్యాయేఽస్మిన్ప్రకీర్తితమ్॥" ద్వితీయాధ్యాయమునందు మొట్టమొదటజ్ఞానము, జ్ఞానసాధనమగుకర్మయు, కర్మఫలమగు సత్త్వశుద్ధియు, సత్త్వశుద్ధికి ఫలమగు జ్ఞాననిష్ఠయు చెప్పఁబడెను.

ఇట్లు శ్రీమధుసూదనసరస్వతీ విరచిత శ్రీమద్భగవద్గీతా ద్వితీయాధ్యాయ గూఢార్థ
దీపికకు "తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార"
బిరుదు అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని
సమాప్తము.

శంకరానందీయము:— "ముముక్షువగు యతికి ప్రపంచవాసనలచేతను, కామక్రోధాదులచేతను, అహంమమాద్యభిమానవిశేషములచేతను ప్రతిబంధకముతోఁగూడిన శ్రవణజన్యజ్ఞానము విదేహముక్తికొరకు సమర్థమైనది కాదు" అని నిశ్చయించి పరమకృపాలువగు శ్రీకృష్ణపరమాత్మ 'సమాధావచలా బుద్ధిః' అని బ్రహ్మనిష్ఠను ప్రస్తుతముగ చేసికొని యెల్లపుడు బ్రహ్మనిష్ఠచే సర్వకామప్రహాణ మొనరించునట్టియు, శరీరయాత్రలయందుగూడ బ్రహ్మస్వరూపముచే బ్రహ్మయందుండునట్టి అహంమమాదిబంధమునుండి ముక్తుడైన విద్వాంసునకే విదేహముక్తిని చెప్పి, యిపుడు ముముక్షువునకుగూడ బ్రహ్మనిష్ఠయే సంపాదింపదగినది; దీనిచేతనే విదేహముక్తి ప్రాప్తించును. మఱియొకవిధమున ప్రాప్తించదని సూచనచేయుచు నుపక్రాంతమగు బ్రహ్మనిష్ఠను "ఏషా బ్రాహ్మీ స్థితిః" అను శ్లోకముచే నుపసంహరించుచుండెను.

'స్వస్వరూపం ప్రకాశ్య ముముక్షుంసంసారమృత్యోః పాతీతి పః పరమాత్మా తమేవార్థయతే వాంఛతీతి పార్థః తస్య సంబుద్ధిః హేపార్థ!" స్వస్వరూపమును ప్రకాశింపజేసి ముముక్షువును సాంసారమృత్యువునుండి రక్షించువాడు పరమాత్మ. అట్టిపరమాత్మను కోరెడివాఁడు పార్థుడనబడును. అతనిసంబుద్ధి "హేపార్థ!" అని. అట్టి యోయర్జునా! నీవు నేనుజెప్పు విషయములను విని చెప్పినట్లాచరించుము. బ్రహ్మప్రాపకమగు నీనిష్ఠ నాచే జెప్పఁడెను. విదేహకైవల్యమును కోరెడి బ్రహ్మవేత్తయగు ముముక్షు వీబ్రహ్మనిష్ఠను పొంది "న విముహ్యతి విశిష్టోమోహో యత్ర స విమోహో దేహస్తం న ప్రాప్నోతి" విశేషమోహము దేనియందుకలదో యట్టి దేహము విమోహమనబడును. అట్టిదేహమును తిరిగిపొందడు. మఱియు పూర్వవయస్సునందే ప్రసిద్ధమైన సాధనములు కలవాడై, జన్మాంతరీయ సంన్యాసశ్రవణాది పుణ్యకర్మపరిపాకవశమున విద్వాంసుడైయాజన్మమునప్రారబ్ధవిశేషబలముచే కించిత్కాలము సంసారమునుపొంది యంతిమకాలమునందు చరమావస్థయం దైననునీబ్రహ్మనిష్ఠయందుం

డినవాఁడై నిష్క్రియము, నిత్యానందైకరసము, బ్రహ్మరూపము నగు ముక్తిని పొందుచున్నాడు. "విజ్ఞాయ చరమావస్థాం దేవతాభ్యో నృపోత్తమః । ఖట్వాంగో నామ రాజర్షి ర్ముహూర్తే ముక్తిమేయివాన్ ॥" రాజర్షి యగు ఖట్వాంగమహారాజు దేవతలవలన తనచరమావస్థను తెలిసికొని రెండుఘడియలందు మోక్షమును పొందెనని ఖట్వాంగచరిత్రము కలదు. కాన విదేహకైవల్యమును కోరెడివారలు బాహ్యమునందు ప్రవృత్తిని వదలి యాబ్రహ్మనిష్ఠయందె సర్వదా యుండవలెనని సిద్ధము.

ఇట్లు శ్రీశంకరానందసరస్వతీ విరచిత శ్రీమద్భగవద్గీతా ద్వితీయాధ్యాయవాక్య
తాత్పర్యబోధినికి 'తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార'
బులుసు అప్పన్నశాస్త్రిచే రచియింపఁబడిన తాత్పర్యబోధిని
సమాప్తము.

భాష్యోత్కర్షదీపిక:— జ్ఞాననిష్ఠను స్తుతించుచు "ఏషా తేఽభిహితా సాంఖ్యే" అను శ్లోకముచే నుపసంహరించుచుండెను.

సర్వమును విడచి బ్రహ్మరూపముచే నవస్థానమింతవరకు చెప్పబడెను. ఇట్టి బ్రాహ్మీస్థితిని పొందినవాడు మోహమును పొందడు. వార్ధక్యావస్థయందైన నిట్టి బ్రాహ్మీస్థితియం దుండినచో మోక్షమును పొందుచున్నాడు. ఇక బాల్యావస్థయందే బ్రహ్మనిష్ఠుడై చరించువాఁడు మోక్షమును బొందు నని యేమిచెప్పవలెను? తప్పక మోక్షమును బొందును. నీకుకూడ నట్టి శోకమోహాభిభూతత్వరూపస్వభావ ముచితము కాదు. మరేమనిన? జీవన్ముక్తస్వభావమే న్యాయ్య మని సూచించుటకు "పార్థ" అని సంబోధించెను. లేక మత్సంబంధి వగు నీకు బ్రహ్మరూపమగు నాయందే యవస్థానము న్యాయ్య మని సూచించుటకు 'పార్థ!' అని సంబోధించెను.

ఈద్వితీయాధ్యాయమునందలి తత్పదలక్ష్యమగుపరమాత్మస్వరూపమునే త్వంపదలక్ష్యముగ ప్రతిపాదించు శ్రీకృష్ణపరమాత్మ చే— సాక్షాచ్ఛోకమోహనివృత్తికి హేతు వగు జ్ఞాననిష్ఠను సలక్షణముగను, ప్రధానముగను జ్ఞాననిష్ఠ కుపాయభూతమగు కర్మయోగనిష్ఠను గుణభావముచేత (అంగముగ) ను ప్రతిపాదించుచు నుపాదేయములగు కర్మజ్ఞాననిష్ఠలనెడి నిష్ఠాద్వయము ప్రకాశింపఁజేయఁబడెను.

ఇట్లు ధనపతిసూరివిరచిత శ్రీభగవద్గీతాద్వితీయాధ్యాయభాష్యోత్కర్షదీపికకు
"తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార"
బులుసు అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని
సమాప్తము.

పరమార్థప్రపా:— పూర్వోక్తలక్షణలక్షితము, బ్రహ్మాకారస్థితిరూపము నగు బ్రాహ్మీస్థితి యుపన్యసింపబడెను. ఇట్టి బ్రాహ్మీస్థితిని పొంది తిరుగ మోహమును పొందడు. దేహావసానసమయమునందైన నట్టి బ్రాహ్మీస్థితియందు క్షణకాలమైన నుండినచో నట్టివాడు బ్రహ్మనిర్వాణమును పొందుచున్నాడు. యావజ్జీవ మిట్టిస్థితియం దుండినచో నట్టివాఁడు మోక్షమును పొందునని యేమి చెప్పవలెను.

—• అథాధ్యాయతాత్పర్యమ్ •—

శ్లో॥ శోకో దేహాత్మబుద్ధ్యా భవతి నను నృణా మేష దేహాతిరిక్తో, దేహాద్యస్పృష్ట ఆత్మా విభు రనుపహతో హంతృహన్యత్వశూన్యః । తస్య జ్ఞానాన్న శోక స్తదిహ నిజమన శ్శుద్ధిత స్స్వధర్మా, ద్వేధోక్త స్స ద్వితీయే భృశ మిమ మతద స్సాంఖ్యయోగాధికారమ్ ॥

—• ద్వితీయాధ్యాయసముదితతాత్పర్యము •—

ఏ కారణముచే నాత్మ దేహాతిరిక్తుఁడు, దేహద్రష్ట, ఏకము, విభువు, నాశములేనివాఁడు, షాడ్భావ్యత్వధర్మశూన్యుఁడు ఆయియుండెనో. ఆ కారణముచే శోకము దేహాత్మబుద్ధిచే సంభవించుచున్నది. అట్టిశోకము మిథ్యయే. నిరుక్తాత్మజ్ఞానమువలన నాశోకము నివర్తించును. ఆత్మజ్ఞానము స్వీయమనశ్శుద్ధివలన కలుగును. మనశ్శుద్ధి స్వధర్మానుష్ఠానమువలన సంభవించును. స్వధర్మము వేదమునందు చెప్పఁబడెను. అను నీవిషయములను సాంఖ్యయోగాధికారమును ద్వితీయాధ్యాయమునందు శ్రీకృష్ణపరమాత్మ చెప్పెను.

ఇట్లు దైవజ్ఞపండితసూరివిరచిత శ్రీభగవద్గీతాద్వితీయాధ్యాయపరమార్థప్రపకు
“తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార”
బిరుదు అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని
సమాప్తము.

సదానందీయము—

“బంధోచ్ఛేద్యాత్మబోధం తదను మతిమలోచ్ఛేదనార్థం స్వధర్మం
తజ్జాం శుద్ధిం తతోఽద్ధాఽఖిలకరణఫలం జ్ఞాననిష్ఠాం పరేష్టామ్ ।
యో భక్తాయ ప్రియాయావదదమలయశాః శ్రీపతిర్ధర్మగోప్తా
స శ్రీకృష్ణోఽఖిలస్య భ్రమతిమిరహరో భాతు భాస్వాన్మమాంతః ॥”

మొట్టమొదట బంధనివర్తకమగు ఆత్మజ్ఞానమును, అనంతరమున జ్ఞానమలనాశమునిమిత్తము స్వధర్మమును, ఆటుపిమ్మట స్వధర్మానుష్ఠానమువలన జనించెడి శుద్ధిని, అనంతరమున నిఖిలకరణఫలమగు నీశ్వరసమ్మతజ్ఞాననిష్ఠను, ఏమహానుభావుఁడు-తనకు భక్తుడుప్రియుఁడు నగు నర్జునునికొరకు చెప్పెనో యట్టి ధర్మగోప్తయు, నిర్మలయశస్కుఁడు, శ్రీపతియు, నిఖిలప్రాణుల భ్రమతిమిరమును హరించునట్టి శ్రీకృష్ణపరమాత్మయనెడి సూర్యుఁడు నాయంతఃకరణమునందు ప్రకాశించుఁగాక!

ఇట్లు సదానందవిద్వత్కృత శ్రీభగవద్గీతాద్వితీయాధ్యాయభావప్రకాశకు ‘తర్కరత్న,
న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార’ బిరుదు అప్పన్నశాస్త్రివిరచిత
తాత్పర్యబోధిని సమాప్తము.

నీలకంఠీయము:— కర్మయోగప్రాప్యము, పూర్వోక్తమునగు సాంఖ్యయోగనిష్ఠను ఫలద్వారమున స్తుతించుచు నుపసంహరించుచుండెను.

“బ్రాహ్మీ” ఇచట బ్రహ్మశబ్దముచే ‘బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి’ అను శ్రుతిచొప్పున బ్రహ్మవేత్త చెప్పబడును. అట్టి బ్రహ్మవేత్తయొక్క నిష్ఠ స్థితప్రజ్ఞలక్షణప్రసంగమున చెప్పబడెను. మనుష్యుడిట్టి నిష్ఠను పొంది తిరిగి మోహమును పొందకుండును. ఇట్టిబ్రాహ్మీనిష్ఠయందంతకాలమునందైన నుండినచో (అనగా ఉపాసనవలె చిరకాలాభ్యాసాపేక్షము కాక యంతకాలమునందొక్కసారి ఈబ్రాహ్మీనిష్ఠకలిగినను) బ్రహ్మమును పొందుచున్నాడు. లోకాంతరమును పొందినటుల బ్రహ్మము పొందదగినదా? యనిన అటుల కానేరదు. మఱేమనిన ‘నిర్వాణం నిర్గతం వానం గమనం యస్మిన్ ప్రాప్యే బ్రహ్మణి తన్నిర్వాణం’ ఏప్రాప్యమగు బ్రహ్మవిషయమై గమనము సంభవింపదో యట్టిబ్రహ్మమును గమనములేకుండగనే పొందును. ఈవిషయమై ‘న తస్య ప్రాణా ఉత్క్రామన్త్యత్రైవ సమవలీయన్తే బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి’ (బ్రహ్మవేత్తయొక్క ప్రాణము ఉత్క్రమిం-

చవు. అచటనే లయించును. బ్రహ్మవేత్త బ్రహ్మస్వరూపుడై బ్రహ్మమును పొందును) అను శ్రుతియు—గమనము లేకుండగనే ప్రాణరూపోపాధిప్రవిలయమాత్రమువలన (ఘటరూపోపాధినాశనమువలన ఘటాకాశమునకు మహాకాశప్రాప్తివలె) జీవునకు బ్రహ్మప్రాప్తిని చెప్పుచున్నది. "అంతకాలేఽపి" అనుచోటనుండు (అపి) శబ్దమువలన—నెవడు బ్రహ్మచర్యము మొదలుకొని బ్రాహ్మీనిష్ఠయం దుండునో వాఁడు బ్రహ్మనిర్వాణమును పొందునని యేమిచెప్పవలయును? అని కైముతిక న్యాయముచే సిద్ధించుచున్నది.

ఇట్లు శ్రీనీలకంఠాచార్యవిరచిత శ్రీభగవద్గీతా ద్వితీయాధ్యాయ భగవద్గీతా ప్రకాశకు
బులుసు వెంకటశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని
సమాప్తము.

శ్రీధరీయము:— పూర్వమునందు చెప్పఁబడిన జ్ఞాననిష్ఠను స్తుతిచేయుచు నుపసంహరించుచుండెను. పరమేశ్వరారాధనచే పరిశుద్ధాంతఃకరణములుకల పురుషుఁడిట్టి బ్రాహ్మీస్థితిని పొంది తిరిగి సంసారమోహమును పొందడు. అంతకాలమునందుకూడ (మృత్యుసమయమునందుకూడ) క్షణకాలమైన నీబ్రహ్మజ్ఞాననిష్ఠయం దుండిన మనుజుఁడు బ్రహ్మమునందు లయమును పొందును. ఇక బాల్యావస్థమొదలుకొని బ్రహ్మజ్ఞాననిష్ఠయం దుండువాఁడు మోక్షమును పొందు నని యేమిచెప్పవలయును? చెప్పనవసరములేదు.

శ్లో॥ శోకపంకనిమగ్నం యః సాంఖ్యయోగోపదేశతః ।
ఉజ్జహారార్జునం భక్తం స కృష్ణః శరణం మమ ॥

శోకపంకమునందు మునిగియుండిన స్వభక్తుఁడగు నర్జునుని సాంఖ్యయోగము నుపదేశించి యెవఁ డుద్ధరించెనో యట్టి శ్రీకృష్ణపరమాత్మ నాకు శరణము.

ఇట్లు శ్రీధరవిరచిత శ్రీభగవద్గీతాద్వితీయాధ్యాయటీకకు "తర్కరత్న,
న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార" బులుసు
అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని
సమాప్తము.
హరిః ఓం తత్స దబ్రహ్మార్పణమస్తు.
ద్వితీయాధ్యాయము సమాప్తము.

శుభమస్తు.

# శ్రీభగవద్గీతా

# శాంకరభాష్యతత్త్వబోధిని

## తృతీయోఽధ్యాయః.

గీ॥ అర్జున ఉవాచ — జ్యాయసీచే త్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన ।
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ! ॥ ॥౧॥

పదవిభాగము:— అర్జునః- ఉవాచ- జ్యాయసీ- చేత్- కర్మణః- తే- మతా- బుద్ధిః- జనార్దన- తత్- కిం- కర్మణి- ఘోరే- మాం- నియోజయసి- కేశవ! । ॥౧॥

ప్రతిపదార్థము:—అర్జునః=అర్జునుడు; ఉవాచ=పలికెను; హేజనార్దన!=ఓశ్రీకృష్ణపరమాత్మా!; తే=నీకు; బుద్ధిః=జ్ఞానము; కర్మణః=కర్మకంటె; జ్యాయసీ=ఉత్కృష్టమైనదై; మతాచేత్=సమ్మతమైనచో; తత్=అప్పుడు; కిం=ఏ కారణమువలన; ఘోరే=ఘోరమగు; కర్మణి=హింసాదిరూపకర్మయందు; మాం=నన్ను; నియోజయసి ?=ఆజ్ఞాపించుచుంటివి ? ॥౧॥

శాంకరభాష్యమ్:—

(1) శాస్త్రస్య ప్రవృత్తినివృత్తివిషయభూతే ద్వే బుద్ధీ భగవతా నిర్దిష్టే సాంఖ్యే బుద్ధి ర్యోగే బుద్ధి రితి చ । తత్ర "ప్రజహాతి యదా కామాన్" (గీ 2-అ-55-శ్లో) ఇత్యారభ్యాఽఽధ్యాయపరిసమాప్తే స్సాంఖ్యబుద్ధ్యాశ్రితానాం సంన్యాసం కర్తవ్య ముక్త్వా తేషాం తన్నిష్ఠతయైవ చ కృతార్థతోక్తా— "ఏషా బ్రాహ్మీ స్థితిః" (గీ 2-అ-72శ్లో) ఇతి । అర్జునాయ చ "కర్మణ్యే వాధికార స్తే, మా తే సంగో స్త్వకర్మణి" (గీ 2-అ-47-శ్లో) ఇతి కర్మైవ కర్తవ్య ముక్త్వా న్యోగబుద్ధి మాశ్రిత్య, న తత ఏవ శ్రేయఃప్రాప్తి ముక్తవాన్ ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(1) ద్వితీయాధ్యాయతృతీయాధ్యాయములకు సంబంధ మేమనిన? గీతాశాస్త్రప్రారంభమున కపేక్షితములు ప్రవృత్తినివృత్తులు విషయముగా గల బుద్ధులు రెండు. అవి యేవనిన ? యోగబుద్ధియు, సాంఖ్యబుద్ధియు, ఆ రెంటిలో యోగబుద్ధి సాధనము, సాంఖ్యబుద్ధి సాధ్యము (ఫలము). అట్టి సాధనసాధ్యము అగు రెండుబుద్ధులు. శ్రీకృష్ణపరమాత్మచే ద్వితీయాధ్యాయమునందుపదేశింపఁబడెను. అందునను "ప్రజహాతి యదా కామాన్" అనుశ్లోకము మొదలు అధ్యాయ

—॥ ౩వ అధ్యాయము- ౧ శ్లోకవ్యాఖ్యావిశేషములు ॥—

మధుసూదనసరస్వతీయము:— "ప్రథమాధ్యాయముచే నుపోద్ఘాతిత మైన శాస్త్రవిషయము ద్వితీయాధ్యాయమునందు సూత్రిత మయినది (సంగ్రహముగఁ జెప్పఁబడెను). ఎట్లన ! ప్రథమమున విష్కామకర్మ

శాంకరభాష్యమ్:—

(2) తదేత దాలక్ష్య పర్యాకులీభూతబుద్ధి రర్జున ఉవాచ- కథం భక్తాయ శ్రేయోర్థినే యత్సాక్షా చ్ఛ్రేయస్సాధనం సాంఖ్యబుద్ధినిష్ఠాం శ్రావయిత్వా మాం కర్మణి దృష్టానేకానర్థయుక్తే పారంపర్యేణా ప్యనైకాన్తికశ్రేయఃప్రాప్తిఫలకే నియుంజ్యాదితి యుక్తః పర్యాకులీభావోఽర్జునస్య । తదనురూపశ్చ ప్రశ్నో "జ్యాయసీచే" దిత్యాదిః । ప్రశ్నాపాకరణవాక్యం చ భగవతోక్తం యథోక్తవిభాగవిషయే శాస్త్రే ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పరిసమాప్తివరకు నగు గ్రంథభాగముచే సాంఖ్యబుద్ధి నాశ్రయించినవారలకు సంన్యాసము కర్తవ్యమని చెప్పి యట్టివారలకు 'ఏషా బ్రాహ్మీ స్థితిః' అను శ్లోకముచే జ్ఞాననిష్ఠచేతనే కృతార్థత్వము నుపపాదించెను. అర్జునునికో అకైతే "కర్మణ్యే వాధికార స్తే- మా తే సంగోఽస్త్వకర్మణి" అను వానిచే యోగబుద్ధి నాశ్రయించి కర్మయే చేయఁదగిన దని చెప్పెను. ఇట్టి కర్మవలన మోక్షము ప్రాప్తించు నని యేమియుఁ జెప్పియుండలేదు.

(2) కాన భగవంతుఁ డగు శ్రీకృష్ణపరమాత్మచేఁ జెప్పఁబడిన విషయమునందు సందేహముఁ బొందుచుండిన యర్జునునకు విషయనిర్ణయకాంక్షచే ప్రశ్నప్రవృత్తి గలిగెను. అందువలన ద్వితీయాధ్యాయతృతీయాధ్యాయములకు ఉత్థాప్యోత్థాపకస్వరూపమగు సంగతి గలదు. కాన ద్వితీయాధ్యాయానంతరమున నీతృతీయాధ్యాయముఁ జెప్పుట సమంజసమే.

ద్వితీయాధ్యాయమునందుఁ జెప్పఁబడిన విషయమును విని యర్జునుఁడు వ్యాకుల మగు బుద్ధికలవాఁడై యిట్లు ప్రశ్నించెను. అర్జునుని బుద్ధికి వ్యాకులత యేమనిన ? సాక్షాత్తు మోక్షమునకు సాధన మగు జ్ఞాననిష్ఠను శ్రేయోర్థియు, భక్తుఁడు నగు నాకొకనికిఁ జెప్పి శ్రేయోర్థిని కానివానివలె భక్తుండను కానివానివలె నన్నుఁగూర్చి పరంపరచేఁ గూడ మోక్షము ప్రాప్తించు నను ఫలనియమము లేనట్టియు, దృష్ట మగు గురుభ్రాతృపితృపుత్రా ద్యనేకవధాత్మకానేకానర్థసంకలితము నగు నీయుద్ధకర్మమునం దెట్లు నియోగించె నని యర్జునునకు పర్యాకులత్వము (వ్యాకులత్వము) న్యాయమే. క్షత్రియకర్మ యగు యుద్ధమునందు గురుభ్రాతృహింసాదిరూప మగు దృష్టానేకానర్థములు సంభవించుట సిద్ధమే. అట్టి దృష్టానేకానర్థసంబంధము బుద్ధిశుద్ధిద్వారమున నైన, వర్తమానజన్మమందైన ఫలము ననుభవించు నను నియమము లేనట్టి యుద్ధమునందు శ్రేయోర్థిని, భక్తుఁ డను నగు నన్ను భగవంతుఁడు ఆజ్ఞాపించుట యుక్తము కాదు. అని

నిష్ఠయు, నద్దానివలన నంతఃకరణసంశుద్ధియు, అనంతరము శమదమాది సాధనపురస్సర మగు సర్వకర్మసంన్యాసము, అనంతరము వేదాంతవాక్యవిచారసహితభగవద్భక్తినిష్ఠయు, అనంతరము తత్త్వజ్ఞాననిష్ఠయు కలుగును. దీనికి తత్త్వజ్ఞాననిష్ఠచేఁ ద్రిగుణాత్మికావిద్యానివృత్తియై జీవన్ముక్తిరూపఫలము ప్రాప్తించును. ఇది ప్రారబ్ధకర్మఫలము ననుభవించువరకు నుండును. తదంతమునందు విదేహముక్తిరూపఫలము ప్రాప్తించును. జీవన్ముక్త్యవస్థయందు పరమపురు-

శాంకరభాష్యము:—

(౩) కేచి త్త్వర్జునస్య ప్రశ్నార్థ మన్యథా కల్పయిత్వా తత్ప్రతికూలం భగవతః ప్రతివచనం వర్ణయన్తి. యథా చాత్మనా సంబంధగ్రంథే గీతార్థో నిరూపిత స్తత్ప్రతికూలం చేహా పునః ప్రశ్నప్రతివచనయో రర్థం నిరూపయన్తి । కథం ? తత్ర సంబంధగ్రంథే తావ త్సర్వేషా మాశ్రమిణాం జ్ఞానకర్మణో స్సముచ్చయో గీతాశాస్త్రే నిరూపితోఽర్థ ఇత్యుక్తం పున ర్విశేషితం చ యావజ్జీవశ్రుతిచోదితాని కర్మాణి పరిత్యజ్య కేవలాదేవ జ్ఞానా న్మోక్షః ప్రాప్యత ఇత్యేత దేకాన్తేనైవ ప్రతిషిద్ధ మితీహా త్వాశ్రమవికల్పం దర్శయతా యావజ్జీవశ్రుతిచోదితానా మేవ కర్మణాం పరిత్యాగ ఉక్తః తత్కథ మీదృశం విరుద్ధ మర్థ మర్జునాయ బ్రూయా ద్భగవాన్. శ్రోతా చ కథం విరుద్ధ మర్థ మవధారయేత్ ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

యర్జునుఁడు పర్యాకులుఁడాయెను. అర్జునుని బుద్ధివ్యాకులత కనుగుణమయినదే "జ్యాయసీ చే త్కర్మణస్తే" ఇత్యాదిప్రశ్నయు నగును. జ్ఞాననిష్ఠులకు కృతార్థతయు, కర్మనిష్ఠుల కకృతార్థతయు అను విభాగమును దెలుపు అర్జునుని ప్రశ్నమును దొలఁగించుటకు "లోకేఽస్మి న్ద్వివిధా నిష్ఠా" అను శాస్త్రమునందును భగవదుక్తమగు వాక్యము సమర్థ మగుచున్నది.

(౩) ఇంతవరకుఁ దేలిన యాశయ మేమి ? సాక్షాత్తు శ్రేయస్సాధనమగు జ్ఞానము నితరులకుఁ జెప్పి శ్రీకృష్ణపరమాత్మ నాకుమాత్ర మట్టి శ్రేయస్సాధనమును జెప్పలేదని తలచి యర్జునుఁడు వ్యాకులచిత్తుఁడై 'జ్యాయసీ చే త్కర్మణస్తే' అని ప్రశ్నించెను. కాన పూర్వోత్తరాధ్యాయముల కుత్థాప్యోత్థాపకత్వసంగతి కలదు. కొంతమంది (వృత్తికారాదులు) ప్రశ్నార్థము నన్యథా కల్పనచేసి త ద్విరుద్ధముగ భగవంతుని సమాధానమును వర్ణించుచుండిరి. అది యేమనినః అర్జునుఁడు జ్ఞానకర్మలకు సముచ్చయమును నిశ్చయించుకొనుటకు 'జ్యాయసీ చే త్కర్మణ స్తే' అని ప్రశ్నించెనని వృత్తికారులు చెప్పెదరు. అటులైన భగవంతుఁడు ప్రతివచనముకూడ సముచ్చయముగనే చెప్పవలయును. అట్లుత్తరగ్రంథమునందు భగవంతుఁడు చెప్పియుండలేదు. జ్ఞానకర్మ సముచ్చయమును భగవంతుఁ డంగీకరించుటచేతనే యర్జునుని ప్రశ్నము దొలఁగుచుండ నట్లుకాక "లోకేస్మి న్ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ ! జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం' అని జ్ఞానకర్మములు భిన్నపురుషాశ్రితములుగఁ జెప్పుటవలన వృత్తికారమతమున ప్రశ్నప్రతివచనములకు విరోధము సంభవించును.

పూర్వాలంబనముగ నుత్కృష్టమగు వైరాగ్యము ప్రాప్తించును. దైవసంపత్తనెడి శుభవాసన యట్టి వైరాగ్యమునకు కారణమగుటచే గ్రహింపఁదగినది. అసురసంపత్తనెడి యశుభవాసన వైరాగ్యమునకు విరోధి యగుటచే విడువఁదగినది. దైవసంపత్తునకు సాత్త్వికీవృత్తిరూపమగు శ్రద్ధ యసాధారణకారణ మగును. అసురసంపత్తునకు రాజసవృత్తిరూపము, తామసవృత్తిరూపము నగు నశ్రద్ధ కారణ మగును" అను నీహేయోపాదేయవిభాగముచే సమస్త

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మరియు వృత్తికారమతమునందు కేవల ప్రశ్నప్రతివచనములయందుమాత్రమే విరోధము సంభవించుటకాదు. మఱేమనిన; వృత్తికారుల గ్రంథమునందుఁగూడ పూర్వాపరవిరోధము కలదు. అది యెట్లనిన ? సంబంధగ్రంథ (గీతాశాస్త్రారంభగ్రంథ) మునందు వృత్తికారులేవిధముగ గీతార్థమును నిరూపించియుండిరో; దానికి విరుద్ధముగ నీ తృతీయాధ్యాయ ప్రథమము నందుఁగల ప్రశ్నప్రతివచనముల కర్థమును నిరూపించుచుండిరి. ఎట్లనిన ? వృత్తికార వ్యాఖ్యయందుగల గీతాశాస్త్రారంభగ్రంథమునందు నిఖిలమగు నాశ్రములకు జ్ఞానకర్మసముచ్చయము గీతాశాస్త్రమునందు నిరూపింపబడినవిషయమని చెప్పబడెను. ఇట్లు చెప్పుటయేకాక తిరుగ "యావజ్జీవ మగ్నిహోత్రం జుహుయాత్" అను శ్రుతిచోదితములగు కర్మలను పరిత్యజించి కేవల జ్ఞానమువలననే మోక్షము పొందఁబడును. అనుమతము 'యావజ్జీవ మగ్నిహోత్రం జుహుయాత్' అను శ్రుతికి విరుద్ధముగుటవలన నియమముగ నిషిద్ధమైనదని చెప్పి యిచట నాశ్రమవికల్పమును జూపి జ్ఞాననిష్ఠులకు యావజ్జీవశ్రుతిచోదితకర్మలయొక్క పరిత్యాగము చెప్పఁబడెను. (కాన వృత్తికారగ్రంథము పూర్వాపరవిరోధము కలది.)

భగవంతుఁ డేవిధముగఁ జెప్పెనో అదే విధమున వృత్తికారులు చెప్పెను. కాన వృత్తికారుల దేమి యపరాధము? అని శంకింపఁజనదు. భగవంతుఁడగు శ్రీకృష్ణపరమాత్మ యర్జునునికొఱ కిట్టి విరుద్ధార్థము నెట్లు చెప్పును? చెప్పఁడని యాశయము. పరమాప్తుఁడు, సర్వజ్ఞుఁడు, అనగా భగవంతుఁడు నగు శ్రీకృష్ణపరమాత్మ విరుద్ధార్థవాది కాఁడు. కాన విరుద్ధార్థమును జెప్పడు. మఱేమనిన? శ్రీకృష్ణాభిప్రాయమును దెలిసికొనకపోవుటచే వ్యాఖ్యాత లగు వృత్తికారులకే విరుద్ధార్థవాదిత్వమని యర్థము.

'భగవంతునకు విరుద్ధార్థవాదిత్వము లేకున్నను శ్రోతయగు నర్జునుఁడే విరుద్ధముగ గ్రహించెను. అట్టి శ్రోతయగు నర్జునుని జ్ఞానము ననుసరించి వ్యాఖ్యజేయు వృత్తికారుల దేమి యపరాధము' అని శంకిపవలదు. శ్రోతయు విరుద్ధార్థము నెట్లు గ్రహించును ? గ్రహించఁడని యర్థము. (అనగా శ్రోత యర్జునుఁడా? అట్టి యర్జునుడు బుద్ధిపూర్వకముగఁ జేయువాడా? అట్టి యర్జునుఁడు భగవదుక్తార్థమును దెలిసికొని విరుద్ధార్థమును గ్రహించుటకు తగఁడు. కాన వృత్తికాయలదే విరుద్ధార్థవాదిత్వమని యర్థము.)

---

శాస్త్రవిషయము పరిసమాప్త మగును. అట్లగుటచే నీద్వితీయాధ్యాయమునందు 'యోగస్థః కురు కర్మాణి' అను మొదలగుదానిచే సత్త్వశుద్ధిసాధనభూత మగు నిష్కామకర్మనిష్ఠ సూత్రితమైనది. ఇదియే సామాన్యవిశేషరూపముగ తృతీయచతుర్థాధ్యాయములచే వివరింపఁబడును. శుద్ధాంతఃకరణుని దగు శమదమాదిసాధనసంపత్తిపురస్సర మగు సర్వకర్మసంన్యాసనిష్ఠ 'విహాయ సర్వాన్యః కామా' నిత్యాదికముచే ద్వితీయాధ్యాయమున సూత్రిత మైనది. ఈసర్వకర్మసంన్యాసనిష్ఠయే సంక్షేపముగను, విస్తరముగను పంచమషష్ఠాధ్యాయములయందు నిరూపింపఁబడును.

శాంకరభాష్యమ్:—

(4)తత్రైతస్మా ద్గృహస్థానా మేవ శ్రౌతకర్మపరిత్యాగేన కేవలాదేవ జ్ఞానాన్మోక్షః ప్రతిషిధ్యతే న త్వాశ్రమాన్తరాణా మిత్యేతదపి పూర్వోత్తరవిరుద్ధమేవ। కథం, సర్వాశ్రమిణాం జ్ఞానకర్మణో స్సముచ్చయో గీతాశాస్త్రే నిశ్చితోఽర్థ ఇతి ప్రతిజ్ఞాయేహ కథం తద్విరుద్ధం కేవలా దేవ జ్ఞానా న్మోక్షం బ్రూయా దాశ్రమాన్తరాణామ్। అథ మతం శ్రౌతకర్మాపేక్షయైత ద్వచనం కేవలా దేవ జ్ఞానా చ్ఛ్రౌతకర్మరహితా ద్గృహస్థానాం మోక్షః ప్రతిషిధ్యత ఇతి।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(4) సంబంధగ్రంథమునందైతే వృత్తికారాభిప్రేత మేదనిన? పతిపక్షజ్ఞానమునువిడచియే యాజ్ఞికుశ్రుతిచోదితంబగు నగ్నిహోత్రాదికర్మపరిత్యాగపూర్వకంబుగ కేవలాపాతాత్మజ్ఞానము వలన మోక్షము నపేక్షించు గృహస్థులకు మోక్షము నిషేధింపబడెను. కాని స్వరూపముచే కర్మత్యాగముగాని, జ్ఞానమువలన మోక్షముగాని నిషేధింపబడలేదు. తృతీయాధ్యాయమునందైతే కర్మలను వదలినట్టియు, గృహస్థులు కానట్టివారలకు కేవలాత్మజ్ఞానమువలన మోక్షము వివక్ష చేయబడెను. కాన నుపక్రమగ్రంథమునందలి నిషేధము, తృతీయాధ్యాయమునందలి యభ్యనుజ్ఞ భిన్నవిషయకము లగుటచే వృత్తికారమతమునందు విరోధాశంక లేదు. అనిన నిదియు పూర్వోత్తరవిరుద్ధమే యగును. ఎట్లనిన? సర్వాశ్రములకు జ్ఞానకర్మల సముచ్చయము గీతాశాస్త్రమునందు నిశ్చితమగు నర్థమని సంబంధగ్రంథమునందు ప్రతిజ్ఞ చేసి ఈతృతీయాధ్యాయమునందు తద్విరుద్ధముగ నాశ్రమాంతరులకు కేవలజ్ఞానమువలన మోక్షము నెటుల జెప్పును? అట్లు వృత్తికారులు చెప్పినచో పూర్వాపరవిరోధ మెందులకు ప్రాప్తింపదు. ప్రాప్తించుననియే యాశయము లేక మఱియొక మతము. శ్రౌతకర్మాపేక్షచే నేతద్వచనము అనెదవా? ఆవచన మేదనిన?

'శ్రౌతకర్మము గృహస్థుల కవశ్యము చేయదగినది." అను యభిప్రాయముచే గృహస్థులకు శ్రౌతకర్మవిహితమగు కేవలాత్మజ్ఞానమువలన మోక్షము నిషేధింపబడెను. కాని ఆశ్రమాంతరులకు గూడ జ్ఞానమునకు స్మార్తకర్మలతో సముచ్చయము నంగీకరించుటచే గృహస్థులకు కేవలజ్ఞానమాత్రాయత్త మగు మోక్షమును నిషేధించి, యితరులకు కేవలాజ్ఞానాధీన మగు మోక్షము వివక్షచేయబడుటలేదు. కాన వృత్తికారమతమునందు విరోధము ప్రాప్తించదు.

ఇందుచే త్వంపదార్థము గూడ నిరూపించబడెను. వేదాంతవాక్యవిచారరహితమగు భగవద్భక్తినిష్ఠ "యుక్త ఆసీత మత్పరః" ఇత్యాదికముచే ద్వితీయాధ్యాయమునం దనేకవిధముల సూత్రితమైనది. ఈభక్తినిష్ఠయే ద్వితీయషట్కముచే బ్రతిపాదింపబడగలదు. అందుచేదత్పదార్థము నిరూపించబడెను. (ప్రత్యధ్యాయమునందు అవాంతరసంగతిని, అవాంతరప్రయోజనభేదమును నాయాప్రదేశములయందే చూపగలము.) 'వేదావినాశినం నిత్యం' ఇత్యా

శాంకరభాష్యమ్:—

(5) తత్ర గృహస్థానాం విద్యమాన మపి స్మార్తం కర్మావిద్యమానవ దుపేక్ష్య జ్ఞానా దేవ కేవలా దుచ్యత ఇతి । ఏత దపి విరుద్ధమ్ । కథం? గృహస్థస్యైవ స్మార్తకర్మణా సముచ్చితా జ్జ్ఞానా న్మోక్షః ప్రతిషిధ్యతే న త్వాశ్రమాన్తరాణా మితి కథం వివేకిభి శ్శక్య మవధారయితుమ్ ।

(6) కించ యది మోక్షసాధనత్వేన స్మార్తాని కర్మా ణ్యూర్ధ్వరేతసాం సముచ్చీయన్తే తథా గృహస్థస్యా పీష్యతాం స్మార్తై రేవ సముచ్చయో న శ్రౌతైః । అథ శ్రౌతై స్స్మార్తైశ్చ గృహస్థస్యైవ సముచ్చయో మోక్షా యోర్ధ్వరేతసాం తు స్మార్తకర్మమాత్రసముచ్చితా జ్జ్ఞానా న్మోక్ష ఇతి । తత్రైవం సతి గృహస్థస్యాయాసబాహుల్యా చ్ఛ్రౌతం స్మార్తం చ బహుదుఃఖరూపం కర్మ శిర స్యారోపితం స్యాత్ ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(5) గృహస్థులకు శ్రౌతకర్మపరిత్యాగపూర్వకంబగు కేవలజ్ఞానమువలన మోక్షము సంభవింపదని చెప్పబడెను. శ్రౌతకర్మను విడచి స్మార్తకర్మనుమాత్ర మాచరించుచుండెడి గృహస్థుని జ్ఞానము స్మార్తకర్మసముచ్చితమగుచుండ నట్టి గృహస్థుని జ్ఞానమునకు కేవలత్వ మెటుల ప్రాప్తించును? అట్టి గృహస్థునకు కేవలజ్ఞానమువలన మోక్షము సంభవింపదని నిషేధించుట యెట్లు పొసగుననిన? గృహస్థులకు ప్రధానమైనది శ్రౌతకర్మము. అట్టి శ్రౌతకర్మను విడచి స్మార్తకర్మ నాచరించుచుండినను ఆస్మార్తకర్మమును లేనిదానినిగఁ దలచి శ్రౌతకర్మము లేమిం జేసి కేవల జ్ఞానమువలన నట్టి గృహస్థునకు మోక్షము సంభవింపదని నిషేధించుట సమంజసమే యగుననిన నిదియు విరుద్ధమే. ఎట్లు? గృహస్థులకు శ్రౌతస్మార్తకర్మసముచ్చితమగు నాత్మజ్ఞానముచేతనే మోక్షము సంభవించునని చెప్పుటవలన కేవలస్మార్తకర్మసముచ్చితమగు జ్ఞానమువలన గృహస్థునకు మోక్షము నిషేధింపబడెను. ఆశ్రమాంతరులకు ఈనిషేధము లేదు. ఇట్లనుటవలన నాశ్రమాంతరులకు కేవల స్మార్తకర్మసముచ్చిత మగు జ్ఞానముచే మోక్షము ప్రాప్తించుననికదా యాశయము. ఈవిషయము వివేకులచే నెటుల నిశ్చయించుకొనుటకు శక్యమగును? శక్యము కానేరదనియర్థము. అనగానిటుల తెలిసికొనుటకు హేతువులేదని యాశయము.

(6) మఱియు పరమహంసపరివ్రాజకుల స్మార్తకర్మములు బ్రహ్మజ్ఞానముతో మోక్షసాధనమై సముచ్చయమును బోధించినచో అటులే గృహస్థుయొక్క బ్రహ్మజ్ఞానము కూడ బ్రహ్మజ్ఞాన మగుటంజేసి స్మార్తకర్మలతో సముచ్చితమేయై మోక్షసాధన మగును.

ఠికముచే ద్వితీయాధ్యాయమున సూత్రితమును, తత్త్వంపదార్థైక్యజ్ఞానరూపము నగు తత్త్వజ్ఞాననిష్ఠ త్రయోదశాధ్యాయమునను, "త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున!" ఇత్యాదికముచే ద్వితీయాధ్యాయమున సూత్రితము, ప్రకృతిపురుషవివేకద్వారమున బ్రపంచితమగు జ్ఞాననిష్ఠకు ఫలభూతమునగు త్రైగుణ్యనివృత్తి చతు-

శాంకరభాష్యమ్:—

(7) అథ గృహస్థస్యైవ ఆయాసబాహుల్యకారణాన్మోక్షస్స్యాన్నాశ్రమాన్తరాణాం శ్రౌతనిత్యకర్మరహితత్వాదితి। తదప్యసత్, సర్వోపనిషత్స్వితిహాసపురాణయోగశాస్త్రేషు చ జ్ఞానాఙ్గత్వేన ముముక్షోస్సర్వకర్మసంన్యాసవిధానాదాశ్రమవికల్పసముచ్చయవిధానాచ్చ శ్రుతిస్మృత్యోః।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

గృహస్థులయొక్క బ్రహ్మజ్ఞానము కేవలస్మార్తకర్మసముచ్చితమై మోక్షసాధనము కుచో? శ్రౌతకర్మల యనుష్ఠానము లేమింజేసి "యావజ్జీవమగ్నిహోత్రం జుహుయాత్" బ్రతికియున్నంత కాల మగ్నిహోత్రము చేయవలె నను శ్రుతి వ్యర్థమయ్యెడిని. కాన శ్రుతిబలమున గృహస్థు యొక్క బ్రహ్మజ్ఞానము శ్రౌతస్మార్తకర్మలతో సముచ్చితమై మోక్షమునకు సమర్థమగును. పరమహంసపరివ్రాజకుల బ్రహ్మజ్ఞానము స్మార్తకర్మసముచ్చితమై మోక్షసాధనము కానేరదా? అట్లయిన గృహస్థున కాయాసబాహుల్యమువలన దుఃఖరూపమగు శ్రౌతస్మార్తకర్మలు శిరస్సునం దారోపితములు కావలసివచ్చును.

(7) సాధనభూయస్త్వముచే (సాధనము లనేకములుండుటచే) ఫలభూయస్త్వము (ఫలమధికము) సిద్ధించు నను న్యాయము ననుసరించి శ్రౌతస్మార్తకర్మముల ననుష్ఠించుటచే గలిగెడి యాయాసబాహుల్య మనెడి కారణమువలన గృహస్థునకే మోక్షము ప్రాప్తించును. యావజ్జీవాదిశ్రుతివిహితము, అవశ్యానుష్ఠేయము నగు కర్మ లేమింజేసి పరమహంసపరివ్రాజకులకు మోక్షము సంభవింప" దందువా! శాస్త్రమునకును, న్యాయమునకు విరోధము ప్రాప్తించినపుడు న్యాయ మప్రమాణము. కాన శాస్త్రము లగు సర్వోపనిషత్తులయందును, ఇతిహాసపురాణ యోగశాస్త్రములయందును ముముక్షువునకు జ్ఞానాంగముగ సర్వకర్మసంన్యాసము విధింపబడుట వలనను, 'బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవే ద్గృహీ ద్వనీ భూత్వా ప్రవ్రజే ద్యది వేతరథా బ్రహ్మచర్యా దేవ ప్రవ్రజే ద్గృహాద్వా వనాద్వా" (బ్రహ్మచర్యమును సమాప్తినిబొందించి గృహస్థుకావలెను. అట్టి గార్హస్థ్యమునుండి వానప్రస్థు కావలెను. అట్టి వానప్రస్థాశ్రమమును

ర్దశాధ్యాయమునను, అట్టి త్రైగుణ్యనివృత్తియే జీవన్ముక్తియని గుణాతీతలక్షణకథనముచే బ్రపంచితమైనట్టియు, 'తదా గంతాసి నిర్వేదం' ఇత్యాదికముచే ద్వితీయాధ్యాయమున సూత్రితమైనట్టిపరమవైరాగ్యనిష్ఠసంసారవృక్షచ్ఛేదద్వారమున బంచదశాధ్యాయమునను, 'దుఃఖే ష్వనుద్విగ్నమనాః' ఇత్యాదిద్వితీయాధ్యాయస్థస్థితప్రజ్ఞలక్షణముచే సూత్రితము, పరవైరాగ్యోపకారకము, గ్రహింపదగినదియునగు దైవసంపత్తు, 'యా మిమాం పుష్పితాం వాచం' ఇత్యాదికముచే ద్వితీయాధ్యాయమున సూత్రితమైనట్టియు, పరమవైరాగ్యవిరోధినియు, పరిహరింపదగినదియునగు నాసురసంపత్తు షోడశాధ్యాయమునను 'నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో' ఇత్యాదికముచే ద్వితీయాధ్యాయమున సూత్రితమైనట్టియు దైవసంపత్తున కసాధారణకారణమైనట్టియు, సత్త్వగుణప్రధానమైన శ్రద్ధ విశోధపరి

శాంకరభాష్యమ్:—

(8) సిద్ధ స్తర్హి సర్వాశ్రమిణాం జ్ఞానకర్మణో స్సముచ్చయః । న, ముముక్షో స్సర్వకర్మసంన్యాసవిధానాత్ । "వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరన్తి । (బృ-4-4-42) తస్మా త్సంన్యాస మేషాం తపసా మతిరిక్త మాహుః । (నారా-78) న్యాస ఏవాత్యరేచయత్" (నారా-78) ఇతి । "న కర్మణా న ప్రజయా ధనేన త్యాగే నైకేఽమృతత్వమానశుః" (కై-1-2) ఇతి చ, "బ్రహ్మచర్యా దేవ ప్రవ్రజేత్" (జాబాల-4) ఇత్యాద్యాః "త్యజ ధర్మ మధర్మం చ ఉభే సత్యానృతే త్యజ। ఉభే సత్యానృతే త్యక్త్వా యేన త్యజసి త త్త్యజ" (మ-భా-శాం-329-40-

శాంకరభాష్యతత్త్వబోధిని:—

బొంది సంన్యసింపవలెను) అని యొకనికే యాశ్రిత బ్రహ్మచర్య; గార్హస్థ్య వానప్రస్థ సంన్యాసాశ్రమములను క్రమముగ జెప్పి, (ఆశ్రమసముచ్చయమును జెప్పి) అటులకానిచో బ్రహ్మచర్యమునుండియే సంన్యసింపవలయును. లేదా గార్హస్థ్యమునుండిగాని, వానప్రస్థాశ్రమమునుండియైననుగాని సంన్యసింపవలెనని యాశ్రమవికల్పమును విధించి, సంన్యాసమును ప్రధానముగ విధించుటవలనను "య మిచ్ఛే త్త మావసేత్" అనుస్మృతియు ఆశ్రమసముచ్చయవికల్పన పురస్సరముగ సంన్యాసమును జ్ఞానాంగముగ విధించుటచే "శ్రౌతకర్మరహితు లగుటంజేసి సంన్యాసులకు మోక్షముప్రాప్తించ" దని చెప్పుటయు సంగతముకాదు.

(8) "సర్వాశ్రమములును శ్రుతిస్మృతీమూలకములైనచో తత్తదాశ్రమవిహితకర్మలకు జ్ఞానముతో సముచ్చయము సిద్ధించునుగాన సర్వాశ్రములకు జ్ఞానకర్మసముచ్చయము సిద్ధించుచున్న" దనెదవా? ముముక్షువునకు సర్వకర్మసంన్యాసము విధింపబడుటచే నట్లు చెప్పుటకు వీలుపడదు. అనగా నాశ్రమవిహితకర్మలు జ్ఞానోత్పత్తికి సాధనములైనను జ్ఞానముకలిగిన పిమ్మట నాజ్ఞానము మోక్షరూపఫలవిషయమై కర్మలను సహకారులుగ నపేక్షింపదు. అట్లపేక్షించి

హారపురస్సరముగ సప్తదశాధ్యాయమునందును ప్రతిపాదింపబడును. ఈవిధముగ సఫలమగు జ్ఞాననిష్ఠ యధ్యాయపంచకముచే ప్రతిపాదింపబడి యష్టాదశాధ్యాయముచేఁ బూర్వోక్తములగు సర్వవిషయములు నుపసంహరింపబడును. ఇదియే సమస్తగీతార్థముయొక్క సంగతిస్వరూపము. పూర్వాధ్యాయమున శ్రీకృష్ణభగవానులు "ఏషా తేఽభిహితా సాంఖ్యేబుద్ధిః" అనుదానిచే సాంఖ్యబుద్ధినాశ్రయించి జ్ఞాననిష్ఠ నుపదేశించెను. అట్లే "బుద్ధి ర్యోగే త్విమాం శృణు" అనునది మొదలుకొని "కర్మణ్యే వాధికార స్తే మాఫలేషు కదాచన" అనునది యంతముగాగల గ్రంథముచే యోగబుద్ధి నాశ్రయించి కర్మనిష్ఠ నుపదేశించెను. కాని జ్ఞాననిష్ఠాకర్మనిష్ఠల కధికారిభేదమును స్పష్టముగ నుపదేశించియుండలేదు. "దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ!" అనిజ్ఞాననిష్ఠకంటె గర్మనిష్ఠ నికృష్టమని చెప్పుటచేతను, "యావా నర్థ ఉదపానే" అనుశ్లోకమున జ్ఞానఫలమునందు సర్వకర్మఫలాంతర్భావమును జూపుటచేతను, స్థితప్రజ్ఞలక్షణమును జెప్పి 'ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ!' అనిసప్రశంసముగ జ్ఞానఫలము నుపసంహరించుటచేతను, "సముచ్చయమును వివక్షించుటచే జ్ఞాననిష్ఠాకర్మనిష్ఠల కేకాధికారిత్వమే పొసగు" ననుటకును నవకాశము లేదు. మరియు "యా నిశా సర్వభూతానాం" ఇత్యాదికమునందు

శాంకరభాష్యమ్:—

౩౩ -44) "సంసారమేవ నిస్సారం దృష్ట్వా సారదిదృక్షయా । ప్రవ్రజ న్త్యకృతోద్వాహాః పరం వైరాగ్య మాశ్రితాః ॥" ఇతి బృహస్పతిః । "కర్మణా బధ్యతే జన్తు ర్విద్యయా చ విముచ్యతే । తస్మా త్కర్మ న కుర్వన్తి యతయః పారదర్శినః" (మ-భా-శాం-24౧-7) ఇతి శుకానుశాసనమ్ । ఇహాపి "సర్వకర్మాణి మనసా సంన్యస్య" (గీ-౫-13) ఇత్యాది మోక్షస్య చాకార్యత్వా న్ముముక్షోః కర్మానర్థక్యమ్ ।

శాంకరభాష్యతత్త్వబోధని:—

వచో సంన్యాసవిధివాక్యము లుపపన్నములు కావు అట్టి సంన్యాసమును విధించు వాక్యము లేవనిన? "వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరంతి" (దారైషణ, పుత్రైషణ, ధనైషణ లనెడి ఏషణాత్రయమును పరిత్యజించి సంన్యాసాశ్రమమును స్వీకరించిన పిమ్మట నట్టి యాశ్రమము నందు విహితధర్మ మగు భిక్షాచర్యమును నాచరించుదురు.) అను శ్రుతియు, "తస్మా త్సంన్యాస మేషాం తపసా మతిరిక్త మాహుః" (ప్రాగుక్త మగు సత్యాదు లల్పఫలము లగుటంజేసి సంన్యాసము జ్ఞానద్వారమున మోక్షఫలక మగుటచే సత్యాదితపస్సులకన్న సంన్యాసమునే యుత్కృష్టఫలము కలదానినిగఁ జెప్పుచుండిరి) అను శ్రుతియు, "న్యాస ఏవాత్య రేచయత్" (కర్మలకంటె సంన్యాసమే యుత్కృష్టమైనది) అను శ్రుతియు, "న కర్మణా న ప్రజయా ధనేన త్యాగే నైకేఽమృతత్త్వ మానశుః" (కర్మప్రజాధనములవలన మోక్షము చేకూరదని కొందఱు సంన్యాసముచేతనే మోక్షమును పొందిరి) అను శ్రుతియు, "బ్రహ్మచర్యా దేవ ప్రవ్రజేత్" (వైరాగ్యము ప్రాప్తించినచో బ్రహ్మచర్యగార్హస్థ్యవానప్రస్థాశ్రమక్రమము ననుసరించియే సంన్యసింపవలయు నను క్రమము లేనందున బ్రహ్మచర్యము నుండియే సంన్యసింపవలయు) అను శ్రుతియు, "త్యజ

జ్ఞానికి ద్వైతదర్శనమే లేదుగాన కర్మానుష్ఠానమే సంభవింపదనియు చెప్పఁబడెను. 'తమేవం విద్వా నమృత ఇహ భవతి నాన్యః పంథాఽయనాయ విద్యతే'' అను శ్రుతిచొప్పున నవిద్యానివృత్తిరూప మగు మోక్షఫలమువిషయమై ఒక జ్ఞానమాత్రమునకే లోకానుసారముగ కారణత్వమును కల్పించుటచేతను జ్ఞాననిష్ఠాకర్మనిష్ఠలకే కాధికారిత్వము సంభవింపనేరదు. తేజస్తిమిరములవలె నత్యంతవిరుద్ధము లగు జ్ఞాననిష్ఠాకర్మనిష్ఠలకు సముచ్చయము సంభవింపమిచే నవి భిన్నాధికారికములే యాగాక. అట్లగుచోఁ గర్మాధికారినిగూర్చి జ్ఞాననిష్ఠనుగాని, జ్ఞానాధికారినిగూర్చి కర్మనిష్ఠనుగాని యుపదేశించుట యుచితముగాదు. కాన నర్జునునొక్కనినే గూర్చి జ్ఞాననిష్ఠాకర్మనిష్ఠల నుపదేశించుట యుక్తము కానేరదు. ఉత్కృష్టనికృష్టము లగు రెంటికి వికల్పమునుఁ జెప్పుట యుపపన్న గాదుగాన "నొకయర్జుననిగూర్చియే వికల్పముగ (జ్ఞాననిష్ఠనుగాని, కర్మనిష్ఠనుగాని యాశ్రయింపవచ్చు నను నూహతో) నుభయము నుపదేశించె'' ననుటయు పొసఁగదు. మరియు నవిద్యానివృత్త్యుపలక్షితాత్మస్వరూప మగు మోక్షమువిషయమై తారతమ్యము సంభవింపదు కాన నట్లనుట యుక్తముగాదు. ఇట్లగుటచే "జ్ఞాననిష్ఠాకర్మనిష్ఠలు భిన్నాధికారికములే యైనచో నొక్కనినిగూర్చి రెంటి నుపదేశించుట సంభవింపదు. ఏకాధికారికములే యున్నచో విరుద్ధములగు నీరెంటికి సముచ్చయము పొసగుటలేదుగాన కర్మకంటె మోక్షమునకు ప్రాశస్త్యమును జెప్పుట యనుపపన్న మగును.

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ధర్మ మధర్మం చ ఉభే సత్యానృతే త్యజ । ఉభే సత్యానృతే త్యక్త్వా యేన త్యజసి తత్త్యజ" (ధర్మాధర్మములు సత్యానృతములు సంసారమునకు హేతువులగుటవలన వానిని విడువుము. అట్టి సత్యానృతములను విడచునపుడు "నేను విడచుచుంటిని" అను నే యభిమానముచే విడుచుచుంటివో ఆట్టి త్యక్తృత్వాభిమానమును గూడ విడువుము) అను స్మృతియు "సంసారమేవ నిస్సారం దృష్ట్వా సారదిదృక్షయా । ప్రవ్రజన్త్యకృతోద్వాహాః పరం వైరాగ్య మాశ్రితాః" (అనుభవానుసారము ప్రమాతృత్వము మొదలగు సంసారమును దుఃఖఫలము కలదగుటచే నిస్సారముగ నెరింగి సారమును దెలిసికొనఁగోరి వివాహమును జేసికొనక పరమవైరాగ్యమును బొంది బ్రహ్మచర్యమునుండియే సంన్యసించుచుండిరి) అను బృహస్పతివచనము, 'కర్మణా బధ్యతే జన్తు ర్విద్యయా చ విముచ్యతే । తస్మాత్కర్మ న కుర్వన్తి యతయః పారదర్శినః' (జీవుడు కర్మచే బద్ధుఁడగును. జ్ఞానముచే ముక్తుఁడగును; కాన తత్త్వము నెరింగిన పరమహంసలు కర్మను జేయరు) అని కర్మజ్ఞానములకు సముచ్చయము సంభవింపదని భిన్నపురుషాశ్రితములుగ కర్మజ్ఞానములను బోధించుచు సంన్యాసమును బోధించు శుకానుశాసనమున్ను, ఈ గీతలయందే 'సర్వకర్మాణి మనసా సంన్యస్య' (సర్వకర్మలను మనసా పరిత్యజించి) అను నీగీతావాక్యశేషము సంన్యాసమునే విధించుటచే జ్ఞానకర్మసముచ్చయము సిద్ధింపనేరదు.

మోక్షస్వభావము నాలోచించినను కర్మజ్ఞానములకు సముచ్చయము పొసఁగదు. అదెట్లనిన? మోక్ష మనునది యొకదానివలన జనించునది కాదు. ఏది జనించుస్వభావముకలదియో అదియే కర్మ నపేక్షించును. కాన ముముక్షువునకు కర్మ వ్యర్థము. అందుచే కర్మజ్ఞానసముచ్చయము పొసఁగనేరదు.

---

ఈరీతికి వికల్పమునే యంగీకరించిచో నుత్కృష్టము, నవాయాససాధ్యము నగు జ్ఞాననిష్ఠను విడచి నికృష్టము ననేకాయాసబహుళము నగు కర్మనిష్ఠ ననుష్ఠించుట యయోగ్య మగును" అని యూహించి వ్యాకులితాంతఃకరణుఁడై యర్జునుఁ డిట్లు ప్రశ్నించుచున్నాఁడు— "జనైః స్వకైర్వైర్గర్ద్యతే యాచ్యతే స్వాభిలషితపూర్త్యై ఇతి జనార్దనః, తస్య సంబుద్ధిః హేజనార్దన!" సర్వజనులచేత స్వస్వాభిలషితసిద్ధికొరకు యాచింపఁబడెడి యోశ్రీకృష్ణా! (ఇట నిన్ను శ్రేయోనిశ్చయరూప మగు స్వాభిలషితసిద్ధికొఱకు యాచించుచుంటినిగాన నిది యనుచితము గానేరదని సంబోధనాభిప్రాయము.) "కర్మణః" నిష్కామకర్మకంటె "బుద్ధిః" ఆత్మతత్త్వము విషయముగాఁగల జ్ఞానము, "జ్యాయసీచేత్" ప్రశస్తతరమేయైనచో, 'తే మతా' నీకు నభిమతమేయైన, 'తత్' అట్టియెడ, 'కిం' ఎందునిమిత్తము, "ఘోరే కర్మణి" హింసాద్యనేకాయాసబహుళ మగు కర్మనిష్ఠయందు, 'మాం' ఆశ్రితుఁడ నగు నన్ను, "నియోజయసి" "కర్మణ్యే వాధి కార స్తే" ఇత్యాదికముచే విశేషముగ ప్రేరేపించుచుంటివి? "హేకేశవ!" ఓపరమేశ్వరుఁడా! (సర్వేశ్వరుఁడ వగుటచే సర్వులయొక్క యిష్టముల నీడేర్చెడి నీకు "శిష్య స్తేహం శాధి మాం త్వాం ప్రపన్నం" ఇత్యుక్తరీతిని నిన్నే శరణను బొందిన నన్ను ఈవిధముగ వంచించుట దగదని యభిప్రాయము.)

శాంకరభాష్యము:—

(9) నిత్యాని ప్రత్యవాయపరిహారార్థ మనుష్ఠేయానీతిచేత్- న, అసంన్యాసివిషయత్వా త్ప్రత్యవాయప్రాప్తేః। న హ్యగ్నికార్యాద్యకరణా త్సంన్యాసినః ప్రత్యవాయః కల్పయితుం శక్యో యథా బ్రహ్మచారిణా మసంన్యాసినా మపి కర్మిణామ్। న తావ న్నిత్యానాం కర్మణా మభావా దేవ భావరూపస్య ప్రత్యవాయ స్యోత్పత్తిః కల్పయితుం శక్యా-కథ మసత స్సజ్జాయేతే త్యసత స్సజ్జన్మాసంభవశ్రుతేః।

(10) యది విహితాకరణా దసంభావ్య మపి ప్రత్యవాయం బ్రూయాద్వేద స్తదాఽనర్థకరో వేదోఽప్రమాణ మిత్యుక్తం స్యాత్, విహితస్య కరణాకరణయో ర్దుఃఖమాత్రఫలత్వాత్।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(9) "అకుర్వ న్విహితం కర్మ నిన్దితం చ సమాచరన్। ప్రసజ్జం శ్చేంద్రియార్థేషు నరః పతన మృచ్ఛతి" (విహితకర్మ నాచరించక నిందితకర్మనాచరించుచు విషయములయందు బ్రవర్తించు మనుజుఁడు పతనమును బొందును) అను స్మృతివలన "ముముక్షువుకూడ ప్రత్యవాయ పరిహారార్థము నిత్యకర్మల నాచరింపవలయు" ననెదవా? ఎవఁ డేకర్మయం దధికృతుఁడో వాఁడా కర్మ నాచరింపనిచో ప్రత్యవాయి యగును. కాని కర్మానధికారియగు సంన్యాసి యగ్నిహోత్రాదినిత్యకర్మల నాచరింపనియెడల ప్రత్యవాయి కానేరఁడు. కాన ముముక్షు వగు సంన్యాసికి కూడ ప్రత్యవాయ పరిహారార్థము నిత్యకర్మానుష్ఠాన మని చెప్పుటయు వలనుపడదు.

ఇంతవరకు నగు గ్రంథముచే నిత్యకర్మ నాచరింపకపోవుటచేఁ బ్రత్యవాయము ప్రాప్తించు నను మతము నంగీకరించి, కర్మజ్ఞానసముచ్చయపక్షము నిరసింపఁబడెను. విచారించుచో "కథ మసత స్సజ్జాయేత" (అసత్తువలన సత్తు ఎట్లు జన్మించును ?) అని ఛాందోగ్యశ్రుతిచే నభావము వలన భావపదార్థము యొక్క యుత్పత్తి నిషేధింపబడుటచే నిత్యాకరణరూపమగు నభావము వలన భావరూపమగు ప్రత్యవాయము కూడ జన్మించునని కల్పించుటయు సంభవింపదు. కాన ముముక్షువునకు కర్మలు సంభవములు కానందున కర్మజ్ఞానసముచ్చయ మెటులఁజూచినను సంభవింపనేరదు.

(10) నిత్యకర్మములను విధించు వేదము నిత్యకర్మముల నాచరించనిచో ప్రత్యవాయము ప్రాప్తించు నని బోధించుచున్నది. ఇది ఇట్లుండ నిత్యకర్మల నాచరించనిచో ప్రత్యవాయము ప్రాప్తించ దనుట శ్రుత్యనుసారమని చెప్పుట శ్రుత్యంతరవిరుద్ధ మగుటంజేసి యెట్లుపపన్న మగు

శాంకరానందీయము:— "నత్వేవాహం జాతు నాసం" అను శ్లోకమునం దాత్మతత్త్వవివేచనము నుపక్రమించి "న జాయతే మ్రియతే వా కదాచిత్" అను శ్లోకము మొదలుకొని తెస్సగ నాత్మతత్త్వమును నిర్ధారణచేసి "వేదాఽవినాశినం నిత్యం" ఇత్యాదికముచే బ్రహ్మవేత్తకు సర్వకర్మసంన్యాసమును జెప్పి, వానికే 'ప్రజహాతి యదా కామాన్' అను శ్లోకము మొదలుకొని "స శాంతి మాప్నోతి" అనునది యంతముగాఁగల గ్రంథముచే

శాంకరభాష్యమ్:—

తథా చ కారకం శాస్త్రం న జ్ఞాపక మిత్యనుపపన్నార్థం కల్పితం స్యాత్ । న చైత దిష్టమ్ । తస్మా న్న సంన్యాసినాం కర్మా ణ్యతో జ్ఞానకర్మణో స్సముచ్చయానుపపత్తిః । "జ్యాయసీ చే త్కర్మణ స్తే మతా బుద్ధిః" ఇత్యర్జునస్య ప్రశ్నానుపపత్తేశ్చ ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నని శంకింపఁజనదు. విహితకర్మముల నాచరింపని యెడలఁ గలుగు నసంభావ్యమగు ప్రత్యవాయ మును జెప్పుచో వేద మనర్థకరము, నప్రమాణము నని చెప్పినట్లగును. "విహితకర్మలనాచరింప నియెడల యనర్థము సంభవించుచుండ నిత్యకర్మములను విధించు వేద మెట్లనర్థకర మగు" ననె దవా? విహితకర్మముల నాచరించినచో పితృలోకము ప్రాప్తించునని నీవును నంగీకరించవు. కాన విహితకర్మానుష్ఠానమునకు ఫలము లేదు. మఱియు కర్మానుష్ఠానకాలమునందు ధూమా దులచే నేత్రపీడ మొదలగు దుఃఖము ప్రత్యక్షసిద్ధము. ఇక నిత్యకర్మముల నాచరించనిచో ప్రత్యవాయము ప్రాప్తించును. రెండువిధముల (నిత్యకర్మముల నాచరించినను ఆచరింపకున్నను) పురుషున కనర్థకర మగు వేద మప్రమాణమే కావలసి వచ్చును. "అభావమునకు కూడ భావపదార్థోత్పాదనసామర్థ్యమును వేదము సంపాదింపగలదు. కాన విహితకర్మముల నాచ రింపనందున ప్రాప్తించు ప్రత్యవాయపరిహారము విహితకర్మముల నాచరించుటయందు సఫల మగు" ననెదవా? అట్లగుచో లోకప్రసిద్ధపదార్థశక్త్యాశ్రయణముచే శాస్త్రము ప్రవర్తించునని యంగీకరించుటవలన నపూర్వశక్త్యాధానాయోగమువలన శాస్త్రము జ్ఞాపకమే కాని కారకము కానేరదు. అపూర్వశక్త్యాధానమువలన శాస్త్రము కారకమే యగుచో నట్టి వేదమున కప్రా మాణ్యము తప్పక సంభవించెడిని. వేద మపౌరుషేయ మగుటచే నేదోషములు సంభవించ నందున శాస్త్ర మప్రమాణము కానేరదు. కాన విహితకర్మముల నాచరింపనియెడల ప్రత్యవాయము ప్రాప్తించనందున జ్ఞాననిష్ఠులగు సంన్యాసులకు కర్మలు సంభవింపవు. అందు వలన జ్ఞానకర్మములకు సముచ్చయము సంభవింపదు. 'మఱియు జ్యాయసీ చే త్కర్మణ స్తే మతా బుద్ధిః" అని యర్జునుని ప్రశ్నయు ననుపపన్న మగుటంజేసి జ్ఞానకర్మసముచ్చయము సంభవింపదు.

బ్రహ్మనిష్ఠను; తత్ఫలభూతమగు మోక్షమును ప్రతిపాదించి, 'న కామకామీ' అనుదానిచే కామములను గోరు వానికి మోక్షము సంభవింపదని ప్రతిపాదించెను. ఇందుచే సర్వకర్మసంన్యాసపూర్వకముగ బ్రహ్మనిష్ఠచే మోక్షము సంపాదింపఁదగినదని నీవిధముగ సర్వులయొక్కయు ప్రవృత్తి ప్రసక్తమైనది. ఇది యిట్లుండ 'విరక్తః ప్రవ్రజే ద్ధీమా న్సరక్తస్తు గృహే వసేత్ । సరాగో నరకం యాతి ప్రవ్రజన్హి ద్విజాధమః॥ యదా మనసి సంజాతం వైతృష్ణ్యం సర్వ వస్తుషు । తదా సంన్యాస మిచ్ఛంతి పతిత స్స్యా ద్విపర్యయే ॥ ప్రవృత్తిలక్షణం కర్మ జ్ఞానం సంన్యాసలక్షణం । తస్మాజ్జ్ఞానం పురస్కృత్య సంన్యసే దిహ బుద్ధిమాన్ ॥ యదా తు విదితం తత్త్వం పరం బ్రహ్మ సనాతనం । తదైకదండం సంగృహ్య సోపవీతాం శిఖాం త్యజేత్ ॥ అహమేవ పరంబ్రహ్మ వాసుదేవాఖ్య మవ్యయం । ఇతి బోధో దృఢో

**శాంకరభాష్యమ్:—**

(11) యది హి భగవతా ద్వితీయేఽధ్యాయే జ్ఞానం కర్మ చ సముచ్చయేన త్వయాఽనుష్ఠేయ మిత్యుక్తం స్యా త్తతోఽర్జునస్య ప్రశ్నోఽనుపపన్నో "జ్యాయసీ చే త్కర్మణస్తే మతా బుద్ధి" రితి। అర్జునాయ చే ద్బుద్ధికర్మణీ త్వయాఽనుష్ఠేయే ఇత్యుక్తే యా కర్మణో జ్యాయసీ బుద్ధి స్సాప్యుక్తైవేతి "తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ" ఇతి ప్రశ్నో న కథం చ నోపపద్యతే। న చార్జునస్యైవ జ్యాయసీ బుద్ధి ర్నానుష్ఠేయేతి భగవతోక్తం పూర్వ మితి కల్పయితుం యుక్తం- యేన జ్యాయసీ చే దితి ప్రశ్న స్స్యాత్।

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

(11) అర్జునుని ప్రశ్న మెట్లనుపపన్న మనిన? శ్రీకృష్ణపరమాత్మ ద్వితీయాధ్యాయము నందలి "జ్ఞానము, కర్మము సముచ్చయముగ నీవనుష్ఠింపవలయును." అని చెప్పినచో "జ్యాయసీ చేత్కర్మణ స్తే మతా బుద్ధిః" (కర్మముకంటె జ్ఞాన ముత్కృష్ట మని నీకు సమ్మతమైనచో) అను ప్రశ్న ముపపన్నముకాదు. అర్జుననికొరకు "జ్ఞానకర్మలు నీచే ననుష్ఠింపదగినవి." అని చెప్పబడియుండ కర్మముకంటె నుత్కృష్టమగు బుద్ధికూడ చెప్పబడినదే కాన "తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ" (ఘోరమగు కర్మమునందే నన్నెందులకు నియోగించెదవు?) అను ప్రశ్న మెటులను సరిపడదు. 'కర్మణ్యే వాధికార స్తే మాఫలేషు కదాచన' (నీకుకర్మము నందే యధికారము, ఫలమునందు లేదు. అని యర్జునునకు కర్మోపదేశము చేయుటవలన నర్జునునకు శ్రేష్ఠమగు జ్ఞానముపదేశింపలేదని 'తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ!' అని యుపాలంభనవచన మర్జునునకు సమంజసమే యందురా? అట్లు కాదు. ఏయిట్టి కల్పనచే నర్జునునకు భగవంతునిచే బోధింపబడిన శ్రేష్ఠమగు బుద్ధి నీచే ననుష్ఠింపదగినదికాదు.' అని పూర్వమునందు చెప్పబడినట్లు కల్పించుట న్యాయముకాదు. అట్లు కల్పించినయెడల 'ఏషా తేఽభిహితా సాంఖ్యే' (ఈసాంఖ్యబుద్ధి నీకొరకు చెప్పబడెను,) అను పూర్వవాక్యమునకు విరోధము ప్రాప్తించును.

యస్య తదా భవతి భైక్ష్యభుక్''॥ ప్రాణే గతేయథా దేహ స్సుఖం దుఃఖం నవిందతి। తథాచే త్ప్రాణయుక్తోపి సకైవల్యాశ్రమేవసేత్॥ అనధీత్యాఖిలా న్వేదా ననిష్ట్వావాఖిలా న్సురాన్। అనుత్పాద్య సుతాన్విప్రో న సంన్యాసితు మిచ్ఛతి॥ అకుర్వ న్విహితం కర్మ నిందితం చ సమాచరన్। ప్రచరన్నింద్రియార్థేషు నరః పతన మృచ్ఛతి॥ జ్ఞాత్వా నైష్కర్మ్య మాచరే త్సశిఖం వపనం కృత్వా బహిస్సూత్రం త్యజే ద్బుధః॥'' "తేహ స్మ పుత్త్రైష ణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరంతి'' అనియు 'పరంబ్రహ్మేతు విజ్ఞాయ ప్రవ్రజే ద్బ్రాహ్మణోత్తమః। అన్యథా కర్మ కుర్వీత న ప్రమాద్యేత కర్హిచిత్॥ స్వే స్వేఽధికారే యా నిష్ఠా స గుణః పరికీర్తితః। విపరీతస్తు దోష స్స్యా దుభయో రేష నిశ్చయః'' అనునిత్యాది శ్రుతిస్మృతివచనములవలన యధికారులకే సంన్యాసము యుక్తముగాని యనధికారులకుతగదు. "అన్యథా కృత్వా పతిష్యంతి' అనునట్లు జ్ఞానకర్మలకు నధికార్యాదిభేదము చేతనే భేదముగాన జ్ఞానకర్మల విభాగమును జూపుటవలను, అనధికారులకు

శాంకరభాష్యమ్:—

(12) యది పున రేకస్య పురుషస్య జ్ఞానకర్మణో ర్విరోధా ద్యుగప దనుష్ఠానం న సంభవ తీతి భిన్నపురుషానుష్ఠేయత్వం భగవతా పూర్వ ముక్తం స్యాత్ తతోఽయం ప్రశ్న ఉప పన్నో 'జ్యాయసీచే' దిత్యాదిః । అవివేకతః ప్రశ్నకల్పనాయా మపి భిన్నపురుషానుష్ఠేయత్వేన భగవతః ప్రతివచనం నోపపద్యతే. న చాజ్ఞాననిమిత్తం భగవత్ప్రతివచనం కల్ప్యం, అస్మాచ్చ భిన్నపురుషానుష్ఠేయత్వేన జ్ఞానకర్మనిష్ఠయోర్భగవతః ప్రతివచనదర్శనాత్ జ్ఞానకర్మణో స్సము చ్చయానుపపత్తిః । తస్మా త్కేవలా దేవ జ్ఞానా న్మోక్ష ఇత్యేషోఽర్థో నిశ్చితో గీతాసు సర్వోపనిషత్సు చ । జ్ఞానకర్మణో రేకం వద నిశ్చిత్య" (గీ3-2) ఇతి చైకవిషయైవ ప్రార్థనాఽ నుపపన్నో భయో స్సముచ్చయసంభవే ! "కురు కర్మైవ తస్మా త్త్వం" (గీ4-15) ఇతి చ జ్ఞాన నిష్ఠాఽసంభవ మర్జున స్యావధారణేన దర్శయిష్యతి- "జ్యాయసీ చే" దితి ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(12) జ్ఞానకర్మలు పరస్పరవిరుద్ధము లగుటవలన నా రెంటిని నొకానొకపురుషుఁ డొకే కాలమున ననుష్ఠించుట సంభవింపదు. కాన భిన్నపురుషానుష్ఠేయత్వమునే శ్రీకృష్ణపరమాత్మ ద్వితీయాధ్యాయంబున నుపదేశించె ననినచో నర్జునునిచే చేయఁబడిన 'జ్యాయసీ చే త్కర్మణస్తే' ఇత్యాదిప్రశ్న ముపపన్న మగును. జ్ఞానకర్మలకు సముచ్చయమును శ్రీకృష్ణపరమాత్మ చెప్పినను అర్థానిని తెలిసికొనక యర్జునుడు "జ్యాయసీ చేత్" ఇత్యాదిప్రశ్నను చేసెనని నను శ్రీకృష్ణపర మాత్మ జ్ఞానకర్మలకు "పూర్వమునందు నాచే సముచ్చయము చెప్పఁబడియుండ నీవిట్లు ఎందు లకు ప్రశ్నించెద" వని సమాధానము చెప్పక జ్ఞానకర్మలకు భిన్నపురుషానుష్ఠేయత్వమును ప్రతి వచనమునందు చెప్పుట యనుపపన్నము. భగవంతుఁడు సర్వజ్ఞుడగుటవలన నతని ప్రతివచన మజ్ఞాననిమిత్తక మని కల్పించుటయు నసంగతమే. కాన జ్ఞానకర్మలు భిన్నపురుషానుష్ఠేయము లుగ భగవత్ప్రతివచనమునందు కాన్పించుటవలన జ్ఞానకర్మలకు సముచ్చయము పొసగనేరదు. కాన శ్రీభగవద్గీతలయందును, సర్వోపనిషత్తులయందును సర్వకర్మసంన్యాసపూర్వకజ్ఞాననిష్ఠా మాత్రమువలననే మోక్షము ప్రాప్తించునను నర్థము నిశ్చితము. మఱియు జ్ఞానకర్మలకు సము చ్చయమే సంభవించినచో జ్ఞానకర్మలలో దేనినో శ్రేయస్కరమగు నొకదానిని నిశ్చయించి చెప్పుమని ఏకవిషయకమగు నర్జునుని ప్రార్థనయు నుపపన్నము కానేరదు. మఱియు "కురు కర్మైవ తస్మా త్త్వం" ఓయర్జునా! నీవు కర్మనే యాచరింపు మని యవధారణార్థక మగు ఏవ కారముచే నర్జునునకు జ్ఞాననిష్ఠయొక్క యసంభవమును మున్ముందు శ్రీకృష్ణపరమాత్మ చెప్పఁ గలడు. కాన నెటుచూచినను జ్ఞానకర్మసముచ్చయము సంభవింపనేరదు.

---

కర్మనిష్ఠయే చిత్తశుద్ధిద్వారమున మోక్షసాధనముగాన నదియే యవశ్య మనుష్ఠింపదగిన దని బోధించుటకును నీతృతీయాధ్యాయము నారంభించుచున్నాడు. ఇట ప్రథమమున 'కర్మణ్యే వాధికార స్తే మాఫలేషు కదాచన'

శాంకరభాష్యమ్:—

(1౩) జ్యాయసీ శ్రేయసీ చేద్యది కర్మణ స్సకాశా త్తే తవ మతాఽభిప్రేతా బుద్ధి ర్జ్ఞానం హేజనార్దన! యది బుద్ధికర్మణీ సముచ్చితే ఇష్టే తదైకం శ్రేయస్సాధన మితికర్మణో జ్యాయసీ బుద్ధి రితి కర్మణోఽతిరిక్తకరణం బుద్ధే రనుపపన్న మర్జునేన కృతం స్యా న్న హి తదేవ తస్మా త్ఫలతోఽతిరిక్తం స్యాత్ । తథా కర్మణ శ్శ్రేయస్కరీ భగవతోక్తా బుద్ధి రశ్రేయస్కరం చ కర్మ కుర్వతి మాం ప్రతిపాదయతి తత్కిం ను కారణమితి భగవత ఉపాలంభమివకుర్వం స్తత్కిం కస్మా త్కర్మణి ఘోరే క్రూరేహింసాలక్షణే మాం నియోజయసి కేశవేతి చ యదాహ తచ్చ నోపపద్యతే । అథ స్మార్తేనైవ కర్మణా సముచ్చయ స్సర్వేషాం భగవతోక్తోఽర్జునేన చావ ధారిత శ్చే త్తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసీత్యాది కథం యుక్తం వచనమ్ ॥౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(1౩) "ఓశ్రీకృష్ణా! కర్మకంటె జ్ఞానము శ్రేయస్సాధనమని నీకభిమతమగుచో" అని ప్రథమపాదార్థము. బుద్ధికర్మలు సముచ్చితములేయైనచో నపుడు బుద్ధికర్మములలో నొకటి యగు బుద్ధియే 'కర్మముకంటె శ్రేయస్సాధన' మని, కర్మముకంటె బుద్ధిని వేరుపరచుట యర్జునునిచే నయుక్తము చేయబడినటులగును. ఒకసాధనమే ఫలమువలన నతిరిక్త మెందులకు కావనియు శంకింపజనదు. సముచ్చయపక్షమున ప్రత్యేకజ్ఞానమునకుఁ గాని, ప్రత్యేకకర్మమునకుఁ గాని శ్రేయస్సాధనత్వ మంగీకరింపనందున కేవల కర్మముకంటె కేవలజ్ఞానమునకు ఫలమువలన నతి రిక్తత్వము వివక్షచేయక పృథక్కరించుట సంభవింపదు కాన పూర్వోక్తాశంక కవకాశము లేదు. ఇట్లు సముచ్చయపక్షమునందు 'జ్యాయసీ చే త్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన!' అను పూర్వార్థమున కనుపపత్తి సంభవించున ట్లుత్తరార్థమునకు గూడ ననుపపత్తి సంభవించును. అది యెట్లనిన? కర్మముకంటె జ్ఞానము శ్రేయస్కరమని భగవంతునిచే చెప్పబడినచో "నశ్రే యస్కర మగు కర్మ నాచరించు మని నన్ను గూర్చి చెప్పుచుండెను. ఏకారణముచే నన్నిట్లు పలుకుచుండె"నని యర్జునుఁడు భగవంతున కుపాలంభనమును చేయువానివలె 'నేకారణమువలన ఘోరము, అతిక్రూరము, హింసారూపము నగు కర్మమునందు నియోగించుచుంటి' వని పలికిన వాక్యముకూడ నుపపన్నముకాదు. "శ్రీకృష్ణపరమాత్మచే నందరికి స్మార్తకర్మముతో సము చ్చయము చెప్పబడెను. అటులే యర్జునుఁడు కూడ నిశ్చయించుకొనె" ననినను 'తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ!' అను వాక్యము యుక్తముకాదు. ॥౧॥

అనినీవు కర్మయందే యధికారము కలుగదుగానివయటియొకచోట నధికారములేదని యవధారణపూర్వకముగకర్మనే విధించి, 'దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ! । బుద్ధౌ శరణ మన్విచ్ఛ' అనుదానిచే జ్ఞానయోగము కంటె కర్మయోగము నికృష్టము గాన జ్ఞానయోగము నే యాశ్రయింపుమని జ్ఞానయోగము నేవిధించుటచే దానిచే వ్యాకులితాంతఃకరణుడై యర్జునుఁడు కేవలము 'దూరేణ హ్యవరం కర్మ' యను వాక్యార్థమునే మనమునం దిడు

గీ॥ వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే ।
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయామ్ ॥ ॥౨॥

పదవిభాగము:—వ్యామిశ్రేణ- ఇవ- వాక్యేన- బుద్ధిం- మోహయసి- ఇవ- మే- తత్- ఏకం- వద- నిశ్చిత్య- యేన- శ్రేయః- అహం- ఆప్నుయామ్ ॥ ॥౨॥

ప్రతిపదార్థము:— వ్యామిశ్రేణేవ=సంకీర్ణమైనదివలెనున్న; వాక్యేన=వాక్యముచేత; మే=నాయొక్క; బుద్ధిం-బుద్ధిని; మోహయసీవ=మోహపెట్టుచున్నవాడవువలె నుంటివి; అహం=నేను; యేన=దేనిచేత; శ్రేయః=శ్రేయస్సును; ఆప్నుయాం=పొందెదనో; తత్=అజ్ఞానకర్మలలో; ఏకం=జ్ఞానమును కాని, కర్మమును కాని నొక దానిని; నిశ్చిత్య=ఇదియే యర్జునునకు యోగ్యమైనదని నిశ్చయించి; వద=చెప్పుము. ॥౨॥

కాని కర్మయోగముకంటె జ్ఞానయోగము సాక్షాత్తుగ మోక్షసాధన మగుటచే దానికే యుత్కృష్టత్వమును తలచినవాఁడై ఇట్లు పలికెను—"జనం జననం తత్కారణ మజ్ఞానం చ స్వసాక్షాత్కారేణ అర్దయతి నాశయతీతి జనార్దనః తస్య సంబుద్ధి హేజనార్దన!" జననరూపసంసారము స్వసాక్షాత్కారముచేనశింపచేయు నో శ్రీకృష్ణా! కర్మయోగముకంటె బుద్ధియోగమే శ్రేష్ఠమనుట నీయభిమతముగుచో "కర్మణ్యే వాధికారస్తే" (నీకు కర్మయందే యధికారము కలదు) అని జ్ఞానముకంటె నికృష్టమగు కర్మయందు నన్నెందులకు నియోజించుచుంటివి? అందునను హింసాద్యనేకానర్థబహుళ మగుటచే ఘోరమగు యుద్ధమును జేయుమని "తస్మా ద్యుధ్యస్వ భారత!" అను వాక్యముచే ప్రేరేపించుచుంటివి. నీవు ఈశ్వరస్వరూపుడవు; నీవచనముసుల్లంఘ్యము; భక్తుండను, అనురక్తుఁడను నగు నన్ను యోగ్య మగు నర్థమును త్యజింపజేసి యయోగ్యానర్థమునందు బ్రవృత్తుని జేయుచుంటివి. ఇది నీకు తగునా? యని భావము.

నీలకంఠీయము:— ద్వితీయాధ్యాయమునందు "ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు" అని సాంఖ్యబుద్ధిని, యోగబుద్ధిని ప్రదర్శించి 'వ్యవసాయాత్మికా బుద్ధిః' అను శ్లోకముచే సాంఖ్యనిష్ఠకలవారలకు పతనశంక లేదనియు, కర్మయోగనిష్ఠులకు పతనశంక కలదని చెప్పి "యావా నర్థ ఉదపానే" అను శ్లోకముచే సాంఖ్యనిష్ఠయందు సర్వకర్మఫలాంతర్భావము శ్రూయమాణ మగుటవలన ప్రశమాత్మక మగు నా సాంఖ్యనిష్ఠనే తన యాశయమున కనుకూలమైనదానినిగ తలచినవాఁడై యర్జునుఁడు "ఓజనార్దనా! నిష్కామ కర్మయోగముకంటె సాంఖ్యనిష్ఠారూపమగు జ్ఞానము ప్రశస్తతరమై నీకు సమ్మతమగుచో భైక్షవృత్తిచేఁ గూడ సంతసించుచున్న నన్ను ఘోరమగు బంధువధాత్మక మగు కర్మమునందు మాటిమాటికి నీవు యుద్ధముచేయుమని యేకారణముచే నియోగించుచుంటివి? అని ప్రశ్నించెను.

శ్రీధరీయము:— "అశోచ్యా నన్వశోచస్త్వం" ఇత్యాదికముచే బ్రథమమున మోక్షసాధనరూపముగ దేహాత్మవివేకబుద్ధిని చెప్పెను. అనంతరమున "ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు" అను అనునది మొదలుగాగల గ్రంథముచే కర్మనుపదేశించెనుగాని జ్ఞానకర్మములలో నేది గుణవత్తరమో స్పష్టముగఁ జెప్పియుండలేదు. మరియుబుద్ధియుక్తుడగు స్థితప్రజ్ఞునకు- నిష్కామత్వ, నియతేంద్రియత్వ, నిరహంకారత్వాదు లుండవలెనని చెప్పటచేతను, "ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ!" అని జ్ఞానయోగమును సప్రశంసముగ నుపసంహరించుటచేతను బుద్ధికర్మలలో జ్ఞానమే శ్రేష్ఠమని భగవదభిప్రాయమని యర్జునుఁడు తలచినవాఁడై యావిధముగ "జ్యాయసీ చే త్కర్మణ స్తే" అను శ్లోకముచేఁ బ్రశ్నించుచున్నాడు. ॥౧॥

శాంకరభాష్యమ్:—

కించ— వ్యామిశ్రేణేతి। వ్యామిశ్రేణేవ యద్యపి వివిక్తాభిధాయీ భగవాంస్తథాఽపి మమ మందబుద్ధే ర్వ్యామిశ్రమివ భగవద్వాక్యం ప్రతిభాతి। తేన మమ బుద్ధిం మోహయసీవ। మమ బుద్ధివ్యామోహాపనయనాయ హి ప్రవృత్తస్త్వం తు కథం మోహయస్యతో బ్రవీమి బుద్ధిం మోహయసీవ మే మమేతి। త్వం తు భిన్నకర్తృకయో ర్జ్ఞానకర్మణో రేకపురుషానుష్ఠానాసంభవం యది మన్యసే తత్రైవం సతి తత్తయో రేకం బుద్ధిం కర్మ వేద మేవార్జునస్య యోగ్యం బుద్ధిశక్త్యవస్థానురూప మితి నిశ్చిత్య వద బ్రూహి। యేన జ్ఞానేన కర్మణా వాఽన్యతరేణ శ్రేయోఽహ మాప్నుయాం ప్రాప్నుయామ్। యది హి కర్మనిష్ఠాయాం గుణభూత మపి జ్ఞానం భగవతోక్తం స్యాత్తత్కథం తయో రేకం వదే త్యేకవిషయైవార్జునస్య శుశ్రూషా స్యాత్। న హి భగవతోక్త మన్యతరదేవ జ్ఞానకర్మణో ర్వక్ష్యామి నైవ ద్వయమితి. యే నోభయప్రాప్త్యసంభవ మాత్మనో మన్యమాన ఏక మేవ ప్రార్థయేత్॥ ॥౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వక్ష్యమాణకారణముచేగూడ నర్జునప్రశ్నము సముచ్చయానుసారి కాదు. మఱియు ఓ శ్రీకృష్ణా! నీవు స్పష్టముగనే చెప్పువాడవు. అయినను మందబుద్ధి కల నాకు భవద్వాక్యము సంకీర్ణ మైనదివలె భాసించుచున్నది. అందుచే నా బుద్ధిని నీవు మోహపెట్టుచున్నవాడవువలె నుంటివి. నాయొక్క బుద్ధివ్యామోహమును తొలగించుటకే ప్రవర్తించు నీ వెట్లు మోహపెట్టెదవు? మోహపెట్టువాడవు కావు. అందువలననే నాబుద్ధిని మోహపెట్టువాడవువలె నుంటివని పలుకుచుంటివి. కర్మజ్ఞానములు పరస్పరవిరుద్ధము లగుటచే నేకకాలమునం దేకపురుషునిచే ననుష్ఠించుటకు శక్యమైనవి కావు. అందుచే భిన్నకర్తృకములగు జ్ఞానకర్మల కేకపురుషానుష్ఠానాసంభవమును నీవు తలచినచో నా రెండు భిన్నకర్తృకములై యుండ నా జ్ఞానకర్మలలో నొక

—• ౩వ అధ్యాయము ౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "నేను కొంచ మైనను వంచనచేయు స్వభావముకలవాఁడను కాను. అందునను అతిప్రియుఁడ వగు నిన్ను వంచించుదునా? అట్టి ప్రతారణచిహ్నమును నాయందేమి కనుగొంటివి"?" అని శ్రీకృష్ణుఁడు ప్రశ్నించునని యూహించి యాప్రశ్నానుకూలముగ నర్జును డిట్లు చెప్పుచున్నాడు. "వ్యామిశ్రేణేవ" ఓ శ్రీకృష్ణా! జ్ఞానకర్మనిష్ఠాప్రతిపాదక మైన నీవాక్యము సంకీర్ణార్థప్రతిపాదకము కాకపోయినను, "నేను జ్ఞాననిష్ఠాధికారినా? లేక కర్మనిష్ఠాధికారినా? అను సందేహముకల నాకు సంకీర్ణార్థకముగ భాసించుచున్నది. అట్టి 'వాక్యేన' జ్ఞాననిష్ఠాకర్మనిష్ఠాప్రతిపాదక మైన వాక్యముచేత 'మే' (వాక్యతాత్పర్యముగ్రహింపలేమిచే మందబుద్ధినగు) నాయొక్క 'బుద్ధిం' అంతఃకరణను, "మోహయసీవ" మోహింపజేయుచున్నవాడవువలె నుంటివి (పరమకారుణికుఁడ వగు నీవు నాబుద్ధిని వస్తుతః మోహింపజేయుటలేదుగాని, ఇంకేమన- నీవాక్యార్థపరిజ్ఞానము నాబుద్ధిదోషమేయని సూచించుటకిట 'మోహయసీవ' అనుస్థలమున ఇవశబ్దము ప్రయోగించబడెను). జ్ఞాననిష్ఠయు, కర్మనిష్ఠయు పరస్పరవిరుద్ధములు కాన నీనిష్ఠాద్వయమునకు నొకఁడే యధికారియని సముచ్చయమును

శాంకరభాష్యతత్త్వబోధిని:—

బుద్ధిని కాని, కర్మను కాని యిదియే యర్జున బుద్ధిశక్త్యవస్థానురూప మని నిశ్చయించి చెప్పుము. ఏజ్ఞానముచేతను కాని, కర్మచేతను కాని, ఏదో యొకదానిచే నేను శ్రేయస్సును పొందగలనో యట్టిదానిని చెప్పుము.

విచారింప కర్మనిష్ఠయందు జ్ఞాన మంగభావముచే నైనను, ప్రధానముగ నైనను భగవంతునిచే చెప్పఁబడినచో "తయో రేకం వద" (కర్మజ్ఞాననిష్ఠలలో నేదో ఒక దానిని చెప్పు) మని యర్జునున కేకవిషయికేచ్ఛ యెట్లు కలుగును? (కలుగనేరదని భావము) కర్మజ్ఞానము లనెడి యుభయము తనకు సంభవింపనేరదని తలఁచు నర్జునున కన్యతరవిషయికేచ్ఛ కలుగవచ్చు ననెదవా? అట్లు కానేరదు. ఏకారణముచే జ్ఞానకర్మోభయప్రాప్త్యసంభవము తనకు తలఁచి యొకదానినే యర్జునుఁడు ప్రార్థించునో యట్టికర్మజ్ఞానములలో నేదో యొకదానినిగాని, ఉభయమును గాని భగవంతుఁడు చెప్పెనని నీ వంగీకరించవు. ఎందువలన ననిన? నీవు కర్మజ్ఞానసముచ్చయవాదివి. కాన నీ మతమున నట్టిది సంభవించనందున నర్జునుఁడు తన కుభయప్రాప్త్యసంభవబుద్ధిచే కర్మజ్ఞానములలో నేదోయొకదానిని చెప్పుమని ప్రార్థించుట సంభవింపనేరదు. ॥2॥

చెప్పుట పొసఁగదు. ఒక కార్యమునుగూర్చి యనేకము స్వతంత్రముగ కారణము లగుచో వానిలో దానినిగాని, లేక దీనినిగాని యాకార్యసిద్ధికై గ్రహింపఁదగు నని వికల్పముగ చెప్పుట సమంజస మగును. మోక్షమునుగూర్చి జ్ఞాననిష్ఠ స్వతంత్రముగను, కర్మనిష్ఠ చిత్తశుద్ధిద్వారమున నస్వతంత్రముగను కారణ మగుటచే జ్ఞాననిష్ఠాకర్మనిష్ఠల కేక కార్యకారిత్వము లేదుగాన నీరెంటిలో నేదోయొకదానిని వికల్పముగ కారణముగ గ్రహింపఁదగు నని చెప్పుటయు కుదురదు.

ఈయుపదేశమునకు జ్ఞాననిష్ఠయం దొకఁడును, కర్మనిష్ఠయందు మరొకఁడును నధికారి యని యధికారిభేదమును జెప్పుటయే నాయభిప్రాయ మందువా? అట్లైన నన్నొకనినిగూర్చియే నిష్ఠాద్వయము నుపదేశించుట యసంగత మగును. కాన నధికారనిశ్చయపురస్సరముగ నీచే నుపదేశింపఁబడి నాచే నాచరింపఁబడిన దగు దేనిచే (జ్ఞాననిష్ఠచేగాని, లేక, కర్మనిష్ఠచేగాని) మోక్షరూపశ్రేయస్సును పొందెదనో; దానిని నిశ్చయించి యొక్కటియగు నట్టి కర్మనిష్ఠనుగాని, లేక జ్ఞాననిష్ఠనుగాని నా కుపదేశింపుము. పైవిధముగ జ్ఞాననిష్ఠాకర్మనిష్ఠల కేకాధికారిత్వమును జెప్పుచో వికల్పసముచ్చయములు సంభవింపవుగాన నధికారిభేదజిజ్ఞాసుఁడై యర్జునుఁ డిట్లు ప్రశ్నించె నని సిద్ధమైనది.

శంకరానందీయము:— "కర్మణ్యే వాధికార స్తే" అనియును, "బుద్ధౌ శరణ మన్విచ్ఛ" అనియును, నిరతిశయవ్యామిశ్రముగ సంకీర్ణమైనదియును, జ్ఞానకర్మలకు సముచ్చయమునే చెప్పునదియు నగు వాక్యముచే నాబుద్ధిని మోహింపఁజేయువానివలె నుంటివి. "యుద్ధము చేయఁదగినదా? లేక విడువఁదగినదా? అని సంశయించుచున్నట్టియు, నిన్నే శరణము పొందినట్టి నాయొక్క భ్రమను తొలఁగించుటకే నీవు ప్రవర్తించితివి. కాని నాకు మోహము కలిగించుటకు ప్రవృత్తుఁడవు కాలేదు. అట్లైనను వివేకవికలుఁడను, జడుఁడను నగు నాకు నీవాక్యము వ్యామిశ్రముగఁ దోచుచున్నది. అట్టివాక్యముచే నీవు నాబుద్ధిని మోహింపఁజేయుచున్నవానివలెఁ దోచుచుంటివి ఇదియు నాబుద్ధిదోషమే సుమా! యని భావము. నీవు చెప్పినది నిజమేయాగాక! నే నిపుడు చేయున దేమి?" యను శిష్య

గీ॥ శ్రీభగవానువాచ- లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ ।
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్ ॥ ॥3॥

పదవిభాగము:—లోకే- అస్మిన్- ద్వివిధా- నిష్ఠా- పురా- ప్రోక్తా- మయా- అనఘ!- జ్ఞానయోగేన- సాంఖ్యానాం- కర్మయోగేన- యోగినామ్ । ॥3॥

ప్రతిపదార్థము:— శ్రీభగవాన్=శ్రీకృష్ణపరమాత్మ; ఉవాచ=సమాధానమును చెప్పెను; హే అనఘ!=ఓ పాపరహితుఁడా; అస్మిన్=ఈ; లోకే=లోకమునందు; మయా=నాచేతను; పురా=పూర్వమునందు; సాంఖ్యానాం=జ్ఞానులగు సాంఖ్యులకు; జ్ఞానయోగేన=జ్ఞాన మనెడి యోగముచేతను; యోగినాం=కర్మ్ములకు; కర్మయోగేన=కర్మమనెడి యోగముచేతను; ద్వివిధా=రెండువిధములగు; నిష్ఠా=స్థితి; ప్రోక్తా=చెప్పఁబడెను. ॥3॥

---

ష్ణాశంకకు సమాధానముగ "తదేకం వద" యను నుత్తరార్ధము జెప్పుచున్నాఁడు. క్రియాకారకఫలములకు భేద ముండుటచే జ్ఞానకర్మల కేకపురుషానుష్ఠేయత్వము సంభవింపదు గాన వానిలో నొకటి యగు జ్ఞానముగాని, కర్మగాని యేది నాయధికారానురూపమో నిశ్చయించి, దానియందు నాయోగ్యత్వాఽయోగ్యత్వములను విచారించి నా కుపదేశింపుము. ఏనీవు చెప్పు జ్ఞానముచేగాని, కర్మచేగాని నేను పరమపురుషార్థమును పొందగల్గుదునో యట్టి దానిని నాకుపదేశింపుము.

భాష్యోత్కర్ష దీపిక:— "నే జెప్పినవాక్యమువలన బుద్ధియోగమే శ్రేష్ఠ మని నీవు నిశ్చయించుకొన్నచో నట్లాచరింపక నన్నేల తిరిగి ఇట్లు ప్రశ్నించుచుంటివి" అను శ్రీకృష్ణోద్దేశము నాశంకించుకొని దానికి సమాధానముగ నర్జునుఁ డీశ్లోకమును జెప్పుచున్నాఁడు. "ఓశ్రీకృష్ణా! "బుద్ధ్యా యుక్తో యయా పార్థ" ఇత్యాదికముచే కర్మను ప్రశంసించితివి. "యా నిశా సర్వభూతానాం" ఇత్యాదికముచే జ్ఞానమును ప్రశంసించితివి. "కర్మ ణ్యే వాధికార స్తే" అని కర్మయందే యధికారమును బోధించితివి. "త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున!" అని జ్ఞాననిష్ఠాధికారమును బోధించితివి. ఇట్లగుటచే "వ్యామిశ్రేణ" ఏది శ్రేష్ఠమైనది? ఏది శ్రేష్ఠ మయినది కాదు? దేనియందు నా కధికారము కలదు? దేనియందు నా కధికారములేదు?" అను సందేహోత్పాదక మగు వాక్యముచే నాబుద్ధిని మోహింపఁజేయువానివలె నుంటివి. కాన నారెండింటిలో దేనియందు నా కధికారము కలదో యట్టి శ్రేయస్సాధన మగు నొకదానిని నా కుపదేశింపుము.

నీలకంఠీయము:— నీకు జ్ఞాననిష్ఠయం దధికారము లేమింజేసి "నీవు కర్మమునే యాచరింపుము" అని నిన్ను గూర్చి పలుకుచుంటి నను భగవదాశయమును శంకించుకొని "వ్యామిశ్రేణేవ" అను శ్లోకముచే నర్జునుఁడు చెప్పుచుండెను.

అవివిక్తమువలె నుండిన వాక్యముచే (ఇట ఇవశబ్దముచే నీవు స్పష్టముగఁ జెప్పినను నాబుద్ధిదోషమువలన నీవు పలికినవాక్యము నవివిక్తముగ గ్రహించుచుంటి నని సూచింపఁబడెను.) "త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున!" అని యొకానొకస్థలమునందు వేదనిష్ఠత్వమును త్యజింపఁజేయుచుంటివి. 'కర్మణ్యే వాధికారస్తే' అని యావేదనిష్ఠత్వమునే గ్రహింపఁజేయుచుంటివి. అట్లే 'నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్...భవ' అని నివృత్తిమార్గము నుపదేశించుచుంటివి. "ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే" అని ప్రవృత్తిమార్గము నుపదేశించుచుంటివి. స్థితిగతులవలె పరస్పరవిరుద్ధ మగు నాయుభయము నొకఁడనగు నాకు నొక పర్యాయము ననుష్ఠించుటకు శక్యమైనది కాదు. కాన నాబుద్ధిని మోహపెట్టువాఁడవువలె నుంటివి. (విచారింప నామోహమును నశింపఁజేయుటకు నీవు ప్రవర్తించితి వని 'ఇవ' శబ్దముచే సూచింపఁబడెను). కాన నారెంటిలో నేది ప్రధానమైనదో, నాకు యోగ్యమైనదో దేని ననుష్ఠించుటచే నేను కల్యాణమును పొందెదనో అట్టి దానిని నిశ్చయించి చెప్పుము. ॥౨॥

శాంకరభాష్యమ్:—

(1) ప్రశ్నానురూపమేవ ప్రతివచనం శ్రీభగవానువాచ — లోకేఽస్మిన్నితి । లోకేఽస్మిన్ శాస్త్రానుష్ఠానాధికృతానాం త్రైవర్ణికానాం ద్వివిధా ద్విప్రకారా నిష్ఠా స్థితి రనుష్ఠేయతాత్పర్యం పురా పూర్వం సర్గాదౌ ప్రజా స్సృష్ట్వా తాసా మభ్యుదయనిశ్శ్రేయసప్రాప్తిసాధనం వేదార్థసమ్ప్రదాయ మావిష్కుర్వతా ప్రోక్తా మయా సర్వజ్ఞే నేశ్వరేణ హే అనఘాఽపాప! తత్ర కా సా ద్వివిధా నిష్ఠే త్యాహ — జ్ఞానయోగేన జ్ఞానమేవ యోగ స్తేన సాంఖ్యానా మాత్మానాత్మవిషయవివేకజ్ఞానవతాం బ్రహ్మచర్యాశ్రమా దేవ కృతసంన్యాసానాం వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థానాం, పరమహంసపరివ్రాజకానాం, బ్రహ్మణ్యేవావస్థితానాం నిష్ఠా ప్రోక్తా । కర్మయోగేన కర్మైవ యోగః కర్మయోగ స్తేన కర్మయోగేన యోగినాం కర్మిణాం నిష్ఠా ప్రోక్తే త్యర్థః ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(1) శ్రీకృష్ణపరమాత్మ యర్జునుని ప్రశ్నానురూపముగనే సమాధానమును చెప్పుచుండెను. సృష్ట్యాదియందు ప్రజలను సృష్టించి వారల యభ్యుదయనిశ్శ్రేయసప్రాప్తికి సాధనమగు వేదార్థసంప్రదాయమును ప్రకటన చేయదలచి- సర్వజ్ఞుడను, ఈశ్వరుడను నగు నాచే- నోపాపరహితుడ వగు నర్జునా! యీవ్యవహారభూమియందు శాస్త్రానుష్ఠానాధికృతులగు త్రైవర్ణికులకు రెండువిధములగు స్థితి (అనుష్ఠేయతాత్పర్యము) చెప్పబడెను. అందా ద్వివిధనిష్ఠ యేదనిన? ఆత్మానాత్మవిషయవివేకజ్ఞానము కలిగి, బ్రహ్మచర్యాశ్రమమునుండియే సంన్యసించినట్టియు, వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థులైనట్టియు, బ్రహ్మమునందే యవస్థితులైనట్టి పరమహంసపరివ్రాజకులకు జ్ఞానమనెడి యోగచే నిష్ఠయు, కర్ములకు కర్మయోగముచే నిష్ఠయు చెప్పబడెను.

—• ౩వ అధ్యాయము- ౩ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పైవిధముగ నధికారిభేదవిషయమై యర్జునునిచేఁ జేయఁబడినప్రశ్నకనురూప మగు సమాధానమును శ్రీకృష్ణుఁ డీశ్లోకమునఁ జెప్పుచున్నాఁడు. "లోకే" అధికారిత్వమున కభిమతులగు జనులు శుద్ధాంతఃకరణు లనియు, నశుద్ధాంతఃకరణు లనియు రెండు తెగలుగ నుండిరి. ఈరెండువిధములగు జనులవిషయమై "ద్వివిధా నిష్ఠా" జ్ఞానపరముగను, కర్మపరముగను రెండువిధము లగు నిష్ఠ (స్థితి) "పురా" పూర్వాధ్యాయమునందు 'మయా' నీ కత్యంతహితమును జేఁగూర్చెడి నాచే "ప్రోక్తా" తెల్లగఁ జెప్పఁబడెను. కాన నధికారైక్యాశంకచే క్లేశపడకు మని భావము. "పాపరహితుఁడ వగు నీ వీయుపదేశమునకు యోగ్యుడవు సుమా" అని సూచించుటకు "అనఘ" అని సంబోధించెను. ఒక్కటి యగు నిష్ఠయే సాధ్యసాధనావస్థాభేదముచే రెండువిధములుగ గన్పట్టుచున్నది గాన స్వతంత్రములగు రెండు నిష్ఠలు లే"వని సూచించుటకు "ద్వివిధా నిష్ఠా" అని యేకవచనమును ప్రయోగించెను. పైవిషయమున కనుగుణముగనే 'ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి" (జ్ఞానయోగకర్మయోగములు రెండు నొకటిగనే దెలిసికొనునో వాఁడు పరమాత్మను చూడఁగలఁడు) అని ముందు చెప్పఁగలఁడు. అనిష్ఠనే ద్విప్రకారముగ నుత్తరార్థమునఁ జూపుచున్నాఁడు. 'సాంఖ్యానాం

శాంకరభాష్యమ్:—

(2) యది చైకేన పురుషేణైకస్మై పురుషార్థాయ జ్ఞానం, కర్మ చ సముచ్చిత్యానుష్ఠేయం భగవతేష్ట ముక్తం వక్ష్యమాణం వా గీతాసు వేదేషు చోక్తం కథ మిహార్జునాయోపపన్నాయ ప్రియాయ విశిష్టభిన్నపురుషకర్తృక ఏవ జ్ఞానకర్మనిష్ఠే బ్రూయాత్। యది పున రర్జునో జ్ఞానం కర్మ చ ద్వయం శ్రుత్వా స్వయమే వానుష్ఠాస్య త్యన్యేషాం తు భిన్నపురుషానుష్ఠేయతాం వక్ష్యామీతి మతం భగవతః కల్ప్యేత; తదా రాగద్వేషవా నప్రమాణభూతో భగవా న్కల్పిత స్స్యాత్। తచ్చాయుక్తం, తస్మా త్కయాపి యుక్త్యా న సముచ్చయో జ్ఞానకర్మణోః। య దర్జునే నోక్తం కర్మణో జాయస్త్వం బుద్ధే స్తచ్చ స్థిత మనిరాకరణాత్। తస్యాశ్చ జ్ఞాననిష్ఠాయా స్సంన్యాసినా మేవానుష్ఠేయత్వం భిన్నపురుషానుష్ఠేయత్వవచనాచ్చ, భగవత ఏవ మేవానుమత మితి గమ్యతే॥ ॥3॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(2) ఒక పురుషార్థముకొఱకు జ్ఞానము, కర్మము అనెడి ఈ రెండును సముచ్చయముగ నేకపురుషానుష్ఠేయములని భగవదభీష్టమై యీగీతలయందు శ్రీకృష్ణపరమాత్మచే పూర్వమునందు చెప్పఁబడి మున్ముందు చెప్పఁబడునదియై వేదములయందు చెప్పఁబడినదై యగునెడల యీతృతీయాధ్యాయమునందు విధివిహితరీతిని శిష్యుఁడై తనయందను జేరినట్టి ప్రియుఁడగు నర్జునుని కొఱకు విశిష్టభిన్నకర్తృకములగు జ్ఞానకర్మనిష్ఠలను (అనగా సర్వకర్మలను సంన్యసించిన) పరమహంసపరివ్రాజకులచే ననుష్ఠింపదగినది జ్ఞాననిష్ఠయనియు, కర్మలచే నాచరింపదగినది కర్మయోగమనియు) నెటుల చెప్పును? చెప్పనేరఁడని భావము. అట్లు భిన్నకర్తృకములగు జ్ఞానకర్మనిష్ఠల నిచట భగవంతుడు చెప్పుచుండెను. అందుచే జ్ఞానకర్మసముచ్చయము భగవదభీష్టము కానేరదు; శాస్త్రార్థమును కానేరదు.

తెస్సక వాత్మజ్ఞానము వార్జించినట్టియు, బ్రహ్మచర్యమునుండియే సంన్యాసమును స్వీకరించినట్టియు, వేదాంతవిజ్ఞానముచే సునిశ్చితమగు పరమపురుషార్థముకలవారును, జ్ఞానభూమి నారోహించినవారును, శుద్ధాంతఃకరణులును అగు సాంఖ్యులకు "జ్ఞాన మేవ యుజ్యతే బ్రహ్మణా నేనేతి జ్ఞానయోగః తేనజ్ఞానయోగేన" (జ్ఞానమే బ్రహ్మముతో దీనిచే కలుపబడును. కాన జ్ఞానయోగమనబడును.) అట్టి జ్ఞానయోగముచే "తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః" ఇత్యాదికముచే చెప్పఁబడిన నిష్ఠ (స్థితి)యు, 'యోగినాం' అంతఃకరణము శుద్ధము కానట్టియు, జ్ఞానభూమినధిష్ఠింపనట్టి కర్మాధికారయోగులకు "కర్మయోగేన" అంతఃకరణశుద్ధిద్వారమున జ్ఞానభూమి నధిష్ఠించుటకుగాను, "ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయోఽన్య త్ క్షత్రియస్య న విద్యతే" ఇత్యాద్యుక్తరీతిని కర్మయోగముచే నిష్ఠయు చెప్పఁబడెను. కనుకనే జ్ఞానకర్మలకు సముచ్చయముగాని, వికల్పముగాని కుదరనేరదు. ఇక నేమన నిష్కామకర్మచే శుద్ధమగు నంతఃకరణముకలవానికి సర్వకర్మసంన్యాసముచేతనే జ్ఞానము కలుగుచుండుటనుఁబట్టి చిత్తము శుద్ధమగుట, శుద్ధము కాకపోవుట, అను నవస్థాభేదముచే రెండువిధములుఁగ నిష్ఠను "ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు" అని నీ కుపదేశించితిని. కనుక చిత్తము శుద్ధము

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మఱియు "నాచే జెప్పబడిన జ్ఞానమును, కర్మమును విని యర్జునుఁడు స్వయముగనే జ్ఞానకర్మముల నాచరించును. ఇతరులకైతే జ్ఞానకర్మలు భిన్నపురుషానుష్ఠేయములని చెప్పెద" నని శ్రీకృష్ణపరమాత్మయొక్క యాశయమును కల్పించినచో శ్రీకృష్ణపరమాత్మ యర్జునునియందనురాగము కలవాడనియు, ఇతరులయందు ద్వేషముకలవాడనియు, అనాప్తుడనియు కల్పించవలసివచ్చును. వాదిప్రతివాదుల కెన్నడును ఇది సమ్మతముకాదు. అట్లు కల్పించినచో "సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరం" అను గ్రంథమునకు విరోధము వాటిల్లును. కాన నిట్లు కల్పించుట యుక్తముకాదు. అందువలన నేయుక్తిచేతను జ్ఞానకర్మములకు సముచ్చయము సంభవింపనేరదు. "జ్యాయసీచే త్కర్మణ స్తే" అనుచోట నర్జునోక్తమగు కర్మకంటె బుద్ధికి జ్యాయస్త్వమును శ్రీభగవానులు నిరాకరింపనందున అర్జుననిచే నుపపాదితమగుబుద్ధిజ్యాయస్త్వమటులనే సుస్థితమగుచున్నది. భిన్నపురుషానుష్ఠేయత్వవచనమువలన నట్టి జ్ఞాననిష్ఠ సంన్యాసులకే యనుష్ఠేయ మగుచున్నది. శ్రీకృష్ణపరమాత్మకు గూడ నిటులే సమ్మత మని తోచుచున్నది. ॥3॥

కానంతవరకు కర్మయోగము, చిత్తము శుద్ధమైనచో జ్ఞానయోగము నీకిరెండునుగూడ నొకనికేయుపయోగించునుగాన నధికారిభేదక్రమున్నను నీయొక్కనికే యీరెంటిని యుపదేశించుటవ్యర్థము కాదని యభిప్రాయము. పైవిషయమును తెల్పుటకు "న కర్మణా మనారంభాత్" అనునది మొదలుకొని "మోఘం పార్థ! స జీవతి" అనునదియంతముగాగల పదమూడుశ్లోకములచే చిత్తశుద్ధిలేని పురుషునకు చిత్తశుద్ధి కలుగనంతవరకు కర్మానుష్ఠానమే తగుననియు, 'యస్త్వాత్మరతిః' అనునది మొదలుకొని రెండుశ్లోకములచే శుద్ధాంతఃకరణుఁడగు జ్ఞానికి కర్మతో నేమియు పనిలేదనియు, "తస్మా దసక్తః" అనునది మొదలగు గ్రంథముచే కర్మము బంధహేతువే యైనను ఫలాభిసంధిరహితముగఁ జేయబడినదై సత్త్వశుద్ధినికలిగించి జ్ఞానోత్పాదకమై తద్ద్వారమున మోక్షమునకు హేతువగుననియు నిరూపించి, యనంతరము "అథ కేన ప్రయుక్తోయం" అను ప్రశ్నను లేవదీసి 'కామదోషముచేతనే కామ్యకర్మలు శుద్ధిహేతువులు కా' వనియు, కనుకనే కామరాహిత్యముతోనే కర్మలనుజేయుచు నంతఃకరణశుద్ధి కలవాఁడై జ్ఞానాధికారి కాఁగలఁడని అధ్యాయాంతమువరకు శ్రీకృష్ణభగవానులు చెప్పగలడు.

శంకరానందీయము:— అర్జునుఁడు ప్రశ్నింప శ్రీకృష్ణుఁ డిట్లుచెప్పుచున్నాడు. ఓయర్జునా! నీవు చెప్పినది సత్యమే. నేజెప్పినవిషయమును దెలిసికొనలేకుండుట నీబుద్ధిదోషమేకాని వేరొండుకాదు. నీవిద్యాబుద్ధిశక్త్యవస్థాదులను విచారించినచో నీకు కర్మయందే యధికారము కలదుకాని సంన్యాసమునం దధికారము లేదు. కనుకనే "కర్మణ్యే వాధికారస్తే" (నీకు కర్మయందే యధికారముకలదు) అని చెప్పితిని. మరియు "ఫలముకొఱకు కాక చిత్తశుద్ధిద్వారమున జ్ఞానసిద్ధికొఱకు కర్మనుజేయు" మని సూచించుటకు 'బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః" అని చెప్పితినిగాని, కర్మనువిడచి జ్ఞానము నాశ్రయింపుమని చెప్పియుండలేదు. అట్లే జ్ఞానకర్మలు రెండును రాజసూయబృహస్పతిసవనములవలె భిన్నకర్తృకములు. కాన నారెంటికి నేకపురుషానుష్ఠేయత్వము సంభవింపదు. కనుక నట్టి జ్ఞానకర్మలను రెంటినిగూడ నీవాశ్రయింపు మనియు చెప్పియుండలేదు. ఈవిషయమును 'ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు' అని పూర్వమే సూచించితిని.

మఱియు నావిషయమునే చెప్పుచుంటిని. వినుము. "లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ!" ఈలోకమున స్వధర్మాసక్తులు, ముముక్షువులునగు బ్రాహ్మణాదివర్ణములకై పూర్వకాలమున—వేదస్వరూపుడను, సర్వజ్ఞుడను, స్వధర్మోపదేష్టనునగు నాచే రెండువిధములుగ నిష్ఠ చెప్పబడెను. అనగా శాస్త్రీయమగు ననుష్ఠేయమునకు ధర్మసాంకర్యము లేకుండునట్లు వ్యవస్థను కల్పించితిని. అదెట్లన— "జ్ఞానయోగేన సాంఖ్యానాం" "వేదాన్తైస్సర్వైస్సమ్యక్ ఖ్యాయతే తాత్పర్యతః ప్రతిపాద్యత ఇతి సాంఖ్యం నిర్విశేషం పరం బ్రహ్మ తదేవ స్వాత్మత్వేన యే విదుస్తే సాంఖ్యాః బ్రహ్మవిదః తేషాం సాంఖ్యానాం" సమస్తవేదాంతములచేతను, తాత్పర్యముచే లెస్సగ చెప్పబడు నిర్విశేషపరబ్రహ్మము సాంఖ్యమనబడును. దానిని స్వస్వరూపముగ దెలిసికొను బ్రహ్మవేత్తలు సాంఖ్యులనఁబడుదురు. అట్టి సాంఖ్యులగు యతులకు—'బ్రహ్మవి ద్బ్రహ్మణా యుజ్యతే ఏకీక్రియతేఽనేనేతి యోగః జ్ఞానమేవయోగః జ్ఞానయోగః తేన" బ్రహ్మవేత్త బ్రహ్మముతో దేనిచే కలుపఁబడునో యది జ్ఞానయోగ మనఁబడును. అట్టి జ్ఞానయోగముచే "సర్వమిద మహం చ బ్రహ్మైవ" బ్రహ్మాకారవృత్తితో నెల్లప్పుడొకేరీతిగ నుండుట విహితమైనది. అనఁగ "తమే వైకం విజానథ ఆత్మాన మన్యావాచో విముంచథ। ఓమిత్యేవం ధ్యాయథ। ఆత్మానం స్వస్తి వః పరాయణం। వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థాః। సర్వం ఖల్విదం బ్రహ్మ। తజ్జలానితి శాంతఉపాసీత। త మేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః। నానుధ్యాయా ద్బహూ ఞ్ఛబ్దా న్వాచో విగ్లాపనం హి తత్" ఇత్యాదివాక్యములచే బ్రహ్మకంటె వేరగుపదార్థమునందు ప్రవృత్తిని నిషేధించి సాంఖ్యులకు బ్రహ్మనిష్ఠయే చేయదగినదని చెప్పబడెను. "కర్మయోగేన యోగినాం" కర్మయోగులగు గృహస్థులకు—"యుజ్యతేఽభ్యుదయోఽనేనేతియోగః: కర్మైవయోగః కర్మయోగః తేన" దేనిచే నభ్యుదయము గూర్చబడునో యది యోగమనంబడును. అట్టి కర్మయనెడి యోగముచే నిష్ఠ (నియమస్థితి) చెప్పబడెను. అనగా 'అహ రహ స్సంధ్యా ముపాసీత। ఉదితే సూర్యే ప్రాత ర్జుహోతి। వసంతే బ్రాహ్మణోఽగ్నీ నాదధీత। కుర్వ న్నే వేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః। తస్మా త్స్వాధ్యాయోఽధ్యేతవ్యః। ఋతం చ స్వాధ్యాయప్రవచనే చ। సత్యం చ స్వాధ్యాయప్రవచనే చ। అగ్నయ శ్చ స్వాధ్యాయప్రవచనే చ। అగ్నిహోత్రం చ స్వాధ్యాయప్రవచనే చ। సత్యం వద। ధర్మం చర। తాని త్వయోపాస్యాని' అను మొదలగు శ్రుతులచే శ్రౌతస్మార్తకర్మనిష్ఠయే కర్మయోగులకు కర్తవ్యముగ చెప్పబడెను. పైజెప్పినరీతిని కర్మయోగులగు గృహస్థులకు, కర్మరహితులగు సంన్యాసులకును సంకీర్ణము కాకుండునట్లు నిష్ఠాద్వయము విభజించి చెప్పబడెనని యర్థము.

నీలకంఠీయము:— పూర్వోక్తమగు నర్జునుని ప్రశ్నకు శ్రీకృష్ణపరమాత్మ సమాధానమును 'లోకేస్మిన్' అను శ్లోకముచే జెప్పుచుండెను.

పాపరహితుడవగు నోయర్జునా! ద్వితీయాధ్యాయమునందు నాచే నొకటే నిష్ఠ చెప్పబడెను. అట్టిబ్రహ్మనిష్ఠకే యధికారిభేదముచే ప్రకారద్వయము చెప్పబడెను. ఇంతియేకాని బ్రహ్మప్రాప్తికొరకు పరస్పరనిరపేక్షకల మార్గద్వయము చెప్పబడలేదు. విశుద్ధాంతఃకరణము కల నోయర్జునా! నీవు నాచే జెప్పబడిన వాక్యముయొక్క యర్థమును లెస్సగ విచారించుము. ఆ ప్రకారద్వయ మేదనిన? ఆత్మానాత్మవివేకవిజ్ఞానము కలవారలకు "జ్ఞానార్థం యుజ్యతే అనేనేతి జ్ఞానయోగః" వేదాంతశ్రవణమనననిదిధ్యాసనాత్మకమగు జ్ఞానోపాయము; దానిచే బ్రహ్మమునందు నిష్ఠను (పరిసమాప్తిని) సాంఖ్యులు పొందుచున్నారు. "సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే" అనుదానిచే చెప్పఁబడిన లక్షణములుకల యోగముకలవారలకు సంధ్యోపాసనాది నిర్వికల్పసమాధ్యనుష్ఠానాంతకర్మయోగము చెప్పఁబడెను. అట్టి కర్మయోగముచేతనే యోగులు బ్రహ్మనిష్ఠను పొందుచున్నారని యర్థము.

గీ॥ న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।
న చ సంన్యసనా దేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥ ॥౪॥

పదవిభాగము:— న- కర్మణాం- అనారమ్భాత్- నైష్కర్మ్యం- పురుషః- అశ్నుతే- న- చ- సంన్యసనాత్- ఏవ- సిద్ధిం- సమధిగచ్ఛతి ॥ ॥౪॥

ప్రతిపదార్థము:— కర్మణాం=యజ్ఞాదికర్మలయొక్క; అనారమ్భాత్=చేయకపోవుటవలన; పురుషః=పురుషుడు; నైష్కర్మ్యం=నిష్క్రియాత్మస్వరూపముచే నవస్థితిని; నాశ్నుతే=పొందడు; సంన్యాసనా దేవ చ=జ్ఞానరహితమగు కేవలకర్మసంన్యాసమాత్రమువలన; సిద్ధిం=జ్ఞాననిష్ఠను; న సమధిగచ్ఛతి=పొందడు. ॥౪॥

---

ఇచట యాశయమిది:— ఈజన్మమునందు కాని, జన్మాంతరమునందు కాని యీశ్వరప్రీత్యర్థ మనుష్ఠితము లగు కర్మలచే పరిశుద్ధమగు నంతఃకరణముకలవాడై వివేక వైరాగ్యశమాదిషట్కసంపత్తులు గలవాడైన, ముముక్షువు ప్రత్యక్షేత్రుడై నిదిధ్యాసనమనసరము లేకుండగనే శ్రవణమననములచేతనే కృతకృత్యుడగును. అట్టివాడు శ్రవణాదుల వలన పూర్వమునందసమాహితచిత్తుడైనచో నట్టివానికి నిదిధ్యాసనముకూడ నపేక్షితము. కనుకనే బ్రహ్మసూత్రములయందు "సహకార్యంతరవిధిః పక్షేణ" అనుసూత్రముచే శ్రీవ్యాసమహర్షి నిదిధ్యాసనమునకు సాక్షికత్వమును చెప్పియుండెను. ఇదియే సాంఖ్యమార్గము. అట్లే సర్వకర్మలను పరమగురువగు పరమేశ్వరునియం దర్పించుచు శ్రవణమననాత్మకమగు విచారములేనిదే కేవలశ్రద్ధామాత్రమువలన నిర్విశేషబ్రహ్మరూపత్వమును గురువాక్యమువలన నిశ్చయించి సంశయాసంభావనావిపరీతభావనారూపదోషత్రయరహితుడై యాచార్యునివలన నిర్గుణబ్రహ్మోపాస్తిప్రకారమును తెలిసికొని కర్మచ్ఛిద్రములయందు (కర్మలనాచరించుచుండ విశ్రాంతిసమయముల యందు) సమాధ్యభ్యాసమును చేయుచు నిష్కళమగు ప్రత్యగాత్మస్వరూపమును సాక్షాత్కరింపజేసికొనును. ఇదియే యోగమార్గ మనంబడును. అట్టియోగమార్గముచే నూహాపోహాత్మకమగు కౌశల మెవరికి గలదో వారు సాంఖ్యులనిపించుకొందురు. ఎవరికట్టి యూహాపోహాత్మకమగు కౌశలముండదో వారు యోగులనిపించుకొందురు. కాన నీనిష్ఠ ద్విప్రకార మనిపించుకొనును. కాని రెండునిష్ఠ లనిమాత్రము భ్రమజెందరాదు. ఈవిషయమునే వశిష్ఠమహర్షియు శ్రీరామున కిట్లుపదేశించెను.

'ద్వౌ క్రమౌ చిత్తనాశస్య యోగో జ్ఞానం చ రాఘవ! । యోగో వృత్తినిరోధో హి జ్ఞానం సమ్యగవేక్షణం ॥ అసాధ్యః కస్యచి ద్యోగః కస్యచిత్తత్త్వనిశ్చయః । ప్రకారౌ ద్వౌ తతో దేవో జగాద పరమశ్శివః ॥' (చిత్తనాశమునకు యోగమనియు, జ్ఞానమనియు రెండు మార్గములు కలవు. అందు యోగమనగ వృత్తినిరోధము. జ్ఞానమనగ సమ్యగవేక్షణము; ఒకానొకనికి యోగ మసాధ్యమగును; ఒకానొకనికి తత్త్వనిశ్చయ మసాధ్యమగును. కనుకనే పరమశివుడు రెండుప్రకారములను చెప్పెను). చిత్తాద్యర్పణోపలక్షితమగు బ్రహ్మసాక్షాత్కారమునకు రెండుమార్గములు కలవు. అందు చిత్తాదులకు మిథ్యాత్వపక్షమున రజ్జ్వాగాదిక మధిష్ఠానమగు రజ్జ్వాదుల తత్త్వసాక్షాత్కారమువలన నెటుల నశించునో యట్లే చిత్తాదుల కధిష్ఠానమగు నాత్మతత్త్వసాక్షాత్కారమువలన చిత్తాదుల వినాశము సంభవించును. చిత్తాదులు సత్యమనుపక్షమునందు సత్యమగు నుదకము (సర్పము) మంత్రాదులచే నిరుద్ధప్రచారము కలదై స్వయముగనే నశించునట్లు సత్యమగు చిత్తాదికము యోగముచే నిరుధ్యమానమై నశించును. అట్టి చిత్తమునకు నిరన్వయోచ్ఛేదము (ఏసంబంధము లేకుండగనుచ్ఛేదము) పై పక్షద్వయమందును ప్రారబ్ధకర్మ నాశానంతరమున సమానముగనే సంభవించును. ॥౩॥

శాంకరభాష్యమ్:—

(1) మాం చ బుద్ధికాలే కర్మణ్యేవ నియోజయసీతి విషణ్ణమానస మర్జునం కర్మ నారభ ఇత్యేవం మన్వాన మాలక్ష్యాహ భగవాన్.—న కర్మణా మనారంభా దితి । అథవా జ్ఞానకర్మనిష్ఠయోః పరస్పరవిరోధా దేకేన పురుషేణ యుగప దనుష్ఠాతు మశక్యత్వే సతీతరేతరానపేక్షయో రేవ పురుషార్థహేతుత్వే ప్రాప్తే కర్మనిష్ఠాయా జ్ఞాననిష్ఠాప్రాప్తిహేతుత్వేన పురుషార్థహేతుత్వం న స్వాతంత్ర్యేణ జ్ఞాననిష్ఠా తు కర్మనిష్ఠోపాయలబ్ధాత్మికా సతీ స్వాతంత్ర్యేణ పురుషార్థహేతు రన్యానపేక్షే త్యేత మర్థం ప్రదర్శయిష్య న్నాహ భగవాన్—న కర్మణా మనారమ్భా దప్రారమ్భా త్కర్మణాం క్రియాణాం యజ్ఞాదీనా మిహ జన్మని జన్మాంతరే వానుష్ఠితానా ముపాత్తదురితక్షయహేతుత్వేన సత్త్వశుద్ధికారణానాం తత్కారణత్వేన చ జ్ఞానోత్పత్తిద్వారేణ జ్ఞాననిష్ఠాహేతూనాం "జ్ఞాన ముత్పద్యతే పుంసాం క్షయా త్పాపస్య కర్మణః । యథాఽఽదర్శతలప్రఖ్యే పశ్యన్త్యాత్మాన మాత్మని॥" ఇత్యాదిస్మరణా దనారమ్భా దననుష్ఠానా న్నైష్కర్మ్యం నిష్కర్మభావం కర్మశూన్యతాం జ్ఞానయోగేన నిష్ఠాం నిష్క్రియాత్మస్వరూపేణై వావస్థాన మితి యావత్ । పురుషో నాఽశ్నుతే న ప్రాప్నోతీ త్యర్థః ।

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(1) జ్ఞానకర్మనిష్ఠావిభాగవచనానురోధముచే నర్జునునకు సంన్యాసపూర్వకజ్ఞాననిష్ఠయం దధికారము లేదని చెప్పఁదలచి శ్రీకృష్ణపరమాత్మ యర్జునుని "జ్ఞానమున కుత్కృష్టత్వ మంగీకరించి కూడ బంధకారణ మగు కర్మమునందే నన్ను నియోగించుచుంటి" వని విషణ్ణమనస్కుడై నవానినిగను, నేను కర్మ నాచరించ నని తలచుచున్న వానినిగను నూహించి "న కర్మణా మనారమ్భాత్" అని చెప్ప మొదలిడెను.

లేక— (కర్మజ్ఞాననిష్ఠల విభాగవచనమువలన నాకర్మజ్ఞాననిష్ఠలకు సముచ్చయము సంభవించనిచో) జ్ఞానకర్మనిష్ఠలు పరస్పరము విరుద్ధము లగుటవలన నొకపురుషునిచే నొకేకాలమునం దనుష్ఠించుట కశక్యము లగుచో పరస్పరానపేక్షితములగు నా రెంటికి పురుషార్థహేతుత్వము ప్రాప్తించును. అట్లు కానిచో (అనగా కర్మనిష్ఠ స్వతంత్రముగ మోక్షసాధనము కాదనినచో) కర్మనిష్ఠయు జ్ఞాననిష్ఠవలె స్వతంత్రముగ మోక్షసాధనము కాకపోయెడిని.

---

—• ౩వ అధ్యాయము ౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— కారణము లేనిదే కార్యము పుట్టనేరదు. కాన "త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన" అను శ్రుతిచే నాత్మను దెలిసికొనుటయందు వినియుక్తములైన కర్మల నాచరించనిచో దానివలన చిత్తశుద్ధి కలుగదు. అందుచే జ్ఞానయోగ్యుఁడు కాక, బహిర్ముఖుఁడైన పురుషుఁడు నైష్కర్మ్యమును (జ్ఞానయోగముచే నిష్ఠను) పొందనేరడు. 'ఏత మేవ ప్రవ్రాజినో లోకమిచ్ఛంతి' అను శ్రుతిచెప్పిన సర్వకర్మసంన్యాసముచేతనే జ్ఞాననిష్ఠ ఉపపన్న మగుచుండ కర్మలతో నేమిప్రయో

శాంకరభాష్యమ్:—

(2) కర్మణా మనారమ్భా న్నైష్కర్మ్యం నాశ్నుత ఇతి వచనా త్తద్విపర్యయా త్తేషా మారమ్భా న్నైష్కర్మ్య మశ్నుత ఇతి గమ్యతే। కస్మా త్పునః కారణా త్కర్మణా మనారమ్భా న్నైష్కర్మ్యం నాశ్నుత ఇతి। ఉచ్యతే, కర్మారంభస్యైవ నైష్కర్మ్యోపాయత్వాత్ ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అట్లగుచో కర్మజ్ఞానములు రెండును సముచ్చితములై కారణములు కావలె ననినట్లగును. కాని యట్లు శంకింపఁజనదు. ఎందువల ననివ? కర్మనిష్ఠ జ్ఞాననిష్ఠాప్రాప్తిద్వారమున మోక్షహేతువు కాని స్వతంత్రముగ మోక్షసాధనము కాదు. జ్ఞాననిష్ఠ యన్ననో స్వతంత్రముగ మోక్షసాధనము. కాన కర్మజ్ఞానసముచ్చయము సిద్ధింపదు. అట్లగుచో జ్ఞాననిష్ఠయు నిష్ఠయే యగుటం బట్టి కర్మనిష్ఠవలె స్వతంత్రముగ పురుషార్థహేతువు కాదు. రెండును స్వతంత్రముగ పురుషార్థహేతువులు కానిచో సముచ్చితములై పురుషార్థహేతువు లగు" నని శంకింపఁజనదు. జ్ఞాననిష్ఠ కర్మనిష్ఠ యనెడి యుపాయమువలన పొందబడినదై స్వతంత్రముగ నితరము నపేక్షింపక పురుషార్థసాధన మగు నని చెప్పఁదలఁచి శ్రీకృష్ణపరమాత్మ "న కర్మణా మనారమ్భాత్" అని చెప్పుచుండెను.

"జ్ఞాన ముత్పద్యతే పుంసాం క్షయా త్పాపస్య కర్మణః। యథాఽఽదర్శతలప్రఖ్యే పశ్య న్త్యాత్మాన మాత్మని" (పాపకర్మము క్షయించినతోడనే పురుషుల కాత్మస్వరూపజ్ఞానము కలుగును. అట్టితఱి నద్దమునందు ముఖము ప్రత్యక్షమగున ట్లాత్మయం దాత్మస్వరూపమును జూచెదరు) అను స్మృత్యనుసార మీజన్మమునందు కాని, జన్మాంతరమునందు కాని యనుష్ఠింపఁబడిన కర్మలచే నుపాత్తదురితక్షయమై, సత్త్వశుద్ధి కలిగి, జ్ఞానోత్పత్తిద్వారమున జ్ఞాననిష్ఠ సంభవించును. అట్టి యజ్ఞాదికర్మల ననుష్ఠింపనిచోఁ బురుషుఁడు నైష్కర్మ్యమును బొందనేరఁడు. నైష్కర్మ్య మనగ కర్మశూన్యత. అనగా జ్ఞానయోగముచే నిష్ఠ (నిష్క్రియాత్మస్వరూపముచే నుండుట) యని యర్థము.

(2) వ్యతిరేకవచన మన్వయమునందు పర్యవసితము. అనగా "అగ్ని లేనిదే వంట జేయుట సంభవము కాదు" అనునది వ్యతిరేకవచనము. ఈవాక్యమువలన వంటను గూర్చి యగ్ని కారణ

జనము ? అను నాశఁకకు సమాధానముగ నుత్తరార్థమును చెప్పుచున్నాడు. "నచ... సమధిగచ్ఛతి" చిత్తశుద్ధి లేకుండగ సంన్యసించినమాత్రముననే ఫలపర్యవసాయిని యగు జ్ఞాననిష్ఠారూపమగు సిద్ధిని పొందనేరదు. (అనగా కర్మజన్యమగు చిత్తశుద్ధిని విడిచి సంన్యాసమే సంభవింపదు. ఎట్టకేల కొకరీతిగ నౌత్సుక్యమాత్రమున సంన్యాసమును స్వీకరించినను నది ఫలపర్యవసాయి గానేరదని భావము.

శంకరానందీయము:— "కర్మయోగులకు కర్మనిష్ఠను, సాంఖ్యులకు జ్ఞానయోగమును జెప్పితిని గాన దీనింబట్టి జ్ఞానయోగకర్మయోగములు రెండును పరస్పరానపేక్షముగ (ప్రత్యేకము నొక్కొక్కటియే స్వతంత్రముగ);

**శాంకరభాష్యమ్:—**

న హ్యుపాయ మంతరే ణోపేయప్రాప్తి రస్తి । కర్మయోగోపాయత్వం చ నైష్కర్మ్యలక్షణస్య జ్ఞానయోగస్య శ్రుతా విహ చ ప్రతిపాదనాత్ । శ్రుతౌ తావ త్ప్రకృత స్యాత్మలోకస్య వేద్యస్య వేదనోపాయత్వేన "త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన" (బృ-4-4-22) ఇత్యాదినా కర్మయోగస్య జ్ఞానయోగోపాయత్వం ప్రతిపాదితమ్ । ఇహాపి చ "సంన్యాస స్తు మహాబాహో! దుఃఖ మాప్తు మయోగతః" (గీ-5-6) 'యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాత్మశుద్ధయే" (గీ 5-11) "యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్" (గీ-18-5) ఇత్యాది ప్రతిపాదయిష్యతి । నను చ—"అభయం సర్వభూతేభ్యో దత్త్వా నైష్కర్మ్య మాచరేత్" ఇత్యాదౌ కర్తవ్యకర్మసంన్యాసా దపి నైష్కర్మ్యప్రాప్తిం దర్శయతి—లోకే చ కర్మణా మనారమ్భా న్నైష్కర్మ్య మితి ప్రసిద్ధతర మతశ్చ నైష్కర్మ్యార్థినః కిం కర్మారమ్భేణేతి ప్రాప్త మత ఆహ—న చ సంన్యసనా దేవేతి । నాపి సంన్యసనా దేవ కేవలా త్కర్మపరిత్యాగమాత్రా దేవ జ్ఞానరహితా త్సిద్ధిం నైష్కర్మ్యలక్షణాం జ్ఞానయోగేవ నిష్ఠాం సమధిగచ్ఛతి న ప్రాప్నోతి ॥

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

మని యెట్లు పర్యవసితమో యటులే "కర్మల నాచరింపకున్నచో బురుషుఁడు నైష్కర్మ్యమును పొందఁడు" అను వ్యతిరేకవాక్యమువలన "కర్మల నాచరించుటవలన నైష్కర్మ్యమును పొందు" నని తోచుచున్నది ఏకారణమువలన కర్మల నాచరింపనిచో బురుషుఁడు నైష్కర్మ్యమును పొందఁ డనెదవా? చెప్పెద వినుము. కర్మాచరణము నైష్కర్మ్యమున కుపాయము. ఉపాయము లేనిదే ఉపేయప్రాప్తి సంభవింపదు. నైష్కర్మ్యరూపము, వేద్యము నగు ప్రకృతాత్మ లోకము యొక్క జ్ఞానమును గూర్చి "త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన" అను శ్రుతియందు "సంన్యాసస్తు మహాబాహో! దుఃఖ మాప్తు మయోగతః । యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాత్మశుద్ధయే" "యజ్ఞో దానం తపః కర్మ పావనాని మనీషిణామ్" అను గీతావాక్యములయందు కర్మయోగ ముపాయముగ చెప్పఁబడెను. (కాన నుపాయము కర్మయోగము. అట్టి యుపాయ మగు కర్మయోగము నాచరించనిచో జ్ఞానరూప మగు నైష్కర్మ్యమును బురుషుఁడు పొందనేరఁడు.

మోక్షమునకు కారణము అనిభావింపకుము. ఏలన? "న కర్మణా నప్రజయా" అనెడి శ్రుతి కర్మలు మోక్షకారణములు గావనియే చెప్పుచున్నది. మరియు 'జ్ఞానా దేవ తు కైవల్యం' అనుటచే నితరవ్యావృత్తిపూర్వకముగ జ్ఞానమే మోక్షకారణమని నిశ్చయింపఁబడినది. కాన జ్ఞానమే మోక్షమును గూర్చి సాధనముగాని కర్మ స్వతంత్రకారణమని భావింపకుము. జ్ఞాన ముదయించినచో నది యితరసహకారము లేకుండగనే మోక్షసుఖమును చేకూర్చును. ఐనను "సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః" అని యుండుటవలన సత్త్వశుద్ధిలేనిచో జ్ఞానమే కలుగదు. ఆసత్త్వశుద్ధియును

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"అభయం సర్వభూతేభ్యో దత్వా నైష్కర్మ్య మాచరేత్" "శాంతో దాంత ఉపరత స్తితిక్షుః, సంన్యాసయోగా ద్యతయ శ్శుద్ధసత్త్వాః" ఇత్యాదిశ్రుతులయందు కర్తవ్యము లగు కర్మలను సంన్యసించుటవలన నైష్కర్మ్యమును పొందు నని చెప్పబడెను. లోకమునందు గూడ "యతో యతో నివర్తతే తత స్తతో విముచ్యతే। నివర్తనాద్ధి సర్వతో న వేత్తి దుఃఖ మణ్వపి" (పురుషుఁ డేయేవస్తువునుండి మరలునో ఆయా వస్తువులవలన విముక్తిని పొందును. సర్వము నుండి నివర్తించినచో లేశమైన దుఃఖమును కూడ పొందఁడు.) అని ప్రసిద్ధముగ చెప్పఁబడెను. కాన నైష్కర్మ్యసిద్ధిని కోరువాఁ డెందులకు కర్మల నాచరించవలెను. అను శంకను దొలఁగించుటకు "నచ సంన్యసనా దేవ" అని చెప్పుచుండెను. జ్ఞానరహిత మగు కేవలసంన్యాసమాత్రమువలన నైష్కర్మ్యలక్షణ మగు జ్ఞానయోగముచే నిష్ఠను పురుషుఁడు పొందఁడు. (అనగా పైనుదహరించిన సంన్యాసప్రతిపాదకశ్రుతులు జ్ఞానము కలిగినపిమ్మట సంన్యాసమును స్వీకరించవలయు నని బోధించుచున్నవి. మున్ముం దుపపాదితము లగు కర్మప్రతిపాదకశ్రుతులు జ్ఞానసిద్ధికి పూర్వము జ్ఞానోపాయ మగుటచే కర్మల నాచరింపవలయు నని బోధించుచున్నవి. ఈవిషయమే యీశ్లోకమునందుఁ జెప్పఁబడెను )

"బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన" సత్కర్మానుష్ఠానము లేందే చిత్తశుద్ధి జనించదు. 'కాన తత్త్వజ్ఞానము కలుగనట్టి ముముక్షువు చిత్తశుద్ధినిమిత్తమై సత్కర్మలఁ జేయుదగును. లేనిచో మోక్షము సిద్ధించ నేరదు." అని యీశ్లోకమున శ్రీకృష్ణభగవానులు చెప్పుచున్నాఁడు. 'న కర్మణాం—పురుషోఽశ్నుతే' నిత్యము లగు శ్రౌతస్మార్తకర్మల నాచరింపనిచో నాపురుషుఁడు "న యత్ర కర్మ తన్నిష్కర్మ బ్రహ్మ, తస్య భావః నైష్కర్మ్యం నిష్క్రియబ్రహ్మాత్మనావస్థానలక్షణాం ముక్తిం" బ్రహ్మము— 'నిష్కలం నిష్క్రియం' అను శ్రుతిచొప్పున నిష్క్రియమై యుండును. గాన నిష్కర్మ యనఁబడును.) దాని భావమును (నిష్క్రియబ్రహ్మ స్వరూపమున నుండుట రూపమగు ముక్తిని) ఉపాయము లేనిందే పొంద నేరఁడు. అనగా నుపాయ మున్నప్పుడే యుపేయము (కార్యము) సిద్ధించుచుండును. ఇట నుపాయభూతము లగు కర్మల ననుష్ఠింపనిచో నవి లేనిందే యుపేయ (కార్య) భూతమగు జ్ఞానము, తత్ఫలమగు నైష్కర్మ్యము గూడ సిద్ధించ నేరవు. కాన ముముక్షువగువాఁడు తప్పక నిత్యనైమిత్తికకర్మలను జేయఁదగును. అందుచే జ్ఞానము, తద్ద్వారమున మోక్షముగూడ సిద్ధించునని యర్థము. "కర్మలకు మోక్షసాధనత్వము—'న కర్మణా న ప్రజయా' అను శ్రుతిచే నిషేధించఁబడెను. 'సంన్యాసయోగాత్' అను శ్రుతిచే నొక సంన్యాసమే మోక్షమునకు హేతువని చెప్పఁబడెను. కనుక సర్వకర్మలను సంన్యసించియే నేను సుఖముగ నుందును. క్లేశభూయిష్ఠము, అందునను హింసాప్రధానము నగుకర్మను జేయఁజాల' నందువేమో యట్లు కాదని యుత్తరార్ధమునఁ జెప్పుచున్నాఁడు. "న చ.....సమధిగచ్ఛతి" కర్మలు క్లేశభూయిష్ఠము లను నాళయముచేఁగాని, ఆలస్యముచేగాని అపాతవైరాగ్యము గలిగి దానివలన శిఖాయజ్ఞోపవీతముల వీడినచో నంతమాత్రముననే విదేహముక్తిస్వరూపమగు సిద్ధిని ముముక్షువగువాఁడు వేదాంతశ్రవణజన్యజ్ఞానము లేనిదే పొంద నేరఁడు. "మోక్షమునకై దహరోపాసనను గాని, వైశ్వానరోపాసనను గాని, యీశ్వరపూజను గాని, ఈశ్వరనామసంకీర్తనమును గాని చేసెద" నని యందువేమో యట్లు కాదు. అందు దహరోపాసనము సత్యకామత్వాదిగుణములు కలదగుటచే గుణవదుపాసనవలన తద్భావాపత్తియే సంభవించును. ఇక వైశ్వానరోపాసనము "స సర్వేషు

భూతేష్వన్నమత్తి” అను శ్రుతిచెప్పిన సర్వభూతస్వరూపముగ నన్నమనుభవించుటే ఫలము గాకలది యగును. ఇక “దేవో భూత్వా దేవాన ప్యేతి” అనుశ్రుతిచెప్పిన శివపూజనము శివలోకప్రాప్తికము మాత్రమే యగును. “నాస్తి పాతక మహో! కలికాలే నామకీర్తనపరేషు నరేషు” “పుణ్యశ్రవణకీర్తనాత్” ఇత్యాదివాక్యములచే నామసంకీర్తనమువలన పాపక్షయమాత్రమగు ప్రయోజనమే సిద్ధించును. ‘యద్దృశ్యం తదసత్’ (దృశ్యమగున దెల్ల యసత్తనదగు) నను నియమముచే నవ్యాకృతము, స్థూలాంతరము సగుణమునగు సమస్తపదార్థముగూడ దృశ్యమగుటచే నసత్తనదగును. కనుకనుపాస్య మగునదెల్ల సగుణముగాన నది యసత్తేయగును. అట్టిదానినుపాసించుటవలన నసద్భావమే ఫలముగ సిద్ధించును. ఫలసిద్ధి యుపాసనానురూపము గాన నసదుపాసనమువలన నసద్భావమే ఫలముగ సిద్ధించును. కాని తద్వ్యతిరేకముగ నొకప్పుడును సద్భావరూపఫలము సిద్ధించనేరదు. “తం యథా యథోపాసతే తథైవభవతి, అసన్నేవ సభవతి” అను శ్రుతులును, ‘యేయథా మాం’ అను స్మృతియు నైవిషయమునే చెప్పుచున్నవి. మఱియు, “అనూర్యా నామతే లోకాః” అనియు, “న చేదిహావేదీ న్మహతీ వినష్టిః” అనియు నీశ్రుతులాత్మతత్త్వానభిజ్ఞునకు అసురలోకప్రాప్తిరూపమగు మహానర్థముగూడ జేకూరునని చెప్పుచున్నవి. “అరున్ముఖా న్యతీ న్సాలావృకేభ్యః ప్రాయచ్ఛత్” అనుశ్రుతి— వేదాంతవిముఖులగు యతులకు నింద్రునుండి భయము కలుగునని చెప్పుచున్నది. “ప్రత్యక్తత్త్వవివేకాయ సంన్యాస స్సర్వకర్మణాం। శ్రుత్యా విధీయతే తస్మా త్త్యాగీ పతితో భవేత్” (ప్రత్యక్తత్త్వవివేకము నిమిత్తము యతికి సర్వకర్మసంన్యాసము విధించబడెను. గాన సర్వకర్మలనుసంన్యసించినయతికి ప్రత్యక్తత్త్వవివేకము కలుగనిచో వాడుపతితుడగును) అనియు నైస్మృతి చెప్పుచున్నది. కనుక సంన్యాసమునకు కర్మలకంటె విశేషములేనందున నంతమాత్రముచేతనే మోక్షము సంభవింపనేరదు. కనుకనే ముముక్షువగు యతి యన్నివిధముల ప్రయత్నించి వేదాంతశ్రవణమునుజేసి జ్ఞానము సంపాదింపదగు” నని సూచించుటకు ‘న చ సంన్యసనా దేవ’ అనునుత్తరార్థమును జెప్పెను. ఇక “సంన్యాసయోగా ద్యతయ శ్శుద్ధ సత్త్వాః” అను స్థలమున సంన్యాసయోగశబ్దమునకు—బ్రహ్మవేత్త లగు యతులకు సంబంధించిన బ్రహ్మారోపితనామరూపపరిగ్రహణపరిత్యాగ మర్థముగాని కర్మసంన్యాసమర్థము కాదు. ఏలన? ‘యతయః’ అనుటచేతనే కర్మసంన్యాసము సిద్ధించుటచే తిరిగి ‘సంన్యాస యోగాత్’ అను శబ్దమునకుగూడ కర్మసంన్యాసమనియే యర్థమును చెప్పుచో బునరుక్తిదోషము వాటిల్లును. కానయతియొక్క సంన్యాసమునకు వేదాంతశ్రవణజన్యజ్ఞానమే ఫలమని సిద్ధించినది.

నీలకంఠీయము:— పైశ్లోకమున జెప్పిన రెండుప్రకారముల కంగాంగిభావము నీశ్లోకముచే చెప్పుచున్నాడు. యజ్ఞాదుల నాచరించనిచో బురుషుడు నైష్కర్మ్యమును పొందనేరడు. కనుకనే ‘త మేతం బ్రాహ్మణా వివిదిషంతి” అను శ్రుతియందు యజ్ఞాదులు జ్ఞానాంగముగ విధింపబడెను. ‘వివిదిషంతి’ అను స్థలమునందు సన్ప్రత్యయము ప్రధానమగుటచే వివిదిషయందే యజ్ఞాదుల నన్వయింపదగును. అట్టి యజ్ఞాదులచే వివిదిష సిద్ధింప “ఏత మేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛంతః ప్రవ్రజంతి” అను శ్రుతిసిద్ధమగు సంన్యాసరూపనైష్కర్మ్యము సంభవించును. కాన నీశ్లోకమునందు జ్ఞాననిష్ఠాసాధనమగు వివిదిషాసంన్యాసమే నైష్కర్మ్యమనంబడును. కాని నైష్కర్మ్యశబ్దముచే జ్ఞాననిష్ఠ చెప్పబడదని “నైష్కర్మ్యసిద్ధిం పరమాం” అనుస్థలమున ‘పరమాం’ అను విశేషణముచే నైష్కర్మ్యశబ్దముచే జ్ఞాననిష్ఠ చెప్పఁబడినను, ఈశ్లోకమునం దట్టి విశేషణవాచకశబ్దము లేమింజేసి యిట నుండు “నైష్కర్మ్యం” అను శబ్దము జ్ఞానాంగ మగు సంన్యాసమునే బోధించును.

“కర్మయోగజనిత మగు చిత్తశుద్ధి లేనిదే కేవలసంన్యాసమువలన సిద్ధి నొందనేరఁడని యోజన చేసినచో విప్రకృష్టము లగు జ్ఞానకర్మల కభీష్ట మగు సముచ్చయాసంభవము సిద్ధించుచుండ నేకారణముచే నిట నుండు నైష్కర్మ్యశబ్దమునకు జ్ఞాననిష్ఠ యర్థ మని చెప్పవలయు” ననెదవా?

గీ॥ న హి కశ్చి త్క్షణ మపి జాతు తిష్ఠ త్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః ॥ ॥౫॥

పదవిభాగము:— న- హి- కః- చిత్- క్షణం- అపి- జాతు- తిష్ఠతి- అకర్మకృత్- కార్యతే- హి- అవశః- కర్మ- సర్వః- ప్రకృతిజైః- గుణైః ॥ ॥౫॥

ప్రతిపదార్థము:— హి=ఏ కారణమువలన; క్షణమపి=క్షణకాలమునందైన; జాతు=ఒకానొకప్పుడు; కశ్చిత్=ఎవడును; అకర్మకృత్=కర్మమును చేయక; నతిష్ఠతి=ఉండడు; హి=ఏ కారణమువలన; ప్రకృతిజైః=ప్రకృతివలన జనించెడి; గుణైః=సత్త్వరజస్తమోగుణములచే; సర్వః=సమస్తజనము; అవశః=స్వాధీనములేని వాఁడై; కర్మ=కర్మమును; కార్యతే=చేయించబడుచుండెనో. ॥౫॥

---

"గుణైః కర్మ కార్యతే" (ప్రకృతిసంబంధమగు సత్త్వరజస్తమోగుణములచే కర్మ చేయబడును.) అను వాక్యశేషమువలన నైర్గుణ్యహేతుకము, ముఖ్యమునగు జ్ఞాననిష్ఠయే ఇట నైష్కర్మ్యశబ్దార్థము కాని సంన్యాసము నైష్కర్మ్యశబ్దార్థము కానేరదు.

("జిగమిష త్యశ్వేన—జిఘాంస త్యసినా" అను స్థలమునందు తృతీయాంతార్థమును ధాత్వర్థమగు గమనహననాదులయం దన్వయించినటుల) 'వివిదిషంతి యజ్ఞేన' (అనుస్థలమునందుగల యజ్ఞాదులను వేదనమునందే యన్వయింపవలయునని తెలియనగును) "ఏత మేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛంతః ప్రవ్రజంతి" అను శ్రుతి వివిదిషాసంన్యాసాభిప్రాయముచే ప్రవృత్తమైనది. "ఏతం వైత మాత్మానం విదిత్వా బ్రాహ్మణాః పుత్రైషణాయా శ్చ, లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యంచరంతి" అను శ్రుతి-జ్ఞానపరిపాకార్థము కాని, జీవన్ముక్తిసుఖార్థము కాని యాజ్ఞవల్క్యాదులచే ననుష్ఠితమగు విద్వత్సంన్యాసమును బోధించుటవలన పూర్వోదాహృతశ్రుతి వివిదిషాసంన్యాసమునే బోధించునని గ్రహింపనగును. సంన్యాసి కానివానికి జ్ఞానమే కలుగదను ప్రాచీనుల యాగ్రహము చిత్తవిక్షేపకారకకర్మపరిత్యాగరూపసంన్యాసవిషయకమే కాని, దండకమండలకాషాయపరిధానవిషయకము కానేరదు. కనుకనే దండకమండలాదులను గ్రహింపనట్టి గార్గీవ్యాధవసిష్ఠాదులకు జ్ఞానోత్పత్తి శ్రుతివలన బోధితమగుచున్నది. కర్మచేబోధింపబడనిచిత్తముకలిగినట్టియు, మందబుద్ధియునగు రాగద్వేషాదిగ్రహగ్రస్తునకు ఆత్మానాత్మవివేకద్వారమున కాని, చిత్తనిరోధద్వారమున కాని నైష్కర్మ్యప్రాప్తి లేదని యీశ్లోకపూర్వార్థముయొక్క యర్థము. "అభయం సర్వభూతేభ్యో దత్త్వా నైష్కర్మ్య మాచరేత్" (సర్వభూతములకు అభయమునొసగి. (అనగా తానెవనికి నపకృతినొనరించడను జ్ఞానమును సర్వభూతములకు కలిగించి నైష్కర్మ్యము నాచరించవలెను) అను స్మృతి కేవలసంన్యాసమువలన గూడ నైష్కర్మ్యము సిద్ధించునని బోధించుచుండ నెందులకు కర్మాచరణములేనిదే పురుషుడు నైష్కర్మ్యమును పొందడని చెప్పియుండె' ననుశంకను 'నచ సంన్యసనాత్' అను నుత్తరార్థముచే తొలగించుచుండెను. కర్మలవలన జనించెడి చిత్తశుద్ధిలేనిదే కేవలసంన్యాసమువలన మోక్షము సిద్ధించదు. "అభయం సర్వభూతేభ్య" అనుస్మృతియు చిత్తశుద్ధిపూర్వకసంన్యాసమువలననే మోక్షము ప్రాప్తించునని యే బోధించుచున్నది. అదియెట్లనిన? రాగాదిగ్రస్తుడు సర్వభూతములకొఱ కభయము నొసంగుటకు సమర్థుడు కానేరడు. అట్టి యభయప్రదాత చిత్తశుద్ధికలవాడుగనే యుండును. అట్టి చిత్తశుద్ధికలవానిసంన్యాసము నైష్కర్మ్యసిద్ధికి హేతువే యగును కాన "నచ సంన్యసనా దేవ సిద్ధిం సమధిగచ్ఛతి" కేవలసంన్యాసమువలన సిద్ధిని పొందడని చెప్పుట సమంజసమే. ॥౪॥

శాంకరభాష్యమ్:—

కస్మా త్పునః కారణా త్కర్మసంన్యాసమాత్రాదేవ జ్ఞానరహితా త్సిద్ధిం నైష్కర్మ్య లక్షణాం పురుషో నాధిగచ్ఛతీతి హేత్వాకాంక్షాయా మాహ — నహీతి। న హి యస్మాత్క్షణ మపి కాలం జాతు కదాచి త్కశ్చి త్తిష్ఠ త్యకర్మకృత్ । కస్మా త్కార్యతే హి యస్మా దవశ ఏవ కర్మ సర్వః ప్రాణీ ప్రకృతిజైః ప్రకృతితో జాతైః సత్త్వరజస్తమోభి ర్గుణైః । అజ్ఞ ఇతి వాక్యశేషః యతో వక్ష్యతి —"గుణై ర్యో న విచాల్యతే" (గీ-14-23) ఇతి । సాంఖ్యానాం పృథక్కరణా దజ్ఞానా మేవ హి కర్మయోగో న జ్ఞానినామ్ । జ్ఞానినాం తు గుణైరచాల్య మానానాం స్వతశ్చలనాభావా త్కర్మయోగో నోపపద్యతే । తథా చ వ్యాఖ్యాతం "వేదా వినాశిన" మిత్యత్ర । (గీ-2-21) ॥౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"ఏ కారణమువలన జ్ఞానరహితమగు కర్మసంన్యాసమువలన నైష్కర్మ్యరూపమగు సిద్ధిని పురుషుఁడు పొందఁ" డను కారణాకాంక్షయందు 'న హి కశ్చిత్' అని శ్రీకృష్ణపరమాత్మ చెప్ప మొదలిడెను,

ఏ కారణమువలన సర్వప్రాణులు ప్రకృతివలన సంభవించెడి సత్త్వరజస్తమోగుణములచే నవశులై కర్మము నాచరించుచుండెదరో, అందుచే నొకానొకఁడైన నెవ్వఁడును క్షణకాలమైన కర్మమును చేయనివాఁడై యుండఁడు.

మూలమున 'సర్వః' అని సర్వశబ్దమును బ్రయోగించుటచే జ్ఞానియును సత్త్వరజ స్తమోగుణములచే కర్మనాచరించు నని కదా భావము. "అట్లగుచో జ్ఞానికి సంన్యాసమును బోధించు వాక్య మనవకాశము కావలసివచ్చు" నని శంకింపఁజనదు. కనుకనే మూలమున 'సర్వః' అనుచోట "అజ్ఞః" అని పూరించుకొనవలయును. ఇట్లు పూరించుటచే నజ్ఞాను లగు సర్వులు గుణములచే నవశులై కర్మము నాచరించుదు రని యర్థము సంభవించును. ఇట్టి యర్థ మున పూర్వోక్తాశంక సంభవింపదు. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ "గుణై ర్యో న విచాల్యతే" (ఏజ్ఞాని గుణములచే చలింపజేయబడఁడో) అని ముందు చెప్పఁగలఁడు. ఇట్లు చెప్పి సాంఖ్యు లను పృథక్కరించుటచేఁ గర్మయోగ మజ్ఞులకే గాని జ్ఞానులకుఁ గాదు. గుణములచేఁ చలింపఁ జేయఁబడని జ్ఞానులకైతే స్వతః చలనము లేమింజేసి కర్మయోగము సంభవింపదు. ఈవిధము ననే "వేదాఽవినాశినం" అనుశ్లోకమునందు వ్యాఖ్యానింపబడెను. ॥౫॥

— ౩వ అధ్యాయము- ౫వ శ్లోక వ్యాఖ్యావిశేషములు —

శంకరానందీయము:— "సర్వకర్మలను సంన్యసించి, యౌదాసీన్యము నవలంబించి సుఖముగ నుందు" నందువేమో యట్లు కాదు, సంస్కారజనితప్రవృత్తిగల క్రియను నిశ్శేషముగ త్యజించుట సంభవింపదు. కనుక బ్రహ్మనిష్ఠుని విడచి మఱియొకఁడెవఁడును నుదాసీనముగనుండుట-వృత్తికి నేయాలంబన ముండదు గాన సంభవిం

గీ॥ కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।
ఇన్ద్రియార్థాన్విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే ॥ ॥౬॥

పదవిభాగము:— కర్మేంద్రియాణి- సంయమ్య- యః- ఆస్తే- మనసా- స్మరన్- ఇన్ద్రియార్థాన్- విమూఢాత్మా- మిథ్యాచారః- సః- ఉచ్యతే ॥ ॥౬॥

ప్రతిపదార్థము:— యః=ఏపురుషుడు; కర్మేన్ద్రియాణి=హస్తపాదాదులను; సంయమ్య=ఉపసంహరించుకొని; మనసా=మనస్సుచేత; ఇన్ద్రియార్థాన్=శబ్దస్పర్శరూపరసగంధము లనెడి విషయములను; స్మరన్=స్మరించుచు; ఆస్తే=ఉండునో; సః=అట్టి; విమూఢాత్మా=విమూఢమగు నంతఃకరణముకలవాడు; మిథ్యాచారః=పాపాచారుఁడని; ఉచ్యతే=చెప్పఁబడుచున్నాడు. ॥౬॥

శాంకరభాష్యమ్:—

యస్త్వనాత్మజ్ఞ శ్చోదితం కర్మ నారభత ఇతి తదసదేవే త్యాహ—కర్మేంద్రియాణీతి । కర్మేంద్రియాణి హస్తాదీని సంయమ్య సంహృత్య య ఆస్తే తిష్ఠతి మనసా స్మరం శ్చింతయ న్నిన్ద్రియార్థాన్విషయా న్విమూఢాత్మా విమూఢాంతఃకరణో మృషాచార స్స ఇష్యతే ॥౬॥

పడు. అని చెప్పుటకీశ్లోకమును చెప్పుచున్నాడు. "నహి—అకర్మకృత్" ఈలోకమున నొకానొకప్పుడును, నెవఁడో యొకానొకడును, నేదోయొక కర్మను చేయనివాడు లేడు. అనగ నొక సుషుప్తిని విడిచి, జాగ్రత్స్వప్నావస్థలయం దెల్లపుడు మనోవాక్కాయములలో నేదో యొకదానితో గాని, లేక యన్నిటితోగాని, చక్షురాదీంద్రియములతోఁ గాని యేదోయొక కర్మను చేయుచునే యుండును గాని యుదాసీనముగ నుండజాలడు. (ఇదియంతయు ననుభవసిద్ధమే యని సూచించుటకు 'హి' అనుపద ముపయోగించెను.) "ఉదాసీనముగ నెందు కుండజాలడు:" అను నాశంకమీద నుత్తరార్థమును జెప్పుచున్నాడు. "కార్యతే—గుణైః" సమస్తమగు ప్రాణివర్గము (సత్త్వరజస్తమోగుణాత్మిక మగు మూలప్రకృతియే యిట ప్రకృతిశబ్దముచే చెప్పఁబడును. దానినుండి బుట్టిన ద్రవ్యవాసనలు, గుణవాసనలు, కర్మవాసనలు, జాతివాసనలు, రాగద్వేషాదులు, ప్రకృతిజములగుగుణము లనఁబడును.) అట్టి ప్రకృతిజగుణములచే ప్రేరేపింపఁబడి యస్వతంత్రుడయి! యే నానావ్యాపారరూపము లగు కర్మలను లోపలను, వెలుపలను గూడ చేయుచునే యుండును. అనఁగా నొక బ్రహ్మనిష్ఠుని విడచి మఱియొకఁ డెవడైనను వాసనారూపమగు ప్రవృత్తికి లోఁబడినవాఁడగుటచే నుదాసీనముగ నుండజాలడని యర్థము. ఇక బ్రహ్మవేత్త నిర్వికల్పసమాధిరూపమగు నగ్నిచే ప్రకృతిగుణతత్కార్యములనెడి తూలరాశిని నిర్మూలించినవాఁడగుటచే వానిని—వాయువెట్లు మేరుపర్వతమును చలింపజేయలేదో అట్లే గుణములు చలింపఁజేయజాలవు. కనుక నట్టి బ్రహ్మవేత్త నిష్క్రియబ్రహ్మస్వరూపమున నుదాసీనుడై యుండగలుగును. "ఉదాసీనవ దాసీనో గుణై ర్యో న విచాల్యతే" అను స్మృతియు నీవిషయమునే తెలుపుచున్నది.

పరమార్థప్రిప:— సత్కార్మాచరణమునందు విసుగుజెందిన జనమునుగూర్చి సోపపత్తికముగ బోధించుచున్నాడు-ఎవడును గూడ నెల్లపుడును కర్మనుజేయకుండ నుండజాలడు. ఇకప్రతివాడునుగూడ నస్వతంత్రుడై స్వభావప్రభవములగు గుణములచే కరచరణచేష్టారూపమగు కర్మచేయుచునే యుండును. ఉద్విగ్నుడై యేదోయొక కర్మను చేయుచునేయుండును. గాని సత్కార్మయందు ప్రవర్తించడు. ఇదియే యాశ్చర్యము. ॥౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"ఆత్మజ్ఞుఁడునలె శరీరేంద్రియసంఘాతమును నియమించుట కసమర్థుఁడును, మూర్ఖుఁడు నగువానికిఁ గూడ సంన్యాసము సంభవించుటవలన కర్మను చేయనట్టి యనాత్మజ్ఞునకు ప్రత్యవాయము సంభవింపనేర" దను శంకను దొలఁగించుటకు ఎవఁ డనాత్మజ్ఞుఁడో, వాఁడును విధివిహితకర్మమును చేయకుండు ననుట యసమంజసమే యగు నని శ్రీకృష్ణపరమాత్మ "కర్మేంద్రియాణి మనసా" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

ఏపురుషుఁడు స్రక్చందనవనితాదులను మనస్సుచే స్మరించుచు, కర్మేంద్రియములగు వాక్పాదపాణిపాయూపస్థల నరికట్టి యుండునో అట్టి విమూఢాంతఃకరణుఁడు మృషాచారుఁ డని చెప్పఁబడుచున్నాఁడు. ॥౬॥

—• ౩వ అధ్యాయము ౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

శంకరానందీయము:— సమస్తకర్మలను సంన్యసించి, కరపాదాదిబహిరింద్రియ సమూహమును నిరోధించి, స్థాణువువలె నిశ్చలుఁడనై యుదాసీనముగ నుండుట శక్యమే యగునే. అందు వేమో? అట్లు కాదు. బంధమోక్షముల గమనమును దెలిసికొని 'నిష్ఫలము, క్లేశభూయిష్ఠము నగు నీ కర్మముతో నేమి ప్రయోజనము?' అని దలఁచి దురహంకారముతో వైదికకర్మను విడచి, యెవఁ డుదాసీనముగ నుండునో వాఁడు దంభాచారుఁ డనఁబడును. అని యీశ్లోకమునఁ జెప్పుచున్నాఁడు. కార్యాకార్యవివేకరహితమనస్కుఁడై, తన కర్తవ్యము, ముక్తిసాధనము నగు వైదికకర్మను విడచి, కర్మేంద్రియవిషయములను నిరోధించి, శబ్దాదీంద్రియములను మనస్సుతో స్మరించుచు "నేనే బ్రహ్మవేత్తను, కర్మసంన్యాసముచే కృతార్థుఁడ నైతి" నని యెవఁడు తలఁచునో; వాఁడు దంభాచారుఁడు (అసదాచారుఁడు, కపటచరిత్రుఁడు, ఆత్మవంచకుఁడు) అనఁబడును. ఇట్లనుటచే వేదాంతశ్రవణనిమిత్తముగాని, లేక మరొకవిధముగఁ గాని సంన్యసించి శ్రవణాదికమును జేయకుండ వేషముచే జీవనమును జేయుచు, "నేను సంన్యాసముచే కృతార్థుఁడ నైతి" నని తలచునట్టి యతికూడ మిథ్యాచారుఁడే యని సూచింపఁబడెను.

పరమార్థప్రపా:— "నాకంటె నైష్కర్మ్యసిద్ధికల పురుషుఁ డింకొకఁ డెవఁడు కలఁ?" డని విఱ్ఱవీగుచు, ధ్యానమిషచే నేత్రములఁ మూసికొని, రూపరసాదివిషయముల నెవఁడు మనస్సుతో స్మరించుచుండునో వాఁడు మిథ్యాచారుఁ డనఁబడును. అట్టివాఁడు తన హితమును దెలిసికొనలేక తన ఆయువును వ్యర్థముచేయువాఁడని యర్థము.

నీలకంఠీయము:— "సంన్యాసమును స్వీకరించి ధ్యానముచేసనే చిత్తశుద్ధిని సంపాదింపఁగలను. కర్మలతో నేమి ప్రయోజనము?" అను శంకను "కర్మేంద్రియాణి" అను శ్లోకముచే తొలఁగించుచుండెను.

రాగద్వేషాద్యాక్రాంతచిత్తుఁ డగు నే విమూఢాత్ముఁడు వాక్పాదపాణిపాయూపస్థ లనెడి కర్మేంద్రియములను విషయములయందు ప్రవేశింపకుండ రహస్యమునందు ధ్యానమిషచేఁ గూర్చుండునో అట్టివాని యుపవేశనము మొదలగునవి నిష్ఫల మగుటంజేసి యలీకములే యగును. ఈవిషయమున 'ఇంద్రియార్థాన్మనసా స్మరన్' అని హేతువుగ ప్రయోగించఁబడెను. అట్టివాఁడు విషయముల శ్రోత్రాదులచే గ్రహించును; మనస్సుచే స్మరించును. కాన వాడు మిథ్యాచారు డనబడును. మరియు వాఁడు విషయముల స్మరించుచు తనసంబంధ మగు రోగవిష్ఠను లోకమునందు ప్రకటించును. కాన నట్టివాఁడు కపటి యనిపించుకొనును. అందువలన కర్మకంటె భిన్నమగున దేదియు చిత్తశుద్ధ్యుపాయము లేదని భావము. ॥౬॥

గీ॥ యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున! ।
కర్మేంద్రియైః కర్మయోగ మసక్త స్స విశిష్యతే ॥ ॥౭॥

పదవిభాగము:— యః- తు- ఇంద్రియాణి- మనసా- నియమ్య- ఆరభతే- అర్జున!- కర్మేంద్రియైః- కర్మయోగం- అసక్తః- సః- విశిష్యతే । ॥౭॥

ప్రతిపదార్థము:— యస్తు=కర్మమునం దధికృతుఁ డగు నే యజ్ఞాని; ఇంద్రియాణి=జ్ఞానేంద్రియములను; మనసా=మనస్సుచే; నియమ్య=నియమించుకొని; హేఅర్జున!= ఓయర్జునుడా!; అసక్తః= సక్తి లేనివాఁడై; కర్మేంద్రియైః=వాక్పాణ్యాదులచే; కర్మయోగం=కర్మయోగమును; ఆరభతే=ప్రారంభించునో; సః=అట్టివాఁడు; విశిష్యతే=(మిథ్యాచారముకలవానికంటె) ఉత్కృష్టుఁ డగుచున్నాడు. ॥౭॥

---

శాంకరభాష్యమ్:—

యస్త్వితి । యస్తు పునః కర్మ ణ్యధికృతోఽజ్ఞో బుద్ధీంద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున! కర్మేన్ద్రియైః ర్వాక్పాణ్యాదిభిః కి మారభత ఇత్యాహ—కర్మయోగ మసక్త స్సన్ స విశిష్యత ఇతరస్మా న్మిథ్యాచారాత్ ॥ ॥౭॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

విధివిహితమగు కర్మ నాచరింపని యజ్ఞుఁడు జాగ్రదవస్థలో విషయాంతరములను దర్శించుట తప్పదుకాన నతఁడు మిథ్యాచారుఁ డగుటంజేసి ప్రత్యవాయి యగు నని పూర్వశ్లోకమున చెప్పి విధివిహితకర్మల నాచరించునట్టియు, ఫలాభిసంధి లేనట్టి యా యజ్ఞుఁడే సదాచారుఁ డగుటచే గొప్పవాఁ డగునని "యస్త్వింద్రియాణి మనసా" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

ఏ యజ్ఞుఁడు విధివిహితకర్మమునం దధికృతుఁడై, జ్ఞానేంద్రియములను మనస్సుచే నిరోధించి, యో యర్జునా ! కర్మేంద్రియములగు వాక్పాణ్యాదులచే కర్మయోగమును ఫలమునపేక్షింపక, నాచరించునో, అట్టి పురుషుఁడు మిథ్యాచారుని కంటె (అనఁగా మనస్సుచే విషయములను ధ్యానించుచు కర్మేంద్రియములను బిగియఁగట్టిన దురాచారునికంటె) నుత్కృష్టుఁడు.

---

—• ౩వ అధ్యాయము ౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "ఔత్సుక్యమాత్రముచేతనే కర్మలను విడువక చిత్తశుద్ధినిమిత్తమై యథాశాస్త్రముగ నిష్కామకర్మల నాచరింపఁదగు" నని యీశ్లోకమునఁ జెప్పుచున్నాడు. శ్రోత్రాదిజ్ఞానేంద్రియములను పాపహేతువు అగు శబ్దాదివిషయములనుండి, వివేకయుక్త మగు మనస్సుచే మరలించి, వాక్పాణ్యాది కర్మేంద్రియములచే శుద్ధిహేతు వగు విహితకర్మను ఫలాభిసంధిశూన్యుఁడై యే వివేకి చేయునో వాఁడు మిథ్యాచారునికంటె—(యుభయులకు శ్రమ సమానమైనను ఫలాతిశయమును పొందువాఁడుగాన) శ్రేష్ఠుఁడగును. ఒకఁడు కర్మేంద్రియములను నిగ్రహించి, జ్ఞానేంద్రియములను ప్రసరింపఁజేయుచు, పురుషార్థశూన్యు డగుచుండెను. మరొకఁడు జ్ఞానేంద్రియములను నిగ్రహించి, కర్మేంద్రియములను ప్రసరింపఁజేయుచు పరమపురుషార్థమును బొందుచుండెను. ఓయర్జునా ! యీయాశ్చర్యమును జూడుము. ॥౭॥

గీ॥ నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।
శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః ॥ ॥౮॥

పదవిభాగము:— నియతం- కురు- కర్మ- త్వం- కర్మ- జ్యాయః- హి- అకర్మణః- శరీరయాత్రా- అపి- చ- తే- న- ప్రసిద్ధ్యేత్- అకర్మణః । ॥౮॥

ప్రతిపదార్థము:— హి=ఏ కారణమువలన; అకర్మణః=కర్మము నాచరింపకుండుటకంటె; కర్మ=కర్మము; జ్యాయః=ఉత్కృష్టమైనదో; అతః=(ఈపద మధ్యాహార్యము) ఈ కారణమువలన; హే అర్జున!=(ఈపద మధ్యాహార్యము) ఓ అర్జునుఁడా!; త్వం=నీవు; నియతం=నిత్యమగు; కర్మ=కర్మమును; కురు=చేయుము; అకర్మణః=కర్మ నాచరింపక పోవుటవలన; తే=నీకు; శరీరయాత్రాపిచ=శరీరస్థితియును; నప్రసిద్ధ్యేత్=ప్రసిద్ధిని పొందనేరదు. ॥౮॥

శాంకరభాష్యమ్:—

యత ఏవ మతః— నియత మితి । నియతం నిత్యం యో యస్మి న్కర్మ ణ్యధికృతః ఫలాయ చాశ్రుతం తన్నియతం కర్మ తత్కురు త్వం హే౽ర్జున! । యతః కర్మ జ్యాయో౽ధిక తరం ఫలతో హి యస్మా దకర్మణో౽కరణా దనారమ్భాత్ । కథం శరీరయాత్రా శరీరస్థితి రపి చ తే తవ న ప్రసిద్ధ్యే త్ప్రసిద్ధిం న గచ్ఛే దకర్మణో౽కరణాత్ । అతో దృష్టః కర్మా కర్మణో ర్విశేషో లోకే ॥ ॥౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఫలమును కోరక నెవఁడు కర్మయోగము నాచరించునో వాఁ డుత్కృష్టుఁడు. కాన నో యర్జునా! ఎవఁ డేకర్మమునం దధికారము కలవాఁడో, ఏకర్మమునకు ఫలము శ్రుతియందు చెప్పఁబడలేదో అట్టి కర్మము వానికి నిత్యకర్మ మనఁబడును. అట్టి నిత్యకర్మమును నీ వాచ రింపుము. ఎందువల ననిన? కర్మ మాచరింపకుండుటకంటె ఫలమువలన కర్మాచరణ ముత్కృష్టము. కర్మము నాచరింపనిచో నీయొక్క శరీరస్థితి గూడ సంభవింపదు. కాన శరీరస్థితినిమిత్త మైనను కర్మాచరణ మావశ్యకము. అందుచే నోయర్జునా! నీవు నిత్యకర్మానుష్ఠానతత్పరుఁడ వగు మని యాశయము.) కర్మము నాచరించిననే దేహాదిచేష్టాద్వారమున శరీరము నిలవత్రొక్కుటకు సమర్థ మగును. కర్మము లేనిచో జీవనమే దుర్లభమైనదై యగును. కాన కర్మాకర్మవిశేషము లోకమున నిట్టి విధముగ చూడఁబడెను. ॥౮॥

—• 3వ అధ్యాయము ౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— విధ్యుద్దేశమునందు ఫలాభిసంధిరహితముగ నిమిత్తకారణముచే విహిత మైన శ్రౌతస్మార్తరూప మగు నిత్యకర్మము నియత మనఁబడును. పూర్వమునందుఁ జేయఁబడునట్టియు, చిత్తశుద్ధికి హేతు వగునట్టి నిత్యకర్మను నీవు జ్ఞానేంద్రియముల నిరోధించి, కర్మేంద్రియములతో చేయుము. లేనిచో నంతః

కరణశుద్ధి కలుగకపోవుటయేగాక క్షత్రియునకు విహిత మగు యుద్ధాదికర్మవిరహితుఁడ వగు నీయొక్క శరీర యాత్రయు సిద్ధించకపోయెడిని.

శంకరానందీయము:— “ముముక్షు వగువానికి నైష్కర్మ్యసిద్ధి యగుటకును, మిథ్యాచారత్వాదికము నివృత్త మగుటకును నవశ్యము కర్మ చేయఁదగును” అని చెప్పుట కీశ్లోకమును చెప్పుచున్నాఁడు. మూఢకృతమగు కర్మసంన్యాసముకంటె మోక్షసాధనముగ వివేకిచేఁ జేయఁబడిన కర్మ శ్రేష్ఠమైనది. ‘న్యాస ఏవాత్యరేచయత్’ అను శ్రుతిచొప్పున సంన్యాసమే సర్వోత్కృష్టమని శ్రూయమాణ మగుచున్నది. అట్లైనను “యోగ్యప్రయుక్తం సాధనం కార్యసాధకం” (యోగ్యముగా ప్రయోగించఁబడిన సాధనము కార్యసాధక మగును) అను న్యాయముచే “నేను కర్మలను జేయుటలేదు” అను నభిమానముకల మూఢజనునిచేఁ జేయఁబడుటచే నట్టి కర్మసంన్యాసముకంటె ‘పరమేశ్వరు నారాధించి తరించెద’ నని తలంపు గలిగి ఈశ్వరార్పణబుద్ధితో నిరభిమానియు, ముముక్షువు నగువానిచేఁ జేయఁబడినచో నట్టి కర్మ శ్రేష్ఠమైన దనఁదగును. ఇట్లనుటచే సంన్యాసమును దూషించుట కాదు. ఇకేమన విద్వత్సంన్యాసముకంటెను వివిదిషాసంన్యాసముకంటె వేఱొండు విలక్షణమగు సంన్యాస మెక్కడను విధింపఁబడలేదుగాన నట్టి సంన్యాసము స్వీకరింపఁదగినది కాదని చెప్పఁదగును. వివిదిషువు కాని కేవలమూఢుఁడు ఆత్మతత్త్వమును దెలిసికొనలేకయే కర్మలను సంన్యసించినచో కర్మల ననుష్ఠింపకుండుటచే సంభవించెడి ప్రత్యవాయ మొకటియును, అందుచే నరకపతన మనునది రెండవదియు, దుష్టజన్మము మూఁడవదియు, మోక్షము లేకపోవుట యనునది నాల్గవదియు నను నీయనర్థచతుష్టయము ప్రాప్తించును. కర్మలను విహితరీతిఁ జేయుచున్నచో ప్రత్యవాయము లేకుండుట, దానిచే నరకకూపమునఁ బడకుండుట, ఈశ్వరానుగ్రహము, దానిచే చిత్తశుద్ధియు, తద్ద్వారమున జ్ఞానము, దానివలన మోక్షముకూడ సిద్ధించును. కాన కర్మలకు ఫలభూయస్త్వ మున్నది. కాన నీవు నిత్య మగునట్టిదిగాని, నైమిత్తిక మగునట్టిది గాని యగు విధ్యుక్త మగు కర్మను నీశ్వరప్రీత్యర్థమై చిత్తశుద్ధి కలుఁగుటకుఁ జేయుము. కేవల మాముష్మికనిమిత్తమే కాక యైహికమునిమిత్తముగూడ కర్మలు చేయఁదగిన” వని యుత్తరార్థమునఁ జెప్పుచున్నాఁడు. “శరీర...అకర్మణః” నిశ్చలస్వరూపముగ స్థాణువువలె నుదాసీనముగ నుండుట యకర్మ యనఁబడును. తద్రూపమగు నిశ్శేషకర్మపరిత్యాగమువలన నీయొక్క శరీరయాత్రకూడ సిద్ధించక పోయెడిని (అనఁగ పెద్ద చట్రాయివలె గుహయందుగాని, పొదయందు గాని యుదాసీనుఁడై కూర్చుని కొంచమైన ననుకూలవ్యాపారమును చేయక యున్నవానికి శరీరయాత్రయు సిద్ధించదు. కనుక కర్మ నవశ్యము చేయఁదగును). అట్లగుచో “శరీరరక్షణమున కవసర మగు కర్మనుమాత్రమే చేయుచు, నంతకంటె నతిరిక్త మగు కర్మను విడచి సుఖముగ నుందు” నందువేమో; అట్లు కాదు. ఇట్టి యభిప్రాయము కలవాఁడ వగుటచేతనే నీ వతిమూఢుఁడవు; సంన్యాసానర్హుఁడవు; నీకంటె భిన్నము, అనాత్మయు నగు దేహమునే రక్షించుటకుఁ దలఁచితివిగాని నీయాత్మను రక్షించుటకుఁ దలఁచుటలేదు. నీయాత్మ జననమరణరూపమైన ప్రవాహమునఁబడి మునుఁగుచు దేలుచు నిరంతరదుఃఖముచే క్లేశపడుచున్నది. నీవట్టి యాత్మ నుద్ధరించక, అనాత్మ యగు దేహముయొక్క రక్షణమునకు ప్రయత్నించుచుంటివి. కనుక నంతకంటె దురభిమానమును విడచి, యుత్సాదరముతో శరీరరక్షణమునకు తగు కర్మల నెట్లు చేయ నెంచితివో యట్లే యుచితరీతిని విహితకర్మల ననుష్ఠించి, చిత్తశుద్ధిని బడసి తద్ద్వారమున నపరోక్షానుభూతిని సంపాదించి నీయాత్మను దుఃఖసాగరమునుండి యుద్ధరింపుము. “ఉద్ధరే దాత్మనాఽఽత్మానం” అను గీతావాక్యానుసార మాత్మోద్ధరణకొఱకే కర్మలను చేయుము. కాని ఒకానొకప్పుడును ఇతరోద్ధరణము నిమిత్తము కర్మలను జేయకు మని భావము. ॥౮॥

గీ॥ యజ్ఞార్థా త్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబన్ధనః ।
తదర్థం కర్మ కౌంతేయ! ముక్తసంగ స్సమాచర! ॥ ౯ ॥

పదవిభాగము:— యజ్ఞార్థాత్- కర్మణః- అన్యత్ర- లోకః- అయం- కర్మబంధనః- తదర్థం- కర్మ- కౌన్తేయ!- ముక్తసంగః- సమాచర ॥ ౯ ॥

ప్రతిపదార్థము:— యజ్ఞార్థాత్=పరమేశ్వరనిమిత్తమగు; కర్మణః=కర్మముకంటె; అన్యత్ర=ఇతరమగు కర్మముచే; అయం=ఈ; లోకః=లోకము; కర్మబంధనః=కర్మమే బంధముగాకలది; హేకౌన్తేయ!=ఓయర్జునా!; త్వం=(ఈపదమధ్యాహార్యము) నీవు; ముక్తసంగః=కర్మఫలసాంగత్యమును వదలి; తదర్థం=పరమేశ్వరార్థము; కర్మ=కర్మమును; సమాచర=లెస్సగనాచరింపుము. ॥ ౯ ॥

శాంకరభాష్యమ్:—

యచ్చ మన్యసే బన్ధార్థత్వా త్కర్మ న కర్తవ్య మితి తదప్యసత్, కథం?— యజ్ఞార్థాదితి । "యజ్ఞో వై విష్ణుః" ఇతి శ్రుతే ర్యజ్ఞ ఈశ్వర స్తదర్థం యత్క్రియతే తద్యజ్ఞార్థం కర్మ, తస్మాత్కర్మణోఽన్యత్రాఽన్యేన కర్మణా లోకోఽయ మధికృతః కర్మకృత్కర్మబన్ధనః కర్మ బన్ధనం యస్య సోఽయం కర్మబంధనో లోకో నతు యజ్ఞార్థా దతః తదర్థం యజ్ఞార్థం కర్మ కౌంతేయ! ముక్తసంగః కర్మఫలసంగవర్జితస్స న్సమాచర నిర్వర్తయ ॥ ౯ ॥

శాంకరభాష్యతత్త్వబోధినీ:—

"కర్మణా బధ్యతే జంతుః" అను స్మృత్యుక్తప్రకారము కర్మము బంధార్థమగును. అట్టి కర్మము శ్రేయోర్థిచే ననుష్ఠింపదగినది కాదని యనుటయు నసంగతము. ఎట్లనః "యజ్ఞో వై విష్ణుః" అను శ్రుతి ననుసరించి యజ్ఞశబ్దమునకు విష్ణువని యర్థము. అట్టి పరమేశ్వరుని నిమిత్తమాచరించు కర్మకంటె వేరగునదియు, ఫలమును కోరి యాచరింపబడునదియు నగు కర్మము బంధక మగును. అట్టిదియే "కర్మణా బధ్యతే జంతుః" అనుస్మృతిచే చెప్పబడు కర్మము. ఇట్టి కర్మము నాచరించుచు నధికారిపురుషుఁడు కర్మబంధను డని చెప్పఁబడును. పరమేశ్వరార్థ మనుష్ఠితమగు కర్మమువలన బురుషుఁడు కర్మబంధనుఁడు కానేరడు. కాన నీవు కర్మఫలసాంగత్యము వదలి పరమేశ్వరార్థము నిత్యము కర్మలనాచరింపుము. (ఫలనిరపేక్షులై పరమేశ్వరార్పణముగ నిత్యకర్మల నాచరించువారలు కర్మలచే బంధింపబడరని యాశయము. ॥ ౯ ॥

—• ౩వ అధ్యాయము ౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

శంకరానందీయము:— "కర్మణా బధ్యతే జంతు ర్విద్యయా చ విముచ్యతే" అను శ్రుతి కర్మలు బంధహేతువులని చెప్పుచున్నది. అట్టి కర్మల నెట్లుచేయనగును?' అనియందు వేమో; అట్లు కాదు. కామ్యకర్మలే బంధహేతువు లగును కాని యీశ్వరార్పణబుద్ధితోఁ జేయఁబడిన కర్మలు బంధకములు కావని చెప్పుచున్నాడు. "యజ్ఞార్థాత్...సమాచర" 'యజ్ఞో వై విష్ణుః' అను శ్రుతిచొప్పున యజ్ఞ మన విష్ణువనియర్థము. విష్ణురూపుడగు పరమేశ్వరుని సంతుష్టికై చేయఁబడినదియు, వేదోక్తమగునట్టిదియు, నిత్యమైనట్టిదియు, ఈశ్వ

గీ॥ సహ యజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।
అనేన ప్రసవిష్యధ్వ మేష వో౽స్త్విష్టకామధుక్ ॥ ॥10॥

పదవిభాగము:— సహయజ్ఞాః- ప్రజాః- సృష్ట్వా- పురా- ఉవాచ- ప్రజాపతిః- అనేన- ప్రసవిష్యధ్వం- ఏషః- వః- అస్తు- ఇష్టకామధుక్ ॥ ॥10॥

ప్రతిపదార్థము:— ప్రజాపతిః=బ్రహ్మ; పురా=సృష్ట్యాదియందు; సహయజ్ఞాః=యజ్ఞసహితులగు; ప్రజాః=బ్రాహ్మణక్షత్రియవైశ్యులనెడి మూడువర్ణములవారలను; సృష్ట్వా=సృజించి; అనేన=ఈయజ్ఞముచేత; ప్రసవిష్యధ్వం=వృద్ధిని చేయుదురుగాక; ఏషః=ఈయజ్ఞము; వః=మీకు; ఇష్టకామధుక్=అభిప్రేతములగు ఫలముల నిచ్చునది; అస్తు=అగుఁగాక; ఇతి=(ఈపద మధ్యాహార్యము) ఈప్రకారముగ; ఉవాచ=పలికెను. ॥10॥

---

శాంకరభాష్యమ్:—

ఇత శ్చాధికృతేన కర్మ కర్తవ్యం—సహేతి । సహయజ్ఞాః యజ్ఞసహితాః ప్రజా స్త్రయోవర్ణా స్తా స్సృష్ట్వోత్పాద్య పురా సర్గాదా వువా చోక్తవా న్ప్రజాపతిః ప్రజానాం ప్రష్టా అనేన యజ్ఞేన ప్రసవిష్యధ్వం ప్రసవో వృద్ధి రుత్పత్తి స్తాం కురుధ్వమ్ । ఏష యజ్ఞో వో యుష్మాక మస్తు భవ త్విష్టకామధు గిష్టా నభిప్రేతా న్కామా న్ఫలవిశేషా న్దోగ్ధీ తీష్టకామధుక్ ॥10॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఈకారణమువలన గూడ నైమిత్తికసహిత నిత్యకర్మములయం దధికారము కలవానిచే నిత్యనైమిత్తికకర్మ లాచరింపదగినవి. సృష్ట్యాయందు హిరణ్యగర్భుడు యజ్ఞసహితముగనే బ్రాహ్మణక్షత్రియవైశ్యులనెడి మూడువర్ణముల ప్రజలను సృష్టించి యీయజ్ఞముచే మీరు వృద్ధిని (ఉత్పత్తిని) చేయుఁడు. ఈయజ్ఞము మీకభీష్టఫలవిశేషముల నిచ్చునది యగుఁగాక అని పలికెను.

---

రానుగ్రహమునకు కారణమైనట్టి కర్మకంటె నితరమగు కామ్యాదికర్మ బంధకమగును. (విహిత మగుదానిని చేయకపోవుటచేగాని, కామ్యము, నిషిద్ధమునగు కర్మను చేయుటచేగాని మనుజుఁడు బంధవంతు డగును. కాని ఈశ్వరప్రీతికై చేయబడు కర్మము బంధకము గానేరదు.) "తత్కర్మ య న్న బంధాయ" అనుస్మృతిచొప్పున ఈశ్వరారాధనాత్మకము, బంధకము కానిదియునగు కర్మయే యనుష్ఠేయ మగును. కావనీశ్వరప్రీతికై యవశ్యము ఫలాభిసంధిరహితుడవై విధివిహితమగు సత్కర్మ నాచరింపుము. దానిచే నీశ్వరుడు సంతుష్టుడై యనుగ్రహించును. అందువలన చిత్తము శుద్ధముకాగా జ్ఞానమును సంపాదించి ముక్తుఁడవు కాగలవు. ॥9॥

—• 3వ అధ్యాయము- 10వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "ప్రజాపతియొక్క వచనము ననుసరించియైనను నధికారి యగు మనుజుడు కర్మ జేయదగును." అని 'సహ యజ్ఞాః' అనునది మొదలుకొని నాలుగుశ్లోకములచేఁ జెప్పుచున్నాడు. విహితకర్మకలాపముతో నుండుమనుజులు సహయజ్ఞులనబడుదురు. (కర్మాధికారులని యర్థము.) అట్టి కర్మాధికృతులును, త్రైవర్ణికులునగు ప్రజలను సృష్టికర్త కల్పాదియందు సృజించి యిట్లు పలికెను— "అనేన...ఇష్టకామధుక్" స్వానుష్ఠితమైన స్వాశ్రమోచితధర్మముచే నుత్తరోత్తరాభివృద్ధిని మీరు పొందుడు. ఈయజ్ఞరూపమగు ధర్మము మీకిష్టమగు కామ్యఫలములను ప్రసాదించునదియై యగుగాక అని పలికెను. ఇట

గీ॥ దేవా న్భావయతాఽనేన తే దేవా భావయంతు వః ।
పరస్పరం భావయంత శ్శ్రేయః పర మవాప్స్యథ ॥ ॥౧౧॥

పదవిభాగము:— దేవాన్- భావయత- అనేన- తే- దేవాః- భావయంతు- వః- పరస్పరం- భావయంతః- శ్రేయః- పరం- అవాప్స్యథ ॥ ॥౧౧॥

ప్రతిపదార్థము:— అనేన=ఈయజ్ఞముచేత; దేవాన్= యింద్రాదిదేవతలను; భావయత=వృద్ధిపొందించుచురుగాక; తే=ఆ; దేవాః=ఇంద్రాదిదేవతులును; వః=మిమ్ములను; భావయంతు=వృష్ట్యాదులచేతృప్తిపరచుదురుగాక; పరస్పరం=అన్యోన్యము; భావయంతః=తృప్తిపరచుకొనుచు; పరం=ఉత్కృష్టమైన; శ్రేయః=శ్రేయస్సును; అవాప్స్యథ=పొందుదురుగాక. ॥౧౧॥

---

శాంకరభాష్యమ్:—

కథమ్— దేవానితి । దేవా నింద్రాదీ న్భావయత వర్ధయతానేన యజ్ఞేన తే దేవా భావయం త్వాప్యాయయంతు వృష్ట్యాదినా వో యుష్మా నేవం పరస్పర మన్యోన్యం భావయంత శ్శ్రేయః పర మపి జ్ఞానప్రాప్తిక్రమేణా వాప్స్యథ స్వర్గం వా పరం శ్రేయోఽవాప్స్యథ ॥౧౧॥

---

ఆవశ్యకము అగు కర్మలను చేయనిచో ప్రత్యవాయము సంభవించునని ముందు చెప్పబోవును. కాన నట్టి యావశ్యకకర్మల కుపలక్షణముగ యజ్ఞశబ్దము నుపయోగించెను. "మా కర్మఫలహేతు ర్భూః" అనుదానిచే కామ్యకర్మలు నిరాకరింపబడెను. కాన నిట కామ్యకర్మల ప్రస్తావనయే లేదు. అట్లైనను నిత్యకర్మలకుగూడ నానుషంగికఫల ముండుటచే 'ఏష వో స్త్విష్టకామధుక్' అని చెప్పుటయు నుపపన్నము గును. దీని కనుగుణముగనే యాపస్తంబులుకూడ "ఆమ్రే ఫలార్థే నిర్మితే ఛాయాగంధా వనూత్పద్యంతే ఏవం ధర్మం చర్యమాణ మర్థా అనూత్పద్యంతే నోచే దనూత్పద్యంతే న ధర్మహాని ర్భవతి" అని చెప్పెను. అనగా ఫలముకొరకై యొక మామిడివృక్షమును నాటినవా డదియొకఫలమునేగాక శ్రమాపనోదకమగు పెద్దనీడను, మనోహరమగు పరిమళమునుగూడ తన్నాశ్రయించినవారల కొసగును. అట్లే స్వాశ్రమోచితధర్మానుష్ఠానమువలన కోరకుండగనే తత్తద్ధర్మానుకూలములగు కొన్నిఫలములు చేకూరుచుండును. అట్లు చేకూరకున్నను నాధర్మమునకు లోపములేదు. నిత్యకర్మలకు ఫల మున్నను ఒకేకర్మఫలమును కోరుచు చేసినచో నది కామ్యకర్మ యనబడును. ఆకర్మ నేవిధమగు ఫలమును కోరక యాచరించినచో నిత్యకర్మ యనబడును. ఇదియే కామ్యకర్మ నిత్యకర్మలకు విశేషము. ఇక ఫలమును కోరకుండ నొకేనిత్యకర్మను జేసినచో దానివలన వస్తుస్వభావముచే ఫలము సిద్ధించినను నదినిత్యకర్మయే యగును. గాని విశేషమేమియులేదు. ఈవిషయమింకను ముందు విస్తరముగ నిరూపింపబడును.

శంకరానందీయము:— ఇంతకుముందు నైష్కర్మ్యము సిద్ధించుటకొరకైను, మిథ్యాచారత్వము నివృత్తమగుటకు, శరీరయాత్రానిర్వాహణమునకుగూడ నవశ్యము కర్మ చేయదగిన దని చెప్పుచు "ధర్మజ్ఞ సమయః ప్రమాణం" అను సూత్రోక్తరీతిని ధర్మజ్ఞులలో శ్రేష్ఠుడగు బ్రహ్మచే చెప్పబడినదగుటచె బ్రమాణసిద్ధ మగు ధర్మమును ముముక్షువు అగువారు తప్పక యింద్రాదిదేవతానుగ్రహసిద్ధికై చేయదగునని 'సహ యజ్ఞాః' అను నది మొదలుకొని రెండు శ్లోకములచే జెప్పుచున్నాడు. సృష్ట్యాదియందు బ్రహ్మ శ్రుతివిహితము అగు యజ్ఞములతోగూడ బ్రాహ్మణాదివర్ణముల సృజించి యిట్లుపలికెను— ఈశ్రౌతస్మార్తరూపములగు కర్మలచే మీరు చరుపురోడాశాదిద్రవ్యములతో దేవతలకు ప్రీతిని కలుగజేయుడు. దేవతలనుద్దేశించి చేయబడిన యీయజ్ఞము మీకభిమతములగు ఫలవిశేషముల నిచ్చునదై యగును. స్వానుష్ఠితమగు నీయజ్ఞము నిష్కాములకు జ్ఞానప్రతిబంధకములగు పాపములను పోగొట్టునదిగను, సకాములకు స్వర్గాదిసుఖమునిచ్చునదిగనునగునని యభిప్రాయము ॥౧౦॥

గీ॥ ఇష్టా న్భోగా న్హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః ।
తై ర్దత్తా న ప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః ॥ ॥౧౨॥

పదవిభాగము:— ఇష్టాన్- భోగాన్- హి- వః- దేవాః- దాస్యన్తే- యజ్ఞభావితాః- తైః- దత్తాన్- అప్రదాయ- ఏభ్యః- యః- భుఙ్క్తే- స్తేనః- ఏవ- సః ॥ ॥౧౨॥

ప్రతిపదార్థము:— హి=ఏకారణమువలన; దేవాః=ఇంద్రాదిదేవతలు; యజ్ఞభావితాః=యజ్ఞముచే వృద్ధి నొందినవారై; వః=మీకొరకు; ఇష్టాన్=అభీప్సితములగు; భోగాన్=భోగములను; దాస్యన్తే=ఇచ్చెదరు; తైః=ఆదేవతలచే; దత్తాన్=ఇవ్వబడినవానిని; ఏభ్యః=ఈదేవతలకొరకు; అప్రదాయ=ఇవ్వక; యః=ఎవఁడు; భుఙ్క్తే=అనుభవించునో; సః=వాఁడు; స్తేనఏవ=దేవద్రవ్యాపహారియగు చోరుఁడే; భవతి=(ఈపదమధ్యాహార్యము) అగుచున్నాఁడు.

శాంకరభాష్యతత్త్వబోధిని:—

దేవానుగ్రహము లేనిదే స్వర్గాదికము ప్రాప్తించదుకదా! ఆత్మజ్ఞానము లేనిదే మోక్షమును బొందుటకు సమర్థుడు కాడుగదా! యజ్ఞమువలన నభీష్టఫలవిశేషప్రాప్తి యెటుల సంభవించుననెదవా? ఈయజ్ఞముచే దేవతలను వృద్ధినొందించుడు. దేవతలీయజ్ఞముచే వృద్ధినొంది మిమ్ములను వర్షాదులచే వృద్ధినొందించెదరు. ఇట్లు పరస్పరము వృద్ధినొందుచు జ్ఞానప్రాప్తిద్వారమున మోక్షమునుగాని, స్వర్గమునుగాని పొందుదురుగాక! (అనగా యజ్ఞముచే దేవతానుగ్రహముగలిగి దానివలన స్వర్గప్రాప్తి యగును.) ఈయజ్ఞమునే నిష్కామునచే ననుష్ఠించినచో సత్త్వశుద్ధికలిగి, శ్రవణాదిద్వారమున జ్ఞానముకలిగి మోక్షమును బొందుదురు. కాన పూర్వోక్తాశంక కవకాశము లేదని యాశయము.

—• ౩వ అధ్యాయము ౧౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

శంకరానందీయము:— "ఈయజ్ఞము ఇష్టార్థముల నెట్లు సమకూర్చు" నను నాశంకకు సమాధానముగ నీశ్లోకమును జెప్పుచున్నాఁడు. "దేవాన్...అవాప్స్యథ" శ్రౌతస్మార్తరూపమగు యజ్ఞముచే మీరు ఇంద్రాదిదేవతలను చరుపురోడాశాదులచే సంతుష్టులను జేయుడు. అయింద్రాదిదేవతలీయజ్ఞముచే సంతుష్టులై మిమ్ములను ఇష్టార్థప్రదానముచే సంభావించెదరు. ఇట్లుపరస్పరము సన్మానించుకొనుచో మీరు—దేవతాప్రసాదముచే నిశ్శేషముగ జ్ఞానప్రతిబంధకములు నశింపగా చిత్తశుద్ధిచే జ్ఞానమునుబొంది, నిరతిశయానందరూపమైన విదేహకైవల్యమను శ్రేయస్సును పొందుదురు. ఇట "పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ" (పరస్పరము సన్మానించుకొనుచు, పరస్పరము శ్రేయస్సును పొందుడు) అని దేవతలకు, యజ్ఞకర్తలగు ప్రజలకుగూడ శ్రేయఃప్రాప్తివిధి ప్రతీయమానమగుచున్నది. అట్లయినను విచారించినచో ప్రజలను విషయముగా జేసుకొని చేయు ధర్మోపదేశములో జెప్పబడిన ధర్మముల ననుష్ఠించినచో లభ్యమగు పరమశ్రేయఃప్రాప్తివిధి ప్రజలకు సంబంధించినదే యగునుగాని, అట్టి పరమశ్రేయస్సు ననుగ్రహించెడి దేవతల కట్టి విధి సంభవింపనేరదు, ఏలయన? దేవతులు పైధర్మోపదేశమునందు విషయులు కాకపోవుటచేతను, స్వయంప్రభూతజ్ఞానము కలవారగుటచేతను, జీవన్ముక్తులగుటచేతను పైపరమశ్రేయఃప్రాప్తివిధి వారికి సంబంధించినది కాదు. కనుక మూలమునను న్న పరస్పరపదమునకు సంభావనతోనే సంబంధముకాని పరమశ్రేయఃప్రాప్తివిధితో సంబంధము లేదని తెలిసికొన దగును. ॥౧౧॥

శాంకరభాష్యమ్:—

కించ— ఇష్టా న్భోగా నితి। ఇష్టా న్భోగా నహి వేరితా న్భోగా న్హి వో యుష్మభ్యం దేవా దాస్యన్తే వితరిష్యంతి స్త్రీపశుపుత్రాదీ న్యజ్ఞభావితా యజ్ఞై ర్వర్ధితా స్తోషితా ఇత్యర్థః। తై ర్దేవై ర్దత్తా న్భోగా నప్రదాయాఽఽనృణ్య మకృత్వే త్యర్థః। ఏభ్యో దేవేభ్యో యో భుఙ్క్తే స్వదేహేంద్రియా ణ్యేవ తర్పయతి స్తేన ఏవ తస్కర ఏవ స దేవాదిస్వాపహారీ॥ ॥౧౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మఱియు దేవతలు యజ్ఞములచే సంతోషపెట్టఁబడినవారై మీకొఱ కిష్టము లగు స్త్రీపశుపుత్రాదిభోగముల నివ్వగలరు. దేవతలచే నొసఁగబడిన భోగములను వారల కొసఁగక (అనగా దేవతలచే లబ్ధ మగు పశ్వాదులచే యజ్ఞాద్యనుష్ఠానద్వారమున దేవఋషిపితృదేవతల ఋణత్రియమును దొలఁగించక) యెవఁడు తానే యనుభవించునో (అనగా తన దేహేంద్రియములనే తృప్తిపరచుకొనునో) వాఁడు దేవద్రవ్యాపహారి యగు తస్కరుఁడు. ॥౧౨॥

—• ౩వ అధ్యాయము ౧౨ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

శంకరానందీయము:— "యజ్ఞములచే సన్మానితులగు దేవతలు ముముక్షువులగువారికి కేవల మొక్షాముష్మికసుఖము నిచ్చుటయే గాక నైహికసుఖమునుగూడ ననుగ్రహింతురు. కనుక వారి సంతుష్టికై యజ్ఞాదికము నవశ్యము చేయుదగును. అట్లు చేయనిచో ప్రత్యవాయము గూడ ప్రాప్తించునని యీశ్లోకమున జెప్పుచున్నాడు. శ్రౌతస్మార్తరూపయజ్ఞములచే సంభావితులగు దేవతలు మీకు ఇష్టము లగు పుత్రకళత్రధనధాన్యాది భోగముల నీయగలరు. వారిచే నీయబడిన పదార్థములను తిరిగి చరుపురోడాశాదిరూపమున వారికి సమర్పించక దేవఋషిపితృఋణములను యజ్ఞ బ్రహ్మచర్యసంతానములచే తీర్చుకొనక ఎవడు తన శరీరమునే పోషించుట కా భోగము ననుభవించునో వాడు దేవ,ఋషి, పితరుల పాలిటి చోరు డగును. శిష్టగర్హితుఁ డగును; (దేవద్రవ్యాపహారి యగు తస్కరున కెట్టి గతి లభించునో యట్టి గతియే వానికి గూడ లభించునని భావము.)

సదానందీయము:— పంచయజ్ఞములచే సంతసింపఁజేయఁబడిన దేవతలు కేవలపరలోకసుఖమునే గాక హిరణ్యపశుధాన్యాదిరూపమగు నైహికభోగములను గూడ వాంఛానురూపముగ మీకు ప్రసాదింతురు. ఆభోగములు మీకు ఋణరూపముగ నీయఁబడినవైనందున నాభోగములను స్వీకరించి, దేవతలను పంచయజ్ఞములచేఁ దృప్తిపరుపక దేహేంద్రియములనే తృప్తిపరచుచు నెవఁడుండునో వాఁడు దేవఋణమును తీర్చనివాఁడగుటచే దేవస్వాపహారి యగు నధముఁడగును.

పరమార్థప్రపా:— కర్మలను జేయుచో ఫల మవశ్యము కలుగునను ఫలనిశ్చయమును జూపుచు కర్మలను జేయనిచో కలుగు దోషమును జెప్పుచున్నాఁడు. యజ్ఞ సంభావితులగు దేవతలు మీకొఱకు ఇష్టములగు భోగముల నిచ్చుచున్నారు. అని కర్మకారులకు పూర్వార్ధముచే ఫలనిశ్చయము చూపఁబడెను. ఇక దేవతలచే నీయబడిన భోగముల ననుభవించి, వానిచే ప్రమత్తులై కర్మలను విడచుటయుం దాసక్తి కలవారల నుత్తరార్ధముచే నిందించుచున్నాఁడు. ఆదేవతలచే నీయఁబడిన యన్నాదిరూపభోగముల ననుభవించి వానిని పంచయజ్ఞాదిరూపమున దేవతల కొసఁడీయకుండగ (అనఁగా పంచయజ్ఞములచే దేవతలను తృప్తిపరుపకుండగ) స్వోదరమును పోషించుచుండునో; వాఁడు దేవద్రవ్యాపహారి యగు చోరుఁడే యగును. ॥౧౨॥

గీ॥ యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః ।
భుంజతే తే త్వఘం పాపా యే పచ న్త్యాత్మకారణాత్ ॥ ॥౧౩॥

పదవిభాగము:— యజ్ఞశిష్టాశినః- సంతః- ముచ్యంతే- సర్వకిల్బిషైః- భుంజతే- తే- తు- అఘం- పాపాః- యే- పచంతి- ఆత్మకారణాత్ । ॥౧౩॥

ప్రతిపదార్థము:— యజ్ఞశిష్టాశిన స్సంతః=దేవయజ్ఞాదుల నాచరింపగా మిగిలిన యన్నమును భుజించువారలై; సర్వకిల్బిషైః=పంచపాపములచేతను; ముచ్యంతే=విడువబడుచున్నారు; యే=ఎవరు; ఆత్మకారణాత్=తననిమిత్తము; పచంతి=పాకమును చేయుదురో; తేతు=వారలైతె; అఘం=పాపమును; భుంజతే=అనుభవించుచున్నారు. ॥౧౩॥

శాంకరభాష్యమ్:—

యే పునః.—యజ్ఞేతి । దేవయజ్ఞాదీ న్నిర్వర్త్య తచ్ఛిష్ట మశన మమృతాఖ్య మశితుం శీలం యేషాం తే యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యన్తే సర్వకిల్బిషై స్సర్వపాపై శ్చుల్ల్యాదిపంచసూనాకృతైః ప్రమాదకృతహింసాదిజనితై శ్చాన్యైః । యే త్వాత్మంభరయో భుజంతే తే త్వఘం పాపం స్వయమపి పాపా యే పచంతి పాకం నిర్వర్తయం త్యాత్మకారణా దాత్మహేతోః ॥౧౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

దేవయజ్ఞము, పితృయజ్ఞము, మనుష్యయజ్ఞము, భూతయజ్ఞము, బ్రహ్మయజ్ఞము అనెడి పంచపాకయజ్ఞముల నాచరింపఁగ మిగిలిన యన్న మమృత మనఁబడును. ఎవరు అట్టి యన్నమును భుజించు స్వభావము కలవారో వారు చుల్లీ (పొయ్యి) ఖండనీ (కత్తిపీట) పేషణీ (సన్నికలు) మార్జనీ (చీపురు) ఉదకుంభము (నీళ్ళకడవ) ఇవి హింసకు హేతువులు. కాన నీయయిదు పంచసూనము లనఁబడును. ఇట్టి పంచసూనములచే బుద్ధ్యబుద్ధిపూర్వకముగ నాచరింపఁబడిన పాపములచేతను, పాదవిన్యాసములవలన ప్రమాదమున ప్రాప్తించెడి జీవహింసారూపపాపముచేతను, అశుచిసంస్పర్శనమువలనఁ గలిగెడి పాపములచేతను విడువబడెదరు ఏపాపపురుషులు స్వోదరపోషణతత్పరులై ఆత్మకారణమువలన (అనఁగా తన యుదరపోషణమాత్రనిమిత్తమే) పాకమును (వంటను) చేసికొనెదరో అట్టివారు పాపమునే యనుభవించుచుండిరి (అనగా వైశ్వదేవము చేయఁగా మిగిలిన యన్న మమృతము. అట్టి యన్నమును భుజించువారలకు పంచసూనములవలన ప్రాప్తించెడి పాపములు, జ్ఞానాజ్ఞానకృతపాపములు సంభవింపవు. అట్లుకాక కేవలము స్వోదరపోషణనిమిత్త మెవరు పాకమును చేసికొనెదరో; వారు పాపరూప మగు యన్నమును భుజించుటచే పాపమునే భుజించువార లగుచుండి రని యాశయము.) ॥౧౩॥

—• ౩వ అధ్యాయము- ౧౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

పరమార్థప్రపా:— సాధువులగు కర్మఠుల నీశ్లోకమున స్తుతించుచున్నాఁడు—వైశ్వదేవాదియజ్ఞావశిష్టమగు నన్నమును భుజించెడి సాధువులు దైనందినములగు పంచసూనాదిసర్వపాపములనుండి విడుపఁబడుదురు.

మఱియు నేపాపులు కేవలము తన శరీరపోషణమునకై పాకమును జేసికొనెదరో; వారు కేవలపాపమునే భుజించెడివారగుదురు. ఈవిషయమున ఋక్శాఖీయశ్రుతిగూడ నిట్లు చెప్పుచున్నది. “మోఘ మన్నం విందతేఽప్రచేతాః సత్యం బ్రవీమి వధ ఇత్స తస్య నార్యమాణం పుష్యతి నో సఖాయం । కేవలాఘో భవతి కేవలాదీ” దీనికి భాష్యము- “న ప్రకృష్టం చేతో యస్యాఽసా వప్రచేతాః మూర్ఖో మోఘం నిష్ఫలం అన్నం విందతే సంపాదయతి । న తస్య వధ ఇత్ వధ ఏవ ఆత్మఘాతక ఏవేత్యర్థః । స కః యో వైశ్వదేవే నార్యమాణం సూర్యం న పుష్యతి న సంతర్పయతి । రాత్రౌచ సఖాయ ముపకారక మగ్నిం న సంతర్పయతి । ఏవం యః కేవల ఇత్తి కేవలాదీ పిండపోషణార్థమేవ భక్షయతి స కేవలాఘో భవతి పాపమేవ భక్షయతీతి సత్యం బ్రవీమి న వైశ్వదేవార్థవాద మిత్యర్థః” (అనఁగా నేమూర్ఖుఁడు వైశ్వదేవముచే సూర్యుని తృప్తినొందింపక రాత్రిభాగమున నుపకారకుఁడగు నగ్నిహోత్రుని తృప్తిపరచక కేవలము తన శరీరపోషణార్థమే యన్నమును సంపాదించి భుజించునో; వాఁడు నిజముగ నాత్మఘాతకుఁ డగును. అట్టి యన్నము పాపరూపము గాన నాయన్నమును భుజించిన కేవలము పాపమునే భుజించువాఁ డగును.) శతపథబ్రాహ్మణమునందుఁగూడ పై విషయమునే “న స పాప్మనో వ్యావర్తతే” (అట్టివాఁడు పాపమునుండి మరలఁడు) అని చెప్పఁబడెను.

భాష్యోత్కర్ష దీపిక:— “బ్రహ్మయజ్ఞో దేవయజ్ఞః పితృయజ్ఞః స్తథైవచ । భూతయజ్ఞో నృయజ్ఞ శ్చ పంచయజ్ఞాః ప్రకీర్తితాః” బ్రహ్మయజ్ఞ మనియు, దేవయజ్ఞ మనియు, పితృయజ్ఞ మనియు, భూతయజ్ఞ మనియు, నృయజ్ఞ మనియును యజ్ఞము లైదు విధములుగఁ జెప్పఁబడెను. అందు అధ్యయనాధ్యాపనములు- బ్రహ్మయజ్ఞ మనియు, హోమము- దేవయజ్ఞ మనియు, పితృతర్పణము, పితృశ్రాద్ధము నీరెండును- పితృయజ్ఞ మనియు, భూతములకొరకు చేయఁబడు బలిప్రదానము భూతయజ్ఞ మనియును, అతిథ్యభ్యాగతుల నర్ఘ్యపాద్యస్నానభోజనాదిసత్కారములచే గౌరవపురస్సరముగ సేవించుట నృయజ్ఞ మనియు జెప్పఁబడెను. ఎవరు పై నుదహరింపఁబడిన యజ్ఞములను జేసి అమృతరూప మగు నీయజ్ఞశిష్టాన్నమును భుజించెడి స్వభావముకలవార లగుదురో యట్టి సత్పురుషులు చుల్ల్యాదిపంచసూనాకృతములు, వాటికంటె నితరము లగునవియు నగు సర్వపాపములనుండి విడువఁబడుదురు. ‘యేతు’ యెవరు వైశ్వదేవాదికనిమిత్తము పాకమును జేయక కేవలము తనయొక్కయుదరపోషణమే ప్రయోజనముగాఁగలవారై పాకమును జేసికొనెదరో, అట్టి పాపాచారులు పాపమునే భుజించెదరు. ఇట “తు” అను శబ్దము వైలక్షణ్యార్థకము (అనగా వైశ్వదేవాదికమునకై కాక కేవలము స్వోదరపూరణకై పాకమును జేయువారు- యజ్ఞశిష్టాశులకంటె నత్యంతవిలక్షణులు. అని వైలక్ష్యమును ద్యోతన చేయును.) ఇక నవధారణము “సర్వం వాక్యం సాధారణం” అను న్యాయముచే లభించును. ఇట్లనుటచే “తు” శబ్దము “అవధారణార్థకము” అను నాచార్యవిరుద్ధోక్తియు ప్రత్యుక్తమయ్యెను.

నీలకంఠీయము:— ఎవరు వైశ్వదేవాదికము నాచరించి, తచ్ఛేషాన్నభక్షణశీలురో వారు దేవఋణ, పితృఋణ, ఋషిఋణములను తొలఁగించుటచే ప్రమాదకృతము అగు సర్వపాపములనుండియు (విహితాకరణము వలన సంభవించెడి పాపములనుండియు, పంచసూనానిమిత్తకము అగు పాపములనుండియు) విడువఁబడును. ఎవరు పంచమహాయజ్ఞార్థము కాక తన నిమిత్తమే యన్నమును పక్వముచేసెదరో; అట్టివారు స్వయముగ పాపరూపులై పాపమునే భుజింతురు. పంచసూనము లనగ “ఖండనీ, పేషణీ, చుల్లీ, ఉదకుంభీ చ మార్జనీ । పంచసూనా గృహస్థస్య తాభి స్స్వర్గం న విందతి” కత్తిపీట, సన్నికల్లు, ఉదకమును తెచ్చు కడవ, చీపురు ఈ యయిదింటివలన గృహస్థున కయిదువిధముల పాపము నిత్యము సంభవించును. ఇట్టి పాపములు కలవాఁడు స్వర్గమును పొందఁడు. అనియు, “పంచసూనాకృతం పాపం పంచయజ్ఞై ర్వ్యపోహతి” పంచసూనా కృతమగు పాపమును పంచయజ్ఞములచే నశింపఁజేసికొను ననియు స్మృతి బోధించుచున్నది. “ఇద మేవ తత్సాధారణ మన్నం

గీ॥ అన్నాద్భవన్తి భూతాని పర్జన్యాదన్నసంభవః ।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః ॥ ॥౧౪॥

పదవిభాగము:— అన్నాత్ – భవన్తి – భూతాని – పర్జన్యాత్ – అన్నసంభవః – యజ్ఞాత్ – భవతి – పర్జన్యః – యజ్ఞః – కర్మసంభవః । ॥౧౪॥

ప్రతిపదార్థము:— అన్నాత్=లోహితరేతోరూపముగ బరిణమించిన యన్నమువలన; భూతాని=భూతములు; (శరీరములు) భవన్తి=పుట్టుచున్నవి; పర్జన్యాత్=వర్షమువలన; అన్నసంభవః=అన్నముకలుగుచున్నది; యజ్ఞాత్=పుణ్యమువలన; పర్జన్యః=వర్షము; భవతి=అగుచున్నది; యజ్ఞః=పుణ్యము; కర్మసముద్భవః=ఋత్విగ్యజమాని వ్యాపారరూపకర్మవలన జనించుచున్నది. ॥౧౪॥

శాంకరభాష్యమ్:—

ఇతశ్చాధికృతేన కర్మ కర్తవ్యమ్ । జగచ్చక్రప్రవృత్తిహేతుర్హి కర్మ । కథమితి, ఉచ్యతే— అన్నాద్భవన్తీతి । అన్నాద్భుక్తాల్లోహితరేతఃపరిణతాత్ప్రత్యక్షం భవన్తి జాయన్తే భూతాని, పర్జన్యాద్వృష్టేరన్నస్య సంభవోఽన్నసంభవః, యజ్ఞాద్భవతి పర్జన్యః— "అగ్నౌ ప్రాస్తాఽఽహుతిః సమ్యగాదిత్యముపతిష్ఠతే । ఆదిత్యాజ్జాయతే వృష్టిర్వృష్టేరన్నం తతః ప్రజాః" (మను-౩-7౬) ఇతి స్మృతేః । యజ్ఞోఽపూర్వం స చ యజ్ఞః కర్మసముద్భవ ఋత్విగ్యజమానయోశ్చ వ్యాపారః కర్మ తత స్సముద్భవో యస్య యజ్ఞస్యాపూర్వస్య స యజ్ఞః కర్మసముద్భవః ॥ ॥౧౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఈ చెప్పబోవు కారణమువలన నధికారి దేవయజ్ఞాదికర్మను నాచరింపవలయును. ఆ కారణ మేదనిన? కర్మ యనునది జగచ్చక్రప్రవర్తకము. కాన కర్మ నాచరింపవలెను. భుక్తమగు నన్నము లోహితరేతోపరిణతిక్రమమున ప్రజారూపముగ జన్మించును. అట్టి యన్నము వర్షమువలన సంభవించుచుండ కర్మము జగచ్చక్రప్రవర్తక మనుట యెట్లు సంభవించు నని యనెదవా? వినుము చెప్పెద. లోహితరేతోరూపమున పరిణతమగు భుక్తమగు నన్నమువలన ప్రత్యక్షముగ

యదిద మస్యతే స య ఏత దుపాస్తే న స పాప్మనో వ్యావర్తతే మిశ్రం హ్యేతదితి" అను శ్రుతియు పై యర్థమునే బోధించుచున్నది. "మోఘ మన్నం విన్దతేఽప్రచేతాః సత్యం బ్రవీమి । వధ ఇత్స తస్య । నార్యమణం పుష్యతి నో సఖాయం । కేవలాఘో భవతి కేవలాదీ" అను శ్రుతియు నెవఁడు వైశ్వదేవార్థము కాక కేవల మాత్మార్థ మన్నమును పచనముచేసి భుజించునో వాఁడు కేవలము పాపరూపుఁడగు నని బోధించుచున్నది ॥౧౩॥

—♦ ౩వ అధ్యాయము ౧౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

శంకరానందీయము:— "ముచ్యంతే సర్వకిల్బిషైః" అనియు, "నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే" అనియు కర్మలు మోక్షహేతువు అని చెప్పి, అవి జగత్స్థితికిఁగూడ హేతువు అని "అన్నాద్భవన్తి భూతాని" అని మూడు శ్లోకములచేఁ జెప్పుచున్నాఁడు. "అగ్నౌ ప్రాస్తాహుతిః పూర్వ మాదిత్య ముపతిష్ఠతే । ఆదిత్యాజ్జాయతే వృష్టి ర్వృష్టే రన్నం తతః ప్రజాః" అను స్మృత్యుక్తప్రకారము శ్రోత్రియునిచే యథాశాస్త్రముగ

గీ॥ కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్ ।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥ ॥౧౫॥

పదవిభాగము:— కర్మ- బ్రహ్మోద్భవం- విద్ధి- బ్రహ్మ- అక్షరసముద్భవం- తస్మాత్- సర్వగతం- బ్రహ్మ- నిత్యం- యజ్ఞే- ప్రతిష్ఠితమ్ ॥ ॥౧౫॥

ప్రతిపదార్థము:— కర్మ=కర్మమును; బ్రహ్మోద్భవం, బ్రహ్మ=వేదము, ఉద్భవం=కారణముగా కలదానిగ; విద్ధి=తెలిసికొనుము; బ్రహ్మ=వేదమును; అక్షరసద్భవం, అక్షర=పరమాత్మ; సముద్భవం=కారణముగా కలదానినిగ; విద్ధి=తెలిసికొనుము; తస్మాత్=పరమాత్మవలన జనించినదగుటచే సర్వార్థప్రకాశకమగుటవలన; బ్రహ్మ=వేదము; సర్వగతం=సర్వమును వ్యాపించినదై; నిత్యం=ఎల్లపుడు; యజ్ఞే=(యజ్ఞవిధి ప్రధానమగుటవలన) యజ్ఞమునందు; ప్రతిష్ఠితం=ప్రతిష్ఠితము. ॥౧౫॥

శాంకరభాష్యమ్:—

తచ్చ—కర్మేతి ॥ కర్మ బ్రహ్మోద్భవం బ్రహ్మ వేద స్స ఉద్భవః కారణం యస్య తత్కర్మ బ్రహ్మోద్భవం విద్ధి విజానీహి, బ్రహ్మ పున ర్వేదాఖ్య మక్షరసముద్భవం, అక్షరం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

భూతములు జనించుచున్నవి. అట్టి యన్నము వర్షమువలన జనించుచున్నది. అట్టి వర్షమపూర్వమువలన (పుణ్యమువలన) జనించును. అట్టి యపూర్వము ఋత్విగ్యజమానవ్యాపారరూపకర్మమువలన జనించును. "అగ్నౌ ప్రాస్తాహుతి స్సమ్య గాదిత్య ముపతిష్ఠతే । ఆదిత్యా జ్జాయతే వృష్టి ర్వృష్టే రన్నం తతః ప్రజాః" (అగ్నియందుంచబడిన ఆజ్యాదిహవిస్సులు సూర్యుని పొందును. సూర్యునివలన వర్షముద్భవించును. వర్షమువలన నన్నము జనించును. శుక్లశోణితరూపముగ పరిణమించిన అన్నమువలన ప్రజలు పుట్టెదరు. అను నీస్మృతియుగూడ పైవిషయములనే బోధించుచున్నది. ॥౧౪॥

అట్టి యపూర్వహేతువగు కర్మము చైత్యవందనాదికమా? లేక అగ్నిహోత్రాదికమా? అని ప్రశ్నించెదవేని చైత్యవందనాదికముగాదు. అట్టికర్మమును వేదము కారణముగా కల

చేయఁబడిన యజ్ఞముచే మేఘోదయమై వర్షముకలుగును. అట్టి వర్షమువలన వ్రీహియవాదిరూపమగు యన్నము సంభవించును. స్త్రీపురుషులచే భుక్తమై శుక్లశోణితరూపమున పరిణమించిన యట్టి యన్నమువలన ప్రాణులు పుట్టును. పుట్టినయా ప్రాణులు అన్నముచేతనే జీవించుచుండిరి. ఈవిధముగ వృష్ట్యన్న ద్వారమున జగజ్జీవనహేతువగు నీయజ్ఞము ఋత్విగ్యజమానాదులచే చేయఁబడు హోమమంత్రతంత్రాదిక్రియారూపమగు వైదికకర్మవలన బుట్టును. దీనినే యపూర్వ మనికూడ నందురు. ॥౧౪॥

పరమార్థప్రభ:— "అన్నా ద్భవంతి" అనుటచే అన్నమువలననే ప్రాణులు పుట్టుచున్నవనియు, జీవించుచున్నవనియు, వృద్ధిపొందుచున్నవనియునుగూడ తెలిసికొనదగును. ఈవిషయమునే "అన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే జాతా న్యన్నేన వర్ధంతే" (ఈభూతము అన్నమువలననే పుట్టి, అన్నమువలననే వృద్ధినొందుచున్నవి, అను బ్రహ్మవల్లీశ్రుతిగూడ చెప్పుచున్నది. ॥౧౪॥

—• ౩వ అధ్యాయము ౧౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— అపూర్వమునకు కారణమగునట్టి అకర్మ "బ్రహ్మోద్భవం"

**శాంకరభాష్యమ్:—**

బ్రహ్మ పరమాత్మా సముద్భవో యస్య తదక్షరసముద్భవం బ్రహ్మ వేద ఇత్యర్థః । యస్మా త్సాక్షా త్పరమాత్మాఖ్యా దక్షరా త్పురుషనిశ్వాసవ త్సముద్భూతం బ్రహ్మ తస్మా త్సర్వార్థ ప్రకాశకత్వా త్సర్వగతమ్ । సర్వగత మపి స న్నిత్యం సదా యజ్ఞవిధిప్రధానత్వా ద్యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥ ॥౧౫॥

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

దానినిగఁ దెలిసికొనుము. (అనగా నాకర్మము వేదవిహితము) వేదమును నాశరహిత మగు పరమాత్మ కారణముగా కలదానినిగఁ దెలిసికొనుము. (అనగా పరమాత్మ సృష్ట్యాదియందు జీవులయెడ దయకలవాఁడై వేదమును సృజించె ననుట) వేదము పౌరుషేయ మగుటచే ప్రామాణ్యసంశయము కలది. అట్టిసందిగ్ధప్రామాణ్యముకల వేదముచే బోధింపబడిన యగ్నిహోత్రాదికర్మ మెటుల గ్రహింపనగు నని శంకింపవలదు. నాశరహిత మగు పరమాత్మనుండి యనాయాసముగ బురుషనిశ్వాసవలె బయలువెడలినదగుటచే సర్వార్థప్రకాశకము. కనుకనే సర్వగతము. అట్టిదైనను నెల్లపుడు యజ్ఞవిధిప్రధానమగుటవలన (అనఁగా ప్రధానముగ యజ్ఞవిధులే కలదగుటవలన) యజ్ఞమునందు ప్రతిష్ఠ కలది. ॥౧౫॥

వేదమే ప్రమాణముగాఁ గలది. వేదవిహితమగు కర్మమే యపూర్వమును సాధించునది యగునుగాని మరొక పాషండాదిప్రతిపాదితమగు కర్మము అట్టి యపూర్వమును సాధించునదిగాదని దెలిసికొనుము. "వేదప్రతిపాదిత మగునదియే ధర్మ మనియు, వేరొకటి ధర్మము కాదనియు" నెట్లు చెప్పుచుంటివి? మఱియు పాషండాది శాస్త్రములకంటె వేదమున కెట్టి గొప్పతనము గలదు? అను నాశంకమీద జెప్పుచున్నాఁడు. "బ్రహ్మాక్షర సముద్భవ-" వేదము దోషరహితుఁడగు పరమాత్మనుండి పురుషనిశ్వాసన్యాయముగ, నిర్యత్నముగ నుద్భవించినది. అట్లగుటచే నిరస్తసమస్తదోషాంగ వేదవాక్యము ప్రమాణజనక మగుటంజేసి ఇంద్రియాతీతవస్తువిషయమై ప్రమాణమగును గాని- భ్రమపడుట, ప్రమాదము, కార్యకరణాసామర్థ్యము, వంచించుట, మొదలగు దోషములతో గూడిన పాషండమతావలంబు లగువారిచేఁ జెప్పబడు వాక్యము ప్రమాణము కాజాలదు. 'అస్య మహతో భూతస్య నిశ్వసిత మేత ద్యదృగ్వేదో యజుర్వేద స్సామవేదోఽథర్వాంగిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషద శ్శ్లోకా స్సూత్రా ణ్యను వ్యాఖ్యానా న్యస్యైవైతాని నిశ్వసితాని" అను శ్రుతిగూడ పైవిషయమునే చెప్పుచున్నది. పరమాత్మనుండి పుట్టినదిగనుక సర్వప్రకాశకము. నిత్యమునగు వేదము అతీంద్రియ మగు ధర్మమునందు తాత్పర్యముచే బ్రతిష్ఠితమైనది. కనుక పాషండప్రతిపాదితోపధర్మపరిత్యాగపూర్వకముగ వేదబోధితమగు ధర్మమునే యనుష్ఠింపదగు నని యర్థము.

శంకరానందీయము:— యజ్ఞ కారణభూత మగు కర్మ 'బ్రహ్మోద్భవం' ఋగాదివేదములనుండి బుట్టినదిగఁ దెలిసికొనుము. ఆవేదమే "అక్షరసముద్భవం" 'అస్య మహతో భూతస్య నిశ్వసితం' అనుశ్రుతి చొప్పన సర్వజగత్కారణుడు, నాశరహితుడునగు పరమాత్మనుండి నిశ్వాసరూపమున స్వయముగ నావిర్భవించుటచే దానిని నిత్యమైనదిగను, అపౌరుషేయముగను దెలిసికొనుము. ఈ జ్ఞైకమూలమగు నీవేదమునుండియే జగత్తుయొక్క యుత్పత్తియు స్థితియు సంభవించుచున్నవి గనుక నీవేదము "సర్వగతం" సర్వపదార్థప్రకాశక

గీ॥ ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః ।
అఘాయు రింద్రియారామో మోఘం పార్థ! స జీవతి ॥ ౧౬॥

పదవిభాగము:— ఏవం- ప్రవర్తితం- చక్రం- న- అనువర్తయతి- ఇహ- యః- అఘాయుః- ఇన్ద్రియారామః- మోఘం- పార్థ!- సః- జీవతి ॥ ॥౧౬॥

ప్రతిపదార్థము:— ఈశ్వరేణ=(ఈపదమధ్యాహార్యము) పరమేశ్వరునిచే; ఏవం=ఈదేవయజ్ఞపురస్సరముగ; ప్రవర్తితం=ప్రవర్తింపజేయబడిన; చక్రం=జగచ్చక్రమును; ఇహ=ఈభూలోకమునందు; యః=కర్మాధికారముకల యెవఁడు; నానువర్తయతి=అనుసరించఁడో; సః=అమానవుఁడు; అఘాయుః=పాపజీవనుఁడై; ఇంద్రియారామః=ఇంద్రియములచే విషయములయందు క్రీడకలవాఁడై; హేపార్థ!=ఓయర్జునా!: మోఘం=వ్యర్థముగ; జీవతి=జీవించుచున్నాఁడు. ॥౧౬॥

శాంకరభాష్యమ్:—

ఏవ మితి । ఏవ మిత్థ మీశ్వరేణ దేవయజ్ఞపూర్వకం జగచ్చక్రం ప్రవర్తితం నానువర్తయతీహ లోకే యః కర్మ ణ్యధికృతస్స న్నఘాయు రఘం పాప మాయు ర్జీవనం యస్యాసో౽ఘాయుః పాపజీవన ఇతి యావత్ ఇంద్రియారామ ఇంద్రియై రారామ ఆరమణ మాక్రీడా విషయేషు యస్య స ఇంద్రియారామో మోఘం వృథా హే పార్థ! స జీవతి । తస్మా దజ్ఞేనాధికృతేన కర్తవ్యమేవ కర్మేతి ప్రకరణార్థః । ప్రాగాత్మజ్ఞాననిష్ఠాయోగ్యతాప్రాప్తేస్తాదర్థ్యేన

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓయర్జునా! ఈశ్వరునిచే నీవిధముగఁ (దేవయజ్ఞపురస్సరముగ) ప్రవర్తింపఁబడిన జగచ్చక్రము నెవఁడు కర్మయం దధికృతుఁడై వేదాధ్యయనపురస్సర మనుసరించఁడో, ఈశ్వరాజ్ఞనతిక్రమించినట్టి యాపురుషుఁడు పాపజీవనము కలవాఁడై ఇంద్రియములచే స్రక్చందనాది విషయములందే క్రీడకలవాఁడై వ్యర్థముగ జీవించుచున్నాఁడు. కర్మమునం దధికారముకల యజ్ఞునిచే నిత్యనైమిత్తికకర్మము లవశ్య మాచరింపదగిన వని ప్రకరణార్థము.

అధికారి కర్మము నాచరింపవలసినచో జ్ఞానికూడ నధికారి యగుటచే గర్మములనాచరింపవలసియుండ నజ్ఞునిచేతనే కర్మ మాచరింపదగిన దని చెప్పుట యెట్లు సమంజసమగునన? ఆత్మజ్ఞాననిష్ఠాయోగ్యతాప్రాప్తికి పూర్వ మట్టి యాత్మజ్ఞాననిష్ఠాప్రాప్తినిమిత్త మధికృతుఁడైన

మగుటచేతను, సమస్తలోకములయందు నుండెడిజనులకు న్యాయాధర్మనియమములను స్థాపించున దగుటచేనంతట నిండియున్నదైన "నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితం" బ్రాహ్మణాదులచే జేయుదగు నాహవనాద్యశ్వమేధాంతమగు కర్మయందు—ఈకర్మలనుచేయుటయే ప్రధానప్రయోజనముకల దగుటచే నియమముతో నున్నదై యగుచున్నది. అనఁగా వర్ణాశ్రములకు కర్తవ్యములుగా నీకర్మలను వేదమే విధించుచున్న దని భావము. ॥౧౫॥

——• ౩వ అధ్యాయము- ౧౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •——

శంకరానందీయము:— పరమేశ్వరుఁడు శ్రుతిముఖమున యజ్ఞసంతతిని విధించి, యజ్ఞద్వారమున వృష్టియు, దానివలనయన్నము కలుగునని యూహించి, దానివలన భూతసృష్టిని, తత్స్థితిని నిర్వహించెడియి వృచే

**శాంకరభాష్యమ్:—**

కర్మయోగానుష్ఠాన మధికృతే నానాత్మజ్ఞేన కర్తవ్యమేవే త్యేతత్। 'న కర్మణా మనారమ్భాత్' (గీ-౩-4) ఇత్యత ఆరభ్య, "శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః" (గీ-౩-8) ఇత్యేవ మంతేన ప్రతిపాద్య, "యజ్ఞార్థా త్కర్మణోఽన్యత్ర" (గీ౩-9) ఇత్యాదినా "మోఘం పార్థ! స జీవతి" (గీ-౩-16) ఇత్యేవ మంతేనాపి గ్రంథేన ప్రాసంగిక మధికృత స్యానాత్మవిదః కర్మానుష్ఠానే బహుకారణ ముక్తం తదకరణే చ దోషసంకీర్తనం కృతమ్ ॥ ॥౧౬॥

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

యజ్ఞానిచే కర్మయోగానుష్ఠానము చేయఁదగినదని "న కర్మణా మనారమ్భాత్" అనునది మొదలు "శరీరయాత్రాఽపి చ తేన ప్రసిద్ధ్యే దకర్మణః" అనునది యంతముగాగల గ్రంథముచే జెప్పబడెను. అట్లగుచో పూర్వమునందే యజ్ఞానులకు కర్మయోగము చెప్పబడుచో "యజ్ఞార్థా త్కర్మణోఽన్యత్ర" అనునది మొదలగు గ్రంథ మెందులకు జెప్పబడెను? జ్ఞానుల కీగ్రంథము చెప్పబడెననెదవా? జ్ఞానులకు జ్ఞాననిష్ఠకదా చెప్పవలసినది. ఈగ్రంథమున నట్టి జ్ఞాననిష్ఠ చెప్పబడలే దనెదవా? "యజ్ఞార్థా త్కర్మణోఽన్యత్ర" అనునది మొదలు "మోఘం పార్థ! స జీవతి" అనునది యంతముగాఁగల గ్రంథముచేఁ గర్మాధికృతుఁ డగు నజ్ఞానికి కర్మానుష్ఠానము నందు ప్రాసంగికముగ ననేక కారణములు చెప్పబడెను. బహుకారణక మగు నిట్టి కర్మము నాచరించనచో దోషము చెప్పబడెను. కాన పూర్వోక్తాశంక సంభవింపదు ॥౧౬॥

స్వయముగనే యీచక్రమును ప్రవర్తింపజేసెను. అట్టి యీశ్వరప్రవర్తితమగు నీచక్రమును కర్మాధికారియగు నెవ డనువర్తించడో (శ్రుతివిహితమగు కర్మయోగము ననుష్ఠించడో) వాడు ఈయీశ్వరశాసనమును జేయక కేవలము విషయభోగలంపటుడై, పాపమే ఫలముగాకల అయుర్దాయము కలవాడై, కాకమువలెను, బూరుగుచెట్టువలెను, ఫలరహితుడై జీవించును. (వ్యర్థజీవనుఁడగును. మరియు నింతియేగాక యీశ్వరాజ్ఞోల్లంఘనరూపమగు దోషముల చేతను, విహితములగుకర్మలను జేయకుండుటచే సంభవించుపాపములచేతను, ఇంకను నిత్యకృతపాపసంఘాతము చేతను, అనేకకల్పములవరకు నరకమనుభవించును. కనుక వివేకియు, ముముక్షువు నగు బ్రాహ్మణుడు స్వయముగ తరించుటకును, లోకకళ్యాణమును జేకూర్చుటకు నవశ్యము వేదోక్తమగు కర్మ జేయుదగునని భావము.

నీలకంఠీయము:— జగచ్చక్రమిటుల ప్రవర్తించుగాక. దానివలన నేమిప్రయోజనమునిన? మొట్టమొదట భూతములు వేదమును దెలిసికొనుట, దానివలన కర్మాచరణము, దానిచే దేవతాతృప్తియు, అందువలన వర్షము, దానివలన అన్నము, కలుగును. అందువలన భూతములు జనించును. తిరిగి ప్రాణులు వేదమును తెలిసికొందురు. అనునీవిధమగు జగత్తునిరంతరము చక్రమువలె తిరుగుచుండును. ఇట్టిజగచ్చక్రము నెవడనుసరించడో వాడు పాపజీవనుడును, ఇంద్రియారాముఁడును నగును కాని ధర్మారాముఁడును, ఆత్మారాముఁడు కానేరడు. అట్టి మానవుడు దంశమశకాదులవలె వ్యర్థజీవను డగును. ఎవడీజగచ్చక్రము ననువర్తించునో వాఁడు జగదుపకారకుఁడును, ధన్యుడును నగునని భావము. ఈవిషయమునే "అథో అయం వా ఆత్మా సర్వేషాం భూతానాం లోకః స యజ్జుహోతి యద్యజతే తేన దేవానాం లోకోఽథ యదనుబ్రూతే తేన ఋషీణా మథ యత్ పితృభ్యో నిపృణాతి యత్ ప్రజా మిచ్ఛతి తేన పితౄణా మథ యన్మనుష్యా న్వాసయతే యదేభ్యోఽశనం దదాతి తేన మను-

గీ॥ యస్త్వాత్మరతి రేవ స్యా దాత్మతృప్త శ్చ మానవః ।
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే ॥ ॥౧౭॥

పదవిభాగము:— యః - తు - ఆత్మరతిః - ఏవ - స్యాత్ - ఆత్మతృప్తః - చ - మానవః - ఆత్మని - ఏవ - చ - సంతుష్టః - తస్య - కార్యం - న - విద్యతే । ॥౧౭॥

ప్రతిపదార్థము:— యస్తు=ఏ; మానవః=ఆత్మజ్ఞాననిష్ఠుఁడగు మానవుఁడు; ఆత్మరతిరేవ - ఆత్మ=ఆత్మయందే; రతిరేవ=క్రీడకలవాఁడై; ఆత్మతృప్తశ్చ. ఆత్మ=ఆత్మచేతనే; తృప్తశ్చ=తృప్తుఁడై; ఆత్మన్యేవ=ఆత్మయందే సంతుష్టశ్చ=సంతుష్టుఁడై; స్యాత్=అగునో; తస్య=అట్టి మానవునకు; కార్యం=చేయఁదగినది; న విద్యతే=లేదు.॥౧౭॥

శాంకరభాష్యమ్.—

ఏవం స్థితే కి మేనం ప్రవర్తితం చక్రం సర్వేణానువర్తనీయ మాహోస్విత్ పూర్వోక్త కర్మయోగానుష్ఠానోపాయప్రాప్యా మనాత్మవిదా జ్ఞానయోగే నైవ నిష్ఠా మాత్మవిద్భి స్సాంఖ్యై రనుష్ఠేయా మప్రాప్తైనైవేత్యేవ మర్థ మర్జునస్య ప్రశ్న మాశంక్య, స్వయమేవ వా శాస్త్రార్థస్య వివేకప్రతిపత్త్యర్థ మేతం వై త మాత్మానం విదిత్వా నివృత్తమిథ్యాజ్ఞానా స్సంతో బ్రాహ్మణా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పరమేశ్వరునిచే ప్రవర్తిత మగు జగచ్చక్రము సర్వులచే ననుసరణీయమా? లేక కర్మయోగానుష్ఠాన మనెడి యుపాయముచేఁ బొందదగినట్టియు, ఆత్మవేత్తలగు సాంఖ్యులచే ననుష్ఠేయమగు జ్ఞానయోగముచే నిష్ఠను పొందనట్టి యనాత్మజ్ఞునిచే నీజగచ్చక్ర మనుసరణీయమా? అనెడి యర్జునుని ప్రశ్న నాశంకించుకొని, లేక స్వయముగనే శ్రీకృష్ణపరమాత్మ శాస్త్రార్థము

వ్యాఖ్యా మథ యత్పశుభ్యస్తృణోదకం విందతి తేన పశూనాం యదస్య గృహేషు శ్వాపదా వయాంస్యాపిపీలికాభ్య ఉపజీవన్తి తేన తేషాం లోక ఇతి" (ఈఆత్మయే సర్వభూతములకు లోకము. ఇట్టి మానవుఁడు దేనిని హోమము చేయునో, యాగము చేయునో యది దేవతలకు స్థితిహేతువగు లోకము. వేదాధ్యయనము చేసినచో నది ఋషులకు స్థితిహేతువగు లోకమగును. పితృదేవతలకొఱకు తర్పణము చేసిన నదియు సంతానము కనిన నదియు పితృదేవతలకు స్థితిహేతువగు లోకమగును. అతిథ్యభ్యాగతులకు నివాసమిచ్చి భోజనాదులనర్పించిన నది మనుష్యులకు స్థితిహేతువగు లోకమగును. పశువులకు తృణమును, జలమును సమర్పించిన నదివాటికి స్థితిహేతువగు లోకమగును. శునకములు, పక్షులు మొదలు పిపీలికలవరకు నగు ప్రాణు లెవరినను సరించి జీవించునో వారు వానికను కూలమగు నాహారము నర్పించుచో వానికది స్థితిహేతువగు లోక మగును.) అని పై శ్రుతి బోధించుచున్నది.॥౧౬॥

—• ౩వ అధ్యాయము ౧౭ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "ఎవఁ డింద్రియములతో విషయములయందు రమించక, పరమార్థదర్శియై యుండునో వాఁ డీజగచ్చక్రభూత మగు కర్మ ననుష్ఠించనివాఁడైనను కృతకృత్యుఁ డగుటచే ప్రత్యవాయమును పొందఁడు" అని రెండుశ్లోకములచే జెప్పుచున్నాఁడు. ఇంద్రియారాముఁడు స్రక్చందనవనితాదులయందు రతి ననుభవించును. మనోజ్ఞాన్నపానాదులయందుఁ దృప్తి నొందును. పశుపుత్రహిరణ్యాదిలాభముచేతను, ఆరోగ్యాదులచేతను తుష్టిని పొందును. పైఁ జెప్పఁబడిన విషయములు లభించనిచో నట్టిరాగులకు అరతి, అతృప్తి, అతుష్టి అనునవి కలుగును. ఇవి సాక్షిసిద్ధము అగు మనోవృత్తివిశేషములు. ఇక పరమాత్మానందము

శాంకరభాష్యమ్:—

మిథ్యాజ్ఞానవద్భి రవశ్యం కర్తవ్యేభ్యః పుత్త్రైషణాదిభ్యో వ్యుత్థాయ భిక్షాచర్యం శరీరస్థితిమాత్రప్రయుక్తం చరంతి న తేషా మాత్మజ్ఞాననిష్ఠావ్యతిరేకే ణాఽన్యత్కార్య మస్తీ త్యేవం శ్రుత్యర్థ మిహ గీతాశాస్త్రే ప్రతిపిపాదయిషిత మావిష్కుర్వ న్నాహ భగవాన్—యస్త్వితి। యస్తు సాంఖ్య ఆత్మజ్ఞాననిష్ఠ ఆత్మరతి రాత్మన్యేవ రతి ర్న విషయేషు యస్య స ఆత్మరతి రేవ స్యా ద్భవే దాత్మతృప్త శ్చాత్మ నైవ తృప్తో నాన్నరసాదినా మానవో మనుష్య స్సంన్యాస్యాత్మన్యేవ చ సన్తుష్టః। సంతోషో హి బాహ్యార్థలాభే సర్వస్య భవతి త మనపే క్ష్యాత్మన్యేవ చ సంతుష్ట స్సర్వతో వీతతృష్ణ ఇత్యేతత్। య ఈదృశ ఆత్మవి త్తస్య కార్యం కరణీయం న విద్యతే నాస్తీ త్యర్థః॥ ॥౧౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

యొక్క వివేకవిజ్ఞాననిమిత్త మీయాత్మరూపమును తెలిసికొని మరలిన మిథ్యాజ్ఞానము కలవారలైన విప్రాహ్మణులు మిథ్యాజ్ఞానముకల యజ్ఞానులచే నవశ్య మాచరణీయ మగు పుత్త్రైషణాధనైషణాదారైషణాదులను వదలి, శరీరస్థితిమాత్రప్రయుక్తమగు భిక్షాచర్యము నాచరించుచుందురో అట్టివారల కాత్మజ్ఞాననిష్ఠకంటె వేరగు (కర్తవ్య మగు) కార్యము లేదనెడి శ్రుత్యర్థము నీగీతాశాస్త్రమునందు చెప్పఁదలచి, అట్టి విషయమును ప్రకటన చేయుచు శ్రీకృష్ణపరమాత్మ "యస్తు" అనుశ్లోకమును జెప్పెను.

ఏసాంఖ్యుఁ డగు నాత్మజ్ఞాననిష్ఠుఁ డాత్మయందే క్రీడ కలవాఁడై, విషయములయందు క్రీడ లేనివాఁడై, యన్నరసాదులచేఁ గాక యాత్మచేతనే సంతుష్టుఁడో, ఏ మానవుఁడు సంన్యసించి యాత్మయందే క్రీడించుచు సంతోషము కలవాఁ డగునో, (అనగా సర్వులకు బాహ్యార్థము లగు స్రక్చందనవనితాదులు లభించినపుడు సంతోషము సంభవించును. అట్టి సంతోషమును లెక్కించక యన్నిటియందు తృష్ణను వదలి యాత్మయందే సంతోషము కలవాఁడై యగునో) అట్టి యాత్మజ్ఞానికిఁ జేయఁదగిన దేదియు లేదని యర్థము. ఇట రతితృప్తిసంతోషములకు మోదప్రమోదానందములకు వలె నవాంతరభేదము; లేక రతి యనగ విషయములయం దాసక్తి, తృప్తి యనగ విషయవిశేషసంపర్కమువలన గలిగెడి సుఖము. సంతోష మనగ నభీష్టవిషయమాత్రలాభము వలన గలిగెడి సుఖసామాన్య మని గ్రహింపనగును. ॥౧౭॥

ననుభవించెడివాఁడు ద్వైతదర్శనము లేనివాఁ డగుటవలన నీచ మగు విషయసుఖమును గోరఁడు. ఈవిషయము "యావా నర్థ ఉదపానే" అనుస్థలమునఁ జెప్పఁబడెను. కనుక ఆత్మకంటె వేరగు విషయములందు రతి, తృప్తి, తుష్టులు లేమింజేసి పరమానందస్వరూప మగు నద్వితీయబ్రహ్మను సాక్షాత్కరించుకొనిన బ్రహ్మవేత్త యుపచారమువలన (అర్థతః) ఆత్మరతుఁ డనియు, ఆత్మతృప్తుఁ డనియు, ఆత్మతుష్టుఁ డనియు పిలువఁబడును. "ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియావా నేష బ్రహ్మవిదాం వరిష్ఠః" అను శ్రుతియు నైవిషయమునే చెప్పుచున్నది. "ఆత్మ

తృప్తశ్చ” అను స్థలమున ‘చ’ కారము ఏవకారానుకర్షణార్థకము. ‘మానవః’ అనుటచే నిం(డై)ను పైఁజెప్పఁబడిన యాత్మతృప్త్యాదులు కలవాఁడగుచో వాఁడు కృతకృత్యుఁడగును గాని బ్రాహ్మణత్వాద్యుత్కృష్టజాత్యమాత్రమునఁ గృతకృత్యుఁడు కాఁడని సూచింపఁబడెను. ‘ఆత్మన్యేవ చ సంతుష్టః’ అను స్థలమున యున్న ‘చ’ కారము సముచ్చయార్థకము. ఎవఁడు పైఁ జెప్పిన విధమున ఆత్మరత్యాదికము కలిగియుండునో వానికి నధికారహేతు వేదియు లేమింజేసి, లౌకిక మగునట్టిదిగాని, వైదిక మగునట్టిదిగాని యేవిధ మగు కర్మయు చేయఁదగినది లేదు.

శంకరానందీయము;— శ్రీకృష్ణపరమాత్మ “జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం” అని సాంఖ్యులగు సంన్యాసులకు జ్ఞాననిష్ఠను, కర్మయోగు లగు గృహస్థులకు కర్మనిష్ఠను ఉత్తరాయణదక్షిణాయనములవలె నసంకీర్ణముగ విభజించి తెలిపి, “తదేకం వద నిశ్చిత్య” అని తనకర్తవ్యము నడిగిన కర్మాధికారి యగు నర్జునుఁడు సన్నిహితుఁ డగుట నాతనికి హితము నుపదేశించుటకు “న కర్మణా మనారంభాత్” అని కర్మయోగము నుపక్రమించి, “నియతం కురు కర్మ త్వం” అని యర్జునునకు కర్మయోగమునే యుపదేశించి, “యజ్ఞార్థాత్” అనునది మొదలుకొని ‘మోఘం పార్థ! స జీవతి’ అనునది యంతముగాఁగల గ్రంథముచే అనాత్మజ్ఞుఁడు ముముక్షువు నగువాఁడు నవశ్యము సత్త్వశుద్ధికై కర్మను జేయఁదగును. ఇట్లు చేసినచో దేవతానుగ్రహము, ఈశ్వరప్రసాదము సిద్ధించు నని సూచించుటకు కర్మల కర్తవ్యత్వమునే యనేకవిధముల నిశ్చయించి, ప్రస్తుతము సాంఖ్యుఁడగు సంన్యాసికి జ్ఞాననిష్ఠను విడచి వేరొక టేమియుఁ జేయఁదగినది కొంచమైనను లేదని యీశ్లోకమునఁ జెప్పుచున్నాఁడు. ‘యస్తు’ ఏ; (ఇట ‘తు’ కారముఆత్మకంటె వేఱగు విషయములందు రాగముకలవాఁడు కానట్టి-అను నర్థము నిచ్చును.) “మానవః” బహిరంతశ్చ సర్వత్ర బ్రహ్మైవ మాపయతి గ్రాహయతీతి మానం ప్రత్యగ్దర్శనం, తదేవ సర్వదా వాతి భజతీతి మానవః బ్రహ్మవిద్యతిః” (అనఁగా లోపలను, బయటను, అంతట నీబ్రహ్మజ్ఞానము బ్రహ్మను దెలియఁజేయునది గాన మాన మనఁబడును. అట్టి మానమును (బ్రహ్మజ్ఞానమును) సర్వదా భజించువాఁడు గాన బ్రహ్మవేత్త యగు యతి మానవుఁ డనఁబడును) అట్టి బ్రహ్మవేత్త— “ఆత్మరతి రేవ స్యాత్” “అహం బ్రహ్మాస్మి” అను శ్రుత్యుక్తరీతిని స్వస్వరూపముచే సాక్షాత్కృతమైనట్టియు, నిత్యానందైకరసస్వరూపమైనట్టియు, నద్వితీయ మగునట్టి పరబ్రహ్మమునందు నంతఃకరణముయొక్క విహారముకలవాఁ డగునో (అనఁగ “ఆత్మరతి రాత్మక్రీడ ఆత్మమిథున ఆత్మానందః” అను శ్రుతిచెప్పిన బ్రహ్మవేత్త యెల్లప్పుఁ డాత్మయందే విహరించునుగాని యాత్మేతర మగు నింకొక దానియం దెన్నఁడు విహరించఁ డని యర్థము): ‘ఆత్మతృప్తశ్చ’ ‘ఆత్మలాభా న్నపరం విద్యతే’ అను స్మృతిచెప్పిన ఆత్మకంటె వేఱొండు పొందఁదగినది లేమింజేసి ఆత్మప్రాప్తిచేతనే యంతట నలంబుద్ధికలవాఁడై తృప్తినొందునో; వాఁడు “ఆత్మన్యేవ చ సంతుష్టః” చక్షురింద్రియమునకు రూప మంతట నెట్లు విషయ మగునో యట్లే యంతఃకరణవృత్తికి విషయ మగునట్టియు, చిదానందరసస్వరూప మగు పరబ్రహ్మమునందే—ఒకానొకవస్తువును కోరువానికి నావస్తువు సిద్ధించినచో నాతఁ డెట్లు సంతుష్టుఁ డగునో యట్లే సంతుష్టుఁ డగును. కృతకృత్యుఁడు, ఆత్మారాముఁడు నగు మహాత్ముఁడు పర్యాప్తకాముఁ డగుటచే వానికి పొందఁదగినది వేఱొండేమియు నుండదుగాన “తస్య కార్యం న విద్యతే” అట్టివానికి చేయఁదగిన కర్మ మేదియును లేదు.

“బ్రహ్మజ్ఞాని యగు విద్వాంసుఁడు కర్మబోధకశాస్త్రములను, తత్ప్రయోజనములను, తన్నియమములను దెలిసినవాఁ డగుట సర్వసామాన్య మగు కర్మవిధిచే నాతఁడుకూడ వైదికకర్మలను చేయఁదగును. ‘విద్వాన్యజతే’ అను విశేషవిధానముచే నైన విధిబలముచేఁగూడ విద్వాంసుఁ డవశ్యము కర్మము చేయఁదగును” అని నీవు అందువేమో అట్టి నిన్నీవిధముగఁ బ్రశ్నింపవలయును.

పరాత్పరైకత్వవిజ్ఞానమనెడు వహ్నిచే నిర్మూలితమైన ద్వైతభ్రమకలవాడును, సర్వమును బ్రహ్మమునుగ దెలిసికొనినట్టియు, జీవన్ముక్తుడు నగు బ్రహ్మవేత్త కర్మలను జేయుట స్వార్థముగనా (తన నిమిత్తమా?) లేక పరార్థముగనా? మొదటిపక్షమున (స్వార్థమే యన్నచో) కర్మనుజేయుట యైహికమునిమిత్తమా? లేక ఆముష్మికార్థమా? ఐహికముకొరకే యన్నచో శరీరరక్షణార్థమా? లేక పరిజనరక్షణార్థమా? లేక విలాసార్థమా? 'సిద్ధే స్యథార్థే న యుతేత తత్ర పరిశ్రమం తత్ర సమీక్షమాణః' అనువచనానుసారము శరీరస్థితి ప్రారబ్ధాధీనమగుట అట్టిశరీరరక్షణార్థము కర్మలను జేయుట యనవసరము. కాన 'శరీరరక్షణార్థము కర్మలను జేయవలెను.' అను మొదటిపక్ష మనుపపన్నము. "ఏవం హైత మాత్మానం విదిత్వా" అను శ్రుతిచొప్పున నిశ్శేషముగ నివృత్తమగు మిథ్యాజ్ఞానముకల బ్రహ్మవేత్తలు పుత్రైషణాద్యేషణాత్రయమునుండి విడువబడుదురుగాన నట్టి బ్రహ్మవేత్త యగు విద్వాంసునకు పరిజనమే లేమింజేసి పరిజనరక్షణార్థము కర్మలను జేయనవసరమేకలుగదు. కాన "పరిజనరక్షణార్థము కర్మలను చేయవలె" నను ద్వితీయపక్ష ముపపన్నముగాదు. ఇక సర్వము నాత్మగ దెలిసికొనిన యాత్మరతుడగు విద్వాంసుడు మఱియొకవస్తువునందు రతిలేనివాడగుట వానికి విలాసములు సంభవింపనేరవుగాన "విద్వాంసుడు విలాసార్థము కర్మలను జేయవలె" నను తృతీయపక్షముగూడ నుపపన్నముగాదు. అట్లగుచో నాముష్మికార్థమే కర్మలజేయవలె నందువేని స్వర్గార్థము కర్మల జేయవలెనందువా? లేక మోక్షార్థము కర్మలు చేయుదగు నందువా? లేక ఆత్మశుద్ధ్యర్థము కర్మలు చేయుదగునందువా? "ఇహైవ సర్వే విప్రలీయంతే కామాః" అని పర్యాప్తకాముఁ డగు నాత్మజ్ఞానికి సర్వకామవిలయము శ్రూయమాణ మగుటచే విద్వాంసునకు స్వర్గకామమే సంభవింపదుగాన "స్వర్గార్థము విద్వాంసుడు కర్మలను జేయవలె" నను ప్రథమపక్ష ముపపన్నము గాదు. "న కర్మణా న ప్రజయా" అను శ్రుతి కర్మలకు మోక్షసాధనత్వమును నిషేధించుటచేతను, విద్వాంసుడు జీవన్ముక్తుడగుటచే నతనికి మోక్షార్థము కర్మల జేయనవసరము లేదుగాన "విద్వాంసుడు మోక్షార్థము కర్మల నాచరించవలె" నను ద్వితీయపక్షము నుపపన్నముగాదు. ఇక నాత్మశుద్ధ్యర్థము విద్వాంసుడు కర్మలు చేయఁదగునను తృతీయపక్షమున– కర్మల నాచరించుట శరీరశుద్ధ్యర్థమా? లేక చిత్తశుద్ధ్యర్థమా? లేక ఆత్మశుద్ధ్యర్థమా? "కలేబరం మూత్రపురీషభాజనం" అను స్మృతిచొప్పునను, ప్రత్యక్షప్రమాణముచేత మలమాంసాస్థిభాజన మగు నీశరీరము కర్మల నాచరించుటచే శుద్ధము కాదుగాన 'విద్వాంసుడు శరీరశుద్ధ్యర్థము కర్మల నాచరించవలె' నను ప్రథమపక్ష ముపపన్నముగాదు. "యతయః శుద్ధసత్త్వాః" అను శ్రుతిచొప్పున శుద్ధసత్త్వు లగుటచేతనే సమ్యగుత్పన్నాత్మజ్ఞాను లగు విద్వాంసులకు చిత్తశుద్ధ్యర్థము కర్మలు చేయనవసరము లేదుగాన "విద్వాంసుఁడు చిత్తశుద్ధ్యర్థము కర్మల నాచరించవలె" నను ద్వితీయపక్షము నుపపన్నము గాదు. 'అస్నావిరగ్ం శుద్ధ మపాపవిద్ధం' అను శ్రుతిచొప్పున నాత్మ నిరవయవ మగుటచే కర్మల కవిషయముగాన కర్మలచే నాత్మను శుద్ధము చేయుట సంభవింపదు. విష్ణుమహేశ్వరాదులుఁగూడ నకార్యశతములఁ జేసియు నేయాత్మజ్ఞానబలముచే స్వయముగ శుద్ధులైరో; అన్యులను శుద్ధులుగ చేసిరో; యట్టి యాత్మను నాత్మజ్ఞానేతర మగు కర్మాదిక మగు దేనిచే నైనను శుద్ధముగ నెవరు చేయఁగలుగుదురు? స్వతశ్శుద్ధము కాని యొకానొకవస్తువును మరొకవస్తువుచే శుద్ధముగ చేయుట సంభవమగునుగాని, స్వతశ్శుద్ధ మగు నాత్మకు మరొకవస్తువుచే శుద్ధిని కల్పించుట యసంభవము. కాన "విద్వాంసుఁ డాత్మశుద్ధ్యర్థము కర్మల నాచరించవలె" నను తృతీయపక్షముఁగూడ నుపపన్నము గాదు. అట్లగుచో విద్వాంసుఁడు పరార్థముగనే కర్మల నాచరించఁదగు నందువా? అటులైన నిట్లీవిధముగఁ ప్రశ్నింపవలయును. పరార్థము కర్మలను జేయు నాతఁడు పరోక్షజ్ఞానవంతుఁడు కావలెనా? లేక యపరోక్షజ్ఞానవంతుఁడై యుండవలెనా? అపరోక్షజ్ఞానియే యై యుండవలసినచో నాతఁడు యతిగ నుండవలెనా? లేక గృహస్థుఁడై యుండవలెనా? ఇట ప్రథమ (అపరోక్షజ్ఞానియు, యతియు నగు విద్వాంసుఁడు పరార్థము కర్మల నాచరింపవలె నను) పక్ష

ముపపన్నము గాదు. ఏలయన- అపరోక్షజ్ఞానియు, యతియు నగు విద్వాంసుఁడు అభిమానశూన్యుఁ డగుట చేతను, సర్వకర్మలను, తత్సాధనములను సంన్యసించినవాఁ డగుటచేతను నట్టివానికి కర్మశబ్దప్రసక్తియే లేదు. దేహాదులయం దహంకారము, వర్ణాశ్రమాదులయందు మమకారము, ప్రపంచము సత్యము అనెడి జ్ఞానము, భోగ్యవస్త్వభిలాషయు, కర్మల నవశ్యము జేయవలె నను బుద్ధియు, కర్మల నాచరించనిచో ప్రత్యవాయము సంభవించు నను భయము, శాస్త్రభీతి; యివికదా కర్మలయందు ప్రవర్తించుటకు కారణములు. వీటి నన్నిటిని పరావరైకత్వ విజ్ఞానవహ్నిచే సామూలముగ దహించివైచి, స్వయముగ నిష్క్రియబ్రహ్మస్వరూపముగ నున్నట్టియు, జ్ఞానాగ్నిచే విదగ్ధమైన యాత్మానాత్మతాదాత్మ్యగ్రంథి కలవాఁ డగుటచే సర్వాత్మభావమును పొందినట్టియు స్వాత్మారాముఁడు నగు యతికి "ప్రాణో హ్యేష సర్వభూతై ర్విభాతి విజాన న్విద్వా న్భజతే నాతివాదీ" అను శ్రుతి చెప్పిన అతిగ మాటలాడుటయే సంభవింపదు. అట్టివానికి కర్మలయం దెట్లు ప్రవృత్తి కలఁగును? కాన "అపరోక్షజ్ఞానియు, యతియు నగు విద్వాంసుఁడు పరార్థము కర్మల నాచరించవలె" నను ప్రథమపక్ష ముపపన్నము గాదు. ఇక ద్వితీయ (అపరోక్షజ్ఞానియు, గృహస్థు నగు విద్వాంసుఁడు కర్మల నాచరించఁదగు నను) పక్షము గూడ నుపపన్నము గాదు. ఏలయన- అనేకసహస్రజన్మకృత మగు పుణ్యకర్మపుంజముయొక్క పరిపాకముచేతను, ఈశ్వరప్రసాదముచేతను నెవనికి సర్వదృశ్యమిథ్యాత్వనిశ్చయపూర్వకముగ 'బ్రహ్మ నేనే' యను బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానము ప్రతిబంధకరహితముగ నెపుడు కలుఁగునో యపుడే నాతఁడు గృహస్థుఁడైనను యాజ్ఞవల్క్యాదులవలె నేషణాత్రయమునుండి విడువఁబడును. అట్టివానికి సంసారకారణము లేమియు లేమింజేసి యాతఁడు అహంకారమమకారనిబంధన మగు సంసారమును పొందనేరఁడు. ఆత్మభిన్న మగు దేహాదులయం దహంభావము, తదతిరిక్త మగువాటియందు మమకారము నీరెండును సంసారకారణములు. ఈ యహంభావమమభావము లెవనియొక్క బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానముచే విధ్వస్తము లగునో యాతఁడు సంసారమును పొందనేరఁడు. ఏమన- "బ్రహ్మనే నేను" అను బ్రహ్మాత్మైకత్వజ్ఞానము 'నేను బ్రాహ్మణుఁడను, ఇది నాది' యను బుద్ధియు నీరెండును తేజస్తిమిరములవలె పరస్పరవిరుద్ధములుగాన నొకచోట నుండుట సంభవింపనేరదు. కనుకనే బ్రహ్మతత్త్వవిజ్ఞానమనెడు ఖడ్గముచే నిర్భిన్నహృదయగ్రంథిగల పురుషునకు తిరిగి సంసారము సంభవింపదు. కనుకనే బ్రహ్మవేత్త యగు విద్వాంసుఁడు గృహస్థుఁడైనను సంసారమునుండి వ్యుత్థితుఁడే యగును. అట్లైనఁ 'డేని యొకఁడు సంసారవిముక్తుఁడు కానిచో నతని సంసారవ్యుత్థానమే యాతఁడు అజ్ఞానకార్యనిగృహీతుఁడని తెలుపుచున్నది. 'సంసారవ్యుత్థానమునకు, హేతు వగు ప్రారబ్ధము లేమింజేసి (సంసారవ్యుత్థానమునకు ప్రతికూల మగు ప్రారబ్ధ ముండుటచే) గృహస్థు బ్రహ్మభావాపన్నుఁడైనను సంసారవ్యుత్థితుఁడు కాకుండు" నని యందువా? అతఁడు జడభరతుఁడువలె నట్లే యుండును. కాని సర్వమిథ్యాత్వజ్ఞానము, సంసారము నీరెండును పరస్పరవిరుద్ధములుగాన బ్రహ్మభావాపన్నుఁ డగు గృహస్థువు "నేను, ఇది నాది" అని సంసరణమును బొందనేరఁడు. వివేకవంతుఁడు మరుప్రదేశమును జలరహితముగఁ దెలిసికొనిన యనంతరము అట దూరమునకు జలముగ భాసించినను, దానిని గ్రహించుటకుఁగాని, పానముచేయుటకుఁగాని యాప్రదేశమునకు వెళ్ళుటకు ప్రయత్నించఁడు. మఱియొక యవివేకి యగు బలవంతునిచే వేగముగ తీసికొనివెళ్ళబడినను నాతఁడు సంతోషముతో వెళ్ళనేరఁడు. మఱియు నెంత కష్టము! అని యనుకొనుచు అతికష్టముచే మందముగ వెళ్ళును. మఱియు నింకొకరి నెవరినీ యటకు తీసికొని వెళ్ళఁడు. అట్లే ప్రతికూలప్రారబ్ధముకల విద్వాంసుఁడుకూడ సర్వమిథ్యాత్వదర్శియై సంసారము నొందుటకు నభిలషింపఁడు; మఱియొకని ప్రేరేపించఁడు. కాని ప్రవృత్తిహేతువగు ఆత్మేతరాహంభావము లేమింజేసి యాతఁడు నడుము విరిగిన సర్పమువలె సంసారమున మందగమనము కలవాఁడై యగును. బ్రాహ్మణునకు చండాలశరీరమువలె 'నేను బ్రహ్మను' అనెడి బ్రహ్మాత్మభావముచే బ్రహ్మనిష్ఠుఁడగు బ్రహ్మవేత్తకు దేహాదితాదాత్మ్యము అభిమతము కాదు.

అది లేనిదే "నేను, నాది" అని వ్యవహరించుటకు శక్యము కాదు. అనగా (బ్రహ్మవేత్తలకు దేహాదితాదాత్మ్యమే దుర్ఘటము, దుఃఖహేతువు) అట్టి తాదాత్మ్యముచే నైన "నేను, నాది" అను ప్రవృత్తి యతిదుఃఖహేతువు. అందువలన కర్మల నాచరించుట యత్యంతదుఃఖహేతు వగును. ఈవిషయమును దెలిసికొని గృహస్థుడైన విద్వాంసుడు సర్వమును సంన్యసించినవాడై స్వార్థ మగునది కాని, పరార్థ మగునది కాని యగు కర్మను చేయుటకు సమర్థుడు కానేరడు. కనుక చతుర్థాధ్యాయమునందును, ప్రస్తుతమునను, వక్ష్యమాణరీతిని పరోక్షజ్ఞానియే కర్మలను చేయవలెనుగాని నిశ్శేషముగ వినష్టమైన యాత్మాహంభావముకల యపరోక్షజ్ఞాని యెప్పుడును కర్మలను చేయ నవసరము లేదని భావము. కాన "అపరోక్షజ్ఞానియు, గృహస్థుపు నగు విద్వాంసుడు కర్మలను చేయవలె" నను ద్వితీయపక్షముగూడ ననుపపన్నము.

"యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః। సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి నలిప్యతే ॥ నైవ కించి త్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్" ఇత్యాదిశ్లోకార్థము నాలోచించినచో నపరోక్షజ్ఞానియు గర్మల నాచరించవలెనని ప్రతీయమానమగుచున్నది. ఒక పరోక్షజ్ఞానియే లోకసంగ్రహార్థము కర్మలు చేయవలె నను నియమము యుక్తియుక్తము కాదు. 'మునిః తత్త్వవిత్' మొదలగు బ్రహ్మవేత్తయొక్క చిహ్నములచే బ్రహ్మనిష్ఠుడగు బ్రహ్మవేత్తను విడచి పైశ్లోకోదాహృతమగు విశుద్ధాత్మత్వాదివిశేషణసముదాయము పరోక్షజ్ఞానికెట్లు సంభవించును. కాన నపరోక్షజ్ఞానియు లోకసంగ్రహార్థము గర్మల నాచరింపదగు నందువా! అదియు నిజమే యగును. విశుద్ధత్వాదివిశేషణసముదాయము బ్రహ్మవేత్తను ఇతరునికంటె ప్రత్యేకించి నిరూపించును గాన వ్యావర్తకమగు నట్టి ముక్తికృతలక్షణ మితరులకు జన్మకోటిశతముచే నైన బొందుటకు శక్యముగాదు. అయినను నిన్నిట నీవిధముగ బ్రశ్నింపవలెను. అపరోక్షజ్ఞాని సిద్ధుడనియు, సాధకు డని రెండువిధములు. వారిలో లోకసంగ్రహకర్మను జేయదగు వాడు సిద్ధుడందువా! లేక సాధకు డందువా! అందున "సిద్ధుడగు నపరోక్షజ్ఞాని కర్మల నాచరింపదగు" నను ప్రథమపక్ష మపపన్నము గానేరదు. ఏలయన— అట్టివాడు ముక్తుడగుటచే నట్టిసిద్ధుడు లోకసంగ్రహార్థము కర్మలను చేయుటయే యనవసరము. 'సర్వ మిద మహం చ బ్రహ్మైవ బ్రహ్మైవ' (ఈచరాచరవస్తుప్రపంచము, నేను అంతయు బ్రహ్మస్వరూపమే) అనెడి నిత్యనిరంతరబ్రహ్మనిష్ఠచే నిశితీకృతప్రజ్ఞావరైకత్వవిజ్ఞానఖడ్గముచే ద్వైతభ్రమను సంపూర్ణముగ నుచ్ఛేదించి బ్రహ్మాదిస్తంబపర్యంత మగు సర్వప్రాణులతోగూడ తనను ముక్తునిగా దెలిసికొను బ్రహ్మవేత్తయగు యతికి నతని దృష్టిలో బద్ధలోకమే లేదు కాబట్టి యట్టియతికి బద్ధలోకసంగ్రహార్థమయిన కర్మయే సంభవింపదు. దేవదత్తు డందరికంటె ముందు భుజించి నేనే యందరికంటె ముందు భుజించితి ననుకొన్నట్లును, యజ్ఞదత్తు డందరికంటె ముందర మేల్కొని నేనే యందరికంటె పూర్వము మేల్కొంటి ననుకొన్నట్లును విద్వాంసుడు తన నొక్కనినే ముక్తునిగా భావించక స్వీయవిజ్ఞానముచే తను, సర్వప్రాణిజాతమును గూడ ముక్తులనుగా భావించుచు స్థాలీపులాకన్యాయమున బ్రహ్మవేత్త యగు యతి తన ముక్తిచే నందరను ముక్తులనుగా భావించును. అట్లుగాక యెవడు తానే ముక్తుడై నట్లును, ఇతరులు ముక్తులు కానట్లును దెలిసికొనునో; వాడు బ్రహ్మవేత్తయు, ముక్తుడు కూడ గానేరడు. ఇక నేమన అట్టివాడు విద్యాబంధమునుండి గాక వాఙ్మాత్రముక్తుడే యగును. ఎట్లన వివేకియగువాడు తన యనుభవముచే తరంగ బుద్బుదఫేన ఉదకాదుల నన్నిటిని నెట్లు జలమాత్రముగనే తెలిసికొనునో, యెట్లు సువర్ణవికారమగు కటక మకుట కుండలాదికమును సువర్ణమాత్రముగనే దెలిసికొనునో, యెట్లు రజ్జుసర్పమును రజ్జుమాత్రముగనే తెలిసికొనునో, యట్లు యెవడు పరిశుద్ధదృష్టితో దనను, సమస్తమగు జగత్తును బ్రహ్మస్వరూపమునుగ దెలిసికొనునో; వాడే బ్రహ్మవేత్తయు, నద్వైతదర్శియు, నవిద్యాబంధవిముక్తుడు నగును. మరియు వాడు—స్వప్నావస్థనుండి ప్రబుద్ధుడగు మనుజుడు స్వాప్నికపదార్థముల జూడనట్లు, స్వాతిరిక్తమగు పదార్థముల జూడకుండును. అట్టి యద్వైతదర్శియు, మహాత్ముడు,

సిద్ధుడు, పూర్ణతృప్తియు, బ్రహ్మవిద్వరిష్ఠుఁడు నగు వానికి ఈలోకసంబంధమగు విధి, విధాన, విధేయములు లేమిం జేసి, యాతనికి లోకము నుద్దేశించి, కర్మలయందు ప్రవృత్తియే సంభవింపదు. ఇక 'కుర్వన్నపి న లిప్యతే' అను ప్రవృత్తిద్యోతకమగు వాక్యము కర్మప్రవృత్తి విధాయకము కదా. అది యెట్లుపపన్నమగునందువా! ఈశ్లోక వ్యాఖ్యావసరమున నిరుక్తవిషయమున కవిరుద్ధముగ దాని యర్థమును వివరించెదము "విద్వాన్ యజతే" అను స్థలమున విద్వచ్ఛబ్దమునకు వేదార్థము దెలిసిన బ్రాహ్మణుడని యర్థము కాని బ్రహ్మవేత్తయగు యతియని యర్థము కాదు. ఏలయన అట్టి యతి సర్వకర్మసంన్యాసియగుటచే కర్మవిధికూడ లోకమువలె మిథ్యాత్వకోట్యంతఃపాతి యగుటచేతను, కర్మసిద్ధియే యుపపన్నము కాదు. కాన విద్వచ్ఛబ్దార్థము బ్రహ్మవేత్త కానేరఁడు. ఇక 'సాధకాపరోక్షజ్ఞాని కర్మల చేయఁదగు" నను ద్వితీయపక్షముగూడ నుపపన్నము గాదు. ఏలయన— ముముక్షువు, నిదిధ్యాసువు నగు యతి సమాధిని విడచి లోకసంగ్రహార్థకర్మమును చేయఁదగునని చెప్పు విధి యేదియు లేదు. "త మేవ ధీరో విజ్ఞాయ" అనియు 'పరం బ్రహ్మానుసంధధ్యాత్' అనియు 'యచ్ఛే ద్వాఙ్మనసీ ప్రాజ్ఞః' అనియు 'బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్' అను నీ మొదలగు శ్రుతులు యతికి జ్ఞాననిష్ఠాకర్తవ్యత్వమునే చెప్పుచున్నవి. అట్లే "మన స్సంయమ్య మచ్చిత్తః" అనియు "ధ్యానయోగపరో నిత్యం" అనియు, "వాచం యచ్ఛ మనో యచ్ఛ" అను మొదలుగాఁగల స్మృతులును యతియగు ముముక్షువునకు జ్ఞాననిష్ఠాకర్తవ్యత్వమునే బోధించుచున్నవి. కనుక సాధకుఁడు, ఆత్మవేదియు నగు యతికి సమాధియే చేయఁదగినది కాని శ్రౌతమగునట్టిది కాని, స్మార్తము కాని, పరార్థము కాని యగు కర్మము, శౌచము, ఆచమనము కాని కర్తవ్యములు కావు. జ్ఞాననిష్ఠున కెట్టి విధియు లేదని స్మృతులు చెప్పుటచే కర్మచోదన (విధి)చే సాధకాపరోక్షజ్ఞాని కర్మల చేయఁదగు"నని చెప్పుటయు నసంగతము. "ఏత మేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛంతః ప్రవ్రజంతి" అను శ్రుతిచోదనచే జిజ్ఞాసచే సంన్యస్తమైన సర్వకర్మలు కల వివిదిషువగు యతి జిజ్ఞాసయందు ప్రవృత్తుఁడగును. అట్టివానికి "నాద్రియేత కర్మచోదనాం" అను శ్రుతిచోదనచే జ్ఞానసాధనమగు శ్రవణాదికమును విడచి వేరొండేయు కర్తవ్యము లేదుగాన కర్మవిధి పైఁజెప్పిన రీతిగ నుపేక్ష్యమని స్పష్టమగుచుండ సిద్ధునకు, ఆత్మతత్త్వవేత్తయగు సాధకునకు కర్మతంత్రావకాశ మెట్లు లభించును? 'నేను, నాది' అనునవి మొదలగు బాహ్యవాసనలచే బద్ధుఁడును, ఆభాసాత్మజ్ఞానియు బహుధాకృతశ్రవణుఁడును అగు పరోక్షజ్ఞానియే "లోకసంగ్రహార్థము కర్మల నాచరించఁదగు" నను వాక్యమున కర్తగ విషయమగును. లేక లోకానుగ్రహార్థము బ్రహ్మచే సృజించఁబడిన మహాత్ములగు వ్యాసాగస్త్యపరాశరవశిష్ఠాదులు, తత్సదృశులు, నిగ్రహానుగ్రహ సమర్థులు నగు అధికారికపురుషులు లోకసంగ్రహవాక్యమున విషయము లయ్యెదరు. కాని సిద్ధుడు కాని, సాధకుఁడగు ముముక్షువుగాని లోకసంగ్రహవాక్యమున విషయులు కారు. కనుకనే సర్వజ్ఞుఁడగు శ్రీకృష్ణపరమాత్మకూడ "తస్య కార్యం న విద్యతే" అని చెప్పుచున్నాడు.

భాష్యోత్కర్షదీపిక:— "న కర్మణా మనారంభాత్" అనునది మొదలుకొని "శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః" అనునంతవరకగు గ్రంథముచే నాత్మజ్ఞాననిష్ఠాయోగ్యతాప్రాప్తినిమిత్తము ఫలాభిసంధిరహితముగ కర్మ మనుష్ఠేయమని చెప్పి, "యజ్ఞార్థాత్" అనునది మొదలు "మోఘం పార్థ! స జీవతి" అనునంతవరకగు గ్రంథముచే ననాత్మజ్ఞుఁడు కర్మయం దధికృతుఁడు నగువానికి ప్రాసంగికముగ కర్మానుష్ఠానమునం దనేక కారణములు చెప్పఁబడెను. మఱియు విహితకర్మాననుష్ఠానమునందు దోషముకూడ చెప్పబడెను. ఇదిట్లుండ 'నీవిధముగఁ బ్రవర్తింపఁజేయఁబడిన చక్రమును సర్వు లనువర్తింపవలసినదా! లేక అపరిశుద్ధాంతఃకరణము కల యనాత్మజ్ఞుఁడే జ్ఞానప్రాప్తినిమిత్త మనుసరింపవలసినదా!" అను యర్జునుని సంశయము నూహించిగాని, స్వయముగ గాని శ్రీకృష్ణపరమాత్మ శాస్త్రముయొక్క వివేకప్రతిపత్తి (జ్ఞానము) నిమిత్తము తత్త్వజ్ఞానికి 'ఏవం ప్రవర్తితం చక్రం' అనుదానిచే బోధింపఁబడిన చక్రానువర్తనమును 'యస్త్వాత్మరతి రేవ స్యాత్' అను శ్లోకముచేఁ నిషేధించుచుండెను.

గీ॥ నైవ తస్య కృతే నార్థో నాకృతే నేహ కశ్చన ।
న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః ॥ ॥౧౮॥

పదవిభాగము:— న- ఏవ- తస్య- కృతేన- అర్థః- న- అకృతేన- ఇహ- కశ్చన- న- చ- అస్య- సర్వభూతేషు- కః- చిత్- అర్థవ్యపాశ్రయః । ॥౧౮॥

ప్రతిపదార్థము:— తస్య=పరమాత్మరతికల ఆసాంఖ్యునకు; కృతేన=కర్మముచే; అర్థః=ప్రయోజనము; నాస్తి=(ఇట అస్తి అను పద మధ్యాహార్యము) లేదు; ఇహ=ఈలోకమునందు; అకృతేన=విధివిహితకర్మల నాచరించక పోవుటచే కశ్చన=ప్రత్యవాయప్రాప్తి కాని, లేక, ఆత్మహాని కాని; నాస్తి=లేదు; అస్య=ఈజ్ఞానికి; సర్వభూతేషు=బ్రహ్మాదిస్థావరాంత భూతములయందు; కశ్చిత్=ఒకానొకమైనను; అర్థవ్యపాశ్రయః=ప్రయోజన నిమిత్త క్రియాసాధ్యమగు వ్యపాశ్రయము (ఆశ్రయణము); నాస్తి=లేదు. ॥౧౮॥

శాంకరభాష్యమ్:—

కించ— నైవేతి । నైవ తస్య పరమాత్మరతేః కృతేన కర్మణార్థః ప్రయోజన మస్తి । అస్తు తర్హ్యకృతే నాకరణేన ప్రత్యవాయాఖ్యోఽనర్థో నాకృతే నేహ లోకే కశ్చన కశ్చి దపి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మరియు పరమాత్మరతుఁ డగు నట్టి సాంఖ్యునకు కర్మజన్యసుకృతముచే సాధింపఁదగిన యభ్యుదయనిశ్శ్రేయసస్వరూపప్రయోజన మేదియు లేదు. అట్లగుచో కర్మపరిత్యాగమువలనఁ

ఏమానవుఁడు ఆత్మజ్ఞాననిష్ఠుఁడై 'ఆత్మన్యేవ రతిః' ఆత్మయందే రతికలవాఁడై (ఏవ కారమువలన విషయములయందు ప్రీతిలేనివాఁ డని యర్థము) "ఆత్మన్యేవ తృప్తః ఆత్మతృప్తః" ఆత్మయందే తృప్తికలవాఁడై (ఏవ కారమువలన నన్నరసాదిప్రయుక్తతృప్తి నిషేధింపఁబడెను) ఆత్మ న్యేవ చ సంతుష్టః" ఆత్మయందే తుష్టికలవాఁడో (ఏవకారమువలన బాహ్యము అగు శబ్దస్పర్శరూపరసగంధము లనెడి విషయములయందు తుష్టి నిషేధింపఁబడెను.) అనఁగా నిఖిలవిషయములయందును తృష్ణను పరిత్యజించినవాఁడై యగునో, అట్టి మానవునకు కర్తవ్య మేదియు లేదని యర్థము. ॥౧౭॥

పరమార్థప్రపా:—ఓయర్జునా! ఇట్లు బ్రహ్మమతమును నిరూపించి, ఇపు డనుత్పన్నజ్ఞానముకల నిన్నును గూర్చియే యీకర్మోపదేశము చేయఁబడుచుండెను. కాని యాత్మజ్ఞానినిగూర్చి కాదనికూడ "య స్త్వాత్మరతి రేవ" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

ఎవఁ డాప సకలకామములు కలవాఁ డగుటచే ఆత్మయందే తృప్తికలవాఁడో, కనుకనే యాత్మయందే సంతుష్టికలవాఁడో (అనఁగా భోగములయం దపేక్ష లేనివాఁడో) ఆట్టివానికి 'కార్యం' కర్తవ్య మేదియు లేదు.

శ్రీధరీయము:— "న కర్మణా మనారంభాత్" అనునది మొదలుకొని యజ్ఞాన కంతఃకరణశుద్ధినిమిత్తము కర్మయోగమును జెప్పి, జ్ఞానికి కర్మయొక్క యనుపయోగమును 'య స్త్వాత్మరతి రేవ స్యాత్' అనునది మొదలు రెండుశ్లోకములచేఁ జెప్పుచుండెను. ॥౧౭॥

—• ౩వ అధ్యాయము ౧౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఆత్మజ్ఞానికూడ అభ్యుదయార్థము కాని, మోక్షార్థము కాని, ప్రత్యవాయపరిహారార్థము కాని కర్మల నాచరింపవలయు నను నాశంకమీఁదఁ జెప్పుచున్నాఁడు.

శాంకరభాష్యమ్:—

ప్రత్యవాయప్రాప్తిరూప ఆత్మహానిలక్షణో వా నైవాస్తి। న చాస్య సర్వభూతేషు బ్రహ్మాదిస్థావరాన్తేషు భూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః ప్రయోజననిమిత్తక్రియాసాధ్యో వ్యపాశ్రయో వ్యపాశ్రయణమ్ । కించి ద్భూతవిశేష మాశ్రిత్య న సాధ్యః కశ్చిదర్థోఽస్తి । యేన తదర్థా క్రియానుష్ఠేయా స్యాత్ । న త్వ మేతస్మి న్సర్వత స్సంప్లుతోదకస్థానీయే సమ్యగ్దర్శనే వర్తసే ॥ ॥౧౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ప్రత్యవాయము ప్రాప్తించదా యని శంకింపజనదు. అట్టి సాంఖ్యున కీలోకమున విహితకర్మల నాచరింపక పోయినందున ప్రత్యవాయప్రాప్తి కాని, ఆత్మహాని కాని సంభవించదు. ఇట్టి స్థితప్రజ్ఞునకు బ్రహ్మాదిస్థావరాన్తభూతములయందు ప్రయోజననిమిత్తక్రియాసాధ్యమగు నేసమాశ్రయణము లేదు. ఏదో యొక భూతవిశేషము నాశ్రయించి సాధింపదగిన ప్రయోజన మేదియు ఆత్మరతుఁడగు సాంఖ్యునకు లేదు. ఏకారణముచే ప్రయోజననిమిత్తమగు క్రియ ననుష్ఠింపఁవలసి వచ్చునో, అట్టి ప్రయోజనమే జ్ఞాననిష్ఠునకు లేనందున నితరసమాశ్రయణ మతనికి లేదని భావము. అట్లగుచో నేనుగూడ తత్త్వజ్ఞానము నాశ్రయించి కర్మలను వదలెద ననెదవా? నీవీ సర్వత స్సంప్లుతోదకస్థానీయ మగు సమ్యగ్దర్శనమునందు లేవు. (కాన కర్మయోగమునందే యధికారి వని భావము.) ॥౧౮॥

ఆత్మరతుఁడగు పురుషుఁడు స్వర్గాదిరూపమగు నభ్యుదయమును కోరనందున నతనికి కర్మచే నభ్యుదయరూపమగు ప్రయోజనము సంభవింపదు. (అనఁగా నభ్యుదయనిమిత్త మాత్మరతుఁడు కర్మ నాచరింపనవసరము లేదనుట) మోక్షము కర్మసాధ్యము కానందున మోక్షమునుద్దేశించియు కర్మము నాచరింపనవసరము లేదు. ఈ విషయమునే "పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయా న్నాస్త్యకృతః కృతేన" (బ్రాహ్మణుడు కర్మచే సంపాదిత మగు లోకము అనిత్యము అని తెలిసికొని వైరాగ్యమును పొందవలెను. నిత్య మగు మోక్షము కర్మచే ప్రాప్తించదు.) అను శ్రుతియు బోధించుచున్నది. మూలస్థమగు 'నైవ' అనుచోటనున్న 'ఏవ' అను పదమువలన మోక్షము జ్ఞానసాధ్యముకూడ కాదని సూచింపబడెను. మోక్ష మాత్మస్వరూపమే. అది నిత్యప్రాప్తమే యగును. అట్టి నిత్యప్రాప్త మగు నాత్మయొక్క యజ్ఞాన మప్రాప్త మనబడును. అట్టి యజ్ఞానము తత్త్వజ్ఞానమువలన నివర్తింపజేయదగును. అజ్ఞానము తత్త్వజ్ఞానమువలననివర్తింప తత్త్వజ్ఞానికి కర్మవలనగాని, జ్ఞానమువలనఁగాని సాధింపదగిన యేప్రయోజనము లేదు. (కాన మోక్షము కర్మవలనగాని, జ్ఞానమువలనగాని సాధింపదగినది కాదని తెలిసికొనదగు). "ఇట్టి యాత్మవేత్త చేకూడ ప్రత్యవాయపరిహారార్థము కర్మ అవశ్య మాచరింపదగినదే" యను శంకనుదొలగించుటకు 'నాకృతేనేహ కశ్చన' అని మూలమునందు జెప్పఁబడెను. 'అకృతేన' అనుచోట భావార్థమునందు నిష్ఠాప్రత్యయము చెప్పబడెను. నిత్యాకరణమువలన నాత్మజ్ఞాని కీలోకమునందు గర్హితత్వముగాని, ప్రత్యవాయముగాని ప్రాప్తించదు. ఈశ్లోకోత్తరార్థముచే సర్వత్ర యుపపత్తిని చెప్పుచుండెను. "నచాస్య" అనుచోటనుండు 'చ' అనుశబ్దము హేత్వర్థమునందు ప్రయుక్తము; ఏకారణమువలన నాత్మజ్ఞానికి బ్రహ్మాదిస్తంబపర్యంతమగు భూతములయందే ప్రయోజనసంబంధము లేదో (అనగా నేభూతవిశేషము

వాశ్రయించి క్రియాసాధ్యమగు నేప్రయోజనము లేదో) అందువలన నీయాత్మజ్ఞానికి కృతాకృతములు నిష్ప్రయోజనములు. ఈవిషయమునే "నైనం కృతాకృతే తపతః" ఈబ్రహ్మవేత్తను నిత్యకర్మాచరణము కాని, నిత్యకర్మాకరణము కాని తపింపజేయవు) అనుశ్రుతియు బోధించుచున్నది. మఱియు "తస్య హ న దేవాశ్చ నాభూత్యా ఈశత ఆత్మా హ్యేషాం స భవతి" అనుశ్రుతివలన దేవతలుకూడ మోక్షము కలుగకుండ జేయుటకు సమర్థులు కారని జెప్పుటవలన విఘ్నములు దొలగుటకు దేవారాధనకర్మ మాచరింపవలయునను శంకయు తొలగించబడెను.

ఇట్టి బ్రహ్మవేత్తను భూమికాసప్తకభేదముచే వసిష్ఠమహర్షి నిరూపించెను. అది యెట్లనిన? జ్ఞానభూమిక—శుభేచ్ఛ యనియు, విచారణ యనియు, తనుమానస యనియు, సత్త్వాపత్తి యనియు, అసంసక్తి యనియు, పదార్థభావని యనియు, తుర్యగ యనియు నేడువిధములు. అందు నిత్యానిత్యవస్తువివేకాదిపురస్సరముగ ఫలపర్యవసాయి యగు మోక్షేచ్ఛ—శుభేచ్ఛ యనంబడును. అట్టి మోక్షేచ్ఛచే గురువును విధివిధానముగ సమీపించి, శ్రవణమునను సాత్త్వికమగు వేదాంతవాక్యవిచారము—విచారణ యనెడి రెండవభూమిక యనంబడును. అనంతరమున నిదిధ్యాసనాభ్యాసముచే మనస్సునకేకాగ్రతచే సూక్ష్మవస్తుగ్రహణయోగ్యత్వము—తనుమానస యనెడి మూడవభూమిక యనబడును. ఈమూడుభూమికలు సాధనరూపములు. జాగ్రత్తునందీ జగత్తు భిన్నముగ భాసించుటవలన ఈభూమికాత్రితయమును యోగులు జాగ్రదవస్థ యందురు. ఈవిషయమునే "భూమికాత్రితయం త్వేతద్ రామ! జాగ్రదితి స్థితమ్। యథావద్భేదబుద్ధ్యేదం జగజ్జాగ్రతి దృశ్యతే" (ఓశ్రీరామ! యెట్లు భేదముచే నీజగత్తు జాగ్రదవస్థయందు చూడబడుచుండెనో, అటులే శుభేచ్ఛ, విచారణ, తనుమానస మనెడి యీభూమికాత్రితయము భేదబుద్ధిచేఁ జూడబడుటవలన (జాగ్రత్తని చెప్పబడును.) అని వశిష్ఠమహర్షి శ్రీరాముని గూర్చి చెప్పెను. అట్టి భూమికాత్రితయారూఢుడైనవానికి వేదాంతవాక్యమువలన గలిగెడి నిర్వికల్పకబ్రహ్మాత్మైక్యసాక్షాత్కారము సత్త్వాపత్తి యనెడి నాల్గవభూమిక యనంబడును. ఇదియే ఫలరూపము. సర్వజగత్తు మిథ్యగ భాసించుటవలన దీని నీయోగులు స్వప్నావస్థ యందురు. ఈవిషయమే "అద్వైతే స్థైర్యమాయాతే ద్వైతే ప్రశమమాగతే। పశ్యంతి స్వప్నవల్లోకం చతుర్థీం భూమికామితాః" (అద్వైతము స్థిరమైయుండ, ద్వైతము ప్రశమమును పొందియుండ చతుర్థభూమికను పొందినవారై లోకమును స్వప్నమువలె చూచెద)రని వాసిష్ఠమునందు జెప్పబడెను. ఈనాల్గవభూమికను బొందినయోగి బ్రహ్మవిత్తనబడును. అయిదు, ఆరు, యేడు భూమికలు జీవన్ముక్తి యొక్క యవాంతరభేదములు. అందు సవికల్పకసమాధ్యభ్యాసముచే మనోనిరోధమును గావించినపిదప కలిగెడి నిర్వికల్పకసమాధ్యవస్థయే 'అసంసక్తి' యను నైదవభూమిక. సుషుప్తినుండి పురుషుడు స్వయముగ లేచునటుల నట్టి నిర్వికల్పకసమాధ్యవస్థనుండి స్వయముగ లేచుటచే నీయసంసక్తి యను నయిదవభూమిక యోగులచే సుషుప్తి యనియు జెప్పబడును. ఈపంచమభూమిక నధిష్ఠించినయోగి "బ్రహ్మవిద్వరుఁడు" అని చెప్పఁబడును. ఇట్టి నిర్వికల్పకసమాధ్యభ్యాసపరిపాకముచే చిరకాలస్థాయినియగు నవస్థ "పదార్థభావని" యనెడి యారవభూమిక యని చెప్పబడును. గాఢసుషుప్తినుండి స్వయముగ లేవని పురుషుడు పరప్రయత్నముచే లేచినటుల నట్టి యారవభూమికను పొందినయోగి స్వయముగ నట్టి సమాధ్యవస్థనుండి లేవక పరప్రయత్నముచే లేచుటవలన నీపదార్థభావని యను నారవభూమికను గాఢసుషుప్తి యని యోగులందురు. ఇట్టి యారవభూమికను పొందినయోగి 'బ్రహ్మవిద్వరీయాన్' అని చెప్పబడును. ఈవిషయమే "పంచమీ భూమికామేత్య సుషుప్తిపదనామికామ్। షష్ఠీం గాఢసుషుప్త్యాఖ్యాం క్రమాత్ పతతి భూమికామ్" సుషుప్తిపదమను పేరి యయిదవభూమికను పొంది క్రమముగ గాఢసుషుప్తి యను పేరి యారవభూమికను యోగిప్రవేశించునని వాసిష్ఠమునందు చెప్పబడెను.) ఏసమాధ్యవస్థనుండి స్వయముగ కాని, పరప్రయత్నమువలన కాని సర్వథా భేదజ్ఞానము లేమింజేసి లేవనివాడై, సర్వదా తన్మయుడై స్వప్రయత్నమును విడిచియే పరమేశ్వరప్రేరితప్రాణవాయువశమువలన నన్యులచే నిర్వహింపబడు శరీరవ్యవహారముకల

వాఁడై, పరిపూర్ణపరమానందఘనుఁడై యంతట నుండునో, అట్టి యేడవయవస్థ తురీయావస్థ యనంబడును. అట్టి యేడవయవస్థను పొందిన యోగి "బ్రహ్మవిద్వరిష్ఠుఁడు" అని యనంబడును. ఈవిషయమే "షష్ఠ్యాం భూమ్యామసౌ స్థిత్వా సప్తమీం భూమి మాప్నుయాత్ । కించి దేవైష సంపన్న స్త్వథ వైష న కించన" "విదేహ ముక్తతా తూక్తా సప్తమీ యోగభూమికా । అగమ్యా వచసాం శాంతా సా సీమా యోగభూమిషు" (యోగి యారవభూమికయం దున్నవాఁడై యేడవభూమికను పొందవలయును. ఈయోగి యేదోయొక విషయమును తెలిసికొనిగాని, లేక దేనిని తెలిసికొనకగాని సమస్తభూమికలను పొందవలయు నని పూర్వముతో నన్వయము. ఈ యేడవ దగు యోగభూమిక విదేహముక్తత్వ మనఁబడును. యోగభూములలో నీయేడవభూమిక శాంతమైనది. వాక్కులకు గోచరించనిది.) అని వాసిష్ఠమునందు జెప్పఁబడెను. ఈ సప్తమభూమికావిషయమే శ్రీమద్భాగవతమునందుకూడ "దేహం చ నశ్వర మవస్థిత ముత్థితం వా సిద్ధో న పశ్యతి యతోఽధ్యగమ త్స్వరూపం । దైవా దుపేత మథ దైవవశా దపేతవాసో యథా పరికృతం మదిరామదాంధః" "దేహోఽపి దైవవశగః ఖలు కర్మ యావ త్స్వారంభకం ప్రతిసమీక్షత ఏవ సాసుః । తం స ప్రపంచ మధిరూఢసమాధియోగ స్స్వాప్నం పున ర్న భజతే ప్రతిబుద్ధవస్తుః" (కల్లుత్రాగినవాఁడు దేహమునుండి జారిపోయిన వస్త్రము నెట్లెఱుఁగఁడో, అదేవిధమున నాత్మస్వరూపమును తెలిసికొనిన సిద్ధుఁడు నశ్వరము, అవస్థితము, ఉపస్థితము నగు దైవమువలన పొందఁబడినట్టిదియు, దైవవశమున పోయినట్టిదియు నగు దేహమును గుర్తెరుఁగఁడు. జాగ్రదవస్థను పొందిన పురుషుఁడు స్వాప్నికదేహము నెట్లు సేవించఁడో, అట్లే సిద్ధుఁడు– ప్రారబ్ధకర్మ యెంతవర కుండునో యంతవరకు ప్రాణములతోకూడిన దేహము కూడ దైవవశమును పొందినది; అని తెలిసికొనును. తెలిసికొని ప్రపంచముతోకూడిన యట్టి దేహమును సమాధియోగము నధిష్ఠించిన యోగి సేవించఁడు.) అని చెప్పఁబడెను. మఱియు "తద్యథాఽహి ర్నిర్ల్వయనీ వల్మీకే మృతా ప్రత్యస్తా శయీతైవ మేవేదం శరీరం శేతేఽథాయ మశరీరోఽమృతో ప్రాణో బ్రహ్మైవ తేజ ఏవ" (త్రాచుయొక్క కూసము పుట్టయందు మృతమై పడి యుండునటుల నీయోగియొక్క శరీర ముండును (అనఁగా కూసమునం దెట్టిమమకారము లేకయే సర్ప ముండునో యట్లే సిద్ధుఁడుకూడ దేహమునం దెట్టిమమకారము లేకయే యుండును) అట్టి సిద్ధుఁడు ప్రాణములు కలవాఁడైనను ప్రాణములు లేనివాఁడే; మఱియు శరీర ముండినను దేహమునం దభిమానము లేమింజేసి యశరీరుఁడు, అమృతుఁడు, బ్రహ్మరూపుఁడు, తేజోరూపుఁడు అనియు ననంబడును. (అనగా ముక్తుఁడు). అని శ్రుతియు బోధించుచున్నది. ఈవిషయమును "చతుర్థీభూమికాజ్ఞానం త్రిస స్స్యా త్సాధనం పురా । జీవన్ముక్తే రవస్థాస్తు పరా స్త్రిసః ప్రకీర్తితాః॥" నాల్గవభూమిక జ్ఞానము. అందు పూర్వము నందుగల మూడుభూమికలు సాధనములు; అయిదు, ఆరు, ఏడు భూమికలు జీవన్ముక్తియొక్క యవస్థావిశేషము అని పై సంగ్రహశ్లోకము బోధించుచున్నది. అందు సాధన మగు మొట్టమొదటి భూమికాత్రయము నధిష్ఠించిన యజ్ఞానియే కర్మాధికారి కాడనిన ఇక తత్త్వజ్ఞాని కాని, తత్త్వజ్ఞాని యగు జీవన్ముక్తుఁడు కాని కర్మాధికారి కాఁడని యేమి చెప్పవలయును. ఎంతమాత్రము కర్మాధికారి కానేరఁడు. కనుకనే "నైవ తస్య కృతే నార్థో నాకృతే నేహ కశ్చన" అని శ్రీకృష్ణపరమాత్మ చెప్పియుండెను.

శంకరానందీయము:— బ్రహ్మేంద్రాదు లాయా స్థానములను బొంది యేయే సుఖములను బొందిరో ఆసుఖము కర్మవలన జనించినదే కాన నంతటను సుఖము కర్మసంపాద్య మగుటవలన బ్రహ్మవేత్తయు సుఖార్థి యగుటవలన నట్టి బ్రహ్మవేత్త నిరంతరసుఖసిద్ధికొరకు యత్నించి తత్కర్మ మాచరింపవలయు నని శంకింపఁజనదు. "ఆనందో బ్రహ్మేతి. విజ్ఞాన మానన్దం బ్రహ్మ" అను మొదలగు శ్రుతులచే బ్రహ్మ మానందైకరసస్వరూప మని శ్రూయమాణ మగుటవలన నిరంతరబ్రహ్మనిష్ఠచే బ్రహ్మభావమును పొందినట్టియు, అఖండానందస్వరూపముచే నుండునట్టియు, నిరంతరబ్రహ్మానందరసానుభూతి నిరవచ్ఛిన్న మగుటవలన (ఎల్లపు డుండుటవలన) కర్మవలన జనిం

చెడి సుఖ మనిత్య మగుటవలనను క్రియాజన్యసుఖము నపేక్షించనట్టి బ్రహ్మవేత్తకు కర్మసాధ్య మగు ప్రయోజనము కాని, కర్మసాధ్య మగు ప్రయోజనము లేనిచో ఏదో యొక పురుషార్థము కాని లేదని "నైవ తస్య కృతే నార్థః" అను శ్లోకముచే జెప్పుచుండెను.

"అహ మేవేదం సర్వం" అని సర్వము నద్వితీయ మగు నాత్మస్వరూపముగ చూచునట్టియు, ఆత్మారాముఁడు ఆత్మానందుఁ డగునట్టి సిద్ధుఁ డగు యతికి చేయఁబడిన కర్మచే పొందఁదగిన ప్రయోజన మేదియు లేదు. అట్టి యతి ఆత్మతృప్తుఁ డగుటవలనను, సర్వమును మిథ్యారూపముగఁ దెలిసికొనినవాఁ డగుటవలనను యోగక్రియచే పొందఁదగిన గగనగమనా ద్యణిమాదిసిద్ధి నపేక్షించఁడు. సర్వాత్మభావాపన్నుఁ డగుటవలన తపఃక్రియచే పొందదగిన బ్రహ్మేంద్రాదుల పదమును గూడ నపేక్షింపఁడు. జీవన్ముక్తు డగుటవలన వైదికక్రియలచే పొందఁదగిన చిత్తశుద్ధిద్వారక మగు మోక్షము నపేక్షించఁడు. కాన బ్రహ్మవిత్తమునకు కర్మచే సాధింపఁదగిన దేప్రయోజనము లేదని యర్థము.

"బ్రహ్మవిత్తమునకు కర్మచే పొందఁదగిన యిష్టార్థ మేదియు లేకున్నను విధ్యుల్లంఘనదోషము కాని, విధ్యుక్త నిత్యనైమిత్తికకర్మల నాచరింపనందున ప్రత్యవాయము కాని ప్రాప్తింపఁగలదు. అట్టి ప్రత్యవాయదోషముచే జ్ఞానహాని కాని, స్వరూపహాని కాని ప్రాప్తించు" నను శంకను "నాకృతే నేహ కశ్చన" అను వాక్యముచేఁ దొలఁగించుచుండెను. చెప్పఁబడిన లక్షణములుకల బ్రహ్మవేత్తకు విహితకర్మాననుష్ఠానమువలన బూర్వమునందు చెప్పఁబడిన యేయనర్థము నీలోకమునందు ప్రాప్తించదు. "మాయామాత్ర మిదం ద్వైతం" (ఈద్వైతప్రపంచమంతయు మాయామాత్రము) అను న్యాయమున విధియు నావిద్యక మగుటచే మిథ్య యగుటవలన విద్వాంసునకు విధి నతిక్రమించుటవలన దోషము ప్రాప్తించదు. 'ఉభే హ్యేవైష ఏతే ఆత్మానంస్ స్పృణుతే' (ఈవిద్వాంసుడు విహితకర్మాననుష్ఠానము, నిషిద్ధాచరణము, అను రెంటిని ఆత్మస్వరూపముగ తెలిసికొనును) అను శ్రుతిచే విహితకర్మా నాచరణమునుకూడ బ్రహ్మస్వరూపముగ దెలిసికొనుటచే విహితకర్మాననుష్ఠానమభావరూప మగుటవలన స్వతః సత్యము లేమింజేసి యభావరూప మగు విహితకర్మాననుష్ఠానముకూడ దోషముకొలుపు సమర్థము కాదు. నిరంతరబ్రహ్మనిష్ఠచే నుండు విద్వాంసునకు విహితకర్మాననుష్ఠానముచే జ్ఞానహానియు సంభవింపదు. "ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య" అను శ్రుతిచే బ్రహ్మవిత్తునకు కర్మాకర్మలచే వృద్ధిక్షయాభావములు శ్రుతిప్రమాణము లగుటవలన బ్రహ్మవేత్త కకర్మముచే స్వరూపహానియు సంభవింపదు. కాన విహితకర్మాననుష్ఠానముచే బ్రహ్మవేత్త కేయనర్థము ప్రాప్తించ దని యీశ్లోకద్వితీయపాదార్థము.

"విద్వాంసుఁడు ముక్తిప్రతిబంధకనివృత్తినిమిత్తము కాని లేక ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతికక్లేశదరిద్రనివృత్త్యర్థము కాని యుపాసనాక్రియచే శివునిగాని, విష్ణువుని కాని, మఱియొక దైవమును కాని యాశ్రయింపవలయును. లేక శరీరయాత్రార్థమైన బ్రాహ్మణుని కాని, క్షత్రియుని కాని విద్వాంసుఁ డాశ్రయింపవలయును. అందువలన విద్వాంసునకు సర్వదా కర్మత్యాగము సంభవింప" దను శంకను తొలఁగించుటకు "న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః" అను నుత్తరార్ధమును జెప్పెను. పూర్వమునందు చెప్పఁబడిన లక్షణములుకల బ్రహ్మవిత్తమునకు దేవతలలో శివుఁడు కాని, విష్ణువు కాని, మఱియొక దేవత కాని, సర్వభూతములయందు బ్రాహ్మణుఁడు కాని, క్షత్రియుండును కాని, మఱియొకఁడు కాని యెవఁడును నే కార్యము నైన నుద్దేశించి క్రియచే నాశ్రయింపఁదగినవాఁడు లేఁడు 'ఇహైవ తైర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః' అను వచనమువలన నీశరీరమునందే నిత్యనిరంతర బ్రహ్మనిష్ఠచే- రాఁబోవు శరీరము నుత్పాదించు నజ్ఞానమును, తత్కార్య మగు సంచితాదిసర్వకార్యజాతమును నశింపజేసికొని స్వయముగ శరీరసంబంధరహితుఁడై యుండుటచే నిచటనే ముక్తుఁడైన బ్రహ్మవేత్తకు ముక్తిప్రతిబంధకము సంభవింపనందునను, శివవిష్ణ్వాదులు మిథ్యారూపము లగుటవలనను బ్రహ్మవేత్తకు వారి నారాధింపనవసరము

లేదు. ఆధ్యాత్మికాద్యుపద్రవము, శరీరపరిత్రాణము ప్రారబ్ధకర్మాధీన మగుటవలన పురుషప్రయత్న మందువిషయమై వ్యర్థ మగుటచే బ్రాహ్మణుఁడు కాని, క్షత్రియుఁడు కాని శరీరపరిత్రాణమునిమిత్తమై బ్రహ్మవేత్తచే నాశ్రయింపఁ దగినవారు కారు. కాన ముక్తుఁ డగు బ్రహ్మవిద్వర్యున కెచ్చటను నేకర్మయును చేయుదగినది లేదు. ఏకర్మము నైన ననుష్ఠించినచో నతఁడు బ్రహ్మవేత్త కానేరఁడు. ఈవిషయమునే "జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః । నైవాస్తి కించిత్కర్తవ్య మస్తి చేన్న స తత్త్వవిత్॥" (జ్ఞానామృతముచే తృప్తుఁడును, కృతకృత్యుఁడు నగు యోగి కేదియు చేయఁదగినది లేదు. ఏదైన నొక కార్యము చేయఁదగిన దున్నచో నతఁడు జ్ఞాని కానేరఁడు) అని స్మృతియుఁ జెప్పుచున్నది. కాన జ్ఞానామృతతృప్తుఁ డగు బ్రహ్మవిద్వరేణ్యున కెచ్చటను నెందులకు నాశ్రయింపఁదగినది లేనందున నేకర్మము చేయఁదగినది లేదని యాశయము (ఈ చెప్పుటవలన జ్ఞానికూడ కర్మ నాచరింపవలయు నను తిలక్మహాశయుల మతము నిరస్తము.)

భాష్యోత్కర్షదీపిక:— "తస్య కార్యం న విద్యతే" అను పూర్వశ్లోక చతుర్థపాదము నీ శ్లోకముచే వివరించుచుండెను. స్వర్గము తుచ్ఛరూపముగ తెలియఁబడిన దగుటచే స్వర్గార్థ మాచరింపఁబడిన కర్మచే నాత్మరతున కేమియు ప్రయోజనములేదు. జ్ఞాన మిదివరకే కలిగియుండుటచే జ్ఞానార్థ మాచరింపఁబడిన కర్మముచే నాత్మరతున కేమియు ప్రయోజనములేదు. 'నాస్త్యకృతః కృతేన' (కర్మముచే నిత్యమగు మోక్షము ప్రాప్తించదు) అని శ్రుతి బోధించుటవలన మోక్షార్థ మాచరింపఁబడిన కర్మచే నాత్మరతున కేమియు ప్రయోజనములేదు. కర్మలను చేయు నాత్మరతున కేమియు ప్రయోజనములేకున్నను, విహితకర్మల నాచరింపకపోవుటచేఁ బ్రత్యవాయము ప్రాప్తించు నను శంకను "నాకృతేనేహ కశ్చన" అను వాక్యముచేఁ దొలఁగించుచుండెను. ఆత్మరతుఁడు నిత్యకర్మలయం దనధికృతుఁడు గాన నతనికి నిత్యకర్మల నాచరింపకపోవుటవలన ప్రత్యవాయప్రాప్తిస్వరూప మగు స్వహాని యీలోకమున ప్రాప్తించదు. మఱియు నిత్యాకరణ మభావరూపము. అభావమువలన భావరూపకార్యము జనించదు. భావమువలననే భావరూపకార్యము జనించును. ప్రకృతమున భావరూపప్రత్యవాయజనకము, భావరూపము నగునది విహితకర్మలకంటె భిన్నమగు నిషిద్ధకర్మ మగును. అట్టి నిషిద్ధకర్మమునం దాత్మరతుఁడు ప్రవృత్తుఁడు కాఁడు. కాన నతని కీలోకమునందు ప్రత్యవాయము జనించదు. ఆత్మరతునకు దేనివలనను కొంచమైన సాధింపఁదగిన దేదియు లేదని యుత్తరార్థముచే జెప్పుచుండెను. ఈ యాత్మరతునకు బ్రహ్మాదిస్తంబపర్యంతమగు సర్వభూతములయం దెవఁడును ప్రయోజననిమిత్తము సేవింపదగినవాడు లేడు.

ఈశ్లోకమున 'భూమికారూఢస్య' అనునట్టి శబ్దము లేనందున నప్రాసంగికమగు వసిష్ఠోక్తభూమికాప్రదర్శనము కొందరిచే (మధుసూదనసరస్వతిచే) జేయఁబడెనని తెలిసికొననగును.

స్వాభిప్రాయము:-ఈశ్లోకమున 'భూమికారూఢస్య' ఇత్యాదిశబ్దములు లేనందున మధుసూదనసరస్వతులకు వసిష్ఠోక్తభూమికాప్రదర్శన మప్రసక్తమని భాష్యోత్కర్షదీపికాకారులు వ్రాసియుండిరి. ఈవిషయము నొకింత విచారింతము. మూలమున 'భూమికారూఢస్య' ఇత్యాదిశబ్దములు లేమింజేసి వసిష్ఠోక్తభూమికాప్రదర్శన మప్రసక్తమా? లేక ప్రకృతమునకు సంబంధించదు కాన భూమికాప్రదర్శన మప్రసక్తమా? 'భూమికారూఢస్య' ఇత్యాదిశబ్దములు లేనందున భూమికాప్రదర్శన మప్రసక్త మందురా? తద్వాచకశబ్దములు మూలమునందు లేకున్నను ప్రకృతమునకు సంబంధించు విషయము లెన్నిటిని వ్యాఖ్యాతలు ప్రదర్శించుట లేదు? వారు వీ రన నేల? శ్రీమద్భాష్యకారులు మూలమున లేని యెన్నివిషయములను ప్రసక్తిని కల్పించి విమర్శించుటలేదు. బృహదారణ్యకషష్ఠాధ్యాయమునందలి "కిం జ్యోతిరేవాయం పురుషః" అనునది మొదలు ఆయధ్యాయపరిసమాప్తివరకుపనిషత్తునం దెచ్చటైన శరీర మాత్మయని కాని, క్షణికవిజ్ఞాన మాత్మయని కాని, బోధించు పదము కలదా?

అట్టి పదములు లేకున్నను శరీరేంద్రియాదులకంటె భిన్నుఁడాత్మయని నిరూపించుటకు చార్వాకబౌద్ధమతములను ప్రసక్తి కల్పించి విమర్శించలేదా? కాన తద్వాచకపద మున్నపుడే యావిషయమును ప్రదర్శింపవలయును కాని, తద్వాచకపదము లేనపుడా విషయమును ప్రదర్శింపరాదను నియమము సమంజసము కాదు. మఱి మధుసూదనసరస్వతుల భూమికాప్రదర్శనము ప్రకృతమునకు సంబంధించదనెదవా? ఇట ప్రకృతమేది? ఆత్మరతునకు కర్మాసంభవము కదా, అట్లగుటచే భూమికాప్రదర్శన మెందులకనెదవా? మొదటిభూమికాత్రియారూఢునకే కర్మసంభవింపనితఱి చతుర్థపంచమషష్ఠసప్తమభూమికారూఢులగు నాత్మరతులకు నెంతమాత్రము కర్మ సంభవింపదని చెప్పుటకే యిచట వాసిష్ఠోక్తభూమికాప్రదర్శన మని చెప్పుటయందేమి యప్రసక్తి కలదు. మధుసూదనసరస్వతులీవిషయమునే సప్తభూమికలను ప్రదర్శించి, యంతిమభాగమున ప్రాథమికభూమికాత్రియారూఢులకే కర్మయం దధికారము లేనితఱి నుత్తరభూమికారూఢులకు కర్మ యెంతమాత్రము సంభవము కాదని కైముతికన్యాయము నెఱపియుండిరి. ఇట్లుభూమికాప్రదర్శనము ప్రకృతమునకుసంబంధించియుండ ‘భూమికారూఢస్య’ ఇత్యాదిశబ్దములు మూలమున లేవుగాన మధుసూదనసరస్వతుల భూమికాప్రదర్శన మప్రసక్తమని భాష్యోత్కర్షదీపికాకారులు వ్రాయుటవారికి తెలియకగాదు. మఱేమనిన—అద్వైతసిద్ధ్యాదిప్రసిద్ధానేకగ్రంథనిర్మాతలగు మధుసూదనసరస్వతులను నిందించినగాని తనగొప్పతనము బయల్పడ దనియే యాశయము. అట్లు కానిచో ప్రతిగీతావాక్యవివరణమందును నేదో యొక విషయమును లేవదీసి మధుసూదనసరస్వతుల నెత్తిపొడుచుటయందే ప్రాయశః వీరిదృష్టి ప్రాకుచున్నది. విచారించిన నేగ్రంథకర్తకైన నేదో యొక చోటనో, రెండుమూడు స్థలములయందో పొరపాటుండును గాని ప్రతిస్థలమునందు పొరపాటుండునా? అందు మధుసూదనసరస్వతులవంటి సిద్ధపురుషులకు పొరపాటుండునా? ఉండదు. మహానుభావులవాక్కులను “వాచమర్థోऽనుధావతి” అను న్యాయమున నర్థమే యనుసరించును. కాన భాష్యోత్కర్షదీపికాకారుల యసూయయే యిటఁ బ్రదర్శింపబడె నని మా యాశయము.

పరమార్థప్రభ:— “తస్య కార్యం న విద్యతే” ఆత్మరతున కేదియు చేయఁదగినది లేదని పూర్వశ్లోకమున జెప్పఁబడెను. అందీశ్లోకముచే హేతువును జెప్పుచుండెను. ఆత్మనిష్ఠుడు నిరహంకారుఁ డగుటచే విధినిషేధాతీతుఁ డగుటవలన నతనికి కృతమగు కర్మచే పుణ్యవిశేషమూ లేదు. విహితకర్మాననుష్ఠానముచే ప్రత్యవాయమూ ప్రాప్తించదు. ఈవిషయమునే “తదేతదృచాభ్యుక్తమేష నిత్యో మహిమా బ్రాహ్మణస్య న కర్మణా వర్ధతే నో కనీయాన్। తస్యైవ స్యాత్పదవిత్తం విదిత్వా న కర్మణా లిప్యతే పాపకేన” అను ఋగ్వేదము నిరూపించెను. (అనఁగా బ్రహ్మజ్ఞానియగు పురుషునకదిశాశ్వతమగు సామర్థ్యము. ఆసామర్థ్య మెట్టిదనిన? ఆత్మజ్ఞాని కృతమగు కర్మచే నుత్కృష్టుడును గాడు. విహితకర్మాననుష్ఠానముచే నికృష్టుఁడును గాడు. ఇట్టి వానికి ‘పదవిత్’ ఆత్మధ్యానముసంభవించును. ఈవిధమున పరమాత్మను తెలిసికొనినవాడు పుణ్యకర్మముచేతను లేపమునుపొందడు. పాపకర్మచేతనూ లేపమును పొందఁడు. అని పైశ్రుతి బోధించుచున్నది.) మఱియు నీవిషయమునే “హృదా తష్టేషు జలేషు బ్రాహ్మణాః స్సంయజంతే సఖాయః। అత్రాహ త్వం విజహుర్వేద్యాభిరోహ బ్రాహ్మణా విచరంత్యుత్వే। ఇమే యే నార్వాఙ్ న పరశ్చరంతి న బ్రాహ్మణాసో న సుతేకరాసః। త ఏతే వాచమభిపద్య పాపయా సిరీస్తంత్రం తన్వతే అప్రజజ్ఞః” హృదా—బుద్ధిరూపమగు మనస్సుచే, మనసః—మనస్సుయొక్క, జవేషు— వేగములు, తష్టేషు— నిరాకృతములైయుండ, యత్— ఏకారణమువలన, బ్రాహ్మణాః—బ్రహ్మజ్ఞానులగు బ్రాహ్మణులు, సఖాయః— సర్వభూతానువృత్తములై, సంయజంతే— లెస్సగ నంతర్యాగమును చేయుచుండిరో, అట్టి యంతర్యాగమును చేయుచుండ నేమి ప్రాప్తించునను శంకను తొలగించుటకు ముందువాక్యము బయలువెడలెను. “అత్రాహ త్వం” అను “అత్ర—చోట అహం త్వం” అని పదవిభాగము చేయవలెను.

'అహం త్వం' అను స్థలమున 'హ' అనువర్ణమున శ్రుతియం దనుస్వారలోపము ఛాందసము. అత్ర- ఈయంత ర్యాగమునందు, అహంత్వం- భేదభావనను, విజహుః- విడచిరి. (ఎట్టివారై విడచిరి?) వేద్యాభిః- విద్యాభిజ్ఞాన వృత్తులచే (నంతట), ఓహ- ఊహింపదగిన బ్రహ్మముకలవారై (అనగా బ్రహ్మమును తెలిసికొనినవారై), బ్రాహ్మణాః- బ్రాహ్మణులు, విచరంతి- అఖండైకస్వరూపముగ వ్యవహరించుచుండిరి. ఈవిషయమే "స్వాధిష్ఠానగతే కుండే చిద్రూపం వహ్ని ముజ్జ్వలేత్ । జుహుయా త్ప్రీహితే నాత్ర త్వ మహం తాం నివేదయేత్ ॥ ఆత్మ నాత్మాన మద్వైతే భూత్వా సచ్చిత్సుఖాత్మకః । స్థీయతే యత్క్రియా త్కాలం సోంతర్యాగ స్స్మృతో బుధైః" స్వాధిష్ఠానగతమగు కుండమునందు చిద్రూపమనెడి వహ్నిని ప్రజ్వలింపజేయవలెను. అట్టి చిద్రూపాగ్నియందు ప్రణవముచే హోమము చేయవలెను. హోమద్రవ్యమేదనిన? త్వమహంతయే. అట్టి త్వమహంతను అర్పించి ఆత్మచే నాత్మ నద్వైతమునం దర్పించవలెను. ఇట్టి విధమున సచ్చిదానందాత్మకుఁడై యెంతకాలముండునో యది యంతర్యాగ మనంబడునని యోగమునందు చెప్పబడెను. (ప్రకృతమును వరించి మిగిలినఋక్కునకర్థమువర్ణితము.) యే- పూర్వమునందు చెప్పబడినలక్షణములుకల, ఇమే- ఈజ్ఞానులు, అర్వాఙ్ - మనుష్యలోకమునందు, నచరంతి- సంచరించరు. నపరః- (పరః అనునది సకారాంతావ్యయము) పరస్మిన్దేవలోకేపి- దేవలోకమునందును, నచరంతి- జనింపరు. (అనగా పుణ్యపాపములచే నుత్తమాధమలోకములను పొందరు. మరేమనిన? ఇచటనే బ్రహ్మీభూతులై యుండెద రని భావము). ఈవిషయమునే "న తస్య ప్రాణా ఉత్క్రామంత్యత్రైవ సమవలీయంతే" అను శ్రుతియు బోధించుచున్నది. బ్రాహ్మణాసః- జన్మమాత్రముచే విప్రులును, సుతేకరాసః- సుతం సోమ మభిసృతం కుర్వంతీతి సుతేకరాస్త ఏవ సుతేకరాసో యాజ్ఞికాః- యాజ్ఞికులు (యాజకులు)న్ను, న- అట్లుకాదు. అనఁగా జన్మమాత్రముచే బ్రాహ్మణున్ను, యాజకులున్ను ఉత్తమమధ్యమాధమగతులను తప్పక పొందెదరని యాశయము. జన్మమాత్రముచే బ్రాహ్మణపదవాచ్యులు యాజకులున్ను ఉత్తమమధ్యమాధమగతులను పొందుటయందు హేతువును ముందువాక్యముచే ఋక్కు బోధించుచుండెను. తే- అట్టి, ఏతే- జన్మమాత్రముచే బ్రాహ్మణులును, యాజ్ఞికులును, వాచం- ఫలప్రతిపాదకమగు వేదవాక్కును, అభిపద్య- తెలిసికొని, సిరీః- (సీరిణఇవ) కృషీవలులవలెనయి, పాపయా- పాపరూపమగు ఫలాశచే, తంత్రం- యజ్ఞాదికమును, తన్వతే- విస్తరింపజేయుచుండిరి. కనుకనే అప్రజజ్ఞయః- నికృష్టజన్మముకలవారు. అని ఋగ్వేదమునందున్న పైఋక్కుల రెండింటికి రావణభాష్యమునందు స్పష్టముగనర్థము వర్ణింపబడెను. ఇఁక ప్రకృతము ననుసరింతము. భగవత్కృపాపాత్రుఁడగు నిట్టి జ్ఞాని సిద్ధుఁడు, ఆత్మరతుఁడు, బ్రహ్మనిష్ఠుఁడు నగువానికి బ్రహ్మాదిస్థావరాంతభూతములయం దేప్రయోజన మాశ్రయింపదగినదియు లేదు. విఘ్నోపశాంతినిమిత్తము గాని యాశ్రయింపదగిన దేదియు లేదు. "తస్యహ దేవాశ్చ నాభూత్యా ఈశతే ఆత్మా హ్యేషాం స భవతి" అను శ్రుతిచే నట్టి బ్రహ్మజ్ఞానికి దేవతలుకూడ న్యూనత్వముకొలుపుటకు సమర్థులు కారు. ఎందువలననిన: ఇట్టిబ్రహ్మవేత్త ఇంద్రాదిదేవతలకుకూడ నంతర్యామి యగుటంజేసి ప్రయోజకుఁ డగును. అట్టి యంతర్యామి యగు ప్రయోజకుని వదలి యింద్రాదిదేవతలుకూడ విఘ్నముల నాచరించుటకు సమర్థులు గారు. అట్టి బ్రహ్మవేత్త తన కార్యమునకు విఘ్నమును కలుగఁజేయుటకు దేవతలను ప్రేరేపించఁడుగదా! అంతర్యామి ప్రేరణ లేనిదే దేవతలు స్వతంత్రముగ విఘ్నములందు ప్రవృత్తికలవారు గానేర రని యాశయము.

శ్రీధరీయము:— "ఈబ్రహ్మవేత్త నిరహంకారుఁ డగుటచే విధినిషేధాతీతుఁడు. కాన కృతమగు పుణ్యకర్మచే నితనికి పుణ్యము లేదు. విహితకర్మాననుష్ఠానమువలన పాపమున్ను లేదు. అయినను "తస్మాత్తదేషాం దేవానాం న ప్రియం యదేత న్మనుష్యా విదుః" ఈయాత్మజ్ఞానులు కర్మలను పరిత్యజించుటచే నీయాత్మజ్ఞానము దేవతల కిష్టము కాదు. అందువలన జ్ఞానికి దేవతలు విఘ్నము నాచరించెద రని శ్రుతి బోధించుచున్నది. కాన విఘ్న

గీ॥ తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర ।
అసక్తో హ్యాచర న్కర్మ పర మాప్నోతి పూరుషః ॥ ॥౧౯॥

పదవిభాగము:— తస్మాత్- అసక్తః- సతతం- కార్యం- కర్మ- సమాచర- అసక్తః- హి- ఆచరన్- కర్మ- పరం- ఆప్నోతి- పూరుషః । ॥౧౯॥

ప్రతిపదార్థము:— తస్మాత్=అకారణమువలన; హే అర్జున!=(ఈపద మధ్యాహార్యము) ఓయర్జునుఁడా!; త్వం=(ఈపద మధ్యాహార్యము) నీవు; అసక్తః=(ఫలమునం దిచ్ఛలేనివాఁడవై) సంగవర్జితుఁడవై; సతతం=ఎల్లపుడు; కార్యం=కర్తవ్య మగు నిత్యనైమిత్తికములైన; కర్మ=(ఇది జాతియం దేకవచనము) కర్మలను; సమాచర=లెస్సగ చేయుము; హి=ఏకారణమువలన అసక్తః=(యీశ్వరార్థము) ఫలమును కోరక; కర్మ=కర్మలను; ఆచరన్=చేయునట్టి; పూరుషః=పురుషుఁడు; పరం=మోక్షమును; ఆప్నోతి=పొందుచున్నాఁడో! ॥౧౯॥

శాంకరభాష్యమ్:—

యత ఏవం—తస్మా దితి । తస్మా దసక్త స్సంగవర్జిత స్సతతం సర్వదా కార్యం కర్తవ్యం నిత్యం కర్మ సమాచర న్నిర్వర్తయ । అసక్తో హి యస్మా త్సమాచార న్నీశ్వరార్థం కర్మ కుర్వ న్పరం మోక్ష మాప్నోతి పురుష స్సత్త్వశుద్ధిద్వారేణే త్యర్థః ॥ ॥౧౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సమ్యగ్జ్ఞాననిష్ఠ లేనిచో కర్మానుష్ఠానమావశ్యకము. ఫలాభిసంధిరహితుఁడై యీశ్వరార్పణముగ కర్మల నాచరించు పురుషుఁడు సత్త్వశుద్ధిద్వారమున మోక్షమును పొందును. కాన నీవుకూడ జ్ఞానరహితుఁడ వగుటవలన ఫలాభిసంధిరహితుఁడవై యెల్లపుడు కర్తవ్యము లగు నిత్యనైమిత్తికకర్మముల నాచరించుము. (అట్లాచరించినచో నీవుకూడ సత్త్వశుద్ధిద్వారమున శ్రవణాదుల నొనర్చి జ్ఞాననిష్ఠుఁడవై ముక్తుఁడ వగుదు వని భావము.) ॥౧౯॥

నిరాసార్థము కర్మలచే దేవతలు సంసేవ్యు" అని శంకింపవలదు. అని యుత్తరార్థమునందు జెప్పుచుండెను. బ్రహ్మాది స్తంబపర్యంత మగు భూతములయం దీయాత్మజ్ఞానికి మోక్షవిషయమై యాశ్రయింపదగిన దేదియు లేదు. ఏమనిన– "తస్యహ న దేవాశ్చ నాభూత్యా ఈశతే ఆత్మా హ్యేషాం స భవతి" అను శ్రుతి ఈబ్రహ్మవేత్తకు దేవతలుకూడ మోక్షవిషయమై విఘ్నము నాచరింపజాల రని బోధించుచున్నది. పై నుదహరించిన "య దేత ద్బ్రహ్మ మనుష్యా విదు స్త ద్దేనానాం న ప్రియం" అను శ్రుతి బ్రహ్మజ్ఞానముకలవారు క్రతువుల నాచరించరు. కాన బ్రహ్మజ్ఞానము దేవతల కిష్టము గాదని బోధించుటచే దేవతలు బ్రహ్మజ్ఞానము కలుగకుండగనే విఘ్నముల జేసెదరు గాని, బ్రహ్మజ్ఞానికి విఘ్నముల నాచరించనేరరు. కాన బ్రహ్మవేత్తకు మోక్షవిషయమై యేదియు నాశ్రయింపదగినది లేదని యాశయము. ॥౧౮॥

—♦ ౩వ అధ్యాయము- ౧౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— ఎవఁ డాత్మరతుఁడో, బ్రహ్మభూతుఁడో అట్టివానికి కర్మల నాచరింపవలసిన దేదియు లేదు. నీవైతే యిట్టి జ్ఞానివి గావు. మరే మనిన– ధర్మమునం దధికృతుఁడవు, ముముక్షువవు; కాన నీవు ఫలకామనారహితుఁడవై యెల్లపు డవశ్యకర్తవ్యములు, యాజ్ఞికశ్రుతిచోదితములు "త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన" అను శ్రుతిచే జ్ఞానమునందు విని

గీ॥ కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః ।
లోకసంగ్రహ మేవాపి సంపశ్య న్కర్తు మర్హసి ॥ ॥౨౦॥

పదవిభాగము:— కర్మణా-ఏవ-హి-సంసిద్ధిం-ఆస్థితాః-జనకాదయః-, లోకసంగ్రహం-ఏవ-అపి-సంపశ్యన్-కర్తుం-అర్హసి ॥ ॥౨౦॥

ప్రతిపదార్థము:— జనకాదయః=జనకాదులు; హి=ఏకారణమువలన; కర్మణైవ=కర్మముచేతనే; సంసిద్ధిం=సిద్ధిని; ఆస్థితాః=పొందిరో; హే అర్జున!=(ఈపదమధ్యాహార్యము) ఓయర్జునుడా!; త్వం=(ఈపదమధ్యాహార్యము) నీవు; లోకసంగ్రహమేవ=లోకసంగ్రహమునైనా; సంపశ్యన్నపి=చూచినవాడవై; కర్మ=(ఈపదమునకు పూర్వశ్లోకమునుండి యనువృత్తి) కర్మమును; కర్తుం=చేయుటకు; అర్హసి=తగుదువు. ॥౨౦॥

శాంకరభాష్యమ్:—

యస్మాచ్చ—కర్మణైవేతి । కర్మణైవ హి యస్మాత్పూర్వే క్షత్రియా విద్వాంసస్సంసిద్ధిం మోక్షం గంతు మాస్థితాః । ప్రవృత్తా జనకాదయో జనకాశ్వపతిప్రభృతయః ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

విచారింప జితేంద్రియుఁడగు వివేకి శ్రవణాదులచే నెల్లపుడు బ్రహ్మనిష్ఠుఁడగుటకు సమర్థుఁడే అయినను విద్వాంసులు, ప్రాచీనులు నగు జనకుడు, అశ్వపతి మొదలగుక్షత్రియులు

యుక్తములగు నిత్యనైమిత్తికకర్మల లెస్సగనాచరించుము. ఇట్లాచరించిన నేమిప్రయోజనముందువా? ఫలకామనారహితుఁడై యీశ్వరార్థము కర్మలనాచరించినచో నంతఃకరణము సత్త్వప్రధానమై శ్రవణాదిద్వారమున జ్ఞానము ప్రాప్తించి తద్ద్వారమున పురుషుడు మోక్షమును పొందును. ఫలనిరపేక్షుఁడై యీశ్వరార్పణముగ కర్మల నాచరించు పురుషుఁడే సత్పురుషుఁడు. (ఇతరుఁడు సత్పురుషుఁడు గానేరఁడని యభిప్రాయము.)

శంకరానందీయము:— "యోగారూఢుఁడు, ఆత్మరతుఁడు, ముక్తుడు నగు యతి కర్మలనాచరింప నవసరములేదు. కర్మల నాచరించడు. నీవైతే యారురుక్షువవు, మోక్షార్థివి, కాన నీవవశ్యము కర్మల నాచరింపవలయు" నని యీశ్లోకముచే బోధించుచుండెను. ముముక్షు వగు పురుషుడు ఫలాభిసంధిరహితుడై వైదిక మగు కర్మలను లెస్సగ నాచరించువాడైనచో పరమపురుషార్థమగు మోక్షమును బొందును. ఎట్లాత్మరతుడగు యతి యీజన్మమునందు కాని, జన్మాంతరమునఁగాని వైదికకర్మల నాచరించియే చిత్తశుద్ధినిపొంది, యాత్మజ్ఞానముచే మోక్షమునుపొందునో, అట్లే యితరుఁడు కూడ కర్మభూమియం దున్నవాడై కర్మల నాచరించియే జ్ఞానమును పొంది ముక్తు డగును. కాన నోయర్జునా! నీవు ముముక్షువవు. అందువలన నిష్కాముఁడవై యెల్లపుడు చేయఁదగిన నిత్యనైమిత్తికకర్మలను శ్రద్ధాభక్తులతో గూడ యీశ్వరార్పణబుద్ధిచే లెస్సగనాచరింపుము. కర్మచేతనే చిత్తశుద్ధినిపొంది, శ్రవణాదిద్వారమున జ్ఞానమునుపొంది మోక్షమును పొందగలవు. "ధర్మేణ పాప మపనుదతి" (ధర్మముచేతనే పాపమును నశింపజేసికొనును) 'జ్ఞానముత్పద్యతే పుంసాం క్షయాత్పాపస్య కర్మణః' 'జ్ఞానాదేవతు కైవల్యం' (పాపముయొక్క క్షయమువలన పురుషునకు జ్ఞానముకలుగును. జ్ఞానమువలననే మోక్షముసిద్ధించును.) అను నిత్యాదిస్మృతులవలన ధర్మానుష్ఠానమువలననే పాపక్షయము, దానివలన జ్ఞానము, దానివలననే మోక్షము పొందునని బోధింపబడుచున్నది. కాన నీవు ఆరురుక్షువవు. కావ తప్పక కర్మలను నిష్కాముడవై పరమేశ్వరార్పణబుద్ధితో నాచరింపుమని పర్యవసితాశయము. ॥౧౯॥

—• ౩వ అధ్యాయము ౨౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "వివిదిషువునకుగూడ జ్ఞాననిష్ఠాప్రాప్తినిమిత్తమై, శ్రవణమననిదిధ్యాసన

శాంకరభాష్యమ్:—

యది తే ప్రాప్తసమ్యగ్దర్శనా స్తతో లోకసంగ్రహార్థం ప్రారబ్ధకర్మత్వాత్ కర్మణా సహైవాఽసంన్యస్యైవ కర్మ సంసిద్ధి మాస్థితా ఇత్యర్థః । అథాప్రాప్తసమ్యగ్దర్శనా జనకాదయ స్తదా కర్మణా సత్త్వశుద్ధిసాధనభూతేన క్రమేణ సంసిద్ధి మాస్థితా ఇతి వ్యాఖ్యేయ శ్శ్లోకః । అథ మన్యసే పూర్వైరపి జనకాదిభిర ప్యజానద్భి రేవ కర్తవ్యం కర్మ కృతం తావతా నావశ్య మన్యేన కర్తవ్యం సమ్యగ్దర్శనవతా కృతార్థే నేతి తథాఽపి ప్రారబ్ధకర్మాయత్త స్త్వం లోకసంగ్రహ మేవాపి లోక స్యోన్మార్గప్రవృత్తినివారణం లోకసంగ్రహ స్త మేవాపి ప్రయోజనం సంపశ్య న్కర్తు మర్హసి ॥ ॥ ౨౦ ॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

విహితనిత్యనైమిత్తికకర్మముచేతనే మోక్షమును పొందుటకు ప్రవర్తించిరి. కాన క్షత్రియుఁడవగు నోయర్జునా! నీవుకూడ ప్రాచీనక్షత్రియు లనుసరించిన కర్మయోగమునే యాచరించుటకు తగుదువు. ఈచెప్పఁబోవు కారణముచేఁగూడ నీవు విహితకర్మము నాచరించఁ దగుదువు. అట్టి కారణ మేదనిన? జనకాశ్వపతిప్రభృతులు సమ్యగ్దర్శనమును పొందినవారైనను సమ్యగ్దర్శనమువలననే లోకముయొక్క యున్మార్గప్రవృత్తినివారణమునకై ప్రారబ్ధకర్మకలవా రగుటవలన కర్మసంన్యాస మొనరింపకుండఁగనే (కర్మముతోడనే) మోక్షమును పొంది రని పూర్వార్థముయొక్క యర్థము. లేక జనకాదులు సమ్యగ్దర్శనమును పొందనివార లగుచో నప్పుడు సత్త్వశుద్ధికి సాధనమగు కర్మముచేతనే క్రమముగ మోక్షమును పొందిరని యీశ్లోకము వ్యాఖ్యానింపఁదగినది.

"ఆత్మజ్ఞానశూన్యులే ప్రాచీనులగు జనకాదులు అట్టివారిచే కర్తవ్య మగు కర్మము చేయఁబడినది. అంతమాత్రముచే సమ్యగ్దర్శనము కలిగి కృతార్థుఁడైన మరియొకనిచే కర్మ మవశ్యము చేయదగినది కాదు" అని తలచెదవా? అట్లైనను నీవు ప్రారబ్ధకర్మాయత్తుడవు కాన

నిమిత్తము సర్వకర్మసంన్యాసము విహితము. కాన కేవలము జ్ఞానికే కర్మానధికారము గాదు. మఱి మనిన-విరక్తుఁడగు జ్ఞానార్థియు కూడ కర్మానధికృతుఁడే యగును. అందువలన విరక్తుఁడను, జ్ఞానార్థిని నగు నాచేఁ గూడ కర్మలు విడువఁదగినవే యగునా?" యను నర్జునుని యాశంకను- క్షత్రియునకు సంన్యాసానధికారమును ప్రతిపాదించుచు తొలఁగించుచుండెను.

శ్రుతిస్మృతిపురాణప్రసిద్ధులగు జనకమహారాజు, అజాతశత్రువు మొదలగు రాజర్షులు విద్వాంసులయ్యుకూడ కర్మను పరిత్యజింపకయే కర్మతోడనే శ్రవణాదిసాధ్య మగు జ్ఞాననిష్ఠ నాశ్రయించిరి. కాన నీవుగూడ క్షత్రియుఁడవు, వివిదిషువవు, లేక విద్వాంసుఁడ వైనను కర్మను చేయఁదగుదువు. "స్వారాజ్యకామో రాజా రాజసూయేన యజేత" అను వాక్యమునందు క్షత్రియత్వమువలె "బ్రాహ్మణాః పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థా యాథ భిక్షాచర్యం చరంతి" అను సంన్యాసవిధాయకవాక్యమునందు బ్రాహ్మణత్వము వివక్షితము. "చత్వార ఆశ్రమా బ్రాహ్మణస్య, త్రయో రాజన్యస్య, ద్వౌ వైశ్యస్య" బ్రాహ్మణునకు బ్రహ్మచర్య

శాంకరభాష్యతత్త్వబోధిని:—
జ్ఞానివైనను లోకముయొక్క దుష్టమార్గప్రవృత్తినివారణమునైన తెలిసికొని నిత్యనైమిత్తిక కర్మల నాచరించుటకు తగుదువు.

ఈశ్లోకమున విచారింపవలసిన విషయ మిది— జనకాదిక్షత్రియులు జ్ఞానులై కర్మలను లోకసంగ్రహముకొఱ కాచరించిరి. అని శ్రీమద్భాష్యకారులు మూలస్థ మగు "జనకాదయః" అను క్షత్రియపర మగు జనకశబ్దమును గ్రహించి వ్రాయుటచే క్షత్రియులకు సాక్షాత్కర్మ సంన్యాసమునం దధికారము లేమింజేసి క్షత్రియులైన జ్ఞానులు కర్మలను చేసిరి. కాన నీవుకూడ క్షత్రియుఁడ వగుటచే కర్మలను వదలుట ధర్మముకాదు. కాన జ్ఞానివైనను లోకసంగ్రహార్థము ప్రారబ్ధకర్మాయత్తుఁడ వయి కర్మలనే చేయు మని సూచింపఁబడెను. ॥౨౦॥

గార్హస్థ్యవానప్రస్థసంన్యాసము లనెడి నాలు గాశ్రమములు, క్షత్రియునకు బ్రహ్మచర్యగార్హస్థ్యవానప్రస్థము లనెడి మూఁడాశ్రమములు, వైశ్యునకు బ్రహ్మచర్యగార్హస్థ్యము లనెడి రెండాశ్రమములు విహితము లని స్మృతి బోధించుటవలనను, క్షత్రియవైశ్యులకు సంన్యాసాభావము చెప్పఁబడెను. మఱియు "ముఖజానా మయం ధర్మో యద్విష్ణోర్లింగధారణం । బాహుజాతోరుజాతానాం నాయం ధర్మః ప్రశస్యతే" (బ్రాహ్మణులకు సంన్యాసము పరమధర్మము. క్షత్రియవైశ్యులకు సంన్యాసము ప్రశస్తము కాదు) అని పురాణమునందు క్షత్రియవైశ్యులకు సంన్యాసము నిషిద్ధ మని చెప్పఁబడెను. కాన శ్రీకృష్ణపరమాత్మచే "కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః" అని న్యాయముగనే చెప్పఁబడెను. 'సర్వే రాజాశ్రితా ధర్మా రాజా ధర్మస్య ధారకః' (సర్వధర్మములు రాజాశ్రితములు. రాజు ధర్మమును ధరించువాఁడు.) అను స్మృతివలనఁగూడ క్షత్రియుఁడు వర్ణాశ్రమప్రవర్తకుఁ డగుటవలన నాతఁ డవశ్యము కర్మ నాచరింపవలయును అని 'లోకసంగ్రహ మేవాపి' అను నుత్తరార్ధముచేఁ జెప్పుచుండెను. (ప్రజలకు తమతమ ధర్మములయందు ప్రవర్తనము, ఉత్పథమునుండి నివర్తనము లోకసంగ్రహము) అట్టి లోకసంగ్రహమును జూచియైన, "అపి" శబ్దమువలన జనకాదిశిష్టాచారమును జూచియైన నీవు కర్మ నాచరించుటకు తగుదువు. క్షత్రియజన్మము నిచ్చు కర్మచే ప్రారంభింపఁబడిన శరీరము కలవాఁడ వగు నీవు విద్వాంసుఁడవైనను జనకాదులవలె ప్రారబ్ధకర్మబలముచే లోకసంగ్రహార్థము కర్మము నాచరించుటకు యోగ్యుఁడవైతివి. బ్రాహ్మణజన్మమును పొందకపోవుటచే కర్మలను వదలుటకు యోగ్యుఁడవు కావని యభిప్రాయము. ఇట్లు భగవదభిప్రాయమును గుర్తెఱింగిన శ్రీమద్భగవద్భాష్యకారులచే బ్రాహ్మణునకే సంన్యాసము; ఇతరులకు సంన్యాసమునం దధికారము లేదని నిర్ణయింపఁబడెను. వార్తికకారులైతే ప్రౌఢవాదముచే క్షత్రియవైశ్యులకుఁగూడ సంన్యాసముకలదని చెప్పియుండిరి.

శంకరానందీయము:— ఆత్మతత్త్వమును దెలిసికొనిన ముముక్షు వవశ్యము కర్మనే యాచరింపవలయునని యుపదేశించి యీవిషయమై శ్రీకృష్ణపరమాత్మ 'కర్మణైవ హి' అను శ్లోకముచే వృద్ధాచారమును ప్రమాణముగ నిచ్చుచుండెను. క్షత్రియు లగు జనకాశ్వపతిభగీరథాదులు శ్రౌతస్మార్తకర్మానుష్ఠానముచేతనే చిత్తశుద్ధిని బొంది, జ్ఞానముచే ముక్తిని బొంది కృతార్థులైరి. కాన నోయర్జునా! నీవుకూడ కర్మనే యాచరించి యట్టి కర్మానుష్ఠానమునఁ జనించిన చిత్తశుద్ధిద్వారమున జ్ఞానమును బొంది, ముక్తుఁడవై సుఖముగ నుండుము.

లేక జనకాదులు జ్ఞానయోగనిష్ఠానిరూఢు లగుటచే ముక్తిని పొందియు, లోకసంగ్రహార్థము కర్మతోఁ

గీ॥ యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః।
స య త్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే ॥ ॥౨౧॥

పదవిభాగము:— యత్- యత్- ఆచరతి- శ్రేష్ఠః- తత్- తత్- ఏవ- ఇతరః- జనః- సః- యత్- ప్రమాణం- కురుతే- లోకః- తత్- అనువర్తతే। ॥౨౧॥

ప్రతిపదార్థము:— శ్రేష్ఠః=ఉత్తముడు; యద్యత్=ఏయేకర్మమును; ఆచరతి=ఆచరించునో: ఇతరః=తదనుయాయి యగు నితరుఁడును; తత్తదేవ=ఆయాకర్మమునే; ఆచరతి=(ఈపద మావృత్తము) చేయును; సః=ఆశ్రేష్ఠుఁడు; యద్యత్=లౌకికవైదికములలో దేని దేనిని; ప్రమాణం=ప్రమాణముగ; కురుతే=చేయునో; లోకః=ఇతరజనులు; తత్=దానినే; అనువర్తతే=అనుసరింతురు. (ప్రమాణముగ జేసికొందురు) ॥౨౧॥

---

గూడినవా రయిరే యుండిరి (స్వయముగ కృతార్థులైనను సాధులు తరించుటకై కర్మ నాచరించుచునే యుండిరని యర్థము). అసాధు లగువారే కర్మ నాచరించుచుండ ననాత్మజ్ఞుఁడవు, అముముక్షుండవు అగు నీవు కర్మ నాచరింపవలయు నని యేమి చెప్పవలయును. (తప్పక నీవు మోక్షార్థము కర్మ నాచరింపవలయు నని భావము.) ఇట్లు ముముక్షువు, అనాత్మజ్ఞుఁడు, అముముక్షువు నగువాఁడు మోక్షార్థ మవశ్యము కర్మ నాచరింపవలయు నని నిర్ధారణ జేసి, ప్రస్తుత మాధికారికం డగు ముక్తుఁడుగూడ లోకహితార్థము కర్మ మాచరింపవలయు నని బోధించుట కావిషయమున దృష్టాంతముగ జ్ఞానవృద్ధు లగు జనకాదుల ప్రవృత్తి నుదహరించి ఓయర్జునా! నీకుఁగూడ నట్టి యధికారమున్నచో నుండుఁగాక. అయినను జనకాదులవలె నీవు లోకహితార్థ మవశ్యము కర్మ ననుష్ఠింపవలయును. మహాపురుషప్రవృత్తి చేతనే శాస్త్రమునకు ప్రామాణ్యము, కర్మకు ప్రాశస్త్యము, అజ్ఞానితరణము, పారంపర్యముచే నాచారాభివృద్ధియు సిద్ధించును. కాన ముక్తుఁడుగూడ నవశ్యము కర్మ మాచరింపవలయు నను నాశయముచేతనే శ్రీకృష్ణమూర్తి "లోకసంగ్రహ మేవాపి" అని చెప్పియుండెను. ఇట లోకశబ్దమునకు పామరజనుఁ డని యర్థము. అట్టివానియొక్క సంగ్రహ మనగ (సత్కర్మమార్గప్రదర్శనద్వారమున తారణము. లేక ఉత్పథము నుండి నివారణము) అట్టి లోకసంగ్రహరూపప్రయోజనము నైన చూచువాఁడవై (అనఁగా నాచే నాచరింపఁబడు కర్మ లోకోపకారక మగు నని చూచువాఁడవై) నీవు కర్మము నాచరించుటకు దగుదువు.

పరమార్థప్రప:— కర్మము చేయదగిన దను విషయమున సదాచారమును— "కర్మణైవ" అను శ్లోకపూర్వార్ధముచే ప్రమాణముగ నిచ్చుచుండెను. క్షత్రియులగు జనకాదులు వర్ణాశ్రమోచితమగు కర్మచేతనే తత్త్వజ్ఞానరూపమగు సిద్ధిని బొందిరి. తత్త్వజ్ఞానము కలిగినను కర్మను పరిత్యజింపరాదని 'లోకసంగ్రహమేవాపి' అను నుత్తరార్ధముచే బోధించుచుండెను. అల్పజ్ఞులగు కొందరు మేముకూడ తత్త్వజ్ఞులమే యని కర్మను పరిత్యజింపఁగలరు. అట్టివారు కర్మను పరిత్యజింపకుండఁగ కర్మ నాచరించుటకు, మఱియు నుత్పథమునందు ప్రవర్తించకుండుటకును, నీవు కర్మము నాచరింపుము. ఈ విషయమే "సర్పిరస్తి పయసీక్షుగోరస స్తైల మస్తి తిలమధ్య ఏవ తత్। లభ్యతే మథనయంత్రకర్మణా కర్మణా హ్యాదిగతా తథైవ చిత్" పయస్సునఁ దాజ్యము, చెఱకునందు రసము, తిలమధ్యమున తైలము కలవు. ఇవి యెట్లు లభించును? మథన మనెడి కర్మచే క్షీరములయందుండు దాజ్యము లభించును. యంత్రకర్మచే చెరకునందుండు రసము, తిలలయందుండు తైలమున్ను ప్రాప్తించును. అట్లే హృదయగతమగు చిద్రూప మెట్లు సాక్షాత్కరించుననిన విహితకర్మానుష్ఠానముచే సాక్షాత్కరించును. కాన కర్మ యవశ్య మాచరణీయము. ॥౨౦॥

**శాంకరభాష్యమ్:—**

లోకసంగ్రహం కః కర్తు మర్హాసి కథంచే త్యుచ్యతే—యద్యదితి । యద్య త్కర్మాచరతి యేషుయేషు శ్రేష్ఠః ప్రధాన స్తత్తదేవ కర్మాచరతీతరోఽన్యో జన స్తదనుగతః । కించ స శ్రేష్ఠో యత్ప్రమాణం కురుతే లౌకికం వైదికం వా లోక స్తదనువర్తతే తదేవ ప్రమాణీ కరోతీత్యర్థః ॥ ॥౨౧॥

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

"కృతార్థుడగు జ్ఞాని లోకసంగ్రహార్థము కూడ ప్రవర్తింపదగినదికాదు. కాన నేవఁడెట్లు కర్మ నాచరించుటకు తగును?" అనెదవా? వినుము చెప్పెద- శ్రుతాధ్యయనసంపన్నుడగు శ్రేష్ఠుఁడు విహితకర్మమును కాని, నిషిద్ధకర్మమును కాని దేనిదేని నాచరించునో తదనుయాయి యగు నితరప్రాకృతజనుఁడు కూడ దానినే యాచరించును. కాన జ్ఞానికూడ లోకమర్యాదాస్థాపనార్థము కర్మ నాచరింపవలయును. మఱియు ఆశ్రేష్ఠుఁడు లౌకికమును గాని, వైదికమును గాని, దేనిని ప్రమాణముగ చేసికొనునో (అనగా లౌకికవైదికములలో దేనిని ప్రమాణముగ గ్రహించునో) అజ్ఞానికూడ దానినే ప్రమాణముగ చేసికొనును. ॥౨౧॥

—• ౩వ అధ్యాయము ౨౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "నేను కర్మ నాచరించుచున్నను లోకమే కారణముచే నాకర్మమునే ప్రమాణముగ గ్రహించెడి"నను శంకను-లోకము శ్రేష్ఠాచారమునే యవలంబించునను హేతువుచే తొలగించుచుండెను. శ్రేష్ఠులు, ప్రధానులునగు క్షత్రియాదులు శుభమును కాని, యశుభమును కాని, యేయేకర్మ నాచరించెదరో తదనుగతులగు ప్రాకృతజనులుకూడ దానినియాచరించెదరు. స్వతంత్రముగ నితరమగుదాని నాచరించరు. "ఇతరజనులు శాస్త్రమును విచారించి శిష్టకృతమైనను నశాస్త్రీయమగుచో దానిని పరిత్యజించి శాస్త్రీయమైన దానినే యెందులకు గ్రహింపరను శంకను ఆచారవత్ప్రవృత్తి యందుగూడ నితరుడు (పామరుడు) శ్రేష్ఠునే యనుసరించునని చెప్పి తొలగించుచుండెను. శ్రేష్ఠుఁడు లౌకికమును గాని, వైదికమును గాని దేనిని ప్రమాణముగ తలఁచునో, ఆ ప్రమాణమునే లోకము కూడ ననువర్తించును. కాని స్వతంత్రముగ దేనిని ప్రమాణముగ తెలిసికొనలేడు. పామరజనవ్యవహారములు ప్రధానానువిధాయు లగుటవలన ప్రధానుఁడవు, క్షత్రియుఁడవు అగు నీ కవశ్యము కర్మము చేయదగుదువు.

శంకరానందీయము:— నాచే నాచరింపబడు కర్మ మెట్లు లోకోపకారక మగు ననెదవా? వేదశాస్త్రాధ్యయనాధ్యాపనములందును, తదర్థజ్ఞానజ్ఞాపనములందును, తదుక్తకర్మానుష్ఠానానుష్ఠాపనములయందును, సమర్థుఁడు, కులశీలాదిమహత్త్వసంపన్నుడు నగు నేద్విజశ్రేష్ఠుడేయే శ్రౌతస్మార్తకర్మను కాని, లేక మఱియొక దానిని కాని ముముక్షువైనియమముగ నాచరించునో, అద్దానినే యితరుడగు పామరుడుకూడ నాచరించును. శాస్త్రజన్యజ్ఞానము, శాస్త్రోక్తకర్మపరిజ్ఞానము లేమింజేసి స్వయముగ నేకర్మను జేయజాలడు. మఱియు పూర్వమునందు జెప్పబడిన లక్షణములు కల శ్రేష్ఠుఁడేయే శాస్త్రమును ప్రమాణముగఁ జేసికొనునో అనగా నట్టి శ్రేష్ఠుఁడే శాస్త్రమును "ఇదియే ప్రమాణము" అని వ్యవహరించునో; మూఢజనుడుకూడ- నా శ్రేష్ఠునిచే ప్రమాణముగ వ్యవహరించబడుచుండిన శాస్త్రమునే ప్రమాణముగ వ్యవహరించును, (పామరుఁడు శ్రేష్ఠునే యనుసరించును. అని యర్థము. (ఈ చెప్పుటచే కృతార్థుడగు శ్రేష్ఠుడుకూడ లోకహితార్థము కర్మ నాచరించవలయునని సిద్ధించుచున్నది. ॥౨౧॥

గీ॥ న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥ ॥22॥

పదవిభాగము:— న- మే- పార్థ! అస్తి- కర్తవ్యం- త్రిషు- లోకేషు- కించన- న- అనవాప్తం- అవాప్తవ్యం- వర్తే- ఏవ- చ- కర్మణి ॥ ॥22॥

ప్రతిపదార్థము:— హేపార్థ!=ఓయర్జునా; మే=నాకు; త్రిషు=మూడైన; లోకేషు=లోకములయందు; కించన=కొంచెమైన; కర్తవ్యం=చేయదగినది; నాస్తి=లేదు; అనవాప్తం=పొందబడనిది; అవాప్తవ్యం=పొందదగినది; న=లేదు; తథాపి=(ఈపదమధ్యాహార్యము) అయినను; అహం=(ఈపదమధ్యాహార్యము) నేను; కర్మణి=కర్మయందు; వర్తఏవచ=ఉండుచుంటిని. ॥22॥

శాంకరభాష్యమ్:—

యద్యత్ర తే లోకసంగ్రహకర్తవ్యతాయాం విప్రతిపత్తి స్తర్హి మాం కిం న పశ్యసి.— నమ ఇతి । నమే మమ పార్థ! నాస్తి న విద్యతే కర్తవ్యం త్రిష్వపి లోకేషు కించన కించిదపి । కస్మాన్నానవాప్త మప్రాప్త మవాప్తవ్యం ప్రాపణీయం, తథాపి వర్తఏవచకర్మణ్యహమ్॥22॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కృతార్థుడుకూడ లోకసంగ్రహార్థము కర్మము నాచరింపవలయునని యింతకుపూర్వము చెప్పబడెను. నీకిలోహసంగ్రహకర్తవ్యతయందుకూడ విప్రతిపత్తి (సందేహము) యున్నచో నెందులకు నన్ను దృష్టాంతముగ తెలిసికొనవు? ఓ యర్జునా! నాకు ముల్లోకములయందు కొంచెమైన చేయదగినదిలేదు. "అప్రాప్తమగు వస్తువును పొందుటకు నీకుగూడ కర్తవ్యముండ, నేమియు కర్తవ్యము లేదని నీవు చెప్పు టెట్లు సమంజసమగు" ననెదవా? నాకు పొందబడనిది కాని, పొందదగినది కాని లేదు. అట్లగుచో ప్రయోజనము లేనిచో నీవుకూడ కర్మను వదలదగినదే యనెదవా? లోకసంగ్రహార్థము నేనుకూడ కర్మయం దుండుచుంటిని. (కర్మము నాచరించుచుంటిని). ॥22॥

—♦ 3వ అధ్యాయము 22 శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— ఈవిషయమున నేనే దృష్టాంతభూతుడనని "న మే పార్థాస్తి" అను శ్లోకము మొదలు మూడు శ్లోకములచే బోధించుచుండెను. ఓపార్థుడా! నాకు ముల్లోకములయందు కర్తవ్యమేదియు లేదు. ఎందువలననిన? నాకు పొందదగిన ఫలముకాని, పొందబడనిదికాని లేదు. అయినను నేను కర్మల నాచరించుచుంటిని. "ఇట హేపార్థ!" అని యర్జునుని సంబోధించుటచే నీవు విశుద్ధక్షత్రియవంశమునందు జనించనవాడ (వీరమాతృకుమారుడ) వగుటచే నాతో సమానుడవు. కావ నేనెట్లుసంచరించుచుంటినో అట్లే నీవును సంచరించుటకు తగుదు వని సూచింపబడెను.

శంకరానందీయము:— "కర్మచే సాధింపదగిన దేదియులేదని తెలిసినట్టి కృతార్థుడగు మహాత్మునకు కర్మాచరణ మెచ్చటను చూడబడలే" దనునాశంకపై నీవిషయమున నేనే ప్రమాణ మని శ్రీకృష్ణపరమాత్మ "న మే పార్థాస్తి" అను శ్లోకముచే చెప్పుచుండెను. ఓయర్జునా! షడ్గుణైశ్వర్యసంపన్నుడను, సర్వేశ్వరుడను

గీ॥ యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః ।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః ॥ ॥౨౩॥

పదవిభాగము:— యది- హి- అహం- న- వర్తేయం- జాతు- కర్మణి- అతన్ద్రితః- మమ- వర్త్మ- అనువర్తన్తే- మనుష్యాః- పార్థ!- సర్వశః ॥ ॥౨౩॥

ప్రతిపదార్థము:— అహం=నేను; జాతు=ఒకానొకప్పుడైనను; కర్మణి=కర్మమునందు; అతన్ద్రితః=అనలసుడనై; నవర్తేయంయది=ఉండనిచో; మమ=శ్రేష్ఠుఁడనగు నాయొక్క; వర్త్మ=మార్గమును; హే పార్థ!=ఓ యర్జునా!; మనుష్యాః=(అజ్ఞానులగు) మనుష్యులు; సర్వశః=సర్వవిధములచేతను; అనువర్తన్తే=అనుసరించెదరు.

శాంకరభాష్యమ్:—

యది పున రహం న వర్తేయం జాతు కదాచి త్కర్మ ణ్యతన్ద్రితోఽనలస స్సన్మమ శ్రేష్ఠస్య సతో వర్త్మ మార్గ మనువర్తన్తే మనుష్యా హే పార్థ! సర్వశః సర్వప్రకారైః ॥౨౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఫలము లేనిదగుటవలన లోకసంగ్రహముకూడ నీకు చేయతగినదికాదని శకింపఁ జనదు. ఓయర్జునా! నేననలసుఁడనై ఒకానొకప్పుడైన కర్మయం దుండకపోతినేని యజ్ఞానులగు మనుష్యులు శ్రేష్ఠుఁడనగు నామార్గమునే సర్వవిధముల ననుసరించెదరు. ॥౨౩॥

అగు నాకు పొందదగిన దేదియులేదు. ఒకదాని నుద్దేశించి చేయదగిన కర్మయు లేదు. ఎందువల ననిన? "అనవాప్తం" అనాప్తమై నాకు క్రియచే పొందదగు నేవస్తువు ముల్లోకములయందు లేదు. గృహస్వామికి గృహస్థవస్తువువలె నిఖిలబ్రహ్మాండములయం దుండు నిఖిలవస్తువులు బ్రహ్మాండస్వామినగు నాకు పొందబడినవే; పొందఁదగిన దేదియు లేదు. ఇట్లే మహాభాగ్యవైరాగ్యజ్ఞానసమృద్ధుఁడ నగు నేను లోకసంగ్రహ మనెడి కర్మ నాచరించుచునే యుంటిని. "వర్త ఏవ చ" అను స్థలమునందుఁగల 'చ' కారము 'హి' అను నవ్యయార్థకము. అనఁగా "హి" అను శబ్దమునకు ప్రసిద్ధి యర్థము. ఇచట 'చ' కారము అట్టి ప్రసిద్ధ్యర్థకము. తేలిన యాశయ మేమి? నాకు వైదికకర్మమునందు, లౌకికకర్మమునందు ప్రవర్తనము మీ కందరకు ప్రత్యక్షసిద్ధమే యని ప్రసిద్ధిని బోధించు నని యర్థము. ॥౨౨॥

—• ౩వ అధ్యాయము ౨౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

శంకరానందీయము:— సర్వేశ్వరుఁడవగు నీకు నవర్థము లేమింజేసి లోకసంగ్రహముకూడ చేయనవసరము లేదు. అని యాశంకించి "అశ్రేష్ఠశ్శ్రేష్ఠానుసారీ" అశ్రేష్ఠుఁడు శ్రేష్ఠు ననుసరించు నను న్యాయమున శ్రీకృష్ణుఁడు సర్వజ్ఞుఁడని సర్వులు నన్నే యనుసరించెదరు. నేను కర్మ నాచరింపనిచో కర్మల నాచరించకపోయెడిని. అందుచే లోకనాశనము సంభవించెడిని. కాన నాకు కర్మ తప్పక యాచరింపదగినదే యను నాశయముచే "యది" అని రెండుశ్లోకములను చెప్పనారంభించెను. నేను కృతార్థుఁడనని కాని, కర్మచే సాధింపఁదగిన దేదియు నాకు లేదని కాని యూహించి, మంత్రతంత్రప్రయోగాదులయం దప్రమత్తుఁడనై యెప్పుడును విహిత కర్మమునందు ప్రవర్తింపనిచో నన్ను కర్మల నాచరింపనివానినిగ తెలిసికొని ప్రజలందరు కర్మల నాచరింపనివారగుదురు. ఎందువల ననిన? మనుష్యులందరు శ్రీకృష్ణుఁడు భగవంతుఁడు, సర్వజ్ఞుఁడు అని సర్వజ్ఞత్వబుద్ధిచే నా మార్గమునే యనుసరించెదరు. నేను కర్మల నాచరించనిచో స్వయముగఁ గర్మలను పరిత్యజించెదరు. ॥౨౩॥

గీ॥ ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మ చే దహమ్ ।
సంకరస్య చ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః ॥ ॥౨౪॥

పదవిభాగము:— ఉత్సీదేయుః– ఇమే– లోకాః– న– కుర్యాం– కర్మ– చేత్– అహం– సంకరస్య– చ– కర్తా– స్యాం– ఉపహన్యాం– ఇమాః– ప్రజాః ॥ ॥౨౪॥

ప్రతిపదార్థము:— అహం=నేను; కర్మ=కర్మమును; నకుర్యాం= చేయకుంటినేని; ఇమే=ఈ; లోకాః=లోకములు; ఉత్సీదేయుః=నశించిపోయెడిని; అహం=నేను; సంకరస్యచ=సంకరమునకు; కర్తా=కర్తనై; స్యాం=అయ్యెదను; ఇమాః=ఈ; ప్రజాః=ప్రజలను; ఉపహన్యాం=నశింపచేయువాడ నగుదును. ॥౨౪॥

శాంకరభాష్యమ్:—

తథాచ కో దోష ఇత్యాహ—— ఉదితి । ఉత్సీదేయు ర్వినశ్యేయు రిమే సర్వే లోకా లోకస్థితినిమిత్తస్య కర్మణోఽభావాత్, న కుర్యాం కర్మ చే దహం, కించ సంకరస్య చ కర్తా స్యామ్ । తేన కారణే నోపహన్యా మిమాః ప్రజాః ప్రజానా మనుగ్రహాయ ప్రవృత్త ఉపహతి రుపహననం కుర్యామిత్యర్థః । మమేశ్వర స్యాననురూప మాపద్యేత ॥ ॥౨౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"శ్రేష్ఠుడ వగు నీయొక్క మార్గము ననుసరించుట మనుష్యుల కుచితమే. అందుచే నేమిదోషముకల' దను శంకను తొలగించుటకు శ్రీకృష్ణపరమాత్మ "ఉత్సీదేయుః' అని చెప్ప మొదలిడెను.

నేనే కర్మము నాచరించనిచో లోకస్థితినిమిత్త మగు కర్మము లేమింజేసి యీ సర్వకర్మములు నశించిపోగలవు. మఱియు కర్మమును వదలిన నేను సంకరకర్త నయ్యెదను. ఆకారణముచే నీప్రజల నందరను నశింపజేసెడివాడ నగుదును. ప్రజలు నశించిన నీకేమి? అనెదవా! ప్రజల యనుగ్రహమునిమిత్తము 'ప్రవృత్తుడ నైతిని. అట్టివాడను ప్రజలను నశింపజేసెడివాడ నగుదును. ఈశ్వరుడ నగు నాకిది తగదు ॥౨౪॥

—• ౩వ అధ్యాయము ౨౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— శ్రేష్ఠుడ వగు నీయొక్క మార్గము ననుసరించుట యుచితమే. నీవు కర్మ నాచరింపనిచో దోష మేమను శంకను తొలగించుటకు "ఉత్సీదేయుః" అని చెప్పుచుండెను. నేనీశ్వరుడనై కర్మనాచరింపనిచో మదనువర్తనులగు మన్వాదులకు కర్మసంభవింపదు. అట్లగుచో లోకస్థితిహేతువగు కర్మయొక్క లోపముచే నీసర్వలోకములు నశించెడిని. అందువలన వర్ణసంకరమునకుకర్తనుకూడ నేనేయగుదును. అందుచే ధర్మలోపమువలన నీనిఖిలప్రజను నేనే నశింపచేయువాడ నయ్యెదను. ప్రజల యనుగ్రహము నిమిత్తము ప్రవృత్తుడనైన యీశ్వరుడ నగు నేనే సర్వప్రజలను నశింపజేయువాడ నయ్యెద నని యాశయము.

'యద్య దాచరతి' ఇత్యాది శ్లోకములకు మఱియొక వ్యాఖ్యానము. అది యెట్లనిన? కేవలము లోకసంగ్రహమునే చూచినవాడవై కర్మలను చేయదగవు. మరేమనిన? శ్రేష్ఠాచార మగుటవలన గూడ కర్మ నాచరింపవలయు నని "యద్య దాచరతి" అను శ్లోకముచే బోధించుచుండెను. శ్రేష్ఠుడ నగు నాయొక్క యాచార

గీ॥ సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత ।
కుర్యా ద్విద్వాం స్తథాఽసక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్ ॥ ॥౨౫॥

పదవిభాగము:— సక్తాః- కర్మణి- అవిద్వాంసః- యథా- కుర్వన్తి- భారత!- కుర్యాత్- విద్వాన్- తథా- అసక్తః- చికీర్షుః- లోకసంగ్రహమ్ । ॥౨౫॥

ప్రతిపదార్థము:— హే భారత=ఓ యర్జునా!; అవిద్వాంసః=అజ్ఞానులు; కర్మణి=కర్మమునందు; సక్తాః=ఈ కర్మఫలము నాకు సంభవించుననెడి సక్తికలవారై; యథా=ఏవిధమున; కర్మ=(ఈపదమనువృత్తము) కర్మమును; కుర్వంతి=చేయుదురో; తథా=అవిధముగనే; విద్వాన్=విద్వాంసుడు (జ్ఞాని) కూడ; అసక్తస్సన్=ఫలమునం దిచ్ఛలేనివాఁడై; లోకసంగ్రహం=లోకసంగ్రహమును; చికీర్షుః=చేయనిచ్ఛకలవాఁడై; కర్మ=కర్మమును; కుర్యాత్=చేయువలయును. ॥౨౫॥

శాంకరభాష్యమ్:—

యది పున రహ మివ త్వం కృతార్థ బుద్ధి రాత్మవి దన్యో వా తస్యా ప్యాత్మనః కర్తవ్యాభావేపి పరానుగ్రహ ఏవ కర్తవ్య ఇతి । సక్తా ఇతి । సక్తాః కర్మణ్యస్య కర్మణః ఫలం మమ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

లోకసంగ్రహముకొరకు కర్మము నాచరించువానికి కర్తృత్వాభిమానముచే జ్ఞానమునకభిభవము ప్రాప్తించు ననెదవా? నావలె నీవుకూడ కృతార్థబుద్ధి కలవాఁడవై యాత్మవేత్త

మేదియో మదనువర్తి వగు నీచే నదియే యాచరింపఁదగినది. స్వతంత్రముగ నిరతమును నీ వనుష్ఠింపరాదు. "నాచే నాచరింపఁదగిన నీయాచార మేది?" అను శంకపై "న మే పార్థాస్తి కర్తవ్యం" అనునది మొదలు మూఁడు శ్లోకములచే నాయాచారము చూపఁబడెను.

శంకరానందీయము:— "ప్రజలు కూడ కర్మను పరిత్యజింతురు కాక. అట్లగుచో నేమి యనర్థము వాటిల్లు" ననుశంకపై 'ఉత్సీదేయుః' అని చెప్పమొదలిడెను. ప్రజలందరు కర్మల బరిత్యజించినచో 'అన్నాద్భవంతి భూతాని' అని చెప్పినరీతిగ హవిర్భాగములు లేనందున దేవతలు క్షీణించెదరు. దేవతలు క్షీణింప వృష్ట్యాదులు లేమింజేసి ప్రజలు జనించకుందురు. మఱియు జనించిన ప్రజలు నశింపఁగలరు. ఇంతమాత్రమే యనర్థము కాదు. మరే మనిన? వర్ణసాంకర్యముకూడ సంభవించెడి నని 'సంకరస్య' అను నుత్తరార్థముచేఁ జెప్పుచుండెను. కృతకృత్యుఁడ ననెడి యభిమానముచే నేను లోకస్థితికారణ మగు వైదికకర్మను లోపలచే విడిచిపెట్టించినవాఁడనై సంకరకర్త నగుదును. తత్తద్వర్ణజాతిభేదవ్యవస్థాపకకర్మము లేనిచో సర్వు లొకటియే యయ్యెడివార లగుదురు. అట్లగుచో వర్ణములు కలసిపోఁగలవు. అట్టి సాంకర్యముకూడ నావలననే యేర్పడవలసివచ్చును. ఇట్లు సాంకర్యము నొసంగుటచే నేను సర్వప్రజలను దుర్గతిపాలు చేసినవాఁడ నగుదును. సద్గతికి హేతు వగు సత్కర్మానుష్ఠానము లేమింజేసి ప్రజలందరు నరకమును బొందెడివారు కావలసివచ్చును. ఇట్టి యనర్థపరంపర ప్రాప్తించవలసివచ్చును గాన కృతకృత్యుఁడ వగు నాకు, నీకు, ఆత్మవేత్త యగు మరియొకనికి లోకహితార్థము కర్మ మాచరింపవలయు నని పర్యవసితము. ॥౨౪॥

—• ౩వ అధ్యాయము- ౨౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఈశ్వరుఁడవగు నీవు కర్మల నాచరించుచుండినను కర్తృత్వాభిమానము లేమింజేసి నీ కేమియు క్షతి లేదు. నేనైతే జీవుడను. అట్టి నేను లోకసంగ్రహార్థము కర్మల నాచరించువాడనైన

గీ॥ న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్ ।
జోషయే త్సర్వకర్మాణి విద్వా న్యుక్త స్సమాచరన్ ॥ ॥౨౬॥

పదవిభాగము:— న- బుద్ధిభేదం- జనయేత్- అజ్ఞానాం- కర్మసంగినాం- జోషయేత్- సర్వకర్మాణి- విద్వాన్- యుక్తః- సమాచరన్ । ॥౨౬॥

ప్రతిపదార్థము:— కర్మసంగినాం=కర్మలయం దాసక్తిగల: అజ్ఞానాం=అజ్ఞానులకు; బుద్ధిభేదం,.. బుద్ధి=నాకీకర్మము చేయుదగినది; ఈకర్మమున కీఫల మనుభవింపదగిన దనెడి బుద్ధియొక్క; భేదం=చాలనమును; నజనయేత్=పుట్టించరాదు; విద్వాన్=జ్ఞాని; యుక్తః=అభియుక్తుడై; కర్మ=(ఈపద మధ్యాహార్యము) కర్మమును; సమాచరన్=చేయుచుట్టివాఁడై; అజ్ఞైః=(ఈపద మధ్యాహార్యము) అజ్ఞానులచే; సర్వకర్మాణి=నిత్యనైమిత్తిక సర్వకర్మలను; జోషయేత్=చేయించవలెను. ॥౨౬॥

శాంకరభాష్యమ్:—

భవిష్యతీతి కేచి దవిద్వాంసో యథా కుర్వంతి భారత! కుర్యా ద్విద్వా నాత్మవి త్తథాఽసక్తస్సన్ । తద్వ త్కిమర్థం కరోతి తచ్ఛృణు చికీర్షుః కరు మిచ్ఛు ర్లోకసంగ్రహమ్ ॥ ॥౨౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వగుచో, లేక మరియొక యాత్మవేత్తయైనను తనకు కర్తవ్యము లేకున్నను పరానుగ్రహము చేయఁదగినది. ఓయర్జునా! యజ్ఞాను లేవిధమున నీకర్మమునకు నాకీఫలము ప్రాప్తించు నని యాసక్తి కలవారై కర్మము నాచరించెదరో, అట్లే యాత్మవేత్త యగు విద్వాంసుఁడు గూడ కర్తృత్వాభిమానమును, ఫలాభిసంధిని వదలి, కర్మము నాచరింపవలయును. విద్వాంసు డట్లేందులకు కర్మము నాచరింపవలె ననెదవా? లోకసంగ్రహమును చేయ నిచ్ఛగలవాఁడై యట్లు కర్మము నాచరింపవలయును. ॥౨౫॥

నాకుఁ గర్తృత్వాభిమానము జనించును. దానిచే జ్ఞానమున కభిభవము సంభవించెడిని. అను నాశంకను తొలఁగించుటకు "సక్తాః" అని చెప్పనారంభించెను. ఎట్లజ్ఞానులు కర్తృత్వాభిమానము చేతను, ఫలాభిసంధిచేతను కర్మయం దభినివేము కలవారై కర్మల నాచరించెదరో; లోకసంగ్రహమును చేయ నిశ్చయించినవిద్వాంసుఁడును, అటులే కర్మల నాచరింపవలయును. మఱియు కర్తృత్వాభిమానమును, ఫలాభిసంధిని వదలి కర్మల నాచరింపవలయును. ఇట "భారత!" అను సంబోధనచే భరతవంశోద్భవుఁడ వగుటచే, లేక జ్ఞానమునందు రతుఁడవగుటచేఁగాని నీవు యథోక్తశాస్త్రార్థయోగ్యుఁడ వని సూచింపఁబడెను.

శంకరానందీయము:— లోకహితార్థమై కర్మయందు ప్రవృత్తమైన విద్వాంసుఁడు కర్మ నెట్లాచరింపవలయు? నను శంకపై "సక్తాః" అని చెప్పమొదలిడెను. అనాత్మజ్ఞులు కర్మజన్యఫలమగు స్వర్గపుత్రధనాదులయందు సక్తి కలవారై నియమముగ శ్రద్ధాభక్తులతోఁగూడి విహితకర్మము నెట్లాచరించెదరో; అటులే లోకసంగ్రహమును జేయఁదలచినవాఁడై విద్వాంసుఁడుకూడ శ్రద్ధాభక్తులతోకూడి స్వయముగ కర్తృత్వాభిమానశూన్యుఁడై, ఫలాపేక్షారహితుఁడై విహితకర్మల నాచరింపవలయును. ఇట్లాచరించుచో స్వయంతీర్ణుఁడై పరులను తరింపఁజేయునని యాశయము. జ్ఞానికి, యజ్ఞానికి వైలక్షణ్య మేదనిన? జ్ఞానికి కర్తృత్వాభినివేశరహితత్వము, ఫల నిరపేక్షత్వము, సాకల్యవైకల్యములయందు హర్షవిషాదరహితత్వము నుండును. అజ్ఞానికన్నచో కర్తృత్వాభినివేశము, ఫలసాపేక్షత్వము, సాకల్యవైకల్యములయందు హర్షవిషాదములు నుండును. కాని కర్మ నాచరించుటలో మాత్ర ముభయులు సమానులే. ॥౨౫॥

శాంకరభాష్యమ్:—

ఏవం లోకసంగ్రహం చికీర్షో ర్న మమాత్మవిదః కర్తవ్య మస్త్యన్యస్య వా లోకసంగ్రహం ముక్త్వా తత స్తస్యాత్మవిద ఇద ముపదిశ్యతే— నేతి। బుద్ధే ర్భేదో బుద్ధిభేదో మమేదం కర్తవ్యం భోక్తవ్యం చాస్య కర్మణః ఫలమితి నిశ్చితరూపాయా బుద్ధే ర్భేదనం చాలనం న జనయే న్నోత్పాదయే దజ్ఞానా మవివేకినాం కర్మసంగినాం కర్మ ణ్యాసక్తానా మాసంగవతామ్। కింతు కుర్యా జ్జోషయే త్కారయే త్సర్వకర్మాణి విద్వా న్స్వయం తదే వావిదుషాం కర్మ యుక్తోఽభియుక్త స్సమాచర న్॥ ॥౨౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఇట్లు లోకసంగ్రహము చేయ నిచ్ఛగలిన నాత్మవేత్త నగు నాకు కర్తవ్య మగు కర్మ మెట్టిదియు లేదు. ఆత్మజ్ఞాని యగు నితరునికైన లోకసంగ్రహార్థము కాక వేరే చేయదగు కర్మ మెట్టిదియు లేదు. కాన నాత్మవేత్త కిది యుపదేశింపబడుచుండెను. కర్మములయం దాసక్తి కల యజ్ఞానులకుఁ గల "నా కిది కర్తవ్యము, ఈకర్మఫల మనుభవించఁదగినది" అనెడి నిశ్చయబుద్ధిని చలింపఁజేయరాదు. మఱియు నట్టి యజ్ఞానుల కాకర్మములయందు ప్రీతిని జనింపఁజేయుచు విద్వాంసుఁడు స్వయముగ నభియుక్తుఁడై యజ్ఞానుల విధివిహితకర్మముల నాచరించుచు యజ్ఞానులచే సర్వకర్మల నాచరింపఁజేయవలయును. ॥౨౬॥

—• ౩వ అధ్యాయము ౨౬ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "కర్మానుష్ఠానముచే లోకసంగ్రహము చేయఁదగినది కాని, తత్త్వజ్ఞానోపదేశముచే నది చేయదగినది కాదనుటయం దేమి హేతువు కల" దను శంకను "న బుద్ధిభేదం" అను శ్లోకముచేఁ దొలఁగించుచుండెను.

కర్తృత్వాభిమానపురస్సరముగను, ఫలాభిసంధిపురస్సరముగను కర్మలయం దభినివిష్టులగు నవివేకులకుఁ గలుగు "నేనీకర్మము నాచరింపఁగలను, ఈకర్మఫలమును నే ననుభవింపఁగలను" అనెడి బుద్ధియొక్క చాలన మాత్మోపదేశమువలన చేయరాదు. మరేమనిన— విద్వాంసుఁడు సావధానమనస్కుఁడై లోకసంగ్రహమును జేయదలచినవాఁడై, యవిద్వాంసుఁ డాచరించు నిఖిలకర్మలను జేయుచు, నజ్ఞానులకు శ్రద్ధను కలిగించి, ప్రీతితో నజ్ఞానులచే కర్మలను చేయించవలెను. అనధికారులకు తత్త్వజ్ఞానోపదేశము చేసినచో వారలబుద్ధి చలించును. దానవలన నజ్ఞానులకు కర్మలయందు శ్రద్ధ నివృత్తమగును. అందుచే కర్మల నాచరింపకుందురు. జ్ఞానము కలుగకపోవుటచే ముక్తిని పొందనేరరు. అట్లగుచో నుభయభ్రష్టత్వ మజ్ఞానులకు సంభవించెడిని. ఈవిషయమే "అజ్ఞస్యార్ధప్రబుద్ధస్య సర్వం బ్రహ్మేతి యో వదేత్। మహానిరయజాలేషు స తేన వినియోజితః" అజ్ఞానికెవఁడు "సర్వము బ్రహ్మస్వరూపమే" యని బోధించునో వాఁ డతనిని రౌరవాది మహానరకములయందుఁ బడఁద్రోయుచున్నాఁ డని స్మృతి బోధించుచున్నది.

శంకరానందీయము:— బ్రహ్మవేత్త స్వయముగ (నాత్మకు దేహతాదాత్మ్యము లేదను) దేహతాదాత్మ్యభావదర్శననిష్ఠుఁడై, తత్తత్కాలోచితకర్మల నాచరించువాఁడై ఫలాపేక్షచే నియమముగఁ గర్మల నాచ

గీ॥ ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।
అహంకారవిమూఢాత్మా కర్తాఽహ మితి మన్యతే ॥ ॥ ౨౭ ॥

పదవిభాగము:— ప్రకృతేః- క్రియమాణాని- గుణైః- కర్మాణి- సర్వశః-అహంకారవిమూఢాత్మా-కర్తా- అహం- ఇతి- మన్యతే । ॥ ౨౭ ॥

ప్రతిపదార్థము:— ప్రకృతేః=ప్రధానము యొక్క; గుణైః= కార్యకరణరూపమగు వికారములచే; క్రియమాణాని=చేయఁబడు; కర్మాణి=కర్మలను గూర్చి; అహంకారవిమూఢాత్మా, అహంకార= కార్యకరణసంఘాతరూపమగు శరీరేంద్రియాదులయం దాత్మజ్ఞానముచే; విమూఢ=విశేషముగ మూఢమగు; ఆత్మా=అంతఃకరణముకల పురుషుడు; సర్వశః= సర్వవిధములచే; అహం=నేను; కర్తా=కర్తను; ఇతి=ఈవిధమున; మన్యతే=తలంచుచున్నాడు.

శాంకరభాష్యమ్:—

అవిద్వా నజ్ఞః కథం కర్మసు సజ్జత ఇత్యాహ— ప్రకృతే రితి । ప్రకృతేః ప్రకృతిః ప్రధానం సత్త్వరజస్తమసాం సామ్యావస్థా తస్యాః ప్రకృతే ర్గుణై ర్వికారైః కార్యకరణరూపైః క్రియమాణాని కర్మాణి లౌకికాని శాస్త్రీయాణిచ సర్వశః సర్వప్రకారై రహంకారవిమూఢాత్మా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అవిద్వాంసుఁ డగు నజ్ఞాని కర్మములయం దెట్లు సక్తుఁ డగు నను శంకపై "ప్రకృతేః" అని శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచుండెను.

ప్రకృతి యనగ ప్రధానము. అనగా సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థ. అట్టి ప్రకృతియొక్క కార్యకరణరూప మగు వికారములచే జేయఁబడు లౌకికవైదికకర్మములను

రించు మూఢులకు. లేక దేహేంద్రియాదులచే కర్మలు చేయఁబడుచుండ "నేనే కర్తను, భోక్తను" అనెడి యభిమానముకల తత్త్వవేత్తలుకానిమూఢులకు— తాను పండితుండ నను బుద్ధిచే "బుద్ధిభేదం" బుద్ధిభేదమును "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అను వాక్యానుసారము నేను జ్యోతిష్టోమమును జేసి స్వర్గఫలము ననుభవించగల నను ఫలవిషయక మగు నేకామనను చాలనను చేయరాదు. అనఁగా కర్మలను కామనచేఁ జేయరాదని కాని, స్వర్గాది ఫలము తుచ్ఛమైన దని కాని, కర్త మొదలగున వన్నియు మిథ్య యని కాని బోధించి, యజ్ఞానుల బుద్ధివైకల్యము చేయరాదు. మరే మనిన? "అక్షయ్యం హ వై చాతుర్మాస్యయాజిన స్సుకృతం భవతి, పశ్యతి పుత్రం పశ్యతి పౌత్రం, తస్మా ద్ధర్మం పరమం వదంతి" చాతుర్మాస్యయాగ మొనరించినవారి కక్షయ మగు పుణ్యము సంభవించును. పుత్రులను, పౌత్రులను చూచును. ధర్మముచే సమస్తపాపములు నశించును. ధర్మాత్ముని సర్వులు సేవింతురు. కావున ధర్మ ముత్కృష్టమైన దని కర్మఫలస్తుతిచే సర్వవైదికకర్మల నాచరించుట కజ్ఞాని కిచ్ఛను జనింపచేయవలెను. ॥ ౨౬ ॥

## —• ౩వ అధ్యాయము- ౨౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— విద్వాంసునకును, అవిద్వాంసునకును కర్మానుష్ఠానము సమానమైనను విద్వాంసునకు కర్తృత్వాభిమానము లేమింజేసియు, అజ్ఞానికి కర్తృత్వాభిమాన ముండుటచేత నిరువురకు విశేషము కల దని చూపించుచు "సక్తాః కర్మణి" అను శ్లోకార్థమును "ప్రకృతేః క్రియమాణాని" అను శ్లోకము మొదలు రెండుశ్లోకములచే వివరించుచుండెను.

శాంకరభాష్యమ్:—

కార్యకరణసంఘాతాత్మప్రత్యయోఽహంకారస్తేన వివిధం నానావిధం మూఢ ఆత్మాఽన్తఃకరణం యస్య సోఽయం కార్యకరణధర్మా కార్యకరణాభిమానీ అవిద్యయా కర్మాణ్యాత్మని మన్యమానస్తత్తత్కర్మణామహం కర్తేతి మన్యతే। ॥౨౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కార్యకరణసంఘాతరూపశరీరేంద్రియాదులే యాత్మయనుజ్ఞానముచే నానావిధములుగ విమూఢమగునంతఃకరణముకల పురుషు డవిద్యచే కర్మలను తనయందే తలచుచు తత్తత్కర్మములకు నేనే కర్త నని తలచును. ॥౨౭॥

ప్రకృతియనఁగ సత్త్వరజస్తమోగుణాత్మకమగు మాయ. అది మిథ్యాజ్ఞానాత్మకము, పరమేశ్వరసంబంధినియగు శక్తియనబడును. ఈవిషయము "మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరం" అను శ్రుతిసిద్ధము. అట్టి ప్రకృతియొక్క కార్యకారణరూపములగు గుణములచే వైదికములు, లౌకికములు నగు సర్వకర్మలు చేయఁబడును. ఇట్టి ప్రకృతిగుణములచే నాచరింపబడుకర్మలను "అహంకారవిమూఢాత్మా" కార్యకరణసంఘాతమునం దాత్మజ్ఞానముచే స్వరూపవివేకాసమర్థమగు నంతఃకరణము కలవాఁడై (అనాత్మయం దాత్మాభిమానము కలవాఁడై) యజ్ఞాని కర్మలను నేనే చేయుచుంటినని తలఁచును.

శంకరానందీయము:— మూఢులకే కర్మము విహితము కాని, పండితులకు విహితము కాదని సూచించుటకు "కర్మసంగినాం" అని పూర్వశ్లోకమునందు చెప్పబడినదానినే 'ప్రకృతేః' అను శ్లోకముచే స్పష్టపరచుచుండెను. ప్రకృతి యనఁగ మాయ. అది సత్త్వరజస్తమోభూత గుణద్వారమున నాకాశాదిమహాభూతరూపముగఁ బరిణమించినది. అట్టి ప్రకృతియొక్క గుణములనఁగ కార్యభూతములగు దేహేంద్రియాదులు. అట్టి దేహేంద్రియాదులచే చేయబడునవి కర్మలు. కాని యెన్నడు నాత్మచే నాచరించబడుటలేదు. అట్టి సర్వకర్మలను గురించి యవిద్వాంసుఁ డవిద్యచే ననాత్మలగు దేహేంద్రియాదులయం దాత్మబుద్ధిచే విపరీతగ్రహణతత్పరమగు నంతఃకరణము కలవాఁడై లేక 'విమూఢః' అనుచోట నంతర్గర్భిత మగు "ణిచ్" అను ప్రత్యయము కలదు. దానివలన ప్రాప్తించిన యర్థమేదనిన— దేహేంద్రియాదులయం దహంకారముచే విమోహితుఁడై నేను ద్రష్టను, నేను స్పృశించువాఁడను, నేను శ్రోతను, నే నాఘ్రాణించువాఁడను, నేను రుచిని తెలిసికొనువాఁడను, నేను కర్తను, భోక్తను అను తత్తదుపాధిసంబంధసంభావితవిపరీతవృత్తులలో విషయాత్వమును పొందించబడిన ప్రత్యగాత్మ కలవాఁడు "అహంకారవిమూఢాత్మా" అని యనఁబడును. లేక, దేహేంద్రియాదులయం దహంకారముచే మోహపెట్టబడిన యాత్మకలవాఁడు (అనఁగ నహంప్రత్యయార్థముగ దెలియబడని యాత్మకలవాఁడు). అట్టివాఁడై నేను కర్తనని తలచుచుండెను. దృష్టాదృష్టప్రారబ్ధవశమున దేహేంద్రియాదులచే దృష్టాదృష్టకర్మములు చేయుబడుచుండ నకర్తయగు నాత్మను "నాచే పాపము చేయబడెను; పుణ్యమును చేయబడెను" అని తత్తత్క్రియాకర్తగ జూచు నని యర్థము.

శ్రీధరీయము:— "విద్వాంసునిచేఁగూడ కర్మలు చేయుదగినవే యగునో విద్వాంసునకును, అవిద్వాంసునకును గల విశేషమేమి?" అను నాశంక మీఁద విద్వదవిద్వాంసులకుగల విశేషమును రెండు శ్లోకములచే జెప్పుచున్నాఁడు. ॥౨౭॥

గీ॥ తత్త్వవిత్తు మహాబాహో! గుణకర్మవిభాగయోః ।
గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే ॥ ॥౨౮॥

పదవిభాగము:— తత్త్వవిత్- తు- మహాబాహో!- గుణకర్మవిభాగయోః- గుణాః- గుణేషు- వర్తంతే- ఇతి- మత్వా- న- సజ్జతే ॥ ॥౨౮॥

ప్రతిపదార్థము:— హేమహాబాహో!=ఓగొప్పబాహువులు కలయర్జునుడా!; గుణకర్మవిభాగయోః=గుణవిభాగముయొక్కయు, కర్మవిభాగముయొక్కయు; తత్త్వవిత్తు=తత్త్వమును తెలిసినవాఁడైనచో; గుణాః=ఇంద్రియములు; గుణేషు=విషయములయందు; వర్తంతే=ఉంటున్నవి; ఇతి=ఈవిధమున; మత్వా=తలచి; న సజ్జతే=సక్తిని పొందడు. ॥౨౮॥

శాంకరభాష్యమ్:—

యః పున ర్విద్వాన్—తత్త్వవిదితి । తత్త్వవిత్తు మహాబాహో! కస్య తత్త్వవి ద్గుణకర్మవిభాగయోః ర్గుణవిభాగస్య కర్మవిభాగస్య చ తత్త్వవి దిత్యర్థః । గుణాః కరణాత్మకా గుణేషు విషయాత్మకేషు వర్తన్తే నాత్మేతి మత్వా న సజ్జతే సక్తిం న కరోతి ॥ ॥౨౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓగొప్పబాహువులుఁకల యర్జునా! ఎవఁడు విద్వాంసుడో అట్టివాఁడు గుణవిభాగముయొక్కయు, కర్మవిభాగముయొక్కయు యాథార్థ్యమును తెలిసికొనినవాఁడై "ఇంద్రియములు విషయములయందు వర్తించుచున్నవి. ఆత్మ వర్తించుటలేదు" అని తలచి కర్మలయందు దృఢతరకర్తృత్వాభిమానమును చేయఁడు. ॥౨౮॥

—• ౩వ అధ్యాయము ౨౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "గుణకర్మవిభాగయోః" (గుణాశ్చ కర్మాణిచ తయో స్స్వమాహార ఇతి, గుణకర్మేతి ద్వంద్వైకవద్భావః గుణకర్మ చ-విభాగశ్చ గుణకర్మవిభాగావితి విగ్రహః) గుణములనగ నహంకారాస్పదములగు దేహేంద్రియాంతఃకరణములు. కర్మలనగ మమకారాస్పదములగు దేహేంద్రియాంతఃకరణవ్యాపారములు. విభాగమనగ 'విభజ్యతే సర్వేషాం జడానాం వికారిణాం భాసకత్వేన పృథక్ప్రతీతి విభాగః' (జడములగు సర్వవికారములకు భాసక మగుటచే పృథక్కుగ నుండునది విభాగ మనఁబడును. అది యేదనిన స్వప్రకాశజ్ఞానరూపము, అసంగమునగు నాత్మయే. అట్టి దేహేంద్రియాంతఃకరణాదులయొక్కయు దేహేంద్రియాంతఃకరణవ్యాపారములయొక్కయు,అసంగము, స్వప్రకాశము, జ్ఞానరూపమునగు నాత్మయొక్కయు యాథాత్మ్యమును తెలిసికొనినవాడు—'దేహేంద్రియాదులు వికారులగుటంజేసి విషయములయందు ప్రవర్తించుచున్నవి. నిర్వికారమగు నాత్మవిషయములయందు బ్రివర్తించుటలే'' దని దలచి యతత్త్వవేత్తగలె కర్తృత్వాభినివేశమును (చేయుఁడు) పొందఁడు. ఈశ్లోకమున "హేమహాబాహో!'' అని యర్జునుని సంబోధించుటచే సాముద్రికశాస్త్రోక్తసత్పురుషలక్షణములు నీయందు కలవు. కాన నోయర్జునా! నీవు ఇతరజనుడువలె నవివేకి వగుటకు తగవని సూచింపబడెను. కొందరు ద్వంద్వసమాసాంతమందు శ్రూయమాణమగు పదము ప్రత్యేకము సంబధించును కాన నిట 'గుణశ్చ కర్మచ గుణకర్మణీ, విభాగశ్చ విభాగశ్చ విభాగా, గుణకర్మణోఃవిభాగా గుణకర్మవిభాగా తయోః గుణకర్మవిభాగయోః' అని విగ్రహము జెప్పి, గుణవిభాగముయొక్కయు, కర్మవిభాగముయొక్కయు తత్త్వమును దెలిసినవాడని యర్థమును జెప్పమండిరి. ఈపక్షమున "గుణకర్మణోః అనునంతమాత్రమే సరిపడునుండ విభాగపద మెందులకిచట జెప్పబడెనో అప్రయోజనము చింత్యము.

శంకరానందీయము:— "విద్వాన్ స్యక్తః" అనుదానిచే నాత్మ దేహేంద్రియ తత్కర్మసంబంధరహిత మని విద్వాంసుడు తెలిసికొననగును. అని చెప్పబడెను. అదియే విద్వాంసునకు "తత్త్వవిత్తు" అను శ్లోకముచే జెప్పఁబడుచుండెను 'గుణకర్మవిభాగయోః' ఇట 'గుణాః-కర్మచ గుణకర్మణీ, విభాగశ్చ విభాగశ్చ విభాగౌ, గుణకర్మణో ర్విభాగౌ గుణకర్మవిభాగౌ, తయోః గుణకర్మవిభాగయోః" అని విగ్రహము. విభాగపదము ద్వంద్వాంతమునందు శ్రూయమాణమగుటచే ప్రత్యేకము సంబంధించును. అనఁగా గుణవిభాగముయొక్కయు, కర్మవిభాగముయొక్కయు తత్త్వము నెరిగినవాఁడు 'తత్త్వవిత్' అనంబడును. త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములనెడి పంచజ్ఞానేంద్రియములు, వాక్పాదపాణిపాయూపస్థలనెడి పంచకర్మేంద్రియములు, మనోబుద్ధులు నివి గుణములనఁబడును. అందు చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములకే స్పర్శనదర్శనశ్రవణరాసనఘ్రాణనక్రియ లనియు, వాక్పాదపాణిపాయూపస్థలకే వచనగమనాదానవిసర్గానందనాదిక్రియలనియు, బుద్ధికే యహంకరణ క్రియయనియు, మనస్సునకే సంకల్పక్రియయనియు ఆత్మకైతే కూటస్థాసంగచిద్రూపముచే నవస్థానమాత్రమని యిట్లు గుణవిభాగముయొక్కయు, కర్మవిభాగముయొక్కయు, ఆత్మయొక్కయు దత్త్వమును తెలిసినవిద్వాంసుడు– ('తత్త్వవిత్' అను స్థలమునందుకల 'తు' అను నవ్యయముచే నవిద్వాంసుడు కాడని యర్థము జెప్పబడును.) సర్వకర్మలయందు "గుణాః" చక్షురాదులే 'గుణేషు' రూపాదులయందు ప్రవర్తించుచున్నవి. బుద్ధియే చక్షురాదికర్మలయందు 'నేనుకర్తను' అని యహంకారమును పొందుచున్నది. నేనైతే వినను, చూడను, పలుకను, చేయను, నడువను, మరేమనిన కూటస్థాసంగచిద్రూపముచే సర్వదా తూష్ణీంభావముగ నుంటినని తలచి యా చక్షురాదితత్తత్కర్మలయందు "నేను, నాసంబంధమైనది" అను జ్ఞానమును పొందడు.

భాష్యోత్కర్షదీపిక:— "తత్త్వవిత్తు తుశబ్దోఽజ్ఞాద్వైలక్షణ్యద్యోతనార్థః। కస్య తత్త్వవి దిత్యత ఆహ– గుణకర్మవిభాగయో ర్గుణవిభాగస్య, కర్మవిభాగస్యచ తత్త్వవి దిత్యర్థః" అని భగవత్పాదుల భాష్యము నుదహరించి, యాభాష్యమున కర్థము నీక్రిందివిధమున భాష్యోత్కర్షదీపికాకారులు వర్ణించుచుండెను.

"నేను కార్యకరణసంఘాతరూపుడను కాను" అనిగుణములనుండి యాత్మకు విభాగము. కర్మలు నాసంబంధమైనవి కావని కర్మలనుండి యాత్మకు విభాగము, ఇట్టి గుణకర్మలనుండి విభక్తమగు నాత్మయొక్క సాక్షాత్కారము కలవాఁడహంకారవిమూఢాత్మ కాఁడు; కర్మలయం దాసక్తుఁడు కాఁడు. ఈశ్లోకమునందు విభాగ పదము లేనిచో నిట్టి యర్థము ప్రాప్తించదు. ఇట "విభాగశ్చ-విభాగశ్చ విభాగౌ, గుణకర్మభ్యో విభాగౌ గుణకర్మవిభాగౌ, తయో ర్గుణకర్మవిభాగయోః" అనివిగ్రహము చెప్పనొప్పును. ఇట్టి విగ్రహమును జెప్పుటచే "గుణవిభాగముయొక్క గాని, కర్మవిభాగముయొక్క గాని తత్త్వమును దెలిసికొనినవాడు" అను నర్థమున "గుణకర్మణోః" అనునంతమాత్రముననే వివక్షితార్థము సిద్ధించుచుండ విభాగపదము వ్యర్థ" మను మధుసూదన సరస్వతుల శంక తొలగించబడెను.

ఈమధుసూదనసరస్వతులే 'గుణాశ్చ- కర్మాణి చ తయోస్సమాహారః గుణకర్మ, గుణకర్మచ విభాగశ్చ గుణకర్మవిభాగౌ' అని విగ్రహము చెప్పి గుణము అనఁగ నహంకారాస్పదములగు దేహేంద్రియ మనోబుద్ధు లనియు, కర్మ అనఁగ మమకారాస్పదము అగు దేహేంద్రియమనోబుద్ధుల వ్యాపారము అనియు, విభాగ మనఁగ వికారు లగు జడములకు భాసక మగుటచే వానికంటె వేఱగు స్వప్రకాశాసంగజ్ఞానరూప మగు నాత్మ యనియు, నీవిధముగ భాస్యభాసకములు,జడచైతన్యరూపములు, వికారినిర్వికారులునగు గుణకర్మవిభాగముల యాథాత్మ్యము నెవఁడు తెలుసుకొనునో" యని వ్యాఖ్యానించిరి. ఇట్టి వ్యాఖ్యానము చింత్యము. ఎందువల ననిన? "గుణకర్మ చ-విభాగశ్చ గుణకర్మవిభాగౌ" అనికదా విగ్రహమును వర్ణించిరి. అట్లగుచో నిది ద్వంద్వసమాసము. అందు "అల్పాచ్తరం పూర్వం అను నియమముచేతను, "అభ్యర్హితతమం పూర్వం" అను నియమముచేతను, అల్పా

చ్చులు కలదియు, అభ్యర్హితతమమునగు విభాగపదము పూర్వమునందును, గుణకర్మపదము పరమునందును నుండ వలసివచ్చును. అట్లగుచో 'విభాగగుణకర్మణోః' అని గీతయందుండవలసివచ్చును. అట్లుండక "గుణకర్మవిభాగయోః" అని విభాగపద ముత్తరముననే యుండుటవలన నిట్టి విగ్రహమును వ్రాసి యర్థమును వర్ణించుట న్యాయము కాదు. ఈప్రయోగము ఛాందసమనినను, నిపాతప్రకరణ మనిత్యమనినను ఈప్రయోగము కుదురును. కాని భాష్యోక్తరీతిని గతియుండ నిట్టివిగ్రహములను కల్పించి యెట్లో సమర్థించుట యనుచితము. విభాగపదమునకు ప్రసిద్ధార్థమును విడచి, యప్రసిద్ధార్థమును కల్పించుటయు, క్లిష్టకల్పనయు ననుచితమే యగును.

కొందరు— ఎవడు తత్త్వవేత్తయో వాడు- 'గుణాః' ధీచక్షురాదులు "గుణేషు" దుఃఖరూపాదుల యందు 'వర్తన్తే' ఉంటున్నవి. అని తలఁచి గుణవిభాగమునందుఁ గాని, కర్మవిభాగమునందుఁ గాని సక్తుఁడు కాఁడని యోజనచేయుచుండిరి. "గుణానాం" సత్త్వరజస్తమస్సుల యొక్క, "విభాగః" విభజనము. అనఁగా బుద్ధ్యహంకారజ్ఞానేంద్రియవిషయరూపములచే వేరుపరచి యుండుటయే. అట్టిదానియందు "న సజ్జతే" 'ఇది' యనియు, "నేను" అనియు తలచడు. ఈచెప్పుటచే కర్మవిభజనముకూడ సాకాఙ్క్షమగుటచే వ్యాఖ్యానింపఁ బడెను. అట్లుకానిచో చిదాత్మయందే యాదానాదికర్తృత్వము, దుఃఖాదిమత్త్వముగూడ సంభవించెడిని. తెలివ యాశయమేమి? ఆత్మానాత్మల యాథాత్మ్యమును తెలిసినవాడు వ్యాపృతములగు నహంకారాదులయందును, తత్కార్యములగు నభిమానాదులయందును కుసుమములందు సూత్రమువలె ననువర్తమానమగు నాత్మను అహంకారాదులకంటె పృథగ్భూతముగ తెలిసికొని ధీచక్షురాదులు దుఃఖరూపాదులయం దనువర్తించుచున్నవి కానిఆత్మ యనువర్తించుటలేదని తెలిసికొని "హస్తాదిరూపసంఘాతము నేనే, ఈయాదానాదికర్మము నాసంబంధమైనదే" అని సక్తుడు కాడని యర్థమును వర్ణించెదరు. ఈయర్థవర్ణనముకూడ విచారింపదగినదే. ఇట్టి యర్థము "గుణకర్మణోః న సజ్జతే" అను వాక్యమువలననే సంభవించుచుండ విభాగపదమున కీవ్యాఖ్యయం దవశ్యము వైయర్థ్యము తప్పదు. కాన నీవ్యాఖ్యానము విచారింపవలసినదే. మఱియు నిట్టి వ్యాఖ్యానమునందు "తథాచేత్యాది" గ్రంథమునకు స్వవ్యాఖ్యానానురూపత్వము సంభవించును. (అనగా "ఆత్మానాత్మల యాథాత్మ్యమును తెలిసిన వాడు" అను గ్రంథమునకు స్వవ్యాఖ్యానానురూపత్వము సంభవించునని యాశయము).

కరణాత్మకములగు గుణములు విషయములయందు ప్రవర్తించుచున్నవి. ఆత్మ వర్తించుటలేదు." అనితలచి కర్తృత్వాభినివేశమును చేయడు. 'గొప్పబాహువులు శత్రుహననమునందు ప్రవర్తించుచున్నవి. నేను ప్రవర్తించుటలేదు" అని నీవును తలచి కర్తృత్వాభినివేశమును చేయుటకు తగదని 'హే మహాబాహో!' అను సంబోధనచే సూచితమయ్యెను.

స్వాభిప్రాయము:— మధుసూదనసరస్వతులు "గుణాశ్చ-కర్మాణిచ తయో స్సమాహారః గుణకర్మ, గుణకర్మ చ-విభాగశ్చ గుణకర్మవిభాగౌ" అనివిగ్రహమును వ్రాసిరి. ఈవిగ్రహము ద్వంద్వము-ద్వంద్వసమాసమున నల్పాచ్చులు గల పదము పూర్వమునందును, బహ్వచ్చులుగల పద ముత్తరమునందు నుండవలెను. అని భాష్యోత్కర్షదీపికాకారులు మధుసూదనసరస్వతుల నాక్షేపించి ఛాందసప్రయోగమనియో; నిపాతప్రకరణ మనిత్యమనియో సమాధానము చెప్పవచ్చును. కాని తాము చెప్పినవిధమున భాష్యోక్తరీతిని సరిపడుచుండ క్లిష్టకల్పన చేయుట యనుచితమనియు, విభాగశబ్దమునకు ప్రసిద్ధార్థపరిత్యాగరూపదోషము సంభవించుననియు నాక్షేపించిరి.

ఇట విచారింతము-భాష్యోత్కర్షదీపికాకారులు మధుసూదనసరస్వతులను పదేపదే యాక్షేపించు స్వభావముచే 'గుణకర్మవిభాగయోః' అనుచోటగూడ నల్పాచ్చులుగల పదము ద్వంద్వసమాసమున పూర్వమునం దుండవలెనని యాక్షేపించి, యెట్టకేలకు సమర్థించువానివలె "ఇది ఛాందసప్రయోగమనిన సరిపడును. కాని' అని ఛాందసప్రయోగముగ సమర్థించువానివలె ప్రథమమున ప్రవర్తించిరి. ఛాందసప్రయోగమనుట యెటులను సమర్థించు

-టకు వీలుపడకయే కదా! అట్లే యీమధుసూదనసరస్వతుల విగ్రహ మెటుమూచిన సరిపడదని యాక్షేపించుటకు బదులు ఛాందసమని చెప్ప మొదలిడిరి. కాని యంతమాత్రముతో నూరకుండిన తనకు వ్యాకరణమునందుగల యశక్తత్వము బయల్పడునని కాబోలు నిపాతప్రకరణ మనిత్యమనివ్రాసి మధుసూదనసరస్వతుల విగ్రహమును సమర్థించి దోషాంతరమును జెప్పుటకు మొదలిడిరి. అనఁగ "లక్షణహేత్వోః క్రియాయాః" అను సూత్రమునందున్న "లక్షణహేత్వోః" అను వాక్యము ద్వంద్వసమాసము. ఈద్వంద్వసమాసమున హేతుశబ్ద మల్పాచ్చులు గలది. "అల్పాచ్‌తరం పూర్వం" అను శాస్త్రము నిత్యమే యైనచో సూత్రకారులు హేతుశబ్దమును లక్షణశబ్దమునకుఁ బూర్వమునందు ప్రయోగింపవలయును. అట్లు ప్రయోగించక లక్షణశబ్దమునకు పరమునందే హేతుశబ్దమును ప్రయోగించుటచే 'అల్పాచ్చులు గల శబ్దమును ద్వంద్వసమాసమున పూర్వమునందు ప్రయోగించవలయు' నను శాస్త్ర మనిత్యమని స్పష్టమగుచున్నది. అని యూహించి భాష్యోత్కర్షదీపికాకారులు మరియొక దోషమును జెప్ప మొదలిడిరి కాబోలు! అదియును విచారింతము. భాష్యకారులు వర్ణించిన యర్థ మొకటి కావచ్చును. దానినే యితరు లనుసరించవలె నను నియమ మెచ్చటిది? ప్రకృతమునకు విరోధము లేకుండగ నితరులు శబ్దమునకు మఱియొకవిధముగ నర్థమును వర్ణింపఁగూడ దను నియమ మెక్కడిది? ఎచ్చట నిట్టి నియమములేదు. మరి ప్రసిద్ధార్థపరిత్యాగ మనెదరా? ప్రసిద్ధార్థమన రూఢ్యర్థమా? లేక శక్యార్థమా? "యోగా ద్రూఢి ర్బలీయసీ" అను నియమమున రూఢ్యర్థపరిత్యాగము సంభవించుననెదరా? పంకజాదిశబ్దమువలె నీవిభాగశబ్దమునకెచ్చోటను రూఢయని యెవరు నిర్ణయించిరి? తార్కికులు విభాగశబ్దమును విభాగమనెడి గుణపరముగ వాడుచుండిరి. అదియు "విపూర్వకభజ్" ధాత్వర్థమే యని గదాధరభట్టాచార్యులవారు శక్యార్థముగనే వ్యుత్పత్తివాద ప్రథమాకారమునందు జెప్పియుండిరి. కాన నీవిభాగపద మెచ్చటను రూఢ్యర్థము కలదని యెవరును జెప్పియుండలేదు. ఇక శక్యార్థమే ప్రసిద్ధార్థ మనెదరా? శక్తిచే ననేకార్థములు నిరూపించఁబడుచుండ నిది ప్రసిద్ధార్థమనియు, నిది కాదనియు, నెవరు నిర్ణయింపఁగలరు. కాన ద్వేషభావముచే పదేపదే మధుసూదనసరస్వతుల నెత్తిపొడుచుట భాష్యోత్కర్షదీపికాకారుల స్వభావవైషమ్యమే గాని మధుసూదనసరస్వతుల వ్యాఖ్యయందు దోషము లేదని మా యాశయము.

పరమార్థప్రప:— "తత్త్వవిత్తు" అను శ్లోకముచే జ్ఞానికి విశేషమును జెప్పుచుండెను. "నేను గుణస్వరూపుడను కాను" అని. (తాను గుణములకంటె వేరగుట గుణవిభాగము) "కర్మలు నాసంబంధమైనవి కా" వని తాను కర్మలకంటె వేరగుట కర్మవిభాగము. అట్టి గుణకర్మవిభాగముల తత్త్వమును దెలిసినవాఁ డింద్రియములు విషయములయందు వాని స్వభావమువలన ప్రవృత్తము లని తలఁచి కర్తృత్వాభినివేశమును పొందడు. ఈవిషయమే "ధూలిధూమాభ్రమైర్వ్యోమ్నో న్నమలినం క్రియతే నభః। పరామృష్ట స్తథైవాత్మా విశుద్ధః ప్రాకృతై ర్గుణైః" (ధూమముచేతను, ధూళిచేతను, మేఘములచేతను నేవిధముగ నాకాశము మలినముగఁ జేయఁబడునో; అట్లే ప్రకృతిసంబంధమగు సత్త్వరజస్తమస్సులచే విశుద్ధమగు నాత్మ పరామృష్టము. (కర్తృత్వాద్యభిమానము కలదిగ చేయబడుచున్నది.) ఇట్టి కర్తృత్వాద్యభిమానమే యాత్మకు మాలిన్యము. పైజెప్పఁబడిన దృష్టాంతముచే కర్తృత్వాద్యభిమాన మాత్మకు స్వాభావికము కాదనియు, ఆగంతుకమనియు, నది తత్త్వజ్ఞానముచే నశించుననియు స్పష్టమగుచున్నది.

నీలకంఠీయము:— ఇట్లు సక్తునకు కర్మాచరణము చెప్పి, యసక్తునకు కర్మాచరణము "తత్త్వవిత్తు" అను శ్లోకముచే చెప్పుచుండెను. "గుణకర్మవిభాగయోః" అనుచోట "గుణవిభాగకర్మవిభాగములయొక్క తత్త్వ మెరిగినవాఁడు" అని శ్రీశంకరభగవత్పాదులు వ్యాఖ్యానించిరి. "నేను గుణాత్మకుఁడను కాను" అని గుణములనుండి యాత్మకు విభాగము, "నేను కర్మాత్మకుఁడను కాను" అని కర్మలనుండి యాత్మకు విభాగము. ఇట్టి గుణకర్మల విభాగములయొక్క తత్త్వ మెరిగినవాఁడని శ్రీధరులు వ్యాఖ్యానించిరి. గుణము లనఁగ నహంకారాస్పదము

అగు దేహేంద్రియాంతఃకరణములు. కర్మ అనఁగ నహంకారాస్పదము లగు దేహేంద్రియాంతఃకరణవ్యాపారములు. అవి మమకారాస్పదములు. “గుణశ్చ కర్మ తయోః స్సమాహారః గుణకర్మ అని ద్వంద్వైకవద్భావము. “విభజ్యత ఇతి విభాగః” నిఖిలజడపదార్థములకు భాసకమై వేరుగ నుండు స్వప్రకాశజ్ఞానరూపము, అసంగము నగు నాత్మ విభాగశబ్దముచే చెప్పఁబడును. గుణకర్మ చ-విభాగశ్చ గుణకర్మవిభాగౌ తయో ర్గుణకర్మవిభాగయోః అని విగ్రహము. అట్టి జడాజడముల యాథాత్మ్యమును తెలిసినవాఁడు గుణములు (కరణములు) గుణములయందు (విషయములయందు) ప్రవర్తించుచున్న వని తలంచి కర్తృత్వాభినివేశమును చెయ్య (పొంద)ఁ డని మధుసూదనసరస్వతులు వివరించిరి. ‘గుణవిభాగకర్మవిభాగములయొక్క తత్త్వ మెరిగినవాఁడు’ అను భగవత్పాదుల పక్షమున “గుణకర్మయో స్తత్త్వవిత్” గుణకర్మల తత్త్వమును తెలిసినవాఁడు అనునంతమాత్రము సరిపడుచుండ విభాగపదము వ్యర్థ మని తెలిసికొనవలెను. లేక ఎవఁడు తత్త్వవేత్త యో వాఁడు “గుణము లగు నింద్రియాదులు విషయములయందు ప్రవర్తించుచున్న” వని తలఁచి గుణవిభాగకర్మవిభాగములందు సక్తుఁడు కాఁడు. అని మూలమును యోజన చేయ నగును. గుణము లనఁగ సత్త్వరజస్తమస్సులు. వాని విభాగ మనగ బుద్ధ్యహంకారజ్ఞానేంద్రియకర్మేంద్రియవిషయరూపముగ విభాగ మొనరించి యుండుట. అట్టిదానియందు “ఇది, నేనే” అని తలవఁడు. అది యెట్లనిన? శరీరము గౌరవర్ణముకలదై యుండ ‘నేను గౌరవర్ణము కలవాడ’ననియు హస్తములచే వస్తువు తీసికొనబడుచుండ “నాచే నిది తీసికొనబడుచుండె” ననియు చక్షుస్సుచే చూడబడుచుండ ‘నాచే నిది చూడబడుచుండె’ ననియు, అహంకారముచే నభిమతమగుచుండ “నాచే నిది యభిమానింపబడుచుండె” ననియు, బుద్ధి వికారమును బొందుచుండ “నేను సుఖి” ననియు, బుద్ధ్యాదు లన్నియు ప్రత్యేకగ్రహ్యమాణము లైనను బుద్ధ్యాదులయందు ప్రత్యగ్రూపత్వము నధ్యసించి ‘ఇది నేను’ అనియు, ‘ఇది నా సంబంధ మగు కర్మ’ యనియు తలఁచుచున్నాడు. ఈ చెప్పుటవలన కర్మవిభజనముకూడ నావశ్యక మగుటచే వ్యాఖ్యానించఁబడెను. అట్లు కానిచో చిదాత్మయందే యాదానాదికర్తృత్వదుఃఖాదిమత్త్వములు సంభవించెడివి. దీనినే “అంధో మణి మవిందత్, త మనంగులి రావయత్ అగ్రీవః ప్రత్యముంచత్ త మజిహ్వో అసశ్చత” (స్వయంప్రకాశహీన మైనను చక్షురాదులు రూపాదివిషయము లను ప్రకాశింపఁజేయుచున్నవి. కాష్టలోష్టాదులవలె జడ మగుటవలన స్వయముగ కర్మను చేయుట కశక్తమైనను హస్తాదులు వస్తువును స్వీకరించుచున్నవి. తెగగొట్టఁబడిన శిరస్సు కలవాడువలె నిర్జీవమగు నహంకారము కంఠమందు విషయమును ధరించుచున్నది. నాచే నిది పొందఁబడె నని తలచుచున్నది. వస్త్రము తనయందుండు రూపాదులయొక్క ప్రకాశనమం దసమర్థమైనటుల “అజిహ్వా” బుద్ధి తనయందుండు సుఖదుఃఖములయొక్క ప్రకాశనాసమర్థమైనను “నేను సుఖిని, నేను దుఃఖిని” అని సుఖదుఃఖంబుల ననుభవించుచున్నది.) అనియు శ్రుతి బోధించుచున్నది. ఇంతవరకు తేలిన యాశయ మేమి? ఆత్మానాత్మలయొక్క యాథాత్మ్య మెరిగిన తత్త్వవేత్త వ్యావృత్తంబులగు అనఁగా నొకదానియం దొకటి యుండనట్టి కుసుమంబులయందు సూత్రమను స్యూతమైనటుల వ్యావృత్తాహంకారాదులయందు, తత్కర్మ అగు నభిమానాదులయం దనువృత్తంబు వ్యావృత్తంబులకంటె భిన్నంబు నగు నాత్మను దెలిసికొని బుద్ధిచక్షురాదులు దుఃఖరూపాదులం బొందుచున్నవి. ఆత్మస్వరూపంబు ప్రవర్తించుట లేదు. అని తలఁచి హస్తాదిసంఘాతంబు నేనే, నాసంబంధమైనదే, ఈయాదానాదిక మంతయు కర్మ అని సక్తుఁడు గాఁడు. ॥ ౨౮ ॥

గీ॥ ప్రకృతే ర్గుణసంమూఢాః సజ్జంతే గుణకర్మసు ।
తా నకృత్స్నవిదో మందా న్కృత్స్నవి న్న విచాలయేత్ ॥ ॥౨౯॥

పదవిభాగము:— ప్రకృతేః- గుణసంమూఢాః- సజ్జన్తే- గుణకర్మసు- తాన్- అకృత్స్నవిదః- మందాన్- కృత్స్నవిత్- న- విచాలయేత్ । ॥౨౯॥

ప్రతిపదార్థము:— యే=(ఈపద మధ్యాహార్యము) ఏపురుషులు; ప్రకృతేః=ప్రకృతియొక్క; గుణసంమూఢాః, గుణ=కార్యకరణరూపవికారములచే; సంమూఢాః=లెస్సగ మోహితులై; గుణకర్మసు, గుణ=ఇంద్రియములయొక్క, కర్మసు=కర్మలయందు; సజ్జన్తే=ఆసక్తికలవార లగుచుండిరో; అకృత్స్నవిదః=సర్వమును తెలిసికొననట్టి (కర్మఫలమాత్రమును తెలిసికొనినట్టి); తాన్=ఆ; మందాన్=మందప్రజ్ఞ లగువారలను; కృత్స్నవిత్=ఆత్మవేత్త; న విచాలయేత్=చలింపచేయరాదు. ॥౨౯॥

---

శాంకరభాష్యమ్:—

యే పునః— ప్రకృతే రితి । ప్రకృతే ర్గుణై స్సమ్య క్మూఢా స్సంమోహితా స్సన్త స్సజ్జన్తే గుణానాం కర్మసు గుణకర్మసు వయం కర్మ కుర్మః ఫలాయేతి, తా న్కర్మసఙ్గినోఽకృత్స్నవిదః కర్మఫలమాత్రదర్శినో మందా న్మందప్రజ్ఞా న్కృత్స్నవి దాత్మవి త్స్వయం న విచాలయే ద్బుద్ధిభేదకరణ మేవ చాలనం త న్న కుర్యా దిత్యర్థః ॥ ॥౨౯॥

---

శాంకరభాష్యతాత్పర్యము:—

విద్వాంసుఁడు, అవిద్వాంసుఁ డనెడిఁయుభయులను ప్రకృతముగ చేసికొని విద్వాంసుఁడవిద్వాంసునియొక్క బుద్ధిభేదమును చేయరా దని యీశ్లోకమునం దుపసంహరించుచుండెను.

ఏమానవులు ప్రకృతియొక్క కార్యకరణరూపమగు దేహాదులచే లెస్సగ మోహితులై 'మేము ఫలముకొఱకు కర్మము నాచరించుచుంటిమి' అని యాదేహాదుల వ్యాపారమునందే దృఢతరమగు నాత్మీయబుద్ధిని చేయుదురో- కర్మసంగులు, ఆత్మజ్ఞానశూన్యులు, కర్మఫలమాత్రమునే గుర్తించెడివారు నగు యా మందప్రజ్ఞులకు ఆత్మవేత్త స్వయముగ బుద్ధిభేదమును చేయరాదు. (అనగా కర్మలతో నేమియు ప్రయోజనము లేదు. కర్మలను వదలు డని బోధించి కర్మలయందుఁగల శ్రద్ధాపూర్వక మగు బుద్ధిని తొలగింపరా దని భావము.) ॥౨౯॥

---

—• ౩వ అధ్యాయము ౨౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇట్లు విద్వాంసునకు, నవిద్వాంసునకు కర్మానుష్ఠానసామ్య ముండుటచే విద్వాంసు డవిద్వాంసునకు బుద్ధిభేదమును జేయరాదని జెప్పిన విషయమునే 'ప్రకృతేః' అను శ్లోకముచే నుపసంహరించుచుండెను. మాయాసంబంధమగు గుణములచే (అనగా మాయాకార్యములగుటచే మాయాధర్మములగు వికారభూతములైన దేహాదులచే) లెస్సగ మూఢులు (అనగా స్వస్వరూపాస్ఫురణచే దేహేంద్రియాదులనే యాత్మగ తలచెడివారు) దేహేంద్రియాంతఃకరణవ్యాపారములయందు "మేము కర్మఫలముకొఱకు కర్మల నాచరించుచుంటిమి" అని దృఢతరమగు నాత్మీయబుద్ధి కలవారగుచుండిరి. అట్టి కర్మసంగులు, అనాత్మాభిమానులు, చిత్తపరిశుద్ధి లేమింజేసి జ్ఞానాధికారమును పొందనివారు. అట్టివారలను పరిపూర్ణాత్మతత్త్వమును దెలిసినవాడు కర్మ

శ్రద్ధనుండి విడిపింపవలదు. శుద్ధాంతఃకరణులు స్వయముగ వివేకోదయమైనచో చలింపరు. అనగా జ్ఞానాధికారము నొందెదరని యభిప్రాయము. కృత్స్నాకృత్స్నశబ్దము లాత్మానాత్మపరములుగ వార్తికకారులు వ్యాఖ్యానించిరి. "సదేవేత్యాదివాక్యేభ్యః కృత్స్నం వస్తు యతోఽద్వయం । సంభవ స్త్వద్విరుద్ధస్య కుతోఽకృత్స్నస్య వస్తునః ॥ యస్మి న్దృష్టే పృథగ్దృష్టోఽర్థ స్స తదన్యశ్చ శిష్యతే । తథాఽదృష్టేఽపి దృష్టి స్స్యా దకృత్స్న స్తాన్ ఉచ్యతే" (అనాత్మ సావయవ మగుటచేతను, అనేకధర్మములు కలదగుటవలనను ఒకానొకధర్మపురస్సరముగ నొకానొక యవయవపురస్సరముగ నొక ఘటాదికము జూడఁబడినను ధర్మాంతరపురస్సరముగ నవయవాంతరపురస్సరముగ నాఘట మజ్ఞాతమే యగును. ఎట్లనిన— ఒక ఘటమునందు ఘటత్వము, రజతత్వము అను రెండు ధర్మములు కల వనుకొనుఁడు! అం దాఘటము ఘటత్వపురస్సరముగఁ దెలియఁబడినను, రజతత్వధర్మపురస్సరముగఁ దెలియఁబడనిదగు నని యాశయము.) అటులే ఘటము జ్ఞాతమైనను పట మజ్ఞాత మగును. అటులే ఘటాదిక మజ్ఞాతమైన పటాదికము జ్ఞాత మగును. పటము జ్ఞాతమైనను తద్భిన్నముయొక్క యజ్ఞానమువలన పట మజ్ఞాతమైనను ఘటజ్ఞానము కలుగుటవలనను ఘటపటాదిక మకృత్స్న మనఁబడును. ఆత్మ జ్ఞాత మగుచో నిఖిలము జ్ఞాత మగుటంబట్టి యద్వయాత్మ కృత్స్న మనఁబడు నని వార్తికకారులు స్పష్టముగ కృత్స్నాకృత్స్నశబ్దములకు ఆత్మానాత్మ అని యర్థమును జెప్పియుండిరి.

శంకరానందీయము:— దేహేంద్రియాదులచే కర్మలు చేయఁబడుచుండ తా నకర్త నని తెలిసికొనువాఁడు విద్వాంసుఁ డనఁబడును. అట్టి విద్వాంసుఁడు తపకంటె విలక్షణులు, కర్ములు నగు నజ్ఞానులను ప్రమాదముచేనైన చలింపఁజేయరా దని చెప్పినవిషయమునే తిరిగి చెప్పి దృఢపరచుచుండెను. 'ప్రకృతే ర్గుణసంమూఢాః' అనుదానిచే కర్ములకు విద్వద్వైలక్షణ్యమును చెప్పుచుండెను. ప్రకృతియొక్క కార్యములగు దేహేంద్రియాదులయం దహంబుద్ధిచే తదాత్మత్వమును బొందిన పామరులు స్వయముగ శ్రవణాదీంద్రియములచేతను, వాగాదీంద్రియములచేతను క్రియమాణ మగు శ్రవణదర్శనవచనాదానభోజనాదులయందు "నేనే శ్రోతను, ద్రష్టను, వక్తను, దాతను, కర్తను, భోక్తను" అని యభినివేశమును పొందెదరు. బ్రహ్మవేత్తలు కానట్టి కర్ములగునట్టి యజ్ఞులను, బ్రహ్మవేత్త— కావునచే కర్మ నాచరింపరాదని కాని, కర్మఫల మసద్రూప మని కాని, కర్త్రాదికము మిథ్య యని కాని, నీవు బ్రహ్మస్వరూప మని కాని, నీ కేదియు చేయఁదగినది లేదని కాని బోధించి కర్మలనుండి చలింపఁజేయరాదు. మరేమిచేయవలయు ననిన? కర్మస్తుతిచే కర్మలయం దట్టి మందబుద్ధులను ప్రవర్తింపజేయవలెను.

భాష్యోత్కర్షదీపిక:— ప్రకృతమగు విద్వ దవిద్వత్స్వరూపమును చెప్పి విద్వాంసుఁ డవిద్వాంసునకు బుద్ధిభేదమును చేయరాదని "ప్రకృతేః" అను శ్లోకముచేఁ బ్రకృతప్రకరణము నుపసంహరించుచుండెను.

ప్రధానరూపమైన మాయాశక్తియొక్క వికారములగు కార్యకరణములచే లెస్సఁగ సంమూఢులు (అనఁగా స్వస్వరూపముయొక్క స్ఫురణము లేమింజేసి యా కార్యకరణములనే యాత్మనుగఁ దలచువారని యర్థము) అట్టివారు కార్యకరణకర్మలయందు (వ్యాపారములయందు) 'మేము ఫలముకొఱకు చేయుచుంటిమి' అని దృఢతరముగ తెలిసికొనుచుండిరి. వారలు గుణసంగులుకనుకనే యాత్మజ్ఞానశూన్యులు. మందప్రజ్ఞులగు నట్టివారల కాత్మవేత్త బుద్ధిభేదమును చేయరాదు. "ఆత్మనో వా అరే దర్శనేన శ్రవణేన మత్యా విజ్ఞానేనేదం సర్వం విదితమ్" అను బృహదారణ్యకశ్రుతి కృత్స్నవిత్త్వమును చెప్పుటచే నిచటగల "కృత్స్నవిత్" అను పదమునకు బ్రహ్మవేత్త యని యర్థము.

కొందరు (శ్రీధరాచార్యులవారు, పరమార్థప్రపాకారులు) "ప్రకృతే ర్గుణసంమూఢాః" అనుచోట ప్రకృతియొక్క గుణము లనఁగ సత్త్వరజస్తమస్సు లనియు, వానిచే సంమూఢు లని యర్థమును వర్ణించిరి. ఇట్టి

యర్థవర్ణనము భాష్యవిరుద్ధమగుటచే నుపాదేయము కాదు. మఱియు 'ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః' అనుచోట పైనుదహరించబడిన వారిరువురు "ప్రకృతివికారములగు నింద్రియములచే చేయబడుకర్మ లను" అని వ్యాఖ్యానించి యిచట నాశబ్దములకే ప్రకృతియొక్క గుణములగు సత్త్వరజస్తమస్సులచే నని వ్యాఖ్యానించుటచే స్వోక్తివిరోధము ప్రాప్తించును. మఱియు దేహేంద్రియాద్యాసక్తి 'గుణసంమూఢాః' అను పదముచేతనే చెప్పబడుటవలన "గుణములగు నింద్రియములయందు, తత్కర్మలయందు" అను వ్యాఖ్యానము నిరస్తము. మఱియు 'ప్రకృతేః' అనుపదమునకు 'గుణకర్మసు' అను పదముతో సంబంధమును చెప్పుటలో ప్రయోజన మేమియు కానరానందున ప్రకృతిసంబంధము గుణభూతములగు దేహాదులయందు, కర్మలగు గమనా దులయందు అని వ్యాఖ్యానించుట వ్యర్థమేయని తెలిసికొనవగును.

స్వాభిప్రాయము:— "కొందరు (శ్రీధరాచార్యులువారు, పరమార్థప్రపా కారులు) 'ప్రకృతేర్గుణ సంమూఢాః' అను స్థలమున ప్రకృతియొక్క గుణములనగ సత్త్వరజస్తమస్సు" లని వ్యాఖ్యానించిరి. ఇట్టి వ్యాఖ్య భాష్యవిరుద్ధమనియు "ప్రకృతేః క్రియమాణాని గుణైః" అను స్థలమున వ్యాఖ్యానించిన తమవాక్యము లకు విరోధము ప్రాప్తించుననియు, అందుచే నీవ్యాఖ్యలుపాదేయములు గావని భాష్యోత్కర్షదీపికా కారులు వ్రాసియుండిరి ఇట విచారింతము.

పైవ్యాఖ్యాతల వ్యాఖ్యలు భాష్యమునకు విరుద్ధములుగాన నేకరింపదగినవి కావనుటలో నర్థమేమి? భాష్య కారులు చెప్పినట్లు చెప్పలేదనియా? భాష్యము ప్రకృతమునకు సంబంధించినది. ఆట్లీవ్యాఖ్యాతల యర్థము ప్రకృతమునకు సంబంధించదనియా? ప్రథమపక్షమున ఒకరు చెప్పినట్లే చెప్పవలయునను నియమము వ్యాఖ్యాత లకు కలదా? అట్టి నియమమెచ్చటను గానరాదు. ఒక వ్యాఖ్యాత పదస్వారస్యము ననుసరించి యొకరీతిగ వ్యాఖ్యానింపవచ్చును. మరియొక వ్యాఖ్యాత పదస్వారస్యమననుసరించి స్వీయప్రతిభచే మరియొకరీతిగ వ్యాఖ్యా నింపవచ్చును. ఇట్లిందులకు వ్యాఖ్యానించి రను నాక్షేపణ యెచ్చటను గానరాదు. కాని యీవ్యాఖ్యలు పూర్వాపరసంబంధమును విడువకయుండెనా? ప్రకృతవిలక్షితార్థము సంభవించునా? యనియే విచారణీయము. ప్రకృతియొక్క కార్యములగు శరీరేంద్రియాదులచే మోహితులనిన నేమి? ప్రకృతియొక్క గుణములగు సత్త్వ రజస్తమస్సులచే సంమూఢు లనిన నేమి? ఎట్లయిన సంమూఢులే. ఇట్టి సంమోహమిరువురకు సమ్మతమే. సంమో హమునకు శరీరేంద్రియాదులే కారణ మనెదవా? అటులైన సత్త్వరజస్తమస్సు లెందులకు గారణములు కావని యడుగవలసియున్నది. సత్త్వరజస్తమస్సులుకూడ మోహమునకు కారణమే. కాన ప్రకృతియొక్క సత్త్వరజ స్తమస్సులచే సంమూఢులని వ్యాఖ్యానించుటచే పైవ్యాఖ్యాతల కెట్టిదోషము లేదు. మరి భాష్యోత్కర్షదీపికా కారుల యనూయయే వ్యక్తమగుచున్నది.

మఱియు 'ప్రకృతేః క్రియమాణాని గుణైః' అనుచోట పైవ్యాఖ్యాత లిరువురు ప్రకృతికార్యములగు దేహేంద్రియాదులని వ్యాఖ్యానించి, ఇటనుండు "ప్రకృతేర్గుణసంమూఢాః" అను సమానపదమునకు ప్రకృతి సంబంధమగు సత్త్వరజస్తమస్సులని వ్యాఖ్యానించుట స్వోక్తివిరుద్ధమనియు భాష్యోత్కర్షదీపికాకారులాక్షేపించి యుండిరి ఇచట తత్త్వమునుగూడ కొంచము విచారింతము. "స్వస్థానే యావ్యార్థం బోధయతి పద మనుపక్త మపి తాదృశార్థమేవ బోధయతి" (స్వస్థానమునందు దేయర్థమును పదము బోధించునో ఆపదమే యన్యత్ర శాబ్ద బోధనిమిత్త మనుషక్తమైనపు డాయర్థమునే బోధించును కాని యన్యార్థమును బోధించనేరదు.) అని శాస్త్రము నందు నియమము కాని, అనుషక్తము కాని సజాతీయపదమునకు పూర్వమునందుండుపదమే యర్థమును బోధించునో యాయర్థమునే చెప్పవలయునని నియమము లేదు. అట్లగుచో శ్రుతులయం దెన్నిచోట్ల ప్రాణశబ్దము లేదు. ఒకచోట ప్రాణశబ్దము బ్రహ్మను బోధించినని యన్నిప్రాణశబ్దములకు బ్రహ్మమే యర్థమని చెప్పనొప్పునా? ఏకప్రకరణ

మండిల్లే కార్థమునే చెప్పబడియుననెదరా, ఒక శబ్దమున కన్నిచోట్ల యవాంతరప్రకరణము ననుసరించి నానార్థములను చెప్పుటలేదు. సర్వనామ అవాంతరప్రకరణములచే నానార్థత్వముయుక్తమేయనెదరా! ఇదియు విచారింపవలసిన విషయమే కాని, యొకప్రకరణమునందు గల "ఆత్మా" అను శబ్దమునకు "పురుషః" అను మొదలగు శబ్దములకు సందర్భము ననుసరించి భాష్యకారులే యనేకార్థములను బృహదారణ్యకోపనిషత్షష్ఠాధ్యాయమందు, ఇతరప్రదేశములయందు వర్ణించియుండిరి. మఱియు నీ యధ్యాయాంతమందుండు శ్లోకమునందుగల "ఆత్మానం ఆత్మనా" అను రెండుపదములు ఆత్మన్ శబ్దములైనను "ఆత్మానం" అనుదాని కంతఃకరణమని, 'ఆత్మనా' అనుదానికి నిశ్చయాత్మకబుద్ధియని యర్థమును చెప్పియుండలేదా! కాన, అనుపక్తముకాని "ప్రకృతేర్గుణసంమూఢాః" అను స్థలమునందుగల గుణశబ్దమునకు సత్వరజస్తమస్సులని యర్థమును వర్ణించుట స్వోక్తివిరుద్ధ మని చెప్పుట భాష్యోత్కర్షదీపికాకారులకు న్యాయము కాదు. కాని ఆచార్యులు వర్ణించినరీతిని, తాము పూర్వమునందు వర్ణించినరీతిని విడచి యీ శ్లోకమందుగల గుణశబ్దమునకు సత్త్వరజస్తమస్సులని యర్థమును వర్ణించుటయం దేమి ప్రయోజనమో దానిని ప్రశ్నింపవలయును. శ్రీమద్భాష్యకారులు, మధుసూదనసరస్వతులు, శంకరానందులు మొదలగువారు గుణశబ్దము ప్రాయికముగ సత్త్వరజస్తమస్సులయందే ప్రయోగింపబడుచుండినను, సత్త్వరజస్తమోగుణాత్మకమగు ప్రకృతి కార్యాకారముగానపు డనర్థమును కలుగజేయలేదని యిచట సామోహారూపానర్థమునకు కార్యాకారముగ (దేహేంద్రియాద్యాకారముగ) బరిణమించిన ప్రకృతియే హేతు వగునని గుణశబ్దమునకు ప్రకృతికార్యములగు దేహేంద్రియాదు లని యర్థమును జెప్పియుండిరి. కాని పై వ్యాఖ్యాతలిరువురు వర్ణించిన సత్త్వరజస్తమస్సులను నర్థమున నిట్టి స్వారస్యము లేదు. అందుచే పై వ్యాఖ్యానములయందు సత్త్వరజస్తమస్సులనే గుణములచే సంమూఢులని చెప్పుట విశేష మున్నదో లేదో చదువరులే గ్రహింతురుగాక.

ఇచట విచారింపవలసినదొక విషయము కలదు. "ప్రకృతే ర్గుణసంమూఢాః" అనుచోట పైవ్యాఖ్యాతలందరు 'ప్రకృతేః' అను పదమును "గుణసంమూఢాః" అను సమాసపూర్వపదముతో నన్వయించిరి. ఇట్లన్వయించుటచే "గుణసంమూఢాః" అను సమాస మెట్లు సంభవించును? ఎందులకనిన– "సమర్థః పదవిధిః" అను సూత్రము కృద్విధి, తద్ధితవిధి, సమాసవిధియు సమర్థమైనవి. (సామర్థ్యమున్నపుడే పైవిధులు ప్రాప్తించును) అని బోధించుచున్నది. సాపేక్షత్వ మున్నపుడు సామర్థ్య ముండదు. సాపేక్షత్వ మనగ సమాసపూర్వపదార్థముతో ప్రకృతసమాసాఘటకపదార్థ మన్వయించుటయే. ఇట సమాసపదము "గుణసంమూఢాః" అనుపదము. అట్టి సమాసమున పూర్వపదము 'గుణ' అను పదము. ఆపదముయొక్క యర్థమగు శరీరేంద్రియాదులతో నీసమాసాఘటకమగు "ప్రకృతేః" అను పదముయొక్క యర్థము నన్వయించి, ప్రకృతిజన్యమగు శరీరేంద్రియాదులచే సంమూఢులని యర్థమును వర్ణించుచుండిరి. కాన నిచట సామర్థ్యము లేమింజేసి 'గుణసంమూఢాః' అను సమాస మెట్లు సంభవించునని శంక వైయాకరణుల కవశ్యము జనించును. అందు సమాధానము నేను కొంచెము చెప్పెద. ఈసమాధానమున నన్వయభేదమే కాని పర్యవసితభావము పూర్వవ్యాఖ్యాతలదే యని గ్రహింపనగును. అన్వయ మెట్లనిన ? ప్రకృతియనంగ మాయ. మాయ యనంగ నవిద్యయే. కాన నవిద్యవలన (ఆత్మతత్త్వాజ్ఞానమువలన) "గుణసంమూఢాః" గుణేషు-సంమూఢాః శరీరేంద్రియాదులయందు సంమూఢులు. అనంగా నజ్ఞానమువలన శరీరేంద్రియాదులయం దాత్మాభిజ్ఞానము కలవారు. కనుకనే "సజ్జంతే గుణకర్మసు" శరీరేంద్రియాదుల కర్మలగు శ్రవణదర్శనాదానవచనాదులయందు "నేను వినుచుంటి ననియు, నేను స్వీకరించుచుంటి ననియు, నేను పలుకుచుంటి ననియు, నేను నడచుచుంటి ననియు సక్తిగలవా రగుచుండిరి." అని యర్థమును వర్ణించినచో పూర్వాచార్యుల యాశయమునకు విరోధము ప్రాప్తించదు. "ప్రకృతేః" అను శబ్దముయొక్క యర్థమును 'గుణసంమూఢాః' అను సమాసోత్తరపదార్థముతో నన్వయించుటవలన నసామర్థ్యము ప్రాప్తించదు. సమర్థపదము అగుటచే సమాసము సంభవించును. వైయాకరణుల యాక్షేపణము సంభవింపదు. అని నాయాశయము.

పరమార్థప్రపా:— "న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినాం" అను స్థలమునం దుపక్రమించబడిన విషయము కర్మసంగులగు నజ్ఞానులకు బుద్ధిభేదమును పుట్టించరాదనునది. అట్టియుపక్రాంతవిషయమునే "ప్రకృతే ర్గుణసంమూఢాః" అను శ్లోకముచే నుపసంహరించుచుండెను.

మాయాగుణములగు సత్త్వరజస్తమస్సులచే మోహమును పొందినవారై "గుణకర్మసు" ఇంద్రియములయందు ఇంద్రియకర్మలగు దృష్టవ్యశ్రోతవ్యాదులయం దెవరు సక్తికలవారగుచుండిరో అట్టియేకైకేంద్రియోపాసకులను "కృత్స్నవిత్" సర్వేంద్రియచాలకుఁడగు నాత్మవేది భ్రంశమును పొందించరాదు. ఈవిషయమునే శ్రుతి- "స యో త ఏకైక ముపాస్తే న స వేదా కృత్స్నో హ్యేషో త ఏకైకేన భవ త్యాత్మే త్యేవోపాసీ తాత్ర హ్యేతే సర్వ ఏకీభవతి త దేత త్పదనీయ మస్య సర్వస్య యదయ మాత్మానేన హ్యేత త్సర్వం వేద యథా హవై పదే నాను విందే దేవం కీర్తిగ్ం శ్లోకం విన్దతే య ఏవం వేద" దీనికి పూర్వశ్రుతియందు 'ప్రాణన్నేవప్రాణోభవతి ఇత్యాదివాక్యములచే సర్వేంద్రియము లాత్మయొక్క కర్మనామము లగుచున్నవని చెప్పఁబడెను. అందాత్మానభిజ్ఞుఁడై ఏకఁ డేకైకేంద్రియోపాసనను చేయునో వాఁడాత్మస్వరూపమును తెలిసికొననివాఁడు. అట్టి యేకైకేంద్రియములచే 'అకృత్స్నుఁడు' అగును. ఇక కృత్స్నుఁడెట్లగు ననిన? సర్వేంద్రియములు తమతమ విషయములను గ్రహించుచుండ పదార్థభాసకుఁ డీయాత్మయే యని యుపాసించవలెను. ఎందువల ననిన? ఈయాత్మయందు సర్వవిషయములు ప్రతీతిరూపముచే నేక మగుచున్నవి. ఇదియే యాత్మయొక్క స్థానము అని తెలిసికొనఁదగినది. కాన నీసర్వజగత్తున కిదియే యాత్మ ఈయాత్మచేతనే సర్వమును తెలిసికొనుచున్నాఁడు. కాన రూపరసాదిసర్వపదార్థగ్రహణ మగుచుండ ప్రతీతి (జ్ఞాన) రూపముచే నాత్మయే తెలియఁబడిన దగును. ఈవిషయమున దృష్టాంత మేదనిన- గోవుయొక్క యడుగుల ననుసరించి వడుమవానికి గోజ్ఞాన మెట్లుకలుగునో అట్లే పైఁజెప్పినరీతి నెవఁ డాత్మను దెలిసికొనునో వాఁడు కీర్తిని పొందును. అని శతపథబ్రాహ్మణము చెప్పుచున్నది. ఈవిషయమే తైత్తిరీయకమునందుఁగూడ "అంతః ప్రాస్తా జనానా మేకః స్స బహుధా విచచార। శతం శుక్రాణి యత్రైకం భవంతి। సర్వే దేవా యత్రైకం భవంతి। అతో బహుప్రకార మింద్రియమార్గై ర్విచరంతి" (శాసకుఁడగు పరమేశ్వరుఁడు ప్రజలలోనఁ బ్రవేశించి, యొక్కఁడేయై యనేకవిధములుగ సంచరించుచుండెను. అనేక మగు నింద్రియవృత్తు లేయాత్మయం దేకమగుచుండెనో, సర్వవేదము లేయాత్మయం దేకమగుచున్నవో అట్టి యాత్మ యనేకవిధములుగ సంచరించుచుండె నని పూర్వముతో నన్వయింపనగును. కాన మనుజులు బహుప్రకారములుగ నింద్రియమార్గములచే సంచరించుచుండిరి.) అని తైత్తిరీయకమునందుఁ జెప్పఁబడెను. మిగిలిన శ్లోకార్థము స్పష్టమైన దగుటచే నిచట వివరింపనవసరములేదు.

గీతారహస్యవిమర్శనము:— "సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత। కుర్యాద్విద్వాం స్తథాఽసక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహం॥ (అ3- శ్లో॥25) న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినాం। జోషయే త్సర్వకర్మాణి విద్వా న్యుక్త స్సమాచరన్॥ (అ 3- శ్లో॥ 26) ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః। అహంకారవిమూఢాత్మా కర్తాహ మితి మన్యతే॥ (అ 3- శ్లో 27) తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః। గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే॥ (అ3-శ్లో॥ 28) ప్రకృతే ర్గుణసంమూఢా స్సజ్జంతే గుణకర్మసు। తా నకృత్స్నవిదో మందా న్కృత్స్నవి న్న విచాలయేత్॥ (అ3- శ్లో॥29)" పైశ్లోకములవలన దేలిన యాశయ మేమి? ఆరూఢుఁడుగూడ లోకసంగ్రహముకొఱకవశ్యము కర్మల నాచరింపవలయు ననియు, అందుకూడ నే నాత్మజ్ఞాని నని యూరకుండక యవిద్వాంసుఁడువలె తప్పక తాను కర్మఫలము నపేక్షించక కర్మల నాచరించుచునజ్ఞానులచే నాచరింపఁజేయవలయు ననియే ముఖ్యముగ దేలినయాశయము, నిజముగ

ఇట్టి శ్లోకములను జూచినతోడనే తిలక్మహాశయుల కట్టి యానందము గలిగెనో అదిమానవులు కూహించుట కశక్యము. ఎందులకు వారి కట్టి యానంద మగు ననిన– వారు కర్మజ్ఞానసముచ్చయవాదులు కనుక. వారంగీకరించిన కర్మజ్ఞానసముచ్చయ మేది? విహంగమ మెట్లు రెండుపక్షములలో నొకపక్షములేనిచో గగనమున కెగురలేదో, రెండుపక్షములుండిన గగనమున కెగురునో అటులే మానవుడును కేవలకర్మముచేతను గాని, సర్వకర్మసంన్యాస పూర్వక మగు జ్ఞానముచేతను గాని మోక్షమును పొందనేరడు. కాన నారూఢుడు కూడ లోకసంగ్రహార్థము కర్మల నాచరింపవలయును. అటులాచరించినచో విహంగన్యాయమున కర్మజ్ఞానములవలన మోక్షమునుబొందును. ఈవిషయ మెచ్చట జెప్పబడిన దని వారిని ప్రశ్నించినచో వారి మతమున కనుగుణముగ భాసించు పైశ్లోకములను వారు చూచినంతమాత్రమున వారికి పరమానందము కలుగుననుటలో నాశ్చర్య మేమున్నది?

పైవిషయమును కొంచము విచారింతము. విశిష్టాద్వైతమతమున మోక్షమనగ వైకుంఠమున కేగుట. కాన వారి మతమున భక్తుడు మోక్షనిమిత్తము దేశాంతరమున కేగవలయును. కాన వీరీవిహంగమన్యాయము ననుసరించి కర్మజ్ఞానసముచ్చయవాదము ననుసరించుట న్యాయమే. కాని గీతారహస్యకారు లద్వైతులు. అద్వైతమతము ననుసరించియే గీతారహస్యమను గ్రంథమును రచియించిరి. అద్వైతమతమున 'న తస్య ప్రాణా ఉత్క్రామంతి అత్రైవ సమవలీయంతే'' (ముక్తుని ప్రాణము లుత్క్రమించవు. మరేమగును. అచటనే లయించును.) అను శ్రుతి ముక్తునకు దేశాంతరగమనమును నిషేధించుచు సర్వేంద్రియప్రాణమనోబుద్ధిరూపమగు లింగదేహమున కుపాదానకారణమగు మూలాజ్ఞాన మాత్మజ్ఞానమువలన నశింప తత్కార్యమగు లింగదేహముగూడ కారణనాశాధీననాశమును పొందుననియు ఇట్లవిద్యస్వకార్యములతో గూడ లయింప ముక్తుడు బ్రహ్మస్వరూపముచే నుండుననియు బోధించుచున్నది. కాని యద్వైతమతమున ముక్తినిమిత్తము దేశాంతరమున కరుగుట సంభవింపదు. గాన గీతారహస్యకారులు విహంగమన్యాయమున కర్మజ్ఞానసముచ్చయవాదము నంగీకరించుట యనుచితము.

మఱియు, లోకసంగ్రహార్థమారూఢుడుగూడ కర్మలనవశ్య మాచరింపవలయునని చెప్పి యట్టికర్మసముచ్చితమగు జ్ఞానమువలననే విహంగమన్యాయమున మోక్షమును పొందెదరని చెప్పుట యెంతసంగతమో విచారింపుడు. ఆరూఢునిచే నాచరింపబడుకర్మ లోకసంగ్రహార్థము. అనుటలో నేమి యర్థము? ఆరూఢునకు మోక్షము నిమిత్తము కర్మము కారణము కాకున్నను లోకసంగ్రహార్థమైన నారూఢుడు కర్మల నాచరించవలయుననియే కదా! యర్థము. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ "లోకసంగ్రహమేవాపి" అనుచోట "ఏవ" అను శబ్దమును ప్రయోగించెను. ఏవకారమువలన దేలినయాశయ మేది? నీకితర ప్రయోజనము లేకున్నను లోకసంగ్రహనిమిత్తమైనను కర్మల నాచరింపుమనియేకదా! నీవాచరించిన కర్మము నీవపేక్షించిన మోక్షమునకు కారణము కాకున్నను లోకసంగ్రహార్థము కర్మలనాచరించుమని చెప్పుటచే మోక్షమునకు కర్మము కారణము కాదనియు, కర్మము యజ్ఞానులకే– నిష్కామముచే ననుష్ఠింపబడిన చిత్తశుద్ధిద్వారమున జ్ఞానమునకు హేతువగునని స్పష్టమగుచున్నది. ఇప్డు గీతారహస్యకారు లంగీకరించిన సముచ్చయవాద మేమైనదో చదువరులే యాలోచింతురుగాక!

మఱియు జ్ఞానులగు నారూఢులెల్ల లోకసంగ్రహనిమిత్తము కర్మము నాచరింపవలయునని గీతారహస్యకారులు మాటిమాటికిపలుకుచుండిరి. ఆరూఢులందఱు కర్మల నాచరించవలయుననుటవలన బ్రాహ్మణారూఢుడు కూడ లోకసంగ్రహార్థము కర్మల నాచరింపవలయుననియే వారి యాశయము. ఇట కొంచము విచారింతము. బ్రాహ్మణాది సర్వవర్ణు లారూఢులైనను, కాకున్నను కర్మనుమాత్రము త్యజింపవలదని విధియే యున్నచో "యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్" అని సంన్యాసవిధాన మెవ్వరికి? ఈవిధికి తావులేనందున నీశ్రుతివాక్య మప్రమాణము కావలసినదే నా? అట్లగుచో "యావజ్జీవమగ్నిహోత్రం జుహుయాత్" అని యావజ్జీవాగ్నిహోత్రవిధాయక శ్రుతి యప్రమాణము కావలసినదేనా? అని శంకించెదరా? 'తుల్యబలవిరోధే వికల్పః'

తుల్యబలము కలవానికి విరోధము ప్రాప్తించిన వికల్ప మనను మీమాంసాన్యాయమువలన నీకర్మ, కర్మసంన్యాసములు రెండునుకూడ వైకల్పికము లగును. కాన లోకసంగ్రహము నిమిత్త మిష్ట ముండినచో కర్మల నాచరించవలయును. లేనివారు సంన్యాసము నవలంబింపవలయు నని యంగీకరించినచో నజ్ఞానులుకూడ కర్మలయం దిష్టము లేక సంన్యాసము నవలంబించవలసివచ్చును. అట్లగుచో నెవఁడును కర్మల నాచరింపఁడు. ఏమనిన శ్రుతిసిద్ధమగు సంన్యాసము సులభమైయుండ నెవఁడు కష్టసాధ్యమగు కర్మల నాచరించును? ఎవఁడు నాచరించఁడు. అట్లాచరించనియెడల దేవతలు హవ్యకవ్యాదులు లేమింజేసి వర్షమును కురిపించకుందురు. అట్లగుటచే సస్యములు నశించును. ఇట్లు సస్యములు నశించిన యన్నపానాదులులేక ప్రజలు నశింతురు. జనించుప్రజలు లేకపోవుటచే ప్రపంచసంతతియు నశించును. ఇట్టి యనర్థములు లోకమునకు కలుగఁజేయుటకా యీవిరుద్ధశ్రుతులననుసరించి కర్మ కర్మసంన్యాసములకు వికల్ప మంగీకరించుట? ఇట్లు వికల్ప మంగీకరించనిచో నాశ్రుతిద్వయమునకు ప్రామాణ్య మెట్లు సంభవించు ననిన వినుము. “ఉదితే జుహోతి” (సూర్యోదయమైనతరువాత హోమముచేయవలెను.) “అనుదితే జుహోతి” (సూర్యోదయమునకు పూర్వమునందే హోమమునుచేయవలెను.) అని రెండుశ్రుతులు కలవు. ఈశ్రుతులలో నొకటి సూర్యోదయానంతరమున హోమమును విధించునది. ఒకటి సూర్యోదయపూర్వమునందు హోమమును విధించునది. సూర్యోదయపూర్వమునందే హోమము చేసినచో సూర్యోదయమునకు పరమందు హోమమును విధించుశ్రుతియు, సూర్యోదయమునకు పరమందే హోమమును జేసినచో సూర్యోదయపూర్వమందు హోమమును విధించు శ్రుతియు నీరెండును నప్రమాణములు కావలసివచ్చును. రెండును శ్రుతులగుటచే ప్రమాణములే కాన నీరెండు శ్రుతులకు ప్రామాణ్య మెట్లు సంపాదింపవలయును? ‘తుల్యబలవిరోధే వికల్పః’ అను న్యాయమననుసరించినచో నవ్యవస్థముగ హోమములు జరుగవలసివచ్చును. అనఁగా నొకపురుషుఁడే యొకనాఁడు సూర్యోదయమునకు పూర్వమునందు హోమముచేయును. మఱునాఁడు సూర్యోదయమునకు పరమునందు హోమముచేయును. అట్లు చేయుటచే హోమము నియమబద్ధము కాకపోయెడిని. అని తలచి పూర్వమీమాంసయందీశ్రుతిద్వయమునకు “తుల్యబలవిరోధే వికల్పః” అను న్యాయమననుసరించియే ఋగ్వేదులు సూర్యోదయమునకు పూర్వమునందే హోమముచేయవలయు ననియు, యజుర్వేదులు సూర్యోదయానంతరమందే హోమము చేయవలయుననియు వికల్పించి చెప్పిరి.

ఆన్యాయముననే యావజ్జీవ మగ్నిహోత్రమును విధించు “యావజ్జీవ మగ్నిహోత్రం జుహుయాత్” అను శ్రుతికిని, సంన్యాసమును విధించు “యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్” అను శ్రుతికిని వికల్పమును కల్పించవలయును. అది యెట్లనిన? బ్రాహ్మణులు విరాగులైనచో సంన్యాసమును స్వీకరింపవలయు నని బ్రాహ్మణవిషయముగ సంన్యాసప్రతిపాదకశ్రుతిని, యావజ్జీవాగ్నిహోత్రప్రతిపాదకశ్రుతిని నారూఢులైనను క్షత్రియాదులు కర్మలను వదలకూడ దని క్షత్రియవైశ్యపరముగ నన్వయించిన పైశ్రుతిద్వయమునకు విరోధము కాని, యప్రామాణ్యము కాని సంభవింపదు. విరక్తక్షత్రియపరముగ సంన్యాసప్రతిపాదకశ్రుతిని ఆరూఢబ్రాహ్మణవైశ్యపరముగ యావజ్జీవాగ్నిహోత్రవిధాయకశ్రుతిని యేల సమన్వయింపరా దని శంకింపఁజనదు “స్వారాజ్యకామో రాజా రాజసూయేన యజేత” అను రాజసూయయాగవిధాయకశ్రుతియందు ‘రాజా’ అను శబ్ద ముండుటచే నీరాజసూయయాగమున నధికారము క్షత్రియులకే యని నిర్ధారణచేయవలయును. అట్లే “బ్రాహ్మణాః పుత్రైషణాయాశ్చ, విత్తైషణాయాశ్చ, లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరంతి” అను సంన్యాసవిధాయకవాక్యమునందు ‘బ్రాహ్మణాః’ అను పద ముండుటచే బ్రాహ్మణులకే సంన్యాసమున నధికారము. ఇతరులగు క్షత్రియాదులకు సంన్యాసమున నధికారము లేదని స్పష్టమగుచున్నది. కాన పూర్వమునందు చెప్పఁబడిన యావజ్జీవాగ్నిహోత్రవిధాయకశ్రుతి క్షత్రియాదిపర మనియు, సంన్యాసవిధాయక మగు ‘యదహరేవ విరజేత్’ అను శ్రుతి బ్రాహ్మణపర మనియు నిర్ధారించిన యేశ్రుతికిని విరోధము కాని, యప్రామా

గీ॥ మయి సర్వాణి కర్మాణి సంన్యస్యాధ్యాత్మచేతసా ।
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః ॥ ॥30॥

పదవిభాగము:— మయి- సర్వాణి- కర్మాణి- సంన్యస్య- అధ్యాత్మచేతసా- నిరాశీః- నిర్మమః- భూత్వా- యుధ్యస్వ- విగతజ్వరః । ॥30॥

ప్రతిపదార్థము:— హే అర్జున!=(ఈపద మధ్యాహార్యము) ఓయర్జునుఁడా; త్వం=(ఈపద మధ్యాహార్యము) నీవు; మయి=పరమేశ్వరుఁడ నగు నాయందు; సర్వాణి=నిఖిల మగు; కర్మాణి=కర్మలను; అధ్యాత్మచేతసా=(కర్త నగు నే నీశ్వరునికొఱకు భృత్యునివలె చేయుచుంటి ననూ) వివేకబుద్ధిచే; సంన్యస్య=అర్పణము చేసి; నిరాశీః=ఆశారహితుఁడవై, ఫలప్రార్థనారహితుఁడవై; నిర్మమః=మమకారము లేనివాఁడవై; విగతజ్వరః=పోయిన శోకము కలవాఁడవై; భూత్వా=అయి; యుధ్యస్వ=యుద్ధమును చేయుము. ॥30॥

---

శ్యము కాని ప్రాప్తించనేరదు. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ యారూఢునకు కూడ కర్మను లోకసంగ్రహనిమిత్తముపపాదించుచు నాకర్మను క్షత్రియాదులకేయని తెలియుటకుగాను 'కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః' క్షత్రియులగు జనకాదులతోనే యా యుద్యమమును ప్రారంభించెను. మధ్యయందందులకు దృష్టాంతముగ క్షత్రియుఁడగు తననే 'న మే పార్థాస్తి కర్తవ్యం' అను శ్లోకముచే చూపెను. చతుర్థాధ్యాయప్రారంభమునం దీ కర్మయోగమును తానెవరికి చెప్పెనో యాపరంపర క్షత్రియపరంపరగనే 'ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహ మవ్యయం । వివస్వా న్మనవే ప్రాహ మను రిక్ష్వాకవే ఽబ్రవీత్ ॥ ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః' అని చెప్పఁగలఁడు. కాన మధ్యనుపన్యసించువిషయమును నిర్ధారణచేయవలయునన్నచో నాద్యంతములయందుండు విషయమననుసరించియే నిర్ధారింపవలయును కాని యేదో యొకవాక్యము తానను కొన్న విషయమును చెప్పునని యంతమాత్రముచే నపరిమితానందుఁడై యేదో వ్రాయుటకుపూనుకొనుట ప్రాజ్ఞలక్షణము కాదు. మరియు "బ్రాహ్మణాః పుత్రైషణాయాశ్చ" అనువాక్యమునందు బ్రాహ్మణశబ్దముండుటే కాదు, ఇట్టివాక్యపర్యాలోచన చేసిన స్మృతికర్తలుకూడ తమస్మృతులయందు 'చత్వార ఆశ్రమా బ్రాహ్మణస్య, త్రయో రాజన్యస్య, ద్వౌ వైశ్యస్య" అని చెప్పియుండిరి. మరియు పురాణములయందుఁగూడ "ముఖజానా మయం ధర్మో యద్విష్ణో ర్లింగధారణం । బాహుజాతోరుజాతానాం నాయంధర్మః ప్రశస్యతే॥" అని బ్రాహ్మణులకే సంన్యాసమనియు, క్షత్రియవైశ్యులకు సంన్యాసము మంచిదికాదనియు బోధింపఁబడెను. కాన గీతారహస్యకారులు గీతలయందుఁగల 'సక్తాః కర్మణ్య విద్వాంసః" అను శ్లోకము మొదలుకొనిగల యారూఢునకు కర్మను లోకసంగ్రహనిమిత్తము బోధించు శ్లోకములను తమ యభీష్టమగు సముచ్చయవాదమున కనుకూలముగ నన్వయించుట యసంగతము.

మఱియు సముచ్చయవాదమనగ రెండు కాని, మూడు కాని యొక కార్యమునగూర్చి కారణములనుట. ఇట కర్మసముచ్చయవాదమనగ కర్మయు, జ్ఞానము ఈరెండును మోక్షమునకు కారణములనుట. "లోకసంగ్రహమేవాపి" అను వాక్యముచే నారూఢులకు మోక్షము ప్రాప్తించుటలో కర్మ యేవిధముగను కారణము కాకున్నను, (అనఁగా మోక్షప్రాప్తికి జ్ఞానులకు దేవతలు విఘ్నము చేయలేరు. ఇక జ్ఞానము కలుగకుండినచో నట్టి జ్ఞానమునకు దేవతలు విఘ్నమాచరించినను, ఆరూఢుడుత్పన్నాత్మవిజ్ఞానుడగుటఁజేసి యతనివిషయమై విఘ్నములాచరింపలేరు. పాపపుణ్యములను రెంటి నాత్మస్వరూపముగ నెరిగినయారూఢునకు ప్రత్యవాయప్రాప్తి యే సంభవింపనందున నందులకైన దేవారాధనము చేయనవసరములేదు. కాని లోకసంగ్రహార్థమారూఢుఁడు కర్మల నాచరింపవలయునని బోధింపబడుటచే జ్ఞానికి మోక్షప్రాప్తియందెట్లును జ్ఞానమునకు కర్మము సహకారి కానేరదు. అని స్పష్టమగుచుండ పైనుదహరించిన వాక్యమువలన కర్మజ్ఞానసముచ్చయము సిద్ధించునని పలుకుటయు నజ్ఞాతవాక్యసందర్భమూలకమే యగునని గ్రహింపవలెను గాక. ॥౨౯॥

శాంకరభాష్యమ్:—

కథం పునః కర్మ ణ్యధికృతే నాజ్ఞేన ముముక్షుణా కర్మ కర్తవ్యమి త్యుచ్యతే-మయీతి। మయి వాసుదేవే పరమేశ్వరే సర్వజ్ఞే సర్వాత్మని సర్వాణి కర్మాణి సంన్యస్య నిక్షి ప్యాధ్యాత్మ చేతసా వివేకబుద్ధ్యాఽహం కర్తేశ్వరాయ భృత్యవ త్కరోమీ త్యనయా బుద్ధ్యా। కించ నిరాశీ స్త్యక్తాశీ ర్నిర్మమో మమభావశ్చ నిర్గతో యస్య తవ స త్వం నిర్మమో భూత్వా యుద్ధ్యస్వ విగతజ్వరో విగతసంతాపో విగతశోకస్స న్నిత్యర్థః ॥ ॥౩౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

విచారింప కర్మమునం దజ్ఞుం డధికారియే. అయినను మోక్షము కర్మముచే సాధింపఁబడని దగుటవలన కర్మయం దధికృతుఁడు, అజ్ఞానియు నగు ముముక్షువుచే కర్మ మెటుల యాచరింపఁ దగిన దనెదవా? (వినుము) చెప్పెద. "కర్తనగు నే నీశ్వరునికొఱకు భృత్యునివలె కర్మముల నాచరించుచుంటిని" అనెడి వివేకబుద్ధితో పరమేశ్వరుఁడను, సర్వజ్ఞుఁడను, సర్వాత్మను, వాసుదేవ స్వరూపుఁడను అగు నాయందు సర్వకర్మలనుంచి (అనఁగా సర్వకర్మలను పరమేశ్వరార్పణము చేసి) మఱియు ఫలప్రార్థనను విడచి (అనఁగా ఫలమును కోరక) పుత్రభ్రాత్రాదుల యందు మమకారమును వదలినవాఁడవై శోకమును విడచి యుద్ధమును చేయుము. ॥౩౦॥

—♦ ౩వ అధ్యాయము ౩౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— ఇట్లు జ్ఞానికిని, నజ్ఞానికిని కర్మానుష్ఠానసామ్య మున్నను అజ్ఞానికి కర్తృత్వాద్యభినివేశ ముండుటచేతను, జ్ఞాని కట్టి కర్తృత్వాద్యభినివేశము లేకపోవుటచేతను విశేషము కలదని చెప్పఁబడెను. ఇపుడు ముముక్షు వగు నజ్ఞానికికూడ ముముక్షువుకాని యజ్ఞానికంటె తా నాచరించు కర్మలను భగవదర్పణము చేయుట, అట్టి కర్మఫలమును కోరకపోవుట యనెడి విశేషము నుపపాదన చేయుచు నజ్ఞాని యగుటచే నర్జునునకు కర్మాధికారమును "మయి సర్వాణి కర్మాణి" అను నీశ్లోకముచే దృఢపరచుచుండెను. "మయి" భగవంతుడను, వాసుదేవుడను, పరమేశ్వరుడను, సర్వజ్ఞుడను, సర్వాంతర్యామిని, సర్వాత్మయు నగు నాయందు లౌకికములు, వైదికములు నగు సర్వకర్మలను— రాజుయొక్క కర్మలను భృత్యుఁ డాచరించురీతిని యంతర్యామిప్రేరితుఁడనైన, కర్త నగు నే నీశ్వరునినిమిత్త మాచరించుచుంటి నను బుద్ధిచే "సంన్యస్య" పరమేశ్వరార్పణ మొనరించి, నిష్కాముఁడవై, స్వీయము లగు దేహపుత్రాదులయందు మమతను విడచినవాఁడవై "విగతజ్వరః" (సంతాపమునకు హేతు వగుటచే నిట జ్వరశబ్దముచే శోకము చెప్పఁబడును.) ఐహికాముష్మిక దుర్యశోనరకపాతాదినిమిత్తశోకరహితుఁడవై ముముక్షువవై యుద్ధమును జేయుము (విహితకర్మల నాచరించుమని యాశయము.) ఇచట తా నాచరించిన కర్మలను భగవదర్పణము చేయుటయు, నిష్కామత్వము సర్వకర్మసాధారణములు. ముముక్షువునకు యుద్ధమాత్రమందు నిర్మమత్వము, శోకమును విడుముట ప్రకృతము అని తెలిసికొనవగును. ఇతరస్థలములయందు మమత్వము, శోకము ప్రసక్తములు కానందున యుద్ధమాత్రమందు మమత్వశోకములు ప్రసక్తము లగుటంజేసి తన్నిషేధము ప్రకృత మని చెప్పఁబడెను. ॥౩౦॥

శంకరానందీయము:— అధికారికు లగు జ్ఞానులుకూడ లోకసంగ్రహార్థము కర్మ నాచరింపవలయు ననియు, లోకసంగ్రహమును జేయదలచినవాఁ డిట్లు నడుచుకొనవలయు ననియు నుపదేశించి, లోకసంగ్రహా

గీ॥ యే మే మత మిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః ।
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేపి కర్మభిః ॥ ॥౩౧॥

పదవిభాగము:— యే- మే- మతం- ఇదం- నిత్యం- అనుతిష్ఠంతి- మానవాః- శ్రద్ధావంతః- అనసూయంతః- ముచ్యంతే- తే- అపి- కర్మభిః । ॥౩౧॥

ప్రతిపదార్థము:— యే=ఏ; మానవాః=మనుష్యులు; శ్రద్ధావంతః=శ్రద్ధకలవారై; అనసూయంతః=(గురువును, వాసుదేవుఁడను నగు నాయందు) అసూయలేనివారై; ఇదం=ఈ; మే=నాయొక్క; మతం=మతమును; నిత్యం=ఎల్లపుడు; అనుతిష్ఠంతి=అనుసరించెదరో; తేపి=వారును; కర్మభిః=ధర్మాధర్మములచే; ముచ్యంతే=విడువఁబడుచున్నారు. ॥౩౧॥

---

దృష్టిచే నైన నీవిపుడు స్వధర్మము నాచరించు మని 'మయి' అను శ్లోకముచే బోధించుచుండెను. లోకసంగ్రహకర్తవు, అధ్యాత్మతత్త్వజ్ఞుఁడవు నగునీవు "అధ్యాత్మ చేతసా" (అధ్యాత్మ మనఁగ "ఇదం సర్వం యదయమాత్మా" (ఈ సర్వ మాత్మస్వరూప) మను శ్రుత్యుక్తప్రకార మాత్మననుసరించి ప్రవృత్తమగు జ్ఞాన మధ్యాత్మ మనఁబడును.) అట్టి యధ్యాత్మచిత్తముచేతను, అనఁగ "బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః" అని నాల్గవ యధ్యాయమునందు చెప్పఁబోవు ప్రత్యగ్దృష్టిచే (సర్వము బ్రహ్మస్వరూపమే) అను జ్ఞానముచే నిత్యనైమిత్తికాది సర్వకర్మలను సర్వాత్మకము, బ్రహ్మము నగు నాయందు "సంన్యస్య" సర్వము బ్రహ్మరూపమే యని ప్రవిలాపనము గావించి, యుద్ధక్రియా ఫలమగు జయము ప్రాప్తింప దానియందు నిరపేక్షుఁడవై, భ్రాతృాదులు జంపబడుచుండ వారలయందు మమతారహితుఁడవై "వీరు నా సంబంధమైనవారు. నాచే చంపఁబడుచుండిరి." అనెడి సంతాపరూపశోకమును విడచినవాఁడవై యో యర్జునా! లోకసంగ్రహార్థము కర్మల నాచరింపుము.

ఇచట నభిప్రాయ మేమనిన "నీయఖిలప్రపంచము, నేనును బ్రహ్మస్వరూపమే" అనెడి పరావరైకత్వవిషయకము, అప్రతిబద్ధము నగు నపరోక్షజ్ఞానముకల యాధికారికబ్రహ్మవేత్త పూర్వమందు చెప్పఁబడినరీతిని లోకసంగ్రహార్థము కర్మ నాచరింపవలయును. ఇట్టి జ్ఞాని జీవించియుండఁగనే ముక్తుఁ డగుటవలన తనచే నాచరించఁబడు కర్మకు స్వప్రయోజనము లేకున్నను పరులు తరించుటయే వాని కర్మకు ప్రయోజనము. అపరోక్షజ్ఞాని కాక శాస్త్రజన్యపరోక్షజ్ఞాని యైనచో ఘటమును తెలుసుకొనువాఁడు ఘటముకంటె భిన్నుఁడైనటుల దేహేంద్రియాదులను తెలిసికొనుటచే 'నాత్మ దేహేంద్రియాదులకంటె భిన్నము' అను (తాను దేహేంద్రియాదులకంటె వేరను) జ్ఞానముచేతను, "నేను కర్తను కాను, కారయితను కాను" అను నకర్తృత్వబుద్ధిచేతను, "మాయామాత్ర మిదం ద్వైతం" (ఈ ద్వైతమంతయు మాయామాత్రము.) అను శ్రుతిబలముచేతను ఐంద్రజాలికమువలె మాయాకార్యమగుటవలన 'నీ ప్రపంచ మంతయు మిథ్య' యనెడి యుక్తిబలముచేతను, 'కర్తయు, కార్యము, కరణము, సర్వము మిథ్యయే" అని కర్త మొదలగు నిఖిలప్రపంచమునకు మిథ్యాత్వమునే చూచుచు సర్వత్ర కామనారహితుఁడై, మమతాశూన్యుఁడై లోకహితార్థము కర్మల నాచరింపవలయును. అట్టి కర్మాచరణచే చిత్త పరిపాకము, అందువలన జ్ఞానము, దానివలన మోక్షము సిద్ధించును. లోకోపకారము సిద్ధించును. అట్టివాఁడు తరించుట, ఇతరులను తరింపఁజేయుట అను నుభయము సిద్ధించును. అనాత్మజ్ఞుఁడైనచో పరిగ్రహణమందు మమతారహితుఁడై, కర్మఫలము నపేక్షించనివాఁడై శ్రౌతస్మార్తకర్మల నన్నిటి నీశ్వరార్పణబుద్ధిచే తన చిత్తశుద్ధినిమిత్తము చేయ నగును. అట్లాచరించినచో దానివలన చిత్తశుద్ధియు, అందువలన జ్ఞానము, దానిచే మోక్షము సిద్ధించునని యభిప్రాయము.

**శాంకరభాష్యమ్:—**

యదేత న్మతం కర్మ కర్తవ్యమితి సప్రమాణ ముక్తం తత్తథా—యే మ ఇతి। యే మే మదీయ మిదం మత మనుతిష్ఠం త్యనువర్తంతే మానవా మనుష్యా శ్శ్రద్ధావన్త శ్శ్రద్ధధానా అనసూయంతోఽనసూయాం చ మయి గురౌ వాసుదేవేఽకుర్వంతో ముచ్యన్తే తేఽప్యేవం భూతాః కర్మభి ర్ధర్మాధర్మాఖ్యైః ॥ ॥౩౧॥

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

పూర్వమునందు జెప్పబడినది భగవంతుని ప్రకృతది మునగు నీమతము నెవరనుసరించెదరో వారు క్రమముక్తిని పొందెదరు. కాన కర్మము నాచరించవలయు నను మతము సప్రమాణముగా జెప్పఁబడెను. ఆచెప్పినవిధముననే యాసంబంధమగు "కర్మము చేయతగినది" అనెడి మతము నేమానవులు శ్రద్ధకలవారలై గురువును, వాసుదేవుడను నగు నాయం దసూయను వదలి యనుసరించెదరో అట్టి మానవులున్ను, ధర్మాధర్మములచే విడువఁబడెదరు. (అనగా ధర్మాధర్మసంబంధము లేనివారై క్రమముక్తిని పొందుదు రని భావము.) ఇట్టి క్రమముక్తికముఖ్యత్వమును తెలుపుటకే "తేఽపి" అనుచోట "అపి" అను శబ్దము ప్రయోగించఁబడెను. శాస్త్రాచార్యోపదిష్ట మగు నదృష్టార్థమునందు విశ్వాసమే శ్రద్ధ యనియు, గుణముల యందు దోషములను ప్రకటించుటయే యసూయయనియు చెప్పనొప్పును. ॥౩౧॥

—• ౩వ అధ్యాయము ౩౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఫలాభిసంధిరహితముగ భగవదర్పణబుద్ధిచేసైన విహితకర్మానుష్ఠానము సత్త్వశుద్ధిని కలుగజేసి, జ్ఞానప్రాప్తిద్వారమున మోక్షమును కలుగజేయునని "యే మే" అను శ్లోకముచే బోధించుచుండెను. ఫలాభిసంధిరహితముగ విహితకర్మానుష్ఠానము నామతము. నిత్యవేదబోధిత మగుటచే ననాదిపరంపరాగతము. అవశ్యకము అని యే మనుష్యులు శాస్త్రాచార్యోపదిష్టమగు నర్థమునందిది యిట్లేయాచరింపదగినదని విశ్వాసముకలవారై, 'అనసూయంతః' (గుణములయందు దోషావిష్కరణ మసూయ యనబడును. అది యెట్లనిన-దుఃఖాత్మక మగు కర్మమందు నన్ను ప్రవర్తింపజేయు వీడు కరుణకలవాడు కాడనునదియే ప్రకృతమందు ప్రసక్తమైన యసూయ.) అట్టి యసూయను సర్వసుహృద్భూతుఁడను, గురువును, వాసుదేవాత్మకుడను నగు నాయందు జేయనివారలై యెవరనుష్ఠించెదరో వారుకూడ శుద్ధసత్త్వము కలవారై జ్ఞానప్రాప్తిద్వారమున లెస్సగ జ్ఞానివలె ధర్మాధర్మము లనెడి కర్మబంధమునుండి ముక్తు లగుదురు.

శంకరానందీయము:— "న కర్మణా మనారంభాత్" అను శ్లోకము మొదలుకొని "మయి సర్వాణి కర్మాణి" అనుశ్లోకముపరకగు గ్రంథముచే ముముక్షు నవశ్యము మోక్షార్థ మీశ్వరార్పణబుద్ధిచే కర్మలనాచరించవలయునని నిశ్చయించి, శ్రీకృష్ణపరమాత్మ—తన మతము నెవ రనుసరించెదరో వారు ముక్తు లగుదురనియు, ఎవరు తన మతము ననుసరింపరో వారు నశించెద రనియు, "యే మే మత మిదం" అను శ్లోకముచే నియమము చేయుచుండెను.

వివేకులగు బ్రాహ్మణాదిమానవులుముముక్షువులై పైనజెప్పిన లక్షణములుగల నామతమును (శాసనమును) 'అనసూయంతః' (జగద్గురువు నగు నాయందు గుణదూషణయే యసూయ యనబడును). అట్టి యసూయారహి

గీ॥ యే త్వేత దభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతమ్।
సర్వజ్ఞానవిమూఢాం స్తా న్విద్ధి నష్టా నచేతసః ॥ ॥౩౨॥

పదవిభాగము:— యే- తు- ఏతత్- అభ్యసూయంతః- న- అనుతిష్ఠంతి- మే- మతం- సర్వజ్ఞానవిమూఢాన్- తాన్- విద్ధి- నష్టాన్- అచేతసః ॥ ॥౩౨॥

ప్రతిపదార్థము:— యేతు=ఏమానవులు; మే=నాయొక్క; మతం=కర్మ చేయవలెనను మతమును; అభ్యసూయంతః=అంతట నసూయాగ్రస్తులై; నానుతిష్ఠంతి=అనుసరించరో; సర్వజ్ఞానవిమూఢాన్, సర్వజ్ఞాన=సర్వజ్ఞానములయందు; విమూఢాన్=అనేక విధములుగ మూఢులగునట్టి: తాన్=ఆమానవులను; నష్టాన్=నాశమును పొందినవారలనుగను; అచేతసః=అవివేకులనుగను; విద్ధి=తెలిసికొనుము. ॥౩౨॥

శాంకరభాష్యమ్:—

'యే త్వితి। యేతు తద్విపరీతా ఏత న్మమ మత మభ్యసూయంతో నానుతిష్ఠంతి నానువర్తంతే మే మతం సర్వేషు జ్ఞానేషు వివిధం మూఢాస్తే. సర్వజ్ఞానవిమూఢా స్తాన్విద్ధి నష్టాన్నాశం గతా నచేతసోఽపివేకినః ॥ ॥౩౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

భగవన్మతము ననుసరించనివారలకు ప్రత్యవాయిత్వము కలదని నమ్మకమును "యేతు" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

భగవన్మతానుయాయులకు విపరీతు లగు నేమానవులు నాసంబంధ మగు మతమునందు లేనిదోషముల నుద్ఘాటనము చేయుచు నామతము ననుసరించరో, సగుణనిర్గుణవిషయకజ్ఞానముల యందు ప్రమాణప్రమేయప్రయోజనములవలన మూఢులగు నట్టివారలను నాశమును పొందినవారలుగను, అవివేకులుగను తెలిసికొనుము. ॥౩౨॥

తులై' భక్తి సహితులై నిత్యము యెవరనుసరించెదరో ఆట్టివారు సత్త్వశుద్ధిచెనిర్వికారాత్మజ్ఞానము నొంది. నానాదుఃఖహేతువులగు సంచితానేక పుణ్యపాపాత్మకకర్మలనుండి ముక్తు లగుదురు. అపిశబ్దముచే జన్మమరణాదులచేఁ గూడ విడువబడుదు రని సూచింపబడెను.

భాష్యోత్కర్షదీపిక:— ఫలాభిసంధిరహితముగ కర్మనుజేసినచో నది చిత్తశోధకమనియు, కాన కర్మము చేయుదగినదనియు, ప్రమాణపురస్సరముగ సర్వజ్ఞుడగు పరమేశ్వరునిచే నిది చెప్పబడినదిగాన తథ్యమేయనియు నిశ్చయించి ఇట్టి శ్రద్ధతోఁగూడినవారై, పరమగురువునగు నాయందు అసూయారహితులై నాయీమతము నెవరనుసరించెదరో వారుసత్త్వశుద్ధిద్వారమున జ్ఞానప్రాప్తి కాగా ధర్మాధర్మరూపకర్మలనుండి విడువఁబడుదురు.

—• ౩వ అధ్యాయము- ౩౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇట్లు పరమేశ్వరమతము ననుసరించుటయందు గుణములఁజెప్పి, తన మతము ననుసరించనిచో కలుగు దోషమును 'యేతు' అను శ్లోకముచేఁ జెప్పుచున్నాఁడు.

'తు' అను శబ్దము శ్రద్ధకువిరుద్ధమగు నశ్రద్ధను సూచించును. నాస్తిక్యమువలన నెవరు శ్రద్ధారహితులై నామతమునందు దోషముల నారోపించుచు నామత మనుసరించరో అట్టివారలను దుష్టచిత్తులనుగను, "సర్వజ్ఞా

గీ॥ సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి ।
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ॥ ॥౩౩॥

పదవిభాగము:— సదృశం- చేష్టతే- స్వస్యాః- ప్రకృతేః- జ్ఞానవాన్- అపి- ప్రకృతిం- యాన్తి- భూతాని- నిగ్రహః- కిం- కరిష్యతి ॥ ॥౩౩॥

ప్రతిపదార్థము:— జ్ఞానవానపి=జ్ఞానియు; స్వస్యాః=తనసంబంధమగు; ప్రకృతేః=వర్తమానజన్మమునందు ఫలముదానముకొఱకభివ్యక్తమయిన పూర్వజన్మకృతధర్మాధర్మాదిసంస్కారమునకు; సదృశం=అనురూపముగ; చేష్టతే=ఆచరించును; భూతాని=భూతములు; ప్రకృతిం=పూర్వకృతధర్మాధర్మసంస్కారమును; యాంతి=పొందుచున్నవి. నిగ్రహః=నిగ్రహము; కింకరిష్యతి=ఏమిచేయగలదు? ॥౩౩॥

శాంకరభాష్యమ్:—

కస్మా త్పునః కారణా త్త్వదీయం మతం నానుతిష్ఠంతి । పరధర్మా ననుతిష్ఠంతి స్వధర్మం చ నానువర్తంతే, త్వ త్ప్రతికూలాః కథం న బిభ్యతి త్వచ్ఛాసనాతిక్రమదోషాత్,

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఏ కారణమువలన నీమతము ననుసరించరు? ఏ కారణమువలన పరధర్మముల ననుసరించెదరు? ఏకారణమువలన స్వధర్మము ననుసరించరు? ఇందులకు భగవత్ప్రతికూల్యమే మూల

విమూఢాన్'' కర్మవిషయకజ్ఞానమునందును, సగుణబ్రహ్మజ్ఞానమునందును, నిర్గుణబ్రహ్మజ్ఞానమునందును, ప్రమాణప్రమేయ (విషయ) ప్రయోజనములవలన మూఢులుగను, సర్వప్రకారములచే నష్టులుగను, అనగా సర్వపురుషార్థభ్రష్టులుగను తెలిసికొనుము.

శంకరానందీయము:— పూర్వమున బోధింపబడిన యీమతము ననుసరించనిచో దండమును (శిక్షను) ''యేతు'' అను శ్లోకముచే శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచుండెను ఏయవివేకులు, దురహంకారులు నగు బ్రహ్మణాదులు పరమేశ్వరుడ నగు నాచేఁ జెప్పబడిన నామతము నత్యంతము దూషించువారలై, దురాగ్రహముచే నాయాజ్ఞ ననుసరించరో, 'సర్వజ్ఞానవిమూఢాన్' సర్వాత్మకు డగుటవలన బ్రహ్మమిట సర్వశబ్దముచే చెప్పఁబడును. అట్టి బ్రహ్మజ్ఞానము సర్వజ్ఞాన మనబడును. అట్టిబ్రహ్మజ్ఞానవిషయమై విశేషముగ మూఢులు—అవివేకులు. అనగా కర్మ మనేకసాధనములచే సాధింపదగినది; క్లేశభూయిష్ఠమైనది; అదృష్టఫలము కలది. కాన దానికన్న సంన్యాసమే పరమసుఖమను విపరీతబుద్ధులుకల సంన్యాసానధికారులు కర్మనిష్ఠులు కానట్టి జనులను నశించిన పుణ్యలోకములు కలవారలనుగ నెరుగుము. స్వధర్మమును విడనాడి స్వయముగ పరధర్మమును సేవించువారలు స్వయముగ విపరీతబుద్ధిచే నశించెదరు.

నీలకంఠీయము:— ''సర్వజ్ఞానవిమూఢాన్'' అను స్థలమునందుగల సర్వశబ్దము ఈశ్వరవాచకము. ''సర్వం సమాప్నోతి తతోసి సర్వః'' (ఓపరమేశ్వరా! నీవుసర్వమునువ్యాపించియుంటివి కాన సర్వశబ్దవాచ్యుడవైతివి) అని నిరుక్తముకూడ చెప్పుచున్నది. అట్టి యీశ్వరవిషయకజ్ఞానమునందు విశేషముగ మూఢులు అనగా పరోక్షముగనైన నీశ్వరస్వరూపమును తెలిసికొనినవారు; దేహమాత్రనిష్ఠులు. అట్టివారలు స్వర్గాపవర్గభ్రష్టులు, వివేకశూన్యులు అని యర్థము. మిగినయర్థము సుగమము.

—• ౩వ అధ్యాయము ౩౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ప్రభువుయొక్క శాసనము నతిక్రమించిన భయము ప్రాప్తించినటుల

శాంకరభాష్యమ్:—

తథా హి — సదృశమితి । సదృశ మనురూపం చేష్టతే కస్యా స్స్వస్యా స్స్వకీయాయాః ప్రకృతేః । ప్రకృతిర్నామ పూర్వకృతధర్మాధర్మాదిసంస్కారో వర్తమానజన్మాదా వభివ్యక్త స్సా ప్రకృతి స్తస్యా స్సదృశమేవ సర్వో జంతు ర్జ్ఞానవా నపి, కిం పున ర్మూర్ఖః । తస్మాత్ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి? మమ వాఽన్యస్య వా ॥ ॥౩౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మనెదవా? అట్లగుచో నీకు ప్రతికూలురై నీశాసనాతిక్రమణమున కెందులకు భయపడరు? అను వాశంకను తొలగించుటకు "సదృశం" అని చెప్పుచుండెను

వర్తమానజన్మాదియందు ఫలదానముకొఱ కభివ్యక్తమయిన పూర్వజన్మకృత ధర్మాధర్మ సంస్కారములు, జ్ఞానేచ్ఛలు నివి ప్రకృతి యనబడును. అట్టి ప్రకృతి కనురూపముగనే సర్వ ప్రాణులు (అనగా జ్ఞానులును, అజ్ఞానులును) నడచుచుందురు. కాన సర్వభూతములు ప్రకృతినే పొందును. నానిగ్రహము కాని, మఱియొకని నిగ్రహము కాని ఏమిచేయగలదు? (ఏమియు చేయనేర దని భావము.) ॥౩౩॥

నీశాసనాతిక్రమణమునందు భయమును తెలిసికొనువారలు ఎట్లనూయావంతులగుదురు? ఎందులకు నీమతము ననుసరించరు? ఎందులకు సర్వపురుషార్థసాధనమునందు విముఖులగుదురు? అను నాశంకను "సదృశం" అను శ్లోకముచే తొలగించుచుండెను.

పూర్వజన్మకృతధర్మాధర్మజ్ఞానేచ్ఛాదిసంస్కారము ప్రకృతియనబడును. అది వర్తమానజన్మమునందు ఫలదానముకొఱ కభివ్యక్తమై సర్వవిధముల బలీయమైనది. ఇట్టిసంస్కారము "తం విద్యాకర్మణీ సమన్వారభేతే పూర్వప్రజ్ఞా చ" అనుబృహదారణ్యకశ్రుతిసిద్ధము. అట్టిస్వకీయమగు ప్రకృతికనురూపముగనే సర్వప్రాణులు— అనగ బ్రహ్మవేత్తయుగూడ 'పశ్వాదిభి శ్చావిశేషాత్' అను న్యాయమువలన గుణదోషములను తెలిసినవాడు కూడ సంచరించును. ఇక మూర్ఖుడు ప్రకృత్యనుసారముగ సంచరించునని యేమి చెప్పవలయును? చెప్పనవసరము లేదు. కాన సర్వప్రాణులు పురుషార్థభ్రంశమునకు హేతుభూతమైనను ప్రకృతిననుసరించెదరు. అందువిషయమై నాయొక్క నిగ్రహముకాని, ప్రభువుయొక్క నిగ్రహము కాని ఏమిచేయుగలదు? అనగా రాగోత్కట్యముచే నగు దురితమునుండి మరలించుటకు సమర్థమైనది కాదు. పాపములు మహానరకసాధనములని తెలిసియు దుర్వాసనాప్రాబల్యమువలన పాపములయందే చరించువారలై నాశాసనాతిక్రమదోషమువలన భయపడరని యాశయము.

శంకరానందీయము:— నాయీమతము నాదరింపక "కర్తవ్యకర్మను పరిత్యజించి, స్థాణువువలె మేము తూష్ణీంభావము నాశ్రయించి యుండెదము" అని యెవరు తలచెదరో, జ్ఞానులకుకూడ జయింప శక్యము కానట్టి నామాయయొక్క నిగ్రహము దుష్కరమగుటవలన ప్రకృత్యధీనులగు నట్టివారలకు చలించకుండగ తూష్ణీంభావముతో నుండుట సంభవింపదు. అని "కార్యతే హ్యవశః కర్మ" అను వాక్యముచే చెప్పబడిన యర్థము నే-మూఢులకు కర్మయందు నియమనముకొఱకు "సదృశం చేష్టతే" అను శ్లోకముచే దృఢపరచుచుండెను.

బ్రహ్మవేత్త నిత్యనిరంతరబ్రహ్మనిష్ఠచే నిర్మూలితసర్వవాసనాగ్రంథికలవాడైనను తనప్రాణత్రాణహేతువగుటచే తనసంబంధమగు నీజన్మమునందు ఫలదానముకొఱ కనుగుణముగనభివ్యక్తమైన ప్రాగ్జన్మకృతధర్మాధర్మ జ్ఞానేచ్ఛాదిసంస్కారరూపప్రకృతి కనుగుణముగనే యాహారాదివిషయమై చలించుచుండును. (తత్తదనురూపముగ

గీ. ఇన్ద్రియ స్యేన్ద్రియ స్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।
తయో ర్న వశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపన్థినౌ ॥ ॥౩౪॥

పదవిభాగము:— ఇంద్రియస్య- ఇంద్రియస్య- అర్థే- రాగద్వేషౌ- వ్యవస్థితౌ- తయోః- న- వశం- ఆగచ్ఛేత్- తౌ- హి- అస్య- పరిపంథినౌ । ॥౩౪॥

ప్రతిపదార్థము:— ఇంద్రియ స్యేంద్రియస్య=ప్రతీంద్రియముయొక్క; అర్థే=(ఇది జాతియం దేకవచనము) శబ్దాదివిషయములయందు; రాగద్వేషౌ=రాగద్వేషములు; వ్యవస్థితౌ=ఉంటున్నవి; తౌ హి=ఆరాగద్వేషములైతే; అస్య=ఈపురుషునకు; పరిపంథినౌ=మోక్షమార్గమునకు విఘ్నకర్తలు; అతః=(ఈపద మధ్యాహార్యము) ఈ కారణమువలన; తయోః=ఆరాగద్వేషములయొక్క; వశం=స్వాధీనమును; నాగచ్ఛేత్=పొందఁదగదు. ॥౩౪॥

శాంకరభాష్యమ్:—

యది సర్వో జంతు రాత్మనః ప్రకృతిసదృశ మేవ చేష్టతే నచ ప్రకృతిశూన్యః కశ్చిదస్తి తతః పురుషకారస్య విషయానుపపత్తే శ్శాస్త్రానర్థక్యప్రాప్తౌ విద ముచ్యతే— ఇంద్రియస్యేతి । ఇంద్రియ స్యేంద్రియ స్యార్థే శబ్దాదివిషయ ఇష్టే రాగోఽనిష్టే ద్వేష ఇత్యేవం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సర్వమానవులు ప్రకృతి కనురూపముగనే ప్రవర్తించెదరు. ప్రకృతిశూన్యుఁడేవాడును కాడు. కానఁ బురుషకారమునకు విషయము (తావు) లేనందున "అహరహస్సంధ్యాముపాసీత, న కలంజం భక్షయేత్" అనునవి మొదలగు విధినిషేధవాక్యముల కానర్థక్యము

కర్మ నాచరించుచుండును.) శరీరస్థితికి హేతువగు ప్రకృతిని నిగ్రహించుటకు శక్యము కానందున అట్టి ప్రకృతి నాత్మవేత్తగూడ నరికట్టుటకు సమర్థుఁడు కాఁడు. ఇట్టి నిత్యనిరంతరబ్రహ్మనిష్ఠచే ప్రకృతి నతిక్రమించియుండు స్వభావముకల జితేంద్రియుఁడగు బ్రహ్మవేత్తకూడ ప్రకృతి ననుసరించుచుండ తదితరులగు మూఢులు ప్రకృతి ననుసరించెదరని యేమి చెప్పవలయును? తప్పక మూఢులు ప్రకృతి ననుసరించెదరని యాశయముచే "ప్రకృతిం యాంతి భూతాని" అని చెప్పుచుండెను? సుఖదుఃఖానుభూతికొరకు తమతమ కర్మలచే జనించినవారు భూతము లనఁబడుదురు. సర్వప్రాణులు తమ తమ జాత్యనుసారముగ నానాక్రియానిర్వృత్తికి హేతువు, రాగద్వేషాది గుణములు కలిగినట్టియు, వాసనాత్మకమునగు ప్రకృతిని బొందుచున్నారు. (అనగా తమ తమ ప్రకృత్యనురూపముగనే రాగద్వేషములచే ననేకవిధములుగ చలించుచుండిరి. కర్మల నాచరించుచుండిరి.) ప్రకృత్యధీనులగువారు ఉదాసీనభావముతో క్షణకాలమైన కర్మ నాచరింపకుండగ నుండుటకు సమర్థులు కారు. కాన "మే మేమియు కర్మ నాచరింపము" అనెడివారికి తాత్కాలికేంద్రియనిరోధ మేమి చేయఁగలదు? ఏమియుఁజేయునేరదు. రాగద్వేషాదివంతునియొక్క ప్రకృతివేగముచే నందరు కర్మ నాచరింపవలసియుండ "నేనేమియు కర్మ నాచరించను" అను నియమము వ్యర్థ మగు నని యర్థము. ॥౩౩॥

—• ౩వ అధ్యాయము ౩౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "ప్రకృతిశూన్యుఁడెవఁడైన యుండినచో వాని నుద్దేశించి విధిప్రతిషేధశాస్త్ర మర్థవత్తగును. అట్లుగాక సర్వప్రాణులు ప్రకృతివశవర్తులే యగుటవలన శాస్త్రోక్తవిధుల ననుసరించుటకు, పురుషకారమునకు తావుసంభవింపనందున విధిప్రతిషేధశాస్త్రమున కానర్థక్యముసంభవించును. అనగా "అహ

శాంకరభాష్యమ్:—

ప్రతీంద్రియార్థే రాగద్వేషా వవశ్యంభావినౌ । తత్రాయం పురుషకారస్య, శాస్త్రార్థస్య చ విషయ ఉచ్యతే । శాస్త్రార్థే ప్రవృత్తః పూర్వమేవ రాగద్వేషయో ర్వశం నాగచ్ఛేత్ । యా హి పురుషస్య ప్రకృతిః, సా రాగద్వేషపురస్సరైవ స్వకార్యే పురుషం ప్రవర్తయతి తదా స్వధర్మపరిత్యాగః పరధర్మానుష్ఠానం చ భవతి । యదా పునా రాగద్వేషౌ తత్ప్రతిపక్షేణ నియమ ఇతి తదా శాస్త్రదృష్టి రేవ పురుషో భవతి న ప్రకృతివశః । తస్మా త్తయో రాగద్వేషయో ర్వశం న గచ్ఛేత్ । యత స్తౌ హ్యస్య పురుషస్య పరిపంథినౌ శ్రేయోమార్గస్య విఘ్నకర్తారౌ తస్కరా వివేత్యర్థః ॥ ॥౩౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ప్రాప్తించును" అను శంకను తొలగించుటకు "ఇంద్రియస్య" అని చెప్పఁబడెను. త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణాదీంద్రియముల విషయములు శబ్దస్పర్శరూపరసాదులు. అందు ఇష్టమగు విషయములయందు రాగము, అనిష్టములయందు ద్వేషము అవశ్యము సంభవించును. ఇది యిట్లు ప్రాప్తించుచుండఁ బురుషకారమునకు, శాస్త్రార్థమునకు నీవిషయము చెప్పఁబడుచుండెను. శాస్త్రార్థమునందు ప్రవృత్తమయిన పురుషుఁడు మొట్టమొదట రాగద్వేషముల వశమును పొందరాదు. ప్రకృతివశమున జీవునకు నియోజ్యత్వము సంభవించ దని శంకింపఁజనదు పురుషుని యొక్క ప్రకృతి రాగద్వేషపురస్సరముగనే స్వకార్యమునందుఁ బురుషుని ప్రవర్తింపఁజేయును. అట్టితటి స్వధర్మపరిత్యాగము, పరధర్మానుష్ఠానము సంభవించును. ఎప్పుడు రాగద్వేషములను ప్రకృతిప్రతిపక్షముగ బురుషుఁడు నియమించునో, అపుడు పురుషుఁడు శాస్త్రదృష్టికలవాఁడగును. ప్రకృతివశుఁడు కానేరడు. కాన పురుషుఁడు రాగద్వేషముల వశమును పొందరాదు. ఎందువల ననిన ? ఆరాగద్వేషము లీపురుషునకు చోరులవలె శ్రేయోమార్గమునకు విఘ్నకర్తలు. అనఁగా పురుషుఁడు ప్రకృతికలవాఁడైనను ఆప్రకృతి రాగద్వేషపురస్సరముగనే బురుషుని స్వకార్యమునందు ప్రవర్తింపఁజేయును. రాగద్వేషములను నియమించువానిని ప్రకృతి తన కార్యమునందు నియోగించలేదు. అట్టి పురుషునకే విధినిషేధశాస్త్రము లర్థవత్తు లగును. కాన శాస్త్రానర్థక్యము సంభవింపదు. ॥౩౪॥

రహ స్సన్ధ్యా ముపాసీత" (ప్రతిపగటియందు సంధ్యావందన మాచరించవలయును) అను మొదలగునవి విధిశాస్త్రములు. "న కలంజం భక్షయేత్, నానృతం వదేత్, న పరదారా న్గచ్ఛేత్" (కలంజ మను పదార్థమును భక్షింపవలదు, అనృతమును పలుకవలదు, పరభార్యలను పొందవలదు) అను నివి నిషేధశాస్త్రములు. ఇట్టి విధినిషేధశాస్త్రములు— శాస్త్రవిరుద్ధవర్తనులు శాస్త్రోక్తరీతిని నడచుకొనుటకుగాను ప్రవృత్తములైనవి. అటులైనను ప్రకృతివశవర్తు లగుటచే నస్వతంత్రులగు జనులు విధినిషేధశాస్త్రముల ననుసరించుట కసమర్థులగుదురు. ఇక నట్టివారు విధ్యుక్తకర్మల నాచరించినను, నిషిద్ధకర్మలను పరిత్యజించినను ప్రకృతివశముననే యట్లాచరించుటచే విధిప్రతిషేధశాస్త్రము వ్యర్థమే యగును. అను నాశంకను తొలఁగించుటకు "ఇంద్రియస్యేంద్రియస్యార్థే" అని చెప్పుచుండెను.

శబ్దస్పర్శరూపరసగంధములు జ్ఞానేంద్రియవిషయములు. వచనగమనాదానవిసర్గతృప్తులు వాక్పాణిపాదపాయూపస్థ లనెడి కర్మేంద్రియవిషయములు. ఇట్టి కర్మేంద్రియజ్ఞానేంద్రియవిషయములు శాస్త్రనిషిద్ధములైనను అనుకూలము లగుటచే వానియందు రాగము, ప్రతికూలము లగుటచే వానియందు ద్వేషము, అనుకూల్య, ప్రాతికూల్యవ్యవస్థచే ప్రాణులకు కలుగుచున్నవి. ఈ రాగద్వేషములాయావిషయములయందనియమముగ సంభవించవు. ఇందు పురుషకారమునకు శాస్త్రమున అట్టి రాగద్వేషముల స్వాధీనమును పొందకుండుట విషయమగుచున్నది. అది యెట్లనిన– పురుషుఁడు కలంజభక్షణమునందు ప్రకృతివశమున ప్రవర్తించును. ప్రకృతియు పురుషుని కలంజభక్షణమునందు రాగమును పురస్కరించుకొనియే ప్రవర్తింపఁజేయును రాగము లేనిచో పురుషుని ప్రకృతి ప్రవర్తింపజేయఁజాలదు. "కలంజభక్షణము నాకిష్టమును సాధించును." అను జ్ఞానమువలన రాగము జనించును. కాని యిట్టిరాగము పుట్టుట కొక ప్రతిబంధము కలదు. అది యెట్టిదనిన– "కలంజభక్షణము గొప్ప యనిష్టమును సమకూర్చును." అను జ్ఞానమే ఇట్టి జ్ఞాన ముండినచో 'కలంజభక్షణ మిష్టమును సమకూర్చు' నను జ్ఞానముండినను రాగము జనించదు. రాగము లేనిచో ప్రకృతి పురుషుని శాస్త్రనిషిద్ధకర్మమునందు ప్రవర్తింపఁజేయనేరదు. కాన 'కలంజభక్షణ గొప్ప యనర్థమును సమకూర్చు' ననుజ్ఞానము లేనపురుషుఁడునట్టి "కలంజభక్షణమువలన నాయిష్టము నెరవేరును" అను 'జ్ఞానమువలన రాగము జనించును. అట్టి రాగపురస్సరముగనే ప్రకృతి శాస్త్రనిషిద్ధకర్మలయందు (కలంజభక్షణాదికమునందు) పురుషుని ప్రవర్తింపజేయును. అటులే పురుషుఁడు శాస్త్రవిహితసంధ్యావందనాదులనుండి ద్వేషపురస్సరముగ ప్రకృతివశమున నివృత్తుఁడగును. ద్వేషము లేనిచో ప్రకృతి దేనినుండియు నివర్తింపజేయఁజాలదు. అట్టి ద్వేషము 'శాస్త్రవిహితసంధ్యావందనాదికము నాకనిష్టమును సమకూర్చును' అను జ్ఞానమువలన జనించును. ఇట్లు ద్వేషకారణమగు జ్ఞాన ముండినను "శాస్త్రవిహితసంధ్యావందనాదికము నాకు గొప్ప శ్రేయస్సును సమకూర్చు" నను జ్ఞాన ముండినచో శాస్త్రవిహితసంధ్యావందనాదికమునందు ద్వేషము జనించదు. కాన "సంధ్యావందనాదికము నాకు గొప్ప శ్రేయస్సును సమకూర్చు" నను జ్ఞానము లేనితరి 'సంధ్యావందనాదిక మనిష్టసాధన' మను జ్ఞాన ముండినచో సంధ్యావందనాదికమునందు ద్వేషము జనించు నని యభిప్రాయము.

అట్టి ద్వేషమువలననే ప్రకృతి పురుషుని శాస్త్రవిహితకర్మలనుండి నివర్తింపఁజేయును. ఇది యిట్లుండ శాస్త్రముచే "శాస్త్రనిషిద్ధమగు కలంజభక్షణపరదారాభిమర్శనానృతవదనాదికము గొప్ప యనిష్టమును సమకూర్చును" అని తెలుపఁబడుచుండ "కలంజభక్షణమునందు రాగమును జనింపఁజేయుటకు సాధనమగు నిష్టసాధనత్వజ్ఞానమునకు సహకారికారణమైనట్టిది 'కలంజభక్షణము గొప్ప యనర్థమును సమకూర్చు' నను జ్ఞానాభావము. అది లేనందున కలంజభక్షణమునందు ప్రకృతి పురుషుని ప్రవర్తింపఁజేయలేదు. అది యెట్లనిన–'అన్నము నాకిష్ట' మను జ్ఞాన ముండినను 'ఈయన్నము మధువిషములచే కలుపఁబడినది కాన గొప్ప యనర్థమును పుట్టించు' నను జ్ఞానముండినపుడు మధువిషసంపృక్తాన్నభక్షణమునందు రాగము జనించనందున ప్రకృతి పురుషుని నాయన్నభక్షణమునందు ప్రవర్తింపఁజేయఁజాలదు. అటులే పూర్వమునందు చెప్పిన విధమున శాస్త్రనిషిద్ధమగు కలంజభక్షణాదులయందు రాగము జనించనందున ప్రకృతి పురుషుని శాస్త్రనిషిద్ధకలంజభక్షణాదులయందు ప్రవర్తింపఁజేయఁజాలదు. భోజన మనిష్టసాధన మను జ్ఞానముండినను 'భోజనము గొప్ప శ్రేయస్సును సమకూర్చును' అను జ్ఞాన ముండినచో నాభోజనమునందు ద్వేషము జనించనటుల శాస్త్రముచే "సంధ్యావందనాదికము గొప్ప శ్రేయస్సును సమకూర్చును" అను జ్ఞానము కలిగినచో సహకారియగు నిట్టి జ్ఞానాభావము లేమింజేసి సంధ్యావందనాదికము కష్టమును కలిగించుననుజ్ఞానముమాత్ర ముండినను సంధ్యావందనాదికమునందు ద్వేషము జనించదు. తనకు తోఁడగు ద్వేషము లేనందున ప్రకృతి పురుషుని సంధ్యావందనాదికమునుండి నివర్తింపఁజేయఁజాలదు. అందువలన నప్రతిబద్ధమగు శాస్త్రము విహితకర్మలయందు

ప్రవర్తింపఁజేయును. నిషిద్ధకర్మలనుండి నివర్తింపఁజేయును. శాస్త్రీయమవివేక ప్రాబల్యముచే స్వాభావికమగు రాగ ద్వేషములయొక్క నాశము స్వకారణము లేమింజేసి సంభవించును. అందుచే ప్రకృతి శాస్త్రదృష్టికళ పురుషుని ప్రవర్తింపఁజేయుటకు సమర్థమైనది కాదు. కాన శాస్త్రమునకు కాని, పురుషకారమునకు కాని వైయర్థ్యము సంభవింపదు. కాన రాగద్వేషాధీనుఁడై ప్రవర్తింపనూరాదు. దేనినుండియు నివర్తింపనూరాదు. మరే మనిన— శాస్త్రీయము, రాగద్వేషములకు శత్రుభూతము నగు జ్ఞానముచే రాగద్వేష కారణమును విఘటనచేసి తద్ద్వారమున రాగ ద్వేషములను నశింపఁజేయవలెను. ఆరాగద్వేషములు స్వాభావికదోషప్రయుక్తములై మోక్షార్థి యగు పురుషునకు శత్రుభూతములు. పాంథునకు తస్కరులు విఘ్నము నాచరించునటుల శ్రేయోమార్గమునకు విఘ్నము నాచరించు నవి ఈవిషయమే "ద్వయా హ ప్రాజాపత్యా దేవా శ్చాసురాశ్చ కనీయసా ఏవ దేవా జ్యాయసా అసురాస్త ఏషు లోకే ష్వస్పర్ధత" (ప్రజాపతిసంబంధ మగువారలు దేవత అనియు, అసుర అనియు రెండువిధములు. అందు దేవతలు చిన్నవారు. అసురులు పెద్దవారు. అయిరువురు నీలోకములవిషయమై ద్వేషించిరి.) అని శ్రుతియందు స్వాభావికరాగద్వేషములు నిమిత్తముగాఁగల శాస్త్రవిపరీతప్రవృత్తిని యసురులుగను, శాస్త్రీయప్రవృత్తిని దేవతలు గను నిరూపించి, వ్యాఖ్యానము చేయఁబడి స్పష్టపరచఁబడెను. ||౩౪||

శంకరానందీయము:— సర్వప్రాణులు రాగద్వేషాత్మక మగు ప్రకృతిచే గ్రస్తు లగుచో త్వన్మతానుసారులుకూడ రాగద్వేషాత్మకప్రకృతిగ్రస్తు లగుటవలన నీచేఁ జెప్పఁబడిన కర్మయోగమునందు వారల కెటుల ప్రవృత్తి సంభవించును? అను శంకపై రాగము సమీచీనత్వబుద్ధివలనను, ద్వేష మసమీచీనత్వబుద్ధివలనను జనించుటచే "న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే" (అకుశల మగు కర్మను ద్వేషించఁడు; కుశలకర్మయందు సక్తుఁడు కాఁడు) అను న్యాయమున నీశ్వరారాధనాత్మకము, కర్తవ్యము, విధ్యుక్తము నగు కర్మమునందు "ఈ కర్మము శ్రేయోదాయకము, ఈకర్మ శ్రేయోదాయకము కాదు" అను జ్ఞానము లేనిచో నాకర్మమునందు రాగము కాని, ద్వేషము కాని సంభవించవు. అని సూచించుటకు రాగద్వేషముల స్థితిని, నివృత్తిప్రకారమును, బంధకత్వమును "ఇంద్రియ స్యేంద్రియస్యార్థే అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

శబ్దస్పర్శరూపరసగంధాదివిషయములలో "ఇష్టవిషయమునందు రాగము, అనిష్టవిషయమునందు ద్వేషము నివి సర్వేంద్రియములకు నుండును" కాన నీవిధముగ నియమముగ రాగద్వేషములు వ్యవస్థితములు. "ఇంద్రియము లకు విషయములయందు రాగముకాని, ద్వేషము కాని యుండుఁగాక. అంతమాత్రముచే ముముక్షువున కేమి హాని సంభవించును?" అను నాశంకను తొలఁగించుటకు 'తయోః' అని చెప్పుచుండెను. ఆరాగద్వేషములు ధర్మమును చేయఁదలచిన యీపురుషుని మోక్షమార్గమునకు మార్గమునందు చోరులవలె ప్రతిబంధకములు (అనఁగా మోక్ష సాధనము నాశ్రయించిన ముముక్షువును స్వాశ్రయబలముచే విషయారణ్యమునందుఁ బడవైచి, యందే త్రిప్పుచుండును). కాన ముముక్షు వగు పురుషుఁడు సదసద్వివేకముకలవాఁడై విషయములయందు సమీచీనత్వాసమీచీ త్వబుద్ధిచే రాగద్వేషముల యధీనత్వమును పొందవలదు. ద్రవ్యమునందు కాని, గుణమునందు కాని, కర్మమునందు కాని "ఇది మంచిది, ఇది చెడు" అని సమీచీనత్వాసమీచీనత్వబుద్ధిని చేయుటయే రాగద్వేషముల కుత్పత్తి యగుట యందు కారణము. ముముక్షు వట్టి బుద్ధి కలుగనీయకుండినచో రాగద్వేషములకు గురి కాఁడు. అట్టి వాఁడై స్వధర్మము కుశలమైనను, అకుశలమైనను దానియందే పరమేశ్వరప్రీతికొరకు ప్రవర్తించవలయును. ఇట్లు ప్రవర్తించు వాఁడు నిర్విఘ్నముగ మోక్షమును పొందు నని యర్థము.

భాష్యోత్కర్ష దీపిక:— సర్వప్రాణిజాతము ప్రకృత్యధీన మగుటవలన పురుషకారమునకు తావు లేనందున "అహ రహ స్సంధ్యా ముపాసీత, న కలంజం భక్షయేత్" అను విధినిషేధశాస్త్రమునకు నానర్థక్యము ప్రాప్తించు నను శంకను "ఇంద్రియ స్యేంద్రియ స్యార్థే" అను శ్లోకముచేఁ దొలఁగించుచుండెను.

సర్వేంద్రియార్థములలో ఇష్టమునందు రాగము, అనిష్టమునందు ద్వేషము నివి యవశ్యము సంభవించును. కాన రాగద్వేషాధీనుడై ప్రవర్తింపవలదు. ఇదియే పురుషప్రయత్నమునకును, శాస్త్రార్థమునకు విషయమని చెప్పబడు చున్నది. అదియెట్లనిన? ఇంద్రియమునకు, విషయమునకు సంబంధ ముండినచో పదార్థజ్ఞాన ముదయించును. అనంతరమున నిట్టి మిథ్యాజ్ఞానవిషయముననే విషయమునందు రాగము జనించును. అనంతరమున ప్రకృతియు, రాగాదిపురస్సరముగనే స్వకార్యమునందు పురుషుని నివర్తింపజేయును. అట్టి సమయముననే నిషిద్ధాచరణము, విహితత్యాగము సంభవించును. ఎపుడు శాస్త్రదృష్టిచే రాగాదులుజనించుటకుపూర్వమునందే యథార్థముగ వస్తువు భాసించునో అపుడు మిథ్యాజ్ఞాననివృత్తిచే రాగద్వేషములు నివర్తించును. సహకారియగు రాగద్వేషములు నివర్తించుటతోడనే ప్రకృతి పురుషుని ప్రవర్తింపచేయుటయందు సమర్థము కానేరదు. కాన మొట్టమొదటనే పురుషకారముచే పురుషుడు రాగద్వేషముల యధీనమును పొందవలదు. 'ప్రతిబంధకమగు ప్రకృతియుండ పురుషకారమునందు, శాస్త్రమునందు ప్రవృత్తియే సంభవింప' దని శంకింపవలదు. అదృష్టము దృష్టసామగ్రినివిడచి, ప్రతిబంధకము కానేరదు. ప్రకృతమున నదృష్టమగు ప్రకృతి దృష్టసామగ్రియగు రాగద్వేషములను విడచి, యెన్నడును ప్రతిబంధకము గానేరదు. కాన రాగద్వేషములు లేని సమయమున పురుషకారమునందు, శాస్త్రమునందు ప్రవృత్తి సంభవించుటలో ప్రకృతి బంధకము కాదు "తుల్యన్యాయముచే దృష్టమగునదికూడ యదృష్టాధీన మగుటవలన దృష్టమగునట్టిశాస్త్రాదికముకూడ నదృష్టప్రకృత్యధీనమే యగునెదవా" అట్లగుచో శాస్త్రాదులయందు ప్రవృత్తికనుకూలమగు సంస్కారరూపాదృష్టముకూడ అధికారులగు బ్రాహ్మణాదులయందు కలదు. కాన నట్టిసంస్కారములవలననే పురుషునకు పురుషకారమునందు, శాస్త్రమునందు ప్రవృత్తిజనించును. కాన నేయనుపపత్తియు లేదు. "అట్లగుచో నట్టి సంస్కారమువలననే సర్వము సంభవించుచుండ విధినిషేధమోక్షపరములగు శాస్త్రములతో నేమి ప్రయోజనము?' అని శంకింపజనదు. అదృష్టమునకు దృష్టసామగ్ర్యపేక్ష యావశ్యకమని చెప్పియే యుంటిమి. లోకమునందు సంస్కారరూపముచే నుండు కాముకునకు కామినీదర్శన ముద్దీపక మెట్లగుచున్నదో, అటులే శాస్త్రము కూడనుద్దీపకమని గ్రహింపుము. శాస్త్రశ్రవణమునందు ప్రవృత్తిజనకమగు సంస్కారమున కుద్దీపక మేదనిన? క్రీడార్థము ద్యూతవనమును ప్రవేశించినవానికా కస్మికముగ సిద్ధవాక్య మెట్లుద్దీపకమో కార్యాంతరమున శ్రవణశాలను ప్రవేశించినవానికి నటనుండు శ్రద్ధశ్రవణ మెట్లుద్దీపకమో? ఒకానొక దేవోయొక కారణముచే మిత్రత్వమును పొందిననొకానొక శిష్టుని వాక్య మెట్లుపకరణమో: అటులే శాస్త్రశ్రవణమునందు ప్రవృత్తిజనకమగు సంస్కారమునకు కూడ నుద్దీపకమేదో యొకటాకస్మికముగ సంభవించునని గ్రహించుము. చాలునిక విస్తారముగ వ్రాయుట. ప్రకృతమునను సరింతము. అట్లు రాగద్వేషము లీపురుషునకు మార్గమున చోరులవలె శ్రేయోమార్గమున విఘ్నమును చేయునవి. ॥౩౪॥

పరమార్థప్రపా:— "పురుషుని ప్రవృత్తి ప్రాచీనస్వభావాధీన మగుచో విధినిషేధశాస్త్రములకు వైయర్థ్యము ప్రాప్తించెడిని" అను శంకను దొలగించుటకు "ఇంద్రియ స్యేంద్రియ స్యార్థే" అని చెప్పచుండెను. "ఇంద్రియస్య" ముఖ్యేంద్రియ మగు మనస్సుకు "ఇంద్రియస్యార్థే" ఇంద్రియములకు విషయము లయ్యెడి రూపరసాదులయందు రాగద్వేషాదు లవశ్యము సంభవించును. తన కనుకూలమగు విషయమునందు రాగము, (ప్రీతియు)' ప్రతికూలమగు విషయమునందు ద్వేషము సంభవించును. అయినను అట్టి రాగద్వేషములకు వశవర్తి కాకూడదు. ఎందువలననిన? ఆ రాగద్వేషములు రెండును ముముక్షువుయొక్క మనస్సునకు క్షోభకములై శత్రువులవలె సంప్రాప్తములు. లోకమునం దెవడును దుఃఖహేతువునందు ప్రవృత్తి సంభవింపనందున శత్రువశవర్తి కాడు. రాగద్వేషములు రెండును ప్రకృతిబలముచే స్వాధీన మొనరించుకొనుచుండును. అయినను నాశ్రయబలముచేతను, శాస్త్రాచార్యోపదేశబలముచేతను రాగద్వేషవశమును పొందరాదు. "పరమేశ్వరాశ్రయణమునందు,

గీ॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥ ॥౩౫॥

పదవిభాగము:— శ్రేయాన్– స్వధర్మః– విగుణః– పరధర్మాత్– స్వనుష్ఠితాత్– స్వధర్మే– నిధనం– శ్రేయః– పరధర్మః– భయావహః ॥ ॥౩౫॥

ప్రతిపదార్థము:— స్వనుష్ఠితాత్=లెస్సగ ననుష్ఠింపబడిన; పరధర్మాత్=పరునియొక్క ధర్మముకంటెను; విగుణః=కొంతిగుణలోపముకలదైనను; స్వధర్మః=తనధర్మము; శ్రేయాన్=శ్రేష్ఠతరమైనది; యతః=(ఈపద మధ్యాహార్యము) ఏ కారణమువలన; పరధర్మః=పరునిధర్మము; భయావహః=నరకాదిభయమును కలుగజేయునో; అతః=(ఈపదమధ్యాహార్యము) ఆ కారణమువలన; స్వధర్మే=తన ధర్మమునందు; స్థితస్య=(ఈపదమధ్యాహార్యము) ఉండువానికి; నిధనం=మరణమయినను; శ్రేయః=శ్రేష్ఠమయినది. ॥౩౫॥

---

శాస్త్రాచార్యోపదేశబలమునందు ప్రాక్సంస్కారమే శరణ" మని శంకింపవలదు. "ఆత్మావాఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యః" అనునవి మొదలగు వాక్యములచే నుపాయము శ్రుతిబోధితము. అట్టి శ్రుతిబోధితోపాయముండ ప్రాక్సంస్కారమే శరణ మని యనరాదు. ॥౩౪॥

శ్రీధరీయము:— ఈశ్లోకమున కాశయమిది. విషయస్మరణాదులచే రాగద్వేషములను పుట్టించి యనవహితుడగు పురుషుని గంభీరప్రవాహమునందువలె యనర్థమునందుగూడ బలత్కారముగ ప్రకృతి ప్రవర్తింపజేయును. శాస్త్రమన్ననో తత్పూర్వమునందే విషయములయందు రాగద్వేషాదులకు ప్రతిబంధకమగు పరమేశ్వరసేవాదులయందు ప్రవర్తింపజేయును. గంభీరమగు ప్రవాహమునందు మునుగుటకు పూర్వమునందే నావ నాశ్రయించినవానివలె శాస్త్రశ్రవణమొనరించి పరమేశ్వరపూజాదులయందు ప్రవర్తించువాడనర్థమునుపొందడు.

నీలకంఠీయము:— "పురుషుడు ప్రారబ్ధకర్మానుసారమే ప్రవర్తించుచో పురుషునకు స్వాతంత్ర్యము లేమింజేసి విధినిషేధశాస్త్రములు వ్యర్థములయ్యెడి" నను నాశంకను "ఇంద్రియ స్యేంద్రియస్యార్థే" అను శ్లోకముచే తొలగించుచుండెను.

'ఇంద్రియస్యేంద్రియస్య' అని రెండుసార్లు చెప్పుట వీప్సయందు చెప్పుటయే. ప్రతీంద్రియముయొక్క విషయము అగు శబ్దాదులలో ననుకూలమునందు రాగము, ప్రతికూలమునందు ద్వేషము నిత్యసంబద్ధములు. అట్టి రాగద్వేషముల వశమును పొందరాదనియే శాస్త్రముయొక్క యభ్యనుజ్ఞ. పురుషునకు శాస్త్రానుష్ఠానమునందు స్వాతంత్ర్యము కలదు. ఆరాగద్వేషములు దృష్టద్వారముగ ప్రవర్తకము అగుటవలన పురుషునకు శత్రువులు. ప్రాణికర్మల ననుసరించి ఫల మొసంగునట్టి యీశ్వరుడీపురుషునకు శత్రువు కాడు. అట్లగుచో నీశ్వరునకు వైషమ్యనైర్ఘృణ్యములు ప్రాప్తించెడిని. ఇచట తత్త్వమిది ఒకానొకపురుషుడు పూర్వదివసమునందు రాజాజ్ఞ నతిక్రమించుటచే ప్రభువునకు కోపమువచ్చి, యీపురుషుని బంధింపుడని ప్రభువుభటుల నాజ్ఞాపించును. ఆపురుషుడే మరునటిదివసమున దానమానములచే ప్రభువునులోబరచుకొనినచో నాప్రభువే యీపురుషుని బంధించుటయందు నియోగించబడిన భటులకు నధిపతిగ నియోగించును. అటులే పూర్వకర్మ ననుసరించియే యీశ్వరుండు ప్రాణులకు ఫలము నొసగును. అట్టి ఫలము నొసగుటకు పురుషుని రాగద్వేషద్వారమున బాధింపజేయువాడైనను విధిప్రతిషేధశాస్త్రానుసార మాపురుషునిచేతనే భక్తిధ్యానప్రణిధానపురస్సరముగ లోబరచుకొనబడి, యీపురుషుని రాగద్వేషజయమునందు నియోగించును. కావున పురుషునకు స్వాతంత్ర్యముండుటవలన విధిప్రతిషేధశాస్త్రము సార్థకమగును. ప్రాణికర్మానుసారముగ ఫలదాతయగుటవలన నీశ్వరునకు వైషమ్యాదికము ప్రాప్తింపదు.
॥౩౪॥

శాంకరభాష్యమ్:—

తత్ర రాగద్వేషాదిప్రయుక్తో మన్యతే శాస్త్రార్థ మప్యన్యథా పరధర్మోఽపి ధర్మత్వాదనుష్ఠేయ ఏవేతి. తదసత్—శ్రేయానితి। శ్రేయాన్ ప్రశస్యతర స్స్వో ధర్మ స్స్వధర్మో విగుణోఽపి విగతగుణోఽప్యనుష్ఠీయమానః పరధర్మా త్స్వనుష్ఠితా త్సాద్గుణ్యేన సంపాదితా దపి। స్వధర్మే స్థితస్య నిధనం మరణ మపి శ్రేయః పరధర్మే స్థితస్య జీవితాత్, కస్మా త్పరధర్మో భయావహః నరకాదిలక్షణం భయ మావహతి యతః ॥ ॥౩౫॥

శాంకరభాష్యతత్త్వబోధని:—

రాగద్వేషములు శ్రేయోమార్గమునకు విరోధులు. ఎందువల ననిన? వ్యవహారభూమి యందుఁ బురుషుడు రాగద్వేషప్రయుక్తుడై శాస్త్రార్థమునుకూడ నన్యథా తలచును. మఱియు పరధర్మముకూడ ధర్మమే యగుటవలన ననుష్ఠేయమే యనియు తలచును. ఇట్లు తలచుట మంచిది కాదని "శ్రేయాన్" అను శ్లోకముచే జెప్పుచుండెను.

లెస్సగ ననుష్ఠింపబడిన పరధర్మము (బ్రాహ్మణపరివ్రాడ్ధర్మమగు భిక్షాటనము) కంటె స్వధర్మము (క్షత్రియధర్మమగు యుద్ధము) కొంచము గుణలోపము కలదైనను శ్రేష్ఠతరమైనది. ఎందువలననిన? పరధర్మము నరకపాతాదిభయమును చేయునది. కాన పరధర్మమునందుండి జీవించుటకంటె స్వధర్మమునం దుండువానికి మరణమైన శ్రేష్ఠము. అనగా స్వధర్మమును వదలి పరధర్మము ననష్ఠించువానికి స్వధర్మపరిత్యాగమువలన ప్రాప్తించెడి దోష మపరిహార్యము. కాన స్వధర్మపరిత్యాగ మెన్నటికిని శ్రేష్ఠమైనదికాదు. (ఇట స్వధర్మ మిది. పరధర్మ మిది యని తెలిసికొను టెట్లనిన? ఈగ్రంథము వర్ణాశ్రమవిభాగపురస్సరముగనే చెప్పఁబడుటచే 'తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ' అనుభగవదుక్తిప్రకారము శాస్త్రము చేతనే స్వధర్మపరధర్మవిభాగము తెలిసికొనవదగినది.) ॥౩౫॥

—• ౩వ అధ్యాయము ౩౫వ శ్లోకవ్యాఖ్యా విశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "స్వాభావికరాగద్వేషప్రయుక్త మగు పశ్వాదిసాధారణప్రవృత్తిని వశింపజేసికొని శాస్త్రవిహితకర్మయే యాచరింపదగినచో భిక్షాశనాదికము శాస్త్రవిహితము, సుకరము కాన వదియే యాచరింపదగినది. అతిదుఃఖావహ మగు యుద్ధముతో నేమి ప్రయోజన" మను శంకను "శ్రేయాన్ స్వధర్మః" అను శ్లోకముచే తొలగించుచుండెను.

ఏవర్ణమును, ఏయాశ్రమము నుద్దేశించి శాస్త్రముచే నేధర్మము విహితమో, అది యావర్ణులకు, నాయాశ్రమములకును స్వధర్మమనబడును. అట్టి స్వధర్మము కొంచె మంగలోపముగ నాచరింపబడినను తన వర్ణము నుద్దేశించి కాని, తనయాశ్రమము నుద్దేశించి కాని శాస్త్రముచే విధింపబడనట్టియు, ఏయంగలోపము లేకుండగ నాచరింపఁబడినదియు నగు పరధర్మముకంటె శ్రేష్ఠమైనది. "ధర్మమగుటవలన పరధర్మముకూడ ననుష్ఠేయమే" అను ననుమానప్రమాణముచే పరధర్మమున కనుష్ఠేయత్వమును సాధించెదవనెదవా? ధర్మ మనునది వేదాతిరిక్తప్రమాణగమ్యము కాదు. ధర్మవిషయమున వేదమే ప్రమాణము. వేదముచే నేది యేవర్ణములకు, ఏయాశ్రమములకు విహి-

తమో యదియే వారలకు ధర్మమనబడును. ఇతరమగునది వారలకధర్మమే యగును. ఈవిషయమే మీమాంసాశాస్త్రమున "చోదనాలక్షణోఽర్థో ధర్మః" (విధివిహితమే ధర్మము) అని స్పష్టముగఁ జెప్పఁబడెను. కాన స్వధర్మము కొంచమంగలోపముగ నాచరింపబడినను అట్టి స్వధర్మమునం దుండువానికి పరధర్మమునం దుండు వాని జీవితముకంటె మరణమైనను శ్రేష్ఠమైనది. స్వధర్మమునందుండువానికి మరణము పరలోకమునందు స్వర్గము నిచ్చును; ఇహలోకమునందు కీర్తి నొసగును. పరధర్మమైనచో నిహలోకమున నపకీర్తిని, పరలోకమున నరకమును సమకూర్చుటచే భయమునుగలుగజేయును. కాన రాగద్వేషప్రయుక్తస్వాభావికప్రవృత్తివలె పరధర్మమును కూడ పరిత్యజింపఁదగినదే. ఇట్లు భగవన్మతాంగీకారులకు శ్రేయస్సు ప్రాప్తించును. భగవన్మతము నంగీకరించనివారలకు శ్రేయోమార్గభ్రష్టత్వము సంభవించునని చెప్పబడెను. ఫలాభిసంధిపూర్వకముగ కామ్యకర్మాచరణమునందు కేవలపాపమాత్రాచరణమునందు శ్రేయోమార్గము భ్రంశమగునని యనేకకారణములను "యే త్వేతదభ్యసూయంతః" అను దానిచే జెప్పుచుండెను. ఈవిషయమై యీసంగ్రహశ్లోకము "శ్రద్ధాహాని స్తథాఽసూయాదుష్టచిత్తత్వమూఢతే। ప్రకృతేర్వశవర్తిత్వం రాగద్వేషౌ చ పుష్కలౌ॥ పరధర్మరుచిత్వం చేత్యుక్తా దుర్మార్గవాహకాః" శ్రద్ధలేకవుట, అసూయ, దుష్టచిత్తుఁడై యుండుట, మూఢత్వము, ప్రకృతివశవర్తి యగుట, పుష్కలరాగద్వేషములు, పరధర్మమునం దభిరుచికలవాఁడగుట అను నీయేడును దుర్మార్గమును పొందించునవి. అనగా నిట్టి గుణములుకలవాఁడు దుర్మార్గుఁ డనఁబడును. అని చెప్పుచున్నది. ॥౩౫॥

శంకరానందీయము:— "అభయం సర్వభూతేభ్యో దత్త్వా నైష్కర్మ్య మాచరేత్" (సర్వభూతములకు నభయమునొసఁగి; సంన్యాసమును స్వీకరించవలయును) అనుస్మృతివలన కర్మసంన్యాసముకూడ నాచరింపదగినధర్మమేయని యనెదవ? సత్యమే. సంన్యాసముకూడ శాస్త్రీయ మగు ధర్మమే. అది ముముక్షు వాశ్రయింపదగినదే. అయినను "స్వే స్వేఽధికారే యా నిష్ఠా స గుణః పరికీర్తితః" (తమతమ యధికారమునందే నిష్ఠ కలదో యదియే గుణము (మంచిది) అని చెప్పబడుచున్నది. ఈవచనమువలన నపక్వాంతఃకరణము కలవానికి సంన్యాసము ధర్మము కాదు. మరేమనిన? అనేకజన్మార్జితపుణ్యసమూహములచే పరిపక్వాంతఃకరణకలిగినట్టియు, అన్నిటినుండి విరక్తుఁడైనట్టియు, కర్మలు మోక్షసాధనములు కావని తెలిసికొనినట్టి ముముక్షువునకు వివిదిషచే ధర్మమగు సంన్యాసము కర్తవ్యము. మఱియు కృతార్థుఁడగు విద్వాంసునకుకూడ సంన్యాసము కర్తవ్యము. అంతియే కాని దుఃఖ (కర్మలు చేయుట యతికష్ట మను) బుద్ధిచే కర్మలయం దలసుఁడగు మూర్ఖునకు సంన్యాసము చేయతగినది కాదు. కాన మూర్ఖునకు సంన్యాసము పరధర్మ మగును; కాని స్వధర్మము కానేరదు. అట్టివానికి సంన్యాసము శ్రేయోహేతువు కాదు. కాన మూఢునకు కర్మయే స్వధర్మము, శ్రేయోదాయకము, అనుష్ఠేయము అగుచున్న దని "శ్రేయాన్" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

వర్ణాశ్రమములు కలవారలకు శ్రీకృష్ణపరమాత్మచే నీపరమోపదేశము చేయఁబడుచుండెను. యథాశాస్త్రముగ లెస్సగ ననుష్ఠింపఁబడిన పరధర్మముకంటె తనకు కర్తవ్యముగ శాస్త్రముచే బోధింపఁబడిన ధర్మము స్వధర్మ మనఁబడును. అట్టి స్వధర్మము కొంచెము గుణలోపముగ ననుష్ఠింపఁబడినను విధ్యుక్త మగుటచే పురుషునకు శ్రేష్ఠతరమైనది. ఎట్లు సంన్యాసికి పరధర్మ మగుటవలన స్నానజపస్తోత్రాదికర్మలకంటె జ్ఞానసాధనశ్రవణాది సాధన మగు సర్వకర్మసంన్యాసమే శ్రేష్ఠధర్మ మగుచున్నదో; అట్లే గృహస్థునకు కర్మసంన్యాసము పరధర్మ మగుటవలన గృహస్థునకుకూడ సర్వకర్మసంన్యాసముకంటె జ్ఞానసాధన మగు సత్త్వశుద్ధియే ముఖ్య మగు ప్రయోజనముగాఁగల కర్మమే శ్రేష్ఠమైన ధర్మము. ఇటులే యితరులగు వర్ణాశ్రములకుకూడ పరధర్మముకంటె స్వధర్మమే శ్రేయస్కరము. మఱియు పరధర్మమును విడచి కొంచ మంగలోప మగు స్వధర్మమునందు నియమముగ నుండు

అర్జున ఉవాచ:—

గీ॥ అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః ।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ! బలాదివ నియోజితః ॥ ॥౩౬॥

పదవిభాగము:— అర్జునః— ఉవాచ— అథ— కేన— ప్రయుక్తః— అయం— పాపం— చరతి— పూరుషః— అనిచ్ఛన్— అపి— వార్ష్ణేయ!— బలాత్— ఇవ— నియోజితః । ॥౩౬॥

ప్రతిపదార్థము:— అర్జునః=అర్జునుఁడు; ఉవాచ=పలికెను; అథ=మఱి; హేవార్ష్ణేయ!=వృష్ణికులసంభూతుఁడ వగు నోశ్రీకృష్ణా!; అయం=ఈ; పూరుషః=పురుషుఁడు; అనిచ్ఛన్నపి=ఇచ్ఛయించనివాఁడైనను; బలాత్=బలముచేతను; నియోజిత ఇవ=నియోగింపఁబడినవాఁడువలె; కేన=ఎవనిచే; ప్రయుక్తః=నియోగింపఁబడినవాఁడై; పాపం=పాపమును; చరతి=ఆచరించుచున్నాఁడు? ॥౩౬॥

---

వానికి (అనఁగా కొంచె మంగలోపముగ నైన స్వధర్మమునే యాచరించువానికి) మరణమైన "శ్రేయః" స్వర్గముకొఱకైనను, మోక్షముకొఱకైనను సమర్థ మగుచున్నది. ఎన్నఁడును అశ్రేయస్సుకొఱకు (నరకపతనముగూర్చి) కారణము కాదు. స్వధర్మమును విడనాడి వాక్కుచేఁ జెప్పుట కశక్య మగు పరధర్మము ననుష్ఠించువానికి నిధనము సంభవించును. అనఁగా స్వధర్మమును పరిత్యజించి, యెవఁడు పరధర్మము నాచరించునో వానిచే నాచరింపఁబడిన పరధర్మము "భయావహః" యమదూతలవలన భయమును, నరకమును కలుగఁజేయును. నరకగర్భవాసపురిణాది దుఃఖప్రవాహమునకు హేతు వగు నని యర్థము.

భాష్యోత్కృష్ట దీపిక:— తత్తదింద్రియగోచర మగు శబ్దస్పర్శరూపరసగంధాదివిషయములయందుగల రాగద్వేషములు ఆత్మప్రాపక మగు నాత్మధర్మవిషయమై విఘ్నమును చేయునట్టి విషయసుఖజనకము లైనను ప్రవృత్తిజనక మగు నింద్రియధర్మమునందు విఘ్న మాచరించనందున నింద్రియధర్మమే యనుష్ఠేయము. విఘ్నకర్తలతోఁగూడిన యాత్మధర్మానుష్ఠానముచే నేమి ప్రయోజన మను నాశంకను "శ్రేయాన్" అను శ్లోకముచే తొలఁగించుచుండెను. సుగమ మగుటచే ననుష్ఠించుటకు శక్యము, ప్రకృతిజనకము, వైషయికసుఖజనకము నగు నింద్రియముల ధర్మముకంటె యాధ్యాత్మవగతిరూపము స్వధర్మ (ఆత్మధర్మ)ము ప్రాకృతగుణములేనిదై ముక్తిహేతువగుటవలన ప్రశస్యతరము. అట్టి యాత్మధర్మమునందు మరణము మోక్షహేతు వగుటవలన శ్రేయోరూప మగును. పర (ఇంద్రియ) ధర్మ మవిద్యారూప మగుటచే సంసారహేతువు. అందువలననే భయావహమే అని కూడ నర్థము చూచుకొనవలయును.

పరమార్థప్రపా:— స్వధర్మపరధర్మములు ధర్మములే యగుటవలన శమదమాదిసంపదుపేత మగు బ్రహ్మకర్మయే యనుష్ఠేయము. క్షత్రియధర్మము స్వపరహింసాప్రధాన మగుటచే దుఃఖసాధనము. అట్టి క్షత్రియధర్మ మెట్లాచరింపవలయు నను శంకను "శ్రేయాన్" అను శ్లోకముచే దొలఁగించుచుండెను.

లెస్సగ ననుష్ఠించఁబడిన శమదమాదిసంపదుపేత మగు బ్రాహ్మణధర్మముకంటె కించిదంగలోపముకల దైనను స్వధర్మమే శ్రేష్ఠమైనది. అదెట్లనిన? సౌభాగ్యాదిగుణములతోఁగూడిన పరుని తల్లికంటె తనతల్లియే తనకు హితవును చేయునట్లని గ్రహింపుము. కాన స్వధర్మమునందే మరణము తనమార్గాదులను సాధించున దగుటవలన శ్రేష్ఠము. పరధర్మమైతే తనకు నిషిద్ధ మగుటచే నరకమును పొందించును. కాన భయమును కలిగించునది. అట్లు కానిచో (అన్నిధర్మము లందరికి నాచరణీయములే యగుచో) వేదముచే చాతుర్వర్ణ్యవిభాగ మెందులకు కల్పించఁబడును? కల్పించఁబడకనే యుండెడిది (వేదము చాతుర్వర్ణ్యవిభాగమును కల్పించుటచే నొక్కొక్క వర్ణము వారి కొక్కొక్క ధర్మ మాచరణీయ మగును. అట్లే పరధర్మ మనాచరణీయ మగునని స్పష్టపడుచున్నది. ॥౩౫॥

శాంకరభాష్యమ్: —

యద్య ప్యనర్థమూలం "ధ్యాయతో విషయా న్పుంసః" (గీ-2-62) "రాగద్వేషౌ హ్యస్య పరిపంథినౌ" (గీ-3-34) ఇతి చోక్తం విక్షిప్త మనవధారితం చ తదుక్తం తత్సంక్షిప్తం నిశ్చితం చేద మేవేతి జ్ఞాతు మిచ్ఛ న్నర్జున ఉవాచ- జ్ఞాతేహి తస్మిం స్తదుచ్ఛేదాయ యత్నం కుర్యా మితి — అథేతి । అథ కేన హేతుభూతేన ప్రయుక్తస్స న్రాజ్ఞేవ భృత్యోఽయం పాపం కర్మ చర త్యాచరతి పూరుషః స్వయ మనిచ్ఛన్నపి హే వార్ష్ణేయ! వృష్ణికులప్రసూత! బలా దివ నియోజితో రాజ్ఞేవే త్యుక్తో దృష్టాంతః ॥ ॥౩౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పూర్వమునందే యనర్థకారణము చెప్పఁబడెను. కాన తిరిగి యర్జునుఁ డిట్టి యనర్థమూలమును తెలుసుకొను నిచ్ఛచే ప్రశ్నించుట యసంగత మని శంకింపఁజనదు. విచారింప "ధ్యాయతో విషయా న్పుంసః, రాగద్వేషౌ హ్యస్య పరిపంథినౌ" అని యనర్థమూలము చెప్పఁబడెను. కాని నీవిషయ మనేకప్రదేశములయందుఁ జెప్పఁబడెను. అట్లు చెప్పుటచే ననేకవిధములుగ ననేకకామాదులచే వికల్పిత మగుటవలన నిశ్చయముగ తెలిసికొనబడలేదు. సంక్షిప్తముగ చెప్పబడనట్టిన్ని. ఇదియే యని నిశ్చయింపఁబడనట్టి యానర్థానర్థమూలమును తెలిసికొన నిచ్ఛకలవాఁడై యర్జునుడు సర్వానర్థమూలము తెలిసినయెడల దాని నాశముకొరకు ప్రయత్నించెద నను యాశయముచే "అథ కేన" అని ప్రశ్నించెను.

ఈశ్లోకమునందుఁ గల "అథ" అను శబ్దమున కారంభ మర్థము. ఓశ్రీకృష్ణా! రాజుచే నియోగింపఁబడిన భృత్యునివలె యీపురుషుఁడు స్వయముగ పాపాచరణమునం దిచ్ఛలేనివాఁడైనను బలాత్కారముగ నియోగింపఁబడినవాఁడువలె నెవనిచే నియోగింపబడి పాపకర్మము నాచరించుచుండెను? ఎట్లనిన? రాజుచే నియోగింపఁబడినవాఁడువలెనని చెప్పబడిన దృష్టాంతము గ్రహింపనగును. ॥౩౬॥

—• ౩వ అధ్యాయము- ౩౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— కామ్యకర్మలయందు, నిషిద్ధకర్మలయందు ప్రవృత్తికి కారణమును తొలఁగించి భగవన్మతము ననుసరించుటకు, కామ్యప్రతిషిద్ధకర్మప్రవృత్తి కారణనిశ్చయముకొఱకు "ధ్యాయతో విషయాన్" అని మొదలగు గ్రంథముచే పూర్వమునం దనర్థమూలము చెప్పఁబడెను. ఇపుడు "ప్రకృతే ర్గుణసంమూఢాః" అనునది మొదలగు గ్రంథముచే విస్తారముగ నా కారణములే చెప్పఁబడెను. ఆ కారణము లన్నియు సమప్రాధాన్యముచే కామ్యప్రతిషిద్ధాచరణప్రవృత్తిహేతువులా? లేక, ఒకటియే ముఖ్యకారణమయి, ఇతరములు ముఖ్యకారణమునకు సహకారులా? అందన్నియు సమప్రాధాన్యముచే కామ్యప్రతిషిద్ధాచరణప్రవృత్తికి కారణము అను పక్షమున నన్నింటిని వేరువేరుగ నిరాకరించుటయందు గొప్ప ప్రయాస సంభవించును. అందొకటియే కామ్యప్రతిషిద్ధాచరణ ప్రవృత్తికి ప్రధానహేతువు. ఇతరము లాప్రధాన కారణమునకు సహకారు లను పక్షమునందు ప్రధానకారణమును నిరసించిన సహకారు లన్నియు నిరాకృతములే యగును. అందువలన కృతకృత్యతా

ప్రాప్తించును. అందువలన నేకారణముచే ప్రేరితుఁడై యీపురుషుఁడీమతము ననుసరించక సర్వజ్ఞానవిమూఢుఁడై, అనర్థమును సమకూర్చునట్టి ఫలాభిసంధిపూర్వక మగు కామ్య మగు చిత్రయాగకర్మను, శత్రువధసాధన మగు శ్యేన యాగమును, నిషిద్ధ మగు కలంజపలాండు భక్షణాదికము నగువివిధకర్మలను స్వయముగ చేయుట నిచ్ఛయించని వాఁడైనను చేయుచుండెను. నీచే నుపదిష్టము, పరమపురుషార్థమును సమకూర్చునట్టిది, నివృత్తిరూపకర్మము నిచ్ఛ యించువాఁడైనను నాచరింపఁడు? పరతంత్రతలేనిదే యిట్లాచరింపఁడు. కాన రాజుచే నియోగింపఁబడినభృత్యుఁడు వలె బలాత్కారముగ నెవరిచే నియోగింపఁబడి యీపురుషుఁడు నీమతవిరోధము సర్వానర్థములను సమకూర్చునని తెలిసినవాఁడైనను, నీమతవిరుద్ధ మగు కర్మల నాచరించుచుండెను? అట్టి యనర్థప్రాపకుఁడగు వానిని చెప్పుము. అట్లు చెప్పిన వానిని నశింపఁజేసికొనెదను. అని యాశయము. నామాతామహకుల మగు వృష్ణివంశమునందు కృపచే నవతీర్ణుఁడవని "వార్ష్ణేయ" అని సంబోధనచే వార్ష్ణేయీసంభూతుఁడ నగు నన్ను నీ వుపేక్షింపరా దని సూచింపఁబడెను. ॥౩౬॥

శంకరానందీయము:— విచారింప "ధ్యాయతో విషయాన్పుంసః సఙ్గస్తేషూపజాయతే। సఙ్గాత్సంజాయతే కామః" అనియు, 'ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే' అనియు పురుషునకు జననమరణాద్యనేకానర్థ కారణము నిరూపింపఁబడెను. అయినను విశేషముగ ననర్థకారణస్వరూపమును, అట్టి కారణాధిష్ఠానమును, అట్టి యనర్థకారణజయోపాయమును తెలిసికొను నిచ్ఛకలవాఁడై యర్జునుఁడు విస్మృతుఁడువలె స్వయముగ 'అథ కేన' అని ప్రశ్నించుచుండెను.

ఇట "అథ" అను శబ్దము పృథక్ప్రశ్నారంభార్థము గాఁగలది. "వర్షతీతి వృష్ణిః" బ్రహ్మవేత్తలకు బ్రహ్మానందమును వర్షించునది గాన తత్త్వజ్ఞానము 'వృష్ణిః' అను పదముచే చెప్పబడును. అట్టి బ్రహ్మజ్ఞానముచే తెలియఁబడు పరమాత్మరూప మగు శ్రీకృష్ణభగవాను "వార్ష్ణేయుఁడు" అని యనఁబడును. అతని సంబుద్ధి "హేవార్ష్ణేయ!" అనునది. అనఁగా బ్రహ్మవేత్తలకు బ్రహ్మానందమును వర్షించు బ్రహ్మజ్ఞానముచే తెలియఁబడు పరమాత్మరూప మగు నోశ్రీకృష్ణపరమాత్మా! బలవంతుఁడగు రాజుచే గాని, లేక యొకానొక బలవంతునిచే గాని బలాత్కారముగ ప్రేరేపింపఁబడినవాఁడువలె కార్యాకార్యములను గుర్తెఱుంగని యీపురుషుఁడు పాపసాధ్య మగు ఫలమును కోరనివాఁడైనను పాప మాచరించుచుండెను. ఈ కార్యకరణసంఘాతమునందుగల బలవంత మగు దేనిచే ప్రేరేపితుఁడై యయుక్తమునుకూడ నాచరించుచుండెనో అట్టిదానిని చెప్పుము. ॥౩౬॥

నీలకంఠీయము:— ఈశ్వరుఁడు కాని, ధర్మాధర్మములు కాని, రాగద్వేషములు కాని పురుషునకు ప్రవర్తకము లగును. కాన పురుషునకు స్వాతంత్ర్యము లేదని యర్జునుఁ డూహించి "అథ కేన" అని ప్రశ్నించుచుండెను.

ఇచట పురుషునకు ప్రవర్తకులు మూఁడు. అవెవ్వి? 1 ఈశ్వరుఁడు, 2 ధర్మాధర్మములు, 3 రాగద్వేషములు. ఈమూఁటిలో నెవనిచే ప్రేరితుఁడై పురుషుఁడు అనిష్ట మగు పాపము నిచ్ఛలేకున్నను బలాత్కారముగ నియోగింపఁబడినవాఁడువలె నాచరించుచుండెను? స్వభావముగనే పాపము నాచరించుచుండె ననెదవా? పురుషునకు స్వాతంత్ర్యము లేమింజేసి యనిష్ట మెట్లాచరించును? ఆచరించఁడు. ఇట "అనిచ్ఛన్" (ఇచ్ఛయించనివాఁడై) అని చెప్పుటవలన రాగద్వేషములకు ప్రవర్తకత్వము తొలఁగింపఁబడెను. రాగ మున్నపుడుకదా యిచ్ఛ జనించును. ఇచ్ఛలేనివాఁడై అని చెప్పుటవలన రాగద్వేషములు లేనివాఁడై అని చెప్పినట్లే. కాన రాగద్వేషములు ప్రవర్తకములు కావని స్పష్ట మగుచున్నది. రాగము ప్రవర్తకము కానిచో రాగమునకు కారణ మగు సంస్కారమును పుట్టించెడి ధర్మాధర్మములకు ప్రవర్తకత్వము లేదని స్పష్ట మగుచున్నది. ధర్మాధర్మములు ప్రవర్తకములు కానిచో ధర్మాధర్మసాపేక్షకుఁ డగు ఈశ్వరుఁడు ప్రవర్తకుఁడు కాఁడని స్పష్టమే. అని యీశ్లోకమునందు ఈశ్వర, ధర్మాధర్మ, రాగద్వేషములు ప్రవర్తకములు కావని యాక్షేపము. కానముఖ్యముగ పాపాచరణమునందు పురుషుని ప్రవర్తింపఁజేయున దేదియో చెప్పఁదగిన దని యర్జునుని ప్రశ్నము. ॥౩౬॥

శ్రీభగవా నువాచ:-గీ॥ కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్ ॥ ॥37॥

పదవిభాగము:— శ్రీభగవాన్- ఉవాచ- కామః- ఏషః- క్రోధః- ఏషః- రజోగుణసముద్భవః- మహాశనః- మహాపాప్మా- విద్ధి- ఏనం- ఇహ- వైరిణమ్ ॥ ॥37॥

ప్రతిపదార్థము:— శ్రీభగవాన్=శ్రీకృష్ణుఁడు; ఉవాచ=పలికెను, ఏషః=ఈ; కామః=కాముఁడు; మహాశనః=గొప్పయశనము కలవాఁడు, మహాపాప్మా=గొప్పపాపాత్ముఁడు; ఇహ=ఈసంసారమునందు; వైరిణం=శత్రువునుగ; ఏనం=ఈ కాముని; విద్ధి=తెలిసికొనుము. ॥37॥

శాంకరభాష్యము:—

శృణు త్వం తం వైరిణం సర్వానర్థకరం యం త్వం పృచ్ఛసి — "ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశస శ్శ్రియః । వైరాగ్యస్యాథ మోక్షస్య షణ్ణాం భగ ఇతీంగనా" (విష్ణు॥ 6-5-74) ఐశ్వర్యాదిషట్కం యస్మి న్వాసుదేవే నిత్య మప్రతిబద్ధత్వేన సామస్త్యేన చ వర్తతే। "ఉత్పత్తిం ప్రళయం చైవ భూతానా మాగతిం గతిమ్ । వేత్తి విద్యా మవిద్యాం చ స వాచ్యో భగవా నితి" ఉత్పత్త్యాదివిషయం చ విజ్ఞానం యస్య స వాసుదేవో వాచ్యో భగవా నితి । కామ ఇతి । కామ ఏష స్సర్వలోకశత్రు ర్య న్నిమిత్తా సర్వానర్థప్రాప్తిః ప్రాణినాం స ఏష కామః ప్రతిహతః కేనచి త్క్రోధత్వేన పరిణమతే । అతః క్రోధో ప్యేష ఏవ । రజో

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఐశ్వర్యము, ధర్మము, యశస్సు, లక్ష్మి, వైరాగ్యము, మోక్షము అను నీయారును ఐశ్వర్యాదిషట్క మనఁబడును. ఇట్టి యైశ్వర్యాదిషట్క మెవనియందు నిత్య మప్రతిబద్ధముగ సంపూర్ణముగ నుండునో, భూతముల యుత్పత్తివినాశములను, గమనాగమములను, విద్యావిద్యలను దెలిసినవాఁ డెవఁడో వాఁడే భగవంతుఁడుగాన నట్టి వాసుదేవుఁడు— "సర్వానర్థకరుఁ డగుటచే వైరి యగునట్టి యెవనిని నీ వడుగుచుంటివో అట్టివానిని విను" మని సమాధానము జెప్పెను.

జీవుల కెవనివలన సర్వానర్థములు ప్రాప్తించుచున్నవో; అట్టి సర్వలోకశత్రు వగు వాఁడీ కాముఁడే ఈ కాముఁ డొకానొకనిచే ప్రతిహతుఁడై, క్రోధరూపుఁడుగఁ బరిణమించును.

—• 3వ అధ్యాయము 37వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— శ్రీకృష్ణపరమాత్మ యి ట్లర్జునునిచే ప్రశ్నింపబడి "అథో ఖల్వాహుః కామమయ ఏవాయం పురుషః, ఆత్మైవేదమగ్ర ఆసీదేక ఏవసోఽకామయత జాయా మే స్యా దథ ప్రజాయేయాథ విత్తం మే స్యా దథ కర్మ కుర్వీయ" (అనంతరమున బ్రహ్మవేత్త లిట్లు చెప్పుచొడఁగిరి. ఈ పురుషుఁడు కామమయుఁడే, సృష్టికిపూర్వమునం దాత్మ యొక్కటియే యుండెను. అట్టి యాత్మ యిట్లు తలంచెను. నాకు భార్య ప్రాప్తించుఁగాక, అనంతరమున నే ననేకరూపములుగ జనింపఁగలను. నాకు ద్రవ్యము ప్రాప్తించుగాక, అనంతరమున కర్మను చేయఁగలను) అను నిట్టి శ్రుతిసిద్ధమగు విషయమును సమాధానముగ 'కామఏష' అని చెప్పుచుండెను.

శాంకరభాష్యమ్:—

గుణసముద్భవో రజశ్చ తద్గుణశ్చ స రజోగుణః స సముద్భవో యస్య స కామో రజోగుణసముద్భవో రజోగుణస్య వా సముద్భవః। కామో హ్యుద్భూతో రజః ప్రవర్తయ న్పురుషం ప్రవర్తయతి తృష్ణయా హ్యహంకారిత ఇతి దుఃఖితానాం రజః కార్యే సేవాదౌ ప్రవృత్తానాం ప్రలాప శ్శ్రూయతే। మహాశనో మహ దశన మస్యేతి మహాశనోఽత ఏవ మహాపాప్మా। కామేన హి ప్రేరితో జంతుః పాపం కరోతి। అతో విద్ధ్యేనం కామ మిహ సంసారే వైరిణమ్ ॥ ॥౩౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కాన క్రోధుడుకూడ కాముఁడే యనబడును. ఇట్టి కాముఁడు రజోగుణము కారణముగా కలవాడు. అనగా రజోగుణమువలన జనించును. లేక రజోగుణమున కీకాముఁడు కారణము. కాముఁడు జనించినవాఁడై రజోగుణమును ప్రవర్తింపజేయుచు పురుషుని ప్రవర్తింపజేయును. "తృష్ణచే యహంకారితుడ" నని రజఃకార్యమగు పరసేవాదులయందు ప్రవృత్తులైన దుఃఖితుల ప్రలాపములు వినబడుచున్నవి. ఈకాముఁడు గొప్పయశనము కలవాఁడు, మహాపాపి. కామునిచే ప్రేరేపితుడగు జీవుడు పాపమును చేయును. కాన మహాపాపి కాముఁ డనబడును. కావున సంసారమునందు మహావైరిగ నీకాముని తెలిసికొనుము. ॥౩౭॥

బలత్కారముగ ననర్థమునందు ప్రవర్తకుఁ డగువాఁడు కాముడు. ఎవనివలన ప్రాణులకు సర్వానర్థము అగుచున్నదో, అట్టి కాముడే గొప్పశత్రువు. క్రోధుడుకూడ నాభిచారికహోమాదులయందు ప్రవర్తకుడుగదా. వాడెందుల కిచట శత్రువని నిరూపింపవు. అనిన ఆక్రోధుడుకూడ కామస్వరూపుడే. కాముడే యొకానొక హేతువుచే ప్రతిహతుడై క్రోధరూపమున పరిణమించును. కనుక క్రోధుడుకూడ కాముఁడే యనబడును. ఇట్టి మహావైరియగు కాముని జయించినచో సర్వపురుషార్థప్రాప్తి యగును. కనుక కామనివారణోపాయజ్ఞాననిమిత్తము కామునకు కారణమును 'రజోగుణసముద్భవః' అను పదముచే జెప్పుచుండెను. దుఃఖప్రవృత్తిబలాత్మకము రజోగుణము. అట్టి రజోగుణమే కారణముగా కలవాఁడు కాముఁడు. (అనఁగా కాముఁడు రజోగుణమువలన జనించును) కాన, కార్యము కార్యానువిధాయియగుటవలన కాముడుకూడ దుఃఖప్రవృత్తిబలాత్మకుడే యగును. విచారింప తమోగుణముకూడ కాము డుద్భవించుటయందు కారణమే. అయినను దుఃఖమునందు, ప్రవృత్తియందు రజోగుణమే ప్రధానమగుటవలన నీగీతయందు కామునకు హేతువుగ రజోగుణమే నిర్దేశింపబడెను. ఈచెప్పుటచే సాత్త్వికవృత్తిచే రజోగుణము క్షీణింపజేయు హేతుక్షయమువలన కాముడుకూడ క్షీణించు నని చెప్పఁబడెను.

లేక కాముఁ డెట్లనర్థమార్గప్రవర్తకుడు? అను నాశంకపై "రజోగుణసముద్భవః" అని చెప్పుచుండెను. ప్రవృత్త్యాదిరూపమగు రజోగుణమునకు హేతువగువాడు కాముడు. విషయాభిలాషరూపుడగు కాముఁడు స్వయముగ నుద్భవించి రజోగుణమును ప్రవర్తింపజేయుచు పురుషుని దుఃఖాత్మకమగు కర్మమునందు ప్రవర్తింపజేయును. అందుచే నీకాము డవశ్యము జంపదగినవాడు. అని యభిప్రాయము.

శత్రుజయమునందు సామదానభేదదండము అను నాలుగుపాయములు కలవు. అందు మొదటిదగునుపాయ

ములు సంభవింపని పక్షమునందుకదా నాల్గవ యుపాయము ప్రయోగించుట. మొదటియుపాయములు ప్రాప్తించుచుండ చతుర్థోపాయమును హఠాత్తుగ ప్రయోగించరాదను శంకను మొదటియుపాయత్రయము మీ కామజయమునందు సంభవింపదని చెప్పుటకు "మహాశనో మహాపాప్మా" అని చెప్పవలసెను. ఈ కాముడు మహాశనుడు అనగా "యత్పృథివ్యాం వ్రీహియవం హిరణ్యం పశవస్స్త్రియః । నాలమేకస్య తత్సర్వమితి మత్వా శమం వ్రజేత్" (ఆసేతుహిమాచలపృథివియందు, ఖండాంతరములయందుండు వ్రీహులు, యవలు, బంగారము, స్త్రీలు. ఇవియన్నియు, నీ కామునితృప్తికొఱకు సమర్థమైనవి కావు అనఁగా నెన్ని వ్రీహులను, యవలను, ధనమును, స్త్రీలను సంపాదించినను వీనివలన కామతులుఁకల పురుషునకు తృప్తిపడక మఱియునింకను పైవానిని సంపాదింపవలయుననియే కోరుచుండును. కాన కామునికిదానము మొసగి నివర్తింపజేయవలెనని యత్నించుచుండుట వ్యర్థమగుటచేనందుకు యత్నించక శమమునే యాశ్రయించుట యుక్తము) అనిస్మృతిబోధించుచున్నది. కానపైయుపాయములలో రెండవదియగు దానమను నుపాయముచే గాముని జయించుట శక్యముగాదు. మఱియు నీ కాముఁడు మహాపాపి, అత్యుగ్రుడు కాన నాయుగ్రరూపముగల గామునిచే ప్రేరితుడై 'పాప మనిష్టఫలము నొసగును' అని తెలిసినవాడైనను పాపము నాచరించును కాన వీనివిషయమై సామభేదములుకూడ నుపయోగించవు. కనుక నీ కామము నీసంసారమునందు మహావైరినిగ దెలిసికొనుము. ఈవిషయమంతయు వార్తికకారులు "ఆత్మైవేదమగ్ర ఆసీత్" అను శ్రుతి వ్యాఖ్యానావసరమున వివరించెను.

వా॥ "ప్రవృత్తౌ చ నివృత్తౌ చ యథోక్తస్యాధికారిణః । స్వాతంత్ర్యేసతి సంసారసృతౌ కస్మాత్ప్రవర్తతే ॥ నను నిశ్శేషవిధ్వస్తస్సంసారానర్థవర్త్మని । నివృత్తిలక్షణే వాచ్యం కేనాయం ప్రేర్యతేఽవశః ॥ అనర్థపరిపాకత్వ మపిజానన్ప్రవర్తతే । పారతంత్ర్యమృతే దృష్టా ప్రవృత్తిర్నేదృశీ క్వచిత్ ॥ తస్మాచ్ఛ్రేయోఽర్థినః పుంసః ప్రేరకోఽనిష్టకర్మణి । కర్తవ్యస్తన్నిరాసార్థమిత్యర్థా స్యాత్పరా శ్రుతిః ॥ అనాప్తపురుషార్థోఽయం నిశ్శేషానర్థసంకులః । ఇత్యకామయతా నాప్తాన్పుమర్థాన్స్వార్థనైర్జడః ॥ జిహాసతి తథానర్థానవిద్వానాత్మని శ్రితాన్ । అవిద్యోద్భూతకామస్స న్నథో ఖల్వితి చ శ్రుతిః ॥ అకామతః క్రియాః కాశ్చిద్దృశ్యంతే నేహ కస్యచిత్ । యద్యద్ధి కురుతే జంతుస్తత్తత్కామస్య చేష్టితం ॥ కామ ఏష క్రోధ ఏష ఇత్యాదివచనం స్మృతేః । ప్రవర్తకో నాపరోఽతః కామాదన్యః ప్రతీయతే ॥"

ఇంతకుముందు వార్తికకారులచే యధికారినిరూపణము చేయబడెను. అట్టి యథోక్తాధికారికి ప్రవృత్తియందును, నివృత్తియందును స్వాతంత్ర్యముండ సంసారసృతియం దేహేతువువల్ల ప్రవర్తించుచుండెను? నివృత్తిరూపమగు నిశ్శేషవిధ్వస్తసంసారానర్థమార్గమునం దవశుడై యీపురుషుఁ డెవనిచే ప్రేరేపింపఁబడుచుండెనో చెప్పదగినది. ఈసంసారమనర్థపరిపాక మని తెలిసినవాడైనను దీనియందు ప్రవర్తించుచుండెను. పరతంత్రత్వము లేనిదే యిట్టి ప్రవృత్తి యెచటను చూడబడబడలేదు. కాన శ్రేయోర్థియగు పురుషున కనిష్టకర్మయం దెవఁడు ప్రేరకుడో వాడు చెప్పబడతగియున్నాడు. ఏందులకనిన నట్టి పురుషుఁడు తెలియబడిన తన్నివృత్తికొరకు ప్రయత్నింపవచ్చును. అందునిమిత్తమై పరాశ్రుతి (వేదాంతము పరాశ్రుతియనబడును.) యీపురుషుఁడు పొందఁబడని పురుషార్థములు కలవాడు; అనేకానర్థములతో కూడినవాఁడు కనుక నే జడుఁడు. అందువలననే ననాప్తములగు పురుషార్థములను కోరును. అట్టి యవిద్వాంసుఁ డాత్మనాశ్రయించియున్న యనర్థములను విడచుటకు యత్నించును. ఈవిషయమునే "అథో ఖల్వాహుః" అని శ్రుతిచెప్పుచున్నది. కోరికలేనివాని కెవనికిని నీలోకమునం దేక్రియలు చూడబడుటలేదు. జీవుఁ డేయేకర్మల నాచరించునో అదంతయు కాముని చేష్టితమే. ఈవిషయమునే "కామ ఏష క్రోధ ఏషః" ఇత్యాదిగీతావాక్యముకూడ చెప్పుచున్నది. తత్తత్కర్మలయందు ప్రవర్తకుడు కాముని కంటె నితరుడెవడును లేడు. అనిస్పష్టముగ చెప్పఁబడెను. "అకామతః" అను మనువచనముకూడ నీవిషయ

మునే స్పష్టపరచుచున్నది. మిగిలినశ్లోకార్థము స్పష్టము. అనగా నట్టి కామునే సంసారమునందు మహావైరిగ తెలిసికొనుము. ॥౩౭॥

శంకరానందీయము:— "అకామస్య క్రియా కాచి ద్దృశ్యతే నేహ కర్హిచిత్। యద్యద్ధి కురుతే జంతు స్తత్తత్కామస్య చేష్టితం" (కోరికలేనివాని కేలోకమునం దేక్రియయు చూడబడనందున (సంభవించనందున) ప్రాణి యేయేకర్మల నాచరించునో అవన్నియు కామునిచేష్టితమే) అను న్యాయముచే పురుషునకు సకలకర్మాచరణహేతువు, సర్వానర్థబీజము కాముడేయని బోధించుటకు శ్రీకృష్ణపరమాత్మ "కామ ఏషః" అని చెప్ప మొదలిడెను.

"సర్వప్రవృత్తులకు కాముడే హేతువగుటవలన కాముడు సర్వులకు ప్రత్యక్షమే" అను నభిప్రాయముచే 'ఏషః' అనిపురోనిర్దేశము చేయబడెను. (యోగ్యత్వాయోగ్యత్వ విచారములేకుండగనే దృష్టము, శ్రుతము నగువస్తువును పురుషునికోరునటులచేయు వైషయిక మగు ప్రబలేచ్ఛయే కాముఁడనబడును). అనగా నెవఁడు పురుషునకు సంసారహేతువో వాఁడే కాముఁడనబడును. ఈ కాముడే యొకాయొకనిచే స్వవిషయము ప్రతిషిద్ధమైయుండ (తాను కోరినవిషయమున కెవడైన నడ్డువచ్చినచో) క్రోధరూపమున పరిణమించును. అందువలన క్రోధుడుకూడ ఈ కాముఁడే యనబడును. ఇట్టి కాముడు స్వయముగ రజస్సుయొక్క గుణము, రంజనాత్మకము వైషయికమునగు సామాన్యేచ్ఛవలన జనించును. లేక 'ప్రజ్ఞాంతు సాత్వికీం ప్రాహు స్తామసీంతు విచిత్రతాం। క్రియాంతు రాజసీం ప్రాహు ర్గుణతత్త్వవిదో బుధాః' (ప్రజ్ఞను సత్వగుణసంబంధమైనదానినిగను, విభ్రమచిత్తము కలుగుటను తమోగుణసంబంధమైనదానినిగను, క్రియను రజోగుణసంబంధమైనదిగను గుణతత్త్వవేత్తలు చెప్పుచుండిరి) అనువచనానుసారముగ క్రియయే రజోగుణ మనబడును. అట్టి రజోగుణమునకు కారణమైనట్టిది (అనగా ప్రవృత్తికి హేతువగువాడు కాముడని యర్థము) 'న జాతు కామః కామానా ముపభోగేనశామ్యతి। హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే" (ఆజ్యాదిహవిస్సులచే నగ్నిహోత్రుఁ డెట్లభివృద్ధినొందునో అట్లే కాముడుకూడ విషయముల భోగముచే నెన్నడును శాంతిని పొందడు. మఱియు విషయముల ననుభవించినకొలది యభివృద్ధినే పొందును.) అను వాక్యానుసారము మహాదియత్తాశూన్యమగు నశనము (ఉపభోగము) కలవాఁడు. అనఁగా నెన్నడునుతృప్తి లేనివాడు. కనుకనే కాముఁడు "మహాపాప్మా" అని యనఁబడును. అనఁగా నెవనివలన పురుషునకు మహాదోషములు ప్రాప్తించునో అట్టివాఁడు కాముడని యర్థము. (కామముగల పురుషుడు మహాపాపము నాచరించుననుట. అదెట్లనిన? కామావిష్టుడగు పురుషుడు తనతోబుట్టువునుకూడ భంగపరచుటకు యత్నించును. ఛండాలునివలనకూడ ద్రవ్యమును గ్రహించును. కామముచే క్రుద్ధుడై గురువునుగూడ దూషించును. గోవునికూడ సంహరించును. కనుకఁ గాముఁడు మహాపాపుడని యనుటకు తగినవాఁడు. గాన నోయర్జునా నీ వీసంసారమునందు ముముక్షువునకు గామునినే మహావైరినిగ తెలిసికొనుము. అనగా మోక్షప్రతిబంధకు డీ కాముఁడే యని తెలిసికొనుమని యర్థము. ॥౩౭॥

పరమార్థప్రప:— అర్జునునిచే చేయబడిన ప్రశ్నకు శ్రీకష్ణపరమాత్మ "కామ ఏషః" అను వాక్యముచే సమాధానము చెప్పుచుండెను. వివేకవంతుడగు పురుషునకుగూడ నెపుడు సత్త్వగుణ మభిభూతమగునో అట్టి సమయమున రజోగుణముజనించును. అట్టి రజోగుణమువలన గామక్రోధము లుద్భవించును. అట్టి కామక్రోధముల స్వరూపమును క్రమముగ "మహాశనః, మహాపాప్మా" అనుపదములచే జెప్పుచుండెను, ఆ కామక్రోధములలో గాముఁడు దుష్పూరుఁ డగుటవలన మహాశనుఁడు; క్రోధుఁ డతిక్రూరుఁ డగుటవలన మహాపాపి యని చెప్ప నొప్పును. ఈ చెప్పుటవలన గామక్రోధు లిరువురు జయించుటకు శక్యము గానివారనిసూచింపబడెను. ఈ కాముని, క్రోధుని వైరులుగ దెలిసికొనుము. శత్రువే పాపమునందు ప్రవర్తింపజేయును. మిత్రుడు పాపమునందు ప్రవ

గీ॥ ధూమే నావ్రియతే వహ్ని ర్యథాఽఽదర్శో మలేన చ ।
యథోల్బే నావృతో గర్భ స్తథా తేనేద మావృతమ్ ॥ ॥౩౮॥

పదవిభాగము:— ధూమేన– ఆవ్రియతే– వహ్నిః– యథా– ఆదర్శః– మలేన– చ– యథా– ఉల్బేన– ఆవృతః– గర్భః– తథా– తేన– ఇదం– ఆవృతమ్ ॥ ॥౩౮॥

ప్రతిపదార్థము:— యథా=ఎట్లు; వహ్నిః=అగ్ని; ధూమేన=ధూమముచే; ఆవ్రియతే=ఆవరించబడుచున్నదో; ఆదర్శః=దర్పణము; మలేనచ=మలముచే; ఆవ్రియతే=ఆవరింపబడుచున్నదో; యథా=ఎట్లు; గర్భః=గర్భము; ఉల్బేన=జరాయువుచే; (మావిచే) ఆవృతః=ఆవరింపబడెనో; తథా=అటులే; =ఇదం=ఇది; (ఈజ్ఞానము) తేన=ఆ కామునిచే; ఆవృతం=ఆవరించబడినది ॥౩౮॥

---

ర్తింపజేయుడు. కాన నోయర్జునా! నీవు బంధుసుహృద్విషయక మగు కామముచేతనే స్వధర్మపరిత్యాగరూప మగు పాపమునందు ప్రర్తించుచుంటి వని యాశయము.

నీలకంఠీయము:— ఇట్టి ప్రశ్నకు "కామమయ ఏవాయం పురుషః" అను శ్రుతిప్రసిద్ధమగు పురుషుని "కామ ఏషః" అనుశ్లోకముచె నిర్దేశించుచు శ్రీకృష్ణపరమాత్మ సమాధానము చెప్పుచుండెను.

ప్రసిద్ధమగు నీకాముడే శ్రేయోమార్గమునకు శత్రువు. కాముడనగ "ఇది నాకు ప్రాప్తించుగాక" అనెడి తీవ్రమగు నభిలాషకు కారణమగు చిత్తవృత్తి కనవస్థితత్వమును కలుగజేయు వృత్తివిశేషము. అది చేతో రూపమే యని "కామ స్సంకల్పః—సర్వం మన ఏవ" అను శ్రుతిబోధించుచున్నది. ఇట్టి కాముండే యేదో యొక కారణముచే ప్రతిహతుడై క్రోధరూపముగ పరిణమించును. కాన నభిజ్వలనాత్మకు డగు క్రోధుడును గామరూపుడే. అట్టి కామునే శరీరముయొక్క లోపలనుండు వైరిగ తెలిసికొనుము. ఎందులకు కాముండు వైరి యగు నెనదరా? అను శంకను దొలగించుటకు 'రజోగుణసముద్భవః' అని చెప్పెను. రజస్సనగ రంజనాత్మక మగు ప్రకృతిగుణము. దానియొక్క గుణములు కార్యభూతములగు తృష్ణాసంగములు. అవియే కారణము గాకలది దుఃఖము. అట్టి దుఃఖమే ముఖ్యఫలముగా కలవాడగుటవలన కాముండు శత్రువు.

లేక 'లోభిప్రవృత్త్యాత్మకమగు రజోగుణమునకు కారణుడగు విషయాభిలాషాత్మకమగు కాముడు విషయ ప్రాప్తిచే శాంతించును. లేక గ్రుడ్డివాడు రూపదర్శనాభిలాషనుండి నివృత్తమైనట్లు విషయము దుర్లభమను విశ్చయముచేతనైన స్వయముగ నివర్తించునుకదా" అను నాశంకను తొలగించుటకు 'మహాశనో మహాపాప్మా' అని చెప్పబడెను. ఇచ్చుటకు శక్యముకాని గొప్పయశనము కలవాడు. "నజాతు కామః కామానా ముపభోగేన శామ్యతి. హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే" (ఎన్నడును కాముండు విషయముల యుపభోగముచే శాంతింపడు. మఱియు హవిస్సుచే నగ్ని ప్రజ్వరిల్లునటుల విషయముల ననుభవించినకొలది కాముం డభివృద్ధినే పొందును) అని చెప్పబడెను. కాన "యత్పృథివ్యాం వ్రీహియవం హిరణ్యం పశవః స్త్రియః । నాల మేకస్య తత్సర్వ మితి మత్వా శమంవ్రజేత్" (పృథివియందుండు వ్రీహులు, యవలు, పశువులు, స్త్రీలు ఈసర్వము నొక కామునియొక్క యుదరమును పూరించుటకు సమర్థమైనవి కావనితలచి శమమును పొందవలెను.) అటులే అత్యుగ్రుండు. సహస్రశః బోధితుండైనను మరలండు. అటులే ఈ కాముండును మరలించుటకు శక్యమైనవాండు గాడు. మహాశనుం డగుటవలన నీవైరి దానసాధ్యుండు గాండు. సామభేదసాధ్యుండును గాండు. గాన నితని విషయమునందు చతుర్థోపాయమే సమంజసము. సర్వథా హంతవ్యుండు. ॥౩౭॥

శాంకరభాష్యమ్:—

కథం వైరీతి దృష్టాంతైః ప్రత్యాయయతి— ధూమేనేతి। ధూమేన సహజేనావ్రియతే వహ్నిః ప్రకాశాత్మకోఽప్రకాశాత్మకేన యథా వాఽఽదర్శో మలేన చ యథోల్బేన గర్భవేష్టనేన జరాయుణాఽఽవృత ఆచ్ఛాదితో గర్భస్తథా తేనేద మావృతమ్॥ ॥౩౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

తెలిసికొనువారి సౌకర్యమునిమిత్త మనేకదృష్టాంతములచే కాముఁ డెట్లు వైరియో "ధూమేన" అను శ్లోకముచేఁ జెప్పుచుండెను.

ప్రకాశాత్మక మగు వహ్ని సహజము, అప్రకాశాత్మకము నగు ధూమముచే నెట్లాచ్ఛాదిత మగునో, మషి మొదలగు మలముచే దర్పణ మెట్లాచ్ఛాదిత మగునో, గర్భవేష్టన మగు జరాయువుచే (మావిచే) గర్భ మెట్లాచ్ఛాదిత మగునో అటులే యీ కామునిచే విది (ఈజ్ఞానము) యావరించఁబడును. ॥౩౮॥

—• ౩వ అధ్యాయము- ౩౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— కాముఁడు మహాపాపికనుకనే వైరియే యనఁబడును. మరియు వాని కట్టి వైరిత్వమునే దృష్టాంతముచే స్పష్టపరచుచుండెను. కామునకు సూక్ష్మావస్థయనియు, స్థూలావస్థయనియు, స్థూలతరావస్థయనియు, స్థూలతమావస్థయనియు నాలుగవస్థలు కలవు. అందు స్థూలశరీరారంభమునకు పూర్వమునం దంతఃకరణ మలబ్ధ మగు వృత్తికలదగుటచేఁ గాముఁ డట్టి సమయమున సూక్ష్ముఁ డగును (అట్టి యవస్థ సూక్ష్మావస్థ). శరీరారంభక మగు కర్మచే స్థూలశరీరముతోఁగూడిన పొందబడిన వృత్తికల యంతఃకరణమునం దభివ్యక్తికల కాముఁడు స్థూలుఁ డనిపించుకొనును (అట్టి యవస్థ స్థూలావస్థ). అట్టి కాముఁడే శబ్దాదివిషయములను చింతించు నవస్థయందు తిరిగి ఉద్రిక్తుఁడైనపుడు స్థూలతరుఁ డనుపించుకొనును. ఆ కాముఁడే విషయముల ననుభవించు నవస్థయం దత్యంతోద్రేకమును పొందును. అట్టి సమయమున స్థూలతముఁ డనుపించుకొనును. (ఈనాలుగవస్థలలో ప్రథమావస్థయందు "ధూమే నావ్రియతే వహ్నిః" అనునది దృష్టాంతము.) సహజము, అప్రకాశాత్మకము నగు ధూమముచే వహ్ని యెట్లావరింపఁబడుచుండెనో, (ద్వితీయావస్థయందు దృష్టాంతమును యథాఽఽదర్శో మలేనచ" అని) దర్పణోత్పత్త్యనంతర ముద్రిక్తము (అతిశయితము), అసహజము నగు మలముచే (ధూళి మొదలగువానిచే) నెట్లు దర్పణ మావరింపఁబడుచుండెనో, (తృతీయావస్థయందు దృష్టాంతము "యథోల్బే నావృతో గర్భః" అని) అతిస్థూల మగు గర్భవేష్టనచర్మచే గర్భ మెట్లు సర్వతః యావరింపఁబడునో అటులే యిట్టి మూఁడువిధములుగను గామునిచే నిది (జ్ఞానము) యావరింపఁబడెను. పైదృష్టాంతములలో ధూమముచేఁ గప్పఁబడిన వహ్ని తన దాహకార్యమును చేయును. మలముచే నావృత మగు దర్పణము స్వచ్ఛతాధర్మతిరోధానమువలన ప్రతిబింబగ్రహణరూప మగు స్వకార్యమును జేయనేరదు. తాను ప్రత్యక్ష మగును. జరాయువుచే గప్పఁబడిన గర్భము హస్తపాదాది ప్రసారణరూపస్వకార్యమును చేయనేరదు. తాను ప్రత్యక్షము గాదు. అని దృష్టాంతత్రయమునందు విశేషము తెలియనగును.

శంకరానందీయము:— ముక్తిప్రతిబంధక మగుటచే గామునకే వైరిత్వము చెప్పఁబడెనో అట్టి వైరిత్వమునే 'ధూమేన' అనునది మొదలు రెండుశ్లోకములచే స్పష్టపరచుచుండెను. అప్రకాశస్వరూప మగు ధూమముచే స్వయముగ ప్రకాశస్వరూప మగు వహ్ని యెట్లావరించఁబడునో, లేపనస్వభావముగల రజస్సుచే బింబప్రకాశక

గీ॥ ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।
కామరూపేణ కౌన్తేయ! దుష్పూరే ణానలేన చ । ॥౩౯॥

పదవిభాగము:— ఆవృతం- జ్ఞానం- ఏతేన- జ్ఞానినః- నిత్యవైరిణా- కామరూపేణ- కౌంతేయ- దుష్పూరేణ- అనలేన- చ । ॥౩౯॥

ప్రతిపదార్థము:— హే కౌంతేయ!=కుంతీపుత్రుడవగు నో యర్జునా!; జ్ఞానినః=జ్ఞానికి; నిత్యవైరిణా= నిత్యము వైరియగునట్టి; దుష్పూరేణ=పూరించుటకు శక్యము కానట్టియు; అనలేనచ=సంపూర్తి లేనట్టి; ఏతేన=ఈ; కామరూపేణ=కామస్వరూపముచే; జ్ఞానం=జ్ఞానము; ఆవృతం=ఆవరించఁబడెను. ॥౩౯॥

---

శాంకరభాష్యమ్:—

కిం పున స్త దిదంశబ్దవాచ్యం య త్కామే నావృత మిత్యుచ్యతే— ఆవృత మితి । ఆవృత మేతేన జ్ఞానం జ్ఞానినో నిత్యవైరిణా । జ్ఞానీహి జానా త్యనే నాహ మనర్థే ప్రయుక్తః పూర్వ మేవేతి । దుఃఖీ చ భవతి నిత్య మేవ । అతోఽసౌ జ్ఞానినో నిత్యవైరీ న తు మూర్ఖస్య । స హి కామం తృష్ణాకాలే మిత్రమివ పశ్యం స్త త్కార్యే దుఃఖే ప్రాప్తే జానాతి తృష్ణయాఽహం దుఃఖిత్వ మాపాదిత ఇతి, న పూర్వ మేవాతో జ్ఞానిన ఏవ నిత్యవైరీ । కిం రూపేణ? కామరూపేణ కామ ఇచ్ఛైవ రూప మస్యేతి కామరూప స్తేన దుష్పూరేణ దుఃఖేన పూరణ మస్యేతి దుష్పూర స్తేనానలేన నాస్యాలం పర్యాప్తి ర్విద్యత ఇత్యనల స్తేన ॥ ॥౩౯॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పూర్వశ్లోకమున "తేనేద మావృతం" (ఆకామునిచే నిది యావరించఁబడినది) అని చెప్పఁబడెను. ఇచ్ఛాస్వరూపము పూరించుటకు శక్యము కానట్టిదియు, అలంబుద్ధి లేనట్టిదియు నగు కామముచే నావరించఁబడిన ఇదంశబ్దవాచ్య మిట నేది? అను శంకపై చెప్పుచున్నాఁడు.

జ్ఞానికి నిత్యవైరి యగు కామునిచే జ్ఞాన మావరించఁబడును. కాముడు జ్ఞానికి నిత్యవైరి యెట్లగు ననెదవా? అనర్థము ప్రాప్తించకుండగనే కామ ముద్భవించనపుడే ఈ కామముచే ద్వారమున నాహ్లాదకరమగు దర్పణ మెట్లావరించఁబడునో; అచేతనమగు జరాయువుచే చేతనుఁడగు శిశు వెట్లావరించఁబడునో అట్లే అప్రకాశరూపము, లేపకము, అచేతనము నగు కామునిచే అప్రకాశరూపము ఆత్మ ప్రకాశనద్వారమున నానందకరము, తనయందు చేతనప్రతిబింబవ్యాప్తిచే చేతనతుల్యము అగు నీపురుషుని జ్ఞానము కప్పఁబడె నని యర్థము. ॥౩౯॥

—• ౩వ అధ్యాయము ౩౯వ శ్లోకవ్యాఖ్యా విశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పూర్వశ్లోకమునందు చెప్పఁబడిన "తథా తేనేద మావృతం" అను సంగ్రహవాక్యము నీశ్లోకముచే వివరించుచుండెను. "జ్ఞాయతేఽనేనేతి జ్ఞాన మంతఃకరణం" దేనిచే విషయములు తెలియఁబడునో అట్టి యంతఃకరణము, లేక వివేకవిజ్ఞానము కామునిచే నావరింపఁబడెను. అట్లైనను ఆపాతతః సుఖహేతు వగుటవలన కాము డుపాదేయుడే యను నాశంకను 'జ్ఞానినో నిత్యవైరిణా' అను వాక్యముచేఁ దొలఁగించుచుండెను. అజ్ఞాని విషయభోగకాలమునందు కాముని మిత్రునివలె చూచువాఁడై చరమ కార్యమగు దుఃఖము ప్రాప్తింప నా కామునే వైరిగ తలచును (కామునిచే నేను దుఃఖి నైతి నని తెలిసికొనును.) జ్ఞానియైతే భోగ కా...

గీ॥ ఇన్ద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే।
ఏతై ర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్ ॥ ॥౪౦॥

పదవిభాగము:— ఇన్ద్రియాణి– మనః– బుద్ధిః– అస్య– అధిష్ఠానం– ఉచ్యతే– ఏతైః– విమోహయతి– ఏషః– జ్ఞానం– ఆవృత్య– దేహినమ్। ॥౪౦॥

ప్రతిపదార్థము:— ఇన్ద్రియాణి=ఇన్ద్రియములు; మనః=మనస్సు; బుద్ధిః=బుద్ధియు; అస్య=ఈ కామునకు; అధిష్ఠానం=ఆశ్రయముగ; ఉచ్యతే=చెప్పఁబడుచున్నది; ఏతైః=ఈయింద్రియమనోబుద్ధులచే; ఏషః=ఈ కాముఁడు; జ్ఞానం=జ్ఞానమును; ఆవృత్య=ఆవరించి; దేహినం=శరీరిని; (శరీరముకల జీవుని) విమోహయతి=అనేకవిధముల మోహపెట్టుచున్నాఁడు. ॥౪౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నే ననర్థమునఁ బ్రవేశింపబడుచుంటి నని జ్ఞాని తెలిసికొని నిత్యము కాము నుద్దేశించి దుఃఖించును. కాన కాముఁడు జ్ఞానికి నిత్యవైరి యగును. సర్వులకును కాముఁడు మంచిని చేకూర్చువాఁడు కానందున నందరికి నిత్యవైరి యగుచుండ నొక్క జ్ఞానికే నిత్యవైరి యను టెట్లు పొసఁగు" నని శంకింపవలదు ఏలయన? మూర్ఖుఁడు కామోద్భవకాలమున కాముని మిత్రునివలెఁ జూచుచు కామకార్యమగు దుఃఖము ప్రాప్తించినపుడు "కామునిచే నేను దుఃఖితుఁడ నైతి" నని తెలిసికొనును. కాని దుఃఖప్రాప్తికి పూర్వమునం దట్లు తెలిసికొనఁడు. కాన మూర్ఖునకు కాముఁడు నిత్యవైరి కాఁడు. జ్ఞానికే నిత్యవైరి యగును. ॥౩౯॥

మందు గూడ "నీ కామునిచే నే ననర్థమునందు ప్రవేశపెట్టబడితి" నని తెలిసికొనును. కాన వివేకి భోగకాలమునందును, తత్పరిణామమునందును దుఃఖి యగును. కాన ఈ కాముడు జ్ఞానికి నిత్యవైరి. అందువలన జ్ఞానిచే చంపదగినవాఁడు. అట్లగుచో నీ కాముఁ డెట్టి రూపముగలవాఁడు? అనిన కృష్ణరూప స్వరూపముకలవాఁడు. కాముఁడు వివేకిచే చంపదగినవాఁడైనను యవివేకిచే గ్రహింపదగినవాఁడే యగునను శంకను 'దుష్పూరేణానలేన చ' అను వాక్యముచే తొలఁగించుచుండెను. ఇట "చ" అను నవ్యయ ముపమార్థకము. "న విద్యతేఽలంపర్యాప్తి ర్యస్యే త్యనలః" అగ్నిహోత్రం డెట్లు హవిస్సుచే తృప్తిపరచబడుటకు శక్యుఁడు కాఁడో అట్లే యీ కాముడును భోగముచే తృప్తిపరచబడుటకు శక్యమైనవాడు కాడు. కాన యెల్లపుడు సంతాపహేతు వగుటచే యీ కాముడెట్లు వివేకికి హేయుడో అట్లే యవివేకికిని హేయుడే (విడచిపెట్టదగినవాఁడే) ఈవిషయమునే "న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి। హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే" అను స్మృతియు బోధించుచున్నది.

లేక ఇచ్ఛ విషయసిద్ధివలన నివర్తించును. కాన నిచ్ఛారూపమగు కాముఁడు విషయభోగముచే మరలిపోఁగలఁడు. అందువిషయమై నిర్బంధ మెందులకు? అను శంకను తొలఁగించుటకు "దుష్పూరేణానలేన చ" అని చెప్పఁబడెను. విషయసిద్ధిచే తత్కాలమునం దిచ్ఛ తిరోహితమైనను తిరిగి జనించుటవలన విషయసిద్ధి యిచ్ఛానివర్తకము కాదు. మరేమనిన? విషయములయందు దోషదృష్టియే యిచ్ఛానివర్తక మని భావము.

శంకరానందీయము:— జ్ఞానావరకమగుదానినే "ఆవృతం" అను శ్లోకముచే స్పష్టపరచుచుండెను. ఎల్లప్పుడును విషయసేవచే చాలునను బుద్ధిలేనివాఁడును, దుఃఖముచే నిష్ప్రాపణముగలవాఁడును, లేక కోరినది ప్రాప్తించనపుడు పురుషుని దుఃఖముచే పూరించువాఁడును. కామ్యత ఇతి "కామః" (విషయము నేయుంతటగోచరించుకొనువాఁడును, ఎన్నఁడును బ్రహ్మమును గోచరించుకొననివాఁడు) కనుకనే జ్ఞానికి నిత్యవైరి యగునట్టి ఈ కామునిచే "సర్వము బ్రహ్మస్వరూపమే" యను బ్రహ్మజ్ఞానము—బురదచే జలమువలె నావృతము. ॥౩౯॥

శాంకరభాష్యమ్:—

కి మధిష్ఠానః పునః కామో జ్ఞానస్యావరణత్వేన వైరీ సర్వస్యే త్యపేక్షాయా మాహ జ్ఞాతే హి శత్రో రధిష్ఠానే సుఖేన శత్రునిబర్హణం కర్తుం శక్యత ఇతి— ఇన్ద్రియాణీతి। ఇన్ద్రియాణి మనో బుద్ధి శ్చాస్య కామ స్యాధిష్ఠాన మాశ్రయ ఉచ్యతే॥ ఏతై రిన్ద్రియాదిభి రాశ్రయై ర్విమోహయతి। వివిధం మోహయ త్యేష కామో జ్ఞాన మావృ త్యాచ్ఛాద్య దేహినం శరీరిణమ్॥ ॥౪౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

శత్రువుయొక్క యాశ్రయము తెలిసిన సుఖముగ జయింపవచ్చును. కాన నీకాముఁడేయాశ్రయము కలవాఁడై, జ్ఞానమున కావరణ మగుటచే సర్వులకు వైరి యగుచుండెనో ఆ యాశ్రయ మేది యను శంకపై "ఇంద్రియాణి" అని చెప్పుచుండెను.

ఇంద్రియములు, మనస్సు, బుద్ధి యివి యీకామున కాశ్రయములని చెప్పఁబడుచున్నవి. కనుకనే ఈకాముఁడు జ్ఞానమును కప్పిపుచ్చి యీయింద్రియాదులచే శరీరముకల ప్రతిజీవుని ననేకవిధముల మోహపెట్టుచుండెను. ॥౪౦॥

—• ౩వ అధ్యాయము- ౪౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— శత్రువుయొక్క స్థానము తెలిసినచో సుఖముగ నాశత్రువును జయించుటకు వీలగును. కాన శత్రు వగు కాముని స్థానమును "ఇంద్రియాణి" అను శ్లోకముచే చెప్పుచుండెను. శబ్దస్పర్శరూపరసగంధగ్రాహకములగు త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లనెడి పంచజ్ఞానేంద్రియములు, వచనాదానగమనవిసర్జనానందజనకము లగు వాక్పాణిపాదపాయూపస్థ లనెడి పంచకర్మేంద్రియములు, సంకల్పాత్మక మగు మనస్సు, నిశ్చయాత్మిక మగు బుద్ధియు నీకామున కధిష్ఠాన (ఆశ్రయ) ములని చెప్పఁబడుచున్నవి. స్వస్వ వ్యాపారములు కలిగినట్టియు, ఆశ్రయము లగునట్టి యీయింద్రియాదులచేతనే యీ కాముఁడు వివేకవిజ్ఞానమును కప్పిపుచ్చి దేహాభిమానము కలవాని ననేకవిధముల మోహపెట్టుచుండెను.

శంకరానందీయము:— సంసారకారణము కాముఁడు. వాని కార్యములు జ్ఞానతిరోధానము, విషయముల సన్నిధికిఁ జేర్చుట. తపింపఁజేయుట, దుఃఖమును పొందించుట అను నీవిషయములు నిరూపింపఁబడెను. అయినను తదధిష్ఠానము తెలియనందున ముముక్షువునకు కామజయము దుర్ఘటము. శత్రువుయొక్క స్థానము తెలియఁబడినచో శత్రుజయమునిమిత్తము ప్రయత్నము చేయుటకు శక్య మగును. అను నాశంకపై శత్రుస్థానమును 'ఇంద్రియాణి' అను శ్లోకముచేఁ జెప్పమొదలిడెను. "యదా పంచావతిష్ఠంతే జ్ఞానాని మనసా సహ। బుద్ధి శ్చ న విచేష్టేత తా మాహుః పరమాం గతిమ్॥" (పంచజ్ఞానేంద్రియములు విషయములయందు ప్రవేశించక మనస్సుతో నేకీభవించి యెన్న డుండునో బుద్ధియు చలింపకుండగ నెన్న డుండునో దానిని పరమగతిగ బ్రహ్మవేత్తలు చెప్పుచుండిరి) అను శ్రుతితాత్పర్యమును తెలిసినవారు— కాముఁడే యింద్రియచేష్టాహేతు వగుటవలన ఇంద్రియములే కామున కాశ్రయ మని చెప్పుచుండిరి. కాన చక్షురాదీంద్రియములు, మనస్సు, బుద్ధియు కామున కాశ్రయ మని తెలిసికొనవలెను. కామప్రవృత్తికి ద్వారభూతములగు నింద్రియముల వ్యాపారముచేతనే కాముఁడు ప్రత్యగ్దృష్టిని కప్పిపుచ్చి (వృత్తిని బహిఃప్రవణముగఁ జేసి) దేహమునం దాత్మబుద్ధికలవానిని (జ్ఞానిని, యజ్ఞానిని)

గీ॥ తస్మాత్త్వ మిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ !
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥ ॥౪౧॥

పదవిభాగము:— తస్మాత్ - త్వం - ఇంద్రియాణి - ఆదౌ - నియమ్య - భరతర్షభ! - పాప్మానం - ప్రజహి - హి - ఏనం - జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥ ॥౪౧॥

ప్రతిపదార్థము:— హే భరతర్షభ! = భరతవంశశ్రేష్ఠుఁడవగు నోయర్జునా!; త్వం = నీవు; తస్మాత్ = ఇంద్రియాదు లాశ్రయము అగుటవలన; ఆదౌ = కామనిరోధమునకు ముందుగనే; ఇన్ద్రియాణి = ఇన్ద్రియములను; నియమ్య = స్వాధీన మొనరించుకొని; పాప్మానం = పాపాచారుఁడైనట్టియు; జ్ఞానవిజ్ఞాననాశనం; జ్ఞాన = శాస్త్రముల వలనను; ఆచార్యునివలనను కలిగిన యాత్మవిషయకజ్ఞానమును; విజ్ఞాన = విశేషముగ కలిగిన యాత్మానుభవమును; నాశనం = నశింపజేయునట్టి; ఏనం = ఈ కాముని; ప్రజహిహి = ప్రకర్షగ జయించుము. ॥౪౧॥

శాంకరభాష్యమ్:—

యత ఏవం—తస్మాదితి । తస్మాత్త్వ మింద్రియాణ్యాదౌ పూర్వం నియమ్య వశీకృత్య, భరతర్షభ! పాప్మానం పాపాచారం కామం ప్రజహిహి పరిత్యజ, ఏనం ప్రకృతం వైరిణం జ్ఞానవిజ్ఞాననాశనం జ్ఞానం శాస్త్రత ఆచార్యత శ్చాత్మాదీనా మవబోధః, విజ్ఞానం విశేషత స్తదనుభవ స్తయో ర్జ్ఞానవిజ్ఞానయో శ్శ్రేయఃప్రాప్తి హేత్వో ర్నాశనం ప్రజహి హ్యాత్మనః పరిత్యజే త్యర్థః ॥ ॥౪౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

భరతకులావతంసుఁడవగు నోయర్జునా! నీవు కామున కాశ్రయములగు నింద్రియములను ముందుగనే (కామనిరోధమునకు పూర్వమునందే) స్వాధీన మొనరించుకొని, శ్రేయఃప్రాప్తి కికారణమగు శాస్త్రాచార్యోపదేశమువలన కలిగిన నాత్మాదిజ్ఞానమును విశేషముగ కలిగిన యాత్మాద్యనుభవరూపమగు విజ్ఞానమును నశింపజేయునట్టియు, పాపమూలమగుటచే పాపాచారుఁడును, వైరియునగు నీకాముని యాత్మనుండి పరిత్యజింపుము.

ఇంద్రియమనోబుద్ధులు కామున కాశ్రయమని పూర్వమునందుచెప్పి యట్టి యాశ్రయములగు నింద్రియములను జయించుమని యిట జెప్పఁబడెను. మనోబుద్ధుల నిగ్రహము కూడ "నేను భోక్తను, ఇది నాకనుభవింపదగినది, ఇది సుఖము, ఇది దుఃఖము" అను నిట్టి విధముల తలఁచు దానినిగఁ జేయుచున్నాడు. కామదోషముచేతనే "బుద్ధికి చాంచల్యము, దేహేంద్రియాదితాదాత్మ్యప్రత్తియు, "నేను, నా సంబంధమైనది" అని పురుషునకు సంసారము సంభవించును. ॥౪౧॥

—• ౩వ అధ్యాయము ౪౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇంద్రియములే యాశ్రయముగాకలవాఁడై కాముఁడు దేహిని (జీవుని) మోహపెట్టును. కాన నోభరతవంశశ్రేష్ఠుఁడవగు నర్జునా! నీవు మొట్టమొదట (అనగా కాముఁడు మోహపెట్టుటకు పూర్వమునందే లేక కామనిరోధమునకు పూర్వమునందే) శ్రోత్రాదీంద్రియములను స్వాధీనమొనరించుకొనుము. సంకల్పాధ్యవసాయరూపమగు మనోబుద్ధులు బాహ్యేంద్రియ ప్రవృత్తివ్యాపారముననే యనర్థహేతువగును కాన శ్రోత్రాదీంద్రియములు స్వాధీనమైనచో మనోబుద్ధుల వశీకరణము కూడ సిద్ధించుచు. కనుకనే పూర్వశ్లోకమునందు

శాంకరభాష్యతత్త్వబోధిని:—

చెప్పబడలేదు. అట్టి మనోబుద్ధుల నిగ్రహము లేనిచో కాముని కాశ్రయములగు మనోబుద్ధుల నాశ్రయించి కాముడు ఇంద్రియములను జయించి, శరీరిని మోహపెట్టును. కాన నింద్రియ జయ మాత్రముచే గాముని జయించుట ఎట్లు పొసగునని? మనోబుద్ధులు ప్రవృత్తి లేనిదే వ్యర్థ మగును. కాన నింద్రియములను స్వాధీనమొనరించుకొనినచో మనోబుద్ధుల నియమనము సిద్ధించు నను నాశయముచే నింద్రియనియమనమే యిచట జెప్పబడెను. ॥౪౧॥

"ఇంద్రియములు, మనోబుద్ధులు" అని వేరుగ చెప్పినను ఇచట 'ఇంద్రియాణి' అని యింద్రియములు మాత్రమే చెప్పబడెను. లేక నింద్రియత్వధర్మపురస్సరముగ మనోబుద్ధులుకూడ గ్రహింపనగును. అట్లు యింద్రియములను స్వాధీనమొనరించుకొని సర్వపాపములకు మూలభూతుడు, వైరియునగు నీ కాముని పరిత్యజించుము. 'జహిశత్రుం' అని యుపసంహారమువలన 'హి' అను శబ్దమునకు స్పష్ట మని యర్థము. అనగా నిట్టి వైరిని స్పష్టముగ నశింప జేయుమని యర్థము తెలిసికొనవలయును ఈ కాము డెట్టివాడనిన? "జ్ఞానవిజ్ఞాననాశనం" జ్ఞానమనగ నిట శాస్త్రాచార్యోపదేశమువలన కలిగిన పరోక్షజ్ఞానము. విజ్ఞానమనగ నట్టిజ్ఞానమునకు ఫలభూతమగు నపరోక్షజ్ఞానము. ఈ రెండును మోక్షప్రాప్తికి హేతువులు. అట్టి జ్ఞానవిజ్ఞానములను నశింపజేయువాడు గాన నట్టి యనర్థమూలమగు కాముని ప్రథమమున నింద్రియములను స్వాధీనమొనరించుకొని జయించు మని భావము.

శంకరానందీయము:— నిశ్శేషముగ గాముని జయింపనిచో బుద్ధికి నిశ్చలత్వము సంభవింపమి జ్ఞానము విశుద్ధము కానేరదు. నది విశుద్ధము కానిచో మోక్షము సంభవింపదు. కాన ముముక్షు వవశ్యము గాముని జయింపవలెనని సూచించుటకు "తస్మాత్త్వం" అని చెప్పమొదలిడెను. మనోబుద్ధీంద్రియవ్యాపారమే ముఖ్యమైన బలముగాకల కాముడు ముముక్షువగు నీకునిత్యశత్రువు. కాన నీవు మొట్టమొదట నింద్రియములను, ననంతరముమనస్సును, బుద్ధిని వీటిని విషయగ్రహణమునుండి విముఖమైనవాటినిగ జేసి (నియమవిధియం దాదిపద మనంతరకృత్య ద్యోతకమగుటవలన) 'ఇంద్రియాణ్యాదౌ' అనుస్థలమునందుకల యాదిశబ్దము మనోబుద్ధుల నియమన మును సూచించుచున్నది. అట్టి, నియమన మొందులకనిన? లోపల విషయచింత యుండినచో నింద్రియనిగ్రహము విఫలమగును. మఱియు "మనస్తుపూర్వ మాదద్యా త్కుమీనమివ మత్స్యహా" (మత్స్యము లను పట్టువాడు మొట్టమొదట దుష్టమత్స్యమును చంపినటుల మొట్టమొదట మనోనిగ్రహమావశ్యకము) అను వచనానుసారము వస్తుదర్శనమునందు మనస్సే కరణమగుటవలన నింద్రియనిగ్రహానంతరమునందే మనోబుద్ధుల నిగ్రహమావశ్యకము. ఇట్లు కాముని కాశ్రయమగు నింద్రియమనోబుద్ధుల నిగ్రహమాచరించి, "జ్ఞానవిజ్ఞాననాశనం" జ్ఞానమనగ పర్వతమునందు వహ్నికలదను జ్ఞానమువలె శ్రుతియుక్తులచే జనించెడి "సర్వము బ్రహ్మ స్వరూపమే" అనెడి పరోక్షమగు వస్తునిశ్చయము. విజ్ఞానమనగ వహ్నియందువ్యాప్తమైన వృత్తివలనజనించెడి "మహానసమునం దగ్నియున్నది" అనుజ్ఞానమువలె నాత్మరూపవిషయమునందు వ్యాప్తమైన వృత్తివలన జనించెడి 'నేనేబ్రహ్మమునే' అనెడి యపరోక్షజ్ఞానము మోక్షమే ముఖ్యమగు ప్రయోజనములుగాగలవి. చంద్రసూర్యుల వలె అవిశేషవిశేష స్ఫురణరూపములగు నీజ్ఞానవిజ్ఞానములను నశింపజేయువాడు కాముడే. కనుకనే కాముడు తనకు (ముముక్షువునకు) వైరి యనబడును. పాపిష్ఠుడగునట్టి కాముని నిశ్శేషముగ ధ్వంస మొనరింపుము.

సదానందీయము:— ఈ కాము డింద్రియము లాధారముగాఁ గలవాడై జీవునియొక్క జయముకొఱకు సమర్థుడగుచున్నాడు. కాన కాముఁడు మోహపెట్టుటకు పూర్వమునందే, లేక కాముని నిరోధమునకు పూర్వము వంశ్యైనను యోగ్యవంశమునందు జనించిన యోయర్జునా! నీవు శ్రోత్రాదీంద్రియములను స్వాధీన మొనరించుకొని

పాపమూలము, శత్రువునగు నీ కాముని నిశ్శేషముగ నశింపజేయుము. శాస్త్రాచార్యోపదేశమువలన కలిగిన పరోక్షజ్ఞానము జ్ఞానమనబడును. అపరోక్షజ్ఞానము విజ్ఞానమనబడును. అట్టి జ్ఞానవిజ్ఞానములకు నాశకుఁడే కాముడు. కాన దుష్టుడు, శఠుడు, శత్రువుఅగు నీ కాముని తత్త్వజ్ఞానివగు నీవు నశింపజేయుము.

ఎప్పుడు విజ్ఞానముతోఁగూడిన జ్ఞానముకలిగినదో అపుడాజ్ఞానము అజ్ఞానతత్కార్యములను, బాధించి నిశ్చలముగ నాత్మయందుండును. అట్టి జ్ఞానమునకు కామునియుత్పత్తి మాత్రముచే నాశమెట్లుసంభవించును? మఱియు వేదాంతవాక్యజన్యమనోవృత్తి రూపమున సిద్ధించిన విజ్ఞానసహితమగు జ్ఞానము కామాదిమాత్రనాశ్యమగుచో నట్టి జ్ఞానమువిషయమై పరిశ్రమ వ్యర్థమే యగును. బ్రహ్మవిద్వరులచే జ్ఞానము వస్తుప్రమాధీనమైన దని సాధింపబడినది. ప్రమాణవస్తు వుండ (ప్రమాణసిద్ధము వస్తువై యుండ) లేక వస్తువిషయక ప్రమాణముండ నట్టి జ్ఞానమెట్లు శీఘ్రముగ నశించును? మఱియు జ్ఞానాజ్ఞానములు పరస్పరవిరుద్ధములు. ఎట్లు దీపతిమిరములు పరస్పరవిరుద్ధములై దీపమునశించునపుడే తిమిరముదయించునో, అట్లే జ్ఞానాజ్ఞానములు పరస్పరవిరుద్ధము అగుటచేవిరుద్ధమగు జ్ఞానముయొక్క నాశముచేతనే యజ్ఞానముదయించును. దీనికివిరుద్ధముగ ననిర్వాచ్యానాద్యేకావిద్యావాదులకు అనాదియు. భావరూపమునగు నజ్ఞానముయొక్క యుత్పత్తి యెట్లు సంభవించును? విజ్ఞానసహితమగు జ్ఞాన ముండినను నజ్ఞానము జనించువనెదవా? అట్లైన మీకే స్వసిద్ధాంతహాని సంభవించును. అనఁగా దీప దృష్టాంతముచే పైనచెప్పబడిన నీసిద్ధాంతమునకు హాని సంభవించువనుట సత్యమే. జనించిన విజ్ఞానసహితమగు జ్ఞానమెన్నడును నశించదు. అట్లగుచో శ్రీకృష్ణపరమాత్మచే జెప్పబడిన "జ్ఞానవిజ్ఞాననాశనం" అను వాక్యమునకు గతియేమి? అనిశంకించినచో కామునకు జనించిన జ్ఞానవిజ్ఞాననాశకత్వము కలదను తాత్పర్యముచే శ్రీకృష్ణపరమాత్మ 'విజ్ఞానవిజ్ఞాననాశనం' అనిచెప్పియుండలేదు. మరేమనిన? దుష్టుడగు కామునియొక్క యత్యంతనిందచే కాముడు హేయుడనుటయందు తాత్పర్యము. అట్లు కానిచో వాక్యభేదము ప్రాప్తించెడిని. జీవన్ముక్తుఁడగు మునికి తత్త్వజ్ఞానము జనింప ప్రారబ్ధకర్మచే కామాభాసము ప్రాప్తించినయెడల నది జ్ఞాననాశనమునందు సమర్థమైనదికాదు. మరేమనిన? ఆ కామాభాసమే జ్ఞానముచే నశించునదగును అయినను నిట్టివిశ్వాసము ముముక్షువునకు కాముని విషయమై చేయుదగినది కాదని చెప్పబడెను. కాన 'జ్ఞానవిజ్ఞాననాశనం, అను భగవద్వాక్యమునకీనిష్కర్ష సమ్మతము. ఆనిష్కర్ష యేదియనిన– "బాధ్యోప్యజ్ఞానాబాధా మ్ఛ్రుతిశిఖరవచోజన్యబోధేన కామో వామోఽయం మోక్షమార్గే ప్రబలతరరిపు ర్నైవ విశ్వాసయోగ్యః। తత్త్యాగే సన్ముముక్షో రనుదిన మధికం యత్న మాస్థాయ బోధ ప్సాధ్యో విజ్ఞానయుక్తో హరి రితి వదతి బ్రహ్మవిద్యాప్రదాతా" విచారింప వేదాంత వాక్యములచే జనించిన జ్ఞానముచే నజ్ఞానము బాధించబడును. అజ్ఞానబాధవలన కాముఁడు బాధించఁబడును. అయినను నీకాముఁడు మోక్షమార్గమునందు దక్షుడు, ప్రబలతరుడు నగు శత్రువు. ఎంతమాత్రము విశ్వాసమునకు యోగ్యుడు కాఁడు. కాన నట్టి కాముని పరిత్యజించుట కుందు ముముక్షు వనుదినము ప్రయత్నపూర్వకముగ జ్ఞానమును సాధింపవలయును. ఆజ్ఞానముకూడ విజ్ఞానయుక్తముగనే సాధింపవలయును. అనిబ్రహ్మవిద్యాప్రదాతయగు శ్రీహరి చెప్పుచుండెను. ఇదియే యిచట నిష్కర్ష.

లేక, కామునియొక్క యేదౌష్ట్యము కలదో అదంతయు నిచట వర్ణించుచుండెను. ఎందులకీవర్ణనమనిన–కాముని పరిత్యాగము కొరకే యతని దౌష్ట్యమును వర్ణించుచుండెను. అటులే శ్రీహరికూడ 'జ్ఞానవిజ్ఞాననాశనం' అని చెప్పెను. ఇట జ్ఞానవిజ్ఞానశబ్దములచే తత్ఫలమగు ముక్తి చెప్పబడును. అది సదేహావిదేహముక్తు లని రెండు విధములు. అందు సాక్షాత్కారమనెడి తత్త్వజ్ఞానము కలిగినచో నవశ్యము దేహపాతానంతరమున నాపురుషుడు ముక్తుడగును. జీవన్ముక్తిఫలము శత్రువులగు కామక్రోధాదులచే నరికట్టబడునని చూపుటనిమిత్త మిచట "జ్ఞానవిజ్ఞాననాశనం" జ్ఞానవిజ్ఞానఫల మగు మోక్షమునకు నాశకు డని చెప్పబడెను. దుష్టుడగు కాముఁడు జ్ఞాన

విజ్ఞానఫలమగు మోక్షముప్రాప్తించినను తత్క్షణమునందేజనించి జ్ఞానియొక్క జీవన్ముక్తి ఫలము నరికట్టుచుండెను. ఎంతయాశ్చర్యము! ఇంతకంటె కాముని దౌష్ట్య మేమిచెప్పవలయును? ఏవృత్తియందు జీవన్ముక్తి సుఖమనెడి యాహ్లాదము ప్రవేశించినదై నశించిపోయిన యవిద్యకల విచక్షణుఁడగు జ్ఞానిని సుఖము కలవానినిగ జేయుచున్నదో; అట్టివృత్తియందు దుష్టప్రారబ్ధకర్మచే కాముఁడు ప్రవేశించి, తత్క్షణమునందే జ్ఞానియొక్క యా సుఖము నరికట్టుచుండెను. జ్ఞానిచిత్తమునందు విజ్ఞానముతోఁగూడిన జ్ఞానముండ నట్టిచిత్తమునం దెట్లు కాముఁడు జనించును? అని యనెదవా? "విషయములు మిథ్యాభూతములు" అనెడి జ్ఞాన ముండినను జ్ఞానిచిత్తమునందు ప్రారబ్ధకర్మప్రాబల్యముచే కాముఁడుదయించును. తత్త్వవేత్తచిత్తమునందు కాముడు ప్రారబ్ధకర్మప్రాబల్యముచే జనించుననుటకు ప్రమాణమేదికలదు? "సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవానపి। ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి" (జ్ఞానియైనను తనప్రారబ్ధకర్మానుసారమే చరించును. భూతములు ప్రకృత్యనుసారము చరించుచుండ నిగ్రహ మేమిచేయఁగలదు) అను శ్రీహరివాక్యమే యిందులకు ప్రమాణము. అటులే వాసిష్ఠమునందుగూడ నిర్వాణప్రకరణమునందు "జ్ఞస్యాజ్ఞస్య చ దేహస్య యావద్దేహ మయం క్రమః। లోకవద్వ్యవహారోఽయం శక్త్యాఽశక్త్యాథవా సదా॥ యే సంజ్ఞాతగతయో యే చాజ్ఞా పశుధర్మిణః। లోకస్య వ్యవహారేషు తే స్థితా లోకజాలవత్॥ వ్యవహారే యథైవాజ్ఞా స్తథై వాఖిలపండితాః। వాసనామాత్రభేదోత్ర కారణం బంధమోక్షయోః॥ యావచ్ఛరీరం తావద్ధి దుఃఖే దుఃఖం సుఖే సుఖం। అసంసక్తధియో ధీరా దర్శయంత్యప్రబుద్ధయః॥" (జ్ఞానికి, నజ్ఞానికి నెంతవరకు దేహముండునో అంతవరకు దేహమున కీక్రమము తప్పదు. శక్తిచేగాని, అశక్తిచేగాని లోకమువలె నీవ్యవహార మెల్లపు డుండును. ఎవరుపరిజ్ఞాత (తెలియఁబడిన) గతికలవారో, ఎవరు పశుధర్మములు కలవారో వారిరువురు లోకముయొక్క వ్యవహారములయందు ప్రాణిసముదాయమువలెనుండువారలే. అజ్ఞుడు వ్యవహారమునందెట్లు చరించునో, అట్లే నిఖిలము తెలిసినపండితుడుగూడ చరించును. ఈబంధమోక్షములకు వాసనామాత్రభేదమే కారణము. ఎంతవరకు శరీరముండునో, అంతవరకు దుఃఖమునందు దుఃఖము, సుఖమునందు సుఖమును. విషయములయందు సంసక్తముకాని యంతఃకరణకల జ్ఞానులు, అజ్ఞానులు చూచుచునేయుందురు) అని కుంభవాక్యమువలన స్పష్టమగుచున్నది. మరియు అటులే భాష్యమునందు, భామతియందు "పశ్వాదిభి శ్చావిశేషాత్" అను స్థలమునం దతిస్పష్టముగ జెప్పబడెను. శ్రుతియుక్తులచే దేహాదులకంటె విలక్షణుఁడు, విశుద్ధుడు, బ్రహ్మైక్యము, చిద్ఘనము, సుఖస్వరూపము అగు ప్రత్యగాత్మను తెలిసికొందురుగాక. అట్టి జ్ఞానిశ్రేష్ఠులు వ్యవహారమందు జీవునిధర్మమును మాత్ర మతిక్రమింపజాలరని భామతియందు నిర్ణయింపబడెను. ప్రారబ్ధకర్మ మనేకవిధము అగుటవలన జ్ఞానులుకూడ ననేకవిధములుగ ప్రవర్తించుచుండెదరు. అంతమాత్రముచే శాస్త్రార్థమగు తత్త్వమునందు పండితులు విరతి పొందవలదు. తమ తమ కర్మానుసారముగ వార ట్లనేకతీరుల నుండుగాక. ఆత్మబోధ సమానమే. ముక్తియు సమానమైనదే. అను నిట్టి యర్థమీసంప్రదాయము తెలిసినవారిచే చెప్పబడెను. తత్త్వజ్ఞానముజనించినను ప్రారబ్ధకర్మచే జీవించియుండువానికి చిత్తధర్మ మనేకవిధములుగ కలదు. బ్రహ్మవేత్తకుగూడ కాముఁడు, రాగద్వేషములు మొదలగు క్లేశములకు హేతువగుటవలన నుదయించును. అట్టి కామోదయ మైనచో జ్ఞానముచే బాధిత మగు నవిద్యానువృత్తిచే బంధము ప్రాప్తించును. చిత్తవృత్తినిరోధరూప మగు యోగముచే కాముని నివారణము ప్రాప్తించును. అని శాస్త్రమునం దనేకవిధముల జీవన్ముక్తిసుఖప్రాప్తికొరకై చెప్పఁబడెను. కాన కామోద్భవమువలన జీవన్ముక్తికి ప్రతిబంధకము ప్రాప్తించును. అందునిమిత్తమే శ్రీహరిచే "జ్ఞానవిజ్ఞాననాశనం" కాముడు జ్ఞానవిజ్ఞానములవలన సంభవించెడి జీవన్ముక్తికి నాశకుడని చెప్పబడెనును. చిత్తసంబంధమగు సర్వదోషములకు కాముడు రాజని చెప్పబడెను. అట్టి కాముని నిరాకరణముచేతనే సర్వదోషములు నిరాకృతములగును. తత్త్వజ్ఞాని చిత్తమునం దపుడే జీవ-

న్ముక్తిసుఖ మావిర్భవించును. లోకమునందు కామసుఖ మెంతకలదో, స్వర్గాదులయం దెంతసుఖము కలదో అట్టి సుఖము లన్నియు తృష్ణాక్షయసుఖముయొక్క పదునాఱవ కళనుకూడ పోలవు. ముముక్షువునకు కామోద్భవము తత్త్వజ్ఞానప్రతిబంధకము. తత్త్వజ్ఞునకు కామోద్భవము ఆత్మసుఖాస్వాదప్రతిబంధక మని చెప్పఁబడుచున్నది. అందునిమిత్తమై కామునియొక్క నాశముకొఱ కందరము తగు ప్రయత్నము చేయఁదగినది. ముముక్షువుచే నాత్మబోధకొఱకు, తత్త్వజ్ఞునిచే నాత్మసుఖముకొఱకు కాముఁడు జ్ఞానవిజ్ఞాననాశకుఁ డని కరుణాసింధువు, రమాపతి, శాస్త్రకర్త యగు శ్రీహరియొక్క తాత్పర్యము తెలియునగును "తత్త్వజ్ఞానేపి జాతే భ్రమతిమిరహరే శాంతిదే సజ్జనానాం, జీవన్ముక్త్యాపి భావ్యం పరమసుఖదయా సర్వవిక్షేపనాశాత్ । తత్ర ప్రారబ్ధదోషా ద్యది భవతి మతౌ కామశత్రోః ప్రచారో, మోక్షో భావ్యంతకాలేత్వపి సపది పరం దృష్టదుఃఖం న నశ్యేత్ ॥" (సజ్జనులకు భ్రమయనెడి తిమిరమును నశింపఁజేయునట్టి, శాంతి నిచ్చునట్టి తత్త్వజ్ఞానము పుట్టినవెంటనే సర్వవిక్షేపములు నశించుటవలన పరమసుఖము నిచ్చునట్టి జీవన్ముక్తికూడ ప్రాప్తించవలసియుండును. అందు ప్రారబ్ధదోషమువలన బుద్ధియందుఁ గాముఁడను శత్రువుయొక్క ప్రచారము సంభవించినచో నంతకాలమున మోక్ష మవశ్యము సంభవించును. శరీరముండువరకు ప్రారబ్ధకర్మాయత్తుఁ డగుటవలన దృష్ట మగు దుఃఖము నశించదు.

లేక తత్త్వజిజ్ఞాసువున కుపదేశార్థము కామనింద ప్రారంభించఁబడెను. ఇట్లుకూడ శ్రీహరి మతమని చెప్పనొప్పును. తృష్ణాదిశబ్దములచే చెప్పఁబడినట్టియు, దుష్పూరుడగునట్టి కాముఁ డెచ్చటనుండునో అచట జ్ఞానవిజ్ఞానముల లేశమైన నత్యంతదుర్లభము. ఈవిషయమునే శ్రీహరియు పదునారవ యధ్యాయమునందు గాముని దుష్టత్వమును "త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః । కామః క్రోధ స్తథాలోభ స్తస్మా దేతత్త్రయం త్యజేత్ ॥ ఏతై ర్విముక్తః కౌంతేయ ! తమోద్వారై స్త్రిభి ర్నరః । ఆచర త్యాత్మనః శ్రేయ స్తతో యాతి పరాం గతిం ॥" (కాముఁడు, క్రోధుఁడు, లోభుడు అనెడి యీముగ్గురు నరకమునకు ద్వారములు. ఆత్మకు నాశమును కలిగించువారు. కాన ప్రాజ్ఞు లీముగ్గురిని పరిత్యజించవలెను. కుంతీపుత్రుడవగు నోయర్జునా! తమోద్వారములగు నీమూడిఁటిచే విడవఁబడినవాఁడై మనుజుఁ డాత్మకు శ్రేయస్సును సమకూర్చువాఁ డగుచున్నాఁడు. దానివలననే మోక్షమును పొందుచున్నాడు ) అని చెప్పఁగఁబడు. ఈశ్లోకమునందు కామశబ్దముచేతనే కామలోభములు చెప్పఁబడుచున్నవి. కాముఁడే కారణముగాఁగల కాముని తమ్ముఁ డగు క్రోధు డీశ్లోకమునందు చెప్పఁబడెను. కాన " కామ ఏష క్రోధ ఏషః" అను వాక్యమునందు శ్రీకృష్ణపరమాత్మచే కామక్రోధలోభములు చెప్పఁబడెననుట. కాన కాముఁ డనెడి శత్రువునందే క్రోధలోభు లిరువురు నంతర్భూతు లగుచుండిరి. అట్టి కాముఁ డుదయించినచో మోక్షదేశమునకుఁ గాని, మోక్షకారణలేశమునకుఁ గాని యెంతమాత్రము తా వుండదు. కాన నోయర్జునా! సుఖమును పొందుటకొఱ కింద్రియములను స్వాధీనమొనరించుకొని, బలవత్తర పౌరుషముచే శత్రువగు కాముని నశింపజేయుము. ఇంద్రియనిరోధముచే గామునియొక్క నాశ మెట్లు సంభవించును; కాముఁ డుదయించినచో నాయింద్రియముల నిరోధముకూడ దుర్ఘటమైనదే కదా. ఇంద్రియచాంచల్యము కాముఁడే కారణముగా కలది. ( కామునివలననే యింద్రియములకుచాంచల్యము సంభవించును.) అట్టి కామునియొక్క నాశనవిషయమై తీవ్రముగు నేయుపాయముచే నేను సమర్థుడ నగుదును? ఈవిషయమై శ్రీహరియే జ్ఞానవిజ్ఞానసాధనమును జెప్పెను. ఈ జ్ఞానవిజ్ఞానములే యీ కామునియొక్క నాశనమందును, బాధనమునందును సమర్థమైనవి. కాన జ్ఞానవిజ్ఞానములనెడి సాధనములచే సమూలముగ కామునియొక్క నాశనము సంభవించును. కాన నోయర్జునా! ఆజ్ఞానవిజ్ఞానముల

వారించుటయందు నీవు ప్రయత్నముకలవాఁడ వగుము. ఎంతవరకు దేహేంద్రియాదులయం దాత్మదృష్టియుండునో, అంతవరకే బలవంతుఁడగు కాముఁ డతిదుఃఖము నిచ్చువాఁడై యుండును. అజ్ఞానమువలన కామము, కామమువలన ప్రవృత్తులు, దానివలనకలుగు ధర్మాధర్మమువలన ననర్థమున కాశ్రయమగు దేహము ప్రాప్తించును. కాన నవిద్యను నిరోధించిన విద్వాంసునకు గామనిరోధము ప్రాప్తించును. కామనిరోధ మగుచో నిశ్శేషకర్మహేతువులనిరోధమపుడే ప్రాప్తించును.) అని తైత్తిరీయభాష్యవార్తికమునందు సురేశ్వరాచార్యులవారిచే స్పష్టముగ చెప్పఁబడెను. అహంకారచిదాత్మల నేక మొనరించుకొని (అనఁగా నహంకారచిదాత్మలను పరస్పర మధ్యసించి) 'ఇది నాకు ప్రాప్తించు గాక' అనెడి యిచ్ఛయే కామ మనఁబడును. దేహాదులకంటె వేరుగ బ్రహ్మాత్మవస్తువు తెలియఁబడినచో (అనఁగా దేహేంద్రియాదులకంటె నాత్మ భిన్నమైనది. అని బ్రహ్మాత్మస్వరూపము తెలియఁబడినచో) సమూలముగ కామునియొక్క నాశనము స్వయముగనే యగును. అందువలన నీకొఱకు కామజయమువిషయమై ముఖ్యమగు నుపాయము నుపదేశించెదను. తత్త్వమస్యాదివాక్యములవలన జనించినట్టి శాస్త్రీయమగు జ్ఞానము నాశ్రయించి, గురువర్యునిచే బోధించఁబడిన యుక్తులచేకూడిన స్వానుభవజన్యమగు విజ్ఞానము నాశ్రయించి, నీవు పౌరుషమునొంది శత్రువగు నీ కాముని నశింపఁజేయుము. అనియైన శ్రీకృష్ణపరమాత్మయొక్క తాత్పర్యము తెలియవగును. ఉత్తరసందర్భమునకు కూడ నీ పక్షమునందే స్వారస్యము కలదు. ఉత్తరసందర్భ మేదనిన? చిదాత్మ జడవర్గము కంటె వేరని చెప్పుచేయుని గ్రహింపనగును. 'స్వాజ్ఞానాధ్యస్తదేహద్వయ మహ మితి సంశ్రిత్య యస్యాస్తి యావత్తావత్క్రోధాదిదోషః ప్రభవతి భయద స్తస్య తావన్ముముక్షోః । దేహాదిభ్యో వివిచ్యాభయపద మమలం తత్త్వమాజ్ఞాయ సమ్యగ్ధ్వస్తేఽజ్ఞానే సకార్యే వ్యపనయతి సుధీః కామశత్రుం సుఖేన ॥" (స్వాజ్ఞానముచే నధ్యస్తమైన స్థూలసూక్ష్మదేహద్వయము నాశ్రయించి 'నేను' అను జ్ఞాన మెవని కెంతవరకు కలదో; అంత కాలమువరకట్టి ముముక్షువునకు భయమునిచ్చు కామక్రోధాదిదోషము సంభవించును. దేహాదులకంటె వేరుపరచి యభయము నిచ్చునట్టి నిర్మలమగు తత్త్వమును దెలిసికొని కార్యముతోఁ గూడ నజ్ఞానము ధ్వస్తమైయుండ విద్వాంసుఁడు సుఖముగ గాముఁడను శత్రువును సంహరించును. (నశింపఁజేయును.)

"క్వ శాస్త్రం గీతాఖ్యం హరిముఖసరోజా ద్విగళితం, క్వ చాస్మాకం బుద్ధి ర్విషయవిషపంకే నిపతితా ।
తథాపి శ్రీకాంతప్రచురగుణలక్ష్మీవిరచితం, కటాక్షం స్వచ్ఛాచ్ఛం హ్యనుసృతవతాం కిం న సులభమ్ ॥"
శ్రీహరిముఖారవిందవినిస్సృత మగు గీతాశాస్త్ర మెచ్చట! శబ్దస్పర్శరూపరసగంధము లనెడి విషయరూప మగు విషపంకమునందు పడియుండిన మనబుద్ధి యెచ్చట! అయినను శ్రీకాంతుఁ డగు వైకుంఠవాసియైన శ్రీహరియొక్క యనంతకల్యాణగుణలక్ష్మీవిరచితము, స్వచ్ఛము నగు కటాక్షము ననుసరించినవారి కేది సులభము కాదు? (అన్నియు సులభమే.) కాన శ్రీహరికటాక్షమును బడసినవారల కీగీతాశాస్త్రము సులభ మని యాశయము.

నీలకంఠీయము:— సామంతరాజునకు గిరిదుర్గాదికమువలె నీకామున కధిష్ఠాన మింద్రియములు. కాననట్టి యింద్రియములనే వశ మొనరించుకొని గిరిదుర్గాదులను స్వాధీన మొనరించుకొన్న దానియం దుండు సామంతరాజును సంహరించునట్లు యీ కాముని నిశ్చయముగ ప్రకర్షచే నశింపఁజేయుము. ఎందులకు నశింపజేయవలె ననెదవా? ఈ కాముఁడు శాస్త్రాచార్యోపదేశమువలన జనించెడి పరోక్షజ్ఞానమునకు, నిదిధ్యాసపరిపాకజనిత మగు నపరోక్షజ్ఞానమునకు నాశకుఁడు. కాన నశ్యుఁడు. కనుకనే నశింపఁజేయదగినవాఁడు. ॥౪౧॥

గీ॥ ఇన్ద్రియాణి పరా ణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః ।
మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః ॥ ॥౪౨॥

పదవిభాగము:— ఇంద్రియాణి- పరాణి- ఆహుః- ఇన్ద్రియేభ్యః- పరం- మనః- మనసః- తు- పరా- బుద్ధిః- యః- బుద్ధేః- పరతః- తు- సః । ॥౪౨॥

ప్రతిపదార్థము:— పండితాః=(ఈపదమధ్యాహార్యము) పండితులు; దేహాదిభ్యః=(ఈపదమధ్యాహార్యము) బాహ్యములగు దేహాదులకంటె; ఇన్ద్రియాణి=త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లనెడి పంచజ్ఞానేంద్రియములను; పరాణి= ఉత్కృష్టములనుగ; ఆహుః= చెప్పి; ఇంద్రియేభ్యః= పంచ జ్ఞానేంద్రియములకంటె; మనః= కల్యాణాత్మకమనస్సు; పరం=ఉత్కృష్టమైనది; మనసస్తు=సంకల్పవికల్పాత్మకమనస్సుకంటె; బుద్ధిః=నిశ్చయాత్మకమగు బుద్ధి; పరా=ఉత్కృష్టమైనది; యః=ఏ దేహి; సర్వదృశ్యేభ్యః=(ఈపదమధ్యాహార్యము) బుద్ధ్యంతసర్వదృశ్యములకంటె; అభ్యంతరః=(ఈపద మధ్యాహార్యము) అభ్యంతరుడో; సతు=ఆదేహియైతే; బుద్ధేః=బుద్ధికి పరతః=ద్రష్టయగు పరమాత్మ ॥ ॥౪౨॥

---

శాంకరభాష్యమ్:—

ఇంద్రియా ణ్యాదౌ నియమ్య కామం శత్రుం ప్రజహిహీ త్యుక్తం, తత్ర కిమాశ్రయః కామం జహ్యా దిత్యుచ్యతే— ఇన్ద్రియాణీతి । ఇంద్రియాణి శ్రోత్రాదీని పంచ దేహం స్థూలం బాహ్యం పరిచ్ఛిన్నం చా పేక్ష్య సౌక్ష్మ్యాంతరస్థత్వవ్యాపిత్వా ద్యపేక్ష్య పరాణి ప్రకృష్టా న్యాహుః పండితాః । తథేంద్రియేభ్యః పరం మన స్సంకల్పవికల్పాత్మకమ్ । తథా మనసస్తు పరా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మొట్టమొదట నింద్రియములను నియమించుకొని (విషయములయందు ప్రవేశింపకుండఁ జేసికొని) కాముని జయించు మని చెప్పఁబడెను. అందువిషయమై దేని నాశ్రయముగ జేసికొని కాముని జయించవలెను? అను శంకను తొలఁగించుటకు "ఇంద్రియాణి" అను శ్లోకమును చెప్ప మొదలిడెను.

స్థూలము, బాహ్యము, పరిచ్ఛిన్నము నగు దేహమును విచారించినచో నంతకంటె సూక్ష్మము, అంతస్థము, వ్యాపకము లగుటంజేసి త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లనెడి పంచ జ్ఞానేంద్రియములు, వాక్పాదపాణిపాయూపస్థ లనెడి పంచ కర్మేంద్రియములు నుత్కృష్టము లని

---

—• ౩వ అధ్యాయము ౪౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఎట్లో యొకవిధమున బాహ్యేంద్రియసంయమనము సంభవించినను అంతర మగు తృష్ణాత్యాగము అతిదుష్కర మని శంకింపఁబడును. "రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే" అను స్థలమునందు పరజ్ఞానము రసశబ్దముచే చెప్పఁబడు తృష్ణయొక్క త్యాగముకొరకు సమర్థమైన దని పూర్వమునందే చెప్పఁబడెను. కాన పూర్వోక్తశంక కవకాశము లేదు. అట్లగుచో నేపరదర్శనమువలన తృష్ణానివృత్తి యగు చున్నదో ఆపర మేది యని యాశంకించి, పరశబ్దవాచ్యము, శుద్ధము నగు నాత్మను దేహాదులకంటె వేరుపరచి "ఇంద్రియాణి" అను శ్లోకముచేఁ జూపుచుండెను.

శాంకరభాష్యమ్:—

బుద్ధి ర్నిశ్చయాత్మికా । యథా య స్సర్వదృశ్యేభ్యో బుద్ధ్యం (తే) తరేభ్యోఽభ్యంతరో యం దేహిన మింద్రియాదిభి రాశ్రయై ర్యుక్తః కామో జ్ఞానావరణద్వారేణ మోహయతీ త్యుక్తం స బుద్ధే ర్ద్రష్టా పరమాత్మా ॥ ॥౪౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పండితులు చెప్పుచుండిరి. ఆవిధముననే యింద్రియములకంటె నంతస్థము, సూక్ష్మము, వ్యాపకము నగుటంజేసి సంకల్పవికల్పాత్మకమగు నంతఃకరణ ముత్కృష్టము. ఆవిధముననే యట్టి మనస్సుకంటె నిశ్చయాత్మిక మగు బుద్ధి సూక్ష్మత్వాదిగుణములు కలదగుటచే నుత్కృష్టమైనది. ఇట్టి దేహాదులుమొదలు బుద్ధివరకు నగునవి దృశ్యము లనఁబడును. అట్టి దృశ్యములకు గూడ నభ్యంతరుఁ డెవఁడో, ఇంద్రియాద్యాశ్రయములుకలవాఁడై కాముఁడే దేహిని జ్ఞానావరణ ద్వారమున మోహపెట్టుచుండె నని చెప్పఁబడెనో, అట్టి దేహి బుద్ధికి ద్రష్టయగు పరమాత్మ రూపమే. ॥౪౨॥

త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లనెడి పంచజ్ఞానేంద్రియములు, స్థూలము, జడము, పరిచ్ఛిన్నము, బాహ్యము నగు శరీరముకంటె సూక్ష్మములు, ప్రకాశకములు, వ్యాపకములు, అంతస్థములు నగుటవలన నుత్కృష్టము లని పండితులు కాని, శ్రుతులు కాని చెప్పుచున్నవి. అట్లే యింద్రియప్రవర్తకమగుటవలన సంకల్పవికల్పాత్మక మగు మనస్సు ఇంద్రియములకంటె నుత్కృష్టమైనది. అటులే నిశ్చయ మనఁగ నధ్యవసాయము [illegible]. అట్టి యధ్యవసాయపూర్వకమైన మనోధర్మము సంకల్పము. కాన నధ్యవసాయాత్మిక మగు బుద్ధి మనస్సుకంటె నుత్కృష్టమైనది. ఎవఁడు బుద్ధికి పరుఁడై భాసకుఁడై యుండెనో, ఏదేహిని యింద్రియాదులాశ్రయములుగ జేసికొని కాముఁ డజ్ఞానావరణద్వారమున మోహపెట్టుచుండె నని చెప్పఁబడెనో, అట్టి యాత్మ ద్రష్టయై బుద్ధికి పరుఁ డగుచుండును. ఈవిషయమునే "యింద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః । మనసస్తు పరా బుద్ధి ర్బుద్ధే రాత్మా మహా న్పరః ॥ మహతః పర మవ్యక్త మవ్యక్తా త్పురుషః పరః । పురుషా న్న పరం కించి త్సా కాష్ఠా సా పరా గతిః ॥" ఇచట ఆత్మయొక్క పరత్వమే వాక్యతాత్పర్యవిషయ మగుటవలన నింద్రియాదిపరత్వ మవివక్షితముగాన 'ఇంద్రియేభ్యః పరా హ్యర్థాః' అను స్థలమున నర్థములకంటె పర మింద్రియములని వివక్షభేదముచే శ్రీకృష్ణపరమాత్మ చెప్పిన విషయమునకు విరోధము లేదు. "బుద్ధే రాత్మా మహా న్పరః" అనుచోట నస్మదాది వ్యష్టిబుద్ధికంటె సమష్టిబుద్ధిరూప మగు నాత్మ యుత్కృష్టమైనది. అని యర్థము. అట్టి హిరణ్యగర్భుని సమష్టిబుద్ధి కంటె సర్వజగద్బీజ మగు మాయ యుత్కృష్టమైనది. అవ్యక్తముకంటె సకలజడప్రకాశకము, ప్రత్యగ్రూప మగు నాత్మ యుత్కృష్టమైనది. అట్టి యాత్మకంటె పరు డెవఁడైన నుండునా? అనుశంకను తొలఁగించుటకు "పురుషా న్న పరం కించిత్" అని చెప్పఁబడెను. అనఁగా పురుషునికంటె పరుఁ డెవఁడును లేడు. ఇట్లు [illegible] ఆపురుషుఁడే సమాప్తి. అనఁగా పురుషునికంటె శ్రేష్ఠప్రకాశకుం డెవఁడును లేఁడు. సర్వోత్కృష్టుఁ డగుటవలన నాపురుషుఁడే యుత్కృష్ట మగు గతి. అని కఠోపనిషత్తు చెప్పుచున్నది. "సోఽధ్వనః పార మాప్నోతి తద్విష్ణోః పరమం పదం" అను శ్రుతిప్రసిద్ధ మగు పరాగతి యాపురుషుఁడే. ఇదియంతయు "యో బుద్ధేః పరతస్తు సః" అను గీతావాక్యముచే చెప్పఁబడెను.

శంకరానందీయము:— "కాముఁడు జయించుటకు శక్యము కానివాఁడు. అట్టి కామజయవిషయమై బలవదాశ్రయ మపేక్షితము. ముముక్షు వెవరి నాశ్రయించి యెవనియొక్క మహిమచే కాముని జయించును" అను నాశంకయందు 'రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే' అను న్యాయముచే సర్వాంతరుఁడు, సర్వవ్యాపకుఁడు నగు పరమాత్మను తెలిసికొని పరమాత్మాశ్రయముచేతనే నీవు కాముని జయించు మని బోధించుట కాత్మను తెలిసికొనురీతిని "ఇంద్రియాణి" అను శ్లోకముచే జెప్పుచుండెను.

'ఇంద్రియేభ్యః పరా హ్యర్థా హ్యర్థేభ్యశ్చ పరం మనః' అనునవి మొదలగు శ్రుతులు- 'త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లనెడి పంచజ్ఞానేంద్రియములు, వాక్పాదపాణిపాయూపస్థ మనెడి పంచకర్మేంద్రియములు నివి ప్రకాశకములు, ఆంతరములు, సూక్ష్మములు, ప్రవర్తకములు, వ్యాపకములు, కారణములు నగుటవలన జడము, బాహ్యము, స్థూలము, ప్రవర్త్యము, వ్యాప్యము, కార్యము నగు శరీరముకంటె నుత్కృష్టతరములని చెప్పుచున్నవి. దేనిచే నేది ప్రకాశింపఁజేయుబడునో అట్టి ప్రకాశకము ప్రకాశితముకంటె వ్యాపకము, సూక్ష్మము, ఉత్కృష్టము, భిన్నము నగును. ఎట్లనిన? ఇనుపగుండునందుండు వహ్ని యినుపగుండునకు ప్రకాశకము గాన నా వహ్ని యినుపగుండుకంటె వ్యాపకము, సూక్ష్మము, ఉత్కృష్టము, భిన్నమును అగును. అట్లే దేహము నపేక్షించి యింద్రియములు దేహతద్ధర్మప్రకాశకము లగుటవలనను, దేహాదిప్రవర్తకము లగుటవలనను దేహాదులకంటె భిన్నములగునని యర్థము. అట్లే యింద్రియములకంటె మనస్సు ప్రకాశకత్వాదిధర్మములు కలదగుటవలన నుత్కృష్టము, భిన్నము అగుచున్నది. మనస్సు అంతస్థమై ఇంద్రియములను, తద్ధర్మములను ప్రకాశింపఁజేయును. కాన మనస్సున కింద్రియములకంటె నుత్కృష్టత్వము, ఇంద్రియభిన్నత్వము న్యాయమే. అట్లే మనస్సుకంటె ప్రకాశకత్వాదిధర్మములు కలదగుటచే బుద్ధి యుత్కృష్టమైనది. బుద్ధిచేతనే మనస్సు మనోధర్మములు ప్రకాశింప జేయుబడును. కాన బుద్ధి మనస్సుకంటె నుత్కృష్టమనుట, మనస్సుకంటె భిన్నమనుట న్యాయమే. సూక్ష్మత్వముచేతను, అంతరత్వముచేతను, వ్యాపకత్వము, కారణత్వము, ప్రవర్తకత్వము, ప్రకాశకత్వము అనెడి ధర్మములచే నెవడు స్వయముగ నంతట వ్యాపించి బుద్ధ్యాదిస్థూలపర్యంతమగు కార్యకరణసంఘాతమును తన సన్నిధిమాత్రముచే ప్రవర్తింపఁజేయుచు బుద్ధ్యాదిస్థూలపర్యంతముల ధర్మములను, వాని కర్మలను, వాని గుణములను, వాని వికారములను, సర్వమును తానవికారుఁడై సాక్షాత్కరింపఁజేసికొనుచుండెనో, ప్రకాశింపఁజేయుచుండెనో అట్టి యాత్మ నిత్య మగుటవలనను, సర్వజ్ఞుఁ డగుటవలనను, సర్వప్రకాశకుఁ డగుటవలనను, సర్వసాక్షి యగుటవలనను, బుద్ధికంటె, సర్వముకంటె నుత్కృష్టమైనది. ఈవిషయమునే 'పురుషాన్న పరం కించిత్' అను శ్రుతియు బోధించుచున్నది. కాన సర్వముకంటె పరము సర్వద్రష్ట. కనుకనే దేహేంద్రియాదులకంటె భిన్నుఁడు, సర్వప్రకాశకుఁడు, చిదానంద రసైకస్వరూపుఁడు, సన్మాత్రము, పరిపూర్ణము నగు నాత్మను స్వాత్మనుగ తెలిసికొనుమని యర్థము.

నీలకంఠీయము:— మూడుప్రాకారముల మధ్యనుండున్న సామంతుని, పైప్రాకారమును జయించి, యంతస్థప్రాకారద్వయజయపురస్సరముగ జయించినటుల కేవలము బాహ్యేంద్రియజయముచేతనే కృతార్థుఁడు కాడు. మరేమనిన? నంతస్థములగు ప్రాకారద్వయమువంటివి మనోబుద్ధులు. అట్టివాని జయముకూడ గాముని యుమూలోచ్ఛేదమునకొఱకు చేయఁదగినది. కాన మనోబుద్ధుల జయముకొఱకు యోగమును 'ఇంద్రియాణి' అనుశ్లోకముచే బోధించుచుండెను. ఈశ్లోకమునందుఁ జెప్పఁబడిన పరత్వము పూర్వముకంటె సూక్ష్మత్వముచేగాని, కారణత్వముచేగాని తెలిసికొనవగును. స్వాశ్రయపృథివ్యాదులతో గూడిన విషయములగు శబ్దస్పర్శరూపరసగంధములకంటెను, ధనపుత్రశరీరాదులకంటెను నింద్రియములు తత్కారణములగుటవలన పరములు. ఇంద్రియములవలన విషయములు, ధనపుత్రాదులు జనించునని కౌషీతకీబ్రాహ్మణమునందు 'ప్రాణేభ్యో దేవా దేవేభ్యో లోకాః' ఇంద్రియములవలన నింద్రియాధిష్ఠానదేవతలు, దేవతలవలన లోకములు (భూతభౌతికములు) పుట్టుచున్నవని చెప్పఁబడెను. అట్టియింద్రియములు మనోవికారము లగుటంజేసి యింద్రియములకంటె మనస్సు పరమైనది. 'మనసా

గీ॥ ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా ।
జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదమ్ ॥ ॥౪౩॥

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం, సంహితాయాం, వైయాసిక్యాం, భీష్మ
పర్వణి. శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు, బ్రహ్మవిద్యాయాం, యోగశాస్త్రే,
శ్రీకృష్ణార్జునసంవాదే, కర్మయోగోనామ తృతీయోఽధ్యాయః ।
హరిః ఓం తత్సత్, శ్రీకృష్ణార్పణ మస్తు ।

పదవిభాగము:— ఏవం- బుద్ధేః- పరం- బుద్ధ్వా- సంస్తభ్య- ఆత్మానం- ఆత్మనా- జహి- శత్రుం- మహాబాహో!- కామరూపం- దురాసదమ్ । ॥౪౩॥

ప్రతిపదార్థము:— హే మహాబాహో!=గొప్పబాహువులుకల ఓయర్జునా!; త్వం=(ఈపదమధ్యాహార్యము) నీవు; ఏవం=ఈపూర్వమునందు చెప్పఁబడినవిధమున; ఆత్మానం=ఆత్మను; బుద్ధేః=(నిశ్చయాత్మకమగు) బుద్ధికంటె; పరం=పరముగ (అతీతముగ); బుద్ధ్వా=తెలిసికొని; ఆత్మనా=శమదమాదులచే సంస్కృతమగు మనస్సుచే; సంస్తభ్య=లెస్సగ సమాధాన మొనరించి; దురాసదం=పొందుటకు శక్యము కానట్టి; కామరూపం=కామస్వరూపమగు; శత్రుం=శత్రువును; జహి=జయించుము. ॥౪౩॥

శాంకరభాష్యమ్:—

ఏవమితి— ఏవం బుద్ధేః పరమాత్మానం బుద్ధ్వా జ్ఞాత్వా సంస్తభ్య సమ్యక్ స్తంభనం కృత్వా స్వేనైవాత్మనా సంస్కృతేన మనసా సమ్యక్ సమాధాయే త్యర్థః । జహ్యేనం శత్రుం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓయర్జునా! ఆత్మ నీవిధమున బుద్ధికంటె పరమైనదానినిగఁ దెలిసికొని, శమదమాదులచే సంస్కృతమగు మనస్సుచే లెస్సగ స్తంభన మొనరించి (అనగా చక్షురాదీంద్రియములద్వార

హ్యేవ పశ్యతి మనసా శృణోతి'' అనిశ్రుతియు నింద్రియములు మనోవికారములనియే బోధించుచున్నది. ఈ చెప్పుటచే దేలిన యాశయ మేమి? కేవల మింద్రియాదులకు పరత్వమాత్రదర్శనమునందు ప్రయోజనము లేమింజేసి బాహ్యమగు విషయములనుండి యింద్రియములను మరలించి మనస్సునందు లయమును బొందించవలయు నని సూచింపఁబడెను. 'మనసస్తు పరా బుద్ధిః' 'తస్మాద్వా ఏతస్మా న్మనోమయాత్ । అన్యోంతర ఆత్మా విజ్ఞానమయః' అను శ్రుతివలన మనస్సుకంటె బుద్ధి పరమైనది. అనఁగా మనస్సును తత్కారణమగు బుద్ధియందు లయమొనరించవలె నని యర్థము. సమష్టిబుద్ధికికూడ దీనియందే యంతర్భావము. భాస్యవర్గముకంటె పరము, బుద్ధ్యాదులకు భాసకము నగు నేజ్ఞానముగలదో యది మావిచే గర్భ మాచరించబడినటుల కామునిచే నావరింపబడె నని యీయధ్యాయము నందున్న ముప్పదియెనిమిదవ శ్లోకముతో నన్వయింపవగును. ఈవిషయమే కఠోపనిషత్తునందు 'యచ్ఛే ద్వాఙ్మనసీ ప్రాజ్ఞ స్తద్యచ్ఛే జ్జ్ఞాన ఆత్మని । జ్ఞాన మాత్మని మహతి తద్యచ్ఛే చ్ఛాంత ఆత్మని'' (వాగాదిబాహ్యేంద్రియ వ్యాపారములను విడచి మనోమాత్రముతో నుండవలెను. విషయవికల్పాభిముఖ మగు మనస్సునుకూడ జ్ఞానశబ్దవాచ్యమగు బుద్ధియందు ధారణజేయవలెను. అట్టి బుద్ధినికూడ సమష్టిబుద్ధియందు ధారణజేయవలెను. అట్టి యాత్మను శాంతము. నిష్కలము, జ్యోతీరూపము నగు ప్రత్యగాత్మయందు ధారణ చేయవలెను) అని చెప్పఁబడెను. ॥౪౩॥

—• ౩వ అధ్యాయము ౪౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు• —

మధుసూదనసరస్వతీయము:— "ఏవం" అను శ్లోకముచే ఫలితమును బోధించుచుండెను. "రసోప్యస్య పరం దృష్ట్వా నివర్తతే'' అను స్థలమునం దేది పరశబ్దముచే చెప్పఁబడెనో; అట్టి పూర్ణము, బుద్ధికంటె

శాంకరభాష్యమ్:—

హేమహాబాహో! కామరూపం దురాసదం దుఃఖే నాసదః ఆసాదనం ప్రాప్తి ర్యస్య తం దురాసదం దుర్విజ్ఞేయానేకవిశేష మితి ॥ ॥౪౩॥

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య 'శ్రీగోవిందభగవత్పూజ్యపాదశిష్య
శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ, శ్రీభగవద్గీతాశాంకరభాష్యే, కర్మ
ప్రశంసాయోగోనామ తృతీయోఽధ్యాయః ।
ఓమ్ తత్సత్ ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మున విషయములందు ప్రవేశింపకుండగ చిత్తసమాధాన మొనరించి నీవు దుర్విజ్ఞేయమగు ననేకవిషయములుకల యీ కాముఁడను శత్రువును జయించుము. ఈయధ్యాయమునందలి జ్ఞాననిష్ఠ కుపాయభూతమగు కర్మనిష్ఠ ప్రధానముగ జెప్పబడెను.

ఉపేయ మగు జ్ఞాననిష్ఠ గుణభూతముగ (అప్రధానముగ బోధించబడె నని తెలిసికొనఁ దగినది.) ॥౪౩॥)

ఇట్లు నూరువేల సంఖ్యగలిగి, వ్యాసప్రోక్తము. సంహితారూపము నగు
మహాభారతమునం దంతర్గతమైన భీష్మపర్వమునందున్న యుపనిష
ద్రూపము, బ్రహ్మవిద్యారూపము, యోగశాస్త్రము నగు
భగవద్గీతయందున్న శ్రీకృష్ణార్జునసంవాదమునందుగల కర్మ
యోగమను పేరి తృతీయాధ్యాయమునకు గౌతమస
గోత్రుఁడగు 'తర్కరత్న, న్యాయవేదాన్తవిద్యా
పారీణ, దర్శనాలంకార' బులుసు అప్పన్న
శాస్త్రిచే రచియింపబడిన ఆనందగిరీయ
వ్యాఖ్యానుసృతశ్రీభగద్గీతాశాంకర
భాష్యతత్త్వబోధిని సమాప్తము.
హరిః ఓం తత్సత్. శ్రీ శ్రీ శ్రీ

పరము నగు నాత్మను తెలిసికొని (సాక్షాత్కరింపజేసికొని) మనస్సును స్థిరము చేసికొని ఆత్మసాక్షాత్కారరూప మగు నిశ్చయముచే గొప్పబాహువులుకల నోయర్జునా! సర్వపురుషార్థనాశకుండు అతికష్టముచే సంహరించుటకు శక్యమైనవాఁడు అగు తృష్ణారూపమైన శత్రువును సంహరించుము. ఇట 'మహాబాహో!' అను సంబోధనచే గొప్పబాహువులు కలవాడు శత్రువుని సంహరించుటయందు సమర్థుడు కాన నీవుకూడ నట్టివాడవే యని సూచింపబడెను. "దురాసదం" అని కామున కీయబడిన విశేషణముచే గాముఁడు దుర్విజ్ఞేయము లగు ననేకవిశేషములు కలవాఁడు కాన వనిని జయమునందు యత్నాధిక్యము చేయవలె నని సూచింపఁబడెను.

"ఉపాయః కర్మనిష్ఠాత్ర ప్రాధాన్యే నోపసంహృతా । ఉపేయా జ్ఞాననిష్ఠా తు తద్గుణత్వేన కీర్తితా ॥" (ఈతృతీయాధ్యాయమునందు ప్రధానముగ నుపాయభూతమగు కర్మనిష్ఠ చెప్పబడెను. కర్మనిష్ఠవలన పొందదగిన జ్ఞాననిష్ఠ కర్మనిష్ఠానుగుణముగ బోధింపబడెను.)

శంకరానందీయము:— ఇట్లు బుద్ధ్యాదిదృశ్యజాతమునకు ద్రష్టయు, సన్మాత్రరూపము నగు నాత్మ నాత్మరూపునిగ దెలిసికొని జ్ఞాననిష్ఠచే సర్వసంసారహేతువు, తనకుశత్రువునగు కాముని నిశ్శేషముగ నిర్మూల మొనరించుకొని మోక్షోపాయమగు కర్మయోగమునకు ఫలభూతమగు జ్ఞాననిష్ఠచే నాప్తించెడి సర్వకామపరిత్యాగమే ముక్తియని సూచించుచు "ఏవం" అను శ్లోకముచే కర్మయోగము నుపసంహరించుచుండెను.

ఈశ్లోకమునం దర్జునుని "మహాబాహో!" అని సంబోధించుటచే ముముక్షువగు నర్జునునకు కామరూపశత్రుసంహారసామర్థ్యము కలదని సూచింపబడెను. బుద్ధ్యాదిసర్వదృశ్యమునకు విలక్షణమై, ద్రష్టయు, నఖండానందైకరసస్వరూపమునగు నాత్మను 'నేనీయాత్మస్వరూపమునే' అని తనస్వరూపముచే దెలిసికొని అనఁగా నాత్మయందే ఆత్మత్వబుద్ధిని దృఢముగ జేసికొని గొప్పబాహువులుకల యోయర్జునా! నీవు కాముని కాశ్రయము, కారణము నగు నంతఃకరణను లోపల, వెలుపల, పూర్ణమైనట్టి యఖండైకరసస్వరూపమగు స్వస్వరూపముచే సంయోజనము చేయుము. అనగా నారోపితమగు నామరూపప్రపంచమును గ్రహింపకుండగ నంతఃకరణ వికాసమున మొనరించుము. అట్లొనరించి మనస్సున కధిష్ఠానమగు బ్రహ్మయొక్క దర్శనమునందు నియోగించి "సర్వము బ్రహ్మస్వరూపమే" అను బ్రహ్మజ్ఞానముకంటె నితరమగుదానిచే జయించుటకశక్యమును, దుర్జయము నగు కామరూపశత్రువును నశింపజేయుము. విశేషముగ విషయగ్రహణమే కామావిర్భూతికి కారణము. అంతట బ్రహ్మదృష్టిచే విషయాగ్రహణమే కామవినాశహేతువు. కానసర్వమును బ్రహ్మస్వరూపముగ చూచువాడవై కాముని నిర్మూలించుమని యర్థము.

—• ఈయధ్యాయమువలన దేలినఫలితము :—

ఈయధ్యాయమునందు "న కర్మణామనారమ్భాత్" అనికర్మయోగము నుపక్రమించి ముముక్షువున కాకర్మయోగపరిత్యాగముకూడదని నిందాపూర్వకముగ ననేకవాక్యములచేకర్మయోగమునకు కర్తవ్యతనుబోధించి 'నేను నాసంబంధమైనది' అనెడి ప్రవృత్తిరూపమగు సంసారమునకు కారణము కామమేయని కాముని మాహాత్మ్యమును వర్ణించి కర్మచేపొందబడిన చిత్తపరిశుద్ధికల పురుషునకు జ్ఞానయోగనిష్ఠచే కామజయము కర్తవ్యమని చెప్పుభగవంతునిచే 'యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది స్థితాః' అను శ్రుతిప్రమాణకమగు కామవినిర్మోక్షమే మోక్షమని సూచింపబడెను. కాన మోక్షహేతువగు జ్ఞాననిష్ఠకే ప్రాధాన్యము. అట్టి జ్ఞానయోగమున కంగమగు కర్మనిష్ఠ కుపసర్జనత్వమే (అంగత్వమే.) అందువలన నీయధ్యాయము జ్ఞానయోగపర్యవసాయి యగుటవలన జ్ఞానయోగపరమే యని సిద్ధించుచున్నది.

భాష్యార్థదీపిక:— "హేమహాబాహో!" అను సంబోధనచే నాచే చెప్పఁబడిన యుపాయమును విడచి గొప్పబాహువులచే బాహ్యశత్రువులను జయించునటుల నీకామరూపశత్రువును జయించుట సాధ్యము కాదు. కాన నేను బోధించిన యుపాయమునే కామరూపశత్రుజయమునందు గైకొనుమని సూచింపబడెను. ఈతృతీయాధ్యాయముచే జ్ఞానసాధనమగు కర్మనిష్ఠ ప్రధానముగ చెప్పబడెను. జ్ఞాననిష్ఠగుణముగ (అప్రధానముగ) చెప్పఁబడెనని తెలిసికొనవగును.

పరమార్థప్రప:— ప్రాగుక్తార్థమును "ఏవం" అనుశ్లోకముచే నుపసంహరించుచుండెను. పురుషార్థమగు నోయర్జునా! పూర్వమునందు చెప్పినవిధమున బుద్ధివ్యతిరిక్తము, బుద్ధిసాక్షియగు పరమాత్మను తెలిసికొని పర

మాత్మవిషయకనిశ్చయముచే మనస్సును నిశ్చలముగఁజేసి దుర్జయుఁడగు కాముడనెడి శత్రువును జయించుము. (వశింపజేయుము.) ఈవిషయమే బృహదారణ్యకమునందు దైవాసురసంగ్రామవ్యాజముచే ద్వాత్రింశ ప్రాజాపత్యాది దశఖండికలచే చెప్పబడెను. అది యెట్లనిన? "అథ హేమ మాసన్యం ప్రాణ మూచు స్త్వం న ఉద్గాయేతి తథేతి తేభ్య ఏష ప్రాణ ఉదగాయ త్తే విదు రనేన వై న ఉద్గాత్రాత్యేష్యన్తీతి త మభిద్రుత్య పాప్మనాఽవిధ్య న్స యథాఽశ్మాన మృత్వా లోష్టో విధ్వంసే తైవం హైవ విధ్వంసమానా విష్వంచో వినేశు స్తతో దేవా అభవ న్పరాసురా భవ త్యాత్మనా పరాస్య ద్విష న్భ్రాతృవ్యో భవతి య ఏవం వేద" (దేవాసురులిరువురు యుద్ధమును చేసిరి. అట్టిసమయమున దేవతలు వ్యర్థమైన ప్రయత్నము కలవారై సర్వేంద్రియచాలకము,, చెప్పఁబోవు ఇంద్రాదిశబ్దముచే చెప్పబడునట్టి సమీపమునందున్న ముఖ్యప్రాణమునుగూర్చి ఓ ముఖ్యప్రాణమా! నీవు మానిమిత్తముద్గానము చేయుమని పలికిరి. ఆయుద్గానము అవాగ్జప్రణవరూపము. ఆదేవతలు చెప్పినప్రకారమా ముఖ్యప్రాణముకూడ పూర్వమునందువలె ఉద్గానమొనరించెను. ఈవిషయమే ఛాందోగ్యమునందుకూడ "అథాధ్యాత్మం। ఏవం ముఖ్యప్రాణ స్త ముద్గీథ ముపాసీతోమితి" (ముఖ్యప్రాణము ఓం అనెడి ఉద్గీథము నుపాసించెను.) అని చెప్పబడెను. ఇట్లుద్గానమును చేయునట్టి ముఖ్యప్రాణమును కామక్రోధాద్యసురులు తెలిసికొనిదాని నెదుర్కొని విధ్వంసమును పొందిరి. ఇట్లు విధ్వంసమును పొందుచు విడిపోయి నానాగతులు కలవారై వినాశమును పొందిరి. ఈవిషయమున దృష్టాంతము— పాంసుపిండము రాతియందు కొట్టబడి విధ్వంసమెట్లు పొందునో; అట్లే ముఖ్యప్రాణముచే నభిహతులై కామక్రోధాద్యసురులు నాశమునుపొందిరని యర్థము. ఇచట నీవిషయము చెప్పబడినటులే వాగాద్యధిదేవతలకు శక్త్యుత్పాదకమగు హిరణ్యగర్భుడు ప్రాణమనబడును. అటులే కామక్రోధాద్యసురప్రసారము బుద్ధిపర్యంతమే. అటుపిమ్మట కామాదులయభావమే సంభవించును. దైత్యనాశానంతరమున దేవతలు పరాభూతులగు నసురులుకలవారైరి. అనగా దేవతలు జయముకలవారైరని యాశయము. ఇట్టిదేవాసురసంగ్రామము నెవడు తెలిసికొనునో వాడు కామాదులను తిరస్కరించి యాత్మవంతుడగును. అట్టివానికి కామక్రోధాదులు సంభవింపవు. ఇట్లాత్మజ్ఞానసంపత్తి కలిగినవానికి శత్రువుకూడ భ్రాతృవ్యుడగును. (మిత్రుడగుననుట).

ఈవిషయమే సామవేదమునందు కల్మషసామనే నిట్లుచెప్పబడెను.— "హా ఉ 3 సేతూగ్ంస్తర తెదుస్తరాన్ 3 దానేనాదానం 3 హా ఉ 3 అహ మస్మి ప్రథమజా ఋత స్యాహా ఉ 3 సేతూగ్ంస్తర 3 దుస్తరాన్ 3 అక్రోధేన క్రోధం" జలప్రవాహప్రతిబంధకములు సేతువు లగునట్లు అఖండైకరసానుభవమునకు ఆదానము, క్రోధము, అశ్రద్ధ, అనృతము అనునివి సేతువులు. అట్టి సేతువులను తరించుము. అందు ప్రథమసేతు వగు నాదానమును తరించుట కుపాయమేదనిన? ఏది బ్రహ్మార్పణబుద్ధితో నివ్వబడునో యది దానమనబడును. దానికంటె భిన్నమగునదియు. జాయాపుత్రార్థము చేయఁబడునదియు దానమనఁబడును. దానముచే నాదానమునుతరించుము. జాయాపుత్రార్థము చేయబడు వ్యయముకూడ బ్రహ్మార్పణముగఁజేసినచో నదియు దానమేయగును (కాన నేదేని వ్యయమెందులకు జేసినను అవ్యయమును బ్రహ్మార్పణబుద్ధితో జేసినచో నది దానమగును. అట్టి దానముచే నాదానరూపమగు ప్రతిబంధకమును తొలగించుకొనుము,) నేను సత్యమగు బ్రహ్మమునకు ప్రథమమున శబలముగ నుపస్థితమైన హిరణ్యగర్భుడనైతిని. కాన (మీచే) నేదేని కొంచమీయబడినచో నదంతయు నాకొసగబడినదే యగును. రెండవసేతువగు క్రోధమును అక్రోధరూపమగు క్షమచే (ఓర్పుచే) తరించుము. ఈవిషయమే 'శ్రమో న వాచాం కరసో న కూలం, న చిత్తతాపో న తనో ర్విమర్దః। నచాపి హింసాది రనర్థయోగ శ్శాన్త్యా పరం క్రోధజయే ఽహమేకా' ఇది క్షమావాక్యము. నన్నెవరాశ్రయించెదరో వారివాక్కులకు శ్రమ, కీర్తిహానిదూరుయు సంభవించవు. చిత్తమునకు తాపమున్ను సంభవించదు. శరీరమున కలయిక సంభవింపదు. హింసాదిరూపానర్థము సంభవించదు. కాన క్రోధజయమునందు క్షమారూపమగు నేను మాత్రమే కొనియాడదగినదాననని క్షమ పలికెనని శతశ్లోకియందు గలదు.

## —• ౩వ అధ్యాయ తాత్పర్యము :—

"శ్లో॥ యజ్ఞాద్యం వర్ణధర్మోచిత మపి నియతం కర్మ కర్మప్రదం స్యా,
న్నత్యాజ్యం కార్య మేత ద్విగుణమపి యతోఽకర్మణః కర్మ శస్తం।
జీవన్మర్త్యః కదాచి త్కరచరణయుతో నైవ తిష్ఠ త్యకర్మా,
తస్మా చ్ఛ్రేయా న్స్వధర్మో యదుపతిగదిత శ్చిత్తశుద్ధ్యై తృతీయే॥"

వర్ణాశ్రమవిహితము, నియతమునగు యజ్ఞయాగాదికర్మము సుఖము నిచ్చును. అట్టి నిత్యనైమిత్తికకర్మ మెన్నడును విడువకూడదు. ఎందువలననిన? అకర్మముకంటె స్వధర్మమగు నిత్యనైమిత్తికకర్మము రెట్టింపు ప్రశస్తమైనది. మనుజుఁడు బ్రతికియుండగ కరచరణములతోఁ గూడినవాఁడై యెన్నడును కర్మను చేయనివాఁడై యుండడు. కాన శ్రేయస్కరమగు స్వధర్మము శ్రీకృష్ణపరమాత్మచే చిత్తశుద్ధికొరకు తృతీయాధ్యాయమునందు జెపఁబడెను.

నీలకంఠీయము:— ఇట్టి యోగమునకు ఫలమును "ఏవం" అను శ్లోకముచే బోధించుచుండెను. హార్దాకాశమునందుగూడ హార్దాకాశస్థితమగు నిత్యకామములను కోరునట్టి మనస్సును బుద్ధిచే వృత్తిరహితమొనరించి బుద్ధికంటె పరమగు పరమాత్మను తెలిసికొని సమూలఘాతకుడగు కామరూపశత్రువును నశింపజేయుము. ఇట 'మహాబాహో!' అని యర్జునుని సంబోధించుటచే శత్రువినాశమందు నీకు సామర్థ్యముకలదని సూచింపఁబడెను. అనగా నెంతవరకు కామమూలమగు నజ్ఞానము వినాశ మొనరించబడదో అంతవరకు గామునకు మూలోచ్ఛేదము కానేరదు. కాన బుద్ధికంటె పరుడగు పరమాత్మను తెలిసికొనియే గాముడు నశింపజేయదగినవాఁడు. కాముడు నశించినచో సంసారరూపానర్థము నశించును. ఈ కాముఁడు దురాసదుఁడు. అనగా నాత్మజ్ఞానము లేనిదే కష్టముచేనైన నీ కాముఁడు నశింపఁజేయుటకు శక్యము కానివాఁడు.

"ఉపాయః కర్మనిష్ఠాత్ర ప్రాధాన్యే నోపసంహృతా। ఉపేయా జ్ఞాననిష్ఠా తు తద్గుణత్వేన కీర్తితా॥" ఈయధ్యాయమునందు జ్ఞాననిష్ఠ కుపాయమగు కర్మనిష్ఠ ప్రధానముగను, నుపేయమగు జ్ఞాననిష్ఠ యప్రధానముగను జెప్పబడెను. ॥౪౩॥

ఇట్లు శ్రీభగవద్గీతాతృతీయాధ్యాయమునకు "తర్కరత్న. న్యాయవేదాంతవిద్యాపారీణ,
దర్శనాలంకార" బిరుదు అప్పన్నశాస్త్రిచే రచింపబడిన
వ్యాఖ్యావిశేషములు ముగిసెను.
హరిః ఓమ్ తత్సత్ । శ్రీః శ్రీః శ్రీః




———